శ్రీః

మూకమహాకవిప్రణీత

# మూకపంచశతీ

సారోల్లాసినీ వ్యాఖ్యా

(ఆంధ్ర ప్రతిపదార్థ తాత్పర్య వివరణ)

దోర్బల విశ్వనాథశర్మ



ప్రకాశికా

రావి కృష్ణకుమారీ

4-103, ఐ.యల్.టి.డి. కాలనీ ఎక్స్‌టెన్షన్,

కొత్తపేట, చీరాల - 523 157

శ్రీః

మూకమహాకవిప్రణీత

# మూకపంచశతీ

సారోల్లాసినీ వ్యాఖ్యా

(ఆంధ్ర ప్రతిపదార్థ తాత్పర్య వివరణ)

దోర్బల విశ్వనాథశర్మ



ప్రకాశికా

రావి కృష్ణకుమారీ

4-103, ఐ.యల్.టి.డి. కాలనీ ఎక్స్‌టెన్షన్,
కొత్తపేట, చీరాల - 523 157

శ్రీః

మూకమహాకవిప్రణీత

# మూకపంచశతీ

సారోల్లాసినీ వ్యాఖ్యా

(ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యవివరణ)

## దోర్బల విశ్వనాథశర్మ

ప్రథమముద్రణ :
సర్వధారీ, మాఘమాసః, మహాశివరాత్రిః 23, ఫిబ్రవరి 2009

ప్రతులు : 500

పేజీలు : 876

వెల రూ. : 500-00



**రావి మోహనరావు**
4-103, ఐ.యల్.టి.డి. కాలనీ ఎక్స్టెన్షన్,
కొత్తపేట, చీరాల - 523157.
సెల్ : 9440115411

ముద్రణ:
సూర్య ఆఫ్సెట్ ప్రింటర్స్, స్టేషన్ రోడ్, చీరాల.

డి.టి.పి.: విక్రమ్ గ్రాఫిక్స్, యం.ఆర్.ఓ. ఆఫీసు ఎదురు, చీరాల.
సెల్ : 9959087319



చంద్రశేఖర రక్ష మాం - చంద్రశేఖర పాహి మాం



Jagadguru Sri Sri Sri Jayendra Saraswathi
Sankaracharya Swamiji



Jagadguru Sri Sri Vijayendra Saraswathi
Sankaracharya Swamiji

# మూకపంచశతి

శ్రీ కామాక్షిదేవి కరుణకు పాత్రుడైన మూకకవి విరచిత 'మూకపంచశతి' నందు - ఒక శిశువు కన్ను మొదలైన ఇంద్రియముల పాటవమేర్పడుటకు ముందు మనోభావమాత్రముచేత తన కోరిక నెట్లు భావించునో అట్లే **ఆర్యాశతకము**నందు భక్తి శిశువుయొక్క మనః ప్రవృత్తిని అంబికాస్వరూపాను సంధానముగ స్పష్టపరచెను. శిశువు కొంచెం గ్రహణశక్తి పెంపొందిన మీదట తన దాపున వర్తించు వస్తువుయొక్క దర్శన స్పర్శనాదులచే ఎట్లు ఆనందింప గల్గునో అట్లే భక్త బాలుడు మిక్కిలి క్రిందుగా తన కందుబాటులో ఉన్న జగన్మాత పాదారవిన్ద సందర్శనానందమనుభవించునని **పాదారవిన్దశతగము**న వెల్లడించెను. మనస్సు జ్ఞానేంద్రియముల యొక్క స్ఫూర్తి తర్వాతే వాక్ప్రసార మగును. అట్లే తనప్రేమకు స్థానమైనవస్తువును నిరర్గళముగ **స్తుతిశతకము**న స్తుతించెను. లౌకిక విద్యలయందు నేర్పరియగు నొక యువకుడు ఎట్లు లౌకిక సంపదలను బడయ నర్హుడగునో అట్లే ఇతఃపూర్వకృప, స్తుతికి ఫలంగా భక్తుడు అంబికా కటాక్ష విశేషమును బడసి పరమజ్ఞానానుభవము పొందుటకు పాత్రము కాగలడని **కటాక్షశతకము**నందు సూచించెను. లౌకికైశ్వర్య సంపూర్ణుడొకడు మంచి వయసులో తానెట్లు శృంగార సుఖానుభవమునకు పాత్రుడగునో అట్లే దేవి అనుగ్రహపాత్రుడైనవాడు ఆ తల్లి మందస్మితచంద్రికాయుతుడై ఆనంద చంద్రునివలె అలౌకిక నిరతశయానందానుభవస్వరూపుడై ప్రకాశించునని **మందస్మితశతకము**ను ఆవిష్కరించెను. ఈ స్తుతి పఠించు మాత్రమున సాధకుడు పరదేవతతోడ ఐకాత్మ్యానుభూతిని బడసిన స్థితి నందగలడు.

**- శ్రీ కామకోటి జగద్గురు చంద్రశేఖరేంద్ర సరస్వతిస్వామి**

# దీర్ఘసూత్రీ

కంచి కామాక్షి వీక్షణం
మదీయకృతసౌభాగ్యం
స్వామి విజయేన్ద్రాశీస్సు
యాలకుల గుబాళింపు
దోర్బల మననోద్భవం
సారోల్లాసినీ స్రోతస్సు
మైత్రేయ మేళ్ళచెఱ్ఱువులు
ప్రియబాంధవజనులు
చింతగుంటగోమాతలు
శ్రేయోస్పందనకారులు
నాగమోతు ఆశాకిరణం
జనితమీ బృహద్భాండం
విక్రమహస్తచాతుర్యం
నరసింహ సూర్యపత్రం
వన్దేఽహం పరమాచార్యం
గురుశ్రీచంద్రశేఖరం
సమర్పితం శ్రీగురుభ్యః
నమోఽర్ధనారీశ్వరాయ



రా మో రా

భావత్కః చ సంపాదకః
**రావి మోహనరాయః**

శ్రీః

మూకపఞ్చశతీ

# ఆర్యాశతకమ్

సారోల్లాసినీ వ్యాఖ్యా



శ్లో॥ కారణపరచిద్రూపా
కాఞ్చీపురసీమ్ని కామపీఠగతా।
కాచన విహరతి కరుణా
కాశ్మీరస్తబకకోమలాఙ్గలతా॥ 1



శ్లో॥ కఞ్చన కాఞ్చీతిలకం
కరధృతకోదణ్డబాణసృణిపాశమ్।
కఠినస్తనభరనమ్రం
కైవల్యానన్దకన్దమవలమ్బే॥ 2



శ్లో॥ చిన్తితఫలపరిపోషణ-
చిన్తామణిరేవ కాఞ్చీనిలయా మే।
చిరతరసుచరితసులభా
చిత్తం శిశిరయతు చిత్సుధాధారా॥ 3



శ్లో॥ కుటిలకచం కఠినకుచం
కున్దస్మితకాన్తి కుఙ్కుమచ్ఛాయమ్।
కురుతే విహృతిం కాఞ్చ్యాం
కులపర్వతసార్వభౌమసర్వస్వమ్॥ 4



శ్లో॥ పఞ్చశరశాస్త్రబోధన-
పరమాచార్యేణ దృష్టిపాతేన।
కాఞ్చీసీమ్ని కుమారీ
కాచన మోహయతి కామజేతారమ్॥ 5



శ్లో॥ పరయా కాఞ్చీపురయా
పర్వతపర్యాయపీనకుచభరయా।
పరతన్త్రా వయమనయా
పఙ్కజసబ్రహ్మచారిలోచనయా॥ 6

శ్లో॥ ఐశ్వర్యమిన్దుమౌలే-
రైకాత్మ్యప్రకృతి కాఞ్చిమధ్యగతమ్।
ఐన్దవకిశోరశేఖర-
మైదమ్పర్యం చకాస్తి నిగమానామ్॥ 7

శ్లో॥ శ్రితకమ్పాసీమానం
శిథిలితపరమశివధైర్యమహిమానమ్।
కలయే పాటలిమానం
కఞ్చన కఞ్చుకితభువనభూమానమ్॥ 8

శ్లో॥ ఆదృతకాఞ్చీనిలయా-
మాద్యామారూఢయౌవనాటోపామ్।
ఆగమవతంసకలికా-
మానన్దాద్వైతకన్దలీం వన్దే॥ 9

శ్లో॥ తుఙ్గాభిరామకుచభర-
శృఙ్గారితమాశ్రయామి కాఞ్చిగతమ్।
గఙ్గాధరపరతన్త్రం
శృఙ్గారాద్వైతతన్త్రసిద్ధాన్తమ్॥ 10

శ్లో॥ కాఞ్చీరత్నవిభూషాం
కామపి కన్దర్పసూతికాపాఙ్గీమ్।
పరమాం కలాముపాసే
పరశివవామాఙ్కపీఠికాసీనామ్॥ 11

శ్లో॥ కమ్పాతీరచరాణాం
కరుణాకోరకితదృష్టిపాతానామ్।
కేలీవనం మనో మే
కేషాఞ్చిద్భవతు చిద్విలాసానామ్॥ 12



శ్లో॥ ఆమ్రతరుమూలవసతే-
రాదిమపురుషస్య నయనపీయూషమ్।
ఆరబ్ధయౌవనోత్సవ-
మామ్నాయరహస్యమన్తరవలమ్బే॥ 13



శ్లో॥ అధికాఞ్చి పరమయోగిభి-
రాదిమపరపీఠసీమ్ని దృశ్యేన।
అనుబద్ధం మమ మానస
మరుణిమసర్వస్వసమ్ప్రదాయేన॥ 14



శ్లో॥ అఙ్కితశఙ్కరదేహా-
మఙ్కురితోరోజకఙ్కణాశ్లేషైః।
అధికాఞ్చి నిత్యతరుణీ-
మద్రాక్షం కాఞ్చిదద్భుతాం బాలామ్॥ 15



శ్లో॥ మధురధనుషా మహీధర-
జనుషా నన్దామి సురభిబాణజుషా।
చిద్వపుషా కాఞ్చిపురే
కేలిజుషా బన్ధుజీవకాన్తిముషా॥ 16



శ్లో॥ మధురస్మితేన రమతే
మాంసలకుచభారమన్దగమనేన।
మధ్యేకాఞ్చి మనో మే
మనసిజసామ్రాజ్యగర్వబీజేన॥ 17



శ్లో॥ ధరణిమయీం తరణిమయీం
పవనమయీం గగనదహనహోతృమయీమ్।
అమ్బుమయీమిన్దుమయీ-
మమ్బామనుకమ్పమాదిమామీక్షే॥ 18



శ్లో॥ లీనస్థితి మునిహృదయే
ధ్యానస్తిమితం తపస్యదుపకమ్పమ్।
పీనస్తనభరమీడే
మీనధ్వజతన్త్రపరమతాత్పర్యమ్॥ 19



శ్లో॥ శ్వేతా మన్థరహసితే
శాతా మధ్యే చ వాఙ్మనో౽తీతా।
శీతా లోచనపాతే
స్ఫీతా కుచసీమ్ని శాశ్వతీ మాతా॥ 20



శ్లో॥ పురతః కదా ను కరవై
పురవైరివిమర్దపులకితాఙ్గలతామ్
పునతీం కాఞ్చీదేశం
పుష్పాయుధవీర్యసరసపరిపాటీమ్॥ 21



శ్లో॥ పుణ్యా కాపి పురన్ధ్రీ
పుఙ్ఖితకన్దర్పసమ్పదా వపుషా।
పులినచరీ కమ్పాయాః
పురమథనం పులకనిచులితం కురుతే॥ 22



శ్లో॥ తనిమాద్వైతవలగ్నం
తరుణారుణసమ్ప్రదాయతనులేఖమ్।
తటసీమని కమ్పాయా-
స్తరుణిమసర్వస్వమాద్యమద్రాక్షమ్॥ 23



శ్లో॥ పౌష్టికకర్మవిపాకం
పౌష్పశరం సవిధసీమ్ని కమ్పాయాః।
అద్రాక్షమాత్తయౌవన-
మభ్యుదయం కిఞ్చిదర్ధశశిమౌలేః॥ 24

శ్లో॥ సంశ్రితకాఞ్చీదేశే
సరసిజదౌర్భాగ్యజాగ్రదుత్తంసే।
సంవిన్మయే విలీయే
సారస్వతపురుషకారసామ్రాజ్యే॥ 25

శ్లో॥ మోదితమధుకరవిశిఖం
స్వాదిమసముదాయసారకోదణ్డమ్।
ఆదృతకాఞ్చీఖేలన-
మాదిమమారుణ్యభేదమాకలయే॥ 26

శ్లో॥ ఉరరీకృతకాఞ్చిపురీ-
ముపనిషదరవిన్దకుహరమధుధారామ్।
ఉన్నమ్రస్తనకలశీ-
ముత్సవలహరీముపాస్మహే శమ్భోః॥ 27

శ్లో॥ ఏణశిశుదీర్ఘలోచన-
మేనఃపరిపన్థి సన్తతం నమతామ్।
ఏకామ్రనాథజీవిత-
మేవమ్పదదూరమేకమవలమ్బే॥ 28

శ్లో॥ స్మయమానముఖం కాఞ్చీ-
మయమానం కమపి దేవతాభేదమ్।
దయమానం వీక్ష్య ముహు-
ర్వయమానన్దామృతామ్బుధౌ మగ్నాః॥ 29

శ్లో॥ కుతుకజుషి కాఞ్చీదేశే
కుముదతపోరాశిపాకశేఖరితే।
కురుతే జనో మనోఽ_యం
కులగిరిపరిబృ(వృ)ఢకులైకమణిదీపే॥ 30

శ్లో॥ వీక్షేమహి కాఞ్చీపురే
విపులస్తనకలశగరిమపరవశితమ్।
విద్రుమసహచరదేహం
విభ్రమసమవాయసారసంనాహమ్॥ 31

శ్లో॥ కురువిన్దగోత్రగాత్రం
కూలచరం కమపి నౌమి కమ్పాయాః।
కూలఙ్కషకుచకుమ్భం
కుసుమాయుధవీర్యసారసంరమ్భమ్॥ 32

శ్లో॥ కుట్మలితకుచకిశోరైః
కుర్వాణైః కాఞ్చీదేశసౌహార్దమ్।
కుఙ్కుమశోణైర్నిచితం
కుశలపథం శమ్భుసుకృతసమ్భారైః॥ 33

శ్లో॥ అఙ్కితకచేన కేనచి-
దన్ధంకరణౌషధేన కమలానామ్।
అన్తఃపురేణ శమ్భో-
రలఙ్క్రియా కాపి కల్ప్యతే కాఞ్చ్యామ్॥ 34

శ్లో॥ ఉరరీకరోమి సన్తత-
మూష్మలఫాలేన లాలితం పుంసా।
ఉపకమ్పముచితఖేలన-
ముర్వీధరవంశసమ్పదున్మేషమ్॥ 35

శ్లో॥ అఙ్కురితస్తనకోరక-
మఙ్కాలఙ్కారమేకచూతపతేః।
ఆలోకేమహి కోమల-
మాగమసంలాపసారయాథార్థ్యమ్॥ 36



శ్లో॥ పుఞ్జితకరుణముదఞ్చిత-
శిఞ్జితమణికాఞ్చి కిమపి కాఞ్చిపురే।
మఞ్జరితమృదులహాసం
పిఞ్జరతనురుచి పినాకిమూలధనమ్॥ 37



శ్లో॥ లోలహృదయోఽస్మి శమ్భో-
ర్లోచనయుగలేన లేహ్యమానాయామ్।
లాలితపరమశివాయాం
లావణ్యామృతతరఙ్గమాలాయామ్॥ 38



శ్లో॥ మధుకరసహచరచికురై-
ర్మదనాగమసమ్యగ్దీక్షితకటాక్షైః।
మణ్డితకమ్పాతీరై-
ర్మఙ్గళకన్దైర్మమాస్తు సారూప్యమ్॥ 39



శ్లో॥ వదనారవిన్దవక్షో
వామాఙ్కతటీవశంవదీభూతా।
పురుషత్రితయే త్రేధా
పురన్ధ్రిరూపా త్వమేవ కామాక్షి॥ 40



శ్లో॥ బాధాకరీం భవాబ్ధే-
రాధారాద్యమ్బుజేషు విచరన్తీమ్।
ఆధారీకృతకాఞ్చీం
బోధామృతవీచిమేవ విమృశామః॥ 41



శ్లో॥ కలయామ్యన్తః శశధర-
కలయాఙ్కితమౌలిమమలచిద్వలయామ్।
అలయామాగమపీఠీ-
నిలయాం వలయాఙ్కసున్దరీమమ్బామ్॥ 42



శ్లో॥ శర్వాదిపరమసాధక-
గుర్వానీతాయ కామపీఠజుషే।
సర్వాకృతయే శోణిమ-
గర్వాయ సమర్ప్యతే హృదయమ్॥ 43



శ్లో॥ సమయా సాన్ధ్యమయూఖైః
సమయా బుద్ధ్యా సదైవ శీలితయా।
ఉమయా కాఞ్చీరతయా
న మయా లభ్యేత కిం తు తాదాత్మ్యమ్॥ 44



శ్లో॥ జన్తోస్తవ పదపూజన-
సన్తోషతరఙ్గితస్య కామాక్షి।
బన్ధో యది భవతి పునః
సిన్ధోరమ్బుఃసు బమ్భ్రమీతి శిలా॥ 45



శ్లో॥ కుణ్డలి కుమారి కుటిలే
చణ్డి చరాచరసవిత్రి చాముణ్డే।
గుణిని గుహారణి గుహ్యే
గురుమూర్తే త్వాం నమామి కామాక్షి॥ 46



శ్లో॥ అభిదాకృతిర్భిదాకృతి-
రచిదాకృతిరపి చిదాకృతిర్మాతః।
అనహన్తా త్వమహన్తా
భ్రమయసి కామాక్షి శాశ్వతీ విశ్వమ్॥ 47



శ్లో॥ శివ శివ పశ్యన్తి సమం
శ్రీకామాక్షీకటాక్షితాః పురుషాః।
విపినం భవనమమిత్రం
మిత్రం లోష్ఠం చ యువతిబిమ్బోష్ఠమ్॥ 48



శ్లో॥ కామపరిపన్థికామిని!
కామేశ్వరి! కామపీఠమధ్యగతే!।
కామదుఘా భవ కమలే!
కామకలే కామకోటి! కామాక్షి॥ 49



శ్లో॥ మధ్యేహృదయం మధ్యేని(టి)టలం
మధ్యేశిరోఽపి వాస్తవ్యామ్।
చణ్డకరశక్రకార్ముక-
చన్ద్రసమాభాం నమామి కామాక్షీమ్॥ 50



శ్లో॥ అధికాఞ్చి కేలిలోలై-
రఖిలాగమయన్త్రతన్త్రమన్త్రమయైః।
అతిశీతం మమ హృదయం
విషమశరద్రోహిజీవనోపాయైః॥ 51



శ్లో॥ నన్దతి మమ హృది కాచన
మన్దిరయన్తీ నిరన్తరం కాఞ్చీమ్।
ఇన్దురవిమణ్డలకుచా
బిన్దువియన్నాదపరిణతా తరుణీ॥ 52



శ్లో॥ శమ్పాలతాసవర్ణం
సమ్పాదయితుం భవజ్వరచికిత్సామ్।
లిమ్పామి మనసి కిఞ్చన
కమ్పాతటరోహి సిద్ధభైషజ్యమ్॥ 53



శ్లో॥ అనుమితకుచకాఠిన్యా-
మధివక్షఃపీఠమఙ్గజన్మరిపోః।
ఆనన్దదాం భజే తా-
మానఙ్గబ్రహ్మతత్త్వబోధిసిరామ్॥ 54

శ్లో॥ ఐక్షిషి పాశాఙ్కుశధర-
హస్తాన్తం విస్మయార్హవృత్తాన్తమ్।
అధికాఞ్చి నిగమవాచాం
సిద్ధాన్తం శూలపాణిశుద్ధాన్తమ్॥ 55

శ్లో॥ ఆహితవిలాసభఙ్గీ-
మాబ్రహ్మస్తమ్బశిల్పకల్పనయా।
ఆశ్రితకాఞ్చీమతులా-
మాద్యాం విస్ఫూర్తిమాద్రియే విద్యామ్॥ 56

శ్లో॥ మూకోఽపి జటిలదుర్గతి-
శోకోఽపి స్మరతి యః క్షణం భవతీమ్।
ఏకో భవతి స జన్తుః
లోకోత్తరకీర్తిరేవ కామాక్షి॥ 57

శ్లో॥ పఞ్చదశవర్ణరూపం
కఞ్చన కాఞ్చీవిహారధౌరేయమ్।
పఞ్చశరీయం శమ్భో-
ర్వఞ్చనవైదగ్ధ్యమూలమవలమ్బే॥ 58

శ్లో॥ పరిణతవతీం చతుర్ధా
పదవీం సుధియాం సమేత్య సౌషుమ్నీమ్।
పఞ్చాశదర్ణకల్పిత-
పదశిల్పాం తాం నమామి కామాక్షీమ్॥ 59

శ్లో॥ ఆదిక్షన్మమ గురురా-
దాదిక్షాన్త్యాక్షరాత్మికాం విద్యామ్।
స్వాధిష్ఠచాపదణ్డాం
నేదిష్ఠామేవ కామపీఠగతామ్॥ 60

శ్లో॥ తుష్యామి హర్షితస్మర-
శాసనయా కాఞ్చీపురికృతాసనయా।
స్వాసనయా సకలజగ-
ద్భాసనయా కలితశమ్బరాసనయా॥ 61

శ్లో॥ ప్రేమవతీ కమ్పాయాం
స్థేమవతీ యతిమనఃసు భూమవతీ।
సామవతీ సత్యగిరాం
సోమవతీ శిరసి భాతి హైమవతీ॥ 62

శ్లో॥ కౌతికినా కమ్పాయాం
కౌసుమచాపేన కీలితేనాన్తః।
కులదైవతేన మహతా
కుట్మలముద్రాం ధునోతు నః ప్రతిభా॥ 63

శ్లో॥ కేనాపి మిలద్దేహా
యూనా స్వాహాసహాయతిలకేన।
సహకారమూలదేశే
సంవిద్రూపా కుటుమ్బినీ రమతే॥ 64

శ్లో॥ కుసుమశరగర్వసమ్పు-
త్కోశగృహం భాతి కాఞ్చీదేశగతమ్।
స్థాపితమస్మిన్కథమపి
గోపితమన్తర్మయా మనోరత్నమ్॥ 65

శ్లో॥ దగ్ధషడధ్వారణ్యం
దరదలితకుసుమ్భసమ్భృతారుణ్యమ్।
కలయే తవ తారుణ్యం
కమ్పాతటసీమ్ని కిమపి కారుణ్యమ్॥ 66



శ్లో॥ అధికాఞ్చి వర్తమానా-
మతులాం కరవాణి పారణామక్ష్ణోః।
ఆనన్దపాకభేదా-
మరుణిమపరిణామగర్వపల్లవితామ్॥ 67



శ్లో॥ బాణసృణిపాశకార్ముక-
పాణిమముం కమపి కామపీఠగతమ్।
ఏణధరకోణచూడం
శోణిమపరిపాకభేదమాకలయే॥ 68



శ్లో॥ కిం వా ఫలతి మమాన్యై-
ర్బిమ్బాధరచుమ్బిమన్దహాసముఖీ।
సమ్బాధకరీ తమసా-
మమ్బా జాగర్తి మనసి కామాక్షీ॥ 69



శ్లో॥ మఞ్చే సదాశివమయే
పరశివమయలలితపౌష్పపర్యఙ్కే।
అధిచక్రమధ్యమాస్తే
కామాక్షీనామ కిమపి మమ భాగ్యమ్॥ 70



శ్లో॥ రక్ష్యోఽస్మి కామపీఠీ-
లాలికయా ఘనకృపామ్బుకాలికయా।
శ్రుతియువతికున్తలీమణి-
మాలికయా తుహినశైలబాలికయా॥ 71



శ్లో॥ లీయే పురహరజాయే!
మాయే! తవ తరుణపల్లవచ్ఛాయే!।
చరణే చన్ద్రాభరణే!
కాఞ్చీశరణే! నతార్తిసంహరణే!॥ 72

శ్లో॥ మూర్తిమతి ముక్తిబీజే
మూర్ధ్ని స్తబకితచకోరసామ్రాజ్యే।
మోదితకమ్పాకూలే
ముహుర్ముహుర్మనసి ముముదిషాస్మాకమ్॥ 73

శ్లో॥ వేదమయీం నాదమయీం
బిన్దుమయీం పరపదోద్యదిన్దుమయీమ్।
మన్త్రమయీం తన్త్రమయీం
ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీమ్॥ 74

శ్లో॥ పురమథనపుణ్యకోటీ
పుఞ్జితకవిలోకసూక్తిరసధాటీ।
మనసి మమ కామకోటీ
విహరతు కరుణావిపాకపరిపాటీ॥ 75

శ్లో॥ కుటిలం చటులం పృథులం
మృదులం కచనయనజఘనచరణేషు।
అవలోకితమవలమ్బిత-
మధికమ్పాతటమమేయమస్మాభిః॥ 76

శ్లో॥ ప్రత్యఙ్ముఖ్యా దృష్ట్యా
ప్రసాదదీపాఙ్కురేణ కామాక్ష్యాః।
పశ్యామి నిస్తులమహో
పచేలిమం కిమపి పరశివోల్లాసమ్॥ 77

శ్లో॥ విద్యే! విధాతృవిషయే!
కాత్యాయని! కాలి! కామకోటికలే!।
భారతి! భైరవి! భద్రే!
శాకిని! శామ్భవి! శివే! స్తువే భవతీమ్॥ 78

శ్లో॥ మాలిని! మహేశచాలిని!
కాఞ్చీఖేలిని విపక్షకాలిని తే।
శూలిని విద్రుమశాలిని
సురజనపాలిని కపాలిని నమోఽస్తు॥ 79

శ్లో॥ దేశిక ఇతి కిం శఙ్కే
తత్తాదృక్తవ ను తరుణిమోన్మేషః।
కామాక్షి! శూలపాణేః
కామాగమసమయతన్త్రదీక్షాయామ్॥ 80

శ్లో॥ వేదణ్డకుమ్భడమ్బర-
వైతణ్డికకుచభారార్తమధ్యాయ।
కుఙ్కుమరుచే నమస్యాం
శఙ్కరనయనామృతాయ రచయామః॥ 81

శ్లో॥ అధికాఞ్చితమణి కాఞ్చన-
కాఞ్చీమధికాఞ్చి కాఞ్చిదద్రాక్షమ్।
అవనతజనానుకమ్పా-
మనుకమ్పాకూలమస్మదనుకూలామ్॥ 82

శ్లో॥ పరిచితకమ్పాతీరం
పర్వతరాజస్య సుకృతసంనాహమ్।
పరగురుకృపయా వీక్షే
పరమశివోత్సఙ్గమఙ్గళాభరణమ్॥ 83

శ్లో॥ దగ్ధమదనస్య శమ్భోః
ప్రథీయసీం బ్రహ్మచర్యవైదగ్ధీమ్।
తవ దేవి తరుణిమశ్రీ-
చతురిమపాకో న చక్షమే మాతః॥ 84



శ్లో॥ మదజలతమాలపత్రా
వసనితపత్రా కరధృతఖనిత్రా।
విహరతి పులిన్దయోషా
గుఞ్జాభూషా ఫణీన్ద్రకృతవేషా॥ 85



శ్లో॥ అఙ్కే శుకినీ గీతే
కౌతుకినీ పరిసరే చ గాయకినీ।
జయసి సవిధేఽమ్బ! భైరవ-
మణ్డలినీ శ్రవసి శఙ్ఖకుణ్డలినీ॥ 86



శ్లో॥ ప్రణతజనతాపవర్గా
కృతరణసర్గా ససింహసంసర్గా।
కామాక్షి! ముదితభర్గా
హతరిపువర్గా త్వమేవ సా దుర్గా॥ 87



శ్లో॥ శ్రవణచలద్వేదణ్డా
సమరోద్దణ్డా ధుతాసురశిఖణ్డా।
దేవి! కలితాన్త్రషణ్డా
ధృతనరముణ్డా త్వమేవ చాముణ్డా॥ 88



శ్లో॥ ఉర్వీధరేన్ద్రకన్యే
దర్వీభరితేన భక్తపూరేణ।
గుర్వీమకిఞ్చనార్తిం
ఖర్వీకురుషే త్వమేవ కామాక్షి॥ 89



శ్లో॥ తాడితరిపుపరిపీడన-
భయహరణనిపుణహలముసలా।
క్రోడపతిభీషణముఖీ
క్రీడసి జగతి త్వమేవ కామాక్షి॥ 90



శ్లో॥ స్మరమథనవరణలోలా
మన్మథహేలావిలాసమణిశాలా।
కనకరుచిచౌర్యశీలా
త్వమమ్బ! బాలా కరాబ్జధృతమాలా॥ 91



శ్లో॥ విమలపటీ కమలకుటీ
పుస్తకరుద్రాక్షశస్తహస్తపుటీ।
కామాక్షి! పక్ష్మలాక్షీ
కలితవిపఞ్చీ విభాసి వైరిఞ్చీ॥ 92



శ్లో॥ కుఙ్కుమరుచిపిఙ్గమసృ-
క్పఙ్కిలముణ్డాలిమణ్డితం మాతః।
జయతి తవ రూపధేయం
జపపటపుస్తకవరాభయాబ్జకరమ్॥ 93



శ్లో॥ కనకమణికలితభూషాం
కాలాయసకలహశీలకాన్తికలామ్।
కామాక్షి! శీలయే త్వాం
కపాలశూలాభిరామకరకమలామ్॥ 94



శ్లో॥ లోహితమపుఞ్జమధ్యే
మోహితభువనం ముదా నిరీక్షన్తే।
వదనం తవ కుచయుగలం
కాఞ్చీసీమాఞ్చ కేఽపి కామాక్షి॥ 95



శ్లో॥ జలధిద్విగుణితహుతవహ-
దిశాదినేశ్వరకలాశ్వినేయదలైః।
నలినైర్మహేశి! గచ్ఛసి
సర్వోత్తరకరకమలదలమమలమ్॥ 96



శ్లో॥ సత్కృతదేశికచరణాః
సబీజనిర్బీజయోగనిశ్రేణ్యా।
అపవర్గసౌధవలభీ-
మారోహంత్యమ్బ కేఽపి తవ కృపయా॥ 97



శ్లో॥ అన్తరసి బహిరసి త్వం
జన్తుతతేరన్తకాన్తకృదహన్తే!।
చిన్తితసన్తానవతాం
సన్తతమపి తన్తనీషి మహిమానమ్॥ 98



శ్లో॥ కలమఞ్జులవాగనుమిత-
గలపఞ్జరగతశుకగ్రహౌత్కణ్ఠ్యాత్।
అమ్బ! రదనామ్బరం తే
బిమ్బఫలం శమ్బరారిణా న్యస్తమ్॥ 99



శ్లో॥ జయ జయ జగదమ్బ! శివే
జయ జయ కామాక్షి జయ జయాద్రిసుతే।
జయ జయ మహేశదయితే
జయ జయ చిద్గగనకౌముదీధారే॥ 100



శ్లో॥ ఆర్యాశతకం భక్త్యా
పఠతామార్యాకటాక్షేణ।
నిస్సరతి వదనకమలా-
ద్వాణీ పీయూషధోరణీ దివ్యా॥ 101



| ౹ ॐ

శ్రీః

# మూకపఞ్చశతీ

# ఆర్యాశతకమ్

## సారోల్లాసినీ వ్యాఖ్యా



**అవ॥:-** మూక మహాకవి కాంచీనగరమున వెలసిన కామాక్షీ నామముగల శ్రీదేవి నైదువందల శ్లోకములలో స్తుతింపదలచి మొదటి శతకముయొక్క ఆరంభమును ఆ అమ్మవారిని కరుణారూపిణిగా పేర్కొనుచున్నాడు.

**శ్లో॥ కారణపరచిద్రూపా**
**కాఞ్చీపురసీమ్ని కామపీఠగతా।**
**కాచన విహరతి కరుణా**
**కాశ్మీరస్తబకకోమలాఙ్గలతా॥ 1**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కాంచీపురసీమ్ని | = | కాంచీపురప్రదేశమున; |
| కామపీఠగతా | = | కామపీఠమును పొందిన; |
| కారణపరచిద్రూపా | = | కారణపరచైతన్యమే స్వరూపముగాగల; |
| కాశ్మీరస్తబకకోమలాంగలతా | = | కుంకుమపూగుత్తులవలె కోమలమైన తీగవంటి దేహముగల; |
| కాచన | = | ఒకానొక; |
| కరుణా | = | దయ; |
| విహరతి | = | విహరించుచున్నది. |

**తాత్పర్యము :-**

కారణపరచైతన్యరూపిణి కామపీఠము నాశ్రయించినదై కుంకుమ పూగుత్తివలె మృదువైన తీగవంటి దేహముగల యొకానొక దయ కాంచీపుర ప్రదేశమున విహరించు చున్నధి.

**వివరణము :-**

1) **అయోధ్యా మథురా మాయా కాశీ కాంచీహ్యవంతికా। పురీ ద్వారవతీ చైవ సప్తైతా మోక్షదాయికాః॥** (అయోధ్య, మథుర, మాయ, కాశి, కాంచి, అవంతి,

ద్వారక అను నేడు నగరములు మోక్షదాయకములు) అను ప్రసిద్ధ శ్లోకము కాంచీనగరమును మోక్షదాయక నగరముగా పేర్కొనుచున్నది. భారతమాత కర్మభూమి, ఉపాసనా(యోగ) భూమి, జ్ఞానభూమి, భక్తిభూమి. ప్రపంచమున మరెచ్చటను లేని వర్ణాశ్రమ ధర్మకర్మ మిచటనే చేయబడుచున్నందున ఇది కర్మభూమి. సకామ కర్మలనాచరించి భారతీయులు స్వర్గలోకమునుగాని ఇతర పుణ్యలోకములనుగాని అత్యధికసౌఖ్యానుభవముగల పునర్జన్మనుగాని పొందగలరు. నిష్కామకర్మల నాచరించి మోక్షమార్గమున మొదటిదైన కర్మ అగు యోగభూమిలో కొంతకాలము విహరించి చిత్తశుద్ధిని సంపాదించి చిత్తముయొక్క ఏకాగ్రత కొఱకై యోగభూమిలో చివరి సోపానములైన ఉపాసనాభూమికలలో ప్రవేశించి చివఱకు పరచైతన్యములో తన (జీవ) చైతన్యమును ప్రవిలాపింపజేయు జ్ఞానభూమిలో ప్రవేశించి తదనంతరము జీవన్ముక్తిని, దేహపాతానంతరము కైవల్యముక్తిని పొందెదరు. పై శ్లోకమునందలి సప్తపురములు సప్తసంఖ్యగల ఉపాసనాభూములకు సంకేతములు. ప్రతివ్యక్తి శరీరము నందీ భూములున్నట్లే సమష్టి భారతమాత పార్థివశరీరమునందున్నట్లు భావించుకొన్నప్పుడు పై పట్టణములు మూలాధారాది సహస్రారాంత సప్తకమల (చక్ర)ములకు సంకేతములని భావించుకొనవలెను. కటిపై నుండెడి యొక ఆభరణము కాంచి. అది కటిస్థానమందలి శరీరాంతర్భాగపు సుషుమ్నా నాడిమూలముగా కుండలినికి ఆధారముగా ఉండుటచే అచటి చక్రము మూలాధారమనబడును. దానికి కాంచిశబ్దము లక్షణావృత్తిచే బోధకము. అది మొదటి ఉపాసనా భూమి. అయోధ్య చివరి ఉపాసనాభూమియైన సహస్రారమునకు లక్షకము. **దేవానామ్ పూరయోధ్యా** అని ఉపనిషత్తు నందు అయోధ్యా శబ్దమును సహస్రారవాచకముగా ప్రయోగించినది. ఇట్లే యథాసంభవముగా మిగిలిన పట్టణములను మిగిలిన చక్రములకు సంకేతములుగా భావించుకొనవచ్చును. కాంచీపురసీమ్ని అను పదములోని చివరిపదము సీమయను పదము ఉపాసనాభూములకు క్రింది సరిహద్దు అయిన మూలాధారచక్రమును వ్యంజింపజేయునని సులభముగానే గ్రహించవచ్చును. సీమశబ్దము సరిహద్దు అను అర్థమునకు వాచకము గదా! భగవద్గీత భక్తి కర్మోపాసన (ధ్యానము) లను మూడింటిని యోగశబ్దము చేతనే బోధించును. జ్ఞానమును సాంఖ్యశబ్దముచే బోధించును. మోక్షమార్గమున చివరిభాగము (ఆత్మ) జ్ఞానము జ్ఞానప్రాప్తితో మోక్షమార్గప్రయాణము పూర్తి యగును.

2) కామ (పీఠ) పూర్ణజాలంధర ఓడ్యాణ శబ్దములు యోగశాస్త్ర ప్రసిద్ధములు. కాంచియందు కామపీఠమున్నది. దానియందు శ్రీకామాక్షీదేవి వేంచేసియున్నది. కాదిపద బహులమైన ఈ శ్లోకమున దక్షిణాత్యభాషా సాధారణమైన వడి (యతి)యని పిలువబడు నొకవిధమైన అనుప్రాస శబ్దాలంకార మున్నది. కామాక్షీ శబ్దము వలె కరుణా శబ్దము కూడ కకారమాది యందుగలది కావున కాది విద్యను వ్యంజింపజేయును. ఆ దేవి కాదివిద్యారూపిణి యనుటలో సందేహము లేదు. ఈ శ్లోకము నందలి దాదాపు అన్ని

పదములను కాదులే. కాదివిద్యాప్రాధాన్యమును సూచించునట్టివే. కంచిలో ప్రసిద్ధమైన శంకర పీఠమున్నది. దానికి కామకోటి పీఠమను పేరున్నది. ఒకప్పుడీ మూకకవియు వారి గురువులును ఈ పీఠమున 19వ, 20వ ఆచార్యులుగా నుండిరట! కామపీఠశబ్దమా పీఠమును సూచించును.

3) చైతన్యము స్వయముగా కార్యకారణ భావములకతీతమే యైనను కారణమైన మాయయందు ప్రతిబింబించినప్పుడా చైతన్యము పరమని కారణమని చెప్పబడును. పరశబ్దము కారణభావమును కూడ నతిక్రమించునను నర్థమును ఇచ్చును. కావున చైతన్యముయొక్క ఈ ప్రతిబింబనము సంసార కారణ మగుటయు పారమార్థికముగా మిథ్యలే అను నర్థమును వ్యంజింపజేయును.

4) అమ్మవారి అంగము కుంకుమపూగుత్తివంటిది అను అర్థమిచ్చు **కాశ్మీరస్తబకకోమలాంగలతా** అను సమాసమున వాచకలుప్తోపమాలంకారమున్నది. లతాశబ్దమా కామాక్షీదేవియొక్క అంగకార్శ్యమును బోధించును. కా, చన అను శబ్దములు ఆ కామాక్షీదేవి మాటలతో చెప్పరానిది. అనగా అనిర్వాచ్య అను నర్థమును బోధించును. **యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ** (తై.2.4) అను ఉపనిషద్వాక్యార్థము నాశబ్దములు సంగ్రహించును. **కరుణా**శబ్దము అభేదాధ్యవసాయముచే కామాక్షీదేవి శబ్దము లేకున్నను కామాక్షీదేవిని బోధించుటచే నీ శ్లోకమున అతిశయోక్త్యలంకారమున్నది.

5) ఈ శ్లోకము ఆర్యాఛందస్సు కలది. ఆర్యాశబ్దవాచ్యయు పూజ్యురాలును అయిన అమ్మవారిని కవి ఆర్యావృత్తమున స్తుతించుటచే కవి వృత్తౌచిత్యమును బాటించినాడని గమనింపవలెను.



**అవ:-** పై శ్లోకమున శ్రీ కామాక్షీదేవి కాంచీపురమున విహరించు కరుణగా పేర్కొనబడినది. ఈ శ్లోకమున ఆ కాంచీపురమున దర్శనీయములలో అమ్మవారొక్కరే శ్రేష్ఠమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కఞ్చన కాఞ్చీతిలకం**
**కరధృతకోదణ్డబాణసృణిపాశమ్।**
**కఠినస్తనభరనమ్రం**
**కైవల్యానన్దకన్దమవలమ్బే॥ 2**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కరధృతకోదండబాణసృణిపాశమ్ | = | చేతులలో ధరింపబడిన ధనువు బాణము అంకుశము, పాశము గల; |
| కఠినస్తనభరనమ్రమ్ | = | కఠినములైన చనులబరువుచే వంగియున్న; |
| కైవల్యానందకందమ్ | = | కైవల్యానందమునకు పుట్టుచోటైన; |

కంచన = ఒకానొక;
కాంచీతిలకమ్ = కాంచీనగరశ్రేష్ఠవస్తువును;
అవలంబే = ఆశ్రయించెదను.

**తాత్పర్యము :-**

కైవల్యానందహేతువు ధనుర్బాణాంకుశపాశములను బాహువులచే ధరించినట్టి కఠినములైన పాలిండ్ల బరువుచే వంగియున్న ఒకానొక కాంచీనగర శ్రేష్ఠవస్తువు నాశ్రయించెదను.

**వివరణము :-**

1) తిలకమనగా నువ్వు గింజంత బొట్టు. అలంకారములలో మిక్కిలి చిన్నది అయినను అది లేకపోవుట అమంగల వైధవ్యమునకు సూచకము. మిగిలిన సొమ్ములు లేకున్నను అదియొక్కటి ఉన్నచో చాలును. మిగిలిన సొమ్ములు మంచిదే, లేకున్నను ఇబ్బంది లేదు. కావున తిలకమలంకార శ్రేష్ఠము. శరీరమున తిలకము వలె సర్వదర్శనీయమైన మరియొక అలంకారముండదు. అట్లే కాంచీనగరమున ఎన్నో దర్శనీయవస్తువు లున్నవి. మిగిలిన వానిని చూచినను చూడకున్నను ఇబ్బంది లేదు. పోవునది లేదు. కాని శ్రీ కామాక్షీదేవిని చూడక తిరిగివచ్చితిమేని కాంచీనగరయాత్ర వ్యర్థము. అదిగాక కైవల్యానందమునే జారవిడుచుకొన్నవార మగుదుము కావున కామాక్షీదేవి అభేదాధ్యవసాయముచే కాంచీనగరతిలకముగా చెప్పబడినందున నీ శ్లోకమున అతిశయోక్త్యలంకార మున్నది.

2) తిలకశబ్దము ఒకానొక వృక్షమునకు వాచకము. దానికి పండ్లుండునో లేదో తెలియదుగాని ఈ కాంచీనగర తిలకవృక్షము చన్నులను పండ్లబరువుచే వంగియున్నది. వానిలోని రసము త్రావిన వారికి కైవల్యానందమే లభించును. అనగా ఆ భక్తశిశువునకు మరొక వేద్యాంతరముండదు. మరొక బాధ్యాంతరముండదు. తాను తప్ప మరొక వస్తువే గోచరించదు. కడుపు నిండుటకన్న కైలాసము మరొకటేమున్నది. ఒకసారి భక్త శిశువులు ఆ రసమును గ్రోలిన చాలును. మరల ఆకలియే వేయదు. వారలకు కడుపు నింపుకొను అవసరమే రాదు.

3) కైవల్యానందమొక వృక్షము. దానికి కామాక్షీదేవియే కందము. కందము నుండి మొలకవచ్చి అది వృక్షమగును. అదియొక్కటే సంసారతాపమును నివారించి హృదయమునకు చల్లదనము నొసగును.

4) పండ్లబరువుచే చెట్టు వంగియున్నది. ఆ చెట్టుక్రింద శిశువులాడు కొనుచున్నారు. ఆకలివేసి ఆ పండ్లరసము త్రాగినారు. ఇక ఆ చెట్టును విడచి బయటకు రానే రారు. మూకమహాకవి యిట్టివారు. ఎక్కవలసిన అవసరము లేకయే ఆ చెట్టు ఫలముల నాశ్రితుల కిచ్చును. ఇప్పుడా వృక్షమొకటి యుండగా దానిని విడచి ఎంతో

శ్రమ పడిననే ఫలముల నొసగగల యితరవృక్షముల నాశ్రయించిన వారవివేకులు.

5) ఈ వృక్షమాశ్రితులకు ఫలముల నొసగుటయే కాదు వారి శత్రువులను పారద్రోలు నాయుధముల శాఖాబాహువులలో ధరించియున్నది. ధనుర్బాణ పాశాంకుశములా ఆయుధములు. ఆ చెట్టు నాశ్రయించిన వారి కామక్రోధాది శత్రువులు పారిపోవుదురు. అట్టి వృక్షమొక కాంచీనగరమునందే యున్నది. ఆమె కామాక్షియే.

6) మొదటిశ్లోకమున చెప్పబడినట్లామె లతయా? ఈ శ్లోకమున చెప్పబడినటుల వృక్షమా? ఫలములనొసగిన జాలును. అది లతయైన నేమి, వృక్షమైన నేమి? ఆమెను స్త్రీయనుకొన్నచో లత, పురుషుడనుకొన్నచో వృక్షము. ఒకదానిని విడచి మరొకటి యుండదు. కామాక్షీదేవిని విడచి ఏకామ్రేశ్వరుడు కాని, ఏకామ్రేశ్వరుని విడచి కామాక్షిగాని యుండదు. వారిరువురు కాంచీనగర వాసులు. ఇరువురు కాదు. ఒకటియే. ఒక్కరే.

7) కాంచీనగరియే యొక పుణ్యాంగన. ఆమె కామాక్షీదేవినే తిలకముగా అనగా బొట్టుగా ధరించినది. ఆ తిలకమువలననే ఆ నగరి ముత్తైదువ యగుచున్నది. చూచువారికి పుణ్యము కలిగించుచున్నది. సాధకులారా! ఆ కామాక్షీ నామ తిలకమునే భ్రూమధ్యమున దర్శింపుడు. కాంచీనగరమే ఆ భ్రూమధ్యము. కామాక్షియే ఆ జ్యోతిరూపతిలకము. తద్దర్శనమే కైవల్యానందమునకు పరంపరాసాధనము.

8) కంచన అనుటచే ఆ కామాక్షీ దేవిని మాటలతో వర్ణించుట యసాధ్యమని తెలియును.



**అవ:-** పై మొదటి రెండు శ్లోకములలో శ్రీకామాక్షీదేవి కామితార్థదానమున కల్పలతగా కల్పవృక్షముగా వ్యంజింపజేయబడినది. ఈ శ్లోకమున ఆమె చింతామణిగా పేర్కొనబడుచున్నది.

**శ్లో॥ చిన్తితఫలపరిపోషణ-**
**చిన్తామణిరేవ కాఞ్చినిలయా మే।**
**చిరతరసుచరితసులభా**
**చిత్తం శిశిరయతు చిత్సుధాధారా॥ 3**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కాంచినిలయా | = | కాంచియందు నివసించు కామాక్షీదేవి; |
| చింతిత ఫలపరిపోషణ చింతామణిః+ఏవ | = | చింతించిన ఫలమును పరిపోషించు చింతామణియే; |
| చిరతర సుచరితసులభా | = | ఎంతోకాలము చేసిన సత్కర్మాచరణములచే |

| | | |
|---|---|---|
| | | సులభముగా లభించునట్టి; |
| చిత్సుధాధారా | = | చైతన్యామృత ప్రవాహరూపిణియు నగు ఆమె; |
| మే | = | నాయొక్క; |
| చిత్తమ్ | = | మనసును; |
| శిశిరయతు | = | చల్లబఱచుగాక. |

**తాత్పర్యము :-**

చింతింపబడిన ఫలములను చక్కగా పోషించి యిచ్చుటలో ఆ కామాక్షీదేవి చింతామణియే. ఆమె కాంచియందు నివసించునట్టిది. ఆమె చైతన్యామృతప్రవాహరూపిణి కావున నా చిత్తమును చల్లబఱచుగాక.

**వివరణము :-**

1) సురాసురులు క్షీరసముద్రమును చిలుకగా పుట్టిన వస్తువులలో చింతామణి యొకటి. చింతామణి శబ్దము కోరిన కోర్కెల నొసగు మణియను అర్థము నిచ్చును కాని యది మోక్షము నొసగజాలదు. కావున ఆ మణి కాపేరు సమంజసము కాదు. కామాక్షీదేవికే ఆ పేరు బాగుగా సరిపోవును. ఆమె మోక్షమును ఇతరములైన ఫలములనన్నిటిని ఇచ్చును.

2) దేవతలు చింతామణి సాయముననే తమను సేవించువారు కోరిన ఫలముల నొసగుదురు. వారికట్లు చేయగల శక్తి నొసగు చింతామణి కామాక్షీదేవియే.

3) పుణ్యస్త్రీలు తమ తమ కాంచులలో మణులను పొదిగించుకొని ధరించెదరు. పుణ్యస్త్రీయగు భారతమాత (భూమి) కాంచీనగరమును కాంచిగా అనగా మొలనూలుగా ధరించినది. ఆ కాంచికొక మణి పొదగబడినది. అది చింతామణి. ఆ మణి కామాక్షీ దేవియే.

4) శ్రీ కామాక్షీదేవి చిత్సుధాధార జ్ఞానామృత ప్రవాహము. తచ్చింతనమే చిత్తమును చల్లబఱచుననగా నిక అందు మునిగిన వారి చిత్తము చల్లబడునని వేరుగా చెప్పనవసరము లేదు. చంద్రకాంతమణి స్పర్శము హిమస్పర్శము. హైమవతీనదీ జలస్పర్శము (స్నానము) శరీరములను చల్లబఱచునవియే యైనను శ్రీకామాక్షీదేవివలె చింతించు వారి హృదయములను చల్లబఱపజాలవు. కావున నిందు వ్యతిరేకాలంకారవ్యక్తి యున్నది.

5) గడచిన పెక్కు జన్మలలో బహువిధములైన పుణ్యకర్మల నాచరించిన సుచరితులకే ఆ కామాక్షీదేవి సుఖముగా లభించును. చరమజన్మముననే ఆమె యందు భక్తి కలుగును. ఆ తరువాత వారికి జన్మలేదు అను విషయము మూడవ పాదము వ్యంజింపజేయును.

6) ఈ శ్లోకమున అన్ని పాదములలో చికారము ఆది యందున్నది. ఇది దాక్షిణాత్యసంప్రదాయమున వడియని పిలువబడు అనుప్రాసమను శబ్దాలంకారము,

శ్రీకామాక్షీదేవి చింతామణిగా చిత్సుధాధారగా అభేదాధ్యవ సాయము చేసి చెప్పబడినందున అతిశయోక్త్యలంకారము నున్నవి. ఈ శ్లోకమున నాల్గవపాదమధ్యమున కూడ చికారావృత్తిరూపమైన వడియను శబ్దాలంకార మున్నది. చిత్సుధాధార అను సమాసము కుండలినీ వేధముచే సహస్రారచంద్ర మండల నిర్గతమగు సుధాధార సూచింపబడుచున్నది.



**అవ:–** పై శ్లోకమున **శ్రీ** కామాక్షీదేవి స్త్రీభావము పుంభావము కలదిగా చెప్పబడినది. ఈ శ్లోకమున స్త్రీపుంభావాతీతయని తెలుపుటకు నపుంసకలింగ విశేష్యములతో పేర్కొనబడుచున్నది.

శ్లో॥ కుటిలకచం కఠినకుచం
కున్దస్మితకాన్తి కుఙ్కుమచ్ఛాయమ్।
కురుతే విహృతిం కాఞ్చ్యాం
కులపర్వతసార్వభౌమసర్వస్వమ్॥ 4

**ప్రతిపదార్థము :–**

| | | |
|---|---|---|
| కుటిలకచమ్ | = | వంకర దిరిగిన ముంగురులుకల; |
| కఠినకుచమ్ | = | కఠినములైన చన్నులుకల; |
| కుందస్మితకాంతి | = | మొల్లలవంటినవ్వు కాంతిగల; |
| కుంకుమచ్ఛాయమ్ | = | కుంకుమపూవువంటి కాంతిగల; |
| కులపర్వత సార్వభౌమ సర్వస్వమ్ | = | కులపర్వత చక్రవర్తియొక్క సర్వస్వము; |
| కాంచ్యామ్ | = | కాంచీపురియందు; |
| విహృతిమ్ | = | విహారమును; |
| కురుతే | = | చేయుచున్నది. |

**తాత్పర్యము :–**

వంకరలు తిరిగిన ముంగురులుకల, కఠినములైన పాలిండ్లుగల, మొల్ల పువ్వువంటి నవ్వు తెలుపు, కుంకుమపూవువలె యెఱుపుగల, హిమాలయ పర్వత చక్రవర్తియొక్క సర్వస్వమనదగిన **శ్రీ**కామాక్షీదేవి కాంచీపురియందు విహరించుచున్నది.

**వివరణము :–**

1) భూమియందు సప్తకుల పర్వతములున్నవి. మిగిలిన పర్వతముల కవి రాజులు. వానికిని హిమాలయపర్వతము రాజు కావున అది కులపర్వత సార్వభౌమత్వము నందినది. శరీరమందు మూలాధారాది, ఆజ్ఞాచక్రాంతమునైన కులమార్గమున్నది. ఆ కులమార్గమున కుండలిని చరించి చివఱకు అకులమని చెప్పబడు సహస్రారమును చేరుకొనును. కులమార్గమును వ్యాపించియున్న భారతభూమికి (కామాక్షీదేవికి)

సహస్రారము మకుటస్థానము. దానిపైకెక్కుటకు హిమాలయముయొక్క సర్వస్వము కావుననే కామాక్షీదేవి యనెడి కుండలినికి సుకర సహజకార్యమైనది. మలయ వింధ్యాది కులపర్వతములు మూలాధారాది షట్చక్రములు వానికన్న ఎత్తైన హిమాలయము ఆ చక్రములపై నున్న సహస్రారమునకు సంకేతము. సహస్రారమున వేయిరేకులున్నట్లు హిమాలయమున వేలకొలది శిఖరములున్నవి. ఆ కులపర్వతసార్వభౌమ హిమాలయము నుండి చిత్సుధాధార యనదగిన గంగ ప్రవహించును. క్రింద నున్న సర్వభూములు ఆప్లావితములు ఆప్యాయితములు నగును. కావున ఆ చిత్సుధాధార ఆ హిమాలయపర్వతసార్వభౌముని సర్వస్వము. ఆమె శ్రీ కామాక్షీదేవి. హిమాలయమునుండి పుట్టిన గంగ భారతభూమియందు విహారము చేసినట్లు పార్వతీదేవి కామాక్షీ రూపమును ధరించి కాంచియందు విహార మొనర్చుచున్నది. ఈ విహారము చక్రములలో కుండలినీ విహారము వంటిదని **కురుతే** అని కృధాతువు నాత్మనేపదముగా ప్రయోగించుటచే తెలియును. పార్వతీదేవి స్వాత్మానందము కొఱకే స్వాత్మకొఱకే కాంచియందు విహారము చేసికొనుచున్నది అని వ్యంగ్యమగుచున్నది. కావున పార్వతీదేవియొక్క దర్శనము కాంచీనగరమును చేరిన భక్తులకు సులభమైనది. అట్లు చేరిన భక్తులందరు కుండలినీ మార్గమున చరించు సాధకయోగిపుంగవులతో సామ్యము నొందుచున్నారు. కామాక్షీదేవి కాంచియందు చరించుటకు బ్రహ్మాండాది పురాణోక్తములైన కారణము లామె యిచ్ఛ కనుగుణములుగా ప్రవర్తిల్లినవి. కాంచీపురమందలి యేకామ్రనాథుడే ఆమెకు స్వాత్మయై యున్నాడు. అందుకొఱకే ఆమె అటవిహారము స్వాత్మానందము కొఱకే చేసికొనుచున్నది. కాదనుటకు వద్దనుటకు మనమెవ్వరము.

2) కుండలినీ మార్గమున సూర్యచంద్రబింబముల వంటి కఠినస్తన పర్వతములు రెండున్నవి. అవి మార్గమున చరించు సాధక యోగిజీవుల కమృతము వంటి క్షీరమొసగి సేదదీర్చుచుండును. అను అర్థమును **కఠినకుచమ్** అను సమాసము వ్యంజింపజేయుచున్నది. వంకరలు తిరిగిన ముంగురులు సహస్రారకమలముయొక్క సహస్రదళములవలె నున్నవి అను నర్థమును **కుటిలకచమ్** అను సమాసము వ్యంజింపజేయును.

3) **కుందస్మితకాంతి, కుంకుమచ్ఛాయమ్** అను రెండు సమాసములు రక్తశుక్లప్రభామిశ్రయైన గురుచరణారవింద కాంతిసూచకములు. సూర్యబింబము కుంకుమచ్ఛాయము, చంద్రబింబము కుందచ్ఛాయము కావున అమ్మవారి పాదములందే కాక స్తనములందును రక్తశుక్లప్రభామిశ్రమున్నది. చంద్రునికి కుందచ్ఛాయకలుగుటకు అమ్మవారి అనుగ్రహము కారణము. కావుననే అమ్మవారి చిఱునవ్వుయొక్క కుందచ్ఛాయ ఆమె అనుగ్రహించినప్పుడు చంద్రునకు కలిగినది. అమ్మవారి స్తనములు శివాలింగనముచే శివుని ఱొమ్మునందలి భస్మముయొక్క పూత అంటి కుందచ్ఛాయములైనవి. వానియందు

అమ్మవారు కుంకుమలేప మొనర్చినది. లత్తుకపూసిన అమ్మవారి ఎఱ్ఱనిపాదములపై విభూతి పూసిన శివుని ఫాలము సోకుటచే అమ్మవారి పాదములందు కుందచ్ఛాయ నెలకొన్నది. అమ్మవారి పెదవు లెఱ్ఱనివి. ఆమె చిఱునవ్వు తెల్లనిది. కావున కుందకుంకుమ చ్ఛాయలు ముఖమునందును కలవు. ఈ ఛాయలు మొత్తమమ్మవారి అర్ధనారీశ్వర త్వమును చాటుచున్నవి. అమ్మవారు అరుణ, శివుడు శుద్ధస్ఫటిక సంకాశుడనుట ప్రసిద్ధము.

4) నాలుగు పాదములు కకారముతో నారంభింపబడుటచే నీ శ్లోకమున దాక్షిణాత్యాలంకారమైన **వడి** యను శబ్దాలంకారమున్నది. సమాసముల అంతములలో కచకుచ శబ్దములుండుటచే ప్రథమ పాదమున పదాంతప్రాసము అను శబ్దాలంకార మున్నది. విషయియగు కులపర్వతసార్వభౌమ సర్వస్వముగా అభేదాధ్యవసాయముచే శ్రీ కామాక్షీదేవి పేర్కొనబడినదే. విషయమైన కామాక్షీదేవిని చెప్పు శబ్దము లేక పోవుటచే నిందు అతిశయోక్త్య లంకారమున్నది. కులపర్వతసార్వభౌమసర్వస్వము అని భంగ్యంతరముగా శ్రీ కామాక్షీదేవి చెప్పబడుటచే పర్యాయోక్త్యలంకార మీ శ్లోకమున నున్నది. ద్వితీయపాదమున పాదమధ్యమున కూడ వడియను దాక్షిణాత్యాలంకారమున్నది.

5) చిఱుత+నవ్వు=చిఱునవ్వు.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి ముఖమునందలి రక్తశుక్లప్రభామిశ్రణము, ఆచార్యపాదద్వంద్వమున నున్నట్లు (ప్రసిద్ధమైనది) పేర్కొనబడినది. ఈ శ్లోకమున అమ్మవారి దృష్టిపాతమున ఆచార్యత్వమారోపింపబడుచున్నది.

**శ్లో॥ పఞ్చశరశాస్త్రబోధన-**
**పరమాచార్యేణ దృష్టిపాతేన।**
**కాఞ్చీసీమ్ని కుమారీ**
**కాచన మోహయతి కామజేతారమ్॥ 5**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| పంచశరశాస్త్ర బోధన పరమాచార్యేణ | = | కామశాస్త్రబోధనకు పరమాచార్య రూపమైన |
| దృష్టిపాతేన | = | కటాక్షముతో |
| కాచన | = | ఒకానొక |
| కుమారీ | = | బాలిక |
| కామజేతారమ్ | = | కాముని జయించిన వానిని(శివుని) |
| మోహయతి | = | మోహింపజేయుచున్నది. |

**తాత్పర్యము :-**

కామశాస్త్రబోధము నొనరించుటలో ప్రథమాచార్యత్వమును బొందిన

దృష్టిపాతముతో కాంచీపురసీమయందలి యొకానొక **కుమారి** కామారియైన శివుని మోహింపజేయుచున్నది.

**వివరణము :-**

కాంచీపుర పరిసరములందొక కుమారి యున్నది. ఆమె బాల్యమును దాటి యౌవనమునందడుగిడినదో లేదో కాముని జయించిన శివునే మోహింపజేయుచున్నది. ఉదయాద్యౌవనత్వమును బోధించు కుమారీ శబ్దమీ యర్థమును వ్యంజింపజేయును. ఆ కుమారి కటాక్షము కామశాస్త్రమును బోధించుటలో పరమాచార్యమైనది. పరమాచార్యుడనగా తనకు మరొక ఆచార్యుడు లేనివాడు. అట్టి పరమాచార్యత్వము కామాక్షీదేవియందే సంభవము. ఇతరత్ర అసంభవము. ఇతరుడెవడేని నేను పరమాచార్యుడనని చెప్పిన ఆ మాట నమ్మరానిది. వాని బోధలు కూడా నమ్మరానివే. **ఆచార్యవాన్ పురుషో వేద** (ఛా. 6.14.2) అను మాట ఆచార్యుని ద్వారా జ్ఞానమును బొందినవాడు మాత్రమే జ్ఞానబోధ యందధికారి యని, ఆచార్యుడు లేకుండనెవనికిని జ్ఞానము కలుగదని చెప్పుచున్నది. శ్రీకామాక్షీదేవియే స్వయముగా జ్ఞానమే స్వరూపముగాగలది. ఆమె జ్ఞానఘనవిగ్రహ. ఆ విగ్రహమందలి అవయవములన్నియు జ్ఞానఘనములే. కావున పరమాచార్యత్వము నామె చూపు పొందుటలో వింత లేదు. ఇంతకు ప్రథమాచార్యరూపమగు అమ్మవారి చూపు ఏ జ్ఞానము నొసగును. అది కామశాస్త్ర జ్ఞానము. వాస్తవమునకు ఆ శాస్త్రము కామోపజ్ఞకము అనగా మన్మథోపజ్ఞము. కాని కామునిచే నా కామశాస్త్రమును ప్రవర్తింపజేసినది సర్వజ్ఞానరూపిణియగు అమ్మవారి చూపే. ఆమె కటాక్షమునకు పాత్రుడైన వాత్స్యాయనుడాకామ శాస్త్రమును భూలోకమున ప్రవర్తింపజేసెను. ఇది తృతీయ పురుషార్థమైన కామముయొక్క సిద్ధికి హేతువు. కాని వాస్తవమునకు ఇచటి పంచశరశాస్త్రము కాది విద్యాశాస్త్రము. ఈ విద్య పంచశరునకు (కామునకు) పంచశరయగు అమ్మవారి ఉపాసనచే లభించినది. ఆ తరువాత ఆ కాదివిద్యాశాస్త్రమును అమ్మవారి అనుగ్రహమునకు పాత్రుడైన హయగ్రీవుడగస్త్యునకు బోధించెను. ఆ విధముగా అది లోకమున ప్రవర్తిల్లెను. ఎందఱాచార్యుల ద్వారా ఆ శాస్త్ర మీలోకమున ప్రవర్తిల్లినను ప్రథమాచార్యత్వమమ్మవారి కటాక్షమునందే యున్నది.

2) అమ్మవారి కటాక్షము కాముని అన్ని ఆయుధములకన్నా గొప్పది. అది పడిన వాని పైన నే ఆయుధములు పనిచేయుట పనిచేయకపోవుట అను వికల్పము సంభవించును. లౌకిక సుఖమును కోరి అమ్మవారి నారాధించి ఆమె కటాక్షమును బొందినవాడు తృతీయ పురుషార్థసిద్ధికి కావలసిన ఐశ్వర్యమును అనిదమైన ప్రియురాండ్రతోడి బహువిధ సంభోగములను పొందును. అలౌకిక సుఖమును కోరి అమ్మవారి నారాధించి ఆమె కటాక్షమును అనగా దృష్టిపాతమును పొందిన వానికి కాదివిద్యాప్రాప్తి తద్వారా కైవల్యము కలుగును. ఇది యిట్లుండగా కాముని బూడిదచేసినాననుకొనుచున్న కామవిజేత యగు శివుడు అమ్మవారి దృష్టిపాతముతో

మోహమును పొందినాడు. కైవల్యసుఖమునకు దూరుడై జీవేశ్వర భేదమునొంది సంచరించి దుఃఖముల పాలైనాడు. అనగా ఎవడమ్మవారి నాశ్రయింపక జ్ఞానియైనాననుకొన్నను వాని జ్ఞానము నమ్మవారు తన దృష్టిపాతమున తొలగించి సంసారిని చేయును. సంసారులొకవేళ కైవల్యమందగోరి అమ్మవారి నారాధించినచో ఆమె దృష్టిపాతము కలిగి శివాత్వమును అనగా జీవశివైక్యరూప కైవల్యమును పొందును. బంధమోక్షములు రెండును అమ్మవారి దృష్టిపాతముననే కలుగును. శివుడు జీవుడగుట, జీవుడు శివుడగుట, అమ్మవారి దృష్టిపాతము చేతనే సంభవించును. ఇట్లు కామశాస్త్రము తత్ఫలమైన కామోపభోగమును తద్ధేతువైన సంభోగచాతుర్యము మొదలగు లౌకిక సుఖములను కలిగించుటకు కావలసిన కామశాస్త్రజ్ఞానమునుగాని మోక్షమునకు పరమ్పరా సాధనములలో పరమమైన కాదివిద్యాశాస్త్రజ్ఞానమునుగాని నేర్చుకొనవలె నన్నచో అమ్మవారి దృష్టిపాతమే ఆచార్యత్వము వహించును. కావున ఉభయవిధకామశాస్త్ర బోధములో అమ్మవారి దృష్టిపాతమే ఆచార్యత్వము వహించును.

3) ఎంతటి ఆచార్యుడైనను బ్రహ్మసూత్రోపనిషదాదుల నధ్యాపనము చేయువాడైనను అందమైన కుమారియొక్క కాంచీ సీమయందు దృష్టి పడెనేని లేక ఆ కుమారియొక్క దృష్టిపాతమునకు పాత్రుడయ్యేనేని మోహమును పొందునను అర్థాంతరము నీ శ్లోకము వ్యంజింపజేయును. ఈ శ్లోకము నాల్గవదైన కటాక్షశతకమున కాంతరమంగలాచరణము వంటిది.

4) బేసిపాదములందు ఆది ప్రాసము, నాల్గవపాదమధ్యమున వడియను శబ్దాలంకారములున్నవి. దృష్టిపాతమం దాచార్యారోవముండుటచే నిట రూపకాలంకారమున్నది.



**అవ:–** పై శ్లోకమున శివపారతంత్ర్య హేతువుగా దృష్టిపాతము వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఆ దృష్టిపాతమునకు ఆధారమైన అమ్మవారి లోచనము మూకాది భక్తపారతంత్ర్య హేతువుగా వర్ణింపబడినది.

**శ్లో॥ పరయా కాఞ్చీపురయా**
**పర్వతపర్యాయపీనకుచభరయా।**
**పరతన్త్రా వయమనయా**
**పఙ్కజసబ్రహ్మచారిలోచనయా॥ 6**

**ప్రతిపదార్థము :–**

పరయా = శ్రేష్ఠురాలైన;
కాంచీపురయా = కాంచీపురమునే తన నగరముగా చేసికొన్న;
పర్వతపర్యాయపీనకుచభరయా = పర్వతవాచి శబ్దములకు పర్యాయమైన

| | |
|---|---|
| | కుచశబ్దముచే చెప్పబడు స్తనముల బరువుకల; |
| పంకజసబ్రహ్మచారిలోచనయా | = కమలములకు సహపాఠులైన కన్నులుగల; |
| అనయా | = ఈమె (శ్రీకామాక్షి) చేత; |
| వయమ్ | = మేము; |
| పరతంత్రాః | = దాసులమై; |
| (స్మః | = ఉన్నాము.) |

**తాత్పర్యము :-**

కాంచీనగరమునే తన నగరముగా చేసికొన్న పర్వతములకు మారు పేరైన స్తనముల బరువుగల, కమలములవంటి కన్నులుగల, ఈ కామాక్షీదేవిచేత దాసులుగా చేయబడియున్నాము.

**వివరణము :-**

1) బ్రహ్మాండము లోపల పిండాండము. పిండాండము (స్థూల శరీరము)లో ప్రాణేంద్రియాత్మక సూక్ష్మశరీరము. దానిలోపల అజ్ఞానము (కారణ శరీరము). దానికిని లోపల ప్రత్యగాత్మ యున్నది. దానికి ప్రత్యక్చైతన్యమని, జీవుడనియు పేర్లు కలవు. ఆ జీవునకు వెలుపల తూలాజ్ఞానము (వ్యష్టికారణ శరీరము), దానికి వెలుపల సూక్ష్మశరీరము, దానికి బహిరంగముగా స్థూలశరీరము (పిండాండము). అట్టి స్థూలశరీరములకన్నింటికి ఆవరణముగా (బహిరంగముగా) బ్రహ్మాండము. దానికావల మూలావిద్య. దానికావల పరమాత్మ ఉన్నాడు. ఈ పరమాత్మకే 'పర' అను పేరు కలదు. ఈ ప్రత్యక్పరములకైక్యము కల్గుటయే కైవల్యము. అదియే పరమమోక్షము. అమ్మవారు పరయనగా బ్రహ్మాండము లన్నింటిని తనయందు ధ్వస్తములుగా నొనరించుకొన్న చైతన్యమే స్వరూపముగాగల దేవతయని అర్థము. అట్లు సర్వాభిమాన రహితయగు పరయగు ఆ ఆమ్మవారు కాంచీపురమును తన పురమని అభిమానించుట వింత. అది భక్తజనులను తరింపజేయుట కొఱకు ఏర్పరచుకొన్న అభిమానము. అంతేకాదు దేవాలయము నందుగల యొక విగ్రహమును కూడ తన స్థూలదేహముగా నభిమానించుట మరొక వింత. ఆ స్థూలదేహవిగ్రహమునకు కన్నులున్నవి. అవి పంకజస బ్రహ్మచారులు. అనగా పంకజసదృశ్యములు అని చెప్పబడుటచే **పంకజస బ్రహ్మచారిలోచనయా** అను సమాసమున ధర్మలుప్తోపమా లంకారమున్నది.

2) ప్రథమ పాదమున పదాంతానుప్రాసము ప్రథమ, ద్వితీయ పాదాంతానుప్రాసము, తృతీయ చతుర్థ పాదాంతానుప్రాసము, అను శబ్దాలంకారములీ శ్లోకమున నున్నవి.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారు పరయని చెప్పబడినది. ఈ శ్లోకమున పరమేశ్వరుని

**ఐశ్వర్యము** (బ్రహ్మాండాద్యణ్వంతము) అమ్మవారని చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఐశ్వర్యమిన్దుమౌలే-**
**రైకాత్మ్యప్రకృతి కాఞ్చిమధ్యగతమ్।**
**ఐన్దవకిశోరశేఖర-**
**మైదమ్పర్యం చకాస్తి నిగమానామ్॥ 7**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| ఇందుమౌలేః | = చంద్రుడు శిరమందుగల శివునియొక్క |
| ఐశ్వర్యమ్ | = ఐశ్వర్యము |
| ఐకాత్మ్యప్రకృతి | = జీవేశ్వరైక్యజ్ఞానహేతువు |
| కాంచిమధ్యగతమ్ | = కాంచినగర మధ్యమున నున్న |
| ఐందవకిశోరశేఖరమ్ | = నెలబాలుడు శిరోభూషణముగాగల |
| నిగమానామ్ | = వేదములయొక్క |
| ఐదమ్పర్యమ్ | = తాత్పర్యము |
| చకాస్తి | = ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము :-**

అమ్మవారనగా చంద్రశేఖరుని ఐశ్వర్యము. ఆతనివలె బాలచంద్రుని శిరమున దాల్చియున్నది. వేదములయొక్క తాత్పర్యము. జీవేశ్వరైక్య జ్ఞానహేతువు. ఆమె కాంచీనగర మధ్యమున నున్నది.

**వివరణము :-**

**ఐశ్వర్య**మనగా ఈశ్వరత్వము. అది ఈశ్వరుని యందున్నప్పుడే అతడీ-శ్వరుడగును. ఐశ్వర్యములేనివాడు ఈశ్వరుడుగాడు. అమ్మవారి వలననే ఈశ్వరుని కీశ్వరత్వము వచ్చినది. ఆమె లేనియెడల నాతని కీశ్వరత్వమే లేదు. ఈశ్వరుడు అనగా ప్రభువు. దాసులున్నచో ప్రభువుండును. దాసులు లేనిచో ప్రభువగుట యెట్లు? ఎవరికాతడు ప్రభువగును? అమ్మవారు శివునకు దాసురాలు. దాసియగు అమ్మవారికి శివుడు ప్రభువు కావున అమ్మవారి వలన ఆతని కీశ్వరత్వమేర్పడినది. ఐశ్వర్యమనగా బ్రహ్మాండశరీరత్వము అనగా బ్రహ్మాండమునే శరీరముగా కలిగియుండుట, బ్రహ్మాండ మంతయు అమ్మవారే. ఆ దేవీరూప బ్రహ్మాండము శరీరముగాగలవాడు, **శరీరం త్వం శమ్భోః** అని సౌందర్యలహరిలో అమ్మవారు శివుని శరీరమని చెప్పినారు శంకరులు. బ్రహ్మాండముయొక్క పై భాగమైన ఆకాశమున చంద్రుడుండును. ఆ ఆకాశమే అనగా ఆ ద్యులోకమే లేక ఆ నీలాకాశమే అమ్మవారి శరీరమునందలి శిరస్సు. ఆ ఆకాశ శిరమున మొగలిరేకు వంటి చంద్రరేఖ నమ్మవారలంకరించుకొన్నది. కావున అమ్మవారు ఐందవ కిశోరము శేఖరముగాగలదైనది. ఆ బ్రహ్మాండ స్థూలదేహోపాధి యందభిమానము కలవాడై శివుడును

ఇందుమౌళియైనాడు. ఆ అభిమానము లేనివాడు బ్రహ్మాండ రూపమైన తన స్థూలశరీరము నందభిమానమును విడచిననాడు శివుడు చంద్రమౌళి కాజాలడు. కావున చంద్రమౌళి యొక్క ఈశ్వరత్వము బ్రహ్మాండరూపిణియైన అమ్మవారి మీద ఆధారపడియున్నది. దాదాపు అన్ని జగద్గురు పీఠములలో చంద్రమౌళీశ్వరుడున్నాడు. ఆ పీఠముల యైశ్వర్యమంతయు అమ్మవారే. అమ్మవారిదే. ఆ ఐశ్వర్యములేని నాడా పీఠముల కడకెవరో యొకరిద్దఱు పోవుదురేమో కాని బ్రహ్మాండమైన సంఖ్యలో సకాములైన భక్తుల కాపీఠములతో పనియే యుండదు. ఈశ్వరుని శక్తి ఐశ్వర్యము. ఈశ్వరుని శక్తియనగా మాయ. అదియే సర్వబ్రహ్మాండముల సృష్టిస్థితిలయముల నొనరించును. అట్లొనరించియు ఈశ్వరునికి తత్కర్తృత్వ మంటగట్టును. అందుచే ఆ నిర్గుణుడు సగుణుడైనాడు. సత్త్వరజస్తమోగుణ రూపైశ్వర్యము కలవాడైనాడు. ఆమె బ్రహ్మాండరూపిణి. బ్రహ్మాండాభిన్న అగుటయే కాదు శివాభిన్న కూడ కావున చంద్రమౌళివలె ఐందవకిశోరశేఖరమైనది. ఈ బ్రహ్మాండ మంతయు ప్రవిలాపము నందగా ఆమె జీవత్వ బ్రహ్మత్వముల వీడి ఏకాత్మత్వము నందును. జీవత్వేశ్వరత్వముల వీడి యేకాత్మ రూపము నందిన జీవన్ముక్తులలో విదేహ ముక్తులలోని ఐకాత్మ్య మామెయే. వారి ఐకాత్మ్య హేతువైన జీవైశ్వరైక్య జ్ఞాన రూపచరమవృత్తియు ఆమెయే. ఆ చరమ వృత్తివలన జీవత్వేశ్వరత్వములు వీడిపోయి ఐకాత్మ్యము శేషించును. ఆ ఐకాత్మ్యము చరమవృత్తి రూపిణియైన అమ్మవారి వలన కలుగును. కావున అమ్మవారు ఐకాత్మ్యప్రకృతి యని చెప్పబడినది. అర్థప్రపంచరూపమైన బ్రహ్మాండమంతయు అమ్మవారైనట్లే, శబ్ద ప్రపంచమంతయు అమ్మవారే. శబ్ద ప్రపంచమున స్వతః ప్రమాణమైన నిగమములు అమ్మవారి రూపములే. అమ్మవారు వాగ్రూపిణి యని రఘువంశాది మంగళాచరణమున కాళిదాసు సూచించినాడు. పెక్కు పురాణవాక్యములమ్మవారు వాగ్రూపిణియని చెప్పినవి. ఆ వేదములు వానికి శిరస్సు లనదగినవి. ఉపనిషత్తులు, వాని అన్నింటి తాత్పర్యము, అమ్మవారి యందే. కావున అమ్మవారు నిగమతాత్పర్యమని చెప్పబడినది.

2) శరీరమున నాభ్యాది శిరఃపర్యంతభాగము మూలాధారాది సహస్రార పర్యంతభాగము ముఖ్యమైనది. ఉపాసనా భూమియు కూడ నైయున్నది. కాలుసేతులు కొమ్మలవంటివి. షట్చక్రములకు నిలయమైన వెన్నెముక దాని శిరోభాగమైన కపాలమును ఉపాసనా భూములు. కావున ఆ భాగము ముఖ్యమైనది. ఆ ముఖ్యమైన పాదభాగమును వేరుచేయు నడిమి భాగమున కాంచి ధరింపబడును. కాంచి సమీపమున నున్న మూలాధార స్వాధిష్ఠానము లందు సమయమతస్థు లమ్మవారి నుపాసించుట నంగీకరింపరు. కావున నాభ్యాది సహస్రారాంతభాగ ముపాసనాభూమిగా నేను పేర్కొనుట జరిగినది. కౌలాది మతము ననుసరించి షట్చక్రముల నుపాసనాభూమి యని చెప్పితిని. ఇట్లు ముఖ్యాముఖ్య శరీరమధ్యమున కాంచి ధరింపబడును. అనగా ఇటకు పై నుండిన చక్రములలో అమ్మవారి నుపాసింపుడని అమ్మవారిని కాంచుడని సాధకులకు మధ్యగత కాంచి

యుపదేశించుచున్నది.

3) మధ్యగతమై జారుచున్న కాంచియను కాంచనాభూషణమును తదలంకృతమైన కామినీ శరీరమును కాంచిన వారధమ (నాభ్యదః) శరీర పరిపోషణ పరితృప్తులు ఉపాసకులు కాజాలరు.

4) **నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా-** అను శ్రుతి ననుసరించి అణూపమయైన అమ్మవారిని (కృశాంగిని) కాంచిన వారు ధన్యులు.

5) కాంచీమధ్యమున పొదగబడిన రత్నమమ్మవారు. కాంచియందది దూరము నుండి చూచువారికి అదృశ్యమైనను దానిచేతనే కాంచికి వెలకట్టబడును. కాంచీనగర మందలి అమ్మవారిని చూడక కాంచినగరమును చూచువాడు వరిపొట్టు కొఱకు ప్రాకులాడువాడు. సారము అనదగిన అమ్మవారు కాంచిమధ్యమున ఉన్నది. ఆమెయే కాంచబడవలెను. తదితరమును కాంచుట వరిపొట్టునకై ప్రాకులాడుటయే.

6) **ఐశ్వర్యమ్** అను పదముయొక్క ఆద్యంతవర్ణ ప్రత్యాహారముచే నొక **ఐంకారమును**, ద్వితీయ పాదాద్యంతవర్ణ ప్రత్యాహారము చేతనొక **ఐంకారము**ను తృతీయ పాదాది యందొక **ఐంకారము**ను ఐదమ్పర్యమ్ అను శబ్దముయొక్క ఆద్యంత వర్ణములయొక్క ప్రత్యహారముచే మరొక **ఐంకారము**ను ఈ విధముగా నాలుగైంకారము లీ శ్లోకమున నుద్ధరింపబడుట కవకాశము కలదు. ప్రథమపాదము ఐశ్వర్యములలోని అకారము ఇందుమౌళేః లోని ఏకారమును సంధానించి మరొక ఐంకారము నుద్ధరించుకొనవచ్చును. అట్లే కాదివిద్యాద్యక్షరమును ఐకాత్మ్య, చకాస్తి పదముల మధ్యమున కిశోరకాంచి పదముల అది యందును దర్శింపవచ్చును. కాది విద్యాద్వితీయాక్షరమును ఇందుమౌళేః అను ఐందవ కిశోర శేఖర అను సమాసముయొక్క చివరి పదమునను రెండుమార్లు దర్శింపవచ్చును. ఈ అంశములు కొన్ని తాంత్రిక మోదావహములు. ఇట్లెన్నియేని ఈ మూకమహాకవియొక్క పంచశతకములందు దర్శించుకొనవచ్చును. పరదేవతా మంత్రములో ఐకారముయొక్క పరమ తాత్పర్యమీ శ్లోకమున సూచితమని బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు (మూకపంచశతి కాంధ్ర పద్యానువాద తాత్పర్యముల గూర్చినవారు) చెప్పి యున్నారు. వారైందవ కిశోరశేఖర మను సమాసమునకు చిచ్చంద్రమండలాధి ష్ఠాత్రి యను నర్థమును సూచించినారు.

7) ఈ శ్లోకమున కామాక్షీదేవి ఇందుమౌళ్యైశ్వర్యమని నిగమైదమ్పర్యమని భంగ్యంతరముగా చెప్పబడుటచే పర్యాయోక్త్యలంకారమున్నది.

8) కాంచీ పురసీమయందు కామాక్షి యున్నదని యొకసారి ఆమె కాంచిమధ్యగతయని, మరొకసారి చెప్పుటలోని విరోధము నిట్లు పరిహరించు కొనవచ్చును. మన భారతదేశమునగల గ్రామముల మధ్యమున నొక ఆలయముండును. అది గ్రామదేవతాలయమైన అగుగాక, బొడ్డురాయి యైనను అగుగాక. దీనిచుట్టు ఇండ్లు,

గ్రామమంతయు నుండును. ఏదోయొక కారణముచే నొకవైపున ఇండ్లు పాడయి బీడయి ఆ ఆలయము సీమగతమగును.

9) మూలాధార సుషుప్తయగు జీవరూపమైన కుండలిని ఆజ్ఞాంతకుల మార్గమును దాటి శివరూపయగును. కావున శ్రీ కామాక్షీదేవి జీవులందు ప్రత్యగాత్మరూపిణిగాని, శివునియందు పరరూపిణిగా నుండి ప్రత్యగైక్యమును, శివునితోడి ఐకాత్మ్యమును, రెంటిని కలిగియుండి చివరకు తదుభయైక్యరూపిణియై పోవుటయే ఐకాత్మ్య ప్రకృతియను సమాసముయొక్క తాత్పర్యము. ఈ శ్లోకమునను పర్యాయోక్త్యలంకార మాలిక యున్నది.



**అవ:-** చతుర్దశభువనాత్మకబ్రహ్మాండరూపమైన శివునైక్యమమ్మవారని పూర్వశ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారు కంచుకితభువన భూమగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ శ్రితకమ్పాసీమానం**
**శిథిలితపరమశివధైర్యమహిమానమ్।**
**కలయే పాటలిమానం**
**కఞ్చన కఞ్చుకితభువనభూమానమ్॥ 8**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| శ్రితకంపాసీమానమ్ | = కంపానదీ తీరభూసీమ నాశ్రయించిన; |
| శిథిలితపరమశివధైర్యమహిమానమ్ | = పరమశివుని ధైర్యమహిమమును శిథిల మొనర్చిన; |
| కంచుకితభువనభూమానమ్ | = భువనాధికవైశాల్యమునే కంచుకముగా వేసికొనిన; |
| కంచన | = ఒకానొక; |
| పాటలిమానమ్ | = ఎఱుపును; |
| కలయే | = ధ్యానించెదను. |

**తాత్పర్యము :-**

కంపానదీతీర భూసీమనాశ్రయించిన, పరమశివుని ధైర్యమహిమమునే శిథిలమొనర్చిన, భువనసమూహమునే చొక్కాగా చేసికొని ధరించిన ఒకానొక ఎఱుపును ధ్యానించెదను.

**వివరణము :-**

1) కంపానదీతీరమున కాంచీనగరమున్నది. ఆ నగరమందలి దేవాలయమున కామాక్షీదేవి యున్నది. ఆ గుడి ఆమె కాధారముగా కనిపించినను సమస్త బ్రహ్మాండముల కామెయే ఆధారభూమియై యున్నది. ఆ బ్రహ్మాండమునే ఆమె పొడుగు చొక్కాగా ధరించి

పాతబడిన వెంటనే చించి పారవేయుచుండును. మరల నొక బ్రహ్మాండమును సృజించి ధరించి కొంతకాలమునకు మరల చించి పారవేయును. ఇది ఆమె పని. పనిలేని పని. పనికాని పని. పనికిరాని పని యని చెప్పుటకు మనము పనికి రామేమో! అదియే ఆమె లీలయేమో?

2) ఆమె ఒక ఎఱుపు కాదు. మెఱుపు కాదు. ఎఱుపు మెఱుపు. ఆమె ఒక విద్యుల్లేఖ. పరమేశ్వరుడు తెల్లని మేఘము కానిచో నీలతోయదమే అగుగాక. ఆమె మాత్రము తన్మధ్యమున మెఱసి అదృశ్యమై పోవును. ఈ బ్రహ్మాండములన్ని ఆమె మెఱుపులోనే కనిపించును. ఆ మెఱుపు లేనిచో బ్రహ్మాండములు లేనట్టివే. కనబడిననే పుట్టినవనుకొందుము. కనబడకయే పోయిన పుట్టిన వనుమాట యెట్లు పొసగును. సాక్ష్యమేది? దృష్టియే సాక్ష్యము. అదియే సృష్టివ్యవహార హేతువు. భావము తెలుపు. అది పగలు. అభావము నలుపు, అది రాత్రి. ఆ రెండిటి సంధిలోని సంధ్య యెఱుపు అమ్మవారనవలెను. భావాభావముల సంధియన్న, సదసద నిర్వాచ్యా మిథ్యయన్నను శబ్దభేదమే కాని అర్థభేదము లేదు. భావాభావములు పరస్పర విరుద్ధములు కావున సదసత్తుకాదీ జగమనిరి. చివరికి దానిని సత్తని చెప్పిరా, అసత్తని చెప్పిరా, ఎట్లును చెప్పరానిదని చెప్పిరి. పొసగకున్నను దానిని తెలుపు నలుపుల మధ్య, అనగా పగటికి రాత్రికి మధ్యనున్న సంధియని చెప్పిరి. నిద్రాజాగ్రన్మధ్యగతమైన లేక జాగ్రన్నిద్రా మధ్యగతమైన స్వప్నమనిరి. చెప్పరానిదన్నవారనిర్వాచ్యమనిరి. చెప్పవచ్చు ననుకొన్నవారు సంధ్యయనిరి. స్వప్నమనిరి. అదేదో అనుభూతియే చెప్పలేక పోయినంత మాత్రమున అనుభూతిని కాదనలేము కదా! అనుభూతిని లేదనలేము గదా! కంచన (ఒకానొక అనిర్వాచ్య) అను పద మీయర్థమును వ్యంజించును.

3) **మానమ్** అను శబ్దము నాలుగు సార్లు నాలుగు పాదముల చివఱ ప్రయోగింపబడుటచే నీ శ్లోకమున అంత్యానుప్రాసమను శబ్దాలంకారమున్నది. ఇందు పాటలిమగా అమ్మవారు భంగ్యంతరమున చెప్పబడుటచే పర్యాయోక్త ంకార మున్నది. ✤



**అవ:-** పై శ్లోకమున అమ్మవారియొక్క శిథిలత పరమశివధైర్యమైన మహిమ చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ మహిమకు కారణమైన ఆరూఢయౌవనాటోపము చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆదృతకాఞ్చీనిలయా-**
**మాద్యామారూఢయౌవనాటోపామ్।**
**ఆగమవతంసకలికా-**
**మానన్దాద్వైతకన్దలీం వన్దే॥ 9**

**ప్రతిపదార్థము :-**

ఆదృత కాంచీనిలయామ్ = కాంచీనగర నిలయము నందాదరము గల;

| | | |
|---|---|---|
| ఆద్యామ్ | = | ఆద్యురాలైన; |
| ఆరూఢ యౌవనాటోపామ్ | = | యౌవనగర్వ (పర్వత)ము నెక్కిన; |
| ఆగమవతంసకలికామ్ | = | వేదములు తమ తలలందు శిరోభూషణముగా ధరించిన మొగ్గయగు; |
| ఆనందాద్వైతకన్దలీమ్ | = | ఆనందాద్వైత వృక్షమునకు మొలకయగు; |
| దేవీమ్ | = | దేవిని గూర్చి; |
| వందే | = | నమస్కరించుచున్నాను. |

**తాత్పర్యము :-**

కాంచీ నగరమందు నివసించు నాదరముగల యౌవనగర్వపర్వతము నెక్కిన ఆగమయువతుల తలలందు అలంకారముగా వెలయు మొగ్గయు, ఆనందాద్వైత వృక్షమునకు మొలకయునగు కామాక్షీదేవికి నమస్కరించుచున్నాను.

**వివరణము :-**

కాంచీనగరము వింతలకెన్నిటికో పుట్టిల్లు. ఆ వింతలలో బ్రహ్మాండము లన్నింటిని తన పొట్టలో నింపుకొన్న కామాక్షీదేవి కాంచీనగర మందుండుట గొప్ప వింత. ఆ నగరమున నివసించుట కాదరము చూపుట గొప్ప వింత. తానొక శరీరము ధరించి తన నివాసమునకై కాంచీనగరమును అమ్మవారు నిర్మించుకొన్నది, కావున కాంచీనగరనిర్మాణమున కాది యందే అమ్మవారున్నది. కాంచీనగరమునకే కాక సర్వబ్రహ్మాండములకును ఆదియందామె యున్నది. ఆమె **ఆరూఢయౌవన**గానే ఆవిర్భవించినది. ఆరూఢయౌవనగా ఏ స్త్రీయు జన్మించదు. అట్టియెడ తానొక్కతెయే అట్లావిర్భవించినానను గర్వమామెకున్నదా? ఏ యువతి యౌవనమును నిత్యము కాదు. తన యౌవనము నిత్యమను గర్వము ఆమెకున్నదా? దేవతా స్త్రీల యౌవనము నిత్యమైనను అనిత్యత్వ మాపేక్షితము. కావున ప్రళయమందది నశించునట్టిదే. తన యౌవనమాప్రళయ కాలమున సైతము నశించని దను గర్వమామెకున్నదా? మేరుపర్వతద్వయమును కాఠిన్యమున మించిన స్తనద్వయము కలిగినదాన నను గర్వము ఆమెకుండుట యుచితమే కావచ్చును. ఇట్టి యౌవనగర్వముగల అమ్మవారిని వేదమాతలు తమ తలలో కలికగా ధరించినారు. వేదమాతృశిరోవతంస కలికయగు అమ్మవారు ఆనందాద్వైత వృక్షమునకు మొలక. శివానందాద్వైతస్థాణువెప్పుడు కందలించినదో దానికి కొమ్మలు రెమ్మలు నెప్పుడుద్భవించి పెరిగిపోయినవో, పత్రములెప్పుడు నిండినవో అది యెప్పుడు మొగ్గ దొడిగినదో తెలియదు. కాని శివానందాద్వైతవృక్షము, కందలి అమ్మవారే. కందలి అమ్మవారైనప్పుడు వృక్షమును అమ్మవారే. కందలియే వృక్షత్వమందును. **వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేక స్తేనేదమ్పూర్ణ మ్పురుషేణ సర్వమ్** (శ్వే. 3. 9) అను శ్రుతిసూక్తికి సార్థకత్వమును కలిగించినదా? కందలియైన అమ్మవారే ఆనందాద్వైతవృక్షము. మూలాధారమున కందలించి సహస్రారమున పూర్ణత్వము నందును. నదీజలములు సముద్ర

జలమందద్వైతత్వ మొందినట్లు తైత్తిరీయోపనిషత్తునందు మనుష్యానందము మొదలు బ్రహ్మానందము వఱకుగల దశ విధానందములు పేర్కొనబడినవి. బ్రహ్మానందమున అన్ని ఆనందములు (ఇహ లౌకిక విషయానంద సహితముగ) అద్వైతత్వము నందును. సమాధ్యభ్యా సారంభకాలమున కందలించిన ఆనందాద్వైతవృక్షము **యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర సమాధయః** అను రీతిగా సహజ సర్వానందాద్వైతస్థితిని పొంది పూర్ణత్వము నందుకొనును. కందలి పూర్ణత్వమునందుట అను వృక్షపరిణామముయొక్క ఆరోపణ వ్యంగ్యమే. అమ్మవారి యందు కందలీత్వారోపణము వ్యంగ్యమే కావున ఇందు రూపకాతిశయోక్త్యలంకార మున్నది. ఆగమవతంసకలికాత్వారోపణము కూడ వ్యంగ్యమే కావున అది మరొక రూపకాతిశయోక్త్యలంకారము. ఈ శ్లోకమున ఆకారము మొదలుగల పదములు ఐదున్నవి. వానిలో ఆద్యాపదము ద్వితీయమగుట వింత. శబ్దరూపిణి యైన అమ్మవారిలో ఇట్టి శాబ్దికాద్భుతములు (శబ్దచమత్కారముల వింతలు) ఎన్నియో ఉన్నవి. అట్లుండుట వింతకాదు. మూకమహాకవి కవితలో అట్లుండక పోవుటయే వింత. **ఆగమవతంసకలికగా ఆనందాద్వైతకన్దలిగా** అమ్మవారు అను విషయముయొక్క నిగరణముండుటచే రూపకాతిశయోక్త్యలంకారమిందున్నది.



**అవ॥:-** పై శ్లోకమున ఆనందాద్వైతము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున ఆనందాద్వైతహేతువైన **శృంగారాద్వైతము** ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ తుఙ్గాభిరామకుచభర-**
**శృఙ్గారితమాశ్రయామి కాఞ్చిగతమ్।**
**గఙ్గాధరపరతన్త్రం**
**శృఙ్గారాద్వైతతన్త్రసిద్ధాన్తమ్॥ 10**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| తుంగాభిరామకుచభరశృంగారితమ్ | = ఎత్తైన అందమైన స్తనముల బరువుచే సింగారింపబడిన; |
| కాంచిగతమ్ | = కాంచీనగరమున నున్న; |
| గంగాధర పరతంత్రమ్ | = శివునకు విధేయమైన; |
| శృంగారాద్వైతతంత్రసిద్ధాన్తమ్ | = శృంగారాద్వైత శాస్త్ర సిద్ధాంతమును; (అమ్మవారిని) |
| ఆశ్రయామి | = ఆశ్రయించెదను. |

**తాత్పర్యము :-**

ఎత్తైన అందమైన స్తనముల బరువుచే సింగారించుకొన్న శివునకు విధేయమై కాంచిలో నున్న శృంగారాద్వైతతంత్ర సిద్ధాంతము నాశ్రయించెదను.

**వివరణము :-**

1) బేధజ్ఞానము దుఃఖహేతువు. అదియే ద్వైతము. ద్వైతము లేకపోవుట అద్వైతము. అది ఆనందరూపము. గడచిన శ్లోకమున ఆనందాద్వైతకందలిగా అమ్మవారు చెప్పబడినది. ద్వైతమనాది. అనగా దాని ఆరంభము ఎప్పుడో తెలియదు. ద్వైతముయొక్క ఆది యేదో తెలియదు. తెలియని ఆదిగల అనాది ద్వైతము నశించును. నశించినప్పుడు అద్వైతము సిద్ధించును. అది ఆనందరూపము. సృష్టికి పూర్వము బ్రహ్మమొకటే యుండెనట. అది యేకాకిగా నుండి ఆడుకొనలేకపోయినది. ఆనందింపలేకపోయినది. తనలో భేదమును కల్పించుకొన్నది. కుడి ఎడమలుగా విభజించుకొన్నది. కుడిభాగము పుం రూపమును, ఎడమభాగము స్త్రీరూపమును పొందినది. అది అర్ధనారి అర్ధపురుషము. ఆ అర్ధనారీశ్వర మొకటి. అది పూర్తిగా విడిపోయి, విడిపోయిన ఎడమభాగము సంపూర్ణ స్త్రీభావమునంది దక్షునకు కూతురుగా నొకపరి, హిమవత్పర్వతరాజునకు ఒకపరి జన్మించి కొంతకాలము వియుక్తమై యుండి పురుషత్వము సంతరించుకొన్న శివునితో నైక్యమును అనగా అద్వైతమును పొందయత్నించి అద్వైత స్థితినందుకొన్నది. ఇదియే శృంగారాద్వైతము. స్త్రీ పురుషు లిరువురొకచోట జేరుట, కౌగలించుకొనుట, మేమిరువురు మొకటే యనుకొనుట, ఒకటే యన్నట్లు ప్రవర్తిల్లుట, ఒకరి సుఖము మరొకరి సుఖముగా ఒకరి దుఃఖము మరొకరి దుఃఖముగా భావించుకొనుట శృంగారాద్వైతహేతువు. ఒకచోట నుండినవారు విడిపోవునప్పుడు దుఃఖించుట, అట్లు విడిపోయినవారు మరల కలిసికొన యత్నించి కలసికొనుట శృంగారాద్వైతమునకు హేతువైన ప్రేమగా పేర్కొనబడును. శరీరము లద్వైతము నొంద జాలవు. మనసులు కూడ పూర్తిగా అద్వైతము నొందజాలవు. అయినను కలసికొనవలెనని, కలసిపోవలెను, కలిసిపోయి తీరవలెను అను తీవ్రేచ్ఛ ప్రేమ యనబడును. విడిగా దూరదేశము లందున్నప్పుడును భావాకాశమున ఒకటై పోయినట్లు, ఒకటై పోవుచున్నట్లు భావించుట, శృంగారాద్వైతహేతువైన **ప్రేమ** యనబడును. కోపించుకొన్నను కొట్లాడుకొన్నను మానసికముగా ఒకటే యనుకొనుట ప్రేమ యనబడును. ప్రేమ ప్రకారములు అనంతములు. అనిర్వాచ్యములు. అయినను ఒక శాస్త్రము దానిని వివరింపబూనినది. నిర్వచింపబూనినది. సిద్ధాన్తీకరించ బూనినది. అదియే శృంగారాద్వైతతంత్ర సిద్ధాంతము. శృంగారాద్వైత తంత్రము అనగా శృంగార శాస్త్రము. దానిలోని కామశాస్త్రమను లౌకిక శృంగార విభాగము తృతీయపురుషార్థ సిద్ధికి కాదివిద్య యను నామాంతరముగల మరొక కామప్రోక్తమైన ఉపాసనా శాస్త్రము. అలౌకికశృంగార శాస్త్ర విభాగము తురీయమై లౌకిక పురుషార్థము యొక్క సిద్ధికి హేతువులై ద్వివిధములుగా నున్న శాస్త్రము. శరీరమనస్సుల భూమికలలో అద్వైతము సాధించుటకు కామశాస్త్రము, ఆత్మీయ భూమికలో ఐక్యమును సాధించుటకు కామప్రోక్తోపాసనాశాస్త్రమును ప్రవర్తిల్లినవి. ఆ శాస్త్రద్వయసిద్ధాంతము శ్రీకామాక్షీదేవియే. విడిపోవుట కలిసిపోవుట అనునవి శరీరమనోభూమికలలోనే జరుగును. వీని వియోగములో ఆత్మ భిన్నమనుభ్రాంతి

యేర్పడును. ఆ భ్రాంతి తొలగుటకు ఆత్మ యొకటే అని సిద్ధాంతీకరింపవలెను. అదియే ముక్తిహేతువు. ఆ సిద్ధాంతమే శ్రీ కామాక్షీదేవి స్వరూపము.

2) ఈ శ్లోకమున నాలుగుపాదములలో ఆద్యనుప్రాసమను శబ్దాలంకార మున్నది.

3) అమ్మవారికి ఎత్తైన అందమైన కుచముల బరువు శృంగారముగా నున్నది. ఆ రెండు స్తనముల మధ్య ఎడమ లేకపోవుటయే ఆ శృంగారము. ఇది యున్నది కావుననే శివుడీ కామాక్షీదేవితో నద్వైతమొందుటకు యత్నించినాడు, యత్నించుచున్నాడు, యత్నించుచున్నట్లు కనబడుచున్నాడు. శివుని శృంగారాద్వైత సిద్ధి వాంఛకమ్మవారి స్తనద్వయ శృంగార దర్శనమే హేతువు ప్రేరకము కావచ్చును. ఆ స్తనముల బరువు క్షీరహేతుకము. శ్రీ కామాక్షీ గంగాధర సంగమమున జనించిన, జనింపబోవు, జనించుచున్న సమస్త జీవశిశువుల కడుపులు నిండవలెనన్న అవి ఎంత పెద్దగా బరువుగా నుండవలెనో అంత పెద్దగా బరువుగా ఉన్నవి. శివుని గాఢాలింగనమున నవి వామనీ భూతములైనను అతనికి పర్వత కఠినస్పర్శననుభూత మొనర్చి ఆనందింపజేయును. జీవుల ముఖములలోనికి క్షీరధారలు కురిపించును. ఆ స్తనముల బరువును పురుషాయిత సమయములలో శివునకు ప్రత్యక్షము. ఇతరులకనుమేయము. ఈ శ్లోకమున నాల్గుపాదములలో నాదిప్రాస మున్నది. అమ్మవారు సిద్ధాంతమని భంగ్యంతరముగా చెప్పబడుటచే పర్యాయోక్త్యలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున శృంగారద్వైత తంత్రము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున తత్ప్రవక్తయగు కాముడు పుట్టిన చోటైన అమ్మవారి **అపాంగము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ కాఞ్చీరత్నవిభూషాం**
**కామపి కన్దర్పసూతికాపాఙ్గీమ్।**
**పరమాం కలాముపాసే**
**పరశివవామాఙ్కపీఠికాసీనామ్॥ 11**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కాంచీరత్నవిభూషామ్ | = కాంచీనగరికి రత్నాలంకారమైన; |
| కందర్పసూతికాపాంగీమ్ | = మన్మథుని ప్రసూతిగృహమైన కటాక్షములు గల; |
| పరశివ వామాంకపీఠికాసీనామ్ | = పరశివునెడమ తొడయను పీఠముపై కూర్చొనియున్న; |
| కామ్ అపి | = ఒకానొక; |
| పరమామ్ | = శ్రేష్ఠమైన |
| కలామ్ | = కలను; |
| ఉపాసే | = ఉపాసించెదను. |

**తాత్పర్యము :-**

కాంచీనగరికి రత్నాలంకారమైన, కాముని జన్మగృహమైన కటాక్షము గల, పరశివునెడమ తొడపై కూర్చొనియున్న ఒకానొక శ్రేష్ఠమైన **కల** నుపాసించెదను.

**వివరణము :-**

1) కాంచీనగరి (దేవత) యొక కాంచిని ధరించినది. ఆ కాంచియందు ఒక అద్భుతమైన రత్నము (కామాక్షీదేవి) పొదగబడినది. ఆ కాంచి సువర్ణ నిర్మితము. ఇట్లా కాంచి రత్నభూషణమైనది. అది కాంచీనగర ప్రాకారము. కాంచీనగర దేవతకు మేఖల దానికి భూమండలమొక మేఖల. దానికి బ్రహ్మాండమొక కాంచి. దానికి మహదాది సప్తకరూపమైన కాంచియున్నది. ఆ కాంచియందు ఒక రత్నభూషణము. అది ఈ లోకమును ప్రకాశింపజేయుచున్నది. కాంచీనగర దేవత తన శిరమున నొక రత్నభూషణము ధరించినది. కాంచీనగరదేవత దాని వెలుగులో ప్రకాశించుచున్నది. ఆ కాంచీ రత్నభూష కామాక్షీదేవి. ఆమె కన్నుల కదలికలో బరిహాసమున్నది. ఆమె కన్నులలో కామమున్నది. అది కూడా చిద్విలాసమే. సృష్ట సంకల్పమున్నది. ఆ సంకల్పముతో నామె స్వాత్మరూపుడైన ముక్కంటియైన శివుని జూచినది. కామాక్షీ భావము నందిన ఆతనికిని సృష్టిసంకల్పము జనించినది. అతడు ఆమెను జూచినాడు. ఆమె కన్నులలోని చిద్విలాసకామమును జూచినాడు. ఆమె శివుని వామాంక మందాసీనయైనది. తదుభయము కూడి మరల కామాక్షియైనది. ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనయైనది. కామున కామె కన్నులు సూతికాగృహము. మన్మథుడందుండి జన్మించినాడు. శివుని కామిని జేయదలచినాడు. శివుడు కాముని దహించినాడు. వాని నమ్మవారు కన్నుల నుండి పుట్టించినది. ఈ కన్నుల కామజనన సంహృతులకు ఉన్మేషనిమిషములకు భువనోత్పత్తి విపత్తులకు అంతము లేదు ఆదిలేదు. అది నిరంతము, కొనసాగు ప్రక్రియా చక్రము. ఈ చక్రము నుండి ఎవడో కామరహితుడై బయటపడును. వాడు నిర్గుణ శివుడగును. సగుణ శివునకాత్మ యగును. కామాక్షికిని ఆత్మ యగును. ఆ ఆత్మ కన్నులు కలిగి కామము కలిగి కామాక్షి యగును. ఆమెయే ముముక్షులోకమనెడి కాంచికి రత్నభూషణము. ఆమెయే ముముక్షులోక శిరోధార్యము. ఆమెకు భిన్నముగా శివుడుగాని బ్రహ్మాండముగాని కాముడుగాని లేరు. అంతయు నామెయే. ఆమెయే సర్వము నగును. ఏమియుకాదు. ఆమె పరశివాభిన్న. పరశివుడు వృత్త స్వరూపుడు. ఆ వృత్తము ద్విధా విభక్తమై వామదక్షిణార్ధరూపమైనది. అందు వామము స్త్రీ యైనది. వామాక్షియైనది. కామాక్షియైనది. వామాంక పీఠికాసీన యైనది. దక్షిణము విరూపాక్షమైనది. త్ర్యక్షమైనది. వృత్తములోని ఏకదేశము కలయనబడును. దాని యాకృతి చంద్రరేఖాకృతి. పూర్ణచంద్రుడు పరశివాభిన్న శివుడు వృత్తాకృతి సహస్రారకృతి. తదేకదేశము కల. అది వృత్తములోని సమస్తైక దేశములలో నున్నది. ఆమె పరమకల. పరశివాభిన్న శివుడు వృత్తము. అది ద్విధమై అర్ధచంద్ర ధరమైనది. షోడశవిధమై షోడశకలా పరిపూర్ణమైనది. ఆ కలకు **షోడశి** యనుపేరు. షోడశకలల

సమాహారమైన పూర్ణచంద్రుడును షోడశియే. ఆ షోడశి పరమకల. అమాకల సాదాఖ్యకల. కొన్ని గ్రంథములలో మహాషోడశియని మహాసప్తదశియని పేర్కొన బడినది. షోడశకలల సమాహారము సప్తదశము కదా! ఆమెకు నమస్కారము. నమస్కారమనగా వంగుట. వంగుట యనగా కలాత్వము నందుట. తన పాదములనే తాను పట్టుకొనుట, శివైక్యము నందుట, పూర్ణత్వమందుట, పూర్ణవృత్తాకృతి భజించుట, దీర్ఘవృత్తాకృతి భజించుట, శివలింగాకృతి నందుట ఇది యంతయు పరమకలా విలాసము. ఆ పరమకలకు నమస్కరించెదనని మూకమహాకవి మోకరిల్లుచున్నాడు. మనమును మోకరిల్లెదము.

2) అమ్మవారు పరమకలగా భంగ్యంతరమున చెప్పబడుటచే పర్యాయోక్త్యలంకార మున్నది. పూర్వార్ధము కాచేత వడి కూర్చబడినది. ఉత్తరార్ధమున ఆది ప్రాసము కూర్చబడినది.



**అవ:–** పూర్వశ్లోకమున అమ్మవారి దృష్టిపాతములలోని కందర్పసూతికాత్వము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ దృష్టిపాతములందలి కరుణాకోరకితత్వము చెప్పబడుచున్నది.

**శ్లో॥ కమ్పాతీరచరాణాం**
**కరుణాకోరకితదృష్టిపాతానామ్।**
**కేలీవనం మనో మే**
**కేషాఞ్చిద్భవతు చిద్విలాసానామ్॥ 12**

**ప్రతిపదార్థము :–**

| | |
|---|---|
| కమ్పాతీరచరాణామ్ | = కమ్పానదీతీరమున చరించు; |
| కరుణా కోరకిత దృష్టిపాతానామ్ | = కరుణ మొగ్గతొడిగిన కటాక్షములు కల; |
| కేషాంచిత్ | = అనిర్వచనీయములైన; |
| చిద్విలాసానామ్ | = చిద్విలాసములకు; |
| మే | = నాయొక్క; |
| మనః | = మనస్సు; |
| కేలీవనమ్ | = విహారోద్యానము; |
| భవతు | = అగుగాక! |

**తాత్పర్యము :–**

కమ్పానదీతీరమున చరించు కరుణ మొగ్గతొడిగిన చూపుగల అనిర్వచనీయములైన చిద్విలాసములకు నామనస్సు కేలీవన మగుగాక!

**వివరణము :–**

1) కమ్పానదీతీరమున విహరించు శ్రీకామాక్షీదేవి చూపులు కరుణ మొగ్గ

తొడిగియున్నట్టివి. ఆమె కన్నులలో కరుణ మొగ్గతొడుగుట చిద్విలాసము కావున ఆ చూపులును చిద్విలాసములే. చిద్విలాసముగానే కమ్పానదీతీర విహారమున్నది. సర్వబ్రహ్మాండముల కావల శ్రీమన్నగరమున నివసించు దేవి బ్రహ్మాండములోని ఏకదేశమగు కమ్పానదీతీరమున చరించుటకు కరుణయే కారణము. ఇక్కడి జీవులకు దర్శనమిచ్చుటకై యామె విగ్రహము ధరించినది. అనుగ్రహము చూపినది. వీరికి తరించు సౌభాగ్యము ప్రసాదించినది. ఆ దేవి కమ్పాతీరమున నివసించుటకు కమ్పానదీతీర కాంచీపురజనుల పుణ్యము చేసినారు. కమ్పానది పూర్వజన్మమున నేదేని పుణ్యమొనరించినదా? ఆచరించినను అమ్మవారిని మృత్యులోకములోని యొక ప్రదేశమున కట్టివేయ గలిగినదా పుణ్యము? అమ్మవారి నిక్కడకు ఈ పుణ్యము రప్పించగలదను నియమమేదైన ఉన్నదా? ఉన్నను దానికామె సర్వస్వతంత్ర నిరంకుశ కట్టుబడవలెనా! ఆమె యక్కడకు వచ్చుట జీవులొనర్చిన పుణ్యముల ఫలము కాదు. తమ పుణ్యముల ఫలముగా ఆమె నిక్కడకు రప్పించుకొన్నామని గర్వించుట వారి కుచితము కాదు. అది సత్యము కూడ కాదు. ఈ పుణ్యమునకే ఫలమీయవలె నని ఆమె తలచుకొనియే గదా ఆ ఫలమిచ్చును. అట్లు తలచుకొన్న దేవి అల్పపుణ్యమునకును ఆ ఫలము నీయవలెనని తలచుకొనలేదా! మహా పుణ్యమునకు ఈ ఫలమీయగూడదని తలచుకొనలేదా! ఏ తలపైనను ఆమె తలచినదే గదా! మనుష్యులకీ తలంపు కావలె. ఈ విధమైన శరణాగతి కావలె. తమ పుణ్యముల కా శక్తిలేదను నిరహంకారము కావలె. కర్మసిద్ధాంతమున ఈశ్వరికి ఫలప్రదాతృత్వ మంగీకరించిన నాడే నిరహంకార పూర్వక శరణాగతి సిద్ధాంతమునకు పునాదిపడినది. ఈ కర్మలకీఫలమని వేదస్మృతి పురాణాదులలో కొన్ని కర్మలకు ఫలములుగా కొన్ని విధములైన సుఖభోగములు చెప్పబడిన మాట వాస్తవమే యైనను ఆ గ్రంథములలో అన్ని కర్మలు వానికి అన్ని ఫలముల చెప్పుట సాధ్యమగునా! స్థాలీపులాకన్యాయముగా చెప్పిన కొన్ని కర్మల కున్న ఫలములీయవలెనని అమ్మవారు నియమము పెట్టుకొనవలె. పెట్టుకొన్న నియమమును పాటింపవలె. పాటించినదో లేదో చూచువారెవరు? పాటించ కున్నచో ఆమె నెవరేమి చేయగలరు. శ్రుతిస్మృత్యాదులు కూడ ఆమె యాజ్ఞలే కదా! అవి యెన్నో తెలియదు. వానిలో నెన్ని ఫలములై పోయినవో తెలియదు. ఆనాడు సృష్ట్యారంభమున కొన్ని శ్రుతి స్మృత్యాది రూపాజ్ఞల నిచ్చి యున్నను అవి యన్నియు మనమెఱుగుదుమా? ఎంతటి మహావిద్వాంసులైన ఎఱుగుదురా? వారు సర్వజ్ఞులా? సర్వజ్ఞత్వము నామెయే దాచి పెట్టుకున్నది. మనమెఱిగి ఈ కర్మ చేసితిమి. దీనికి ఫలమీశాస్త్రమున ఇట్లున్నది. నీ వీయవైతివని ఎవరేని అమ్మవారిని నిలదీసి నారనుకొందము. నీవు చేసిన ఆ కర్మలలో నీయాలోపములున్నవి కావున నీయలేదు అని చెప్పిన మీరేమి చేయుదురు? ఇది యంతయు గందరగోళముగ నున్నది. ఆమె కరుణతోడనే జీవుల కర్మలు, బలాత్కారము చేతకాదు. కమ్పాతీరమున చేరింది కరుణ మొగ్గదొడిగిన చూపుల బఱపుచున్నది. ఎక్కడ వారైనను అక్కడ కేగి ఆ కరుణా

కోరకములను కోసికొనవచ్చును. మీరున్నచోటనే యుండియు వానిని కోసికొనవచ్చును. ఆ చూపులు ఏ గోడకు కొట్టుకొని యాగిపోవునట్టి సూర్యకిరణాదుల వంటి అల్పములు కావు. మనోగుహలో ప్రవేశించుట కసమర్థములు కావు. ఆమె కరుణాకోరకితదృష్టిపాతము లున్నవి. మీరున్నారు. మధ్య నేనెవరను. నేను చిద్రూపుడను. అమ్మవారి ఆత్మగా సైతము నేనే యున్నాను. ఆ చూపులన్నియు చిద్రూపుడనైన నాయొక్క విలాసములే, చిద్విలాసములే. ఆ చిద్విలాసములు విహరించుటకు నామనస్సే ఉద్యానమగుగాక! మీరందఱు చిద్రూపిణినైన నాయొక్క విలాసములే-అని అమ్మవారు మూకమహాకవి ద్వారా చెప్పుచున్నది. మూకమహాకవి తన మనస్సాచిద్విలాసములు విహరించుట కుద్యానమగు గాక యని యున్నాడు.

ఇది చదివిన ప్రతివాడును అట్లు కోరుకొనుచున్నట్లే యగును. ఇదే స్తుతికావ్యపు అనన్యవైభవము. భగవదనన్యత్వ సిద్ధి తత్ప్రయోజనము.



**అవ॥:-** పై శ్లోకమున ఉద్యానప్రసక్తి వచ్చినది. వృక్షము ప్రసక్తానుప్రసక్తము. ఈ శ్లోకమున ఆమ్రవృక్షము ప్రసక్తమై తన్మూలవాసియగు శివునికి నయన పీయూషముగా అమ్మవారు వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ ఆమ్రతరుమూలవసతే-**
**రాదిమపురుషస్య నయనపీయూషమ్।**
**ఆరబ్ధయౌవనోత్సవ-**
**మామ్నాయరహస్యమన్తరవలమ్బే॥ 13**

**ప్రతిపదార్థము :-**

ఆమ్రతరుమూలవసతేః = ఆమ్రవృక్షముయొక్క మూలము నివాసముగాగల;
ఆదిమపురుషస్య = మొదటిపురుషుడైన శివునియొక్క;
నయన పీయూషమ్ = నేత్రామృతమైన;
ఆరమ్భయౌవనోత్సవమ్ = యౌవనోత్సవము నారంభించిన;
ఆమ్నాయరహస్యమ్ = వేదగుహ్యమును;
అంతః = లోపల;
అవలంబే = పట్టుకొనియుందును.

**తాత్పర్యము :-**

మామిడిచెట్టుయొక్క మూలమును నివాసముగా చేసుకొన్న ఆదిమ పురుషుని నేత్రామృతమైన యౌవనోత్సవము నారంభించిన వేదగుహ్యమును హృదయము లోపల విడువక పట్టుకొందును.

**వివరణము :-**

1) ఆమ్రవృక్షమునకు **రసాలము** అనునది సంస్కృత పర్యాయము. ఆ వృక్ష ఫలము రసభరితమగుటయే ఆ పర్యాయ మేర్పడుటకు కారణము. అందుచేత ఆమ్రఫలము **ఫలరాజము.** ఆమ్రవృక్షము **వృక్షరాజము.** శివుడామ్ర వృక్షమూలమునే ఏల యాశ్రయించెను. రామానుసంధానము కొఱకు ద్వితీయాక్షరములోని ఆకారమును ప్రథమాక్షరాకారములో సావర్ణ్యము కారణముగా లీనమొనరించిన రామాశబ్దము రామ్ అగును. దాని నావృత్త మొనర్చిన (ఆ) మ్రామ్రామ్రామ్రామ్రా యని అగుననుటలో ఆమ్రశబ్దముయొక్క రామశబ్దముయొక్కయు ఆవృత్తి యేర్పడును. రామశబ్దమున కాత్మ యర్థము. శివుడు స్వాత్మానుసంధానమొనర్చుకొనుటకు విస్మృతి బడనీయక ఆమ్రశబ్దము స్మరింపజేయును. తదర్థమైన ఆమ్రవృక్షముయొక్క మూలమున వసతి యేర్పాటు చేసికొనుట కిది కారణము కావచ్చును. ఆ ఆమ్ర మేకామ్రనాథ నామము కలది. తన్మూలవసతియగు శివున కేకామ్రేశ్వరుడని పేరు కలిగినది. ఆ శివుడు రామానుసంధాన మొనర్చునంటిమి కదా. అనుసంధానము భావనామయ రూపమును భావనానేత్రముల ముందుంచును. శివుడాయనుసంధానముచే తన రామను స్వాత్మరూపిణిని దర్శించినాడు. ఆమె యాతని నేత్రముల నమృతము గురిపించినది. ఈ ప్రపంచమంతయు పోయినను ఆతనికి చింతలేదు. లోకమున పీయూషము లభింపదు. లభించిన దానితోడనే మనుష్యులు తృప్తిపడవలె. శివునకు స్వాత్మారామారసమే లభించినది. దానిముందు పీయూషము గంజి వంటిది మాత్రమే. ఆ రామ కామాక్షీదేవియే. ఆరబ్ధయౌవనోత్సవ ఆమె. యౌవనమున అడుగిడు సమయమున లోకమునందలి రామయే మనోరాజ్య మేలునది యగును. ఇక స్వాత్మారామ రామా రూపము ధరించిన శివుని కన్నులలో నమృతము బోయుచుండుటకయి యౌవనారంభోత్సవ మొనర్చు కొనుచున్న రామగా స్వాత్మారామమే యవతరింప నన్యస్మృతి యెట్లుండును. అన్యస్మృతి లేని అట్టి సమాధిలోనే శివుడెప్పటినుండియో ఉన్నాడు. ఎప్పటికిని ఉండును.

2) వేదముల ఆవృత్తి ఆమ్నాయ మనబడుట ఆవృత్తియే పరమావధిగల వేదమునకును ఆమ్నాయమని పేరు కలిగినది. ఆమ్నాయముల అర్థమెఱుగుటయే కష్టము. ఇక వాని రహస్యమెఱుగుట కష్టమని చెప్పనక్కఱలేదు. అమ్మవారి ఆ ఆమ్నాయరహస్యమును ఆమ్నాయముల గుట్టును మూకకవి విప్పినాడు. దానిని తనలోనే దాచుకొన్నాడు. దాచుకొని పట్టుకొని యున్నానని చెప్పుచున్నాడు. ఆయన పంచశతి చదువుడు. ఆ పట్టు వదిలించుకొని ఆ రహస్యము గోచరమగునేమో చూడుడు. నాలుగు ఆకారములతో ఆరంభింపబడి పద్యమును శోభింపజేయుచున్నది.

3) అమ్మ **ఆగమరహస్యమని** భంగ్యంతరముగా చెప్పబడుటచే పర్యాయోక్త్యలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున నేకామ్రేశ్వరు **దాదిమపురుషుదు**గా పేర్కొనబడినాడు. ఈ శ్లోకమున నాతడు **ఆదిమపరపీఠరూపుడు**గా పేర్కొనబడుచున్నాడు

**శ్లో॥ అధికాఞ్చి పరమయోగిభి-**
**రాదిమపరపీఠసీమ్ని దృశ్యేన।**
**అనుబద్ధం మమ మానస**
**మరుణిమసర్వస్వసమ్ప్రదాయేన॥ 14**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| అధికాంచి | = కాంచీనగరియందు; |
| ఆదిమపరపీఠసీమ్ని | = మొదటి శ్రేష్ఠమైన పరమశివుడను పీఠప్రదేశమున; |
| పరమయోగిభిః | = శ్రేష్ఠయోగులచేత; |
| దృశ్యేన | = చూడదగిన; |
| అరుణిమసర్వస్వసంప్రదాయేన | = పూర్ణారుణిమ సమ్ప్రదాయముచేత; |
| మమ | = నాయొక్క; |
| మానసమ్ | = మనస్సు; |
| అనుబద్ధమ్ | = అనుబంధింపబడినది. |

**తాత్పర్యము :-**

కాంచీనగరియందు ఆదిమపరశివుడను పీఠమున పరమయోగులచే చూడదగిన అరుణిమ సర్వస్వసమ్ప్రదాయముతో నా మనమునకు అనుబంధ మేర్పడియున్నది.

**వివరణము :-**

1) క అనగా **బ్రహ్మ. అ** అనగా **విష్ణువు. మ** అనగా **రుద్రుడు.** ప్రకృతిలోని రజస్సుయొక్క సత్త్వముయొక్క తమస్సుయొక్క శక్తులచేత సృష్టి పాలన సంహార రూపకృత్యముల నిర్వహించుచున్నారు. రజస్సు ఎఱుపుచేత, సత్త్వము తెలుపుచేత, తమస్సు నలుపుచేత సూచింపబడుచుండును. ఈ మూడు గుణములు త్రిమూర్తులకున్నట్లే మూడు రంగులు అమ్మవారి కన్నులలో నున్నవి. అమ్మవారి కన్నులలోని ఆ మూడు రంగులు సత్త్వరజస్తమోగుణములు. గుణములు గుణులను విడచి యుండవు. అనగా త్రిమూర్తులను విడచి యుండవు. త్రిమూర్తులామె కన్నులలో నున్నందుననే అమ్మవారికి కామాక్షియను పేరు కలిగినది. ఈ త్రిమూర్తులు శుద్ధసత్త్వ ప్రధానములైన ఆ త్రిగుణముల నాశ్రయించి యీశ్వరత్వమునంది సృష్టిస్థితిసంహారముల జేయుచున్నను, వారమ్మవారి కనుసైగలను బట్టియే ఆ పనుల జేయుచున్నందున వారు ముప్పురు ఆమె కన్నులలోనే ఉన్నారు అని చెప్పవలెను. అదిగాక శ్రుతి ఒక్క దేవతయే సృష్టిస్థితి సంహారము లొనర్చునని చెప్పినది.

ఆ దేవతకే సృష్టికాలమున బ్రహ్మయని, స్థితికాలమున విష్ణువని, సంహారకాలమున రుద్రుడని పేర్లు కలిగినందున ఆ మువ్వురు ఆ దేవతకన్న భిన్నులు కారు. శక్తులలో వారు మువ్వురా పనులు జేయుదురని చెప్పియున్నాము కదా. అప్పుడామువ్వురు ఆ శక్తుల విడచిరేని ప్రేతకల్పులగుదురు. వారాశక్తులతో సృష్టిస్థితిసంహారము లొనర్చునప్పుడు అమ్మవారు సాక్షిగా నుండును. చూచువాడు సాక్షి. చూచుట కన్నుల పని. కావున ఆ మువ్వురు ఆమె కన్నులలో నున్నారని చెప్పబడినది. ఇంతేగాక ఆ మువ్వురికే మూడు శక్తుల నొసగిన ఏకైక శక్తి యామె. ఆ మూడు శక్తులును ఆ యేకశక్తికి చెందినవే. త్రిమూర్తులా ఏకశక్తికి భిన్నులు కారని ఈ వఱకే చెప్పబడినది. అందుచే కామాక్షియే త్రివిధములైన సృష్టిస్థితిసంహారకృత్యము లొనర్చుననుట సిద్ధమైనది. ఇది పురాణసమ్మతమతము. ఆగమములందు ఈశ్వర కృత్యము లైదు అని చెప్పబడినవి. పై మూడు కృత్యములకు తిరోధానము అనుగ్రహము అను రెండు కృత్యములను కలిపినచో పంచకృత్యములగును. అప్పుడు ఆ కృత్యము లొనర్చు వారైదుగురగుదురు. బ్రహ్మవిష్ణురుద్రులు ముగ్గురు ఈశ్వరుడొకడు, సదాశివుడు మరొకడు, కలిసి పంచేశ్వరులేర్పడుదురు. ఈ ఐదుగురిలోను ఏకైక శక్తియే భిన్న విధములుగా పనిచేయుట చేత పంచకృత్యములు సాగిపోవుచుండ ఆ యైదుగురేమి చేయుచున్నట్లు? ఆ ఏకైక శక్తిని మోయుచున్నారు అని మాత్రమే చెప్పనగును. వారేమి చేయుటలేదు గనుక ప్రేతప్రాయులు శవప్రాయులు అని చెప్పబడినారు. వారిలో పీఠమునకుండు నాలుగు కాళ్ళుగా మొదటి నల్వురున్నారు. పరశివుడు ఆ పీఠఫలకముగా నున్నాడు. ఫలకము మీద అమ్మవారు కూర్చొనియున్నది అనగా ఆమెకు పరశివుడు పీఠమైయున్నాడు. ఆ పరశివుడు త్రిమూర్తులకు పంచమూర్తులకు మొదటివాడు కావున ఆ ఆదిమ పరశివుడు త్రిమూర్తులకు పంచమూర్తులకు మొదటివాడు కావున ఆ ఆదిమ పరశివుడు అమ్మవారికి పీఠఫలకమై యుండ మిగిలిన నలుగురు ఆ పీఠపాదములై యున్నారు. ఫలక ప్రాధాన్యమును బట్టి ఆ పీఠము పర (శివ) పీఠముగా పేర్కొనబడినది. తత్ప్రదేశము నందున్నట్లు పరమయోగులకు మాత్రమే దృశ్యమగును. **పరశివుడు శుద్ధస్ఫటిక మూర్తి.** ఆ మూర్తిపై ఎఱ్ఱగా అమ్మవారున్నది. ఆ అమ్మవారు అరుణిమ సర్వస్వము. ఇట్టిదీ సంప్రదాయము కావున అమ్మవారు అరుణిమ సర్వస్వసంప్రదాయముగా పేర్కొనబడినారు. మరొకరు ధవళిమ సంప్రదాయమన్నను అనవచ్చును. ఇంతకు ఈ రంగులు సరూపకే, నిరూపకే రంగులు నుండవు. నిర్గుణ కేగుణములును లేవు. ఆ నిరూపనిర్గుణయే వివిధ వర్ణములలో వివిధ సంప్రదాయజ్ఞుల రుచి భేదములతో భాసిల్లునట్లు పేర్కొనబడును. వానిలో నరుణిమ సంప్రదాయము లలితా కామేశ్వరీ రాజరాజేశ్వరి దేవతా భేదములచే భిన్నభిన్నముగా నున్నది. అట్లే కాలిమ సంప్రదాయము కాళీ భేదములతో, ధవలిమసంప్రదాయము సరస్వతీ శివాది భేదములతో భిన్న భిన్నములుగా నున్నవి. మూకకవి యిప్పుడీ యరుణిమ సంప్రదాయము నాశ్రయించి నా మనము అరుణిమ సర్వస్వసంప్రదాయ రూపిణియగు అమ్మవారితో అనుబంధము

కలిగియున్నదని చెప్పుచున్నాడు.

2) లత్తుక, పారాణి పూయకయే అమ్మవారి పాదములెఱ్ఱనివి. ఆ యెఱ్ఱని పాదముల పై భాగములైన ప్రపదములను దాకుచు నెఱ్ఱని చీరయున్నది. అది బిగించిన నడుమెఱ్ఱనిది. దాని పైనున్న స్తనములు కుంకుమపూలరక్తము పూయకయే యెఱ్ఱనివి. ఆ రసము పూయబడి మఱింత యెఱ్ఱనైనవి. వానిపైని గళమెఱ్ఱనిది. చిబుకమెఱ్ఱనిది. దానిపైని అధరము తాంబూలరసమంటక మునుపే యెఱ్ఱనిది. ఆ రసముచే నది మరింత యెఱ్ఱనైనది. దంతములు తెల్లముత్తెముల వలె నున్నను తాంబూలరసమంటి దానిమ్మ గింజలవలె యెఱ్ఱబారినవి. నాసిక, ఫాలమును ఎఱ్ఱనివే. పైగా ఫాలమున సిందూర తిలకమున్నది. ధరించిన సొమ్ములన్ని తప్తకాంచనమయములు, పద్మరాగమణిమయములు కావున నవియు నెఱ్ఱనివే. ఇదంతయు కలిసి అరుణిమ సర్వస్వసంప్రదాయము అనగా అమ్మవారు. **ధవలిమకాలిమారుణిమ** సంప్రదాయములలో లౌహిత్యం విమర్శః అను తాంత్రిక సూక్తి ననుసరించి అరుణిమ సంప్రదాయమునకు ప్రాచుర్యము కలదు. అందును దక్షిణదేశమున దానికి మరింత ప్రాచుర్యము.

3) సరిపాదములలో అంత్యానుప్రాసమను శబ్దాలంకారమున్నది. అరుణిమ సర్వస్వ సంప్రదాయమున అమ్మభంగ్యంతరమున చెప్పబడుటచే పర్యాయోక్త్యలంకార మున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి అరుణిమ చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి **తరుణిమ** చెప్పబడుచున్నది.

**శ్లో॥ అఙ్కితశఙ్కరదేహా-**
**మఙ్కురితోరోజకఙ్కణాశ్లేషైః।**
**అధికాఞ్చి నిత్యతరుణీ-**
**మద్రాక్షం కాఞ్చిదద్భుతాం బాలామ్॥ 15**

**ప్రతిపదార్థము :-**

అధికాంచి = కాంచీనగరియందు;
అంకురితోరోజకంకణాశ్లేషైః = అంకురించిన స్తనకంకణాలింగనముల చేత;
అంకిత శంకరదేహామ్ = చిహ్నితమైన శంకర దేహముకల;
నిత్యతరుణీమ్ = నిత్యయౌవనయగు;
కాంచిత్ = ఒకానొక;
బాలామ్ = బాలను;
అద్రాక్షమ్ = చూచితిని.

**తాత్పర్యము :-**

కాంచీ నగరియందు అంకురించిన స్తనకంకణాశ్లేష చిహ్నిత శంకరదేహము కల యొకానొక నిత్యతరుణియైన బాలను చూచితిని.

**వివరణము :-**

1) శ్రీ కామాక్షీదేవి శంకరునాలింగనము చేసికొన్నది. ఆమె స్తనము లందలి కుంకుమ పూరసమంటుకొని శివుని యురము అంకితమైనది. ఆతని కంఠము నందమ్మవారి కంకణముల యొత్తిడిచే గుర్తు లేర్పడినవి. ఆమె నిత్యతరుణి కావున ఆమె ఉరోజములయొక్క చిహ్నములు శంకరు నురము నంటుకొన్నవి. ఎత్తైన శంకరునాలింగనము చేసికొనుటకు బాహువులెత్తబడుటచే నామె కంకణము లాతని కంఠమున గుచ్చుకొని గుర్తులు మొలపించినవి. నిత్య తరుణీమ్ అనియే చెప్పినాడు. కాని నిత్యబాలామ్ అని అనక పోవుటచే నిరంతరము శంకరునల్లుకొని పోవుట సూచింపబడుచున్నది. ఆ తరుణి అద్భుతబాల యని పేర్కొనుటచే శంకరునాట పట్టించుట వ్యంగ్యమగుచున్నది. పెద్దలు పిల్లల నాడింపవలె కాని చిన్నదియైన అమ్మవారు పెద్దయైన శివునాడించుట అద్భుతమని అద్భుతయను విశేషణము వ్యంజింపజేయును. అద్భుత బాలగా భంగ్యంతరమున చెప్పుటచే పర్యాయోక్త్యలంకార మున్నది.



**అవ:-** పై శ్లోకమున వాచ్యమైన ఆలింగనము చేత అమ్మవారిలోని కామ (స్వరూప)ము వ్యంగ్యమైనది ఈ శ్లోకమున అమ్మవారి బాహ్యశరీరమందలి కామరూపము వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ మధురధనుషా మహీధర-**
**జనుషా నన్దామి సురభిబాణజుషా।**
**చిద్వపుషా కాఞ్చిపురే**
**కేలిజుషా బన్ధుజీవకాన్తిముషా॥ 16**

**ప్రతిపదార్థము :-**

మధురధనుషా = తీయని విల్లుకల;
సురభి బాణజుషా = సుగంధిలమైన అమ్ముగల;
బంధుజీవకాంతిముషా = బంధుజీవపుష్పముయొక్క కాంతిని దొంగిలించు;
కాంచిపురే = కాంచీనగరియందు;
కేలిజుషా = ఆటకలిసిన;
చిద్వపుషా = చైతన్యమే శరీరముగాగల;
మహీధరజనుషా = కొండయందు జన్మగలదానిచేత;
నందామి = ఆనందించుచున్నాను.

**తాత్పర్యము :-**

చెఱుకు విల్లు, పూవులు బాణములుగాగల బంధుజీవపుష్పముయొక్క కాంతి నపహరించు చైతన్య శరీరము గలిగి, కాంచిపుర మందాదుకొను, పర్వతము నందు పుట్టిన శ్రీ కామాక్షీదేవి చేత ఆనందించుచున్నాను.

**వివరణము :-**

1) తీయని విల్లనగా చెఱుకు విల్లు. సురభిబాణమనగా పూబాణము. ఇవి రెండు ఇక్షుకోదండ పుష్పబాణములు అమ్మవారి కున్నట్లే మన్మథునకున్నవి. ఇరువురి శరీరములు బంధుజీవకాంతి నపహరించునట్లెట్లగానే యున్నవి. కాని మన్మథుడు చిత్తజనితమైన వపువుగలవాడు. కాని చిద్వపువు కాజాలదు. అమ్మవారి వపువు చిద్రూపము కావున ఆమె చిద్వపువు. మన్మథుడు చిత్తములలోనే నాడు కొనును. అమ్మవారు స్థూల సూక్ష్మ కారణ శరీరములందంతటను ఆడుకొన్నట్లు కాంచీనగర మందును ఆడుకొనును. ఈ సామ్యవైషమ్యములు స్ఫురించుటచే నీ శ్లోకమున వ్యతిరేకాలంకార స్ఫూర్తియున్నది. ఈ శ్లోకములందలి పెక్కు పదములలో అంత్యానుప్రాసమున్నది. బంధుజీవకాంతిముషా అను సమాసమున ఉపమాలంకార స్ఫూర్తి ఉన్నది. అమ్మవారు మహీధర జనువుగా భంగ్యంతరమున చెప్పబడుటచే పర్యాయోక్త్యలంకారమున్నది.

2) మూకకవి ఆనందించుటకు హేతువు అమ్మవారని ఫలితార్థము. ఇచటి తృతీయ హేతుబోధకము.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి రూపము కామునకున్నదని వ్యంజింప జేయబడినది. ఈ శ్లోకమున మనసిజ (**కామ**) సామ్రాజ్య గర్వబీజముగా అమ్మవారు చెప్పబడుచున్నది.

**శ్లో॥ మధురస్మితేన రమతే**
**మాంసలకుచభారమన్దగమనేన।**
**మధ్యేకాఞ్చి మనో మే**
**మనసిజసామ్రాజ్యగర్వబీజేన॥ 17**

**ప్రతిపదార్థము :-**

మధురస్మితేన = మధురమైన చిఱునవ్వుగల;
మాంసలకుచభారమందగమనేన = బలిసిన కుచముల బరువుతో నేర్పడిన మందగమనముగల;
మనసిజ సామ్రాజ్య గర్వబీజేన = మన్మథుని సామ్రాజ్యగర్వమునకు కారణమైన ఒక విత్తనము చేత;
మధ్యేకాంచి = కాంచీనగర మధ్యమున;
మే = నాయొక్క

మనః = మనము;
రమతే = ఆడుకొనుచున్నది.

**తాత్పర్యము :-**

తియ్యని నవ్వు, బలిసిన కుచముల బరువు, మందగమనముగల మన్మథుని సామ్రాజ్యగర్వమునకు హేతువు (శ్రీకామాక్షీదేవి)తో ఆడుకొనుచున్నాను, ఆనందించు చున్నాను.

**వివరణము :-**

1) ముక్కంటి కంటిమంట గాలిన మన్మథుడు అమ్మవారి కన్నులలో పునర్జన్మము నందినాడు. పెరిగినాడు, రాజైనాడు, సామ్రాట్టైనాడు. ఆతనికి సామ్రాట్టు నైతినను గర్వము కలిగినది. ఆ గర్వమునకు బీజము అమ్మవారు. ఆమె సాయము చేతనే తనను గాల్చి తన సామ్రాజ్యమును బూడిదపాలు చేసిన శివుని దేహమున బూడిదపూసిన ఆతని ఉరమున అమ్మవారి కుచముల కుంకుమ పూసి శివునెగతాళి చేసి తన సామ్రాజ్యమును తిరిగి సాధించితినను గర్వమునకు హేతువు అమ్మవారు. ఆమె లేకున్న మన్మథునకు సామ్రాజ్యప్రాప్తిగాని తజ్జనిత గర్వముగాని కలుగుట కవకాశమే లేదు. అమ్మవారు **మన్మథసామ్రాజ్య గర్వబీజముగా** భంగ్యంతరమున చెప్పబడుటచే పర్యాయోక్త్యలంకారమున్నది. ద్వితీయ, చతుర్థపాదములం దంత్యప్రాసమున్నది. ద్వితీయపాదమధ్యమున దాక్షిణాత్యమైన యతి అనగా వడియున్నది.



**అవ:-** పై శ్లోకమున పురుషపారార్థ్యముగల ప్రకృతియొక్క స్త్రీమయమూర్తి వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఆ ప్రకృతియొక్క అష్టమూర్తిమయత్వము వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ ధరణిమయీం తరణిమయీం**
**పవనమయీం గగనదహనహోతృమయీమ్।**
**అమ్బుమయీమిన్దుమయీ-**
**మమ్బామనుకమ్పమాదిమామీక్షే॥ 18**

**ప్రతిపదార్థము :-**

ధరణిమయీమ్ = భూమూర్తి;
తరణిమయీమ్ = సూర్యమూర్తి;
పవనమయీమ్ = వాయుమూర్తి;
గగనదహనహోతృమయీమ్ = ఆకాశమూర్తి అగ్నిమూర్తి యజమానమూర్తి;
అంబుమయీమ్ = జలమూర్తి;
ఇందుమయీమ్ = చంద్రమూర్తియునైన;

ఆదిమామ్ = మొదటి;
అంబామ్ = తల్లిని;
అనుకంపమ్ = కంపానదీతీరమున;
ఈక్షే = చూచుచున్నాను.

**తాత్పర్యము :-**

భూమి, సూర్య, వాయు, ఆకాశ, అగ్నిమూర్తి, యజమాన, జల, చంద్ర రూపాష్టమూర్తిమయమగు మొదటి తల్లిని కంపానదీతీరమున చూచుచున్నాను.

**వివరణము :-**

1) పంచభూతములు సూర్యచంద్రులు (బుద్ధిమనస్సులు) యజమానుడు (అహంకారము) అను ఎనిమిది ప్రకృతియొక్క మూర్తులు. శివుడందు బ్రతిబింబించి యుండుటచే అష్టమూర్తియను బిరుదమును శివుడు కొట్టివేసినాడు కాని నీరూపుడు నిర్గుణుడునైన శివున కష్టమూర్తులు కాదు గదా ఏయొక్క మూర్తియు లేదు. **చంద్రమా మనసో జాతః** అను శ్రుతి ననుసరించి చంద్రమనస్సులకు వ్యష్టి సమష్టి భారము జన్యజనక భావమును ప్రసిద్ధములు. సూర్యునియొక్క ప్రకాశము చంద్రునియందు ఫలించి చంద్రత్వమాతనికి కలిగించును. ఆ ప్రకాశమే ప్రతిఫలింపక పోయిన చంద్రుడను వ్యవహారమే యుండకపోవును. అట్లే చంద్రుడు కనిపించుట కనిపించకపోవుట చేత ఆతని సత్త సందేహాస్పద మగుట ప్రసిద్ధము. అందుచే సందేహవృత్తి మనస్సు అని చెప్పబడినది. సూర్యుని ప్రకాశము నందట్టి సందేహము లేదు. ఆతడు నిత్యము ప్రకాశించును. రాత్రియందు సైతము దేశాంతరము ప్రకాశించుననుట శాస్త్రసిద్ధమైన సత్యము. ఆతడు నిరంతరము ప్రకాశించుట నిశ్చితము కావున నిర్ణయాత్మక బుద్ధి సూర్యసంకేతమైనది. భగవద్గీతలో(7.4) **భూమిరాపోऽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ। అహంకార ఇతీయమ్మే భిన్నా ప్రకృతిరష్టధా॥** అను శ్లోకమున చంద్రసూర్య యజమానులకు బదులు మనోబుద్ధ్యహంకారములే పేర్కొనబడినవి. ఇట్లు అష్టమూర్తుల భిన్నప్రకారోక్తుల కేకవాక్యత కల్పించుకొని తీరవలెను. ఈ ప్రకృతి స్త్రీరూపమును ధరించి సర్వసృష్టిహేతువగుటచే ఆదిమాంబగా ఇచట చెప్పబడినది. కామాక్షి ఇట ఆదిమాంబగా భంగ్యంతరమున పేర్కొనబడుటచే పర్యాయోక్త్యలంకారమిందున్నది.

2) స్త్రీరూపము పంచభూతముల మనోబుద్ధ్యహంకారముల పరిణామమై నందున ఇచట మయట్ప్రత్యయము వికారార్థకము. ప్రకృతి యిట్లు పరిణమించుట పురుషుని భోగార్థమేకాని ప్రకృతికిట్లు పరిణమించుటలో స్వార్థమేమియు లేదు. అందుచేత ప్రకృతి పరార్థయనబడును. పర(పురుషుని) అర్థ కొఱకైనది. ప్రకృతి కావున దానికి పారార్థ్యము స్వాభావికము. ఈ పురుష సంయోగము లేక ప్రతిబింబము చేతనే ప్రకృతిలో పరిణామము కలుగును. స్త్రీ పురుష దేహములు రెండును ప్రకృతి పరిణామములే కాని స్త్రీశరీరమున ప్రకృతికి కించిదధిక ప్రాధాన్యము, పురుషశరీరమున పురుషునికి కించిదధిక

ప్రాధాన్యముండుటచే పురుషుల కన్న అధికముగా స్త్రీలు పారార్థ్యము కలిగియుందురు. ఈ అంశము వ్యవహారానురోధముతో చెప్పబడినది. వాస్తవమున స్త్రీ పురుష శరీరములు ప్రకృతియే. వానిలో పురుషుడే ఆత్మగా నుండును. ఆదిమాంబ అష్టమూర్తిమయి ప్రకృతిరూపిణి. ఆమెను చూచుట (బ్రహ్మము) ఆత్మయైన శివుని పని ఇట. (బ్రహ్మ) శివతాదాత్మ్యముతో (జీవుడైన) మూకకవి ప్రకృతిని చూచుచున్నాడని అర్థము వ్యంగ్యమగుచున్నది. **ధరణి తరణి; పవన గగన దహన,** అను పదద్వయ పదత్రయములలో వృత్త్యనుప్రాస మున్నది. **అంబామనుకంపమాదిమాం** అను పదములకారదులై దాక్షిణాత్యమైన వడి యను అలంకారమును ఆకార బహులములై శయ్యా సౌభాగ్యమును కలిగియున్నవి. తృతీయ చతుర్థపాదములందాదిప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున ప్రకృతియొక్క అష్టమూర్తి పరిణామము చెప్పబడినది. ఈ శ్లోకమున ప్రకృతియైన కామాక్షి రూపము ముని హృదయమున లయించుట ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ లీనస్థితి మునిహృదయే**
**ధ్యానస్తిమితం తపస్యదుపకమ్పమ్।**
**పీనస్తనభరమీడే**
**మీనధ్వజతన్త్రపరమతాత్పర్యమ్॥ 19**

**ప్రతిపదార్థము :-**

మునిహృదయే = మునుల హృదయమున;
లీనస్థితి = లీనమైన స్థితిగల;
ధ్యానస్తిమితమ్ = ధ్యాననిశ్చలమైన;
ఉపకమ్పమ్ = కమ్పానదీ సమీపమున;
తపస్యత్ = తపమొనర్చుచున్న;
పీనస్తనభరమ్ = బలిసిన స్తనముల బరువుగల;
మీనధ్వజతంత్రపరమతాత్పర్యమ్ = కాదివిద్యాతంత్ర పరమతాత్పర్యమును;
ఈడే = స్తుతించెదను.

**తాత్పర్యము :-**

ముని హృదయమున లీనస్థితి గలిగిన, ధ్యాన నిశ్చలమైన, కమ్పానదీ తీరమున తపమొనర్చుచున్న లావైన స్తనముల బరువుగల, కాదివిద్యా తంత్రమునకు పరమతాత్పర్యరూపిణియైన శ్రీకామాక్షీదేవిని స్తుతించెదను.

**వివరణము :-**

1) సుందరదేవతావిగ్రహములను పగులకొట్టుట ఉద్యమముగా చేపట్టిన విమతులు పేట్రేగినకాలమున ఆ విగ్రహముల రూపములంతకు ముందు తమను దర్శించి

ధ్యానించిన మునుల హృదయములలో పదిలముగా దాగియుండును. విగ్రహములు ధ్వస్తములైనను తిరిగి వానిని శిల్పులకు వర్ణించి చెప్పి వారు మరల నిర్మింపజేయుదురు. వానికి శాశ్వతత్వమును కలిగించెదరు. ఇదియే అమ్మవారి ముని హృదయమున లీనమైన స్థితి. ముని హృదయములలో లీనమైన కాలమున వారి హృదయములలో నితరము లేవియు గోచరింపవు. ఆ విగ్రహముల చిద్రూపతయే వ్యాపించియుండి వానిలో మిక్కిలి యానందమునే నింపును. పరమమునియైన సదాశివుని హృదయమున లీనమయి యుండి తొలత నాతని హృదయమున భాసించియే ఆ పిమ్మట బాహ్యశరీరము నమ్మవారు ధరించును. ఇట్లు అమ్మవారు మునిహృదయమునుండి బయటకు పోయి విహరించి మరల ఆతని హృదయముననే లీనమగుస్థితి కలిగియుండును. అమ్మవారు స్వయముగ సదాశివుని ధ్యానించుచుండును. అప్పుడామె యంగము నందు మనస్సునందును స్తిమితత్వము అనగా నిశ్చలత్వముండును. కదలని కామాక్షీ విగ్రహము ధ్యాన స్తిమితత్వమును ప్రకటించుట లేదా? ఒకసారి చూచి గ్రహింపుడు. ఆ నిశ్చల విగ్రహమును చూచునప్పుడామె కమ్పాతీరమున తపమొనర్చునట్లు కనబడుటలేదా! మరొకసారి చూచి గ్రహింపుడు. అమ్మవారు కాదివిద్యా తంత్ర (శాస్త్ర)ముయొక్క పరమతాత్పర్యమై యున్నది. శాస్త్రములలో నెన్నియో విషయములుండును. ఒక్కొక్కపుడు వానిలో పరస్పర విభేదము లుండును. వానిని సవిమర్శముగా పరిశీలించి గ్రంథకర్త తాత్పర్యమేదో గ్రహింపవలెను. తాత్పర్యగ్రాహకలింగము లాఱున్నవి.

| | |
|---|---|
| **1) ఉపక్రమోప సంహారములు** | **2) అభ్యాసము** |
| **3) అపూర్వత** | **4) ఫలము** |
| **5) అర్థవాదము** | **6) ఉపపత్తి.** |

వీని సాయమున, అనగా ఆ తంత్రముయొక్క ఉపక్రమోప సంహారములలో నేమి చెప్పబడినది, ఏ విషయము మరల మరల చెప్పబడినది. ఏ విషయమునం దపూర్వత (ప్రమాణాంతరాగోచరత) ఉన్నది, ఏ విషయమున తాత్పర్యము గ్రహించిన గ్రంథపఠనము సఫలమగును, ఏ విషయమును స్తుతించుట కాఖ్యాయికలు చెప్పబడినవి, ఏ విషయము నంగీకరించుటలో నుపపత్తి యున్నది, అను ఆఱంశముల సవిమర్శముగా పరిశీలించిన, గ్రంథ తాత్పర్యముగా నా విషయము గోచరించును. కాదివిద్యాతంత్ర మిట్లు పరిశీలింపబడగా అమ్మవారి యేకత్వము, అనగా అమ్మవారే తాత్పర్యముగా తేలినందున ఆమె మీనధ్వజతంత్రముయొక్క పరమతాత్పర్యము అని చెప్పబడినది.

2) నాలుగు పాదముల ఆదియందు ప్రాసమున్నది. కావున నిట వృత్త్యనుప్రాసమను శబ్దాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు మీనధ్వజతంత్రపరమతాత్పర్యమని చెప్పబడినది. ఈ

శ్లోకమున అమ్మవారు వాఙ్మనోతీతురాలని చెప్పబడుచున్నది.

**శ్లో॥ శ్వేతా మన్థరహసితే**
**శాతా మధ్యే చ వాఙ్మనోఽతీతా।**
**శీతా లోచనపాతే**
**స్ఫీతా కుచసీమ్ని శాశ్వతీ మాతా॥ 20**

**ప్రతిపదార్థము :-**

శాశ్వతీ = నిత్యయగు;
మాతా = తల్లి;
మంథరహసితే = మందహాసము నందు;
శ్వేతా = తెల్లనిది;
మధ్యే = నడుమున;
శాతా = కృశించినది;
వాఙ్మనోఽతీతా = వాక్కునకు, మనస్సునకు అందనిది;
లోచనపాతే = దృష్టిపాతమున;
శీతా = చల్లనది;
కుచసీమ్ని = కుచప్రదేశమున;
స్ఫీతా = లావైనది.

**తాత్పర్యము :-**

శ్రీ కామాక్షి శాశ్వతమాత. ఆమె మందహాసము తెల్లనిది. నడుము సన్ననిది. దృష్టిపాతము చల్లనిది. కుచసీమ లావైనది. ఆమె వాఙ్మనస్సులకు అందనట్టిది.

**వివరణము :-**

1) వాఙ్మనోతీతయని చెప్పుటకు వాక్కే కావలెను. అయినను ఆమెను గూర్చి సమగ్రముగ చెప్పినట్లు కాదు. ఆమెకు జాతిగుణక్రియలు లేవు, గావున జాతిగుణక్రియావాచకశబ్దము లామెను చెప్పలేవు. ఆమె ఏద్రవ్యమును కలిగిలేదు, కావున ఏ ద్రవ్యవాచకశబ్దమును ఆమెను చెప్పజాలవు. ఆమెకు ఏ సంజ్ఞయులేదు, అందువలననే శబ్దములు ఆమెను చెప్పజాలవు. మనస్సు తెలిసికొనునట్టి వేవియు నామెకడ లేవు గావున, మనస్సునకు గూడ నామె గోచరము గాదు, కావున వాఙ్మనోతీత యని చెప్పబడినది. **యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ (తై.2.4)**-అను శ్రుతి యర్థము సమాసము తెలుపును. శ్వేతా అను పదము అమ్మవారి మందహాసము తెలుపును గావున అది గుణవాచక శబ్దము. అట్లే శాతా శబ్దమామె నడుముయొక్క కార్శ్యగుణమును, శీతా శబ్దమామె దృష్టిపాతములోని శైత్యగుణమును, స్ఫీతాశబ్దము ఆమె కుచసీమయందలి మాంసలతా గుణమును చెప్పుటచే నీ శబ్దములన్నియు గుణవాచకములు. అవి యన్నియు

అవయవముల గుణములు తెలిపినను అవయవియగు అమ్మవారి గుణరహితత్వమును వ్యంజింపబడుచున్నది.

2) ఈ శ్లోకమున నాలుగు పాదముల ఆదియందు ప్రాసమున్నది. గుణవాచకముల జెప్పి వాఙ్మనోతీతా యనుటలో విరోధాలంకారస్ఫూర్తియున్నది. ఆమె నిర్గుణ తత్త్వమును వాఙ్మనస్సులు చెప్పలేక పోయినను సగుణతత్త్వము నవి కొంత కొంత చెప్పునని విరోధమును పరిహరించు కొనవచ్చును.

3) ఇచట మాతా యని చెప్పి ఆమె సౌందర్యమును వర్ణించుట యుచితమా అని ఒక ప్రశ్న కలుగుచున్నది. మాతృత్వము యౌవనమునందే సిద్ధించును. కాని ముసలమ్మ సంతానమును కనదు. శిశువున కామె పుష్కలముగా పాలీయ వలసినప్పుడు ఆమె కుచసీమ స్ఫీతముగా నుండవలసినదే. యౌవన ముడిగిన తల్లి పాలను గూడ శిశువున కీయలేదు. శిశువునకు తల్లి యందముగా లేకున్నను యందముగా కన్పించును. అది ఆ శిశువునకున్న ప్రేమకు నిదర్శనము. వాస్తవమునకు శిశువునందు దయగలిగియుండుటయే తల్లియొక్క సౌందర్యము. ఈ సౌందర్యవర్ణనము ఆ సౌందర్యమునకు వ్యంజకము.



**అవ:-** పై శ్లోకమున శ్రీకామాక్షీదేవి **మాత**యని చెప్పబడినది. స్త్రీయొక్క మాతృత్వము సంభోగరూప పురుష విమర్దమున సిద్ధించును. అది ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ పురతః కదా ను కరవై**
**పురవైరివిమర్దపులకితాఙ్గలతామ్**
**పునతీం కాఞ్చీదేశం**
**పుష్పాయుధవీర్యసరసపరిపాటీమ్॥ 21**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| పురవైరివిమర్దపులకితాంగలతామ్ | = శివుని కౌగిలింత చేత పులకించిన తీగ వంటి శరీరముగల; |
| కాంచీదేశమ్ | = కాంచీనగర ప్రాంతమును; |
| పునతీమ్ | = పవిత్రమొనర్చుచున్న; |
| పుష్పాయుధవీర్యసరసపరిపాటీమ్ | = మన్మథుని వీర్యముయొక్క సరసపరిపాటీయైన దానిని; |
| కదా | = ఎప్పుడు; |
| పురతః | = ఎదుట; |
| కరవై ను | = చేసికొందునో. |

**తాత్పర్యము :-**

పురవైరియొక్క బిగికౌగిలింతలచే పులకితశరీరముగల, కాంచీ దేశమును పవిత్రమొనర్చు మన్మథుని వీర్యముయొక్క సరసపరిపాటియగు శ్రీకామాక్షీదేవి నెప్పుడు నాముందట సాక్షాత్కరించుకొనగలుగుదునో.

**వివరణము :-**

1) తండ్రి గదిలోనికి పోవునప్పుడు తల్లి మరొక గదిలో శిశువును నిద్రపుచ్చును. తండ్రితో ఆమె గడపిన కాలమెంతో నొకప్పుడా తల్లి మఱచి యుండును. వెంటనే శిశువు జ్ఞప్తికి వచ్చును. తండ్రిగది వీడి శిశువు పడుకొన్న గదిలోనికి వచ్చును. అప్పటికి శిశువు మేల్కొని యుండవచ్చును లేక నిద్రపోవుచుండవచ్చును. లేక తల్లిని గానక బిక్కుబిక్కుమని యెదురు చూచు చుండవచ్చును. ఆ సమయమున శిశువునకు తల్లి సాక్షాత్కరించినచో శిశువుయొక్క సంతోషమునకు అవధి యుండదు. అట్టి తీవ్రసంతోషమును కలిగించుటకే ఒకప్పుడు తల్లి కొంచెము సేపు శిశువునకు కనబడకుండ నుండును. ఏమైననేమి తల్లి రావలెను. ఎట్లు రావలెను. తండ్రి కలయికతో పులకించి రావలెను. ఆ సమయమున శిశువేది కోరిన అది యిచ్చును. అది సంతోషసమయము గదా. కావున మూకకవి పురవైరిపులకితాంగలత యగు కామాక్షీదేవీ సాక్షాత్కారమును కోరుకొనుచున్నాడు. కొంచెమాలస్యము నామె యొనర్చినను పురవైరికి వార్ధమచే నేర్పడిన ఆ ఆలస్యమును సహించుట కాతడు సిద్ధమయి యున్నాడు. కాని ఆమెను ఎంతకాలమునకు చూడగలడో అతడెరుగడు. త్వరగా వచ్చిన బాగుండునే యని యనుకొనుచున్నాడు. కామాక్షీదేవిచే వలపించుకొన్న పురుషుడు పురవైరి. ఆమె యేమో త్రిపురసుందరి, ఆ త్రిపురముల ధ్వంసమొనర్చినగాని ఆ త్రిపురముల లోపలనున్న కామాక్షీదేవి యాతనికి లభింపదు. తనకు కామాక్షీదేవికి సంయోగము కలుగకుండ అడ్డుగోడలైయున్న త్రిపురములపై నాతడు వైరము వహించెను. ఆ అడ్డుగోడల ధ్వంసమొనర్చి వచ్చిన నాయకు నామె యెదురేగి కౌగలించుకొనెను. ఆతడును ఆమెను చిరవియోగానంతరము ఆ వియోగక్లేశము తీరునంతవఱకు కౌగిలింతలతో సరససల్లాపములతో ముంచెత్తెను. వియోగతాపము శమించుటతో కామాక్షీదేవి ముఖము ఆనందమున విప్పారును. అట్టి కామాక్షీదేవి దర్శనమునకై మూకకవి యెదురు చూచుచున్నాడు. ఆ కాంచీ నగర ప్రదేశమాది దంపతుల మన్మథవీర్యసరసపరిపాటులతో పవిత్రమొనర్చుచు లేక యే కైలాసాదులలోనో యా యానందసంభోగములను ముగించుకొని కాంచీ ప్రదేశమందలి శిశువుల భక్తుల నుద్ధరించుట కొఱకు ఆ ప్రదేశమును పవిత్ర మొనరించుచు నెప్పుడు వచ్చునో యని మూకకవి యెదురు చూచుచున్నాడు.

2) నాలుగు పాదములు పకారారంభములై వడిని కలిగి యున్నవి. మొదటి రెండు పాదములలో ఆది ప్రాసమున్నది. ద్వితీయ పాదమధ్యమున కూడ వడి యున్నది. శ్రీకామాక్షీదేవి పుష్పాయుధవీర్యసరసపరిపాటిగా భంగ్యంతరమున చెప్పబడుటచే

పర్యాయోక్త్యలంకార మున్నది. ఈ శ్లోకమున ఇట్టి శ్లోకముల యందు వర్ణింపబడిన **శివాశివసంభోగవర్ణనము కుండలినీ సహస్రారవేధము**ను తెలుపునని అభిజ్ఞులు చెప్పెదరు.



**అవ॥:-** పై శ్లోకమున శివయొక్క పులకితత్వము చెప్పబడినది. ఈశ్లోకమున **శివుని పులకితత్వము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ పుణ్యా కాపి పురన్ధ్రీ**
**పుఙ్ఖితకన్దర్పసమ్పదా వపుషా।**
**పులినచరీ కమ్పాయాః**
**పురమథనం పులకనిచులితం కురుతే॥ 22**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కమ్పాయాః | = కమ్పానదియొక్క; |
| పులినచరీ | = ఇసుకతిన్నెలలో చరించు; |
| కా అపి | = ఒకానొక; |
| పుణ్యా | = పుణ్యవతియైన; |
| పురంధ్రీ | = ముత్తైదువ; |
| పుంఖితకందర్పసంపదా | = మన్మథునికి ఱెక్కలు మొలపింపజేయు సంపదయైన; |
| వపుషా | = శరీరముతో; |
| పురమథనమ్ | = శివుని ; |
| పులకనిచులితమ్ | = పులకలతో కప్పబడిన వానినిగా ; |
| కురుతే | = చేయుచున్నది. |

**తాత్పర్యము :-**

కమ్పానదియొక్క ఇసుకతిన్నెలలో విహరించు నొక పుణ్యాంగన మన్మథుని ఱెక్కలు మొలపింపజేయు రూపసంపదగల శరీరముతో శివుని పులకితు నొనర్చుచున్నది.

**వివరణము :-**

1) కమ్పానదీ తీర పులినములో విహరించు పుణ్యపురంధ్రి శ్రీకామాక్షీ దేవి, ఏకామ్రేశ్వరున కామె సుపరిచితయే. తత్సంభోగమున తనకు గలిగిన పారవశ్యము ఆతని కింకను జ్ఞప్తిలో నున్నది. ఆ సంభోగము తరువాత కొన్ని దినము లెవరి ఆలయములలో వారున్నారు. ఇరువురికి పునస్సంధానకాంక్ష కలిగినది. ఆమె ఆలయమునుండి బయలుదేరి కమ్పాతీరపులినతలముల చేరుకొన్నది. అవి యన్న ఆమె కెంతో ఇష్టము. వానిని చూచినప్పుడెల్ల ఆ పులినతలములలో ఎన్నిమార్లు తామిరువురు కలసి సంభోగించి సుఖపారవశ్యము నొందిన వేళలో జ్ఞప్తికి వచ్చినవి. సరిగా ఆ సమయముననే అదిగో ఏకామ్రేశ్వరు డెదురు పడినాడు. లోకమోహకమైన ఆమె

శరీరసౌందర్యము నిత్యనూతనము కావున అది మొదటిరాత్రి యలంకరించుకొని వచ్చినప్పటి సౌందర్యము రవంతయు తగ్గినట్లు లేదు. శివుడామెను చూచి ఆ తొల్లింటి సంభోగములు జ్ఞప్తికి వచ్చి ఇకముందు సంభవింపబోవు సుఖపారవశ్యమును తలచుకొని పులకితుడైనాడు. పులకలతో శరీరమంతట కప్పబడినవాడైనాడు. అంతగా పులకితుడగునట్లు చేయు రూపసంపద యౌవనసంపద కలిగిన శరీరమామెది.

2) ఆమె ఒక పుణ్యపురంధ్రి యనగా పురమును ధరించినది. పురమనగా శరీరము. పురశబ్దమునకు పట్టణము అను అర్థము కూడా నున్నది. ఆ పట్టణము చిన్నరాజ్యమునకు రాజధాని కావచ్చును లేక త్రిలోకసామ్రాజ్యము నకో సర్వబ్రహ్మాండసామ్రాజ్యమునకో రాజధాని కావచ్చును. ఆమెకు కాంచీ పులినతలములలో విహరింప నిచ్చ జనించిన దనగా కాంచీపుర భాగ్యమెట్టిదో దాని మనోహరిత యెట్టిదో ఊహించుకొననగును. ఇంతకును ఈ పురంధ్రి ఏ పురుషుని కోరివచ్చినది. ఆయన పురమధనుడు. త్రిపురములను ఫాలనేత్ర జ్ఞానాగ్నితో దగ్ధ మొనర్చినవాడు. పురంధ్రీపురమధనుల సంయోగమనగా ప్రకృతికి ఆత్మకు నేర్పడిన సంయోగము. అది సృష్టిహేతువు. ప్రలయమున వారికి వియోగము కలిగినట్లనిపించును. సృష్టికి పూర్వము సంయోగము కలిగినట్లు అనిపించును. కాని వారిది నిత్యసంయోగము, వియోగరహితము. ఈ సంయోగ, వియోగములు కేవలము నటనమే. అసలు సంయోగమే లేదు. సృష్టియే లేదు. సృష్టిహేతు సంయోగసంభావనమున్నది. ఈ శ్లోకమున ఆ సంభావనము చేయబడినది. కాంచీనగర పరిసరములలో కమ్పాతీర పులినతలములలో ప్రతిదినమెన్నో యువతీయువకుల జంటలు విహరించుటకు వచ్చుట సాధారణము. కాళిదాసు మేఘసందేశమున చెప్పినట్లిచట పొదలు (గుహలు) వారి యౌవనమదగంధమును వ్యాపింపజేయుచుండునేమో, అట్టి అచట జంటలలో శివమిథునభావమును విరక్తుడు మహాభక్తుడునైన మూకకవి చేసినాడనుకొనుటలో దోషము కానరాదు.



**అవ:-** పూర్వశ్లోకమున కమ్పానదీ పులిన ప్రస్తావనమున్నది. ఈ శ్లోకమున కమ్పానదీతటము ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ తనిమాద్వైతవలగ్నం**
**తరుణారుణసమ్ప్రదాయతనులేఖమ్।**
**తటసీమని కమ్పాయా-**
**స్తరుణిమసర్వస్వమాద్యమద్రాక్షమ్॥ 23**

**ప్రతిపదార్థము :-**

కమ్పాయాః = కంపానదియొక్క;
తటసీమని = తీరప్రదేశమున;

తనిమాద్వైతవలగ్నమ్ = కార్శ్యముతో నభేదమొందిన నడుముగల
తరుణారుణసంప్రదాయ తనులేఖమ్ = తరుణారుణ సమ్ప్రదాయరూపమైన తనురేఖకల;
ఆద్యమ్ = మొదటి;
తరుణిమసర్వస్వమ్ = యౌవనసర్వస్వమును;
అద్రాక్షమ్ = చూచితిని.

**తాత్పర్యము :-**

కమ్పానదీతీరమున నొక యౌవనసర్వస్వ మనదగిన కామాక్షీదేవిని చూచితిని. ఆమె తన శరీరమున తరుణారుణరేఖలతో తరుణారుణ సమ్ప్రదాయమును సృష్ట్యాది నుండి నేటిదాక కాపాడుకొనుచు వచ్చినట్లున్నది.

**వివరణము :-**

1) పరతత్త్వమును శిశురూపమున భావించుట శైవసంప్రదాయము లేక శిశుసంప్రదాయము. **కరారవిందేన పదారవిన్దమ్ముఖారవిన్దే వినివేశయన్తమ్। వటస్య పత్రస్య పుటే శయానమ్ బాలమ్ముకుందమ్మనసా స్మరామి॥ (కృ.క.-2)** ఇత్యాది శ్లోకములలో చెప్పబడిన బాలముకున్దోపాసన శిశుసంప్రదాయమై యున్నది. అట్లే పరతత్త్వమును యువరూపమున భావించుట తరుణిమ సమ్ప్రదాయము. ఇట్లే పరతత్త్వమును నల్లనిదని భావించుట కాలిమ సంప్రదాయమని, తెల్లనిదని భావించుట ధవలిమ సంప్రదాయ మని, ఎఱ్ఱనిదని భావించుట అరుణ సమ్ప్రదాయము. ఈ విషయమిది వఱకు ప్రస్తావింపబడినది. ఆ విధముగనే పరతత్త్వమును తరుణమని అరుణమని తారుణ్యారుణముల నొకచోట కలిపి యుపాసించుట తరుణారుణ సంప్రదాయము. అమ్మవారి శరీరములో నా తారుణ్యారుణ్యములు రెండు నొకచోట నుండుట నీ మూకకవి **తరుణారుణ సంప్రదాయతనులేఖమ్** అని చెప్పినాడు. తరుణిమసర్వస్వమను మాట ఇది వఱకే వివరింపబడినది. అది ఆద్యమని చెప్పుట ఈ శ్లోకమున నున్నది. అట్లమ్మవారు ఆద్య, తరుణిమసర్వస్వమని చెప్పుట పర్యాయోక్త్యలంకార మగుననుట స్పష్టము. తరుణిమము విడిగా చెప్పబడినందున తరుణారుణ శబ్దములోని తరుణ శబ్దము లేత అను నర్థమున ప్రయోగింపబడినట్లు భావించుకొనవచ్చును. అట్లే అరుణ శబ్దము సూర్యవాచకముగా భావించుకొన వచ్చును. అప్పుడు తరుణారుణ శబ్దములు బాలసూర్యుని బోధించును. బాలసూర్యుడెఱ్ఱనివాడు కావున ఆమె తనులేఖలో అరుణిమ సంప్రదాయమున్నట్లు స్పష్టమగును. బాలసూర్యమండలపు టెఱుపున అమ్మవారి అరుణిమను చూచుట కూడ సంప్రదాయసిద్ధమే. సూర్యస్థానమైన అనాహతకమలమున అమ్మవారిని ధ్యానించుట కూడ ఈ సంప్రదాయమునకే చెందును. ఈ శ్లోకమున చెప్పబడిన తరుణిమ సంప్రదాయము రాధాకృష్ణోపాసనలో ప్రసిద్ధముగా నున్నట్టిదే. భాగవతమున గర్గసంహిత యందు, బ్రహ్మవైవర్తపురాణమునను, ఈ సంప్రదాయపు జాడలు పుష్కలముగా

కనిపించును. అచట కృష్ణుడు నలుపు. ఇచటి కామాక్షి ఎఱుపు. ఇది మరొక భేదము. స్త్రీపురుషభేదము మాట చెప్పనక్కఱలేదుగదా. **తనిమాద్వైతవలగ్నమ్** అను సమాసమున్నది. తనిమాద్వైత మను నొక అద్వైత మిచటను కన్పడును. ఇచట తనిమవలగ్నముల అద్వైతము నీ సమాసము బోధించును. కార్శ్యమనగా అమ్మవారి నడుమే. అమ్మవారి నడుమనగా కృశత్వమే. ఇంతకు మించిన కృశత్వము మఱెక్కడ ఏ నడుమునను కన్పించదు అనుట ఫలితార్థము.

2) ఈ శ్లోకమున సరిపాదములలో ఆది ప్రాసమున్నది. అన్ని పాదములలో తకారాదిత్వమను వడియున్నది. ద్వితీయ పాదమధ్యమున కూడ వడియున్నది. తను లేఖా శబ్దము ఆమె శరీరకాంతికార్శ్యముల వ్యంజింపజేయును.



**అవ:-** పై శ్లోకమున **తరుణిమసర్వస్వముగా** అమ్మవారు చెప్పబడినది. తరుణి తరుణిమ పురుష భోగార్థమే. అందుచేత నీ శ్లోకమున పురుషుడైన అర్ధశశిమౌళి అభ్యుదయమే ఆమె యౌవనమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ పౌష్టికకర్మవిపాకం**
**పౌష్పశరం సవిధసీమ్ని కమ్పాయాః।**
**అద్రాక్షమాత్తయౌవన-**
**మభ్యుదయం కిఞ్చిదర్ధశశిమౌలేః॥ 24**

**ప్రతిపదార్థము :-**

కమ్పాయాః = కమ్పానదియొక్క;
సవిధసీమ్ని = సమీప ప్రదేశమున;
పౌష్పశరమ్ = మన్మథునకు సంబంధించిన;
పౌష్టికకర్మవిపాకమ్ = పౌష్టిక కర్మల పరిణామమైన;
ఆత్తయౌవనమ్ = యౌవనము నొందిన;
కించిత్ = ఒకానొక;
అర్ధశశిమౌలేః = శివునియొక్క;
అభ్యుదయమ్ = అభ్యుదయమును (శ్రీకామాక్షీదేవిని);
అద్రాక్షమ్ = చూచితిని.

**తాత్పర్యము :-**

కమ్పానదీ సమీపమున,మన్మథుని పౌష్టిక కర్మల పరిపాకముగా యౌవనము పొందిన అర్ధచంద్రమౌళియొక్క యొకానొక అభ్యుదయమని చెప్పదగిన అమ్మవారిని చూచితిని.

**వివరణము :-**

పౌష్టికకర్మలని, శాంతికర్మలని వైదికపుణ్యకర్మలు ద్వివిధములు. వానిలో శాంతికర్మలు పాపమును(పూర్వజన్మసంచితమైన దానిని శాంతింపజేసి ఈ శరీరమును కల్పించుట ద్వారా) తమ పనిని ప్రారంభించిన ప్రారబ్ధకర్మల ద్వారా కలిగిన కలుగబోవు దుఃఖముల ననుభవించు శక్తిని, వాని తీవ్రతను తట్టుకొను శక్తిని కలిగించునట్టివి. పౌష్టికములు శరీరపుష్టిని ఇతరములైన శారీరక మానసికములైన సుఖములను మంగలములను కలిగించునట్టివి. ఆయుర్వేద శాస్త్రమున శరీరపుష్టిని కలిగించు ఔషధముల కర్మలు, వాజీకరణములు, రోగముల శమింపజేయు నౌషధకర్మలు నున్నవి. అవి అట్లుండుగాక. ప్రస్తుతము మన్మథుడు కొన్ని పౌష్టిక కర్మలొనరింప తత్పరిపాకమున అమ్మవారికి యౌవనము కలిగినది. ఇప్పుడు దానిచేత తన పూర్వ విరోధియైన శివుని గెలువవచ్చునని సంతోషించుటకు ఆమె యౌవనము కారణమైనది. ఇప్పుడు తన పుష్పబాణముల సాన బెట్టుచున్నాడు. అమ్మవారి శరీరమంతయు పుష్పగంధము పుష్ప సుకుమారము అనగా అది మన్మథుని కమ్ముల పొదియైనది. దీనిని చూడగానే శివుడు తన యోటమిని సంతోషముతో నంగీకరించినాడు. ఇది తన యభ్యుదయముగా భావించినాడు. తాను వియోగకాలమున చేసిన తపమంతయు ఫలించినదను కొన్నాడు. నాడు మన్మథుని దహించి సంపాదించిన పాపము నిక కడిగి కొనవచ్చుననుకొన్నాడు. పిచ్చుకపై బ్రహ్మాస్త్రమేసినట్లు పుష్పశరుని ప్రలయకాలాభీలఫాలనేత్రాగ్నివృష్టిని గురిపించి కాల్చివేయుట శివునకు ధర్మము కాదు, అను రీతి వచ్చిన అపకీర్తిని తొలగించుకొని మన్మథసామ్రాజ్యము నేలుకొనవచ్చు ననుకొన్నాడు. ఇహపరలోకముల కలుగు సౌఖ్యము అభ్యుదయ మనబడును. చంద్రమౌలి కామాక్షిని గూర్చి దాంపత్యధర్మమవలంబించుటకు వీలును కలిగించునట్టి దమ్మవారి యౌవనము. కావున దాని నాతడు అభ్యుదయముగా భావించినాడు.

2) ఉత్తరార్ధమున అకారాది పదముల ప్రయోగించుటచే వడి గూర్చబడినది.



**అవ:-** పై శ్లోకమున శివుడర్ధశశిమౌలిగా పేర్కొనబడినాడు. ఈ శ్లోకమున అమ్మవారు **చంద్రావతంసగా** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ సంశ్రితకాఞ్చీదేశే**
**సరసిజదౌర్భాగ్యజాగ్రదుత్తంసే।**
**సంవిన్మయే విలీయే**
**సారస్వతపురుషకారసామ్రాజ్యే॥ 25**

**ప్రతిపదార్థము :-**

సంశ్రితకాంచీదేశే = కాంచీనగరదేశము నాశ్రయించిన;

సరసిజ దౌర్భాగ్య జాగ్రదుత్తంసే = కమలముల దౌర్భాగ్యమున మేల్కొనువాడు (చంద్రుడు) శిరోభూషణముగాగల;
సంవిన్మయే = జ్ఞానస్వరూపమైన;
సారస్వతపురుషకారసామ్రాజ్యే = సరస్వతికి సంబంధించిన ప్రయత్నము యొక్క సమ్పూర్ణతయందు;
విలీయే = లీనమగుచున్నాను.

**తాత్పర్యము :-**

కాంచీనగరప్రదేశము నాశ్రయించిన, చంద్రుడు శిరోభూషణముగాగల జ్ఞానమయమైన **సారస్వతప్రయత్నపరిపూర్ణత** (అమ్మవారి) యందు లీనమగు చున్నాను.

**వివరణము :-**

సరసిజదౌర్భాగ్యమునందు, అనగా కమలములను ముకుళింపజేసి వానిని సౌభాగ్యమునకు (కాంతికి) దూరమొనర్చి దౌర్భాగ్యమును (సంకోచమును కాంతి హీనతను) కలిగించుటయందు జాగ్రత్, అనగా మేల్కొనువాడు, అనగా చంద్రుడు . అట్టి చంద్రుని ఉత్తంసముగా అనగా శిరోభూషణముగా ధరించిన దమ్మవారు. శివుడు పూర్ణచంద్రుని తలదాల్చుకున్నను అర్ధచంద్రునో చంద్రషోడశ భాగరూప కలనో ధరించినను చంద్రశేఖరుడే. అట్లే అమ్మవారును చంద్రశేఖరయే. చంద్రుడనుటకు బదలు సరసిరుహదౌర్భాగ్య జాగ్రత్ అనుట పర్యాయోక్తమే. శిరము లోపలి వెలుగు సహస్రారకమలమే చంద్రమండలము. దానిని చిచ్చంద్రమండలమని కూడ కొందరు పేర్కొందురు. ఆ చంద్రమండలకాంతిచే మూలాధారాద్యాజ్ఞాంత కమలములు ముకుళించుకొని యుండుటపై యర్థమీ శ్లోకముననున్నదని చెప్పినవారు శ్రీకల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులవారు. ఇది బాగుగానే ఉన్నది. కాని వారు **సరసిజదౌర్భాగ్యజాగ్రదుత్తంసే** అను పదము చంద్రశేఖర అను నర్థము నిచ్చుచుండగా దానికి చంద్రరేఖాకిరీట యని అర్థము చెప్పినారు. రేఖావాచక శబ్ద మాసమాసమున లేదు. పైగా రేఖయని చెప్పుట చిచ్చంద్రమండలము అని వారు చెప్పిన సూచ్యార్థమునకు అనుగుణము కాదు. రేఖా శబ్దము మూలమున నున్నప్పుడు అది చిచ్చంద్రమండలమును సూచించును అని చెప్పుట దోషము కాదు. కాని మూలమున రేఖావాచక శబ్దమే లేనప్పుడట్లు చెప్పనవసరము లేదు. రేఖచేత కమలములకు కించిన్ముకుళీ భావము కలుగవచ్చును. కాని పూర్ణముకుళీ భావము కలుగదు. సూర్యాభావ మాపని చేయునన్నచో ముకులమను కార్యము చంద్రరేఖదని చెప్పనవసరమే లేదు. కవుల దృష్టిలో కమలముకులము సూర్యాస్తమయమునకు, చంద్రోదయమునకు కార్యము గానే కన్పించును. శిలాది నిర్మిత దేవ విగ్రహములందు శిలాత్వాదిబుద్ధి కూడదని అవి కళాన్యాసాదులచే సంవిన్మయత్వము నొందునని పెద్దలు చెప్పుదురు. అందుచేత కామాక్షీ విగ్రహము సంవిన్మయము. దేవి ప్రకృతిరూపిణిగా చిద్రూపిణిగా వర్ణింపబడుట సంప్రదాయసిద్ధము. అందుచే మూకమహాకవి అమ్మవారిని సంవిన్మయే అని కీర్తించినారు. పురుషకారశబ్దమునకు

కొందఱు అధికారులతో తన యాశ్రితులకు వారి కార్యములలో ననుకూలింపుమని కోరుట అను అర్థమును చెప్పుదురు. మరికొందఱు పురుషకారశబ్దమునకు పౌరుష ప్రయత్నము (స్త్రీలచే చేయబడు యత్నముకూడ పౌరుషమే. కొన్ని సందర్భములలో స్త్రీలు కూడ పురుషశబ్దవాచ్యలే యగుదురు) అను అర్థము చెప్పుదురు. సాధారణముగా క్రింది యుద్యోగులు పై అధికారులచే తమ కార్యముల ఫలింప జేసికొనుటకై వారి భార్యల నాశ్రయించి ఆమె పురుషకారమునకై ప్రార్థించు చుందురు. అట్లే నను బ్రోవుమని (రామునకు) చెప్పవే॥ అని భక్తులు సీతమ్మను ప్రార్థించినారు. సారస్వతపురుషకార మిచ్చుట ఉత్తమవాఙ్మయాధ్యయనపాండిత్య సంపాదనోత్తమ గ్రంథ గ్రథనాదిరూపము. ఆ ప్రయత్నముల కనుకూల ఫలసంధానవైభవమును సామ్రాజ్యపదము బోధించును.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కాంచీదేశాశ్రయణము చెప్పబడినది. ఈ శ్లోకమున **కాంచీప్రదేశఖేలనాదరము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ మోదితమధుకరవిశిఖం**
**స్వాదిమసముదాయసారకోదణ్డమ్।**
**ఆదృతకాఞ్చీఖేలన-**
**మాదిమమారుణ్యభేదమాకలయే॥ 26**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| మోదితమధుకరవిశిఖమ్ | = పూవులు బాణములుగాగల; |
| స్వాదిమసముదాయసారకోదండమ్ | = చెఱుకువిల్లుగల; |
| ఆదృతకాంచీఖేలనమ్ | = కాంచీనగర ప్రదేశమున నాడుటయం దాదరముకల; |
| ఆదిమమ్ | = మొదటి; |
| అరుణ్యభేదమ్ | = ఒక విధమైన ఎఱుపును; |
| ఆకలయే | = ధ్యానించెదను. |

**తాత్పర్యము :-**

పూలు బాణములుగాగల, చెఱుకువిల్లుగాగల, కాంచీనగర ప్రదేశములలో నాడుకొనుటయం దాదరముగల ఒకానొక **అరుణిమ** విశేషమును ధ్యానించెదను.

**వివరణము :-**

1) మధుకరము లనగా తుమ్మెదలు. వానికి మోదము కలిగించు పూలు మోదితమధుకరములు. ఆ పూలు బాణములుగాగలది అమ్మవారు. స్వాదిమములనగా తీయదనములు. వాని సముదాయముయొక్క సారము చెఱుకు నందుగలదు. కావున

చెఱుకు స్వాదిమసముదాయసారముగా పేర్కొనబడినది. ఆ చెఱుకు విల్లుగాగల దమ్మవారు. రాగి యెఱ్ఱనిది. బాలారుణు డెఱ్ఱనివాడు. కమల మెఱ్ఱనిది. కురువింద మెఱ్ఱనిది. మంకెనపూ వెఱ్ఱనిది. ఇట్లెన్నియేని యెఱుపు లున్నవి. అమ్మవారి యందొక యెఱుపున్నది. ఆ యెఱుపున కదియే సాటి. అది జగదాదిమమైన ఎఱుపు. సృష్ట్యాది ప్రలయాంతకాలము పగలు, ప్రలయాది సృష్ట్యంతకాలము రాత్రి. పగలు తెల్లనిది. రాత్రి నల్లనిది. ఆ రెండింటి నడుమ సంధ్య కలదు. అది యెఱ్ఱనిది. సృష్ట్యారంభమందలి విమర్శశక్తి యెఱుపు. సృష్టిహేతువైన రజోగుణ మెఱుపు. ఇచ్ఛాశక్తి యెఱుపు. అది అమ్మవారి యెఱుపు. సంధ్యలో దానిని ధ్యానించువారు సంధ్యోపాసకులు. ఇచ్ఛాశక్తి యెఱుపని చెప్పితిని. దానికి కామమని మరొక పేరు, సృష్టీచ్ఛగల సర్వేశ్వరుడు కామేశ్వరుడు. ఆతని అర్ధాంగి కామేశ్వరి. లోకమందలి స్త్రీపురుషుల సంయోగేచ్ఛ కూడ కామమే. దాని కధిదేవత మన్మథుడు. ఆతనికి పూలబాణములు, చెఱుకువిల్లు ఉన్నవి. కామేశ్వరునికున్నవి కామేశ్వరికిని ఉన్నవి. లలితాదేవికున్నవి. ఆమె నుపాసించుటచే ఆతని కవి ప్రాప్తించినవి. అమ్మవారిని నుపాసించు వా రమ్మవారివంటి వేషము ధరింపవలెనని ముందే పూలను బాణములుగా, చెఱుకును విల్లుగా, చేసికొన్నాడేమో తెలియదు. ఇచట కామాక్షీదేవికి పూలబాణములు, చెఱుకువిల్లు కలదని చెప్పుటకు ప్రయోగించిన శబ్దములు మిక్కిలి చమత్కారావహములు. అమ్మవారి కరుణచే అట్టి శబ్దప్రయోగమబ్బిన **మూకకవి ధన్యుడు.** అన్ని పాదములందాదిప్రాసమున్నది. పర్యాయోక్త్యలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చెఱుకువిల్లునందు స్వాదిమమున్నదని చెప్పబడినది. అట్లే ఆమె పూలబాణములందు మధువున్నదని సూచింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారు స్వయముగా **ఉపనిషదరవిందకుహరమధుధార**గా వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ ఉరరీకృతకాఞ్చీపురీ-**
**ముపనిషదరవిన్దకుహరమధుధారామ్।**
**ఉన్నమ్రస్తనకలశీ-**
**ముత్సవలహరీముపాస్మహే శమ్భోః॥ 27**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| ఉరరీకృతకాంచిపురీమ్ | = కాంచిపురి నంగీకరించిన; |
| ఉపనిషదరవిందకుహర మధుధారామ్ | = వేదాంత కమల గర్భమధుధారయైన; |
| ఉన్నమ్రస్తనకలశీమ్ | = ఎత్తైన కలశముల వంటి స్తనములు కల; |
| శమ్భోః | = శివునియొక్క; |
| ఉత్సవలహరీమ్ | = సంతోష ప్రవాహమును; |
| ఉపాస్మహే | = ఉపాసించెదము. |

**తాత్పర్యము :-**

కాంచీపురవాసము నంగీకరించిన వేదాంతములనెడి కమలముల గుహలందలి మధుధారయైన, ఎత్తైన కుండలవంటి స్తనములు కల, శివుని సంతోషముల ప్రవాహమైన అమ్మవారిని ధ్యానించెదము.

**వివరణము :-**

1) తృతీయ పాదాంతమున **కలశీమ్** శబ్దము చేత **క్లీం కారమును,** చతుర్థపాద ప్రథమ సమాసాంత(హరీమ్) మున **హ్రీం కారమును,** దానియందలి ద్వితీయ తృతీయ పదములలో **ఐంకారము** నుద్ధరించుకొనవచ్చును. మొత్తము శ్లోకమున శ్రీం, సౌః అను మిగిలిన శక్తి ప్రణవద్వయమును కూడ ఉద్ధరించుకొనవచ్చును. కావున నీ **శ్లోకపారాయణమధిక ఫలదము.** నాలుగు పాదముల మొదట, చతుర్థపాదముయొక్క మధ్యను వడి యున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి స్తనముల ఔన్నత్యము చెప్పబడినది. ఈ శ్లోకమున లోచనముల ధైర్యము చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఏణశిశుదీర్ఘలోచన-**
**మేనఃపరిపన్థి సన్తతం నమతామ్।**
**ఏకామ్రనాథజీవిత-**
**మేవమ్పదదూరమేకమవలమ్బే॥ 28**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| ఏణశిశుదీర్ఘలోచనమ్ | = జింకపిల్లకన్నులవలె పొడవైన కన్నులుగల; |
| సంతతమ్ | = ఎల్లప్పుడు; |
| నమతామ్ | = నమస్కరించువారియొక్క; |
| ఏనఃపరిపంథి | = పాపములకు విరోధియైన; |
| ఏవమ్పదదూరమ్ | = ఏవమ్ అను పదమునకు దూరమైన; |
| ఏకమ్ | = ఒక; |
| ఏకామ్రనాథజీవితమ్ | = ఏకామ్రనాథుని జీవితమును; |
| అవలమ్బే | = ఆశ్రయించెదను. |

**తాత్పర్యము :-**

జింకపిల్ల కనులవలె పొడవైన కన్నులుగల, ఎల్లప్పుడు నమస్కరించు వారి పాపముల బొగొట్టు ఇట్లని చెప్పరాని యొక ఏకామ్రనాథుని జీవితమైన శ్రీ కామాక్షీదేవి నాశ్రయించెదను.

**వివరణము :-**

1) ఏణశిశు శబ్దమునకు ఏణశిశులోచనములను అర్థమును లక్షణ నాశ్రయించి చెప్పవలెను. ఇందుపమానవాచకలుప్తోపమాలంకారమున్నది. లోకములోని అన్నింటిని ఇది యిట్లు అని వివరింపవచ్చును. అమ్మవారు మాత్రమిట్లని చెప్పుటకు వీలుకానిది. కావున ఆమె ఇట్లు అను అర్థమిచ్చు ఏవమ్ అను పదమునకు దూరముగానే యుండును.

2) ఇందు పంచదశీ ద్వితీయాక్షర మైదు సార్లు ఆవృత్తమైనది. ప్రథమ ద్వితీయ పాదములలో తృతీయచతుర్థపాదములలో నాది ప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి లోచనముల **ధైర్యము** చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి ముఖమందలి **స్మితము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ స్మయమానముఖం కాఞ్చీ-**
**మయమానం కమపి దేవతాభేదమ్।**
**దయమానం వీక్ష్య ముహు-**
**ర్వయమానన్దామృతామ్బుధౌ మగ్నాః॥ 29**

**ప్రతిపదార్థము :-**

స్మయమానముఖమ్ = మందహాసమొనర్చుచున్న ముఖముగల;
కాంచీమ్ = కాంచీనగరమును;
అయమానమ్ = చేరుకొనుచున్న;
దయమానమ్ = దయజూపుచున్న;
కమ్ అపి = ఒకానొక;
దేవతాభేదమ్ = దేవతా విశేషమును;
ముహుః = మాటిమాటికి;
వీక్ష్య = చూచి;
వయమ్ = మేము;
ఆనన్దామృతామ్బుధౌ = ఆనందామృతసముద్రమునందు;
మగ్నాః = మునిగితిమి.

**తాత్పర్యము :-**

మాకమ్మవారి ముఖము నవ్వుచున్నట్లు కనిపించుచున్నది. కాంచీనగరమును చేరుకొనుచున్నట్లు, అందఱిపై దయజూపుచున్నట్లు అనిపించుచున్నది. ఆ అమ్మ ఏదో యొక అనిర్వాచ్య ప్రభావముగల దేవతయని తోచుచున్నది. ఆమెను మాటిమాటికి

చూచి మేము ఆనందామృతసముద్రములో మునిగితిమి.

**వివరణము :-**

1) నాలుగు పాదములం దాదిప్రాసమున్నది. అమ్మవారి సాక్షాత్కారమున కలుగు స్వానందానుభవమును మూకమహాకవి చెప్పుచున్నారు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి ముఖమందలి స్మితము చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి శిరమందలి **చంద్రరేఖ** చెప్పబడుచున్నది.

**శ్లో॥ కుతుకజుషి కాఞ్చిదేశే**
**కుముదతపోరాశిపాకశేఖరితే।**
**కురుతే జనో మనోఽయం**
**కులగిరిపరిబృ(వృ)ఢకులైకమణిదీపే॥ 30**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కాంచిదేశే | = | కాంచీనగర ప్రదేశమున; |
| కుతుకజుషి | = | కుతూహలమును పొందిన; |
| కుముదతపోరాశిపాకశేఖరితే | = | చంద్రుడే శిరోభూషణముగాగల; |
| కులగిరిపరివృఢకులైకమణిదీపే | = | కులగిరులకు ప్రభువైన హిమవంతుని కులమునకు మణిదీపమైన అమ్మవారియందు; |
| అయమ్ | = | ఈ; |
| జనః | = | జనుడు (మూకకవి); |
| మనః | = | మనస్సును; |
| కురుతే | = | చేయుచున్నాడు. |

**తాత్పర్యము :-**

కాంచిదేశవాసకుతూహలముగల, చంద్రుని శిరోభూషణముగా ధరించిన, హిమవంతుని కులమును వెలిగించు మణిదీపమైన అమ్మవారియందు ఈ మూకకవి మనస్సు కలిగియున్నాడు.

**వివరణము :-**

1) కుముదములనగా (తెల్ల) కలువలు. వాని తపస్సునకు ఫలముగా చంద్రుడు పాలసముద్రమున జనించినాడు. వాని నేలుచున్నాడు. అతడు రాగానే ఆ కలువలు వికసించును. ఆతడు దూరము కాగానే అవి ముకుళించుకొని పోవును. ఒక విధముగా వారిమధ్య భార్యాభర్తృబంధ మేర్పడినది. కుముద శబ్దము నపుంసకమైనను వానియందు స్త్రీత్వమునే కవులు దర్శించినారు. అదిగాక అవి యొక తీగకు పూచిన పూలు. తీగకు

స్త్రీత్వము సంస్కృత భాషలో శబ్దలింగ మాధారముగా నెప్పుడో యేర్పడినది. ఈ పూవు తీవకు ముఖముగా నుండును. భర్త వచ్చినప్పుడు భార్యముఖము వికసించినట్లు కుముదము చంద్రోదయమున వికసించును. అందుచేత చంద్రుడు కుముదతపోరాశిపాకముగా నిట చెప్పబడినాడు. నాలుగు పాదములు **కు** వర్ణముతో నారంభింపబడినవి. నాల్గవపాద మధ్యమున కూడ వడి యున్నది.

2) అమ్మవారు దీక్షయజ్ఞమున యోగబలమున ఆత్మాహుతి చేసికొని ప్రాణత్యాగ మొనర్చుకొని హిమవంతునికి కూతురుగా పుట్టుటచే ఆతని వంశము వెలిగిపోయినది. ఆతడు అమ్మవారు పుట్టుటచేతనే కులపర్వతప్రభువై వారిచే పరివేష్టింపబడి పర్వత సామ్రాజ్య వైభవము ననుభవించు చున్నాడు. అమ్మవారిని చూచినప్పటి నుండామెపై మూకకవి మనసు చేసికొన్నాడు. ఆమె కనబడక పోయిన చంద్రుడు కనబడనప్పటి కలువయే యైనాడు. ప్రేమ భార్యాభర్తల సొమ్మేకాదు. భర్తకు భార్య మీద నున్న ప్రేమకు తక్కువ కాకుండ శిశురూపభక్తునకు మాతృరూపదేవతయం దుండును.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి శీర్షమున చంద్రరేఖ యున్నట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి దేహమందలి **విద్రుమసాదృశ్యము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ వీక్షేమహి కాఞ్చిపురే**
**విపులస్తనకలశగరిమపరవశితమ్।**
**విద్రుమసహచరదేహం**
**విభ్రమసమవాయసారసంనాహమ్॥ 31**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కాంచిపురే | = | కాంచీనగరమున |
| విపులస్తనకలశగరిమపరవశితమ్ | = | పెద్ద కుండలవంటి స్తనముల బరువుచే పరవశించిన |
| విభ్రమసమవాయసారసన్నాహమ్ | = | విలాసముల సమూహపు సారముయొక్క సంసిద్ధతగల |
| విద్రుమసహచరదేహమ్ | = | పగడములకు సహచరమైన దేహముగల అమ్మవారిని |
| వీక్షేమహి | = | చూచెదము గాక. |

**తాత్పర్యము :-**

కాంచీనగరమున పెద్దకుండలవంటి చనులబరువుచేత పరవశము చేయబడిన విలాసనివాసమైన పగడపురంగు దేహముగల అమ్మవారిని చూచెదము గాక.

**వివరణము :-**

1) **విద్రుమసహచరదేహమ్** అను సమాసమున ధర్మలుప్తోపమాలంకార మున్నది. నాలుగు పాదములలో వకారారంభమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి దేహమునందలి విద్రుమసాదృశ్యము చెప్పబడినది. ఈ శ్లోకమున **కురువిందసాదృశ్యము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ కురువిన్దగోత్రగాత్రం**
**కూలచరం కమపి నౌమి కమ్పాయాః।**
**కూలఙ్కషకుచకుమ్భం**
**కుసుమాయుధవీర్యసారసంరమ్భమ్॥ 32**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కురువిందగోత్రగాత్రమ్ | = | కురువింద మణుల గోత్రమునందు బుట్టినట్లున్న శరీరముగల; |
| కమ్పాయాః | = | కమ్పానదియొక్క; |
| కూలచరమ్ | = | ఒడ్డున తిరుగు; |
| కమ్+అపి | = | ఒకానొక; |
| కూలంకషకుచకుమ్భమ్ | = | కూలముల నొరయు కుండలవంటి కుచములుగల; |
| కుసుమాయుధవీర్యసారసంరమ్భమ్ | = | మన్మథుని వీర్యసారముయొక్క వేగమును (అమ్మవారిని); |
| నౌమి | = | నమస్కరించెదను. |

**తాత్పర్యము :-**

కురువిందమను గోత్రమున పుట్టినట్లున్న శరీరముగల, కమ్పానదీ తీరమున విహరించు కులముల నొరయు కుండలవంటి కుచములుగల, ఒకానొక కుసుమాయుధ వీర్యసార సంరమ్భ రూపిణియైన అమ్మవారికి నమస్కరించెదను.

**వివరణము :-**

1) రావణగంగలో లభించునొక విధములైన ఎఱ్ఱని మణులు కురు విందము లనబడును. అమ్మవారి శరీర మామణులు పుట్టిన గోత్రమున బుట్టినట్లెఱ్ఱగా నున్నవి. సాధారణముగా నొక గోత్రమున బుట్టిన వారందఱు రంగు మొదలైన అంశములలో పోలికలుగలవారై యుందురు. అందువలన కురువిందమణులు అమ్మవారి శరీరము నొక గోత్రమని చెప్పబడుటచే నుపమాలంకార స్ఫూర్తి యున్నది. ద్వితీయ తృతీయ

పాదములందాది ప్రాసమున్నది. అన్ని పాదములందు క కారారమ్భమున్నది. అమ్మవారి స్తనములు దోర్మూలముల నొరసి కొనుచు కుండలవలె నున్నవని చెప్పుటచే నుపమాలంకార మున్నది. గురువిందగింజలుకూడ ఎఱ్ఱగా నుండును. వాని కింద నలుపు కనబడదు. వాని ఎఱుపు, అమ్మవారి స్తనముల యెఱుపు ఒకతీరుగా నుండుటచే వాని గోత్రమే శరీరమున నున్నదని చెప్పవచ్చును.

2) గోత్రగాత్ర అను పదబంధమున వృత్త్యనుప్రాసమను శబ్దాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి గాత్రమందు కురువిందసాదృశ్యము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమెయందు **కుంకుమశోభ** చెప్పబడుచున్నది.

**శ్లో॥ కుట్మలితకుచకిశోరైః**
**కుర్వాణైః కాఞ్చిదేశసౌహార్దమ్।**
**కుఙ్కుమశోణైర్నిచితం**
**కుశలపథం శమ్భుసుకృతసమ్భారైః॥ 33**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కుట్మలితకుచకిశోరైః | = మొగ్గతొడిగిన చిన్న కుచములుగల; |
| కాంచిదేశసౌహార్దమ్ | = కాంచిదేశముతో మైత్రిని; |
| కుర్వాణైః | = చేయుచున్న; |
| కుంకుమశోణైః | = కుంకుమవలె నెఱ్ఱనైనవియునగు; |
| శంభుసుకృతసంభారైః | = శివుని పుణ్యముల అతిశయముల చేత; |
| కుశలపథమ్ | = మంగల మార్గము; |
| నిచితమ్ | = నింపబడినది. |

**తాత్పర్యము :-**

మొగ్గలవంటి చిన్నకుచములుగల కాంచిదేశముతో స్నేహమొనర్చు చున్న కుంకుమపూత పూసినట్లెఱ్ఱనైయున్న శివుని పుణ్యములచే క్షేమమార్గము నిండియున్నది.

**వివరణము :-**

ప్రథమపాదముచే నమ్మవారి యౌవనారమ్భస్థితి సూచింపబడినది. ద్వితీయపాదమున కాంచిదేశమందలి నివాసమే ఆ దేశముతో స్నేహము చేయుటగా నుత్ప్రేక్షింపబడినది. కుంకుమ పూయకున్నను కుంకుమ పూసినట్లమ్మవారి శరీరమంతయున్నదని తృతీయపాదారమ్భసమాసము తెలుపుచున్నది. శంభుని పుణ్యసంభారములు అని బహువచనము చేత అమ్మవారు చెప్పబడుటచే కవికి ఆమె యందున్న పూజ్యభావము వ్యక్తమగుచున్నది.

**అవ:-** పై శ్లోకమున అమ్మవారు శివుని పుణ్యరాశిగా చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె **శివుని అంతఃపురముగా** చెప్పబడుచున్నది.

**శ్లో॥ అఙ్కితకచేన కేనచి-**
**దన్ధంకరణౌషధేన కమలానామ్।**
**అన్తఃపురేణ శమ్భో-**
**రలఙ్క్రియా కాపి కల్ప్యతే కాఞ్చ్యామ్॥ 34**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కేనచిత్ | = ఒకానొక; |
| కమలానామ్ | = కమలములయొక్క; |
| అంధంకరణౌషధేన | = గుడ్డితనమును కలుగజేయు నౌషధము చేత; |
| అంకితకచేన | = చిహ్నితములైన కచములుగల; |
| శమ్భోః | = శివునియొక్క; |
| అంతఃపురేణ | = అంతఃపురముచేత; |
| కాంచ్యామ్ | = కాంచినగరమందు; |
| కా+అపి | = ఒకానొక; |
| అలంక్రియా | = అలంకారము; |
| కల్ప్యతే | = కల్పింపబడుచున్నది. |

**తాత్పర్యము :-**

కచములందు చంద్రుని భూషణముగా ధరించిన శివుని అంతఃపురమైన అమ్మవారిచేత కాంచినగరమున నొక అలంకారము కూర్చబడినది.

**వివరణము :-**

1) అందఱకు వెలుగు నిచ్చు చంద్రుడు కమలములను గుడ్డివానినిగా జేయును. ఒకరిని గుడ్డివారిగా చేయుటకు మరొక రౌషధముల ప్రయోగించుట అరుదుగానైనను లోకమున నున్నది. ఇచట అమ్మవారౌషధమును తన వెంట్రుకలకు పూసికొన్నది. వెంట్రుకలకు ఆంధ్యము మరింత నల్లదనము కలిగి యుండవచ్చును లేక పోవచ్చును. కాని కమలములకు గుడ్డితనము వచ్చినది. అవి ముడిచికొని పోయినవి. వానినట్లు ముడిచికొని పోవునట్లు చేయుట చేత చంద్రుడంధకరణౌషధమైనాడు. ఆ చంద్రునితో అమ్మవారి కచములంకితమైనవి. తెల్లని చంద్రుని కేశములలో పువ్వును తురిమినట్లు అమ్మవారు తురిమికొనుటచే ఆమె జెడ నలుపు మరింత స్పష్టముగా కనబడినది. తెల్లని వస్తువు ప్రక్కన ఉంచిన చాలును నల్లని వస్తువుయొక్క నలుపు మరింత స్పష్టముగా కనబడుచున్న దనుట పూర్వార్థమున వ్యంజింపజేయబడినది. అమ్మవారి ముఖ సౌందర్యమును చూచి కమలములు ఎప్పటినుండియో నిప్పులు

పోసికొనుచున్నవి. వాని ఆ అసూయను చూచి తన శిరమున అంధకరణౌషధమును ధరించి తన తలనొప్పి తగ్గించుకొనుటతో పాటు కమలముల తిక్క కుదిర్చినది. వానిని గుడ్డివానిని చేసినది. అనియు పై పూర్వార్థము వ్యక్తీకరించుచున్నది. కమలము లమ్మవారి యొక్క ముఖమును చూచి మాత్రమే అసూయ జెందుట లేదు. ఆమె పాదములు, కరతలములు, నాభి మొదలగు వానిని చూచియు కమలము లసూయ నొందినవి. కమలముల కా యసూయ అవి పూచి పూయకముందే ఆరంభమైనది. పై శ్లోకమున **కుట్మలితకుచకిశోరైః** అని చెప్పుటచే ఆమె స్తనములు కమలముల మొగ్గలవలె నున్నవి అని సూచింపబడినది. వానిని చూచి కూడ కమలముల మొగ్గలకు అసూయ కలిగినది. ఇకముందు అమ్మవారి ఏ యితర అవయవములను చూచియు నీసుకొనకుండ నీ అంధంకరణౌషధము ప్రయోగించుట జరిగినది. కాని ఈ ఔషధమును ఎవరికి కీడు జరుగునో వారిపై ప్రయోగించనక్కఱలేదు. ఆ ఔషధము తాముపయోగించినంత మాత్రమున ఉద్దిష్టులగు వారిపై పనిచేయునని ఇదంతయు పూర్వార్థమున వ్యక్తమగుచున్నది. ఉత్తరార్థమున అమ్మవారు కాంచీనగరమున నివాసమేర్పఱచుకొని కాంచీ నగరమునకే శోభ చేకూర్చినదని చెప్పబడినది. **కాపి** అనుటచే ఆ శోభ ఇట్టిదని గాని ఇంతదనిగాని చెప్పరాదను అర్థము గ్రహింపబడుచున్నది. అన్ని పాదములు 'అ'తో ఆరంభములై వడిని కలిగించుచున్నవి.

2) రాణులంతఃపురముల నుందురు. అవి సుందరములుగ నుండును. నగరమునకే అవి శోభను కూర్చుచుండును. జడమైన నగరమునకు జడమైన మరొక సుందరభవనముచేత శోభ యేర్పడవచ్చును. అమ్మవారి అంతఃపురము దేవాలయము. దానిచే కాంచీనగరమునకు శోభ యేర్పడినది. సమష్టిలోని యొక వ్యష్టిచే సమష్టికి శోభ యేర్పడును. అమ్మవారు కాంచీనగరదేవత. శోభ నొకచోటనుండి చేయుచున్నది.

3) కాంచీనగరమమ్మవారి కాంచియే. ఆమెచేతనే ఆ కాంచి కలంకారము. అమ్మవారు అ కాంచన కంచిలోని అద్భుతరత్నము.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు కాంచి నలంకరించుట చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారు శివునిచే లాలింపబడుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఉరరీకరోమి సన్తత-**
**మూష్మలఫాలేన లాలితం పుంసా।**
**ఉపకమ్పముచితఖేలన-**
**ముర్వీధరవంశసమ్పదున్మేషమ్॥ 35**

**ప్రతిపదార్థము :-**

ఊష్మలఫాలేన = అగ్ని ఫాలమందుగల;

| | |
|---|---|
| పుంసా | = పురుషునిచేత; |
| సంతతమ్ | = ఎల్లప్పుడు; |
| లాలితమ్ | = లాలింపబడిన; |
| ఉపకమ్పమ్ | = కమ్పానదీ సమీపమున; |
| ఉచితఖేలనమ్ | = తగిన ఆటలుగల; |
| ఉర్వీధరవంశసమ్పదున్మేషమ్ | = పర్వత వంశసంపదకు వికాసమైన అమ్మవారిని; |
| ఉరరీకరోమి | = అంగీకరించెదను. |

**తాత్పర్యము :-**

ఆవిరులు చిమ్ముచున్న ఫాలనేత్రముగల పురుషునిచే నిరంతరము లాలింపబడిన కమ్పానదీ తీరమున తగిన ఆటల నాడుకొను పర్వతవంశ సంపదకు వికాసము కలిగించిన అమ్మవారిని అంగీకరించెదను.

**వివరణము :-**

ఫాల మావిరులు కల దనగా ఫాలమందగ్ని యున్నట్లే. ఫాలమందగ్ని యున్నదనగా ముఖమునందగ్ని యున్నట్లే. కాని అగ్నిర్ముఖమ్ అగ్నియే పరమేశ్వరుని ముఖమను సూక్తియున్నది. మరియు **ముఖాదింద్రశ్చాగ్నిశ్చ** పరమేశ్వరుని ముఖము నుండి అగ్ని పుట్టినదని పురుషసూక్తము నందున్నది. అట్లే పరమేశ్వరుని కన్ను నుండి సూర్యుడు పుట్టినాడనియు పురుషసూక్తము చెప్పును. ముఖమంతయు నగ్నియే కావున కన్ను నుండి అగ్ని భేదమైన సూర్యుడు పుట్టుట ఉపపన్నమగు చున్నది. ఆ సూర్యుడు పుట్టుట కుడికన్నునుండి. అందువలన దక్షిణాక్షి పురుషోపాసనము. సూర్యోపాసనము సాన్నిహిత్యము కలిగియున్నవి. చక్షురింద్రియ మొక్కటే రెండు కన్నులనుండి పనిచేయునట్లు సూర్యుడే సూర్యచంద్రాగ్ని రూపమున శివుని ముఖమునందలి మూడుకన్నులలో పనిచేయుచున్నాడనియు లేక ఒకే అగ్ని త్రినేత్రములలో సూర్యచంద్రాగ్ని రూపమున పనిచేయుచున్నదనియు చెప్పవచ్చును. అందఱికి కన్నులు రెండే యుండగా శివునకు మూడవ కన్ను ఫాలమునందున్నది. అందఱు అజ్ఞానులు. శివుడు జ్ఞాని. ఫాలనేత్రము అందలి అగ్ని జ్ఞానమునకు ప్రతీకము. యోగదృష్టిలో జ్ఞానాగ్ని ప్రపంచ ప్రవిలాపము నొనరించును. ఇతిహాసమున శివుడు ప్రలయకాలమున మూడవకన్ను తెఱచి ప్రపంచమును బూడిద చేసినట్లు చెప్పును. ఊష్మమును చిమ్ము ఫాలముగల పురుషునిచే లాలింపబడుట అమ్మవారి సౌభాగ్యము. మరే పడతికి ఆ భాగ్యము కలుగలేదు. అమ్మవారు పుట్టుటచే పర్వతవంశ సంపదున్మేషము జరిగినది కావున ఆమెయే ఆ ఉన్మేషముగా చెప్పబడినది. ఒక్కొక్క బాలిక జన్మించిన పిదప ఆ వంశమున ఆ యింట సంపద పెంపొందుట జరుగుట హిమవంతునింట త్రైలోక్యసంపదయే ఉన్మేషము నందినది. తదుపాసనముచే యోగిలోకము ధన్యమైనది. భ్రూమధ్యమున జ్యోతిర్దర్శనమును యోగులు చేయగలుగుదురు. శివుడు మహాయోగి. ఆతని ఫాలమున జ్యోతియెప్పుడు దర్శనమిచ్చును.

ఆ జ్యోతిర్దర్శనముచే త్రిపురములైన కారణసూక్ష్మస్థూల దేహము లందభిమానము నశించును. ఆ జ్యోతీరూపకుండలిని శివుదు లాలించినాదు. ఇది పూర్వార్ధ వ్యంగ్యార్థము. ఆమె కుండలినీరూపకామాక్షి. కాంచి దగ్గఱ కమ్పానదీ తీరమున విహరించుచున్నది. తొలుత మూలాధారమున కుమారిగా కుండలినీ విహరించునని తరువాత పతి ప్రియమై సహస్రార చంద్రమండలి శివుని జేరుకొనుననియు తంత్రములు పేర్కొనును. ఆ కమ్పాతీర కాంచీ ఖేలనము మూలాధారమున తొలుతటి విహారములు శివుని యా లాలనము. సంతతము అనగా నిరంతము. పాదములన్ని యుకారారంభములై వడి కలిగియున్నది. చతుర్థ పాదమున పాదమధ్యమున కూద వడి యున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు శివునిచే లాలింపబడినదని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె శివుని అంకమునకే అలంకారమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ అఙ్కురితస్తనకోరక-**
**మఙ్కాలఙ్కారమేకచూతపతేః।**
**ఆలోకేమహి కోమల-**
**మాగమసంలాపసారయాథార్థ్యమ్॥ 36**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కోమలమ్ | = మృదువైన; |
| అంకురితస్తనకోరకమ్ | = అంకురించిన స్తనములను మొగ్గలుగల; |
| ఏకచూతపతేః | = ఏకామ్రేశ్వరునియొక్క; |
| అంకాలంకారమ్ | = అంకమున కలంకారమైన; |
| ఆగమసంలాపసారయాథార్థ్యమ్ | = వేదసంలాపముల సారసత్యమైన; |
| ఏకమ్ | = ఒకదానిని (అమ్మవారిని); |
| ఆలోకేమహి | = చూచెదము గాక. |

**తాత్పర్యము :-**

అంకురించిన చనుమొగ్గలుగల, ఏకామ్రేశ్వరుని అంకమునకు అలంకారమైన కోమలమైన వేదవాక్యముల సారసత్యమునొకదానిని చూచెదము గాక.

**వివరణము :-**

ఏకచూతపతి అను శబ్దము ఒక మామిడిచెట్టుయొక్క ప్రభువని యొక యర్థమును, ఏకైకమైన గొప్పదైన మామిడిచెట్టు అను మరొక యర్థమును ఇచ్చును. మొదటి యర్థము భర్తయైన ఏకామ్రేశ్వరునొడి కలంకారమమ్మవారు. ఆమెకు మొలచిన మొగ్గలవంటి స్తనములున్నవి. ఆమె లేత వయస్సు కలది. అనుభవము నొసగుటకు

రెండవ యర్థము శివుడొక మోక్షఫలకమైన గొప్ప మామిడిచెట్టు. ఆయన సమీపమున అమ్మవారు కోమలలతయై యున్నది. ఆ లతకు స్తనములు మొగ్గలై యున్నవను భావము నొసగుటకు కారణమగును. మొదటి భావమున ఉపమాలంకారము, రెండవ భావార్థమున రూపకాలంకారము స్ఫురించును. వాక్కునకు సారము సత్యము. అసత్యవాక్యము నిస్సారము. ఆ వేదముల సారమమ్మవారు. ఆమెను అట్లు గుర్తించని వారు సారమును గ్రహింపని వారు. వారి వాక్కులయథార్థములు. నాలుగు పాదములు ఆ కారాదులై వడి కలిగియున్నవి. అంకాలంకారమను సమాసమున, ఏకమ్, ఆలోకేమహి అను పదములలో వృత్త్యనుప్రాసమను శబ్దాలంకారమున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారు **శివుని అంకాలంకార** మని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె **శివుని మూలధన**మని చెప్పబడుచున్నది.

**శ్లో॥ పుఞ్జితకరుణముదఞ్చిత-**
**శిఞ్జితమణికాఞ్చి కిమపి కాఞ్చిపురే।**
**మఞ్జరితమృదులహాసం**
**పిఞ్జరతనురుచి పినాకిమూలధనమ్॥ 37**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| పుంజితకరుణమ్ | = ఘనీభవించిన దయయైన; |
| ఉదంచిత శింజిత మణికాంచి | = పూజనీయ ధ్వనిగల మణి కాంచిగలదైన; |
| మంజరిత మృదుల హాసమ్ | = చిరునవ్వు గుత్తిగా చేసికొన్న; |
| పింజరతనురుచి | = పింజరవర్ణదేహకాంతిగల; |
| కిమపి | = ఒకానొక; |
| పినాకిమూలధనమ్ | = శివుని మూలధనమును; |
| కాంచిపురే | = కాంచిపురియందు; |
| అస్తి | = ఉన్నది. |

**తాత్పర్యము :-**

అమ్మవారు పుంజీభూత దయ. మణిమయకింకిణుల మంజుల ధ్వనిగల కాంచిగలది. ఆమె నవ్వు పూలగుత్తియే. ఆమె తనువు పింజర వర్ణకాంతిగలది. ఆమె శివునియొక్క మూలధనము.

**వివరణము :-**

మూలధనమింత యుండవలెనని, అంతకు మించినది దానధర్మ వ్యాపారాదులకు వినియోగించవలెనని గృహయజమాని నిర్ణయించుకొనవలెను. సామాన్య అవసరములకు వ్యాపారాదులచే నార్జించిన ధనమును వినియోగించు కొనవచ్చును.

కాని మూలధనమును వినియోగింపరాదు. మూలధనమనగా కొందఱి పెట్టుబడి, ధనము, మూలధనమని దానివలన వచ్చు వడ్డి లాభము మొదలయినవి గృహావసరములకు వినియోగించవలెను. వీలైనప్పుడల్లా మూలధనమును పెంచుకోవలెను. మరికొందఱి దృష్టిలో మూలధనమనగా నిట్టిది. మూలధనము నితరుల కెవ్వరికి కంటబడకుండ తెలియబడకుండ కాపాడుకొనబడిన ధనము. ఇది మఱికొందఱి దృష్టిలో మూలధనము. అందఱి దృష్టిలోను మూలధనము సురక్షితముగా నుంచుకొనదగినది. శివునకు మూలధనము కామాక్షీదేవి. ఆమెను అర్ధదేహముగా కాదు ఆత్మగా శివుడు చూచుకొనును. పినాకమని శివుని ధనువునకు పేరు. ఇతరుల ధనువునకు ఆ పేరు లేదు. కావున శివుడే పినాకి. నాలుగుపాదములలో ఆదిప్రాసమున్నది. మణికాంచి, కాంచిపురే అను పదములలో ముక్తపదగ్రస్త మను శబ్దాలంకార మున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు శివుని మూలధనమని చెప్పబడినది. ఈ శ్లోకమున **సౌందర్యామృతమాల** యని చెప్పబడినది.

**శ్లో॥ లోలహృదయో౽స్మి శమ్భో-**
**ర్లోచనయుగలేన లేహ్యమానాయామ్।**
**లాలితపరమశివాయాం**
**లావణ్యామృతతరఙ్గమాలాయామ్॥ 38**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| లాలితపరమశివాయామ్ | = లాలింపబడిన పరమశివుడుగల; |
| శమ్భోః | = శివునియొక్క |
| లోచనయుగలేన | = రెండుకన్నుల చేత; |
| లేహ్యమానాయామ్ | = నాకబడుచున్న; |
| లావణ్యామృతతరంగమాలాయామ్ | = సౌందర్యమను అమృతముయొక్క తరంగముల మాలెయందు; |
| లోలహృదయః | = ఆసక్తమైన హృదయముగలవాడనై; |
| అస్మి | = ఉన్నాను. |

**తాత్పర్యము :-**

పరమశివుని లాలించు, ఆతని రెండు కన్నులచే నాకబడుచున్న సౌందర్యామృత తరంగముల మాలెయైన అమ్మవారి యందు ఆసక్తమైన హృదయముగలవాడనైతిని.

**వివరణము :-**

1) సాధారణముగా భర్త పెద్దవాడు, భార్య చిన్నది. కావున భర్త భార్యను

లాలించవలెను. భర్త బయట ఒత్తిడులకు గురియై ఇంటికి వచ్చినపుడు భార్య కూడ అతనిని లాలించవలెను. 35వ శ్లోకమున శివుడు అమ్మవారిని లాలించు నట్లున్నది. ఈ శ్లోకమున అమ్మవారే శివుని లాలించినట్లు చెప్పబడినది.

2) ఖాద్య పదార్థములు కంటికందముగా కనబడిన మంచిదే. ఒకవేళ అవి అట్లు కనబడక పోయినను నాలుకకు అంటించుకొన్నప్పుడు రుచి యనిపించవలెను. ఆ రుచియే ఖాద్య పదార్థముల అందము అని చెప్పనగును. రుచి యనునది ఉప్పన, పులుపు, వగరు, చేదు, కారము, తీపి అను ఆఱు విధములుగా నుండును. ప్రకృతి యందు ఉప్పు అధికముగా లభించును. దాని రుచి ఉప్పన. అన్ని రుచులు కలిసియున్న పదార్థములు మన శరీరమునకు ఆవశ్యకములు. ముఖ్యముగా తీపిగల పదార్థములు ఉప్పుగల పదార్థములు ఎక్కువ ఆవశ్యకములు. అట్లని వానిని అవసరమునకు మించి తీసికొనరాదు. పదార్థములను వండి తినవలసి వచ్చినపుడు వానిలో ఉప్పు తప్పక కలుపవలసి యుండును. అట్లు కలిపిన అవి ఎక్కువ కాలము నిలువ యుండును. ఉప్పులేని కూర యొప్పదు అని యెవరో యొక కవి యన్నాడు. **'పదునుగ మంచికూర నలపాకము చేసిననైన నందు నింపొదవెడు నుప్పు లేక రుచి పుట్టదు'** అని భాస్కరకవి యన్నాడు. అనగా కూర కందమును, రుచిని యిచ్చునది ఉప్పు అని ఆతని అభిప్రాయము. ఖాద్యముల కందము రుచియని ఈ వఱకే చెప్పితిని. అందమును సంస్కృత భాషలో లావణ్యము అందురు. లావణ్యము అను శబ్దము దృశ్య పదార్థముల అందమునకు అర్థవిస్తృతిచే వాచకమైనది. చూచుట యనునది యొక విధముగా కంటి(చూపు)లో నంటిన అందము తెలియును. నాలుకతో తెలియదగినది ఖాద్య పదార్థముల లావణ్యము తెలియదగినది. లావణ్య శబ్దముయొక్క యోగార్థము ఉప్పన రూఢ్యర్థము అందము అనగా లావణ్యము భక్ష్యభోజ్య లేహ్యచోష్య రూప చతుర్విధాహారముల లోనను సర్వవిధ ఖాద్యములలోనను ఉండదగినది అని సారాంశము. అమృతము తీయనిది కావున నాలుక కంటించుకొనదగినది. లావణ్యము కంటి కంటించుకొన దగినది. ఈ కవి లావణ్యామృతము కంటి(చూపు) కంటించుకొనదగినది (కంటితో నాకదగినది) అను అర్థము నొసగు లేహ్యమాన శబ్దమును ప్రయోగించినను అమ్మవారు లావణ్యామృత తరంగముగా చెప్పబడినది. అది కంటితో నాకదగినది అని చెప్పబడినది.

3) నాలుగు పాదములు **ల** కారారంభము కలిగి వడిని, లకార బాహుల్యము కలిగి వృత్త్యనుప్రాసమును కూర్చుకొన్నవి.



**అవ:-** పై శ్లోకమున అమృతప్రస్తావన మున్నది. ఈ శ్లోకము మధు శబ్దముతో నారంభింపబడినది.

శ్లో॥ మధుకరసహచరచికురై-
ర్మదనాగమసమయదీక్షితకటాక్షైః।
మణ్డితకమ్పాతీరై-
ర్మఙ్గళకన్దైర్మమాస్తు సారూప్యమ్॥ 39

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| మధుకరసహచరచికురైః | = తుమ్మెదల పోలికగల ముంగురులు కల; |
| మదనాగమసమయదీక్షితకటాక్షైః | = మదన శాస్త్ర సిద్ధాంతాచారములందు దీక్షగైకొన్న; |
| మండితకమ్పాతీరైః | = కమ్పాతీరము నలంకరించిన; |
| మదనాగమసమయదీక్షితకటాక్షైః | = కాదివిద్యా సమయ దీక్షితములైన చూపులుగల; |
| మంగలకందైః | = మంగలములకు జన్మహేతువైన అమ్మవారితో; |
| మమ | = నాకు; |
| సారూప్యమ్ | = సమానరూపత; |
| అస్తు | = కలుగుగాక. |

**తాత్పర్యము :-**

అమ్మవారి ముంగురులు తుమ్మెదల వంటివి. ఆమె కటాక్షములు మదనాగమ సమయదీక్షితములు. అమ్మవారు కమ్పాతీరము నలంకరించినది. మంగలములకు కందములైన అమ్మ వారి సారూప్యము నాకు కలుగుగాక.

**వివరణము :-**

మదనాగమ మనగా కాదివిద్యాశాస్త్రము అని యొక యర్థము. వాత్స్యాయనాద్యుపబృంహితమైన కామశాస్త్రము అని మరియొక యర్థము. తదుభయమునందు అమ్మవారి కటాక్షములే మొదలు దీక్ష తీసికొని శివునుపాసించి ఆతనిని సాక్షాత్కరించుకొన్నవి. ఆ కటాక్షములకు పాత్రులైన శాక్తేయులలో కొందఱు కాలదీక్షను, కొందఱు సమయదీక్షను తీసికొన్నవారు. అమ్మవారి కటాక్షములే సమయదీక్షితులకు పరమాచార్యములు. అవి కామాక్షీదేవి కన్నులలోని కామునినుండియే సమయదీక్ష తీసికొన్నందున ఆ కటాక్షములు సమయ దీక్షితములు. కాలదీక్షితులకు పరమాచార్యులెవ్వరో మూకకవి చెప్పలేదు. అట్లు చెప్పకపోవుటచే నాకవికి కాలదీక్షితులకన్న సమయదీక్షితులం దాదరమెక్కువ యున్నదని, ఆ కవి స్వయముగా సమయదీక్షితుడు కావచ్చునని యూహించు కొనవచ్చును. కామాక్షీదేవి కాదివిద్యారూపిణి. కామాక్షి శబ్దము కూడ కాది. అట్లే కాలీదేవియు కాదివిద్యారూపిణి. కాలీ శబ్దము కూడ కాదియే. కౌలమతమున కూడ కాదివిద్యోపాసకులున్నారు. కామాక్షీదేవి యేదో యొక సమయమున సమయాదేవిగా అవతరించినది. శ్రీ శంకరులు సౌందర్యలహరిలో **సహసమయయా లాస్యపరయా** అని ఆ సమయాదేవి లాస్యపర అని చెప్పినారు. కావున

శంకరులు సమయదీక్షితులు. తత్పితాచార్యులలో నొకరైన మూకుల కాదీక్ష పరమ్పరాలబ్ధము. శంకరుల పరమగురువులు సుభగోదయస్తుతిలో సమయమతమును బహుధా ప్రశంసించిరి. కౌలమతమును నిరసించిరి. పర్యాయశబ్దవాచ్యలైన కాళీదేవియు సమయాదేవియు కామాక్షీదేవియొక్క యవతారములైనను వారి నుపాసించు వారిలో పెక్కుమత భేదము లేర్పడి ఆయా మతములందత్యధికాభిమానములతో ఒకరు మరొకరి మతముల నిరసించి స్వమతముల ప్రశంసించిరి. కౌలులు మూలాధార స్వాధిష్ఠానములలో అమ్మవారి నుపాసింతురని ఆ చక్రములు తమోమయములు కావున వారు తామసులని గౌడపాదులు వారిని నిరసించిరి. కౌలపరమాచార్యులను ప్రసిద్ధిని పొందిన భాస్కరులు (భాసురానందనాథులు) తమ లలితాసహస్రనామ **సౌభాగ్యభాస్కర** నామకభాష్యమున కౌలసమయమతభేదముల చక్కగా వివరించినారు.

1) కౌలులు బాహ్యాకాశమున శ్రీ చక్రమును కల్పించుకొని యుపాసించెదరు. 2) కౌలులు మూలాధారస్వాధిష్ఠానములలో అమ్మవారి నుపాసించెదరు. సమయులు మణిపూరమాదిగ నూర్ధ్వ చక్రములలో అమ్మవారి నుపాసించెదరు. 3) కౌలులు కులార్ణవాది గ్రంథములను ప్రమాణముగా అంగీకరించెదరు. సమయులు వసిష్ఠశుకసనకాదిరచిత **శుభాగమపంచకము**ను ప్రమాణముగా స్వీకరించెదరు. 4) మద్యమాంసాది నివేదనమును కౌలు లొనరించెదరు. దానిని భాస్కరులు ఖండించక పోవుటచేత సమయమతస్థులలో నొకరు భాస్కరమత ఖండనగ్రంథమును రచించుటచేతను, సమయులైన సింహంభట్ల రామమూర్తిశాస్త్రి ప్రభృతులు మద్యమాంసాది నివేదనమును భాస్కరులు సమర్థించుటను విమర్శించుటచేతను భాస్కరులు కౌలపక్షపాతము వహించెనని చెప్పవచ్చును. ఇంతేగాక భాస్కరులు కౌలిక ప్రమోదము కొఱకు తమ గురువులు ఛల సూత్రములపై వ్రాసిన పరిభాషలకు సౌభాగ్యభాస్కరమును వ్రాసినందున భాస్కరులు కౌళులే యనుట నిస్సందేహము. లలితాసహస్రనామ స్తోత్రముయొక్క భాస్కరపాఠమే జగద్గురు పీఠములలో నేటికిని ఆదరింపబడుట చేత అతడు సమయి యని కొందరు భ్రమించుటచే నీవిషయమింతగా వ్రాయవలసి వచ్చినది. సమయులు మద్యమాంసాదులను అమ్మవారికి నివేదించరు. సమయమతాను కూల **లలితాసహస్రనామ జయమంగళ పాఠము** (నాచే ముద్రించబడినది)న సుమారు నూరుభేదములున్నవి. కొన్ని భాస్కర పాఠములు సర్వదా దుష్టములు. సమయాచారానుసారము మణిపూరమున పాద్యాది భూషణాంతోపచార సమర్పణము కావింపవలెను. అనాహతమున తాంబూలాంతోపచారసమర్పణము చేయవలెను. విశుద్ధియందు దక్షిణా సమర్పణము చేయవలెను. ఆజ్ఞయందు నీరాజనము సమర్పించవలెను. ఆ తరువాత అమ్మవారిని సహస్రారమునకు బంపి అటు శివునితో నామెకు సంయోగమును భావించి వారికడ్డముగా నొక తిరస్కరిణి యున్నట్లు భావించి సాధకుడు ప్రక్కింట కొంతకాలము (వారి సమాగమము పూర్తి అయి అమ్మవారు బయటకు వచ్చువఱకు) వసించి మరల తన గృహమున కొచ్చినట్లు భావింప వలెను. ఇది

సమయాచారము అని భాస్కరులు వివరించినారు. అమ్మవారితో సారూప్యమును మూకకవి **మమాస్తు సారూప్యమ్** అని కోరుకున్నారు. సారూప్యమొకవిధమైన ముక్తి. ముక్తిభేదములో నొకటి సారూప్యముక్తి యనగా అమ్మవారి రూపముతో సమానమైన రూపము నుపాసకుడు పొందుట. ఇది అమ్మవారి లోకమునకు పోయిన వారికి కోరుకొన్నచో లభించునట్టిది. అమ్మవారి లోకమునకు పోవుట సాలోక్యముక్తి. అమ్మవారి లోకమున ఆమెకు దగ్గఱగా నుండుట సామీప్యముక్తి. అమ్మవారి శరీరావయవ భూషణాదులలో చేరుట సాయుజ్యయని కొందఱి మతము. మరికొందఱు అమ్మవారితో నభేదమును పొందుటయే సాయుజ్యముక్తి యందురు. జగద్వ్యాపారవర్జమైన అమ్మవారి అణిమాది బహువిధైశ్వర్య ప్రాప్తి సార్ష్టిముక్తియని కొందఱు చెప్పెదరు. ఈ యన్ని ముక్తుల కన్న మిన్న అమ్మవారి ఆత్మతో సాధకుని ఆత్మయొక్క అభేదము సిద్ధించుట కైవల్యముక్తి యనబడును. నాలుగుపాదములు మకారాదులు కావున వడి కలసి యున్నవి.



**అవ:-** పై శ్లోకము మధుశబ్దముతో నారంభింపబడినది. మధువు వదనారవింద నిష్ఠము కావున ఈ శ్లోకము వదనారవింద యను సమాసముతో నారంభింపబడు చున్నది.

**శ్లో॥ వదనారవిన్దవక్షో**
**వామాఙ్కతటీవశంవదీభూతా।**
**పురుషత్రితయే త్రేధా**
**పురన్ధ్రిరూపా త్వమేవ కామాక్షి॥ 40**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ! |
| త్వమ్ ఏవ | = నీవే; |
| పురుషత్రితయే | = ముగ్గురు పురుషులందు; |
| వదనారవిందవక్షోవామాంకతటీ -వశంవదీభూతా | = ముఖ కమలమున, వక్షమున, వామాంకతటమున, వశంవద యైనదానవై |
| త్రేధా | = మూడు విధములుగా; |
| పురంధ్రిరూపా | = స్త్రీరూపములుగల దానవైనావు. |

**తాత్పర్యము :-**

ఓ కామాక్షీదేవీ! ముగ్గురు పురుషుల వదనారవిందవక్షోవామాంక తటములలో పరవశవై మూడు విధముల స్త్రీ రూపముల ధరించి యున్నదానవు నీవే.

**వివరణము :-**

బ్రహ్మముయొక్క ముఖమున సరస్వతీదేవిగా, విష్ణువుయొక్క వక్షమున

లక్ష్మీదేవిగా, రుద్రునియొక్క వామాంకతటమున కాళీదేవిగా నున్నదానవు నీవే. పురుషులెందఱున్నను ముగ్గురు మూర్తులను అనగా బ్రహ్మవిష్ణురుద్రుల మించిన పుణ్యపురుషులు ఇతరులెవరు లేరని, పరశివుడే ఈ త్రిపురుషత్వమునందినాడు కావున పరశివుని యర్ధాంగియైన కామాక్షీదేవి తాను పురంధ్రీత్రయముగా నవతరించినది. ఈ త్రిపురంధ్రులు త్రిపురుషులు మొత్తము ఏర్పడిన దమ్మవారి కామము అనగా ఇచ్ఛ చేతనే అని కామాక్షి యను సంబోధము సూచించుచున్నది. పూర్వార్ధమున వకారబాహుల్యముచే వృత్త్యనుప్రాసమేర్పడినది. ఉత్తరార్ధపాదముల ఆదిలో వడియు ప్రాసయును నున్నవి.



**అవ:-** పై శ్లోకమున ఆజ్ఞాకమల స్థానమైన వదనము, అనాహత కమల స్థానమైన వక్షము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున ఆధారాది కమలములందు అమ్మవారు విహరించునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ బాధాకరీం భవాబ్ధే-**
**రాధారాద్యమ్బుజేషు విచరన్తీమ్।**
**ఆధారీకృతకాఞ్చీం**
**బోధామృతవీచిమేవ విమృశామః॥ 41**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| భవాబ్ధేః | = సంసారసముద్రమునకు; |
| బాధాకరీమ్ | = బాధను కలిగించు; |
| ఆధారాద్యమ్బుజేషు | = ఆధారము మొదలైన కమలములందు; |
| విచరంతీమ్ | = బాగుగా తిరుగు; |
| ఆధారీకృతకాంచీమ్ | = ఆధారముగా జేసికొనబడిన కాంచీనగరముగల; |
| బోధామృతవీచిమ్+ఏవ | = జ్ఞానామృత తరంగమునే; |
| విమృశామః | = చింతించెదము. |

**తాత్పర్యము :-**

సంసారసముద్రమును బాధించు ఆధారాది కమలములలో విహరించు కాంచీ నగరము నాధారముగా చేసికొన్న జ్ఞానామృతతరంగమునే చింతించెదము.

**వివరణము :-**

సంస్కృత భాషలో బాధ శబ్దమునకు నాశమను అర్థమున్నది. బాధా శబ్దమునకు పీడయను నర్థమున్నది. అమ్మవారు భవాబ్ధికి నాశమునే కలిగించగలదు. దాని సమూలనాశమే సాధకులకు కావలెను. దానికి బాధ కలిగించుట అక్కఱలేదు. ఇక్కడ **బాధకరీమ్** అని యుండుటయే ఉచితము. బాధాకరీమ్ అనుట ఛందోనుగుణమే

కాని అర్థానుగుణము కాదు. కావున బాధమును అనగా నాశమును ఆ అనగా పూర్తిగా కరీమ్ అనగా కలిగించునది అని అర్థము చెప్పికొని బాధాకరి యను బాధాకర ప్రయోగమును సమర్థించుకొనవలెను.

2) ఆధారకమలము (మూలాధార కమలము) స్వాధిష్ఠానకమలము, మణిపూర కమలము, అనాహతకమలము, విశుద్ధికమలము, ఆజ్ఞాకమలము అను ఆఱు కమలములు ఆరోహణక్రమమున అనగా గుదము నుండి వదనము వఱకు వేఱు వేఱు స్థానములలో నుండును. శిరమున సహస్రారకమలముండును. ఈ కమలములలో అమ్మవారు విహరించును. ఇవి ప్రతి మనుష్యుని యందుండును కాని యోగులు మాత్రము ఈ కమలములలో కుండలినీశక్తి విహరింపజేయుదురు. మొదటి ఆఱు కమలములలో జీవరూపముగా నున్న కుండలినీశక్తి సహస్రారమున శివైక్యము నందును. జీవకుండలిని ఒక్కొక్క కమలముల జంటను దాటుచు ఒక్కొక్క అభిమానమును వీడుచు చివఱకు ఆజ్ఞాకమలమును దాటునప్పుడు జీవభారమును పూర్తిగా వీడి సహస్రారమున శివైక్యము నందును. జీవునకు దేహత్రయాభిమానము అవస్థాత్రయాభిమానమును ఉండవు. ఈ దేహత్రయావస్థాత్రయములు వ్యష్టిసమష్టి భేద భిన్నములై యుండును. ఆధారీకృతకాంచీమ్ అను సమాసముచేత కాంచీనగరము భారతమాత కాధారకమలముగా నున్నదని వ్యంజితమగును. శివుడు బోధామృత సముద్రము. అమ్మవారు బోధామృత వీచి. వీచి, సముద్రములకు భేదము నంగీకరించి శివశక్తులలో శివుడు పురుషుడని సముద్రుడని, శక్తి స్త్రీయని వీచి యని వ్యవహారములు చేయబడినవి. అంతే తప్ప ఆస్వాదమున శివశక్తులకు భేదము లేదు. కామాక్షీదేవి వీచియైనచో ఏకామ్రేశ్వరుడు సముద్రము. ఒకటి అమృతవీచి, ఇంకొకటి అమృతసముద్రము. వారిరువురు బోధస్వరూపులే, అమృతస్వరూపులే, బోధామృతస్వరూపులే. విమృశామః అనుటచే శ్రీ కామాక్షీదేవి విమర్శరూపిణి యని వ్యంగ్యమగుచున్నవి. బోధమనగా ప్రకాశము. శివుడు ప్రకాశసముద్రము. తద్విమర్శము తదాస్వాదము శ్రీకామాక్షీదేవి. ప్రకాశము ధర్మి, విమర్శ ధర్మము. ధర్మిధర్మముల కభేదము. ఒకదానిని విడచి మరొకటి యుండవు. సముద్రమును విడచి తరంగము, తరంగమును విడచి సముద్రముండదు.

3) నాలుగు పాదములలో ఆదిప్రాసమున్నది.



**అవ:-** వీచి సముద్రముల వంటివి కలా చంద్రబింబములు. పై శ్లోకమున అమ్మవారు బోధామృతవీచి యని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె **శశధర కలాంకిత మౌళిగా** చెప్పబడుచున్నది.

**శ్లో॥ కలయామ్యన్తః శశధర-**
**కలయాఙ్కితమౌలిమమలచిద్వలయామ్।**

అలయామాగమపీఠీ-
నిలయాం వలయాఙ్కసున్దరీమమ్బామ్॥42

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| శశధరకలయా | = చంద్రకలచేత; |
| అంకితమౌలిమ్ | = చిహ్నితమైన శిరముగల; |
| అమలచిద్వలయామ్ | = స్వచ్ఛమైన చైతన్యముతో చుట్టబడిన; |
| అలయామ్ | = లయములేని; |
| ఆగమపీఠీనిలయామ్ | = ఆగమమనెడి పీఠికయే నిలయముగాగల; |
| వలయాంకసుందరీమ్ | = వలయముల గుర్తులుగల శివుని కాంతయైన; |
| అమ్బామ్ | = అమ్మను; |
| అంతః | = లోపల; |
| కలయామి | = ధ్యానించెదను. |

**తాత్పర్యము :-**

చంద్రకలాం చిహ్నితమైన శిరముగల స్వచ్ఛచైతన్యముచే చుట్టబడిన లయరహితమైన ఆగమపీఠికయందు నివసించు కడియముల చిహ్నములుగల శివుని కాంతయైన అమ్మను మనము లోపల ధ్యానించెదము.

**వివరణము :-**

1) వలయమనగా వృత్తము. దానిలో ఏ రెండు బిందువుల కలుపురేఖ యైనను కల యనబడును. వృత్తము ఘనమైనచో గోళమనబడును. దానిలోని యేభాగమైనను కలయే. కల యనగా అంశము. చంద్రబింబము 360 డిగ్రీలుగల వృత్తము. దానిలోని పదేనవభాగముకల వృత్తముయొక్క రేఖ. మొత్తమునొక కలగా భావించి దానిని గూడ కలిపి కల యనగా పదారవభాగమని చెప్పబడినది. పదేనుదినములలో దినమొక భాగము పెరిగి పూర్ణిమనాడు చంద్రబింబము పూర్ణ(వృత్త)మగును. అమ్మవారు చిద్వలయము చుట్టును చైతన్యము కలది. ఇంతకు ముందు మొత్తము వృత్తరేఖ అమ్మవారే అని చెప్పబడినది. కావున అమ్మవారు చిద్వలయ చంద్రబింబమున మలము (మచ్చ) ఉన్నది కాని చిద్వలయమైన అమ్మవారిలో మచ్చలేదు. కావున అమ్మవారు అమలచిద్వలయమై యున్నది. లయకాలమందమ్మవారుండును. అన్నింటిని లయమొనర్చును. లయమొనర్చుటకు ఒకరు ఉండవలెను గదా! లయకర్త ఒకరున్నాడు సరే ఆ లయకర్త ఉన్నాడు, లయము జరిగినది అనుటకు ఒక సాక్షి కావలెను. ఆ సాక్షి వలయాంకుడు అనగా శివుడు. లయకర్త లయసాక్షి వేరుగా నుండనక్కఱలేదు. ఒకరే కావచ్చును. లయమును చేయునది ఒక శక్తి. సృష్టి మొదలగు అన్ని పనులు చేయునది కూడ ఒక శక్తియే. సృష్టిశక్తి పాలనశక్తి లయశక్తి, ఇత్యాది శక్తులు భిన్నములని కూడ చెప్పనక్కఱలేదు.

ఆ శక్తులన్నియు నొకటే. అది శివుని కన్న వేరుగా లేదు. శివుడు సృష్టి చేసినప్పుడాతనికి సృష్టిశక్తి యున్నదని, పాలించగలిగినపుడు పాలనశక్తి యున్నదని, లయము చేయునప్పుడు లయశక్తి యున్నదని మనము గుర్తింతుము. కాని ఆ శక్తి ఎవరికి కనబడదు. అది అనుమేయముగానే ఉండును. ఒకడున్నాడనగా వానికి ఉనికి యున్నదని అర్థము. ఆ ఉనికి(సత్త) కూడ శక్తియే. ఆతడు తెలిసినవాడు అనగా ఆతనికి తెలివి (జ్ఞానము) యున్నదని యర్థము. ఆ తెలివిశక్తి. ఆతడు కర్తయనగా ఆతనికి క్రియ ఉన్నదని అర్థము. ఆతనికి (సృష్టిస్థితిలయాదులచేయు) క్రియాశక్తి యున్నదని అర్థము. ఆతడు ఆనందించును. అనగా ఆనందము అను శక్తి ఆతనికి ఉన్నదని అర్థము. ఈ విధముగా అమ్మవారే సత్త, జ్ఞానము ఆనందము అయి ఉన్నది. తెలిసినది, ఆనందించునది అన్నప్పుడు సత్తయే జ్ఞానమై ఆనందమై అదిగలవాడు అన్నపుడు అది వేరై శక్తి శివ భేదవ్యవహారము కలుగును. అమ్మవారు చిద్వలయ. ఆ చిద్వలయమెవరికున్నదో వాడు వలయాంకుడు. ఆతనిలోని చిద్వలయము అమ్మవారు. ఈ విధముగ అమ్మవారు **వలయాంకసుందరి** యనబడును. వలయము అనునది ఒక భూషణము. దానిని కడియము అని యందురు. కాలికి వేసికొన్నది కాలికడియము (మంజీరము). చేతికి వేసికొన్నది చేతికడియము (కంకణము) నడుమునకు చుట్టుకొన్నది ఒడ్డాణము (కాంచీ), భుజదండమునకు వేసికొన్నది దండకడియము (అంగదము). ఏకామ్రేశ్వరునకివి యన్నియు నున్నవి. ఉత్సవములలో ఆ భూషణములాయనకు ధరింపజేయుదురు. అందుచే ఆతడు వలయాంకుడు. చిత్తునకు వలయాకారమున్నదనుట ఒక కల్పనము. అది వలయాకారముచే గుర్తింపబడునప్పుడు ఆమెయే వలయాంక యగును. ఆమెయే సుందరియగును. కాని యీ శ్లోకమున కవి తాత్పర్యము వలయాంకుడు శివుడని ఆతని సుందరి శ్రీకామాక్షీదేవియను భేదవ్యవహారమే ప్రస్తుతము కవిచేత ఉద్దిష్టము అని గమనింపవలెను. చిద్వలయ వలయాంకసుందరి అను రెండు శబ్దములు ప్రయోగించినందున మూకకవి యుద్దేశమదియే. అంకశబ్దమునకు అంకె అను అర్థమును గ్రహించి శ్రీకల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులవారు వలయాంక సుందరి అను శబ్దమును పూర్ణాంక స్వరూపముగాగలది అని చెప్పినారు. సున్నయే పూర్ణాంకము. ఆ పూర్ణాంకము అన్ని అంకెలకు అతీతముగా నుండును. అన్ని అంకెలు సృష్టిలోనివి. ఆమె వానికతీత యని వారి భావము కావచ్చును. వలయము అనగా చుట్టు ఉండునది. ఒక వస్తువుని మూసివేయునప్పు డేదేని మరొక వస్తువుతో దానిని మూయుటకు మూసివేయబడినది మూసివేయునది అని రెండు పదార్థములుండవలెను. మూసివేయబడినది చిత్తు. దానిని మూయునది శ్రీ కామాక్షీదేవి. మూయుదానిని ఆవరణము అందురు. అమ్మవారు శివజ్ఞానమును దాచియుంచును. కావున అమ్మవారు ఆవరణము. జగత్తంతయు శివునకు ఆవరణము. జగత్తును తొలగించినచో శివుడు కన్పించును. శివుడు కన్పించకుండ ఆవరణముగా ఉండి చిద్రూపముగా తానే కనబడుచున్నది. అందువలన అమ్మవారు చిత్తు అను శివుని చుట్టి ఆవరణముగా

(వలయము) నున్నది కావున అమ్మవారు **చిద్వలయ.** శివుడు వలయాంకుడు. ఆ వలయాంకుని కామె సుందరి కావున ఆమె వలయాంక సుందరి. ఇట్లు శివుని మూసి జీవుని భ్రాంతింపజేయుట ఆవరణము తొలగించి జీవుని శివునిగా జేయుట అమ్మవారి ఆట, ఆమె వినోదము. పూర్వార్ధమున కలయా రెండు పాదముల ఆదిలో ద్విరావృత్తమైనది. కావున ఇచట పాదాదియమకము అను శబ్దాలంకారమున్నది. ఉత్తరార్ధమున పాదాదిప్రాస మున్నది.

2) అమ్మవారు **శశధరకలయాంకితమౌలి** యని చెప్పబడినది. అమ్మవారి శిరసున చంద్రకల యున్నదని దాని యర్థము. శశమనగా కుందేలు, దాని ధరించినవాడు శశి లేక శశధరుడు. చంద్రబింబములోని మచ్చ కుందేలు వంటి ఆకృతిగలదని భావించి చంద్రుని శశధరుడనుచున్నారు. మృగమని భావించి మృగాంకుడు మృగధరుడు అని చెప్పుదురు. మృగమనగా జింక. ఆ మచ్చ జింక యని భావించి చంద్రునా పేర్లతో చెప్పుదురు. శివుని పదిచేతులలోని యొక చేతిలో జింకయుండును. అందువలన శివునకు కూడ మృగధరుడని పేరున్నది. మృగధరశబ్దమే కాక సోమశబ్దము చంద్రునితో పాటు శివుని బోధించును. సహస్రారచంద్రుని శివుడనుట గూడ తాంత్రిక (యోగి) వ్యవహార సిద్ధము. కుండలినీ చంద్రవేధము అమ్మవారి శివుని సంభోగముగా కూడ చెప్పబడును. శశధర అనగా చంద్రుడు, శశధరకల అనగా చంద్రకల. శశధరకలను శివుడు శిరసున ధరించును. శివుని అర్ధశరీరమగుటచే శశధరకల అమ్మవారి శిరముపై కూడ నుండును. మరొక విధముగా శశధరమండలము శివస్వరూపము కల అమ్మవారు కుండలినీ స్వరూపము. శివుడు యోగీశ్వరుడు కావున ఆతని సహస్రారచంద్రుని యందు కుండలినీవేనము జరుగుచుండును. అట్లే అమ్మవారు యోగీశ్వరి. ఆమె సహస్రారచంద్రుని యందును కుండలినీవేనము జరుగుచుండును. ఇరువురి సహస్రారములందు శివశక్త్యైక్యానందామృతాస్వాద ముండును. ఆ శివశక్తులు బాహ్యరూపైక్యము నెట్లు కలిసియున్నారో యోగ భూమికలలో కూడ నా యైక్యము ననుభవించుచున్నారు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారికి లయము లేదని అలయామ్ అను పదముచే చెప్పబడినది. లయముగలవారికి గర్వముండకూడదు. అది నిష్ప్రయోజనము. లయములేనివారెవరైన ఉన్నచో వారికి గర్వముచితము. శివుడు లయము చేయునేగాని ఆయనకు లయము లేదు. ఆయన గర్వముచితము. ఈ శ్లోకమున అమ్మవారే ఆ శివుని గర్వముగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ శర్వాదిపరమసాధక-
గుర్వానీతాయ కామపీఠజుషే।
సర్వాకృతయే శోణిమ-
గర్వాయ సమర్ప్యతే హృదయమ్॥ 43**

ప్రతిపదార్థము :-

| | |
|---|---|
| శర్వాది పరమ సాధక గుర్వానీతాయ | = శివుడు మొదలైన పరమసాధక గురువులచే తేబడిన; |
| కామపీఠజుషే | = కామపీఠమును పొందిన; |
| సర్వాకృతయే | = అన్ని ఆకృతులుగల; |
| శోణిమగర్వాయ | = ఎఱుపుగర్వము కొఱకు; |
| హృదయమ్ | = మనస్సు; |
| సమర్ప్యతే | = సమర్పింపబడుచున్నది. |

**తాత్పర్యము :-**

శివాది పరమసాధకగురువులచే తేబడిన కామపీఠమున పొందిన అన్ని ఆకృతులుగల ఎఱుపు గర్వమనదగిన అమ్మవారికి హృదయము సమర్పింప బడుచున్నది.

**వివరణము :-**

1) సిద్ధిని (శివైక్యమును) పొందవలసినవాడు శిష్యుడు. ఆతడు సాధన చేయవలెను. కాని సాధన ఎట్లు చేయవలెనో ఒకప్పుడు శిష్యుడై యుండి సాధన చేయు సాధకుడుగా నుండి సిద్ధిని సాధించి గురుత్వమును పొందిన గురువు తన శిష్యునకు విధానమును ఉపదేశించును. శిష్యుడు సాధకుడై సిద్ధిని పొందును. ఆ తరువాత గురువై తన నాశ్రయించిన మరొక శిష్యునకు సాధన విధానము నుపదేశించును. ఇది గురుశిష్య పరమ్పర యేర్పడు పద్ధతి. పరమ సాధకులనగా గొప్ప సాధకులని యొక అర్థము. వాస్తవమునకు శివుడు నిత్యసిద్ధుడై నందున సాధకత్వము లేదు. ఐనను శిష్యానుగ్రహార్థము సాధకత్వమును పొందెను. సనకాదుల నెందఱనో శిష్యులుగా చేసికొని వారికి సాధనవిధానము నుపదేశించినాడు. శిష్యులందఱు తప్పనిసరియై సిద్ధికొఱకు సాధకులైనవారే కాని శివుడు స్వేచ్ఛచేత తప్పనిసరి కాకున్నను సాధకుడైనాడు. కావున ఆయన పరమసాధకుడు. మిగిలిన సాధకులు శివునివలె పరమ సాధకులు కాకపోయినను గొప్ప సాధకులు అను నర్థమున ఇచట పరమ సాధకులని చెప్పబడినారు.

2) శర్వుడనగా సంహరించువాడు. లయకర్త యగుటచే శివునకా పేరేర్పడినది. శివుడు సృష్టిస్థితిలయములకు సాక్షియే కాని వాని కాతడు కర్తకాదు అని భావించినప్పుడు శివునందు సృష్టిస్థితిలయాదులారోపింపబడిన వైనందున తత్కర్తృత్వాభిమానముగలవారిలో శర్వుడొకడు. ఆతడు సాధన చేసి ఆరోపమును తద్ధేతువైన భ్రాంతిని వీడి యున్నందున తొలుత ఆయన సాధకుడే యైనందున ఆతడు మొదటి సాధకుడని చెప్పబడును. ఆయనయే పరమసాధకుడు. పరమసాధకులలో మొదటివాడుగా నాతని భావించి **శర్వాది పరమసాధక** అని చెప్పబడినది. సాధకుడే గురువైనాడు. ఆతడే పరమసాధక గురువైనాడు. ఆతని శిష్యులెందఱో పరమసాధక గురువులైనారు. వారందఱు

ఎక్కడో ఉన్న అమ్మవారిని భూలోకమునకు మూలాధారమునకు తెచ్చినారు. అదియే కాంచి. అది కామపీఠము. ఆమె నక్కడ నిలిపినారు. ఆమె అక్కడ నిలచినందున కామపీఠజుషే అని చెప్పబడినది. సాధకులందఱు ఎక్కడో సహస్రారమున లేక బ్రహ్మాండముల కావలనున్న అమ్మవారిని సాధనబలముతో ఎవరికి వారు తెచ్చుకొనవలసినదే కాని ఒకరు తెచ్చుకొనజాలరు. అందుచేతనే **శర్వాదిపరమసాధక గుర్వానీతాయ** అని అమ్మవారు చెప్పబడినారు. అమ్మవారు ఎవరి ఇచ్ఛచేతను భూలోకమునకు తీసికొనిరాబడరు. ఆమె స్వేచ్ఛచేతనే భూలోకమునకు అందును కాంచికి అందును కామపీఠముకు వచ్చి నిలచినది. కాదను వారెవ్వరు అని చెప్పుట కామపీఠమును పొందినది అను అర్థమిచ్చు **కామపీఠజుషే** అను సమాసము ప్రయోగింపబడినది. అమ్మవారిని సాధించి భూలోకమునకు తేవలెనని బుద్ధిపుట్టుట ఆమె తేబడుట ఆమె స్వయముగా వచ్చుట అంతయు ఆమె ఇచ్ఛయే. ఆమెకు మన హృదయము సమర్పించెదము. అది చాలును. ఆమె తలచుకొనిన మనము సాధకుల మగుదుము. పరమ సాధకులమగుదుము. గురువులమగుదుము. అమ్మవారిని భూలోకమునకు తెత్తుము. లేక ఆమె వచ్చునట్లు చేయుదుము లేక ఆమె స్వయముగా వచ్చినప్పుడు దర్శించుకొందుము. అమ్మవారున్నంత యెఱుగా నెవ్వరును లేరు. తనభార్య అట్లున్నందుకు శివునకు గర్వము. అట్లున్నందుకు ఆమెకును గర్వమున్నదేమో? రాగము ఎఱుపు, కోపము ఎఱుపు అని చెప్పబడును. శివుని రాగమామె, శివుని కోపమామె, శివుని గర్వమామె, ఆమె యెఱుపు ఆమె గర్వము. ఆమెకు హృదయము సమర్పించిన సాధకులకు లయముండదు. నాకు లయము లేదను గర్వమును వహింతుము. తల యెత్తుకొందుము. లోకము పాదాక్రాంతము చేసికొందము. ఇది యంతయు అమ్మవారి ఇచ్ఛ. నాలుగు పాదములలో ప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కొఱకు హృదయ సమర్పణము చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారితో తాదాత్మ్యముయొక్క ప్రాప్తి విశ్వసింపబడుచున్నది.

**శ్లో॥ సమయా సాన్ధ్యమయూఖైః**
**సమయా బుద్ధ్యా సదైవ శీలితయా।**
**ఉమయా కాఞ్చీరతయా**
**న మయా లభ్యేత కిం తు తాదాత్మ్యమ్॥ 44**

**ప్రతిపదార్థము :-**

సాంధ్యమయూఖైః = సంధ్యాసమయ కిరణములతో;
సమయా = సమానురాలైన;
సమయా బుద్ధ్యా = సమయాదేవి అను బుద్ధితో;

| | |
|---|---|
| సదా | = ఎల్లప్పుడు; |
| శీలితయా | = ధ్యానింపబడిన; |
| కాంచీరతయా | = కాంచీనగరమందిష్టముగల; |
| ఉమయా | = కామాక్షీ దేవితో; |
| తాదాత్మ్యమ్ తు | = అభేదమే; |
| కిం న లభ్యేత | = ఎందుకు కలుగకుండునో? |

**తాత్పర్యము :-**

సంధ్యాసమయకిరణ సమాన కాంతిగల సమయాదేవి అను బుద్ధితో ధ్యానింపబడిన కాంచీనగరమందిష్టముగల ఉమాదేవితో (కామాక్షీదేవితో) తాదాత్మ్యము కలుగకుండునా?

**వివరణము :-**

సంధ్యాసమయకిరణకాంతివలె అమ్మవారి కాంతి యొప్పునిది. మూలాధారమునందు సమయమతానుయాయులచే ధ్యానింపబడు దేవత సమయాదేవి. శ్రీ శంకరులు సౌందర్యలహరిలో మూలాధారమునందు సమయాధ్యానమును చెప్పినారు. సమయాదేవిగా కామాక్షీదేవి కవిచే ధ్యానింప బడినది. ధ్యేయ స్వరూపము ధ్యాతకు కలుగుట తాదాత్మ్యము. అది ధ్యానఫలము. దక్షయజ్ఞమందు తన స్థూలశరీరమును యోగాగ్నిలో దహింపజేసిన యమ్మవారు హిమాలయ పర్వతరాజు, ఆయన భార్య మేనకయొక్క పుణ్యఫలముగా వారినుండి మరల స్థూలశరీరమును పొందినది. పూర్వజన్మసంస్కారవశమున మరల శివుని భర్తనుగా పొందుటకు తపస్సు చేయబోవునప్పుడామె తల్లిచే ఉ (ఓ అమ్మాయీ) మా (తపస్సునకు పో) వలదు అని చెప్పబడినందున పూర్వజన్మమున సతియని పేరుగల యామెకు ఈ జన్మమున ఉమయను పేరు గలిగినది. 1) ఉమ యనగా పురుషుని (శివుని) ఇచ్చు శివశబ్దములోని ఇకారము కూడ ఇచ్చును బోధించును. 2) ఉ అనగా శివుడు మా యనగా విద్య. ఉమ యనగా శివుని జ్ఞానశక్తి. 3) ఉ అనగా శివుడు మా అనగా కాంతి. ఉమ అనగా శివుని కాంతి. 4) ఉ అనగా శివుడు మా అనగా మాయ. ఉమ అనగా శివుని మాయ. 5) ఉ అనగా అభేదము మ్ అనగా జీవుడు అ అనగా శివుడు. ఉమ యనగా జీవశివైక్యమును బోధించు ఓంకారము. ఓంకారము నందలి అకార ఉకార మకారములు ఉమా శబ్దమున క్రమము విడచి కూర్పబడియున్నవి. జీవశివైక్యము నిర్గుణాత్మయందే సంభవించును కావున ఉమ యనగా నిర్గుణాత్మ. అదే ఓంకారము యొక్క అర్థము. పరాశబ్ద వాచ్యము దానికి సమయాకళ అను పేరుకలదని శ్రీ కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారు చెప్పినారు. కామాక్షీదేవియే ఇట ఉమగా చెప్పబడినది. ఆమెయే సమయాదేవిగా చెప్పబడినది. మా యనగా విద్య. దానితో కూడిన శివుడు సమ అని చెప్పబడును. ఆ శివుని పొందించునది సమయా లేక సమశబ్దము భావ ప్రధానముగా సామ్యమును బోధించును.

ఐదు విధములైన శివసామ్యము అమ్మవారి యందు కలవు.

1) **అధిష్ఠాన సామ్యము** : శివుని అనుష్ఠానమైన కైలాసమే అమ్మవారికిని అధిష్ఠానమై ఉండుట

2) **అనుష్ఠానుసామ్యము** : శివుని అనుష్ఠానములైన సృష్టిస్థితిలయ తిరోధానాను గ్రహములను ఐదు కృత్యములు నమ్మవారికిని ఉండుట.

3) **అపస్థాన సామ్యము** : శివుడు నృత్య మొనరించు స్థితియే లేక (శివుని అవస్థయైన తురీయావస్థ) అమ్మవారికిని ఉండుట (మాండూక్యోపనిషత్తున శివుని అవస్థ తురీయమని చెప్పబడినది)

4) **రూపసామ్యము** : శివుని చంద్రశేఖరేత్యాది రూపము అమ్మవారికిని ఉండుట.

5) **నామసామ్యము** : శివ అనుపేరే అమ్మవారికిని ఉండుట.

ఈ ఐదు సామ్యములు సమశబ్దముచే చెప్పబడును. సమములు అనగా సామ్యములు వానిని యా అనగా పొందునదిగా వున్న అమ్మవారు సమయ అని చెప్పబడును. ఈ పంచవిధసామ్యములు భావించుట సమయాచారము అని చెప్పబడును. అమ్మవారు జీవశివులందు సమముగా ఉండును. కావున ఈ శివాశివ సామ్యభావనము జీవశివతాదాత్మ్య భావనమున జీవశివాభేద (జీవశివైక్య)మున పర్యవసించి కైవల్యసిద్ధికి హేతువగును. సమ సమాన శబ్దములు ఏకత్వ వాచకములు **రషాభ్యాం నో ణః సమానపదే** అను పాణిని వ్యాకరణసూత్రమున సమాన శబ్దము **సమం పశ్య హి సర్వత్ర నిర్దోషం హి సమమ్** బ్రహ్మ ఇత్యాదులలో సమశబ్దములు ఏకత్వవాచకములు. కావున సమమ్ అనగా ఏకత్వమును పొందించునది **సమయా** అని చెప్పబడును. ఓంకారార్థమైన నిర్గుణాత్మయే ఉమాశబ్దార్థము సమయాశబ్దార్థము కూడ కావున **ఉమయా సమయా బుద్ధ్యా శీలితయా** అని చెప్పబడినది.

2) నాలుగు పాదముల ఆదిలో ద్విప్రాసమున్నది. పూర్వార్ధమున రెండు పాదములలో ఆది యమకమున్నది.



**అవ:**– పై శ్లోకమున అమ్మవారితో తాదాత్మ్యము కలుగునను విశ్వాసము ప్రకటింపబడినది. ఈ శ్లోకమున భేదభావరూపసంసారబాధముండదని ప్రకటింపబడుచున్నది.

**శ్లో॥ జన్తో స్తవ పదపూజన–**
**సన్తోషతరఙ్గితస్య కామాక్షి!**
**బన్ధో యది భవతి పునః**
**సిన్ధోరమ్భఃసు బమ్భ్రమీతి శిలా॥ 45**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| తవ | = నీయొక్క |
| పదపూజనసంతోషతరంగితస్య | = పాదముల పూజించుట యందలి సంతోషముతో ఓలలాడువానికి; |
| జన్తోః | = జీవముగల వానికి; |
| బంధః | = బంధము; |
| భవతి యది | = కలుగునేని; |
| సింధోః | = సముద్రముయొక్క; |
| అంభఃసు | = జలములయందు; |
| శిలా | = ఱాయి; |
| బంభ్రమీతి | = తిరుగును. |

**తాత్పర్యము :-**

అమ్మా! కామాక్షీదేవీ! నీ పాదముల పూజించుటలో సంతోషించు వానికి బంధమున్నదన్నచో సముద్రజలములో ఱాయి తిరుగునన్నట్లే యగును.

**వివరణము :-**

**తరంగితస్య** అనుటచే అమ్మవారి పాదముల పూజించువాని సంతోషము సముద్రము అని చెప్పినట్లైనది. సముద్రజలములలో ఱాయి పైన తేలనట్లు అమ్మవారి పాదముల పూజించుటలో సంతోషమనుభవించు వానికి సంసారబంధ ముండదని తేలును. పూర్వార్ధముననుఉత్తరార్ధముననుపాదాది ప్రాసములున్నవి.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదముల పూజించువారికి బంధము కలుగదని చెప్పబడినది. ఈ శ్లోకమున బంధనివారిణియైన అమ్మవారికి నమస్కార మాచరింప బడుచున్నది.

**శ్లో॥ కుణ్డలి కుమారి కుటిలే**
**చణ్డి చరాచరసవిత్రి చాముణ్డే।**
**గుణిని గుహారణి గుహ్యే**
**గురుమూర్తే త్వాం నమామి కామాక్షి॥ 46**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కుండలికుమారి | = నాగకన్యవైన; |
| కుటిలే | = వంకరలుగలదానవైన; |

| | |
|---|---|
| చండి | = కోపస్వభావముగల దానవైన; |
| చరాచరసవిత్రి | = చరాచరములకు తల్లివైన; |
| చాముండే | = చండముండ సంహారము చేసినదానవైన; |
| గుణిని | = గుణములుగలదానివైన; |
| గుహారణి | = గుహవు అరణివియైన; |
| గుహ్యా | = గుహలోనున్న దానివైన; |
| గురుమూర్తే | = గురుస్వరూపిణివైన; |
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ; |
| త్వామ్ | = నిన్నుగూర్చి; |
| నమామి | = నమస్కరించెదను. |

**తాత్పర్యము :-**

అమ్మవారు వంకరలు తిరుగు కుండలిని యనబడు నాగకన్యక. కోపస్వభావము కలది. చరాచరములకు తల్లి. గుణవతి, చండముండుల సంహర్త్రి, గుహారూపిణి, అరణి రూపిణి, గుహలో నుండునది, గురుస్వరూపిణి.

**వివరణము :-**

1) కుండలిని మేల్కొని పైకి పోవునప్పుడు అత్తగారింటికి కొత్తగా బోవుకుమారివలె మంద్రధ్వని చేయును. **యత్కుమారీ మంద్రయతే** అనుశ్రుతి దీనిని సమర్థించుచున్నది. అమ్మవారు కుటిలస్వభావులైన రాక్షసాదులయందు కుటిలగా నుండి వారిని సంహరించును. కావున అమ్మవారు కుటిలయని చెప్పబడినది. ఆమె కుండలినీ స్వరూపిణి. కావున వంకరలుగా తిరుగుట కుండలినికి స్వభావము. కుటిలే అను పదమాస్వభావమును తెలుపును. చాలా కాలము నిద్రించి మేల్కొన్న కుండలిని ఆకలిగొని కోపించియున్న పామువలె బుసలు కొట్టుచుండును. చండియను పదము ఆ కోపముగలది అని తెలుపును లేదా దుష్టులను సంహరించునప్పుడు ప్రలయమందందరిని సంహరించుటకు తమోగుణమును స్వీకరించునప్పుడు కోపముగలది అని చండి పదము బోధించును. గుణిని అనుపదము అమ్మవారి సగుణత్వము తెలుపును. భక్తుల ననుగ్రహించు కరుణావాత్సల్యాది కల్యాణగుణములు కలది అని తెలుపును. పరమాత్మ నివసించు బుద్ధికి గుహ అని పేరు. అమ్మవారు బుద్ధిరూపిణి అని గుహాశబ్దము తెలుపును. అరణియందెట్లు అగ్ని గూఢముగా నుండునో గుహయందట్లు పరమాత్మ యుండును. కావున బుద్ధి రూపిణియగు అమ్మవారు అరణి వంటి గుహ కావున గుహారణి అని చెప్పబడినది. గుహ్యా అనగా గుహయందున్నది అని అర్థము. పరమాత్మరూపిణియై గుహయందుండుటచే అమ్మవారు గుహ్యా అని చెప్పబడినది. **శ్రీ గురుః సర్వకారణభూతా శక్తిః(1)** అను భావనోపనిషత్సూక్తి ననుసరించి అమ్మవారు గురుస్వరూపిణి.

2) ప్రథమపాదములో ఉన్న అన్ని పదముల మొదట రెండులో అన్ని పదములమొదట, మూడవ పాదములో ఉన్న అన్ని పదముల మొదట వడి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున శ్రీ కామాక్షీ దేవి గురుమూర్తిగా భ్రమించు కుండలినిగా వాచ్యమైనది. ఈ శ్లోకమున ఆమె అనిర్వాచ్య అని, భ్రమింపజేయునది అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ అభిదాకృతిర్భిదాకృతి-**
**రచిదాకృతిరపి చిదాకృతిర్మాతః।**
**అనహన్తా త్వమహన్తా**
**భ్రమయసి కామాక్షి శాశ్వతీ విశ్వమ్॥ 47**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| మాతః | = అమ్మా! |
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| త్వమ్ | = నీవు; |
| అభిదాకృతిః | = భేదములేని దానవు; |
| అపి | = అయినను; |
| భిదాకృతిః | = భేదముకల దానివి; |
| అచిదాకృతిః అపి | = జడవైనను; |
| చిదాకృతిః | = చైతన్యరూపిణివి; |
| అనహంతా | = అహంతలేని దానవు; |
| అపి | = అయినను; |
| అహంతా | = అహంతారూపిణివి; |
| శాశ్వతీ | = శాశ్వతియైన దానవై; |
| విశ్వమ్ | = ప్రపంచమును; |
| భ్రమయసి | = భ్రమింపజేయుచున్నావు. |

**తాత్పర్యము :-**

ఓ తల్లీ కామాక్షీదేవీ భేదాభేదాకృతులలో చేతనజడాకృతులలో అనహంతాహంతా రూపములలో శాశ్వతమైన దానవై యుండియు విశ్వమును భ్రమింపజేయుచున్నావు.

**వివరణము :-**

శ్రీ కామాక్షీదేవి మాయా స్వరూపిణి. మాయ అనునది ఎవరికిని ప్రత్యక్షము కాని పరమేశ్వరుని శక్తి. మనకీ లోకము కనబడుచున్నది. అది ఎట్లు వచ్చినది. అను

ప్రశ్నము మనకు కలుగుచున్నది. మనము చూడలేని ఒక శక్తి ఈ ప్రపంచమును సృష్టించుచున్నది అని మన మనమును సమాధాన పెట్టుకొందుము. శాస్త్రములు పురాణములు ఇట్లే చెప్పుచున్నవి. వాస్తవమునకు ప్రపంచము ఎట్లు పుట్టియున్నదో మనకు తెలియదు. ఎవని వలన ఈ జగము పుట్టునో ఎవనిచే జీవించునో ఎవనియందు లీనమగునో వాడు పరమేశ్వరుడు (బ్రహ్మ) అని తైత్తిరీయోపనిషత్తు చెప్పినది. కాని పరమేశ్వరుడేల ఈ జగమును సృష్టించెను? అను ప్రశ్నమునకు సమాధానములు కాని సమాధానములు అనగా సమాధానాభానములు ఎన్నో ఉన్నవి. ఒకరు దేవుడాడుకొనుచున్నాడని చెప్పిరి. ఒకరు ఒంటిగా నున్న దేవునికానందము లేక ఆనందము కొఱకు ఈ ప్రపంచమును సృష్టించెనని చెప్పిరి. మరి కొందఱు సృష్టించుటయే పరమేశ్వరుని స్వభావము కావున సృష్టించకుండ నెట్లుండును? అని ఎదురు ప్రశ్నించిరి. ఈ సమాధానములతో మన మనమును సమాధానపెట్టుకొనుచున్నాము. సరే పరమేశ్వరుడు సృష్టించినాడు, కాపాడుచున్నాడు, సంహరించుచున్నాడు అనగా ఆతని కాశక్తి యున్నదని అర్థము. ఆ శక్తి ప్రత్యక్షము కాదు. ఆ శక్తినే మాయయని కొందఱనిరి. ఇది చాలా విచిత్రమైనది. ఈ శక్తి పరమేశ్వరుని కంటే వేరుగా కనబడునా? కనబడదు. అట్లని లేదందుమా లేనిచో నీ ప్రపంచముయొక్క సృష్టిస్థితి లయములను శక్తిలేని దేవుడు ఎట్లు చేయగలడు. శక్తిలేని వాడెవడును ఎవరిని కూడ చేయలేడనుట మన మెఱుగుదుము. సృష్టిస్థితిలయములు చేయుశక్తి యున్న దేవుడే వానిని చేయుచున్నాడని ఒప్పుకొనవలెను. ఒకడొక పని చేసిన పిమ్మటనే ఆ పని చేయుశక్తి ఆయనకున్నదని మనకు తెలియును కాని ఆ పని చేయక ముందాతని శక్తి యున్నదని ఎట్లు తెలియును? ఎట్లు చెప్పగలము? కావున శక్తి కార్యానుమేయ యని చెప్పబడినది. ఈ శక్తి ఆతని కన్న భిన్నమా అభిన్నమా అను ప్రశ్నకు భిన్నమని కాని అభిన్నమని కాని చెప్పలేము. అట్లే మాయాశక్తిస్వరూపిణియైన శ్రీ కామాక్షీదేవి శివునికన్న భిన్నయని కాని అభిన్నయని కాని చెప్పలేము. అందుచేతనే ఈ శ్లోకమున శ్రీకామాక్షీదేవి అభిదాకృతి యైనను భిదాకృతి యని చెప్పబడినది.

2) శివుడు చిద్రూపుడు, అమ్మవారు శివాభిన్నయని భావించు కొన్నప్పుడు ఆమె కూడ చిదాకృతియే యగును. శివుని కన్న భిన్నయని భావించుకొన్నప్పుడు అచిదాకృతి యని చెప్పబడును. అందుచేత నీ శ్లోకమున ఆమె అచిదాకృతి యైనను చిదాకృతి యని చెప్పబడినది.

3) అహమ్ అను శబ్దమునకు ఆత్మయని అర్థము. కాని ఎవరికినీ ఆ శబ్దము పూర్తిగా అర్థము కాకున్నది. అర్థమైనను సరిగా ప్రయోగింపలేకున్నవారే ఎక్కువ మంది. పైగా పుట్టిన శరీరమునే నేననుకొనుచున్నారు. నేను పుట్టి యిప్పటి కరువదియైదేండ్ల కాలము పూర్తియయినది. ఇరువది యైదేండ్ల కాలము పూర్తియయినది ఇత్యాది వ్యవహారములు అట్లన్నవారి శరీరముల వయస్సునే తెల్పును. పుట్టక ముందును ఆత్మ ఉన్నది. చచ్చిన తరువాత కూడా అది ఉండును. పుట్టక ముందున్న ఆత్మ శరీరమును

స్వీకరించుటయే పుట్టుక. శరీరమును పరిత్యజించుటయే మరణము. ఇట్లు జననాది మరణపర్యంత వికారములు అన్నీ శరీరమునకు చెందినవే యైనను స్థూలశరీరాభిమానముచే జీవాత్మ తనకు చెందినవిగా భావించును. తాను ఆత్మయే యైనను, తాను స్వీకరించు శరీరము తాను కాకపోయినను, తానే శరీరమని భావించుట అహంకారమని చెప్పబడును. అట్లే సూక్ష్మశరీరమును ఆత్మకాదు. తానుకాని ఆ సూక్ష్మశరీరమును తానని భావించుటయు అహంకారమే. ఈ భావనము అహమభిమానము అని చెప్పబడును. (ఇదియే అహంకారము). మట్టినుండి పుట్టిన దంతయు మట్టియే యైనట్లు ఆత్మయగు పరమేశ్వరుని నుండి పుట్టిన ప్రపంచము అంతయు ఆత్మయే యగును. ప్రపంచము శబ్దప్రపంచము, అర్థ ప్రపంచము అని ద్వివిధముగా నున్నది. శబ్దప్రపంచమునకు నామప్రపంచమని, అర్థప్రపంచమునకు రూపప్రపంచమనియు పర్యాయములున్నవి. శబ్ద ప్రపంచము వాచకము, అర్థప్రపంచము వాచ్యము. అర్థప్రపంచము అంతయు శివుడు, శబ్దప్రపంచము అంతయు అమ్మవారు. కాళిదాసు పార్వతీ పరమేశ్వరులు వాగర్థముల వలె విడదీయరానివారు అని చెప్పినాడు. ఆ శ్లోక వ్యాఖ్యానములో మల్లినాథుడు వాక్స్వరూప (శబ్దస్వరూపిణి) అమ్మవారని, శివుడు అర్థస్వరూపుడు అను పురాణవాక్యములను ఉదహరించినాడు. పిపీలికాది బ్రహ్మపర్యంతమైన అర్థప్రపంచమంతయు శివుడు. ఆ అర్థప్రపంచమును బోధించు శబ్దప్రపంచము అంతయు అమ్మవారు. శబ్దప్రపంచము అంతయు **అ**కారము మొదలు **హ**కారము వఱకుగల వర్ణముల నుండి యేర్పడినది. వర్ణములకు మాతృకలని పేరు. ఈ వర్ణములు కూడ శబ్దములే. వర్ణములనుండి పదములు, పదములనుండి వాక్యములు, వాక్యములనుండి వేదపురాణాది సమస్తవాఙ్మయ మేర్పడినది. అంతయు శబ్దప్రపంచమే. ఏ వస్తువును అంటుకొనకుండ మొత్తము అర్థ ప్రపంచమును ఆకాశము తనలోనే ఉంచుకొనునట్లు ఆత్మకూడ ఏ వస్తువును తాకకుండ అన్ని వస్తువులను తనలో దాచుకొనును. అట్లే అర్థమును తాకకుండనే శబ్దము దానిని బోధించును. అర్థమును వాచ్యమనియు శబ్దమును వాచకమనియు అందురు. శబ్దము వినబడగానే అర్థము స్ఫురించును. అర్థము మనసులోనికి వచ్చినదనగా శబ్దము కూడ వచ్చును. శబ్దము అర్థము ఒకదానిని విడచి మరొకటి విడిగా ఉండవనునది సారాంశము. ఏ శబ్దమును విన్నను అకారము మొదలుకొని హకారము వఱకు ఉన్న వర్ణమాలలోని వర్ణములతో నేర్పడునట్టిదే. అన్ని అర్థములును అహమర్థములే. అన్ని శబ్దములును అహమ్ రూపములే. అహంత అనగా అన్ని అర్థములు నాస్వరూపములే అని భావించుట, ఆ విధముగా అనుభవించుట. అమ్మవారు ఇట్టి అహంతాస్వరూపిణి. వాస్తవమునకు ఈ నామరూపములు మిథ్యలు. ఉన్నది బ్రహ్మమొక్కటే. శబ్దార్థ ప్రపంచములు లేనివే. ఆ జ్ఞానము కలవాడు శివుడు కావున ఆయనకు అహంకారము లేదు. అహంతయు లేదు. అమ్మవారు శివస్వరూపిణి. శివునివలె అహంకారము లేనిది. అజ్ఞానము లేనిది మాయలేనిది. శివునకెట్లు అహంత లేదో ఆమెకు కూడ అహంతలేదు. కావున అనహంతారూపిణి

కూడ. లేని జగత్తు ఉన్నట్లు కనిపించుట దానికి కర్త పరమేశ్వరుడనుకొనుట అంతయు మాయయే. లేని జగత్తు ఉన్నట్లు కనిపింపజేసినదెవరు? మాయ. పరమేశ్వరుడేమియు చేయలేదు. అంతయు మాయయే చేసినది కావున ఆమె పరమేశ్వరుని చిద్రూపుని జేసినను జడరూపిణియైనది. పరమేశ్వరునకు ఈ జగత్కర్మను ఈ జగమంతయు నేనే అను అభిమానము కలిగించి అహంకారము అహంతయు తానే యున్నది. వాస్తవమునకు శివునకు భిన్నముకాని తాను అహంత యెట్లగును? కావున అనహంతరూపిణియు ఆమెయే. పూర్వార్థమున రెండు పాదములలో మూడవ అక్షరము ప్రాసగా నున్నది. ఈ శ్లోకమున విరోధాభాసాలంకారమున్నది.

4) పరస్పర విరుద్ధ భేదాభేద, చిజ్జడ, అహంతా నాహంతాది రూపముల ధరించి విశ్వమును భ్రమింపజేయుచున్నది అమ్మవారే. అనాది మాయోపాధికుడు నైన ఈశ్వరుడు సృష్ట్యారంభమున అహమవ్యాకృతః నామరూపే వ్యాకరనాణి అను అహంవృత్తులను పొందును. ఈ అహమాకారవృత్తియే విమర్శయని శాక్తేయులచే చెప్పబడును. ఈ విమర్శయే అహంత యనబడును. ఆ శ్రీ కామాక్షీ విశ్వమును భ్రమింపజేయును. శ్రీ కామాక్షీదేవి ఒక్కటిగానున్న చిద్రూపబ్రహ్మను శివుడుగా జీవుడుగా భ్రమింపజేయును. చైతన్యరూపమైన బ్రహ్మను చిజ్జడములుగా భ్రమింపజేయును. శివుని జీవునిగా విశ్వమున భ్రమింపజేసి మరల విశ్వోత్తీర్ణునిగా శివునిగా జేయు అవిద్యావిద్యాస్వరూపిణి ఆమె.



**అవ॥:-** పై శ్లోకమున ఒకే బ్రహ్మమును భిన్నాభిన్నములుగ భ్రమింపజేయున దమ్మవారే యని చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి భక్తులు భిన్నములైన (విరుద్ధములైన) వస్తువుల నభిన్నములుగా దర్శించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ శివ శివ పశ్యన్తి సమం**
**శ్రీకామాక్షీకటాక్షితాః పురుషాః।**
**విపినం భవనమమిత్రం**
**మిత్రం లోష్టం చ యువతిబిమ్బోష్ఠమ్॥ 48**

ప్రతిపదార్థము :-

| | |
|---|---|
| శ్రీకామాక్షీకటాక్షితాః | = శ్రీ కామాక్షీ దేవిచేత చూడబడిన; |
| పురుషాః | = పురుషులు; |
| విపినమ్ | = అడవిని; |
| భవనమ్ | = ఇల్లుగా; |
| భవనమ్ | = ఇంటిని; |
| విపినమ్ | = అడవిగా; |

| | |
|---|---|
| అమిత్రమ్ | = శత్రువును; |
| మిత్రమ్ | = మిత్రునిగా; |
| యువతి బిమ్బోష్ఠమ్ | = పడుచుయొక్క దొండపండువంటి పెదవిని; |
| లోష్టమ్ చ | = మట్టిబెడ్డగాను; |
| సమమ్ | = సమముగా; |
| పశ్యంతి | = చూచెదరు; |
| శివ శివ | = విచిత్రము. |

**తాత్పర్యము :-**

శ్రీదేవి కటాక్షపాత్రులైన పురుషులు అడవిని ఇల్లుగా, ఇల్లును అడవిగా శత్రువును మిత్రునిగా, మిత్రుని శత్రువుగా, మట్టిబెడ్డను యువతిబిమ్బోష్ఠముగా, యువతిబిమ్బోష్ఠమును మట్టిబెడ్డగా చూచెదరు. శివ శివ ఇది విచిత్రము గదా!

**వివరణము :-**

1) సాధారణ జనులు ఇండ్లలో నివసించెదరు. అడవులనిన భయము చెందెదరు. ఒకవేళ అడవికి బోయినను ప్రొద్దుగ్రుంకేలోపల ఇండ్లకు తిరిగి వచ్చెదరు. అడవిలో నివసించు ఆటవికులు అప్పుడప్పుడు గ్రామములోనికి వచ్చినను పనులు పూర్తి చేసికొని తిరిగి అడవులలోనికి పోయెదరు. అమ్మవారి అనుగ్రహముచే విరక్తినందిన వారికి ఇల్లు అడవియు రెండును సమానములుగా నుండును.

2) రాగద్వేషములు మిత్రామిత్ర భావహేతువులు. అమ్మవారి భక్తులకు రాగద్వేషములుండవు. కావున వారు శత్రువులను మిత్రులను సములుగా చూచెదరు. వారికి అమ్మవారి భక్తులందు రాగమున్న నా భక్తులును మిత్రులగుదురు. ద్వేషమున్నవారు శత్రువులగుదురు అంతేకాని అమ్మవారి భక్తులు రాగద్వేషముల ననుసరించి వారికి శత్రువులు మిత్రులేర్పడరు. అమ్మవారి భక్తులు తమను ద్వేషించు వారిని కూడ శత్రువులుగా చూడరు. తమయందు రాగమున్నదని వానిని మిత్రులుగా చూడరు. అందరిని సమముగా చూచెదరు. అట్లే అమ్మవారి భక్తులు పడుచుదాని దొండపండువంటి ఎఱ్ఱని పెదవిని మట్టిబెడ్డవలె ఉపేక్షించెదరే కాని దానిని చుంబించగోరరు. ఇటువంటి భక్తులు అమ్మవారి అనుగ్రహమునకు పాత్రులే కావున వారికి అందఱిని అన్నింటిని సమముగా చూచెడు గొప్పగుణమబ్బినది.

3) అమ్మవారి భక్తులు సుఖములను కోరరు, దుఃఖములను ద్వేషించరు. కావున వారు గృహమందున్నను అడవియందున్నను ఒకే విధముగా నుందురు. ప్రారబ్ధపుణ్యకర్మకు సుఖమును, ప్రారబ్ధపాపకర్మకు దుఃఖమను ఫలము నీశ్వరుడొసగును. ఆ సుఖదుఃఖములు రెండును భగవద్దత్తములే, భగవత్ప్రసాదములే, అను భావములో వానిని స్వీకరించెదరేకాని వానిపట్ల భేదమును ప్రదర్శించరు. కావున వారికి విపిన

భవనములలో నేదియైన నొకేవిధముగా కనబడును. అమ్మవారి భక్తులు ఒక వస్తువును మరొక వస్తువుగా మార్చగలుగుదురు. వారికెవరియందు అనుగ్రహము కలుగునో వారదవులలో దుఃఖమనుభవించుచు దాని నివారణమును కోరువారైనచో వాని కావనవాసము తొలగి గృహవాసము లభించును. ఎవరికి అమ్మవారి భక్తులందు నిష్కారణద్వేషముండునో వారు గృహవాసము చేయు వారైనచో వారు వనవాసము ననుభవించెదరు. అమ్మవారి భక్తుల అనుగ్రహమునకు పాత్రులైన వారికి శత్రువులున్నచో వారు శత్రుభావము వీడి మిత్రులగుదురు. ఒకవేళ ఆ అమ్మవారి భక్తులయెడల నిష్కారణద్వేషము కలిగియుందురేని వారి మిత్రులుకూడ శత్రువులుగా మారి దుఃఖము కలిగించెదరు. అమ్మవారి భక్తుల సహవాసమును పొందిన రాగులు కూడ విరక్తులై యువతిబిమ్బోష్ఠమును లోష్టముగా భావించు విరక్తులుగా మారుదురు. ఇది యంతయు అమ్మవారి భక్తుల సమ(బ్రహ్మ) దర్శన ప్రభావము. శివ శివ అను శివశబ్దామ్రేడనముచే వారి ప్రభావమును దర్శించిన కవియొక్క ఆశ్చర్యము వ్యంగ్యమగును. మనమందే భావముద్రేకించినను, శరీరమునందే కదలిక కదిలినను తుమ్ము, దగ్గు మొదలగు నేవికారములు కలిగినను, భగవతీ నామస్మరణము చేయవలెనను సంప్రదాయము నీ కవి పాఠకులకు సూచించుచున్నారు.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి కటాక్షమునకు పాత్రులైనవారి సిద్ధి చెప్పబడినది. ఈ శ్లోకమున సిద్ధిని పొంది పరవశించినవారి **భగవతీనామగానము** చేయబడుచున్నది.

**శ్లో॥ కామపరిపన్థికామిని!**
**కామేశ్వరి! కామపీఠమధ్యగతే!।**
**కామదుఘా భవ కమలే!**
**కామకలే కామకోటి! కామాక్షి॥ 49**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కామపరిపన్థికామిని | = కాముని శత్రువు(శివుని) ప్రియురాలా! |
| కామేశ్వరి | = కామేశ్వరుని (శివుని) భార్యయైనదానా! |
| కామపీఠమధ్యగతే | = కామపీఠమధ్యనున్నదానా! |
| కమలే | = లక్ష్మీస్వరూపముగలదానా! |
| కామకోటి | = కామముల కోట్లుగలదానా! |
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ! |
| కామదుఘా | = కామముల పితుకుదానవు |
| కామకలే | = కామకలవు |
| భవ | = అగుము. |

**తాత్పర్యము :-**

ఓ కామాక్షీ! నీవు కాముని శత్రువైన శివుని కామినివి. కామేశ్వరుడైన శివుని యిల్లాలవు. కామపీఠమధ్యమున నున్నదానవు. నీవు కామకలవు. కోట్ల కొలది కామములు నీయందున్నవి. అనగా భక్తులకు కోట్లకొలది కామములను కోరిన వానిని అనుగ్రహించుదానవు. నీవు నాకు కామములను పితుకుము.

**వివరణము :-**

కామునికి శత్రువైన శివుని కామము అమ్మవారి యందున్నది. ఆ శివుని కామము మిక్కిలి ప్రశంసనీయము అని కామపరిపన్థికామిని అను సమాసముయొక్క అర్థము. ఈ సమాసమున విరోధాభాసాలంకారస్ఫూర్తి యున్నది. విష్ణువు కామ జనకుడు, శివుడు కామ సంహారకుడు. కాముడు సృష్టిమూలము. ఆ కాముని అమ్మవారు తన చూపును ధరించి కామాక్షి అను నామమును పొందినది. కామముయొక్క విధములకు అంతులేదు. ఎన్నికోట్ల విధములో చెప్పలేము. అనంతత్వమును చెప్పుటకు కోటి అను పదము చివఱగల కామకోటి అను సమాస మీ శ్లోకమున వాడబడినది. అమ్మవారు కామిని అనగా కామములుగలది. కోట్ల కొలది కామములుగలది. వానిని భక్తుల కొసగి ఆనందింపజేయునది. కామశబ్దమునకు కోరదగినది అను అర్థము కలదు. కావున కామము అనగా సుఖము. ఆ సుఖము శబ్దస్పర్శవిషయముల అనుభవమున కలుగునను మాట పూర్ణముగా సత్యము గాకున్నను పెక్కు ఆ విషయముల అనుభవమునకై ఆరాటపడుచుందురు. అది సుఖమువలె కనిపించు దుఃఖమే కాని అదియే సుఖమనుకొని విషయములకై వెంపఱలాడుచున్నారు. శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అని విషయములైదు. కాని ఒక్కొక్కటి కోట్ల కొద్ది విధములుగలది. వాని అనుభవములు కోట్లు. తజ్జన్యసుఖములు కోట్లు. అవి అన్నియు ప్రపంచస్వరూపిణియైన అమ్మవారి స్వరూపములు కావున అమ్మవారు కామకోటి అనబడినది. కోటి అను శబ్దమునకు అంచు అను నర్థము కలదు. అంచు చివఱ నుండునది. కావున ఇహలౌకిక (ప్రాపంచిక) సుఖముల అంచులో అనగా చివఱలో పారలౌకిక సుఖములుండును. అవి కూడ కామశబ్దముచే బోధింపబడును. దాని ప్రకారములు కోట్లు, ఆ ప్రకారములన్నియు అమ్మవారి స్వరూపములే కావున ఆమె **కామకోటి** అని చెప్పబడినది. ఇహపరసుఖములందు విరక్తులైన మోక్షసుఖమును అనగా శాశ్వతసుఖమును కోరుదురు. కామమనగా కోరదగినది. కావున మోక్షము కూడ కామమే. ఆ మోక్షము ఇహపరలోకములయొక్క వైరాగ్యపుటంచులలో లభించునది. వైరాగ్యములేనిదే మోక్షము రాదు. మోక్షముకొఱకు వైరాగ్యముకూడ కోరదగినది కావున వైరాగ్యముకూడ కామమే. వైరాగ్యముయొక్క అంచు అనగా పరమవైరాగ్యము అచట లభించునది. మోక్షరూపిణియైన అమ్మవారు కావున అమ్మవారు కామకోటియని చెప్పబడినది. కాంచియందు కామకోటియను పేరుగల శంకరపీఠమున్నది. ఆ పీఠము అమ్మవారి స్వరూపము కావున

అమ్మవారు కామకోటియని చెప్పబడినది. ఆ పీఠముయొక్క మధ్యమున దేవతగా పూజింపబడునది కావున అమ్మవారు కామ పీఠమధ్యగతే యని చెప్పబడినది. విష్ణువు కామునికి తండ్రి. అనగా కాముని సౌందర్యము కూడ విష్ణువు నుండియే ఆతనికి సంక్రమించినది. శివుడు విరూపాక్షుడు. విష్ణువువలె పద్మనేత్ర అను పేరాతనికి ప్రసిద్ధముగా లేదు. పద్మనేత్రాది స్త్రీ వాచక శబ్దములు కొన్ని విష్ణు వాచకములుగా నున్నవి. అమ్మవారే విష్ణుసోదరి కావున ఆమె పద్మనేత్ర. అన్న చెల్లెండ్రపోలిక స్వాభావికము కావున విష్ణునేత్రములును పద్మములవలెనే ఉన్నందున అమ్మవారి సౌందర్యమువలె ఆయన సౌందర్యముకూడ పురుషమోహకమే. శివుడు కామసంహారకుడు కావున ఆతనికి కాముని సౌందర్యము రాలేదు. ఆ సౌందర్యమున్నట్లు తననెవరు భావించుట లేదని శివుడు కొంచెము చింతించి విష్ణువువలె కాదు కాదు విష్ణువును మించిన సౌందర్యమును ధరించినాడు. అదియే శివుని కామేశ్వరావతారము. బ్రహ్మాండపురాణమునందీ కామ శంకరావతార (కామేశ్వరావతార) ప్రసక్తి ఉన్నది. ఆ కామేశ్వరునికి భార్య యగుటచేత అంత మాత్రమే కాదు అపారమైన కాముని మించిన, రతీదేవిని మించిన సౌందర్యముగలదగుటచేత సౌందర్య విషయమున కాముడు ఆమెకు దాసుడగుటచేత ఆ కామునికి ఆ విషయమున అమ్మవారు ఈశ్వరియగుటచేత అమ్మవారు **కామేశ్వరి** యని చెప్పబడినది. కామమనగా కోరిక, మోక్షేచ్ఛ కూడ కోరికయే కాని అన్ని కోరికలకన్న మించినది మోక్షము. నిత్యసుఖస్వరూపము. అల్పసుఖవాంఛలకన్న నిత్యసుఖమైన మోక్షము నందలి కోరిక **కామేశ్వరి** యని చెప్పబడును. ఆ మోక్షేచ్ఛారూపకామము అమ్మవారి అనుగ్రహము చేతనే కలుగును. కావున అమ్మవారు కామేశ్వరి యని చెప్పబడినది. పాలు పితుకుట నెక్కువగా స్త్రీలే చేయుదురు. పాలు చేపుట స్త్రీజాతికే సాధ్యము. కామములను పితుకుట కామేశ్వరికే సాధ్యము. కామములను క్షీరములను పితికి జీవుల దృప్తుల జేయునది అమ్మవారే కావున అమ్మవారిని **కామదుఘా భవ** కామముల పితుకు దానవు కమ్ము అని కవి కోరుచున్నాడు. అమ్మవారు కామదుఘయైనను జీవులు పుణ్యకర్మచేయనిదే వారికి కామములను పితుకదు. కామములను చేపదు. మూకకవికి (ఈ గ్రంథము చదువువానికి) పూర్వపుణ్యము లేనందుననే అమ్మవారు కామముల పితుకుట లేదు చేపుట లేదు అని అనిపించినది. అమ్మా పుణ్యము లేకున్నను నాకు పాలు పితుకవచ్చును గదే చేపవచ్చును గదే పాలకై యేడ్చు శిశివు నేడ్చు చుండగా తల్లి ఉపేక్షించునా? పూర్వ పుణ్యమున్నదా? లేదా అని ఆలోచించునా? ఆలోచించదు. అమ్మా, అట్లే నా పూర్వ పుణ్య విశేషమున్నదా లేదా యను విచారమును వీడి నాకు పాలు పితుకుదానవు పాలు చేపుదానవు కమ్ము! అట్లు చేసిన నిన్ను తప్పు పట్టువారెవరు? తప్పు పట్టెదరను భయమున్నచో కొంగుచాటు చేసికొని ఎవ్వరికిని తెలియకుండ కామదుఘవు కమ్ము అని కవి కోరుచున్నాడు. ఈ శ్లోకమున సంబోధనములన్నియు కకారాదులుగా నున్నందున అమ్మవారి **కాదివిద్యాస్వరూపత్వమును** వ్యంజింపజేయును. 'వడి' కలిగి యున్నవి.



**అవ:-** పై శ్లోకమున నమ్మువారిని కామములనొసగు మని యర్థించుట జరిగినది. ఈ శ్లోకమున తత్సాధనమైన **నమనము** చేయబడుచున్నది.

**శ్లో॥ మధ్యేహృదయం మధ్యేని(టి)టలం**
**మధ్యేశిరోఽపి వాస్తవ్యామ్।**
**చణ్డకరశక్రకార్ముక-**
**చన్ద్రసమాభాం నమామి కామాక్షీమ్॥ 50**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| మధ్యేహృదయమ్ | = హృదయమధ్యమున; |
| మధ్యేని(టి)టలమ్ | = ఫాలమధ్యమున; |
| మధ్యేశిరః+అపి | = శిరోమధ్యముననను; |
| వాస్తవ్యామ్ | = నివసించునట్టి; |
| చండకర, శక్రకార్ముక చంద్రసమాభామ్ | = సూర్యునితో, సింగిణితో, చంద్రునితో సమానమైన కాంతిగల; |
| కామాక్షీమ్ | = కామాక్షీదేవికి; |
| నమామి | = నమస్కరించుచున్నాను. |

**తాత్పర్యము :-**

హృదయఫాలశిరో మధ్యభాగములలో నివసించు సూర్యశక్రధను శ్చంద్రుల కాంతితో సమానమైన కాంతిగల శ్రీ కామాక్షీదేవికి నమస్కరించు చున్నాను.

**వివరణము :-**

హృదయకమలమున ఇష్టదేవతను ధ్యానించుట సర్వోపానన సమ్ప్రదాయప్రసిద్ధము. ఫాలశిరోదేశములలో నుపానించుట ముఖ్యముగా తాంత్రికోపాసనలో ప్రసిద్ధము. వైదికులు సంధ్యాసమయములలో సూర్య మండలము నందలి చిచ్ఛక్తిని ధ్యానించెదరు. అట్లు ధ్యానించవలెనని **అహరహస్సంధ్యాముపాసీత** అను విధి కూడ ఉన్నది. తాంత్రికులదృష్టిలో హృదయకమలము సూర్యమండల ప్రాతినిధ్యము కలది. అనగా హృదయ కమలమే సూర్యమండలము. అందు ఇష్టదేవత ఉపాసించదగినదే అనుట సర్వోపాసక సమ్మతము. మధ్యేహృదయమ్ అను సమాసము దీనిని సూచించును. భ్రూమధ్యము నాసయొక్క పై అగ్రము ఫాలముయొక్క క్రింది అగ్రము. అక్కడ దీపాకారముగా తిలకాకారముగా శివలింగాకారముగా చిద్రూపజ్యోతిర్దర్శనము యోగులు చేయుదురనుట యోగసంప్రదాయములలోని ముఖ్య మతములలో నొకటి. మధ్యేనిటలమ్ అని ఆ మతముయొక్క సంప్రదాయమిట సూచితమైనది. భ్రూమధ్యము నందలి లింగాకారజ్యోతియొక్క ఆరంభముండి అది దాదాపు శిరస్సుయొక్క క్రింది యగ్రము వఱకు దాని చివఱ యుండును. దీర్ఘవర్తులముగా దర్శింపబడును. జ్యోతిస్సు

లింగాకారముగా నుండును. అది శివుని ఫాలాక్షము నందలి అగ్నియు నేక రూపములే యను భావనము శివాత్మసాధనోపాయము. శిరోమధ్యమున సహస్రారకమల మొకటి యున్నదని యోగులు చెప్పెదరు. ముఖ్యముగా తంత్రపద్ధతి నవలంబించు యోగులా సహస్రారమను చంద్రమండలమునకు కుండలినిని పంపి ఆ కుండలినియొక్క వేధమును చంద్రమండలమునకు కలిగించి అప్పుడు స్రవించు అమృతముచే శరీరములోని డెబ్బదిరెండువేల నాడులకాప్యాయనమును కలిగించెదరనునది శాక్త తంత్ర ప్రసిద్ధము. అపి శబ్దముచే సమయమతస్థుల ఉదరమధ్యమందలి నాభి ప్రదేశమున మణిపూరచక్రమున సాక్షాత్కరించిన అమ్మవారిని పూజించు సంప్రదాయము సూచింపబడుచున్నది. మూలాధార స్వాధిష్ఠానములందలి అమ్మవారికి కౌళు లొనరించు పూజ ధ్యానము కూడ సూచింపబడవచ్చుననవచ్చును. కాని యిది సమయమతానుసారియగు మూకకవికి సమ్మతము కాకపోవచ్చును. అమ్మవారు అనాహత కమలమున సూర్యకాంతి గలిగియున్నదిగా, ఫాలప్రదేశమున ఇంద్ర ధనుః కాంతిగలిగినదిగా, సహస్రారమున చంద్రకాంతి కలిగియున్నదిగా ధ్యానింప బడుటను ఉత్తరార్ధమందలి దీర్ఘసమాసము సూచించును. హృదయస్థా, రవిప్రఖ్యా, ఫాలస్థేంద్రధనుఃప్రభా ఇత్యాది లలితాసహస్రనామ స్తోత్రము నీధ్యానము చెప్పుచున్నది. పూర్వార్ధమందలి హృదయఫాలశిరఃక్రమము ననుసరించి సూర్యశక్ర ధనుశ్చంద్రకాంతుల క్రమము చెప్పబడుటచే నీ శ్లోకమున క్రమాలంకారము (యథా సంఖ్యాలంకారము)న్నది.



**అవ:–** పై శ్లోకమున తంత్రోక్తోపాయానుసారము హృదయఫాలశిరో మధ్యమున ఏయో కాంతులుగల అమ్మవారు ధ్యానింపబడవలెనో చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె శివునియొక్క **యంత్రమంత్రతంత్రమయ జీవనోపాయము**గా వర్ణింపబడు చున్నది.

**శ్లో॥ అధికాఞ్చి కేళిలోలై-**
**రఖిలాగమయన్త్రతన్త్రమన్త్రమయైః।**
**అతిశీతం మమ హృదయం**
**విషమశరద్రోహిజీవనోపాయైః॥ 51**

**ప్రతిపదార్థము :-**

అధికాంచి = కాంచీనగరమందు;
కేలిలోలైః = క్రీడలందాసక్తములైన;
అఖిలాగమయంత్రతంత్ర మంత్రమయైః = సమస్తములైన ఆగమములలోని యంత్ర తంత్రమంత్రములే స్వరూపములుగాగల;
విషమశరద్రోహిజీవనోపాయైః = మన్మథుని శత్రువు (శివుని)బ్రతుకు నుపాయములైన అమ్మవారిచే;

మమ = నాయొక్క;
హృదయమ్ = ఎద;
అతిశీతమ్ = మిక్కిలి చల్లబడియున్నది.

**తాత్పర్యము :-**

కాంచీనగర మందాటలయందు ఆసక్తయైన, అఖిలాగమములందలి యంత్రతంత్రమంత్రములు స్వరూపములుగాగల శివుని జీవనోపాయరూపమైన అమ్మవారిచేత నా హృదయము చల్లబడియున్నది.

**వివరణము :-**

శివుడు వాచామగోచరుడు. కావున ఆయన అభివ్యక్తుడు కాదు. ఆయన అనభివ్యక్తుడు. ఆయనయొక్క అభివ్యక్తియే ఈ ప్రపంచము. దీని అభివ్యక్తికి హేతువుగా ఆయనను అనుమానప్రమాణముచే అనుమానించు కొనవలెను. ఈ ప్రపంచాభివ్యక్తి మాయాకార్యమని కొందఱందురు. మాయ, అభివ్యక్తి యనునవి శివుని జీవనోపాయములు. శివుడున్నాడు అనుటకు ప్రపంచ ముండవలెను. ఈ ప్రపంచముయొక్క దర్శనమే ఆయన ఉనికికి ప్రమాణము. ఇట్లనుటయే ఆయన అనుమానప్రమాణగమ్యుడని చెప్పుట. అమ్మవారు శివుని జీవనోపాయమని చెప్పుట ఇదియే. ఈ ప్రపంచము శబ్దార్థమయము. శబ్దార్థాభి వ్యక్తియే అమ్మవారి స్వరూపము. అమ్మవారు మాయాస్వరూపిణి. మాయా కార్యమైన ప్రపంచముయొక్క స్వరూపము కూడ అమ్మవారే. అద్దములోని ప్రతిబింబము అద్దముకన్న వేరు కానట్లు మాయామయమైన ప్రపంచమును మాయయు వేరుకావు. మట్టియు, మట్టికార్యమైన కుండయు, వేరు కానట్లు మాయయు, మాయాకార్యమైన ప్రపంచమును వేఱుకావు. వివర్తవాదమందును పరిణామవాదమందును అమ్మవారే ప్రపంచపరిణామమున కుపాదానము కాని వివర్తవాదమందు శివుడు ప్రపంచాధిష్ఠానము. ప్రపంచము శివుని వివర్తమనుట విశేషము. ఈ వివర్తపరిణామాది వాదములను చెప్పినవి వివిధాగమములు. స్థూలముగా పౌరుషేయములు ఆగమములు, అపౌరుషేయములు వేదములు. పౌరుషేయములైన యంత్రమంత్రతంత్రములను నిరూపించు శాస్త్రములు ఆగమములు, యంత్రశాస్త్రములు మంత్రశాస్త్రములును ఆగమములలో చేరిన భాగములు. ఈ ప్రపంచము అంతయు శబ్దార్థమయమని చెప్పబడినది. శబ్దార్థములే నామరూపములు. మాయామాయిక ప్రపంచాభేదము ఇదివరకు చెప్పబడినది. అట్లే అర్థప్రపంచము శబ్దప్రపంచముకన్న వేరుకాదు. శబ్దప్రపంచమునుండియే అర్థప్రపంచము జనించినది. కావున శబ్దప్రపంచము కారణము. అర్థప్రపంచము కార్యము. కారణమునకు కార్యము భిన్నమైనది కాదు. మట్టికన్న కుండవేరు కాదని ఇదివఱకు చెప్పబడినది. శబ్దార్థములే నామరూపములనియు చెప్పబడినది. నామమును స్మరించినంతనే రూమును, రూపమును స్మరించినంతనే నామమును, మనసున మెదలును. కాళిదాసు అమ్మవారు శివుడు నామరూపములవలె విడదీయరానట్లు కలిసియున్నవారు అని రఘువంశ కావ్యారంభమున

చెప్పినారు. నామము మాయవంటిది. రూపము దానిలోని ప్రతిబింబము వంటిది. నామము అద్దము వంటిది. రూపము దానిలోని ప్రతిబింబము వంటిది. నామరూపముల అభేదము మాయామాయికా భేదము వంటిది. మంత్రశాస్త్రము శబ్దప్రపంచమున అనగా నామప్రపంచమున చేరినట్టిది. యంత్రశాస్త్రము అర్థప్రపంచమున అనగా రూపప్రపంచమున చేరినట్టిది. తంత్రశాస్త్రము ఆ రెంటి అభేదముయొక్క ధ్యానజ్ఞానముల ప్రతిపాదించు శాస్త్రము. మంత్రమునకు మాతృకవర్ణము. అచ్చు హల్లు రెండును వర్ణములనబడును. వర్ణములవలన ఏకాక్షరద్వ్యక్షరత్ర్యక్షరాది మంత్రములు పదములు నేర్పడును. పదములు కొన్ని మంత్రములలోను ఉండును. పదములతో వాక్యములేర్పడును. కొన్ని బహ్వక్షరమంత్రములలో వాక్యములుకూడ నుండును. మంత్రముల కర్థమున్నను అవి శబ్దప్రధానములు. యంత్రములలో బీజాక్షరములు వ్రాయబడినను వ్రాయబడకున్నను వానిలో శబ్దమునకన్న అర్థమునకే ప్రాధాన్యము. నామప్రపంచమునకు వర్ణము (అచ్చు హల్లు) మాతృకయైనట్లు; రూప ప్రపంచమునకు కూడ వర్ణము (రంగు) పితృస్థానమగును. అర్థప్రపంచ మూలవర్ణము **బిందు రేఖావృత్తతల ఘనాద్యాత్మకము**గా నుండును. వర్ణరహితము లైన అర్థములు కొన్ని యున్నను కనబడునదంతయు వర్ణమయమైన యర్థమే. అనగా రూపమే. వర్ణముల (అచ్చులు, హల్లులు)కు వర్ణములు (రంగు లున్నట్లు) మంత్రశాస్త్రము చెప్పును. అన్ని వర్ణములు తెల్లనివే అని మంత్రశాస్త్రము లోని కొన్ని గ్రంథములు చెప్పును. యంత్రములు రాగి మొదలైన లోహముల మరియు శిలల ఫలకములపై చెక్కబడును. దీర్ఘకాలవస్థాయులగుటకు అట్లు చెక్కబడును. అట్టి అవశ్యకత లేనప్పుడు గుడ్డలపై వ్రాయబడును. ఈనాడు కాగితములపై కూడ వ్రాయబడుచున్నవి. ఆ యంత్రములకు ధాన్యాధివాస శయ్యాధివాస జలాధివాసాదులు చేసి వేల లక్షల తద్యంత్ర సంబంధ మంత్రజపము హోమతర్పణాదులు చేసిన వానిని దేవాలయములలో ముందుగా ప్రతిష్ఠించి వానిపైన ఆయా దేవతల విగ్రహములు ప్రతిష్ఠింపబడును. ప్రతిష్ఠాతంత్రము లందు ఆయాయాధివాసములు మంత్రసంఖ్యాదులు వివరింపబడును. ఇట్లు యంత్ర మంత్ర తంత్ర సమన్వయ మాగమములందు చేయబడియుండును. ఇదిగాక శ్రీ చక్రాది చరయంత్ర తంత్ర సమన్వయమాగమములందు చేయబడియుండును. ఇదిగాక శ్రీచక్రాది చరయంత్రములందు విగ్రహాదులందువలె పూజాదులు నిర్వహింపబడు విధానము కూడ ఆగమములలోని తంత్ర గ్రంథములందు వివరింపబడును. ఇట్లు బహిర్యాగసంబంధ విషయములే కాక అంతర్యాగ సంబంధవిషయములలో వెనుక శ్లోకములో చెప్పబడిన మూలాధారాది శరీరాంతర్యాగచక్రములందు దేవతల నుపాసించు విధానముకూడ తంత్రము లందు వివరింపబడియున్నది. ముఖ్యముగా పుందేవతల యుపాసనల కన్న స్త్రీదేవతల యుపాసనముల వివరణములే తంత్ర గ్రంథములం దధికముగా నున్నవి. స్త్రీ దేవతల యుపాసనముల వివరించు గ్రంథములే శాక్తతంత్రములని చెప్పబడును. వానిలో శివశక్తి సామరస్యమున పర్యవసించు లలితా (రాజరాజేశ్వరీ కామేశ్వరీ కాలీ)ది దేవతల

యుపాసనలకే మరింత ప్రాచుర్యము కలదు. వానిలో కాదివిద్యాతంత్రగ్రంథములకు మరింత ప్రాచుర్యము కలదు. అమ్మవారు యంత్ర (విగ్రహ)ములందు పూజింపబడుట రూపోపాసనము. ఈ యుభయమును ఆశ్రయించి యంత్రముల ముందుంచుకొని మంత్రముల జపించుట మంత్రజప పూర్వోత్తరాంగములుగా యంత్రముల పూజించుటయు శిష్టసంప్రదాయముగా నున్నది. మంత్రజప మంగియైనప్పుడు యంత్రపూజ అంగము కాదు. యంత్రపూజ అంగియైనప్పుడు మంత్రజపము అంగముగాను ఉండును. **యజ్ఞానాం జప యజ్ఞోస్మి** (10.25) అను గీతావచనము ననుసరించి నామమంత్రజపమునుకు శ్రేష్ఠత యున్నది. ఇదిగాక పూజాజపములు అంగములుగా ధ్యానమంగిగా నుండునది ఉపాసనము. అదియే తంత్రశాస్త్రము యొక్క ముఖ్య ప్రతిపాద్యము. ఉపాసనమునకు బాహ్యపూజ అంగమైనట్లు, మానసికపూజ కూడ అంగమే. ఈ మానసికపూజయే అంతర్యాగమని చెప్పబడును. మానసికమైన హోమము కూడ అంతర్యాగమే. సర్వమును ఆత్మయందు హోమము చేయుట, లేక సర్వమును ప్రవిలాపింప జేయుట, లేక సర్వమును సమర్పించుట అంతర్యాగముయొక్క పరమావధి. ఈ పరమావధి నిర్వికల్పసమాధి రూపము. అది జీవ బ్రహ్మైక్య జ్ఞానికి నిద్రవంటిది. **నామము మంత్రము శబ్దము అమ్మవారి రూపము. రూపము యంత్రము విగ్రహము అర్థము అమ్మవారి రూపము.** ఆ రెంటియొక్క పరస్పరాను సంధానము తాదాత్మ్యభావనారూపమైన ఉపాసనము తంత్రము అమ్మవారి రూపము. ఇట్లు **అమ్మవారు మంత్రమయి, యంత్రమయి, తంత్రమయి.** ఈ శ్లోకమున ఈ మూడింటి రూపమైన అమ్మవారు శివుని జీవనోపాయమని చెప్పబడినది. అమ్మవారు లేనిదే శివుడుండడనుటయే జీవనోపాయ శబ్దార్థము. అది బహువచనాంతముగ అమ్మవారి యందు పూజ్యతను తెలుపుటకై చెప్పబడినది. శివుని జెప్పుటకు ఈ శ్లోకమున విషమశరద్రోహ శబ్దము ప్రయోగింపబడినది. విషమ శబ్దమునకు బేసియని యర్థము. మన్మథుని శరములు ఐదు. అది బేసి సంఖ్య కావున మన్మథుడు విషమశరుడని చెప్పబడును. శివుడు మూడు కన్నులు గలవాడు. కావున విషమాక్షుడని చెప్పబడును. విష్ణ్వాదులకు లేని ఫాలనేత్రము శివునకున్నది. అది జ్ఞానాగ్ని రూపము. కావున విషమశరుడైన కాముని (కామమును) అది దహించినది. మన్మథుని విషమశరత్వము అమ్మవారి విషమశరగా నుపాసించినందున నేర్పడినది. కావుననే తనయొక్క అనుగ్రహముగా నున్న విషమశరత్వము ఫాలాగ్ని దగ్ధమగుట చూచి అమ్మవారు తన కన్నులలో వానిని దాచి కామాక్షియైనది. మరల మన్మథునకు విషమశరత్వము ననుగ్రహించినది. విషమాక్షుని విషమత్వము నమ్మవారు పునస్స్వీకరించినది. శివుడు అమ్మవారిపట్ల కాముకుడైనాడు. అమ్మవారు కూడ విషమశరయే కావున ఆమె ప్రభావముచే శివుడు కాముకత్వము నొందుటలో విచిత్రమేమున్నది. ఇంతేకాదు అమ్మవారు లేనిదే శివుడు జీవించలేని పరిస్థితి యేర్పడినది. శివుడు జీవించవలెనన్న అమ్మవారి సాన్నిధ్యము అవసరమైనది. ఈ యర్థమంతయు

**విషమశరద్రోహిజీవనోపాయైః** అనుటచే వ్యంగ్యమైనది. ఈ శ్లోకమునందలి మొదటి మూడు పాదములు అకారాదులై 'వడి' కలిగియున్నవి.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి యంత్ర తంత్ర మంత్రమయ పరిణామము చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి **బిందువియన్నాదాది పరిణామము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ నన్దతి మమ హృది కాచన**
**మన్దిరయన్తీ నిరన్తరం కాఞ్చీమ్।**
**ఇన్దురవిమణ్డలకుచా**
**బిన్దువియన్నాదపరిణతా తరుణీ॥ 52**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| నిరంతరమ్ | = ఎల్లప్పుడు; |
| కాంచీమ్ | = కాంచీపురిని; |
| మందిరయన్తీ | = ఇల్లుగా చేసికొనుచున్న; |
| ఇందురవిమండలకుచా | = సూర్యచంద్రమండలములే స్తనములుగా గల; |
| బిందువియన్నాదపరిణతా | = బిందువుగా ఆకాశముగా నాదముగా పరిణమించిన |
| కాచన | = ఒక; |
| తరుణీ | = యువతి; |
| మమ | = నాయొక్క; |
| హృది | = ఎదయందు; |
| నందతి | = ఆనందించుచున్నది. |

**తాత్పర్యము :-**

ఎల్లప్పుడు కాంచిపురినే నివాసముగా చేసికొన్న సూర్యచంద్ర మండలములే పాలిండ్లుగాగల బిందువుగా, ఆకాశముగా, నాదముగా పరిణమించిన ఒక తరుణి నా యెదలో నానందించుచున్నది.

**వివరణము :-**

1) శ్రీ శంకరులు **ముఖమ్ బిందుమ్ కృత్వా కుచయుగమధస్తస్య** అని కామకలాధ్యాన ప్రకారమును చెప్పినారు. కామకల అమ్మవారు. కామకలలోని బిందువు అమ్మవారి ముఖము, దానిక్రింది రెండు బిందువులు కుచయుగము అని చెప్పినారు. ఆ రెండు కుచములు సూర్యచంద్రమండలములని మూకకవి **ఇందురవిమండలకుచా** యను సమాసముతో మూడవ పాదములో వివరించినారు. బిందువు శివశక్త్యైక్యరూపము. శివశక్తులు పృథగ్భావము నొంది వియన్నాదములుగా మారినారు. అందును నాదము

శక్తి, వియత్తు శివుడు. నిరంజనము నిర్గుణమునైన చిత్తు. సగుణత్వమందినప్పుడు బిందువుగా శివశక్త్యైక్యరూపమున పరిణమించుట ప్రథమపరిణామము. ఆ బిందువు వియన్నాదములుగా పరిణమించుట ద్వితీయపరిణామము. సగుణమైనను శివశక్త్యైక్యరూపబిందువు సచ్చిదానందఘనము అర్ధనారీశ్వరతత్త్వమున కది సంకేతము. ఆ బిందువులు వియన్నాదములుగా శివశక్తులుగా (శివపార్వతులుగా) విడిపోవుట (శబ్దార్థాత్మక) నామరూపాత్మక పరిణామము గడచిన శ్లోక వివరణము నందు నాదము(వాక్కు) పార్వతీరూపము అని చెప్పబడినది. వియత్తు నాశ్రయించి నాదముండును. అట్లే శివునాశ్రయించి పార్వతి యుండును. రూప (అర్ధ) ప్రపంచమూలము శివుడు.. నామప్రపంచమూలమైన నాదము (వాక్కు) పార్వతి యని ఇంతకుముందే చెప్పితిని. ఈ పరిణామ మంతయు సృష్ట్యారంభమున జరుగును. ప్రలయవేళ వియన్నాదరూపులైన పార్వతీ పరమేశ్వరులు బిందువులై ఐక్యమందుదురు.

2) ఈ శ్లోకము మూడు పాదముల ఆదిలో ప్రాసమున్నది.



**అవ:-** జీవుని దుఃఖమునకు హేతువైన అమ్మవారి వియన్నాదాది పరిణామ రూప సంసారము పై శ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున ఈ సంసారజ్వర దుఃఖము పోవుటకు కావలసిన ఔషధముకూడ అమ్మవారే అని చెప్పబడుచున్నది.

శ్లో॥ **శమ్పాలతాసవర్ణం**
**సమ్పాదయితుం భవజ్వరచికిత్సామ్।**
**లిమ్పామి మనసి కిఞ్చన**
**కమ్పాతటరోహి సిద్ధభైషజ్యమ్॥ 53**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| శమ్పాలతాసవర్ణమ్ | = మెఱుపుతీగవంటి; |
| భవజ్వరచికిత్సామ్ | = సంసారరోగచికిత్సను; |
| సమ్పాదయితుమ్ | = సంపాదించుటకు; |
| కమ్పాతటరోహి | = కమ్పానదీ తీరమున మొలచు; |
| కించన | = ఒకానొక; |
| సిద్ధభైషజ్యమ్ | = సిద్ధౌషధమును; |
| మనసి | = మనస్సున; |
| లిమ్పామి | = పూసెదను. |

**తాత్పర్యము :-**

సంసారరోగమునకు చికిత్స చేయుటకు మెఱుపుతీగ వంటి వన్నెతో

సమానమైన వన్నెగల, కమ్పానదీతీరమున మొలచు సిద్ధౌషధము నొక దానిని అనగా అమ్మవారిని నా మనసున పూసెదను.

**వివరణము :-**

1) సంసారమనునది మానసిక వ్యాధి. దానివలన మనసు గాయపడును. ఆ గాయము మాయుటకు లేపనము కావలెను. కమ్పానదీ తీరమందు మెఱుపుతీగ వంటి ఓషధి (అమ్మవారు) మొలచియున్నది. ఆ ఓషధియొక్క రసమును నా మనస్సునకు పూసెదను అని కవి చెప్పవలెను. ఆ రసమే అనగా అమ్మవారి ధ్యానమే సంసారమను మానసిక వ్యాధికి చికిత్స కాని అమ్మవారే ఆ లేపనము అని శ్లోకమున కవిచే ప్రధానముగా చెప్పబడినది. మానసిక వ్యాధి వలన శరీరమున కూడ తాపము కనబడును. సంసారవ్యాధి శరీరమున తాపమును జనింపజేయదు. జ్వరము కూడ మనస్సునకే కలుగును. వాస్తవమునకు శరీరము నందలి జ్వరము వలన బాధపడునది మనస్సే. సంసారము మనోజ్వరమని కవి చెప్పుట ఉచితముగ నున్నది. మనస్సునకే చికిత్స అవసరము కావున అమ్మవారినే మనసున చూసికొందును అని కవి చెప్పుచున్నాడు.

2) అన్ని పాదములందాది ప్రాసమున్నది. శమ్పాలతాసవర్ణమ్ అను పాదమున ఉపమాలంకార స్ఫూర్తి యున్నది. చాలా శ్లోకములందున్నట్లు ఈ శ్లోకమున కూడ పర్యాయోక్తాలంకార మున్నది. చాలా శ్లోకములలో పర్యాయోక్త్యలంకారము అతిశయోక్త్యను ప్రాణితమైనట్లు ఈ శ్లోకమున కూడ అట్లే ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున భవజ్వరనివారణోపాయము అమ్మవారని చెప్పబడినది. భవజ్వరము తొలగగా కలుగు ఆనందము నమ్మవారే ఇచ్చునని ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ అనుమితకుచకాఠిన్యా-**
**మధివక్షఃపీఠమఙ్గజన్మరిపోః।**
**ఆనన్దదాం భజే తా-**
**మానఙ్గబ్రహ్మతత్త్వబోధిసిరామ్॥ 54**

**ప్రతిపదార్థము :-**

అఙ్గజన్మరిపోః = మన్మథశత్రువు(శివుని)యొక్క;
అధివక్షఃపీఠమ్ = ఱొమ్ము అను పీటయందు;
అనుమితకుచకాఠిన్యామ్ = అనుమానింపబడిన స్తనముల కఠినతగల
ఆనఙ్గబ్రహ్మతత్త్వబోధిసిరామ్ = మన్మథునిచే ప్రతిపాదించబడిన బ్రహ్మతత్త్వమును బోధించు నాడియైన;
ఆనన్దదామ్ = ఆనందమునొసగు;

తామ్ = ఆమెను(అమ్మవారిని);
భజే = సేవించెదను.

**తాత్పర్యము :-**

శివుని రొమ్మునందు అనుమానింపబడిన స్తనముల కఠినతగల మన్మథ ఋషిప్రతిపాదితబ్రహ్మతత్త్వమును బోధించు నాడియైన ఆ అమ్మవారిని భజించెదను.

**వివరణము :-**

1) కొండమీద అగ్ని ఉన్నది. పొగ (యుండుట) వలన అనునది అనుమానము. అనగా హేతువుచేత బాహ్యేంద్రియముల కనుగొనలేని వస్తువును కనుగొనుట హేతువు ప్రత్యక్షముగా నుండును. పై అనుమానమున పొగ కనబడుచున్నది. అగ్ని కనబడకున్నను పొగయున్న చోట అగ్ని ఉండును కావున అగ్ని ఉన్నదని నిశ్చయించుకొనుట అనుమానము. ప్రత్యక్షమాధారముగా పనిచేయు ప్రత్యక్షానంతరిక ప్రమాణము (అను-తరువాత, మానము- ప్రమాణము). ఈ శ్లోకమున అమ్మవారి కుచద్వయము కొండల జంట వంటిది. ఎక్కడ కనబడని విషయమున్నదని హేతువుచేత నిశ్చయింపబడునో అది పక్షమనబడును. అమ్మవారి కుచద్వయము కూడ పక్షమే. కాఠిన్యము కంటికి కనబడునది కాదు. శివుని రొమ్మునందలి కాఠిన్యము అనుమానింపబడుచున్నది. కొండయందు నిప్పువలె కుచములందు కాఠిన్యముకూడ హేతువుచే నిర్ధారించుకొనవలసి యున్నందున సాధ్యము అనబడును. శివుని రొమ్మునందలి గుర్తులే అమ్మవారి కుచముల కాఠిన్యము సాధించు హేతువులు ఇవి. కొండమీద కనబడు పొగవంటివి. పొగవలననే కదా మనము అగ్ని ఉన్నదని నిర్ధారించుకొనగలుగుట. సాధ్యము (కాఠిన్యము) కుచములందున్నది. హేతువులు రాపిడి గుర్తులు. (ఆలింగనము వలన శివుని రొమ్మునందు విభూతి తొలగుట ఆ విభూతి మీద అమ్మ వారి స్తనములందలి కుంకుమ మరకలు) శివుని రొమ్ము నందున్నవి. కావున హేతుసాధ్యములు. భిన్న స్థలములందుండుట హేత్వాభాసము అను అనుమానదోష మున్నదని చెప్పుట కవకాశమున్నది. అయినను వాస్తవముగా ఇచట ఆ గుర్తులే హేతువులని చెప్పబడినను స్తనములందలి ఆ గుర్తుల నేర్పఱచగలుగుట అను ధర్మమే హేతువు. కావున ఇచట ఆ దోషము లేదు. అస్తు. పూర్వార్ధమున అనుమానాలంకార మున్నది.

2) సుషుమ్నానాడియందు కుండలినీ శక్తి మూలాధారాది చక్రముల భేదించుకొని చివఱకు సహస్రారము జేరి శివైక్యము నొందును. ఆ శక్తి (అమ్మవారే) ఆ సుషుమ్నా నాడియే అని లక్షణావృత్తిచే చెప్పబడినది. సహస్రారమున కుండలినీ వేధముచేతనే ఆనందము కలుగును. ఆనందము నొసగునది అమ్మవారే అని చెప్పబడినది. లేక అమ్మవారి అనుగ్రహము చేత కుండలినీ యోగుల శక్తిపాతద్వారమున ఆనందము

కలుగును. కావున అమ్మవారే ఆనందం. పూర్వార్ధపాదములు అకారాదులై ఉత్తరార్ధ పాదములు ఆకారాదులై వడి కలిగియున్నవి. కాదివిద్యకు ఋషి మన్మథుడు. కావున అనంగబ్రహ్మవిద్య యనబడును. దానివలన జపోపాసనముల ద్వారమున వానివలన కలుగు జీవబ్రహ్మైక్యజ్ఞానమే ఇట ఆనంగబ్రహ్మతత్త్వబోధమని చెప్పబడినది. ఆ బోధము నొసగు కుండలిని నివసించు సుషుమ్న కూడ అమ్మవారే అని ఈ శ్లోకమున చెప్పబడినది.



**అవ:-** పై శ్లోకమున అనంగబ్రహ్మతత్త్వబోధము ప్రస్తావింపబడినది. అది ఎట్టి ధ్యానమువలన కలుగునో అట్టి పాశాంకుశహస్తాన్తమైన అమ్మవారి ధ్యేయరూపము యొక్క దర్శన మీ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఐక్షిషి పాశాఙ్కుశధర-**
**హస్తాన్తం విస్మయార్హవృత్తాన్తమ్।**
**అధికాఞ్చి నిగమవాచాం**
**సిద్ధాన్తం శూలపాణిశుద్ధాన్తమ్॥ 55**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| అధికాంచి | = | కాంచీనగరమున; |
| పాశాంకుశధరహస్తాన్తమ్ | = | పాశమును అంకుశమును ధరించు ముంజేతులుగల; |
| విస్మయార్హవృత్తాన్తమ్ | = | ఆశ్చర్యపడదగిన సంగతులుగల; |
| నిగమవాచామ్ | = | వేదవాక్యములయొక్క; |
| సిద్ధాన్తమ్ | = | సిద్ధాన్తమైన; |
| శూలపాణిశుద్ధాన్తమ్ | = | శూలమును చేత ధరించువాని (శివుని) భార్యను; |
| ఐక్షిషి | = | చూచితిని. |

**తాత్పర్యము :-**

కాంచీనగరమున ముంజేతులలో పాశాంకుశములు ధరించి విస్మయమును కలిగించు సంగతులెన్నో కలిగిన, వేదవాక్యముల సిద్ధాంతమైన శివుని భార్యను చూచితిని.

**వివరణము :-**

అమ్మవారు పాశాంకుశముల ధరించినది. జీవుల రాగక్రోధములే ఆ పాశాంకుశములు. జీవులలో రాగము, క్రోధము కలుగుట అమ్మవారి చేతిపని. ఎంతటి జ్ఞానియైనను వానికి రాగము అమ్మవారి ఇచ్ఛవలన కలుగును. అట్లే క్రోధమును కలుగును. అట్లే మోహము కూడ కలుగును. మోహము జ్ఞానులకు సైతము అమ్మవారివలననే కలుగును అని సప్తశతియందు చెప్పబడినది. ఇచ్ఛాశక్తియే పాశమని, జ్ఞానశక్తియే అంకుశమని,

కొన్ని తంత్ర గ్రంథములందు చెప్పబడినది. భండాసురవధాదికమైన అమ్మవారి చరిత్రము విస్మయజనకము కావున అమ్మవారు విస్మయార్హవృత్తాంతము (కలది). అమ్మవారు వేదవాక్కుల చేత ప్రతిపాదింపబడిన సిద్ధాంతము అనగా అమ్మవారియందు వేదముయొక్క తాత్పర్యమున్నది. వేదమునందలి మంత్రాదులలో భిన్నాభిన్నవిషయములు చెప్పబడినను వానియందు వేదమునకు తాత్పర్యము లేదు. కావున అమ్మవారే వేదవాక్కుల సిద్ధాంతమైయున్నది. అమ్మవారు శూలపాణిసిద్ధాంతమునందు అనగా అంతఃపురమునందు ఉండునది. కావున ఆమెయే శూలపాణి సిద్ధాంతముగా చెప్పబడినది. ఈ శ్లోకమున చాలా పదముల అంతమందు ప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి ధ్యేయమూర్తి చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారు జ్ఞాన(స్ఫూర్తి) మయ విద్యామూర్తి అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆహితవిలాసభఙ్గీ-**
**మాబ్రహ్మస్తమ్బశిల్పకల్పనయా।**
**ఆశ్రితకాఞ్చీమతులా-**
**మాద్యాం విస్ఫూర్తిమాద్రియే విద్యామ్॥ 56**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| ఆబ్రహ్మస్తమ్బశిల్పకల్పనయా | = | బ్రహ్మమొదలు స్తమ్బమువఱకుగల శిల్పముయొక్క కల్పనచేత; |
| ఆహితవిలాసభంగీమ్ | = | చేయబడిన విలాసరీతులుగల; |
| ఆశ్రితకాంచీమ్ | = | కాంచీనగరము నాశ్రయించిన; |
| అతులామ్ | = | సాటిలేని; |
| ఆద్యామ్ | = | మొదటి; |
| విస్ఫూర్తిమ్ | = | విస్ఫురణరూపమైన; |
| విద్యామ్ | = | విద్యను (అమ్మవారిని); |
| ఆద్రియే | = | ఆదరించెదను. |

**తాత్పర్యము :-**

ఆ బ్రహ్మస్తంబజీవుల కల్పన మామెవిలాసము. ఆ ఆద్యావిస్ఫూర్తి రూపిణియైన, సాటిలేని, కాంచినగరము నాశ్రయించిన విద్యను (అమ్మను) ఆదరించెదను.

**వివరణము :-**

చతుర్ముఖబ్రహ్మ హిరణ్యగర్భనామ ధేయుడు. ఆయన ప్రథమజీవుడు. ఉత్తమోత్తమ జీవుడు. స్తమ్బమనగా చెఱుకుయొక్క జొన్నతుంగ మొదలగు జాతులకు చెందిన చిన్నమొక్కయొక్క పేర్ల సముదాయము (మూలము). జీవులలో స్థావరములే

అధమములు. వానిలో స్తమ్బము మిక్కిలి చిన్నమొక్క అధమాధమ జీవి. ఉత్తమోత్తమజీవి మొదలు అధమాధమజీవివఱకుగల జీవులు అనగా సమస్తజీవులు భిన్నులుగా కనబడుటకు హేతువులు శరీరములు. వానిలోని స్థూలశరీరముల నిర్మాణమునందు శిల్ప (కల్పన) చాతుర్యము మనకు స్పష్టముగా గోచరమగును. ఇంతటి శిల్పమును కల్పించుట కామె యేమియు శ్రమపడలేదు. ఆ శిల్పకల్పన మామె విలాసముగనే యొనర్చినది. అది యామె విలాసము మాత్రమే. ఆద్య విస్ఫూర్తి యనగా మొదటి వృత్తి జ్ఞానము. అది అహమాకారము. దీనికే అహంకారమని పేరు. అమ్మవారు అహంకారరూపిణి అనుట ఫలితాంశము. **బహు స్యామ్ ప్రజాయేయ** (ఛా.6-2.3) ఇత్యాదులు (బహు భవనసంకల్పాదులు) తదనంతర వృత్తులు. ప్రధానము ప్రకృతి అవ్యక్తము ఇత్యాది నామములుగల సాంఖ్యోక్త ప్రథమతత్త్వము మొదలు చతుర్వింశతితత్త్వములు అవిద్యారూపములు. పురుషతత్త్వము విద్యారూపము. అవిద్యారూప చతుర్వింశతి తత్త్వాత్మక ప్రకృతి విద్యారూపపురుషతత్త్వము ఉభయమును అమ్మవారే అనుట ఫలితాంశము. ఈ శ్లోకములోని నాలుగు పాదము లాకారాదులై వడి కలిగియున్నవి. నాలుగవ పాదము యొక్క ఆదిమధ్యము లందు కూడ వడియున్నది.



**అవ॥:-** పై శ్లోకమున ఆబ్రహ్మస్తంబ జగచ్ఛిల్పకల్పనమమ్మవారి విలాసమని చెప్పబడినది. ఈ శ్లోకమున అఘటన ఘటనా రూపమైన అమ్మవారి విలాసము చెప్పబడుచున్నది.

**శ్లో॥ మూకోఽపి జటిలదుర్గతి-**
**శోకోఽపి స్మరతి యః క్షణం భవతీమ్।**
**ఏకో భవతి స జన్తుః**
**లోకోత్తరకీర్తిరేవ కామాక్షి॥ 57**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| మూకః+అపి | = మూగయైనను; |
| జటిలదుర్గతిశోకః+అపి | = తీవ్రమైన క్లేశసముదాయముయొక్క దుఃఖము కలవాడైనను; |
| యః | = ఎవడు; |
| క్షణం | = క్షణకాలము; |
| భవతీమ్ | = నిన్ను; |
| స్మరతి | = తలచునో; |
| సః | = ఆ; |
| ఏకః | = ఒక; |
| జన్తుః | = ప్రాణియే; |

లోకోత్తరకీర్తిః = లోకాతిశాయియైన కీర్తిగలవాడు;
భవతి = అగును.

**తాత్పర్యము :-**

మూకుడు (మూగవాడు), తీవ్రదారిద్ర్యాది దుర్గతి శోకుడునైన ప్రాణి నిన్ను క్షణకాలము స్మరించెనేని లోకోత్తరకీర్తిగలవాడగును.

**వివరణము :-**

లోకమున చక్కగా మాటాడువానికే కీర్తి కలుగును. మూగవానికి అపకీర్తి యుండును కాని కీర్తియుండదు. అందఱు మూగవానిని అపహసించెదరు కూడ. అట్లే దారిద్ర్యాది దుర్గతికి లోబడిన వానికిని అపకీర్తియే యుండును. వానినెవరు పట్టించుకొనరు. జాలితో నెవరైన బిచ్చమిడుదురేమో కాని ప్రశంసించరు. అట్టివాడు కూడ క్షణకాల మమ్మవారిని స్మరించెనేని వాడు లోకము నందందఱికంటె అధికమైన కీర్తిగలవాడై అందఱిచే ప్రశంసింపబడుచుండును. ఈ శ్లోకమునందలి విరోధాలంకారము అమ్మవారి స్మరణమహత్త్వమును వ్యక్తీకరించును. నాలుగు పాదములందాది ప్రాసము కలదు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి స్మరణము శోకహరమని చెప్పబడినది. ఈ శ్లోకమున స్మరణీయమైన అమ్మవారి **పంచదశీ మంత్రరూపము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ పఞ్చదశవర్ణరూపం**
**కఞ్చన కాఞ్చీవిహారధౌరేయమ్।**
**పఞ్చశరీయం శమ్భో-**
**ర్వఞ్చనవైదగ్ధ్యమూలమవలమ్బే॥ 58**

**ప్రతిపదార్థము :-**

పఞ్చదశవర్ణరూపమ్ = పదేను వర్ణముల మంత్రమే రూపముగాగల;
కాఞ్చీవిహారధౌరేయమ్ = కాంచీనగరమున విహరించుటకు ముందుండు;
పఞ్చశరీయమ్ = మన్మథునకు సంబంధించిన;
కఞ్చన = ఒకానొక;
శమ్భోః = శివునియొక్క;
వంచనవైదగ్ధ్యమూలమ్ = మోసముచేయు నేర్పరితనమునకు మూలమును (అమ్మవారిని);
అవలమ్బే = ఆశ్రయించెదను.

**తాత్పర్యము :-**

కాంచీపుర విహారమందాసక్తి చూపు శివుని వంచింపవలెనను మన్మథుని

నైపుణ్యమునకు మూలమైన పంచదశీ మంత్రరూపిణియైన అమ్మవారిని ఆశ్రయించెదను.

**వివరణము :-**

కాదివిద్య అనగా **కాది పంచదశీ విద్య** తత్సంబంధితానేకానేక రహస్యముల జ్ఞానము. అకారాది పంచదశీ మంత్రమే అమ్మవారి సూక్ష్మరూపము. కరచరణాది మయరూపము అమ్మవారి స్థూలరూపము.. స్థూలరూపము ధ్యానము నకు ముఖ్యముగా అర్చనకు అనుకూలము. సూక్ష్మరూపము ధ్యానమునకు, జపమునకు అనుకూలము. అమ్మవారి సూక్ష్మరూపమైన పంచదశీ మంత్రమున పదేను (అక్షరములు) వర్ణములున్నవి. అందుచేతనే ఆ మంత్రము పంచదశి యనబడుచున్నది. **పంచదశవర్ణరూపమ్** అను సమాసమునందలి వర్ణశబ్దము అక్షరము అను అర్థమును బోధించును. వాస్తవమునకు కాదిపంచదశీ మంత్రమందు అచ్చులు పదేను, హల్లులు పదారు, మూడు బిందువులు, మూడు నాదములు కలిసి మొత్తము ముప్పదియేడు వర్ణములున్నవని **అజ్వ్యంజన బిందుత్రయ నాదత్రితయైర్విభావితాకారా షట్త్రింశత్తత్త్వాత్మా తత్త్వాతీతా చ కేవలా విద్యా** అను శ్లోకము చెప్పుచున్నది. శాక్తేయతంత్రమున తత్త్వములు ముప్పది యాఱు. ముప్పదియేడవ తత్త్వము ఆత్మరూపము. ఈ మంత్రమందలి ముప్పదేడు వర్ణములా ముప్పదేడు తత్త్వములకు ప్రతీకములు కావున అమ్మవారి బ్రహ్మాండమయ స్థూలరూపము మంత్రముయొక్క వాచ్యమని పై శ్లోకము సూచించును. ఈ కాది విద్య పంచశరీయము అనగా మన్మథర్షిదృష్టము. మన్మథర్షికాదర్శించు అనుగ్రహము పంచశరయగు అమ్మవారి చేతనే లభించినది. అందువలన కూడ అమ్మవారు పంచశరీయము అని పేర్కొనబడినది. పంచశరుని శివుడు చంపినాడు. వానిని చంపినాననుకొని శివుడు తనకిక కామబాధ యుండదని యనుకొన్నాడు. పంచశరుడు పంచశరమైన అమ్మవారి కన్నులనుండి పునర్జన్మనందినాడు. పంచశరయగు నమ్మవారిని చూచినను ఆమె ఆదుది కావున తాను పంచశరుని చూచుట లేదనుకొన్నాడు. అమ్మవారి పట్ల కామమును పొందుచునే యుండుట నా శివుడు గమనింపనేలేదు. ఇట్లు అమ్మవారి సాయముతో శివుని మన్మథుడు వంచించినాడు. అట్లు వంచించు వైదగ్ధ్యము నమ్మవారే ప్రసాదించినది. కావున దానికి మూలమమ్మవారే కావున శంభోర్వంచనవైదగ్ధ్యమూలమని ఆమె చెప్పబడినది. నాలుగు పాదములలో ఆదిప్రాసమున్నది.

కఏఈలహ్రీం హసకహలహ్రీం సకలహ్రీం



**అవ:-** పై శ్లోకమున పంచదశవర్ణ (మంత్ర) రూపము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి పంచాశద్వర్ణకల్పితపదశిల్పము ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ పరిణతవతీం చతుర్ధా**
**పదవీం సుధియాం సమేత్య సౌషుమ్ణీమ్।**

పఞ్చాశదర్ణకల్పిత-
పదశిల్పాం తాం నమామి కామాక్షీమ్॥ 59

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| సుధియామ్ | = విద్వాంసులయొక్క; |
| సౌషుమ్ణీమ్ | = సుషుమ్నానాడికి చెందిన; |
| పదవీమ్ | = మార్గమును; |
| సమేత్య | = పొంది; |
| చతుర్ధా | = నాల్గువిధములుగా; |
| పరిణతవతీమ్ | = పరిణామములుగల; |
| పంచాశదర్ణకల్పితపదశిల్పామ్ | = ఏబది వర్ణములతో కల్పింపబడిన పదముల శిల్పముగల; |
| తామ్ | = ఆ; |
| కామాక్షీమ్ | = కామాక్షీదేవిని గూర్చి; |
| నమామి | = నమస్కరించెదను. |

**తాత్పర్యము :-**

విద్వాంసుల సుషుమ్నా నాడిలో పరాపశ్యంత్యాది చతుర్విధ పరిణామ ముల నందిన ఏబది వర్ణములలో పదశిల్పముల నెన్నింటినో కల్పించిన ఆ కామాక్షీ దేవికి మ్రొక్కెదను.

**వివరణము :-**

సుషుమ్నానాడి అధోభాగము మూలాధారము. ఆ నాడికి మూలము ఆధారమునైనందున ఆ చక్రము **మూలాధార**మని పిలువబడినది. అచ్చట ఇచ్ఛాశక్తిచే ప్రేరేపింపబడిన వాయువు(అగ్ని) పరాపశ్యంత్యాది చతుర్విధ వాక్కులుగా పరిణమించు ప్రక్రియ ఆరంభింపబడును. ఆ వాయువు శివ స్వరూపము. ఆ వాయువులోని అగ్ని శక్తిరూపము. ఆ రెంటియొక్క ఐక్యమే వాక్కుయొక్క ప్రథమపరిణామము. అదియే **పర.** అది బీజరూపము. స్వాధిష్ఠానము నందు ఆ బీజము ఉచ్ఛూనమగును. మణిపూరమున ఏకరూపమైన బీజము ద్విధా భావము నొంది **పశ్యంతి** యనబడును. ద్విధా భావము కనిపించుటయే దాని పశ్యంతీత్వము. ఇది ప్రధానముగా జ్ఞానశక్తి రూపము. అనాహతమున ఇతరులకు వినిపింపని నాదము కలిగి **మధ్యమ** యనబడును. అది కంఠదేశము నందలి విశుద్ధచక్రమున ఇతరులకు వినిపించు ధ్వని కలిగి క్రియాశక్తిరూపిణియై స్వరవ్యంజనాది శాఖాసహితగా విస్తరించి **వైఖరి** యని పేర్కొనబడును. స్వరవ్యంజన భేదములుగల పంచాశద్వర్ణములలో స్వరములు శక్తి రూపములు. వ్యంజనములు శివరూపములు. వర్ణమే **అర్ణము** అని కూడ చెప్పబడును. విశుద్ధి

చక్రమునందు వైఖరీత్వమందిన ఈ పంచాశద్వర్ణాత్మక వాక్కు మూలాధారాది షట్చక్రముల వివిధ సంఖ్యగల దళములుగా విస్తరించి యుండును. ఈ పంచాశద్వర్ణములే సమస్తపదములు, వాక్కులు జనించుటకు హేతువు లైనందున **మాతృక**లని పేర్కొనబడును. మొత్తమేబది వర్ణముల సమాహారముకూడ మాతృక యని పేర్కొనబడును. పదోచ్చారణమే అర్థ జన్మమునకు హేతువనుట తాంత్రిక సంప్రదాయము. **వేదశబ్దేభ్య ఏవాదౌ జగన్నిర్మమే** వంటి సూక్తులు ఈ సంప్రదాయముయొక్క వైదికతను చాటుచున్నవి. ఈ మాతృక అమ్మవారు కావున ఆమె **పంచాశదర్ణకల్పితపదశిల్ప** యని పేర్కొనబడినది. నాలుగు పాదములు పాదులై వడి కలిగియున్నవి.



**అవ:-** పై శ్లోకమున మాతృకారూప పంచాశదర్ణములు ప్రస్తావింపబడినవి. ఈ శ్లోకమున ఆ మాతృక మంత్రరూపమనియు, దానిని గురుసార్వభౌముని అనుగ్రహముచే కవి పొందినట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆదిక్షన్మమ గురురా-**
**డాదిక్షాన్తాక్షరాత్మికాం విద్యామ్।**
**స్వాధిష్ఠచాపదణ్డాం**
**నేదిష్ఠామేవ కామపీఠగతామ్॥ 60**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| స్వాధిష్ఠచాపదండామ్ | = మిక్కిలి తీయని చెఱుకు వింటికట్టుగల; |
| కామపీఠగతామ్ | = కామపీఠమందున్న; |
| నేదిష్ఠామ్ | = మిక్కిలి సమీపమందున్న; |
| ఆదిక్షాన్తాక్షరాత్మికామ్ | = అకారము మొదలు క్ష కారము వఱకున్న అక్షరములు స్వరూపముగాగల; |
| విద్యామ్ ఏవ | = విద్యయే యైన అమ్మవారిని (మాతృకను); |
| గురురాట్ | = గురుసార్వభౌముడు; |
| మమ | = నాకు; |
| ఆదిక్షత్ | = ఉపదేశించెను. |

**తాత్పర్యము :-**

తీయని చెఱుకువింటి కట్టు ధరించిన, కామపీఠమందున్న మిక్కిలి దగ్గఱగా నున్న, అకారాది క్షకారాన్త విద్యాస్వరూపిణియైన మాతృకను నాకు గురుసార్వభౌము డుపదేశించెను.

**వివరణము :-**

1) మూలాధారమున వ,శ,ష,స (4);స్వాధిష్ఠానమున- బ,భ,మ, య,ర,ల

(6); మణిపూరమున-డ,ఢ,ణ,త,థ,ద, ధ,న,ప,ఫ(10); అనాహతమున -క,ఖ,గ,ఘ,ఙ,చ,ఛ,జ,ఝ,ఞ,ట,ఠ(12); విశుద్ధమున అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ, ఋ,ౠ,ఌ,ౡ,ఎ,ఏ,ఐ,ఒ,ఓ,ఔ,అమ్,అః(16); ఆజ్ఞాచక్రమున హ,ళ,లేక హ,క్ష(2); సహస్రారమున క్ష లేక సర్వవర్ణములు(1). పై పట్టికను పరిశీలించిన వర్ణముల సంఖ్య 'క్ష'తో కలిసి ఏబది ఒకటి యని దానిని విడచి ఏబదియని తెలియుచున్నది. కాని కవి ఆదిక్షాన్తక్షరాత్మకము విద్యయన్నారు. పూర్వశ్లోకమున వానిసంఖ్య ఏబది యని చెప్పినారు. క్షకారముతో కూడి యేబది యను సంఖ్యను కవి నిర్దేశించినందున ఏబదికి ఏబది యొకటికిగల స్వల్పభేదము (ఏకాక్షర భేదము) పట్టించుకొననక్కఱ లేదని హకారము మహాప్రాణాంతర్గతమైనందున దానిని విడువవలెననియే కవి భావించియుండవచ్చును. **అత్రాకథా అక్షరాః సన్నివిష్టాః(1)** అను త్రిపురోపనిష ద్వాక్యమున హ,ళ,క్ష అను మూడు వర్ణములను విడచి వేయబడిన మూడు షోడశులు (48) మాత్రమే సంగ్రహింపబడినవి. విశుద్ధ్యాది మూలాధార పర్యంతమువఱకుగల ఐదు చక్రముల దళముల మొత్తము నలుబది యెనిమిదియే అని గమనింపవలెను. **హ,ళ,క్ష** అను మూడును ఆజ్ఞాసహస్రార చక్రములకు సంబంధించినవిగా చదువరు లీవఱకే గుర్తించి యుందురను కొందును. అదిగాక అహమ్ ప్రత్యాహారము నందు క్ష చేరనే చేరదు. ళ కారము లకార డకారముల లోని యొక వర్ణముతో నైక్యమొంది ప్రయోగింపబడుటయు విజ్ఞులెఱిగినదే. క్షకారమును కలిపికొని అక్ష అను ప్రత్యాహారమును కల్పించుకొని దానియందు రమించుటచే వర్ణముల కక్షరవ్యవహారము కూడ సముచితమే. ఈ విషయములు **ఆదిక్షాన్తాక్షరాత్మికా** అని ఈ శ్లోకమున, పూర్వశ్లోకమున **పంచాశదర్ణకల్పితపదశిల్ప** అని ప్రయోగించుటచే కవికీ సంప్రదాయభేదముల పరిచయము కలిగింపవలెనను కోరికయున్నదని సూచింపబడుచున్నది. స్త్రీదేవతా ప్రధాన మంత్రములకు **విద్య**యను వ్యవహారము కలదు. ఆదిక్షాన్తాక్షరాత్మిక మాతృకయు విద్యయే. మాతృకయు మాత్రమే అని అదియే కవికి గురూపదిష్టమైనదని చెప్పుటకు విద్యాశబ్ద ప్రయోగము సముచితముగానున్నది. మాతృకావిద్య అమ్మవారి నామము. కామపీఠమందున్న తీయని చెఱుకు విల్లు ధరించినది రూపము. అది (నామము) ఇది (రూపము) రెండును సచ్చిదానందైక వస్తువునకు చెందినవే అని **ఏవ** పదము సూచించుచున్నది. కావుననే నామముచే దాని కల్పితరూపము; రూపముచే దాని కల్పితనామము, బుద్ధిలో సముపస్థాపితము లగును. నామరూపములు సచ్చిదానందరూపిణియైన అమ్మవారియందే కల్పితములు. ఆ కల్పితములైన నామరూపముల ఐక్యము కూడ ఏవ అను శబ్దముచే సూచింపబడును. ప్రపంచమునందు తనకు (ఆత్మకు) భిన్నముగా కనిపించు వస్తువులు దేశకాలపరిచ్ఛేదములు కలిగియున్నట్టివి. వానికి స్వీయ (వస్తు) పరిచ్ఛేదము కూడగలదు. ఆత్మ ఆ త్రివిధ (దేశకాలవస్తు) పరిచ్ఛేదములు లేనట్టిది. నేదిష్ఠ శబ్దము భక్తుడైన కవికి దేవతయైన కామాక్షికి ఆ పరిచ్ఛేదములు లేవని తెలుపును. **నేదిష్ఠ** అనగా మిక్కిలి దగ్గఱిది. దూరము, దగ్గఱ

అనునవి ప్రధానముగా దేశమునకు చెందినవై దేశపరిచ్ఛేద రాహిత్యమును తెలుపుచునే ఉపలక్షణవిధి నాశ్రయించి కాలవస్తుపరిచ్ఛేదరాహిత్యమును సూచించును. కామాక్షీదేవియొక్క రూపము (సేక్షుచాపము) ఆమె నామము (మాతృక) తనకు నేదిష్ఠములని కవి చెప్పుటచే కవి వానిని స్వాత్మరూపములుగానే భావించుచున్నాడని ఆమె నామ రూపములు ఆమెయందు కల్పితములు. ఆమె సచ్చిదానంద రూపిణి. ఆమె తనకు నేదిష్ఠ అనగా ఆమె తనకాత్మగా నున్నదని యెఱిగినాడని నేదిష్ఠశబ్దముచే వ్యంగ్యమగును.

2) ఈ శ్లోకములోని నాలుగుపాదములందు ఆది ప్రాసమున్నది. ద్వితీయపాదమున ఆది మధ్యవర్ణముల మైత్రి అనగా వడియున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి విద్యయొక్క ఉపదేశమును కవి పొందినట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున దానితో తనకు సంతోషము కలుగుచున్నదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ తుష్యామి హర్షితస్మర-**
**శాసనయా కాఞ్చీపురికృతాసనయా।**
**స్వాసనయా సకలజగ-**
**ద్భాసనయా కలితశమ్బరాసనయా॥ 61**

**ప్రతిపదార్థము :-**

హర్షితస్మరశాసనయా = సంతోషపెట్టబడిన మన్మథుని శాసించినవాడు (శివుడు)గలది;
కాంచిపురికృతాసనయా = కాంచిపురమునందు చేయబడిన ఆసనముగలది;
స్వాసనయా = తనయందు కూర్చున్నట్టిది;
సకలజగద్భాసనయా = సకల జగముల భాసింపజేయునట్టిది;
కలితశమ్బరాసనయా = కూర్చబడిన జలముయొక్క ఆసనము గలట్టిదియునైన అమ్మవారిచేత;
తుష్యామి = సంతోషించెదను.

**తాత్పర్యము :-**

శివుని సంతోషింపజేయునది. కాంచీపురమునందు నివసించునది. తనలోనే ఉండునట్టిది, సకల జగముల ప్రకాశింపజేయునది. జలమందు ఆసనము నేర్పఱచుకొన్నదియు నైన అమ్మవారి చేతనే సంతోషము కలుగుచున్నది.

**వివరణము :-**

స్మరుని శాసించినవాడు అనగా శిక్షించినవాడు శివుడు. ఆయన అమ్మవారిచే హర్షితుడైనాడు. అనగా సంతోషింపజేయబడినాడు. అందుచే అమ్మవారు హర్షితస్మరశాసన

అని చెప్పబడినది. శివుని స్మరశాసనమునకు అనగా అమ్మవారిని కామించవలెనను స్మరుని శాసనమునకు లోబడిన వానినిగా చేసినందున స్మరుడు హర్షితుడైనాడు. ఆయన శాసనమందు వర్తితమైన లోకమంతయు సంతోషించినది. అందుచేతనే అమ్మవారు **హర్షితస్మరశాసన** యైనది. అమ్మవారికి తానే ఆసనమై యున్నానని కవి చెప్పినాడు. ఆసనమనగా ఆధారము. అమ్మవారు తన ఆత్మయందే ఉన్నట్లు కవి దర్శించినందున కవికి తనకు అభేదమైనందున అమ్మవారు స్వాసనయైనది. అమ్మవారు కవి మనస్సును తన ఆసనముగా చేసికొని యున్నందున అమ్మవారు స్వాసన యైనది. అమ్మవారు సకలజగముగా భాసించుటచే **సకలజగద్భాసన** అని చెప్పబడినది. అమ్మవారు సకలజగమును తనయందు భాసింపజేయుటచే సకలజగద్భాసన యని చెప్పబడినది. రాక్షసులను ఓడించి తన వాహనములుగా సింహాసనములుగా చేసికొనుట దేవతలకొక విలాసము. వినాయకుడు మూషికాసురుని జయించి వానిని తన ఆసనముగా చేసికొనెను. అమ్మవారు కాముని రూపమున శంబరాసురుని జయించి వానిని తన ఆసనముగా చేసికొనుటచే **కలితశమ్బరాసన** అని చెప్పబడినది. జలమును (నారములను) తన ఆసనముగా (అయనముగా) చేసికొని నారాయణియైన అమ్మవారు కలితశమ్బరాసన అని చెప్పబడినది. ఈ శ్లోకమున సరిపాదములందు ఆద్యంతత్రిప్రాసములున్నవి.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారు సంతోషదాయిని అని చెప్పబడినది. ఈ శ్లోకమున సంతోషహేతువైన ప్రేమగల ఆమె చెప్పబడుచున్నది.

**శ్లో॥ ప్రేమవతీ కమ్పాయాం**
**స్థేమవతీ యతిమనఃసు భూమవతీ।**
**సామవతీ సత్యగిరాం**
**సోమవతీ శిరసి భాతి హైమవతీ॥ 62**

**ప్రతిపదార్థము :-**

కమ్పాయామ్ = కమ్పానదియందు;
ప్రేమవతీ = ప్రేమగలది;
యతిమనఃసు = యతుల మనసులందు;
స్థేమవతీ = స్థిరత్వముగలది;
సత్యగిరామ్ = సత్యవాక్కులలో (వేదములలో);
సామవతీ = సామ(వేద)ము కలది;
శిరసి = శిరస్సునందు;
సోమవతీ = చంద్రుడుగలది;
భూమవతీ = సర్వాతిశయాధిక్యము గలదియునైన;

హైమవతీ = హిమవత్పర్వతపుత్రిక;
భాతి = ప్రకాశించుచున్నది.

**తాత్పర్యము :-**

అమ్మవారు కంపానదియందు ప్రేమకలది. యతులమనసులందు స్థిరముగా నుండునది. శిరసునందు చంద్రుడుగలది. సత్యవాక్కులనదగిన వేదములలో సామవేదము స్వరూపముగాగలది. సర్వాతిశయాధిక్యము గలదియునైన హిమవత్పర్వత పుత్రికయగు అమ్మవారు అంతట ప్రకాశించు చున్నది.

**వివరణము :-**

1) ఈ సర్వప్రపంచము అంతయు బ్రహ్మస్వరూపిణియైన అమ్మవారి యందు మిక్కిలి అల్పము. ఈ ప్రపంచమును మించిన అధిక్యము అమ్మవారి యందే ఉన్నది. అందుచేత అమ్మవారు భూమవతి అని చెప్పబడినది. వేదములు సత్యవాక్కులు వానిలో సామవేదము శ్రేష్ఠము, వేదపాఠులవాక్కులు సత్యములు. సామవేదగాయకుల వాక్కులు పరమసత్యములు. ఆమె వాక్కులు వేదములు. ఆమె గానము సామవేదము. సామమనగా ఇతరులలో సౌమనస్యము కలిగించు వాక్యము, అట్టి సామములు స్వరూపముగాగలది గావున అమ్మవారు సామవతి అని చెప్పబడినది. అమ్మవారి శిరమున చంద్రుడుండుటచే ఆమె శిరసి సోమవతి అని చెప్పబడినది.

2) ఈ శ్లోకమున అన్ని పాదములందు త్రిప్రాసమున్నది. ద్వితీయ చతుర్థాంతమును త్రిప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారికి కమ్పానది యందు ప్రేమ యున్నదని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమెకు ఆ నదియందు కౌతుకమున్నట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ కౌతికినా కమ్పాయాం**
**కౌసుమచాపేన కీలితేనాన్తః।**
**కులదైవతేన మహతా**
**కుట్మలముద్రాం ధునోతు నః ప్రతిభా॥ 63**

**ప్రతిపదార్థము :-**

కమ్పాయామ్ = కమ్పానదియందు;
కౌతికినా = కుతూహలముగల;
కౌసుమచాపేన = పూలువిల్లుగల;
మహతా = గొప్పనైన;
అంతః = లోపల;

| | |
|---|---|
| కీలితేన | = చెక్కబడిన; |
| కులదైవతేన | = కులదైవమైన అమ్మవారిచేత; |
| నః | = మాయొక్క; |
| ప్రతిభ | = కవితానిర్మాణశక్తి; |
| కుట్మలముద్రామ్ | = మొగ్గ దొడిగియుండు ముద్రను; |
| ధునోతు | = విడచుగాక. |

**తాత్పర్యము :-**

కమ్పానదియందు కౌతుకముగలదియు పూలు విల్లుగ ధరించినదియు నా (కవి)లోపల చెక్కబడినట్లు స్థిరముగా నిలచియుండునదియు గొప్పకులదైవము నైన అమ్మవారిచేత మా కావ్యనిర్మాణప్రతిభ వికసించుగాక.

**వివరణము :-**

1) మన్మథునకు చెఱకు విల్లు అనియే కాక పూవుకూడ విల్లు అని బాణము అనియు ప్రసిద్ధముగా నున్నవి. అట్లే అమ్మవారికిని పూవు విల్లు అని చెప్పబడినది. మన్మథుని ఆ రూపము అమ్మవారి అనుగ్రహముచే లబ్ధము. శివునిచే దహింపబడిన పిమ్మట మన్మథుడు అమ్మవారి శరీరమునందు లీనమై యుండుటచే అమ్మవారు ఆ రూపముతో భక్తుల ననుగ్రహించినది. శివుని రంజింపజేసినది. కౌసుమచాప శబ్దమును కులదైవతశబ్దముతో నన్వయించి అమ్మవారు కౌసుమచాపుని కులదైవతమనియు చెప్పవచ్చును. ఆ రూపముగల అమ్మవారు కవి మనస్సున చెక్కబడినట్లు స్థిరముగా నున్నది. ఎన్నడును తొలగక యున్నది. అని కీలితేన అను పదముచే వ్యక్తమగును. పురుషునందున్న పుత్రోత్పాదన శక్తి యౌవనకాలముననే వ్యక్తమైనట్లు కవికి అది మొగ్గ దొడిగియే యున్నదట. ఇంత గొప్పకవి తన ప్రతిభమొగ్గ దొడిగియున్నదని చెప్పుచు అది వికసింపవలెనని కోరుచున్నాడు. అది ఇప్పటికే భువనమంత నిండునంతటి కీర్తి సౌరభమును నింపివైచినది. ఇక అది వికసించినదో దాని పరిమళము కొత్త బ్రహ్మాండముల ద్వారములను బద్దలు కొట్టుకొని వ్యాపించి తీరవలసినదే అని నాలుగవ పాదము వ్యంజింపజేయుచున్నది.

2) అమ్మవారి చాపమనెడి కుసుమముయొక్క ధ్యానముచేత కుట్మలము కూడ పుష్పత్వమందును. పరమాత్మరూపిణియైన అమ్మవారి ధ్యానముచేత జీవాత్మ పరమాత్మత్వప్రాప్తిని పరంపరగా (గురూపదేశ ద్వారమున) పొందును. శ్రవణము చేతనే లభింపవలసియున్న పరమాత్మత్వము ప్రతిబంధవశమున లభింపనప్పుడు ధ్యానము సాధన మగుటయను సంప్రదాయ భేదములిట వ్యంజింపజేయబడుచున్నవి. జీవాత్మకుట్మలమువలె నుండినందున సౌరభ ప్రకాశములేక యుండును. ఆతడు పరమాత్మత్వ మందిన పిదప ఆతడు ఆనంద సౌరభ ప్రకాశము కలిగియుండుననుట ఇట **కుట్మలకుసుమ** శబ్ద

ప్రయోగముచే వ్యంగ్యమగును. పూర్వార్థమున ఉత్తరార్థమున పాదాదులలో వడియున్నది. **కౌసుమచాపేన, కీలితేన, కులదైవతేన** అను పదములలో అంత్యప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు కుసుమచాపుని కులదేవతగా చెప్పబడినది. ఈ శ్లోకమున (కుసుమచాపుని శత్రువైన శివుని) కుటుంబిని యని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కేనాపి మిలద్దేహా**
**యూనా స్వాహాసహాయతిలకేన।**
**సహకారమూలదేశే**
**సంవిద్రూపా కుటుమ్బినీ రమతే॥ 64**

**ప్రతిపదార్థము :-**

స్వాహాసహాయతిలకేన = స్వాహాదేవి సహాయగాగలవాడు (అగ్ని) తిలకముగాగల;
కేన+అపి = ఒకానొక;
యూనా = యువకునిచేత;
మిలద్దేహా = కలియుచున్న దేహముగల;
సంవిద్రూపా = జ్ఞానరూపిణియైన;
కుటుమ్బినీ = ఇల్లాలు;
సహకారమూలదేశే = మామిడిచెట్టు మూలముగల దేశమున;
రమతే = రమించుచున్నది.

**తాత్పర్యము :-**

అగ్ని తిలకుడైన ఒకానొక యువకుడైన శివుని దేహముతో తన దేహమును చేర్చి ఆతని కుటుమ్బిని యైన కామాక్షీదేవి మామిడిచెట్టు క్రింది భూమిపై రమించుచున్నది.

**వివరణము :-**

1) స్వాహాదేవికి భర్త అగ్ని. ఆ అగ్నిని తిలకముగా ధరించిన వాడు శివుడు. అతని కా అగ్ని తిలకముగా, మూడవనేత్రముగా కూడ ఉన్నాడు. ఆ అగ్నితో కుసుమచాపుని కాల్చివైచి శివుడు కామారి అని పిలువబడినాడు. కాని ఆయన ఆ కామారిత్వ మెంతసేపో నిలువలేదు. మన్మథుడు కాలిపోయియు అమ్మవారిలో లీనమైనాడు. అమ్మవారిలో లీనుడై ఆ కాముడు శివుని కాల్చుట నారంభించినాడు. శివుడోర్వలేక అమ్మవారి అక్షులలో కన్పించు కాముడే అగ్నియై తనను దహించుచున్నాడని గ్రహించి ఆమెకు లోబడుట కంగీకరించాడు. కామమునకు లోబడిన శివునితో ఆమె రమించుట కారంభించినది. ఇప్పటికి రమించుచునేయున్నది. **రమతే** అను వర్తమానాత్మకప్రత్యయముతో కూడిన

రమ్‌ధాతువు పీలన అనగా గ్రహతే అను క్రియ వలన వ్యంజింపబడుచున్నది. స్వాహాదేవి అగ్నితో నెట్లు రమించుచున్నదో అట్లే అమ్మవారు శివునితో రమించు చున్నది. అని **స్వాహాసహాయతిలకేన** శబ్దము ఉపమాలంకారమును వ్యంజించుచున్నది. అగ్ని స్వాహాసహాయుడని భంగ్యంతరముగా చెప్పుటచే పర్యాయోక్త్యలంకారమున్నది. ఆ రమించుట సహకారవృక్షమూల దేశమున. సహకారపుష్పము మన్మథుని పంచబాణములలో నొకటి. అట్టి సహకార పుష్పబాణము శివుని కామాగ్నిలో వ్రేల్చుచునే ఉన్నది. తచ్ఛాంత్యర్థము శివునితో ఆమె రమించవలెనని శివుడు కోరుచునేయున్నాడు. ఆ కోరిక కనుగుణముగా ఆమె స్వయంగ్రహపరిష్వంగమాయనకు లభించుచునే యున్నది. ఆ రమణము నకు ముగింపు లేదు. యూనా కేనాపి అనుటచే నీయర్థము లభించుచున్నది. ఆ కామ మనంతము. సహకారము (వృక్షము) ఆ మన్మథునికి సహకరించుచునే యుండును. ఆ మన్మథుని కావృక్షము వలన వారి రమణమునకు సహకారము లభించుచునే యుండును. ఆ సహకారమనంతము. ఆ సహకార మూలదేశము వారి రమణమున కుద్దీపనవిభావముగా తనవంతు సహకారము నందించుచునే యున్నది. **సహకారమూలదేశే** అను శబ్దముచే నీయర్థము లభించుటచే పరికరాలంకార ధ్వని ఈ శ్లోకమున నున్నది.

2) అమ్మవారు సంవిద్రూప. శివుడును సంవిద్రూపుడు. వారిరువురి (శివశక్తి) సంయోగము జీవ పరమాత్మల సంయోగము. ఆమెకు కుటుమ్బ మున్నది. ఆమె కుట్టుమ్బిని విచిత్రకుటుమ్బిని. కుటుమ్బిని యయ్యు భర్తతో అనంతకాలము రమించుట విచిత్రము. యూనా కేనా, దేహా స్వాహా, సహాయ శబ్దములలో అనుప్రాసమను శబ్దాలంకారమున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారు కుసుమశరద్రోహి శివుని కుటుమ్బిని యని చెప్పబడినది. ఈ శ్లోకమున కుసుమశరగర్వసంపత్కోశగృహముగా చెప్పబడు చున్నది.

**శ్లో॥ కుసుమశరగర్వసమ్ప-**
**త్కోశగృహం భాతి కాఞ్చిదేశగతమ్।**
**స్థాపితమస్మిన్కథమపి**
**గోపితమన్తర్మయా మనోరత్నమ్॥ 65**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కుసుమశరగర్వసమ్పత్కోశగృహమ్ | = మన్మథుని గర్వసంపదయొక్క భాండాగారము; |
| కాంచిదేశగతమ్ | = కాంచిదేశగతమై ఉన్నది; |
| అస్మిన్ | = దీనియందు; |

| | |
|---|---|
| అంతః | = లోపల; |
| కథమ్+అపి | = ఎట్లో; |
| మయా | = నాచేత; |
| మనోరత్నమ్ | = మనస్సనెడి రత్నము; |
| స్థాపితమ్ | = ఉంచబడినది; |
| గోపితమ్ | = దాచబడినది. |

**తాత్పర్యము :-**

అమ్మవారు మన్మథుని సంపద్గర్వమునకు భాండాగారము. అది కాంచీదేశ మందున్నది. దానియందు లోపల మనోరత్నము నెట్లో దాచి యుంచగలిగితిని. (ఇక దాని నేమాయావియు అపహరింపలేదు)

**వివరణము :-**

తనను కాల్చిన శివుని గెలిచినానను గర్వము మన్మథునకున్నది. ఆ గర్వమే ఆతని సంపద. ఆ సంపదను దాచుకొను కోశగృహమే అమ్మవారు. అమ్మవారిలో తన మనోరత్నమును కవి దాచి యుంచినాడు. మన్మథుని తన గర్వసంపదను దాచుకొను కోశగృహము కూడ అమ్మవారే. ఆమె లేకున్న శివుడెప్పుడో మన్మథుని గర్వమణచి వేసియుండెడివాడు. శివునికి కామమునకు లోబడకూడదనే ఉన్నది. అందుకు కావలసిన మనోనిగ్రహాది బహువిధయోగ ప్రక్రియ శివుడు చేపట్టగలడు. అవి అన్నియు అమ్మవారిని చూడగనే వ్యర్థములై పోవును. ఆమెను విడచి యొక క్షణముండలేని పరిస్థితిలో పడిపోయినాడు. ఇక మన్మథుని గర్వము నణచు ఊహయు పొడమదు. పూర్వార్థమందలి పాదముల ఆదిలో వడి; ఉత్తరార్థముయొక్క పాదములలో ఆదిప్రాసమునున్నది.



**అవ:-** శివుని కామున కోదునట్లుచేసి కాముని గర్వసంపదకు భాండాగార మమ్మవారని పై శ్లోకమున చెప్పబడినది. అమ్మవారి తారుణ్యమే దానికి కారణము. అది ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ దగ్ధషడధ్వారణ్యం**
**దరదలితకుసుమ్భసమ్భృతారుణ్యమ్।**
**కలయే తవ తారుణ్యం**
**కమ్పాతటసీమ్ని కిమపి కారుణ్యమ్॥ 66**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| దగ్ధషడధ్వారణ్యమ్ | = కాల్చిన షడధ్వమను అరణ్యము కల; |
| దరదలితకుసుమ్భ | = కొంచెము వికసించిన కుసుమ్భపుష్పముల |

సమ్భృతతారుణ్యమ్ యెఱుపును మోసిన;
కమ్పాతటసీమ్ని = కమ్పానదీతటప్రదేశమున;
కిమపి = ఏదో;
కారుణ్యమ్ = దయ యనెడు;
తవ = నీయొక్క;
తారుణ్యమ్ = యౌవనమును;
కలయే = ధ్యానించెదను.

**తాత్పర్యము :-**

షడధ్వారణ్యమును కాల్చిన, కొంచెము వికసించిన కుసుమ్భ పుష్పముల యెఱుపును ధరించిన, కమ్పాతటప్రదేశమున వెలసిన, దయయో అనదగిన నీ యౌవనమును ధ్యానించెదను.

**వివరణము :-**

1) శివశక్తిసంయోగము సృష్ట్యాదిన బీజప్రాయముగా నుండి షడధ్వారణ్యముగా విస్తరించినది. షడధ్వములలోని వర్ణ, పద, మన్త్ర రూపములైన మూడు అధ్వములు శబ్దప్రపంచవిస్తృతిరూపములు (ప్రపంచ మంతయు వాగర్థమయము నామరూపమయము) కావున మొదటి మూడు అధ్వములు శక్తి మయములు. తరువాతి మూడు అధ్వములు శివమయములు. శక్తి సంయుక్త శివుడు (మాయా) శబలబ్రహ్మమని చెప్పబడిన ఈ ప్రపంచమున ఆ శివోపాసనము నామరూపముల ద్వారముననే అనగా నామప్రతీకమైన, రూప ప్రతీకమైన ఉపాసనముల ద్వారముననే చేసి పిపీలికామార్గమున లోకాంతరము లందున్న బ్రహ్మమును పొందవలెను. ఈ మార్గమే కర్మభక్తియోగోపాసనా (యోగ) మార్గమనియు చెప్పబడును. విహంగమార్గమున బ్రహ్మమును ఈ లోకముననే పొందుట **జ్ఞానమార్గమని** చెప్పబడును.

2) నామరూప ప్రతీకోపాసనములు చిత్తశుద్ధిద్వారమున అనగా చిత్తైకాగ్ర్యద్వారమున జీవబ్రహ్మైక్య జ్ఞానమునకును పరమ్పరాసాధనములగును. కావున పై ఆఱు అధ్వములలో నేదైనను ఉపాసనాప్రతీకమై బ్రహ్మప్రాప్తికి పరమ్పరా హేతువగును. ఇట్లుపాసనా మార్గత్వము వానియందు పొందగల్గుటయే వాని యధ్వత్వము. షడధ్వములలో దేనియందైనను బ్రహ్మబుద్ధి చేయుటయే ఉపాసనము. వానిలో శ్రీమదూర్జితమైనది. ఉపాసనమునకు శ్రేష్ఠప్రతీకమగును. స్వభిన్న సర్వము బ్రహ్మము అను పరోక్షజ్ఞానముగల సాధకునకు ఏ వస్తువైనను ప్రతీకమగును. చివఱకు బ్రహ్మము మిగిలి అధ్వములన్నియు జ్ఞానాగ్నిలో దగ్ధము లగును. అమ్మవారు జ్ఞానాగ్నిరూపిణియని **దగ్ధషడధ్వారణ్యమ్** అను విశేషణము వ్యంజించుచున్నవి. అరుణ్యమ్ అను పదముచే అమ్మవారు అగ్నిరూపిణియని స్ఫురించుటచే అధ్వదాహము సమంజసమగుచున్నది. **యమేవైష వృణుతే తేన లభ్యః**

(1.2.23) అను కఠోపనిషత్సూక్తి ననుసరించి బ్రహ్మప్రాప్తి బ్రహ్మానుగ్రహ లభ్యము. బ్రహ్మరూపిణియైన అమ్మవారి అనుగ్రహము లేనిది బ్రహ్మ ప్రాప్తి కలుగదు. ఆ అనుగ్రహము కలుగు ఉద్దేశము తోడనే కర్మభక్త్యుపాసనాది మార్గము లవలంబించబడును. కాని వాని వలన అనుగ్రహము కలుగుట ఐకాంతికము కాదు. బ్రహ్మరూపిణియైన అమ్మవారికి నిరంకుశ స్వాతంత్ర్యముతో జీవులందు నెవరికోయొక్కరికి ఎప్పుడో ఒకప్పుడు కారుణ్యలాభము కలుగును. బ్రహ్మ (శివుని) యొక్క కారుణ్యమే అమ్మవారు పురుషులకన్న స్త్రీల కెక్కువ దయ యుండును. అమ్మవారికి స్త్రీత్వపురస్కృతియైన కారుణ్యమే ఉన్నది. అమ్మవారు ఆరుణ్యవతి, తారుణ్యవతి, కారుణ్యవతి గుణగుణులకు ధర్మధర్ములకు భేదము లేదను నియమము ననుసరించి ఇట అమ్మవారే ఆరుణ్యము, తారుణ్యము, కారుణ్యము అని పేర్కొనబడినది.

3) నాలుగు పాదములలో అంత్యద్విప్రాసమున్నది. రెండవ, మూడవ పాదముల అంత్యమున తారుణ్య శబ్దద్విరుక్తిచే యమకము అను శబ్దాలంకార మున్నది.



**అవ॥:-** దర్శనీయములైన అమ్మవారి ఆరుణ్యతారుణ్యములు పై శ్లోకమున చెప్పబడినవి. ఈ శ్లోకమున వానిని కలిగియున్న అమ్మవారి **దర్శనము** చెప్పబడు చున్నది.

**శ్లో॥ అధికాఞ్చి వర్తమానా-**
**మతులాం కరవాణి పారణామక్ష్ణోః।**
**ఆనన్దపాకభేదా-**
**మరుణిమపరిణామగర్వపల్లవితామ్॥ 67**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| అధికాఞ్చి | = | కాంచీనగరమందు; |
| వర్తమానామ్ | = | నివసించుచున్న; |
| అతులామ్ | = | సాటిలేని; |
| ఆనందపాకభేదామ్ | = | ఆనందపాక విశేషమైన; |
| అరుణిమపరిణామగర్వపల్లవితామ్ | = | ఎఱుపు పరిణామముయొక్క గర్వముచే పల్లవించిన అమ్మవారిని; |
| అక్ష్ణోః | = | కన్నులకు; |
| పారణామ్ | = | విందును; |
| కరవాణి | = | చేసికొందును గాక. |

**తాత్పర్యము :-**

కాంచీనగరియందు నివసించునట్టి సాటిలేని ఆనంద పాక విశేషమైన

ఆరుణ్యపరిణామ గర్వము పల్లవించినట్లున్న అమ్మవారిని నా కన్నులకు విందు చేసికొందునుగాక.

**వివరణము :-**

1) పుంరూప శివుడు ఆనందరూపుడు. ఆ ఆనందము స్త్రీ రూపము ధరించుట ఆనందపాక భేదము. పాకము వలన పదార్థముల రుచి పెఱుగును. అందుకే మనము పదార్థముల వండుకొని తిందుము. అమ్మవారి దర్శనము ఆనంద పాక భేదము. అమ్మవారు కన్నులకు విందు. అది ఆనందపాక భేదము. ఆనందరూపుడైన శివునకే అది ఆనందకరము. అమ్మవారు అరుణిమ పరిణామ గర్వ పల్లవిత. అరుణిమ పరిణామము ఇంతకుమించి యుండదనునది ఆ గర్వము అనుపల్లవించినది. పల్లవము లెఱ్ఱనివి కావున ఆ గర్వము మరల ఎఱ్ఱబడి అరుణిమమునకు మరొక ఆరుణ్యమును చేకూర్చినదేమో యనునట్లున్నది. దానిని నా కనులలో నింపుకొందును గాక అని కవి వాంఛించు చున్నాడు.

2) నాలుగు పాదములు అకారాదులై వడి కలిగియున్నవి.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు ఆనందపాక భేదము అని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె **అరుణిమపాకభేద**మని చెప్పబడుచున్నది.

**శ్లో॥ బాణసృణిపాశకార్ముక**
**పాణిమముం కమపి కామపీఠగతమ్।**
**ఏణధరకోణచూడం**
**శోణిమపరిపాకభేదమాకలయే॥ 68**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| బాణసృణిపాశకార్ముకపాణిమ్ | = బాణములు అంకుశము పాశము విల్లు చేతులందుగల; |
| కామపీఠగతమ్ | = కామపీఠమందున్న; |
| ఏణధరకోణచూడమ్ | = జింకను ధరించువాని (చంద్రుని) కల శిరమందుగల; |
| శోణిమపరిపాకభేదమ్ | = అరుణిమ పాకభేదమైన; |
| అముమ్ | = ఈ; |
| కమ్+అపి | = ఒకానొకదానిని (అమ్మవారిని); |
| ఆకలయే | = బాగుగా ధ్యానించెదను. |

**తాత్పర్యము :-**

బాణములు, అంకుశము, పాశము, విల్లు చేతులందు కల, కామపీఠగతమైన చంద్రకలను ధరించిన, ఒకానొక అరుణిమ పరిపాకభేదమును బాగుగా ధ్యానించెదను.

**వివరణము :-**

1) అమ్మవారు ఒకచేత అయిదు బాణములను, మరొక చేత పాశమును, ఇంకొక చేత అంకుశమును, వేరొక చేత విల్లును ధరించియుండును. ఆ విల్లు చెఱుకు విల్లు, ఆ బాణములు పూవులు. అమ్మవారు వీనిని ధరించుటలోని రహస్యమేమి? అవి సంకేతములు. ఈ విషయముల నిందు వివరించెదను. పాశమనగా రాగము లేక ఇచ్ఛాశక్తి. అంకుశమనగా క్రోధము లేక జ్ఞానశక్తి. అమ్మవారిచేత రాగము కలదు. మన ఇచ్ఛచేత రాగము మనకు కలుగదు. ఎవరిపై ఎందుకు రాగము కలుగునో తెలియదు. అసలు రాగమే యెందుకు కలుగవలెను. అది యంతయు (ఆ రాగము కలుగుట కలుగకపోవుట) అమ్మవారి ఇచ్ఛ ననుసరించి జరుగును. అమ్మవారికి రాగము చేతనున్న దనగా అమ్మవారు జీవవిలక్షణ యనుట. జీవుని రాగము జీవుని చేత ఉండదు. అమ్మవారి చేత అమ్మవారి రాగముండును. రాగమామెకు స్వాధీనమై యుండును. జీవునకది స్వాధీనముగా నుండదు. అట్లే మనకెవరిపై ఎప్పుడు ఎందుకు క్రోధము కలుగును? ఒక్కొక్కపుడు ఇతరులు తప్పు చేయక పోయినను మనకు కోపము జనించును. ఒకప్పుడు వాడెంత తప్పు చేసినను క్రోధము కలుగదు. మనకు క్రోధము కలుగుట కలుగక పోవుట అమ్మవారి ఇచ్ఛ ననుసరించి యుండును. అమ్మవారి చేత కోపమున్నదనగా అది ఆమెకు ఆధీనమైయున్నది. కోపము కలుగవలెనన్న కలుగును, వలదన్న కలుగకుండును. ఇట్లు రాగక్రోధములు అమ్మవారికి స్వాధీనములై ఆమె ఏ జీవునధోగతి పాలు చేయదలచునో వానియందు రాగక్రోధములు కలుగును.

2) రాగక్రోధములకు చిత్తము నిలయము. ఆ చిత్తమే చెఱుకువిల్లు యొక్క ఆకృతి ధరించి అమ్మవారి చేతనున్నది. చిత్తము మనకు స్వాధీనము గాక చంచలముగా నున్నది. అది నిశ్చలము చేయుటకు యత్నించుచుందుము. అసలు చిత్తమే ఆమెచేత నుండగా నీ ప్రయత్నమామె యిష్టపడిన నీకు స్వాధీనమై నిశ్చలముగా నుండును. లేకున్న చంచలముగానే తిరుగుచుండును. అమ్మవారి చేత మనసున్నది. అది ఆమెకు స్వాధీనముగా నున్నది. మనకు పరాధీనముగా నున్నది. పంచతన్మాత్రలను పూవులు అమ్మవారి చేతిలో బాణములైయున్నవి. శబ్దస్పర్శరూపరసగంధములు వరుసగా శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణేంద్రియ విషయములు. చిత్తమున వానియెడ రాగమో ద్వేషమో యేర్పడుచుండును. ఇంద్రియములకు విషయముల పట్ల ఆకర్షణము రాగకృత్యము, వానికి వానిలో వైముఖ్యము క్రోధకృత్యము. ఈ వైముఖ్యము విషయసుఖముల అశాశ్వతత్వము నెఱిగిన జ్ఞానులకు శాశ్వతముగా నుండును. క్రోధము వలన నేర్పడు వైముఖ్యము తాత్కాలికము. అమ్మవారిచేత అంకుశము క్రోధము అని కొందఱిచేత, జ్ఞానము అని మఱికొందఱిచేతను చెప్పబడినది.

3) వృక్షాదులలో ఆకులు మొదలగు వానిలో రంగులు మారుచుండును. దానికి

సూర్యకిరణాదుల వలన వానిలో కలుగు పాకమే కారణము. శివుని రాగమే అమ్మవారి అరుణిమము. దానికి అమ్మవారి సౌందర్యముచే పాకమేర్పడినది. అందుచేత అమ్మవారి శోణిమము శోణిమపాకభేద మని చెప్పబడినది. ధర్మాధర్ముల అభేదము ననుసరించి అమ్మవారే అరుణిమపాక భేద మని చెప్పబడినది. నాలుగుపాదములందాది ప్రాసమున్నది.



**అవ:-** రాగద్వేషదూషిత చిత్తరూపమైన సంసారమే అమ్మవారి చేత నున్నదని పై శ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారు తప్ప మరొక దేవత ఏదియు సంసారమును రోసిన వారికి ఫలము నీయజాలదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కిం వా ఫలతి మమాన్యై-**
**ర్బిమ్బాధరచుమ్బిమన్దహాసముఖీ।**
**సమ్బాధకరీ తమసా-**
**మమ్బా జాగర్తి మనసి కామాక్షీ॥ 69**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| మమ | = నాకు; |
| అన్యైః | = ఇతరులతో; |
| కిం వా ఫలతి | = ఫలించునదేమున్నది; |
| బిమ్బాధరచుమ్బిమందహాసముఖీ | = దొండపండు వంటి క్రింది పెదవిని ముద్దిడుకొను ముఖముగల; |
| తమసామ్ | = చీకట్లకు; |
| సంబాధకరీ | = అత్యంతిక నాశమును కలిగించు; |
| కామాక్షీ అంబా | = కామాక్షి అమ్మ; |
| మనసి | = మనసునందు; |
| జాగర్తి | = మేలుకొనియున్నది. |

**తాత్పర్యము :-**

చీకట్లను మరల రాకుండా నశింపజేయుచున్నట్టి, దొండపండు వంటి పెదవిని ముద్దిడుకొను చిఱునవ్వు మోముగల కామాక్షి అమ్మ నామనస్సున మేల్కొని యుండగా నా కితర దేవతలేమి ఫలమీయగలరు.

**వివరణము :-**

1) అమ్మవారి పెదవి దొండపండు వలె ఎఱ్ఱగా ఉన్నది. దానిమీద తెల్లని చిరునవ్వు చిందులాడుచున్నది. పెదవి ఎఱుపు అమ్మవారి వలెనే ఎఱ్ఱనిది. చిఱునవ్వు శివుని వలె తెల్లనిది. అమ్మవారి పెదవిని చిఱునవ్వు ముద్దాడుచున్నది కాని శివుడే

అమ్మవారిని ముద్దాడుచున్నట్లు ఆ దృశ్యము కవిభావనలో కనబడుచున్నదని **చుమ్బి** అను పదము వ్యంజించుచున్నది.

2) తమసాం సంబాధకరీ మనసి జాగర్తి అను పదములు మరియు మూడవపాదము తమస్సులను తాత్కాలికముగ పోగొట్టు సంధ్య వలె అమ్మవారు తమోగుణము శాశ్వతముగా పోగొట్టునని వ్యతిరేకాలంకారమును ధ్వనింపజేయు చున్నది. **సంధ్యే సృష్టిరాహ హి** (3.2.1.1) అను బ్రహ్మ సూత్రము స్వప్నసంధ్యలో ఐక్యము చెప్పును. మనసు మేల్కొనుట స్వప్నలక్షణము కదా. మోక్షప్రదాత్రి కామాక్షీదేవి నిరంతరము నా మనస్సున మేలుకొనుచుండగా నితర దేవతలు వారీయగలిగిన ఫలములందు విరక్తుడనైన నాకేమి ఫలమీయగలరు అను అర్థమును మొదటి పాదము వ్యంజింపజేయుచున్నది. నాలుగు పాదములందాదిప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు మనసున మేల్కొనుట చెప్పబడినది. ఈ శ్లోకమున దానికి సాధనమైన శ్రీచక్రముయొక్క మధ్యలో ఉన్నదను విశ్వాసము చెప్పబడుచున్నది.

**శ్లో॥ మఞ్చే సదాశివమయే**
**పరశివమయలలితపౌష్పపర్యఙ్కే।**
**అధిచక్రమధ్యమాస్తే**
**కామాక్షీనామ కిమపి మమ భాగ్యమ్॥ 70**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| అధిచక్రమధ్యమ్ | = శ్రీచక్రమధ్యమున; |
| పరశివమయలలితపౌష్పపర్యంకే | = పరశివుడను సుందరమైన పుష్పపర్యంకము గల; |
| సదాశివమయే | = సదాశివమయమైన; |
| మంచే | = మంచమునందు; |
| కామాక్షీనామ | = కామాక్షీదేవియను; |
| కిమ్ అపి | = ఒకానొక; |
| మమ | = నాయొక్క; |
| భాగ్యమ్ | = భాగ్యము; |
| ఆస్తే | = కూర్చొనియున్నది. |

**తాత్పర్యము :-**

శ్రీచక్రమధ్యమున పరశివుడను పుష్పపర్యంకముగల సదాశివ మయమైన మంచము నందు కామాక్షీదేవి యనెడి నా భాగ్యము కూర్చొనియున్నది.

**వివరణము :-**

1) శ్రీచక్రమమ్మవారి గృహము. దాని నడుమ సదాశివమయమైన మంచమున్నది. ఆ మంచముపైన పరశివుడను పూలపానుపున్నది. దానిపై నాభాగ్యమైన కామాక్షీదేవి కూర్చొనియున్నది.

2) ఆ సదాశివ మంచమునకుగల నాలుగు కోళ్ళు బ్రహ్మవిష్ణురుద్ర ఈశ్వరులు. పై నలుగురు; సదాశివుడు పంచప్రేతములనబడుదురు. ఆ మంచము **పంచప్రేతమంచ** మనబడును. మూకకవి అభిప్రాయమున పరశివుడు కూడ ప్రేతకల్పుడే అగుచున్నాడు. పర్యంక శబ్దమునకు అంకము అని మాత్రమే అర్థము చెప్పి పరశివుని ప్రేతాతీతుడు పంచకృత్యరహితుడు లేక పంచకృత్య సమష్టికృత్యుడుగా మూకకవి భావించినాడని చెప్పవలెను. శ్రీ శంకరులు కూడ **శివాకారే మంచే పరమశివపర్యంక నిలయామ్** అని చెప్పుట మూకకవికి మార్గము చూపుటకావచ్చును. లలితశబ్దము సర్వానతీత్య లలితే అను పౌరాణిక వ్యుత్పత్తి నాశ్రయించుటచే నీ సర్వాతీతత్వము అనగా పంచబ్రహ్మలు (పంచ ప్రేతములు) అనబడువారిని దాటిన పరశివుడు (పరమశివుడు) అయిన శివునంకమున నున్నదమ్మవారు అని ఆస్తే అను పధముచే ఆమె కూర్చొని ఉన్నదనియు చెప్పుట ఉచితముగా ఉండును. కాని ఆ పర్యంకము పౌష్పమని విశేషించుట, పానుపు అను అర్థమును చెప్పుట కనుకూలముగా ఉన్నది.

3) సదాశివుడు పంచకృత్యములలోని అనుగ్రహమును చేయువాడు. ఆయన మంచముయొక్క నాలుగు పాదముల చెక్కుటకు సాధనమైన ఫలకము గావున అది ముఖ్యము కావున బ్రహ్మవిష్ణువులు రుద్రేశ్వరులు మంచమున చేరినను సదాశివ ప్రాధాన్యము ననుసరించి అది సదాశివమయమని చెప్పబడినది. ఫలకము కాకపోయినను ఆ నాలుగు కోడులను కలుపు వస్త్రము (నవారు) అని చెప్పినను సదాశివుని ప్రాముఖ్యమునకు ఇబ్బంది లేదు. పౌష్ప పర్యంక శబ్దమునకు పూలపానుపు అని అర్థము చెప్పినను సదాశివాతీతత్వమునకు బాధలేదు. కాని ప్రేత కల్పత్వమును వారించుట మాత్రము కష్టమే. అమ్మవారి ప్రాధాన్యమును పెంచుట కా పరశివునికి ప్రేతకల్పత్వమును మూకకవి యిష్టపడి యుండవచ్చును. పౌష్పపర్యంక శబ్దములో రేఫమును లకారాభిన్నమని భావించి పూలపల్లకి శ్రీచక్రమునకు పైనున్న ఆకాశము నందున్న బిందు స్థానీయమని చెప్పవచ్చును. ఊర్ధ్వత్రికోణచక్రమధ్యమున **బిందువు** చిత్రించనక్కఱలేదను సంప్రదాయము నిది సూచించును. మంచము శ్రీచక్రము (భూమి) నంటి యుండక తప్పదు. పూలపల్లకికి భూమినంటియుండ నక్కఱలేదు. దానిని మోయు బ్రహ్మవిష్ణు రుద్రేశ్వరులంటియున్న చాలును. అయినను ఫలకమెట్లును భూమి నంటియుండదు. పై సంప్రదాయమునకు మంచము పల్లకి, అను భావనలలో ఏదైనను విరుద్ధము కాదు. మంచము అగుటయే ప్రసిద్ధము.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పీఠము మంచము (పల్లకి) అని చెప్పబడినది. ఈ శ్లోకమున పీఠములలో నొకటైన కామపీఠము ఊయలగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ రక్ష్యోఽస్మి కామపీఠీ-**
**లాలికయా ఘనకృపామ్బుకాలికయా।**
**శ్రుతియువతికున్తలీమణి-**
**మాలికయా తుహినశైలబాలికయా॥ 71**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కామపీఠీలాలికయా | = కామపీఠము ఊయెలగాగల; |
| ఘనకృపామ్బుకాలికయా | = గొప్పదయాజలమునకు వర్షాకాలమైన; |
| శ్రుతియువతికుంతలీమణి మాలికయా | = శ్రుతుల పడచుల కేశములలో మణిహారమైన; |
| తుహినశైలబాలికయా | = హిమగిరిపుత్రిచేత; |
| రక్ష్యః+అస్మి | = రక్షింపదగినవాడను అగుచున్నాను. |

**తాత్పర్యము :-**

కామపీఠమను ఊయలగల, గొప్పదయాజలమునకు వర్షాకాలమైన, శ్రుతులను పడచుల కేశములలోని మణిహారమైన, హిమగిరి బాలికచే రక్షింపదగిన వాడను.

**వివరణము :-**

మొదటి మూడు పాదములలో రూపకాలంకారములున్నవి. సరిపాదములలో నాద్యంతత్రిప్రాసమున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారు హిమగిరికి కూతురని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె శివునకు భార్యగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ లీయే పురహరజాయే!**
**మాయే! తవ తరుణపల్లవచ్ఛాయే!।**
**చరణే చన్ద్రాభరణే!**
**కాఞ్చీశరణే! నతార్తిసంహరణే!॥ 72**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| చంద్రాభరణే | = చంద్రుడు అవతంసముగాగలదానా! |
| పురహరజాయే | = శివునకు భార్యయైనదానా! |
| మాయే | = ఓ మాయా! |
| తరుణపల్లవచ్ఛాయే | = లేజిగుళ్ళవంటి కాంతిగలదానా! |

| | | |
|---|---|---|
| కాంచీశరణే | = | కాంచి యిల్లుగాగలదానా! |
| నతార్తిసంహరణే | = | నమస్కరించువారి బాధల పోగొట్టుదానా! |
| తవ | = | నీయొక్క; |
| చరణే | = | పాదమందు; |
| లీయే | = | దాగియుందును. |

**తాత్పర్యము :-**

అమ్మవారు శివునకు భార్య, మాయాస్వరూపిణి. లేజిగురువలె ఎఱ్ఱనైనది. చంద్రుని శిరమున అలంకరించుకొన్నది. నమస్కరించువారి బాధలను బోగొట్టునది. కాంచీనగరమున నివసించునట్టిది. అట్టి అమ్మవారియొక్క పాదమున దాగికొనియుందును.

**వివరణము :-**

1) అమ్మవారు చంద్రాభరణ కావుననే నతార్తి సంహరణ కాగలిగినది. తాపము యొక్క ఆర్తిని పోగొట్టుటలో చంద్రుడు సమర్థుడు గదా. పై రెండు విశేషణములు సాభిప్రాయములు. కావున పరికరాలంకార మున్నది. పూర్వార్ధమున పాదములలో ఆద్యంత ప్రాసమున్నది. ఉత్తరార్ధమున పదాన్తాను ప్రాసమున్నది. శివుడు పురహరుడు. అమ్మవారు ఆతని జాయ. భార్యాభర్తలు విరోధి లింగులైయుందురు కావున శివునిభార్య త్రిపురసుందరియైనది. మాయ యనగా త్రిగుణాత్మక ప్రకృతి. గుణాతీతుడైన శివునకు సగుణత్వము మాయా ధనము. మాయ సగుణ కావున శివుడు కూడ తత్సంబంధమున మాయయై సగుణుడైనాడు.

2) చరణమున బడి శివుడు ఆమెను ప్రసన్నను చేసికొనువాడు. నేనుగూడ ఆమె చరణమునబడి ఆమె ప్రసాదమునకు పాత్రుడనై శివత్వము నందుదును. నేనే కనబడకుండనయ్యెదను అని లీయే పదముచే వ్యంగ్యమగును. తరుణపల్లవచ్ఛాయే అను సమాసమున ఉపమాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున చెప్పబడిన చంద్రాభరణత్వమే ఈ శ్లోకమున సవిశేషముగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ మూర్తిమతి ముక్తిబీజే**
**మూర్ధ్ని స్తబకితచకోరసామ్రాజ్యే**
**మోదితకమ్పాకూలే**
**ముహుర్ముహుర్మనసి ముముదిషాస్మాకమ్॥ 73**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| మూర్తిమతి | = | ఆకారముగల; |

| | | |
|---|---|---|
| ముక్తిబీజే | = | ముక్తి కారణమైన; |
| మూర్ధ్ని | = | శిరమున; |
| స్తబకితచకోరసామ్రాజ్యే | = | పూగుత్తిగా చేయబడిన చంద్రుడుగల; |
| మోదితకమ్పాకూలే | = | కమ్పానదీ తీరమును సంతోషింపజేసిన అమ్మవారియందు; |
| ముహుర్ముహుః | = | మాటిమాటికి; |
| అస్మాకమ్ | = | మాకు; |
| మనసి | = | మనసున; |
| ముముదిషా | = | ఆనందించు కోరిక (అస్తి-ఉన్నది). |

**తాత్పర్యము :-**

ఆకారముగల, ముక్తిహేతువైన, శిరమున చంద్రుని పూగుత్తివలె ధరించిన, కమ్పానదీ తీరము నానందింపజేసిన అమ్మవారి వలన సంతోషమును పొందవలెనను కోరిక నా మనసున మాటిమాటికి కలుగుచున్నది.

**వివరణము :-**

1) ముక్తిని పొందుట యనగా నిరాకార నిర్గుణ పరమాత్మైక్యము నందుట. అమ్మవారు మూర్తిమతి అనగా సాకార అయ్యును ఆమె ముక్తి హేతువగుననుటచే నిందు విరోధాలంకార స్ఫురణమున్నది. చంద్రుని భంగ్యంతరముగ చకోరసామ్రాజ్యముగా చెప్పుటచే పర్యాయోక్త్యలంకారమున్నది. అమ్మవారు కమ్పానదీతీరమున జేరి దానిని సంతోషింపజేసినది కావున కమ్పాతీరమున అమ్మవారి సన్నిధిని సంతోషింపవలెనని కోరిక యున్నది అని కవి చెప్పుచున్నాడు. మోదము కలిగించు వారి చెంతనే మోదము నొందవలెనను కోరిక ఫలించును. ఇతరుల చెంత జేరిన మోదము నొంద వలెనను కోరిక ఫలింపదు గదా అనుట ఉత్తరార్ధమున వ్యంగ్యము. పాదములన్నిట వడియున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు **ముక్తి బీజ**మని చెప్పబడినది. ఈ శ్లోకమున ముక్తి క్షేత్రమైన పరపదమున నుదయించు చంద్రుడు స్వరూపముగాగలది అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ వేదమయీం నాదమయీం**
**బిన్దుమయీం పరపదోద్యదిన్దుమయీమ్।**
**మన్త్రమయీం తన్త్రమయీం**
**ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీమ్॥ 74**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| వేదమయీమ్ | = | వేదమయియైన; |
| నాదమయీమ్ | = | నాదమయియైన; |
| బిందుమయీమ్ | = | బిందుమయియైన; |

పరపదోద్యదిందుమయీమ్ = పరమపదమున నుదయించు చంద్రుడి స్వరూపముగాగల;
మంత్రమయీమ్ = మంత్రమయియైన;
తంత్రమయీమ్ = తంత్రమయియైన;
విశ్వవికృతిమయీమ్ = విశ్వవికారరూపిణియైన ప్రకృతిని గూర్చి;
నౌమి = నమస్కరించెదను.

**తాత్పర్యము :-**

వేదనాదబిందురూపిణి, పరమపద మందుదయించు చంద్రుడు స్వరూపముగాగల, మంత్రతంత్రమయియైన, విశ్వవికారమయియైన, ప్రకృతియైన అమ్మవారికి నమస్కరించెదను.

**వివరణము :-**

1) ఈ ప్రపంచమంతయు నమ్మవారే. పరమపదమని చెప్పదగిన సహస్రారము ఇందువు. అదియు అమ్మవారే. ప్రకృతియైన అమ్మవారే విశ్వమను నీ వికారముగా పరిణమించిది. ప్రకృతి యనగా కరణము. వికృతి యనగా కార్యము. కారణము కార్యమును అమ్మవారే. మట్టియొక్క వికారము కూడ కారణమైన మట్టియు కార్యమైన కుండయు మట్టియే యైనట్లు కారణము కార్యమును అమ్మవారే. ఈ ప్రపంచములోని వేదములు, ప్రకృతివికృతులు, బిందునాదములు, మంత్రములు, తంత్రములు అన్నియు అమ్మవారే అని చెప్పుటచే **సర్వం ఖల్విదమ్ బ్రహ్మ** అను శ్రుత్యర్థము ఈ శ్లోకమున చెప్పబడినది. సహస్రారములో బిందువే యిందువు. బిందువే సుధాసింధువు. ఈ బిందు స్థానం సుధౌ సింధుః అని తంత్రవచనము. సుధా సింధువును బిందువువలె జన్మించు ఇందువు అమృత బిందువు. ఇందువునకు సోముడని పేరు. శివునకు సోముడని పేరు. కావున సహస్రారము శివస్థానము. శివమయి అమ్మవారు కావున **పరపదోద్యదిందుమయి** యని చెప్పబడినది.

2) చతుర్వేదములు, దశవిధ నాదములు, సప్తకోటి మహామంత్రములు, చతుఃషష్టి తంత్రములు అన్నియు అమ్మవారే. ద్వితీయ పాదమున యతికి బదులు ప్రాసయున్నది. చతుర్థపాదమున కూడ ప్రాసయతియే ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారికి నమస్కరించుట లేక ఆమెను స్తుతించుట చెప్పబడినది. అవి అమ్మవారి కరుణకొఱకే అని ఈ శ్లోకమున సూచింప బడుచున్నది.

**శ్లో॥ పురమథనపుణ్యకోటీ**
**పుఞ్జితకవిలోకసూక్తిరసధాటీ।**
**మనసి మమ కామకోటీ**
**విహరతు కరుణావిపాకపరిపాటీ॥ 75**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| పురమథనపుణ్యకోటీ | = | పురముల మథించిన శివుని కోటి పుణ్యముల స్వరూపమైన |
| పుఞ్జితకవిలోకసూక్తిరసధాటీ | = | పుంజీభవించిన కవిలోక సూక్తుల యందలి రసముయొక్క వేగమైన |
| కరుణావిపాకపరిపాటీ | = | దయాపరిణామముయొక్క సంప్రదాయమైన; |
| కామకోటీ | = | కామకోటి పీఠరూపిణియైన అమ్మవారు; |
| మమ | = | నాయొక్క; |
| మనసి | = | మనసున; |
| విహరతు | = | విహరించుగాక. |

**తాత్పర్యము :-**

శివుని కోటి పుణ్యముల మూర్తి, కవిలోకసూక్తుల పుంజీభావము, కరుణాపరిణామ సంప్రదాయమును, కామకోటి పీఠదేవతయునైన అమ్మవారు నా మనసున విహరించుగాక.

**వివరణము :-**

నాలుగు పాదములలో అంత్యప్రాసమున్నది. పూర్వార్ధపాదాదులందు వడియున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారు **కరుణావిపాకపరిపాటి** యని చెప్పబడినది. ఈ శ్లోకమున కరుణాఫలముగా అమ్మవారి దర్శనమైనట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ కుటిలం చటులం పృథులం**
**మృదులం కచనయనజఘనచరణేషు।**
**అవలోకితమవలమ్బిత-**
**మధికమ్పాతటమమేయమస్మాభిః॥ 76**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కచనయనజఘనచరణేషు | = | కేశనేత్రకటిపాదముల యందు; |
| కుటిలమ్ | = | వంకఅయైన; |
| చటులమ్ | = | చంచలమైన; |
| పృథులమ్ | = | విశాలమైన; |
| మృదులమ్ | = | మృదువైన; |
| అధికమ్పాతటమ్ | = | కమ్పానదీతీరమున; |
| అవలోకితమ్ | = | చూడబడిన; |

అమేయమ్ = ప్రమాణములకందనిది (అమ్మవారు);
అస్మాభిః = మాచేత;
అవలమ్బితమ్ = ఆశ్రయింపబడినది.

**తాత్పర్యము :-**

వక్రకేశములు, చంచలనేత్రములు, విశాలజఘనము, మృదు చరణములుగల, కమ్పానదీతీరమున కనబడునట్టి అమ్మవారే మాచేత ఆశ్రయింపబడినది. ఆమె ఏ ప్రమాణముల చేతను తెలియరానిదై యున్నది.

**వివరణము :-**

1) పూర్వార్ధమున నాలుగు విశేషణములు (గుణములు), వాని కాధార స్థానములు నాలుగు వరుసగా చెప్పబడినందున క్రమాలంకారమున్నది. **అమేయమ్** అనగా ప్రమాణముచే తెలిసికొనరానిది అని చెప్పుచునే అవలోకితమ్ చూడబడినది అని అనుప్రత్యక్షప్రమాణము తెలియబడినది, అని పూర్వ విరుద్ధముగా చెప్పుటచే విరోధాలంకారమున్నది. పంచేంద్రియములు అంతఃకరణము (మనస్సు) అను ఆఱింటిని ప్రత్యక్షప్రమాణములందురు. శ్రోత్రత్వక్చక్షు ర్జిహ్వాఘ్రాణములు అను బహిరింద్రియములే బయటనున్న శబ్దస్పర్శరూప రసగంధములు అను విషయములను గ్రహించుటచే ఆ ఇంద్రియములు ప్రత్యక్షములు లేక ప్రత్యక్ష ప్రమాణములు. ఆ విషయములు ప్రత్యక్ష ప్రమేయములు లేక ప్రత్యక్షములు అని చెప్పబడును. సుఖదుఃఖములు అంతర విషయములు అంతఃకరణము అయిన మనస్సుచే తెలియబడును. కావున మనస్సు కూడ అంతర ప్రత్యక్ష ప్రమాణము అని చెప్పబడును. ప్రత్యక్షమైన ధూమముచే కొండమీది అగ్ని ఉన్నదని తెలియును. కావున అగ్ని అనుమేయము అనబడును. ధూమమున్న చోట అగ్ని ఉండును అను వ్యాప్తి జ్ఞానము అనుమానము అనబడును.

2) గోసదృశము గవయము అని తెలిసిన వానినుండి విని తాను అడివికి పోయినప్పుడు అక్కడ గోసదృశపిండమును చూచి ఇది గవయము అని గ్రహించుట ఉపమానము. గవయము ఉపమాన ప్రమాణవేద్యమై ఉపమేయ మనబడును. గవయమందలి గో సాదృశ్యజ్ఞానము ఉపమానము అనబడును. శబ్దస్పర్శరూపరస గంధములు సుఖదుఃఖములే ప్రమాణము (ప్రత్యక్షము)చే వేద్యములో వాని అభావము కూడ అప్రమాణముచేతనే తెలియబడును. కావున శబ్దాద్యభావము నుపలబ్ధి అను ప్రమాణముచే తెలియబడును. కావున అభావము అనుపలబ్ధి ప్రమాణవిషయము కావున అదికూడ మేయమే. బలిసియున్న దేవదత్తుడు పగలు భుజింపడు. అను వాక్యముపపన్నము కావలెననిన అనగా దేవదత్తుని బలుపు ఉపపన్నము కావలెనను పై వాక్యముచేత దేవదత్తుడు రాత్రి భుజించును అను అర్థము ఆక్షిప్తమగును. కావున ఆతని రాత్రి భోజనము అర్థా పత్తి ప్రమాణలభ్యము.

3) కొందఱు పురాణాదులను ఐతిహ్యప్రమాణముగా నంగీక రించెదరు. కొందఱు ఈ చెట్టుపై దయ్యమున్నది అని ఉండుట సంభవము కావున దీనిని సంభవ ప్రమాణమనెదరు. ప్రత్యక్షాదులైన పై సప్త ప్రమాణములను నిర్దోషములు కాజాలవు. వేదమొక్కటే నిర్దోష ప్రమాణము. అదియే శబ్ద ప్రమాణము అని కూడ అనబడును.

4) అమ్మవారికి శబ్దస్పర్శరూపరసగంధములు లేకపోవుటచే ప్రత్యక్ష ప్రమాణవేద్యము కాదు. ప్రత్యక్షముయొక్క ప్రామాణ్యము మీదనే అది ఆధారముగాగల మిగిలిన ప్రమాణములు ప్రత్యక్షమంత ప్రబలములు కావు. ఆ ప్రత్యక్షమే దోషభూయిష్ఠమగు నవకాశమున్నందున ప్రబలప్రమాణము కాజాలదనగా వేదమొక్కటే ప్రబలప్రమాణము. బ్రహ్మము వేదవేద్యమని చెప్పబడినందున అది అమేయమెట్లగును. అన్న ప్రశ్నమునకు **తత్త్వమసి** అను వేద మహావాక్యము ఆవరణభంగము నొనరించి చరితార్థము కాగా అమ్మవారు స్వయముగనే గోచరించును. కావున ఆమె **అమేయ** యని చెప్పబడవచ్చును.



**అవ॥:-** అమ్మవారు అమేయ యని పై శ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి అనుగ్రహముచే కవి తానే ఆమెను దర్శించినట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ ప్రత్యఙ్ముఖ్యా దృష్ట్యా**
**ప్రసాదదీపాఙ్కురేణ కామాక్ష్యాః।**
**పశ్యామి నిస్తులమహో**
**పచేలిమం కిమపి పరశివోల్లాసమ్॥ 77**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కామాక్ష్యాః | = కామాక్షీదేవియొక్క; |
| ప్రసాదదీపాంకురేణ | = అనుగ్రహదీపపు మొలకయైన; |
| ప్రత్యఙ్ముఖ్యా | = ప్రత్యఙ్ముఖియైన; |
| దృష్ట్యా | = చూపుచేత; |
| నిస్తులమ్ | = సాటిలేని; |
| పచేలిమమ్ | = పండిన; |
| కిమపి | = ఒకానొక; |
| పరశివోల్లాసమ్ | = పరశివుని ఉల్లాసమును (అమ్మవారిని); |
| పశ్యామి | = చూచుచున్నాను; |
| అహో | = ఆహా. |

**తాత్పర్యము :-**

అమ్మవారి అనుగ్రహముచే కలిగిన ప్రత్యఙ్ముఖిదృష్టిచేత సాటిలేని పండిన

పరశివోల్లాసమని చెప్పదగిన అమ్మవారిని చూచుచున్నాను ఆహా!

**వివరణము :-**

1) తనను తానుచూచు చూపు ప్రత్యఙ్ముఖదృష్టి అనబడును. ప్రత్యక్ అనగా ఆత్మ దానికి అభిముఖమైనది. ప్రత్యఙ్ముఖ అద్దములోనికి చూచునప్పుడు ప్రతిబింబము ద్వారా తనకు తానభిముఖమై తనను చూచుచున్నానని భ్రాంతి కలుగును. సాధారణముగా మన దృష్టి పరాఙ్ముఖమై యుండును. కఠోపనిషత్తులో **పరాంచి ఖాని వ్యతృణత్ స్వయమ్భూః తస్మాత్ పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్** (2.11) భగవానుడు పరాఙ్ముఖములుగా నుండునట్లు ఇంద్రియములను పోషించెను. అందువలన ప్రతి జీవుడును బయటకు చూచును. తనలోనికి తన చూపు ప్రసరించదు. చూపేకాదు. ఏ యింద్రియమును తనలోనికి ప్రసరించదు. అమ్మవారి అనుగ్రహము కలిగినచో ఆ చూపు పరాఙ్ముఖత్వమును వీడి ప్రత్యఙ్ము[illegible]గును. బయటి చూపును వీడి లోచూపుకలవాడై తనను తాను చూచుకొని తానే అ[illegible]గా అమ్మవారే తానుగా అగు దర్శనము ఆత్మ సాక్షాత్కారము అది కలుగును. అప్పటి ఆనందము సాటిలేనిది. అది **పరశివోల్లాసము.** కోట్లకొలది పుణ్యములు పండుటచే ఆ సాక్షాత్కారము కలుగును.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి దర్శనము చెప్పబడినది. ఈ శ్లోకమున అదృష్టమైన అమ్మవారు స్తుతింపబడుచున్నది.

**శ్లో॥ విద్యే! విధాతృవిషయే!**
**కాత్యాయని! కాలి! కామకోటికలే!।**
**భారతి! భైరవి! భద్రే!**
**శాకిని! శామ్భవి! శివే! స్తువే భవతీమ్॥ 78**

**ప్రతిపదార్థము :-**

విద్యే = ఓ విద్యా!
విధాతృవిషయే = బ్రహ్మకు తెలియబడుదానా!
కాత్యాయని = కాత్యాయనీ!
కాలి = ఓ కాలీ!
కామకోటికలే = కామకోటీశ్వరుడగు చంద్రుని (చంద్రమౌళియైన శివుని) కలయైనదానా!
భారతి = వాగ్రూపిణియైనదానా!
భైరవి = భైరవుని భార్యయైన దానా!
భద్రే = భద్రతా స్వరూపముగలదానా!
శాకిని = శాకినీ స్వరూపురాలా!

శామ్భవి = శమ్భుతత్త్వ స్వరూపిణియైనదానా!
శివే = మంగళస్వరూపురాలా!
భవతీమ్ = నిన్ను;
స్తువే = స్తుతించుచున్నాను.

**తాత్పర్యము :-**

అమ్మవారు విద్యా స్వరూపిణి, కాత్యాయని, మహాకాలి, కామకోటికల, సరస్వతీరూపిణి, మంగళస్వరూపిణి, భద్రతాస్వరూపిణి, శాకినీస్వరూపిణి, శమ్భుతత్త్వస్వరూపిణి, శివ అట్టి అమ్మవారిని స్తుతించెదను.

**వివరణము :-**

1) విద్యయనగా ఉపాసనము, విద్యయనగా అవిద్యను నశింపజేయు బ్రహ్మ జ్ఞానము. తదుభయము అమ్మవారే. ఆమె మాయా స్వరూపిణి. అందఱు ఆమెచే మోహితులై యుందురు. ఒక్క పరమేశ్వరుడే ఆమెను స్వాధీనము నందుంచుకొని ఎఱుక గలిగియుండును. ఆయనకు మాత్రమే ఆమె దర్శన మిచ్చును. పతివ్రతా స్త్రీ భర్తకు తప్ప మరొకరికి దర్శన విషయము కానట్లు అమ్మవారు విధాతయగు పరమేశ్వరునకే దృగ్విషయమగును. కత్యఋషి వంశీయులచే ఉపాసింప బడినది కావున ఆమె **కాత్యాయని.** ఆమె నల్లనిదై కాలి యనబడును. సమస్తమును మ్రింగునది కావున కాలి యనబడును కాలస్వరూపిణి కావున **కాలి** యనబడును. ఆమె భక్తులకు భద్రములను కలిగించునది కావున ఆమె **భద్ర** యనబడును. శమ్భుజ్ఞానమును ప్రసాదించునది కావున శాంభవి యనబడును. భా అనగా కాంతి జ్ఞానము దానియందు రతి కలది కావున **భారతి** యనబడును. భైరవి యనగా భయంకరమైన ధ్వనిగలది లేక భైరవుని భార్య భైరవి యనబడును. శాకము లాభరణములుగా ధరించు భూదేవియొక్క రూపముగలది కావున ఆమె **శాకిని.**

2) ప్రథమ పాద వికారారంభ పదములు, ద్వితీయపాదము కకారారంభపదములు, తృతీయ పాదమున భకారారంభపదములు, చతుర్థపాదము శకారారంభముగల పదములుగలదనుటచే అనుప్రాసము అను శబ్దాలంకార మున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారు స్తుతింపబడినది. ఈ శ్లోకమున ఆమె నమస్కరింపబడుచున్నది.

**శ్లో॥ మాలిని! మహేశచాలిని!**
**కాఞ్చీఖేలిని విపక్షకాలిని తే।**
**శూలిని విద్రుమశాలిని**
**సురజనపాలిని కపాలిని నమోఽస్తు॥ 79**

**ప్రతిపదార్థము :-**

మాలిని = మాలకలదానా!
మహేశచాలిని = మహేశుని కదిలించుదానా!
కాంచీఖేలిని = కాంచీనగరమున నాడు కొనుదానా!
విపక్షకాలిని = శత్రువులను సంహరించుదానా!
శూలిని = శూలము కలదానా!
విద్రుమశాలిని = పగడములవలె నొప్పుదానా!
సురజనపాలిని = సురజనులను పాలించుదానా!
కపాలిని = కపాలముగలదానా!
తే = నీకు;
నమః = నమస్సు;
అస్తు = అగుగాక.

**తాత్పర్యము :-**

మాలను ధరించుదానా! మహేశుని కదిలించుదానా! కాంచీనగరమున నాడుకొనుదానా! శత్రువుల సంహరించుదానా! శూలము ధరించుదానా! పగడముల ధరించుదానా! లేక పగడముల రంగుగలదానా! అనగా ఎఱ్ఱని దానా! సురజనుల పాలించుదానా! కపాలము ధరించుదానా! ఓ దేవీ! నీకు నా నమస్సు అగుగాక!

**వివరణము :-**

ఈ శ్లోకమున పదాంత ద్విప్రాసమున్నది. ద్వితీయార్ధమున పాదాది వడియున్నది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారికి శూలియు కపాలియునైన శివునితో సామ్యము చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారు శివునకు గురువని చెప్పబడు చున్నది.

**శ్లో॥ దేశిక ఇతి కిం శఙ్కే**
**తత్తాదృక్తవ ను తరుణిమోన్మేషః।**
**కామాక్షి! శూలపాణేః**
**కామాగమసమయతన్త్రదీక్షాయామ్॥ 80**

**ప్రతిపదార్థము :-**

కామాక్షి! = ఓ కామాక్షీ!
తవ = నీయొక్క;
తత్తాదృక్ = తత్త్వదర్శియైన;

| | |
|---|---|
| తరుణిమోన్మేషః | = యౌవనోదయము; |
| శూలపాణేః | = శివునకు; |
| కామాగమసమయతంత్రదీక్షాయామ్ | = మన్మథ విద్యతంత్ర దీక్షయందు; |
| దేశిక ఇతి కిం ను | = గురువువలె ఆచరించుచున్నదా? అని |
| శంకే | = సందేహించుచున్నాను. |

**తాత్పర్యము :-**

అమ్మా! కామాక్షీ! శివా! తత్త్వదర్శియైన నీ యౌవనోదయము శివునకు కాదివిద్యా సమయతంత్ర దీక్షయందు గురుత్వమును వహించుచున్నదా యేమి?

**వివరణము :-**

1) కామాగమ సమయము ఆహ్లాదకర వాతావరణము వర్షాకాలమో వసంతర్తువో హేమంతమో శరదృతువో ఏదియైన కావచ్చును. అమ్మవారి యౌవనోన్మేషము శివునకు కామము నుద్దీపింపజేయును. ఇంతేకాదు విరక్తుడైన శివునకు సంభోగతంత్రమునందు మెలకువలు నేర్పుటలో అమ్మవారు గురుత్వమును వహించినది.

2) కామాగమ సమయ తంత్రమనగా కాదివిద్యలోని సమయాచారము. శివుదును అమ్మవారి ఉపాసకులలో నొకడు కావున ఆతనికి అమ్మవారే గురువు. శివుడు గురువైనప్పుడు అమ్మవారు శిష్యురాలు. అమ్మవారు గురువైనప్పుడు శివుడు శిష్యత్వము వహించుట తంత్రములో సాధారణమే. దేశిక ఇతి అనుటచే ఉపమాలంకారము స్ఫూర్తియున్నది. ఉత్తరార్ధమున పాదాదిప్రాసమున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి యౌవనోన్మేషము చెప్పబడినది. ఈ శ్లోకమున యౌవనోన్మేషమున వర్ధిల్లు కుచభరము చెప్పబడుచున్నది.

**శ్లో॥ వేదణ్డకుమ్భడమ్బర-**
**వైతణ్డికకుచభారార్తమధ్యాయ।**
**కుఙ్కుమరుచే నమస్యాం**
**శఙ్కరనయనామృతాయ రచయామః॥ 81**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| వేదండకుంభడంబరవైతండిక కుచభారార్తమధ్యాయ | = గజకుంభముల ఆడంబరముతో వినదించు కుచముల భారముతో పీడితమైన నడుముగల; |
| కుంకుమరుచే | = కుంకుమవన్నెగల; |
| శంకరనయనామృతాయ | = శివుని నేత్రముల కమృతమైన అమ్మవారికి; |

నమస్యామ్ = నమస్సును;
రచయామః = చేయుచున్నాను.

**తాత్పర్యము :-**

అమ్మవారి కుచభరము ఏనుగుకుంభస్థలమున ఔన్నత్యముతో వినదించు చున్నట్లున్నది. ఆ కుచభరముచే నడుము పీడించబడి మిక్కిలి చిక్కినట్లున్నది. అమ్మవారు శివుని కన్నులకెట్టని యమృతమువలె ఆస్వాద్యమై ఉన్నది.

**వివరణము :-**

పూర్వార్ధమున ఉత్ప్రేక్షాలంకారమున్నది. ఉత్తరార్ధమున అమ్మవారిని చెప్పక శివనయనామృతముగా చెప్పబడుటచే అతిశయోక్త్యలంకారమున్నది. అమ్మృతము తెల్లనిది. అమ్మవారెఱ్ఱనిది. అమ్మవారు ఎఱ్ఱని అమృతమని చెప్పబడినది. పూర్వార్ధమున తృతీయాక్షర ప్రాసమున్నది. ఉత్తరార్ధమున ద్వితీయాక్షర ప్రాసమున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి మధ్యము కుచభరపీడితమని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ మధ్యమున విలసిల్లు కాంచి (మొలనూలు) ప్రస్తావింప బడుచున్నది.

**శ్లో॥ అధికాఞ్చితమణి కాఞ్చన-**
**కాఞ్చీమధికాఞ్చి కాఞ్చిదద్రాక్షమ్।**
**అవనతజనానుకమ్పా-**
**మనుకమ్పాకూలమస్మదనుకూలామ్॥ 82**

**ప్రతిపదార్థము :-**

అధికాంచితమణికాంచనకాంచీమ్ = మిక్కిలి పూజనీయమైన మణులు పొదిగిన బంగారు ఒడ్డాణముగల;
అవనతజనానుకమ్పామ్ = నమస్కరించిన జనులయందు దయగల;
అస్మదనుకూలామ్ = మాకు అనుకూలమైన;
కాంచిత్ = ఒకానొక దానిని (అమ్మవారిని);
అనుకమ్పాకూలమ్ = కమ్పానదీ తీరమున;
అధికాంచి = కాంచీనగరమున;
అద్రాక్షమ్ = చూచితిని.

**తాత్పర్యము :-**

కమ్పానదీతీరమున కాంచీనగరమున మిక్కిలి పూజనీయ మణికాంచన కాంచిని ధరించిన, మాకు అనుకూలమైన నమస్కరించిన జనులయందు దయగల ఒకానొక **యమ్మను** చూచితిని.

**వివరణము :-**

అధికాంచితమణికాంచనకాంచీమ్ అను విశేషణమున కాంచి ద్విరావృత్తమగుటచే యమకాలంకార మేర్పడియున్నది. ఉత్తరార్ధమున అనుకమ్పా కూలశబ్దముల ద్విరావృత్తిచే యమకాలంకారమేర్పడియున్నది. అధికాంచి కాంచి దద్రాక్షమ్ అను పదములలో అవ్యవహిత కాంచి శబ్దద్వారావృత్తిచే ఛేకాను ప్రాసాలంకార మేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి నడుమునందలంకారమైన కాంచన మణికాంచి ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున శివుని ఉత్సంగమున కమ్మవారే అలంకార మని చెప్పబడుచున్నది.

**శ్లో॥ పరిచితకమ్పాతీరం**
**పర్వతరాజస్య సుకృతసంనాహమ్।**
**పరగురుకృపయా వీక్షే**
**పరమశివోత్సఙ్గమఙ్గళాభరణమ్॥ 83**

**ప్రతిపదార్థము :-**

పరిచితకమ్పాతీరమ్ = పరిచితమైన కమ్పానదీతీరముగల;
పర్వతరాజస్య = హిమవంతునియొక్క;
సుకృతసంనాహమ్ = సుకృతముల సమూహమైన;
పరమశివోత్సంగమంగలాభరణమ్ = పరమశివుని ఒడికి మంగలాభరణమైన అమ్మవారిని;
పరగురుకృపయా = పరమగురుని దయచేత;
వీక్షే = చూచెదను.

**తాత్పర్యము :-**

కమ్పానదీ తీరముతో పరిచయముగల హిమవంతుని పుణ్యముల సమూహమైన, పరమశివుని ఒడికి మంగళాభరణమైన అమ్మవారిని పరగురుని కృపతో చూచెదను.

**వివరణము :-**

తన తపస్సుచే శివునిచే గళాభరణము కట్టించుకొన్న అమ్మవారు శివుని ఒడికి మంగలాభరణమైనది. గురుకృపచేతనే తనకు అమ్మవారి దర్శనమైనదని కర్మభక్త్యాది సాధనవలన కాదని కవి తన నిరహంకారత నీ శ్లోకమున ప్రకటించినాడు. వీక్షే అను వర్తమానక్రియచేత అమ్మవారి దర్శన మొకసారి కలిగిన దానికంతముండదని కవి

సూచించుచున్నాడు. పాదాదులందు వడి యున్నది. ద్వితీయార్ధమున ప్రాసము కూడ నున్నది.



**అవ:-** అమ్మవారికి పరమశివసంగము కలుగుట పై శ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున దానికి కారణము చెప్పబడుచున్నది.

**శ్లో॥ దగ్ధమదనస్య శమ్భోః**
**ప్రథీయసీం బ్రహ్మచర్యవైదగ్ధీమ్।**
**తవ దేవి తరుణిమశ్రీ-**
**చతురిమపాకో న చక్షమే మాతః॥ 84**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| మాతః | = అమ్మా! |
| తవ | = నీయొక్క |
| తరుణిమశ్రీచతురిమపాకః | = యౌవన శోభాచాతుర్యపాకము; |
| దగ్ధమదనస్య | = కాల్చబడిన కాముడుగల; |
| శమ్భోః | = శివునియొక్క; |
| ప్రథీయసీమ్ | = ప్రసిద్ధమైన; |
| బ్రహ్మచర్యవైదగ్ధీమ్ | = బ్రహ్మచర్య నిపుణతను; |
| న చక్షమే | = క్షమించలేదు. |

**తాత్పర్యము :-**

అమ్మా! నీ యౌవనశోభాచాతుర్యపాకము మన్మథుని కాల్చిన శివుని ప్రసిద్ధమైన బ్రహ్మచర్యనిపుణతను క్షమించలేదు.

**వివరణము :-**

1) ఏ పురుషునేస్త్రీ ఆకర్షించ బూనినదో ఆ పురుషుని బ్రహ్మచర్య దీక్షనా స్త్రీ క్షమించజాలదు. కాముని కాల్చిన మన్మథుని బ్రహ్మచర్యవైదగ్ధి అను స్త్రీ ఎదుట అమ్మవారి యౌవనశోభా చాతుర్యపాక పురుషుడు క్షమించలేక పోయినాడు. ఇచట స్త్రీ పురుష భావము వ్యత్యస్తమైనది. శివుడు పురుషుడు. కామాక్షి స్త్రీ. శివుని బ్రహ్మచర్యవైదగ్ధి స్త్రీ లింగమున, అమ్మవారి తరుణిమ శోభాచాతుర్యపాకము పుంలింగమున ప్రయోగింపబడుట స్త్రీపురుషుల సామ్యమును తెలుపుచున్నది. మొదట శివుడు గెలిచినట్లే గెలిచినాడు కాని తరువాత శివుడే అమ్మవారిని తనకై కుదుర్చుమని సప్తర్షులని ప్రార్థించి హిమవంతు నొప్పించి పెండ్లాడినాడు. అనగా అమ్మవారే గెలిచినట్లైనది. శివుని బ్రహ్మచర్యవైదగ్ధి ఒక స్త్రీ. ఆమె అమ్మవారి యౌవన శోభను ఓర్వలేక పురుషుని ముందోడి పోకపోవుటను

క్షమింపక ఆ పురుషుడు ఆమె ఓడి పోవు వఱకు విశ్రమించలేదు. ఆ తరువాత కథ కంచికి వెళ్ళి సుఖాంతమైనది.

2) అర్థాలంకారము సమాసోక్తి. ద్వితీయ చతుర్థపాదములలో స్థాన భేదమును వర్ణమైత్రి పాటింపబడినది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి **యౌవనము** ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున యౌవనమదముగల **పుళిందయువతిగా** అమ్మవారు వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ మదజలతమాలపత్రా**
**వసనితపత్రా కరాధృతఖనిత్రా।**
**విహరతి పులిన్దయోషా**
**గుఞ్జాభూషా ఫణీన్ద్రకృతవేషా॥ 85**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| మదజలతమాలపత్రా | = మదజలము తమాలపత్రముగాగల; |
| వసనితపత్రా | = వస్త్రముగా చేసికొన్న ఆకులుగల; |
| కరాధృతఖనిత్రా | = చేతధరించిన గడ్డపాఱగల; |
| గుంజాభూషా | = గురువింద పూసల సొమ్ములుగల; |
| ఫణీంద్రకృతవేషా | = సర్పరాజుచే చేయబడిన వేషముగల; |
| పుళిందయోషా | = కిరాతస్త్రీ; |
| విహరతి | = విహరించుచున్నది. |

**తాత్పర్యము :-**

మదజలము తమాలపత్రముగాగల, ఆకులచీర ధరించిన, చేతగడ్డపాఱ ధరించిన, గురువిందపూసల సొమ్ముల ధరించిన, వేషము వేయుటలో సర్పరాజు నుపయోగించుకొన్న, కిరాతస్త్రీ విహరించుచున్నది.

**వివరణము :-**

1) శివుడు కిరాతవేషము ధరించి అర్జుననితో యుద్ధము చేసి ఆతని పరాక్రమమునకు సంతోషించి పాశుపతాస్త్రము నాతనికిచ్చిన కథ భారత ప్రసిద్ధము. కిరాతార్జునీయ మహాకావ్య రచనకు ఆధారమైనది. శివున కాదికిరాతుడను పేరు కూడ ప్రసిద్ధము. లయకర్తకాపేరుచితము కూడ. శివుడు కిరాతవేషమును ధరించినప్పు డమ్మవారు కిరాతివేషమును ధరించినది. దాని వర్ణన మీ శ్లోకమున చేయబడినది. ఒక అమ్నాయ దేవత కీవేషము కలదని మూడు శ్లోకములలో నిట్టి దేవతల వేషములు వర్ణింపబడినవని పెద్దలు చెప్పెదరు. తాళపత్రమును తెనుగున తాటికమ్మ అందురు.

నేడు చెవులకు ధరించుటచే కమ్మలను పేరువచ్చి యుండవచ్చును. తాళపత్రమో తమాలపత్రమో చెవులకు ధరించి యలంకరించు కొనుట పేదవారికిని అలంకారప్రీతి యుండుననుటకు నిదర్శనము. స్త్రీలకు అలంకరణప్రీతి సంపత్తి, సువర్ణరజతాది భూషణములు లేకున్నను తగ్గదు. పురుషులకు కూడ స్త్రీలకున్నంత లేకపోయినను అలంకారప్రీతి ఎంతో కొంత ఉండనే ఉండును. ఆటవికులు పాములను సొమ్ములుగా ధరించి ధనికులకు వినోదము కల్పించి ధనము సంపాదించువారిని మనము అప్పుడప్పుడు చూచెదము. అమ్మవారు కిరాతయోషా వేషమున సర్పరాజులను ధరించినది.

2) ఆటవికులు కందమూలములను త్రవ్వుకొనుటకు చేతగడ్డపాఱ లేక గునపము ధరించెదరు. శివునకు పీతాంబరములు లేవు. దిగంబరుడుగానో చర్మాంబరుడుగానో ఉండును. ఆతని భార్య కిరాతవేషమున ఆకులనే చీరగా కట్టుకొన్నది. ఆటవికులలో ఇప్పటికి వస్త్రములు ధరింపని వారు పెక్కుఱున్నారు. తమాలాది పత్రములతో దొప్పలు కుట్టుకొని వానిలో మద్యరసమును దాచుకొందురు. వానికిష్టమైన పానీయమద్యము దొప్పలలో పోసికొని త్రావుదురు. యౌవనవతులలో మదపువాసనవేయు చమట, గజముల మదజలమువలె గండస్థలముల స్రవించును. దానిని పత్రవ్యజనముతో విసరుకొనుచు పోగొట్టుకొందురు. పూర్వార్ధమున ఉత్తరార్ధమునను పదాంతప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కిరాతయువతి వేషము వర్ణింపబడినది. ఈ శ్లోకమున మరొక వేషము వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ అఙ్కే శుకినీ గీతే**
**కౌతుకినీ పరిసరే చ గాయకినీ।**
**జయసి సవిధేఽమ్బ! భైరవ-**
**మణ్డలినీ శ్రవసి శఙ్ఖకుణ్డలినీ॥ 86**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| అంబ | = అమ్మా; |
| అంకే | = తొడయందు; |
| శుకినీ | = చిలుకగలది; |
| గీతే | = పాటయందు; |
| కౌతుకినీ | = కౌతుకముగలది; |
| పరిసరే చ | = చుట్టుపట్టులందును; |
| గాయకినీ | = గాయకులుగలది; |
| శ్రవసి | = చెవియందు; |
| శంఖకుండలినీ | = శంఖకుండలములుగలది; |

సవిధే = సమీపమున;
భైరవమండలినీ = భైరవమండలముననున్న నీవు;
జయసి = జయించెదవు సర్వోత్కర్షముగ వర్ధిల్లెదవు.

**తాత్పర్యము :-**

ఆమె తొడపై చిలుక యున్నది. ఆమెకు పాటయనిన ఇష్టము. ఆమె చుట్టుపట్టులలో గాయకులు గాయికలు ఉన్నారు. ఆమె చెవులకు శంఖములతో చేయబడిన కుండలములున్నవి. ఆమె చుట్టు భైరవులు అనగా కాపాలిక వ్రత దీక్షితుల లేక వేదముల లేక (కుక్కల) మండలమున్నది. ఈ రూపముతో నా సమీపముననే ఉన్నావు.

**వివరణము :-**

ద్వితీయార్ధమున ఆద్యవర్ణమునకు యత్యనంతర స్థానిక వర్ణమునకు మైత్రి ఉన్నది. నాల్గవపాదమున ఆద్యంత త్రిప్రాసమున్నది. భైరవమండలినీ అనుటచే ఈమె **మహాభైరవి** యని స్ఫురింపజేయబడినది. ఆమె చుట్టు గాయకులు గాయికలున్నారని **పరిసరే చ గాయకినీ గీతే కౌతుకినీ** అను పదములు తెలుపుచున్నవి. సముద్ర ప్రాంతములలోని గిరిజన స్త్రీలు శంఖముచే చేయబడిన కుండలముల ధరించెదరు. అమ్మవారు ఆ వేషముచే సాక్షాత్కరించినట్లు **సవిధే, జయసి** అను పదములు తెలుపుచున్నవి.



**అవ:-** పై శ్లోకమున విచిత్రవేషయగు నమ్మవారు వర్ణింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి **దుర్గారూపము** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ ప్రణతజనతాపవర్గా**
**కృతరణసర్గా ససింహసంసర్గా।**
**కామాక్షి! ముదితభర్గా**
**హతరిపువర్గా త్వమేవ సా దుర్గా॥ 87**

**ప్రతిపదార్థము :-**

కామాక్షి! = ఓ కామాక్షీదేవి!
ప్రణతజనతాపవర్గా = ప్రణమిల్లిన జనసమూహమునకు ముక్తివైన;
కృతరణసర్గా = చేయబడిన యుద్ధముల సృష్టిగల;
ససింహసంసర్గా = సింహసంబంధముతో కూడిన;
ముదితభర్గా = సంతోషించిన శివుడుగల;
హతరిపువర్గా = చంపబడిన శత్రు సమూహముగల;
త్వమ్ ఏవ = నీవే;
సా = ఆ;
దుర్గా = దుర్గవు.

**తాత్పర్యము :-**

నమస్కరించు జనులకు మోక్షము నొసగునది, యుద్ధములను సృష్టించునది, సింహమును వాహనముగా చేసికొన్నది. శివుని సంతసింప జేయునది, శత్రువులను సంహరించునది యైన కామాక్షాదేవి దుర్గయే.

**వివరణము :-**

1) భక్తులకు ఆత్మ (శివ/బ్రహ్మ) జ్ఞానము కలిగించు గురురూపిణి యగుటచే అమ్మవారు భక్తులకు ముక్తి హేతువైనందున ముక్తియే యని చెప్పబడినది. బలమును గలిగించు నెయ్యిని గూర్చి చెప్పు సమయమున నెయ్యి బలము అని చెప్పుట లోక సాధారణము. అందఱి బుద్ధుల ప్రచోదినియై దేవాసురల మధ్య యుద్ధమును సృజించున దమ్మవారే కావున **కృతరణసర్గ** యని చెప్పబడినది. అమ్మవారు సింహమునందు కూర్చున్నందున ఆమెకు సింహముతో సంయోగ సంబంధమున్నది. అందుచే **సింహసంసర్గ** అని చెప్పబడినది.

2) శివుని భర్తగా చేసికొనిగాని లేక రాక్షసులతో దౌత్యము నెఱపు దూతగా చేసికొనిగాని ఆయనను సంతోషింపజేయున దమ్మవారు కావున **ముదిత భర్గ**యని చెప్పబడినది. బహిశ్శత్రువైన రాక్షసాది దుష్టలోకకంటకులను అంతశ్శత్రువులైన కామక్రోధాద్యరిషడ్వర్గమును నశింపజేయునది గావున అమ్మవారు **హతరిపువర్గ** యని చెప్పబడినది.

3) అమ్మవారి యుద్ధము శత్రుసంహారము భక్తమోక్ష ప్రధానము. శివుని సంతోషింపజేయుట మొదలగు అంశములు దుర్గాసప్తశతి యందు వర్ణింపబడినవి. ఆ దుర్గయే ఈ **కామాక్షి** యని ఇట చెప్పబడినది. ఈ శ్లోకమున పదాంత ప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి దుర్గాస్వరూపము వర్ణింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి **చాముండా** స్వరూపము వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ శ్రవణచలద్వేదణ్డా**
**సమరోద్దణ్డా ధుతాసురశిఖణ్డా।**
**దేవి! కలితాన్త్రషణ్డా**
**ధృతనరముణ్డా త్వమేవ చాముణ్డా॥ 88**

**ప్రతిపదార్థము :-**

దేవి! = ఓ దేవీ!
శ్రవణచలద్వేదండా = చెవులయందూగుచున్న ఏనుగులు కలది;
సమరోద్దండా = యుద్ధము నందుద్ధతయైన;

ధుతాసురశిఖండా = కదలింపబడిన రాక్షసుల(తలలోని) నెమలి పింఛములుగల;
కలితాంత్రషండా = ధరించిన పేగుల గుంపులుగల;
ధృతనరముండా = ధరించిన మనుష్యుల తలలుగల;
త్వమ్ ఏవ = నీవే;
చాముండా = చాముండవు.

**తాత్పర్యము :-**

చెవులందేనుగులూగులాడు చున్నవి. రాక్షసుల కిరీటములలోని నెమలి యీకలు కదలిపోయినవి. పేగులను వేసికొన్నది. మనుష్యుల తలలను ధరించినది అయిన చాముండ నీస్వరూపమే.

**వివరణము :-**

అమ్మవారి బలమెంతటిదనగా ఆమె తన చెవులకు ఏనుగుల గట్టికొని నడచుచుండగా ఆ ఏనుగులు కుండలములవలె చెవులక్రింద నూగులాడుచున్నవి. ఏనుగులు కుండలములవలె నూగుచున్నవనగా ఇక నామె యెంత పొడవుగా నున్నదో ఊహించుకొననగును. ఈ విశేషణము ఆమె చాలా పొడుగుగా నున్నదని వ్యంజింప జేయును. ఆమె రణరంగమున నిలచినదనగానే రాక్షసుల తలలపైని కిరీటములు కదలును, వానిపై నున్న నెమలి యీకలు కదలును అని చెప్పుటచే రాక్షసులు భయముచేత వణికి పోవుదురని వ్యంగ్యమగును. నరకపాలములను ప్రేగులను హారములుగా ధరించి భయంకర స్వరూపమున యుద్ధమున నుద్దండయై చండముండుల సంహరించుటచే చాముండయని దుర్గాదేవిచే నామకరణము చేయబడిన దేవతకు చాముండయని పేరు. అమ్మవారు కల్పించిన దేవత కూడ అమ్మవారే అనుటచే అమ్మవారు కల్పించిన జగమంతయు నమ్మవారేయని వ్యంగ్యమగును. దండశబ్దముయొక్క ఆవృత్తిచే, ముండశబ్దముయొక్క ఆవృత్తిచే యమకాలంకారములున్నవి. మూడు నాలుగు పాదములలో అంత్యప్రాసమున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి **చాముండారూపము** వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఆమె **అన్నపూర్ణారూపము** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ ఉర్వీధరేన్ద్రకన్యే**
**దర్వీభరితేన భక్తపూరేణ।**
**గుర్వీమకిఞ్చనార్తిం**
**ఖర్వీకురుషే త్వమేవ కామాక్షి॥ 89**

**ప్రతిపదార్థము :-**

ఉర్వీధరేంద్రకన్యే = హిమవంతుని కుమార్తెవైన;

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| దర్వీభరితేన | = గరిటెలో నింపబడిన; |
| భక్తపూరేణ | = అన్నపుముద్దచే; |
| త్వమ్ ఏవ | = నీవే; |
| గుర్వీమ్ | = గొప్పదైన; |
| అకించనార్తిమ్ | = పేదవారి బాధను; |
| ఖర్వీకురుషే | = తగ్గించుచున్నావు. |

**తాత్పర్యము :-**

పేదలకు గరిటెల నింపిన ఆహారములతో తృప్తికలిగించి వారి బాధను పోగొట్టెదవు.

**వివరణము :-**

1) ఆకలిగొన్నవారెంతమంది భక్తులు అమ్మవారి ఇంటిముందాహారమునకై వేచి యుందురనగా వారిదొక ప్రవాహమున్నట్లుండును, అని **భక్తపూరేణ** శబ్దము వ్యంజింపజేయును. ఆకలి చాలా గొప్ప బాధ కదా! అన్నము పెట్టు అమ్మలందఱు అన్నపూర్ణలే. ఆకలికింత తినగలిగినవారు కూడ కోరికల ఆకలితో అమ్మవారి యింటిముందు వేచియుండు వారి సంఖ్యకూడ అనంతమే. అమ్మవారు తన గరిటెతో ఆహారమునే గాక కోరికలను గూడ వడ్డించును అని **దర్వీభరిత** శబ్దము స్ఫురింపజేయును. అన్నము తిన్నవారికాకలి యెంత పెద్దదైనను తొలగునట్లు భక్తుల బాధ ఎంత పెద్దదైనను అమ్మవారి అనుగ్రహముచే తొలగును.

2) నాలుగు పాదములందు ప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున **అన్నపూర్ణరూపము** వర్ణింపబడినది. ఈ శ్లోకమున **వారాహి రూపము** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ తాడితరిపుపరిపీడన-**
**భయహరణనిపుణహలముసలా।**
**క్రోడపతిభీషణముఖీ**
**క్రీడసి జగతి త్వమేవ కామాక్షి॥ 90**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| తాడితరిపు- | = కొట్టబడిన శత్రువుగల; |

| | |
|---|---|
| పరిపీడనభయహరణనిపుణహల ముసలా | = మిక్కిలి పీడనము వలన గలిగిన భయమును హరించుటలో నిపుణములైన హల ముసలములుగల; |
| క్రోడపతిభీషణముఖీ | = వరాహపతి ముఖము వంటి భయంకరముఖముగల; |
| త్వమ్ ఏవ | = నీవే; |
| జగతి | = జగమున; |
| క్రీడసి | = క్రీడించుచున్నావు. |

**తాత్పర్యము :-**

శత్రుసైన్యమును దండించునది, శత్రుభయమును పోగొట్టుటలో సమర్థములైన హల ముసలములుగల వరాహముఖముగల దానివి నీవే జగమున క్రీడించుచున్నావు, ఓ కామాక్షీదేవి!

**వివరణము :-**

1) వరాహముఖముకల దేవి వారాహి యనబడును. ఆమె హల ముసలములు ధరించి యుండును. వారాహీరూపము కూడ కామాక్షీదేవిదే.

2) నాలుగు పాదములందును ప్రాసమున్నది.



**అవ॥:-** పై శ్లోకమున వారాహీరూపము వర్ణింపబడినది. ఈ శ్లోకమున బాలారూపము వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ స్మరమథనవరణలోలా**
**మన్మథహేలావిలాసమణిశాలా।**
**కనకరుచిచౌర్యశీలా**
**త్వమమ్బ! బాలా కరాబ్జధృతమాలా॥ 91**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| అంబ! | = అమ్మా! |
| స్మరమథనవరణలోలా | = మన్మథుని మథించినవాని (శివుని) వరించుట యందాసక్తిగల; |
| మన్మథహేలా కనకరుచిచౌర్యశీలా | = మన్మథుని హేలయైన బంగారు కాంతిని దొంగిలించు స్వభావము గల; |
| కరాబ్జధృతమాలా | = కమలములవంటి హస్తములందు ధరించిన మాలగల; |
| బాలా | = బాలవు; |
| త్వమ్ ఏవ | = నీవే. |

**తాత్పర్యము :-**

అమ్మా! మన్మథుని మథించిన, శివుని మన్మథవిలాసములతోనే వరించుటలో ఆసక్తిగల, బంగారుకాంతిని దొంగిలించు స్వభావముగల, చేత మాల ధరించిన నీవు బాలవే.

**వివరణము :-**

మన్మథుని రూపమే యనదగిన అమ్మవారు మన్మథుని మథించిన శివుని వరించుట యందాసక్తిగలదై యున్నదనుటలో విరోధాలంకారస్ఫూర్తి యున్నది. ఈ శ్లోకమున పదాంత పాదాంత ప్రాసములున్నవి. **కరాబ్జధృతమాలా** అను శబ్దము అమ్మవారు బాలాత్రిపురసుందరీరూపిణి అని తెలుపుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి **బాలా** స్వరూపము వ్యంజింపజేయబడినది. ఈ శ్లోకమున అమ్మవారి **సరస్వతీరూపము** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ విమలపటీ కమలకుటీ**
**పుస్తకరుద్రాక్షశస్తహస్తపుటీ।**
**కామాక్షి! పక్ష్మలాక్షీ**
**కలితవిపఞ్చీ విభాసి వైరిఞ్చీ॥ 92**

**ప్రతిపదార్థము :-**

కామాక్షి! = ఓ కామాక్షీదేవీ!
విమలపటీ = శుభ్రవస్త్రముగల;
కమలకుటీ = కమలము కుటీరముగాగల;
పుస్తకరుద్రాక్షశస్తహస్తపుటీ = పుస్తకము చేత రుద్రాక్షల చేత పవిత్రములని ప్రశంసనీయములైన చేతుల ముదుపుగల;
పక్ష్మలాక్షీ = ఱెప్పలతో కూడిన కన్నులుగల;
కలితవిపంచీ = ధరించిన వీణగల;
విలాసివైరించీ = విలాసములుగల బ్రాహ్మివి;
విభా = కాంతివి;
అసి = అయివున్నావు.

**తాత్పర్యము :-**

ఓ కామాక్షి! శుభ్రములైన తెల్లని వస్త్రములను ధరించిన, కమలము కుటీరముగాగల, పుస్తక రుద్రాక్షల దాల్చుటచే పవిత్రములైన చేతులుగల, ఱెప్పలధికముగా నున్న కన్నులుగల, వీణ ధరించిన సరస్వతివి నీవే.

**వివరణము :-**

పూర్వార్ధమున నాల్గవపాదమున పాదాంతానుప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి **సరస్వతీరూపము** వర్ణింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారే వరదాభయ హస్తములను పుస్తకాక్షమాలలను ధరించినట్లు చెప్పబడు చున్నది.

**శ్లో॥ కుఙ్కుమరుచిపిఙ్గమసృ-**
**క్పఙ్కిలముణ్డాలిమణ్డితం మాతః।**
**జయతి తవ రూపధేయం**
**జపపటపుస్తకవరాభయాబ్జకరమ్॥ 93**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| మాతః | = అమ్మా! |
| కుంకుమరుచిపింగమ్ | = కుంకుమకాంతితో పింగళవర్ణముగల; |
| అసృక్పంకిలముండాలిమండితమ్ | = రక్తపు బురదగల పుఱ్ఱెలచే అలంకరింపబడిన; |
| జపపటపుస్తకవరాభయాబ్జకరమ్ | = జపమాల పుస్తక వరదాభయముద్రగల కమలముల వంటి చేతులుకల; |
| తవ | = నీయొక్క; |
| రూపధేయమ్ | = రూపము; |
| జయతి | = జయించుచున్నది. |

**తాత్పర్యము :-**

కుంకుమకాంతిచే పింగలవర్ణము నొందిన, రక్తపుబురదగల పుఱ్ఱెల గుంపుచే అలంకరింపబడిన, జపమాలను పుస్తకమును వరాభయముద్రలను ధరించిన, కమలముల వంటి చేతులుగల నీ రూపమమ్మా జయించుచున్నది.

**వివరణము :-**

1) ఎఱుపు తెలుపు గలిపిన వర్ణము పింగవర్ణము. కుంకుమ ధరించుటచే అమ్మవారి రూపమారంగు కలిగియున్నది. ఈ శ్లోకమున సరస్వతీరూప సామ్యముగల అమ్మవారి రూపము వర్ణింపబడినది. సరస్వతీ రూపము నందువలె చేతులలో పుస్తకజపమాలలున్నవి. కాని వీణ లేదు. అమ్మవారి రూపమున రక్తపు బురదతో కూడి కపాలమున్నది. అది సరస్వతీ రూపమున నుండదు. చేతులలో వీణకు బదులు వరదాభయముద్ర లున్నవి. 2) పూర్వార్ధమందలి పాదములలో ప్రాసము, తృతీయ చతుర్థపాదాదిన వడి యున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి రూపము పింగవర్ణము కలిగియున్నట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె నలుపు రంగు రూపము చెప్పబడుచున్నది.

**శ్లో॥ కనకమణికలితభూషాం**
**కాలాయసకలహశీలకాన్తికలామ్।**
**కామాక్షి! శీలయే త్వాం**
**కపాలశూలాభిరామకరకమలామ్॥ 94**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| కనకమణికలితభూషామ్ | = బంగారుతో మణులతో కూడిన సొమ్ములుగల; |
| కాలాయసకలహశీలకాంతికలామ్ | = ఇనుముతో కలహించు స్వభావము కల కాంతి లేశముగల; |
| కపాలశూలాభిరామకరకమలామ్ | = పుఱ్ఱెతో, శూలముతో మనోహరములైన కమలములవంటి చేతులుగల; |
| త్వామ్ | = నిన్ను; |
| శీలయే | = ధ్యానించెదను. |

**తాత్పర్యము :-**

ఓ కామాక్షీదేవీ! మణిఖచిత కనకాభరణములుకల, ఇనుమును మించిన నలుపుకాంతిగల, పుర్రెను శూలమును పట్టుకున్న చేతులుగల నిన్ను ధ్యానించెదను.

**వివరణము :-**

**కాలాయసకలహశీల కాంతి కలామ్** అను విశేషణమున ఉపమాలంకార స్ఫూర్తి ఉన్నది. ద్వితీయ చతుర్థపాదములలో అంత్యప్రాసమున్నది. 1-4 గణముల మొదట వర్ణమైత్రి ఉన్నది. లకారప్రాచుర్యముచే వృత్త్యనుప్రాస మున్నది. పదములన్ని కకారాదులై ఉండుటచేత కూడ వృత్త్యనుప్రాసమున్నది. ఈ కాదిపదత్వము అమ్మవారి **కాదివిద్యా స్వరూపిణీత్వము** ను వ్యంజింపజేయును.



**అవ॥:-** పై శ్లోకమున **అమ్మవారి నలుపు కాంతి** వర్ణింపబడినది. ఈ శ్లోకమున **అమ్మవారి ఎఱుపు** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ లోహితమపుఞ్జమధ్యే**
**మోహితభువనం ముదా నిరీక్షన్తే।**
**వదనం తవ కుచయుగలం**
**కాఞ్చీసీమాఞ్చ కేఽపి కామాక్షి॥ 95**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| లోహితమపుంజమధ్యే | = ఎఱుపుల సమూహము నడుమ; |
| మోహితభువనమ్ | = మోహింపజేయబడిన లోకములుగలన |
| తవ | = నీయొక్క |
| వదనమ్ | = ముఖమును; |
| కుచయుగలమ్ | = చనుదోయిని; |
| కాంచీసీమాం చ | = కాంచీసీమను కూడ; |
| కేఽపి | = ఎవఱో; |
| ముదా | = సంతసముతో; |
| నిరీక్షంతే | = చూచెదరు. |

**తాత్పర్యము :-**

ఎఱుపు కాంతుల నడుమ భువనమును మోహింపజేయు నీ ముఖమును, చనుదోయిని, కాంచిని ఎవఱో ధన్యులు మాత్రమే చూచెదరు.

**వివరణము :-**

ఉదయాస్తమయములలో సంధ్యారుణ కాంతుల నెందఱు చూచుట లేదు. వారెవరికైన నీ ముఖమో, చనుదోయియో, కటియో కనబడినదా? ఒకవేళ కనబడినను వానిని జూచి సాధారణ స్త్రీ సహజావయవములుగానే దర్శించినారు. కాని నీ ముఖము కామకలయొక్క ఊర్ధ్వబిందువుగ, కుచ యుగమును క్రింది రెండు బిందువులుగ, దానిక్రింద కట్యాద్యధోభాగమును, హకారార్ధమునుగా దర్శించినారా? అంతయు నెఱుపుగానే సాధారణోపాసకులు అందలి అవయవ భేదమును దర్శింపలేకపోవుచుండగా, శివాభిన్నసిద్ధులు మాత్రము ముఖాదిభిన్నా వాయవములను దర్శించెదరు. ముఖమును అగ్నిమయద్యులోకముగా, స్తనద్వయమును సూర్యచంద్రబింబములుగా చూచి ఆనందించు వారెవ్వఱో చెప్పగలమా? దృశ్యము ఎఱ్ఱని కాంతి, దృక్కు ఉపాధి భేదమున బహుత్వము నొందిన దృగ్రూపియైన శివుడు. సంతోషముతో నా ఎఱ్ఱని కాంతిని (అమ్మవారిని) చూచును. మిగిలిన జీవులలో ఆత్మజ్ఞానమును పొందినారెవఱు? ఎందఱు ఆ కాంతిని సంతోషముతో చూచెదరు? భేదదర్శన మందే ఆనందించువారు అభేద రూపమైన ఆ కాంతిని సంతోషముతో చూచెదరా. అభేదరూపమైన ఎఱ్ఱని కాంతిలోనిదే ముఖస్తనాది రూపమైన భిన్న ప్రపంచము అని తెలిసికొని దాని నభిన్నముగా చూచి ఆనందించు వారెవ్వఱు. ఎవఱో కొందఱు ధన్యులు మాత్రమే సంతోషముతో దర్శించెదరు. పూర్వార్ధపాదములలో ఆదిప్రాసమున్నది. నాల్గవపాదమున 1-4 గణములు కాదులై వర్ణమైత్రి కలిగియున్నవి.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి దర్శనము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారే శివుని గలియుటకై షట్చక్రములు దాటి సహస్రారమును జేరుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ జలధిద్విగుణితహుతవహ-**
**దిశాదినేశ్వరకలాశ్వినేయదలైః।**
**నలినై ర్మహేశి! గచ్ఛసి**
**సర్వోత్తరకరకమలదలమమలమ్॥ 96**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| జలధిద్విగుణిత హుతవహదిశా దినేశ్వర కలాశ్వినేయదలైః | = నాలుగు, ఆఱు, పది, పన్నెండు, పదాఱు, రెండు దలములుగల; |
| నలినైః | = కమలముల మార్గమున; |
| మహేశి | = ఓ మహేశ్వరి!; |
| అమలమ్ | = స్వచ్ఛమైన; |
| సర్వోత్తరకరకమలదలమ్ | = అన్నిటికి పైనున్న కమలములయొక్క దలమును; |
| గచ్ఛసి | = పొందుచున్నావు. |

**తాత్పర్యము :-**

మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, అజ్ఞాచక్ర షట్కమును దాటి సహస్రారకమలము నందు అమలమైన శివుడుండుదలమును చేరుచున్నావు.

**వివరణము :-**

1) వ,శ,ష,స అను దళములు నాలుగు కలది మూలాధార కమలము. బ,భ,మ,య,ర,ల అను ఆఱుదలములు కలది స్వాధిష్ఠానకమలము. డ,ఢ,ణ, త,థ,ద,ధ,న,ప,ఫ అను పదిదలములు కలది మణిపూరకమలము. క,ఖ,గ,ఘ,ఙ, చ,ఛ,జ,ఝ,ఞ,ట,ఠ అను పన్నెండు దలములు కలది అనాహతకమలము. అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ,ఋ,ౠ,ఌ,ౡ,ఎ,ఐ,ఓ,ఔ,అం,అః అను పదునాఱు స్వరములు దలములుగాగలది విశుద్ధ కమలము. ళ,హ అను రెండు దలములు కలది ఆజ్ఞాకమలము. కుండలిని అను శక్తి మూలాధారమునందు నిద్రించి సాధకుని ప్రయత్నమున మేల్కొని ఊర్ధ్వముఖమున ప్రయాణము చేసి మూలాధారమునుండి సహస్రారమువఱకు మధ్యనున్న కమలములను దాటి సహస్రారమును చేరుకొని శివునితో నైక్యమందును. సహస్రకమలదలమనుటచే సహస్రదళములలోని ఒక దలము శివమంచముగా నున్నదని అచ్చటనున్న శివునామె చేరుకొనునని వ్యంగ్యమగుచున్నది. అమలమ్ అను విశేషణముచే ఆ సహస్రారము సర్వవర్ణముల సమాహారమైన ధావల్యమని వ్యంగ్యమగుచున్నది.

2) పూర్వోత్తర దక్షిణ పశ్చిమదిశలందు నాలుగు సముద్రములున్నవి కావున **జలధి** అను శబ్దము నాలుగు అను అర్థము నొసగును. అగ్నులు మూడు హుతవహము లనబడును. అవి ద్విగుణితములైన ఆఱు అగును. గార్హపత్యము అహవనీయము దక్షిణము అని అగ్నులు మూడు త్రేతాగ్నులనబడును. ఆ మూడు ద్విగుణితములైన ఆఱగును కావున **ద్విగుణితహుతవహశబ్దము** ఆఱు అను నర్థమొసగును. తూర్పుపడమరలు ఉత్తరదక్షిణములు వానిమధ్యగల మూలలు. పైన క్రింద అనునవి పది దిక్కులు కావున **దిశా**శబ్దము పది అను అర్థమొసగును. నెలకొక సూర్యుడు, నెలలు పన్నెండు, సూర్యులు పన్నెండుగురు కావున **దినేశ్వర** శబ్దము పన్నెండు అను నర్థమొసగును. చంద్రుని కలలు పదునాఱు కావున **కలా**శబ్దము పదునాఱు అను అర్థమిచ్చును. అశ్వినీ దేవతలిద్దఱు కావున **అశ్వినేయ** శబ్దము రెండు అను నర్థమొసగును. ఈ సంఖ్యలు వరుసగా మూలాధారాది ఆజ్ఞాపర్యంతముగల ఆఱు కమలములలోని దలముల సంఖ్యను చెప్పుచున్నవి. వాని దలముల సంఖ్యగల కమలములని చెప్పుటచే పర్యాయోక్త్యలంకార మేర్పడియున్నది.



**అవ:-** పూర్వశ్లోకమున షట్చక్రభేదనము అను కుండలినీయోగమున **శక్తి శివైక్యము** చెప్పబడియున్నది. ఈ శ్లోకమున యమనియమాది సమాధ్యవధ్యష్టాంగ యోగము చెప్పబడుచున్నది.

**శ్లో॥ సత్కృతదేశికచరణాః**
**సబీజనిర్బీజయోగనిశ్శ్రేణ్యా।**
**అపవర్గసౌధవలభీ-**
**మారోహంత్యమ్బ కేఽపి తవ కృపయా॥ 97**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| అంబ | = అమ్మా! |
| సత్కృతదేశికచరణాః | = సత్కరించిన గురుపాదములుగల; |
| కేఽపి | = ఎవరో; |
| సబీజనిర్బీజయోగనిశ్శ్రేణ్యా | = సబీజనిర్బీజ సమాధుల నిచ్చెనచేత; |
| తవ | = నీయొక్క; |
| కృపయా | = దయచేత; |
| అపవర్గసౌధవలభీమ్ | = మోక్షమను మేడయొక్క పిట్టగోడను; |
| ఆరోహంతి | = ఎక్కెదరు. |

**తాత్పర్యము :-**

గురుచరణముల సత్కరించి నీకృపకు పాత్రులైన ఏ కొందఱో ముందు

సబీజసమాధిని ఆ తరువాత నిర్బీజసమాధి అను నీవరుసమెట్లుగల నిచ్చెనవంటి ఊర్ధ్వయానమార్గమున పయనించి మోక్షసౌధముయొక్క వలభిని చేరుకొందురు.

**వివరణము :-**

వియోగమనగా చిత్తమునందు వృత్తులు పుట్టకుండ ఆగిపోవుట. **యమము నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి** అనునవి దానికి అంగములు. సంసారమునకు బీజము అవిద్య. అది పూర్తిగా నశించకున్నను ఏడు అంగముల అభ్యాసము వలన ఎనిమిదివ యోగాంగమైన సమాధి కలుగును. ఈ సమాధిలో ధ్యేయాకారమును ధ్యాత చిత్తము తాత్కాలికముగ పొందును. వృత్తులకు బీజమైన చిత్తమునకు లయమేర్పడకుండుటచే ఈ సమాధి **సబీజసమాధి** అనబడును. బీజమైన అవిద్య నశించిన పిమ్మట యావజ్జీవము చిత్తముయొక్క అనువృత్తియున్నను దాని యందు వృత్తులు ఆగినంతకాలము అది **నిర్బీజసమాధి** యనబడును. ఈ సమాధి కలిగినవారు జీవన్ముక్తులు. బీజమైన అవిద్య నశించి యుండుటచే దేహావసానమున వారు ఆత్మయొక్క స్వభావమైన కైవల్యము నొందుదురు. ఈ స్థితినే శంకరులు **నిద్రాసమాధిస్థితిః** అని చెప్పిరి. గుర్వనుగ్రహమున ఆత్మజ్ఞానము నొందిన వారికే అవిద్య నశించి ఈ **నిర్బీజసమాధి** కలుగును. కావున శిష్యులు గురుచరణములను సత్కరించి మాత్రమే ఈ ఆత్మజ్ఞానమును అమ్మవారి అనుగ్రహమున పొందగలరు అని చెప్పుటకు **సత్కృతదేశికచరణాః** అని చెప్పబడినది. వర్గమనగా త్రివర్గము. ధర్మార్థకామత్రయము దీనికి మోక్షము చేరదు. కావున అది అపవర్గము అని చెప్పబడినది. అట్టి మోక్షమను మేడయొక్క వలభి అనగా పై భాగము నొందెదరు. క్రింది భాగమున సాలోక్యాది ముక్తులున్నవి. కాని కైవల్యము మోక్షసౌధముయొక్క పైభాగము అని చెప్పబడినది. పూర్వార్థమందలి రెండు పాదాలు సకారాదులై ఉత్తరార్థమున రెండు పాదాలు ఆకారాదులై వడి కలిగియున్నది.



**అవ:-** పై శ్లోకమున జ్ఞానుల **మోక్షసౌధారోహణము** చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారిని నిరంతరము ధ్యానించు వారి మహిమ ఆమె అనుగ్రహమున వర్ధిల్లును అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ అన్తరసి బహిరసి త్వం**
**జన్తుతతేరన్తకాన్తకృదహన్తే!।**
**చిన్తితసన్తానవతాం**
**సన్తతమపి తన్తనీషి మహిమానమ్॥ 98**

**ప్రతిపదార్థము :-**

అహంతే = ఓ అహంతారూపిణి!

| | |
|---|---|
| జంతుతతేః | = ప్రాణిచయముయొక్క |
| అంతః | = లోపల; |
| అసి | = ఉన్నావు; |
| బహిః | = బయట; |
| అసి | = ఉన్నావు; |
| అంతకాంతకృత్ | = యముని అంతము చేయుదానవు; |
| సంతతమ్ | = ఎల్లప్పుడు; |
| చింతితసంతానవతామ్ | = ధ్యానముగలవారియొక్క; |
| మహిమానమ్ | = మహిమను; |
| తంతనీషి | = విస్తరింపజేసెదవు. |

**తాత్పర్యము :-**

ఓ అహంతారూపిణీ కామాక్షీదేవి! నీవు యముని సంహరించుదానివి. జంతుసమూహముయొక్క లోపల బయటనున్నావు. ఎడతెగక ధ్యానము చేయువారి మహిమను వర్ధిలజేసెదవు.

**వివరణము :-**

మాయాశబల బ్రహ్మమునకు **అహమ్** అను స్ఫురణము ఉండును. మాయాశబలబ్రహ్మయైన పరమేశ్వరుని ఆ స్ఫురణములో సర్వమును అంతర్భవించి యుండును. ఆ అహమ్ స్ఫురణమే **అహంత** అనబడును. అనగా పరమేశ్వరుని అహమాత్మకస్ఫురణమే అమ్మవారు కావున ఆమెకు అహంత అని పేరు. జీవుని అహంకారమునుండి అహమాత్మకస్ఫురణమునుండి అది వేఱని తెలుపుటకు ఈశ్వరుని ఆ అహమ్ స్ఫురణము **పూర్ణాహంత** అనియు అనబడును. ఈ అహమ్ స్ఫురణము జీవేశ్వరుల **అహమజ్ఞః అహమ్ సర్వమ్** ఇత్యాది సర్వవృత్తులకును సాక్షిగా నుండును. స్థూలాది శరీరములందలి ఆ అహమభిమానము **అహంకార**మని పిలువబడును. చైతన్యము ప్రకృతిలో (మాయ) ప్రతిబింబించి **అహమ్ అవ్యాకృతః నామరూపే వ్యాకరవాణి** ఇత్యాది వృత్తులకు హేతువగును. స్థూలాది భావాభావ విషయసాక్షి అహంస్ఫురణమని అంతః కరణముయొక్క మాయావిషయాకారపరిణామము వృత్తి యని చెప్పబడును. తత్ప్రతిఫలిత చైతన్యము వృత్తిజ్ఞాన మనబడును. **అహమవ్యాకృతః నామరూపే వ్యాకరవాణి** మొదలగు తొలి వృత్తుల కాయా యాకారములు నామరూప వ్యాకరణానంతరము అవిద్యా కల్పితములో వైదిక వ్యవహారసిద్ధములో కావలసినదే కాని మనమాయాకారముల నిర్దేశించజాలము. అహమ్ శబ్దము అహంకారమునందును ప్రయోగింపబడును. **మహదహమాదయోఽండమ సృజన్ యదనుగ్రహీతః** అను శ్రుతిగీతలో అట్లు ప్రయోగింపబడినది. గ్రహమనగా చైతన్యము, అనుగ్రహమనగా చైతన్య ప్రతిఫలనము, అహంకారేత్యాది శబ్దములలోని కార అనునది ఆకారార్థమునను అభేదార్థమునను ప్రయోగింపబడును. అస్తు. అహంకార

ప్రతిఫలిత చైతన్యము అహం కర్తా అనువృత్తి జ్ఞానము. ఈ అహంతలో తాంత్రిక సమ్మతమైన మరొక విశేషము గమనింపదగినది. అహమ్ లోని అకారము శివవాచకము, హకారము అవిద్యా ప్రతిఫలిత చైతన్యరూపుడైన జీవునకు వాచకము కావున అహమ్ అను స్ఫురణమే శివజీవైక్య విషయకము. **శివోఽహమ్** అను చరమవృత్తియందును శివజీవైక్యమే విషయము. ఇది యంతయు వివరించరాని అహంతయొక్క యథామతి వివరణము. అది అమ్మవారి స్వరూపము. చైతన్యరూపిణియైన అమ్మవారు జంతువుల లోపల, బయటను ఉండును.

2) దీర్ఘకాలిక ఏకవిషయ జ్ఞానము లేక ఏకవిషయ ప్రత్యయముల ప్రవాహము కాని **ధ్యాన** మనబడును. ఆ ధ్యానము లేక ఉపాసనమును చేయు యోగులందు చిరంజీవిత్వ సత్యకామత్వ సత్యసంకల్పత్వాది రూపమహిమను వారి జ్ఞానములందు విషయముగా కూడ నున్న అమ్మవారే అనుగ్రహించుచుండును.



**అవ॥:-** పై శ్లోకమున యోగులకు మహిమలను ప్రసాదించగల మహిత అమ్మవారు అని చెప్పబడినది. ఈ శ్లోకమున శివుని రంజింపజేయు అమ్మవారి వాఙ్మంజులత వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ కలమఞ్జులవాగనుమిత-**
**గలపఞ్జరగతశుకగ్రహౌత్కణ్ఠ్యాత్।**
**అమ్బ! రదనామ్బరం తే**
**బిమ్బఫలం శమ్బరారిణా న్యస్తమ్॥ 99**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| అమ్బ! | = అమ్మా! |
| కలమంజులవాగనుమితగల | = అవ్యక్తమధురమైన అందమైన వాక్కు చేత తెలియబడిన |
| పంజరగతశుకగ్రహౌత్కణ్ఠ్యాత్ | పంజరమందున్న చిలుకను పట్టు తీవ్రవాంఛవలన; |
| తే | = నీయొక్క; |
| రదనామ్బరమ్ | = పెదవియనెడు; |
| బిమ్బఫలమ్ | = దొండపండు; |
| శమ్బరారిణా | = మన్మథునిచేత ; |
| న్యస్తమ్ | = ఉంచబడినది. |

**తాత్పర్యము :-**

అమ్మా! నీ అవ్యక్తమధురమంజుల వాక్కుచేత నీ కంఠమను పంజర మందొక చిలుక యున్నదని దానిని పట్టుకొనుట కెఱగా పెదవియను దొండపండును మన్మథుడు పెట్టినాడు.

**వివరణము :-**

పూర్వార్ధమున వాక్కు అను హేతువుచేత నీ కంఠపంజరము అను పక్షమునందు చిలుక అను సాధ్యము అనుమితమగుచున్నదని చెప్పుటచే ననుమాలంకారమున్నది. ఆ చిలుకను పట్టుకొనుట కామన్మథుడెఱగా పెట్టిన దొండపండేమో యన్నట్లు నీ పెదవి యున్నదని చెప్పుటచే నుత్ప్రేక్షాలంకారము ఉత్తరార్ధమున అనుప్రాసాలంకారములున్నవి.



**అవ॥:-** అమ్మవారి వాక్కులు మధురమంజులములు అని పై శ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున అట్టి వాక్కులనే తనకు ప్రసాదించిన అమ్మవారికి కృతజ్ఞతతో జయజయ కారమును కవి చేయుచు ఆర్యాశతకమును సమాప్త మొనరించుచున్నాడు.

**శ్లో॥ జయ జయ జగదమ్బ! శివే**
**జయ జయ కామాక్షి జయ జయాద్రిసుతే।**
**జయ జయ మహేశదయితే**
**జయ జయ చిద్గగనకౌముదీధారే॥ 100**

**ప్రతిపదార్థము :-**

జగదమ్బ = ఓ జగజ్జననీ!
శివే = ఓ మంగలస్వరూపురాలా!
జయ = జయింపుము;
జయ = జయింపుము;
కామాక్షి! = ఓ కామాక్షీదేవీ!
అద్రిసుతే = ఓ మంచుకొండ కూతురా;
జయ = జయింపుము;
జయ = జయింపుము;
మహేశదయితే = ఓ మహేశుని దయితా!
జయ = జయింపుము;
జయ = జయింపుము;
చిద్గగనకౌముదీధారే = ఓ చిదాకాశమందలి దట్టమైన వెన్నెల ప్రవాహమా!
జయ = జయింపుము;
జయ = జయింపుము.

**తాత్పర్యము :-**

ఓ జగజ్జననీ! మంగల స్వరూపిణివైన నీవు మరల మరల జయింపుము. ఓ కామాక్షీ! మంచుకొండ బిడ్డవైన నీవు మరల మరల జయింపుము. మహేశ్వరుని భార్యవైన నీవు మరల మరల జయింపుము. చిద్గగన మందలి దట్టమైన వెన్నెల ప్రవాహమవైన నీవు మరల మరల జయింపుము.

**వివరణము :-**

శతక సమాప్తి యందు అమ్మవారికి జయవెట్టుచున్నాడు. కవి **చిద్గగన కౌముదీధారే** పదమున శివుడు చిద్గగన చంద్రుడు. ఆతని కాంతి ప్రవాహము అమ్మవారు అని రూపింపబడుటచే రూపకాలంకారమేర్పడియున్నది. ✤

**అవ॥:-** పై శ్లోకమున జయకారముయొక్క పునఃపునరావృత్తిచే శతకసమాప్తి సూచింపబడినది. ఈ శ్లోకమున **శతక పఠన ఫలము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆర్యాశతకం భక్త్యా**
**పఠతామార్యాకటాక్షేణ।**
**నిస్సరతి వదనకమలా-**
**ద్వాణీ పీయూషధోరణీ దివ్యా॥ 101**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| భక్త్యా | = భక్తితో; |
| ఆర్యాశతకమ్ | = ఆర్యాశతకమును; |
| పఠతామ్ | = చదువువారికి; |
| ఆర్యాకటాక్షేణ | = అమ్మవారి కటాక్షముచేత; |
| వదనకమలాత్ | = ముఖమను కమలము నుండి; |
| పీయూషధోరణీ | = అమృతధారవంటి; |
| దివ్యా | = దివ్యమైన; |
| వాణీ | = వాక్కు; |
| నిస్సరతి | = బయలుదేరును. |

**తాత్పర్యము :-**

భక్తితో ఆర్యాశతకము పఠించు వారి ముఖకమలము నుండి అమృత ధారవంటి దివ్యవాణి బహిర్గతమగును.

**వివరణము :-**

ఆర్యాశతకము అనగా ఆర్యావృత్తములతో రచింపబడిన అమ్మవారిని స్తుతించు పద్యముల సమూహము. ఆర్యాకటాక్షమనగా అమ్మవారి కడగంటి చూపు. వదనకమలాత్ అను సమాసమున రూపకాలంకారమున్నది. కమలము నందు మధువు స్రవించునట్లు ఆర్యాశతకము పఠించువారి ముఖమునుండి దివ్యవాక్కు బయలుదేరును. ఉత్తరార్ధమందు దివ్యవాక్కు అను అమృతము కమలమువంటి ముఖమునుండి స్రవించుననుటచే ఉపమ స్ఫురించుచున్నది. వాణీ పీయూషధోరణీ అను పదములలో పదాంతానుప్రాసమున్నది.

**శ్రీః**

# ఆర్యాశతకమ్ - శ్లోకానుక్రమణికా

శ్రీః

## మూకపఞ్చశతీ

# పాదారవిన్దశతకమ్

### సారోల్లాసినీ వ్యాఖ్యా



శ్లో॥ మహిమ్నః పన్థానం మదనపరిపన్థిప్రణయిని
ప్రభుః నిర్ణేతుం తే భవతి యతమానోఽపి కతమః।
తథాపి శ్రీకాఞ్చీవిహృతిరసికే కోఽపి మనసో
విపాకస్త్వత్పాదస్తుతివిధిషు జల్పాకయతి మామ్॥ 1



శ్లో॥ గలగ్రాహీ పౌరన్దరపురవనీపల్లవరుచాం
ధృతప్రాథమ్యానామరుణమహసామాదిమగురుః।
సమిన్ధే బన్ధూకస్తబకసహయుధ్వా దిశి దిశి
ప్రసర్పన్ కామాక్ష్యాశ్చరణకిరణానామరుణిమా॥ 2



శ్లో॥ మరాలీనాం యానాభ్యసనకలనామూలగురవే
దరిద్రాణాం త్రాణవ్యతికరసురోద్యానతరవే।
తమస్కాణ్డప్రౌఢిప్రకటనతిరస్కారపటవే
జనోఽయం కామాక్ష్యాశ్చరణనలినాయ స్పృహయతే॥ 3



శ్లో॥ వహన్తీ సైన్దూరీం సరణిమవనమ్రామరపురీ-
పురన్ధ్రీసీమన్తే కవికమలబాలార్కసుషమా।
త్రయీసీమన్తిన్యాః స్తనతటనిచోలారుణపటీ
విభాన్తీ కామాక్ష్యాః పదనలినకాన్తిర్విజయతే॥ 4



శ్లో॥ ప్రణమ్రీభూతస్య ప్రణయకలహత్రస్తమనసః
స్మరారాతేశ్చూదానియతిగృహమేధీ హిమకరః।
యయోస్సాన్ధ్యాం కాన్తిం వహతి సుషమాభిశ్చరణయో -
స్తయోర్మే కామాక్ష్యా హృదయమపతన్ద్రం విహరతామ్॥ 5



శ్లో॥ యయోః పీఠాయన్తే విబుధముకుటీనాం పటలికా
యయోస్సౌధాయన్తే స్వయముదయభాజో భణితయః।
యయోర్దాసాయన్తే సరసిజభవాద్యాశ్చరణయో-
స్తయోర్మే కామాక్ష్యా దినమను వరీవర్తు హృదయమ్॥ 6



శ్లో॥ నయన్తీ సఙ్కోచం సరసిజరుచం దిక్పరిసరే
సృజన్తీ లౌహిత్యం నఖకిరణచన్ద్రార్ధఖచితా।
కవీన్ద్రాణాం హృత్కైరవవికసనోద్యోగజననీ
స్ఫురన్తీ కామాక్ష్యాశ్చరణరుచిసన్ధ్యా విజయతే॥ 7



శ్లో॥ విరావైర్మాఞ్జీరైః కిమపి కథయన్తీవ మధురం
పురస్తాదానమ్రే పురవిజయిని స్మేరవదనే।
వయస్యేవ ప్రౌఢా శిథిలయతి యా ప్రేమకలహ-
ప్రరోహం కామాక్ష్యాశ్చరణయుగలీ సా విజయతే॥ 8



శ్లో॥ సుపర్వస్త్రీలోలాలకపరిచితం షట్పదకులైః
స్ఫురల్లాక్షారాగం తరుణతరణిజ్యోతిరరుణైః।
భృతం కాన్త్యమ్భోభిర్విసృమరమరన్దైస్సరసిజై-
ర్విధత్తే కామాక్ష్యాశ్చరణయుగలం బన్ధుపదవీమ్॥ 9



శ్లో॥ రజస్సంసర్గేఽపి స్థితమరజసామేవ హృదయే
వరం రక్తత్వేన స్థితమపి విరక్తైకశరణమ్।
అలభ్యం మన్దానాం దధదపి సదా మన్దగతితాం
విధత్తే కామాక్ష్యాశ్చరణయుగమాశ్చర్యలహరీమ్॥ 10



శ్లో॥ జటాలా మఞ్జీరస్ఫురదరుణరత్నాంశునికరై-
ర్నిషీదన్తీ మధ్యే నఖరుచిఝరీగాఙ్గపయసామ్।
జగత్త్రాణం కర్తుం మమ జనని కామాక్షి! నియతం
తపశ్చర్యాం ధత్తే తవ చరణపాథోజయుగలీ॥ 11



శ్లో॥ తులాకోటిద్వన్ద్వక్వణితభణితాభీతివచసో-
ర్వినమ్రం కామాక్ష్యా విసృమరమహఃపాటలితయోః।
క్షణం విన్యాసేన క్షపితతమసోర్మే లలితయోః
పునీయాన్మూర్ధానం పురహరపురన్ధ్రీచరణయోః॥ 12



శ్లో॥ భవాని! ద్రుహ్యేతాం భవనిబిడితేభ్యో మమ ముహు-
స్తమోవ్యామోహేభ్యస్తవ జనని! కామాక్షి! చరణౌ।
యయోర్లాక్షాబిన్దుస్ఫురణధరణాద్ధూర్జటిజటా-
కుటీరా శోణాఙ్కం వహతి వపురేణాఙ్కకలికా॥ 13



శ్లో॥ పవిత్రీకుర్యుర్నః పదతలభువః పాటలరుచః
పరాగాస్తే పాపప్రశమనధురీణాః పరశివే!।
కణం లబ్ధుం యేషాం నిజశిరసి కామాక్షి! వివశా
వలన్తో వ్యాతన్వన్త్యహమహమికాం మాధవముఖాః॥ 14



శ్లో॥ బలాకామాలాభిర్నఖరుచిమయీభిః పరివృతే
వినమ్రస్వర్నారీవికచకచకాలామ్బుదకులే।
స్ఫురన్తః కామాక్షి! స్ఫుటదలితబన్ధూకసుహృద-
స్తటిల్లేఖాయన్తే తవ చరణపాథోజకిరణాః॥ 15



శ్లో॥ సరాగః సద్వేషః ప్రసృమరసరోజే ప్రతిదినం
నిసర్గాదాక్రామన్విబుధజనమూర్ధానమధికమ్।
కథఙ్కారం మాతః! కథయ పదపద్మస్తవ సతాం
నతానాం కామాక్షి! ప్రకటయతి కైవల్యసరణిమ్॥ 16



శ్లో॥ జపాలక్ష్మీశోణో జనితపరమజ్ఞానలహరీ-
వికాసవ్యాసఙ్గో విఫలితజగజ్జాడ్యగరిమా।
మనఃపూర్వాద్రిమ్మే తిలకయతు కామాక్షి! తరసా
తమస్కాణ్డద్రోహీ తవ చరణపాథోజరమణః॥ 17



శ్లో॥ నమస్కుర్మః ప్రేఙ్ఖన్మణికటకనీలోపలమహః-
పయోధౌ రిఙ్ఖద్భిర్నఖకిరణఫేనైర్ధవలితే।
స్ఫుటం కుర్వాణాయ ప్రబలచలదౌర్వానలశిఖా-
వితర్కం కామాక్ష్యాస్సతతమరుణిమ్నే చరణయోః॥ 18



శ్లో॥ శివే పాశాయేతామలఘుని తమఃకూపకుహరే
దినాధీశాయేతాం మమ హృదయపాథోజవిపినే।
నభోమాసాయేతాం సరసకవితారీతిసరితి
త్వదీయౌ కామాక్షి! ప్రసృతకిరణౌ దేవి! చరణౌ॥ 19



శ్లో॥ నిషక్తం శ్రుత్యన్తే నయనమివ సద్వృత్తరుచిరైః
సమైర్జుష్టం శుద్ధైరధరమివ రమ్యైర్ద్విజగణైః
శివే వక్షోజన్మద్వితయమివ ముక్తాశ్రితముమే
త్వదీయం కామాక్షి! ప్రణతశరణం నౌమి చరణమ్॥ 20



శ్లో॥ నమస్యాసంసజ్జన్నముచిపరిపన్థిప్రణయినీ-
నిసర్గప్రేఙ్ఖోలత్కురలకులకాలాహిశబలే।
నఖచ్ఛాయాదుగ్ధోదధిపయసి తే వైద్రుమరుచామ్
ప్రచారం కామాక్షి! ప్రచురయతి పాదాబ్జసుషమా॥ 21



శ్లో॥ కదా దూరీకర్తుం కటుదురితకాకోలజనితం
మహాన్తం సన్తాపం మదనపరిపన్థిప్రియతమే।
క్షణాత్తే కామాక్షి! త్రిభువనపరితాపహరణే
పటీయాంసం లప్స్యే పదకమలసేవామృతరసమ్॥ 22



శ్లో॥ యయోః సాన్ధ్యం రోచిః సతతమరుణిమ్నే స్పృహయతే
యయోశ్చాన్ద్రీ కాన్తిః పరితపతి దృష్ట్వా నఖరుచిమ్।
యయోః పాకోద్రేకం పిపఠిషతి భక్త్యా కిసలయం
మ్రదిమ్నః కామాక్ష్యా మనసి చరణౌ తౌ తనుమహే॥ 23



శ్లో॥ జగన్నేదం నేదం పరమితి పరిత్యజ్య యతిభిః
కుశాగ్రీయస్వాన్తైః కుశలధిషణైః శాస్త్రసరణౌ।
గవేష్యం కామాక్షి! ధ్రువమకృతకానాం గిరిసుతే!
గిరామైదంపర్యం తవ చరణమాహాత్మ్యగరిమా॥ 24



శ్లో॥ కృతస్నానం శాస్త్రామృతసరసి కామాక్షి! నితరాం
దధానం వైశద్యం కలితరసమానన్దసుధయా।
అలఙ్కారం భూమేర్మునిజనమనశ్చిన్మయమహా-
పయోధేరన్తస్స్థం తవ చరణరత్నం మృగయతే॥ 25



శ్లో॥ మనోగేహే మోహోద్భవతిమిరపూర్ణే మమ ముహు-
ర్దరిద్రాణీకుర్వన్దినకరసహస్రాణి కిరణైః।
విధత్తాం కామాక్షి! ప్రసృమరతమోవఞ్చనచణః
క్షణార్ధం సాన్నిధ్యం చరణమణిదీపో జనని! తే॥ 26



శ్లో॥ కవీనాం చేతోవన్న ఖరరుచిసమ్పర్కి విబుధ-
స్రవన్తీస్రోతోవత్పటుముఖరితం హంసకరవైః।
దినారమ్భశ్రీవన్నియతమరుణచ్ఛాయసుభగం
మదన్తః కామాక్ష్యాః స్ఫురతు పదపఙ్కేరుహయుగమ్॥ 27



శ్లో॥ సదా కిం సమ్పర్కాత్ప్రకృతికఠినైర్నాకిముకుటై-
స్తటైర్నీహారాద్రేరధికమణునా యోగిమనసా।
విభిన్తే సమ్మోహం శిశిరయతి భక్తానపి దృశా-
మదృశ్యం కామాక్షి! ప్రకటయతి తే పాదయుగలమ్ ॥ 28



శ్లో॥ పవిత్రాభ్యామమ్బ! ప్రకృతిమృదులాభ్యాం తవ శివే
పదాభ్యాం కామాక్షి! ప్రసభమభిభూతైః సచకితైః
ప్రవాలైరమ్భోజైరపి చ వనవాసవ్రతదశాః
సదైవారభ్యన్తే పరిచరితనానాద్విజగణైః॥ 29



శ్లో॥ చిరాద్దృశ్యా హంసైః కథమపి సదా హంససులభం
నిరస్యన్తీ జాడ్యం నియతజడమధ్యైకశరణమ్।
అదోషవ్యాసఙ్గాత్ సతతమపి దోషాప్తిమలినం
పయోజం కామాక్ష్యాః పరిహసతి పాదాబ్జయుగలీ॥ 30



శ్లో॥ సురాణామానన్దప్రబలనతయా మణ్డనతయా
నఖేన్దుజ్యోత్స్నాభిర్విసృమరతమఃఖణ్డనతయా।
పయోజశ్రీద్వేషవ్రతరతతయా త్వచ్చరణయో-
ర్విలాసః కామాక్షి! ప్రకటయతి నైశాకరదశామ్॥ 31



శ్లో॥ సితిమ్నా కాన్తీనాం నఖరజనుషామ్ పాదనలిన-
చ్ఛవీనాం శోణిమ్నా తవ జనని! కామాక్షి! నమనే।
లభన్తే మన్దారగ్రథితనవబన్ధూకకుసుమ-
ప్రభాసామీచీన్యం సురపురపురన్ధ్రీకచభరాః॥ 32



శ్లో॥ స్ఫురన్మధ్యే శుద్ధే నఖకిరణదుగ్ధాబ్ధిపయసాం
వహన్నబ్జం చక్రం దరమపి చ రేఖాత్మకతయా।
శ్రితో మాత్స్యం రూపం శ్రియమపి దధానో నిరుపమాం
త్రిధామా కామాక్ష్యాః పదనలిననామా విజయతే॥ 33



శ్లో॥ నఖశ్రీసన్నద్ధస్తబకనిచితః స్వైశ్చ కిరణైః
పిశఙ్గైః కామాక్షి! ప్రకటితలసత్పల్లవరుచిః।
సతాం గమ్యః శఙ్కే సకలఫలదాతా సురతరు-
స్త్వదీయః పాదోఽయం తుహినగిరిరాజన్యతనయే॥ 34



శ్లో॥ వషట్కుర్వన్మాఞ్జీరకకలకలైః కర్మలహరీ-
హవీంషి ప్రోద్దణ్డం జ్వలతి పరమజ్ఞానదహనే।
మహీయాన్కామాక్షి! స్ఫుటమహసి జోహోతి సుధియాం
మనోవేద్యాం మాతస్తవ చరణయజ్వా విజయతే॥ 35



శ్లో॥ మహామన్త్రం కిఞ్చిన్మణికటకనాదైరివ జపన్
క్షిపన్దిక్షు స్వచ్ఛం నఖరుచిమయం భాస్మనరజః।
నతానాం కామాక్షి! ప్రకృతిపటురుచ్చాట్య మమతా-
పిశాచీం పాదోఽయం ప్రకటయతి తే మాన్త్రికదశామ్॥ 36



శ్లో॥ ఉదీతే బోధేన్దౌ తమసి నితరాం జగ్ముషి దశాం
దరిద్రాం కామాక్షి! ప్రకటమనురాగం విదధతీ।
సితేనాచ్ఛాద్యాఙ్గం నఖరుచిపటేనాఙ్ఘ్రియుగలీ-
పురన్ధ్రీ తే మాతః స్వయమభిసరత్యేవ హృదయమ్॥ 37



శ్లో॥ దినారమ్భస్సమ్పన్నలినవిపినానామభినవో
వికాసో వాసన్తః సుకవిపికలోకస్య నియతమ్।
ప్రదోషః కామాక్షి! ప్రకటపరమజ్ఞానశశిన-
శ్చకాస్తి త్వత్పాదస్మరణమహిమా శైలతనయే॥ 38



శ్లో॥ ధృతచ్ఛాయం నిత్యం సరసిరుహమైత్రీపరిచితం
నిధానం దీప్తీనాం నిఖిలజగతాం బోధజనకమ్।
ముముక్షూణాం మార్గప్రథనపటు కామాక్షి! పదవీం
పదం తే పాతఙ్గీం పరికలయతే పర్వతసుతే॥ 39



శ్లో॥ శనైస్తీర్త్వా మోహామ్బుధిమథ సమారోఢుమనసః
క్రమాత్కైవల్యాఖ్యాం సుకృతిసులభాం సౌధవలభీమ్।
లభన్తే నిఃశ్రేణీమివ ఝటితి కామాక్షి! చరణం
పురశ్చర్యాభిస్తే పురమథనసీమన్తిని! జనాః॥ 40



శ్లో॥ ప్రచణ్డార్తిక్షోభప్రథమసుహృదే ప్రాతిభసరి-
త్ప్రవాహప్రోద్దణ్డీకరణజలదాయ ప్రణమతామ్।
ప్రదీపాయ ప్రౌఢే భవతమసి కామాక్షి! చరణ-
ప్రసాదౌన్ముఖ్యాయ స్పృహయతి జనో౽యం జనని తే॥ 41



శ్లో॥ మరుద్భిస్సంసేవ్యా సతతమపి చాఞ్చల్యరహితా
సదారుణ్యం యాన్తీ పరిణతిదరిద్రాణసుషమమ్।
గుణోత్కర్షాన్మాఞ్జీరకకలకలైస్తర్జనపటుః
ప్రవాలం కామాక్ష్యాః పరిహసతి పాదాబ్జయుగలీ॥ 42



శ్లో॥ జగద్రక్షాదక్షా నలినరుచిశిక్షాపటుతరా
సురైర్నమ్యా రమ్యా సతతమభిగమ్యా బుధజనైః
ద్వయీ లీలాలోలా శ్రుతిషు సురపాలాదిముకుటీ-
తటీసీమాధామా జయతి తవ కామాక్షి! పదయోః॥ 43



శ్లో॥ గిరాం దూరౌ చోరౌ జడిమతిమిరాణాం కృతజగ-
త్పరిత్రాణౌ శోణౌ మునిహృదయలీలైకనిపుణౌ।
నఖైః స్మేరౌ సారౌ నిగమవచసాం ఖణ్డితభవ-
గ్రహోన్మాదౌ పాదౌ తవ మనసి కామాక్షి! కలయే ॥ 44



శ్లో॥ అవిశ్రాన్తం పఙ్కం యదపి కలయన్యావకమయం
నిరస్యన్కామాక్షి! ప్రణమనజుషాం పఙ్కమఖిలమ్।
తులాకోటిద్వన్ద్వం దధదపి చ గచ్ఛన్నతులతాం
గిరాం మార్గం పాదో గిరివరసుతే! లఙ్ఘయతి తే ॥ 45



శ్లో॥ ప్రవాళం సవ్రీడం విపినవివరే వేపయతి యా
స్ఫురల్లీలం బాలాతపమధికబాలం వదతి యా।
నవాం సన్ధ్యాం వన్ధ్యాం విరచయతి యా వర్ధయతు సా
శివమ్మే కామాక్ష్యాః పదనలినపాటల్యలహరీ ॥ 46



శ్లో॥ కిరన్జ్యోత్స్నారీతిం నఖముఖరుచా హంసమనసాం
వితన్వానః ప్రీతిం వికసదమలామ్భోరుహరుచిః।
ప్రకాశః శ్రీపాదస్తవ జనని కామాక్షి! తనుతే
శరత్కాలప్రౌఢిం శశిశకలచూడప్రియతమే॥ 47



శ్లో॥ నఖాఙ్కూరస్మేరద్యుతివితతిగఙ్గామ్భసి సుఖం
కృతస్నానం జ్ఞానామృతమమలమాస్వాద్య నియతమ్।
ఉదఞ్చన్మఞ్జీరస్ఫురణమణిదీపే మమ మనో
మనోజ్ఞే కామాక్ష్యాశ్చరణమణిహర్మ్యే విహరతామ్॥ 48



శ్లో॥ భవామ్భోధౌ నౌకాం జడిమవిపినే పావకశిఖా
మమర్త్యేన్ద్రాదీనామధిముకుటముత్తంసకలికామ్।
జగత్తాపే జ్యోత్స్నామకృతకవచః పఞ్జరపుటే
శుకస్త్రీం కామాక్ష్యా మనసి కలయే పాదయుగలీమ్॥ 49



శ్లో॥ పరాత్మప్రాకాశ్యప్రతిఫలనచుఞ్చుః ప్రణమతాం
మనోజ్ఞస్త్వత్పాదో మణిముకురముద్రాం కలయతే।
యదీయాం కామాక్షి! ప్రకృతిమసృణాః శోధకదశాం
విధాతుం చేష్టన్తే వలరిపువధూటీకచభరాః॥ 50



శ్లో॥ అవిశ్రాన్తం తిష్ఠన్నకృతకవచః కన్దరపుటీ-
కుటీరాన్తః ప్రౌఢం నఖరుచిపటాలీమ్ప్రకటయన్।
ప్రచణ్డం ఖణ్డత్వం నయతు మమ కామాక్షి! తరసా
తమోవేతణ్డేన్ద్రం తవ చరణకణ్ఠీరవపతిః॥ 51



శ్లో॥ పురస్తాత్కామాక్షి! ప్రచురరసమాఖణ్డలపురీ-
పురన్ధ్రీణాం లాస్యం తవ లలితమాలోక్య శనకైః।
నఖశ్రీభిః స్మేరా బహు వితనుతే నూపురరవై-
శ్చమత్కృత్యా శఙ్కే చరణయుగలీ చాటురచనాః॥ 52



శ్లో॥ సరోజం నిన్దన్తీ నఖకిరణకర్పూరశిశిరా
నిషిక్తా మారారేర్మకుటశశిరేఖాహిమజలైః।
స్ఫురన్తీ కామాక్షి! స్ఫుటరుచిమయే పల్లవచయే
తవాధత్తే మైత్రీం పథికసుదృశా పాదయుగలీ॥ 53



శ్లో॥ నతానాం సంపత్తేరనవరతమాకర్షణజపః
ప్రరోహత్సంసారప్రసరగరిమస్తమ్భనజపః।
త్వదీయః కామాక్షి! స్మరహరమనోమోహనజపః
పటీయాన్నః పాయాత్పదనలినమఞ్జీరనినదః॥ 54



శ్లో॥ వితన్వీథా నాథే! మమ శిరసి కామాక్షి! కృపయా
పదామ్భోజన్యాసం పశుపరివృఢప్రాణదయితే।
పిబన్తో యన్ముద్రాం ప్రకటముపకమ్పాపరిసరం
దృశా నానద్యన్తే నలినభవనారాయణముఖాః॥ 55



శ్లో॥ ప్రణామోద్యద్బృన్దారకముకుటమన్దారకలికా-
విలోలల్లోలమ్బప్రకరమయధూమప్రచురిమా।
ప్రదీప్తః పాదాబ్జద్యుతివితతిపాటల్యలహరీ-
కృశానుః కామాక్ష్యా మమ దహతు సంసారవిపినమ్॥ 56



శ్లో॥ వలక్షశ్రీరృక్షాధిపశిశుసదృక్షా తవ నఖై-
ర్జిఘృక్షుర్దక్షత్వం సరసిరుహభిక్షుత్వకరణే।
క్షణాన్మే కామాక్షి! క్షపితభవసంక్షోభగరిమా
వచోవైచక్షణ్యం చరణయుగలీ పక్ష్మలయతాత్॥ 57



శ్లో॥ సమన్తాత్కామాక్షి! క్షతతిమిరసన్తానసుభగా-
ననన్తాభిః భాభిర్దినమను దిగన్తాన్విరచయన్।
అహన్తాయా హన్తా మమ జడిమదన్తావలరిపు-
ర్విభిన్తాం సన్తాపం తవ చరణచిన్తామణిరసౌ॥ 58



శ్లో॥ దధానో భాస్వత్తామమృతనిలయో లోహితవపు-
ర్వినమ్రాణాం సౌమ్యో గురురపి కవిత్వం చ కలయన్।
గతౌ మన్దో గఙ్గాధరమహిషి కామాక్షి! భజతాం
తమఃకేతుర్మాతస్తవ చరణపద్మో విజయతే॥ 59



శ్లో॥ నయన్తీం దాసత్వం నలినభవముఖ్యానసులభ-
ప్రదానాద్దీనానామమరతరుదౌర్భాగ్యజననీమ్।
జగజ్జన్మక్షేమక్షయవిధిషు కామాక్షి! పదయో-
ర్ధురీణామీష్టే కస్తవ భణితుమాహోపురుషికామ్॥ 60



శ్లో॥ జనోఽయం సన్తప్తో జనని! భవచణ్డాంశుకిరణై-
రలబ్ధ్వైకం శీతం కణమపి పరజ్ఞానపయసః।
తమోమార్గే పాన్థస్తవ ఝటితి కామాక్షి! శిశిరాం
పదామ్భోజచ్ఛాయాం పరమశివజాయే! మృగయతే॥ 61



శ్లో॥ జయత్యమ్బ! శ్రీమన్నఖకిరణచీనాంశుకమయం
వితానం బిభ్రాణే సురమకుటసఙ్ఘట్టమసృణే।
నిజారుణ్యక్షౌమాస్తరణవతి కామాక్షి! సులభా
బుధైః సంవిన్నారీ తవ చరణమాణిక్యభవనే॥ 62



శ్లో॥ ప్రతీమః కామాక్షి! స్ఫురితతరుణాదిత్యకిరణ-
శ్రియో మూలద్రవ్యం తవ చరణమద్రీన్ద్రతనయే!।
సురేన్ద్రాశామాపూరయతి యదసౌ ధ్వాన్తమఖిలం
ధునీతే దిగ్భాగానపి చ మహసా పాటలయతే॥ 63



శ్లో॥ మహాభాష్యవ్యాఖ్యాపటుశయనమారోపయతి వా
స్మరవ్యాపారేర్ష్యాపిశుననిటలం కారయతి వా।
ద్విరేఫాణామధ్యాసయతి సతతం వాధివసతిం
ప్రణమ్రాన్కామాక్ష్యాః పదనలినమాహాత్మ్యగరిమా॥ 64



శ్లో॥ వివేకామ్భఃస్రోతఃస్నపనపరిపాటీశిశిరితే
సమీభూతే శాస్త్రస్మరణహలసఙ్కర్షణవశాత్।
సతాం చేతఃక్షేత్రే వపతి తవ కామాక్షి! చరణో
మహాసంవిత్సస్యప్రకరపరబీజం గిరిసుతే!॥ 65



శ్లో॥ దధానో మన్దారస్తబకపరిపాటీం నఖరుచా
వహన్దీప్తా శోణాఙ్గులిపటలచామ్పేయకలికాః।
అశోకోల్లాసం నః ప్రచురయతు కామాక్షి! చరణో
వికాసీ వాసన్తస్సమయ ఇవ తే శర్వదయితే!॥ 66



శ్లో॥ నఖాంశుప్రాచుర్యప్రసృమరమరాలాభిధవలః
స్ఫురన్మఞ్జీరోద్యన్మరకతమహఃశైవలయుతః।
భవత్యాః కామాక్షి స్ఫుటచరణపాటల్యకపటో
నదః శోణాభిఖ్యో నగపతితనూజే! విజయతే॥ 67



శ్లో॥ ధునానం పఙ్కౌఘం పరమసులభం కణ్టకకులై-
ర్వికాసవ్యాసఙ్గం విదధదపరాధీనమనిశమ్।
నఖేన్దుజ్యోత్స్నాభిర్విశదరుచి కామాక్షి! నితరా-
మసామాన్యం మన్యే సరసిజమిదం తే పదయుగమ్॥ 68



శ్లో॥ కరీన్ద్రాయ ద్రుహ్యత్యలసగతిలీలాసు విమలైః
పయోజైర్మాత్సర్యం ప్రకటయతి కామం కలయతే।
పదామ్భోజద్వన్ద్వం తవ తదపి కామాక్షి! హృదయం
మునీనాం శాన్తానాం కథమనిశమస్మై స్పృహయతే॥ 69



శ్లో॥ నిరస్తా శోణిమ్నా చరణకిరణానాం తవ శివే!
సమిన్ధానా సన్ధ్యారుచిరచలరాజన్యతనయే!।
అసామర్థ్యాదేవం పరిభవితుమేతత్సమరుచాం
సరోజానాం జానే ముకులయతి శోభాం ప్రతిదినమ్॥ 70



శ్లో॥ ఉపాదిక్షద్దాక్ష్యం తవ చరణనామా గురురసౌ
మరాలానాం శఙ్కే మసృణగతిలాలిత్యసరణౌ।
అతస్తే నిస్తన్ద్రం నియతమమునా సఖ్యపదవీమ్
ప్రసన్నం పాథోజం ప్రతి దధతి కామాక్షి! కుతుకమ్॥ 71



శ్లో॥ దధానైస్సంసర్గం ప్రకృతిమలినైః షట్పదకులై-
ర్ద్విజాధీశశ్లాఘావిధిషు విదధద్భిర్ముకులతామ్।
రజోమిశ్రైః పద్మైర్నియతమపి కామాక్షి! పదయో-
ర్విరోధస్తే యుక్తో విషమశరవైరిప్రియతమే॥ 72



శ్లో॥ కవిత్వశ్రీమిశ్రీకరణనిపుణౌ రక్షణచణౌ
విపన్నానాం శ్రీమన్నలినమసృణౌ శోణకిరణౌ।
మునీన్ద్రాణామన్తఃకరణశరణౌ మన్దశరణౌ
మనోజ్ఞౌ కామాక్ష్యా దురితహరణౌ నౌమి చరణౌ॥ 73



శ్లో॥ పరస్మాత్సర్వస్మాదపి చ పరయోర్ముక్తికరయో-
ర్నఖశ్రీభిర్జ్యోత్స్నాకలితతులయోస్తామ్రతలయోః।
నిలీయే కామాక్ష్యా నిగమనుతయోర్నాకినతయో-
ర్నిరస్తప్రోన్మీలన్నలినమదయోరేవ పదయోః॥ 74



శ్లో॥ స్వభావాదన్యోన్యం కిసలయమపీదం తవ పదం
మ్రదిమ్నా శోణిమ్నా భగవతి దధాతే సదృశతామ్।
వనే పూర్వస్యేచ్ఛా సతతమవనే కిం తు జగతామ్
పరస్యేత్థం భేదః స్ఫురతి హృది కామాక్షి! సుధియామ్॥ 75



శ్లో॥ కథం వాచాలోఽపి ప్రకటమణిమఞ్జీరనినదైః
సదైవానన్దార్ద్రాన్విరచయతి వాచంయమజనాన్।
ప్రకృత్యా తే శోణచ్ఛవిరపి చ కామాక్షి! చరణో
మనీషానైర్మల్యం కథమివ నృణాం మాంసలయతే॥ 76



శ్లో॥ చలత్తృష్ణావీచీపరిచలనపర్యాకులతయా
ముహుర్భ్రాన్త్వా తాన్తః పరమశివవామాక్షి! పరవాన్।
తితీర్షుః కామాక్షి! ప్రచురతరకర్మామ్బుధిమముం
కదాహం లప్స్యే తే చరణమణిసేతుం గిరిసుతే!॥ 77



శ్లో॥ విశుష్యన్త్యాం ప్రజ్ఞాసరితి దురితగ్రీష్మసమయ-
ప్రభావేణ క్షీణే సతి మమ మనఃకేకిని శుచా।
త్వదీయః కామాక్షి! స్ఫురితచరణామ్భోదమహిమా
నభోమాసాటోపం నగపతిసుతే కిం న కురుతే॥ 78



శ్లో॥ వినమ్రాణాం చేతోభవనవలభీసీమ్ని చరణ-
ప్రదీపే ప్రాకాశ్యం దధతి తవ నిర్ధూతతమసి।
అసీమా కామాక్షి! స్వయమలఘుదుష్కర్మలహరీ
విఘూర్ణన్తీ శాన్తిం శలభపరిపాటీవ భజతే॥ 79



శ్లో॥ విరాజన్తీ శుక్తిర్నఖకిరణముక్తామణితతే-
ర్విపత్పాథోరాశౌ తరిరపి నరాణామ్ ప్రణమతామ్।
త్వదీయః కామాక్షి! ధ్రువమలఘువహ్నిర్భవవనే
మునీనాం జ్ఞానాగ్నేరరణిరయమంఘ్రిర్విజయతే॥ 80



శ్లో॥ సమస్తైస్సంసేవ్యస్సతతమపి కామాక్షి! విబుధైః
స్తుతో గన్ధర్వస్త్రీసులలితవిపఞ్చీకలరవైః।
భవత్యా భిన్దానో భవగిరికులం జృమ్భితతమో-
బలద్రోహీ మాతశ్చరణపురుహూతో విజయతే॥ 81



శ్లో॥ వసన్తం భక్తానామపి మనసి నిత్యం పరిలస-
ద్ఘనచ్ఛాయాపూర్ణం శుచిమపి నృణాం తాపశమనమ్।
నఖేన్దుజ్యోత్స్నాభిః శిశిరమపి పద్మోదయకరం
నమామః కామాక్ష్యాశ్చరణమధికాశ్చర్యకరణమ్॥ 82



శ్లో॥ కవీన్ద్రాణాం నానాభణితిగుణచిత్రీకృతవచః-
ప్రపఞ్చవ్యాపారప్రకటనకలాకౌశలనిధిః।
అధఃకుర్వన్నబ్జం సనకభృగుముఖ్యైర్మునిజనై-
ర్నమస్యః కామాక్ష్యాశ్చరణపరమేష్ఠీ విజయతే॥ 83



శ్లో॥ భవత్యాః కామాక్షి! స్ఫురితపదపఙ్కేరుహభువాం
పరాగాణాం పూరైః పరిహృతకలఙ్కవ్యతికరైః।
నతానామామృష్టే హృదయముకురే నిర్మలరుచి-
ప్రసన్నే నిశ్శేషం ప్రతిఫలతి విశ్వం గిరిసుతే॥ 84



శ్లో॥ తవ త్రస్తమ్ పాదాత్కిసలయమరణ్యాన్తరమగా-
త్పరం రేఖారూపం కమలమముమేవాశ్రితమభూత్।
జితానాం కామాక్షి! ద్వితయమపి యుక్తం పరిభవే
విదేశే వాసో వా శరణగమనం వా నిజరిపోః॥ 85



శ్లో॥ గృహీత్వా యాథార్థ్యం నిగమవచసాం దేశికకృపా-
కటాక్షార్కజ్యోతిశ్శమితమమతాబన్ధతమసః।
యతన్తే కామాక్షి! ప్రతిదివసమన్తర్ద్రఢయితుం
త్వదీయం పాదాబ్జం సుకృతపరిపాకేన సుజనాః॥ 86



శ్లో॥ జడానామప్యమ్బ! స్మరణసమయే త్వచ్చరణయో-
ర్భ్రమన్మన్థక్ష్మాభృద్ఘుమఘుమితసిన్ధుప్రతిభటాః।
ప్రసన్నాః కామాక్షి! ప్రసభమధరస్పన్దనకలా
విభాన్తి స్వచ్ఛన్దం ప్రకృతిపరిపక్వా భణితయః॥ 87



శ్లో॥ వహన్నప్యశ్రాన్తం మధురనినదం హంసకమసౌ
తమేవాధఃకర్తుం కిమివ యతతే కేలిగమనే।
భవస్యైవానన్దం విదధదపి కామాక్షి! చరణో
భవత్యాస్తద్ద్రోహం భగవతి! కిమేవం వితనుతే॥ 88



శ్లో॥ యదత్యన్తం తామ్యత్యలసగతివార్తాస్వపి శివే!
తదేతత్కామాక్షి! ప్రకృతిమృదులం తే పదయుగమ్।
కిరీటైః సంఘట్టం కథమివ సురౌఘస్య సహతే
మునీన్ద్రాణామాస్తే మనసి చ కథం సూచినిశితే॥ 89



శ్లో॥ మనోరజ్గే మత్కే విబుధజనసమ్మోదజననీ
పరాగవ్యాసజ్గా సరసమృదుసఞ్చారసుభగా।
మనోజ్ఞా కామాక్షి! ప్రకటయతు లాస్యప్రకరణం
రణన్మఞ్జీరా తే చరణయుగలీనర్తకవధూః॥ 90



శ్లో॥ పరిష్కుర్వన్మాతః పశుపతికపర్దం చ విషయే
పరాచాం హృత్పద్మం పరమభణితీనాం చ మకుటమ్।
పరస్తే పాదో౽యం పరిహరతు కామాక్షి! మమతా-
పరాధీనత్వమ్మే పరిముషితపాథోజమహిమా॥ 91



శ్లో॥ ప్రసూనైః సమ్పర్కాదమరతరుణీకున్తలభవై-
రభీష్టానాం దానాదనిశమపి కామాక్షి! నమతామ్।
స్వసజ్గాత్కఙ్కేలిప్రసవజనకత్వేన చ తవ
త్రిధా ధత్తే వార్తాం సురభిరితి పాదో గిరిసుతే॥ 92



శ్లో॥ మహామోహస్తేనవ్యతికరభయాత్పాలయతి యో
వినిక్షిప్తం స్వస్మిన్నిజజనమనోరత్నమనిశమ్।
స రాగస్యోద్రేకాత్సతతమపి కామాక్షి! తరసా
కిమేవం పాదో౽సౌ కిసలయరుచిం రోచయతి తే॥ 93



శ్లో॥ సదా స్వాదుంకారం విషయలహరీశాలికణికాం
సమాస్వాద్య శ్రాన్తం హృదయశుకపోతం జనని మే।
కృపాజాలే ఫాలేక్షణమహిషి! కామాక్షి! రభసా
గృహీత్వా రున్ధీథాశ్చరణయుగలీపఞ్జరపుటే॥ 94



శ్లో॥ ధునానం కామాక్షి! స్మరణలవమాత్రేణ జడిమ-
జ్వరప్రౌఢిం గూఢస్థితి నిగమనైకుఞ్జకుహరే।
అలభ్యం సర్వేషాం కతిచన లభన్తే సుకృతిన-
శ్చిరాదన్విష్యన్తస్తవ చరణసిద్ధౌషధమిదమ్॥ 95



శ్లో॥ రణన్మఞ్జీరాభ్యాం లలితగమనాభ్యాం సుకృతినాం
మనోవాస్తవ్యాభ్యాం మథితతిమిరాభ్యాం నఖరుచా।
నిధేయాభ్యాం పత్యా నిజశిరసి కామాక్షి! సతతం
నమస్తే పాదాభ్యాం నలినమృదులాభ్యాం గిరిసుతే॥ 96



శ్లో॥ సరాగే రాకేన్దుప్రతినిధిముఖే! పర్వతసుతే!
చిరాల్లభ్యే భక్త్యా శమధనజనానాం పరిషదా।
మనోభృంగో మత్కః పదకమలయుగ్మే జనని! తే
ప్రకామం కామాక్షి! త్రిపురహరవామాక్షి! రమతామ్॥ 97



శ్లో॥ శివే! సంవిత్పాశైః శశిశకలచూడప్రియతమే!
శనైర్గత్యాగత్యా జితసురవరేభే! గిరిసుతే!।
యతన్తే సన్తస్తే చరణనలినాలానయుగలే
సదా బద్ధుం చిత్తప్రమదకరియూథం దృఢతరమ్॥ 98



శ్లో॥ యశస్స్రోతే మాతర్మధురకవితాం పక్ష్మలయతే
శ్రియం ధత్తే చిత్తే కమపి పరిపాకం ప్రథయతే।
సతాం పాశగ్రన్థిం శిథిలయతి కిం కిం న కురుతే
ప్రపన్నే కామాక్ష్యాః ప్రణతిపరిపాటీ చరణయోః॥ 99



శ్లో॥ మనీషాం మాహేన్ద్రీం కకుభమివ తే కామపి దశాం
ప్రధత్తే కామాక్ష్యాశ్చరణతరుణాదిత్యకిరణః।
యదీయే సమ్పర్కే ధృతరసమరన్దా కవయతాం
పరీపాకం ధత్తే పరిమలవతీ సూక్తినలినీ॥ 100



శ్లో॥ పురా మారారాతిః పురమజయదమ్బ! స్తవశతైః
ప్రసన్నాయాం సత్యాం త్వయి తుహినశైలేన్ద్రతనయే!।
అతస్తే కామాక్షి! స్ఫురతు తరసా కాలసమయే
సమాయాతే మాతర్మమ మనసి పాదాబ్జయుగలమ్॥ 101



శ్లో॥ పదద్వన్ద్వం మన్దం గతిషు నివసన్తం హృది సతాం
గిరామన్తే భ్రాన్తం కృతకరహితానాం పరివృఢే।
జనానామానన్దం జనని జనయన్తం ప్రణమతాం
త్వదీయం కామాక్షి! ప్రతిదినమహం నౌమి విమలమ్॥ 102



శ్లో॥ ఇదం యః కామాక్ష్యాశ్చరణనలినస్తోత్రశతకం
జపేన్నిత్యం భక్త్యా నిఖిలజగదాహ్లాదజనకమ్।
స విశ్వేషాం వన్ద్యస్సకలకవిలోకైకతిలక-
శ్చిరం భుక్త్వా భోగాన్పరిణమతి చిద్రూపకలయా॥ 103



శ్రీః

# మూకపఞ్చశతీ

# పాదారవిన్దశతకమ్

## సారోల్లాసినీ వ్యాఖ్యా



అవ:- ఆర్యాశతకమును ముగించిన మూకమహాకవి ఆర్యయైన ఆమె కటాక్షించు అనుగ్రహమును గాని, మందస్మితానుగ్రహమును గాని పాదారవిందముల నాశ్రయింపనిదే చేయదని యెఱిగి ముందుగా పాదారవిన్దముల స్తుతించుటకు పూనుకొని ప్రప్రథమముగా ప్రథమ శ్లోకమున అనిర్వచనీయమైన వాని మహిమను స్తుతింపగల శక్తి యెవని కున్నదని ఆక్షేపరూపముగా ప్రశ్నించుచున్నాడు.

శ్లో॥ మహిమ్నః పన్థానం మదనపరిపన్థిప్రణయిని
ప్రభుః నిర్ణేతుం తే భవతి యతమానోఽపి కతమః।
తథాపి శ్రీకాఞ్చీవిహృతిరసికే కోఽపి మనసో
విపాకస్త్వత్పాదస్తుతివిధిషు జల్పాకయతి మామ్॥ 1

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| శ్రీకాంచీవిహృతిరసికే | = | శ్రీకాంచీ నగర విహారమునందు ఆసక్తి గలదానా! |
| మదనపరిపన్థిప్రణయిని | = | మన్మథవిరోధి (శివుని) ప్రియురాలా! |
| తే | = | నీ యొక్క |
| మహిమ్నః | = | మహిమయొక్క; |
| పంథానమ్ | = | మార్గమును; |
| నిర్ణేతుమ్ | = | నిశ్చయించుటకు; |
| యతమానః | = | ప్రయత్నించేవాడు; |
| కతమః | = | ఎవడు; |
| ప్రభుః | = | సమర్థుడు; |
| భవతి | = | అగును; |
| తథా+అపి | = | అయినను; |
| మనసః | = | మనస్సుయొక్క |

| | | |
|---|---|---|
| కః+అపి | = | ఏదో ఒక; |
| విపాకః | = | పరిపాకము; |
| త్వత్పాదస్తుతివిధిషు | = | నీ పాదముల స్తుతించు విధులందు; |
| మామ్ | = | నన్ను; |
| జల్పాకయతి | = | వాగించుచున్నది. |

**తాత్పర్యము :-**

శ్రీకాంచీనగరమున విహరించుటలో ఆసక్తిగల శివుని యిల్లాలా! నీ మహిమయొక్క మార్గమును నిర్ణయించు సామర్థ్యము ఈ ప్రపంచమున ఏ యొకనికినీ లేకున్నను నా మనస్సు చేసికొన్న ఏ పుణ్యమో పరిపాకమునకు వచ్చి నన్ను పలికించుచున్నది.

**వివరణము :-**

1) ***మహిమ్నః పారంతే, అతీతః పంథానమ్*** అని పుష్పదంతుడు శివుని మహిమ అనిర్వాచ్యము, అచింత్యము అని చెప్పినాడు. తత్స్మరణముతో మూకమహాకవి ***మహిమ్నః పంథానమ్*** అని ఆతని ఎత్తుగడతోనే ఆతడు ఆశ్రయించిన శిఖరిణీ వృత్తములోనే తన ఆర్యాపాదారవిన్దమహిమ అనిర్వాచ్య మనియే చెప్పినాడు. **శిఖరిణీ** వృత్తమున ***యమనసభ*** గణములు, వాని చివరఁ వ గణము ఉండును. ఆఱు అక్షరముల తరువాత విశ్రామ ముండును. ఈ శ్లోక ప్రథమపాదమున 1-7 వర్ణములకు మైత్రి కూడ దాక్షిణాత్యసంప్రదాయముతో కూర్పబడినది. 'కేకో, పాక, జల్పాక' అని ఉత్తరార్థమున అనుప్రాసమును శబ్దాలంకారము కూర్పబడినది. ఈ ప్రపంచమున ప్రయత్నపూర్వకముగా కొన్ని కర్మల నిర్వహణము చేయగలుగుచున్నాము. కొన్ని కర్మల నిర్వహింపలేక పోవుచున్నాము. కాలాంతరమున ఫలించు కర్మలు ఫలించునో లేదో ముందుగా చెప్పలేము కూడ. పరిస్థితి ఇట్లుండగా అమ్మవారి పాదముల స్తుతించు మహాకార్యము మహామునులకే సాధ్యము అని చెప్పలేము. ఇక సామాన్యుడనైన నావంటి వానికి అందును మూకుడను వానికి ఎట్లు సాధ్యమగును? ఒకప్పుడు మూకుడనైన నేను ఇప్పుడేదేదో వాగుటకు అలవాటు పడియున్నాను. కొత్తగా మాటలాడ నేర్చిన శిశువు ఆ వచ్చిన రెండు మూడు మాటలను అదే పనిగా చెప్పుచుండును. నా వాగుడు కూడ అటువంటిదే అని '***జల్పాకయతి***' అను క్రియాపదము ధ్వనింపజేయుచున్నది. '**క**' శబ్దమునకు బ్రహ్మయను నొక అర్థమున్నది. అనిర్వాచ్యుడగుటచేతను బ్రహ్మయైన ఈశ్వరునకును ఆ పేరు చెల్లును. అట్టి బ్రహ్మలలో ఈశ్వరులలో పరమేశ్వరుడు శ్రేష్ఠుడు కావున ఈ శ్లోకమునందలి కతమ శబ్ద మాతని వ్యంజింపజేయుచున్నది.

2) రసై రుద్రైశ్ఛిన్నా యమనసభలా గః శిఖరిణీ. ఇతి లక్షణమ్.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదస్తుతి యత్నించువానికిని సాధ్యము కాదని, అయినను నన్నేదో శక్తి వాగించుచున్నదని కవిచే చెప్పబడినది. ఈ శ్లోకమున ప్రథమముగా ధృతప్రాథమ్యములైన అమ్మవారి చరణకిరణముల **అరుణిమ** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ గలగ్రాహీ పౌరన్దరపురవనీపల్లవరుచాం**
**ధృతప్రాథమ్యానామరుణమహసామాదిమగురుః।**
**సమిన్ధే బన్ధూకస్తబకసహయుధ్వా దిశి దిశి**
**ప్రసర్పన్ కామాక్ష్యాశ్చరణకిరణానామరుణిమా॥ 2**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| పౌరందరపురవనీపల్లవరుచామ్ | = | నందనవనమందలి చిగుళ్ళ కాంతులయొక్క; |
| గలగ్రాహీ | = | గొంతు పట్టుకొన్న; |
| ధృతప్రాథమ్యానామ్ | = | పట్టుకొన్న మొదటితనము గల; |
| అరుణమహసామ్ | = | సూర్యకాంతులకు; |
| ఆదిమగురుః | = | మొదటిగురువైన; |
| బంధూకస్తబకసహయుధ్వా | = | మంకెన పూగుత్తులతో పోరాడునదియైన; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| చరణకిరణానామ్ | = | పాదకాంతులయొక్క; |
| అరుణిమా | = | ఎఱుపు; |
| దిశి దిశి | = | అన్ని దిక్కుల; |
| ప్రసర్పన్ | = | ప్రసరించుచు; |
| సమిన్ధే | = | వెలుగుచున్నది. |

**తాత్పర్యము :-**

నందనవనమందలి చిగుళ్ళ కాంతుల గొంతు పట్టుకొనునట్టి మొదటివని చెప్పదగిన అరుణకాంతులకు ఆదిమగురువైనట్టి కామాక్షీదేవి చరణ కిరణారుణిమ అన్ని దిక్కులలో ప్రసరించి వెలుగుచున్నది.

**వివరణము :-**

అల్లరి పిల్లవాడు ఒకరి గొంతు పట్టుకొనుచు మరొకరితో పోరాడును. అమ్మవారి చరణకిరణారుణిమయందు ధూర్తబాలవ్యవహారము ఈ శ్లోకమున వ్యంగ్యమగుటచే ఈ శ్లోకమున సమాసోక్త్యలంకారస్ఫూర్తి కలదు. వెలుగు వానిలో అరుణ కిరణములదే ప్రాథమ్యము. వానికిని అమ్మవారి చరణముల అరుణిమ ఆదిగురువని చెప్పుటచే సూర్యకిరణములందు శిష్యత్వారోపము స్ఫురించుటచే ఈ శ్లోకమున

రూపకాలంకారము వ్యంజితమగుచున్నది. **'ధృతప్రాథమ్యానామ్'** అను సమాసముచే ప్రాథమ్యము లేకున్నను దానిని చేజిక్కించు కొన్న సూర్యకిరణముల అనుచితమైన దానిని తొలగించి యథార్థమైన తన ఆదిమత్వము అమ్మవారి చరణకిరణారుణిమదే అని స్ఫురించుచున్నది. చరణకిరణారుణిమ యందలి ఆదిగురుత్వ మీశ్వరునకు తప్ప అన్యులకు చెల్లదు గదా! **పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్** (26) అను పాతంజల యోగసూత్రము పై వాక్యమునకు సమర్థకము. **'బంధూకస్తబకసహాయుధ్వా'** అను సమాసమున ఉపమాలంకారమున్నది. ప్రథమపాదమున ప్రతీపాలంకార మున్నది. పౌరందరపుర, అరుణ, కిరణ, అరుణిమ శబ్దములలో అనుప్రాస మను శబ్దాలంకార మున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదారుణిమకు అరుణ కిరణాది గురుత్వము చెప్పబడినది. ఈ శ్లోకమున దాని అంధకారతిరస్కారము చెప్పబడుచున్నది.

**శ్లో॥ మరాలీనాం యానాభ్యసనకలనామూలగురవే**
**దరిద్రాణాం త్రాణవ్యతికరసురోద్యానతరవే।**
**తమస్కాణ్డప్రౌఢిప్రకటనతిరస్కారపటవే**
**జనోఽయం కామాక్ష్యాశ్చరణనలినాయ స్పృహయతే॥ 3**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| మరాలీనామ్ | = ఆడు హంసలయొక్క; |
| యానాభ్యసనకలనామూలగురవే | = నడక నేర్చుకొనుటకు తొలిగురువైన; |
| దరిద్రాణామ్ | = దరిద్రులయొక్క; |
| త్రాణవ్యతికరసురోద్యానతరవే | = రక్షించు సంబంధమున కల్పవృక్షమైన; |
| తమస్కాండప్రౌఢిప్రకటన తిరస్కారపటవే | = చీకట్ల సమూహముల ప్రౌఢతయొక్క ప్రకటనమును తిరస్కరించుటయందు నేర్పరియైన; |
| కామాక్ష్యాః | = కామాక్షీదేవియొక్క; |
| చరణనలినాయ | = పాదకమలముకొఱకు; |
| అయమ్ | = ఈ; |
| జనః | = జనుడు (మూకకవి); |
| స్పృహయతే | = కోరుచున్నాడు. |

**తాత్పర్యము :-**

హంసలకు నడకనేర్పునట్టి దరిద్రులను దారిద్ర్యమునుండి వెలికితీసి రక్షించుటలో కల్పవృక్షమైన చీకట్లను చీల్చుటలో నేర్పరియైన కామాక్షీదేవి చరణ కమలము నీ జనుడు కోరుచున్నాడు.

**వివరణము :-**

ఆడు హంసలని చెప్పుటచే అమ్మవారి అంతఃపురమున శివుడు తప్ప మిగిలిన పురుషుల కెవ్వరికిని చివరకు పశుపక్ష్యాది జంతువులకును ప్రవేశము లేదని ధ్వనించుచున్నది. దరిద్రులను రక్షించుట అనగా వారిని సంపన్నులను జేయుట అను కర్మలో కల్పవృక్షమనుటచే రూపకాలంకారమేర్పడుచున్నది. మూడవ పాదమున అమ్మవారి పాదకమలమునందలి అంధకారతిరస్కారమును అరుణత్వమును అనగా సూర్యత్వమును వ్యంజించుటచే రూపకాలంకారస్ఫూర్తి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున చరణ నలినము వర్ణింపబడినది. ఈ శ్లోకమున దానికాంతి వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ వహన్తీ సైన్దూరీం సరణిమవనమ్రామరపురీ-**
**పురంధ్రీసీమన్తే కవికమలబాలార్కసుషమా।**
**త్రయీసీమన్తిన్యాః స్తనతటనిచోలారుణపటీ**
**విభాన్తీ కామాక్ష్యాః పదనలినకాన్తిర్విజయతే॥ 4**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| అవనమ్రామరపురీపురంధ్రీ సీమంతే | = | వంగిన దేవతానగరి యందలి ముత్తైదువుల పాపటయందు; |
| సైందూరీమ్ | = | సింధూరమునకు సంబంధించిన; |
| సరణిమ్ | = | మార్గమును; |
| వహన్తీ | = | మోయుచున్న; |
| కవికమలబాలార్కసుషమా | = | కవులనెడి కమలములకు లేత సూర్యుని కాంతియైన; |
| త్రయీసీమంతిన్యాః | = | వేదవిద్య యనెడి ముత్తైదువయొక్క; |
| స్తనతటనిచోలారుణపటీ | = | స్తన ప్రాంతమున కప్పు ఎర్రని రవికగుడ్డయైన |
| విభాన్తీ | = | ప్రకాశించుచున్న; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| పదనలినకాంతిః | = | పాదపద్మకాంతి; |
| విజయతే | = | సర్వోత్కృష్టముగా వర్ధిల్లుచున్నది. |

**తాత్పర్యము :-**

నమస్కరించిన దేవతా స్త్రీల పాపిటల యందు సిందూరముగా నున్న, కవులను కమలములందే లే యెండయైన, శ్రుతి యనెడి ముత్తైదువయొక్క స్తనములను కప్పు రవిక గుడ్డయైన ప్రకాశించు కామాక్షీదేవియొక్క పాదపద్మకాంతి సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**వివరణము :-**

**'కవికమలబాలార్కసుషమా'** అను సమాసమున రూపకాలంకార మున్నది. అమ్మవారి పాదకాంతి యందు సిందూరమార్గవహనము సంభావింప బడుటచే శ్లోకము నందలి మొదటి పాదమునందలి అలంకారము ఉత్ప్రేక్ష, మూడవ పాదమున అమ్మవారి పాదకాంతి శ్రుతికాంతస్తనతటకము రవికగుడ్డయో యన్నట్లున్నదని స్ఫురించుటచే ఉత్ప్రేక్షాలంకారమున్నది. **'పురీపురంధ్రీ'** అను శబ్దములలో ఛేకానుప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున బాలార్క సుషమగా అమ్మవారి పాదకాంతి చెప్పబడినది. ఈ శ్లోకమున బాలార్కుడు ప్రాతఃసాంధ్యకాలికుడగుటచే, సంధ్యసాయంకాలికము నగుటచే ఆ సంధ్యాకాంతి అమ్మవారి చరణములదే అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ ప్రణమ్రీభూతస్య ప్రణయకలహత్రస్తమనసః**
**స్మరారాతేశ్చూడానియతిగృహమేధీ హిమకరః।**
**యయోస్సాన్ధ్యాం కాన్తిం వహతి సుషమాభిశ్చరణయో-**
**స్తయోర్మే కామాక్ష్యా హృదయమపతన్ద్రం విహరతామ్॥** **5**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| ప్రణమ్రీభూతస్య | = | నమస్కరించిన; |
| ప్రణయకలహత్రస్తమనసః | = | ప్రణయ కలహము కలుగునను భయపడిన మనస్సుగల; |
| స్మరారాతేః | = | మన్మథవిరోధి (శివుని) యొక్క; |
| చూడానియతిగృహమేధీ | = | జటాజూటమునందు నియతముగా నుండు గృహస్థుడైన; |
| హిమకరః | = | చంద్రుడు; |
| యయోః | = | వేనియొక్క; |
| సాంధ్యామ్ | = | సంధ్యాకాలికమైన; |
| కాంతిమ్ | = | కాంతిని; |
| వహతి | = | ధరించునో; |
| కామాక్ష్యాః | = | కామాక్షియొక్క; |
| తయోః | = | ఆ; |
| సుషమాభిః | = | శ్రేష్ఠమైన కాంతులీను; |
| చరణయోః | = | పాదముల యందు; |
| మే | = | నాయొక్క; |
| హృదయమ్ | = | మనస్సు; |

అపతంద్రమ్ = సోమరితనము లేకుండ;
విహరతామ్ = విహరించుగాక!

**తాత్పర్యము :-**

ప్రణయకలహము కలుగునని భయపడిన శివుడమ్మవారి పాదము లందు తన శిరము నుంచెను. అప్పుడమ్మవారి పాదములందలి సంధ్యారుణ కాంతిని శివుని జటాజూటమందున్న చంద్రుడు గ్రహించి యెఱ్ఱనయ్యెను. అంతటి ఎఱ్ఱని అమ్మవారి పాదములందు నా హృదయము సోమరితనము వీడి విహరించు గాక!

**వివరణము :-**

చంద్రుడు తెల్లనివాడు. అనగా సాత్వికుడు. తెలుపు సత్త్వగుణమునకు ప్రతీకమని పెద్దలు చెప్పెదరు. ***'అజామేకాం లోహితశుక్లకృష్ణామ్'*** శ్వే. 4.5 అని ఉపనిషత్తు నందు సత్త్వరజస్తమో గుణ ప్రకృతి లోహిత శుక్ల కృష్ణ అని రంగులతో గుణములను చెప్పినది. శివుడును తెల్లని రంగుగల వాడే. ఆతడును సాత్త్వికుడే. తొలత సాత్త్వికుడైన శివుడు అమ్మవారి యందు కాలాంతరమున, కారణాంతరమున లేక కాలకారణభేదము లేకుండ అమ్మవారి యందు రాగమును వహించినాడు. అప్పుడారాగముచే అమ్మవారి వియోగమును సహింపలేని వాడైనాడు. శివుడు నెత్తిమీద గంగను (మరొక స్త్రీని) ధరించి అపరాధమును చేసినాడు. అమ్మవారిని సమీపింపబోవుచు శిరమును తడిమికొన్నాడు. తన అపరాధమును స్మరించి ఆమె పాదములందు తన తలను మోపినాడు. అమ్మవారు కోపించి కలహించి తనకు దూరమగునేమో, ఆమె విరహము కలుగునేమో అని భయపడి అట్లొనర్చినాడు. శివచంద్రులిరువురు సోమనాములగుటచే శివుని కమ్మవారి యందు మనస్సులో రాగము కలిగిన వాడైనట్లు అమ్మవారి పాదములందు శివుడు తన తలను మోపుటచే ఆ తలయందలి చంద్రుడమ్మవారి పాదములందలి లాక్షారుణిమచే ఎఱ్ఱబారినాడు. శుద్ధస్ఫటికమూర్తి యగు శివుడును ఎఱ్ఱబారక యుండడు. ఉత్తమాంగమందలి చంద్రుడే ఎఱ్ఱబారగా శివుని ఇతరాంగము లెఱ్ఱబారినవని చెప్పనక్కరలేదు. చంద్రుడు మన్మథునకు మిత్రుడు. మన్మథుని పరివారములోనివాడు. ఆతనిని తలదాల్చి స్మరారాతియైన శివుడు స్మరునితో వైర ముజ్జగించి కాళ్ళబేరమునకు వచ్చినాడు. ఈ అర్థమంతయు ***'స్మరారాతేః, ప్రణమ్రీభూతస్య, ప్రణయకలహత్రస్తమనసః'*** అను సమాసముల చేత స్ఫురించుచున్నది. చంద్రుడమ్మవారి ముఖములో సౌందర్యవిషయమున ఒకప్పుడు స్పర్ధించి యోడిపోయినాడు. ఇప్పుడు పాదములపై బడి ఆమె చరణ కాంతిని, చరణగతరజమును బోలె ధరించినాడు. ఈ అర్థము ***'యయోః సాంధ్యామ్ కాన్తిమ్ వహతి'*** అను పదముల వలన స్ఫురించుచున్నది. శివుని శిరసెక్కుటచే అనగా శివుని సహవాసముచే సోమత్వమును బొందుటచే ఆతనికమ్మవారి పాదములందు బడు సౌభాగ్యము ప్రయత్నమున చేకూరినది. ఇది సజ్జన సహవాస ఫలము. శివుని శిరసెక్కుట దోషము. శివుని వంటి మహానుభావుల పాదములందుండుట గృహస్థుడైన

చంద్రునికి; కల్యాణహేతువు. కాని ఆతడు శివుని శిరసెక్కువాడు. కావున పాదములందు పతితుడైనాడు. అయినను అవి అమ్మవారి పాదములు కనుక తా నెట్టబడి శివుని సరాగత్వమును చాటినాడు. కనుక అమ్మవారి కరుణకును పాత్రుడై అమ్మవారి తలలో సైతము పూవైనాడు. గృహమేధుల కిట్టి ఉత్థాన పతనములు స్వస్వ కర్మానుగుణములు. ఈ అంశమును **గృహమేధి** శబ్దము వ్యంజింపజేయును. అమ్మవారి పాదరజము సంధ్యాకాంతి సదృశము. సంధ్యా కాంతిని ధరించినాడనగా ఆమె పాదరజమును ధరించినట్లే. ఏలననగా సాదృశ్యము భేదముతో పాటు అభేదము కూడ నుండును. పాదరజమును స్వీకరించుట భారతోత్తర దేశీయాచారము. శ్లోకమునందు ధ్వనించిన వస్తుధ్వని వివరింపబడినది.



**అవ:-** పై శ్లోకమున **యయోః తయోః** అను చరణముల యత్తచ్ఛబ్ద పరామర్శ మున్నది. ఈ శ్లోకమున సైతము ఆ పరామర్శయే స్వీకరింపబడి శ్లోకము నందలి ఉత్తరార్ధము నందలి ఎత్తుగడతోనే ఈ శ్లోకమారంభింపబడుచున్నది.

**శ్లో॥ యయోః పీఠాయన్తే విబుధముకుటీనాం పటలికా**
**యయోస్సౌధాయన్తే స్వయముదయభాజో భణితయః।**
**యయోర్దాసాయన్తే సరసిజభవాద్యాశ్చరణయో-**
**స్తయోర్మే కామాక్ష్యా దినమను వరీవర్తు హృదయమ్॥ 6**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| యయోః | = | వేనికి; |
| విబుధముకుటీనామ్ | = | దేవతల కిరీటముల యొక్క; |
| పటలికాః | = | సమూహములు; |
| పీఠాయన్తే | = | పీఠములగుచున్నవో; |
| యయోః | = | వేనికి; |
| స్వయమ్ | = | స్వయముగా; |
| ఉదయభాజః | = | ఉదయము బొందు; |
| భణితయః | = | వాగ్రీతులు; |
| సౌధాయన్తే | = | మేడలగుచున్నవో; |
| యయోః | = | వేనికి; |
| సరసిజభవాద్యాః | = | బ్రహ్మాదులు; |
| దాసాయన్తే | = | దాసులగుచున్నారో; |
| తయోః | = | ఆ; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |

| | | |
|---|---|---|
| చరణయోః | = | చరణములయందు; |
| మే | = | నాయొక్క; |
| హృదయమ్ | = | మనస్సు; |
| దినమ్ అను | = | ప్రతిదినము; |
| వరీవర్తు | = | వర్తించుగాక! |

**తాత్పర్యము :-**

దేవతా కిరీటములకు పీఠములు, కవితారీతులకు సౌధములునగుచున్న బ్రహ్మాది సేవ్యములునైన కామాక్షీదేవి చరణములందు నా హృదయమెప్పుడు వర్తించుగాక!

**వివరణము :-**

మొదటి మూడు పాదములలో లుప్తోపమాలంకారములున్నవి. పీఠము కలిగియుండుట, మేడలలో నివసించుట, దాసులు కలిగియుండుట అను మహారాజ్ఞీ ధర్మములు పేర్కొనబడి అమ్మవారి మహారాజ్ఞీత్వము నర్థ సిద్ధమొనర్చు చున్నవి. ఈ ధర్మములు అమ్మవారి అధోవయవములైన పాదములందే ఉండగా అమ్మవారి యందుండుటలో సందేహించనక్కఱ లేదను నర్థమును స్ఫురింపజేయు చున్నవి. అవయవధర్మముయొక్క అవయవిగతత్వము దాదాపు నియతము. వాస్తవమునకు శక్తిరూపిణియైన అమ్మవారియందు అవయవావయవిభావము కల్పితమే. అమ్మవారి పాదముతో సాదృశ్యము గల సరసిజమునుండి పుట్టిన బ్రహ్మ ఆ పాదమునకు దాసుడగుట వింత కాదు. ఆ బ్రహ్మమునకు జన్మస్థానమైన సరసిజమే తొలత ఆ దాస్యము చేసియే తత్సాదృశ్యమును పొందినది. కావున బ్రహ్మయొక్క దాసత్వము కులక్రమాగతమని **సరసిజ భవ** శబ్దము వ్యంజింపజేయుచున్నది. వ్యంగ్యమైన ఈ సరసిజ దాస్యము ప్రతీపాలంకారమును ధ్వనింపజేయుచున్నది.



**అవ:-** పై శ్లోకమున వ్యంగ్యమైన ఉపమాన సరసిజ తిరస్కారము ఈ శ్లోకమున వాచ్యము చేయబడుచున్నది.

**శ్లో॥ నయన్తీ సఙ్కోచం సరసిజరుచం దిక్పరిసరే**
**సృజన్తీ లౌహిత్యం నఖకిరణచన్ద్రార్ధఖచితా।**
**కవీన్ద్రాణాం హృత్కైరవవికసనోద్యోగజననీ**
**స్ఫురన్తీ కామాక్ష్యాశ్చరణరుచిసన్ధ్యా విజయతే॥ 7**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| సరసిజరుచమ్ | = | కమలకాన్తిని; |
| దిక్పరిసరే | = | మూలవైపున; |

| | | |
|---|---|---|
| సంకోచమ్ | = | సంకోచమును; |
| నయన్తీ | = | పొందుచున్న; |
| నఖకిరణచంద్రార్ధఖచితా | = | గోటికాంతి యనెడి అర్ధచంద్రుడు; చెక్కియున్నదై; |
| లౌహిత్యమ్ | = | ఎఱుపును; |
| సృజన్తీ | = | పుట్టించుచున్న; |
| కవీంద్రాణామ్ | = | కవీశ్వరులయొక్క; |
| హృత్కైరవవికసనోద్యోగజననీ | = | హృదయములను కలువల వికసింపజేయుట అను ప్రయత్నమును కలిగించు; |
| స్ఫురన్తీ | = | ప్రకాశించుచున్న; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| చరణరుచిసంధ్యా | = | పాదకాంతి యనెడి సంధ్య; |
| విజయతే | = | సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది. |

**తాత్పర్యము :-**

కమలకాంతి నొక మూలకు నెట్టుచు ఎఱ్ఱదనమును సృజించుచు గోటి కాంతి యను అర్ధచంద్రుడు చెక్కబడి ప్రకాశించుచున్న కవీంద్రుల హృదయముల వికసింపజేయు కామాక్షీదేవి చరణములందలి కాంతియనెడి సంధ్య సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**వివరణము :-**

ప్రథమపాదమున ఉపమానమైన కమలముయొక్క కాంతిని సంకోచింప జేయుటకు ఉపమానమందు చరణములకున్న తిరస్కారభావము కారణము కావున ప్రతీపాలంకారమున్నది. ద్వితీయపాదమున నఖచంద్రార్ధముల అభేదము చెప్పబడినందున విషయ్యభేదము విషయమునందు అనగా చంద్రార్ధభేదము నఖములందు స్ఫురించుటచే రూపకాలంకారమేర్పడియున్నది. అట్లే తృతీయపాదమునను హృదయకైరవముల అభేదస్ఫూర్తి ఉండుటచే రూపకాలంకార మేర్పడియున్నది. అమ్మవారి గోటికాంతి వెన్నెలవలె నుండుటచే అది కవులహృదయకైరవముల వికసింపజేయుచున్నది. అమ్మవారి నఖము లర్ధచంద్ర సదృశములని స్ఫురింపజేయుటయే పైన వివరింపబడినది. 'నఖ చంద్ర' రూపకాలంకారము యొక్క తాత్పర్యము. చంద్రుడమ్మవారి ముఖ సాదృశ్యము నందలేక పది ముక్కలై కాలిగోళ్ళ రూపమున అమ్మవారి నాశ్రయించినాడు. అర్ధానుగ్రహము చేతనే కాలిగోటి సాదృశ్యమునందిన అష్టమినాటి వెన్నెలవంటి ఆ కాలిగోటి కాంతి కవులహృదయకుముదముల వికసింపజేయుచున్నది అని చంద్రార్ధ శబ్దము వ్యంజింపజేయుచున్నది. ఒక్క గోటి కాంతియే ఆ పని చేయుచున్నదనియు వ్యంగ్యమగుచున్నది. అది ఎడమకాలి గోటి కాంతి యనుకొన్నచో ఆమె అనుగ్రహ లేశమే కవి హృదయవికాసము నామె కాలిగోటితో అనగా విలాసముగా శ్రమ లేకుండా చేయుననుట స్పష్టమగును. చరణరుచియందు సంధ్యారోప ముండుటచే నాల్గవపాదమున

రూపకాలంకార మున్నది. కైరవములు సాయంసంధ్యయందు వికసింప నారంభించునవి. కావున చరణరుచిసంధ్య సాయంసంధ్య యని స్ఫురించుచున్నది. చంద్రుడుకూడ రాత్రియందు ప్రకాశము కలవాడగుట చేతను పై స్ఫూర్తి ఔచిత్యము కలిగియే యున్నది. సరసిజరుచి సంకోచము కూడ సాయంసంధ్యయందే కలుగును. స్త్రీ దేవతకు రాత్రి పూజ అధిక సంతోషదాయకము కావున అమ్మవారి చరణరుచిసంధ్యయొక్క సాయంకాలార్చనీయత్వముచేతను ఔచిత్యము మరింత రమణీయతను పొందియున్నది. వెనుక **దిక్పరిసరే సరసిజరుచం, సంకోచం నయన్తీ** అని అన్వయము చేయబడినది. అట్లుగాక **దిక్పరిసరే లౌహిత్యమ్ సృజన్తీ** అని దిక్పరిసర శబ్దమును ద్వితీయ పాదగత పదములతో నన్వయించి దిక్కుల ప్రాంతము లందు ఎఱ్ఱదనమును సృజించుచున్న అని అర్థమును చెప్పవచ్చును. అప్పుడామె చరణ రుచిసంధ్యయొక్క దిగంతవ్యాప్తి చెప్పినట్లగును.



**అవ:-** ఒక పూర్వ శ్లోకమున శివుని ప్రణయ కలహము కలుగునేమో యను భయము చెప్పబడినది. ఈ శ్లోకమున ప్రణయకలహముయొక్క ***శిథిలత*** చెప్పబడుచున్నది.

**శ్లో॥ విరావైర్మాఞ్జీరైః కిమపి కథయన్తీవ మధురం**
**పురస్తాదానమ్రే పురవిజయిని స్మేరవదనే।**
**వయస్యేవ ప్రౌఢా శిథిలయతి యా ప్రేమకలహ-**
**ప్రరోహం కామాక్ష్యాశ్చరణయుగలీ సా విజయతే॥** **8**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| పురస్తాత్ | = | ఎదుట; |
| ఆనమ్రే | = | వంగిన; |
| పురవిజయిని | = | శివుడు; |
| స్మేరవదనే | = | చిరునవ్వు మోముగలవాడు కాగా; |
| ప్రౌఢా | = | ప్రౌఢురాలైన; |
| వయస్యా+ఇవ | = | స్నేహితురాలివలె; |
| మాంజీరైః | = | కాలి అందెలకు సంబంధించిన; |
| విరావైః | = | ధ్వనులచేత; |
| కిమ్ అపి | = | ఏదో; |
| మధురమ్ | = | మధురముగా; |
| కథయన్తీవ | = | చెప్పుచున్నట్లున్న; |
| యా | = | ఏది; |
| ప్రేమకలహప్రరోహమ్ | = | ప్రేమ కలహారంభమున; |
| శిథిలయతి | = | తగ్గించునో; |

సా = ఆ;
కామాక్ష్యాః = కామాక్షీదేవియొక్క;
చరణయుగలీ = పాదముల జంట;
విజయతే = సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**తాత్పర్యము :-**

చిఱునవ్వు మోముతో శివుడు అమ్మవారి పాదముల బడగా మంజీర నాదములతో నేదో మాట్లాడుచున్నట్లున్న ప్రణయకలహమును సడలింపజేయు ప్రౌఢ స్నేహితురాలివలె నొప్పు కామాక్షీదేవి చరణముల జంట సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**వివరణము :-** మంజీరధ్వనితో మాట్లాడుచున్నట్లున్న అనుటచేత *ప్రౌఢా వయస్యా ఇవ* అనుటచేతను ఉత్ప్రేక్షాలంకారము ఏర్పడియున్నది. అమ్మవారు ప్రణయ కుపితయై శివునితో కలహించుటకు సిద్ధముగా ఉన్నది. ఆ సమయమున చరణయుగళి యను ఆమె చెలికత్తె మంజీరధ్వనితో మాట్లాడినది. ఆ మాటలతో అమ్మవారి కోపము కొంచెము తగ్గినది. శివుని ముఖమున చిఱునవ్వు విరిసినది. పై అలంకారము యొక్క బలమున ఈ అర్థము ధ్వనించుచున్నది.



**అవ:-** పై శ్లోకమున **మంజీరనాదము** ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున నినదించు తుమ్మెదలతో కూడిన కమలములతోడి ***బంధుత్వము*** చరణయుగళము నందు చెప్పబడుచున్నది.

**శ్లో॥ సుపర్వస్త్రీలోలాలకపరిచితం షట్పదకులైః**
**స్ఫురల్లాక్షారాగం తరుణతరణిజ్యోతిరరుణైః।**
**భృతం కాన్త్యమ్భోభిర్విసృమరమరన్దైస్సరసిజై-**
**ర్విధత్తే కామాక్ష్యాశ్చరణయుగలం బన్ధుపదవీమ్॥ 9**

**ప్రతిపదార్థము :-**

సుపర్వస్త్రీలోలాలకపరిచితమ్ = దేవతా స్త్రీల చంచలమైన ముంగురుల తోడి పరిచయము గల;
స్ఫురల్లాక్షారాగమ్ = ప్రకాశించు లత్తుక యెఱుపుగల;
కాన్త్యంభోభిః = కాంతి జలములచేత;
భృతమ్ = పోషింపబడిన;
కామాక్ష్యాః = కామాక్షీదేవియొక్క;
చరణయుగళమ్ = పాదముల జంట;

షట్పదకులైః = తుమ్మెదలతో కూడిన;
తరుణతరణిజ్యోతిరరుణైః = లేత సూర్యుని వెలుగువలె నెఱ్ఱనైన;
విసృమరమరందైః = ప్రసరించు మకరందము గల;
సరసిజైః = కమలములతో;
బంధుపదవీమ్ = బంధుమార్గమును;
విధత్తే = ఏర్పరచుచున్నది.

**తాత్పర్యము :-**

తుమ్మెదలతో కూడిన లేత సూర్యుని వెలుగువలె లేక వెలుగులో నెఱ్ఱనైన మకరందమును స్రవించు కమలములతో దేవతా స్త్రీల ముంగురులతో పరిచితమైన లత్తుకతో ప్రకాశించుచున్న కాంతి జలములతో పోషించబడిన అమ్మవారి చరణయుగళము బంధుత్వమును నెఱుపుచున్నది.

**వివరణము :-**

కమలములు తుమ్మెదలతో కూడియున్నట్లు అమ్మవారి చరణములు దేవతా స్త్రీల ముంగురులతో కూడియున్నవి. కమలములు జలముతో పోషింపబడు నట్లు అమ్మవారి పాదములు కాంతులతో పోషింపబడుచున్నవి. కమలములలో మకరందమున్నట్లు అమ్మవారి చరణయుగలము బంధుత్వము నెఱపుచున్నది, అని సమానధర్మము క్రమముగా నిర్వహించుటచేత ఉపమాలంకార స్ఫూర్తి యున్నది. క్రమాలంకారము కూడ నున్నది. కమలములలో ఆర్ద్రత సహజముగా ఉండును. అమ్మవారి పాదములలో తత్సామ్యమును సాధించుటకు కాంతియందు జలరూపణము చేయబడుటచే ఉపమాలంకారము రూపకానుప్రాణితము. చరణసంబంధిదేవతావనితలకును, కమలసంబంధి షట్పదములకు బింబప్రతిబింబ భావమున్నది. అట్లే లాక్షా తరణి జ్యోతులకును బింబప్రతిబింబ భావమున్నది. మకరంద రసము వంటి కాంతి జలముచే అమ్మవారి చరణములకు కలిగిన ఆర్ద్రత లోకమునందఱి పట్ల ముఖ్యముగా భక్తుల పట్ల అమ్మవారికి గల దయార్ద్ర భావమును వ్యంజింపజేయుచున్నది. **బంధు** శబ్దము అమ్మవారి లోకబంధుత్వమును వ్యంజింపజేయును. సరసిజ శబ్దములోని సరసి అను పదము అమ్మవారి చరణముల కరుణారస నిలయత్వమును వ్యంజించుచున్నది. **సుపర్వస్త్రీలోలాలకపరిచిత** మను సమాసము అమ్మవారి దేవతా వంద్యత్వమును తెలుపుచుండగా బంధు శబ్ద మామె సర్వలోక బాంధవ్యమును తెలుపుచున్నది. ***'విసృమరమరంద'*** అను సమాసమున ఛేకానుప్రాసమున్నది. తరుణ తరణి అను సమాసమున వృత్త్యనుప్రాసాలంకార మున్నది. ఈ అనుప్రాసములు రెండు శబ్దాలంకారములు. పైన వివరింపబడిన ఉపమా రూపకాలంకారము అర్థాలంకారములని వేఱుగా చెప్పనక్కరలేదు.



**అవ:-** పై శ్లోకమున రజస్సుతో నిండియుండు కమలములు ప్రస్తావింపబడినవి. ఈ శ్లోకమున జగత్సర్జక రజస్సంబంధ మమ్మవారి చరణములకున్నట్లు చెప్పబడు చున్నది.

**శ్లో॥ రజస్సంసర్గేఽపి స్థితమరజసామేవ హృదయే**
**వరం రక్తత్వేన స్థితమపి విరక్తైకశరణమ్।**
**అలభ్యం మన్దానాం దధదపి సదా మన్దగతితాం**
**విధత్తే కామాక్ష్యాశ్చరణయుగమాశ్చర్యలహరీమ్॥ 10**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| రజస్సంసర్గే+అపి | = | రజస్సుతోడి సంబంధమున్నను; |
| అరజసామ్ | = | రజోగుణములేనివారియొక్క; |
| హృదయే ఏవ | = | హృదయము నందే; |
| స్థితమ్ | = | ఉన్నట్టి; |
| రక్తత్వేన | = | లౌహిత్యముతో; |
| స్థితమ్ అపి | = | ఉన్నను; |
| విరక్తైకశరణమ్ | = | విరక్తులకు ముఖ్యముగా ఆశ్రయణీయమైన; |
| సదా | = | ఎల్లప్పుడు; |
| మందగతితామ్ | = | మెల్లని నడకను; |
| దధత్ అపి | = | ధరించుచున్నను; |
| మన్దానామ్ | = | మందులకు; |
| అలభ్యమ్ | = | లభింపని; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| వరమ్ | = | శ్రేష్ఠమైన; |
| చరణయుగమ్ | = | పాదముల జంట; |
| ఆశ్చర్యలహరీమ్ | = | ఆశ్చర్య ప్రవాహమును; |
| విధత్తే | = | చేయుచున్నది. |

**తాత్పర్యము :-**

రజస్సుతోడి సంపర్కమున్నను అమ్మవారి పాదము రజస్సులేనివారి హృదయమందే ఉండును. రక్తమై ఉన్నను విరక్తులకే ముఖ్యముగా అది ఆశ్రయణీయము. మందగమనము కలిగియున్నను మందులకు లభ్యము కానిది. అట్టి అమ్మవారి పాదముల జంట నా మనమున ఆశ్చర్యప్రవాహమును కలిగించు చున్నది..

**వివరణము :-**

రజస్సనగా దుమ్ము లేక పుప్పొడి. రజస్సనగా రజో గుణము. పై రెండర్థములు

ఏక శబ్ద బోధ్యములై శ్లేషను సమకూర్చుచున్నవి. అమ్మవారి పాదములలో దుమ్ము లేకున్నను జగత్సర్జకరజోగుణమున్నది. రజస్సు లేకుండుటచే రజస్సు (రాగద్వేష దుః ఖాది హేతువైన రజోగుణము) లేని వారియొక్క అనగా సాత్త్వికులయొక్క హృదయమునందే అమ్మవారి పాదముల జంట విరోధమేమి లేకున్నను రజస్సులేని వారి హృదయమున నుండుట విరోధము అభాసించుటచే ఇట విరోధాభాసాలంకార మున్నది. అది శ్లేషమూలకము కావున శ్లేషానుప్రాణితమని చెప్పబడినది. అట్లే రెండవపాదమున రక్త శబ్దమెఱ్ఱనైన అను అర్థమును బోధించును. విరక్త శబ్ద 'మెఱ్ఱనిది కాని' అర్థమును బోధించునప్పుడు రక్తచరణము రక్తహీనునికి శరణ్యమెట్లగునను విరోధము శ్లేష బలమున ఆభాసమగును. అట్లే మూడవపాదమున కూడ విరోధాభాస మున్నది. మందగతిగల అమ్మవారి చరణము మందులకు లభ్యము కాకుండుటెట్లను విరోధము మందశబ్దమునకు మందబుద్ధి అను అర్థము చెప్పి పరిహరించు కొనవచ్చును గదా! కావున ఈ శ్లోకమున మూడు విరోధాభాసాలంకారము లున్నవి. విరోధము కలవారొకచోట నుండుట ఆశ్చర్యకరము. ఆ అంశమునే నాలుగవ పాదము తెలుపును. **ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమ్..... కశ్చిత్** (గీత 2.29) అని ఆశ్చర్యనిలయముగా ఆత్మను పేర్కొనుచున్నది. అట్టి ఆత్మయే స్వరూపమైన అమ్మవారి చరణయుగ మాశ్చర్యలహరిని భక్తుల హృదయములలో ప్రవహింపజేయుటలో వింత లేదు. అయినను ఆశ్చర్యప్రవాహముల సృజించు చున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చరణములకు జగత్సర్జకమైన రజస్సుయొక్క సంసర్గము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె చరణములయందు జగత్త్రాణ కరణమునకైన **తపశ్చర్యాకార్యము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ జటాలా మఞ్జీరస్ఫురదరుణరత్నాంశునికరై-**
**ర్నిషీదన్తీ మధ్యేనఖరుచిఝరీగాఙ్గపయసామ్।**
**జగత్త్రాణం కర్తుం మమ జనని! కామాక్షి! నియతం**
**తపశ్చర్యాం ధత్తే తవ చరణపాథోజయుగలీ॥ 11**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| మంజీరస్ఫురదరుణ రత్నాంశునికరైః | = | మంజీరములందు ప్రకాశించు నెఱ్ఱని రత్నముల కాంతుల గుంపులచే; |
| జటాలా | = | జడలు కలిగినదైన; |
| మధ్యేనఖరుచిఝరీగాంగపయసామ్ | = | గోళ్ళ కాంతులను గంగకు సంబంధించిన జలములయొక్క నడుమ; |
| నిషీదన్తీ | = | కూర్చొనుచున్నదైన; |

| | | |
|---|---|---|
| జనని | = | తల్లీ!; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ!; |
| మమ | = | నాయొక్క; |
| జగత్త్రాణమ్ | = | జగత్ రక్షణమును; |
| కర్తుమ్ | = | చేయుటకు; |
| తవ | = | నీయొక్క; |
| చరణపాథోజయుగలీ | = | పాదకమలముల జంట; |
| తపశ్చర్యామ్ | = | తపశ్చర్యను; |
| ధత్తే | = | ధరించుచున్నది. |

**తాత్పర్యము :-**

మంజీరరత్నకాంతులు జడలుగా ధరించి గోళ్ళ కాంతియను గంగ యొక్క జలముల నడుమ కూర్చొని నీ పాదపద్మముల జంట జగద్రక్షణ కొఱకై తపశ్చర్య నొనర్చుచున్నది.

**వివరణము :-**

1) బ్రహ్మ ప్రలయకాలము ముగియు సమయమున విష్ణువుచే నాభి కమలమున సృజింపబడెను. ఆయన జగముయొక్క సృష్టి నెట్లు చేయవలెనో తెలియక దిక్కుతోచక యుండగా తపస్సుచేయుమను ఆకాశవాణి వినబడెను. ఆయన తపస్సు నొనరించి తనను సృజించిన విష్ణువుయొక్క గర్భములోనికి దిగి ఆ గర్భములోని లోకమును చూచివచ్చి జగమును సృజించెనను పురాణగాథ సృష్టి కొఱకైన బ్రహ్మ తపస్సును పేర్కొన్నది. మరి కొన్ని పురాణగాథలు విష్ణువు శివుని సహస్రకమలములతో నర్చించి జగద్రక్షణ సామర్థ్యమును, తత్సాధనమైన సుదర్శనచక్రమును పొందెనని చెప్పినవి. ఈ శ్లోకము అమ్మవారి పాదకమలముల జంట జగద్రక్షణము కొఱకు తపస్సు చేసినదని యుత్ప్రేక్షించు చున్నది. తపము చేయవలెనన్న ముందుగా జడలు ధరింపవలెను. నీటిలో నిలబడియో కూర్చొనియో ఉండవలెను. అమ్మవారి చరణకమలములు మంజీరములలోని రత్నముల కాంతులను జడలుగా కట్టుకొన్నవి. మంజీరములు పాదములకు కొంచెము పైగా నుండునవగుటచే శిరస్థానీయములై యున్నవి. వాని కాంతులు కేశస్థానీయములైయున్నవి. కావున కవి వానిని జడలుగా సంభావించుట ఉచితముగా ఉన్నది. కమలములకు జలములలో నుండుట స్వభావము, పాదములు కమలరూపమున జలములలో నున్నవి అని **చరణ పాథోజ** శబ్దములతో సూచించుచున్నాడు. అదిగాక శివుని శిరమున గంగయున్నది. ప్రణయ కుపితయైన అమ్మవారి కోపమును శమింపజేయుటకై పాదములపై తలనిడినప్పుడు గంగ పాదములపై పడినది. ఆ గంగా జలములో కూర్చొని ఆ పాదములు స్నానమాడినవి. కవి దానితో తృప్తిపడక ఆమె గోటికాంతియే గంగాజలమని ఆ జలములో అమ్మవారి పాదముల జంట కూర్చొని తపము చేయుచున్నదని కవి చెప్పుటచే ఈ శ్లోకమున

సంభావన పరమరమణీయముగా నున్నది. అందుచే ఈ శ్లోకమున ఉత్ప్రేక్షాలంకార మొప్పుచున్నది. తపశ్చర్యకొఱకు పాదములు గంగలో నుండక పోయినను అందుకొఱకే తపశ్చర్యయని చెప్పుట ఫలము కాని జగత్త్రాణమును ఫలముగా సంభావించుటచే నీ శ్లోకములోని **ఉత్ప్రేక్ష ఫలోత్ప్రేక్ష** అగుచున్నది. చతుర్థపాదమున దాక్షిణాత్యమైన వర్ణమైత్రి ఉన్నది.

2) మధ్యేనఖరుచిఝరీగాఙ్గపయసామ్ - అవ్యయీభావ సమాసం.



**అవ:-** పూర్వ శ్లోకము 8న మంజీరనాదమేమో చెప్పు శబ్దముగా ఉన్నది. ఈ శ్లోకమున తులాకోటిద్వంద్వనాదము అభయవచనరూపమే అని చెప్పబడు చున్నది.

**శ్లో॥ తులాకోటిద్వన్ద్వక్వణితఫణితాభీతివచసో-**
**ర్వినమ్రం కామాక్ష్యా విసృమరమహః పాటలితయోః।**
**క్షణం విన్యాసేన క్షపితతమసోర్మే లలితయోః**
**పునీయాన్మూర్ధానం పురహరపురన్ధ్రీచరణయోః॥ 12**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| తులాకోటిద్వంద్వక్వణిత ఫణితాభీతివచసోః | = | అందెలజంటయొక్క ధ్వనిచే చెప్పబడిన అభయవచనము గల; |
| విసృమరమహఃపాటలితయోః | = | ప్రసరించు తేజముచేత నెఱ్ఱవాఱిన; |
| క్షపితతమసోః | = | తపస్సుగల; |
| లలితయోః | = | సుందరములైన; |
| పురహరపురంధ్రీచరణయోః | = | శివుని ఇల్లాలి పాదములయొక్క; |
| క్షణమ్ | = | క్షణకాలము; |
| విన్యాసేన | = | ఉంచుట చేత; |
| వినమ్రమ్ | = | వంచిన; |
| మే | = | నాయొక్క; |
| మూర్ధానమ్ | = | తలను; |
| పునీయాత్ | = | పవిత్రమొనరించుగాక! |

**తాత్పర్యము :-**

అందెల రవళిచేత అభయవచనము చెప్పు ప్రవహించు కాంతితో నెఱ్ఱవారిన సుందరములైన అమ్మవారి పాదములజంట నా శిరమున క్షణకాలముంచి శ్రీ కామాక్షీదేవి నా తమస్సును పాఱద్రోలి, వంచిన నా తలను పవిత్ర మొనరించుగాక!

**వివరణము :-**

అమ్మవారి పాదములకు రత్నాల కడియము లున్నవి. వానికి మణుల గజ్జెలున్నవి. అమ్మవారు పాదములదలించు నప్పుడు అవి మ్రోయును. మణుల మ్రోత క్వణితమని చెప్పబడును. ఆ ధ్వని అమ్మవారి పాదములందుండగా మీకు భయమేల? రండు, వాని నాశ్రయింపుడు అని చెప్పుచున్నట్లున్నది. ఇది యొక అందమైన సంభావనము. కావున ప్రథమ పాదమున ఉత్ప్రేక్షాలంకారమున్నది. అమ్మవారి పాదములున్నచోట చీకటి ఉండదు. ఏల? అవి వ్యాపించు నెఱ్ఱని కాంతిగలిగి యున్నవి. రాత్రియొక్క అంధకారమును చీల్చు ఉషస్సు వంటిదాకాంతి అని ***విస్మృమరమహః పాటలితయోః, క్షపితతమసోః*** అను విశేషణములు సూచించుచున్నవి. మూర్ధములోని వెంట్రుకలు నల్లనివి. అవి తమస్సుతో పోల్చబడుట కవి సమయము. తమశ్శబ్దము చీకటి, అజ్ఞానము, తమోగుణము అను అర్థముల నొసగును. మహశ్శబ్దము వెలుగు అను అర్థము నిచ్చినను జ్ఞానము అను అర్థమునకు ప్రతీకముగా నుండును. ఈ అర్థముల ననుసరించి విచారించెదము. భక్తుని యెదలోని తమోగుణమును అజ్ఞానమును అమ్మవారి పాదముల జంట తొలగించును. పాపము, అజ్ఞానము, తమోగుణము జీవుల హృదయము నపవిత్రమొనరించును లేదా అపవిత్రత అనునది తమోగుణాజ్ఞానపాపము లున్నచోట నుండును. ఈ శ్లోకమున కవి తన తల అపవిత్రముగా నున్నదని దానిమీద అమ్మవారి చరణయుగమును మోపుట ద్వారా పవిత్ర మొనరించుమని ప్రార్థించుచున్నాడు. సాధారణముగా యౌవనమున అజ్ఞానము, కామ, క్రోధోద్రేకములుండును. తలవెంద్రుకలు నల్లగా నుండును. సాధారణముగా పలితశిరము పండిన తల (నెఱసిన) జ్ఞానమునకు ప్రతీకముగా భావింపబడును. తన తల అజ్ఞాన కామ క్రోధాది దుర్గుణములకు నిలయమైన హృదయమునకు ఆవరణమై స్థూలశరీరమునకు చెందినది కావున అది కూడ అపవిత్రమైనది, అని కవి భావించుచున్నాడు. తలను పవిత్ర మొనరించుట యనగా తల ఉత్తమాంగముగా గలిగిన స్థూల శరీరములో నున్న సూక్ష్మశరీరములో ప్రధానమైన హృదయములోని అజ్ఞానాదుల తొలగించుటయే అని భావింపవలెను. అమ్మవారి శరీరమంతయు చిద్ఘనము, జ్ఞానరూపము కావున పవిత్రము. అట్టి శరీరములోని క్రింది అవయవములైన పాదముల జంటను తన ఉత్తమాంగ మందుంచమని కవి కోరుచున్నాడు. ***'నహి జ్ఞానేన సదృశమ్ పవిత్రమిహ విద్యతే'*** (4.38) అను గీతావచనము ననుసరించి జ్ఞానరూపచరణస్పర్శచే కారణసూక్ష్మశరీరముతో పాటు స్థూలశరీరమును పవిత్రమగును. అనగా జీవబ్రహ్మైక్యజ్ఞానము కలుగును. దానిని చరణ స్పర్శద్వారా కలిగించమని కవి కోరుచున్నాడు. ఇహలోకమున ఆ స్పర్శ క్షణికమైనను శాశ్వతము. పవిత్రమైన బ్రహ్మపదము నందించును. బ్రహ్మ పదమనగా బ్రహ్మత్వమే. దానిని ప్రసాదించమని కోరుచున్నాడు. లేదా సాలోక్యాది చతుర్విధముక్తులు బ్రహ్మ పదములు. భక్తుని కవి లభించిన అమ్మవారి చరణస్పర్శ బహుకాలము లభించుచుండును. ఇహలోకము నందీ

స్పర్శ లభించినచో మరణానంతరము సాలోక్యాది ముక్తులు లభించునని భావము. లేదా భక్తుని తలయే సత్యలోకము. అది సహస్రార నిలయము. గురువు పాద స్పర్శతో (అమ్మవారి చరణస్పర్శ) కుండలిని సహస్రారము చేరుట తంత్రశాస్త్ర ప్రసిద్ధము. **పురహరపురంధ్రీ** అను సమాసమున యమకాలంకార మున్నది. ప్రథమపాదమున **క్వణితఫణిత** అను సమాసమున వృత్త్యనుప్రాసమున్నది. మూడు, నాలుగు పాదముల చివఱ అంత్యనుప్రాస మున్నది. ద్వితీయ, తృతీయ, చతుర్థపాదములలో దాక్షిణాత్యమైన వర్ణమైత్రి ఉన్నది. ఇవి అన్నియు శబ్దాలంకారములు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చరణములు తమఃక్షయ పవిత్రీకరణములకై అర్థింపబడినవి. ఈ శ్లోకమున భంగ్యంతరమున తమోవ్యామోహముల యెడ అమ్మవారి చరణములు ద్రోహమొనర్చుట అర్థింపబడుచున్నది.

**శ్లో॥ భవాని! ద్రుహ్యేతాం భవనిబిడితేభ్యో మమ ముహు-**
**స్తమోవ్యామోహేభ్యస్తవ జనని! కామాక్షి! చరణౌ।**
**యయోర్లాక్షాబిందుస్ఫురణధరణాద్ధూర్జటిజటా-**
**కుటీరా శోణాఙ్కం వహతి వపురేణాఙ్కకలికా॥ 13**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| జనని! | = | తల్లీ, |
| భవాని | = | ఓ కామాక్షీ దేవీ!; |
| యయోః | = | వేనియొక్క; |
| లాక్షాబిన్దుస్ఫురణధరణాద్ | = | లత్తుక బిందువు స్ఫూర్తిని ధరించు; |
| ధూర్జటిజటాకుటీరా | = | శివుని జడల గుడిసెగల; |
| ఏణాంకకలికా | = | చంద్రకల; |
| శోణాంకమ్ | = | ఎఱుపు చిన్నెగల; |
| వపుః | = | శరీరమును; |
| వహతి | = | ధరించునో; |
| తవ | = | నీయొక్క; |
| చరణౌ | = | పాదములు; |
| భవనిబిడితేభ్యః | = | సంసారముతో దట్టమైన; |
| మమ | = | నాయొక్క; |
| తమోవ్యామోహేభ్యః | = | తమోవ్యామోహములకొఱకు; |
| ముహుః | = | మాటి మాటికి; |
| ద్రుహ్యేతామ్ | = | ద్రోహము నొనరించుగాక! |

**తాత్పర్యము :-**

అమ్మవారికి నమస్కరించిన శివుని జడల గుడిసెలో నివసించిన చంద్రకల ఈమె పాదముల లాక్షారాగముతో నెఱ్ఱవాఱినది. ఆ ఎఱ్ఱని పాదములు నా సాంసారిక తమోవ్యామోహముల నడంచుగాక!

**వివరణము :-**

ప్రణయకలహకుపితయైన అమ్మవారి కోపము తగ్గింపజేయుటకు గత్యంతరము లేక శివుడు ఆమె పాదములపై పడినాడు. అప్పుడాయన జడల గుడిసెలో నివసించు చంద్రకల పాదములందలి లత్తుక అంటి ఎఱ్ఱవాఱీ ఉషస్సంగతి గలిగినదనిపించు కాంతిని ధరించినది. పాదముల ఎఱుపు ఉషస్సు వలె ఉన్నది, అని **తమోవ్యామోహ** శబ్దములోని తమశ్శబ్దము వ్యంజించుచున్నది. తమస్సు రాత్రి సంబంధము. ఎఱ్ఱని ఉషస్సు ఉదయించుట రాత్రియొక్క తమస్సు నశించుట గదా! జ్ఞానసూర్యోదయమునకు ముందుదయించునది అమ్మవారి చరణములందలి భక్తి. అది అజ్ఞానరాత్రి గత తమస్సును తొలగించుటలో నుషస్సువలె తోడ్పడునను వస్తుధ్వని ఈ శ్లోకమున ఉన్నది. ప్రథమ, ద్వితీయ, పాదముల యతి స్థానముల దాక్షిణాత్యమైన వర్ణమైత్రి ఉన్నది. తృతీయపాదమున చతుర్థపాదాదిని గల **స్ఫురణధరణా, ధూర్జటిజటాకుటీరా** అను సమాసములలో, శోణాంక, ఏణాంక అను పదములు గల చతుర్థపాదమున వృత్త్యనుప్రాసమను శబ్దాలంకారమున్నది.



**అవ:-** పూర్వ శ్లోకములలో తమోపహరణద్వారమున కవియొక్క పవిత్రీకరణమే అర్థింపబడినది. ఈ శ్లోకమున ఆ పవిత్రీకరణమే పాపప్రశమన ద్వారమున అర్థింపబడుచున్నది.

**శ్లో॥ పవిత్రీకుర్యుర్నః పదతలభువః పాటలరుచః**
**పరాగాస్తే పాపప్రశమనధురీణాః పరశివే!॥**
**కణం లబ్ధుం యేషాం నిజశిరసి కామాక్షి! వివశా**
**వలన్తో వ్యాతన్వన్త్యహమహమికాం మాధవముఖాః॥ 14**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవి! |
| పరశివే! | = | ఓ పరమ కల్యాణ రూపిణీ, |
| మాధవముఖాః | = | విష్ణ్వాదులు; |
| నిజశిరసి | = | తమ తలలందు; |
| యేషామ్ | = | వేనియొక్క; |
| కణమ్ | = | కణమును; |

| | | |
|---|---|---|
| లబ్ధుమ్ | = | పొందుటకు గదా!; |
| వివశాః | = | వివశులై; |
| వలన్తః | = | చలించుచున్నవారై; |
| అహమహమికామ్ | = | నేను నేనను ముందుచొఱవను; |
| ఆతన్వన్తి | = | విస్తరించుకొనుచున్నారో; |
| తే | = | ఆ; |
| పాపప్రశమనధురీణాః | = | పాపములను బాగుగ శమింపజేయుటలో సమర్థములైన; |
| పదతలభువః | = | పాదతలములలో జనించిన; |
| పాటలరుచః | = | ఎఱ్ఱని కాంతులు గల; |
| పరాగాః | = | పరాగములు; |
| నః | = | మమ్ములను; |
| పవిత్రీకుర్యుః | = | పవిత్రీకరించుగాక! |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదపరాగములలోని ఒక కణికను శిరస్సున దాల్చుటకు కదా! మాధవాదులు అహమహమికను చూపెదరు. ఆ ఎఱ్ఱని కాంతిగల పాద తలములలో జనించిన పాపప్రశమనసమర్థములైన పాదపరాగములు మనలను పవిత్రీకరించుగాక!

**వివరణము :-**

పరాగము భూమియందు జనించి అంతరిక్షమున వ్యాపించు చుండును. అమ్మవారి పాదతలము అను భూమి యందు ఈ పాదపరాగము జనించినది. అమ్మవారి పాదతలమే ఈ భూమి లేదా అమ్మవారి పాదములు కమలములు, వానిలోని పుప్పొడి పాదపరాగము. ఆ పరాగ మెఱ్ఱని కాంతి గలది. ఆ పరాగములోని ఒక కణికను తమ తలలో ధరించుటకు విష్ణ్వాదులే పోటీ పడుతున్నారు. అనేక కోటి బ్రహ్మాండములలో మాధవాదులుందురు. వారందఱి తలలలో ధరించుటకు తలకొక పరాగకణమైన లభింపవలె కదా! ఇక పోటీ లేకుండుట ఎట్లు? అది లభింపనిదే జన్మసార్థకము కాదు గదా! మాధవాదులు పుణ్యమూర్తులే. ఎంత పుణ్యమూర్తులైనను ఏ కొంచెమైనను పాపముండక తప్పదు. సత్త్వరజస్తమోగుణములవలన నేర్పడు పుణ్యపాపములలో సత్త్వరజస్తమో గుణప్రకృతికి సంబంధించిన వారిలో నెవ్వరికైనను ఒకటి లేదనుట కుదరదు. అచ్చము సాత్త్వికులుగాని రాజసతామసులుగాని ఉండరు. ఒక గుణమెక్కువ గాని తక్కువ గాని ఉండవచ్చును. ఆ గుణములలో ఒకటి పూర్తిగా లేకుండుట జరగదు. ఆ అల్పమైన పాపమును పోగొట్టుకొనుటకొఱకే అనగా తమను పవిత్రీకరించుకొనుట కొఱకే మాధవాదులు తహతహ పడుచుండగా పాపాధిక్యము గల మానవుల లెక్కయేమి? మాధవాదులు పోటీపడుచుండ మానవులమైన మనము పోటీ పడగలమా? పోటీ పడలేము.

కాని అమ్మ పుణ్యులైన ఆ మాధవాదుల మీద కన్న మనయందే అధిక ప్రేమ కలదై మనవైపే నడచి వచ్చును. తప్పక ఆ పాదపరాగములలో ఒక కణమైనను మనకు లభించి పవిత్రతను తప్పక సమకూర్చుగలదు. ఈ అర్థమంతయు **'యః నః, కణమ్, పాపప్రశమనధురీణః'** అను పదముల అర్థములందలి వ్యంజనాశక్తి వలన లభించుచున్నది. పరాగములు భూరూపమైన పాదతలమున జనించునవి. కావున భూమియందు పుట్టిన మానవులమైన మనపైన పతించు(పడు) పక్షపాతము వహింపగలవు. ఈ అర్థము **'పదతలభువః'** అను సమాసమునందు భూ శబ్ద శక్తిచే ధ్వనించు చున్నది. మానవుల వైపు అనగా భూతలమునకు బయలుదేరు పాదముల గతిని గమనించిన మాధవాదులు శీఘ్రగతిని భూలోకమునకు వచ్చి కాంచీనగరపరిసరభూములలో పొరలాడుచున్నారు. ఈ యర్థం **ఆతన్వన్తి** అను క్రియ వ్యంజించుచున్నది. అమ్మవారు మందగమన కావున మనమే ముందు భూమికి చేరుకొనగలమను భావముతో వారట్లు పొరలాడుచున్నారు. సహజముగా భూలోకమున నివసించు మనపై ఆ పొరలాడు నవసరము లేకయే ముందున్న మనపై పడి మనలను ముందుగా పవిత్రులనొనరించుచున్న వా పాదపరాగములు. ఈ యర్థమును **'వలన్తః'** అను శబ్దము సూచించుచున్నది. మాధవాదులు మణిద్వీపమునకు బోయి అమ్మవారి చరణరజ మందుకొనగలరు. మన మా పని చేయలేము గదా. అందుకొఱకు మన మీద పక్షపాతము వహించి కాంచీభూమిపై కామాక్షి అవతరించినది. ఈ అర్థము **పదతలభూ**శబ్ద శక్తిచేతనే లభించుచున్నది. అల్ప పాపుల నుద్ధరించుట యను కర్మ నలవోకగా చరణము లొనర్పగలవు. అధికపాపులమైన మనల నుద్ధరించుట యను కర్మ నలవోకగా చరణము లొనర్పగలవు. అధికపాపులమైన మనల నుద్ధరించుట నొక ఘన కార్యముగా స్వీకరించి కామాక్షీదేవి భూమిపై నవతరించి మనకు పాదపరాగముల ననుగ్రహించినది. ఈ అర్థము **పాపప్రశమనధురీణ** అను సమాసములోని **ధురీణ** శబ్దము వ్యంజించుచున్నది. ధురీణులు కాని వారల్ప కార్యములనే యొనరించెదరు గదా! ఒక కణము లభించుటకే మాధవాదులు పొరలాడవలసి వచ్చినది. మనకా అవసరము లేదు. కావున భూమిపై జనించిన చాలును. ఈ అర్థము పరాగ శబ్దములోని బహువచనమువలన స్ఫురించుచున్నది.



**అవ:-** పై శ్లోకమున మాధవాది పురుషదేవత లమ్మవారికి నమించుట చెప్పబడినది. ఈ శ్లోకమున **స్త్రీ దేవతల నమనము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ బలాకామాలాభిర్నఖరుచిమయీభిః పరివృతే**
**వినమ్రస్వర్నారీవికచకచకాలామ్బుదకులే।**
**స్ఫురన్తః కామాక్షి! స్ఫుటదలితబన్ధూకసుహృద-**
**స్తటిల్లేఖాయన్తే తవ చరణపాథోజకిరణాః॥ 15**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| నఖరుచిమయీభిః | = | గోళ్ళ కాంతులు అనెడి; |
| బలాకామాలాభిః | = | కొంగల గుంపులచేత; |
| పరివృతే | = | చుట్టబడిన; |
| వినమ్రస్వర్నారీవికచకచ కాలామ్బుదకులే | = | నమస్కరించినదేవతా స్త్రీల విరిసిన కురులనెడి మేఘముల సమూహమున; |
| స్ఫురన్తః | = | ప్రకాశించుచున్న; |
| స్ఫుటదలితబన్ధూకసుహృదః | = | బాగుగా వికసించిన మంకెన పూలకు మిత్రములైన; |
| తవ | = | నీయొక్క; |
| చరణపాథోజకిరణాః | = | పాదముల కాంతులు; |
| తటిల్లేఖాయన్తే | = | మెఱపు తీగలగుచున్నవి. |

**తాత్పర్యము :-**

అమ్మవారి కాళ్ళగోళ్ళ కాంతులు కొంగలవలె తెల్లగా నున్నవి. అవి నమస్కరించిన దేవతా స్త్రీల విరిసిన కురులనెడి కాలమేఘముల చుట్టియున్నవి. బాగుగా వికసించిన మంకెనపూలకు మిత్రములైన అమ్మవారి పాదకమల కాంతులు ఆ మేఘములలో మెఱపులవలె నొప్పుచున్నవి.

**వివరణము :-**

మొదటి మూడు పాదములు అవయవ రూపకములు. నాలుగవ పాదము నందు లుప్తోపమకు సమానధర్మము చేకూర్చుచు ఉపమ ననుప్రాణించుటచే నీ శ్లోకమున రూపకానుప్రాణితలుప్తోపమాలంకార మొప్పుచున్నది. ద్వితీయ, తృతీయ, చతుర్థ పాదములలో దాక్షిణాత్యమైన వర్ణమైత్రి యున్నది. ఇది శబ్దాలంకారము. **వికచకచ** అను పదములలో ఛేకానుప్రాసమనుశబ్దాలంకారమున్నది. ***'స్ఫుటదలితబన్ధూకసుహృదః'*** అను సమాసమున ఔపమ్యస్ఫూర్తి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చరణకమలములందు బంధూకపుష్పముల రాగమున్నట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున రాగముతో పాటు ద్వేషమున్నట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ సరాగః సద్వేషః ప్రసృమరసరోజే ప్రతిదినం**
**నిసర్గాదాక్రామన్విబుధజనమూర్ధానమధికమ్।**
**కథఙ్కారం మాతః! కథయ పదపద్మస్తవ సతాం**
**నతానాం కామాక్షి! ప్రకటయతి కైవల్యసరణిమ్॥ 16**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |
| మాతః | = | అమ్మా! |
| ప్రతిదినమ్ | = | ప్రతిదినము; |
| సరాగః | = | ఎఱుపుగల; |
| ప్రస్మృమరసరోజే | = | వికసించిన పద్మములయెడ; |
| సద్వేషః | = | వైరము వహించి; |
| అధికమ్ | = | అధికముగా; |
| నిసర్గాత్ | = | స్వాభావికముగా; |
| విబుధజనమూర్ధానమ్ | = | విద్వజ్జన శిరస్సును; |
| ఆక్రామన్ | = | ఆక్రమించుచున్న; |
| తవ | = | నీయొక్క; |
| పదపద్మః | = | పాదపద్మము; |
| నతానామ్ | = | నమస్కరించిన; |
| సతామ్ | = | సత్పురుషులయొక్క; |
| కైవల్యసరణిమ్ | = | కైవల్యమార్గమును; |
| కథంకారమ్ | = | ఎట్లు; |
| ప్రకటయతి | = | తెలుపుచున్నదో! |

**తాత్పర్యము :-**

జ్ఞానుల శిరస్సు నెక్కు నెఱ్ఱని నీ పాదపద్మము కమలముతో ద్వేషము కలిగియున్నది. అది నమస్కరించిన సత్పురుషులకు కైవల్యమార్గమునెట్లు తెలుపునో చెప్పుమమ్మా, ఓ కామాక్షీదేవీ!

**వివరణము :-**

తనకు సుఖమును కలిగించు వ్యక్తుల యందుండు ప్రేమ **రాగ** మనబడును. తనకు క్లేశమును కలిగించు వ్యక్తుల యందుండు విముఖత లేక ప్రాతికూల్యము ద్వేష మనబడును. సంసారులలో చాలామందికి రాగద్వేషము లుండును. మోక్షాపేక్షులైన సాధుజనులు రాగద్వేషములు వీడి యుందురు. అమ్మవారి పాదకమలము సహజముగానే ఎఱ్ఱనిది కావున ఒకరియందు ప్రత్యేకమైన ప్రేమ అనగా రాగము గలది కాదు. ద్వేషమసలే లేనిది. కాని సాదృశ్యనిమిత్తముగా కమలమందు ద్వేషము కలదని కవి చెప్పినాడు. ద్వేషమున్నచో రాగమున్నట్లే. కావున అమ్మవారి పాదకమలములందు లేని రాగద్వేషము లున్నట్లు చెప్పబడినది. రాగద్వేషములు, సుఖదుఃఖములు, మానావమానములు, ఈ మొదలగునవి ద్వంద్వములు. పాదకమలములు రెండు కావున వానియందు ద్వంద్వభావమున్నదని చెప్పుటలో విప్రతిపత్తి లేదు. ఈ ద్వంద్వము రాగద్వేష రూపమని

కవి చెప్పుచున్నాడు. అందుకే **సరాగ స్సద్వేషః** అని పాదపద్మము విశేషింపజేయబడినది. రాగద్వేషాది ద్వంద్వములున్న వారికి కైవల్యము లభింపదు. వారికి కైవల్యమార్గము చూపగల శక్తి ఉండునేమో? అను ప్రశ్నమునకు గాని, సందేహమునకు గాని ఆస్కారమే లేదు. అయినచో పాదద్వంద్వమెట్లు, ద్వంద్వదూరమైన కైవల్యమార్గము నెట్లు ప్రకటించునో చెప్పుమని అమ్మవారిని కవి అడుగుచున్నాడు. ద్వంద్వభావములులేని వానికే కైవల్యమార్గము తెలియును. వాడే గురుస్థానముననుండి అర్హులైన శిష్యులకు మార్గము నుపదేశింపగలడు గదా! అదికాక కైవల్యమార్గము నభిలషించు సాధకుడే విద్వాంసుల పట్ల వినయము చూపవలసినవాడై యుండగా అమ్మవారి పాదపద్మములు విద్వజ్జనమూర్ధమున కెక్కినవి. ఇది విద్వజ్జనముల పట్ల అపచారము గదా, అట్టి పాదపద్మమున కెట్లు కైవల్యమార్గ ప్రవేశముండును. అట్లు ఉండుటయు విరోధమే. విరోధములు ధ్వనించుటచే ఈ శ్లోకమున విరోధాభాసాలంకారస్ఫూర్తి ఉన్నది. ఇచట విరోధము ఆభాసము మాత్రమే. వాస్తవము కాదు. అమ్మవారి పాదపద్మములు గురుపాద పద్మ రూపములు. వాని స్పర్శ కుండలినీ ప్రబోధ తత్ సహస్రార ప్రవేశ రూపకైవల్య మార్గమున సాధకునగ్రగామిగా చేయునట్టివే. అమ్మవారే గురువు అని భావనోపనిషత్తు తెలుపుచున్నది. సాధకుడు గురువునకు అమ్మవారికిని బేధము భావింపరాదు. దర్శింపరాదు. అట్లు చేయుట సాధకుని భ్రష్టతకు హేతువగును. విద్వజ్జనముల మూర్ధములందు (సహస్రారములందు) మాత్రమే గురు (అంబా) పాదపాదుకా ధారణాదులు సంభవించును. పాదపద్మమని కవి పాదద్వయము నేక వచనమున చెప్పుట అది ద్వంద్వరహితకైవల్య రూపమని చెప్పుటకే అని సూక్ష్మదృష్టితో గ్రహింపవలెను. విరోధము ప్రపంచలక్షణము. పరమాత్మ ప్రపంచము (విరోధము) యొక్క ఉపశమనమే లక్షణముగా గలదని ఈ విరోధాభాసాలంకారము వ్యంజించుచున్నది. అన్ని విరోధములు కైవల్యప్రాప్తిలో సమన్వయరూపమున ద్వంద్వభావమును వీడి లయించును. కైవల్యప్రాప్తియే బ్రహ్మత్వము. బ్రహ్మము సర్వ విరోధ (ప్రపంచ)ము యొక్క ఉపశమ రూపమని మాండూక్యోపనిషత్తు చెప్పినది. మూర్ధ (సహస్రార)ము నాక్రమించుట అమ్మవారి చరణములకు నిసర్గమే. అనగా స్వాభావికమే. స్వభావసిద్ధమే. **నిసర్గ** పదమీ యర్థమును స్ఫురింపజేయుచున్నది. అమ్మవారు అర్ధనారీశ్వరి, ఈశ్వరాభిన్న యగుటచే ఆమె ఎడమ పాదమే యెఱ్ఱనిది. కుడిపాదము తెల్లనిది. ఈ అర్థము ననుసరించి పాదపద్మమని ఏకవచనమున ప్రయోగించు టుచితముగానే యున్నది. ఏకవచనమున పాదపద్మమని ప్రయోగించిన అన్నిచోట్ల ఈ యర్థమును భావించుట సహృదయుల కుచితము. కథంకారమ్మాతః కథయ అను యతి స్థానమున వర్ణమైత్రి దాక్షిణాత్యసంప్రదాయము ననుసరించి కూర్పబడినది.



**అవ:–** మనుష్యునకు శిఖరము వంటి మూర్ధము నాక్రమించుట అమ్మవారి చరణ కర్మగా పూర్వ శ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున మనస్సును పూర్వాద్రి యొక్క (శిఖర) ముఖమున (మూర్ధ భాగమున) అమ్మ పాదమను సూర్యుడు తిలకమగు కర్మము నాచరింప గోరబడుచున్నాడు.

శ్లో॥ జపాలక్ష్మీశోణో జనితపరమజ్ఞానలహరీ-
వికాసవ్యాసఙ్గో విఫలితజగజ్జాడ్యగరిమా।
మనఃపూర్వాద్రిమ్మే తిలకయతు కామాక్షి! తరసా
తమస్కాణ్డద్రోహీ తవ చరణపాథోజరమణః॥ 17

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| జపాలక్ష్మీశోణః | = | దాసాని పూవు కాంతివలె ఎఱ్ఱనైనన; |
| జనితపరమజ్ఞానలహరీ వికాసవ్యాసంగః | = | పుట్టిన గొప్ప జ్ఞానప్రవాహ వికాస సంబంధము గల; |
| విఫలితజగజ్జాడ్యగరిమా | = | విఫల మొనర్చిన జగము యొక్క జాడ్యము యొక్క గొప్పతనము గల; |
| తమస్కాండద్రోహీ | = | చీకట్ల సమూహమునకు ద్రోహమొనర్చు; |
| తవ | = | నీయొక్క; |
| చరణపాథోజరమణః | = | పాదసూర్యుడు; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ!; |
| మే | = | నాయొక్క; |
| మనఃపూర్వాద్రిమ్ | = | మనస్సనెడు తూర్పుకొండకు; |
| తరసా | = | శీఘ్రముగా; |
| తిలకయతు | = | తిలకమగుగాక! |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదకమలము ఎఱ్ఱనిది. సూర్యుడెఱ్ఱనివాడు. ఆ ఎఱుపు దాసాని పూవు కాంతి వంటిది. అమ్మవారి పాదము గొప్ప జ్ఞానమును వికసింప జేయును. సూర్యుడు తామర తీగను వికసింపజేయును. కావున జ్ఞానమునకు నలినికి విషయ విషయి భావము తీర్చబడినది. జ్ఞానము కైవల్యరూపమున పుష్పించును. నలిని కమలమును పూయును. కావున జ్ఞానకమలినుల ఔపమ్యము మూలముగా పై విషయ విషయి భావము కూర్చబడినది. అమ్మవారి పాదమున జాడ్యమును అనగా అజ్ఞానము సంసారఫలకము గాకుండ విఫలింపజేయును. సూర్యుడు సోమరితనమున కలుగవలసిన దోషములు పుట్టకుండ జేయును. అనగా సోమరితనమును విఫలింపజేయును. చివఱకు సూర్యుడెట్లు పూర్వాద్రికి తిలకమగునో అట్లే కవి మనస్సున అమ్మవారి పాదము తిలకమగు గాక అని కవి ప్రార్థించుచున్నాడు.

**వివరణము :-**

పూర్వాద్రి సూర్యునితో శోభించునట్లు నా మనస్సు అమ్మవారి పాదకమలముతో శోభించును. కావున కవి పూర్వాద్రి సూర్యుల రూపణమును స్వమనోజగదంబా పాదముల యందొనర్చి రూపకాలంకారముతో నీ శ్లోకము నలంకరించినాడు. ప్రథమ, ద్వితీయ

చతుర్థ పాదముల యతి స్థానములలో వర్ణమైత్రులును కూర్చబడినవి. తిలకము ముఖశోభను పెంచుట ద్వారా ధరించిన వ్యక్తిని శోభింపజేయును. అట్లే పూర్వాద్రి శిఖరమున నుదయించిన సూర్యుడు మొత్తము పూర్వాద్రిని శోభింపజేయును. అవయవాలంకారము అవయవముతో పాటు అవయవికిని శోభను కూర్చును. ఈ యర్థమును **తిలక** శబ్దము సూచించును. సూర్యుడు కమలములకు భర్త. తామరతీగను జెప్పు కమలినీ నలిన్యాది శబ్దములు స్త్రీ లింగములు కావున సూర్యునకు తద్భర్తృత్వమే సముచితము. కవులు నపుంసకలింగములైన కమలములందు సైతము స్త్రీత్వమును దర్శించి తద్భర్తృత్వమును సూర్యునందు వర్ణించెదరు. కమలము కమలినికిని అవయవము. కమలవికాసము ద్వారా అవయవియైన కమలినికిని వికాసమును కలిగించును. ఇచట అవయవము నందు సంక్రమింప జేయబడినది. మనస్సు తమోనిలయము. ఆ తమస్సును తొలగించునది అమ్మవారి పాదము. సాధారణ సూర్యుడు తమస్సును పోగొట్టును. కాని మనస్సులోని చీకట్లను పోగొట్టజాలడు. అందుకొఱకు అమ్మవారి పాదమే సూర్యకృత్యమును నిర్వహింపవలెను. సూర్యుడు ప్రాణుల సోమరితనమును తొలగించగలడే గాని జగములందలి జాడ్యమును అనగా అజ్ఞానమును తొలగింపజాలడు. దానికొఱకు అమ్మవారి పాదమే పూనుకొనవలెను. సూర్యుడు కమలినీ వికాసము నొనరింపగలడు. కాని జ్ఞానసుమమును వికసింపజేయ జాలడు. దానికొఱకు అమ్మవారి పాదమే పూనుకొనవలెను. అమ్మవారి పాదము, సూర్యుడు అను రెండు ప్రకాశముల యొక్క వైధర్మ్యము కూడ నీ శ్లోకమున వ్యంగ్యమగుచున్నది. జ్ఞాన కమలినుల రూపణమున లింగ భేద దోషమున్నది. అది అకించిత్కరమే సూర్యుడు స్వయంప్రకాశుడని చెప్పబడుచున్నను జ్ఞానరూపమగు అమ్మవారి పాదముయొక్క దృష్టిలో పర ప్రకాశ్యమే. జ్ఞానరూపమైన అమ్మవారి పాదము యథార్థముగా స్వయంప్రకాశము. సూర్యుని ప్రకాశము తొలగింపలేని తమస్సుండ వచ్చును. కాని అమ్మవారి పాదము తొలగింపలేని తమస్సు లేదు. కావున సంపూర్ణ తమస్కాండద్రోహిత్వము అమ్మవారి పాదముననే కుదురును.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదమున **సూర్యారోపము** చేయబడినది. ఈ శ్లోకమున దాని ఎఱుపునందు ***బడబాగ్ని జ్వాలావితర్కము*** చేయబడుచున్నది.

**శ్లో॥ నమస్కుర్మః ప్రేఙ్ఖన్మణికటకనీలోపలమహః-**
**పయోధౌ రిఙ్ఖద్భిర్నఖకిరణఫేనైర్ధవలితే।**
**స్ఫుటం కుర్వాణాయ ప్రబలచలదౌర్వానలశిఖా-**
**వితర్కం కామాక్ష్యాస్సతతమరుణిమ్నే చరణయోః॥ 18**

**ప్రతిపదార్థము :-**

ప్రేంఖన్మణికటకనీలోపల = ధ్వనించు రత్నాల కడియములలోని ఇంద్రనీల

మహః పయోధౌ  మణులకాంతి సముద్రమునందు;
రింఖద్భిః = తిరుగుచున్న;
నఖకిరణఫేనైః = గోళ్ళ కాంతులనెడి నురుగులచేత;
ధవలితే = తెల్లబడిన;
స్ఫుటమ్ = స్పష్టముగా;
ప్రబలచలదౌర్వానలశిఖా వితర్కమ్ = ప్రబలమైన చలించు బడబాగ్నిజ్వాలయను ఊహను;
కామాక్ష్యాః = కామాక్షిదేవియొక్క;
కుర్వాణాయ = చేయుచున్న;
చరణయోః = పాదములయొక్క;
అరుణిమ్నే = ఎఱుపుకొఱకు;
సతతమ్ = ఎల్లప్పుడు;
నమస్కుర్మః = నమస్కరించుచున్నాము.

**తాత్పర్యము :-**

అమ్మవారి కాలి అందెలలో ఇంద్రనీలమణు లున్నవి. వాని కాంతి సముద్రమే. గోళ్ళకాంతి అను నురుగులతో ఆ సముద్రము తెల్లబడినది. ఆ సముద్రమున బడబాగ్నియా యనిపించు అమ్మవారి పాదముల ఎఱుపున్నది. దానికి నమస్కరించుచున్నాము.

**వివరణము :-**

అమ్మవారి కాలిఅందెలకాంతి యందు నీలసముద్రారోపము, నఖకాంతి యందు ఫేనారోపము చేయబడినది. అవి అమ్మవారి చరణారుణిమ యందు బడబాగ్నిశిఖావితర్కము (భావనము) కలుగుటకు తోడ్పడుచున్నందున ఈ శ్లోకమున రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకార మొప్పుచున్నది. అగ్ని వైద్యుతాగ్ని, జఠరాగ్ని, బడబాగ్ని, మొదలైన ప్రకారములు కలిగియున్నది. సముద్రము నందుండు అగ్నికి ***బడబాగ్ని*** అని పేరు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చరణారుణిమ తమోనివారకమైన అగ్నియొక్క ఒక ప్రకారమైన ***బడబాగ్నియొక్క జ్వాల***గా వితర్కింపబడినది. ఈ శ్లోకమున ఆమె పాదములు తమఃకూపకుహరమున **సూర్యరూపము**గా పోల్చబడినవి.

**శ్లో॥ శివే పాశాయేతామలఘుని తమఃకూపకుహరే**
**దినాధీశాయేతాం మమ హృదయపాథోజవిపినే।**
**నభోమాసాయేతాం సరసకవితారీతిసరితి**
**త్వదీయౌ కామాక్షి! ప్రసృతకిరణౌ దేవి! చరణౌ॥** 19

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| కామాక్షి! దేవి! | = | ఓ కామాక్షీదేవీ! |
| ప్రసృతకిరణౌ | = | ప్రసరింపబడిన కిరణములు గల; |
| త్వదీయౌ | = | నీకు సంబంధించిన; |
| చరణౌ | = | పాదములు; |
| శివే | = | శివునియందు; |
| పాశాయేతామ్ | = | పాశములగుగాక; |
| అలఘుని | = | గొప్పదైన; |
| తమఃకూపకుహరే | = | చీకటి బావి బొందయందు; |
| హృదయపాథోజవిపినే | = | హృదయమనెడి కమల వనమునందు; |
| దినాధీశాయేతామ్ | = | సూర్యత్వమునందు గాక; |
| సరసకవితారీతిసరితి | = | సరస కవితారీతి యనెడి నదియందు; |
| నభోమాసాయేతామ్ | = | శ్రావణమాసమగుగాక! |

**తాత్పర్యము :-**

అమ్మా కామాక్షీదేవీ! నీ పాదములు నాలోని శివుని కట్టివేయు పాశము లగుగాక! చీకటి బావిబొందలో నా హృదయమనెడి కమలవనమున సూర్య రూపములై వికసింపజేసి వెలుగుల నింపుగాక! నా కవితారీతియనెడి నదికి శ్రావణమాసరూపములై వరదలను తెచ్చుగాక!

**వివరణము :-**

1) వల్లకాడులలో తిరుగు శివుడొక చోట నుండడు. ఆతనిని కట్టి పడవైచి ఒకచోట నిలుపుటకు సాధనములే లేవు. నేటికి అమ్మవారి పాదములు లభించినవి. అవి నాలో శివుని కట్టివేయుటకు పాశములగు గాక! నా యజ్ఞానము చాలా పెద్ద చీకటి బావిలోని లోతైన గుహ. దానిలో నా హృదయ కమల వనము ముడుచుకొనియున్నది. ఆ గుహలోని చీకట్లు తొలగించి ఆ కమల వనమును వికసింపజేయుటకు అమ్మవారి పాదములు సూర్యరూపములగు గాక! నాలో కవితారీతి అను నది ప్రవహించుచున్నది. అది దాదాపు ఎండిపోయి యున్నది. అమ్మవారి పాదములు దానికి వరదలు తెచ్చు శ్రావణ మాసములగు గాక! అను నీ అర్థ మీ శ్లోకమున స్ఫురించుచున్నది. **పాశాయేతామ్, దినాధీశాయేతామ్, నభోమాసాయేతామ్** అను ఆచారార్థక ప్రత్యయాంత క్రియల ప్రయోగించుటచే నీ శ్లోకమున మూడు ఉపమాలంకారము లొప్పుచున్నవి. కావున ఈ శ్లోకమున మాలోపమాలంకారమున్నది.

2) నా కజ్ఞానమున్నది. అది యొక పెద్ద తమస్సు. అది బావివలె లోతైనది.

అందు నీరు లేదు. కావున అది యొక లోతైన గుహగా నేర్పడినది. నాకజ్ఞాన మున్నదనియే నేనంగీకరింపను. కారణమేమనగా ఆ చీకటిబావిలో హృదయమను కమలవనమును చూచుచున్నాను. నిద్రించినప్పుడు అది చూడలేకపోవుచున్నాను. కలగనినట్లు దానిని చూచుచున్నానేమో. ఆ కమలవనము సత్యమో అసత్యమో ఎఱుగను. దాని నట్లు చూచు హృదయ మెక్కడ నుండి వచ్చెనో నేనెఱుగను. అది యెట్లు ఏల ఆ వనమును కల్పించుకొనెనో ఎఱుగను. అప్పుడప్పుడు ఆ వనము కన్పించు స్వప్నావస్థకు, వనము కన్పించని నిద్రావస్థకు, నేను జాగ్రదావస్థలో నున్నప్పుడు వానికి సాక్షినై యున్నాననుకొను చుందును. కాని ఆ సాక్షి శివుడని ఎఱుగను. నీ చరణములు కనిపించి కనిపించక తప్పించుకొని పాఱిపోవు ఆ శివుడే ఆ నిద్రావస్థను, ఆ స్వప్నావస్థను, జాగ్రదావస్థలో జ్ఞప్తికి తెచ్చుచున్నాడు. వానిలోని కొంతభాగమును మఱిపింపజేయు చున్నాడు. కాని వాడు ఆ అవస్థల కవతలనున్నాడు. వానిని తీసికొని వచ్చి నీ చరణములో నా జీవభావము నందు కట్టి పడివేయవలెనని కోరుచున్నాను. ఈ వస్తువంతయు వ్యంగ్యమగుటచే నీ శ్లోకమున **వస్తుధ్వని** ఉన్నది. పైన జెప్పిన విధముగ స్వప్నావస్థ వంటి కాల్పనిక జగమొకటి యున్నది. అచట స్వప్నావస్థయందు వలె మనస్సొకటే పనిచేయును. మిగిలిన చక్షురింద్రియములు పనిచేయవు కావున ఆ కాల్పనిక జగద్దర్శనము స్వప్నదర్శనమే. శ్లేష్మాగారమైన స్త్రీ ముఖము కమల మనిపించుట్లు ఆమె మాంసపిండములైన స్తనములు, కనకకమలము లనిపించుట ఈ కాల్పనా జగద్దర్శనములు. ఇది నన్ను సరస కవితారీతిలో ఇతరులకును ఆ దర్శనము కలిగింపజేయు మహాకవినను కీర్తి నాకు కలిగించుచున్నది. నా కా కీర్తియం దధికమైన వాంఛ కలదు. ఇంకను ఆ కీర్తి పెఱగవలెనన్న ఈ ప్రకృతి మొత్తమును దేవీ రూపముగా దర్శింపజేయు వెల్లువ యొకటి వచ్చి ప్రాకృతికకాంతావర్ణాదు లందు వైముఖ్యము కలిగించి అనగా కూకటివేళ్ళతో సామాన్యకాంతగా దర్శింపజేయు కాల్పనిక జగద్దర్శన కంటక వృక్షములను పెళ్ళగించి కాల్పనిక మైనను స్వచ్ఛమైన దేవీ దర్శనమను వఱద నన్ను ముంచెత్తున ట్లొనరింపుము అని కవితారీతిలో గల 'సరస' అను విశేషణము వ్యంజించుచున్నది. కాంతాముఖ కమలభావనారూపకవిత నిస్సారమని, ప్రకృతిభాగములందు దేవ్యవయభావనారూప కవిత సరస మని గమనింపవలెను. **'శివే'** అను పదమును సంబోధనముగనే భావించి తమఃకూపము నుండి జీవుల నుద్ధరించు పాశముల వంటివి అమ్మవారి పాదము లను నర్థమును కూడ చెప్పవచ్చును.



**అవ : –** పై శ్లోకమున శివుని **పాశబంధము** ప్రార్థింపబడినది. ఈ శ్లోకమున ***పాశబంధమునుండి*** విడువబడిన ముక్తుల కమ్మవారి చరణ మాశ్రయమని చెప్పబడుచున్నది.

శ్లో॥ నిషక్తం శ్రుత్యన్తే నయనమివ సద్వృత్తరుచిరైః
సమైర్జుష్టం శుద్ధైరధరమివ రమ్యైర్ద్విజగణైః।
శివే వక్షోజన్మద్వితయమివ ముక్తాశ్రితముమే
త్వదీయం కామాక్షి! ప్రణతశరణం నౌమి చరణమ్॥ 20

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| శ్రుత్యంతే | = | శ్రుతియొక్క అంతమున; |
| నయనమ్ ఇవ | = | కంటివలె; |
| నిషక్తమ్ | = | ఆసక్తమైన; |
| సద్వృత్తరుచిరైః | = | మంచి వృత్తముతో మెఱసిన; |
| సమైః | = | సమానములైన; |
| శుద్ధైః | = | స్వచ్ఛములైన; |
| రమ్యైః | = | అందములైన; |
| ద్విజగణైః | = | ద్విజ సమూహములచేత; |
| అధరమ్ ఇవ | = | పెదవివలె; |
| జుష్టమ్ | = | కూడినది; |
| వక్షోజన్మద్వితయమ్ ఇవ | = | స్తనద్వయమువలె; |
| ముక్తాశ్రితమ్ | = | ముక్తాశ్రయమైనది; |
| శివే | = | ఓ మంగళ స్వరూపురాలా!; |
| ఉమే | = | ఓంకార స్వరూపురాలా; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| ప్రణతశరణమ్ | = | నమస్కరించిన వారికి దిక్కైన; |
| త్వదీయమ్ | = | నీయొక్క; |
| చరణమ్ | = | పాదమును గూర్చి; |
| నౌమి | = | నమస్కరించుచున్నాను. |

**తాత్పర్యము :-**

నీ కన్నువలె నీ పాదము శ్రుత్యంతమున ఆసక్తమైనది. సద్వృత్తముతో ప్రకాశించు సమత్వము గల శుద్ధములైన ద్విజగణములతో నీ పెదవివలెనే నీ పాదము కూడియున్నది. నీ పాదము నీ స్తనద్వయమువలెనే ముక్తాశ్రయమై యున్నది. నమస్కరించు వారికి శరణమైన నీ చరణమునకు మ్రొక్కుచున్నాను.

**వివరణము :-**

ఈ శ్లోకమున శ్లేషబలమున నయనాధరవక్షోజన్మ ద్వితయముతో అమ్మవారి చరణమున ఔపమ్యము సాధింపబడినది. శ్లేషమనగా ఒక శబ్దము నుండి రెండర్థములు

వచ్చుట. అట్లు వచ్చిన రెండర్థములు ఏకరూపములై సమాన ధర్మభావమునందుట శ్లేషోపమాలంకారములోని విశిష్టత. అమ్మవారి చరణము ఉపమేయము. అది శ్రుత్యంత నిషక్తము. శ్రుతి అనగా వేదము. శ్రుత్యంత మనగా వేదాంతము. అనగా ఉపనిషత్తు. దాని యందాసక్తి గలది. అనగా వేదాంతవాక్యములతో స్తుతింపబడునది. వాని యందాసక్తి గలది. అమ్మవారి నయనము ఉపమానము. అది శ్రుత్యంత నిషక్తము. శ్రుతి అనగా చెవి. దాని చివఱ శ్రుత్యంతము. దాని చివఱను దాకి యుండునది కావున నయనము కూడ శ్రుత్యంత నిషక్తమే. శ్రుత్యంతనిషక్తత్వ ముభయ సాధారణ ధర్మము. అట్లే అమ్మవారి చరణము ద్విజగుణజుష్టము. ద్విజులనగా బ్రహ్మణులు. వారి గుంపులు ద్విజగణములు. ద్విజగణములతో కూడినదై ద్విజగుణ జుష్టమైనది. ఆ ద్విజగుణములు సద్వృత్తరుచిరములు అనగా మంచిశీలముతో నొప్పునవి. మరియు సమభావము కలిగినట్టివి. మరియు స్వచ్ఛములైనవి. అనగా దోషరహితములు మరియు రమ్యములైనవి. అమ్మవారి అధరము ద్విజగుణ జుష్టము. ద్విజములనగా దంతములు. వాని గణములు. దంతముల వరుసలు వానితో గూడినది. ఆ దంతముల వరుసలు (ద్విజగణములు) సద్వృత్త రుచిరములు. అనగా చక్కగా నున్నట్టివి. మరియు అవి సమములు. ఎగుడు దిగుడుగా లేక సమములుగా నున్నవి. అనగా సమానములుగా నున్నవి. మఱియు ఆ దంతములు స్వచ్ఛముగా రమ్యముగా నున్నవి. సద్వృత్త రుచిరత్వ సమత్వ శుద్ధత్వ రమ్యత్వములు బ్రాహ్మణగణములకు, దంతములవరుసలకు సమానముగా నున్న ధర్మములు. కావున అధరముతోడి ఔపమ్యము ఆ ధర్మములే సమానముగా గల చరణమున కేర్పడినది. అమ్మవారి చరణము ముక్తులచే ఆశ్రయింపబడినది. కావున ముక్తాశ్రితము. అట్లే అమ్మవారి వక్షోజన్మ ద్వయము ముక్తములచే అనగా ముత్తెములచే ఆశ్రితము. అనగా ముత్యాలహారముతో కూడినది. అమ్మవారి వక్షోజన్మద్వయము ముక్తాశ్రితత్వమను ధర్మము గలది. అట్టిది కావున అట్టి ధర్మమే కలిగిన చరణమునకు సమానమైనది. ముక్తాశ్రితత్వమను సమానధర్మముతో వక్షోజన్మ చరణముల కౌపమ్యము సిద్ధించినది. అమ్మవారి చరణముల కుపమానముగా గల శక్తి కమలములు మొదలగు వానికి లేదు. అవి అనిత్యములు, జడములు, చిద్ఘనములైన అమ్మవారి అవయవములైన చరణములకు చిద్ఘనములైన అమ్మవారి అవయవములైన నయనాధర స్తనద్వయములకే ఉపమానత్వమును కవి చెప్పినాడు. ఈ అలంకార కల్పనలో అర్థమిదియే. చిద్ఘనములైన అమ్మవారి చరణమే ప్రణత శరణము అనగా నమస్కరించిన వారికి దిక్కై కాపాడునది. కావున ఆ అమ్మవారి చరణము నమస్కరింపదగినది. శరణాగతి చేయదగినది. ఉపనిషద్వాక్యములచే స్తుతింపదగినది. ఉత్తమశీలము దోషరాహిత్యము గల బ్రాహ్మణుల కాపాదము చేరదగినది. చివఱకు జీవులకు ముక్తి లభించిన పిమ్మటను అవియే ఆశ్రయింపదగినవి. సాలోక్యాది ముక్తుల నొందిన వారి కమ్మవారి చరణము ఆశ్రయముగానే ఉండును. ఆ చరణము నాశ్రయించిన వారి కమ్మవారు కైవల్య ముక్తిని అనగా జీవబ్రహ్మైకత్వమును ప్రసాదించును.

అనగా జీవులకు స్వస్వరూప బ్రహ్మత్వమునే ఇచ్చును. ఈ యర్థమీ యలంకారము చేత వ్యంగ్యమగును.



**అవ:-** పై శ్లోకమున చరణము ప్రణతశరణ మగుటచే నమస్కరింపదగినదని చెప్పబడినది. ఈ శ్లోకమున శచీదేవి యొక్క నమస్కరించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ నమస్యాసంసజ్జన్నముచిపరిపన్థిప్రణయినీ-**
**నిసర్గప్రేఙ్ఖోలత్కురలకులకాలాహిశబలే।**
**నఖచ్ఛాయాదుగ్ధోదధిపయసి తే వైద్రుమరుచాం**
**ప్రచారం కామాక్షి! ప్రచురయతి పాదాబ్జసుషమా॥ 21**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| నమస్యాసంసజ్జన్నముచి పరిపంథిప్రణయినీనిసర్గ ప్రేంఖోలత్కురలకుల కాలాహి శబలే | = | నమస్కరించుటకు సిద్ధపడుచున్న శచీదేవి యొక్క సహజముగా కదలుచున్న ముంగురుల గుంపనెడి నల్లత్రాచుతో కొంత నలుపెక్కిన; |
| నఖచ్ఛాయాదుగ్ధోదధిపయసి | = | గోళ్ళకాంతి అనెడి పాలసముద్రముయొక్క పయస్సునందు; |
| తే | = | నీయొక్క; |
| పాదాబ్జసుషమా | = | పాద కమల కాంతి; |
| వైద్రుమరుచామ్ | = | పగడముల కాంతులయొక్క; |
| ప్రచారమ్ | = | ప్రచారమును; |
| ప్రచురయతి | = | పెంపొందించుచున్నది. |

**తాత్పర్యము :-**

ఇంద్రుని భార్యయగు శచీదేవి నమస్కరించు ప్రయత్నమున ఆమె నల్లని ముంగురులకాంతి నల్లత్రాచు నిగనిగలను గోళ్ళకాంతియను పాల సముద్రమున కలిగించగా నీ చరణకమలకాంతి పగడముల కాంతుల ప్రచారము నధిక మొనర్చుచున్నది.

**వివరణము :-**

అమ్మవారి గోళ్ళకాంతి పాలసముద్రము వలె తెల్లనిది. నమస్కరించు శచీదేవియొక్క ముంగురుల నల్లనిత్రాచు నిగనిగలందు మెదలుచుండగా అమ్మవారి పాదకమలకాంతి పగడముల ఎఱుపును పెంపొందించుచున్నది. సముద్రము నందు నల్లత్రాచులుండుట, పగడపు తీగలుండుట ప్రసిద్ధము. ప్రకృతిలో **'లోహితశుక్లకృష్ణామ్'**

(శ్వే. 4. 5) అని ఉపనిషత్తు పేర్కొనును. అమ్మవారు ప్రకృతి స్వరూపిణి. ఆమె చరణములలో గోళ్ళ తెలుపు ముంగురుల వల్ల త్రాచు నలుపు, పాదపద్మకాంతి పగడముల ఎఱుపు ఉండునట్లు వర్ణించుట సముచితముగా ఉన్నది. ప్రథమ చతుర్థ పాదములలో దాక్షిణాత్యమైన వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున **దుగ్ధోదధి** ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున దాని నుండి పుట్టిన కాకోలము ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ కదా దూరీకర్తుం కటుదురితకాకోలజనితం**
**మహాన్తం సన్తాపం మదనపరిపన్థిప్రియతమే।**
**క్షణాత్తే కామాక్షి! త్రిభువనపరితాపహరణే**
**పటీయాంసం లప్స్యే పదకమలసేవామృతరసమ్॥ 22**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| మదనపరిపంథిప్రియతమే | = | శివునకు మిక్కిలి ప్రియమైన; |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| కటుదురితకాకోలజనితమ్ | = | చేదైన పాపమను విషము నుండి పుట్టిన; |
| మహాన్తమ్ | = | గొప్పదైన; |
| సన్తాపమ్ | = | దుఃఖమును; |
| దూరీకర్తుమ్ | = | దూరము చేయుటకు; |
| క్షణాత్ | = | క్షణకాలమున; |
| త్రిభువనపరితాపహరణే | = | మూడు లోకముల పరితాపమును హరించుట యందు; |
| పటీయాంసమ్ | = | మిక్కిలి సమర్థములైన; |
| తే | = | నీయొక్క; |
| పదకమలసేవామృతరసమ్ | = | పాదపద్మసేవ యనెడి అమృతరసమును; |
| కదా | = | ఎప్పుడు; |
| లప్స్యే | = | పొందగలను. |

**తాత్పర్యము :-**

పాపము చేసి సంపాదించుకొన్న నా దుఃఖమును దూరము చేయుటకు త్రిభువనపరితాపముల హరించు సామర్థ్యముగల నీ పాదసేవామృతరసము నాకెప్పుడు లభింపగలదో గదా!

**వివరణము :-**

ఈ శ్లోకము నందలి నాలుగు పాదములలో వర్ణమైత్రి యొప్పుచున్నది.

అమ్మవారి పాదసేవ ఆమెకు సంబంధించిన నవవిధ భక్తులలో నొకటి. అమ్మవారి విగ్రహమునందలి పాదముల నొత్తవచ్చును. కాని బ్రహ్మాండశరీరయగు అమ్మవారి పాదసేవ అనగా ఏమి? *'పాదోస్య విశ్వా భూతాని'* అను శ్రుతి ననుసరించి సర్వభూతములు భూమియందున్న వన్నియు భూమితో సహా ఆమె పాదమే. సర్వప్రాణులకు సేవచేయుట అమ్మవారి పాదసేవ. మరియు ఆహారోత్పాదనము నైన దానిని దున్నుట అమ్మవారి పాదము నొత్తుట. ఇటువంటి అమ్మవారి పాదసేవ అమృతరసము వంటిది. అమృతము త్రావిన వారికి ప్రళయపర్యంతము సంభవించు తాత్కాలిక మృత్యువు తొలగును. కాని వాడు మృత్యువును తప్పించుకొనలేదు. అమ్మవారి పాదసేవామృతరసము త్రావిన వాని కజ్ఞాన మృత్యువు నశించి శాశ్వతబ్రహ్మము జీవబ్రహ్మైక్యము ద్వారా లభించును.



**అవ:-** పూర్వ శ్లోకమున నఖకాంతి దుగ్ధోదధి పయస్సుగా రూపింపబడినది. ఈ శ్లోకమున దాని యందు పుట్టిన చంద్రుని కాంతియగు వెన్నెల నతిశయించు నని చెప్పబడుచున్నది.

**శ్లో॥ యయోః సాన్ధ్యం రోచిః సతతమరుణిమ్నే స్పృహయతే**
**యయోశ్చాన్ద్రీ కాన్తిః పరితపతి దృష్ట్వా నఖరుచిమ్।**
**యయోః పాకోద్రేకమ్ పిపఠిషతి భక్త్యా కిసలయం**
**మ్రదిమ్నః కామాక్ష్యా మనసి చరణౌ తౌ తనుమహే॥ 23**

ప్రతిపదార్థము :-

సాంధ్యమ్ = సంధ్యాకాలమునకు సంబంధించిన;
రోచిః = కాంతి;
సతతమ్ = ఎల్లప్పుడు;
యయోః = వేనియొక్క;
అరుణిమ్నే = ఎఱుపు కొఱకు;
స్పృహయతే = కోరుచున్నదో;
యయోః = వేనియొక్క;
నఖరుచిమ్ = గోళ్ళకాంతిని;
చాంద్రీ = చంద్రునికి చెందిన;
కాంతిః = కాంతి;
దృష్ట్వా = చూచి;
పరితపతి = పరితపించుచున్నదో;
యయోః = వేనియొక్క;
మ్రదిమ్నః = మృదుత్వముయొక్క;
పాకోద్రేకమ్ = పాకోద్రేకమును;

| | | |
|---|---|---|
| కిసలయమ్ | = | చిగురుటాకు; |
| భక్త్యా | = | భక్తితో; |
| పిపఠిషతి | = | నేర్చుకొనగోరుచున్నదో; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| తౌ | = | ఆ; |
| చరణౌ | = | పాదములను; |
| మనసి | = | మనస్సునందు; |
| తనుమహే | = | గొప్పజేయుచున్నాము. |

**తాత్పర్యము :-**

ఏ పాదముల ఎఱుపును సంధ్యాకాలకాంతి కోరుచున్నదో, ఏ పాదముల గోళ్ళకాంతినిచూచి వెన్నెల పరితపించుచున్నదో, ఏ పాదముల మృదుత్వముయొక్క పరిపాకోద్రేకమును చిగురుటాకు పొందగోరుచున్నదో, ఆ కామాక్షీదేవి పాదములను స్తుతించుచున్నాము.

**వివరణము :-**

సంధ్యాకాంతికి లేని పాదారుణిమ, స్పృహ; వెన్నెలకు లేని పరితాపమును, కిసలయమునకు లేని పాదమార్దవ పరిపాకప్రాప్తి వాంఛ ఉన్నట్లు చెప్పబడుటచే అతిశయోక్త్యలంకార మొప్పుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదములకు సంధ్యాజ్యోత్స్నా కిసలయాతి శాయిత్వము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ పాదముల **సర్వోపరిపరత్వము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ జగన్నేదం నేదమ్ పరమితి పరిత్యజ్య యతిభిః**
**కుశాగ్రీయస్వాన్తైః కుశలధిషణైః శాస్త్రసరణౌ।**
**గవేష్యం కామాక్షి! ధ్రువమకృతకానాం గిరిసుతే!**
**గిరామైదంపర్యం తవ చరణమాహాత్మ్యగరిమా॥** **24**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| గిరిసుతే | = | పార్వతివైన; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| ఇదమ్ | = | ఈ జగము; |
| పరమ్ | = | ఉత్కృష్టము; |
| న | = | కాదు; |
| ఇతి | = | అని; |

| | | |
|---|---|---|
| పరిత్యజ్య | = | విడచి; |
| కుశాగ్రీయస్వాన్తైః | = | దర్భముల్లువలె సూక్ష్మమైన మనస్సుగల; |
| కుశలధిషణైః | = | నిపుణమైనబుద్ధిగల; |
| యతిభిః | = | సన్యాసులచేత; |
| శాస్త్రసరణౌ | = | శాస్త్రమార్గమునందు; |
| గవేష్యమ్ | = | వెదుకదగిన; |
| ధ్రువమ్ | = | శాశ్వతమైన; |
| అకృతకానామ్ | = | చేయబడని; |
| గిరామ్ | = | వాక్కులకు; |
| ఐదంపర్యమ్ | = | ఇదియే ఉత్కృష్టమని చెప్పదగినది. |

**తాత్పర్యము :-**

అమ్మా కామాక్షీదేవీ! నీ చరణ ప్రభావ గరిమ వేదముల తాత్పర్యము. ఇది పరము కాదు ఇది పరము కాదు అని జగమునంతను విడచి, కుశాగ్ర మనస్కులు కుశలబుద్ధులునైన సన్యాసులచేత శాస్త్రమార్గమున వెదుకదగిన శాశ్వత వస్తువు.

**వివరణము :-**

ఈ జగమునం దే వస్తువైన ఉత్కృష్టము కాదు. ఎందుచేత? నశ్వర మగుట చేత. నశ్వరము కాని దమ్మవారి పాద మహిమ యొక్కటే అని ఎరుగుట సామాన్య సంసారులకు సాధ్యము కాదు. సర్వసంగ పరిత్యాగులైన సన్యాసులు తమ కుశాగ్రబుద్ధితో ఈ జగమునం దే వస్తువు ఉత్కృష్టమైనది కాదు, అది అంతయు మిథ్యాభూతము, నశ్వరము అని తెలిసికొని శాస్త్రమార్గమున వెదుకగా వెదుకగా అమ్మవారి పాదము లభించినది. అది మిథ్యాభూతము కాదు. సత్య వస్తువు. దుఃఖరూపము కాదు. ఆనందరూపము. జడరూపము కాదు, చిన్మయము అని గుర్తించి దానినే ఆశ్రయించి ఈ జగమునంతను విడచివైచినారు. వేదములం దీ చరణగరిమయే పరమైనదని నిశ్చయించుటయే వాని తాత్పర్యము. అందులో చెప్పిన మిగిలిన విషయములన్నియు లోకవ్యవహారానువాదములే. కావున వానియందు వేదములకు తాత్పర్యము లేదు. అవి అపూర్వములు కావు. వాని నెఱిగిన ప్రయోజనము లేదు. అవి యన్నియు మిథ్యాభూతములు. కావున వాని నెఱుగుట వ్యర్థము. ఇవి ఇంద్రియములచే తెలియబడును. కావున అపూర్వములు కావు. వానియందు తాత్పర్యము లేదు. వేదముల ప్రామాణ్య మమ్మవారి చరణమహిమనిరూపణము నందే. ఇంద్రియవేద్యములైన కొన్ని విషయములు వేదములందు చెప్పబడును. అవి అనువాదముగా చెప్పబడినవే. అందుచే ఆ విషయములకు ప్రామాణ్యము కాని సత్యత్వముకాని లేదని గమనింపవలెను.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చరణము యతులచే శాస్త్ర మార్గమున వెదుకదగినదని చెప్పబడినది. ఈ శ్లోకమున మునిజన మనస్సు ఆ చరణమును వెదుకుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ కృతస్నానం శాస్త్రామృతసరసి కామాక్షి! నితరాం**
**దధానం వైశద్యం కలితరసమానన్దసుధయా।**
**అలఙ్కారం భూమేర్మునిజనమనశ్చిన్మయ మహా-**
**పయోధేరన్తస్స్థం తవ చరణరత్నం మృగయతే॥ 25**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| శాస్త్రామృతసరసి | = | శాస్త్రమనెడి అమృతసరస్సున; |
| కృతస్నానమ్ | = | చేయబడిన స్నానముగలదై; |
| నితరామ్ | = | మిక్కిలి; |
| వైశద్యమ్ | = | స్వచ్ఛతను; |
| దధానమ్ | = | ధరించుచున్నదై; |
| భూమేః | = | భూమికి; |
| అలంకారమ్ | = | సొమ్మైన; |
| మునిజనమనః | = | మునిజనమనస్సున; |
| ఆనందసుధయా | = | ఆనందామృతముచేత; |
| కలితరసమ్ | = | పొందిన రసము గల; |
| చిన్మయమహాపయోధేః | = | జ్ఞానమయమైన మహాసముద్రముయొక్క; |
| అంతఃస్థమ్ | = | లోపలనున్న; |
| తవ | = | నీయొక్క; |
| చరణరత్నమ్ | = | పాదమను రత్నమును; |
| మృగయతే | = | వెదకుచున్నది. |

**తాత్పర్యము :-**

శాస్త్రామృతసరస్సున స్నానమొనర్చి స్వచ్ఛతను సంపాదించుకొని భూమి కలంకారమైన మునిజనమనస్సు అధికస్వచ్ఛతగ్గల ఆనందామృతముచే రసము గలిగిన జ్ఞానము అనెడి మహాసముద్రముయొక్క లోననున్న అమ్మవారి పాదమను రత్నమును వెదుకుచున్నది.

**వివరణము :-**

అత్యంతము స్వచ్ఛమైనది అమ్మవారి చరణరత్నము. దానిని వెదుకుటకు తగిన అర్హత సంపాదించుకొనుటకు మునిజనమనస్సు శాస్త్రామృత సరస్సునందు

స్నానమొనర్చి స్వచ్ఛతను సంపాదించుకొన్నది. ఆనందసుధచే అమ్మవారి చరణరత్నము రసవంతమైనది. అట్టి రత్నమును వెదుకుటకు తగిన అర్హతను సంపాదించుటకు మునిజనమనస్సు మామూలు సరస్సున గాక అమృత సరస్సున స్నానము చేయుట జరిగినది. మునిజనమనస్సు భూమికి అలంకారము. దానిలో రత్నము లేదు. దేనిని రత్నముగా పొందవలెనని పరిశీలింపగా అమ్మవారి చరణమే అందుకు తగినదిగా శాస్త్ర పరిశీలన వలన తెలిసినది. కాని అది ఎచట నున్నది? చిన్మయ మహాసముద్రము లోపలనున్నట్లు తెలిసినది. కాని సముద్రము పెద్దది గదా! దానిని పొందుటకై మునిజన మనస్సు అను భూమ్యాలంకారము వెదకుచుండును. అది దొరికినచో మునులు జ్ఞానులగుదురు. ప్రస్తుతము దానిని వెదకుచున్నారు. అనగా గురువులను విచారించు చున్నారు. వేదాంతశాస్త్ర చర్చల నొనరించుచున్నారు. ఉపనిషత్తులలో చెప్పబడిన అనేక విధములైన బ్రహ్మోపాసనములను **'ఉద్గధీబ్రహ్మ'**, ఆదిత్య బ్రహ్మోపసనాద్యుపాసనముల **అక్షిపురుషమధువిద్య, సంవర్గవిద్య, ఉరకోసల విద్య** అను పేర్లుగల ఉపాసనలను ఇంకను అనేక విధములైన బ్రహ్మోపాసనము లను ఒనరించుచున్నారు. లేక అమ్మవారి చరణరత్నమే చిన్మయమహా సముద్రము నందున్నదే భూమి కలంకారము అని మరియొక విధముగా నీ శ్లోకమును సమన్వయించుకొనవచ్చును.



**అవ:-** పై శ్లోకమున మునిజనమనస్సు అలంకారముగా చెప్పబడినది. ఈ శ్లోకమున మనస్సు గేహముగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ మనోగేహే మోహోద్భవతిమిరపూర్ణే మమ ముహు-**
**ర్దరిద్రాణీకుర్వన్దినకరసహస్రాణి కిరణైః।**
**విధత్తాం కామాక్షి! ప్రసృమరతమోవఞ్చనచణః**
**క్షణార్ధం సాన్నిధ్యం చరణమణిదీపో జనని! తే॥ 26**

**ప్రతిపదార్థము :-**

మోహోద్భవతిమిరపూర్ణే = మోహము నుండి పుట్టిన చీకటితో నిండిన;
మమ = నాయొక్క;
మనోగేహే = మనస్సను గృహము నందు;
దినకరసహస్రాణి = వేలకొలది సూర్యులను;
కిరణైః = కిరణములతో;
ముహుః = మాటిమాటికి;
దరిద్రాణీకుర్వన్ = దరిద్రులను చేయుచు;
జనని! కామాక్షి! = తల్లీ! కామాక్షీదేవీ!
ప్రసృమరతమోవంచనచణః = వ్యాపించు చీకట్లను వంచించుటలో సమర్థములైన;

| | |
|---|---|
| తే | = నీయొక్క; |
| చరణమణిదీపః | = పాదమను మణిదీపము; |
| క్షణార్థమ్ | = అరక్షణము; |
| సాన్నీధ్యమ్ | = సమీపస్థితిని; |
| విధత్తామ్ | = చేయునుగాక! |

**తాత్పర్యము :-**

తల్లీ! కామాక్షీదేవీ! మోహజనితాంధకారపూర్ణమైన నా మనస్సనెడి గృహమునందు, మాటిమాటికి వేలకొలది సూర్యులను తన కిరణములతో దరిద్రుల నొనరించుచున్న, వ్యాపించు చీకట్లను మోసగించుటలో సమర్థమైన నీ చరణమణిదీపము అరక్షణము దగ్గఱకు చేరుగాక!

**వివరణము :-**

చరణమునందు మణిదీపారోపణముండుటచే నిట రూపకాలంకార మొప్పుచున్నది. మణిదీపము సాధారణమైన చీకట్లను బోగొట్టును. కాని మనోగుహలోని చీకట్లను పోగొట్టజాలదు. అమ్మవారి చరణమణిదీప మాపని చేయగలదు. ఎందుచేత? ఆ మణిదీపము మాటిమాటికి వేలకొలది సూర్యుల కాంతి వెలవెల బోవునట్లు చేయును. సాధారణముగా వేలకొలది దీపములు సూర్యకాంతిలో వెలవెలబోవును. కాని ఈ దీపముయొక్క కాంతి వేలకొలది సూర్యుల వెలవెల బోవునట్లు చేయును. వెలుగు చేరుచున్న కొలది చీకట్లు పాఱిపోవుచుండును. పాఱిపోయి ఆ వెలుగులు చేరనిచోట దాగియుండును. అమ్మవారి చరణమణిదీపము అట్లు పాఱిపోవుచు దూరతీరములకు వ్యాపించు చీకట్లను గూడ మోసగించుటలో సమర్థమైనది. పాపమాచీకట్లంత దూరము ఆ దీపము రాదులే అని ఏ మూలనో నక్కును. అమ్మవారి చరణమణిదీపము దాని నక్కడ కూడ నిలువనీయక పూర్తిగా నిర్మూలమొనర్చును. ఆకాశమున సూర్యుడున్నాడు. ఆ సూర్యునకన్న కోట్లరెట్లెక్కువ కాంతిగల నక్షత్ర కోట్లున్నవి. కాని చీకటి మాసిపోలేదు. అవి యంత సంఖ్యలో నున్నను అంత ప్రకాశవంతము లైనను బాహ్యాంధకారమునే రూపుమాపలేకున్నవి. ఇక అంతరతమస్సును అనగా మనస్సులోని అజ్ఞానమును పోగొట్టగలదను ఊహకే తావు లేదు. అమ్మవారి చరణ మణిదీపమువలె ఆ బాహ్యానక్షత్రము లేవియు నిత్యములు కాక పోవుటచే అవి నశింపగానే మరల చీకట్లు సామ్రాజ్యమును స్థాపించును. అమ్మవారి చరణ మణిదీపము నిత్యమగుటచే మరల తమోగుణముకాని, అజ్ఞానముకాని, మోహము గాని, కలుగు నవకాశము లేదు. కావున చరణ మణిదీపముతో సాటి మరొక తేజమేదియు లేదు అను **అనన్వయాలంకారధ్వని** ఈ శ్లోకమున నున్నది.



**అవ:-** పై శ్లోకమున సూర్యుని మించిన మణిదీపముగా అమ్మవారి చరణము

రూపింపబడినది. ఈ శ్లోకమున ఆ సూర్యుడమ్మవారి చరణ సన్నిధికి చేరనేలేదని అందువలన ఆ చరణమునకు సూర్య సంపర్కమే లేదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కవీనాం చేతోవన్న ఖరరుచిసమ్పర్కి విబుధ-**
**స్రవన్తీస్రోతోవత్పటుముఖరితం హంసకరవైః।**
**దినారమ్భశ్రీవన్నియతమరుణచ్ఛాయసుభగం**
**మదన్తః కామాక్ష్యాః స్ఫురతు పదపఙ్కేరుహయుగమ్॥27**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవి యొక్క; |
| పదపంకేరుహయుగమ్ | = | పాదపద్మములజంట; |
| కవీనామ్ | = | కవులయొక్క; |
| చేతోవత్ | = | మనస్సువలె; |
| న ఖరరుచిసంపర్కి | = | సూర్య సంపర్కరము కలది కాదు (గోళ్ళకాంతి సంపర్కము కలది); |
| విబుధస్రవన్తీస్రోతోవత్ | = | గంగానదీ ప్రవాహమువలె; |
| హంసకరవైః | = | అందెల చప్పుడు చేత (హంసల ధ్వనిచేత); |
| పటుముఖరితమ్ | = | మిక్కిలి ధ్వనించునది; |
| దినారంభశ్రీవత్ | = | ప్రాతఃకాంతివలె; |
| నియతమ్ | = | తప్పని; |
| అరుణచ్ఛాయసుభగమ్ | = | ఎఱ్ఱని కాంతిగలది మరియు అందమైనది; |
| మదన్తః | = | నాలో; |
| స్ఫురతు | = | ప్రకాశించుగాక! |

**తాత్పర్యము :-**

కవుల మనస్సువలె అమ్మవారి చరణ పద్మయుగము సూర్యసంపర్కము లేనిదే కాని గోళ్ళకాంతుల సంపర్కము గలది. ఆకాశగంగానదీ ప్రవాహము వలె హంసకరములతో మిక్కిలి ధ్వనించునది. ప్రాతఃకాంతివలె నిశ్చితముగా అనూరుని అరుణ కాంతి ప్రసరించనిది కాని ఎఱ్ఱగానే ఉన్నది. ఆ పాదపద్మ యుగము నాలో స్ఫురించుగాక!

**వివరణము :-**

1) ఇంతకు పూర్వమే వివరించినట్లు సూర్యుడు మనస్సులోని తమస్సును చీల్చజాలడు. అసలు మనస్సులో ప్రవేశింపనేలేడు. ఇక కవుల మనస్సులో కెట్లు పోగలడు. కవుల మనస్సు సూర్యకాంతి లేకున్నను అన్నిటిని దర్శింపగలదు. రవి కానని చోటును కవి మనస్సు కాంచగలదు. కవుల మనస్సు సుకుమారము. ఖర రుచిని అనగా

తీక్షణమైన కాంతిగల సూర్యునెట్లు సహింపగలదు. కావుననే న ఖరరుచి సంపర్క అమ్మవారి పాదపద్మము సూర్యునిచే ప్రకాశించునది కాదు. అది స్వయంప్రకాశ జ్ఞాన రూపము. చిన్మయము. కావున అదియే సూర్యుని ప్రకాశింపజేయగలిగి ఉన్నది. ఆ చరణముల అనుగ్రహము లేనిదే సూర్యుడే ప్రకాశింపలేదు. మరొకదానిని ప్రకాశింపజేయుట ఎట్లు? సాధారణముగా సూర్యుడు కమలమును ప్రకాశింపజేయును. ఇచట తద్విపరీతముగా పాదపద్మము సూర్యుని ప్రకాశింపజేయవలె. అతడు ప్రకాశింపవలె. లోకమును ప్రకాశింపజేయవలె. అమ్మవారి పాదముల తోడనే కాదు, తద్భాగమైన గోటికాంతితో సరితూగజాలడు. అమ్మవారి పాదపద్మయుగము ఖరరుచి సహింపజాలదు. అది మిక్కిలి సుకుమారము కాని మృదు రుచియైన ఆ సూర్యుని సారథియైన అనూరుని కాంతిని సహించగలుగను కాబోలు. అందుచేతనే అమ్మవారి పాదయుగ్మము అరుణచ్ఛాయ సుభగము అని చెప్పబడినది. కావున ప్రభాతశ్రీ వంటిదని ప్రభాతశ్రీతో ఉపమింపబడినది.

2) విబుధ స్రవన్తి అనగా దేవనది. దాని ప్రవాహము హంసల ధ్వనితో ధ్వనించుచుండును. అమ్మవారి పాదముల కడకును నడక నేర్చుకొనుటకై ఆ హంసలు వచ్చి యుండవచ్చును. వాని ధ్వనులతో అమ్మవారి పాద పంకేరుహయుగ్మము ధ్వనించుచనే ఉండును. భక్తజనులను తుమ్మెదల తోడను ధ్వనించుచుండును. పైగా ఆమె తన చరణముల హంసకములను (అందెలను) ధరించియున్నది. వాని ధ్వని కూడా హంసల ధ్వనితో సమానము కావున వానికి హంసకములను పేరు వచ్చినది. నమస్కరించిన దేవతల కిరీట మణులొక దానితోనొకటి సమ్మర్దముతో తాకి ఆ చరణ పంకేరుహయుగము ధ్వనించును. ఇన్ని ధ్వనులు కలది కావున అది పటు ముఖరితము. ఆకాశగంగా ప్రవాహమున హంసల ధ్వని యొక్కటే కావున దానిలో పాటవము తక్కువ. నాలుగవ చరణమున ఆది మధ్యలలో వర్ణమైత్రికి బదులు ప్రాసమను శబ్దాలంకారమున్నది. ఇది ప్రధానముగా దాక్షిణాత్యము.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి చరణములకు దేవతాకిరీటసంపర్కము ప్రస్తావింపబడు చున్నది.

**శ్లో॥ సదా కిం సమ్పర్కాత్ప్రకృతికఠినైర్నాకిముకుటై-**
**స్తటైర్నీహారాద్రేరధికమణునా యోగిమనసా।**
**విభిన్తే సమ్మోహం శిశిరయతి భక్తానపి దృశా-**
**మదృశ్యం కామాక్షి! ప్రకటయతి తే పాదయుగలమ్ ॥28**

**ప్రతిపదార్థము :-**

ప్రకృతికఠినైః = స్వభావకఠినమైన;

| | | |
|---|---|---|
| నాకిముకుటైః | = | దేవతా కిరీటములతో; |
| సదా | = | ఎల్లప్పుడు; |
| నీహారాద్రేః | = | హిమవత్పర్వతముయొక్క; |
| తటైః | = | తటములతో; |
| అధికమ్ | = | మిక్కిలి; |
| అణునా | = | చిన్నదైన; |
| యోగిమనసా | = | యోగి మనస్సుతో; |
| సమ్పర్కాత్ కిమ్ | = | సమ్పర్కమువలననో; |
| దృశామ్ | = | దృక్కులయొక్క; |
| సమ్మోహమ్ | = | సమ్మోహమును; |
| విభిన్తే | = | భేదించుచున్నది. |
| కామాక్షి | = | ఓ కామాక్షిదేవీ! |
| తే | = | నీయొక్క; |
| పాదయుగలమ్ | = | పాదముల జంట; |
| సమ్మోహమ్ | = | సమ్మోహమును; |
| విభిన్తే | = | భేదించుచున్నది. |
| దృశామ్ | = | చూపుతో; |
| భక్తాన్ | = | భక్తులను; |
| శిశిరయతి | = | చల్లబఱచుచున్నది. |
| అదృశ్యమ్ | = | చూడబడని దానిని; |
| ప్రకటయతి | = | వెల్లడించుచున్నది. |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదయుగళి ఎల్లప్పుడు స్వభావకఠినములైన దేవతా కిరీటముల వలన సమ్మోహనమును భేదించుచున్నది. హిమవత్పర్వతముయొక్క చఱియలతోడి సమ్పర్కము వలన భక్తులను చల్లబఱచుచున్నది. కానరాని దానిని స్పష్టముగా తెలుపుచున్నది.

**వివరణము :-**

సమ్పర్కముగల వస్తువుల నొకవరుసలో చెప్పి భేదించుట, చల్లబఱచుట, అదృశ్యప్రకటనము అను పాదయుగలిక్రియలను వరుసగా చెప్పుటచే నీ శ్లోకమున క్రమాలంకార మొప్పుచున్నది. '**సమ్పర్కతో దోషగుణా భవన్తి**' అనునది పెద్దల సూక్తి. కలసి ఉండుటచే వారి గుణములు వీరికి, వీరి గుణములు వారికి కలుగును అని దాని అర్థము. అమ్మవారి పాదములకు దేవతలెప్పుడును నమస్కరించుచుందురు. చరణములు మృదువైనను దేవతా కిరీటములు కఠినములు కావున వాని కఠినత్వము పాదములకు

కల్గినదేమో? అందుచేతనే సమ్మోహమును భేదించుచున్నవి. అట్లు కానిచో కఠినత్వములేని చరణములు సమ్మోహము నెట్లు భేదించగలవు? భేదించుటకు కఠినత్వ మావశ్యకము కదా! సమశీతోష్ణములైన అమ్మవారి పాదములు హిమాలయ పర్వతతటసంచార సంపర్కమువలన చల్లదనము పొందినవై భక్తుల తాపమును పోగొట్టి వారి హృదయమును చల్లబఱచుచున్నవేమో! మనస్సు అణుస్వరూప మనగా కనబడనంత చిన్నదని తర్క శాస్త్రజ్ఞులు చెప్పెదరు. అట్టి మనస్సుతో కంటికి కనబడని ఇతరులు మనస్సుతో కూడ నెఱుగజాలని ఎన్నో వస్తువులను యోగులు తెలిసికొందురు. అట్టి యోగులు అదృశ్యమైన తమ మనస్సులో అమ్మవారి పాదములనే ఎప్పుడు ధ్యానించుచుందురు. కావున అదృశ్యములైన అమ్మవారి పాదములజంటను వారు దర్శించుచుందురు. అట్టి అదృశ్యమును ప్రకటింపగల స్వయముగా అదృశ్యమైన శివస్వరూపమును ప్రకటించుచున్నవని గ్రహింపవలసియున్నది. అమ్మవారి అదృశ్యములైన పాదముల ధ్యానించు సమ్పర్కమువలన యోగుల మనస్సు అదృశ్యముల జూడగలుగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున ప్రకృతి కఠినములైనవి దేవతా కిరీటములని చెప్పబడినది. ఈ శ్లోకమున ప్రకృతి మృదులములమ్మవారి చరణములని చెప్పబడుచున్నది.

**శ్లో॥ పవిత్రాభ్యామమ్బ! ప్రకృతిమృదులాభ్యాం తవ శివే**
**పదాభ్యాం కామాక్షి ప్రసభమభిభూతైః సచకితైః।**
**ప్రవాలైరమ్భోజైరపి చ వనవాసవ్రతదశాః**
**సదైవారభ్యన్తే పరిచరితనానాద్విజగణైః ॥29**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| అంబ! | = | అమ్మా! |
| శివే! | = | మంగళ స్వరూపురాలా! |
| కామాక్షి! | = | కామాక్షీదేవీ! |
| పవిత్రాభ్యామ్ | = | పవిత్రములైన; |
| ప్రకృతిమృదులాభ్యామ్ | = | స్వభావమృదువులైన; |
| ప్రసభమ్ | = | బలవంతముగా; |
| అభిభూతైః | = | తిరస్కరింపబడిన; |
| సచకితైః | = | భయముతో కూడిన; |
| ప్రవాలైః | = | చిగుళ్ళచేత, పగడములచేత; |
| అమ్భోజైః అపి | = | కమలములచేతను; |
| పరిచరితనానాద్విజగణైః ఏవ | = | సేవింపబడిన పక్షుల (బ్రాహ్మణుల) సమూహములు గలవాని చేతనే; |

వనవాసవ్రతదశాః = వనము నందుండు నియమముల దశలు;
సదా = ఎల్లప్పుడు;
ఆరభ్యంతే = ఆరంభింపబడుచున్నవి.

**తాత్పర్యము :-**

పవిత్రములు, సహజముగా మృదువులునైన అమ్మవారి పాదముల చేత తిరస్కరింపబడి భయము నొందిన చిగుళ్ళు కమలములు, ద్విజగణ పరిచరణాది వనవాసవ్రతనిష్ఠల నారంభించుచున్నవి.

**వివరణము :-**

అమ్మవారి పాదముల కున్నంత పవిత్రతగాని, మృదుత్వము గాని లేని చిగుళ్ళు కమలములు ఆ పవిత్రతా మృదుత్వముల సంపాదింపగోరి వనవాసవ్రత దీక్షతో ద్విజసేవాది తద్వ్రతనియమానుష్ఠానము నారంభించు చున్నవి. పక్షులకు చిగుళ్ళు, కమలములున్న చోటనుండుట సహజము. వానికి పక్షుల పరిచరణముతో సంబంధము సహజముగానే ఉన్నది. పక్ష్యార్థకమైన ద్విజ శబ్ద ముపయోగించుట చేత పరిచరణ శబ్దము సేవార్థమును బోధించును. చిగుళ్ళు కమలములు అడవులలో నుండును. సహజమైన ఆ వనవాసమిట అమ్మవారి పాదముల మృదుత్వ పవిత్రత్వ ముండుటకు చేయబడుచున్నదని కవి సంభాషించుటచే నిట ఉత్ప్రేక్షాలంకార మొప్పుచున్నది. నాలుగు పాదములలోను దాక్షిణాత్య వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున కమలకృత వనవాసవ్రతనియమ బ్రాహ్మణ సేవ చెప్పబడినది. ఈ శ్లోకమున బ్రాహ్మణ సేవాయుక్త వనవాసవ్రతానుష్ఠాన మొనర్చినను సహజ జడ సంపర్కాది దోషయుక్తమైన కమలము అమ్మవారి చరణముచే చేయబడిన పరిహాసమునకు భాజనమగుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ చిరాద్దృశ్యా హంసైః కథమపి సదా హంససులభం**
**నిరస్యన్తీ జాడ్యం నియతజడమద్యైకశరణమ్।**
**అదోషవ్యాసఙ్గాత్ సతతమపి దోషాప్తిమలినం**
**పయోజం కామాక్ష్యాః పరిహసతి పాదాబ్జయుగలీ॥ 30**

**ప్రతిపదార్థము :-**

హంసైః = హంసలచేత;
కథమ్ అపి = ఎట్లో;
చిరాత్ = ఎంతో కాలమునకు;
దృశ్యా = కనబడు;

| | | |
|---|---|---|
| జాడ్యమ్ | = | జడత్వమును; |
| నిరస్యన్తీ | = | తొలగించుచున్న; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క |
| పాదాబ్జయుగలీ | = | పాదపద్మద్వయము; |
| సదా | = | ఎల్లప్పుడు; |
| హంససులభమ్ | = | హంసలకు అక్లేశముగా లభించు; |
| నియతజడమద్ధ్యైకశరణమ్ | = | నియతముగ జడ మధ్యమే ; ముఖగృహముగా గల; |
| దోషాప్తిమలినమ్ | = | దోషముయొక్క ప్రాప్తిచే వికాసమును వీడిన; |
| పయోజమ్ | = | కమలమును; |
| అదోషవ్యాసంగాత్ | = | దోషసంపర్కము లేకపోవుటవలన; |
| సతతమ్ అపి | = | ఎల్లప్పుడును; |
| పరిహసతి | = | పరిహసించుచున్నది. |

**తాత్పర్యము :-**

కమలము చుట్టు హంసలెప్పుడు తిరుగుచుండుటచే నది హంస సులభము. అమ్మవారి పాదయుగలి ఎంతో కాలమునకు ఎట్లో కనబడును. కమలమునకు జ(డ)ల మధ్యస్థితి నియతము. పాదయుగలి జాడ్యమును నిరసించును. కమలము దోషము అనగా చీకటి వచ్చినపుడు ముడుచుకొనును. అమ్మవారి పాదములకు దోషమే లేదు కావున కమలము నమ్మవారి పాదయుగలి పరిహసించుచున్నది.

**వివరణము :-**

ఈ శ్లోకమున ఉపమేయమైన అమ్మవారి చరణము ఉపమానమైన కమలమును పరిహసించుచున్నదని చెప్పుటచే నిందు ప్రతీపాలంకార మొప్పుచున్నది. ద్వితీయ, చతుర్థ పాదములలో వర్ణమైత్రి ఒప్పుచున్నది. నాలుగు ఆశ్రమములలో చివరిది సన్యాసము. దానిని స్వీకరించిన సంన్యాసులలో నాలుగు విధములు కలరు.

1) **కుటీచకులు**-వీరు గుడిసెలలో నివసించెదరు.

2) **బహూదకులు**-గ్రామైకరాత్రముగా తిన్నచోట నిద్రించక, నిద్రించినచోట భుజింపక దినముకొక ఊర భిక్షాటనము చేయుచు అనేకములైన గ్రామములలో అనేకములైన వివిధములైన పెక్కు జలములు త్రావుచుందురు.

3) **హంసలు**- నీరమును పరిత్యజించి క్షీరమును గ్రోలు హంసలవలె మిథ్యాసంసారమును పరిత్యజించి సత్యబ్రహ్మనిష్ఠ కలిగియుండువారు.

4) **పరమహంసలు**-జ్ఞాన భూమికలలోని చివరి భూమికయైన తుర్యగా అను భూమికలో నుండి బ్రహ్మానందానుభవము నొందువారు.

పరమహంసలు కూడ హంసలు అనబడుదురు. అటువంటి హంసలచే అమ్మవారి పాదయుగము సేవింపబడుట విశేషము. వారును బహుకాల ముపాసించిన పిమ్మటను అది వారికి కనబడును. 'లడయో రభేదః' అను నియమము ననుసరించి శ్లోకమున జలము జడముగా ప్రయోగింపబడినది. కావున జడుల మధ్యమున ఇల్లు గలదను అర్థము కమలమున వర్తించుటకు వీలైనది. జల మధ్యమున నుండుట జడ మధ్యమున నున్నట్లు భావించుటకు వీలగునట్లు ప్రయోగింపబడినది. దోష శబ్దమునకు చీకటి అను అర్థమొకటి, తప్పు అను మరొక అర్థమునున్నవి. దోషశబ్దమునకు రాత్రి అను అర్థమున్నది. **దోషాప్తిమలిన** మను చోట దోషముల ప్రాప్తి, రాత్రియొక్క రాక అను రెండర్థము లేర్పడుటచే దోషముల ప్రాప్తియే అనగా రాత్రియొక్క రాకచే కమలము మలినమైనది అను నర్థము కలుగుటచే దోష వ్యాసంగము లేని చరణము దోషమును పరిహరించునని చెప్పబడినది. అమ్మవారి పాదమబ్జముగా చెప్పబడినను చిన్మయము అనుటచే జాడ్య సంబంధ రహితము. అందుచే అది పయోజమును పరిహసించుచున్నది. జంట అని చెప్పుటకు నపుంసకమైన 'యుగలమ్' అను శబ్దమును ప్రయోగించక **'యుగలీ'** అను స్త్రీ లింగశబ్దమును ప్రయోగించుటచే చరణముల జంటయందు స్త్రీత్వము వ్యంగ్య మగును. అణకువగల వారిని కరుణించుట, అణకువ లేనివారిని పరిహసించుట అను అర్థములు ఆ స్త్రీత్వమును పురస్కరించుకొని వ్యంగ్యములగును. ఆ స్త్రీత్వము చేత దర్శన దౌర్లభ్యమేర్పడును. కావుననే హంసలకు సైతము ఎంతోకాలము వేచియున్న పిదపనే లభించినదిగాని సుఖముగా అనాయాసముగా వారికి లభించ లేదని వ్యంగ్యమగును.



**అవ:-** కమల శత్రువైన చంద్రుని దశ అమ్మవారి పాదము లందున్నట్లు ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ సురాణామానన్దప్రబలనతయా మణ్డనతయా**
**నఖేన్దుజ్యోత్స్నాభిర్విసృమరతమఃఖణ్డనతయా।**
**పయోజశ్రీద్వేషవ్రతరతతయా త్వచ్చరణయో-**
**ర్విలాసః కామాక్షి! ప్రకటయతి నైశాకరదశామ్॥ 31**

**ప్రతిపదార్థము :-**

సురాణామ్ = దేవతలయొక్క;
ఆనన్దప్రబలనతయా = ఆనందమును పెంచుటచేత;
మండనతయా = అలంకారమగుటచేత;
నఖేన్దుజ్యోత్స్నాభిః = గోళ్ళకాంతి యను వెన్నెలలచేత;
విసృమరతమఃఖండనతయా = వ్యాపించు చీకట్ల చీల్చుటచేత;

| | |
|---|---|
| పయోజశ్రీద్వేషవ్రతరతతయా | = కమల కాంతితో ద్వేషము వ్రతముగా కలిగి యుండుటచే; |
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవి! |
| త్వచ్చరణయోః | = నీ పాదములయొక్క; |
| విలాసః | = విలాసము; |
| నైశాకరదశామ్ | = చంద్రత్వమును; |
| ప్రకటయతి | = ప్రకటించుచున్నది. |

**తాత్పర్యము :-**

దేవతల ఆనందమును పెంచుటచేత, వారికి శిరోలంకారమగుటచేత, గోళ్ళకాంతులనెడి వెన్నెలచేత, చీకట్ల చీల్చుటచేత, కమలముల ద్వేషించు వ్రతము నెప్పుడు నాచరించుటచేత, అమ్మవారి చరణముల విలాసము చంద్రత్వ స్థితిని ప్రకటించుచున్నది.

**వివరణము :-**

చంద్రుడు సుధాకరుడు. ఆతనిలోని సుధ దేవతల కమృతాహారము. దానిని దర్శించినంతనే వారికి నోరూరును. ఇక దానిని ఆస్వాదించిన ఆనందము కలుగునని చెప్పనక్కరలేదు. వారా అమృతమును త్రాగి తలకు బోసికొందురు. ఆ చంద్రుని నెత్తికెక్కించుకొందురు. శివుడమ్మవారి పాదముల నెత్తికెక్కించు కొనును. ఆయన దేవతలలో చేరిన మహాదేవుడు చంద్రశేఖరుడు గదా! అందుచేతనే పాదములకు చంద్రునికి సర్వదేవతాశిరోమండనత్వము సంభవించినది. పాదములకు, చంద్రునికి సర్వదేవతా శ్రేష్ఠత్వమును కూడ **మండన** శబ్దము తెలుపును. సాదృశ్యము నిమిత్తముగా కమలకాంతి ద్వేషము పాదములకు చంద్రునకు సమానమే. తమస్సును అనగా బాహ్యాంధకారమును చంద్రకాంతి హరించును. అమ్మవారి నఖచంద్రకాంతులు తమస్సును అనగా హృదయగతాజ్ఞానాంధకారమును హరించును. ఇట్లు అమ్మవారి చరణములకు చంద్రత్వము చంద్రస్థితి ఏర్పడుచున్నది. దీనివలన పాదములందు చంద్రత్వోత్ప్రేక్ష శబ్దశక్తి మూలమున వ్యంగ్యమగుచున్నది. ప్రథమ ద్వితీయ పాదాంతానుప్రాస శబ్దాలంకారమున్నది. వ్రతరతతయా అనుచోటను వృత్త్యనుప్రాస శబ్దాలంకార మున్నది. సురల నానందింపజేయుట, మహాదేవ శిరోభూషణమగుట, పయోజ శ్రీని ద్వేషించుట, తమః ఖండనము అను ధర్మము లా ఉత్ప్రేక్షావ్యక్తికి దోహద మొనర్చుచున్నవి. దేవత లమ్మవారికి నమస్కరించినప్పుడు అమ్మవారి పాద కమలములు వారి సిగలలో అలంకారములైనవి. అమ్మవారి పాదాబ్జములు వాని అర్ధచంద్రము వంటి గోళ్ళకాంతులు నమస్కరించిన శివుని శిరమున వెన్నెల కాయించినవి. అబ్జ శబ్దమునకు కమలము, చంద్రుడును అర్థము లుండుటచే అమ్మవారి పాదకమలములు చంద్రునితో కూడి నమస్కరించిన శివుని శిరమున పరస్పరము శత్రువులై యుండియు మైత్రీభావముతో నొకచోట గూడియున్నవను నంశము

అమ్మవారి పాదసన్నిధిలో శత్రుత్వమున కాస్కారము లేదను నంశమును వ్యంగ్యమగు చున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదకమలములు సురల శిరమున కలంకార మగుట చెప్పబడినది. ఈ శ్లోకమున సురపురంధ్రీ శిరోలంకారములు అమ్మవారి పాద కమల, ధవలిమాశోణిమలు అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ సితిమ్నా కాన్తీనాం నఖరజనుషాం పాదనలిన-**
**చ్ఛవీనాం శోణిమ్నా తవ జనని! కామాక్షి! నమనే।**
**లభన్తే మన్దారగ్రథితనవబన్ధూకకుసుమ-**
**ప్రభాసామీచీన్యం సురపురపురన్ధ్రీకచభరాః॥** **32**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| నఖరజనుషామ్ | = | గోళ్ళయందు జన్మగల |
| కాన్తీనామ్ | = | కాంతులయొక్క |
| సితిమ్నా | = | తెలుపుచేత |
| పాదనలినచ్ఛవీనామ్ | = | పాదపద్మ కాంతులయొక్క |
| శోణిమ్నా | = | ఎఱుపుచేత |
| జనని | = | తల్లీ! |
| కామాక్షి | = | కామాక్షీ! |
| నమనే | = | నమస్కరించినప్పుడు |
| సురపురపురంధ్రీకచభరాః | = | అమరావతీ స్త్రీల కొప్పులు |
| మందారగ్రథితనవబంధూక కుసుమప్రభాసామీచీన్యమ్ | = | మందారములతో కూర్పబడిన కొత్త మంకెనపూల కాంతియొక్క మంచితనమును |
| లభన్తే | = | పొందుచున్నవి. |

**తాత్పర్యము :-**

అమ్మవారి కాళ్ళగోళ్ళ కాంతుల ఎఱుపు తెలుపులు నమస్కరించిన దేవతా స్త్రీల కొప్పులు మందారపూలతో కూర్పబడిన కొత్త మంకెనపూలు తురిమి నట్లు కనబడుచున్నవి.

**వివరణము :-**

మన్దార పుష్పములు తెల్లనివి. బంధూకపుష్పములు ఎఱ్ఱనివి. అమ్మవారి గోళ్ళకాంతులు తెల్లనివి. పాదకమలకాంతులు ఎఱ్ఱనివి. ఇవి నమస్కరించిన దేవతా స్త్రీలు కొప్పులలో ఎరుపు తెలుపు కాంతులు గల మంకెన పూలు, మన్దారములు కలిపి

గ్రుచ్ఛేనదండ ధరించినట్లు కనబడుచున్నారు. అమ్మవారి పాదకమలములకు కొత్త మంకెనపూలతో, గోళ్ళకు మన్దార పుష్పములతో పోలిక వ్యంగ్యమగుటచే ఔపమ్య ధ్వని ఈ శ్లోకమున నున్నది.

**అవ:-** పై శ్లోకములలో దేవతల నమస్కారము చెప్పబడినది. ఈ శ్లోకమున విష్ణువుయొక్క **నమస్కారము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ స్ఫురన్మధ్యే శుద్ధే నఖకిరణదుగ్ధాబ్ధిపయసాం**
**వహన్నబ్జం చక్రం దరమపి చ రేఖాత్మకతయా।**
**శ్రితో మాత్స్యం రూపం శ్రియమపి దధానో నిరుపమాం**
**త్రిధామా కామాక్ష్యాః పదనలిననామా విజయతే॥ 33**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| నఖకిరణదుగ్ధాబ్ధిపయసామ్ | = గోళ్ళకాంతి యనెడి పాలసముద్రము యొక్క జలములలో; |
| శుద్ధే | = స్వచ్ఛమైన; |
| మధ్యే | = నడుమ; |
| స్ఫురన్ | = ప్రకాశించుచు; |
| రేఖాత్మకతయా | = రేఖారూపమున; |
| అబ్జమ్ | = కమలమును; |
| చక్రమ్ | = చక్రమును; |
| దరమ్ | = శంఖమును; |
| వహన్ | = ధరించుచు; |
| అపి | = మరియు; |
| మాత్స్యమ్ | = చేపకు సంబంధించిన; |
| రూపమ్ | = రూపమును; |
| శ్రితః | = ఆశ్రయించిన; |
| నిరుపమామ్ | = సాటిలేని; |
| శ్రియమ్ | = లక్ష్మిని; |
| దధానః | = ధరించుచు; |
| కామాక్ష్యాః | = కామాక్షీదేవియొక్క; |
| పదనలిననామా | = పాదపద్మమను పేరుగల; |
| త్రిధామా | = విష్ణువు; |
| విజయతే | = సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నాడు. |

**తాత్పర్యము :-**

స్వచ్ఛమైన పాలసముద్రము నడుమ స్ఫురించుచు, శంఖ చక్ర కమలముల రేఖారూపముగా ధరించుచు, సాటిలేని లక్ష్మిని ధరించుచు, మత్స్య రూపమును ఆశ్రయించిన విష్ణువు పాదకమలనామమున సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నాడు.

**వివరణము :-**

అమ్మవారి గోళ్ళకాంతి పాలసముద్రము. దాని నడుమ మత్స్యరూప ధారియైన విష్ణువున్నాడు. ఆయన శంఖచక్రకమలముల ధరించియున్నాడు. ఎట్లనగా అమ్మవారి పాదములకు శంఖరేఖ, చక్రరేఖ, కమలరేఖ ఉన్నవి. మత్స్య రేఖయున్నది. ఇట్టి రేఖలు పాదము లందు ధరించియుండుట **ఉత్తమ స్త్రీ** (సాముద్రిక) లక్షణము. అమ్మవారి పాదము లందెనలేని కాంతి యున్నది. ఆ కాంతియే ఇట లక్ష్మిగా చెప్పబడినది. ఇంకేమీ లక్ష్మిని వక్షమున, చేతులలో శంఖచక్ర కమలముల ధరించిన విష్ణు వమ్మవారి పాదములలో ప్రకాశించినాడు. విష్ణువున కిచట అమ్మవారి ***శరీరభాగత్వప్రాప్తి, రూపసాయుజ్యముక్తి*** కలిగినట్లైనది. ఉపాసనా లభ్యములగు సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య రూప ముక్తులు ఇష్ట దేవతా భేదరూపములు కావు. కావున శరీర భాగావయవ స్థితియే సాయుజ్యమను నంశమును శ్రీ శంకరులు తమ శివానందలహరిలో ***'చరాచరాత్మకతనుధ్యానే భవానీపతే సాయుజ్యమ్మమ సిద్ధమ్'*** (28) అని స్పష్టపరచినారు. (మిథ్యా చరాచరాత్మక తనువు యొక్క ధ్యానమునందు చరతనువైన తనకు సాయుజ్య మీ విశ్వమున నుండుట చేతనే బ్రతికియుండగనే సశరీరముగానే ప్రాప్తించుచుండుటచే లోకాంతరలభ్యసాయుజ్యమేల యని శంకరులు చెప్పినారు.) స్వర్గమర్త్యపాతాళములలో నుండుటచే విష్ణువునకు ధామములు మూడైనవి. అందుచే నాతడు త్రిధాముడని చెప్పబడినాడు. ***'అంగాన్యన్యా దేవతాః'*** తై. 1. 5. 1. అను శ్రుతియు పరమేశ్వరున కితర దేవతలంగములని చెప్పుచున్నది. ఈ శ్రుతి ననుసరించి విష్ణురూపమైన అమ్మవారి చరణమున విష్ణు చిహ్నములైన శంఖ చక్ర కమలములు, ఆయన ధరించిన మత్స్య రూపము, ఆయన నాశ్రయించు లక్ష్మి ఉండుట అనురూపముగా సముచితముగా వర్ణింపబడినది.



**అవ:-** పై శ్లోకమున పాలసముద్రమున పవ్వళించు విష్ణువు అమ్మవారి పాదమని చెప్పబడినది. ఈ శ్లోకమున పాలసముద్రమున బుట్టిన దేవతావృక్ష మమ్మవారి పాదమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ నఖశ్రీసన్నద్ధస్తబకనిచితః స్వైశ్చ కిరణైః**
**పిశఙ్గైః కామాక్షి ప్రకటితలసత్పల్లవరుచిః।**

సతాం గమ్యః శఙ్కే సకలఫలదాతా సురతరు-
స్త్వదీయః పాదోఽయం తుహినగిరిరాజన్యతనయే॥ 34

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| తుహినగిరిరాజన్యతనయే | = | హిమవత్పర్వతరాజపుత్రీ! |
| కామాక్షి | = | కామాక్షీదేవీ! |
| నఖశ్రీసన్నద్ధస్తబకనిచితః | = | గోళ్ళకాంతిచే సిద్ధమైన గుత్తులతో కూడిన; |
| స్వైః | = | తనవైన; |
| పిశఙ్గైః | = | ఎఱ్ఱని; |
| కిరణైః | = | కిరణములచేత; |
| ప్రకటితలసత్పల్లవరుచిః | = | ప్రకటింపబడిన ప్రకాశించు చిగుళ్ళ కాంతిగల; |
| సతామ్ | = | సత్పురుషులకు; |
| గమ్యః | = | చేరదగిన; |
| సకలఫలదాతా | = | అన్ని ఫలముల నొసగు; |
| సురతరుః | = | దేవతా వృక్షమైన; |
| త్వదీయః | = | నీ; |
| అయమ్ | = | ఈ; |
| పాదః | = | పాదము (ఇతి); |
| శంకే | = | ఊహించుచున్నాను. |

**తాత్పర్యము :-**

పర్వతరాజపుత్రివైన ఓ కామాక్షీ! గోళ్ళ కాంతులనెడి పూలగుత్తులతో కూడిన ఎఱ్ఱని కిరణముల చిగుళ్ళుగల సద్గమ్యమైన సకల ఫలముల నొసగు నీ పాదము దేవతావృక్షమని యూహించుచున్నాను.

**వివరణము :-**

ఈ శ్లోకమున అమ్మవారి పాదము **కల్పవృక్షము**గా సంభావింపబడినది. కావున ఉత్ప్రేక్షాలంకార మున్నది. పాలసముద్రమున దేవతా వృక్షములు పుట్టిన వనుట పౌరాణిక సమ్మతము. **మందార సంతాన పారిజాత హరిచందనములు** దేవతా వృక్షములు. స్వర్గోద్యానమైన నందనవనమున నుండును. కదంబ వృక్షమునకు **సురవృక్ష**మని వ్యవహారమున్నది. వటాశ్వత్థదేవదార్వాది మహావృక్షముల దేవతారూపమున పూజించుట భారతీయాచారము. దేవతా వృక్షములు కోరికల నొసగును. అందువలన అవి కామితఫలదములు. దేవతా వృక్షములును దేవతలతో పాటు మహాప్రళయమున నశించు నట్టివే. కావున అవి శాశ్వతమైన మోక్షమును ఫలమునీయజాలవు. అమ్మవారి పాదము శాశ్వతము. కావున మోక్షఫలమును కూడ నొసగును. కావున అది సకల ఫలదము

అని చెప్పబడినది. గోళ్ళకాంతులు పూగుత్తులుగా రూపింపబడినవి. అమ్మవారి పాదమునందలి ఎఱ్ఱని కాంతులు చిగుళ్ళుగా రూపింపబడినవి. ఇవి అవయవములు. వీనికి రూపణమున్నది. పాదసురతరువులు సావయవములు కావున రూపకానుప్రాణిత మిందలి ఉత్ప్రేక్షాలంకారము.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చరణమున ఫలదానము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున తచ్చరణగత సఫల యజ్ఞకర్తృత్వము చెప్పబడుచున్నది.

**శ్లో॥ వషట్కుర్వన్మాఞ్జీరకకలకలైః కర్మలహరీ-**
**హవీంషి ప్రోద్దణ్డం జ్వలతి పరమజ్ఞానదహనే।**
**మహీయాన్కామాక్షి! స్ఫుటమహసి జోహోతి సుధియాం**
**మనోవేద్యాం మాతస్తవ చరణయజ్వా విజయతే॥ 35**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| మాతః | = | అమ్మా! |
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |
| మాంజీరకకలకలైః | = | మంజీర సంబంధి కలకల ధ్వనులచేత; |
| వషట్కుర్వన్ | = | వషట్కార మొనర్చుచు; |
| కర్మలహరీహవీంషి | = | కర్మప్రవాహములనెడి హవిస్సులను; |
| ప్రోద్దండమ్ | = | మిక్కిలి యుజ్జ్వలముగా; |
| జ్వలతి | = | మండుచుండగా; |
| స్ఫుటమహసి | = | స్పష్టమైన వెలుగుగల; |
| పరమజ్ఞానదహనే | = | గొప్ప జ్ఞానమనెడి అగ్నిగల; |
| సుధియామ్ | = | ఉత్తమబుద్ధిగల విద్వాంసుల; |
| మనోవేద్యామ్ | = | మనస్సను వేదికయందు; |
| జోహోతి | = | హుతముల నొనర్చుచుండగా; |
| మహీయాన్ | = | పూజనీయమగుచు; |
| తవ | = | నీయొక్క; |
| చరణయజ్వా | = | పాదమను యజమానుడు; |
| విజయతే | = | సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నాడు. |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదము నందలి మంజీరముల కలకల ధ్వనియే వషట్కార ధ్వని. కర్మ ప్రవాహములే హవిస్సులు. పరమజ్ఞానమే అగ్ని. అది స్పష్టముగా జ్వలించుచుండగా

జ్ఞానుల మనస్సనెడి వేదిక యందు హవిస్సుల హోమ మొనర్చుచున్న ఆ పాద మనెడి యజమానుడు సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నాడు.

**వివరణము :-**

వషట్కార పూర్వకముగా యజ్ఞమున హోమము చేయబడును. వషట్కారముతో పాటు **యజామహే** వంటి నాలుగైదు అక్షరములు గల, **స్వాహా** వంటి రెండక్షరములు గల శబ్దములతో గూడ హోమము చేయబడును. హోమము చేయునపుడు చేయబడు మంత్రోచ్చారణ ధ్వనులలో **వషట్** అనునదొకటి. అమ్మవారి మంజీర నాదమే ఇట వషట్కారమైనది. ***'జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా'*** (4.37) అను గీతావచనము ననుసరించి జ్ఞానాగ్ని కర్మ ప్రవాహముల కాల్చును. ఆ జ్ఞానాగ్ని సాధకమనస్సు అను వేదిక యందు ప్రతిష్ఠింపబడును. సాధకులు అనాదిగా నాచరించుచున్న కర్మ ప్రవాహములనెడి హవిస్సుల నమ్మవారి పాదమను యజ్ఞకర్త వ్రేల్చును. హవిస్సులు హుతములగు కొలది జ్ఞానాగ్ని ప్రోద్దండముగా నుండును. వెలుగు ప్రస్ఫుటమగు చుండును. యజమానుడు వెలిగిపోవుచుండును. ఆ దృశ్యము చూచి తీరవలసినదే. కనీసము భావించి తీరవలసినదే. యజ్ఞకర్తయందు మనకు పూజ్యభావము కలుగుచుండును. ఇందు సావయవరూపకాలంకార మొప్పుచున్నది. తైత్తిరీయోపనిషత్తునందలి అంతర్యాగము నందు ***'ఆత్మా యజమానః'*** అని చెప్పబడినది. తదనుగుణముగా అమ్మవారి పాద మాత్మరూపమైనదని ఈ శ్లోకమునందలి అంతర్యాగరూపణమున స్ఫురించుచున్నది.



**అవ:-** పై శ్లోకమున మంజీర నాదమున వషట్కారము చెప్పబడినది. ఈ శ్లోకమున దానియందు మహామంత్ర (వాచికోచ్చారణ) జపము చెప్పబడుచున్నది.

**శ్లో॥ మహామన్త్రం కిఞ్చిన్మణికటకనాదైరివ జపన్**
**క్షిపన్దిక్షు స్వచ్ఛం నఖరుచిమయం భాస్మనరజః।**
**నతానాం కామాక్షి! ప్రకృతిపటురుచ్చాట్య మమతా-**
**పిశాచీం పాదోఽయం ప్రకటయతి తే మాన్త్రికదశామ్॥ 36**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |
| మణికటకనాదైః | = | మణిమంజీరనాదముల చేత; |
| కించిత్ | = | ఏదో యొక; |
| మహామంత్రమ్ | = | మహామంత్రమును; |
| జపన్ ఇవ | = | జపించుచున్నట్లున్న; |
| నఖరుచిమయమ్ | = | గోళ్ళకాంతియనెడి; |
| స్వచ్ఛమ్ | = | నిర్మలమైన; |

| | | |
|---|---|---|
| భాస్మనరజః | = | భస్మమునకు సంబంధించిన పరాగమును; |
| దిక్షు | = | దిక్కులయందు; |
| క్షిపన్ | = | వెదజల్లుచు; |
| ప్రకృతిపటుః | = | స్వాభావికముగా సమర్థమైన; |
| తే | = | నీయొక్క; |
| అయమ్ | = | ఈ; |
| పాదః | = | పాదము; |
| నతానామ్ | = | నమస్కరించినవారియొక్క; |
| మమతాపిశాచీమ్ | = | మమకారమనెడి పిశాచమును; |
| ఉచ్చాట్య | = | ఉచ్చాటన మొనరించి; |
| మాంత్రికదశామ్ | = | మాంత్రిక స్థితిని; |
| ప్రకటయతి | = | ప్రకటించుచున్నది. |

**తాత్పర్యము :-**

అందెల చప్పుడుతో ఏదో ఒక మహామంత్రమును జపించుచు దిక్కుల యందు స్వచ్ఛమైన నఖముల కాంతి యనెడి బూడిదను వెదజల్లుచు స్వభావసిద్ధమైన పటుత్వము గల అమ్మవారి పాదము నమస్కరించు వారి మమకారమను పిశాచముయొక్క ఉచ్చాటన మొనరించుచు మాంత్రికస్థితిని ప్రకటించుచున్నది.

**వివరణము :-**

శబ్ద పునః పునరావృత్తిరూపమైనది **జపము.** దేనిని జపించిన కోరిన ఫలములు సిద్ధించునో అది **మంత్రము.** అట్టి మంత్రములలో శ్రేష్ఠములైనవి మహామంత్రములు. ప్రణవము, శివపంచాక్షరి, శివషడక్షరి, సౌరసప్తాక్షరి, నారాయణాష్టాక్షరి, వాసుదేవ ద్వాదశాక్షరి, దేవీనవావర్ణము, గాయత్రి, దాని గుప్తరూపమైన పంచదశి, షోడశి మొదలగునవి మహామంత్రములు. ఉచ్చాట నాదుల నొనరించు మాంత్రికులు మంత్రజపము నింత సంఖ్యలో నొనరించి కొన్ని తంత్రానుసార క్రియల నొనరించెదరు. వానిలో బూడిద చల్లుట యొకటి. భూతపిశాచములు ఉచ్చాటనార్హములు. అవి ఉన్నచోట జపము చేయు మాంత్రికునికి మనోవైకల్యాది విఘ్నము లేర్పడును. అందుచేత కొన్ని మంత్రముల జపించుచు బూడిద చల్లినచో అవి ఆ చోటనుండి వెడలిపోవును. అట్లు వెడలి పోవునట్లు చేయుటయే **ఉచ్చాటనము.** అమ్మవారి పాదపద్మము నమస్కరించు వారి మమకారమును తొలగించును. మమకారమునందు పిశాచత్వ మారోపింప బడినది. గోళ్ళకాంతియందు భస్మరజస్త్వ మారోపింపబడినది. అట్లే అమ్మవారి పాదమునందు మాంత్రికత్వ ముత్ప్రేక్షింపబడినది. మమకారమును తొలగించుట, పిశాచముల నుచ్చాటన మొనర్చుట కన్న క్లిష్టతరమైన కార్యము. కావున సాధారణమంత్రము లిందు పనికిరావని

**మహామంత్ర** శబ్దము వ్యంజించుచున్నది. ఇవ శబ్దముచే ఈ శ్లోకమున రూపానుప్రాణితోత్ప్రేక్షాలంకార మొప్పుచున్నది.



**అవ:-** పై శ్లోకమున మమతా (అజ్ఞాన) పిశాచమును తొలగించు జ్ఞానము కలిగించు **మహామంత్రజపము** ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున జ్ఞానమను చంద్రుని ఉదయము ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ ఉదీతే బోధేన్దౌ తమసి నితరాం జగ్ముషి దశాం**
**దరిద్రాం కామాక్షి! ప్రకటమనురాగం విదధతీ।**
**సితేనాచ్ఛాద్యాఙ్గం నఖరుచిపటేనాఙ్ఘ్రియుగలీ-**
**పురన్ధ్రీ తే మాతః స్వయమభిసరత్యేవ హృదయమ్॥ 37**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| బోధేందౌ | = | జ్ఞానచంద్రుడు; |
| ఉదీతే | = | ఉదయించుచుండగా; |
| తమసి | = | అజ్ఞానాంధకారము; |
| నితరామ్ | = | మిక్కిలి; |
| దరిద్రామ్ | = | దరిద్రమైన; |
| దశామ్ | = | స్థితిని; |
| జగ్ముషి | = | పొందుచుండగా; |
| ప్రకటమ్ | = | స్పష్టమైన; |
| అనురాగమ్ | = | అనురాగమును; |
| విదధతీ | = | పూనుచు; |
| సితేన | = | తెల్లని; |
| నఖరుచిపటేన | = | గోళ్ళకాంతి యనెడి వస్త్రముతో; |
| అంగమ్ | = | శరీరమును; |
| ఆచ్ఛాద్య | = | కప్పుకొని; |
| తే | = | నీయొక్క; |
| అంఘ్రియుగలీపురంధ్రీ | = | పాదద్వయి అను స్త్రీ; |
| మాతః | = | అమ్మా! |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| స్వయమ్ | = | స్వయంగా; |
| హృదయమ్ | = | హృదయమును; |
| అభిసరతి+ఏవ | = | అభిసరించుచునే యున్నది. |

**తాత్పర్యము :-**

జ్ఞానచంద్రుదుదయించుచుండగా అజ్ఞానమను చీకటి చెదిరిపోవు చుండగా, అనురాగమును స్పష్టీకరించుచు గోళ్ళకాంతి యనెడి తెల్లని దుప్పటితో శరీరమును కప్పుకొని అమ్మవారి పాదయుగళి యను స్త్రీ హృదయమును అభిసరించుచునే యున్నది.

**వివరణము :-**

మూకమహాకవి హృదయము శివ స్వరూపము. దాని కడకు అమ్మవారి పాదయుగళి అను స్త్రీ జ్యోత్స్నాభిసారికా రూపమును ధరించి చేరుచున్నది. తమోభిసారికలు చీకటిరాత్రిలో నల్లని ముసుగు ధరించి ప్రియుని కడకు పోయెదరు. శివ స్వరూపమైన మూక మహాకవి హృదయమను ప్రియుని కడకు అమ్మవారి పాదయుగళి అను స్త్రీ, జ్యోత్స్నాభిసారికయై అభిసరించుచున్నదని పాదయుగళి యందు జ్యోత్స్నాభిసారికాత్వారోపము స్పష్టముగ నుండుటచే నీ శ్లోకమున రూపకాలంకార మున్నది. హృదయ మమ్మవారి పాదయుగళము నభిసరింపవలసియుండగా అమ్మవారి పాదయుగళమే భక్తుని హృదయము నభిసరించుచున్నదని చెప్పుటచేత ఆతనియందు గల భక్త్యున్నతత్వము స్పష్టమగు చున్నది. జ్ఞానమునందు చంద్రత్వము, అజ్ఞానము నందు తమస్త్వారోపము, నఖకాంతియందు సితపటత్వారోపము, పాదయుగళియందలి పురంధ్రీత్వారోపము నకు అవయవములుగా నున్నందున ఇట రూపకాలంకార మొప్పుచున్నది.



**అవ:-** పై శ్లోకమున **ఇందూదయము** ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున సూర్యుడుదయించు **దినారంభము** ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ దినారమ్భస్సమ్పన్నలినవిపినానామభినవో**
**వికాసో వాసన్తః సుకవిపికలోకస్య నియతమ్।**
**ప్రదోషః కామాక్షి! ప్రకటపరమజ్ఞానశశిన-**
**శ్చకాస్తి త్వత్పాదస్మరణమహిమా శైలతనయే॥** **38**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| శైలతనయే | = | పర్వతపుత్రివైన |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| సంపన్నలినవిపినానామ్ | = | సంపదలనెడి కమలముల అడవులకు; |
| అభినవః | = | అతినూతనమైన; |
| దినారంభః | = | ప్రభాతము; |
| సుకవిపికలోకస్య | = | సుకవులనెడి కోకిలల గుంపునకు; |
| వాసన్తః | = | వసన్తఋతువునకు సంబంధించిన; |

| | | |
|---|---|---|
| వికాసః | = | వికాసము; |
| ప్రకటపరమజ్ఞానశశినః | = | స్పష్టమైన గొప్పజ్ఞానమనెడి చంద్రునకు; |
| ప్రదోషః | = | రాత్ర్యారంభమునయిన; |
| త్వత్పాదస్మరణమహిమా | = | నీ పాదముల స్మృతియొక్క మహిమ; |
| నియతమ్ | = | ఎల్లప్పుడును; |
| చకాస్తి | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము :-**

పర్వతపుత్రివైన యో కామాక్షీ! సంపదలనెడి కమలములకు నూతన ప్రభాతము, సత్కవికోకిలలకు వసన్త వికాసము, పరమజ్ఞానచంద్రునకు రాత్ర్యారమ్భము నయిన నీ పాదస్మరణమహిమ ప్రకాశించుచున్నది.

**వివరణము :-**

పాదస్మరణమహిమయందు ప్రభాత, వసన్త, వికాస, ప్రదోషముల ఆరోపము చేయబడుటచే మాలా రూపకాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకమున మూడు ఆరంభములున్నవి.

**1)** *దినారమ్భము*

**2)** *సంవత్సరారంభరూపమైన వసన్తఋతువుయొక్క వికాసము*

**3)** *రాత్రియొక్క ఆరంభరూపమైన ప్రదోషము.*

ఈ మూడు కాలఖండముల ఆరంభములగుటచే అమ్మవారి పాదస్మరణ మహిమ సార్వకాలికమని తెలియుచున్నది. పాదస్మరణ మొనర్చిన వారి పుణ్య ప్రభావము సార్వకాలికమైన అమ్మవారి చరణసాన్నిధ్యమును కలిగించుననియు వ్యంగ్య మగుచున్నది. తృతీయ చతుర్థ పాదములలో వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి యందు **సూర్యస్థితి** ఆరోపింపబడుచున్నది.

**శ్లో॥ ధృతచ్ఛాయం నిత్యం సరసిరుహమైత్రీపరిచితం**
**నిధానం దీప్తీనాం నిఖిలజగతాం బోధజనకమ్।**
**ముముక్షూణాం మార్గప్రథనపటు కామాక్షి! పదవీమ్**
**పదం తే పాతఙ్గీమ్ పరికలయతే పర్వతసుతే!॥ 39**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| నిత్యమ్ | = | ఎల్లప్పుదు; |
| పర్వతసుతే! | = | పర్వతపుత్రివైన; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ!; |

| | | |
|---|---|---|
| ధృతచ్ఛాయమ్ | = | ధరింపబడిన ఛాయ (సూర్యుని భార్య) గలది; |
| సరసిరుహమైత్రీపరిచితమ్ | = | కమలముల మైత్రితో కూడినది; |
| దీప్తీనామ్ | = | కాంతులకు; |
| నిధానమ్ | = | నిధి; |
| నిఖిలజగతామ్ | = | అన్ని లోకములకు; |
| బోధజనకమ్ | = | జ్ఞానమును కలిగించునది; |
| ముముక్షూణామ్ | = | మోక్షమును కోరువారికి; |
| మార్గప్రథనపటు | = | మార్గమును చూపుటలో సమర్థమునయిన; |
| తే | = | నీయొక్క; |
| పదమ్ | = | పాదము; |
| పాతంగీమ్ | = | సూర్య సంబంధమైన; |
| పదవీమ్ | = | స్థితిని; |
| పరికలయతే | = | తెలుపుచున్నది. |

**తాత్పర్యము :-**

ఓ పర్వతపుత్రివైన కామాక్షీ! ఎల్లప్పుడు ఛాయను (ఛాయాదేవి) లేక కాంతిని ధరించుచు, కమలములతో మైత్రిగల కాంతుల గనియైన సమస్త లోకములకు జాగృతిని లేక జ్ఞానమును కలిగించు మరియు ముముక్షువులకు మార్గమును చూపు నీ పాదము సూర్యత్వమును కలిగియున్నది.

**వివరణము :-**

1) అమ్మవారి పాదమునకు కాంతి యున్నది. సూర్యునకు ఛాయాదేవి అను భార్య ఉన్నది. కావున ఉభయమును ధృతచ్ఛాయమే. సూర్యునకు కమల బంధువను పేరున్నది. ఆతని ఉదయమునకు కమలములు వికసించును. మిత్రుడైన సూర్యుని ఉదయమును చూచి ఆనందించునవి. కావున అవి సూర్యుని మిత్రములు. అమ్మవారి పాదము కమల సదృశము. సాదృశ్యము నిమిత్తముగ అదియు కమలములకు మిత్రమే. సూర్యోదయముతో చీకటి తొలగును. అది బాహ్యము. ప్రాణుల హృదయములోని అజ్ఞానము కూడ తొలగును. అనగా నిద్ర వీడును. జ్ఞానము కలుగును. లోకము నిద్రావస్థను వీడి జాగ్రదవస్థను స్వీకరించును. అమ్మవారి పాదము కూడ ఆత్మజ్ఞానహేతువగుటచే బోధ జనకము. ఇట్లు సూర్యత్వము నమ్మవారి పాదము కలిగియున్నదని చెప్పబడుటచే నీ శ్లోకమున దేవీ పాద సూర్యుల ఔపమ్యము స్ఫురించుచున్నది.

2) మొదటి రెండు పాదములలో చెప్పబడిన ఛాయను ధరించుట, కమలములతో మైత్రి, కాంతులు గలిగియుండుట బోధ జనకత్వము మున్నగు సమాన

ధర్మములు ఔపమ్యస్ఫూర్తికి హేతువులు. సంసారాంధకారమున దిక్కుతోచక పరిభ్రమించుచు ఆ అంధకారమునుండి విడివడగోరువారికి (ముముక్షువులకు) అమ్మవారి చరణమే మార్గము చూపవలెను. సూర్యుడందుకు పనికిరాడు. అమ్మవారి పాదమే అందుకు సమర్థము అని సూర్యుని కన్న అమ్మవారి పాదమున విశేషము మూడవ పాదమున స్ఫురించుటచే నీ శ్లోకమున వ్యతిరేకాలంకార స్ఫూర్తి ఉన్నది. ద్వితీయ చతుర్థ పాదములలో వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదము ముముక్షువులకు మార్గము చూపునని చెప్పబడినది. ఈ శ్లోకమున అది కైవల్యసౌధమునకు నిచ్చెన అని చెప్పబడు చున్నది.

**శ్లో॥ శనైస్తీర్త్వా మోహామ్బుధిమథ సమారోఢుమనసః**
**క్రమాత్కైవల్యాఖ్యాం సుకృతిసులభాం సౌధవలభీమ్।**
**లభన్తే నిఃశ్రేణీమివ ఝటితి కామాక్షి! చరణం**
**పురశ్చర్యాభిస్తే పురమథనసీమన్తిని! జనాః॥** **40**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| పురమథనసీమన్తిని | = | శివుని ఇల్లాలా! |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| శనైః | = | మెల్లగా; |
| మోహాంబుధిమ్ | = | మోహమను సముద్రమును; |
| తీర్త్వా | = | దాటి; |
| అథ | = | పిమ్మట; |
| క్రమాత్ | = | క్రమముగా; |
| కైవల్యాఖ్యామ్ | = | కైవల్యమను పేరుగల; |
| సుకృతిసులభామ్ | = | పుణ్యాత్ములకు సుఖముగా లభించు; |
| సౌధవలభీమ్ | = | మేడపై పిట్టగోడను; |
| ఝటితి | = | శీఘ్రముగా; |
| సమారోఢుమనసః | = | ఎక్కగోరు మనస్సుగల; |
| జనాః | = | జనులు; |
| పురశ్చర్యాభిః | = | పురశ్చర్యల చేత; |
| తే | = | నీయొక్క |
| చరణమ్ | = | పాదమును; |
| నిశ్శ్రేణీమ్ ఇవ | = | నిచ్చెననువలె; |
| లభన్తే | = | పొందెదరు. |

**తాత్పర్యము :-**

జనులు మొదట మోహసముద్రమును దాటి, ఆ పిమ్మట కైవల్యమను మేడ పై భాగమున కెక్కగోరువారై శీఘ్రముగా నీ పాదమును నిచ్చెనగా పొంద గలుగుదురు.

**వివరణము :-**

జీవులు మోహసముద్రమున కొట్టుకొని పోవుచుందురు. తరంగములు వచ్చిపడినప్పుడు కొట్టుకొనిపోవుట, మునిగిపోవుట, పైకి లేచుట, మరల మునుగుట, మరల లేచుట జరుగుచునే యుండును. మోహ మనగా మంచి చెడులు గుర్తింపలేని అవివేకము. కొంత కాలమునకు సుకృతఫలముగ వివేకము లభించి మోహాంబుధి వంటి సంసారమునుండి విడివడి కైవల్యమను మేడనెక్కు కోరిక కలుగను. ఈ కోరిక ముముక్ష లేక **ముముక్షుత్వము** అనబడును. కైవల్యమను పేరుగల మేడ కనిపించును. అమ్మో దానినెక్కుట యెట్లు అను నిర్వేదము కలుగును. సంచితపూర్వపుణ్యబలమువలన లేక అమ్మవారి నిర్వ్యాజకృపావిశేషమున అమ్మవారి చరణము లభించును. ఇంకేమున్నది వారికి నిచ్చెన లభించినట్లైనది అను అర్థము లభించుట చేత ఈ శ్లోకమున ఉత్ప్రేక్షాలంకార మేర్పడినది. పురశ్చర్యలతో అమ్మవారి చరణము లభించునని చెప్పబడినది. పురశ్చర్యా శబ్దము సామాన్యముగా అమ్మవారి మంత్రజప మంత్రార్థ ధ్యానములను బోధించును. కాని శ్రీ భాస్కరరాయలు తమ లలితాసహస్రనామ భాష్యమున గురువునుండి మంత్రోపదేశము నొందిన తరువాత శిష్యుడు మంత్రదీక్ష నారంభించుటకు ముందు చేయబడు గురుసేవాదిరూపచర్యయే పురశ్చర్య అని నిర్వచించినారు. గురువునకు అమ్మవారికిని అభేదము భావింపదగి యుండుటచే అమ్మవారి సేవ మంత్రజప మంత్రార్థ ధ్యానములును పురశ్చర్యలే అని గ్రహింపనగును. అటువంటి పురశ్చర్యలచేత అమ్మవారు సాక్షాత్కరించును. అనగా అమ్మవారి చరణము లభించినది. ఈ సాక్షాత్కారము కాంచ్యాది పవిత్ర క్షేత్రములందలి విగ్రహ సాక్షాత్కారమైనను చాలును. వాస్తవమునకు చరణ శబ్దమునకు కుండలిని అను అర్థము కలదు. ఇట్టి బాహ్యవిగ్రహసాక్షాత్కార పుణ్యఫలముగా లోపలి **కుండలిని** సాక్షాత్కరించును. అప్పుడు మూలాధారాది సహస్రారాంతమువఱకుగల కమలసప్తకము అను సోపానసప్తకముగల నిచ్చెన లభించును. చరణమును నిచ్చెనగా నుత్ప్రేక్షించుటలోని పరమార్థమిదియే. చరణశబ్దమును కుండలిన్యర్థకముగా స్వీకరించినప్పుడు చరణమునందు నిశ్శ్రేణిత్వము సముచితముగా నుండును. సహస్రారము క్రిందగా నున్న ఆఱు కమలములలో క్రింది రెండు కమలములు మూలాధార స్వాధిష్ఠానములు **అగ్ని కుండల** మని; మధ్యనున్న మణిపూరానాహత కమలములు **సూర్యకుండల** మని, పైనున్న విశుద్ధాజ్ఞా కమలములు **చంద్రకుండల** మని పిలువబడుట తంత్రములలో కానగును. కుండలత్రయముగల జీవరూపిణియైన కుండలిని సహస్రారమున శివైక్యము నొంది దేహావసానమున కైవల్యము నందును.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చరణ లాభము చెప్పబడినది. ఈ శ్లోకమున దానికి హేతువైన చరణ ప్రసాదము నందలి **ఉన్ముఖత** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ ప్రచణ్డార్తిక్షోభప్రథమసుహృదే ప్రాతిభసరి-**
**త్ప్రవాహప్రోద్దణ్డీకరణజలదాయ ప్రణమతామ్।**
**ప్రదీపాయ ప్రౌఢే భవతమసి కామాక్షి! చరణ-**
**ప్రసాదౌన్ముఖ్యాయ స్పృహయతి జనోఽయం జనని తే॥41**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| జనని! | = | తల్లీ! |
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| ప్రణమతామ్ | = | నమస్కరించినవారియొక్క; |
| ప్రచండార్తిక్షోభప్రథమసుహృదే | = | తీవ్రమైన దుఃఖముల నశింపజేయుట యందు మొదటి మిత్రమైన; |
| ప్రాతిభసరిత్ప్రవాహప్రోద్దండీకరణజలదాయ | = | ప్రతిభకు సంబంధించిన నదియొక్క ప్రవాహమును పెంచు మేఘమైన; |
| ప్రౌఢే | = | తీవ్రమైన; |
| భవతమసి | = | సంసారాంధకారమునందు; |
| ప్రదీపాయ | = | గొప్పదీపమైన; |
| తే | = | నీయొక్క; |
| చరణప్రసాదౌన్ముఖ్యాయ | = | పాదదయ కెదురుపడుట కొఱకు; |
| అయమ్ | = | ఈ; |
| జనః | = | జనుడు; |
| స్పృహయతి | = | ఎదురు చూచుచున్నాడు. |

**తాత్పర్యము :-**

నమస్కరించువారి తీవ్రదుఃఖముల నశింపజేయు మొదటి మిత్రమైన జ్ఞాననదీప్రవాహమును పెంచు మేఘమైన, గాఢమైన సంసారాంధకారమున ప్రదీపమైన అమ్మవారి చరణానుగ్రహ మెప్పుడెదురు వచ్చునో యని ఎదురు చూచుచున్నాను.

**వివరణము :-**

అమ్మవారి చరణానుగ్రహోన్ముఖ్యమునందు ప్రథమ మిత్రత్వ, జలదత్వ, ప్రదీపత్వము లారోపింపబడుటచే మాలారూపకాలంకార మేర్పడియున్నది. భక్తుడమ్మవారి పాదముల కనుగ్రహము కలుగుట కెదురు చూచుట చరణ ప్రసాదౌన్ముఖ్య శబ్దార్థము.

భక్తుని ఎదురు చూపు అమ్మవారి అనుగ్రహమువలన కలుగు మోక్షాది ఫలప్రాప్తికొఱకు. అమ్మవారి ఎదురుచూపు దుఃఖతప్తుడైన జీవుని దుఃఖములు తొలగించుట కొఱకు, అజ్ఞానముచే శోషించిన జీవుని పునరుజ్జీవనము కొఱకు, సంసారాంధకారమున దిక్కుతోచని జీవుని సత్య మార్గము కనబడు వెలుగును కలిగించుట కొఱకు. ఏ ప్రయోజనము నాశింపక ప్రేమించకుండ నుండలేని ప్రేమ, మంచి హృదయము గల తల్లి ప్రేమను పొందిన జీవునకు మాత్రమే అనుభవనీయము. అజ్ఞానముచే జడత్వమునంది నీరసించిన వానిలో ప్రతిభ ప్రవహించు నట్లొనర్చు ప్రేమ చల్లని హృదయముగల తల్లికి మాత్రమే ఉండును. సంసారాంధకారమున దారిగానక తొట్రుపడుచు పడుచు లేచుచు మరల పడుచున్న జీవునకు తానే కన్నై చేయిపట్టి నడిపించు నేర్పు ఓర్పు తల్లియందే ఉండును. అందుకే ఆ అనుగ్రహమున కొకవైపు తల్లి మరొకవైపు జీవుడు ఉందురు. అమ్మవారి కభిముఖుషయ్యు ఆ యిద్దఱ నేకమొనర్చువఱకు స్పందించుచు అట్టి అనుగ్రహముకొఱకు మనమును ఎదురు చూచుచుందుము గాక! ప్రసాదౌన్ముఖ్య శబ్దముయొక్క ప్రసాదముయొక్క ఔన్ముఖ్యము, ప్రసాదము కొఱకు ఔన్ముఖ్యము అను రెండు విధముల విగ్రహముల ననుసరించి పైన కొంత వివరింపబడినది. అమ్మవారికిని ఆమె పాదమునకు అభేదము లేక తాదాత్మ్యమే యని వేఱుగా చెప్పనక్కఱలేదు. నవనవోన్మేషశాలిని యైన ప్రజ్ఞకు ప్రతిభ అని పేరు. కొత్త విషయములను ఆవిష్కరించు మనోవాక్ప్రవృత్తి ప్రతిభ, పాత విషయములను క్రొత్తగా ఒనరింపగల ప్రజ్ఞ ప్రతిభ. నాల్గవ పాదమున వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున జలద సరిత్ప్రవాహములు ప్రస్తావింపబడినవి. ఈ శ్లోకమున వానిచే నుజ్జీవింపజేయబడు ప్రవాలము ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ మరుద్భిస్సంసేవ్యా సతతమపి చాఞ్చల్యరహితా**
**సదారుణ్యం యాన్తీ పరిణతిదరిద్రాణసుషమమ్।**
**గుణోత్కర్షాన్మాఞ్జీరకకలకలైస్తర్జనపటుః**
**ప్రవాలం కామాక్ష్యాః పరిహసతి పాదాబ్జయుగలీ॥ 42**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| మరుద్భిః | = | వాయువులచేత; |
| సంసేవ్యా | = | సేవింపదగినది; |
| సతతమ్ అపి | = | ఎల్లప్పుడును; |
| చాంచల్యరహితా | = | చంచలత లేని; |
| సదా | = | ఎల్లప్పుడు; |
| ఆరుణ్యమ్ | = | ఎఱుపును; |

| | | |
|---|---|---|
| యాన్తీ | = | పొందుచున్న; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| పాదాబ్జయుగలీ | = | పాదకమలముల జంట; |
| గుణోత్కర్షాత్ | = | గుణముల అతిశయమువలన; |
| మాంజీరకకలకలైః | = | అందెల గలగలలతో; |
| తర్జనపటుః | = | బెదిరించుటయందు సమర్థమై; |
| పరిణతిదరిద్రాణసుషమమ్ | = | పరిణామమున తగ్గిన కాంతిగల; |
| ప్రవాలమ్ | = | చిగురుటాకును; |
| పరిహసతి | = | వెక్కిరించుచున్నది. |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదమును దేవతలు సేవించెదరు. దాని కెప్పుడు చంచలత లేదు. ఎప్పుడును ఎఱుపు గలిగియే యుండును. అధికగుణములు గలిగి యున్నందువలన అది కొంత కాలము తరువాత వన్నె తగ్గు చిగురుటాకును తన అందెల గలగలలతో బెదిరించుచు పరిహసించుచున్నది.

**వివరణము :-**

అమ్మవారి పాదము ఉపమేయము. చిగురుటాకు ఉపమానము. ఉపమానమైన చిగురుటాకు నమ్మవారి పాదము పరిహసించుట ఉపమాన తిరస్కారము. ఆ కారణము చేత ఈ శ్లోకమున ప్రతీపాలంకార మొప్పుచున్నదని గ్రహింపవలెను. అందెల గలగలలకు బెదరించుటతో సంబంధము లేకున్నను సంబంధ మున్నట్లు చెప్పబడినందున అతిశయోక్త్యలంకారము కూడ ఉన్నది. **మరుద్భిస్సంసేవ్యా** అను సమాసము శబ్దశ్లేష గలదై గాలుల లేక దేవతలచేత సంసేవింపదగినదను రెండు అర్థములను చెప్పునదగుటచే శ్లేషబలమున మరుత్సంసేవ్యత అను సమానధర్మమును చెప్పినందున ప్రవాల పాదముల ఔపమ్యము స్ఫురించినను ఇది ఉపమాలంకారము కాదు. అది కేవలము వాని కుపమానోపమేయ భావమును మాత్రమే చెప్పును. చిగురుటాకు పరిణామమున అనగా పండిన కొలది, ఎండిన కొలది వన్నె గోల్పోవును. అమ్మవారి పాదము నందెప్పుడు వన్నె యొప్పు చుండును. ఈ విధముగా అమ్మవారి పాదములు చిగురుటాకు కన్న అధిక గుణములు కలవి. ఈ గుణోత్కర్ష ఆ పాదము లందలి అనంత కల్యాణ గుణముల వ్యంజించును.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి పాదములందు ***గుణోత్కర్ష*** చెప్పబడినది. ఈ శ్లోకమున కొన్ని గుణములు చెప్పబడుచున్నవి.

శ్లో॥ జగద్రక్షాదక్షా నలినరుచిశిక్షాపటుతరా
సురైర్నమ్యా రమ్యా సతతమభిగమ్యా బుధజనైః।
ద్వయీ లీలాలోలా శ్రుతిషు సురపాలాదిముకుటీ -
తటీసీమాధామా జయతి తవ కామాక్షి! పదయోః॥ 43

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| జగద్రక్షాదక్షా | = | లోకముల కాపాడుటయందు దక్షతగల; |
| నలినరుచిశిక్షా పటుతరా | = | కమలముల కాంతియొక్క శిక్షయందు మిక్కిలి సమర్థమైన; |
| సురైః | = | దేవతలచేత; |
| నమ్యా | = | నమస్కరింపదగిన; |
| రమ్యా | = | అందమైన; |
| బుధజనైః | = | విద్వజ్జనులచేత; |
| సతతమ్ | = | ఎల్లప్పుడు; |
| అభిగమ్యా | = | చేరదగిన; |
| శ్రుతిషు | = | వేదములయందు; |
| లీలాలోలా | = | విహరించు ఆటయందు ఆసక్తిగల; |
| సురపాలాదిముకుటీతటీసీమాధామా | = | ఇంద్రాదుల కిరీట తటముల అంచులకు చోటైన; |
| పదయోః | = | పాదములయొక్క; |
| ద్వయీ | = | జంట; |
| జయతి | = | సర్వోత్కర్షముగా వర్థిల్లుచున్నది. |

**తాత్పర్యము :-**

లోకముల కాపాడు దక్షతగల, కమలముల కాంతిని శిక్షించుట యందు మిక్కిలి సమర్థమైన దేవతలచేత, చేరదగిన వేదములయందు విహరించుట యందాసక్తమైన ఇంద్రాది దేవతా కిరీటముల అంచున నొఱయు అమ్మవారి పాదముల జంట సర్వోత్కర్షముగా వర్థిల్లుచున్నది.

**వివరణము :-**

జగద్రక్షణ సామర్థ్యము సర్వదేవత నమ్యత, రమ్యత, విద్వజ్జనాభిగమ్యత శ్రుతి విహరణ లీలత్వము మొదలగు ఉత్కృష్టకల్యాణగుణములున్నట్లు చెప్పబడుట చే నీ శ్లోకమున ఉదాత్తాలంకారమున్నది. సుర నమ్యత ఇంద్రాదులైన కొందఱు దిక్పాలకులకున్న సామాన్యగుణము. అది ఇంద్రాది కిరీట తటసీమాధామము అను విశేషము చేత నమ్యతయే

అని నాలుగవ పాదము సురనమ్యతను వివరించి తెలుపుచున్నది. సతతమ్ శబ్దమును అన్ని విశేషములకును అన్వయించినచో ఆ గుణములు నిత్యములని స్పష్టమగును. సదృశత్యభిమానముకల కమలములను మాత్రమే శిక్షించు చరణములతో తదితర సర్వజీవరక్షణమును జగద్రక్షా శబ్దము వ్యంజించును. దీనివలన శిక్షించగలనని చెప్పుటచే ఒకతిద్దతిని శిక్షించినను అందఱిని రక్షింపగల రక్షణ గుణాధిక్యము తున్మూలమైన కారుణ్యమును తెలుపును. అదిగాక శిక్షించుట పాప నిర్మూలన మొనర్చుటయే. కావున అది కూడా ఆమె కారుణ్యమును వ్యంజింపజేయును. విద్వజ్జనులును ఆమె చరణముల సేవించెదరని చెప్పుట జ్ఞానులకు భక్తి అపహరణీయమని వ్యంజించుచున్నది. ఈ అంశము మధుసూదనసరస్వత్యాదికృత భక్తిరసాయనాది గ్రంథములలో స్పష్టము చేయబడినది. రెండు పాదములు అను ద్వివచనమున చెప్పక ద్వయీ అని ఏకవచనమున చెప్పుటచేత ఈ చరణద్వయ మద్వైతముక్తిని, ద్వైతాభావ భంజనము ద్వారా ప్రసాదించునని వ్యంగ్యమగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున చరణముల కొన్ని గుణములు చెప్పబడినవి. ఈ శ్లోకమున దాదాపు అట్టి గుణములే భంగ్యంతరమున చెప్పబడుచున్నవి.

**శ్లో॥ గిరాం దూరౌ చోరౌ జడిమతిమిరాణాం కృతజగ-**
**త్పరిత్రాణౌ శోణౌ మునిహృదయలీలైకనిపుణౌ।**
**నఖైః స్మేరౌ సారౌ నిగమవచసాం ఖణ్డితభవ-**
**గ్రహోన్మాదౌ పాదౌ తవ మనసి కామాక్షి! కలయే ॥ 44**

ప్రతిపదార్థము :-

| | |
|---|---|
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ! |
| గిరామ్ | = వాక్కులకు; |
| దూరౌ | = దూరములైన; |
| జడిమతిమిరాణామ్ | = జాడ్యములను చీకట్లయొక్క; |
| చోరౌ | = దొంగలైన; |
| కృతజగత్పరిత్రాణౌ | = చేయబడిన జగద్రక్షణముగల; |
| శోణౌ | = ఎఱ్ఱనైన; |
| మునిహృదయలీలైకనిపుణౌ | = మునులయొక్క హృదయములందలి విహారమునందు ముఖ్యమైన నైపుణ్యముగల; |
| నఖైః | = గోళ్ళతో; |
| స్మేరౌ | = కొంచెము నవ్వుచున్న; |
| నిగమవచసామ్ | = దేవతా వాక్కులయొక్క; |

సారౌ = సారములైన;
ఖండితభవగ్రహోన్మాదౌ = ఖండింపబడిన సంసారమను దయ్యము వలన పిచ్చిగల;
తవ = నీయొక్క
పాదౌ = పాదములను;
మనసి = మనస్సున;
కలయే = ధ్యానించుచున్నాను.

**తాత్పర్యము :-**

వాక్కుల కందనట్టి జాడ్యాంధకారముల హరించునట్టి, జగత్తులను రక్షించునట్టి, ఎఱ్ఱనివైనట్టి, ముని హృదయములలో విహరించుటలో సామర్థ్యము గలిగినట్టి, గోళ్ళతో నవ్వునట్టి, వేదవాక్కుల సారమైనట్టి సంసారగ్రహమువలన కలుగు పిచ్చిని తొలగించునట్టి నీ పాదముల నమ్మా, కామాక్షీ! మనస్సున ధ్యానించెదను.

**వివరణము :-**

పై శ్లోకమున జగద్రక్షాదక్షా అను సమాసముచే చెప్పబడిన జగద్రక్షణమే ఈ శ్లోకమున **కృతజగత్పరిత్రాణౌ** అను సమాసముచే చెప్పబడినది. అట్లే పై శ్లోకమున ***శ్రుతిషు లీలాలోలా*** అను పదములచే చెప్పబడిన శ్రుతివేద్యత ఈ శ్లోకమున ***నిగమ వచసాం సారౌ*** అను పదములచే చెప్పబడినది. అట్లే పై శ్లోకమున శిక్ష శబ్దముచే చెప్పబడిన ఒక ప్రహసనక్రియ ఈ శ్లోకమున ఖండిత చోర శబ్దములచే చెప్పబడినది. పై శ్లోకమున చెప్పబడిన ***లీలాలోలత,*** ఈ శ్లోకమున ***లీలైక నిపుణ*** శబ్దమున చెప్పబడినది. పై శ్లోకమున చెప్పబడని ఒకటి రెండు గుణములను అనగా అమ్మవారి పాదముల వాగగోచరత్వము సంసారనాశకరణ సామర్థ్యము ఈ శ్లోకమున చెప్పబడినవి. పూర్వార్ధమున రెండు పాదముల ఆది ప్రాసమున్నది. ప్రతి పాదమున ***దూరౌ చోరౌ, త్రాణౌ శోణౌ, స్మేరౌ సారౌ, మూఢౌ పాదౌ*** అను వదముల జంటలలో వృత్త్యనుప్రాసములున్నవి. అమ్మవారి పాదములు గిరాం దూరౌ అని చెప్పుటచే నిగమవచసాం సారౌ అని చెప్పుట విరోధాభాసము. వాక్కుల కవి వాచ్యములు కావు. తాత్పర్యము లగును. అని చెప్పిన విరోధము పరిహృత మగును.



**అవ:-** పై శ్లోకమున నొక విరోధాభాసము చెప్పబడినది. ఈ క్రింది శ్లోకమున మరికొన్ని విరోధాభాసములు చెప్పబడుచున్నవి.

**శ్లో॥ అవిశ్రాన్తం పఙ్కం యదపి కలయన్యావకమయం**
**నిరస్యన్కామాక్షి! ప్రణమనజుషాం పఙ్కమఖిలమ్।**
**తులాకోటిద్వన్ద్వం దధదపి చ గచ్ఛన్నతులతాం**
**గిరాం మార్గం పాదో గిరివరసుతే! లఙ్ఘయతి తే ॥** **45**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| అవిశ్రాంతమ్ | = | ఎల్లప్పుడు; |
| యావకమయమ్ | = | లత్తుకయను; |
| పంకమ్ | = | బురదను; |
| కలయన్ యదపి | = | ధరించుచున్నను; |
| ప్రణమనజుషామ్ | = | నమస్సుతో కూడిన వారియొక్క; |
| అఖిలమ్ | = | మొత్తము; |
| పంకమ్ | = | బురదను; |
| నిరస్యన్ | = | నిరసించుచు; |
| తులాకోటిద్వంద్వమ్ | = | అందెల జతను; |
| దధత్ అపి | = | ధరించుచున్నను; |
| అతులతామ్ | = | సాటిలేని తనమును; |
| గచ్ఛన్ | = | పొందుచు; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| గిరివరసుతే | = | ఓ పర్వతరాజపుత్రీ! |
| తే | = | నీయొక్క; |
| పాదః | = | పాదము; |
| గిరామ్ | = | వాక్కులయొక్క; |
| మార్గమ్ | = | మార్గమును; |
| లంఘయతి | = | దాటుచున్నది. |

**తాత్పర్యము :-**

పర్వతరాజపుత్రివైన ఓ కామాక్షీ! లత్తుక యను బురదను (పంకమును) ధరించియు, నమస్కరించువారి పంకమును (పాపమును) తొలగించుచు, తులాకోటి ద్వంద్వము (అందెల జతను) ధరించియు అతులత్వమును పొందుచు నీ పాదము వాక్కుల మార్గము దాటుచున్నది.

**వివరణము :-**

అమ్మవారు లత్తుకయను పంకమును ధరించియు నమస్కారమొనర్చు వారి పంకము నెట్లు పోగొట్టును. శుద్ధజలమే పంకమును పోగొట్టగలదు. బురద గలది ఇతరులకు బురద నంటించునే కాని తొలగించుట యెట్లు సంభవము అను విరోధమును నమస్కరించు వారి పంకమును అనగా పాపమును అది పంక శబ్దమునకు పాపము అను అర్థమును చెప్పి విరోధమును పరిహరింపవచ్చును. తులాకోటిద్వంద్వమనగా అందెల జత. అది ధరించిన పాదము అతుల ఎట్లగును? అను విరోధము అందెను బోధించు శబ్దమున తులా శబ్దముండుటయే విరోధము. కాని అందు సామ్యము అను

అర్థము లేనే లేదు. కావున అర్థము గ్రహించిన వెంటనే విరోధస్ఫూర్తి తొలగును. ఇంతకు అమ్మవారి పాదము పంకజము కాదు. కావున పంక స్పర్శ లేదు. పంకమున చరించు నవసరము లేదు. అమ్మవారి పాదమును చూచి పంకజమేమో అను భ్రాంతి తుమ్మెదలకు కలుగవచ్చును. కీటకమునకు భ్రాంతి గలుగం పోయిన నేమి? అమ్మవారి పాదము యావకమును ధరించియున్నది. అందువలన దానికి పంక స్పర్శ ఉన్నది. అది నమస్కరించు వారి పాపపంకమును తొలగించుటలో విరోధము లేదు. కాని పంకమును (లత్తుక) ధరించి పంకమును తొలగించుట అను వ్యవహారమున విరోధము స్ఫురించుచున్నది. అట్లే తులాకోటిద్వంద్వమును అనగా రెండు కోట్ల సామ్యములను ధరించు పాదము అతులతను పొందుట అను విరోధము వ్యావహారకము మాత్రమే. అది భాషాగతమే, అర్థగతము కాదు. అర్థము గ్రహించిన వెంటనే విరోధస్ఫూర్తి తొలగును. ఇట్లు వాగ్వ్యవహార విరోధి కావున అమ్మవారి పాదము వాక్కుయొక్క మార్గమును లంఘించుచున్నది. మాటకందని మహిమ గలదగుటచేత అసలు గుణములే లేని నిర్గుణ మగుట చేతను అమ్మవారి పాదము మాటల మార్గమును దాటును. **'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ'** తై. 2. 4. 1 అను శ్రుత్యర్థ మీ శ్లోకమున చెప్పబడినది.



**అవ:-** పై శ్లోకమున విరోధము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున విరోధిని వడకించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ ప్రవాళం సవ్రీడం విపినవివరే వేపయతి యా**
**స్ఫురల్లీలం బాలాతపమధికబాలం వదతి యా।**
**నవాం సన్ధ్యాం వన్ధ్యాం విరచయతి యా వర్ధయతు సా**
**శివమ్మే కామాక్ష్యాః పదనలినపాటల్యలహరీ ॥ 46**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| యా | = | ఏది; |
| విపినవివరే | = | అడవిగుహలో; |
| సవ్రీడమ్ | = | సిగ్గుతో కూడిన; |
| ప్రవాలమ్ | = | చిగురుటాకును; |
| వేపయతి | = | వడికించునో; |
| యా | = | ఏది; |
| స్ఫురల్లీలమ్ | = | ప్రకాశించు క్రీడగల; |
| బాలాతపమ్ | = | లేతయెందను; |
| అధికబాలమ్ | = | శిశువుగా; |
| వదతి | = | చెప్పునో; |

| | | |
|---|---|---|
| యా | = | ఏది; |
| నవామ్ | = | నూతనమైన; |
| సన్ధ్యామ్ | = | సన్ధ్యను; |
| వన్ధ్యామ్ | = | వ్యర్థమైన దానినిగా; |
| విరచయతి | = | చేయునో; |
| సా | = | ఆ; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| పదనలినపాటల్యలహరీ | = | పాద పద్మముల ఎఱుపు ప్రవాహము; |
| శివమ్ | = | శుభమును; |
| మే | = | నాకు; |
| వర్ధయతు | = | పెంచునుగాక! |

**తాత్పర్యము :-**

అడవిలో సిగ్గుపడుచున్న చిగురుటాకును వడకించుచు, క్రీడించు లేత యెండను శిశువని చెప్పుచు, నూతనమైన సంధ్యను వ్యర్థ మొనరించుచు అమ్మవారి పాద పద్మారుణ కాంతి ప్రవాహము నాకు శుభమును పెంచుగాక!

**వివరణము :-**

ఉపమానములైన ప్రవాల బాలాతప సన్ధ్యలను తిరస్కరించుట అమ్మవారి పాదము నందున్నట్లు స్ఫురించుటచే ప్రతీపాలంకార మొప్పుచున్నది. మూడు పాదములందు మూడు ప్రతీపాలంకారము లుండుటచే మాలా ప్రతీపాలంకార మని చెప్పనొప్పును. ప్రవాలమునకు సిగ్గుతో సంబంధము లేకున్నను ఉన్నట్లు చెప్పుటచేత ప్రథమపాదమున అతిశయోక్త్యలంకారము కూడ నున్నది. సహజమైన కదలికను వడకుటగా సంభావించుటవలన ఉత్ప్రేక్షాలంకార మొప్పుచున్నది. బాలాతపము బాలుడని చెప్పుట సముచితముగా ఉన్నది. నాలుగవ పాదమున 'సంధ్యామ్', 'వంధ్యామ్' అను వృత్త్యనుప్రాసమను శబ్దాలంకార మున్నది. రెండవపాదము తప్ప మిగిలిన మూడుపాదములలో పాదాది ప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి ***పాదములందలి ఎఱుపు*** వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఆ ***పాదముల గోళ్ళ తెలుపు*** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ కిరన్జ్యోత్స్నారీతిం నఖముఖరుచా హంసమనసాం**
**వితన్వానః ప్రీతిం వికసదమలామ్భోరుహరుచిః।**
**ప్రకాశః శ్రీపాదస్తవ జనని కామాక్షి! తనుతే**
**శరత్కాలప్రౌఢిం శశిశకలచూడప్రియతమే!॥** **47**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| శశిశకలచూడప్రియతమే | = | శివుని యిల్లాలా! |
| జనని! | = | తల్లీ! |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| నఖముఖరుచా | = | గోటి చివరి కాంతిచేత; |
| జ్యోత్స్నారీతిమ్ | = | వెన్నెలయొక్క రీతిని; |
| కిరన్ | = | వెదజల్లుచు; |
| హంసమనసామ్ | = | హంసల మనస్సులకు; |
| ప్రీతిమ్ | = | సంతోషమును; |
| వితన్వానః | = | పెంచుచు; |
| వికసదమలాంభోరుహరుచిః | = | వికసించుచున్న స్వచ్ఛమైన కమలకాంతిగల; |
| ప్రకాశః | = | ప్రకాశమైన; |
| తవ | = | నీయొక్క |
| శ్రీపాదః | = | పూజ్యపాదము; |
| శరత్కాలప్రౌఢిమ్ | = | శరత్కాలముయొక్క ప్రౌఢిత్వమును; |
| తనుతే | = | విస్తరింపజేయుచున్నది. |

**తాత్పర్యము :-**

గోళ్ళ చివరల కాంతిచేత హంసల మనస్సులకు వెన్నెలలో విహరించిన ప్రీతిని కలిగించుచు వికసించు స్వచ్ఛమైన కమలముల కాంతిగలదైన అమ్మవారి పాదము శరత్కాలమును వెలయింపజేయుచున్నది.

**వివరణము :-**

హంసలు కమలముల ప్రేమించునట్లు హంసలు (సన్యాసులు) నీ పాదముల ప్రేమించుచున్నారు. కమలములు హంసల కానందము కలిగించునట్లు, అమ్మవారి పాదకమలము హంసలకు (సన్యాసులకు) ఆనందము కలిగించుచున్నవి. శరత్కాలమున కమలముల స్వచ్ఛత పెఱుగును. వెన్నెలలు గూడ స్వచ్ఛముగా విరియును. మేఘములు తొలగుట ఆ రెండింటి (కమలముల, వెన్నెలల) స్వచ్ఛతకు కారణము. పాదముకూడ నఖముఖహంస రుచిలో మనస్సులలో వెన్నెల (సంతోషము) చిలకరించుచున్నది. శరత్కాలము హంసల మనస్సులో స్వచ్ఛమైన వెన్నెల విరజిమ్ముటలో సందేహమే లేదు. కావున పాదము శరత్కాలప్రౌఢిమను కలుగజేయుచున్నది. కాగా శరత్కాలమే కమలమును స్వచ్ఛముగా ప్రకాశించునట్లు చేయుచున్నది. వర్షాకాలములలో హంసల కంత ఆనంద ముండదు. ఇతర కాలములలో దాని ప్రకాశమంత స్వచ్ఛము కాదు. కావున కమలము కంటే పాదమే గొప్పది. అది సృష్టించిన వెన్నెలలో హంసలు (సన్యాసులు) ఆనందించెదరు.

సాధారణముగా కమల మెఱ్ఱనిదే. అయినను నఖముఖరుచి తెల్లనిది. కావున ఇచట స్వచ్ఛమైన కమలము అనగా తెల్లని కమలమునే గ్రహింపవలెను. సాధారణముగా హంసలను మాత్రమే ఆనందింప జేయగల శరత్కాలము పరమహంసల నానందింప జేయలేదు. ఈ అర్థమంతయు శ్లోకములోని శబ్దార్థశ్లేషలవలన వ్యంగ్యమగుచున్నది. ద్వితీయ చతుర్థ పాదములలో వర్ణమైత్రి ఉన్నది. ప్రథమ ద్వితీయ పాదముల మధ్య ప్రాసమున్నది. నఖముఖ శశికల పదములలో వృత్త్యనుప్రాసమున్నది. ఈ శ్లోకమున పాదకమలముల పాదశరత్తుల ఔపమ్యస్ఫూర్తితో పాటు పాదముయొక్క ఆధిక్యమును స్ఫురించుటచే వ్యతిరేకాలంకార స్ఫూర్తి కూడ ఉన్నది. అమ్మవారి ప్రకాశపాదము తెల్లనిది. విమర్శపాదము ఎఱ్ఱనిది. ప్రకాశము శివుడని, విమర్శము శక్తియని తాంత్రిక వ్యవహారము. శ్రీపాదము ప్రకాశము అని చెప్పుట ప్రకాశ విమర్శ సామరస్య బోధకము. ప్రకాశమునుండి విమర్శనము వెలువడి జగత్సర్గాదుల నొనరించి చివఱకు ప్రకాశమునందు లీనమై పోవును. సామరస్యమునందు ప్రకాశవిమర్శభేదము కనిపించదు. అమ్మవారి ఒక పాదము విమర్శ రూపమయ్యు ప్రకాశముగానే మిగిలిపోవును. అని *'ప్రకాశః శ్రీపాదః'* పదములు తెలుపుచున్నవి. శ్రీ శబ్దము అమ్మవారినే గాక పూజ్యులెవరినైన చెప్పుటకు వారి నామమునకు ముందు శ్రీ శబ్దము చేర్చబడును. అపుడు శ్రీ పాదః అను శబ్దము పూజ్యమైన పాదము అను అర్థము నిచ్చును. ***వికచ కరుణాంభోరుహరుచిః*** అను పాఠము పాదము నందలి కరుణను సూచించినను శరత్కాలప్రౌఢిని కలుగజేయుటకు సాయపడదు. కావున ఆ పాఠము సముచితముగా లేదు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కాలిగోటికాంతి వెన్నెల అని చెప్పబడినది. ఈ శ్లోకమున అది ***గంగాజలము***గా చెప్పబడుచున్నది.

**శ్లో॥ నఖాఙ్కూరస్మేరద్యుతివితతిగఙ్గామ్భసి సుఖం**
**కృతస్నానం జ్ఞానామృతమమలమాస్వాద్య నియతమ్।**
**ఉదఞ్చన్మఞ్జీరస్ఫురణమణిదీపే మమ మనో**
**మనోజ్ఞే కామాక్ష్యాశ్చరణమణిహర్మ్యే విహరతామ్॥ 48**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| నఖాంకూరస్మేరద్యుతివితతి గంగాంభసి | = | చిఱుగోళ్ళ నవ్వుకాంతుల సమూహమను గంగా జలము నందు; |
| సుఖమ్ | = | సుఖముగా; |
| కృతస్నానమ్ | = | చేసిన స్నానముగల; |
| అమలమ్ | = | స్వచ్ఛమైన; |
| జ్ఞానామృతమ్ | = | జ్ఞానమను అమృతమును; |

| | | |
|---|---|---|
| ఆస్వాద్య | = | ఆస్వాదించి; |
| నియతమ్ | = | నియమము గలదై; |
| మమ | = | నాయొక్క; |
| మనః | = | మనస్సు; |
| ఉదంచన్మంజీరస్ఫురణమణిదీపే | = | ప్రకాశించుచున్న అందెల యందు ప్రకాశించు మణిదీపములుగల; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| మనోజ్ఞే | = | అందమైన; |
| చరణమణిహర్మ్యే | = | పాదమను మణిసౌధమునందు; |
| విహరతామ్ | = | విహరించుగాక! |

**తాత్పర్యము :-**

గోళ్ళకాంతుల సమూహమనెడి గంగానదియందు స్నానమొనరించి జ్ఞానామృతము నాస్వాదించి నియమము గలిగిన నా మనస్సు అందెలలోని మణులు దీపములుగా గల అమ్మవారి చరణమను మేడయందు విహరించుగాక!

**వివరణము :-**

అమ్మవారు చింతామణి గృహమున నివసించును. ఆ చింతామణి గృహము శ్రీ చక్రమే. అమ్మవారు ఆత్మరూపిణి కావున ఆత్మకు నివాసమైన సాధకుని శరీరము కూడ శ్రీచక్రమే. అమ్మవారి గృహము చింతామణి గృహమైనప్పుడు అమ్మవారి చరణమునకును అదే గృహము. **చరణ** శబ్దమునకు కుండలిని అని అర్థము కూడ ఉన్నందున కుండలినీ నివాసములైన పిండాండ బ్రహ్మాండములు అనగా జీవ పరమాత్మల వ్యష్టి సమష్టి శరీరములు రెండును చరణమణిగృహములే. మణిగృహమున అనగా శ్రీచక్రమున సాధకుడు స్నానమొనరించి ప్రవేశింపవలెను. కావున సాధకుని మనస్సు అమ్మవారి కాలిగోటి కాంతుల సమూహమను గంగానదిలో స్నాన మొనరించినది. సాధకుడు నియమము కలిగియుండి పవిత్రమైన ఆహారమును స్వీకరింపవలెను. కావున సాధకుడు స్వచ్ఛమైన జ్ఞానమనే అమృతమునే ఆహారముగా స్వీకరించినాడు. ***'అవిదిత్వా న ప్రవిశేత్'*** తెలిసికొనక అనగా జ్ఞానమును పొందక ప్రవేశింపరాదు అను నిషేధము ననుసరించి సాధకుడచట జ్ఞానమును ఆహారముగా స్వీకరించినాడు. చరణము అను మణి భవనము అనియే కవి ఉద్దేశించిన అర్థము. ఆయన కా రూపణమందే తాత్పర్య మున్నట్లున్నది. అయినను పై యర్థము గ్రహించుట కవి తాత్పర్యమునకు విరుద్ధము కాదు. మణిగృహమున మణిదీపము లుండును. మణిమంజీరములలోని మణులు కాంతివంతములు కావున అవి మణిదీపములు అని నిరూపింపబడినవి. నఖాంకూరస్మేరద్యుతివితతి గంగాజలముగా, జ్ఞానము అమృతముగా రూపింపబడినది. కావున ఈ శ్లోకమున రూపకాలంకార మొప్పుచున్నది. సమయాచారము ననుసరించి

మణిపూరకమలమునందే అమ్మవారి పూజ నారంభింపవలెను. కావున చరణమణిహర్మ్యశబ్ద మా మణిపూరచక్రమును వ్యంజింపజేయును. మణిపూరమున పాద్యాది భూషణాంతోపచార సమర్పణ మాచరించుట సమయాచారమని శ్రీభాస్కరులు తమ లలితాసహస్రనామ భాష్యమున చెప్పినారు. భూషణములలో పాదభూషణములు మంజీరములు. వానిలోని మణులతో ప్రకాశించునది కావున మణిపూర చక్ర నామము సార్థకము. అమ్మవారు మూలాధారస్వాధిష్ఠానములను తమోమయచక్రముల దాటి సాధకులకు దర్శనమిచ్చుటకు మణిపూరమున వచ్చి చేరినది. అట్లు వచ్చిన అమ్మవారికి పాద్యాది భూషణాంతోపచారము లొనర్పరాదని గౌడపాదులు సుభగోదయస్తుతిలో నిషేధించినారు. అట్లు పూజించు కౌళులను నిందించినారు కూడ. మూలాధారముక్రింద విషు అని ఒక చక్రము, దానిక్రింద అధ స్సహస్రారము కలవు. అధస్సహస్రారమును ఆ అమ్మవారి చరణముగా స్వీకరించినపుడు ఊర్ధ్వ సహస్రార మామె శిరముగా గ్రహింపవచ్చును. శ్రీచక్రము నందలి మొదటి భూపుర మప్పుడధస్సహస్రార స్థానీయమగును. (అమ్మవారి చరణము ఎట్లనిది) శ్రీ చక్రముయొక్క చివరి చక్రము బిందువు. అది అమ్మవారి శిరస్థానీయ మగును. ఇట్లు శ్రీ చక్రములోని తొమ్మిది చక్రములకు శరీరములోని తొమ్మిది (అధస్సహస్రార విషువులను రెండింటిని, మూలాధారాది ఆజ్ఞాంత చక్రములాఱింటిని, ఊర్ధ్వ సహస్రారము తొమ్మిదవది) చక్రములలో సామరస్యము సుకరముగా నుండును. ఇది శ్రీ భాస్కర రాయల కంగీకారము. మనో మనోజ్ఞే అనుచోట ఛేకానుప్రాసమున్నది. 'కూరస్మేర' 'స్నానం జ్ఞానా', 'స్ఫురణమణి', 'చరణమణి' అను శబ్దముల జంటలలో వృత్త్యనుప్రాసాలంకార మున్నది. పైరెండు శబ్దాలంకారములు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదముల భూషణములైన మంజీరములందలి మణులు ప్రస్తావింపబడినవి. ఈ శ్లోకమున ఆ పాదములే **దేవతాశిరోభూషణము** లని చెప్పబడుచున్నది.

**శ్లో॥ భవామ్భోధౌ నౌకాం జడిమవిపినే పావకశిఖా-**
**మమర్త్యేన్ద్రాదీనామధిముకుటముత్తంసకలికామ్।**
**జగత్తాపే జ్యోత్స్నామకృతకవచఃపఞ్జరపుటే**
**శుకస్త్రీం కామాక్ష్యా మనసి కలయే పాదయుగలీమ్॥ 49**

**ప్రతిపదార్థము :-**

భవామ్భోధౌ = సంసారసముద్రమునందు;
నౌకామ్ = నావయైన;
జడిమవిపినే = జాడ్యమను అడవియందు;

| | | |
|---|---|---|
| పావకశిఖామ్ | = | అగ్నిజ్వాలయైన ; |
| అమర్త్యేంద్రాదీనామ్ | = | దేవేంద్రాదులయొక్క; |
| అధిముకుటమ్ | = | కిరీటములందు; |
| ఉత్తంసకలికామ్ | = | శిరోభూషణ కలికయైన; |
| జగత్తాపే | = | జగముయొక్క తాపమునందు; |
| జ్యోత్స్నామ్ | = | వెన్నెలయైన; |
| అకృతకవచఃపంజరపుటే | = | వేద వాక్కుల పంజరమునందు; |
| శుకస్త్రీమ్ | = | ఆడు చిలుకయైన; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| పాదయుగలీమ్ | = | పాదముల జంటను; |
| మనసి | = | మనస్సునందు; |
| కలయే | = | ధ్యానించెదను. |

**తాత్పర్యము :-**

సంసార సముద్రమును దాటిన నావయైన, జాడ్యమను అడవిని కాల్చు అగ్నిశిఖయైన, ఇంద్రాదుల శిరముల నలంకరింపు పూమొగ్గయైన, జగముల తాపమును బాపు వెన్నెలయైన, వేద వాక్పంజరమందు వెలయు చిలుకయైన అమ్మవారి పాదయుగళిని మనమున ధ్యానించెదను.

**వివరణము :-**

అమ్మవారి పాదము నందు నౌకా, అగ్నిశిఖా, ఉత్తంసకలికా, జ్యోత్స్నా శుక స్త్రీ రూపణము లుండుటచే నీ శ్లోకమున మాలా రూపకాలంకార మున్నది. భవమునం దంభోధిరూపణము, జాడ్యమునందు విపినత్వారూపణము, వేదవాక్కు లందు పంజరపుటత్వ రూపణములున్నవి. **కలయే** అను శబ్దమునకు సంభావించెదను అని అర్థమును చెప్పినప్పుడు రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకార మని చెప్పవలెను.



**అవ:-** పై శ్లోకమున ఇంద్రాదుల సిగలోని పూమొగ్గగా అమ్మవారి పాదయుగలి చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి పాదము ఇంద్రపత్నుల శిరము లలంకరించుకొనుటకు సాయపడు అద్దముగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ పరాత్మప్రాకాశ్యప్రతిఫలనచుఞ్చుః ప్రణమతాం**
**మనోజ్ఞస్త్వత్పాదో మణిముకురముద్రాం కలయతే।**
**యదీయాం కామాక్షి! ప్రకృతిమసృణాః శోధకదశాం**
**విధాతుం చేష్టన్తే వలరిపువధూటీకచభరాః॥ 50**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| ప్రణమతామ్ | = | నమస్కరించువారికి; |
| పరాత్మప్రాకాశ్యప్రతిఫలనచుంచుః | = | ప్రకాశింప జేయదగిన పరమాత్మ యొక్క ప్రతిబింబము నందు సమర్థమైన పరమాత్మ యొక్క జీవాత్మయొక్క యు ప్రకాశమును ప్రతిఫలించుట యందు; |
| మనోజ్ఞః | = | మనోహరమైన; |
| త్వత్పాదః | = | నీయొక్క పాదము; |
| మణిముకురముద్రామ్ | = | మణి దర్పణ స్థితిని; |
| కలయతే | = | పొందుచున్నది,; |
| యదీయామ్ | = | దానికి సంబంధించిన; |
| శోధకదశామ్ | = | బాగు చేసుకొను స్థితిని లేక బాగు చేయు స్థితిని; |
| విధాతుమ్ | = | చేయుటకు; |
| ప్రకృతిమసృణాః | = | సహజస్నిగ్ధములైన; |
| వలరిపువధూటీకచభరాః | = | ఇంద్రపత్నియొక్క కేశభారములు; |
| చేష్టంతే | = | వ్యాపారించుచున్నవి. |

**తాత్పర్యము :-**

నమస్కరించు శచీదేవి ఏ పాదములను అద్దములందు తమ కేశముల వంకలను తీర్చుకొనునో లేక అమ్మవారి పాదములను శుభ్రపరచునో అమ్మవారి ఆ పాదమణి దర్పణములు పరమాత్మను పరమాత్మ జీవాత్మలను స్వస్వరూపముగా చూపుటకు సమర్థములై యున్నవి.

**వివరణము :-**

౧ అమ్మవారి పాదమణి దర్పణము లందు శోభకత్వము, శచీ కేశము లందు శోధ్యత, ౨ శచీదేవి కచభరములందు శోభకత్వము, అమ్మవారి పాదమణి దర్పణములందు శోధ్యతయును పర్యాయముగా చెప్పవచ్చును. ౧(అ) అమ్మవారికి శచీదేవి నమస్కరించినది. ఆమె పాదముపై తన తలను మోపినది. ఆమె కచభారమంతయు ఆమె స్వచ్ఛమైన పాదమునందుపడి వాని మసృణత ప్రతిఫలించినది. (ఆ) ఆమె ఎత్తైన పాద పీఠమునకు సమాంతరముగా ఈ శచీదేవి ముఖమున్నది. దానియందామె కేశములు పడియున్నవని ఆమె తెలిసికొని ఆమె వానిని సవరించుకొన్నది. ఇది అంతయు నేల జరిగినది. ఆమె పాదము దర్పణమా? కావచ్చును. లేనిచో ఈ ప్రతిఫలించుట యేమి? అమ్మవారి పాదమణి దర్పణము శచీదేవి తన వెంట్రుకలను శోధించుకొనునట్లు చేసినది. ఈ అంశము ఆమె

పాద స్వచ్ఛత కద్దము పట్టుచున్నది. ఆమె పాదము మణి దర్పణమే యైపోయినది. నమస్కరణ ఫలముగా శచీదేవి తలకట్టు మరింత శోభించినది. ఇంద్రునికి కల్పాంతాయువు సిద్ధించినది. శచీదేవికి ముక్తి అక్కఅలేదు. ఆమెకు దేవతా రాజ్ఞీ వైభవము చాలును. లేదా ఆ వైభవమే మరింత అధికము కావలెను. లేదా అది శాశ్వతముగా నుండవలెను. రాక్షసాదులవలన ఆ వైభవము ననుభవించుటలో ఆటంకము లేర్పడకుండ అవిచ్ఛిన్నముగా ఉండవలెను. పాదరజమామె పాపటయందు, ముఖమందును సిందూరము కావలెను. అందుకే ఆమె నమస్కరించినది. కాని నమస్కరించు భక్తులు విరక్తులు. కావున వారు దేవతల కన్న అధికులు. వారు ఇంద్రాది వైభవము నాశింపరు. తృణీకరించెదరు. వారామె పాదమణి దర్పణము నందేమి చూచిరి. తమ యథార్థమైన పరమాత్మత్వమును దర్శించిరి. తాము పరమాత్ములమే అని వారికి తెలిసినది. కైవల్యము సిద్ధించినది. పరాత్మ శబ్దము పరమాత్మ అను అర్థమంతః సాక్షి పరమాత్మను జీవాత్మను రెంటిని అను అర్థమును ఇచ్చును. విచిత్రమేమనగా దర్పణమందు మిథ్యా ప్రతిబింబమే గోచరించును. అది మిథ్యయే యైనను తన (బింబము) నెట్లు సవరించుకోవలెను. తన యలంకరణము నందేమైన లోపము లున్నచో తెలుపును. దానిని చూచి సవరించుకొనుట లోక స్వభావము. దానికి విరుద్ధముగా ప్రతిబింబ జీవుని యథార్థస్వరూపము నీ మణిదర్పణము తెలుపుచున్నది. ఈశ్వరుడు బింబభూతుడని వేదాంత శాస్త్రజ్ఞులలోని యొక వర్గము వచించును. ఆ వాదము బింబప్రతిబింబవాదముగా ప్రసిద్ధము. ఓయీ! శరీరమునకు దాని ఆత్మకు భేదము బాగా గుర్తించిన వాడా! నీ శరీరమునకు నీలోని జీవాత్మ ప్రభువు. నీ శరీరము దానికి దాసభూతము కావున అది పరార్థము. అనగా ప్రభ్వర్థము. ఆ ప్రభువైన జీవుని సంతోష మావశ్యకమైనచో ఈశ్వరుని ప్రీత్యర్థము శాస్త్రోక్త పద్ధతిని జీవించును. ఆయన బింబము కావున ఆయన నవ్వినచో నీ ప్రభువైన జీవునకు సంతోషము కలుగునని అర్థమిచ్చు శ్రీశంకరుల వాక్యము లున్నవి. ఈ శంకర వాక్యములు ఈశ్వర జీవుల బింబ ప్రతిబింబ భావమునకు శాస్త్రజ్ఞుల బింబప్రతిబింబవాదమునకు ప్రమాణభూతములు. ఈ శ్లోకమున అమ్మవారి చరణదర్పణములో ప్రతిబింబించునది పరమాత్మ ప్రతిబింబమైన పరమాత్మను దర్శించుకొనువారు అమ్మవారికి నమస్కరించు జీవులు బింబములు. ఇది శ్లోకములోని విచిత్రత. (ఇ) అమ్మవారు పరమాత్మయైన శివునకు శరీరభూతము. ఆతడు సైతమొక్కొక్కపరి అమ్మవారి చరణములకు ప్రణమిల్లును. అప్పుడాయనకు కనిపించునది తన జీవభావమే. లేనిచో ప్రాకృతుని పగిది ప్రియురాలి చరణములకు ప్రణమిల్లునా? (ఈ). అమ్మవారికి ఆమె యొనర్చు పంచకృత్యములకు సాక్షిగా నుండు శివునకు అమ్మవారి ఈశ్వరత్వము ఆమె చరణములకు ప్రణమిల్లు జీవులు అందఱు తనకు భిన్నులుగా కన్పించెదరు. తన ఈశ్వరత్వము తనకు దృశ్యమైనందుకు తమ జీవేశ్వర (త్వములకు) భిన్నుడనియు తెలిసికొనును. అది ఆయన స్వరూపావస్థితి. అమ్మవారి చరణమణి దర్పణమున తమను చూచువారికి అదియే కన్పింపవలె ననుకొనిన

అదియే కన్పించును. కొందఱకందుండు ఈశ్వరబింబము కన్పించును. కొందఱకు జీవ ప్రతిబింబము కన్పించును. కొందఱకు జీవ ప్రతిబింబభావమే కన్పించదు. స్వస్వరూప కైవల్యమే స్వస్వరూపావస్థితియే కన్పించును. కన్పించు ననగా అది దృశ్యమనుట కాదు. దర్పణము తద్బింబ ప్రతిబింబము లేమియు లేవు. అంతయు తానే, అంతయును నదియే, ఏమియు కన్పించదు. తనకు బహిరంతస్సులు లేవు. తానే తన ఏకత్వమే. అదియే ఈ దర్పణమునందలి విచిత్రత. ఇది నమస్కరించి చూచుకొను వారి సొమ్ము. ఇట్టి శోధక దిశనే అది కల్పించుచున్నది. ఇది తత్త్వము. పదార్థశోధకత మరొక విచిత్రత ఏమనగా దోషము ఉపాధిగతము. అద్దము ఉపాధి. తద్గత దోషమే తత్ప్రతిబింబ మందున్నట్లు కన్పించును. **ఇది వేదాంత శాస్త్ర వ్యవహార సిద్ధాంతము.** ఇచట ఉపాధి అమ్మవారి చరణ దర్పణము. అది అత్యంత శుద్ధము. దానికి శోధనీయత లేదు. శోధనీయత ఉపాధిగతమై యుండుట వేదాంత శాస్త్ర వ్యవహారసిద్ధము. కాని ఇచట శోధనీయత అందు చూచుకొని తనను (బింబములను) దిద్దుకొనుట, సవరించుకొనుట (దోషములను తొలగించుట). ఇవి అన్నియు బింబధర్మములే. కాని వీని అవసరము లేకుండగనే అమ్మవారి చరణదర్పణము శుద్ధమైన స్వచ్ఛమైన స్వరూపమైన పరమాత్మ సాక్షాత్కరించు చుండగా ఇక వేరు శోధనమేమియు నక్కఱలేదు. చరణ దర్పణాశ్రయము చాలును. దర్పణము స్వయంశుద్ధము. కావున దానికి శోధనీయత లేదు. అపరిశుద్ధమైనను బింబముయొక్క స్వచ్ఛస్వరూపము సాక్షాత్కరించుటచే దర్పణమునందు చూచి దిద్దుకొనవలసిన దేమియు లేదు. ౨ అమ్మవారి చరణమణి దర్పణము త్రిగుణాత్మక ప్రకృతి. (మాయ) అందు శుద్ధసత్త్వము ప్రధానమైనను యత్కించి ద్రజస్తమస్సంపర్కము లేనిదే జగత్ సృష్టి స్థితి లయములు జరగవు. కావున ఆ దర్పణము రజస్సు కలదియే. ఆ రజస్సును తుడుచుటకు కుంచె కావలెను. ఆ కుంచెతనమును వహించి శచీదేవి కేశములు శోధకదశను అనగా శోధకత్వమును చేపట్టి అమ్మవారి పాదములందలి రజస్సును తుడిచివైచినవి. శచీదేవి కేశములందు లేని శోధకత్వమున్నట్లు చెప్పబడుటచే నీ శ్లోకమున అతిశయోక్తియు, శోధకత్వసంభావనముచేత ఉత్ప్రేక్షాలంకారమును ఒప్పుచున్నవి. అమ్మవారి పాద మణిదర్పణరజమును తుడిచినప్పుడది ఆ శచీదేవి పాపిటలో సిందూర మైనది. అది ఇంద్రుని కల్పాంతాయువుగా నొనరించినది అను అర్థమిట వ్యంగ్యము. పూర్వార్ధములోని రెండు పాదములలో వర్ణమైత్రి ఉన్నది. అమ్మవారి పాదమణి ముకురము చిద్ఘన శుద్ధాత్మ స్వరూపము. దాని ప్రకాశము తమపై ష్ఠుటచే తమోమయములైన శచీదేవి కేశములందు చేష్టించు శక్తి కలిగినది. దానివలన శుద్ధాత్మకు మిథ్యారజస్సంపర్కము కలిగినట్లైనది. అమ్మవారి కరుణ ఆ రజమును తుడిచివేయు శక్తిని కేశములకు కలిగించినది.



**అవ:-** తమః ప్రతీకమైన తమోమయములగుటచే నలుపు రంగు కల కేశములు పై

శ్లోకమున ప్రస్తావింపబడినవి. ఈ శ్లోకమున స్వతమఃఖండనము కవిచే అర్థింపబడుచున్నది.

**శ్లో॥ అవిశ్రాన్తం తిష్ఠన్నకృతకవచఃకన్దరపుటీ-**
**కుటీరాన్తః ప్రౌఢం నఖరుచిపటాలీః ప్రకటయన్।**
**ప్రచణ్డం ఖణ్డత్వం నయతు మమ కామాక్షి! తరసా**
**తమోవేతణ్డేన్ద్రం తవ చరణకణ్ఠీరవపతిః॥** **51**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| అకృతకవచఃకందరపుటీకుటీరాన్తః | = | వేద వాక్కులనెడి గుహయను గుడిసెలోపల; |
| అవిశ్రాన్తమ్ | = | ఎల్లప్పుడు; |
| తిష్ఠన్ | = | నివసించుచు; |
| ప్రౌఢమ్ | = | ప్రౌఢయైన; |
| నఖరుచిపటాలీమ్ | = | గోళ్ళ కాంతులను జడల సమూహమును; |
| ప్రకటయన్ | = | ప్రకటించుచు; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| తవ | = | నీయొక్క; |
| చరణకంఠీరవపతిః | = | చరణమను సింహ ప్రభువు; |
| మమ | = | నాయొక్క; |
| ప్రచండమ్ | = | తీవ్రమైన; |
| తమోవేతండేంద్రమ్ | = | తమమను గజరాజును; |
| ఖండత్వమ్ | = | ముక్కలగుటను; |
| నయతు | = | పొందించుగాక! |

**తాత్పర్యము :-**

వేద వాక్కందరమందెల్లప్పుడు విహరించుచు గోళ్ళ కాంతులను జూలును ప్రకటించుచు అమ్మవారి చరణమను సింహప్రభువు ప్రచండమైన నా తమమను గజరాజును ముక్క లొనర్చుగాక!

**వివరణము :-**

అమ్మవారి గోళ్ల కాంతియే జూలు. అమ్మవారి చరణమే సింహ ప్రభువు. సింహ మేనుగును చంపును. అమ్మవారి చరణకంఠీరవమే ఏన్గును చంపును. అది చంపదగిన గజరాజమేది. ఇదిగో అది నా యెదలో నున్న తమస్సే. దాని నమ్మవారి చరణకంఠీరవ పతియే చంపగలదు అను అర్థమును తెలుపు రూపకాలంకారమున్నది. నఖరుచి అమ్మవారి పాదమునందున్నట్లు సింహమునకు కూడ నుండును. కావున నఖరుచి అను విషయము నందు జూలుయొక్క రూపణ మున్నదనియు చెప్పవచ్చును.

సింహము గుహలో నుండునట్లీ చరణ సింహ ప్రభువు వేదవాక్కందరమున నివసించును. వేదవాక్కులు అకృతకములు. అనగా సహజములు. గుహలు కూడ సహజముగ నేర్పడునవి. కావున అవియు అకృతకములే. అకృతకత్వము వేదగుహల సమానధర్మము. ఈ సమానధర్మములవలన చరణకంఠీరవముల ఔపమ్యము బాగుగా స్ఫురించును. అమ్మవారి చరణకంఠీరవపతి కొక ప్రణయసఖి ఉన్నది. ఆమె మిక్కిలి ప్రౌఢ. ఎవరామె? నఖరుచియే. ఆ ప్రియసఖి ఈ యర్థమును ***ప్రౌఢా, ఆలీ, ప్రకటయన్*** శబ్దములు స్ఫురింపజేయుచున్నవి. కావున ఇందు సమాసోక్త్య లంకార స్ఫూర్తి ఉన్నది. సింహము యొక్క రంగు ఎఱ్ఱనిది. అది గాక ఎంతమంది భక్తుల మనస్సులనెడి అడవులలో నివసించు తమోగజములను చంపలేదు. వాని రక్తముతో ఎఱ్ఱబడిన తన దేహకాంతిని శౌర్యచిహ్నముగా ప్రియురాలి సంతోషము కొఱకు చూపించుచున్నదను అర్థమున్నది. మహారాజు తన శౌర్యచిహ్నముగా సంపాదించిన ప్రణయసఖిని సగర్వముగా ప్రకటించునట్లు సింహప్రభువు నఖరుచి యను తన ప్రణయసఖిని (తాను గెలుచుకొన్న దానిని) గర్వముగా లోకమునకు ప్రకటించుచున్నాడను అర్థమును వ్యంగ్యమగుచున్నది. ప్రథమ, చతుర్థ పాదములలో **వర్ణమైత్రి** ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున ***ప్రౌఢా*** ప్రసక్తి ఉన్నది. ఈ శ్లోకమున ప్రౌఢలైన **అమరపురీ పురంధ్రుల లాస్యము** ప్రశంసింపబడుచున్నది.

**శ్లో॥ పురస్తాత్కామాక్షి! ప్రచురరసమాఖణ్డలపురీ-**
**పురన్ధ్రీణాం లాస్యం తవ లలితమాలోక్య శనకైః।**
**నఖశ్రీభిః స్మేరా బహు వితనుతే నూపురరవై-**
**శ్చమత్కృత్యా శఙ్కే చరణయుగలీ చాటురచనాః॥ 52**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తవ | = | నీయొక్క; |
| పురస్తాత్ | = | ఎదుట; |
| లలితమ్ | = | సుందరమైన; |
| ఆఖండలపురీపురన్ధ్రీణామ్ | = | ఇంద్రనగరియందలి స్త్రీలయొక్క; |
| ప్రచురరసమ్ | = | అధికరసముగల; |
| లాస్యమ్ | = | లాస్యమును; |
| ఆలోక్య | = | చూచి; |
| శనకైః | = | మెల్లగా; |
| నఖశ్రీభిః | = | గోళ్ళ కాంతుల చేత; |



| | | |
|---|---|---|
| స్మేరా | = | చిఱునవ్వుగలదై; |
| చరణయుగలీ | = | పాదముల జంట; |
| చమత్కృత్యా | = | చమత్కారముచే; |
| నూపురరవైః | = | అందెల ధ్వనులచేత; |
| చాటురచనాః | = | ప్రశంసా రచనలను; |
| బహు వితనుతే | = | బహుమానించుచున్నవి (అని); |
| శంకే | = | ఊహించుచున్నాను. |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదయుగలి తన ఎదుట ఎక్కువరసము చిప్పిలునట్లు దేవతా స్త్రీలు చేయు లాస్యమును చూచి గోళ్ళకాంతితో నవ్వుచు అందెల రవళిలో బాగున్నదను ప్రశంసావాక్యరచనల బహుమానములుగా నిచ్చుచున్నది.

**వివరణము :-**

అమ్మవారి పాదయుగళి మహారాజ్ఞివలె పీఠముపై కూర్చుని ఉన్నది. దేవతా స్త్రీలు నృత్యము చేసినారు. దాని కా పాదయుగళి మెచ్చుకొనవలె. మెచ్చుకొనుటలో మొదటిది కొంచెము నవ్వుట, నవ్వును పెదవులపై ప్రకటించుట ఉండును. ఈ చిఱునవ్వు నామె పెదవులపై చూపించినది. ఆ పని నామె గోళ్ళకాంతి చేసినది. అనగా గోళ్ళకాంతియే పాదయుగళి నవ్వుచున్నట్లు కనబడునట్లు చేసినది. మెచ్చుకొన్నట్లు తెలుపు సూచన ఏదైన బహుమతి నిచ్చుట. పాదయుగళి అందెల గలగలమనిపించినది. ఆ ధ్వని చెవులలో పడినది. దేవతా స్త్రీలకు పాదయుగళి తమను మెచ్చుకొన్నట్లు అనిపించినది. ఈ శ్లోకము నందలి ఉత్ప్రేక్షాలంకారముననే ఈ యర్థము నిష్పన్నమగుచున్నది. **'ప్రచురరసమ్, లలితమ్'** అను శబ్దములు లాస్యముయొక్క చమత్కృతికి హేతువులను తెలుపుచున్నవి. చమత్కృతి కలిగించినప్పుడే కళాకారుల కళకు సార్థకత్వము, చమత్కృతి కలిగినప్పుడే సహృదయుల రసికతకు సార్థకత. **చాటురచనా** శబ్దము సాధారణముగా నాయకుడు నాయిక కోపము తగ్గింపజేయుట కామె యందు కొంచెముగా నున్న గుణములను పెద్దజేసి చెప్పుట, ఆమె దోషములను గుణములుగా చేసి చెప్పుట మొదలగు వాగ్విన్యాసమును బోధించును. కావ్యాంతర్భాగములుగా గాక విడివిడిగా ఉబుసుపోకకో పరిహాసమునకో ఏదేదో ఊహించుకొనుచు చెప్పిన పద్య రచన అను అర్థమునందు కూడ చాటురచనా శబ్దము వర్తించును. ఈ శ్లోకమున సాధారణ ప్రశంసాపరముగా గాని దేవతా స్త్రీల కించిద్రసవల్లాస్యమును ఔదార్యముతో మెచ్చుకొనుచునే అమ్మవారీ చాటు రచన చేసినది. **'బహు, వితనుతే'** అను శబ్దములు పై అంశమునే వ్యంజించు చున్నవి.



**అవ:-** పై శ్లోకమున రసము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి పాదయుగళి విప్రలంభ శృంగార రసము ననుభవించు పథిక కాంతా సుదృశగా వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ సరోజం నిన్దన్తీ నఖకిరణకర్పూరశిశిరా**
**నిషిక్తా మారారేర్ముకుటశశిరేఖాహిమజలైః।**
**స్ఫురన్తీ కామాక్షి! స్ఫుటరుచిమయే పల్లవచయే**
**తవాధత్తే మైత్రీం పథికసుదృశా పాదయుగలీ॥ 53**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| సరోజమ్ | = | కమలమును; |
| నిన్దన్తీ | = | నిందించుచున్న; |
| నఖకిరణకర్పూరశిశిరా | = | గోళ్ళకాంతియనెడి కర్పూరముచే చల్లనైన; |
| మారారేః | = | శివునియొక్క; |
| ముకుటశశిరేఖాహిమజలైః | = | కిరీటమందలి చంద్రరేఖయొక్క మంచు నీళ్ళచేత; |
| నిషిక్తా | = | స్నానమాడిన; |
| స్ఫుటరుచిమయే | = | స్పష్టకాంతిమయమైన; |
| పల్లవచయే | = | చిగుళ్ళ గుంపునందు; |
| స్ఫురన్తీ | = | ప్రకాశించుచున్న; |
| తవ | = | నీయొక్క ; |
| పాదయుగలీ | = | పాదముల జంట; |
| పథికసుదృశా | = | విరహ కాంతితో; |
| మైత్రీమ్ | = | స్నేహమును; |
| ఆధత్తే | = | చేయుచున్నది. |

**తాత్పర్యము :-**

కమలమును నిందించుచు గోళ్ళకాంతియనెడి కర్పూరమును పూసికొని శివుని కిరీట మందలి చంద్రరేఖలోని మంచుజలములలో స్నానమాడి స్పష్టమైన కాంతియనెడి చిగుళ్ళపై దొర్లాడుచున్న నీ పాదయుగళి విరహిణితో పోల్చదగియున్నది.

**వివరణము :-**

తుమ్మెద వ్రాలిన కమలమును చూచి తనను చుంబించు నాయకుడు దూరగతుడైనాడనే బాధతో అదృష్టవంతమైన ఆ కమలమును నిందించుట విరహిణి చేయునొక పని. విరహతాపమును బాపుకొనుట కామె ఒంటిపై కర్పూరమును పూసికొనెను. మంచునీళ్ళలో స్నానము చేయుచు చిగుళ్ళపై దొర్లును. అమ్మవారి

పాదముల జంట కూడ తన సౌందర్యాధిక్యముచే కమలనింద చేయుచున్నది. పాదయుగలి గోళ్ళకాంతియనెడి కర్పూరమును బూసికొన్నది. శివుని కిరీట మందలి చంద్రరేఖలోని మంచునీట స్నానమాడినది. ఎఱ్ఱని తనకాంతి యనెడి చిగుళ్ళగుంపుపై దొర్లాడుచున్నది. విరహిణివలె నాచరించుటయే విరహిణితో మైత్రి చేయుటగా చెప్పబడినది. కమలనింద, కర్పూరపు పూత, చన్నీళ్ళ స్నానము, చిగురుటాకులపై పడుకొనుట. ఇవన్ని విరహిణు లొనరించుకొను శైత్యోపచారములు. స్నేహితురాండ్రు కూడ తమ యజమానురాండ్రైన విరహిణుల కిట్టి శైత్యోపచారముల నొనరించి వారి విరహతాపము బాప యత్నించెదరనుట కావ్యములలో సాధారణముగా దృశ్యమగు నంశము. శివుడు నమస్కరించినపుడు అమ్మవారి పాదముల జంటపై శివకిరీట గతచంద్రరేఖలో నుండి మంచు జలములు పడుటయే పాదముల జంట స్నానము చేయుటగా చెప్పబడినది. మూడవ పాదమున వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున సౌభాగ్య సంపన్నమైన అమ్మవారి పాదముల యెడ శివుని నమస్కారము వ్యంగ్యము చేయబడినది. ఈ శ్లోకమున నమస్కరించు వారి కమ్మవారి అందెల ధ్వని సంపత్తి నాకర్షింపచేయునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ నతానాం సంపత్తేరనవరతమాకర్షణజపః**
**ప్రరోహత్సంసారప్రసరగరిమస్తమ్భనజపః।**
**త్వదీయః కామాక్షి! స్మరహరమనోమోహనజపః**
**పటీయాన్నః పాయాత్పదనలినమఞ్జీరనినదః॥ 54**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| అనవరతమ్ | = | ఎల్లప్పుడు; |
| నతానామ్ | = | నమస్కరించువారియొక్క; |
| సంపత్తేః | = | సంపద యొక్క; |
| ఆకర్షణజపః | = | ఆకర్షించు జపమైన; |
| ప్రరోహత్ సంసారప్రసర గరిమస్తంభనజపః | = | పెరుగుచున్న సంసార ప్రసారమును స్తంభింపజేయు జపమైన; |
| స్మరహరమనోమోహనజపః | = | మనస్సును మోహింపజేయు జపమైన; |
| త్వదీయః | = | నీకు సంబంధించిన; |
| పటీయాన్ | = | మిక్కిలి సమర్థమైన; |
| పదనళినమంజీరనినదః | = | పాదపద్మముల యందలి అందెలయొక్క ధ్వని; |

నః = మనలను;
పాయాత్ = కాపాడుగాక.

**తాత్పర్యము :-**

నమస్కరించువారికొఱకు, సంపత్తి నాకర్షించుటకొఱకు, పెరుగుచున్న వారి సంసారప్రసారమును స్తంభింపజేయుట కొఱకు, శివుని మనస్సును మోహింపజేయుట కొఱకు చేయదగిన జపధ్వనివలె అమ్మవారి పాదమంజీర నాద మొప్పుచున్నది. అది మనలను కాపాడుగాక!

**వివరణము :-**

మాంత్రికులు ఆకర్షణముకొఱకు మంత్రజపము చేయుదురు. సంపత్తి యొక్క గాని, స్త్రీ యొక్కగాని ఆకర్షణము కొఱకు మంత్రముల జపించెదరు. అట్లే శత్రు స్తంభనము కొఱకు మంత్రముల జపించెదరు. ప్రతిపంథి విద్వాంసుల వాగ్స్తంభనము కొఱకును జపించెదరు. అట్లే శత్రువుల బుద్ధిలో మోహము కలుగుటకును జపించెదరు. (ఇచట ఇష్టుడైన శివుని మనస్సు తనపై మోహము నొందగోరిన అమ్మవారికై పాదయుగళి జపించినది.) ఇంకను భూతోచ్చాటన, శత్రుమారణము మొదలైన అనేక క్రియల సిద్ధికొఱకై మంత్రముల జపించెదరు. అమ్మవారి పాదయుగలి ఒక మాంత్రికురాలు. ఆమె నతుల సంపత్తి నాకర్షించుటకు వారి సంసారప్రసారమును స్తంభింపజేయుటకు జపించును. నతులలో జీవులతో పాటు పరమేశ్వరుడుండుట విచిత్రము. ఆ పరమేశ్వరుని మనమును తనపట్ల మోహమును పొందు నిమిత్తము జపించును. ఇంతకు పాదయుగళి జపించుట అననేమి? అందెల ధ్వనియే ఆ జపముగా సంభావింప బడినది గావున ఇట ఉత్ప్రేక్షాలంకారస్ఫూర్తి యున్నది. అమ్మవారి పాదయుగళి మాంత్రికురాలని చెప్పక పోయినను స్ఫురించుచునే యున్నది. కావున ఇందు సమాసోక్త్యలంకారము కూడ నున్నది. వాచ్యముగా అందెల ధ్వని యందు జపత్వారోపమున్నది. కావున రూపకాలంకారమున్నది. జపము **వాచికము.** వినబడకుండ నుచ్చరింపబడు జపము **ఉపాంశువు.** మనస్సులోనే మంత్రము యొక్క ఆవృత్తి **మానసికము.** అని ధర్మశాస్త్ర గ్రంథములలో ఉపాసనా గ్రంథములలో వివరింపబడినది. పాతంజలయోగసూత్రమున మంత్ర జప మంత్రార్థ భావనలు సాధకున కావశ్యకములని చెప్పబడినది. ద్వితీయ, చతుర్థ పాదములలో వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున శివుని ప్రణామము వ్యంజింపజేయబడినది. ఈ శ్లోకమున **బ్రహ్మావిష్ణ్వాదులప్రణామము** చెప్పబడినది.

**శ్లో॥ వితన్వీథా నాథే! మమ శిరసి కామాక్షి! కృపయా**
**పదామ్భోజన్యాసం పశుపరివృఢప్రాణదయితే!**

పిబన్తో యన్ముద్రాం ప్రకటముపకమ్పాపరిసరం
దృశా నానద్యన్తే నలినభవనారాయణముఖాః॥ 55

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| పశుపరివృఢప్రాణదయితే | = | ఓ శివుని యిల్లాలా! |
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |
| నాథే | = | యజమానురాలా! |
| యన్ముద్రామ్ | = | దేని చిహ్నమును; |
| ప్రకటమ్ | = | స్పష్టముగా; |
| ఉపకమ్పాపరిసరమ్ | = | కమ్పానదీ పరిసరములకు దగ్గఱ; |
| దృశా | = | చూపుతో; |
| పిబన్తః | = | త్రాగుచున్న; |
| నలినభవనారాయణముఖాః | = | బ్రహ్మవిష్ణ్వాదులు, |
| నానద్యన్తే | = | ఆనందపారవశ్యమున ధ్వనించుచున్నారో; |
| (అ) పదాంభోజన్యాసమ్ | = | పాదకమలన్యాసమును; |
| మమ | = | నాయొక్క; |
| శిరసి | = | శిరమునందు; |
| కృపయా | = | దయతో; |
| వితన్వీథాః | = | ఉంచుము. |

**తాత్పర్యము :-**

అమ్మా, నీ పాదన్యాసమును కమ్పానదీతీరప్రాంతమున కంటితో త్రాగుచు బ్రహ్మవిష్ణ్వాదులు ఆనందోద్గారముల నొనర్చుచున్నారు. ఆ పాదన్యాసమును నా శిరముపై దయతో నుంచుము.

**వివరణము :-**

కమ్పానదీతీరప్రాంతములలో అమ్మవారు విహరించినది. ఆ విహార మెప్పుడు జరిగినదో ఎవ్వరును ఎఱుగరు. కాని ఆ విహారమునకు చిహ్నము అమ్మవారి పాదముద్ర ఆ ఇసుక తిన్నెలలో బ్రహ్మవిష్ణ్వాదులకు స్పష్టముగా కానవచ్చినది. దాని నాసక్తితో బ్రహ్మవిష్ణ్వాదులు చూచుటను కవి కంటితో త్రాగుటగా చెప్పినాడు. దర్శనానందముతో వారొనర్చిన ధ్వనులిప్పటికిని వినబడుచున్నవి. **'నానద్యన్తే'** అను క్రియలోని వర్తమానార్థకప్రత్యయ మీ అంశమునకు వ్యంజకము. అమ్మా! అట్టి నీ పాదమును నా తలపై దయతో ఉంచుము అని కవి అమ్మవారిని ప్రార్థించుచున్నాడు. అమ్మవారి పాదన్యాస ముద్ర కమ్పాతీరపులినములల్లో బ్రహ్మవిష్ణ్వాదులకు కనబడుట కూడ అమ్మవారి కృపకు ఫలమే. అందుకే ఆ బ్రహ్మవిష్ణ్వాదులు ఆనందోద్గారము లొనర్చుట.



**అవ:-** పై శ్లోకమున బ్రహ్మ విష్ణ్వాదుల పాద దర్శనానందము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆదిపదగ్రాహ్యులైన దేవతల ప్రణామము చెప్పబడుచున్నది.

**శ్లో॥ ప్రణామోద్యద్బృన్దారకముకుటమన్దారకలికా-**
**విలోలల్లోలమ్బప్రకరమయధూమప్రచురిమా।**
**ప్రదీప్తః పాదాబ్జద్యుతివితతిపాటల్యలహరీ-**
**కృశానుః కామాక్ష్యా మమ దహతు సంసారవిపినమ్॥ 56**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| ప్రణామోద్య ద్బృన్దారక ముకుట మన్దార కలికా విలోల ల్లోలమ్బ ప్రకర మయ ధూమ ప్రచురిమా | = | ప్రణామము కొఱకు సిద్ధించుచున్న దేవతల కిరీటముల మందార కలికలకై చలించు తుమ్మెదల సమూహము అనెడి పొగ యొక్క ఆధిక్యము గల; |
| ప్రదీప్తః | = | ప్రజ్వలించిన; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| పాదాబ్జద్యుతివితతిపాటల్య లహరీకృశానుః | = | పాదకమల కాంతుల గుంపు యొక్క ఎఱుపు ప్రవాహమనెడి అగ్ని; |
| మమ | = | నాయొక్క; |
| సంసారవిపినమ్ | = | సంసారమనెడు అడవిని; |
| దహతు | = | కాల్చివేయును గాక! |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదముల ఎఱ్ఱని ప్రకాశము ప్రజ్వలించిన అగ్నియే. దేవత లా పాదములపై ప్రణమిల్లునప్పుడు వారి శిరస్సులలోని మన్దారముల మొగ్గలకై ఆసక్తి గొనుచున్న తుమ్మెదల సమూహము ధూమాధిక్యమా అనిపించు చున్నది.

**వివరణము :-**

అమ్మవారి చరణములపై తమ తలలు మోపుటకు పాదపీఠమునకు క్రిందుగా కూర్చొని యున్న దేవతలు ఆ లేచుచున్నప్పుడు వారి శిరస్సులలోని మన్దారముల మొగ్గలకై తిరుగాడు తుమ్మెదలు అంతకన్న బాగుగా వికసించి అధిక మరందసుగంధముల కలిగియున్న అమ్మవారి చరణముల వైపున కెగురుచున్నవి. ఆ తుమ్మెదలగుంపు చరణారుణిమ యను అగ్ని నుండి వెడలుచున్న పొగగా కనిపించుచున్నది అని కవిచే సంభావింపబడుచున్నందున ఈ శ్లోకమున గమ్యోత్ప్రేక్షాలంకారమున్నది. సంసారమునందు విపినత్వారోప మున్నందున రూపకాలంకారమున్నది. **ప్రచురిమా** శబ్దము జ్వాల వచ్చుటకు ముందు అగ్నిలో నుండి అధికమైన పొగ వచ్చునను అంశమును సూచించును. పాదముల

ఎఱుపు, దానిపై దేవతల శిరస్సులలో మన్దారకలికల తెలుపు, వానిపై నున్న తుమ్మెదల నలుపు అమ్మవారి యందలి త్రిగుణాత్మక ప్రకృతి స్వభావమును తెలుపుచున్నవి. అగ్ని జ్వలించునప్పుడు అడుగుననున్న అగ్ని, దానిపై జ్వాలలు, వాని చివఱలలో పొగలు-ఈ దృశ్యము అమ్మవారి పాదములపై దేవతలు తమ తలలు మోపినప్పుడు కవి భావనా నేత్రమునకు కనిపించినది. ప్రథమ, తృతీయ పాదములలో వర్ణమైత్రి, యతి భిన్నభిన్న స్థానములలో ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున తెల్లని మన్దార కలిక ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున దానితోడి సాదృశ్యము గల అమ్మవారి తెల్లని పాదనఖ కాంతి వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ వలక్షశ్రీరృక్షాధిపశిశుసదృక్షా తవ నఖై-**
**ర్జిఘృక్షుర్దక్షత్వం సరసిరుహభిక్షుత్వకరణే।**
**క్షణాన్మే కామాక్షి! క్షపితభవసంక్షోభగరిమా**
**వచోవైచక్షణ్యం చరణయుగలీ పక్ష్మలయతాత్॥ 57**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| సరసిరుహభిక్షుత్వకరణే | = | కమలమును భిక్షువుగా చేయుటయందు; |
| దక్షత్వమ్ | = | సామర్థ్యమును; |
| జిఘృక్షుః | = | గ్రహింపగోరినదై; |
| నఖైః | = | గోళ్ళతో; |
| వలక్షశ్రీః | = | తెల్లనికాంతిగలదై; |
| ఋక్షాధిపశిశుసదృక్షా | = | బాలచంద్రునితో సామ్యము నొందిన; |
| క్షపితభవసంక్షోభగరిమా | = | శమింపజేయబడిన సంసార సంక్షోభము యొక్క గొప్పతనము గల; |
| తవ | = | నీయొక్క; |
| చరణయుగలీ | = | పాదముల జంట; |
| మే | = | నాకు; |
| క్షణాత్ | = | క్షణ కాలమున; |
| వచోవైచక్షణ్యమ్ | = | మాటలలో నేర్పును; |
| పక్ష్మలయతాత్ | = | పెంపొందించు గాక! |

**తాత్పర్యము :-**

కమలమును భిక్షువుగా చేయు సామర్థ్యమును పొందగోరి గోళ్ళతో తెల్లనికాంతి

నొంది బాలచంద్రసదృశమైన అమ్మవారి పాదముల జంట క్షణకాలమున నా వాక్ నైపుణ్యమును పెంపొందించుగాక!

**వివరణము :-**

అమ్మవారి పాదముతో పోటీపడు కమలము పాదమునకు శత్రువై పోయినది. అదిగాక లక్ష్మికి నిలయమునని గర్వించినది. దాని లక్ష్మీ గర్వము నణచి దానిని భిక్షువుగా జేయు సామర్థ్యమెట్లు లభించునా అని ఆలోచించినది. అమ్మవారి పాద మెఱ్ఱనిది. కమలము కూడ ఎఱ్ఱనిది. కావున ఎఱుపు రంగుతో దాని నోడించుట గొప్పకాదు. దానికి లేని తెలుపు కాంతిని సంపాదింపవలెను. తన గోళ్ళలోనే ఆ తెల్లని కాంతి యున్నది. ఆ తెల్లని కాంతితో తాను బాలచంద్ర తుల్యమై పోయినది. బాలచంద్రునికి కమలము నోడించు శక్తి గలదు. (దానిని ముడుచుకొని పోవునట్లు చేయగలదు.) బాలచంద్ర సాదృశ్యమును బొందిన తరువాత తనకును ఆ శక్తి గలిగినది. బాలచంద్రుని చూచియే ముడుచుకొని పోవు కమలమున కట్టి మరొక దానితో అనగా అమ్మవారి పాదముతో ముడుచు కొనియు నట ఉండలేక దేశాంతరము పోయి బిచ్చమెత్తుకొని జీవించుటయే మంచిది అని కమలము భావించునట్లు చేసినది. దేశాంతరములకు బోయి బిచ్చమెత్తుకొనునట్లు చేసినది ఇక దానికి అమ్మవారి పాదముతో పోటీపడు మాట అటుంచి తన ఎదుటకే వచ్చుటకు సాహసము లేదు. కమలము ఎఱ్ఱని లక్ష్మికి నిలయమే కాని వలక్షశ్రీ (తెల్లని లక్ష్మికి) నిలయము కాదు. ఆ లోపముతో సిగ్గుపడి ఇట నిలువలేక ఎక్కడనో బిచ్చమెత్తుకొని జీవింప నారంభించినది. అమ్మవారి పాదము తన ఎఱ్ఱని తెల్లని కాంతులతో ఉదయించు బాలచంద్రునితో సమానమై రాత్రి కూడ విహరించుచున్నది. పగటను దానికి లేని తన తెల్లని కాంతితో కమలమును పరిహసించుచునే యున్నది. ఇంతటి వైభవము గోళ్ళకాంతులతో అమ్మవారి పాదముల జంటకు కలిగినది. లక్ష్మీ నిలయమైన పద్మము (ఒక నిధిపేరు) యాచకులకు లక్ష్మి నొసగగలుగునేమో కాని వాక్ నైపుణ్యము నొసగజాలదు. (వాక్కులు తెల్లని వనుట కవి సమయము). తెల్లని కాంతితో నాలో వాక్ నైపుణ్యము (సరస్వతి) నొసగుమని కవి అమ్మవారి పాదయుగళిని ప్రార్థించుచున్నాడు. **భవసంక్షోభగరిమ**ను అనగా సంసార బాధను నశింపజేయగల శక్తి కమలమునకు లేనే లేదు. లక్ష్మి చంద్రసహోదరి కావున చంద్రసాదృశ్యము పొందిన పాదయుగళి కడ బాలచంద్రుని కడ నున్నట్లే హాయిగా నుండును. ఈ అర్థమంతయు ఈ శ్లోకమున వ్యంగ్యమగుటకు ప్రధానముగ శ్రీశబ్ద ప్రయోగము దోహదపడుచున్నది. శ్రీశబ్దము లక్ష్మ్యర్థకము, కాంత్యర్థకము నగుటయే ఇందులకు కారణము. 'క్ష' కార బహువారావృత్తిచే నిట వృత్త్యనుప్రాస మను శబ్దాలంకార మేర్పడినది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి ***పాదనఖకాంతి*** వర్ణింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి ***పాదకాంతులు*** వర్ణింపబడుచున్నవి.

శ్లో॥ సమన్తాత్కామాక్షి! క్షతతిమిరసన్తానసుభగా-
నసన్తాభిః భాభిర్దినమను దిగన్తాన్విరచయన్।
అహన్తాయా హన్తా మమ జడిమదన్తావలరిపు-
ర్విభిన్తాం సన్తాపం తవ చరణచిన్తామణిరసౌ॥ 58

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| దినమ్ అను | = | ప్రతిదినమందు; |
| అనంతాభిః | = | అంతులేని; |
| భాభిః | = | కాంతులతో; |
| సమంతాత్ | = | అంతట; |
| దిగంతాన్ | = | దిగంతములను; |
| క్షతతిమిరసంతానసుభగాన్ | = | కొట్టబడిన చీకట్ల గుంపులతో సుందరములైన వానినిగా; |
| విరచయన్ | = | చేయుచు; |
| అహంతాయాః | = | అహంతయొక్క; |
| హన్తా | = | నశింపజేయు; |
| జడిమదన్తావలరిపుః | = | జాడ్యమను ఏనుగుకు శత్రువైన; |
| తవ | = | నీయొక్క; |
| అసౌ | = | ఈ; |
| చరణచింతామణిః | = | పాదమను చిన్తామణి; |
| మమ | = | నాయొక్క; |
| సన్తాపమ్ | = | సంతాపమును; |
| విభిన్తామ్ | = | ఛేదింపజేయుగాక! |

**తాత్పర్యము :-**

ప్రతిదినము తన అనంత కాంతులతో దిగన్తముల నున్న అన్ని చీకట్లను తొలగించి కాంతులతో నింపి సుందరములుగా చేయుచు, అహంతను చంపు జాడ్యమను ఏనుగుకు శత్రువైన నీ చరణచింతామణి నా సన్తాపమును తొలగించుగాక.

**వివరణము :-**

ఇంద్రుడు పాలసముద్రమును మథించునప్పుడు పుట్టిన మణిని స్వీకరించెను. దానిపేరు **చిన్తామణి.** అది చీకటుల తొలగించుటతో కోరిన కోర్కెల దీర్చును. చిన్తామణి స్వర్గమును వెలిగించునేమో కాని భూలోకము దాక దాని కాంతులు ప్రసరింపవు. అమ్మవారి చరణచిన్తామణియొక్క (జ్ఞాన) కాంతులు సర్వలోకములలోని అన్ని దిగంతములలోని

చీకట్లను నశింపజేయును. అజ్ఞానమను ఏనుగునకు ఆమె పాదచిన్తామణి శత్రువు. అహంత అనగా అహంకారము. దానిని ఆ చిన్తామణి చంపి వైచును. ఇంద్రుని చిన్తామణి యీ పనులను చేయలేదు. వాచ్యమైన పాదమునందు చింతామణియొక్క రూపణము చేత పైన వివరించిన వ్యతిరేకాలంకారము స్ఫురించుచున్నది. అన్ని పాదముల ఆరంభమున రెండవ మూడవ అక్షరముల ప్రాస అనగా ద్విప్రాసమున్నది. పాద మధ్యమున 13వ అక్షరము ప్రాసముగా నున్నది. అహన్తా హన్తా అను చోట ఛేకానుప్రాసమున్నది. వీటన్నిట నకార, తకారావృత్తి ఉండుటచే వృత్త్యనుప్రాసము కూడ నున్నది. ఇవి శబ్దాలంకారములు.

విభిన్తామ్ – ఆత్మనేపది, లోట్ ప్రథమపురుషైకవచనము.



**అవ:–** పై శ్లోకమున అమ్మవారి చరణము చింతిత ఫలదాతృ చిన్తామణిగా రూపింపబడినది. ఈ శ్లోకమున చింతిత ఫలదాన ప్రతిబంధ తన్నిరాస హేతువులైన నవగ్రహరూప మమ్మవారి చరణమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ దధానో భాస్వత్తామమృతనిలయో లోహితవపు–**
**ర్వినమ్రాణాం సౌమ్యో గురురపి కవిత్వం చ కలయన్।**
**గతౌ మన్దో గఙ్గాధరమహిషి! కామాక్షి! భజతాం**
**తమః కేతుర్మాతస్తవ చరణపద్మో విజయతే॥ 59**

ప్రతిపదార్థము :–

| | | |
|---|---|---|
| మాతః | = | అమ్మా! |
| గంగాధరమహిషి | = | శివుని యిల్లాలా! |
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |
| వినమ్రాణామ్ | = | నమస్కరించువారికిని; |
| భజతామ్ | = | సేవించువారికిని; |
| భాస్వత్తామ్ | = | ప్రకాశత్వమును (సూర్యుడు); |
| దధానః | = | ధరించునది; |
| అమృతనిలయః | = | అమృతమునకు నిలయము (చంద్రుడు); |
| లోహితవపుః | = | ఎఱ్ఱని ఆకృతి గలది (అంగారకుడు); |
| సౌమ్యః | = | శాంతమైనది (బుధుడు); |
| గురుః | = | గొప్పది (బృహస్పతి); |
| కవిత్వమ్ కలయన్ | = | కవితను చేయునది (శుక్రుడు); |
| అపి చ | = | మరియు; |
| గతౌ | = | నడకయందు; |

| | | |
|---|---|---|
| మన్దః | = | మాన్ద్యము గలది (శనైశ్చరుడు); |
| తమః | = | చీకటిని; |
| కేతుః | = | పోగొట్టునది (రాహువు కేతువు)యునైన; |
| తవ | = | నీయొక్క; |
| చరణపద్మః | = | పాదకమలము; |
| విజయతే | = | సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది. |

**తాత్పర్యము :-**

అమ్మా! శివుని యిల్లాలా! కామాక్షీ! నీ పాదకమలము ప్రకాశకత్వమును ధరించునది, మోక్షమును ఇచ్చునది, ఎఱ్ఱని అకృతి గలది, శాంతమైనది, గురువైనది, కవిత్వము నొనర్చునది, నడకయందు మాంద్యము కలది, తమస్సును బోగొట్టునది.

**వివరణము :-**

భాస్వాన్ అనగా సూర్యుడు అని ఒక అర్థము. ప్రకాశము గలవాడు అని మరొక అర్థము. అమ్మవారి చరణమునందు భాస్వత్త ఉన్నందున శ్లేషబలమున సూర్యత్వమున్నట్లు చెప్పబడినది. అమ్మవారి చరణము తన నాశ్రయించిన వారికి అమృత మనగా మరణరాహిత్యము ప్రసాదించును. అమృత మనగా దేవతల ఆహారము. చంద్రుడు దేవతల కమృత నిలయమైన భోజనపాత్రమన వచ్చును. అందుచేత శ్లేషబలమున అమ్మవారి పాదము చంద్రుడని చెప్పబడినది. అమ్మవారి పాద మెఱ్ఱనిది. కావున అది లోహితవపువు. అంగారక శరీరము కూడ ఎఱ్ఱనిదే. కావున లోహితవపు శ్శబ్దము అమ్మవారి పాదము అంగారకుడని కూడ అర్థశ్లేషబలమున చెప్పుచున్నది. సౌమ్య శబ్దము క్రూర శబ్దమునకు ప్రతిద్వంద్వి. అమ్మవారి చరణము శాంతమని బోధించును. బుధుడు సోముని పుత్రుడు. గావున సౌమ్యుడనబడును. శబ్దశ్లేషచే అమ్మవారి పాదము బుధుడను అర్థమేర్పడినది. అమ్మవారి చరణము భక్తుల అజ్ఞానమును నిరసించి వారికి జ్ఞానమును కలుగజేయును. (గు అనగా అంధకారము, రు అనగా తొలగించునది) గురు వనగా అజ్ఞానాంధకారమును తొలగించువాడు. అందువలన అమ్మవారి చరణము **గురువు** అని చెప్పబడినది. గురు శబ్దము రూఢి బలమున **బృహస్పతి**ని బోధించును. కావున శబ్ద శ్లేషబలమున అమ్మవారి చరణము బృహస్పతి అను అర్థమేర్పడును. గురువునకు శుక్రుడు శత్రువు. ఆతనికి కవి యను పేరున్నది. అందువలన కవిత్వమనగా శుక్రత్వము. అది కలది పాదము కావున 'కవిత్వమ్ కలయన్' అను శబ్దములు అమ్మవారి పాదము **శుక్రుని** చెప్పును. ఒకే పాదము ఒకవైపు గురువుయగుచు మరొకవైపు కవిత్వము కలది (శుక్రుడు) అనుట విరోధము గదా! దానిని 'అపి' అను శబ్దము సూచించును. ప్రకృతార్థము అమ్మవారి పాదము అజ్ఞానమును తొలగించి కవిత్వమును ప్రసాదించు ననియే కావున విరోధము పరిహృత మగును. కావున ఇట విరోధాభాసా లంకారమున్నది. అమ్మవారి పాదము గతియందు మందము అనగా మాంద్యము (సోమరితనము) కలది. కావున

**శనైశ్చర గ్రహబోధకము.** శనైశ్చరుడు మెల్లగా నడుచు గ్రహము. కావున అమ్మవారి పాదము శనైశ్చరుడని చెప్పబడినది. మందశబ్దము అర్థశ్లేషబలమున శనైశ్చరుడు అను అర్థము నిచ్చును. తమః శబ్దము అజ్ఞానమును రాహుగ్రహమును బోధించును. కేతు శబ్దము అగ్ని యను అర్థమును, కేతు గ్రహమును బోధించును. కావున తమఃకేతు శబ్దములు శ్లేషబలమున అమ్మవారి పాదము **రాహువును, కేతువును** బోధించును. ఇట్లు అమ్మవారి పాదము **నవగ్రహ** రూపమని ఈ శ్లోకమున చెప్పబడినది. నవగ్రహములవలె అమ్మవారి చరణము ఐహిక క్లేశముల నివారించి ఐహిక సుఖముల గలిగించుననుట నవగ్రహ రూపమని చెప్పుటకు ప్రయోజనము. తృతీయ చతుర్థ పాదములలో వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదము నవగ్రహరూపమున ఐహిక సుఖముల ననుగ్రహించుట చెప్పబడినది. ఈ శ్లోకమున పారలౌకికసుఖముల ననుగ్రహించు బ్రహ్మాదులకన్నను, కల్పవృక్షమునకన్నను అమ్మవారి పాదము **మోక్షప్రదాన హేతువు**న అధికమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ నయన్తీం దాసత్వం నలినభవముఖ్యానసులభ-**
**ప్రదానాద్దీనానామమరతరుదౌర్భాగ్యజననీమ్।**
**జగజ్జన్మక్షేమక్షయవిధిషు కామాక్షి! పదయో-**
**ర్ధురీణామీష్టే కస్తవ భణితుమాహోపురుషికామ్॥** **60**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |
| దీనానామ్ | = | దీనులకు; |
| అసులభప్రదానాత్ | = | దుర్లభమైన దాని (మోక్షము) నొసగుట వలన; |
| నలినభవముఖ్యాన్ | = | బ్రహ్మాదులను; |
| దాసత్వమ్ | = | దాసభావమును; |
| నయన్తీమ్ | = | పొందించుచున్న; |
| అమరతరుదౌర్భాగ్యజననీమ్ | = | కల్పవృక్షమునకు దౌర్భాగ్యము కలిగించు; |
| జగజ్జన్మక్షేమక్షయవిధిషు | = | జగముల సృష్టి స్థితి లయ కృత్యములందు; |
| ధురీణామ్ | = | నేర్పరియైన; |
| తవ | = | నీయొక్క |
| పదయోః | = | పాదములయొక్క |
| ఆహోపురుషికామ్ | = | మహిమను; |
| కః | = | ఎవడు; |

భణితుమ్ = చెప్పుటకు;
ఈష్టే = చాలును.

**తాత్పర్యము :-**

దీనులకు దుర్లభమైన మోక్షము నిచ్చుటవలన బ్రహ్మాదులకు దాసత్వమును, కల్పవృక్షమునకు దౌర్భాగ్యమును కలిగించు జగముల సృష్టి స్థితి లయ కృత్యములందు నిపుణమైన నీ పాదముల మహిమ నెవడు వర్ణింపగలడు.

**వివరణము :-**

పరలోకములని చెప్పదగిన స్వర్గ సత్యాది లోకముల సుఖములను తా మనుభవించుచు తమ భక్తులకు నీయగల బ్రహ్మాదులును నీ చరణదాసులై ఆశ్రయించెదరు. బ్రహ్మాదులు తామే మోక్షమును పొందలేరు. తమ భక్తుల కెట్లీయగలరు. వారే కల్పాంతరమున మరణించెదరు. అమరణ ధర్మమైన మోక్షమును వారెట్టు లీయగలరు. వారికిని మృత్యుభయము కలదు. దానిని తొలగించుకొనగోరియే వారు నీ చరణముల నాశ్రయించి యున్నారు. నీవేమో వారి కడకు పోక ఎక్కడనో భూలోకమున నక్కియున్న దీనులకు గూడ బ్రహ్మాది దుర్లభమైన మోక్షము ననుగ్రహించెదవు. నీ దీనదయాళుత్వమును చూచి బ్రహ్మాదులును దీనభావము నొంది నీ చరణములను వీడక సేవించుచున్నారు. అమరతరువులు, పారిజాతాదులు నీ వితరణశీలమును చూచి తమ దౌర్భాగ్యమును తలపోసికొనుచున్నవి. నీ వితరణములో కోట్యంశమును కూడ తామీయలేక పోవుచున్నామని తమ దైన్యమును తలచుకొని యేడ్చుచున్నవి. అవి ఒకవేళ చచ్చి స్వర్గమున కేగు వారికేమైనా ఇచ్చునేమో. అది మోక్షమునకు భిన్నమైన అల్పమైనదే కాని మోక్షము మాత్రము కాదు. అవి బ్రహ్మాదులవలె స్వయముగా అమ్మవారి పాదముల కడకు చేరలేని చేరనీయని తమ స్థావరత్వ దౌర్భాగ్యమును గూర్చి దుఃఖించుచున్నవి. బ్రహ్మ జగముల సృష్టించుట, విష్ణువు పాలించుట, రుద్రుడు సంహరించుట అను కృత్యముల నొనరించెదరని పురాణములు చెప్పుచున్నవి. అమ్మవారి పాదరజముచేతనే బ్రహ్మ సృష్టించునని, దానినే తన వేయి తలలపై శేష రూపమున విష్ణువు మోయుచు, కాపాడునని, రుద్రుడు దానినే చిదిమి బూదిగా తన శరీరమున నంతట రాచుకొనునని సౌందర్యలహరిలో శ్రీశంకరులు చెప్పినారు. వారమ్మవారి పాదరజమును సృష్టించలేదు, పాలించలేదు, సంహరించలేదు. ఆ రజము నమ్మవారి పాదకమలములే బహిర్గత మొనరించుకొన్నవి. దానిలోని అల్పాంశమే త్రిజగదుపాదనము త్రిజగన్మూలద్రవ్యము. అమ్మవారి అజ్ఞానుసారమే ఆమె అనుగ్రహించిన శక్తితోడనే వారా రజముతో సృష్టిస్థితిలయముల నొనర్చుచున్నారు., అనగా జగజ్జన్మ క్షేమక్షయము లమ్మవారి పాదరజము యొక్క కృత్యములే. బ్రహ్మ విష్ణు రుద్రులు పురుషులు. అమ్మవారి, అనుగ్రహమున లభించిన పాదరజః శక్తితోడనే జగజ్జన్మ క్షేమ క్షయముల నొనర్చు పురుషులు. దానిలో నేమి యాశ్చర్య మున్నది? ఆహోపురుషికత ఏమున్నది. అది అమ్మవారి పాదము లందే ఉన్నది. అట్టి

అమ్మవారి మహిమ సగుణమైనను గుణముల అనంతత్వహేతువున మనోవాచ్యము. నిర్గుణమైనచో అది మనోవాచామగోచర మని చెప్పబనియే లేదు. చరణవాచకమైన పదశబ్దము పుంలింగము. పురుషవ్యక్తి బోధకము. అమ్మవారనుగ్రహించనిచో అసమర్థులైన అశక్తులైన బ్రహ్మాదుల పురుషత్వ మేమి పురుషత్వము? నపుంసకత్వమే దానికన్న నయము. అమ్మవారి పాదములందలి పురుషత్వమే పురుషత్వము. అదే ఆహోపురుషిక. ఆహోపురుషికా శబ్దము స్త్రీ లింగము. ఆహోపురుషికత పరదేవతా (స్త్రీ) గతమే. అని ఆ శబ్దము వ్యంజించుచున్నది.



**అవ:-** పై శ్లోకమున ఛాయనిచ్చు అమరతరువులు ప్రస్తావింపబడినవి. ఈ శ్లోకమున అమ్మవారి **పాదామ్భోజచ్ఛాయాన్వేషణము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ జనోఽయం సన్తప్తో జనని! భవచణ్డాంశుకిరణై-**
**రలబ్ధ్వైకం శీతం కణమపి పరజ్ఞానపయసః।**
**తమోమార్గే పాన్థస్తవ ఝటితి కామాక్షి! శిశిరాం**
**పదామ్భోజచ్ఛాయాం పరమశివజాయే! మృగయతే॥ 61**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| పరజ్ఞానపయసః | = | గొప్ప జ్ఞానమనెడి జలముయొక్క; |
| ఏకమ్ | = | ఒక్క; |
| కణమ్ అపి | = | చుక్కను కూడ; |
| అలబ్ధ్వా | = | పొందక; |
| భవచండాంశుకిరణైః | = | సంసారమనెడి సూర్య కిరణములచేత; |
| సంతప్తః | = | బాగుగా తపింపబడిన; |
| అయమ్ | = | ఈ; |
| జనః | = | జనుడు; |
| తమోమార్గే | = | చీకటి మార్గమున; |
| పాన్థః | = | బాటసారియై; |
| పరమశివజాయే! | = | శివుని యిల్లాలా! |
| జనని! | = | అమ్మా! |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| శిశిరామ్ | = | చల్లనైన; |
| తే | = | నీయొక్క; |
| పదామ్భోజచ్ఛాయామ్ | = | పాదకమలచ్ఛాయను; |
| మృగయతే | = | వెదకుచున్నాడు. |

**తాత్పర్యము :-**

తమోమార్గమున త్రాగుటకు జ్ఞానజలముయొక్క ఒక్క చుక్కైనను లేదు. పైగా సూర్య కిరణముల సంతాపమున్నది. దానిచే స్రుక్కిన యీ బాటసారి అమ్మవారి కమలచ్ఛాయకై వెదకుచున్నాడు.

**వివరణము :-**

ఒక విచిత్రమైన తమోమార్గమున్నది. సంసార సూర్యకిరణ తాపమక్కడ తీవ్రముగా నున్నది. కాని అక్కడ వెలుగే మాత్రము లేదు. సాధారణముగా ఎండ తీవ్రత సంతాప హేతువై ఉండును. ఈ విచిత్ర తమోమార్గమున త్రాగుట కొక్క నీటి చుక్కైన లభించదు. పరజ్ఞానమే జలము. దానియొక్క ఒక్క చుక్క సంతాపమును పోగొట్టగలదు. కాని ఆ ఒక్క చుక్కయే లభింపని దా తమో మార్గము. అందు సంసారసూర్యకిరణముల ప్రసారమున్నది. కాని వెలుగు లేదు. ఎండలో నున్నవాడు సాధారణముగా నీడకై పరితపించును. కాని ఈ మార్గమున ఎండలోనున్న వానివలె నీడకై వెదకుట విచిత్రము. అది ఏదో నీడయైన సరిపోదు. అది వృక్షచ్ఛాయ కాదు. అమ్మవారి చల్లని పాద కమలచ్ఛాయ. ఛాయా శబ్దమునకు కాంతియను నర్థము కూడ నున్నది. కాంతి కొఱకే ఈ తమోమార్గ పాంథుడు వెదకుచున్నాడు. సంతప్తునకు అమ్మవారి పదాంభోజగతనఖచంద్రకాంతి సంతాపహరము. ఇట ప్రయాణించువాని వలె నీడకై వెదకుట విరుద్ధము. అట్లే ఆ బాటసారి సూర్యకిరణతప్తుడై యుండియు తమోమార్గమున ప్రయాణించుటయు విరుద్ధము. ఈ విరోధములు తమ శ్శబ్దమునకు అజ్ఞానము అను అర్థము చెప్పిన పరిహృతములగును. చీకటికి సూర్యునికి విరోధము. కాని అజ్ఞానసూర్యులకు విరోధము లేదు. ఇచట నున్నది సంసారసూర్యుడు. సంసారసూర్యతప్తునకు జ్ఞానామృతముయొక్క ఒక్క చుక్కయు లభించుట లేదు. కావున తాపము మఱింత అధికమైనది. అమ్మవారి చల్లని పాదపద్మమందలి మరందము అను అమృతము లభించిన సర్వతాపములు హృతములగును. సూర్యకిరణతీవ్రతచేత జలము ఆవిరిగా మారి ఇగిరిపోవును. ఇచట భవసూర్యకిరణతీవ్రతచేత జ్ఞానజలమంతయు నింకిపోగా ఒక్క చుక్క జ్ఞానజలముకూడ తమోమార్గప్రయాణ మొనరించు వానికి లభించలేదు. అమ్మవారి పాదపద్మమునుండి జ్ఞానమకరందామృత మూరుచునే ఉండును. అచటకు చేరిన వారెంత జ్ఞానామృతమైనను ద్రావవచ్చును. సంతాపము నా పద్మచ్ఛాయలో తీర్చుకొనవచ్చును. అమ్మవారి పాదపద్మముల చెంత చేరిన వానికి సంతాపము నశించుట, జ్ఞానప్రాప్తి, తద్వారా బ్రహ్మానందప్రాప్తి లభించుననుట సారాంశము. ప్రథమ తృతీయ చతుర్థ పాదములలో వర్ణమైత్రి ఉన్నది. పరజ్ఞానపయసః, పాన్థః, పరమశివ, పదామ్భోజ, అను పదములలో ఆద్యనుప్రాసమున్నది. చాయా జాయే అను పదముల అంత్యనుప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున చండాంశు కిరణములు ప్రస్తావింపబడినవి. ఈ శ్లోకమున అమ్మవారి పాదములందలి *నఖకిరణప్రశంస* చెప్పబడుచున్నది.

**శ్లో॥ జయత్యమ్బ! శ్రీమన్నఖకిరణచీనాంశుకమయం**
**వితానం బిభ్రాణే సురమకుటసఙ్ఘట్టమసృణే।**
**నిజారుణ్యక్షౌమాస్తరణవతి కామాక్షి! సులభా**
**బుధైః సంవిన్నారీ తవ చరణమాణిక్యభవనే॥ 62**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| అమ్బ! | = | అమ్మా! |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| శ్రీమన్నఖకిరణచీనాంశుక మయమ్ | = | పూజనీయమైన గోళ్ళకాంతియనెడి చీనాంశుకమయమైన; |
| వితానమ్ | = | చాందినిని; |
| బిభ్రాణే | = | ధరించిన; |
| సురమకుటసంఘట్టమసృణే | = | దేవతా కిరీటము లందలి మణుల రాపిడిచే నునుపెక్కిన; |
| నిజారుణ్యక్షౌమాస్తరణవతి | = | తన ఎఱుపు అనెడి నారగుడ్డ పఱచుటగల; |
| తవ | = | నీయొక్క; |
| చరణమాణిక్యభవనే | = | పాదమణి హర్మ్యమున; |
| సంవిన్నారీ | = | జ్ఞానకాంత; |
| బుధైః | = | పండితులచేత; |
| సులభా | = | సుఖముగా పొందదగినదై; |
| జయతి | = | సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది. |

**తాత్పర్యము :-**

గోళ్ళ కాంతియను పట్టుబట్ట అంచుల చాందినిని ధరించు దేవతల కిరీటముల మణుల రాపిడిచే నునుపెక్కిన శాగమట్ట పఱచబడిన అమ్మవారి పాదమణి భవనమున నున్న జ్ఞానకాంతి పండితులకు సుఖముగా లభించును.

**వివరణము :-**

చరణమున మణిభవనముయొక్క ఆరోపము, సంవిత్తు (జ్ఞానము) నందు నారీరూపణము చేయబడినందున ఈ శ్లోకమున రూపకాలంకార మున్నది. బిభ్రాణే, మసృణౌ, స్తరణ, కిరణ, చరణ, శబ్దముల రేఫణ కారముల బహువారావృత్తి ఉండుటచే నిట వృత్త్యనుప్రాసమను శబ్దాలంకార మేర్పడి యున్నది. అమ్మవారి చరణముల నాశ్రయించిన వారికి జ్ఞానము లభించుననుట సారాంశము.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చరణము లందు సురమకుట సంఘట్టనము చెప్పబడినది. ఈ శ్లోకమున **సురేంద్రాశాపూరణము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ ప్రతీమః కామాక్షి! స్ఫురితతరుణాదిత్యకిరణ-**
**శ్రియో మూలద్రవ్యం తవ చరణమద్రీన్ద్రతనయే!॥**
**సురేన్ద్రాశామాపూరయతి యదసౌ ధ్వాన్తమఖిలం**
**ధునీతే దిగ్భాగానపి చ మహసా పాటలయతే॥ 63**

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| అద్రీంద్రతనయే | = | పర్వతరాజపుత్రివైన; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ; |
| యత్ | = | ఏ కారణమున; |
| అసౌ | = | ఇది (చరణము); |
| అఖిలమ్ | = | మొత్తము; |
| ధ్వాన్తమ్ | = | చీకటిని; |
| ధునీతే | = | తొలగించునో; |
| దిగ్భాగాన్ | = | దిక్కుల భాగములను; |
| అపి చ | = | మఱియు; |
| మహసా | = | కాంతితో; |
| పాటలయతే | = | ఎఱ్ఱగా జేయుచున్నదో; |
| సురేంద్రాశామ్ | = | తూర్పును; |
| ఆపూరయతి | = | నింపునో; |
| తత్ | = | ఆ కారణమున; |
| తవ | = | నీయొక్క; |
| చరణమ్ | = | పాదమును; |
| స్ఫురితతరుణాదిత్యకిరణ శ్రియః | = | ప్రకాశించిన బాలసూర్యుని కిరణముల కాంతికి; |
| మూలద్రవ్యమ్ | = | మూలద్రవ్యముగా; |
| ప్రతీమః | = | నమ్ముచున్నాము. |

**తాత్పర్యము :-**

లేత సూర్యుని కిరణకాంతికి మూలద్రవ్యము అమ్మవారి చరణమే. ఏలననగ అమ్మవారి చరణములోని సురేంద్రాశాపూరణమే (ఇంద్రుని ఆశ నెరవేర్చుటయే) బాలసూర్యుని కిరణశ్రీలో సురేంద్రాశాపూరణము (తూర్పు దిక్కున నింపుట)గా ఉన్నది. అమ్మవారి చరణము ధ్వాన్తమును పోద్రోలుటయే లేత సూర్యుని కిరణశ్రీ ధ్వాన్తమును

పోద్రోలుటగా నున్నది. అమ్మవారి చరణము నందు, బాల సూర్యకిరణ శ్రీ యందును దిగ్భాగముల నెఱ్ఱబఱచుట సమానము గానే యున్నది.

**వివరణము :-**

కారణ గుణముల కార్యము సంగ్రహించుట ఒక శాస్త్రీయ సత్యము. బాలసూర్యకిరణశ్రీ కార్యము. కార్యము అనగా కారణమునుండి పుట్టినది. కారణము లెన్ని ఉన్నను మూలద్రవ్యము అనగా ఉపాదానకారణముయొక్క గుణములే కార్యమునందు సంక్రమించును. కాని ఇతర కారణములయొక్క గుణములు కార్యమున సంక్రమించవు. ఉదాహరణమునకు మూలద్రవ్యమైన మట్టియొక్క వాసన మొదలైన గుణములు ఆ మట్టితో చేయబడిన కుండయందు సంక్రమించును. ఏలననగా కుండయొక్క ఉపాదాన కారణము (మూలద్రవ్యము) ఐన మట్టి కార్యదశలో కూడ అనుగమించుటచే కుండయందు సంక్రమించును. కాని కుండకు నిమిత్తకారణమైన కుమ్మరివాని గుణములు కుండయందు సంక్రమించవు గదా! బాలసూర్యుని కిరణశ్రీకి మూలద్రవ్యముగా అమ్మవారి చరణమును సంభావించుటచేత నీ శ్లోకమున ఉత్ప్రేక్షాలంకార మొప్పుచున్నది. సురేంద్రాశాపూరణము ధ్వాన్తనివారణమును దిగ్భాగములందు వ్యాపింపజేసిన ఎఱ్ఱదనము అను గుణములు అమ్మవారి చరణములనుండి దాని కార్యమైన బాలసూర్యకిరణశ్రీయందు సిద్ధమైనదే. ***'దివి సూర్య సహస్రస్య భవే ద్యుగపదుత్థితా యది భా స్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః'*** (11-12) (ఆకాశము నందొక వేళ వేయి సూర్యుల కాంతి ఒకేసారి పైకి లేచినచో ఆ మహాత్ముని కాంతితో సరితూగగలదేమో) అను గీతావచనము ననుసరించి అమ్మవారి చరణమునందు ధ్వాన్తనివారణము అను గుణమున్నదనుటలో సందేహింప బనిలేదు. సూర్యుని యందు గుణమున్నదనుట ప్రసిద్ధము కావున సందేహమే లేదు. కాంతిలో దిగంతములందు వ్యాపింపజేసిన ఎఱ్ఱదనము కార్యకారణములలో సమానమే. అయినను బాలసూర్యకిరణశ్రీ హృదయములలోని ధ్వాన్తమును గాని అనంతాకాశములలో సుదూర ప్రాంతములలోని ధ్వాన్తమునుగాని నివారించు శక్తి లేదు. అమ్మవారి చరణమునకే ఆ శక్తి ఉన్నది అని ***'అఖిలమ్'*** అను విశేషణము వ్యంజింపజేయుటచే వ్యతిరేకాలంకారము యొక్క స్ఫురణము కూడ నున్నది. ***'ప్రతీమః'*** అను క్రియకు విశ్వసించుచున్న యను అర్థమున్నను ఇచట దానిని సంభావనాస్ఫోరకముగానే గ్రహింపవలయును. స్ఫురిత, తరుణ, కిరణ, చరణ, ప్రతీమః, శ్రియమ్, అద్రీంద్ర, ద్రవ్యమ్, సురేంద్రాశామ్, ఆపూరయతి అను శబ్దములలో రేఫణకారముల బహురావృత్తి చేత వృత్త్యనుప్రాస మను శబ్దాలంకార మున్నదనుట స్పష్టము.



**అవ:-** పై శ్లోకమున సురేంద్రుని ఆశ యొక్క పూరణమును అమ్మవారి చరణ మొనర్చునని చెప్పబడినది. ఈ శ్లోకమున సురేంద్రుని వంటి ప్రణమ్రుల కెట్టి ఆశలున్నను వాని పూరణము నది యొనర్చునని చెప్పబడుచున్నది.

శ్లో॥ మహాభాష్యవ్యాఖ్యాపటుశయనమారోపయతి వా
స్మరవ్యాపారేర్ష్యాపిశుననిటలం కారయతి వా।
ద్విరేఫాణామధ్యాసయతి సతతం వాధివసతిం
ప్రణమ్రాన్కామాక్ష్యాః పదనలినమాహాత్మ్యగరిమా॥ 64

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవీయొక్క; |
| పదనలినమాహాత్మ్యగరిమా | = | పాదకమల ప్రభావాతిశయము; |
| ప్రణమ్రాన్ | = | నమస్కరించువారిని; |
| మహాభాష్యవ్యాఖ్యాపటుశయనమ్ | = | మహాభాష్యమను వ్యాఖ్యానమునందు నిష్ణాతృశయము (శేషశయ్యను); |
| వా | = | కాని; |
| ఆరోపయతి | = | ఎక్కించును; |
| స్మరవ్యాపారేర్ష్యా | = | మన్మథచేష్టయెడ ఈర్ష్యను; |
| పిశుననిటలమ్ | = | సూచించు నిటలఫాలముగల వానినిగా; |
| వా | = | కాని; |
| కారయతి | = | చేయించును; |
| సతతమ్ | = | ఎల్లప్పుడు; |
| ద్విరేఫాణామ్ | = | తుమ్మెదలయొక్క; |
| అధివసతిమ్ | = | నివాసమును; |
| వా | = | కాని; |
| అధ్యాసయతి | = | అధిష్ఠింపఁజేయును. |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదకమలము మహిమాతిశయము. ప్రణమ్రులను మహాభాష్యముయొక్కవ్యాఖ్యయందు సమర్థమైన శయ్య నెక్కించుట గాని, మన్మథుని వ్యాపారమునం దీర్ష్యను సూచించు ఫాలముగల వానిగా చేయుటగాని, తుమ్మెదల వసతియైన కమలము నధిష్ఠింపజేయుట గాని, చేయును.

**వివరణము :-**

మహాభాష్యమని వ్యవహరింపబడు వ్యాఖ్య ఒకటి వ్యాకరణశాస్త్రమున ప్రసిద్ధమై ఉన్నది. దానిని పతంజలి మహర్షి రచించాడు. ఆ పతంజలి మహర్షి పాణిని ఎనిమిదధ్యాయములుగా రచించిన సూత్రగ్రంథముపై రచించిన వ్యాఖ్యకు మహాభాష్యమను పేరు ప్రసిద్ధము. ఇతర శాస్త్రములందును భాష్యము లున్నవి. కాని దేనికిని మహాభాష్యమను పేరు లేదు. పాణిని రచించిన అష్టాధ్యాయిపై పతంజలి వ్రాసిన వ్యాఖ్య ఒక్కటే

మహాభాష్యమని వాసికెక్కినది. శాస్త్ర వాఙ్మయమున పతంజలి రచించిన ఆ గ్రంథమునకున్న ప్రశస్తి అటువంటిది. సాధారణమానవులెంత విద్వాంసులైనను ఇట్టి గ్రంథములు వ్రాయలేరని ఆదిశేషుడు పతంజలిమహర్షిగా భూలోకమున నవతరించి ఈ మహాభాష్యమును రచించాడని సంస్కృతవిద్వాంసులలో పెక్కురు విశ్వసించెదరు. ఆదిశేషుడు పతంజలిమహర్షిగా నవతరించి అమ్మవారి చరణములకు ప్రణామ మొనరించిన పిమ్మటనే ఆయనకు ఆ మహాగ్రంథము రచించు శక్తి కలిగినది అని ఈ శ్లోక ప్రథమ పాదము సూచించుచున్నది. ఆదిశేషుడు విష్ణువుయొక్క శయనముగా పురాణ ప్రసిద్ధుడు. ఆయన మహాభాష్యవ్యాఖ్యాపటువు అని చెప్పుటచే ఆయన పతంజలిమహర్షిగా అవతరించాడను కవి విశ్వాసము స్పష్టమగుచున్నది. శైవశాక్తాది మతములలో పీఠాధిపతులైన గురువులకు 'వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర' అను బిరుదము కనిపించును. అదేమి వ్యాఖ్యానమో ఆ పదము వెనుక పేర్కొనబడును. మతభేదమును బట్టి సిద్ధాంతములు పేర్కొనబడును. వ్యాకరణాదిశాస్త్రములు సర్వమతసిద్ధాంతోపకారములు. వీనిలో పైన పేర్కొనబడిన బిరుదములు అరుదే. కాని ఈ శ్లోకమున **మహాభాష్యవ్యాఖ్యాపటు శయనారోపణ** అను బిరుదును సూచించు వాక్యమున్నది. వ్యాకరణశాస్త్ర నిష్ణాతున కీయబడదగిన బిరుదము ఆ వాక్యము. మహాభాష్యవ్యాఖ్యానపటువైన శేషుని శయనమెక్కిన విష్ణువును బోధించును. కావున అమ్మవారిపాదము సేవించిన వానిని విష్ణువు నొనరించునను అర్థము వచ్చును. ఈ రెండు అర్థములు ప్రకృతములే కావున ఇది ప్రకృత శ్లేష. శేషుని మహాభాష్య వ్యాఖ్యాపటువని భంగ్యంతరముగా చెప్పుటగాని, విష్ణువును చేయుననుటకు బదులుగా మహాభాష్యవ్యాఖ్యా పటుశయన మారోపయతి అని భంగ్యంతరముగా చెప్పుట పర్యాయోక్త్య లంకారము అగుచున్నది. అట్లే రెండవ పాదమున శివుని చేయుననుటకు బదులు స్మరవ్యాపారేర్ష్యాపిశుననిటలుడని భంగ్యంతరముగా చెప్పుట గూడ పర్యాయోక్త్యలంకారమే. మన్మథవ్యాపారమునం దీర్ష్యను సూచించు నిటలము గలవాడు. కామ వ్యాపారమునెడ అనిష్టతను చూపుటకు నొసలును చిట్లించు విరక్తుడని ఒక అర్థము. మన్మథుని వ్యాపారమునం దీర్ష్యను చూపుట అనగా మన్మథుని దహించు నొసలు గలవాడని మరో అర్థముండుటచే నిట కూడ ప్రకృతి శ్లేష ఉన్నది. అట్లే మూడవపాదమున పద్మాసనస్థ (యోగి) నొనరించును అని ఒక అర్థము. పద్మాసనస్థ (బ్రహ్మను) నొనరించును అని మరొక అర్థము చెప్పుటచేత ప్రకృత శ్లేష మున్నది. జగత్సృష్టి స్థితి లయముల నొనర్చు బ్రహ్మ విష్ణు రుద్రత్వ ప్రాప్తి నే సాధకుడైన కోరుకొనవచ్చును. బ్రహ్మత్వ విష్ణుత్వ రుద్రత్వము లింద్రత్వము కన్న గొప్పవి. కావున ఇంద్రుడు కూడ బ్రహ్మత్వమునో విష్ణుత్వమునో రుద్రత్వమునో కోరి అమ్మవారి పాదములందు ప్రణమ్రుడు కాదగును. ఈ పదవులను కోరక వ్యాకరణశాస్త్రమునో లేక సన్యాసమునో, యోగమునో పొందదలచిన వానికి అమ్మవారి చరణగతి దానిని ప్రసాదించు ననుట సారాంశము. ద్విరేఫ మనగా రెండు రేఫలు గల భ్రమర శబ్దము అని అర్థము. భ్రమరశబ్ద వాచ్యమును

తుమ్మెదను బోధించుట లక్షితలక్షణావృత్తి చేతనని ఆలంకారకులు చెప్పెదరు.



**అవ:-** పై శ్లోకమున వ్యాకరణశాస్త్రమున ప్రామాణికగ్రంథమైన **మహాభాష్యము** ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున సామాన్యముగా శాస్త్రముయొక్క స్మరణ చేత సమభావము కల్గుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ వివేకామ్భఃస్రోతఃస్నపనపరిపాటీశిశిరితే**
**సమీభూతే శాస్త్రస్మరణహలసఙ్కర్షణవశాత్।**
**సతాం చేతఃక్షేత్రే వపతి తవ కామాక్షి! చరణో**
**మహాసంవిత్సస్యప్రకరవరబీజం గిరిసుతే!॥ 65**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| గిరిసుతే | = | పార్వతీ! |
| వివేకామ్భఃస్రోతఃస్నపన పరిపాటీశిశిరితే | = | వివేక జనుల ప్రవాహమున స్నాన విధిచే చల్లబడిన; |
| శాస్త్రస్మరణహలసంకర్షణవశాత్ | = | శాస్త్రముల తలచుట అను నాగలి యొక్క దున్నుట వలన; |
| సమీభూతే | = | సమభావము నొందిన; |
| సతామ్ | = | సజ్జనులయొక్క; |
| చేతఃక్షేత్రే | = | మనస్సను పొలమున; |
| తవ | = | నీయొక్క; |
| చరణః | = | పాదము; |
| మహాసంవిత్సస్యప్రకర వరబీజమ్ | = | గొప్ప జ్ఞానమనెడి పంటయొక్క ఉత్తమమైన విత్తనమును; |
| వపతి | = | నాటుచున్నది. |

**తాత్పర్యము :-**

వివేక జలౌఘు స్నానముచే చల్లబడిన శాస్త్రచింతన అను నాగలిచే దున్నుటవలన సమభావము నొందిన సత్పురుషుల చిత్త క్షేత్రమున అమ్మవారి చరణము గొప్ప జ్ఞానమను పంట పండుటకొఱకు ఉత్తమమైన విత్తనమును నాటుచున్నది.

**వివరణము :-**

విత్తనమును నాటుటకు ముందు రైతు పొలమును నీటితో బాగుగా తడుపును. ఆ తరువాత నాగలితో దున్ని చదును చేయును. ఆ తరువాత మంచి విత్తనమును

నాటును. అట్లే ఇక్కడ అమ్మవారి పాదము అను రైతు ఎప్పుడు సత్పురుషుల చిత్తము అను క్షేత్రమున విత్తనము వేయును. వివేక జల ప్రవాహముచే ముందుగా నది బాగుగా చేయవలెను. ఎగుడు దిగుడులు లేకుండ సమముగా నొనర్పవలెను. చిత్త క్షేత్రమున ఎగుడు దిగుడు లనగా కొందఱి యందు రాగము, మఱికొందఱి యందు ద్వేషము కలిగియుండుట. దానిని సమానముగా చేయుట యనగా అందఱ యందు బ్రహ్మము అను ఏక (అద్వైత) బుద్ధిచే సమభావము నొంది యుండవలెను. అట్టి పొలమున అమ్మవారి పదము జ్ఞానమును పండించుటకు కావలసిన మంచి బీజమును అనగా ఉత్తమ భక్తిని నాటును.



**అవ॥:-** పై శ్లోకమున బీజావాపము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున తత్పూర్వ కాలికము అయిన వసన్త కాలము వంటి దమ్మవారి చరణమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ దధానో మన్దారస్తబకపరిపాటీం నఖరుచా**
**వహన్దీప్తాం శోణాఙ్గులిపటలచామ్పేయకలికామ్।**
**అశోకోల్లాసం నః ప్రచురయతు కామాక్షి! చరణో**
**వికాసీ వాసన్తస్సమయ ఇవ తే శర్వదయితే!॥ 66**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| శర్వదయితే | = శివుని ప్రియురాలవైన |
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ! |
| నఖరుచా | = గోళ్ళకాంతిచేత; |
| మన్దారస్తబకపరిపాటీమ్ | = మందారవృక్షము లందలి పూగుత్తుల పద్ధతిని; |
| దధానః | = ధరించు; |
| దీప్తామ్ | = ప్రకాశించిన; |
| శోణాంగులిపటలచామ్పేయకలికామ్ | = ఎఱ్ఱని వ్రేళ్ళ సమూహమను సంపెంగ మొగ్గను; |
| వహన్ | = ధరించుచు; |
| వికాసీ | = వికాసము గల; |
| వాసన్తః | = వసన్తర్తువునకు సంబంధించిన; |
| సమయ ఇవ | = కాలమువలె; |
| తే | = నీయొక్క |
| చరణః | = పాదము; |
| నః | = మాకు; |
| అశోకోల్లాసమ్ | = అశోకోల్లాసమును; |
| **ప్రచురయతు** | = అధికమొనరించుగాక! |

**తాత్పర్యము :-**

అమ్మవారి గోళ్ళకాంతి మందారపుష్పస్తబకమువలె, అమ్మవారి వ్రేళ్ళ కాంతి సంపెంగ మొగ్గవలె నుండుట చేత ఆమె చరణము వసన్తకాలము వలె నున్నది. ఆ చరణము మాలో అశోకోల్లాసము కలిగించు గాక!

**వివరణము :-**

వసన్తఋతువున అశోకవృక్షముల కుల్లాసము కలుగును. మందారములు పూచును. సంపెంగలు మొగ్గ దొడుగును. ఈ వసన్త ఋతు లక్షణము లన్నియు అమ్మవారి చరణములో సమానముగా నున్నవి. కావున అమ్మవారి చరణమునకు వసన్తకాలముతో ఔపమ్యము చెప్పబడినందున ఈ శ్లోకమున ఉపమాలంకారమున్నది. అశోక శబ్దము ఆనందమును బోధించును. అశోకోల్లాసమనగా ఆనందోల్లాసము. వసన్తఋతువునందు ప్రకృతి తన అందమును బహిర్గత మొనరించును. వృక్షములు చిగురించి పుష్పించును. అంతకు ముందు శిశిరమున గోల్పోయిన శోభను వసన్తఋతువున మరల పొందును. వసన్తకాలమున జీవరాశి యంతయు అశోకోల్లాసమును పొందును. వసన్త సమయము వలె అమ్మవారి చరణము మన అందఱకు ఆనందోల్లాసమును అధిక మొనర్చుగాక!



**అవ:-** పై శ్లోకమున చరణనఖకాంతికి మన్దారస్తబకముతో సాదృశ్యము స్ఫురింపజేయబడినది. ఈ శ్లోకమున దానికి హంసలతో సాదృశ్యము స్ఫురింపజేయ బడుచున్నది.

**శ్లో॥ నఖాంశుప్రాచుర్యప్రసృమరమరాలాభిధవలః**
**స్ఫురన్మఞ్జీరోద్యన్మరకతమహఃశైవలయుతః।**
**భవత్యాః కామాక్షి! స్ఫుటచరణపాటల్యకపటో**
**నదః శోణాభిఖ్యో నగపతితనూజే! విజయతే॥** **67**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| నగపతితనూజే | = | పర్వతపుత్రివైన; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| నఖాంశుప్రాచుర్యప్రసృమర మరాలాభిధవలః | = | గోళ్ళకాంతియొక్క ఆధిక్యమును ప్రసరింప జేయు హంసలతో మిక్కిలి తెల్లనైన; |
| స్ఫురన్మంజీరోద్యన్మరకత మహఃశైవలయుతః | = | ప్రకాశించు అందెలనుండి ఉదయించు మరకతమణికాంతి యనెడి నాచుతో కూడిన; |
| భవత్యాః | = | నీయొక్క |

స్ఫుటచరణపాటల్యకపటః = స్పష్టమైన పాదముల ఎఱుపు అనెడి;
శోణాభిఖ్యః = శోణ అను పేరుగల;
నదః = నదము;
విజయతే = సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**తాత్పర్యము :-**

గోళ్ళకాంతి ప్రసారము హంసల తెలుపుగల అందెలలోని మరకత మణుల కాంతి అనెడి నాచుతో కూడిన అమ్మవారి పాదముల ఎఱుపు అను శోణ నదము సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**వివరణము :-**

నఖాంశు ప్రాచుర్యమునందు హంస ధావల్యము ఆరోపింపబడినందున మంజీరములందలి మరకతముల మహస్సునందు శైవల మారోపింపబడినందున ప్రథమ ద్వితీయ పాదములందు రూపకములు అంగములుగా, స్ఫుటచరణపాటల్య కపట అని ఉత్తరార్ధమున కపట శబ్ద ప్రయోగముచేత అపహ్నవాలంకారము అంగిగా ఉన్నది. ఈ శ్లోకమున ఎఱుపు, తెలుపు, నలుపు అను మూడు వర్ణములు వర్ణింపబడినందున అమ్మవారి చరణము ప్రకృతిరూపము అని వ్యంజింపబడినది. **ప్రసృమరమరాల** అను సమాసము నందు ఛేకానుప్రాసమను శబ్దాలంకార మున్నది.



**అవ॥:-** శోణనద మెఱ్ఱనిది. దానిలో నల్లని నాచు ఉన్నట్లు మంజీర మహస్సు ఉన్నదని తెల్లని హంసలున్నట్లు ఎఱ్ఱని గోళ్ళ కాంతులున్నందున అమ్మవారి పాదము శోణనదము వలె ఉన్నదని శోణనదముతోడి సాదృశ్యము అమ్మవారి పాదమున స్ఫురింపజేయబడినదని పై శ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున కమలముతో సాదృశ్యముతో పాటు అసామాన్యము అనగా వైషమ్యము ఆ పాదము నందున్నట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ ధునానం పఙ్కౌఘం పరమసులభం కణ్టకకులై-**
**ర్వికాసవ్యాసఙ్గం విదధదపరాధీనమనిశమ్।**
**నఖేన్దుజ్యోత్స్నాభిర్విశదరుచి కామాక్షి! నితరా-**
**మసామాన్యం మన్యే సరసిజమిదం తే పదయుగమ్॥68**

**ప్రతిపదార్థము :-**

కామాక్షి = ఓ కామాక్షీదేవీ!
పంకౌఘమ్ = బురద సమూహమును;
ధునానమ్ = విదిలించుచు;
కణ్టకకులైః = ముండ్ల (దుష్టుల) చే;

| | | |
|---|---|---|
| అసులభమ్ | = | సుఖముగా చేరరానిది; |
| అనిశమ్ | = | ఎల్లప్పుడు; |
| అపరాధీనమ్ | = | పరాధీనము కాని; |
| వికాసవ్యాసంగమ్ | = | వికాసముయొక్క సంబంధమును; |
| విదధత్ | = | చేయుచున్న; |
| నఖేన్దుజ్యోత్స్నాభిః | = | నఖ చంద్రకాంతులచేత; |
| నితరామ్ | = | మిక్కిలి; |
| విశదరుచి | = | స్వచ్ఛమైనకాంతిగల; |
| తే | = | నీయొక్క; |
| పదయుగమ్ | = | పాదముల జంట; |
| ఇదమ్ | = | ఈ; |
| అసామాన్యమ్ | = | అసాధారణమైన; |
| సరసిజమ్ | = | కమలముగా; |
| మన్యే | = | తలచెదను. |

**తాత్పర్యము :-**

బురదను వెదజల్లుచు, ముండ్లకు దూరమై ఎల్లప్పుడు స్వప్రకాశమై నఖచంద్రకాంతులచే మిక్కిలి స్వచ్ఛముగా ప్రకాశించు నీ ఈ పాదముల జంట అను కమలము నసాధారణ కమలముగా తలచెదను.

**వివరణము :-**

కమలము బురదలో పుట్టును. కాని బురదను వెదజల్లదు. అమ్మవారి పాదకమలము బురదలో పుట్టలేదు. కాని బురదను అనగా పాపమును దూర మొనర్చును. కమల నాళమున చిన్నచిన్న ముండ్లుండును. కాని అమ్మవారి పాదము ముండ్లకు మిక్కిలి దూరమై ఉండును. అనగా జగత్తునకు ముండ్లవలె బాధ కల్గించు దుర్మార్గులకు అమ్మవారి పాదము సులభము కాదు. కమలము పరాధీన (సూర్యాధీన) ముగా వికాసము పొందును. సూర్యుడు లేనప్పుడు ముడుచుకొని యుండును. అమ్మవారి పాదమట్లుగాక సూర్యుడు లేనప్పుడు ఉన్నప్పుడును అనగా సూర్య సంబంధములేకయే ఎల్లప్పుడు వికాసము కలిగియుండును. పైగా సూర్యునికే వికాసమును కలిగించును. అమ్మవారి అనుగ్రహములేనిచో సూర్యుడు ప్రకాశింపజాలడు. సూర్యుడు స్వప్రకాశకుడని చెప్పుటయే కాని పరాశక్తియైన అమ్మవారికి అధీనమైనదే అతని ప్రకాశము. అమ్మవారి పాదము ఎవరికీ అధీనము కాక స్వయముగా వికాసము కలిగి యుండును. కమలము చంద్రుని ప్రకాశమున అనగా వెన్నెలలో ముడుచుకొని పోవును. కాని అమ్మవారి పాదము నఖేన్దుకాంతులచే మిక్కిలి స్వచ్ఛముగా ప్రకాశించుచుండును. అందుచేత అనగా

కమలముయొక్క లక్షణములకు భిన్నములైన లక్షణములు గల కమలము సామాన్య కమలమని కాక అసామాన్య కమలమనియే సంభావించుచున్నాను అను అర్థము **'మన్యే'** అను క్రియ ప్రయోగించుట చేత ఉత్ప్రేక్షాలంకార మొప్పుచున్నది. రెండవపాదము వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదము **అసామాన్య కమల**మని చెప్పబడినది. ఈ శ్లోకమున అది కమలములతో మాత్సర్యమును ప్రకటించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ కరీన్ద్రాయ ద్రుహ్యత్యలసగతిలీలాసు విమలైః**
**పయోజైర్మాత్సర్యం ప్రకటయతి కామం కలయతే।**
**పదామ్భోజద్వన్ద్వం తవ తదపి కామాక్షి! హృదయం**
**మునీనాం శాన్తానాం కథమనిశమస్మై స్పృహయతే॥ 69**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| తవ | = | నీయొక్క |
| అలసగతిలీలాసు | = | మెల్లని నడకయొక్క విలాసములందు; |
| పదామ్భోజద్వంద్వమ్ | = | పాదముల జంట ; |
| కరీంద్రాయ | = | గజేన్ద్రునికొఱకు; |
| ద్రుహ్యతి | = | ద్రోహమొనర్చుచున్నది; |
| విమలైః | = | స్వచ్ఛములైన; |
| పయోజైః | = | కమలములతో; |
| మాత్సర్యమ్ | = | మత్సరతను; |
| ప్రకటయతి | = | ప్రకటించుచున్నది; |
| కామమ్ | = | కామమును; |
| కలయతే | = | ఆదరించుచున్నది; |
| శాన్తానామ్ | = | శాన్తులైన; |
| మునీనామ్ | = | మునులయొక్క; |
| తద్ | = | ఆ; |
| హృదయమ్ | = | మనస్సు; |
| అపి | = | కూడ; |
| అస్మై | = | దీని (పాదముల జంట) కొఱకు; |
| స్పృహయతే | = | కోరుచున్నది. |

**తాత్పర్యము :-**

మందగతితో ఏనుగుకు ద్రోహము చేయు, విమలములైన కమలము లతో మాత్సర్యమును బూను, కామము నాదరించు అమ్మవారి పాదకమల ద్వంద్వముకొఱకు శాన్తులైన మునుల హృదయముకూడ కోరుచున్నది.

**వివరణము :-**

ఒకరికి ద్రోహము చేయుటను శాన్తులైన మునులు హర్షించరు. అట్టివారు తమకు సన్నిహితముగా నుండవలెనని కోరుకొనరు. కాని మందగతి విషయమున గజేన్ద్ర ద్రోహమొనరించు అమ్మవారి పాదకమలము తమ హృదయమున నుండవలెనని కోరుకొనుచున్నారు. మునుల హృదయము స్వచ్ఛమైనది. అది స్వచ్ఛులతో స్నేహభావమునే కనబఱచవలసి యుండగా స్వచ్ఛుల యెడ మాత్సర్యమును పూనుకొను వానికి దూరముగా ఉండవలసి యుండగా స్వచ్ఛకమలములతో మత్సరించు అమ్మవారి పాదముల జంటను కోరుకొనుట వింతగా నున్నది. మునుల హృదయమున కామమునకు చోటుండదు. కామమునకు తమ హృదయములలో చోటిచ్చు వారికి కూడ మునులు దూరముగానే యుందురు. కాని కామము (కాము)నాదరించిన అమ్మవారి పాదయుగము సన్నిహితము గావలెనని కోరుకొనుచున్నారు. అది విచిత్రముగా నున్నది అను అర్థమును ప్రకటించు నీ శ్లోకమున విరోధాభాసా లంకారమున్నది. అమ్మవారి నడక గజేంద్రగతికన్న సుందరమని, అమ్మవారి పాదయుగము కమలయుగముకన్న మృదువైనదని ఆమె శివునిచే శిక్షింపబడిన మన్మథు నాదరించినదనియు దాని వలన వ్యంగ్యమగుచున్నది. కరీంద్ర ద్రోహము సింహ లక్షణము. సింహము గుహ యందుండును. సింహములేని గుహ శోభించదు. అందుకే మునీంద్రహృదయము గుహ. అమ్మవారి పాదయుగమను సింహము యొక్క ఆగమనమును కోరుకొనుచున్నది అని ప్రథమపాదములోని మొదటి రెండు పదములు ***'కరీంద్రాయ, ద్రుహ్యతి'*** అనునవి సూచించుచున్నవి. ***పయోజమాత్సర్యము, చంద్రలక్షణము.*** మనస్సు చంద్రరూపము. మునుల మనస్సునందు భక్తిసుధ ఉన్నది. వారి మనస్సు తనలోని అజ్ఞానాంధకారమును తొలగించుకొనుటకు అమ్మవారి పాదయుగము సోమనామధేయ చంద్రా (హంసా) గమనమును కోరుకొనుచున్నది అని రెండవ పాదములోని మొదటి మూడు పదములు ***పయోజైర్మాత్సర్యమ్ ప్రకటయతి*** అనునవి సూచించుచున్నవి. అమ్మ వారి పాదయుగము మోక్షకామమును ఆదరించును. కావున మోక్షకామియైన మునిహృదయము మోక్షకామము నాదరించు అమ్మవారి పాదయుగమును కోరుకొనుచున్నది అని రెండవ పాదములోని చివటి రెండు పదములు ***కామం, కలయతే*** అనునవి సూచించుచున్నవి. ***కరీంద్రద్రోహము*** శివ లక్షణము. తనలోని మమతాపహారము కొఱకై శివరూపమైన అమ్మవారి పాదయుగమును మునుల మనస్సు కోరుకొనుచున్నది. శివుడు సోముడు, సోమశేఖరుడు. కావున పయోజమాత్సర్యము సోమరూపశివలక్షణము. అమ్మవారిని పెండ్లాడిన పిదప

శివునికి కామాదర లక్షణ మబ్బినది. కావున మోక్షకామము నాదరించుటకై శివ రూప కామాక్షీచరణయుగమును మునుల మనస్సు కోరుచున్నది. ఈ శ్లోకమున ఈ అర్థము లన్నియు ధ్వనించుచున్నవి.



**అవ:-** పై శ్లోకమున కమల మాత్సర్యము చెప్పబడినది. ఈ శ్లోకమున ప్రతిదిన **కమల ముకులనము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ నిరస్తా శోణిమ్నా చరణకిరణానాం తవ శివే!**
**సమిన్ధానా సన్ధ్యారుచిరచలరాజన్యతనయే!॥**
**అసామర్థ్యాదేవం పరిభవితుమేతత్సమరుచాం**
**సరోజానాం జానే ముకులయతి శోభాం ప్రతిదినమ్॥ 70**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| ప్రతిదినమ్ | = | ప్రతిదినము |
| అచలరాజన్యతనయే | = | పర్వతరాజపుత్రీ! |
| శివే | = | ఓ మంగళస్వరూపురాలా! |
| తవ | = | నీయొక్క; |
| చరణకిరణానామ్ | = | చరణ కిరణములయొక్క; |
| శోణిమ్నా | = | ఎఱుపుచేత; |
| నిరస్తా | = | తిరస్కరించబడిన; |
| సమిన్ధానా | = | మండుచున్న; |
| సంధ్యారుచిః | = | సంధ్యాకాంతి; |
| ఏవమ్ | = | ఇట్లు (ఈ పాదమును); |
| పరిభవితుమ్ | = | తిరస్కరించుటకు; |
| అసామర్థ్యాత్ | = | చేతకాకపోవుటవలన; |
| ఏతత్+సమరుచామ్ | = | ఈ పాదముతో సమానమైన కాంతిగల; |
| సరోజానామ్ | = | కమలముయొక్క; |
| శోభామ్ | = | కాంతిని; |
| ముకులయతి | = | ముకులింపజేయుచున్నది (అని); |
| జానే | = | ఎఱుగుదును. |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదముల ఎఱుపుచేత తిరస్కరింపబడిన సాయంసంధ్యా కాంతి తిరిగి అమ్మవారి పాదమును తిరస్కరించుట చేతకాకపోవుటవలన ఆ ఎఱ్ఱగానున్న కమలములను ముకుళించుకొనునట్లు చేయుచున్నది.

**వివరణము :-**

తనకొక బలవంతుడు అపకారము చేసినప్పుడు ఆ బలవంతు నేమియు చేయజాలని, చేతకానివాడు, ఆ బలవంతునియొక్క బలహీన సంబంధి కపకారము చేసి తన అశక్తదుర్జనత్వమును ప్రకటించుకొనుట లోకమున అచ్చటచ్చట కనబడును. ఈ శ్లోకమున సంధ్యారుచి ఆ పని చేసినది. అమ్మవారి పాదము నేమి జేయజాలక ఆమె పాదకాంతితో సమానమైన కాంతిగల కమలములు ముకులించుకొనునట్లు చేసినది. (పిల్లి కాలిని బట్టె తొక్కిన ఆ పిల్లి ఎలుకపై మీసముల దిప్పినది, కారణమేమి? ఎలుక రంగు ఆ బట్టెరంగుతో సమానముగా నుండుటయే) కమలములు ఉపమానములు. అవి అమ్మవారి పాదములతో సమరుచి గలవి అని చెప్పుట వాని కుపమేయత్వమును కలిగించుట కావున అట్లు ఉపమేయత్వమును కల్పించి ఉపమానముయొక్క తిరస్కారము చేయబడుటచే నీ శ్లోకమున ***ప్రతీపాలంకార*** మున్నది. ***'నిరస్తా చరణ కిరణ సన్ధ్యారుచి రచల రాజన్య సమిన్ధానా సన్ధ్యా అసామర్థ్యాత్ పరిభవితుమ్*** అను పదములలో చకారరేఫ సకారములు బహువారావృత్తము లగుటచే వృత్త్యనుప్రాస మను శబ్దాలంకార మేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున కమలముకులము అమ్మవారి చరణరుచి సన్ధ్యాకృత్యముగా చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి పాదమునకు **కమల సఖ్యము** ప్రస్తావింప బడుచున్నది.

**శ్లో॥ ఉపాదిక్షద్దాక్ష్యం తవ చరణనామా గురురసౌ**
**మరాలానాం శఙ్కే మసృణగతిలాలిత్యసరణౌ।**
**అతస్తే నిస్తన్ద్రం నియతమమునా సఖ్యపదవీమ్**
**ప్రసన్నం పాథోజం ప్రతి దధతి కామాక్షి! కుతుకమ్॥ 71**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |
| తవ | = | నీయొక్క |
| చరణనామా | = | పాదమనెడి; |
| అసౌ | = | ఈ; |
| గురుః | = | గురువు; |
| మసృణగతిలాలిత్య సరణౌ | = | సవిలాస మందగమన సౌందర్యమార్గమునందు; |
| మరాలానామ్ | = | హంసలకు; |
| దాక్ష్యమ్ | = | దక్షతను; |
| ఉపాదిక్షత్ | = | ఉపదేశించెను (అని); |
| శంకే | = | భావించుచున్నాను; |

| | | |
|---|---|---|
| అతః | = | అందువలన; |
| తే | = | అవి; |
| నిస్తంద్రమ్ | = | సోమరితనము లేకుండ; |
| నియతమ్ | = | నియతముగా; |
| అమునా | = | దీని (పాదము)తో; |
| సఖ్యపదవీమ్ | = | స్నేహ మార్గమును; |
| ప్రసన్నమ్ | = | పొందిన; |
| పాథోజమ్ ప్రతి | = | కమలమును గూర్చి; |
| కుతుకమ్ | = | కుతూహలమును; |
| దధతి | = | ధరించుచున్నది. |

**తాత్పర్యము :-**

హంసలు అమ్మవారి పాదముతో సఖ్యము చేయు కమలమును గూర్చి కుతూహలపడుటచేత వాని కమ్మవారి పాదము గురువై నడకలో సామర్థ్యము నుపదేశించినదని భావించుచున్నాను.

**వివరణము :-**

అమ్మవారి చరణములందు గురుత్వము చెప్పబడుటచే హంస శిష్యత్వము స్ఫురించుచున్నది. నడకను నేర్చుకొనుటకు హంస లమ్మవారి నాశ్రయించి ఎట్లు నడచిన బాగుండునో ఆ నేర్పు నామె పాదము గురువై వాని కుపదేశించినదని భావించుచున్నానని చెప్పుటచే ఈ శ్లోకమున నుత్ప్రేక్షాలంకార మొప్పుచున్నది. అమ్మవారి పాదముపై గౌరవముతో ఆ పాదమే కమలముతో స్నేహము చేయుచున్నదో ఆ కమలమునందును సోమరితనము లేకుండ నియతముగా కౌతుకమును పొందుచున్నవను హేతువు కాని హేతువు ఆ ఉత్ప్రేక్షణమునందు చెప్పబడినది. అమ్మవారు గతి సౌందర్యమున హంసలను మించినది. కమలముతో సమానమైన ఎఱుపును కలిగిన పాదములు గలిగియున్న దనుట వ్యంజితమైన అంశము. ద్వితీయ, తృతీయ చతుర్థ పాదములందు వర్ణమైత్రి పాటించబడినది.



**అవ:-** పై శ్లోకమున కమలసఖ్యము అమ్మవారి పాదములందు చెప్పబడినది. ఈ శ్లోకమున కమల విరోధము చెప్పబడుచున్నది.

**శ్లో॥ దధానైస్సంసర్గం ప్రకృతిమలినైః షట్పదకులై-**
**ర్ద్విజాధీశశ్లాఘావిధిషు విదధద్భిర్ముకులతామ్।**
**రజోమిశ్రైః పద్మైర్నియతమపి కామాక్షి! పదయో-**
**ర్విరోధస్తే యుక్తో విషమశరవైరిప్రియతమే॥ 72**

ప్రతిపదార్థము :-

విషమశరవైరిప్రియతమే = శివుని ఇల్లాలా!
కామాక్షి = ఓ కామాక్షీ దేవీ!,
ప్రకృతిమలినైః = స్వాభావిక మాలిన్యముగల;
షట్పదకులైః = తుమ్మెదల గుంపులతో;
సంసర్గమ్ = సంబంధమును;
దధానైః = ధరించుచున్న;
ద్విజాధీశశ్లాఘావిధిషు = బ్రాహ్మణప్రభువు మెచ్చుకొను విధానములందు;
నియతమ్ = నియతముగా;
ముకులతామ్ = ముడుచుకొనిపోవుటను;
విదధద్భిః = చేయుచున్న;
రజోమిశ్రైః = రజస్సుతో కూడిన;
పద్మైః = పద్మములతో;
తే = నీయొక్క;
పదయోః = పాదములకు;
విరోధః = విరోధము;
యుక్తః = తగినది.

**తాత్పర్యము :-** స్వాభావిక మాలిన్యము (నలుపు)గల తుమ్మెదలతో సంబంధమును పెట్టుకొను, ద్విజాధీశు (బ్రాహ్మణ-చంద్రు)ని మెచ్చుకొనుటలో ముకుళత్వమును (వైముఖ్యమును) ప్రకటించు, రజో మిశ్రకమలములతో అమ్మవారి పాదము విరోధము పెట్టుకొనుట యుక్తమే.

**వివరణము :-** మాలిన్య మనగా పాపము లేక నలుపు. (పాపము నల్లదనుట కవి సమయము) నల్లగా నుండు తుమ్మెదలు పాపము గలవైనవి. అట్టి తుమ్మెదలతో సంబంధమును పెట్టుకొనుట పాపము కాదా? పాపాత్ములతో కలసియుండుట కూడ పాపమని ధర్మశాస్త్రములలో చెప్పబడినది. ***మద్యపానము, స్వర్ణస్తేయము, బ్రహ్మహత్య, గురుతల్పగమనము*** మహాపాపములు. ***వీనిని చేసిన వారితో కూడియుండుట*** ఐదవ మహాపాపము. ***పంచమహాపాతకములని*** వీనిని పేర్కొందురు. తుమ్మెదలు మధువును త్రావును. కావున మహా పాతకములలో నొక పాపము చేసిన వారిక్రింద లెక్క. అట్టి తుమ్మెదల రాకకై ఎదురు చూచుచు అవి వచ్చినప్పుడు తమలోని మద్యము నిచ్చి సంతృప్తిపరచు సంబంధము పెట్టుకొన్నందున కమలములకును పాపము వచ్చినందున వానితోడను మైత్రి చేయరాదు. పైగా విరోధింపవలె. సజ్జనులు పాపులతో విరోధించుట మనమెఱుగుదుము. బ్రాహ్మణ ప్రశంస పుణ్యకర్మ. ద్విజాధీశుడనగా బ్రాహ్మణ ప్రభువు.

ద్విజ అనగా (చకోర) పక్షులు. వానికి ప్రభువు చంద్రుడు. కావున ఆయన కూడ ద్విజాధీశుడే. ద్విజాధీశ ప్రశంసకు కమలములు విరోధములు. చంద్రుని రాకతో కమలములు ముకుళించు కొనుటయే ద్విజాధీశ ప్రశంసావైముఖ్యముగా ఇట చెప్పబడినది. ద్విజాధీశుని (చంద్రుని) మెచ్చుకొనుటను కమలములు చేయకపోవుట అనగా పుణ్యము చేయక పోవుటయు, కమలముతో అమ్మవారి పాదము విరోధించుటకు మరో కారణము. కొందఱు పాపము చేసియు పుణ్యము కూడ చేయుచుందురు. పుణ్యముచే పాపము నశించుటచేత వారు పాపులు అనబడకూడదు. అట్టి వానితో స్నేహము చేసినను చేయవచ్చునేమో గాని పాపులతో (తుమ్మెదలతో) సంబంధము పెట్టుకొని పాపకర్మ చేయుచు ద్విజాధీశ ప్రశంస అను పుణ్యకర్మ యెడల వైముఖ్యమును చూపుట అనగా పుణ్యము చేయకపోవుటచే వారి కేర్పడిన పాపము తొలగుట కవకాశము లేదు. కావున వారు పాపుల క్రింద లెక్క. వారితో స్నేహము చేయుట పాపమనియే అమ్మవారి పాదము కమలముతో స్నేహము చేయకపోవుట యుక్తమే మరి విరోధించుట యేల? పాపులు సాధారణముగా తమవంటి పాపుల సంఖ్య హెచ్చవలెనని కోరుచుందురు. ఊరిలో కొద్దిమంది మద్యపులున్నారను కొందము. అప్పుడాయూరి వారు వారు కనబడినప్పుడు వీరు మద్యపులని వ్రేలెత్తిచూపి పరిహసించెదరు. అందుచేత ఆ మద్యపులు తమవలె మద్యము త్రాగువారి సంఖ్య హెచ్చుటకు ఉచితముగా మద్యమును వారి నోళ్ళలో పోయుచు వారిని మద్యమునకు దాసులగునట్లు చేసి తమలో కలిపికొందురు. ఆ యూరి వారందఱు కాకపోయినను చాలామంది మద్యపులుగా మారినప్పుడు కొద్దిమంది మద్యపానదూరు లున్నను వారు వీరిని వ్రేలెత్తి చూపలేరు. వీరికి మద్యము త్రాగుట చేతగాదేమో అని ఆ మద్యపులే వీరిని వ్రేలెత్తి చూపుదురు. కొద్దిమంది మద్యపు లున్నప్పుడు అప్రతిష్ఠ వారికుండెడిది. అవమానముల పాలు కావలసి వచ్చెడిది. కాని తమ ప్రయత్నముల వలన ఊరిలో ఎక్కువమంది మద్యపులు కాగా ఇప్పుడా అప్రతిష్ఠ చేయువారు తగ్గుటచే వారికిప్పుడవమానమే కలుగుట లేదు. అందుచేతనే పాపులు పాపుల సంఖ్య వృద్ధికే పాటుపడుచుందురు. తాము (పుణ్యాత్ములు) పాపులు పెరిగిపోయిన తమను కూడ పాపులుగా పాపులు మార్చెదరేమో అని పుణ్యాత్ములు పాపుల పట్ల విరోధము ప్రకటించెదరు. అట్లే అమ్మవారిపాదము మాలిన్యము (నలుపు, పాపము)గల తుమ్మెదలతో విరోధించుట యుక్తమే. పాపులవలె పుణ్యాత్ములు పుణ్యాత్ముల సంఖ్య హెచ్చవలెనని కోరుకొనరు. ఏల? ఊరిలో కొద్దిమంది పుణ్యాత్ములున్న వారికి ప్రతిష్ఠ గౌరవము కలుగు చుండును. ఆ ఊరిలో అందఱు పుణ్యాత్ములుగా మారినచో ఇక తమకు ప్రతిష్ఠ గౌరవ మెట్లుండును. వారితో సమానులుగానే ఉండిపోవలసి వచ్చును. అందుచేత పుణ్యాత్ములు పుణ్యాత్ముల సంఖ్య పెఱుగుటకు కృషి చేయరు. ఇది సాధారణ అనగా కీర్తికాముకులైన పుణ్యాత్ముల లక్షణము, స్వభావము. ఇది కాక దుష్కృతులు అనగా పాపుల వినాశము కొఱకు భగవంతుడవతరించునని 'గీత' చెప్పుచున్నది. అనగా పాపులతో విరోధించుట

భగవల్లక్షణము. అందుచేతనే బ్రాహ్మణత్వ రక్షణమను భగవల్లక్షణము అమ్మవారి పాదమునకు తగినదే. శ్రీ శంకరులు తమ భగవద్గీతా భాష్యారంభమున *'భౌమస్య బ్రహ్మణో బ్రాహ్మణత్వస్య చ రక్షణార్థమ్ దేవక్యాం వసుదేవాదంశేన.. కిల సంబభూవః'* అని పేర్కొనుట పైన చెప్పబడిన దానికి ప్రమాణము. కావున బ్రాహ్మణ శ్లాఘ ద్వారా బ్రాహ్మణత్వ రక్షణము చేయగోరిన అమ్మవారి పాదమునకు బ్రాహ్మణ ప్రశంసా (ద్విజాధీశ శ్లాఘా) విముఖములైన కమలములతో విరోధము యుక్తమే. పైగా పద్మములు రజో మిశ్రములు. అమ్మవారి చరణము శుద్ధ సత్త్వ ప్రధానము. శుద్ధ సత్త్వ ప్రధానులు రజోమిశ్రులతో సహవాసము చేయరు. రజస్వలలైన స్త్రీలు రజోదర్శన పర్యంత మస్పృశ్యులు. రజోదర్శనము గల కమలముల నమ్మవారి పాదమెట్లు స్పృశించి, కరచాలనము చేసి స్నేహము చేయగలదు? సత్త్వము జ్ఞాన ప్రధానము. రజస్సు అజ్ఞానజన్యకర్మ ప్రధానము. అజ్ఞానజన్యకర్మ ప్రధానులతో జ్ఞాన ప్రధానులు సహవాసము చేయరు. జ్ఞానాజ్ఞానములు విరోధ స్వభావములు గదా! అందుచేతనే అమ్మవారి పాదము కమలముతో విరోధించుట యుక్తమే. విరోధించనిచో కర్మఠులు జ్ఞానుల కడకు వచ్చి జ్ఞానమును నైష్కర్మ్య స్వభావమును పరిహసించెదరు. అందుచేత రజో మిశ్రులకు అమ్మవారి పాదము దూరముగనే యుండవలసి వచ్చినది. విరోధించవలసి వచ్చినది. అమ్మవారి భర్తయైన శివుడు విషమశరుడైన మన్మథునకు వైరి, విరోధి. ఆ శివుడు విషమశరునితో నేల విరోధించెను? రజోమిశ్రములైన అరవిందములతో అనగా బాణములతో శివుని కొట్టెను. శివున కమ్మవారు ప్రియతమ యగునట్లు అనగా శివుని సంసారి యగునట్లు చేయుటకు యత్నించెను. ఆ సందర్భమున విషమశరునితో శివుడు విరోధించెను. కాని విషమశరుని ప్రయత్నమున లోకమునకు మేలే కలిగినది. అమ్మవారికి సంతోషమే కలిగినది. కావున ఓ అమ్మవారి పాదమా! నీకు కమలములతో విరోధించుట యుక్తము కాదు. తే అయుక్తః అని విభజించి నీకు విరోధము యుక్తము కాదు. శుద్ధసత్త్వులకు విరోధము యుక్తమే కాదు. పాప సహవాసము నిన్ను పాపిగా చేయునని భయపడెదవా-అట్లగుచో నేనును పాపిని కదా, నాయందును విరోధించెదవా! అది నీకే మాత్రము యుక్తము కాదు అను అర్థాంతరము కూడ ధ్వనించుచున్నది. ఇక ద్విజాధీశ శ్లాఘా వైముఖ్యము కూడ కమలములకు లేదు. ఎట్లు? ద్విజాధీశములనగా హంసలు వానితో స్నేహమే కాని తత్ప్రశంసకు కమలములకు వైముఖ్యమే లేదు. కావున వానితో నీకు విరోధము యుక్తము కాదు. ఇక రజోమిశ్రణము మాట యొకటున్నది. నీకు మాత్రము రజోమిశ్రణము లేదా! అదిలేనిచో ఈ జగము నెట్లు సృజింతివి? విషమశరవైరి అని శివునికి పేరు వచ్చినది. ఆ వైరము నెన్నడో ఆతడు మఱచినాడు. లేనిచో తానై అమ్మవారిని పెండ్లాడుటకు సప్తర్షుల నరుంధతీ సహితముగా నెట్లు హిమవంతుని కడకు రాయబార మంపినాడు. ఆయన మఱచిన విరోధము నాయన ప్రియతమమైన అమ్మవారికి అవయవముగా నున్న నీకు (పాదమునకు) పాపులతో నావంటివారితో (కమలములతో)

విరోధము యుక్తమే గాదు. ఈ యర్థమంతయు విషమశరవైరి అను సంభోధనము వలన, **తే+అయుక్తః** అను పదముల విభజించుట కవకాశమును కల్పించు **తే యుక్తః** అను పదములను ప్రయోగించి నందువలన వ్యంగ్యమగుచున్నది. ద్వితీయ, తృతీయ పాదముల ఆదిప్రాసము, ద్వితీయ చతుర్థ పాదముల వర్ణమైత్రి దాక్షిణాత్య పద్యలక్షణములు (శబ్దాలంకారములు) ఇందున్నవి.



**అవ:-** పై శ్లోకమున కమలములందు ***దోషరూపరజోమిశ్రణము*** అమ్మవారి చరణములకును యుక్తమే అని చెప్పబడినది. ఈ శ్లోకమున కమల మసృణములైన ఆ చరణములందు గుణమైన ***కవిత్వ శ్రీ మిశ్రీకరణము*** చెప్పబడు చున్నది.

**శ్లో॥ కవిత్వశ్రీమిశ్రీకరణనిపుణౌ రక్షణచణౌ**
**విపన్నానాం శ్రీమన్నలినమసృణౌ శోణకిరణౌ।**
**మునీన్ద్రాణామన్తఃకరణశరణౌ మన్దసరణౌ**
**మనోజ్ఞౌ కామాక్ష్యా దురితహరణౌ నౌమి చరణౌ॥ 73**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కవిత్వశ్రీమిశ్రీకరణనిపుణౌ | = | కవిత్వ శ్రీలను కలుపుటలో సమర్థములైన; |
| విపన్నానామ్ | = | ఆపదలనొందిన వారియొక్క; |
| రక్షణచణౌ | = | రక్షణమునందు నిపుణములైన; |
| శ్రీమన్నలినమసృణౌ | = | కాంతిగల కమలముల నునుపుగల; |
| శోణకిరణౌ | = | ఎఱ్ఱని కిరణములుగల; |
| మునీన్ద్రాణామ్ | = | మునీశ్వరులయొక్క; |
| అంతఃకరణశరణౌ | = | అంతఃకరణమే ఇల్లుగాగల; |
| మన్దసరణౌ | = | మందగమనముగల; |
| మనోజ్ఞౌ | = | సుందరములైన; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| చరణౌ | = | పాదములనుగూర్చి; |
| నౌమి | = | నమస్కరించుచున్నాను. |

**తాత్పర్యము :-**

అమ్మవారి చరణములు కవిత్వ శ్రీలను కలుపుటలో నిపుణములైనవి. ఆపన్నులను రక్షించుటకు సమర్థత గలవి. ఎఱ్ఱని కిరణములు గలవి. మునీంద్రుల అంతఃకరణమున నివసించునట్టివి. మన్దగమనము గలవి. అట్టివానికి నమస్కరించుచున్నాను.

**వివరణము :-**

కవిత్వము సరస్వతీ స్వరూపము. శ్రీ లక్ష్మీ స్వరూపము. సరస్వతీ లక్ష్ములు అత్తకోడండ్రని, వారికి విరోధమని, ఒకచోట ఉండరని లోక ప్రసిద్ధి ఉన్నది. అది చాలాచోట్ల సత్యమైనను అమ్మవారి పాదముల నారాధించు వారి యెడ అసత్యము. వారికి సరస్వతీ లక్ష్ములు కలసి సేవ చేయుదురు. వారికి విద్యతో పాటు ధనము పుష్కలముగా నుండుటచే వారిరువురొక చోట విరోధము విడచి యున్నట్లే అగుచున్నది. విరోధులైన ఇద్దఱిలోని విరోధము అమ్మవారి పాదములయొక్క సత్త్వగుణమహిమచే తొలగిపోవునను అంశ మీ మొదటి సమాసముచే వ్యంగ్యమగుచున్నది. కవులకడ సాధారణముగా సంపద ఉండదు. కాని అమ్మవారి చరణముల నారాధించు కవులు బహు ధనసంపన్నులై ఉందురు. ఆపన్నులను రక్షించుట కితర దేవతలవలె అవతరించనక్కఱలే దమ్మవారికి. ఆమె చరణములే వారిని రక్షింప సమర్థములై ఉండగా ఆమెకు అవతరించు శ్రమ ఉండదు. అయినను భక్తులకు తన దర్శనచరణస్పర్శనాద్యవకాశము' కలిగించుట కమ్మవారు మహాకాళీ, మహాలక్ష్మి, మహా సరస్వత్యాది విభవావతారములనే కాక విగ్రహరూపమున కాంచ్యాది నగరములందు కామాక్ష్యాద్యర్చావతారముల ధరించుచునే ఉండును. ఇది రెండవ విశేషముచేత వ్యంగ్యమగు నర్థము. నలినమునందు లక్ష్మి నివసించుటచే నలినము **శ్రీమత్** అని చెప్పబడినది. నలినమనగా కమలము. నలినము నునుపుగా ఉండును. అట్టి నునుపే అమ్మవారి పాదమున నున్నదని చెప్పుటచే మూడవ విశేషణమున లుప్తోపమాలంకార మున్నది. శ్రీమంతుడనగా విష్ణువు. ఆయన సిరిగలవాడు గదా! ఆయన చేతను ఒక కమలమున్నది. ఆయన హస్తముకూడ సుకుమారమే యై యున్నది. ఆయన అమ్మవారికి పుత్ర సదృశ్యుడు. కాదు పుత్రుడే. ప్రలయ సముద్రమున నొక మఱ్ఱిచెట్టును కల్పించి దాని ఆకులను వేనవేల ఊయలలుగా చేసి వానిలో వేనవేల బ్రహ్మాండముల రక్షించు వేనవేల బాల విష్ణువు (ముకుంద) ల నుంచుచు పోషించినది. వారు వినయముతో ప్రతిదిన మమ్మపాదములు పట్టగా పట్టగా అనగా కమలపూజ చేయగా చేయగా వారి చేతులలోని కమలముల నునుపు అమ్మవారి పాదముల కంటినది. లేదా వారమ్మవారి పాదములు పట్టగా పట్టగా ఒత్తగా ఒత్తగా ఆమె పాదములలోని రజము తొలగిపోగా అమ్మవారి పాదములకు కమల సదృశ మసృణత కలిగినది. అమ్మవారి ఆ చరణారాధనము చేతనే విష్ణువు శ్రీమంతుడైనాడు అని నాలుగవ విశేషణముచే వ్యంజింపజేయ బడును. ఐదవవిశేషణ మమ్మవారి పాదము ఉదయసూర్యునివలె ఎఱ్ఱని కిరణముల విరజిమ్ముటను వ్యంజించును. ఆఱవ విశేషణము **శరణ** శబ్దము యొక్క గృహరక్షకార్థముల ననుసరించి అమ్మవారికి మణిద్వీపమందు నివసించుట కంటె మునీంద్రుల హృదయములందు నివసించుటకే అధికమైన ఇష్టము కలిగియున్నదని వ్యంజింపజేయును. అమ్మవారి చరణములకు మునుల అంతఃకరణమునకంటె వేఱు నివాసము మిక్కిలి ఇష్టమైనది లేకపోవుటచే అమ్మవారు నివసించుటకు మునీంద్రుల

అంతఃకరణమే దిక్కు. మునీంద్రుల అంతఃకరణమునకు అమ్మవారి పాదముల వంటి ఇష్టమైన రక్షకమైన మరొక పదార్థము లేకపోవుట చేత మునీంద్రాంతఃకరణ చరణముల పరస్పరశరణత్వ మీ విశేషణము చేత వ్యంగ్యమగుచున్నది. సప్తమ విశేషణ మమ్మవారి గతిమాన్ద్యమును చెప్పుచున్నది. మన్దసరణమున ఉపమానములైన గజాదులను పేర్కొనకపోవుట వలన అవి యేవియును అమ్మవారి చరణములకు గతిమాంద్యమున సాటిరావు అను అర్థము భావుకుల హృదయములలో మెదలును. ఎనిమిదవ విశేషణము కూడ అమ్మవారి పాదముల అట్టి మనోజ్ఞతనే స్ఫురింపజేయును. తొమ్మిదవ విశేషణము కూడ అట్టి దురితహరణమునే వ్యంజింపజేయును. అట్టి చరణములు తప్ప నమస్కార్య మన్యము లేదని చివటి ప్రధానవాక్యమున స్ఫురించుచున్నది. బహుళముగా ఉపమానములు ప్రయోగించు మూకకవి ఉపమానముల ప్రయోగింపకపోవుటయే ఈ అనితర సాధారణత్వస్ఫూర్తికి హేతువు. రేఫావృత్తి అధికసంఖ్యగల (కరణ, శరణ, సరణ, హరణ) పదములలో నుండుటచే పదాంత వృత్త్యనుప్రాసమను శబ్దాలంకారము ఈ శ్లోకమున నేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదములందలి *నలిన మసృణత* చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ పాదములచేత చేయబడిన *నలినమదనిరాసము* చెప్పబడినది.

**శ్లో॥ పరస్మాత్సర్వస్మాదపి చ పరయోర్ముక్తికరయో-**
**ర్నఖశ్రీభిర్జ్యోత్స్నాకలితతులయోస్తామ్రతలయోః।**
**నిలీయే కామాక్ష్యా నిగమనుతయోర్నాకినతయో-**
**ర్నిరస్తప్రోన్మీలన్నలినమదయోరేవ పదయోః॥ 74**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| పరస్మాత్ | = | పరమైన; |
| సర్వస్మాత్ అపి | = | సమస్తమున కంటెను; |
| పరయోః | = | పరములైన; |
| ముక్తికరయోః | = | ముక్తిని కలిగించు; |
| నఖశ్రీభిః | = | గోళ్ళకాంతులచేత; |
| జ్యోత్స్నాకలితతులయోః | = | వెన్నెలతో ఏర్పడిన పోలిక గల; |
| తామ్రతలయోః | = | ఎఱ్ఱనితలములు గల; |
| నిగమనుతయోః | = | వేదములచే స్తుతింపబడిన; |
| నాకినతయోః | = | దేవతల చేత నమస్కరింపదగిన; |
| నిరస్తప్రోన్మీలన్నలినమదయోః | = | నిరసింపబడిన వికసించుచున్న కమలముల మదము గల; |

| | | |
|---|---|---|
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| పదయోః+ఏవ | = | పాదములందే; |
| నిలీయే | = | దాగియుందును. |

**తాత్పర్యము :-**

పరములైన అన్నింటికన్న పరములైనవి అమ్మవారి పాదములు. అవి ముక్తిని కలిగించునట్టివి. గోళ్ళకాంతుల హేతువున వెన్నెలతో తులతూగునట్టివి. వేదములచే పొగడబడినవి. దేవతలచే నమస్కరింపబడినవి. వికసించుచున్న కమలముల మదమును పోగొట్టునట్టివి. అట్టి ఆ పాదములలోనే తలదాచు కొందును.

**వివరణము :-**

అమ్మవారు పరాత్పర. కావున ఆమె పాదములును పరాత్పరములు. అవి సంసార దుఃఖమునుండి ముక్తిని కలిగించునట్టివి. ఆమె గోళ్ళ తెల్లదనము వెన్నెలతో పోలిక గలిగియున్నది అని తెలియజేయుటచేత ఉపమాలంకారము ద్వితీయపాదమున నేర్పడియున్నది. నాల్గవపాదమున ఉపమాన నలిన మదనిరాసము చెప్పబడుటచే ప్రతీపాలంకారము నేర్పడియున్నది. ప్రథమ తృతీయ పాదములలో వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కాళ్ళగోళ్ళ కాంతిని వెన్నెలతో పోల్చుట చెప్పబడినది. చరణముల తామ్రతలత చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి చరణమును చిగురుటాకుతో పోల్చుట ద్వారా ఆ తామ్రతలత సమర్థింపబడు చున్నది.

**శ్లో॥ స్వభావాదన్యోన్యం కిసలయమపీదం తవ పదం**
**మ్రదిమ్నా శోణిమ్నా భగవతి! దధాతే సదృశతామ్।**
**వనే పూర్వస్యేచ్ఛా సతతమవనే కిం తు జగతాం**
**పరస్యేత్థం భేదః స్ఫురతి హృది కామాక్షి! సుధియామ్॥ 75**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| భగవతి | = | షడ్గుణైశ్వర్య సంపన్నురాలైన; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ!; |
| కిసలయమ్ | = | చిగురుటాకు; |
| ఇదమ్ | = | ఈ; |
| తే | = | నీయొక్క; |
| పదమ్ అపి | = | పాదమును; |
| స్వభావాత్ | = | స్వభావమువలన; |
| మ్రదిమ్నా | = | మృదుత్వముతో; |
| శోణిమ్నా | = | ఎఱుపుతో; |

| | | |
|---|---|---|
| అన్యోన్యమ్ | = | పరస్పరము; |
| సదృశతామ్ | = | పోలికను; |
| దధాతే | = | ధరించుచున్నవి; |
| పూర్వస్య | = | మొదటిదానికి (చిగురాకున); |
| వనే | = | వనమునందు; |
| అవనే | = | వనముకాని దానియందు; |
| ఇచ్ఛా | = | కోరిక (అస్తి); |
| కిం తు | = | కాని; |
| జగతామ్ | = | జగములయొక్క; |
| అవనే | = | రక్షణమునందు; |
| పరస్య | = | తరువాతి దానికి (పాదమున); |
| సుధియామ్ | = | విద్వాంసులయొక్క; |
| హృది | = | హృదయమున; |
| ఇత్థమ్ | = | ఇట్లు; |
| భేదః | = | భేదము; |
| స్ఫురతి | = | స్ఫురించుచున్నది. |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదము చిగురుటాకు స్వభావముతోడనే మృదుత్వముతో, ఎఱుపుతో పరస్పరము పోలికను కలిగియున్నవి. చిగురుటాకునకు వనము నందు, అమ్మవారి పాదమునకు అవనము (వనేతరము) నందు అనగా (జగముల) రక్షణమునందు కోరిక భిన్నభిన్నముగా ఉండుట అను భేదము ఆలోచించు విద్వాంసుల హృదయమున తోచును.

**వివరణము :-**

శ్రీ కామాక్షి పాద కిసలయమునకు మృదుత్వ శోణత్వ సాధారణ ధర్మములతో పోలిక, దానితో పాటు ఒక దానికి వనేతర జగదవనము (రక్షణము) నందు, మరొక దానికి వనమునందు ఇచ్ఛ ఉన్నదని భేదము అనగా విశేషము చెప్పబడుటచే నీ శ్లోకమున వ్యతిరేకాలంకార మేర్పడియున్నది. అమ్మవారి పాదము వనమున ఉండదు. చిగురుటాకు వనమున ఉండును. వనమున ఉండుట, వనమున ఉండకపోవుట కిసలయ శ్రీ కామాక్షీపాదముల భేదము (విరోధము) శ్లేషబలమున అవన శబ్దమునకు రక్షణమునందు అర్థమును చెప్పి పరిహరింపవచ్చును. సమానశీలవ్యసనులకు సఖ్యముకూడ ఉండుట సాధారణముగా ఉత్తములలో కన్పించును. అధములలో సాదృశ్యము ఈర్ష్యా ద్వేషనిరోధములకు హేతువగును. అందుచేతనే ఉత్తమశ్రీకామాక్షీపాద కిసలయముల **కిం తు** శబ్దములచే నేర్పడిన విరోధము శ్లేషబలమున పరిహరింపబడినది.



**అవ:-** పై శ్లోకమున శ్లేషబలమున శ్రీ కామాక్షీ పాద కిసలయముల విరోధము యొక్క పరిహార్యత చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె పాదముల యందు పరిహార్య విరోధము చెప్పబడుచున్నది.

**శ్లో॥ కథం వాచాలోఽపి ప్రకటమణిమఞ్జీరనినదైః**
**సదైవానన్దార్ద్రాన్విరచయతి వాచంయమజనాన్।**
**ప్రకృత్యా తే శోణచ్ఛవిరపి చ కామాక్షి! చరణో**
**మనీషానైర్మల్యం కథమివ నృణాం మాంసలయతే॥ 76**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| ప్రకటమణిమంజీరనినదైః | = | స్పష్టములైన మణిమంజీరముల ధ్వనులచేత |
| వాచాలః+అపి | = | మాటకారియైనను; |
| వాచంయమజనాన్ | = | మౌని జనములను; |
| సదా | = | ఎల్లప్పుడు; |
| ఆనందార్ద్రాన్ ఏవ | = | ఆనందముతో తడిసిన వారినిగానే; |
| విరచయతి | = | చేయును; |
| ప్రకృత్యా | = | సహజముగా; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ; |
| శోణచ్ఛవిః | = | ఎఱుపుకాంతిగల; |
| తే | = | నీయొక్క; |
| చరణః అపి | = | పాదము కూడ; |
| కథమ్ ఇవ | = | ఎట్లు; |
| నృణామ్ | = | నరులయొక్క; |
| మనీషానైర్మల్యమ్ | = | బుద్ధియొక్క నిర్మలతను; |
| మాంసలయతే | = | పెంచుచున్నది గదా! |

**తాత్పర్యము :-**

మంజీరనాదములచే మాట్లాడు అమ్మవారి చరణము మౌనులను ఆనందార్ద్రులను చేయుచున్నది. అంతేకాక ఎఱ్ఱనిరంగు కలదైనను అది బుద్ధి యందు నిర్మలతను పెంచుచున్నది గదా! ఇది ఎట్లు?

**వివరణము :-**

మౌనులు మాట్లాడువారి నీసడించుకొందురు. మాట్లాడువారు మౌనులను వెక్కిరించెదరు. మౌనులు మౌనులను, మాట్లాడువారు మాట్లాడువారిని ఆనందింపజేయు చుందురు. దీనికి కారణము ఏకస్వభావముగల వారొకరొకరిని అభినందించుటయే.

సాధారణ స్థితి ఇట్లుండ(గా మాటకారియైన నీ పాదము మౌనులను ఆనందింపజేయుట విరోధము. అట్లే ఎఱ్ఱని అమ్మవారి పాదము బుద్ధిలో రజమును కలిగింపవలెను. కాని నిర్మలతను కలిగించుటయు విరోధము. మహామహిమగల అమ్మవారి పాదమట్లు చేయుటలో విరోధమేమి లేదని విరోధమును పరిహరించుకొన వచ్చును. కావున ఈ శ్లోకమున విరోధాభాసా లంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున జలసాధ్యములైన ఆర్ద్రత నైర్మల్యములు ప్రస్తావింపబడినవి. ఈ శ్లోకమున అమ్మవారి చరణము కర్మ జలరాశికి హేతువుగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ చలత్తృష్ణావీచీపరిచలనపర్యాకులతయా**
**ముహుర్భ్రాన్త్వా తాన్తః పరమశివవామాక్షి! పరవాన్।**
**తితీర్షుః కామాక్షి! ప్రచురతరకర్మామ్బుధిమముం**
**కదాహం లప్స్యే తే చరణమణిసేతుం గిరిసుతే!॥ 77**

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| చలత్ తృష్ణావీచీపరిచలన పర్యాకులతయా | = | కదులుచున్న ఆశలనెడి తరంగముల చలనము చేత మిక్కిలి వ్యాకులత కలుగుట చేత; |
| ముహుః | = | మాటిమాటికి; |
| భ్రాన్త్వా | = | భ్రమించి; |
| తాన్తః | = | అలసిన; |
| పరవాన్ | = | పరవశుడైన; |
| అముమ్ | = | ఈ; |
| ప్రచురతరకర్మాంబుధిమ్ | = | అధికమైన కర్మయనెడి సముద్రమును; |
| తితీర్షుః | = | దాటదలచిన; |
| అహమ్ | = | నేను; |
| గిరిసుతే | = | పార్వతివైన; |
| పరమశివవామాక్షి | = | పరమశివుని కాంతవైన; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ; |
| తే | = | నీయొక్క; |
| చరణమణిసేతుమ్ | = | పాదమను మణియను వారధిని; |
| కదా | = | ఎప్పుడు; |
| లప్స్యే | = | పొందగలను. |

**తాత్పర్యము :-**

ఆశల తరంగములతో వ్యాకులుడనైన మాటిమాటికి భ్రమించి అలసిన పరవశుడనైన నేను కర్మ సముద్రమును దాట గోరితిని. తత్సాధనమైన అమ్మవారి పాదమనెడి మణిమయసేతువు నెప్పుడు పొందగలుగుదునో.

**వివరణము :-**

కర్మయందు, తృష్ణలందు వీచులయొక్క సముద్రముయొక్క పాదమణు లందు సేతువుయొక్క రూపణముండుటచే నీ శ్లోకమున రూపకాలంకార మున్నది.



**అవ:-** పై శ్లోకమున కర్మ సముద్రముగా రూపింపబడినది. ఈ శ్లోకమున ప్రజ్ఞ **సరిత్తుగా** రూపింపబడుచున్నది.

**శ్లో॥ విశుష్యన్త్యాం ప్రజ్ఞాసరితి దురితగ్రీష్మసమయ-**
**ప్రభావేణ క్షీణే సతి మమ మనఃకేకిని శుచా।**
**త్వదీయః కామాక్షి! స్ఫురితచరణామ్భోదమహిమా**
**నభోమాసాటోపం నగపతిసుతే! కిం న కురుతే॥ 78**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| దురితగ్రీష్మసమయప్రభావేణ | = | పాపమను గ్రీష్మకాలముయొక్క ప్రభావముచేత |
| ప్రజ్ఞాసరితి | = | ప్రజ్ఞయనెడి నది; |
| విశుష్యన్త్యామ్ | = | ఎండిపోవుచుండగా! |
| మమ | = | నాయొక్క; |
| మనః కేకిని | = | మనస్సనెడి నెమలి; |
| శుచా | = | దుఃఖముచేత; |
| క్షీణే సతి | = | క్షీణించినది కాగా; |
| నగపతిసుతే | = | పర్వతరాజకుమారివైన; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| త్వదీయః | = | నీ; |
| స్ఫురితచరణాంభోదమహిమా | = | ప్రకాశించిన పాదమనెడి మేఘముయొక్క మహిమ; |
| నభోమాసాటోపమ్ | = | శ్రావణమాసగర్వమును; |
| కిమ్ న కురుతే | = | చేయుట లేదా! |

**తాత్పర్యము :-**

పాపమను గ్రీష్మకాలముయొక్క ప్రభావముచే ప్రజ్ఞానది ఎండిపోవు చుండగా కవి మనస్సనెడి నెమలి దుఃఖముతో క్షీణించినది, కాగా అమ్మవారి పాదమనెడి మేఘము శ్రావణమాస మగుచున్నది.

**వివరణము :-**

ప్రజ్ఞయందు సరిదారోపము, మనస్సునందు నెమలియొక్క ఆరోపము, చరణమునందు మేఘముయొక్క ఆరోపము చేయబడినందున నేర్పడిన రూపకము నభోమాసాటోపకరణసంభావనమునకు అంగముగా సహకరించుటచేత రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకార మీ శ్లోకమున నున్నది. ఎండకాలమున నదులెండి పోవును. కవియొక్క ప్రజ్ఞయను నది పాపమను గ్రీష్మముచేత ఎండిపోయినది. ఒక వ్యక్తికి ప్రజ్ఞ తక్కువైన అది ఆయన పూర్వజన్మపాపముననే అట్లున్నదని తెలియవలెను. నెమళ్ళకు ఎండకాలమున దుఃఖము, వర్షాకాలమున ఆనందము కలుగును. వర్షాకాలమున నెమలి పురివిప్పి ఆడును. ఆ వర్షాకాలము శ్రావణమాసము నెమలికి ఆనందజనకమైనట్లు కవి మనస్సునకు అమ్మవారి పాద మానందజనక మగునను ఉపమాలంకార ధ్వని ఈ శ్లోకమున నున్నది.



**అవ:-** పై శ్లోకమున లోకోపకారకమైనను తమస్సును విస్తరింపజేయు మేఘముతో అమ్మవారి పాదము రూపింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి చరణము **తమస్సును పోగొట్టు ప్రదీపము**గా రూపింపబడుచున్నది.

**శ్లో॥ వినమ్రాణాం చేతోభవనవలభీసీమ్ని చరణ-**
**ప్రదీపే ప్రాకాశ్యం దధతి తవ నిర్ధూతతమసి।**
**అసీమా కామాక్షి! స్వయమలఘుదుష్కర్మలహరీ**
**విఘూర్ణన్తీ శాన్తిం శలభపరిపాటీవ భజతే॥** **79**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| వినమ్రాణామ్ | = | నమస్కరించువారియొక్క; |
| చేతోభవనవలభీసీమ్ని | = | మనస్సనెడి భవనము యొక్క పిట్టగోడ ప్రాంతమునందు; |
| తవ | = | నీయొక్క; |
| చరణప్రదీపే | = | పాదమను ప్రదీపము; |
| ప్రాకాశ్యమ్ | = | వెలుగును; |
| దధతి | = | ధరించుచుండగా; |
| నిర్ధూతతమసి | = | చీకటులు నశించగా; |
| అసీమా | = | హద్దులు లేని; |
| అలఘుదుష్కర్మలహరీ | = | గొప్ప పాప ప్రవాహము; |

స్వయమ్ = స్వయముగా;
విఘూర్ణంతీ = పరిగెత్తుకొని వచ్చి;
శలభపరిపాటీ+ఇవ = మిడుతల పద్ధతివలె;
శాన్తిమ్ = శాన్తిని;
భజతే = పొందుచున్నది.

**తాత్పర్యము :-**

నమస్కరించువారి మనోభవనమున అమ్మవారి పాదము దీపమై ప్రకాశించుచుండగా, దానియందు పాప ప్రవాహము మిడుతల దండులా వచ్చిపడి నశిస్తున్నాయి.

**వివరణము :-**

చేతమునందు భవనవలభిసీమత్వము, చరణమునందు ప్రదీపత్వము ఆరోపింపబడినందున, దుష్కర్మలహరియందు శలభపరిపాటియొక్క ఔపమ్యము చెప్పబడినందున రూపకోపమాలంకారముల సంసృష్టి ఇందున్నది. నమస్కరించు వారి మనస్సను భవనమున అమ్మవారి చరణము దీపమువలె ప్రకాశించుచున్నది. దీపరూపమోహముచేత మిడతలు దీపమునబడి నశించుచుండును. పాపకర్మ సమూహప్రవాహము మిడుతలదండువలె అమ్మవారి చరణమను దీపముయొక్క జ్వాలలో స్వయముగా వచ్చి పడి శమించుచున్నది. స్వయముగా అనుటచేత అమ్మవారి చరణము నాశ్రయించిన జాలు నా పాపకర్మ సమూహము తనంత తానే నశించునని పాపకర్మములను తొలగించుకొనుటకు వేఱు ప్రయత్న మక్కఱ లేదను నర్థము వ్యంగ్యమగుచున్నది. సీమ (ప్రాంతము) గల మనస్సున సీమలేని దుష్కర్మలహరి ఉన్నదని చెప్పుటచే తన పాపములకును హద్దు లేకున్నను అమ్మవారి చరణదీపప్రకాశమున అవి అన్నియు తప్పక నశించునను విశ్వాసము వ్యక్తమగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున హేతువైన అవయవమైన దుష్కర్మలహరులు ప్రస్తావింప బడినవి. ఈ శ్లోకమున తత్ఫలమైన తదవయవియైన విపత్సముద్రములు ప్రస్తావింపబడుచున్నవి. పై శ్లోకమున వహ్న్యవయవమైన దీపము ప్రస్తావింప బడినది. ఈ శ్లోకమున అవయవియైన వహ్ని. దానికి హేతువైన **అరణి** ప్రస్తావింపబడుచున్నవి.

**శ్లో॥ విరాజన్తీ శుక్తిర్నఖకిరణముక్తామణితతే-**
**ర్విపత్పాథోరాశౌ తరిరపి నరాణాం ప్రణమతామ్।**
**త్వదీయః కామాక్షి! ధ్రువమలఘువహ్నిర్భవవనే**
**మునీనాం జ్ఞానాగ్నేరరణిరయమంఘ్రిర్విజయతే॥ 80**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| నఖకిరణముక్తామణితతేః | = | గోళ్ళ కాంతులనెడి ముత్తెముల గుంపునకు; |
| శుక్తిః | = | ముత్యపు చిప్పయైన; |
| విరాజన్తీ | = | ప్రకాశించుచున్న; |
| ప్రణమతామ్ | = | నమస్కరించుచున్న; |
| నరాణామ్ | = | నరులయొక్క; |
| విపత్పాథోరాశౌ | = | ఆపద యనెడి సముద్రముయొక్క; |
| తరిః | = | నావయైన; |
| అపి | = | మరియు; |
| భవవనే | = | సంసారమను అడవియందు; |
| అలఘువహ్నిః | = | గొప్పనైన అగ్నియైన; |
| మునీనామ్ | = | మునులయొక్క; |
| జ్ఞానాగ్నేః | = | జ్ఞానమనెడి అగ్నికి; |
| అరణిః | = | దారువైన; |
| త్వదీయః | = | నీ; |
| అయమ్ | = | ఈ; |
| అంఘ్రిః | = | పాదము; |
| ధ్రువమ్ | = | నిశ్చయముగా; |
| విజయతే | = | సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది. |

**తాత్పర్యము :-**

గోళ్ళ కాంతులనెడి ముత్తెముల సమూహమునకు ముత్తెపు చిప్ప, నమస్కరించు నరుల ఆపదలనెడి సముద్రమునకు నావ, సంసారమను అడవి యందు అగ్ని, మునుల జ్ఞానమనెడి అగ్నికి అరణియునైన అమ్మవారి పాదము వర్ధిల్లుచున్నది.

**వివరణము :-**

అమ్మవారి చరణము ముత్తెపుచిప్పగా, ఓడగా, అగ్నిగా, అరణిగా సంభావింపబడినందున ఇందు ఉత్ప్రేక్షాలంకార మేర్పడినది. ముత్తెములు ముత్తెపు చిప్పలు ప్రథమ పాదమున, వాని కథిష్ఠానమైన సముద్రము ద్వితీయ పాదమున ప్రస్తావింపబడినవి. అమ్మవారి పాదము సముద్రములోని ముత్తెపుచిప్పగా, సముద్రమును దాటించు నావగా ఉత్ప్రేక్షింపబడినది. సముద్రముయొక్క ఉద్ధృతిని అణచునట్టి అనగా సముద్రము పొంగకుండచేయు అగ్ని, ఆ అగ్నికి ఆహారమైన వనము మూడవ పాదమున ప్రస్తావింపబడినవి. అమ్మవారి పాదము భవవననాశకవహ్నిగా, ఆ వహ్నికి జన్మస్థానమైన అరణిని మథించి (అగ్నిని చిలికి) వెలికిదీయు ప్రయత్నమునకు ముఖ్యాధారమైన అరణిగా

నాల్గవ పాదమున అమ్మవారి పాద ముత్ప్రేక్షింపబడినది. అరణినుండి పుట్టిన అగ్ని, అరణినే దహింపజేయుటయు గలదు. అగ్ని నుండి జనించిన జలము, అగ్ని నార్పుటయు కలదు. అగ్నిచే ఉధృతి అణచి వేయబడు లక్షణము గల సముద్రము, అగ్నికి దారు నిర్మితమైన నావ ఇంధనముగా దగియుండుట స్పష్టమే. మొత్తము మీద ఈ శ్లోకమున నున్న విషయ విషయి ద్రవ్యములన్నియు పరస్పరోపమర్ద్యోపమర్దక భావ సంబంధములు కలవై సంసారస్వభావమును తెలియజేయుచున్నవి. దానికి సాక్షిణియైన అమ్మవారి శాశ్వతత్వము వ్యంజింపజేయుచున్నవి. ముత్తెములు తెల్లనివి. ముత్తెపుచిప్పయు తెల్లనైనదే. అయినను నఖకిరణముక్తామణులకు జన్మహేతువైనందున ఎఱ్ఱని చరణము శుక్తిగా ఉత్ప్రేక్షింపబడినది. మూడవ పాదము భవవనోచ్ఛేద హేతువుగా ఉత్ప్రేక్షింపబడిన అమ్మవారి చరణము నాల్గవ పాదమున అగ్ని మంథానదారువై అగ్ని జననహేతువైన అగ్ని గాహ్యతగల అరణిగా ఉత్ప్రేక్షింపబడి ఒక విధమున శృంఖలాబంధము నీ శ్లోకమున స్ఫురింపజేయు చున్నది. **అలఘువహ్నిః** అను సమాసమును **అలఘు రగ్నిః** అని న్యసించినచో ఈ శ్లోకమున నొక విధమైన **ముక్తపదగ్రస్తత** ఏర్పడును.



**అవ:-** పై శ్లోకమున భవవనోచ్ఛేదహేత్వగ్నిగా అమ్మవారి చరణ ముత్ప్రేక్షింప బడినది. ఈ శ్లోకమున వనములలోనుండి వనముల కాధారములైన గిరుల నుచ్ఛేదించు నింద్రుడుగా అమ్మవారి చరణము సంభావింపబడుచున్నది.

**శ్లో॥ సమస్తైస్సంసేవ్యస్సతతమపి కామాక్షి! విబుధైః**
**స్తుతో గన్ధర్వస్త్రీసులలితవిపఞ్చీకలరవైః।**
**భవత్యా ఛిన్దానో భవగిరికులం జృమ్భితతమో-**
**బలద్రోహీ మాతశ్చరణపురుహూతో విజయతే॥ 81**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |
| సమస్తైః | = | అందఱి; |
| విబుధైః | = | దేవతల చేత; |
| సతతమ్ అపి | = | ఎల్లప్పుడును; |
| సంసేవ్యః | = | బాగుగా సేవింపదగిన; |
| గంధర్వ స్త్రీసులలితవిపంచీ కలరవైః | = | గంధర్వ స్త్రీల మిక్కిలి అందములైన వీణల అవ్యక్త మధురములైన ధ్వనులచేత ; |
| స్తుతః | = | పొగడబడిన; |
| భవగిరికులమ్ | = | సంసారపర్వతసమూహమును; |
| ఛిందానః | = | ఛేదించునట్టి; |

| | | |
|---|---|---|
| జృమ్భితతమోబలద్రోహీ | = | విజృంభించిన తమస్సుగల బలుని (రాక్షసుని)కి ద్రోహమొనర్చిన; |
| భవత్యాః | = | నీయొక్క |
| చరణపురుహూతః | = | పాదమను ఇంద్రుడు, ; |
| విజయతే | = | సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నాడు. |

**తాత్పర్యము :-**

ఎల్లప్పుడును దేవతలందఱచే బాగుగా సేవింపదగిన, గంధర్వ స్త్రీల మనోహరవీణాధ్వనులచేత పొగడబడిన సంసారపర్వతసమూహమును ఛేదించు, తమస్సు పెరిగిన బలుడను రాక్షసుని ఛేదించిన నీ చరణమను ఇంద్రుడు సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నాడు.

**వివరణము :-**

అమ్మవారి పాదమునందు పురుహూతత్వారోపము చేయబడుటచేత ఈ శ్లోకమున రూపకాలంకార మేర్పడియున్నది. ఇంద్రుడు దేవతల రాజు కావున దేవతలందఱాతని సేవించి నట్లే అమ్మవారి పాదమును సేవించెదరు. గంధర్వస్త్రీల వీణానాదములచే ఇంద్రుని స్తుతించినట్లే అమ్మవారి చరణమును స్తుతించబడును. ఆ రెండు విశేషణముల అర్థము ఇంద్ర-చరణములకు సమానముగా సరిపోవుటచే నిట అర్థశ్లేష ఉన్నది. ***భవగిరికులమ్ ఛిందానః*** అను విశేషణము సంసారమునకు పర్వత సమూహమునకు రూపకబలముచే అభేదమును కూర్చుచు, చరణేంద్రమయమైన ఏకత్వమును సమర్థించుచున్నది. ***జృమ్భితతమోబలద్రోహీ*** అను విశేషణము పాదపక్షమున తమోబలమును అనగా అజ్ఞానబలమును నశింపజేయునను అర్థమును ఇచ్చుటచేత శబ్ద శ్లేష ఏర్పడియున్నది. మొదటి మూడు పాదములలో వర్ణమైత్రి ఉన్నది. మొదటి పాదమున మొదటి మూడు పదముల సకారాదిత్వము సులలిత, కలరవ, గిరికుల, బల, చరణ పురుహూత శబ్దములందలి లకార రేఫావృత్తి అక్షరరమ్యతను, వృత్త్యనుప్రాసమును, శయ్యా సౌభాగ్యమును చేకూర్చుచున్నవి. రెండవ పాదమున వీణల వాయించుచు గంధర్వ స్త్రీలు చేసిన స్తుతి గానములు చెప్పబడినవి. వాద్యముతో కూడిన గానము ఏకాగ్రతను కలిగించుటలో సాయపడునను నంశము సూచింపబడినది. ఇట్టి స్తుతి మొదటి పాదమునకు హేతువైన అజ్ఞానమును తొలగించుననుట ఈ శ్లోకములోని ముఖ్యముగా వ్యంజింపజేయ బడిన భావార్థము.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చరణము ***తమోబలద్రోహీ*** యని చెప్పబడినది. ఈ శ్లోకమున తమోజన్యతాపశమనము నది కలిగించునని చెప్పబడుచున్నది. పై శ్లోకమున అమ్మవారి చరణముయొక్క సేవాస్తుతులు ప్రతిపాదింపబడినవి. ఈ శ్లోకమున తత్ఫలమైన **తాపోపశమనము** నమ్మవారి పాదము కలిగించునని చెప్పబడుచున్నది.

శ్లో॥ వసన్తం భక్తానామపి మనసి నిత్యం పరిలస-
ద్ఘనచ్ఛాయాపూర్ణం శుచిమపి నృణాం తాపశమనమ్।
నఖేన్దుజ్యోత్స్నాభిః శిశిరమపి పద్మోదయకరం
నమామః కామాక్ష్యాశ్చరణమధికాశ్చర్యకరణమ్॥ **82**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| భక్తానామ్ | = | భక్తులయొక్క; |
| మనసి | = | మనసునందు; |
| నిత్యమ్ | = | ఎల్లప్పుడు; |
| వసన్తమ్ అపి (వసన్తమైనను) | = | నివసించుచున్నను; |
| పరిలసద్ఘనచ్ఛాయాపూర్ణమ్ | = | ప్రకాశించుచున్న మేఘము యొక్క కాంతితో నిండియున్న (వర్షర్తువైన); |
| శుచిమ్ అపి | = | పవిత్రము (అగ్ని గ్రీష్మము) ఐనను, |
| తాపశమనమ్ | = | తాపమును శమింపజేయు; |
| నఖేన్దుజ్యోత్స్నాభిః | = | గోళ్ళ కాంతులనెడి వెన్నెలతో; |
| శిశిరమ్ అపి | = | చల్లనిదైనను (శిశిరర్తువైనను); |
| పద్మోదయకరమ్ | = | పద్మయనెడి లక్ష్మిని పెంచులేక పద్మముల వికాసమును కలిగించు (శరదృతువైన); |
| అధికాశ్చర్యకరణమ్ | = | మిక్కిలి వింతను కలిగించునట్టి; |
| నమామః | = | నమస్కరించుచున్నాము. |

**తాత్పర్యము :-**

భక్తుల మనసునందు వసన్తమై నివసించుచున్నను, మేఘ కాంతితోడి (దట్టమైన కాంతిలో) నిండియున్న అగ్నియైనను (పవిత్రమైనను) తాపమును తొలగించు గోళ్ళకాంతులనెడి వెన్నెలలతో చల్లనైనను, పద్మను (లక్ష్మిని) ఉదయింప జేయు మిక్కిలి వింతగొలుపు అమ్మవారి పాదమునకు ప్రణమిల్లుచున్నాము.

**వివరణము :-**

ఆకాశమున మేఘకాంతి నిండియుండును. భక్తుల మనస్సున అట్టి అమ్మ వారి ఘనచ్ఛాయ నిండిన పాదమున్నది. అమ్మవారి పాద మెట్టునిది. దానికి ఘనచ్ఛాయ యెక్కడిది? దానికి లేదు. అయినను అది ఘనచ్ఛాయతో అనగా దట్టమైనకాంతితో గూడియున్నది అని అర్థము చెప్పి విరోధము పరిహరింప వచ్చును. ఈ పాదముననే మరొక విధముగా విరోధమును తత్పరిహారమును చెప్పవచ్చును. అమ్మవారి పాదము వసన్తము అయినచో అది ఘనచ్ఛాయతో అనగా మేఘచ్ఛాయతో నిండియుండుట యెట్లు? వసన్తమున మేఘముండదు గదా. మేఘముల కాలము వర్షాకాలము. అది వసన్త గ్రీష్మ

ఋతువుల అనంతరము వచ్చును కావున వసన్త మేఘ కాలముల సంధియు లేదు. మధ్యమున శుచి అనగా గ్రీష్మమున్నది. అమ్మవారి పాదము వసన్తమైనను వర్షర్తువువలె మేఘచ్ఛాయతో అనగా దట్టమైనకాంతితో నిండియున్నది అని అర్థము చెప్పి విరోధము పరిహరించుకొనవచ్చును. కొందరిట్లనవచ్చును. వసన్తమున మేఘములు రావచ్చును. వర్షములు పడవచ్చును. కావున వసన్తమేఘకాలములకు విరోధము లేదు అని అన్నప్పుడు మేఘములు వచ్చినను అవి వసన్త ఋతువంతయు నిండియుండవు. కావున విరోధ ముండనే ఉన్నది అని పూర్ణశబ్దముపై ప్రశ్నమునకు సమాధానము చెప్పుచున్నది. శుచి యనగా గ్రీష్మర్తువు ఆ సమయమున సూర్యుడగ్నివలె మండును. అమ్మవారి పాదమగ్ని వలె పవిత్రము. అగ్ని కంటెను పవిత్రము. అసలు ఆ పాదమగ్నియే. శుచి శబ్దమగ్ని వాచకము. అమ్మవారే అగ్ని స్వరూపిణి. అగ్నిలో నుండియే ఆమె ఆవిర్భవించినది. ఆమె శీర్షాది చరణాన్తావయవము లన్నియు రూపుదిద్దుకొన్నవి. అయినను అగ్ని ఆమె అనిన భయపడును. *'భీషాస్మాదగ్నిశ్చ'* తై. 2. 8. 1 అను ఉపనిషద్వాక్యము దానికి ప్రమాణము. అగ్నియందు అమ్మవారు ఉపాస్యయైనను అనగా అమ్మవారి ఉపాసనమునకు అగ్ని ప్రతీకమైనను అమ్మవారగ్ని కాదు. అమ్మవారి పాదము అగ్ని కాదు. అది పవిత్రమని శుచి శబ్దమునకు అర్థము చెప్పి అగ్నియైన అమ్మవారి పాదమెట్లు పరతాపమును శమింపజేయగలుగుట అను విరోధమును పరిహరింపవచ్చును. శుచి యనగా గ్రీష్మర్తువు. అది పాపతాప పంకమును హరించును. రెండవ పాదమునందు గ్రీష్మమని, అగ్నియని చెప్పబడిన అమ్మవారి పాదము శిశిరమని మూడవ పాదమున చెప్పబడినది. ఇదియు విరోధమే. శిశిరమువలె జగమ్మునకు ప్రలయకాలమునకు నాశకమని అర్థము చెప్పి విరోధమును పరిహరించుకొన వచ్చును. అమ్మవారి పాదము శిశిరము. శిశిరమున పద్మముల కుదయ ముండదు. శిశిరము పద్మోదయకరము కాదు. పద్మ ముకులన హేతువు. అది పద్మోదయకరమ్మని అనగా శరదృతువని చెప్పుట విరోధము. శిశిర శబ్దమునకు విశేష్యమైన అమ్మవారి పాదము చల్లనిది అను అర్థమును చెప్పిగాని లేక పద్మ అనగా సంపద (లక్ష్మి) యొక్క ఉదయమును కలిగించును అని చెప్పిగాని విరోధమును పరిహరించుకొనవచ్చును. విరుద్ధ ధర్మముల కేకాశ్రయమై యుండుటచే అమ్మవారి పాద మాశ్చర్యకరణము. అనగా ఆశ్చర్యమును కలిగించును. విరుద్ధ ధర్మము లొకచోట ఉండవు. అట్లుండని వానిని తన యందుంచుకొనుటయే అమ్మవారి ఆశ్చర్యకరమైన మహిమ. ఈ శ్లోకమున విరోధాభాసాలంకార మున్నదని నిరూపింపబడినది. అమ్మవారి పాదము ***వసన్తము. వర్షర్తువు, గ్రీష్మము, శిశిరము, శరదృతువు*** అను అన్ని ఋతువుల స్వరూపము నొక్క అమ్మవారి పాదమే ధరించినదనుట ఈ శ్లోకమునందలి ముఖ్యమైన భావార్థము. శ్లోకమున పేర్కొనబడని **హేమంతర్తువు** శిశిరమునందే గతార్థమని భావింపవలెను. భక్తుల మనస్సునందు అమ్మవారి పాదము వసన్తర్తువని చెప్పబడుటచే వారి మనసులో అహింసా సత్యాది పుష్పములు వికసించునని వ్యంగ్యమగుచున్నది.

పరిలసద్ఘనచ్ఛాయాపూర్ణ మని చెప్పుటచే అమ్మవారి పాదము భక్తుల తాపోపశమన మొనరించుటయే గాక వారికి జీవనదాన మొనర్చునని వ్యంగ్యమగుచున్నది. ఘనమనగా మేఘము. తాపమును తొలగించుటయే గాక జీవనమును (జలమును) ఒసగుట లోక ప్రసిద్ధమే. ఇచట జీవన మాధ్యాత్మికము. జీవ పరైక్యజ్ఞాన పరిపాకానుకూల కాలమని గమనింపవలెను. వెన్నెలల విరియింపజేయుట **శరదృతు** లక్షణము. శిశిరఋతువుతో పాటు జ్యోత్స్న కూడ కమలముల ముకుళింపజేయును. శిశిరర్తువున మంచు ఎక్కువగా కురియుటచే శరదృతువున నున్నంత స్వచ్ఛముగా వెన్నెల ఉండదు. శరదృతువు నందు నవరాత్రి దీపావళ్యాదులలో లక్ష్మీపూజ (పద్మోదయము) అధికముగా జరుగును. ఆ లక్ష్మిని అమ్మవారి పాదము ప్రసాదించును అని శిశిరర్తువుతో పాటు శరదృతు లక్షణము (జ్యోత్స్నాధిక్యము) ను మూడవ పాదము వ్యంజింప జేయుచున్నది. వర్షర్తువు తాపశమనమే అయినను అది పద్మముల ముకుళనమునకే సూర్యకిరణనిరోధక మేఘాచ్ఛాదనము ద్వారా సాయపడును. అయినను అది సస్యవృద్ధి ద్వారా పద్మోదయమును అనగా సంపద్వృద్ధిని కలిగించుటచే పద్మోదయకరమని చెప్పవచ్చును. ఇట్లీ విస్తరణముయొక్క ప్రయోజన మేమనగా ప్రతి ఋతువునకు మరొక ఋతువునందలి లక్షణముల విరోధించు లక్షణమున్నదని చెప్పుచునే అమ్మవారి పాదమహిమను విస్తరించుట. **తాపశమనమ్** అను శబ్దము అమ్మవారి పాదము ఆధ్యాత్మికాధిదైవిక ఆధిభౌతిక తాపత్రయనివారణమును బోధించును.



**అవ:-** పూర్వ శ్లోకమున అమ్మవారి పాదమునందు ఇంద్రత్వ మారోపింపబడినది. ఈ శ్లోకమున ఆ పాదమునందు పరమేష్ఠి (బ్రహ్మ) త్వ మారోపింపబడుచున్నది.

**శ్లో॥ కవీన్ద్రాణాం నానాభణితిగుణచిత్రీకృతవచః-**
**ప్రపఞ్చవ్యాపారప్రకటనకలాకౌశలనిధిః।**
**అధఃకుర్వన్నబ్జం సనకభృగుముఖ్యైర్మునిజనై-**
**ర్నమస్యః కామాక్ష్యాశ్చరణపరమేష్ఠీ విజయతే॥ 83**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కవీన్ద్రాణామ్ | = | కవీంద్రులయొక్క ; |
| నానాభణితిగుణచిత్రీకృతవచః ప్రపంచవ్యాపారప్రకటన కలాకౌశలనిధిః | = | అనేకములైన ఫణితుల గుణములు చిత్రీకరించబడిన వాక్ప్రపంచవ్యాపారమును ప్రకటించు కలాకౌశలమునకు నిధియైన; |
| అబ్జమ్ | = | కమలమును; |
| అధఃకుర్వన్ | = | క్రిందు చేయుచు; |
| సనకభృగుముఖ్యైః మునిజనైః | = | సనకుడు, భృగువు మొదలైన ముని జనములచే; |

నమస్యః = నమస్కరింపదగిన;
కామాక్ష్యాః = కామాక్షీదేవి యొక్క;
చరణపరమేష్ఠీ = పాదమను బ్రహ్మ;
విజయతే = సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నాడు.

**తాత్పర్యము :-**

కవుల అనేక విధములైన వాగ్విన్యాసరీతి గుణముల ప్రకటించు కలా కౌశలమునకు నిధియైన, కమలమును క్రిందుగా చేయు, సనకాది భృగ్వాది మునులచే నమస్కరింపదగిన కామాక్షీదేవియొక్క పాదమనుబ్రహ్మ సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నాడు.

**వివరణము :-**

ఒక్కొక్క కవియొక్క కవితాఫణితి వేరువేరుగా నుండును. అట్లు తన ముద్రను ప్రదర్శించగల కవికే అధిక గౌరవ ముండును. ఆదికవియైన వాల్మీకి మహాకవి మధుమయఫణితులమార్గదర్శి. ఆయన వివిధములైన ఫణితుల వివిధ కవులు పుణికి పుచ్చుకొన్నారు. ఆదికవి వాల్మీకి కవియొక్క అట్టి ఫణితుల ప్రకటింపజేయు కలాకౌశలము బ్రహ్మదే. అమ్మవారి పాదము నారాధించని వారి కా కౌశలమలవడదు. ఆరాధించు వారి కా కౌశలమలవడుట ప్రసిద్ధ విషయము. బ్రహ్మ అట్లారాధించి ఆ కౌశలమునకు నిధియైనాడు. అందుచేతనే బ్రహ్మను కవియని చెప్పుట వైదికశిష్టవ్యవహారసిద్ధము. బ్రహ్మ కా కౌశల మమ్మవారి పాదమునుండియే కలిగినది. కావున పాదసామ్యమును పొందినాడు. దానిని వ్యంజించుటకే పాదమున బ్రహ్మతోడి అభేద ప్రధాన ఆరోపణము చెప్పబడినందున ఇట రూపకాలంకార మేర్పడినది. అబ్జము అనగా కమలము. దాని నధఃకరించుట చరణ (పక్ష) మున కమలాధికారుణ్యము కలిగియుండుట హేతువు. బ్రహ్మపక్షమున ఆసనమైన కమలము క్రిందుగా నుండుట హేతువు, అర్థశ్లేష ద్వారా అభేదము చెప్పుటకు కావలసిన సమాన ధర్మమును **'అధః కుర్వన్నబ్జమ్'** అను పదములు సంపాదించుచున్నవి. **'సనకభృగుముఖ్యై ర్మునిజనై ర్నమస్యః'** అను పదములు కూడ సనకభృగ్వాది మునివంద్యత్వమను సమాన ధర్మమును చెప్పుచున్నవి. సనకసనందసనత్కుమార సనత్సుజాతులు బ్రహ్మమానస పుత్రులు. బ్రహ్మ వారిని మనస్సుతో సృష్టించినాడు. వారెల్లప్పుడు అనగా ప్రలయకాలము వరకును కుమారులుగా అనగా ఎనిమిది వత్సరముల లోపు వయసు కలవారుగానే ఉన్నట్లు పురాణములలో వర్ణింపబడినారు. సనాతనుడను నొకడు ఈ నలుగురిలో చేరి ఉండుట పురాణములలో కొన్ని చోట్ల, ఔత్తరాహపాఠమున సనందనునకు బదులుగా కాననగును. కావున సనకాదులు నల్వురు. భృగ్వాదులు కౌమారసర్గములోని వారు కారు. భృగుమహర్షికి నవబ్రహ్మలలోను, సప్తర్షులలోను స్థానము కానవచ్చును. ఆయన ఒక మహర్షి. శ్రీవత్సాదిగోత్రములకు గోత్రఋషి. **సనకభృగుముఖ్యైః** అను సమాసమును సనకముఖ్యైః , భృగుముఖ్యైః అను ద్వంద్వాంత మందలి ముఖ్య శబ్దమునకు సనక శబ్దమునకు, భృగు శబ్దమునకు అన్వయించి చెప్పుట సముచితము.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదము నమస్యః అనగా నమన యోగ్యమని చెప్పబడినది. ఈ శ్లోకమున నమనము చేసిన వారికి కలుగు ప్రయోజనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ భవత్యాః కామాక్షి! స్ఫురితపదపఙ్కేరుహభువాం**
**పరాగాణాం పూరైః పరిహృతకలఙ్కవ్యతికరైః।**
**నతానామామృష్టే హృదయముకురే నిర్మలరుచి-**
**ప్రసన్నే నిశ్శేషం ప్రతిఫలతి విశ్వం గిరిసుతే॥ 84**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| గిరిసుతే | = | పర్వతపుత్రివైన; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| భవత్యాః | = | నీయొక్క; |
| స్ఫురితపదపంకేరుహభువామ్ | = | ప్రకాశించిన పాద కమలములందు పుట్టిన; |
| పరాగాణామ్ | = | పాంసువుల యొక్క; |
| పరిహృతకలంకవ్యతికరైః | = | తొలగింపబడిన కలంక సంబంధము గల; |
| పూరైః | = | సమూహముల చేత; |
| నతానామ్ | = | నమస్కరించువారియొక్క; |
| హృదయముకురే | = | ఎదయను అద్దము; |
| ఆమృష్టే | = | పూర్తిగా శుద్ధము చేయబడి; |
| నిర్మలరుచిప్రసన్నే | = | నిర్మలమైనకాంతిచేత స్వచ్ఛముకాగా; |
| నిశ్శేషమ్ విశ్వమ్ | = | యావత్ ప్రపంచము; |
| ప్రతిఫలతి | = | ప్రతిబింబించుచున్నది. |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదమందు పుట్టిన పుప్పొడిచే నమస్కరించిన వారి హృదయము శుద్ధము చేయబడి నిర్మలమైన కాంతిచే స్వచ్ఛముకాగా దానియందు విశ్వము ప్రతిబింబించుచున్నది.

**వివరణము :-**

అమ్మవారి పాదములు పద్మములు కావున వానియందు పుప్పొడి యుండును. పాదధూళియే పాదారవిందపరాగము. పరాగమునకు రజస్సు అనియు పేరు. ముల్లుతో ముల్లును తీయునట్లు శారీరధూళి నివారించు కొఱకు చణక పరాగ (సెనగపిండి) ముపయోగపడునట్లు, నమస్కరించు వారి మనస్సను అద్దమునకు పట్టిన మురికిని అమ్మవారి పాదపరాగము నివారించును. అద్దము నందు మురికి ఉన్నంత వఱకు ప్రతిబింబము స్పష్టముగా కనబడదు. అమ్మవారి పాదకమలములకు నమస్కరించు వారి మనోదర్పణమలమును పాదకమలముల లోని పరాగము తొలగించివేయగా విశ్వమందు ప్రతిఫలించును. వారికి సర్వము కరతలామలక మగును. వారి మనోదృష్టికి

గోచరముకానిదేదియు నుండదు. ఈ అర్థమంతయు నుత్తరార్థమున వ్యంగ్యమగుచున్నది. విచిత్రమేమనగా అమ్మవారి పాదకమలపరాగము పరిహృతకలంకవ్యతికరమట. **'చంద్రమా మనసో జాతః'** అని శ్రుతి ననుసరించి అమ్మవారి మనస్సునుండి చంద్రుడుద యించును. జన్యజనకముల యభేదసంబంధమును పురస్కరించుకొని మనసే చంద్రుడని పెక్కు ఆధ్యాత్మిక గ్రంథములలో చెప్పబడినది. చంద్రునకు కలంక మున్నట్లు మనస్సునకు రాగద్వేషరూపకలంక ముండును. ఆ కలంకము నమ్మవారి పాద కమలపరాగము తొలగించును. ఇది ఉత్తరార్ధ వ్యంగ్యార్థము. అమ్మవారి పాదము కమలము. చంద్రుడు కమల విరోధి. అయినను నఖ రూపమున చంద్రుడు దశ విధముల అమ్మవారి పాదము నాశ్రయించినాడు. అందుచేత విరోధియయిన వాని కలంకమును పరిహరించినది. అనగా నఖములలో కలంకము జాడ కూడ లేదు. ఇది పరిహృతకలంకవ్యతికరైః అను సమాసమున వ్యంగ్యార్థము. నతుల మనశ్చంద్రుని యందలి రాగరూప కలంకమును తొలగించిన దమ్మవారి పాదకమలపరాగము. **'నిశ్శ్వాసాంధ ఇవాదర్శశ్చంద్రమానప్రకాశతే'** అని వాల్మీకి మబ్బులతో మసక బారిన చంద్రుని నిశ్శ్వాసాంధమైన ఆదర్శము (అద్దము) వలె నున్నాడని వర్ణించినాడు. స్త్రీలు అద్దము చూచుచు బొట్టు పెట్టుకొనునప్పుడు కడిగికొని స్వచ్ఛమైన అద్దమును మరల ఉపయోగించుకొందురు. భక్తుల మనోముకురము నందలి రాగము తొలగి పోగా వారి మనస్సు స్వచ్ఛమైనది. దానిలో పరమేశ్వర మాయావిక్షిప్త మిథ్యాప్రతిబింబవిశ్వము ప్రతిబింబించినది. ఆ ప్రతిబింబమునకు అమ్మవారి సత్త తప్ప స్వీయ సత్తలేదు. ఈ అర్థము మనోముకురరూపక వ్యంగ్యము. ప్రథమ ద్వితీయ తృతీయ పాదములందు వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదమున నతమనశ్చంద్రాదర్శస్థితి వ్యంజింపజేయబడినది. ఈ శ్లోకమున అమ్మవారి పాదమున జితమైన కమలము నకు శరణాగతిరూప నతియే యుక్తమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ తవ త్రస్తం పాదాత్కిసలయమరణ్యాంతరమగా-**
**త్పరం రేఖారూపం కమలమముమేవాశ్రితమభూత్।**
**జితానాం కామాక్షి! ద్వితయమపి యుక్తం పరిభవే**
**విదేశే వాసో వా శరణగమనం వా నిజరిపోః॥ 85**

**ప్రతిపదార్థము :-**

కామాక్షి = ఓ కామాక్షీదేవీ;
తవ = నీయొక్క;
పాదాత్ = పాదమువలన;
త్రస్తమ్ = భయపడిన;

| | | |
|---|---|---|
| కిసలయమ్ | = | చిగురుటాకు; |
| అరణ్యాంతరమ్ | = | అరణ్యములోనికి; |
| అగాత్ | = | పోయెను; |
| పరమ్ | = | కాని; |
| రేఖారూపమ్ | = | రేఖారూపమైన; |
| కమలమ్ | = | కమలము; |
| అముమ్ | = | దీని (పాదము)నే; |
| ఆశ్రితమ్ | = | ఆశ్రయించినది; |
| అభూత్ | = | ఆయెను; |
| నిజరిపోః | = | తన శత్రువునుండి; |
| పరిభవే | = | అవమానమునందు; |
| జితానామ్ | = | ఓడిన వారికి; |
| విదేశే | = | విదేశమున; |
| వాసః వా | = | ఉనికి గాని; |
| శరణగమనమ్ వా | = | శరణాగతి కాని; |
| ద్వితయమ్ అపి | = | రెండును; |
| యుక్తమ్ | = | తగినదే (వే). |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదముయొక్క మార్దవమున కోడిన చిగురుటాకు సిగ్గుతో అరణ్యములోనికి వెడలినది. ఆరుణ్యమున కోడిన కమలము రేఖారూపమున ఆ పాదమునే ఆశ్రయించినది. ఓడిపోయిన వారికి దేశాంతరమేగుట కాని, శరణాగతిగాని రెండును యుక్తములే.

**వివరణము :-**

అమ్మవారి పాదమున కమలరేఖ ఉన్నది. ఆ కమలరేఖయే ఇట రేఖారూపకమలముగా చెప్పబడినది. అమ్మవారి పాదమున రేఖారూపమున కమలమేల యున్నది? అది **ఉత్తమ స్త్రీ సాముద్రిక లక్షణము.** కాని కవి దానిని కమలముయొక్క శరణాగతిగా సంభావించుచున్నాడు. కమలమునకు శరణాగతి యేల చేయవలసివచ్చినది? ఆరుణ్యమున పోటీపడి ఓడినందున శరణాగతి చేయవలసి వచ్చినది అని వ్యంజింపజేయు ఉత్ప్రేక్షాలంకార మిట ద్వితీయ పాదమున ఉన్నది. ప్రథమపాదమున సహజముగా అడవిలోని చెట్లలో నుండు చిగురుటాకు అమ్మవారి పాదారుణ్యమున కోడియే అరణ్యములోనికి వెడలినదని సంభావింపబడుటచే ఉత్ప్రేక్షాలంకారమే ఉన్నది. ఈ రెండుత్ప్రేక్ష్యార్థముల సమర్థించుటకొఱకు ఉత్తరార్ధమున అర్థాంతరము న్యసింపజేయబడినందున శ్లోకము మొత్తము అర్థాంతరన్యాసాలంకారముగా రూపొందినది.

శరణాగతుల రక్షించుట సాధారణవీరులకే కర్తవ్యమై ఉండగా అచింత్యమహిమకలిగిన అమ్మవారి పాద మాపని చేయుటలో వింత యేమున్నది అను అర్థాంతరము కూడ ఈ శ్లోకమున వ్యంగ్యమగుచున్నది. *'ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్ రక్షిష్యతీతి విశ్వాసో స్వగోప్తృత్వ వరణం తథా ఆత్మ నిక్షేపకారుణ్యే షడ్విధా శరణాగతిః'* శరణ్యమునకు

1. అనుకూలముగానే ఉండవలెను. సంకల్పము
2. ప్రతికూల భావమును విడుచుట
3. ఆ శరణ్యమే రక్షించునను విశ్వాసము
4. ఆ శరణ్యమే స్వగోప్తగా వరించుట
5. తన బరువును ఆ శరణ్యమందే ఉంచుట.
6. ఆ శరణ్యము నెదుట తన దైన్యమును ప్రకటించుట

అను ఆఱు విధములు గల శరణాగతి చెప్పబడినది. లేక ఈ ఆఱింటిని శరణాగతి కంగములని చెప్పుట కలదు. కర్మజ్ఞానములను రెండుఱెక్కలతో గూడిన భక్తి అను పక్షినెక్కి వైకుంఠాది పరమపదమును చేరుట యొక మార్గము అని పరమేశ్వరుని చేరు మార్గములు వేఱువేఱుగా విశిష్టాద్వైతులచే చెప్పబడినవి. భగవద్రామానుజులు **'భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా'** అని బ్రహ్మ సూత్రభాష్య మంగళాచరణ శ్లోకమున చెప్పుటచే భక్తియు జ్ఞానరూపమే అని తెలియుచున్నది. నారద శాండిల్యులు పరమప్రేమ లేక అనురక్తియే భక్తియని చెప్పినారు. వైదిక వర్ణాశ్రమాచార ధర్మావలంబనము భక్తి మార్గమున ఆవశ్యకమని ప్రపత్తికి దాని అవసరము లేదని, బ్రహ్మసూత్రములందు అర్చిరాదిగతిహేతు (భక్తిమార్గము) చెప్పబడగా గీతాభాష్యమున చరమ శ్లోకమున రెండవది (శరణాగతి) చెప్పబడినది అని ఇత్యాది మతభేదము లెన్నియో తన్మతానుయాయులలో కలవు. శ్రీ శంకరుల దృష్టిలో ఆత్మనిష్ఠను సర్వధర్మ (కర్మ) పరిత్యాగపూర్వకముగా కలిగియుండుటయే సర్వదుఃఖనివృత్తి (మోక్ష) హేతు మార్గము.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదమును కమలము శరణుజొచ్చుట యుక్తము అను అర్థాంతరన్యాసముచే శరణాగతిరూప **మోక్షమార్గము** సూచింపబడినది. ఈ శ్లోకమున మోక్షమార్గమున ముందుగా దేశికుని కటాక్షమును పొందిన వారికే మోక్ష ప్రతిబంధకమైన **మమతాబన్ధము తొలగునని** చెప్పబడుచున్నది.

**శ్లో॥ గృహీత్వా యాథార్థ్యం నిగమవచసాం దేశికకృపా-**
**కటాక్షార్కజ్యోతిశ్శమితమమతాబన్ధతమసః।**
**యతన్తే కామాక్షి! ప్రతిదివసమన్తర్ద్రఢయితుం**
**త్వదీయం పాదాబ్జం సుకృతపరిపాకేన సుజనాః॥ 86**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| దేశికకృపాకటాక్షార్కజ్యోతి శ్శమితమమతాబన్ధతమసః | = | గురుకృపాకటాక్షమనెడి సూర్యకాంతిచే శమింపజేయబడిన మమతా బన్ధమను తమస్సు గల; |
| సుజనాః | = | సుజనులు; |
| నిగమవచసామ్ | = | వేదవాక్కుల యొక్క |
| యాథార్థ్యమ్ | = | సత్యత్వమును; |
| గృహీత్వా | = | గ్రహించి; |
| సుకృతపరిపాకేన | = | పుణ్యముయొక్క పరిపాకముచే; |
| ప్రతిదివసమ్ | = | ప్రతిదినము; |
| త్వదీయమ్ | = | నీ; |
| పాదాబ్జమ్ | = | పాదకమలమును; |
| అన్తః | = | మనస్సులోన; |
| ద్రఢయితుమ్ | = | దృఢపఱచుటకు; |
| యతన్తే | = | ప్రయత్నించెదరు. |

**తాత్పర్యము :-**

పుణ్యము పండిన సుజనులు గురుకృపాకటాక్షమున మమకారము వీడిన వారై ప్రతిదిన మమ్మవారి పాదకమలమును తమ మదిలో దృఢముగా నిలుపుకొనుటకు యత్నించెదరు.

**వివరణము :-**

*'న గురోరధికమ్'* అను సూక్తి గురువుయొక్క సర్వోత్కృష్టతను తెలుపును. *'శివేరుష్టే గురుస్త్రాతా గురౌరుష్టే న కశ్చన'* (శివుడు కోపించినను గురువు ఆ శివుని కోపమును మానిపించి ఆతని దయ కలుగునట్లు చేసి శిష్యుని కాపాడును. కాని గురువు కోపించిన ఆ శిష్యుని రక్షించుటకు శివుడు కూడ పూనుకొనడు) అను సూక్తి శివుని కృపకంటె ముందుగా ప్రధానముగా గురుకృపయే సంపాదింపదగినదని తెలుపును. దేశికుని కృపాకటాక్షము సూర్యజ్యోతి. దానిచేత సుజనులైన శిష్యుల మనసులలోని మమకారము అను అన్ధకారము శమించును. ఆ జ్యోతిచేత వేదవాక్కుల యథా తథార్థ మవగతమగును. గురుకృపలేని వారికి వేదవాక్కుల తాత్పర్యమవగతము కాదు. అందుచేత వేదబోధితమైన పరమాత్మ తత్త్వ మవగతము కాదు. అది అవగతము కానిదే మోక్షము సిద్ధించదు. కావున మోక్షము పొందగోరిన సుజనుడు ముందుగా గురుకృపను పొందవలెను. ఆతని కృపాకటాక్షము సూర్యజ్యోతి అన్ధకారమును వలె శిష్యునిలోని మమకారమును తొలగించునని ఔపమ్యమును వ్యంజింపజేయు రూపకాలంకారము రెండవ

పాదమున ఉన్నది. గురువు తనను శరణుజొచ్చిన సుజనులైన శిష్యులకు శరణ్యమైన అమ్మవారి పాదమును జూపును. ఆ సుజన శిష్యులు వేదవాక్కులన్నియు అమ్మవారి పాదము యొక్కశరణ్యతనే చెప్పునని గ్రహించి ఆ పాదమునే తమ మనసులలో దృఢముగా నిలుపుకొన యత్నించెదరు. **'శమిత మమతాబన్ధతమసః'** అను సమాసభాగమున తకార మకారావృత్తి చేత వృత్త్యనుప్రాసరూప శబ్దాలంకారమేర్పడి యున్నది. **'యతన్తే కామాక్షి ప్రతిదివసమ్'** అని వర్ణమైత్రికి బదులు ప్రాసయతి మూడవపాదమున ప్రయోగింపబడినది. **'త్వదీయమ్ పాదాబ్జమ్ సుకృతపరిపాకేన సుజనాః'** అను చతుర్థపాదమున శయ్యా సౌభాగ్యమున్నది.



**అవ:-** పై శ్లోకమున సుజనులు అమ్మవారి పాదమును మనసులలో నిలుపుకొను ప్రయత్నము చెప్పబడినది. ఈ శ్లోకమున జడులును తత్స్మరణముచేత తమ ముఖములనుండి వాగ్విన్యాసముల ప్రవహింపజేయ గలుగుదురని చెప్పబడు చున్నది.

**శ్లో॥ జడానామప్యమ్బ! స్మరణసమయే త్వచ్చరణయో-**
**ర్భ్రమన్మన్థక్ష్మాభృద్ఘుమఘుమితసిన్ధుప్రతిభటాః।**
**ప్రసన్నాః కామాక్షి! ప్రసభమధరస్పన్దనకలా**
**విభాన్తి స్వచ్ఛన్దం ప్రకృతిపరిపక్వా భణితయః॥ 87**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| అమ్బ | = | అమ్మా! |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| త్వచ్చరణయోః | = | నీ పాదములయొక్క; |
| స్మరణసమయే | = | స్మరణ సమయమున; |
| జడానామ్ | = | జడులకు కూడ; |
| భ్రమన్మంథక్ష్మాభృద్ఘుమఘుమిత సింధుప్రతిభటాః | = | తిరుగుచున్న మంథరపర్వతము చేత ఘూర్ణిల్లిన సముద్రముతో పోటీపడు; |
| ప్రసన్నాః | = | ప్రసన్నములైన; |
| అధరస్పన్దనకలాః | = | పెదవుల కదలికల కళలుగల; |
| ప్రకృతిపరిపక్వాః | = | సహజముగా పరిపక్వములైన; |
| భణితయః | = | వాగ్విన్యాసములు; |
| స్వచ్ఛన్దమ్ | = | స్వేచ్ఛగా; |
| విభాన్తి | = | ప్రకాశించును. |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదముల స్మరించు జడుల ముఖములనుండియు మన్థర

పర్వతముతో మథించునప్పటి మధురప్రసన్నామృతప్రవాహమువంటి వాగ్విన్యాసములు స్వేచ్ఛగా సహజముగా దుముకుచుండును.

**వివరణము :-**

అమృతమును సముద్రమునుండి చిలుకగోరిన దేవతలు మంథర పర్వతమును మన్థాన దండముగా చేసికొనిరి. అందుచేత ఆ మన్థర పర్వతము 'మన్థక్ష్మాభృత్తు' అని పిలువబడినది. ఆ పర్వతముతో సముద్రమును మథించునప్పుడు ఘుమఘుమ ధ్వనులతో గుమగుమ వాసనలతో సముద్రమున ప్రవాహము లేర్పడినవి. ఆ ప్రవాహములలో అమృతము పుట్టబోవు చున్నందుననే ఆ మధురములైన గుమగుమ వాసనలు వచ్చినవి. అప్పుడు చిలుకుట ఆపబడినది. అప్పుడు అమృతము నవనీతమువలె సముద్రోపరితలమున తేలియాడినది. అప్పటి సముద్రప్రవాహములకు భణితులు అనగా వాగ్విన్యాసములు ప్రతిభటములైనవని చెప్పుటచే భణితులకు సముద్ర ప్రవాహములతోడి ఔపమ్యము ప్రతిపాదింప బడినది. ఆ వాగ్విన్యాసభణితులు అధరస్పందనకలా రూపమున గనబడుటచే చెవులకు తద్ధ్వనులు మధురముగా వినబడును. గురుముఖాధ్యయనలబ్ధ పాండిత్యసముపేతులైన కవుల ముఖములనుండి ప్రవహించు వాగ్విన్యాసములు ప్రౌఢగంభీరములై ఉండును. అమ్మవారి కరుణచే గురుముఖాధ్యయనము లేకుండగానే జడుల ముఖముల నుండి వాగ్విన్యాసములు స్వతంత్రములై సహజధారగలవై ప్రసన్న మధురములై ఉండును. స్మరణసమయముననే వాగ్విన్యాసములు జడుల ముఖములనుండి వెలువడి ప్రకాశించునని కార్యకారణముల ఏకకాలికత చెప్పబడుటచే నీ శ్లోకమున అతిశయోక్త్యలంకార మేర్పడియున్నది. బేసి పాదములలో వర్ణమైత్రి ఉన్నది. రెండవ పాదమున ప్రాసయతి, మూడవ పాదమున వర్ణమైత్రితో పాటు ప్రాసయతి ప్రయోగింప బడినది. **'స్మరణసమయే త్వచ్చరణయోః, భ్రమన్మంథక్ష్మాభృద్ఘుమ ఘుమిత'** అను శబ్దములలో సకార మకార రేఫ ణకారముల ఆవృత్తి ఉండుటచే వృత్త్యనుప్రాసాలంకార మేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదస్మరణము జడుల వాగ్విన్యాస కలా హేతువుగా చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ చరణమే హంసనాదము వహించు నని చెప్పబడుచున్నది.

**శ్లో॥ వహన్నప్యశ్రాన్తం మధురనినదం హంసకమసౌ**
**తమేవాధఃకర్తుం కిమివ యతతే కేలిగమనే।**
**భవస్యైవానన్దం విదధదపి కామాక్షి! చరణో**
**భవత్యాస్సద్రోహం భగవతి! కిమేవం వితనుతే॥** **88**

**ప్రతిపదార్థము :-**

కామాక్షి = ఓ కామాక్షీదేవీ!
భగవతి = పూజ్యురాలా;

| | | |
|---|---|---|
| అశ్రాన్తమ్ | = | ఎల్లప్పుడు; |
| మధురనినదమ్ | = | తీయని ధ్వనిగల; |
| హంసకమ్ | = | అందెను; |
| వహన్ అపి | = | ధరించుచున్నను; |
| అసౌ | = | ఈ; |
| భవత్యాః | = | నీయొక్క; |
| చరణః | = | పాదము; |
| తమ్ ఏవ | = | దానినే; |
| కేలిగమనే | = | విలాసయానమున; |
| కిమ్ ఇవ | = | ఎందుకు; |
| అధః కర్తుమ్ | = | క్రింది చేయుటకు; |
| యతతే | = | ప్రయత్నించుచున్నది, |
| భవస్య | = | శివునకు; |
| ఆనన్దమ్ | = | ఆనందమును; |
| విదధత్ అపి | = | చేయుచున్నను; |
| ఏవమ్ | = | ఇట్లు; |
| కిమ్ | = | ఎందుకు; |
| ద్రోహమ్ | = | ద్రోహమును; |
| వితనుతే | = | చేయుచున్నది. |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదము మధురధ్వనిగల హంస(క)మును అనగా అందెను ధరించుచునే, మాసయానమున దానినెందుకు క్రింది చేయుచున్నది? భవునకు అనగా శివునకు ఆనందమును కలిగించుచునే దీనికి (ఆ భవమునకే) అనగా సంసారమునకే ద్రోహమెందుకు చేయుచున్నది?

**వివరణము :-**

హంస శబ్దమునకు స్వార్థమున క ప్రత్యయము వచ్చినప్పుడు హంసక శబ్ద మేర్పడును. అప్పుడు హంసక శబ్దమునకు హంస శబ్దమువలె అంచ అనియే అర్థము. దానికి అందెయను మరొక యర్థము కలదు. అమ్మవారి పాదమునకు హంసక శబ్దమనబడు అందె యున్నది. కావున అది హంసకమును ధరించుచున్నది. దాని ధ్వని మధురమైనది. అమ్మవారి పాదము అంచయొక్క నడకలోని ఒయ్యారమును మించిన ఒయ్యారము కలిగియున్నది. కావున ఆ పాదము అంచను ఆ విషయమున మించుటచే అంచ అధః కరింపబడినట్లైనది. అందె చప్పుడుగూడ అంచ చేయు ధ్వనియొక్క మాధుర్యమును మించిన మాధుర్యము కలిగియున్నది. అందుచేత ఆ విషయమునకు అనగా పాదమునం

దండెను ధరించి మధురధ్వని కలిగియుండుటచేతను అమ్మవారి పాదము అంచను అధః కరించినది. హంసక శబ్దముయొక్క శ్లేషచేత హంసకమున ధ్వనించిన అమ్మవారి పాదము నడక యొయ్యారమునందును మధురధ్వనిని కలిగించుట యందును అంచను మించి దాని నధఃకరించుటకు యత్నించినది కావున పాదము హంసకమును తన పాదమున ధరించుచునే హంసకము నధఃకరించుటకు యత్నించినది. భవ శబ్దమునకు శివుడను నొక యర్థము, సంసారమను మరొక యర్థము ఉన్నది. భవున కనగా శివున కానందము కలిగించుచునే భవమునకు అనగా సంసారమునకు ద్రోహము చేయుచున్న దమ్మవారి పాదమని ఉత్తరార్ధమున భవానంద మొనర్చుచునే భవద్రోహము చేయుట అను విరోధములు శ్లేషబలమున పరిహరింపబడుటచే విరోధాభాసాలంకారములున్నవి. **కిమివ** శబ్దముచే పూర్వార్ధమున హంసకము నధఃకరించు యత్నముయొక్క సంభావనము, ఉత్తరార్ధమున కిమ్ శబ్దముచే ఆనందము నొనరించిన భవనామధారికే (పాదకృత)ద్రోహము సంభావింపబడినందునను ఉత్ప్రేక్షాలంకారములున్నవి. మూడవ నాల్గవ పాదములలో (అను)ప్రాసము, నాల్గవ పాదమున వర్ణమైత్రి కూర్చబడినవి. అమ్మవారి పాదముల క్రింద తమతమ తలలను మోపవలెనని అప్పుడా పాదముచే అధఃకరణమను బహుమానమును పొందగలమను హంసలనబడు సన్న్యాసులైన జ్ఞానిభక్తులయొక్క ఇచ్ఛ ఈ పూర్వార్ధమున వ్యంగ్యమగుచున్నది. ఉత్తరార్ధమున అమ్మవారిచే ఆనందింపజేయబడుటకు భవిత్వమును అనగా సంసారిత్వమును వదలి శివత్వమును, ఆ పాదముచే ద్రోహమును అనగా పాదముచే రాచబడుటను కోరి శివత్వమును వదలి భవిత్వమును పొందగోరుట వ్యంజింపజేయబడుచున్నవి. భవ శబ్దమునకు **అర్శాద్యచ్** ప్రత్యయమును చేర్చి భవ శబ్దమునకు భవము కలవాడు (భవి) అను అర్థమును చెప్పుట కవకాశముండుట చేత పై వ్యంగ్యము ననుసంధించుట సమంజసమగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదమున కేలిగమనము వర్ణింపబడినది. ఈ శ్లోకమున ***అలసగతి*** లేక ***గతి మాంద్యము*** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ యదత్యన్తం తామ్యత్యలసగతివార్తాస్వపి శివే!**
**తదేతత్కామాక్షి! ప్రకృతిమృదులం తే పదయుగమ్।**
**కిరీటైః సంఘట్టం కథమివ సురౌఘస్య సహతే**
**మునీన్ద్రాణామాస్తే మనసి చ కథం సూచినిశితే॥ 89**

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| శివే | = | మంగళస్వరూపురాలా! |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |

| | | |
|---|---|---|
| తే | = | నీయొక్క; |
| యత్ | = | ఏ; |
| ప్రకృతిమృదులమ్ | = | సహజముగా మృదువైన; |
| పదయుగమ్ | = | పాదయుగళము; |
| అలసగతివార్తాసు అపి | = | మన్దగతి ముచ్చటలలో కూడ; |
| అత్యన్తమ్ | = | మిక్కిలి; |
| తామ్యతి | = | బాధనొందునో; |
| తత్ | = | ఆ; |
| ఏతత్ | = | ఇది; |
| సురౌఘస్య | = | దేవతా సమూహముయొక్క; |
| కిరీటైః | = | కిరీటములతో; |
| సంఘట్టమ్ | = | రాపిడిని; |
| కథమివ | = | ఎట్లు; |
| సహతే | = | సహించును; |
| మునీన్ద్రాణామ్ | = | మునీంద్రులయొక్క; |
| సూచినిశితే | = | సూదివలె వాడియైన; |
| మనసి చ | = | మనస్సునందును; |
| కథమ్ | = | ఎట్లు; |
| ఆస్తే | = | కూర్చొనియున్నది. |

**తాత్పర్యము :-**

ఏ అమ్మవారి మెత్తని పాదముల జంట మెల్లగా నడచుటకు సంబంధించిన ముచ్చటలలోను బాధనొందునో, ఆ పాదముల జంట దేవతా సమూహముయొక్క కిరీటముల రాపిడి నెట్లు సహించును? సూదివలె వాడియైన మునీంద్రుల మనస్సులలో నెట్లు కూర్చొనియున్నది?

**వివరణము :-**

అమ్మవారి పాదయుగళ మెంత మృదువైన దనగా మెల్లగా నడుచు ముచ్చటలో గూడ కందిపోవును. అట్టి మృదువైన పాదముల జంట దేవతల కిరీటముల రాపిడి నోర్చుట, సూదివలె సూక్ష్మమైన మునీంద్రుల మనసులలో కూర్చొనుట విచిత్రము అని చెప్పుటచే అమ్మవారి పాదములు కుసుమముల కన్న మృదువైనను అవసరమైనప్పుడు వజ్రకాఠిన్యము నొందు మహిమ గలవని వ్యంగ్యమగును. అమ్మవారి చరణముల సర్వదేవతా నమ్యత, మునిహృదయ స్థితి ఈ శ్లోకమున సూచించబడినది. ఆస (కూర్చొను) ధాతువు యొక్క వర్తమాన క్రియారూపము ప్రయోగింపబడుటచే నిశ్చింతగానున్న దనుట వ్యంగ్యమగును. మణికాంచనమయదేవతాకిరీటముల కాఠిన్యము వ్యంగ్యమగుచు వాని

మనస్సు మిక్కిలి సూక్ష్మమై అత్యన్తసూక్ష్మములైన (సాధారణులచే గ్రహింపరాని) విషయముల గ్రహింపగలదని స్పష్టమగును. పూర్వార్ధపాదములలో పాదాది ప్రాసయున్నది. ప్రథమపాదమున వర్ణమైత్రియునున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదముల ***గతి మాంద్యము*** చెప్పబడినది. ఈ శ్లోకమున వాని ***మృదుసంచార సౌభాగ్యము*** చెప్పబడుచున్నది.

**శ్లో॥ మనోరఙ్గే మత్కే విబుధజనసమ్మోదజననీ**
**పరాగవ్యాసఙ్గా సరసమృదుసఞ్చారసుభగా।**
**మనోజ్ఞా కామాక్షి! ప్రకటయతు లాస్యప్రకరణం**
**రణన్మఞ్జీరా తే చరణయుగలీనర్తకవధూః॥ 90**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| విబుధజనసమ్మోదజననీ | = | విద్వజ్జనములకు సమ్మోదమును కలిగించు; |
| పరాగవ్యాసంగా | = | పరాగముతో సంబంధముగల; |
| సరసమృదుసంచారసుభగా | = | సరసమైన మృదువైన సంచారముతో అందమైన; |
| మనోజ్ఞా | = | మనోహరమైన; |
| రణన్మంజీరా | = | మ్రోయుచున్న అందెలుగల; |
| తే | = | నీయొక్క; |
| చరణయుగలీనర్తకవధూః | = | పాదముల జంటయనెడి నట్టువగత్తె; |
| లాస్యప్రకరణమ్ | = | లాస్య ప్రధానమైన యొక రూపక భేదమును; |
| మత్కే | = | నా; |
| మనోరంగే | = | మనస్సను రంగస్థలమున; |
| ప్రకటయతు | = | ప్రకటించుగాక! |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదముల జంట విద్వజ్జనులకు సంతోషమును కలిగించునది. పరాగముతో సంపర్కము గలది. సరసముగా మృదువుగా సంచారము చేయునప్పుడు ఎంతో అందముగా కనబడును. మనస్సును హరించి వేయునది. మ్రోయుచున్న అందెలు గలది. అట్టి ఆ పాదముల జంట నా మనస్సనెడి రంగస్థలమున లాస్య మొనరించుగాక!

**వివరణము :-**

స్త్రీ లొనర్చు నృత్తము **లాస్య** మనబడును. ఇది నాట్యముయొక్క భేదము. ప్రతి కదలికకు అర్థముండదు కాని మొత్తమేదో యొక రసమును సహృదయులైన విద్వజ్జనుల హృదయములలో స్ఫురింపజేయును. అట్లు చేయుట కళాతపస్వుల

కళాప్రదర్శన పరమార్థము. కళాతపస్వు లెంత కాలమో తమలో దాగియుండిన కళాసంపద నెంత కాలమో దాచి యుంచలేరు. దాచియుంచుట యుచితము కూడ కాదు. అమ్మవారి పాదము దర్శనమాత్రము చేతనే విద్వజ్జన సమ్మోదమును కలిగించును. అమ్మవారు భూలోకమున సంచరించుట మొదలిడినప్పటినుండి ఆమె పాదములకు పరాగముతోడి వ్యాసంగము కలిగినది. తొలుతనే ఎఱ్ఱనైన అమ్మవారి పాదములు సంచారము చేయుట నారంభింపగానే మఱింత యెఱ్ఱనై లోని రక్తము బయటకు చిమ్మునేమో యన్నట్లు సరసముగా కనబడును. అంతేకాదు ఆమె అందెలు గల్లుగల్లు మనును. అప్పుడామె నడచుచున్నట్లుగాక నాట్యమొనరించుచున్నట్లు కనబడును. ఆ నడకను చూచి వారి కామె లాస్య కుశల అని స్పష్టమగును. రూపకములలో నాటకము తరువాత ప్రకరణమున కున్నతస్థానము కలదు. సాధకుని శరీరమున విబుధగణములు మేల్కొని యుండును. వారికి మనోరంగమున అమ్మవారి లాస్య ప్రకరణమును ప్రయోగించగా సంతోషము కలుగుననుటయు నీ శ్లోకమున వ్యంగ్యము. **'రణ'** అను హల్లుల జంట అవ్యవధానముగా ఆవృత్తమగుటచే నిందు ఛేకానుప్రాసమను శబ్దాలంకార మేర్పడియున్నది. రణన్ చరణ శబ్దములలో యమకమను శబ్దాలంకార మున్నది.



**అవ:-** పై శ్లోకమున కవిచే తన మనమున అమ్మవారి పాదముయొక్క **లాస్యప్రకటన** మర్థింపబడినది. ఈ శ్లోకమున **స్వమమతాపరిహార** మర్థింపబడు చున్నది.

**శ్లో॥ పరిష్కుర్వన్మాతః పశుపతికపర్దం చ విషయే**
**పరాచాం హృత్పద్మం పరమభణితీనాం చ మకుటమ్।**
**పరస్తే పాదోఽయం పరిహరతు కామాక్షి! మమతా-**
**పరాధీనత్వమ్మే పరిముషితపాథోజమహిమా॥** **91**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| మాతః | = | అమ్మా! |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| పశుపతికపర్దమ్ | = | శివుని జటాజూటమును; |
| విషయే | = | విషయమునందు; |
| పరాచామ్ | = | పరాకు వహించువారియొక్క; |
| హృత్పద్మమ్ | = | హృదయకమలమును; |
| చ | = | మరియు; |
| పరమభణితీనామ్ | = | వేదవాక్కులయొక్క; |
| మకుటమ్ | = | కిరీటమును; |
| పరిష్కుర్వన్ | = | సవరించుచున్న; |

| | | |
|---|---|---|
| పరః | = | ఉత్కృష్టమైన; |
| తే | = | నీయొక్క; |
| అయమ్ | = | ఈ; |
| పరిముషితపాథోజమహిమా | = | కమలమహిమ నావహించిన; |
| పాదః | = | పాదము; |
| మే | = | నాయొక్క; |
| మమతాపరాధీనత్వమ్ | = | మమతాపరాధీనతను; |
| పరిహరతు | = | పరిహరించుగాక! |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాద మా శివుని జటాజూటమును, విషయపరాఙ్ముఖుల హృదయ కమలమును, వేదవాక్కుల శిరస్సును అలంకరించుచున్నది. అది కమల మహిమను పరిహరించియున్నది. మిక్కిలి ఉత్కృష్టమైనది. అది నా మమతాపరాధీనతను పరిహరించుగాక!

**వివరణము :-**

అమ్మవారి పాదమేకకాలమున శివుని జటాజూటమును, విరక్తుల హృదయ కమలమును, వేదశిరస్సైన ఉపనిషత్తును పరిష్కరించుచున్నది. సహోక్త్యలంకారము వ్యంజింపజేయబడినది. ఏకకాలమున పై మూడు కృత్యములు నిర్వహించగల నీ పాదమునకు నా మమతాపరాధీనతను తొలగించుటలో శ్రమ యేమియు లేదను వస్తువు వ్యంగ్యమగుచున్నది. శివుడు అమ్మవారిపాదమున తన తలను మోపినప్పుడు ఆయన శిరస్సున కది అలంకారమైనది. ఉదయించు చంద్రరేఖయేయైనది. శివుడు చంద్రకలాధరుడు గదా! విరక్తులమ్మవారిని తమ హృదయమున ధ్యానించునప్పుడు వారి హృదయ పద్మము అమ్మవారి పాదమునకు పీఠమైనది. వేదవాక్కులను సతీమణులు శిరమున నలంకరించుకొను మణియైనది. చన్ద్రశేఖరునకు చన్ద్రశేఖరత్వమును (గంగాధరత్వమును) సంపాదించుటచే పాదమున పార్వతీ (గంగా) త్వమును విరక్తవిష్ణువు నెద వహించుటచే లక్ష్మీత్వము, వేదమాతృశిరోరూపోపనిషద్వి హారముచే సరస్వతీత్వము వ్యంగ్యములగు చున్నవి. తన కాంతిధారాజలముచే శివుని జటాజూటములోని మలినతను తొలగించి పరిష్కరించును. నల్లని విరక్త విష్ణువు నెద వసించి తత్కాలిమను తొలగించి పరిష్కరించుచు ఉపనిషత్తులలో భేదప్రతిపాదకవాక్కుల తాత్పర్య మద్వైతమే యని జీవేశ్వరభేదభావమును తొలగించి దానియందు తాత్పర్యము లేదని దానికి కిరీటము పెట్టినట్లు అద్వైత దర్శనమే సర్వదర్శనశిరోమణి యని వ్యక్తీకరించుట యను పరిష్కారమొనరించు చున్నదని వ్యంగ్యమగుచున్నది. మమతయే సంసారబంధహేతువు. దానిని తొలగించుట అమ్మవారి పాదము నాశ్రయించిననే కలుగునని వ్యంగ్యమగుచున్నది. ప్రథమ ద్వితీయ చతుర్థ పాదములలో ప్రాసము, అన్ని పాదములలో వర్ణమైత్రియు ప్రయోగింపబడినది.



**అవ:-** పై శ్లోకమున ***పశుపతి జటాజూట (కేశపాశ)*** ***సమ్పర్కము*** అమ్మవారి పాదమున వర్ణింపబడినది. ఈ శ్లోకమున ***దేవతా స్త్రీ కుంతల (కేశపాశ) గత పుష్పసమ్పర్కము*** చెప్పబడుచున్నది.

**శ్లో॥ ప్రసూనైః సమ్పర్కాదమరతరుణీకున్తలభవై-**
**రభీష్టానాం దానాదనిశమపి కామాక్షి! నమతామ్।**
**స్వసఙ్గాత్కఙ్కేలిప్రసవజనకత్వేన చ తవ**
**త్రిధా ధత్తే వార్తాం సురభిరితి పాదో గిరిసుతే॥ 92**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| గిరిసుతే | = | పర్వతపుత్రివైన; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| అమరతరుణీకుంతలభవైః | = | దేవతా స్త్రీ కేశపాశము లందున్న; |
| ప్రసూనైః | = | పూవులతో; |
| నమతామ్ | = | నమస్కరించువారికి; |
| అనిశమ్ అపి | = | ఎల్లప్పుడు; |
| అభీష్టానామ్ | = | కోరికలయొక్క; |
| దానాత్ | = | దానమువలన; |
| స్వసంగాత్ | = | తన కలయికవలన; |
| కంకేళిప్రసవజనకత్వేన చ | = | అశోకవృక్షమున పూలను కలిగించుట చేతను; |
| త్రిధా | = | మూడు విధములుగా; |
| తవ | = | నీయొక్క; |
| పాదః | = | పాదము; |
| సురభిః ఇతి | = | సురభి అని; |
| వార్తామ్ | = | వార్తను (ప్రసిద్ధిని); |
| ధత్తే | = | ధరించుచున్నది. |

**తాత్పర్యము :-**

దేవతా స్త్రీల తలకొప్పులలోని పూవుల సమ్పర్కమువలన, నమస్కరించు వారి కోరిక నీడేర్చుటవలన, తన స్పర్శతో అశోకవృక్షమును పూయించుట వలనను, ఈ మూడు విధములుగా అమ్మవారి పాదము ***సురభి*** యని ప్రసిద్ధి నొందినది.

**వివరణము :-**

దేవతాస్త్రీ లమ్మవారి పాదముపై తమ తలల మోపినప్పుడా పాదమునకు పుష్పములతో సమ్పర్కము కలుగును. సాధారణముగా పూజించినపుడు అమ్మవారి పాదములపై పూవులుంచబడును. దేవతాస్త్రీలు నందనవనములలోని పూవులను ధరించి

అమ్మవారి పాదములపై తలలను మోపుటతో వారు తలలతో పూలపూజ చేసినట్లైనది. అందుచేత అమ్మవారి పాదమునకు సుగంధము అబ్బినది. సురభి అనగా సుగంధము గలది అని అర్థము కలదు. సురభి శబ్దము దేవతల గోవు అని మరియొక అర్థము. అది అడిగిన వారికి కోరికల నిచ్చుటచే కామధేనువని ప్రసిద్ధిని పొందినది. అమ్మవారి పాదము కూడ అడిగిన వారికి కోర్కెల నిచ్చుటచే ఆ పాదమునకు సురభియని ప్రసిద్ధి కలిగినది. ఉత్తమస్త్రీ తన్నినచో అశోకవృక్షము పుష్పించుననుట కవి సమయము. అమ్మవారి పాదము సోకినంతనే అశోకవృక్షము పుష్పించుటచే ఆ పుష్పముల వాసన ఆ పాదమునకును వచ్చుటచే సురభి అనగా సుగంధము గలది అను ప్రసిద్ధి కలిగినది. ఈ మూడు విధములలో మొదటి మూడవ విధములు పుష్పములవలన అమ్మవారి పాదమునకు సురభి అను ప్రసిద్ధి కలుగుటకు సంబంధించినవి, రెండవ విధము కోరిన వారికి కోరిన కోర్కెలిచ్చుటచే సురభి అను ప్రసిద్ధి వచ్చినది అనుట ఈ మూడు విధములలోని భేదము. నమస్కరించిన కొద్దిసేపే సురవనితాశిరములందలి సురభిపుష్పముల సంబంధముండును. ఆ కొద్దికాలపు సమ్పర్కముచే అమ్మవారి పాదము కూడ తాత్కాలికముగానే సురభి యగును గదా అను ప్రశ్న మొకటి కలుగును. వరుసగా దేవతా స్త్రీలు ఎప్పుడును నమస్కరించుచునే యుండుటచే ఆ పాదమునకు సురభి పుష్పసమ్పర్కము చిరకాలికమే. అందుచేత పాదము సురభి అగుటలో వింత లేదు. తనయందు భక్తిగల దేవతాస్త్రీల మూర్ధముల మార్కొను పాదము యొక్క వాత్సల్యము కూడ ఇచట వ్యంగ్యమగుచున్నది.



**అవ:**– పై శ్లోకమున ప్రసూనసమ్పర్కము అమ్మవారి చిగురుటాకువంటి పాదమున కున్నట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున పుష్పములు చిగుళ్ళలో నుండును కావున అమ్మవారి పాదము చిగురుటాకు కాంతిని ధరించి యున్నట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ మహామోహస్తేనవ్యతికరభయాత్పాలయతి యో**
**వినిక్షిప్తం స్వస్మిన్మునిజనమనోరత్నమనిశమ్।**
**స రాగస్యోద్రేకాత్సతతమపి కామాక్షి! తరసా**
**కిమేవం పాదోఽసౌ కిసలయరుచిం రోచయతి తే॥ 93**

**ప్రతిపదార్థము :–**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| మహామోహస్తేన వ్యతికరభయాత్ | = | మహామోహమను దొంగయొక్క సంబంధము గల భయమునుండి; |
| అనిశమ్ | = | ఎల్లప్పుడు; |
| యః | = | ఏ పాదము; |

| | | |
|---|---|---|
| స్వస్మిన్ | = | తనయందు; |
| వినిక్షిప్తమ్ | = | దాచిపెట్టబడిన; |
| మునిజనమనోరత్నమ్ | = | మనుజనుల మనస్సనెడి రత్నమును; |
| పాలయతి | = | కాపాడునో; |
| సః | = | ఆ; |
| అసౌ | = | ఈ; |
| తే పాదః | = | నీ పాదము; |
| రాగస్య | = | రాగముయొక్క; |
| ఉద్రేకాత్ | = | ఉద్రేకము వలన; |
| తరసా | = | శీఘ్రముగా; |
| ఏవమ్ | = | ఇట్లు; |
| కిసలయరుచిమ్ | = | చిగురుటాకు కాంతిని; |
| సతతమ్ | = | ఎల్లప్పుదు; |
| రోచయతి కిమ్ | = | ఇష్టపడుచున్నదా యేమి? |

**తాత్పర్యము :-**

మహామోహమును దొంగ యెత్తుకొని పోవునను భయముతో మునులు తమ మనస్సు అను రత్నమును ఎప్పుడు అమ్మవారి పాదము కడ దాచగా దాని నామె కాపాడుచుండుటవలన కలిగిన రాగముయొక్క ఉద్రేకమువలన ఆ పాదము ఎల్లప్పుడు చిగురాకుకాంతి నిష్టపడుచున్నట్లున్నది.

**వివరణము :-**

చిరకాలసహవాసమువలన ఒకరి గుణము లొకరికి సంక్రమించును. **'సంసర్గతో దోషగుణా భవన్తి'** అను పెద్దల సూక్తి ఈ విషయమునే చెప్పుచున్నది. మునిజననములు తమ మనశ్శ్రీరత్నముల నమ్మవారి పాదముల కడ దాచి పెట్టినారు. అనగా వారి మనములలో సాంసారిక విషయము లుండవు. ఒకవేళ వారామె పాదముల కడ దాచి యుంచనిచో వారి ఆ మనోరత్నముల నే మహామోహచోరుడో (మహామోహమందు చోరత్వారోపము చేయుటచే నిట రూపకాలంకారము) అపహరించి యుండును. లేక జ్ఞానులమని విఱ్ఱవీగు మహామునుల మనములను అమ్మవారే ఆ మహామోహమున కప్పగించి యుండును. అట్లు జరుగకుండ వారమ్మవారి పాదముల కడ తమ మనోరత్నముల దాచియుంచిరి. ఇచట మనసునందు రత్నారోప ముండుటచే రూపకాలంకార మున్నది. పాదముల కా రత్నములనెడ రాగము పెఱిగినది. అది చిరసహవాసఫలితము. లేదా రత్నము లెఱ్ఱనివి. కావున చిరసహవాసమున ఆ రత్నముల యెఱుపే పాదముల కేర్పడియుండవచ్చును. ఏమైన నేమి పాదమున రాగోద్రేకము కలిగినది. అమ్మవారి కెఱ్ఱని రత్నముల సహవాసమువలన ఆమె పాదము చిగురాకు

కాంతిని కోరుచున్నది, అను సంభావన ముండుటచే నీ శ్లోకమున నుత్ప్రేక్షాలంకారము **కిమివ** శబ్దములచే వాచ్యమగుచున్నది. దానివలన పాదమునకు చిగురాకుతోడి ఔపమ్యము వ్యంగ్యమగును. పత్రపుష్ప ఫలతోయములలో దేని నైనను భక్తితో సమర్పించిన దానిని భగవానుడు ప్రేమతో స్వీకరించి యనుభవించును. ఇక మునులిచ్చిన మనోరత్నమును ప్రేమతో సమర్పించిన స్వీకరించుటలో వింతలేదు. రత్నస్పర్శచే సుకుమారమైన అమ్మవారి పాద మెఱ్ఱబడినది. పాదము రత్నము రెండును ఒకచోట యెఱ్ఱగా నుండుటచే పాదమువలె రత్నమును చిగురాకువలె కన్పడుచున్నది. లేదా రత్నము మృదువైన అమ్మవారి పాదముయొక్క చిరకాల సహవాసముచే కాఠిన్యము కోల్పోయినది. భక్తుల హృదయము మృదువుగా కొద్దికాలముననే మారిపోవును. ఇప్పుడా రత్నముపై మోహపడుట అమ్మవారి పాదము వంతైనది. మహామోహచోరునకు భయపడి మహామునులు తమ మనోరత్నముల నమ్మవారి పాదమున దాచి యుంచిరి కదా! ఇప్పుడామె పాదమే వాని నపహరించినది. ఇప్పటి వఱకును వారి మనోరత్నములను వారికి తిరిగి యీయనే లేదు. వీరును 'తిరిగి పొందవలెనను మాటయే మఱచినారు. అమ్మవారి పాదముల కడ రత్నమైనను చిగురుటాకైనను ఒక్కటే. దానినొక ఆకువంటి అమూల్యవస్తువుగా నెంచి తిరిగి యీయవలెనని ఆ పాదమే యనుకొనలేదు. వారును కఠినత్వమును వీడి మృదుత్వము నొందిన తమ మనమును తిరిగి తీసికొనవలెనని కోరుకొనలేదు. కోరుకొన్నను వారి మనస్సు వారి కడకు తిరిగి వచ్చుట కిష్టపడలేదేమో. ఏమయిన నేమి? ఆ మనోరత్నము లమ్మవారి కడనే ఉండిపోయినవని *వినిక్షిప్త* శబ్దములోని *'వి'* అను ఉపసర్గ మీ యర్థమును వ్యంగ్యమొనర్చుచున్నది. చిగురాకు కాంతిని కోరుకొను అమ్మవారి పాదమునకు మృదువైన ఆ మునిమనోరత్నమే ఆ కాంతి నమ్మవారి కొసగినది అను అర్థమిట వ్యంగ్యము. ద్వితీయపాదమున యతి స్థానాంతరములలో ప్రాసములున్నవి. మూడవ పాదమున నాల్గవ పాదమున వర్ణమైత్రి ఉన్నది. **'మునిజనమనోరత్నమనిశమ్'** అను పాదభాగమున వృత్త్యను ప్రాస శబ్దాలంకార మున్నది.



**అవ:-** పై శ్లోకమున మునిజనమనస్సు రత్నముగా రూపింపబడినది. ఈ శ్లోకమున ఆ రత్నము వంటి యెఱ్ఱని ముక్కుగల **శుకపోతము**గా రూపింపబడు చున్నది.

**శ్లో॥ సదా స్వాదుంకారం విషయలహరీశాలికణికాం**
**సమాస్వాద్య శ్రాన్తం హృదయశుకపోతం జనని మే।**
**కృపాజాలే ఫాలేక్షణమహిషి! కామాక్షి! రభసా**
**దృహీత్వా రున్ధీథాశ్చరణయుగలీపఞ్జరపుటే॥ 94**

**ప్రతిపదార్థము :-**

ఫాలేక్షణమహిషి = శివుని యిల్లాలైన;

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| సదా | = | ఎల్లప్పుడు; |
| స్వాదుంకారమ్ | = | రుచి యనిపించు; |
| విషయలహరీశాలికణికామ్ | = | విషయప్రవాహమనెడి వరిగింజ ముక్కను; |
| సమాస్వాద్య | = | బాగుగా ఆస్వాదించి; |
| శ్రాన్తమ్ | = | అలసిన; |
| మే | = | నాయొక్క; |
| హృదయశుకపోతమ్ | = | మనస్సనెడి చిలుక పిల్లను; |
| కృపాజాలే | = | దయయను వలయందు; |
| రభసాత్ | = | శీఘ్రముగా; |
| గృహీత్వా | = | పట్టుకొని; |
| చరణయుగలీపంజరపుటే | = | పాదముల జంటయను పంజరమునందు; |
| రున్ధీథాః | = | బంధింపుము. |

**తాత్పర్యము :-**

విషయమను బియ్యపుగింజను బాగుగా తిని అలసిన నా మనస్సు అను చిలుకకూనను నీ పాదమను పంజరమునందు దయయను వలను విసరి పట్టుకొని బంధింపుము.

**వివరణము :-**

శబ్దస్పర్శరసరూపగంధముల విషయములు ధాన్యపుగింజలో నున్న రసమను విషయమును చిలుక ముక్కులోని నాలుక ఆస్వాదించి ఆస్వాదించి అలసిపోయినది. దానికి తినుట తప్ప మఱియొక పని యేమున్నది? కూయుట అను మఱియొక పని యున్నది గదా! అది నాలుకలోని వాగింద్రియముయొక్క పని. నాలుకలోని రసేంద్రియము రసమను విషయము నాస్వాదించును. అది రసము గ్రహించు జ్ఞానేంద్రియమే కాని నాలుకలోని మాట్లాడు వాగింద్రియము కాదు. అదిగాక భుక్తాయాసమున నున్న చిలుక నిద్రపోవునేమో గాని కూత కూయునా? వేటకాండ్రు వలవేసి దానిలో నూకలు చల్లిన వానిపై నాసతో చిలుక లందు జిక్కుకొనును. ఆ తరువాత వారు ఆ వలలో పడిన చిలుకల తమ పంజరములందు బంధించెదరు. అమ్మా! నీవును దయయను వలతో పట్టుకొని బంధింపుము. అని దయయందు జాలత్వారోపము, చరణయుగలియందు పంజరత్వారోపము నుండుటచే రూపకాలంకార మేర్పడియున్నది. ప్రథమ ద్వితీయ పాదములందు ప్రథమ తృతీయాక్షర ప్రాసయున్నది. '**కృపాజాలే ఫాలే**' అను పదములలో వృత్త్యనుప్రాసమున్నది.



**అవ:**- పై శ్లోకమున **విషయ సమాస్వాదము** చెప్పబడినది. భోగే రోగభయమ్ అని కదా పెద్దల సూక్తి. ఈ శ్లోకమున అమ్మవారి పాదము **సిద్ధౌషధముగా** చెప్పబడుచున్నది.

**శ్లో॥ ధునానం కామాక్షి! స్మరణలవమాత్రేణ జడిమ-**
**జ్వరప్రౌఢిం గూఢస్థితి నిగమనైకుఞ్జకుహరే।**
**అలభ్యం సర్వేషాం కతిచన లభన్తే సుకృతిన-**
**శ్చిరాదన్విష్యాన్తస్తవ చరణసిద్ధౌషధమిదమ్॥ 95**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| స్మరణలవమాత్రే | = | అత్యల్పస్మరణమాత్రముచేత; |
| జడిమజ్వరప్రౌఢిమ్ | = | జాడ్యజ్వరాతిశయమును; |
| ధునానమ్ | = | పోగొట్టుచున్న; |
| నిగమనైకుంజకుహరే | = | వేదమను పొదరింటిలోని భాగమున; |
| గూఢస్థితి | = | రహస్యముగా నిలుచు; |
| సర్వేషామ్ | = | అందఱకు; |
| అలభ్యమ్ | = | లభించని ; |
| ఇదమ్ | = | ఈ; |
| తవ | = | నీయొక్క |
| చరణసిద్ధౌషధమ్ | = | చరణమను సిద్ధౌషధమును; |
| చిరాత్ | = | చాలకాలము; |
| అన్తః | = | లోపల; |
| అన్విష్య | = | వెదకి; |
| కతిచన | = | కొందఱు; |
| సుకృతినః | = | పుణ్యాత్ములు; |
| లభన్తే | = | పొందెదరు. |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదమను సిద్ధౌషధము కొద్దిసేపు స్మరించిన మాత్రమున జాడ్యజ్వరమును తొలగించును. వేదమను పొదలోపలి భాగమున గూఢముగా నుండునట్టిది, అందఱకు లభించనిది, చాలా కాలము వెదకు కొందఱు పుణ్యాత్ములే పొందెదరు.

**వివరణము :-**

సంసారులైన జీవులు జాడ్యజ్వరముతో బాధ పడుచుందురు. జాడ్య జ్వర మనగా శరీరము కదలలేని స్థితి అని ఒక అర్థము. అజ్ఞానజ్వరమని మరొక అర్థము.

సాధారణముగా ఔషధము సేవించిన వారికే జాడ్యజ్వరము తొలగును. కాని ఔషధము స్మరించిన జాడ్యజ్వరము తొలగదు. అమ్మవారి చరణౌషధము స్మరించిన మాత్రముననే వారి జాడ్యజ్వరము (అజ్ఞానము)ను తొలగించునని చెప్పుటచే నిచట వ్యతిరేకాలంకార మున్నది. కొన్ని ఔషధములు గుహలలో లభించును. ఔషధములనగా మొక్కలలోని ఆకు కాండము వేరు మొదలగునవి. కొన్ని ఔషధములు సూర్యరశ్మి సోకినచో పనిచేయవు. అవే ఓషధులు గుహలలోనే సూర్యరశ్మి అధికముగా సోకకుండుటచే పనిచేయును. అమ్మ చరణౌషధము సూర్యరశ్మి సోకని వేదమను పొదలోపలిభాగమున నున్నది. (ఇట నిగమము నందు నికుంజత్వారోప ముండుటచే రూపకాలంకార మేర్పడి యున్నది) పైగా అది సిద్ధౌషధము. అమ్మవారి చరణము కడకు పోగలుగుటయే సిద్ధి. అట్లు పోయిన వారే సిద్ధులు. వారే ఏ పొదలో లభించునో వేదము అను పెద్ద పొదలో ఏ మూల లభించునో వారు చెప్పగలరు. కొందఱా పొదలలోనే వెదకుచుందురు. వారికి కనిపించదు. కాని చూచి వచ్చినవారు చూపించినప్పుడు అది యున్నచోట చూచి దానిని పొందవచ్చును. కేవల శాస్త్రజ్ఞులు వేదమంత్రము లన్నింటి అర్థము చెప్పగలరు. కాని ఏ మంత్రములో స్పష్టముగా నా చరణము ప్రకాశించునో ఆ మంత్రమునే సిద్ధులుపదేశించెదరు. మంత్రము లన్నింటిలో దాని ప్రకాశమున్నప్పుడు అన్ని మంత్రములలో వెదకవలసి వచ్చును. ద్వైత ప్రతిపాదకములలో నా చరణము స్పష్టముగా ప్రకాశింపదు. అస్పష్టముగానే ప్రకాశించును. వేదములు అనెడి పొదలో ఆ సిద్ధౌషధముతో పాటు మఱెన్నియో ఔషధము లుండును. సిద్ధులుకాని అన్యులచే నుపదేశింపబడిన వారా యౌషధమును గానక భ్రాన్తులై తిరుగుచుందురు. కొన్ని ఔషధములు ఓషధుల నుండి కొన్ని ప్రక్రియల ద్వారా సాధ్యములై యుండును. అనగా ఆ ఔషధము సిద్ధము కాదు. కొన్ని కర్మల ద్వారా (అపూర్వ స్వర్గాది రూపమున) సాధ్యమగును. కాని ఈ చరణౌషధము నెవఱు సాధ్యము చేయనక్కఱలేదు. అది సిద్ధమే. కావున వెదకినచో ఔషధమే లభించును. కాని ఓషధులను తీసుకొని వానిని దంచియో, ఎండబెట్టియో, ఆఱబెట్టియో ఇటువంటి యేవో ప్రక్రియల ద్వారా సాధ్యమగునది కాదు. ఈ ఔషధము లభించవలెనన్న వెదకువారు పుణ్యాత్ములు కావలెను. అనగా యజ్ఞతపోదానజపధ్యానాదులతో పుణ్యమును పొంది యుండవలెను. ఆ తరువాతనే సిద్ధగురుదర్శనము. ఆ తరువాత సిద్ధమైన చరణౌషధముయొక్క లాభము. ఇది వేద నికుంజకుహరములలో నున్నను అచట వెదకవలసిన అవసరము లేదు. సిద్ధగురువులు దానిని నీ హృదయము నందే సాక్షాత్కరింపజేయుదురు. గురువులు నీ హృదయములోనే ఆ ఔషధమున్నదని చెప్పెదరు. కాని వెదకగా మాత్రమే లభించును. సిద్ధగురువుల అనుగ్రహమువలన అది ప్రకాశించును. అప్పుడే దానిని మనము పొందినట్లగును. వాస్తవమున కది నూతనౌషధలాభము కాదు. సిద్ధౌషధలాభమే ఉన్నది. ప్రకాశింపనంత వఱకు లేనట్లే ఉన్న ఆ ఔషధము సిద్ధగురువుల అనుగ్రహముచే వెదకమన్న విధముగా వెదకుటలోనే అది ప్రకాశించును. చూచుటలో నేదేని లోపమున్నను సిద్ధగురువులు తమ శక్తిపాతముతో దానిని సరిచేయుదురు. అప్పుడది ప్రకాశించును. పూర్వజన్మ

సిద్ధులు కొందఱు ఇప్పుడీ జన్మమున గురువుల నాశ్రయింపకున్నను లోన వెదకినచో ఆ సిద్ధౌషధము ప్రకాశించును. ఈ సిద్ధౌషధ మీ విధముగా వేదమను పొద లోపలి భాగమున గూఢముగా నున్నది. అయినను అది హృదయముననే ప్రకాశించును. ఆ వేదనికుంజమును హృదయమున నుంచి వెదుకవలెను. జ్ఞానరూపమైన ఆ ఔషధమును వెదకుట ఇట్లే ఉండవలెను. వేదమంత్రముల అర్థము విచారింపవలెను. సిద్ధగురూపదిష్ట మంత్రముయొక్క అర్థము గురుముఖమున ఉపదేశింపబడి చెవి ద్వారా హృదయమున నిలుపుకొని అచట వెదకవలెను. ఆ సిద్ధగుర్వనుగ్రహమున ఆ సిద్ధౌషధము తనకు తానే పుణ్యాత్ములకు హృదయముననే లభించును. అందుచేతనే **సర్వేషామలభ్యమ్** అని చెప్పబడినది. గూఢస్థితి అను సమాస మీ యంశమును దృఢపఱచుచున్నది. వెదకుటలో సంభవించు భ్రమప్రమాదాది విఘ్నములు ఆ పాదముయొక్క స్మరణముచేతనే తొలగును. దానిని తలచుచునే జాడ్యమును తొలగించుకొనవలెను. అనగా ఆ ఔషధము ప్రకాశింపవలెననిన జాడ్యము అనగా అజ్ఞానము తొలగవలెను. ఇవి రెండు దాదాపు ఏకకాలికములే. కొందఱకు (పుణ్యాత్ములకు) అల్పస్మరణము చేతనే జాడ్యము తొలగును.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చరణముయొక్క లాభము కలుగు విధము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ చరణముల యొక్క లక్షణము తన్నమస్కరణము చెప్పబడుచున్నవి.

**శ్లో॥ రణన్మఞ్జీరాభ్యాం లలితగమనాభ్యాం సుకృతినాం**
**మనోవాస్తవ్యాభ్యాం మథితతిమిరాభ్యాం నఖరుచా।**
**నిధేయాభ్యాం పత్యా నిజశిరసి కామాక్షి! సతతం**
**నమస్తే పాదాభ్యాం నలినమృదులాభ్యాం గిరిసుతే॥ 96**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| గిరిసుతే | = | పర్వతపుత్రివైన; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| రణన్మంజీరాభ్యామ్ | = | ధ్వనించు అందెలు గల; |
| లలితగమనాభ్యామ్ | = | అందమైన నడకగల; |
| సుకృతినామ్ | = | పుణ్యాత్ములయొక్క; |
| మనోవాస్తవ్యాభ్యామ్ | = | మనస్సు నందు నివసించునట్టి; |
| సతతమ్ | = | ఎల్లప్పుడు; |
| నఖరుచా | = | గోళ్ళకాంతిచే; |
| మథితతిమిరాభ్యామ్ | = | నశింపజేయబడిన చీకట్లుగల; |
| పత్యా | = | భర్తచేత; |
| నిజశిరసి | = | తన శిరసునందు; |

| | | |
|---|---|---|
| నిధేయాభ్యామ్ | = | ఉంచదగినట్టి; |
| నలినమృదులాభ్యామ్ | = | కమలములవలె మృదువులైన; |
| తే | = | నీయొక్క; |
| పాదాభ్యామ్ | = | పాదముల కొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదములు ధ్వనించు నందెలు గలవి. వాని గమనము అందమైనది. పుణ్యాత్ముల మనములందే అవి నివసించునట్టివి. గోళ్ళకాంతులచే చీకట్లు చీల్చునట్టివి. భర్తయైన శివునిచే నెల్లప్పుడు తన శిరస్సున నుంచుకొన దగినట్టివి. కమలములవలె కోమలములైనవి. అట్టి పాదములకు మా నమస్సు.

**వివరణము :-**

**రణన్మంజీరాభ్యామ్** అనుటచే అమ్మవారి పాదములందు మణికింకిణు లున్న వనుట వ్యంగ్యము. **లలితగమనాభ్యామ్** అనుటచే మంచి నడక గల వారికే లభించునవి అని వ్యంగ్యము. **సుకృతినామ్ మనోవాస్తవ్యాభ్యామ్** అనుటచే అనేక జన్మల పుణ్యముచేతనే అమ్మవారి చరణముల ధ్యానించు భాగ్యము కలుగునని వ్యంగ్యము. **నఖరుచా మథితతిమిరాభ్యామ్** అనుటచే ఆ పాదముల గోళ్ళు అజ్ఞానాంధకారమును జీల్చుననుట వ్యంగ్యము. **పత్యా నిజశిరసి నిధేయాభ్యామ్** అనుటచే అమ్మవారు స్వాధీనపతిక యనుట వ్యంగ్యము. **నలిన మృదులాభ్యామ్** అనుటచే నేలమీద మోపినచో కందిపోవునను భయము చేతనే శివుడు ఆమె పాదముల శిరమున నుంచుకొనుచున్నాడని వ్యంగ్యము. ఐదవ విశేషణముయొక్క అర్థమును సమర్థించుటచే నీ వ్యంగ్యము గుణీభూతవ్యంగ్యము. విశేషణములన్నియు శ్లాఘ్యములుగా నుండుటచే స్వభావోక్త్యలంకార మున్నది. **నలినమృదులాభ్యామ్** అను విశేషణమున లుప్తోపమాలంకార మున్నది. దాదాపు అన్ని పాదములలో వర్ణమైత్రి ఉన్నది. పూర్వార్ధమునందలి పాదాది విశేషణములు ఆఱు అక్షరములతో పాదమధ్య విశేషణము లేదు. ఆ అక్షరములు కలిగియుండుటచే నేర్పడిన సమత్వము **శయ్యాసౌభాగ్యమును** ప్రకటించుచున్నవి. ఆ శయ్య ఊయల మంచము నందలి శయ్యవలె ఊగుచున్నది, తూగుచున్నది. మొదటి విశేషణముచే ఒక వైపునకు పోయి మరొక దానిచే తిరిగి వచ్చుచున్నట్లున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదములు **కమలమృదులములు** అని చెప్పబడినది. ఈ శ్లోకమున **కమలములే** అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ సరాగే రాకేన్దుప్రతినిధిముఖే! పర్వతసుతే!**
**చిరాల్లభ్యే భక్త్యా శమధనజనానామ్ పరిషదా।**

**మనోభృంగో మత్కః పదకమలయుగ్మే జననీ! తే**
**ప్రకామం కామాక్షి! త్రిపురహరవామాక్షి! రమతామ్॥ 97**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| పర్వతసుతే | = | పర్వత పుత్రికవైన; |
| త్రిపురహరవామాక్షి | = | శివుని ఇల్లాలవైన; |
| జనని | = | అమ్మా! |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| రాకేందుప్రతినిధిముఖే | = | పున్నమి చంద్రుని వంటి ముఖము కలదానా! |
| సరాగే | = | ఎఱుపుతో కూడిన; |
| శమధనజనానామ్ | = | మనోనిగ్రహము ధనముగా గలవారియొక్క; |
| పరిషదా | = | సమూహముచేత; |
| భక్త్యా | = | భక్తితో; |
| చిరాత్ | = | చాలా కాలమునకు; |
| లభ్యే | = | లభింపదగిన; |
| తే | = | నీయొక్క; |
| పదకమలయుగ్మే | = | పాదకమల ద్వంద్వమునందు; |
| మత్కః | = | నా; |
| మనోభృంగః | = | మనస్సను తుమ్మెద; |
| ప్రకామమ్ | = | మిక్కిలి; |
| రమతామ్ | = | రమించు గాక! |

**తాత్పర్యము :-**

రాగముతో కూడిన మనోనిగ్రహము కలవారియొక్క సమూహముచే భక్తితో చాలా కాలమునకు పొందదగిన అమ్మవారి పాదకమలద్వంద్వము నందు నా మనస్సను తుమ్మెద రమించు గాక!

**వివరణము :-**

ప్రతినిధి శబ్దము సదృశ వాచకము. కావున **రాకేన్దుప్రతినిధిముఖే** అను సమాసమున లుప్తోపమాలంకార మున్నది. **పదకమలయుగ్మే** అను సమాసమున పాదము లందు కమలత్వారోపము, **మనోభృంగే** అను సమాసమున మనస్సునందు భృంగత్వారోప ముండుటచే రూపకాలంకారములున్నవి. **'ప్రకామం కామాక్షి'** అనుచోట యమకాలంకార మను శబ్దాలంకార మున్నది. రెండవ పాదము మనో నిగ్రహముతో ఎంతో కాలము భక్తితో సేవించిన కాని అమ్మవారి పాదములు లభింపవని తెలుపుచున్నది. సరాగే అను విశేషణము అమ్మవారి పాదయుగ్మమునకు గాని అమ్మవారికి గాని అన్వయింపవచ్చును.

అమ్మవారి కన్వయించినపుడు అమ్మవారికి శివునందు రాగమున్నదని, పదకమల యుగ్మమున కన్వయించినప్పుడు ఎఱుపుగల అను అర్థము నిచ్చును.



**అవ:-** మనస్సు **తుమ్మెదగా** పై శ్లోకమున రూపింపబడినది. ఈ శ్లోకమున చిత్తము ***మదించినగజముగా*** రూపింపబడుచున్నది.

**శ్లో॥ శివే! సంవిత్పాశైః శశిశకలచూడప్రియతమే!**
**శనైర్గత్యాగత్యా జితసురవరేభే! గిరిసుతే!॥**
**యతన్తే సన్తస్తే చరణనలినాలానయుగలే**
**సదా బద్ధుం చిత్తప్రమదకరియూథం దృఢతరమ్॥ 98**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| శివే | = | మంగళ స్వరూపురాలవైన; |
| శశిశకలచూడప్రియతమే | = | శివుని కత్యంత ప్రియురాలా! |
| గిరిసుతే | = | పర్వతపుత్రీ! |
| శనైర్గత్యా | = | మన్దగమనముతో; |
| జితసురవరేభే | = | ఓడించిన ఐరావతము గలదానా! |
| అగత్యా | = | వేరు మార్గము లేకపోవుటచే; |
| తే | = | నీ; |
| చరణనలినాలానయుగలే | = | పాదకమలమను జంట కొయ్యలయందు; |
| సంవిత్పాశైః | = | జ్ఞాన పాశములతో; |
| సదా | = | ఎల్లప్పుడు; |
| చిత్తప్రమదకరియూథమ్ | = | మనస్సను మదించిన గజమును; |
| బద్ధుమ్ | = | బంధించుటకు; |
| సంతః | = | సత్పురుషులు; |
| యతన్తే | = | యత్నించెదరు. |

**తాత్పర్యము :-**

తన మన్దగమనముతో ఐరావతమును జయించిన పర్వతపుత్రి, శివుని యిల్లాలునునైన అమ్మవారి చరణయుగము అనెడి ఆలానస్తంభ యుగ్మమున తమ మనస్సులను గజముల సమూహమును జ్ఞానపాశములతో బంధించుట కెల్లప్పుడు సత్పురుషులు యత్నించుచుందురు.

**వివరణము :-**

అమ్మవారి పాదములందు ఆలానత్వారోపము, మనసులందు గజత్వారోప ముండుటచే రూపకాలంకార మేర్పడియున్నది. ***శనైర్గత్యా జితసుర వరేభే*** అను

సంబోధనమున ఉపమానమైన ఐరావతము అమ్మవారిచేత జయింప బడినట్లు చెప్పుటచే ప్రతీపాలంకారమేర్పడి యున్నది. ఐరావతము ఇంద్రుని యేనుగు. అది తెల్లగా నుండును. అది పాలసముద్రమున జన్మించినది. అన్ని గజములకు ప్రభువగుటచే నది గజేంద్రము. దేవతల కింద్రుడు ప్రభువు. ఆతని వాహనమైన ఐరావతము గజములకు ప్రభువు. దానినే తన యందనురాగముతో నమ్మవారి పాదమోడించిన దనగా లోకములోని గజము లన్నింటి నోడించినట్లే. శనైర్గత్యా జితసురవరేభే అను సమాసమును అమ్మవారికి విశేషణముగా లేక ఆమె చరణనలినాలానయుగలమునకు విశేషణముగా చేయవచ్చును. అప్పుడేనుగు బంధింపబడినందున దాని గతి సౌందర్య గర్వము అణచివేయబడిన దగును. దానికప్పుడు గతి అనగా గతిలేకపోవుటయే సంభవించును. సత్పురుష లిదివఱకు విష్ణ్వాది దేవతా చరణముల నాశ్రయించి తమ మనస్సుయొక్క మదము నణచగోరి యుండిరి. కాని వారాయత్నమున సఫలతనొందలేక పోయిరి. అగతికముగా నిప్పు డమ్మవారి చరణముల నాశ్రయించిరి. సత్పురుషుల మనస్సులకు ఏనుగు లనేకములు. వారి సమూహము లన్నింటిని అమ్మవారి చరణములను కట్టుకొయ్యలకే కట్టి వాని మదము నణచుటలో సత్పురుషులు సఫలత నొందిరి. సఫలత నొందుటకు వారికింకోగతి లేక (అగత్యా) అమ్మవారి చరణాలానస్తంభములకే తమ మనో గజసమూహములను కట్టివైచిరి. ఏనుగులను బంధించు కట్టుకొయ్యకు **ఆలాన** మను పేరు ప్రసిద్ధము. సంవిత్తులందు పాశత్వారోపముచేత రూపకాలంకార మేర్పడియున్నది. ***సంవిత్పాశము*** లనగా జ్ఞానరజ్జువులు. ***'శివే, సంవిత్పాశై, శశిశకల, శనైః'*** అను పదములలో శకారావృత్తి ఉండుటచే, ***సురవరేభే, గిరిసుతే*** పదములలో రకారావృత్తి ఉండుటచే, ***యతన్తే, సన్తస్తే*** అను పదములలో నకార తకారవృత్తి ఉండుటచే వృత్త్యనుప్రాసాలంకార మేర్పడియున్నది. గత్యాగత్యా-పోకచేతను, రాకచేతను అనియు అర్థము చెప్పవచ్చును. స్వర్గమునకు వచ్చునప్పుడు, పోవునప్పుడు ఇంద్రుని యేనుగు నడక సౌందర్యము అమ్మవారిచే జయింపబడును అనియు చమత్కరింపవచ్చును.



**అవ:-** పై శ్లోకమున ముక్తి హేతువున అమ్మవారి చరణాలానమున మనస్సను ఏనుగుయొక్క **సంవిత్పాశబంధము** చెప్పబడినది. ఈ శ్లోకమున బంధ రూపమైన పాశముల శైథిల్యము నమ్మవారి పాద మొనర్చునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ యశస్తే మాతర్మధురకవితాం పక్ష్మలయతే**
**శ్రియం ధత్తే చిత్తే కమపి పరిపాకం ప్రథయతే।**
**సతాం పాశగ్రన్థిం శిథిలయతి కిం కిం న కురుతే**
**ప్రపన్నే కామాక్ష్యాః ప్రణతిపరిపాటీ చరణయోః॥ 99**

**ప్రతిపదార్థము :-**

కామాక్ష్యాః = కామాక్షీదేవియొక్క

| | | |
|---|---|---|
| చరణయోః | = | పాదములందలి; |
| ప్రణతిపరిపాటీ | = | ప్రణామ ప్రవణత; |
| ప్రపన్నే | = | శరణాగతుని యందు; |
| యశః | = | కీర్తిని; |
| సూతే | = | కలిగించును; |
| మధురకవితామ్ | = | తీయని కవితను; |
| పక్ష్మలయతే | = | పెంచును; |
| శ్రియమ్ | = | సంపత్తిని; |
| ధత్తే | = | ధరించును; |
| చిత్తే | = | చిత్తమున; |
| కమ్ అపి | = | ఏదో ఒక; |
| పరిపాకమ్ | = | పరిపాకమును; |
| ప్రథయతే | = | విస్తరింపజేయును; |
| సతామ్ | = | సత్పురుషులయొక్క; |
| పాశగ్రన్థిమ్ | = | పాశబంధమును; |
| శిథిలయతి | = | వదులుచేయును; |
| కిమ్ కిమ్ | = | దేనిని దేనిని; |
| న కురుతే | = | కలిగించదు; |
| మాతః | = | అమ్మా! |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాదములందొనర్చిన ప్రణామము శరణాగతుని యందు కీర్తిని కలిగించును. మధురకవితను వికసింపజేయును. సంపదను కలిగించును. చిత్తమున పరిపాకమును కలిగించును. సత్పురుషుల పాశబంధమును వదిలించును. ఇంకేమేమి చేయదు?

**వివరణము :-**

ఈ శ్లోకమున చెప్పబడిన యశఃకీర్తి మధుర కవితా మనః పరిపాక పాశ గ్రంథి శైథిల్యములనే కాక చెప్పబడని కోరిన దానిని దేనినైన అమ్మవారి పాదములందు చేయబడిన ప్రణామము ప్రసాదించును. ప్రపత్తి అనగా శరణాగతి. తనకు వేరు ఆశ్రయము, ఆధారము, ఆలంబనము ఏదియు లేదని ఆమె పాదములపై పడు ప్రణతి పరిపాటి. ప్రపత్తి ఒకసారి చేయదగినదని కొందఱు చెప్పెదరు. ఒక్కసారి చేయబడిన ప్రణామము పునర్జన్మరాహిత్యము కలిగించునని కులశేఖరాళ్వారులు చెప్పినారు. ఇటువంటి ప్రణామము శరణాగతియే ప్రపత్తియే. ఇతర సాధారణ నమస్కారమునకు ఈ

నమస్కారమునకు (శరణాగతికి) భేదము చెప్పవచ్చును. కాని నమే (నా దేమియు లేదు), నమః (నా దేమియు లేదు) అను భావమును తెలుపు ప్రణతికి శరణాగతికి భేదము చెప్పుట అసాధ్యము. **సూతే మాతః ధత్తే చిత్తే** అను పద ద్వంద్వములలో వృత్త్యనుప్రాస మున్నది. 4వ పాదమున వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున **మధుర కవిత** నమ్మవారి చరణము ప్రణామ మొనర్చు వారికి కలిగించునని చెప్పబడినది. ఈ శ్లోకమున కవితా మధురత కమల మరందరసతుల్యమని ప్రతిపాదింపబడుచున్నది.

**శ్లో|| మనీషాం మాహేన్ద్రీం కకుభమివ తే కామపి దశాం**
**ప్రధత్తే కామాక్ష్యాశ్చరణతరుణాదిత్యకిరణః|**
**యదీయే సమ్పర్కే ధృతరసమరన్దా కవయతాం**
**పరీపాకం ధత్తే పరిమలవతీ సూక్తినలినీ|| 100**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| యదీయే చరణతరుణాదిత్య | = | ఏ చరణ తరుణాదిత్య కిరణ సంబంధియైన; కిరణః |
| సమ్పర్కే | = | కలయికయందు; |
| కవయతామ్ | = | కవులయొక్క; |
| ధృతరసమరన్దా | = | ధరింపబడిన మకరన్ద రసముగల; |
| పరిమలవతీ | = | సుగంధముగల; |
| సూక్తినలినీ | = | మంచి మాటయనెడి కమలపు తీగ; |
| పరీపాకమ్ | = | పరిపాకమును; |
| ధత్తే | = | ధరించునో (సః=అ); |
| కామాక్ష్యాః | = | కామాక్షీ దేవియొక్క; |
| మాహేన్ద్రీమ్ | = | మహేన్ద్రునికి సంబంధించిన; |
| కకుభమ్ ఇవ | = | దిక్కునువలె; |
| తే | = | నీకు; |
| మనీషామ్ | = | బుద్ధిని; |
| కామ్ అపి | = | ఏదో ఒక; |
| దశామ్ | = | దశను; |
| ప్రధత్తే | = | ధరించును. |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాద సూర్య సమ్పర్కమున కవులు మకరన్దరసము నిండిన

సుగంధయుతమైన సూక్తియను కమలపుతీగ పరిపాకము నొందునో తూర్పు దిక్కునువలె బుద్ధి నేదో యొక దశను పొందును.

**వివరణము :-**

చరణమునందు తరుణాదిత్యారోప ముండుటవలన, సూక్తి యందు నలినీత్వారోపము నుండుటచేత రూపకాలంకార మేర్పడియున్నది. మనీషకు తూర్పు దిక్కుతోడి ఔపమ్యము చెప్పబడుటచే ఉపమాలంకార మేర్పడి యున్నది. లేత సూర్యుని కిరణ సంబంధము తూర్పు దిక్కునం దొక వింత దశను కలిగించు నట్లు అమ్మవారి చరణము బుద్ధికొక వింత దశను కలిగించును. అట్టి కవుల బుద్ధి కమలపు తీవ మకరన్ద పరిమళముల విరజిమ్మునట్లు మాధుర్యసౌరభ్యములు గల వాక్కులను అర్థములును గల గొప్ప కవితను విరజిమ్మును. వారి మాటయే కవిత్వమట్లు మాధుర్యసౌరభ్యముల గల్గియుండును. ఈ శ్లోకమునందలి రూపకానుప్రాణితోపమాలంకారమువలన సూర్యసమ్పర్కమున కమలపుతీవ కమలముల పూచును. పరిమలముతో దిక్కులు సురభిలము లగును. అమ్మవారి పాదసంపర్కమువలన బుద్ధి సూక్తిమయమధురరసపూర్ణ కవితాసుమములు వికసించును. కవి యశస్సు దిగంతవ్యాప్తమగును అని వ్యంగ్యమగును. 4వ పాదమున వర్ణమైత్రి యున్నది. **చరణతరుణాదిత్యకిరణ** అనుచోట రకార ణకారముల ఆవృత్తిచే వృత్త్యనుప్రాస శబ్దాలంకార మేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చరణము **లేత సూర్యునితో** ఉపమింపబడినది. ఈ శ్లోకమున **అబ్జముతో** రూపింపబడినది.

**శ్లో॥ పురా మారారాతిః పురమజయదమ్బ! స్తవశతైః**
**ప్రసన్నాయాం సత్యాం త్వయి తుహినశైలేన్ద్రతనయే!।**
**అతస్తే కామాక్షి! స్ఫురతు తరసా కాలసమయే**
**సమాయాతే మాతర్మమ మనసి పాదాబ్జయుగలమ్॥** **101**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| తుహినశైలేన్ద్రతనయే | = | పర్వతరాజకుమారివైన; |
| మాతః | = | జ్ఞానస్వరూపురాలవైన; |
| కామాక్షి అంబ! | = | ఓ కామాక్ష్యమ్మా! |
| పురా | = | పూర్వము; |
| మారారాతిః | = | మన్మథుని శత్రువు (శివుడు); |
| స్తవశతైః | = | వందల స్తోత్రములచేత; |
| త్వయి | = | నీవు; |
| ప్రసన్నాయాం సత్యామ్ | = | ప్రసన్నురాలివికాగా; |

| | | |
|---|---|---|
| పురమ్ | = | త్రిపురాలను; |
| అజయత్ | = | జయించెను; |
| అతః | = | అందువలన; |
| తే | = | నీయొక్క; |
| పాదాబ్జయుగలమ్ | = | పాదకమలముల జంట; |
| కాలసమయే | = | మృత్యు సమయము; |
| సమాయాతే | = | రాగా; |
| మమ | = | నాయొక్క; |
| మనసి | = | మనసునందు; |
| తరసా | = | వేగముగా; |
| స్ఫురతు | = | స్ఫురించుగాక! |

**తాత్పర్యము :-**

పూర్వము శివుడు త్రిపురాసురసంహారసమయమున అమ్మవారిని వందల స్తోత్రములచే స్తుతించి వారి త్రిపురములను వారిని జయించెను. అందువలన మృత్యుసమయము రాగా నా మనస్సున వేగముగా అమ్మవారి పాదము స్ఫురించుగాక!

**వివరణము :-**

ఈ శ్లోకమున పాదములం దబ్జారోప ముండుటచే రూపకాలంకార మేర్పడియున్నది. మూకమహాకవి తన పంచశతిని రచించుటకు శివుడే ఆదర్శమని చెప్పుచున్నారు. త్రిపురాసురసంహారమునకు కావలసిన శక్తిని అంబకు స్తవశతములు సమర్పించి పొందెను. **పురమ్** అను శబ్దము త్రిపురములను అర్థమున జాత్యేకవచనముగా ప్రయోగింపబడినది. ఆ శివునే తన ఆదర్శముగా గ్రహించి స్తవ శతకములను (ఐదింటిని) రచించినానని మూకమహాకవి వ్యంజింప జేయుచున్నాడు. **'కాలసమయే'** అనుచోట ఏకార్థముల వలె భాసించు శబ్దముల ప్రయోగముచే పునరుక్తవదాభాసాలంకార మేర్పడియున్నది. అంతకాలము రాగానే అమ్మవారే తన మనమున స్ఫురించవలెనని కవి యేల కోరుచున్నాడు? శివునంతవాడు తన కోరిక తీర్చుకొనుటకు అమ్మవారినే స్తుతించగా ఆమె అనుగ్రహించినందున అది **అతః** శబ్దముచే వ్యంగ్యమగు నర్థము. ***అతస్తే కామాక్షి స్ఫురతు తరసా, పురా మారారాతిః, పుర మజయ దంబ స్తవశతైః సమాయాతే మాతర్మమ మనసి*** అను చోట్ల **రేఫ మకార తకారావృత్తి**చే వృత్త్యనుప్రాస మేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున కవిచేత తన హృదయమున అమ్మవారి పాదముల స్ఫురణము కోరబడుటకు కారణముగా నీ శ్లోకమున సత్పురుష హృదయ నివాసమే అని చెప్పబడుచున్నది. తనను సత్పురుషునిగా భావించి తనలో స్ఫురింపవలెనని వ్యంజింపజేయ బడుచున్నది.

శ్లో॥ పదద్వన్ద్వం మన్దం గతిషు నివసన్తం హృది సతాం
గిరామన్తే భ్రాన్తం కృతకరహితానాం పరివృఢే।
జనానామానన్దం జనని జనయన్తం ప్రణమతాం
త్వదీయం కామాక్షి! ప్రతిదినమహం నౌమి విమలమ్॥ 102

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| పరివృఢే | = | యజమానురాలవైన; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| జనని | = | అమ్మా! |
| గతిషు | = | నడకలయందు; |
| మన్దమ్ | = | మాన్ద్యముగల; |
| సతామ్ | = | సత్పురుషులయొక్క; |
| హృది | = | మనస్సున; |
| నివసన్తమ్ | = | నివసించుచున్నట్టి; |
| కృతకరహితానామ్ | = | వ్యాజ రహితములైన; |
| గిరామ్ | = | వాక్కులయొక్క; |
| అన్తే | = | అంతమున; |
| భ్రాన్తమ్ | = | తిరుగుచున్నట్టి; |
| ప్రణమతమ్ | = | నమస్కరించు; |
| జనానామ్ | = | జనులకు; |
| ఆనన్దమ్ | = | ఆనందమును; |
| జనయన్తమ్ | = | కలిగించుచున్నట్టి; |
| విమలమ్ | = | స్వచ్ఛమైన; |
| త్వదీయమ్ | = | నీ; |
| పదద్వన్ద్వమ్ | = | పాదముల జంటను; |
| ప్రతిదినమ్ | = | ప్రతిరోజు; |
| అహమ్ | = | నేను; |
| నౌమి | = | నమస్కరించెదను. |

**తాత్పర్యము :-**

మెల్లని నడకగల, సత్పురుషుల హృదయముల నివసించు, వేదాన్తముల యందు తిరుగుచున్న నమస్కరించు వారి కానందమును కలిగించుచున్న అమ్మవారి స్వచ్ఛమైన పాదద్వంద్వమును ప్రతిదినము నేను నమస్కరించెదను.

**వివరణము :-**

అమ్మవారి పాదద్వంద్వము సత్పురుషుల మనస్సులలో నివసించు చున్నదని

చెప్పబడినది. ఆ సత్పురుషుల హృదయమునను ఆ పాద ద్వంద్వము నివసించును. కాని వారు తమ హృదయముననున్న ఆ పాదద్వంద్వమును గుర్తింపక పోవుట వలన వారి దృష్టిలో అది లేనట్లే అగును. వర్తమాన కాలముననే గాక భూతకాలముననును అది నివసించియే యున్నది. భవిష్యకాలమున నివసించగలదు కూడ. అంతటా ఉన్న ఆ చరణ ద్వంద్వము హృదయమున నివసించు ననగా అది అక్కడ మనస్సునకు గోచరమగు ననియే అర్థము. మనస్సునకు కూడ గోచరము కాని నిర్గుణ స్వరూపమునను అది ఉండును. నమస్కరించు వారికి ఆనందమును కలుగజేయు చున్న దా పాదమని చెప్పుట వారికా దర్శనానందము కలుగునని చెప్పుటయే. వారే ఆ పాదద్వంద్వ దర్శనమున ఆనందమును పొందుదురు. ఇతరుల కది ఆనందింపజేయు దర్శనముగా ఉండదు. ప్రణామము చేయుచున్నారనగా ఆ పాదద్వంద్వము తృష్టము. ఇంతేగాక అది రక్షకము. దుఃఖనివర్తకము. ప్రేమప్రవర్ధకము అని భావించుచున్నారని యర్థము. అమ్మవారి పాదద్వంద్వము విమలము అని చెప్పబడినది. అజ్ఞానమే ప్రధానముగా మలము. అజ్ఞానజన్యములైన కామక్రోధలోభాదులన్నియు మలములే. అట్టి మలములేవియు లేని దమ్మవారి పాదద్వంద్వము. కావుననే భక్తుల ఆ మాలిన్యము తొలగించుటకు సమర్థము. కావుననే నమస్కార్యమైనది. ప్రతిదినము నమస్కరించెదనని కవి చెప్పుచున్నాడు. ఒకసారి నమస్కారము చేసిననే ముక్తి కలుగును గదా. కలుగును. జీవేశ్వరైక్యజ్ఞానోత్పత్తిద్వారమున కలుగును. జీవేశ్వరైక్యజ్ఞానము కలుగు వఱకు నమస్కరించవలసినదే. ఒకసారి త్రికరణశుద్ధిగా నమస్కరించిన వాడికేమియు చేయుట కిష్టపడదు. నమస్కరించుట ఒకటియే చేయగలడు. అమ్మవారి పాదద్వంద్వమునందలి ఉత్కృష్టజ్ఞానము, తన యందు నికృష్టత్వాజ్ఞానము కలసియున్నందున ఆతడే కర్మ చేసినను నమస్కరించుటయే అగును. హస్తపాదాది స్థూలశరీరాంగములతో నమస్కరించుట సార్వకాలికము కాజాలదు. పై జ్ఞానమును పొందుటయే నమస్కారము. అది కలిగిన పిమ్మట నిరంతరాయము గానే హృదయమున నమస్క్రియ జరుగుచునే యుండును. నోటితో నామ సంకీర్తనాదుల నొనర్చు సమయముననను అది హృదయమున జరుగుచుండును. స్థూలదేహక్రియ యేదియు దానికి అంతరాయము కాదు. సూక్ష్మదేహములోని ఉచ్ఛ్వాస నిఃశ్వాసములు దాని కంతరాయము కాజాలవు. నిద్రాస్వప్నముల రాకపోకలకు తన ప్రయత్నమేదియు తన కృతియేదియు ఉండదు గనుక అప్పుడు నమస్కరణము లేకుండుట దోషము కాదు. పూర్వజన్మకర్మవశమున జరుగు ఉన్మాదవిస్మృత్యాదుల సమయమున నమస్కరణము లేకుండుటయు దోషము కాదు. ఈ జ్ఞానము మానసవ్యాపారము. క్షణికము అని భావించినప్పుడు దాని నైర్మల్యముకొఱకు మఱల మఱల నమస్కారము చేయవలెను. ఆ పక్షమున చరమనమస్కారమొక్కటియే జీవేశ్వరైక్యజ్ఞానోత్పత్తిద్వారమున ముక్తి హేతువగును. ఆ చరణనమస్కారమునకు పూర్వపూర్వ నమస్కారములు హేతువులగును. ప్రథమ నమస్కారమునకు పూర్వజన్మసుకృతము కారణము. నమస్కారము ప్రపత్తి కభిన్నమని భావించినపుడొక నమస్కారమే జీవేశ్వరైక్యజ్ఞానహేతువగును. అసకృత్ప్రపత్తివలె

అసకృన్నమస్కారము కూడ ప్రీతివర్ధనద్వారమున సహకారి యగును. కావున ప్రియమైన కర్మ కావున ముక్తికి జీవేశ్వరైక్యజ్ఞానమునకు దాని ఆవశ్యకత అంగీకరింపకున్నను ప్రతిదినము కవి నమస్కరించెద ననుచున్నాడు. అట్టి కర్మయందు ప్రీతి కలుగుట జన్మాంతరసుకృతపరిపాకము. మోక్షమార్గమున నా గతియు మన్దమే. ఆ మన్దగతి పాదములు కలిసియున్నందున తన గతిమాన్ద్యము అపరాధముగా స్వీకరింపరాదని '***గతిషు మన్దమ్***' అను విశేషణము వ్యంజింపజేయుచున్నది. ***జనానామానన్దమ్, జనని జనయన్తమ్*** అను తృతీయ పాదమున ***జకార నకార*** ఆవృత్తిచే వృత్త్యనుప్రాస నామక శబ్దాలంకారము వర్ణమైత్రియు నున్నవి. ***నివసన్తమ్ గిరామన్తే భ్రాన్తమ్ జనయన్తమ్*** అను విశేషణములలో అంత్యప్రాస మున్నది. నౌమి అను నమస్కరణవాచి క్రియ స్తోత్ర సమాప్తి ద్యోతకము.



**అవ:-** పూర్వశ్లోకమున పాదారవిన్ద శతక సమాప్తి చతుర్ధ పాదోపాన్త్యనౌమి పదముతో సూచింపబడినది. ఈ శ్లోకమున నీ శతక జపము యొక్క ఫలము చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఇదం యః కామాక్ష్యాశ్చరణనలినస్తోత్రశతకం**
**జపేన్నిత్యం భక్త్యా నిఖిలజగదాహ్లాదజనకమ్।**
**స విశ్వేషాం వన్ద్యస్సకలకవిలోకైకతిలక-**
**శ్చిరం భుక్త్వా భోగాన్పరిణమతి చిద్రూపకలయా॥ 103**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| నిఖిలజగదాహ్లాదజనకమ్ | = | సర్వలోకములకు సంతోషమును కలిగించు; |
| ఇదమ్ | = | ఈ; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| చరణనలినస్తోత్రశతకమ్ | = | పాదారవిన్ద శతకముగా ప్రసిద్ధమైన స్తోత్రమును; |
| యః | = | ఎవడు; |
| భక్త్యా | = | భక్తిచేత; |
| నిత్యమ్ | = | ప్రతిదినము; |
| జపేత్ | = | జపించునో; |
| సః | = | ఆ భక్తుడు; |
| విశ్వేషామ్ వన్ద్యః | = | విశ్వవంద్యుడు అగును. |
| సకలకవిలోకైకతిలకః | = | కవి మూర్ధన్యుడు అగును; |
| భోగాన్ | = | భోగాలను; |
| చిరమ్ | = | చిరకాలము; |
| భుక్త్వా | = | అనుభవించి; |
| చిద్రూపకలయా | = | చిద్రూపకలగా; |
| పరిణమతి | = | పరిణమించును. |

**తాత్పర్యము :-**

సర్వలోకములకు ఆనందము కలిగించు పాదారవిన్ద శతకమని ప్రసిద్ధిని పొందిన స్తోత్రరూపమైన ఒక్కొక్క శ్లోకము గల నూరు శ్లోకముల గ్రంథము ఎవడు జపించునో వాడు సర్వలోకనమస్కార్యుడు. సకలకవిలోకశ్రేష్ఠుడునునై చిరకాలము భోగముల ననుభవించుచు జీవించి చివఱకు చిత్కలారూపమున పరిణమించును.

**వివరణము :-**

***జపేత్*** అనుట వలన ఈ స్తోత్రమంతయు మాలామన్త్రరూప మని వ్యంగ్యమగుచున్నది. దీనిని కవి ఛందస్సున నిముడునట్లుగా చరణ నలిన స్తోత్ర శతకమని ప్రసిద్ధిని పొందినది. నిఖిలజగదాహ్లాదజనకమ్ అనుటచే సంస్కృతభాష నెఱిగిన వారి కందఱకు ప్రత్యక్షముగా ప్రత్యక్షరపఠనసమయమున పఠనసమాప్తివఱకు ఆహ్లాదము కలిగించు ఉత్తమకవిత్వతత్త్వజ్ఞానభక్తిపరిపూర్ణ శతకమని శతకమును స్తుతించుట పరంపరగా ఆత్మస్తుతి వలె కనబడుచున్నను ఇది ఇందలి ప్రతిపాద్యము దేవీమాహాత్మ్య మగుట వలననే కవి అట్లనినాడు. కాని స్వస్తుతియందు కవికి తాత్పర్యము లేదు అని తన కంతటి భక్తి జ్ఞాన కవిత్వవైశారద్యము అమ్మవారికి తనయందనుగ్రహము కలుగుట చేతనే అని ఆతడు భావించినాడు అని గమనింపవలసియున్నది. ప్రతిదినము ఈ ***మాలామన్త్రరూపస్తోత్రము***యొక్క బహువారావృత్తి సాధ్యము కాకపోయినను త్రివారావృత్తి, దశవారావృత్తి, అష్టావింశతి వారావృత్తి, పంచాశద్వారావృత్తి, శతావారావృత్తి, సహస్రవారావృత్తి యథో చితముగా యథాశక్తి ఆవృత్తి నొనరింపవచ్చును. వాచ్య లక్ష్య వ్యంగ్యార్థాలంకార రసాదులను ప్రతిపాద్య తత్త్వవిచారమును అనుసంధించుచు సాధ్యమైనన్ని పర్యాయములు జపించుట శ్రేష్ఠము. కావున జప సంఖ్యను కవి పేర్కొన లేదు. **నిత్యమ్** అను పదముచే సర్వకాలసర్వావస్థలయందు దీని ననుసంధించుటకు వీలుగా కంఠస్థమై యుండదగి యుండుట వ్యంగ్యమగుచున్నది. **భక్త్యా** అనుటచే కేవలరసాస్వాద చతురసహృదయత చాలదని భావుకుని చిత్తము భక్తి పూర్ణమైనప్పుడు సంపూర్ణ ఫలము కలుగునని వ్యంగ్యమగుచున్నది. సర్వలోకైకవంద్యత, కవిలోకైకశ్రేష్ఠత, బహుభోగానుభవము అను ఈ స్తోత్రజపముయొక్క ఐహికాముష్మిక ఫలములు. **చిర** శబ్దముచే మరణానంతరయశస్సు వ్యంజింపజేయబడుచున్నది. చిద్రూపకలా పరిణతి రూపముక్తి అలౌకిక ఫలము. ***నిత్యమ్ భక్త్యా నిఖిలజగదాహ్లాదజనకమ్*** అనుచోట నిత్య నిఖిల పదాది యందు పదాదిమైత్రి ప్రాసము, మూడవ పాదమున వర్ణమైత్రి ప్రయోగింపబడినవి.

**మూకమహాకవి ప్రణీతంబైన పాదారవిన్ద శతకము, దానికి దోర్బల విశ్వనాథశర్మచే వ్రాయబడిన సారోల్లాసినీ వ్యాఖ్యా సర్వమూ సమ్పూర్ణము.**

**శ్రీః**

# పాదారవిన్దశతకమ్ - శ్లోకానుక్రమణికా

శ్రీః

## మూకపఞ్చశతీ

# స్తుతిశతకమ్

### సారోల్లాసినీ వ్యాఖ్యా



శ్లో॥ పాణ్డిత్యం పరమేశ్వరి! స్తుతివిధౌ నైవాశ్రయన్తే గిరాం
వైరిఞ్చాన్యపి గుమ్ఫనాని విగలద్గర్వాణి శర్వాణి! తే।
స్తోతుం త్వాం పరిపుల్లనీలనలినశ్యామాక్షి! కామాక్షి! మాం
వాచాలీకురుతే తథాపి నితరాం త్వత్పాదసేవాదరః॥ 1



శ్లో॥ తాపిఞ్ఛస్తబకత్విషే తనుభృతాం దారిద్ర్యముద్రాద్విషే
సంసారాఖ్యతమోముషే పురరిపోర్వామాఙ్కసీమాజుషే।
కమ్పాతీరముపేయుషే కవయతాం జిహ్వాకుటీం జగ్ముషే
విశ్వత్రాణపుషే నమోఽస్తు సతతం తస్మై పరఞ్జ్యోతిషే॥ 2



శ్లో॥ యే సన్ధ్యారుణయన్తి శఙ్కరజటాకాన్తారచన్ద్రార్భకం
సిన్దూరన్తి చ యే పురన్దరవధూసీమన్తసీమాన్తరే।
పుణ్యం యే పరిపక్వయన్తి భజతాం కాఞ్చీపురే మామమీ
పాయాసుః పరమేశ్వరప్రణయనీపాదోద్భవాః పాంసవః॥ 3



శ్లో॥ కామాదమ్బరపూరయా శశిరుచా కమ్రస్మితానాం త్విషా
కామారేరనురాగసిన్ధుమధికం కల్లోలితం తన్వతీ।
కామాక్షీతి సమస్తసజ్జననుతా కల్యాణదాత్రీ నృణాం
కారుణ్యాకులమానసా భగవతీ కమ్పాతటే జృమ్భతే॥ 4



శ్లో॥ కామాక్షీణపరాక్రమప్రకటనం సమ్భావయన్తీ దృశా
శ్యామా క్షీరసహోదరస్మితరుచిప్రక్షాళితాశాన్తరా।
వామాక్షీజనమౌళిభూషణమణిర్వాచాం పరా దేవతా
కామాక్షీతి విభాతి కాపి కరుణా కమ్పాతటిన్యాస్తటే॥ 5



శ్లో॥ శ్యామా కాచన చన్ద్రికా త్రిభువనే పుణ్యాత్మనామాననే
సీమాశూన్యకవిత్వవర్షజననీ యా కాపి కాదమ్బినీ।
మారారాతిమనోవిమోహనవిధౌ కాచిత్తమఃకన్దలీ
కామాక్ష్యాః కరుణాకటాక్షలహరీ కామాయ మే కల్పతామ్॥ 6



శ్లో॥ ప్రౌఢధ్వాన్తకదమ్బకే కుముదినీపుణ్యాఙ్కురం దర్శయన్
జ్యోత్స్నాసఙ్గమనేఽపి కోకమిథునమ్మిశ్రం సముద్భావయన్।
కాలిన్దీలహరీదశాం ప్రకటయన్కమ్రాం నభస్యద్భుతాం
కశ్చిన్నేత్రమహోత్సవో విజయతే కాఞ్చీపురే శూలినః॥ 7



శ్లో॥ తన్ద్రాహీనతమాలనీలసుషమైస్తారుణ్యలీలాగృహై-
స్తారానాథకిశోరలాఞ్ఛితకచైస్తామ్రారవిన్దేక్షణైః।
మాతస్సంశ్రయతామ్మనో మనసిజప్రాగల్భ్యనాడిన్ధమైః
కమ్పాతీరచరైర్ఘనస్తనభరైః పుణ్యాఙ్కురైశ్శాఙ్కరైః॥ 8



శ్లో॥ నిత్యం నిశ్చలతాముపేత్య మరుతాం రక్షావిధిం పుష్ణతీ
తేజస్సఞ్చయపాటవేన కిరణానుష్ణద్యుతేర్ముష్ణతీ।
కాఞ్చీమధ్యగతాపి దీప్తిజననీ విశ్వాన్తరే జృమ్భతే
కాచిచ్చిత్రమహో స్మృతాపి తమసాం నిర్వాపికా దీపికా॥ 9



శ్లో॥ కాన్తైః కేశరుచాం చయైర్భ్రమరితం మన్దస్మితైః పుష్పితం
కాన్త్యా పల్లవితం పదామ్బురుహయోర్నేత్రత్విషా పత్రితమ్।
కమ్పాతీరవనాన్తరం విదధతీ కల్యాణజన్మస్థలీ
కాఞ్చీమధ్యమహామణిర్విజయతే కాచిత్కృపాకన్దలీ॥ 10



శ్లో॥ రాకాచన్ద్రసమానకాన్తివదనా నాకాధిరాజస్తుతా
మూకానామపి కుర్వతీ సురధునీనీకాశవాగ్వైభవమ్।
శ్రీకాఞ్చీనగరీవిహారరసికా శోకాపహన్త్రీ సతా-
మేకా పుణ్యపరమ్పరా పశుపతేరాకారిణీ రాజతే॥ 11

శ్లో॥ జాతా శీతలశైలతస్సుకృతినాం దృశ్యా పరం దేహినాం
లోకానాం క్షణమాత్రసంస్మరణతస్సన్తాపవిచ్ఛేదినీ।
ఆశ్చర్యం బహుఖేలనం వితనుతే నైశ్చల్యమాబిభ్రతీ
కమ్పాయాస్తటసీమ్ని కాపి తటినీ కారుణ్యపాథోమయీ॥ 12

శ్లో॥ ఐక్యం యేన విరచ్యతే హరతనౌ దమ్భావపుమ్భావకే
రేఖా యత్కచసీమ్ని శేఖరదశాం నైశాకరీ గాహతే।
ఔన్నత్యమ్ముహురేతి యేన స మహాన్మేనాసఖస్సానుమా-
న్కమ్పాతీరవిహారిణా సశరణాస్తేనైవ ధామ్నా వయమ్॥ 13

శ్లో॥ అక్ష్ణోశ్చ స్తనయోశ్శ్రియా శ్రవణయోర్బాహ్వోశ్చ మూలం స్పృశ-
న్నుత్తంసేన ముఖేన చ ప్రతిదినం ద్రుహ్యన్పయోజన్మనే।
మాధుర్యేణ గిరాం గతేన మృదునా హంసాఙ్గనాం హ్రేపయ-
న్కాఞ్చీసీమ్ని చకాస్తి కోఽపి కవితాసన్తానబీజాఙ్కురః॥ 14

శ్లో॥ ఖణ్డం చాన్ద్రమసం వతంసమనిశం కాఞ్చీపురే ఖేలనం
కాలాయశ్ఛవితస్కరీం తనురుచిం కర్ణేజపే లోచనే।
తారుణ్యోష్మనఖమ్పచం స్తనభరం జఙ్ఘాస్పృశం కున్తలం
భాగ్యం దేశికసఞ్చితమ్మమ కదా సమ్పాదయేదమ్బికే॥ 15

శ్లో॥ తన్వానం నిజకేళిసౌధసరణిం నైసర్గికీణాం గిరాం
కేదారం కవిమల్లసూక్తిలహరీసస్యశ్రియాం శాశ్వతమ్।
అంహోవఞ్చనచఞ్చు కిఞ్చన భజే కాఞ్చీపురీమణ్డనం
పర్యాయచ్ఛవి పాకశాసనమణేః పౌష్పేషవం పౌరుషమ్॥ 16

శ్లో॥ ఆలోకే ముఖపఙ్కజే చ దధతీ సౌధాకరీం చాతురీం
చూడాలఙ్క్రియమాణపఙ్కజవనీవైరాకరప్రక్రియా।
ముగ్ధస్మేరముఖీ ఘనస్తనతటీ మూర్ఛాలమధ్యాఞ్చితా
కాఞ్చీసీమని కామినీ విజయతే కాచిజ్జగన్మోహినీ॥ 17



శ్లో॥ యస్మిన్నమ్బ! భవత్కటాక్షరజనీ మన్దేఽపి మన్దస్మిత-
జ్యోత్స్నాసంస్నపితా భవత్యభిముఖీ తం ప్రత్యహో దేహినమ్।
ద్రాక్షామాక్షికమాధురీమదభరవ్రీడాకరీ వైఖరీ
కామాక్షి! స్వయమాతనోత్యభిసృతిం వామేక్షణేవ క్షణాత్॥ 18



శ్లో॥ కాళిన్దీజలకాన్తయః స్మితరుచిస్వర్వాహినీపాథసి
ప్రౌఢధ్వాన్తరుచః స్ఫుటాధరమహాలౌహిత్యసన్ధ్యోదయే।
మాణిక్యోపలకుణ్డలాంశుశిఖిని వ్యామిశ్రధూమశ్రియః
కల్యాణైకభువః కటాక్షసుషమాః కామాక్షి! రాజన్తి తే। 19



శ్లో॥ కలకలరణత్కాఞ్చీ కాఞ్చీవిభూషణమాలికా
కచభరలసచ్చన్ద్రా చన్ద్రావతంససధర్మిణీ।
కవికులగిరః శ్రావం శ్రావమ్మిలత్పులకాఙ్కురా
విరచిత(పరిచిత)శిరఃకమ్పా కమ్పాతటే పరిశోభతే॥ 20



శ్లో॥ సరసవచసాం వీచీ నీచీభవన్మధుమాధురీ
భరితభువనా కీర్తిర్మూర్తిర్మనోభవజిత్వరీ।
జనని! మనసో యోగ్యం భోగ్యం నృణాం తవ జాయతే
కథమివ వినా కాఞ్చీభూషే! కటాక్షతరఙ్గితమ్॥ 21



శ్లో॥ భ్రమరితసరిత్కూలే నీలోత్పలప్రభయా భయా-
నతజనతమఃఖణ్డీ తుణ్డీరసీమ్ని విజృమ్భతే।
అచలతపసామేకః పాకః ప్రసూనశరాసన-
ప్రతిభటమనోహారీ నారీకులైకశిఖామణిః॥ 22



శ్లో॥ మధురవచసో మన్దస్మేరా మతఙ్గజగామిన-
స్తరుణిమజుషస్తాపిఞ్ఛాభాస్తమఃపరిపన్థినః।
కుచభరనతాః కుర్యుర్భద్రం కురఙ్గవిలోచనాః
కలితకరుణాః కాఞ్చీభాజః కపాలిమహోత్సవాః॥ 23



శ్లో॥ కమలసుషమాకక్ష్యారోహే విచక్షణవీక్షణాః
కుముదసుకృతక్రీడాచూడాలకున్తలబన్ధురాః।
రుచిరరుచిభిస్తాపిఞ్ఛశ్రీప్రపఞ్చనచుఞ్చవః
పురవిజయినః కమ్పాతీరే స్ఫురన్తి మనోరథాః॥ 24



శ్లో॥ కలితరతయః కాఞ్చీలీలావిధౌ కవిమణ్డలీ-
వచనలహరీవాసన్తీనాం వసన్తవిభూతయః।
కుశలవిధయే భూయాసుర్మే కురఙ్గవిలోచనాః
కుసుమవిశిఖారాతేరక్ష్ణాం కుతూహలవిభ్రమాః॥ 25



శ్లో॥ కబలితతమస్కాణ్డాస్తుణ్డీరమణ్డలమణ్డనాః
సరసిజవనీసన్తానానామరున్తుదశేఖరాః।
నయనసరణేర్నేదీయాంసః కదా ను భవన్తి మే
తరుణజలదశ్యామాశ్శమ్భోస్తపఃఫలవిభ్రమాః॥ 26



శ్లో॥ అచరమమిషుం దీనమ్మీనధ్వజస్య ముఖశ్రియా
సరసిజభువో యానమ్మ్లానం గతేన చ మఞ్జునా।
త్రిదశసదసామన్నం ఖిన్నం గిరా చ వితన్వతీ
తిలకయతి సా కమ్పాతీరం త్రిలోచనసున్దరీ॥ 27



శ్లో॥ జనని! భువనే చంక్రమ్యేఽహం కియన్తమనేహసం
కుపురుషకరభ్రష్టైః దుష్టైర్ధనైరుదరమ్భరిః।
తరుణకరుణే తన్ద్రాశూన్యే తరఙ్గయ లోచనే
నమతి మయి తే కిఞ్చిత్కాఞ్చీపురీమణిదీపికే ॥ 28



శ్లో॥ మునిజనమనః పేటీరత్నం స్ఫురత్కరుణానటీ-
విహరణకలాగేహం కాఞ్చీపురీమణిభూషణమ్।
జగతి మహతో మోహవ్యాధేర్నృణాం పరమౌషధం
పురహరదృశాం సాఫల్యమ్మే పురః పరిజృమ్భతామ్ ॥ 29



శ్లో॥ మునిజనమనోధామ్నే ధామ్నే వచోమయజాహ్నవీ-
హిమగిరితటప్రాగ్భాగాయాక్షరాయ పరాత్మనే।
విహరణజుషే కాఞ్చీదేశే మహేశ్వరలోచన-
త్రితయసరసక్రీడాసౌధాఙ్గణాయ నమో నమః॥ 30



శ్లో॥ మరకతరుచాం ప్రత్యాదేశం మహేశ్వరచక్షుషా-
మమృతలహరీపూరం పారం భవాఖ్యపయోనిధేః।
సుచరితఫలం కాఞ్చీభాజో జనస్య పచేలిమం
హిమశిఖరిణో వంశస్యైకమ్ వతంసముపాస్మహే॥ 31



శ్లో॥ ప్రణమనదినారమ్భే కమ్పానదీసఖి తావకే
సరసకవితోన్మేషః పూషా సతాం సముదఞ్చితః।
ప్రతిభటమహాప్రౌఢప్రోద్యత్కవిత్వకుముద్వతీం
నయతి తరసా నిద్రాముద్రాం నగేశ్వరకన్యకే!॥ 32



శ్లో॥ శమితజడిమారమ్భా కమ్పాతటీనికటేచరీ
నిహతదురితస్తోమా సోమార్ధముద్రితకున్తలా।
ఫలితసుమనోవాఞ్ఛా పాఞ్చాయుధీ పరదేవతా
సఫలయతు మే నేత్రే గోత్రేశ్వరప్రియనన్దినీ॥ 33



శ్లో॥ మమ తు ధిషణా పీడ్యా జాడ్యాతిరేక! కథం త్వయా
కుముదసుషమామైత్రీసమ్యగ్వతంసితకున్తలామ్। -
జగతి శమితస్తమ్భాం కమ్పానదీనిలయామసౌ
శ్రయతి హి గలత్తన్ద్రా చన్ద్రావతంససధర్మిణీ॥ 34



శ్లో॥ పరిమలపరీపాకోద్రేకం పయోముచి కాఞ్చనే
శిఖరిణి పునర్ద్వైధీభావం శశిన్యరుణాతపమ్।
అపి చ జనయన్కమ్బోర్లక్ష్మీమనమ్బుని కోఽప్యసౌ
కుసుమధనుషః కాఞ్చీదేశే చకాస్తి పరాక్రమః॥ 35



శ్లో॥ పురదమయితుర్వామోత్సఙ్గస్థలేన రసజ్ఞయా
సరసకవితాభాజాం కాఞ్చీపురోదరసీమయా।
తటపరిసరైర్నీహారాద్రేర్వచోభిరకృత్రిమైః
కిమివ న తులామస్మచ్చేతో మహేశ్వరి! గాహతే॥ 36



శ్లో॥ నయనయుగలీమాస్మాకీనాం కదా ను ఫలేగ్రహీం
విదధతి గతౌ వ్యాకుర్వాణా గజేన్ద్రచమత్క్రియామ్।
మరకతరుచో మాహేశానా ఘనస్తననమ్రితాః
సుకృతవిభవాః ప్రాఞ్చః కాఞ్చీవతంసధురన్ధరాః॥ 37



శ్లో॥ మనసిజయశఃపారమ్పర్యమ్మరన్దఝరీస్రువాం
కవికులగిరాం కన్దం కమ్పానదీతటమణ్డనమ్।
మధురలలితమ్మత్కం చక్షుర్మనీషిమనోహరం
పురవిజయినః సర్వస్వం తత్పురస్కురుతే కదా॥ 38



శ్లో॥ శిథిలితతమోలీలాం నీలారవిన్దవిలోచనాం
దహనవిలసత్ఫాలాం శ్రీకామకోటిముపాస్మహే।
కరధృతలసచ్ఛూలాం కామారిచిత్తమనోహరాం
మనసిజకృపాలీలాం లోలాలకామలికేక్షణామ్॥ 39



శ్లో॥ కలాలీలాశాలా కవికులవచఃకైరవవనీ-
శరజ్జ్యోత్స్నాధారా శశధరశిశుశ్లాఘ్యముకుటీ।
పునీతే నః కమ్పాపులినతటసౌహార్దతరళా
కదా చక్షుర్మార్గం కనకగిరిధానుష్కమహిషీ॥ 40



శ్లో॥ నమః స్తాన్నమ్రేభ్యః స్తనగరిమగర్వేణ గురుణా
దధానేభ్యశ్చూడాభరణమమృతస్యన్ది శిశిరమ్।
సదా వాస్తవ్యేభ్యస్సవిధభువి కమ్పాఖ్యసరితో
యశోవ్యాపారేభ్యస్సుకృతవిభవేభ్యః పశుపతేః॥ 41



శ్లో॥ అసూయన్తీ కాచిన్మరకతరుచో నాకిముకుటీ-
కదమ్బం చుమ్బన్తీ చరణనఖచన్ద్రాంశుపటలైః।
తమోముద్రాం (వి)నిద్రావయతు మమ కాఞ్చీనిలయనా
హరోత్సఙ్గశ్రీమన్మణిగృహమహాదీపకలికా॥ 42



శ్లో॥ అనాద్యన్తా కాచిత్సుజననయనానన్దజననీ
నిరున్ధానా కాన్తిం నిజరుచివిలాసైర్జలముచామ్।
స్మరారేస్తారల్యమ్మనసి జనయన్తీ స్వయమహో
గలత్కమ్పా శమ్పా పరిలసతి కమ్పాపరిసరే॥ 43



శ్లో॥ సుధాడిణ్డీరశ్రీః స్మితరుచిషు తుణ్డీరవిషయం
పరిష్కుర్వాణాసౌ పరిహసితనీలోత్పలరుచిః।
స్తనాభ్యామానమ్రా స్తబకయతు మే కాంక్షితతరుం
దృశామైశానీనాం సుకృతఫలపాణ్డిత్యగరిమా॥ 44



శ్లో॥ కృపాధారాద్రోణీ కృపణధిషణానాం ప్రణమతాం
నిహన్త్రీ సన్తాపం నిగమముకుటోత్తంసకలికా।
పరా కాఞ్చీలీలాపరిచయవతీ పర్వతసుతా
గిరాం నీవీ దేవీ గిరిశపరతన్త్రా విజయతే॥ 45



శ్లో॥ కవిత్వశ్రీకన్దస్సుకృతపరిపాటీ హిమగిరే-
ర్విధాత్రీ విశ్వేషాం విషమశరవీరధ్వజపటీ।
సఖీ కమ్పానద్యాః పదహసితపాథోజయుగలీ
పురాణీ పాయాన్నః పురమథనసామ్రాజ్యపదవీ॥ 46



శ్లో॥ దరిద్రాణా మధ్యే దరదళితతాపిఞ్ఛసుషమా
స్స్వనాభోగక్లాన్తాస్తరుణహరిణాఙ్కాఙ్కితకచాః।
హరాధీనా నానావిబుధముకుటీచుమ్బితపదాః
కదా కమ్పాతీరే కథయ విహరామో గిరిసుతే!॥ 47



శ్లో॥ వరీవర్తు స్థేమా త్వయి మమ గిరాం దేవి! మనసో
నరీనర్తు ప్రౌఢా వదనకమలే వాక్యలహరీ।
చరీచర్తు ప్రజ్ఞాజనని! జడిమా నః పరజనే
సరీసర్తు స్వైరం జనని! మయి కామాక్షి! కరుణా॥ 48



శ్లో॥ క్షణాత్తే కామాక్షి! భ్రమరసుషమాశిక్షణగురుః
కటాక్షవ్యాక్షేపో మమ భవతు మోక్షాయ విపదామ్।
నరీనర్తు స్వైరం వచనలహరీ నిర్జరపురీ-
సరిద్వీచీనీచీకరణపటురాస్యే మమ సదా॥ 49



శ్లో॥ పురస్తాన్మే భూయః ప్రశమనపరః స్తాన్మమ రుజాం
ప్రచారస్తే కమ్పాతటవిహృతిసమ్పాదిని! దృశోః।
ఇమాం యాచ్ఞామూరీకురు సపది దూరీకురు తమః-
పరీపాకమ్మత్కం సపది బుధలోకం చ నయ మామ్॥ 50



శ్లో॥ ఉదఞ్చన్తీ కాఞ్చీనగరనిలయే! త్వత్కరుణయా
సమృద్ధా వాగ్ధాటీ పరిహసితమాధ్వీ కవయతామ్।
ఉపాదత్తే మారప్రతిభటజటాజూటముకుటీ-
కుటీరోల్లాసిన్యాః శతమఖతటిన్యా జయపటీమ్॥ 51



శ్లో॥ శ్రియం విద్యాం దద్యాజ్జనని! నమతాం కీర్తిమమితాం
సుపుత్రాన్ ప్రాదత్తే తవ ఝటితి కామాక్షి! కరుణా।
త్రిలోక్యామాధిక్యం త్రిపురపరిపన్థిప్రణయిని!
ప్రణామస్త్వత్పాదే శమితదురితే! కిం న కురుతే॥ 52



శ్లో॥ మనస్స్తమ్భం స్తమ్భం గమయదుపకమ్పం ప్రణమతాం
సదాలోకం నీలం చికురజితరోలమ్బనికరమ్।
గిరాం దూరం స్మేరం ధృతశశికిశోరం పశుపతే-
ర్దృశాం భోగ్యం యోగ్యం తుహినగిరిభాగ్యం విజయతే॥ 53



శ్లో॥ ఘనశ్యామాన్కామాన్తకమహిషి! కామాక్షి! మధురా-
న్దృశామ్పాతానేతానమృతజలశీతాననుపమాన్।
భవోత్పాతే భీతే మయి వితర నాథే! దృఢభవ-
న్మనశ్శోకే మూకే హిమగిరిపతాకే! కరుణయా॥ 54



శ్లో॥ నతానామ్మన్దానాం భవనిగళబన్ధాకులధియాం
సదాన్ధ్యం రున్ధానామభిలషితసన్తానలతికామ్।
చరన్తీం కమ్పాయాస్తటభువి సవిత్రీం త్రిజగతాం
స్మరామస్తాం నిత్యం స్మరమథనజీవాతుకలికామ్॥ 55



శ్లో॥ పరా విద్యా హృద్యాశ్రితమదనవిద్యా మరకత-
ప్రభానీలా లీలాపరవశితశూలాయుధమనాః।
తమఃపూరం దూరం చరణనతపౌరన్దరపురీ-
మృగాక్షీ కామాక్షీ కమలతరలాక్షీ నయతు మే॥ 56



శ్లో॥ అహన్తాఖ్యా మత్కం కబలయతి యా హన్త హరిణీ
హఠాత్సంవిద్రూపం హరమహిషి! సస్యాఙ్కురమసౌ।
కటాక్షవ్యాక్షేపప్రకటహరిపాషాణపటలై-
రిమాముచ్చైరుచ్చాటయ ఝటితి కామాక్షి! కృపయా॥ 57



శ్లో॥ బుధే వా మూకే వా తవ పతతి యస్మిన్ క్షణమసౌ
కటాక్షః కామాక్షి! ప్రకటజడిమక్షోదపటిమా।
కథఙ్కారం నాస్మై కరముకులచూడాలముకుటా
నమోవాకం బ్రూయుర్నముచిపరిపన్థిప్రభృతయః॥ 58



శ్లో॥ ప్రతీచీం పశ్యామః ప్రకటరుచినీవారకణికా-
ప్రభాసధ్రీచీనాం ప్రదళితషడాధారకమలామ్।
చరన్తీం సౌషుమ్నే పథి పరపదేన్దుప్రవిగల-
త్సుధార్ద్రాం కామాక్షీమ్పరిణతపరంజ్యోతిరుదయామ్॥ 59



శ్లో॥ జమ్భారాతిప్రభృతిముకుటీః పాదయోః పీఠయన్తీ
గుమ్ఫాన్వాచాం కవిజనకృతాన్స్వైరమారామయన్తీ।
శమ్పాలక్ష్మీమ్మణిగణరుచాం పాటలైః ప్రాపయన్తీ
కమ్పాతీరే కవిపరిషదాం జృమ్భతే భాగ్యసీమా॥ 60



శ్లో॥ చన్ద్రాపీడాం చతురవదనాం చఞ్చలాపాఙ్గలీలాం
కున్దస్మేరాం కుచభరనతాం కున్తలోద్ధూతభృఙ్గామ్।
మారారాతేర్మదనశిఖినమ్మాంసలం దీపయన్తీం
కామాక్షీం తాం కవికులగిరాం కల్పవల్లీముపాసే॥ 61



శ్లో॥ కాలామ్భోదప్రకరసుషమాం కాన్తిభిస్తర్జయన్తీ
కల్యాణానాముదయసరణిః కల్పవల్లీ కవీనామ్।
కన్దర్పారేః ప్రియసహచరీ కల్మషాణాం నిహన్త్రీ
కాఞ్చీదేశం తిలకయతి సా కాపి కారుణ్యసీమా॥ 62



శ్లో॥ ఊరీకుర్వన్నురసిజతటే చాతురీం భూధరాణాం
పాథోజానాం నయనయుగలే పారిపన్థ్యం వితన్వన్।
కమ్పాతీరే విహరతి రుచా మోఘయన్మేఘశైలీం
కోకద్వేషం శిరసి కలయన్ కోఽపి విద్యావిశేషః॥ 63



శ్లో॥ కాఞ్చీలీలాపరిచయవతీ కాపి తాపిఞ్ఛలక్ష్మీ-
ర్జాడ్యారణ్యే హుతవహశిఖా జన్మభూమిః కృపాయాః।
మాకన్దశ్రీర్మధురకవితాచాతురీకోకిలానాం
మార్గే భూయాన్మమ నయనయోర్మాన్మథీ కాపి విద్యా॥ 64



శ్లో॥ సేతుర్మాతర్మరకతమయో భక్తిభాజాం భవాబ్ధౌ
లీలాలోలా కువలయమయీ మాన్మథీ వైజయన్తీ।
కాఞ్చీభూషా పశుపతిదృశాం కాపి కాలాఞ్జనాలీ
మత్కం దుఃఖం శిథిలయతు తే మఞ్జులాపాఙ్గమాలా॥ 65



శ్లో॥ వ్యావృణ్వానాః కువలయదలప్రక్రియావైరముద్రాం
వ్యాకుర్వాణా మనసిజమహారాజసామ్రాజ్యలక్ష్మీమ్।
కాఞ్చీలీలావిహృతిరసికే కాంక్షితం నః క్రియాసు-
ర్బన్ధచ్ఛేదే తవ నియమినాం బద్ధదీక్షాః కటాక్షాః॥ 66



శ్లో॥ కాలామ్భోదే శశిరుచి దలం కైతకం దర్శయన్తీ
మధ్యేసౌదామని మధులిహాం మాలికాం రాజయన్తీ।
హంసారావం వికచకమలే మఞ్జుముల్లాసయన్తీ
కమ్పాతీరే విలసతి నవా కాపి కారుణ్యలక్ష్మీః॥ 67



శ్లో॥ చిత్రం చిత్రం నిజమృదుతయా భర్త్సయన్పల్లవాలీం
పుంసాం కామాన్భువి చ నియతమ్ పూరయన్పుణ్యభాజామ్।
జాతశ్శైలాన్నతు జలనిధేః స్వైరసఞ్చారశీలః
కాఞ్చీభూషా కలయతు శివం కోఽపి చిన్తామణిర్మే॥ 68



శ్లో॥ తామ్రామ్భోజం జలదనికటే తత్ర బన్ధూకపుష్పం
తస్మిన్మల్లీకుసుమసుషమాం తత్ర వీణానినాదమ్।
వ్యావృణ్వానాః సుకృతలహరీ కాపి కాఞ్చీనగర్యా-
మైశానీ సా కలయతితరామైన్ద్రజాలం విలాసమ్॥ 69



శ్లో॥ ఆహారాంశం త్రిదశసదసామాశ్రయే చాతకానా-
మాకాశోపర్యపి చ కలయన్నాలయం తుఙ్గమేషామ్।
కమ్పాతీరే విహరతితరాం కామధేనుః కవీనాం
మన్దస్మేరో మదననిగమప్రక్రియాసమ్ప్రదాయః॥ 70



శ్లో॥ ఆర్ద్రీభూతైరవిరలకృపైరాత్తలీలావిలాసై-
రాస్థాపూర్ణైరధికచపలైరఞ్చితామ్భోజశిల్పైః।
కాన్తైర్లక్ష్మీలలితభవనైః కాన్తికైవల్యసారైః
కాశ్మల్యం నః కబలయతు సా కామకోటీ కటాక్షైః॥ 71

శ్లో॥ ఆధున్వత్యై తరలనయనైరాఙ్గజీం వైజయన్తీ-
మానన్దిన్యై నిజపదజుషామాత్తకాఞ్చీపురాయై।
అస్మాకీనం హృదయమఖిలైరాగమానాం ప్రపఞ్చై
రారాధ్యాయై స్పృహయతితరామాదిమాయై జనన్యై॥ 72

శ్లో॥ దూరం వాచాం త్రిదశసదసాం దుఃఖసిన్ధోస్తరిత్రం
మోహక్ష్వేళక్షితిరుహవనే తీక్ష్ణధారం కుఠారమ్।
కమ్పాతీరే ప్రణయకవిభిర్వర్ణితోద్యచ్చరిత్రం
శాన్త్యై సేవే సకలవిపదాం శాఙ్కరం తత్కళత్రమ్॥ 73

శ్లో॥ ఖణ్డీకృత్య ప్రకృతికుటిలం కల్మషం ప్రాతభశ్రీ-
శుణ్డీరత్వం నిజపదజుషాం శూన్యతన్ద్రం దిశన్తీ।
తుణ్డీరాఖ్యే మహతి విషయే స్వర్ణవృష్టిప్రదాత్రీ
చణ్డీ దేవీ కలయతి రతిం చన్ద్రచూడాలచూలీ॥ 74

శ్లో॥ యేన ఖ్యాతే భవతి స గృహీ పూరుషో మేరుధన్వా
యద్దృక్కోణే మదననిగమప్రాభవం బోభవీతి।
యత్ప్రీత్యైవ త్రిజగదధిపో జృమ్భతే కిమ్పచానః
కమ్పాతీరే స జయతి మహాన్ కశ్చిదోజోవిశేషః॥ 75

శ్లో॥ ధన్యాధన్యా గతిరిహ గిరాం దేవి! కామాక్షి! కా మే
నిన్ద్యాం భిన్ద్యాత్సపది జడతాం కల్మషాదున్మిషన్తీమ్।
సాధ్వీ మాధ్వీరసమధురతాభఞ్జనీ మఞ్జురీతి-
ర్వాణీవేణీ ఝటితి వృణుతాత్ స్వర్ధునీస్పర్ధినీ మామ్॥ 76

శ్లో॥ యస్యా వాటీ హృదయకమలం కౌసుమీ యోగభాజాం
యస్యాః పీఠీ సతతశిశిరా శీకరైర్మాకరన్దైః।
యస్యాః పేటీ శ్రుతిపరిచలన్మౌళిరత్నస్య కాఞ్చీ
సా మే సోమాభరణమహిషీ సాధయేత్కాంక్షితాని॥ 77



శ్లో॥ ఏకా మాతా సకలజగతామేయుషీ ధ్యానముద్రా-
మేకామ్రాధీశ్వరచరణయోరేకతానా సమిన్ధే।
తాటఙ్కోద్యన్మణిగణరుచా తామ్రకర్ణప్రదేశా
తారుణ్యశ్రీస్తబకితరుచా తాపసీ కాపి బాలా॥ 78



శ్లో॥ దన్తాదన్తిప్రకటనకరీ దన్తిభిర్మన్దయానై-
ర్మన్దారాణామ్మదపరిణతిమ్మథ్నతీ మన్దహాసైః।
అఙ్కూరాభ్యామ్మనసిజతరోరఙ్కితోరాః కుచాభ్యా-
మన్తఃకాఞ్చి స్ఫురతి జగతామాదిమా కాపి మాతా॥ 79



శ్లో॥ త్రియమ్బకకుటుమ్బినీం త్రిపురసున్దరీమిన్దిరాం
పులిన్దపతిసున్దరీం త్రిపురభైరవీం భారతీమ్।
మతఙ్గకులనాయికామ్మహిషమర్దినీమ్మాతృకాం
భణన్తి విబుధోత్తమా విహృతిమేవ కామాక్షి! తే॥ 80



శ్లో॥ మహామునిమనోనటీ మహితరమ్యకమ్పాతటీ-
కుటీరకవిహారిణీ కుటిలబోధసంహారిణీ।
సదా భవతు కామినీ సకలదేహినాం స్వామినీ
కృపాతిశయకిఙ్కరీ మమ విభూతయే శాఙ్కరీ॥ 81



శ్లో॥ జడాః ప్రకృతినిర్ధనా జనవిలోచనారున్తుదా
నరా జనని! వీక్షణాం క్షణమవాప్య కామాక్షి! తే!
వచస్సు మధుమాధురీం ప్రకటయన్తి పౌరన్దరీ-
విభూతిషు విడమ్బనాం వపుషి మాన్మథీం ప్రక్రియామ్॥ 82



శ్లో॥ ఘనస్తనతటస్ఫుటస్ఫురితకఞ్చులీ చఞ్చలీ-
కృతత్రిపురశాసనా సుజనశీలితోపాసనా।
దృశోస్సరణిమశ్నుతే మమ కదా ను కాఞ్చీపురే
పరా పరమయోగినామ్మనసి చిత్కలా పుష్కలా॥ 83

శ్లో॥ కవీన్ద్రహృదయేచరీ పరిగృహీతకాఞ్చీపురీ
నిరూఢకరుణాఝరీ నిఖిలలోకరక్షాకరీ।
మనఃపథదవీయసీ మదనశాసనప్రేయసీ
మహాగుణగరీయసీ మమ దృశోఽస్తు నేదీయసీ॥ 84

శ్లో॥ ధనేన న రమామహే ఖలజనాన్న సేవామహే
న చాపలమయామహే భవభయాన్న దూయామహే।
స్థిరాం తనుమహేతరాం మనసి కిఞ్చ కాఞ్చీరత-
స్మరాన్తకకుటుమ్బినీచరణపల్లవోపాసనామ్॥ 85

శ్లో॥ సురాః పరిజనా వపుర్మనసిజాయ వైరాయతే
త్రివిష్టపనితమ్బినీకుచతటీ చ కేలీగిరిః।
గిరస్సురభయో వయస్తరుణిమా దరిద్రస్య చ
కటాక్షసరణౌ క్షణం నిపతితస్య కామాక్షి! తే॥ 86

శ్లో॥ పవిత్రయ జగత్త్రయీవిబుధబోధజీవాతుభిః
పురత్రయవిమర్దినః పులకకఞ్చులీదాయిభిః।
భవక్షయవిచక్షణైర్వ్యసనమోక్షణైర్వీక్షణై-
ర్నిరక్షరశిరోమణిం కరుణయైవ కామాక్షి! మామ్॥ 87

శ్లో॥ కదా కలితఖేలనాః కరుణయైవ కాఞ్చీపురే
కలాయముకులత్విషః శుభకదమ్బపూర్ణాఙ్కురాః।
పయోధరభరాలసాః కవిజనేషు తే బన్ధురాః
పచేలిమకృపారసాః పరిపతన్తి మార్గే దృశోః॥ 88

శ్లో॥ అశోధ్యమచలోద్భవం హృదయనన్దనం దేహినా-
మనర్ఘమధికాఞ్చి తత్కిమపి రత్నముద్ద్యోతతే।
అనేన సమలఙ్కృతా జయతి శఙ్కరాఙ్కస్థలీ
కదాఽస్య మమ మానసం వ్రజతి పేటికావిభ్రమమ్॥ 89



శ్లో॥ పరామృతరసప్లుతా జగతి నిత్యమన్తశ్చరీ
నృణామపి బహిశ్చరీ పరమసంవిదేకాత్మికా।
మహద్భిరపరోక్షితా సతతమేవ కాఞ్చీపురే
మమాన్వహమహమ్మతిర్మనసి భాతు మాహేశ్వరీ॥ 90



శ్లో॥ తమోవిపినధావినం సతతమేవ కాఞ్చీపురే
విహారరసికా పరా పరమసంవిదుర్వీరుహే।
కటాక్షనిగలైర్దృఢం హృదయదుష్టదన్తావలం
చిరం నయతు మామకం త్రిపురవైరిసీమన్తినీ॥ 91



శ్లో॥ త్వమేవ సతి! చణ్డికా త్వమిహ దేవి! చాముణ్డికా
త్వమేవ పరమాతృకా త్వమసి యోగినీరూపిణీ।
త్వమేవ కిల శామ్భవీ త్వమసి కామకోటీ జయా
త్వమేవ విజయా త్వయి త్రిజగదమ్బ! కిం బ్రూమహే॥ 92



శ్లో॥ పరే! జనని! పార్వతి! ప్రణతపాలిని! ప్రాతిభ-
ప్రదాత్రి! పరమేశ్వరి! త్రిజగదాశ్రితే! శాశ్వతే!।
త్రియమ్బకకుటుమ్బిని! త్రిపదసఙ్గిని! త్రీక్షణే!
త్రిశక్తిమయి! వీక్షణమ్మయి నిధేహి కామాక్షి! తే॥ 93



శ్లో॥ మనోమధుకరోత్సవం విదధతీ మనీషాజుషాం
స్వయమ్ప్రభవవైఖరీవిపినవేదికాలమ్బినీ।
సదా శిశిరితా కృపామధురసేన కమ్పాతటే
చరాచరవిధాయినీ చరతి కాపి చిన్మఞ్జరీ॥ 94



శ్లో॥ కలావతి కలాభృతో ముకుటసీమ్ని లీలావతి
స్పృహావతి మహేశ్వరే భువనమోహనే భాస్వతి।
ప్రభావతి రమే సదా మహితరూపశోభావతి
త్వరావతి పరే సతాం గురుకృపామ్బుధారావతి॥ 95



శ్లో॥ త్వయైవ జగదమ్బయా భువనమణ్డలం సూయతే
త్వయైవ కరుణార్ద్రయా తదపి రక్షణం నీయతే।
త్వయైవ ఖరకోపయా నయనపావకే హూయతే
త్వయైవ కిల నిత్యయా జగతి సన్తతం స్థీయతే॥ 96



శ్లో॥ చరాచరవిచిన్మయీం సకలహృన్మయీం చిన్మయీం
గుణత్రయమయీం జగత్త్రయమయీం త్రిధామామయీమ్।
పరాపరమయీం సదా దశదిశాం నిశాహర్మయీం
పరాం సతత సన్మయీం పరమచిన్మయీం శీలయే॥ 97



శ్లో॥ జయ జగదమ్బికే! హరకుటుమ్బిని! నేత్రరుచా
జితశరదమ్బుజే! ఘనవిడమ్బిని! కేశరుచా।
పరమవలమ్బనం కురు సదా పరరూపధరే!
మమ గతసంవిదో జడిమడమ్బరతాణ్డవినః॥ 98



శ్లో॥ భువనజనని! భూషాభూతచన్ద్రే! నమస్తే
కలుషశమని! కమ్పాతీరగేహే! నమస్తే।
నిఖిలనిగమవేద్యే! నిత్యరూపే! నమస్తే
పరశివమయి! పాశచ్ఛేదహస్తే! నమస్తే॥ 99



శ్లో॥ క్వణత్కాఞ్చీ కాఞ్చీపురమణివిపఞ్చీలయఝరీ-
శిరఃకమ్పా కమ్పావసతిరనుకమ్పాజలనిధిః।
ఘనశ్యామా శ్యామా కఠినకుచసీమా మనసి మే
మృగాక్షీ కామాక్షీ హరనటనసాక్షీ విహరతామ్॥ 100



శ్లో॥ సమరవిజయకోటీ సాధకానన్దధాటీ
మృదుగుణమణిపేటీ ముఖ్యకాదమ్బవాటీ।
మునినుతపరిపాటీ మోహితాజాణ్డకోటీ
పరమశివవధూటీ పాతు మాం కామకోటీ॥ 101



శ్లో॥ ఇమం పరవరప్రదం ప్రకృతిపేశలం పావనం
పరాపరచిదాకృతిప్రకటనప్రదీపాయితమ్।
స్తవం పఠతి నిత్యదామనసి భావయన్నమ్బికాం
జపైరలమలం మఖైరధికదేహసంశోషణైః॥ 102



శ్రీః

# మూకపఞ్చశతీ

# స్తుతిశతకమ్

## సారోల్లాసినీ వ్యాఖ్యా



అవ:- మూకమహాకవి పాదారవిన్దశతకానంతరము స్తుతిశతకము నీ క్రింది శ్లోకముతో నారంభించుచున్నాడు.

**శ్లో॥ పాణ్డిత్యం పరమేశ్వరి! స్తుతివిధౌ నైవాశ్రయన్తే గిరాం**
**వైరిఞ్చాన్యపి గుమ్ఫనాని విగలద్గర్వాణి శర్వాణి! తే।**
**స్తోతుం త్వామ్ పరిఫుల్లనీలనలినశ్యామాక్షి! కామాక్షి! మాం**
**వాచాలీకురుతే తథాపి నితరాం త్వత్పాదసేవాదరః॥ 1**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| పరమేశ్వరి | = | పరమైశ్వర్యము గలదానా! |
| పరిఫుల్లనీలనలినశ్యామాక్షి | = | వికసించిన నల్లకలువలవలె నల్లనైన కన్నులుగల; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| శర్వాణి | = | ఓ శివుని యిల్లాలా! |
| తే | = | నీయొక్క; |
| స్తుతివిధౌ | = | స్తుతించుట అను క్రియయందు; |
| విగలద్గర్వాణి | = | జారుచున్న గర్వముగల; |
| వైరించాని | = | బ్రహ్మకు సంబంధించిన; |
| గిరామ్ | = | వాక్కులయొక్క; |
| గుమ్ఫనాని అపి | = | గుమ్ఫనములు కూడ; |
| పాణ్డిత్యమ్ | = | పాండిత్యమును; |
| న+ఏవ+ఆశ్రయన్తే | = | ఆశ్రయించుట లేదు; |
| తథా+అపి | = | అయినను; |
| త్వత్పాదసేవాదరః | = | నీ పాదసేవ యందలి ఆదరము; |
| త్వామ్ | = | నిన్ను; |

| | | |
|---|---|---|
| స్తోతుమ్ | = | స్తుతించుటకు; |
| మామ్ | = | నన్ను; |
| నితరామ్ | = | మిక్కిలి; |
| వాచాలీకురుతే | = | వాగు వానినిగా చేయుచున్నది. |

**తాత్పర్యము :-**

అమ్మవారిని స్తుతించుటలో బ్రహ్మదేవుని వాగ్గుంఫనములును గర్వహీనములై తమ పాండిత్యము నాశ్రయింపజాలకున్నవి. అట్టి అమ్మవారిని స్తుతించుటకు ఆమె పాదసేవాదరమే కవిని ప్రేరేపించుచున్నది.

**వివరణము :-**

1) పాదారవిన్దశతకమును ముగించిన మూకమహాకవికి అమ్మవారి పాదముల సేవించు నాదరము ఇంకను తగ్గలేదు. స్తుతించుట అమ్మవారి పాద సేవాదరమును ప్రకటించుటయే యని ఆయన అభిప్రాయము. విగ్రహము నందలి అమ్మవారి పాదములను సేవించుటలో ఆతని కాదరమున్నది. **పాదోస్య విశ్వా భూతాని** అను శ్రుతి వాక్యము ననుసరించి విశ్వభూతములను అనగా ప్రపంచములోని అన్ని ప్రాణులను, అప్రాణులను, జడచేతనములను సేవించుటలో కవి కాదరమున్నదని చెప్పవచ్చును. అంశపంచకములోని రెండు అంశములు నామరూపములు అనగా శబ్దార్థములు లేక వాగర్థములు లేక పార్వతీ పరమేశ్వరరూపములు. అవి సత్యజ్ఞానానందములు అను మూడు అంశముల వివర్తములు అయినను అవి ఒకదానిని విడచి మరొకటి చెప్పదగిన అంశత్రయభిన్నమైన అంశద్వయముయొక్క వాగంశములోని అంశాంకము శ్లోకము. దానిలోని రెండు అర్థములు అనగా పూర్వార్థోత్తరార్థములు అమ్మవారి అంశములు కావున పాదములే. పాదము అనగా నాలుగవ అంశము అని అర్థము. అయినను ఇచట సామాన్యముగా అంశమనియే గ్రహింపబడవచ్చును. పార్వతీరూపమైన పద్యముయొక్క పూర్వార్థోత్తరార్థములు ఆమె రెండు పాదములు. వానిని సేవించు నాదరము అనగా వాఙ్మయ రచనము నందలి అనగా స్తోత్ర వాఙ్మయరచనము నందలి ఆదరమే అగును. లేక పార్వతీపరమేశ్వరుల నాలుగు పాదములు గలది పద్యము. వారిరువురు అభిన్నులే. కావున పద్యము ఆమె పాదస్తుతియే. పాదసేవాదరమే. పదములవలన వాక్కు (పాదము) యేర్పడును. వాక్కు పార్వతియే యని ఇంతకుముందు చెప్పబడినది. వాఙ్మయమంతయు పరోక్షముగా పరమేశ్వరీరూపమే. పరమేశ్వరస్తుతి రూపమే. తదభిన్నపరమేశ్వరీ స్తుతిరూపమే. పదములు పరమేశ్వరస్తుత్యంశములే. పరమేశ్వరీస్తుత్యంశములే. పరోక్షముగ వాఙ్మయమంతయు స్తుతిరూపమే. పాదసేవాదర ప్రేరితమే. స్తోత్ర వాఙ్మయము ప్రత్యక్షస్తుతిరూపము. పాదారవిన్దస్తుతిశతకానంతర మమ్మవారి అవయవములలో నేయొక్క దానినో గాక మొత్త మమ్మవారిని స్తుతించు శతకమును కవి ఆరంభించుచున్నాడు. సత్యజ్ఞానానందములు బ్రహ్మాంశత్రయము. తద్వివర్తములగుటచే నామరూపముల

నేకాంశముగా పరిగణింపవచ్చును. అమ్మవారి (పరమేశ్వరుని) రూపస్తుతి ఈ విధముగా నాల్గవ అంశమే. కావున ఆమె పాదసేవాదరమే కవి నామె స్తోత్ర మొనరింప బ్రేరేపించుచున్నది. వైదికసరస్వతికి ఛందస్సు పాదములని చెప్పబడినందున పద్యరచన ఆమె పాదసేవాదరమే. తదర్థమును అనగా పొగడ్తను చేయుటకు ఆ పాదసేవాదరమే ప్రేరేపించుచున్నది. వేదము పరమేశ్వరీస్తుతియే. పరమేశ్వరీప్రాప్తిని పరంపరా హేతువులైన కర్మోపాసనాదులను విధించు యజురాది వేదములును పరంపరగ పరమేశ్వరీ స్తుతిరూపములే. వివిధ దేవతలు **అంగాన్యన్యా దేవతాః** తై. 1.5.1 అను శ్రుతి వాక్కు ననుసరించి ఋగ్వేదము అను హస్తపాదాది (ఇంద్ర విష్ణ్వాది) స్తుతినే యొనరించినందున ఋగ్వేదము అమ్మవారి స్తుతియని వేఱుగా చెప్పనక్కఱలేదు. అట్టి వేదములు బ్రహ్మముఖనిర్గతములు. కావున అవి బ్రహ్మయొక్క గీర్గుమ్ఫనములే. వాగ్గుమ్ఫనములే. అవియు పాండిత్యము నాశ్రయించుట లేదనగా ఆమె కృప నాశ్రయించియే స్తుతించినవని భావము. స్తుత్యర్థకగృధాతు 'నిష్పన్నగిరామ్' శబ్దప్రయోగము భావాభివ్యక్తికి హేతువు. బ్రహ్మదేవునకే అమ్మవారి కృప నాశ్రయింపక స్తుతింప సాధ్యము కానపుడు మానవకవియైన తన సంగతి చెప్పనక్కఱలేదను భావము అనదగిన కైమత్యన్యాయ మీ శ్లోకమున ధ్వనించుచున్నది. 1) విగలద్గర్వాణి శర్వాణి, 2) పరిఫుల్ల నీలనలిన శ్యామాక్షి కామాక్షి 3) పాదసేవాదర అను పదబంధములలో వృత్త్యనుప్రాసమను శబ్దాలంకారమున్నది. నడిమి పదబంధమందు లుప్తోపమాలంకారమున్నది.

2) సూర్యాశ్వైర్యది మః సజౌ సతతగాః శార్దూలవిక్రీడితమ్, ఇతి లక్షణమ్।



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదసేవాదరముయొక్క మూకవాచాలీకరణము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమెయొక్క వాచారూప నమస్సు చెప్పబడుచున్నది.

**శ్లో॥ తాపిఞ్ఛస్తబకత్విషే తనుభృతాం దారిద్ర్యముద్రాద్విషే**
**సంసారాఖ్యతమోముషే పురరిపోర్వామాఙ్కసీమాజుషే।**
**కమ్పాతీరముపేయుషే కవయతాం జిహ్వాకుటీం జగ్ముషే**
**విశ్వత్రాణపుషే నమోఽస్తు సతతం తస్మై పరఞ్జ్యోతిషే॥ 2**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| తాఫింఛస్తబకత్విషే | = | తమాలస్తబకముల కాంతివంటి కాంతిగల; |
| తనుభృతామ్ | = | శరీరధారులయొక్క; |
| దారిద్ర్యముద్రాద్విషే | = | దారిద్ర్యముద్రను ద్వేషించు; |
| సంసారాఖ్యతమోముషే | = | సంసారమను పేరుగల అంధకారమును అపహరించు; |
| పురరిపోః | = | పురద్వేషియైన శివునియొక్క; |

| | | |
|---|---|---|
| వామాంకసీమాజుషే | = | ఎడమతొడ ప్రదేశము నందున్న; |
| కమ్పాతీరమ్ | = | కమ్పానదీతీరమును; |
| ఉపేయుషే | = | సమీపించిన; |
| కవయతామ్ | = | కవులయొక్క; |
| జిహ్వాకుటీమ్ | = | నాలుకయను గుడిసెను; |
| జగ్ముషే | = | పొందు; |
| విశ్వత్రాణపుషే | = | విశ్వమును రక్షించి పోషించు; |
| తస్మై | = | ఆ; |
| పరంజ్యోతిషే | = | పరప్రకాశము కొఱకు; |
| సతతమ్ | = | ఎల్లప్పుడు; |
| నమః | = | నమస్సు; |
| అస్తు | = | అగుగాక! |

**తాత్పర్యము :-**

అమ్మవారు తమాలపుష్పస్తబకముల కాంతివంటి కాంతిగలది. మనుష్యుల పేదరికమును పోద్రోలునది. సంసారము అను అంధకారమును దూరమొనర్చునది. శివునెడమ తొడపై కూర్చొను నట్టిది. కమ్పాతీరసమీపమున నున్నట్టిది. విశ్వమును రక్షించి పోషించునది. అట్టి పరంజ్యోతిః స్వరూపిణియైన అమ్మవారికి ఎల్లప్పుడు మ్రొక్కుచుండెదను.

**వివరణము :-**

తమాలవృక్షమునకు చీకటి చెట్టని పేరు. దాని పూలకాంతివంటి కాంతిగల దమ్మవారనుటచే లుప్తోపమాలంకారమేర్పడియున్నది. మనుష్యుల దారిద్ర్యముద్రను అనగా పేదరిక లక్షణమును తొలగించునదనుటచే ఆమె లక్ష్మీ స్వరూపిణి యని ధ్వనించుచున్నది. సంసారాంధకారమును దూరము చేయున దనుటచే ఆమె జ్ఞాన (సరస్వతి) రూపిణియని ధ్వనించుచున్నది. శివుని వామాంకమునందుండునట్టిదనుటచే ఆమె పార్వతియని ధ్వనించుచున్నది. కమ్పాతీరమును చేరుకొన్నదనుటచేత ఆమెకు తనలోకమునకంటె కమ్పాతీరప్రదేశము నందధిక ప్రేమయున్నదని ధ్వనించుచున్నది. కవుల నాల్కల (గుడిసెల) యందున్నదనుటచేత ఆమె వాగ్రూపిణి (సరస్వతి)యని ధ్వనించుచున్నది. విశ్వత్రాణపుషే అనుటచే విశ్వమును రక్షించు విష్ణువునకు సైతము పోషికయని వ్యక్తమగుచున్నది. అమ్మవారు పరంజ్యోతిఃస్వరూపురాలనుటచే తారా సూర్యచంద్రాది జ్యోతిస్సులు చేరలేని హృదయగుహలోనికామె చేరునని వ్యక్తమగుచున్నది. పెక్కుపదములు షేకారమంతమందు గల వగుటచే నీ శ్లోకమున పదాంతానుప్రాసమను శబ్దాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు పరంజ్యోతిఃస్వరూపిణిగా వర్ణింపబడినది. పరంజ్యోతి యందు పరదేవతాపాదరజోదర్శన మీ క్రింది శ్లోకమున చేయబడుచున్నది.

**శ్లో॥ యే సన్ధ్యారుణయన్తి శఙ్కరజటాకాన్తారచన్ద్రార్భకం**
**సిన్దూరన్తి చ యే పురన్దరవధూసీమన్తసీమాన్తరే।**
**పుణ్యం యే పరిపక్వయన్తి భజతాం కాఞ్చీపురే మామమీ**
**పాయాసుః పరమేశ్వరప్రణయినీపాదోద్భవాః పాంసవః॥ 3**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| యే | = ఏవి; |
| శంకరజటాకాంతారచంద్రార్భకమ్ | = శివుని జడల అడవిలోని బాలచంద్రుని; |
| సంధ్యారుణయన్తి | = సంధ్యాకాలసూర్యునిగా నొనర్చుచున్నవో; |
| యే | = ఏవి; |
| పురందరవధూసీమంతసీమాంతరే | = శచీదేవియొక్క పాపటహద్దుయొక్క లోపలి భాగమున; |
| సిందూరన్తి | = సిందూరములగుచున్నవో; |
| చ | = మరియు; |
| యే | = ఏవి; |
| కాంచీపురే | = కాంచీపురమున; |
| భజతామ్ | = సేవించువారి; |
| పుణ్యమ్ | = పుణ్యమును; |
| పరిపక్వయన్తి | = పండించుచున్నవో, (తే-అ); |
| అమీ | = ఈ; |
| పరమేశ్వరప్రణయినీపాదోద్భవాః | = పరమేశ్వరుని ప్రియురాలైన కామాక్షీ పాదములందు పుట్టిన; |
| పాంసవః | = పరాగములు; |
| మామ్ | = నన్ను; |
| పాయాసుః | = కాపాడుగాక! |

**తాత్పర్యము :-**

అమ్మవారి పాద పరాగములు శివుని జడల అడవిలోని బాలచంద్రుని సంధ్యారుణునిగా నొనరించుచున్నవి. శచీదేవి పాపటలో సిందూరములగు చున్నవి. సేవించువారి పున్నెమును పండించుచున్నవి. అట్టి ఆ పాదరేణువులు నన్ను కాపాడుగాక!

**వివరణము :-**

శివుని జడలడవియని ఆరోపించుటచే రూపకాలంకార మేర్పడి యున్నది.

అందొక బాలుడు బాలచంద్రుడు. నెలబాలుడు పడియున్నాడు. పడి లేచి భ్రమించు చున్నాడు. వాని యొడలంతయు దుమ్ము కొట్టబడియున్నది. ఆ దుమ్ము ఎట్లు వచ్చినది? శివుడమ్మవారి పాదములపై బడినాడు. ఆతని తల ఆమె పాదములపై బడియున్నది. ఆ తలలో జటాజూటమునందలి చంద్రునిపై ఆ పాదముల దుమ్ము పడినది. ఆ దుమ్ము సంధ్యాకాలమువలె ఎఱ్ఱగా నున్నది. ఆ చంద్రుడు ఎఱ్ఱబడినాడు. సంధ్యారుణుడైనాడు. అసలాయన సంధ్యాకాల సూర్యుడేమో అను భ్రమ కలుగజేయుచున్నాడు అను భ్రాంతిమదలంకారధ్వని ఈ శ్లోక ప్రథమ పాదమందున్నది. అడవిలో భ్రమించు బాలవృత్తాంతస్ఫూర్తి ఉండుటచే సమాసోక్త్యలంకారధ్వనియు నిందున్నది. ఆమె పాదముల పాంసువులు చంద్రుని సూర్యునొనరించుట అఘటితఘటనము నొనర్చుట అను అంశమును, దాని ద్వారమున ఆ పాదపాంసువుల అఘటితఘటనా పాటవమును ధ్వనించుచున్నవి. శివుని పాదప్రణతు జేయు అమ్మవారి సౌభాగ్యము వ్యంగ్యమగుచున్నది. **సంధ్యారుణయన్తి** అను పదముచేత ఉపమాలంకారము వాచ్యమగుచున్నది. రెండవ పాదమున **సిందూరన్తి** అను పదము చేత శచీదేవి యందలి సిందూరమా అన్నట్లు ఆ పాదపరాగ మున్నదను సంభావన వాచ్యమగుటచే ఉత్ప్రేక్షాలంకార మున్నది. దానిచేత శచీదేవి వంటి దేవతా వధువులచే ఆమె నమస్కరింపబడు ఆ పాదమహిమ వ్యక్తమగుచున్నది. మూడవ పాదమున ఆమె పాదాంసువుల సేవించువారి పుణ్యముల పండించు ననుట చేత భక్తులకు కలుగనున్న పరమసౌఖ్యము వ్యంగ్యమగుచున్నది. వారి పూర్వార్జిత పుణ్యమునకు స్వయముగా పండుశక్తి లేదని దానికి భగవదానుకూల్యమే ఆవశ్యకమని వ్యక్తమగుచున్నది. పరమేశ్వరప్రణయినీ అను సమాసమున ప్రాపణార్థక నీ ధాతువునుండి పుట్టిన శబ్దముండుటచే పరమేశ్వరుని కడకు భక్తులను జేర్చుటయే ఆమె ప్రధానకృత్యమను వ్యంగ్యము స్ఫురించుచున్నది. పాదపాంసువులకే ఇంత సామర్థ్య ముండగా ఇక ఆమె మహిమనేమని వర్ణింప గలమను ఆ మహిమ అనిర్వాచ్యత వ్యక్తమగుచున్నది. సిందూరన్తి పురందర, సీమంత సీమాంతరే అను పద ద్వంద్వములలో వృత్త్యనుప్రాసమను శబ్దాలంకార మున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు పరమేశ్వరప్రణయము కలది అని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ ప్రణయము వివరింపబడుచున్నది.

**శ్లో॥ కామాదమ్బరపూరయా శశిరుచా కమ్రస్మితానాం త్విషా**
**కామారేరనురాగసిన్ధుమధికం కల్లోలితం తన్వతీ।**
**కామాక్షీతి సమస్తసజ్జననుతా కల్యాణదాత్రీ నృణాం**
**కారుణ్యాకులమానసా భగవతీ కమ్పాతటే జృమ్భతే॥** **4**

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| కామాడమ్బరపూరయా | = | కామాడంబరము నిండిన; |
| శశిరుచా | = | చంద్రకాంతి గలిగిన; |
| క్రమస్మితానామ్ | = | మనోహరమైన చిఱునవ్వులయొక్క; |
| త్విషా | = | కాంతిచేత; |
| కామారేః | = | శివునియొక్క; |
| అనురాగసిన్ధుమ్ | = | ప్రణయసముద్రమును; |
| అధికమ్ కల్లోలితమ్ | = | మిక్కిలి కల్లోలములు కలిగిన దానిగా; |
| తన్వతీ | = | చేయుచున్న; |
| కామాక్షి+ఇతి | = | కామాక్షి యని; |
| సమస్తసజ్జననుతా | = | సర్వసుజనులచే స్తుతింపబడిన; |
| నృణామ్ | = | నరులకు; |
| కల్యాణదాత్రీ | = | శుభముల నిచ్చునట్టి; |
| కారుణ్యాకులమానసా | = | దయతో ఆకులమైన మనస్సుగల; |
| భగవతీ | = | భగవతి; |
| కమ్పాతటే | = | కమ్పానదీ తీరమున; |
| జృమ్భతే | = | విజృంభించుచున్నది. |

**తాత్పర్యము :-**

శివుని అనురాగసముద్రమును చంద్రకాంతిగల తెల్లని చిఱునవ్వు చేత కల్లోలిత మొనర్చుచున్న కామాక్షి యని సర్వజనులచే నుతింపబడిన, దయతో నుప్పొంగిన మనస్సుగల **భగవతి** కమ్పాతీరమున విజృంభించుచున్నది.

**వివరణము :-**

అమ్మవారి చిఱునవ్వు వెన్నెలగా ఆరోపింపబడుటచే రూపకాలంకార మిందున్నది. విషయి విషయములు శశిరుజ్మందహాసత్విట్టులు భిన్నపదోపాత్తములుగా ఇది వ్యస్తరూపకము. చంద్రుడు సముద్రము నుప్పొంగింప జేసినదని వర్ణించుట పూర్వార్ధమున బ్రస్ఫురించుటచే ఉపమాలంకారవ్యక్తి ఉన్నది. అమ్మవారు కమ్పాతీరమున కామాక్షి అని ప్రసిద్ధినందిన భగవతి. కొన్ని విగ్రహములలో కొన్ని అవయవములు మిక్కిలి సుందరముగా నుండును. కామాక్షీ విగ్రహమున కన్నులు మిక్కిలి అందముగా నున్నవి. ఆ కన్నులు భక్తుల కోరిక తీర్చెదనని అమ్మవారు పల్కుచున్నట్లు భక్తుల కనుభవము కలిగించునట్లున్నవి. వారిని రమ్మని పిలుచుచున్నట్లున్నవి. ఆ కన్నులలో శివకామమున్నది. జీవుని శివుల నొనరించు కామమున్నది. కోరదగిన వగుటచే సకల పురుషార్థములు కామములే. భక్తుల కామె కన్నులలో సాక్షాత్కరించును. ఆ కన్నుల జూచిన నిక నే కామమక్కఱ లేదు-అను వైరాగ్యము కలుగును. ఇన్ని కారణములచేత సజ్జను లామెను కామాక్షి యని పలుకుచున్నారు. కాదు స్తుతించుచున్నారు. వారియెడ అమ్మవారి

మనసున దయ యున్నది. అది దీర్ఘములైనను ఆ కన్నులలో నుండి ఆ దయ ఇమడలేక భక్తుల పైకి దుమికి వచ్చుచున్నట్లున్నది. ఇంతకు ఆ కన్నుల జూచిన వారికామె మనసులో నెంత దయ ఉన్నదో అనిపించును. సమగ్ర వీర్యైశ్వర్య యశ శ్రీ జ్ఞానవైరాగ్యము లాఱును భగనామ ధేయములు. అట్టివే యైన ఇతర కల్యాణగుణముల ఆనంత్యము కూడ భగనామ ధ్యేయమే. అట్టి గుణవతి కావున ఆమె భగవతి. భూతముల ఉత్పత్తి వినాశములు, గతాగతులు, విద్యావిద్యలెఱిగినది కావున ఆమె భగవతి. మనుష్యులకు సర్వ కల్యాణముల నొసగుటకు కమ్పాతీరమున వేంచేసియున్నది. కాంచీపురములో కాపురమున్నది. భూలోకవాసుల పున్నెములు పండిన్పుడామె అట్లు చేసినది. రాలేని వారికిని కామాక్షి యను ప్రసిద్ధ నామము వినబడుచునే యుండును. వారికి అది చాలును. ఇది తృతీయ పాదమున వ్యక్తమగు నంశము. నాలుగు పాదములలో వర్ణమైత్రి కకార రూపమున కానవచ్చుచున్నది.



**అవ:–** పై శ్లోకమున అమ్మవారు **కారుణ్యాకులమానస** అని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె కరుణయే యని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కామాక్షీణపరాక్రమప్రకటనం సమ్భావయన్తీ దృశా**
**శ్యామా క్షీరసహోదరస్మితరుచిప్రక్షాళితాశాన్తరా।**
**వామాక్షీజనమౌళిభూషణమణిర్వాచాం పరా దేవతా**
**కామాక్షీతి విభాతి కాపి కరుణా కమ్పాతటిన్యాస్తటే॥ 5**

**ప్రతిపదార్థము :–**

| | | |
|---|---|---|
| దృశా | = | చూపుచేత; |
| కామాక్షీణపరాక్రమప్రకటనమ్ | = | కాముని గొప్పపరాక్రమముయొక్క ప్రకటనమును; |
| సంభావయన్తీ | = | చక్కగా భావింపజేయుచున్నట్టి; |
| శ్యామా | = | మధ్యయౌవనము గల; |
| క్షీరసహోదరస్మితరుచి ప్రక్షాళితాశాన్తరా | = | పాలతోబుట్టువైన చిఱునవ్వుకాంతిచేత కడుగబడిన దిఙ్మధ్యభాగము గల; |
| వామాక్షీజనమౌళిభూషణమణిః | = | స్త్రీజనశిరోభూషణమణియైన; |
| వాచామ్ | = | వాక్కులయొక్క; |
| పరా | = | పరయైన; |
| దేవతా | = | దేవతయగు; |
| కామాక్షి+ఇతి | = | కామాక్షి అని; |
| కా+అపి | = | ఒకానొక; |

కరుణా = దయ;
కమ్పాతటిన్యాః = కమ్పానదియొక్క;
తటే = ఒడ్డున;
విభాతి = ప్రకాశించుచున్నది.

**తాత్పర్యము :-**

తనచూపుతో కాముని పరాక్రమమును ప్రకటించుచున్న యౌవన మధ్యస్థయై తన చిఱునవ్వుచే దిక్కుల మధ్యభాగమున తెల్లబఱచుచు స్త్రీలలో తలమానికమై వాక్కులకందని దేవతయై కమ్పానదీ తీరమున కామాక్షియను పేర ఒకానొక కరుణ ప్రకాశించుచున్నది.

**వివరణము :-**

గుణిగుణములు వేఱు పదార్థములని తర్కశాస్త్రము చెప్పును. గుణి గుణములకు తాదాత్మ్యమని మీమాంసాశాస్త్రము చెప్పును. తాదాత్మ్యమనగా వారి దృష్టిలో భేదముతో కూడిన అభేదము. గుణికి గుణమనన్యము. అనగా భిన్నము కాదని అద్వైతశాస్త్రము చెప్పును. లోకమున పరాక్రమవంతుని రూపొందిన పరాక్రమమే యని ప్రశంసించుట కలదు. ఈ శ్లోకమున దయకల అమ్మవారు రూపు కట్టిన దయయే అని చెప్పబడినది. కరుణకు కాళ్ళు చేతులు మొదలగు అవయవములు మొలుచుకొని వచ్చిన వన్నమాట. కావున అది కంటితో కాముని పరాక్రమప్రకటనమునే భావింపజేయును. కన్ను తెఱచుకొన్న కాముని పరాక్రమము ప్రకటింపబడినట్లే. ఇక ఆ చూపునుండి తన చూపును మరలించుకొనుట కామారియని పేరొందిన శివునకును సాధ్యము కాదు. ఆయనకు ఇంతకు ముందున్న కామారియను బిరుదము నేతిబీర కాయయైనది. కాముని కాల్చినట్లు లోకము చెప్పుకొనుట తన భ్రాంతిని వెల్లడించుకొనుటయే. ఆమె కన్నులలో కాముడు దాగియున్నాడని, కాలలేదని, లోకము గ్రహించుట కెక్కువ కాలము పట్టలేదు. ఆమె కన్నులలో వారికి కాముడు సాక్షాత్కరించినాడు. ఆమెను కామాక్షియని పిలిచినారు. ఆ పేరే ఆమెకున్న అన్ని నామములకన్న ప్రసిద్ధి నొందినది. ఆమెను చూచిన వారామెను **శ్యామ** యందురు. అట్లనుట ఆమె యౌవన మధ్యయని చెప్పుటయో లేక ఆమె దేహకాంతి నల్లనిదని చెప్పుటయో లేక రెండింటిని ప్రశంసించుటయో యగును. ఉభయ విధములలోనను ఆమె శ్యామయే. ఆమె నవ్వినది. ఆమె నవ్వినదని యెట్లు తెలిసినది. దిక్కులలో అంతకు ముందు లేని తెల్లదనము కనిపించినందువలన తెలిసినది. చంద్రోదయమైనదేమో యను భ్రాంతి కలిగి ఆకసము వైపు చూడగా చంద్రుని జాడలేదు. ఎదుట ఆమె నవ్వు జూడ గోచరించినది. ఇది ఈ దిక్కులు తెల్లవాఱుట ఆ నవ్వు పనియని తెలిసినది. ఆ నవ్వు పాలను బోలిన తెలుపురంగు కలది యన్న మాత్రమున చాలదు. దిక్కుల నడుమనుండు జనుల ఎదలలోని చీకట్లు గూడ తొలగినవి. వానిలోని తమోదోషములు అణగినవి. లోకమున భాగ్యమంతయు తమ శరీరమలమును

తొలగించుకొనుటకు బిందెలతో పాలను గ్రుమ్మరించుకొనుచు స్నానము చేయుదురట, ఏమో? దేవతల విగ్రహములను మాత్రము పాలతో అభిషేకించుట ప్రసిద్ధము కాని ఈ కామాక్షియను పరదేవత దిక్కుల మధ్యభాగము నంతటిని తన నవ్వుపాలతో కడగివైచినది. అందున్న జీవుల ఎదలలోని పాపపంకమును కడగివైచినది. ఇంత కరుణను చూపించు దేవత నేమని వర్ణింపగలము?. ఆమెను వాక్కులకందని దేవతయని మాత్రమే వాక్కులతోనే చెప్పగలము. అంతమాత్రమున ఆమెను చెప్పినట్లగునా? ఇంకేమో మనమున చెప్పవలెనని యున్నది. ఏమి చెప్పవలెనో మనమునకే అందుట లేదు. ఇక వాక్కులతో ఎట్లు చెప్పుట? కరుణకు అనుకమ్మ అనుపర్యాయము కలదు. అనుకమ్మ ఏ దేవతకైనా ఇంత ఉండునా? ఉండదు. ఈ దేవత కమ్పానదీతీరమున నున్నది. కావున **అనుకమ్ప** యని చెప్పదగినది. అక్కడి ప్రజలపట్ల ఆమె కెంత అనుకమ్పయో వారి యైహికసౌభాగ్య చిహ్నములైన పాడిపంటలను వర్ధిల్లచేయు కమ్పానదిని ప్రవహింపజేసినది. వారి పారలౌకిక సౌభాగ్యమును వర్ధిల్లజేయు ఇతర దేవతల దేవళములను నిర్మింపజేసినది. ఇహపర సౌఖ్య విరక్తుల కొఱకు అలౌకికమోక్షసౌభాగ్యమును కలిగించుట కామెయే కామాక్షీ రూపమును ధరించి వచ్చి నిలచినది. అందుచేత అనుకమ్పయొక్క మూర్తియైనది. కమ్పాతీరమే అనుకమ్పకు నిలయమైనది. దాక్షిణాత్యమైన ప్రాస ఈ శ్లోకము నలంకరించుచున్నది. క్షీరసహోదరము, స్మితరుచి యని చెప్పుటచే లుప్తోపమాలంకార మేర్పడినది. కామాక్షి కరుణయే అని చెప్పుట ఆమె అనితరదేవతాసాధారణకారుణ్యమును వ్యంజింపజేయుచున్నది.



**అవ:**- పై శ్లోకమున కామాక్షీ దేవియే కరుణ యని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె కడగంటి చూపులలోని కరుణ వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ శ్యామా కాచన చన్ద్రికా త్రిభువనే పుణ్యాత్మనామాననే**
**సీమాశూన్యకవిత్వవర్షజననీ యా కాపి కాదమ్బినీ।**
**మారారాతిమనోవిమోహనవిధౌ కాచిత్తమఃకన్దలీ**
**కామాక్ష్యాః కరుణాకటాక్షలహరీ కామాయ మే కల్పతామ్॥ 6**

**ప్రతిపదార్థము :-**

త్రిభువనే = మూడులోకములందు;
శ్యామా = నల్లని;
కాచన = ఒకానొక;
చంద్రికా = వెన్నెల;
పుణ్యాత్మనామ్ = పుణ్యాత్ములయొక్క;
ఆననే = ముఖమునందు;

| | | |
|---|---|---|
| సీమాశూన్యకవిత్వవర్షజననీ | = | హద్దులేని కవిత్వవర్షమును కలిగించు; |
| యా కా+అపి | = | ఏదో ఒకానొక; |
| కాదమ్బినీ | = | మేఘమాల; |
| మారారాతిమనోవిమోహనవిధౌ | = | శివుని మనస్సును మోహించుట అను కర్మయందు; |
| కాచిత్ | = | ఒకానొక; |
| తమఃకన్దళీ | = | చీకటి మొలక; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| కరుణాకటాక్షలహరీ | = | కడగంటి దయాప్రవాహము; |
| మే | = | నాయొక్క; |
| కామాయ | = | కామముకొఱకు; |
| కల్పతామ్ | = | పూనుకొను గాక! |

**తాత్పర్యము :-**

త్రిభువనముల నొక వెన్నెల కలదు. అది నల్లనిది. పుణ్యాత్ముల ముఖమున హద్దులేని కవితను వర్షించు మేఘమాల అది. శివుని మనస్సును మోహించునట్టి చీకటి మొలకయునైన కామాక్షీదేవియొక్క దయగల చూపుల ప్రవాహము నా కోరిక తీర్చుగాక!

**వివరణము :-**

అమ్మవారి కరుణగల చూపు మూడు లోకముల వెలిగించు వెన్నెలగా రూపించబడుటచే ప్రథమపాదమున రూపకాలంకార మేర్పడియున్నది. అది నల్లనిదని చెప్పుటచే నది తాద్రూప్య రూపకము. వెన్నెల నల్లనిదని చెప్పుటచే విరోధాభాసము వ్యంగ్యమగుచున్నది. అమ్మవారి చూపు నల్లగా నున్నదనిన కంటి సౌందర్యము వ్యంగ్యమగుచున్నది. కాచన అనుటచే నది లోకాతిశాయి యని వ్యంగ్యము. ఈ చంద్రిక భూలోకవాసులకే లభించిన దేవుని వరము. చంద్రుడు భూమియొక్క ఉపగ్రహము. సూర్యుని కాంతిని గ్రహించి భూమిపై వెదజల్లును. అమ్మవారి ముఖచంద్రునివెన్నెల త్రిభువనహర్షదాయి. ఆతనికి కళంకిత క్షయత లేదు. అమ్మవారి చూపు నల్లనిదై ఆమె ముఖమున కళంకము వలె శోభిల్లునని చెప్పవచ్చును. కాని తిలకమును కలంకముగా చెప్పుట కవి ప్రసిద్ధము కాదు. పైగా కన్నులలో వెలుగు వెన్నెల యున్నదని చెప్పుటచే ఆ ముఖములోని కాంతి అంతయు ఆ చూపుదే అని గ్రహింపవలయును. ముఖములోని పెదవులలో అమృత మున్నదనుట కవి ప్రసిద్ధము. కాని చూపులలోనే ఆ అమృతమున్నది. అది దయామృతము. రెండవ పాదమున అమ్మవారి ఆ చూపు పుణ్యాత్ముల ముఖమున కవితను వర్షించు కాదంబినిగా చెప్పుటచే రూపకాలంకార మేర్పడియున్నది. పుణ్యాత్ముల ముఖములు చాతకములవలె ఆ కవితావర్షధారలకొఱకై ఎదురు చూచుచుండుననుట

వ్యంగ్యమగుచున్నది. వారి ముఖమునుండి వచ్చు నా కవితాధారలకై లోకమెదురు చూచుచున్నది. మేఘమాల ఎంత పెద్దదయినను అది వర్షించు వర్షమునకు హద్దులేదనలేము. అది కొన్ని ప్రాంతములలో కొంతకాలమే వర్షించును. అమ్మవారి కరుణాకటాక్షకాదంబిని పుణ్యాత్మ కవి ముఖముల ద్వారా వర్షింపజేయు కవితా వర్షము. సర్వదేశకాలవ్యాప్తమై యుండును. కాని అది పుణ్యాత్ముల శ్రోత్రముల ద్వారా వారి హృదయభూములలో వర్షించును. హర్షము కలిగించు చుండును. మూడవపాదమున శివుని మోహింపజేయు తమఃకందళిగా అమ్మవారి చూపు రూపింపబడుటచే రూపకాలంకార మేర్పడియున్నది. పుణ్యాత్ములైనను జ్ఞానులమను నహంకారము గల వారలకు మోహము కలిగించుటలో ఆమె చూపు చీకటి మొలకయే యగును. శివుడు కాముని చంపి కామారి యైనాడు. కామారినైతినని అహంకరించినాడేమో ఆయనను అమ్మవారి వెంట పడునట్లాకామాక్షులొనరించినవి. తలచుట్టు త్రిప్పుకొనుటలో తనపాదములపై పడవేయుటలో తద్ద్వారమున తన సౌభాగ్యమును పెంచుటలో అమ్మవారికి ఆ చూపు సహకరించినది. కాదు ప్రధానకారణమే యైనది. ఇట్లు మూడు పాదములలో రూపకము లుండుటచే మొత్తము శ్లోకమున రూపకమాల యేర్పడినది. నాల్గవపాదమున ఆ చూపు తన కోరిక తీర్చవలెనని కవి ప్రార్థించినాడు. ఆ కామమెట్టిదో ఏ రూపమైనదో కవి చెప్పలేదు. కాని ఆ చూపు తన కన్నులకు వెన్నెల కావలెనని తన హృదయములో సత్కవిత్వవర్ష హర్షప్రాప్తి కావలెనని శ్లోకములో సూచింపబడిన కామమాకవిదే కావచ్చును. అది తీరినదని చెప్పుట కా మూకకవి ఈ కృతియే నిదర్శనము. 1,2,4 పాదములలో ప్రాసమున్నది. నాల్గవ పాదమున ప్రాసతోబాటు వర్ణమైత్రియు నున్నది. చంద్రికకు నలుపు కవిత్వమున సీమాశూన్యత, మారారాతికి మోహము అను విరోధాంశస్ఫూర్తి ఉండుటచే విరోధాభాసాలంకారము వ్యంగ్యమగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కరుణాకటాక్షలహరి నల్లనిచంద్రికగా రూపింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి మిగిలిన అవయువములు ఉపమాన ద్రవ్యములుగా అధ్యవసింపజేయబడుచున్నవి.

**శ్లో॥ ప్రౌఢధ్వాన్తకదమ్బకే కుముదినీపుణ్యాఙ్కురం దర్శయన్**
**జ్యోత్స్నాసఙ్గమనేఽపి కోకమిథునమ్మిశ్రం సముద్భావయన్।**
**కాలిన్దీలహరీదశాం ప్రకటయన్కమాం నభస్యద్భుతాం**
**కశ్చిన్నేత్రమహోత్సవో విజయతే కాఞ్చీపురే శూలినః॥ 7**

**ప్రతిపదార్థము :-**

ప్రౌఢధ్వాన్తకదమ్బకే = గాఢములైన చీకట్ల గుంపులందు;

| | | |
|---|---|---|
| కుముదినీపుణ్యాంకురమ్ | = | కలువతీగ పుణ్యపు మొలకను; |
| దర్శయన్ | = | చూపించుచు; |
| జ్యోత్స్నాసంగమనే+అపి | = | వెన్నెలతో కలయిక ఉన్నను; |
| కోకమిథునమ్ | = | చక్రవాకముల జంటను; |
| మిశ్రమ్ | = | కలసియున్నదానినిగా; |
| సముద్భావయన్ | = | చేయుచు; |
| నభసి | = | ఆకసమున; |
| అద్భుతామ్ | = | వింతైన; |
| కమ్రామ్ | = | మనోహరమైన; |
| కాలిన్దీలహరీదశామ్ | = | యమునా ప్రవాహస్థితిని; |
| ప్రకటయన్ | = | చాటుచు; |
| కాంచీపురే | = | కాంచీపురమున; |
| శూలినః | = | శివునియొక్క; |
| కశ్చిత్ | = | ఒకానొక; |
| నేత్రమహోత్సవః | = | కన్నులయొక్క గొప్పపండుగ; |
| విజయతే | = | సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది. |

**తాత్పర్యము :-**

చీకట్ల గుంపులో చిఱుజాబిల్లి మొలకను చూపుచు, వెన్నెలలో గూడ చక్రవాకముల జంటను కలుపుచు, ఆకసమున వింతగా మనోహరముగా నున్నాయని ప్రవాహమును చూపించుచున్న శివుని కన్నుల గొప్పపండుగ సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**వివరణము :-**

అమ్మవారి శిరస్సు మొదలు నడుమువఱకు గల అవయవము లీ శ్లోకమున వర్ణింపబడుచున్నవి. గాఢాంధకార సమూహము అను ఉపమానమును చెప్పి ఉపమేయమైన అమ్మవారి నల్లనికేశపాశమును చెప్పకపోవుట అధ్యవసాయము. అట్లే చిఱుచంద్రుని చెప్పక, కలువతీవ మొలకను చెప్పుట అధ్యవసాయము. అట్లే నడుమని చెప్పక ఆకాశమని చెప్పుట, నూగారని చెప్పక యమునానదీ ప్రవాహమని చెప్పుట, చిఱునవ్వని చెప్పక వెన్నెల యని చెప్పుట, స్తనములని చెప్పక చక్రవాకమిథునమని చెప్పుట-ఇవి అన్నియు అధ్యవసాయములే. ఈ అధ్యవసాయముచేత ఈ శ్లోకమున అతిశయోక్త్యలంకార మేర్పడియున్నది. చీకట్ల గుంపనగా అమ్మవారి కేశము. దానిలో తుటిమిన కలువ పున్నెపు మొలక యనగా బాలచంద్రుడు. వెన్నెల యనగా అమ్మవారి చిఱునవ్వు. చక్రవాకముల జంట యనగా స్తనద్వయము. నభస్సనగా నడుము. యమునా ప్రవాహమనగా నూగారు. ఈ అధ్యవసాయోక్తికి కారణము వానికున్న పరస్పరసాదృశ్యము

గావున అది ఈ శ్లోకమున స్ఫురించుటచేత ఈ శ్లోకమున ఔపమ్యవ్యక్తి యున్నది. దీనితోపాటు అంధకారమున కలువతీవ మొలచుట, వెన్నెలలో సైతము చక్రవాకముల జంట కలసియుండుట, ఆకాశమున యమునా నది యుండుట అను విరోధములు స్ఫురించుటచే విరోధాలంకార వ్యక్తి యున్నది. వీని వలన లోకాతీతముగా సర్వవిరోధముల నొకచోట సంగమింపజేయు అమ్మవారి మహిమ ధ్వనించుచున్నది. అమ్మవారిని కామాక్షియని చెప్పక శివుని నేత్రమహోత్సవమని భంగ్యంతరముగా చెప్పుటచే నీ శ్లోకమున పర్యాయోక్త్య లంకారమేర్పడియున్నది. అమ్మవారి కేశపాశము చీకటివలె నల్లగా ఉన్నది. అందలి బాలచంద్రుడు అమ్మవారి తుఱిమిన కలువపూవువలె ఉన్నాడు. అమ్మవారి చిఱునవ్వు వెన్నెల వలె ఉన్నది. వెన్నెలలో విడిగా నుండి విరహము ననుభవించు స్వభావము గల చక్రవాకముల జంట కలసియున్నవి. అనగా చక్రవాకముల జంటవలె గాఢాలింగన మొనరించుచున్న స్తనముల జంట యున్నది. అనగా స్తనముల మధ్య ఎడము లేకున్నది. ఆ చక్రవాకముల జంట గాఢాలింగనమున మునిగినట్లున్నది అను సంభావనము ఇట చెప్పవచ్చును. ఆకసమున గంగ యుండవచ్చును కాని యమున ఉండదు. అమ్మవారి ఆకాశము నంటి నడుమున యశమువలె నూగారున్నది. ఇది యంతయు పై శ్లోకమున వ్యంగ్యమగు నర్థము. శివునకు భార్యగా, సంసారము అను శూలముగల భక్తునికి తల్లిగా వారి కన్నులకు విందొనర్చు చున్నది అమ్మవారే యని ఈ శ్లోకముయొక్క సారము. సృష్ట్యాది యందలి పరమేశ్వరుని ఈక్షణ మమ్మవారను వ్యంగ్యము పరమార్థము. ఉత్తరార్ధమున వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కేశపాశమందలి బాలచంద్రకల కలువతీవ పున్నెపు మొలకగా అధ్యస్తము చేయబడినది. ఈ శ్లోకమున ఆ కేశములు బాలచంద్ర లాంఛితములని స్పష్టము చేయబడుచున్నది.

**శ్లో॥ తన్ద్రాహీనతమాలనీలసుషమైస్తారుణ్యలీలాగృహై-**
**స్తారానాథకిశోరలాఞ్ఛితకచైస్తామ్రారవిన్దేక్షణైః।**
**మాతస్సంశ్రయతామ్మనో మనసిజప్రాగల్భ్యనాడిన్ధమైః**
**కమ్పాతీరచరైర్ఘనస్తనభరైః పుణ్యాఙ్కురైశ్శాఙ్కరైః॥ 8**

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| మాతః | = | అమ్మా! |
| తంద్రాహీనతమాలనీలసుషమైః | = | సోమరితనములేని తమాల వృక్షముల వలె నీలి కాంతిగల; |
| తారుణ్యలీలాగృహైః | = | యౌవన విలాసములకు నిలయములైన; |
| తారానాథకిశోరలాంఛితకచైః | = | బాలచంద్రునిచే చిహ్నితములైన కేశములు గల; |

| | | |
|---|---|---|
| తామ్రారవిందేక్షణైః | = | ఎఱ్ఱని కమలములవంటి కన్నులుగల; |
| మనసిజప్రాగల్భ్యనాడిన్ధమైః | = | మన్మథుని ప్రాగల్భ్యమునకు హేతువులైన; |
| కమ్పాతీరచరైః | = | కమ్పానదీతీరమున సంచరించు; |
| ఘనస్తనభరైః | = | గొప్పస్తనముల భారముగల; |
| శాంకరైః | = | శంకరునకు సంబంధించిన; |
| పుణ్యాంకురైః | = | పుణ్యముల మొలకలచేత; |
| మనః | = | మనస్సు; |
| సత్క్రియతామ్ | = | సత్కరింపబడుగాక! |

**తాత్పర్యము :-**

అమ్మవారు శివుని పుణ్యముల మొలక. అది తమాలనీలము. తారుణ్యలీలా గృహము. చంద్రకిశోరచిహ్నితకచము. ఎఱ్ఱని కమలముల వంటి నేత్రములు కలిగినట్టిది. మన్మథుని విజృంభణమునకు హేతువైనట్టిది. కమ్పాతీరమున చరించునట్టిది. గొప్ప స్తనముల బరువు గలిగినట్టిది. అది నా మనస్సును సత్కరించుగాక!

**వివరణము :-**

ఇందలి విశేషణ విశేష్యములు తృతీయా బహువచనాంతములు. వీని బహువచనము పూజార్థకము. బహ్వర్థకము గాదు. మూడవ నాల్గవ ఏడవ విశేషణము లమ్మవారి కేశములను కన్నులను స్తనములను వర్ణించునట్టివి. మొదటి విశేషణ మామె దేహకాంతిని, రెండవ విశేషణ మామె శివకామ్యతను బోధించును. ఆఱవ విశేషణ మామె కమ్పాతీర విహారమును బోధించును. ఇవి యన్నియు శాంకరపుణ్యాంకుర రూపమైన అమ్మవారిని విశేషింపజేయును. ఆమె తన మనస్సును సత్కరించుట అనగా మనస్సున నిలచుట కవిచే కోరబడుచున్నది. మాతః అను సంబోధన మమ్మవారు భర్తయైన శివుని కలయికతో తనను మఱచినప్పుడు గట్టిగా పిలుచు కవియొక్క శైశవమును వ్యంజింపజేయుచున్నది. నాల్గవ పాదమునందలి పదములన్నియు అంత్యాను ప్రాసము కలిగియున్నవి. పూర్వార్థమున **త**కారము వర్ణమైత్రీ రూపమున కనబడుచున్నది. మూడవ పాదమున **మ**కార వర్ణమైత్రి ఉన్నది. మనో మన అను పదముల జంటలో ఛేకానుప్రాస మున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చంద్ర సంబంధము శిరోభషణకల్పనము ద్వారా చెప్పబడినది. ఈ శ్లోకమున తేజస్సంచయ పాటవముచే సూర్యుని కిరణాపహారము ద్వారా సంబంధము చెప్పబడుచున్నది.

**శ్లో॥ నిత్యం నిశ్చలతాముపేత్య మరుతాం రక్షావిధిం పుష్ణతీ**
**తేజస్సఞ్చయపాటవేన కిరణానుష్ణద్యుతేర్ముష్ణతీ।**

కాఞ్చీమధ్యగతాపి దీప్తిజననీ విశ్వాన్తరే జృమ్భతే
కాచిచ్చిత్రమహో స్మృతాపి తమసాం నిర్వాపికా దీపికా॥ 9

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| నిత్యమ్ | = | ఎల్లప్పుడు; |
| నిశ్చలతామ్ | = | నిశ్చలత్వమును; |
| ఉపేత్య | = | పొంది; |
| మరుతామ్ | = | దేవతలయొక్క; |
| రక్షావిధిమ్ | = | రక్షణకృత్యమును; |
| పుష్ణతీ | = | పోషించుచున్నదై; |
| తేజస్సంచయపాటవేన | = | తేజముల గూర్చుటలోని సామర్థ్యముచేత; |
| ఉష్ణద్యుతేః | = | సూర్యునియొక్క; |
| కిరణాన్ | = | కిరణములను; |
| ముష్ణతీ | = | అపహరించుచున్నదై; |
| కాంచీమధ్యగతా+అపి | = | కాంచీనగర మధ్యనున్నను; |
| దీప్తిజననీ | = | ప్రకాశములకు తల్లియై; |
| విశ్వాంతరే | = | విశ్వము లోపల; |
| కాచిత్ | = | ఒకానొక; |
| తమసామ్ | = | తమస్సులయొక్క; |
| నిర్వాపికా | = | చల్లార్చునదగు; |
| దీపికా | = | దీపము; |
| జృంభతే | = | జృంభించుచున్నది; |
| అహో | = | ఆహా; |
| చిత్రమ్ | = | వింత! |

**తాత్పర్యము :-**

ఎల్లప్పుడు కదలక యుండి దేవతల రక్షించుచున్నదై, వెలుగుల కూర్చుకొను సామర్థ్యమున సూర్యుని కిరణముల నపహరించుచున్నదై, కాంచీనగర మధ్యమున నున్నను విశ్వాంతరమున వెలుగుల కలిగించుచు తమస్సుల చల్లార్చు నొక దివ్వె విజృంభించుచున్నది. ఇది యెంత విచిత్రమై యున్నది.

**వివరణము :-**

చాంచల్యము మరుత్తులకు అనగా గాడ్పులకు లక్షణము. అట్లే దేవతల జీవితము సైతము చంచలము. మనుష్యులకన్న కోట్ల సంవత్సరము లధికముగా జీవించు వారైనను కాలముయొక్క అనంతతను పురస్కరించుకొని పరిశీలించిన వారి జీవితము

క్షణికము కావున చంచలము. అందుచే దేవతలు సైతము మరుత్తులవలె అనగా గాడ్పులవలె చంచలులగుటచే మరుత్తులనియే పిలువబడినారు. అమ్మవారు దేవతా జాతికి చెందినదయ్యు ఇతర దేవతలవలె మరుత్ పదముచే చెప్పబడకపోవుటయే యుచితము. ఒకవేళ చెప్పబడినను దేవతా సాధారణమైన చంచలత అనగా క్షణికత ఆమెకు లేదు. కావున క్షణికములగు దేవతలను మనుష్యాది జీవులకన్న అధికకాలము జీవించు నట్లొనర్చుచున్నది. ఇదియే మరుద్రక్షావిధికృత్యపోషణము. కాంచీపుర మందిరము నిశ్చలముగా విగ్రహరూపమున ఆ గుడిలోని నందాదీపమువలె నున్నది. గాలి తీవ్రమై ఆ నందాదీప మారిపోయినను ఈ విగ్రహరూపదీపిక మాత్రమారిపోదు. వాయువు లాకాశమున పుట్టును. గిట్టును. కొంతకాలము చలించును. బ్రతుకును. చలనమే వాని బ్రతుకు. అట్లే చిదాకాశమున బుట్టి గిట్టి కొంతకాలము బ్రతుకువారు మరుత్తులు. ఆ కొంతకాలము బ్రతికినారన్నను దానికి కారణ మా చైతన్యమే. అనంతాకాశ మందలి వాయువులెన్ని యున్నను అవి యన్నియు అత్యల్పములే. వానికన్న ఆకాశమెంతో గొప్పది. అట్లే చిదాకాశమందు దేవతలెందఱున్నను వారు అత్యల్పులే. బాహ్యాకాశము అనంతమని వ్యవహారమున్నను చిదాకాశమున అనంతత్వము పారమార్థికము. ఆ చైతన్యమే కాంచీ మందిరమున విగ్రహముగా నిశ్చలముగా నుండుట. ఆ పారమార్థికమైన అనంతత్వము నిశ్చలతయా అను పదముచే చెప్పబడినది. **నిత్యమ్** అను శబ్దము దేవతలు బ్రతుకు కాలమంతయు వారిని బ్రతికింప జేయుటలో నేమాత్ర మశ్రద్ధ చేయక యెల్లవేళల వారిని కాపాడు అమ్మవారి స్వభావముయొక్క నిత్యతను బోధించును. సర్వకాలనిశ్చలచైతన్య రూపిణియైన అమ్మవారు నిశ్చలత నొందుట యేమి? విగ్రహరూపమున కదలక యుండుటయే ఆ నిశ్చలత. చలనము జీవలక్షణము. జీవనమనగా చలనమే. శరీరమున జీవులు నిద్రించుచున్నప్పుడును జీవలక్షణమైన చలనము అంతరవయవములైన జీర్ణకోశాదులలో సంభవించుచుండును. జీవిలో నీ చలన మెట్లారంభమైనదో మనకు తెలియదు. కాని స్థూలదేహమును విడిచి పోయిన తరువాత ఆ స్థూలదేహము నిశ్చలమగుట, ప్రాణము లా స్థూలదేహమునుండి చలించి వెడలిపోవుట మన మెఱుగుదుము. కావున మరణమువఱకు స్థూలదేహమున చలనముండును. అదియే బ్రతుకని పిలవబడును. జీవి యిట్లు బ్రతుకుట అమ్మవారి రక్షణకృత్యపోషణమే. స్థూలదేహమునుండి ఇప్పుడు చలించు క్రియ ప్రాణమరుదధీనమైనది. ప్రాణవాయువు యొక్క ఈ చలనము మోక్షపర్యంత ముండును. అంతవఱకు రాకపోకలుండును. చలన ముండుట సూక్ష్మదేహ నాశముతో దీనిలోని భాగమైన ప్రాణమరున్నాశము సంభవించును. ఆ సూక్ష్మప్రాణమరుత్తుల రక్షణకృత్యపోషణ మమ్మవారిదే. ఈ ప్రాణ మరుత్తు లుండునంతవఱకు మరుత్తులు (ప్రాణములు)అనగా ఇంద్రియములు పనిచేయును. ఈ ఇంద్రియముల (ప్రాణమరుత్తుల) రక్షణకృత్యపోషణ మమ్మవారిదే. ఇంద్రియములు అనగా ఘ్రాణరసనస్పర్శనశ్రవణదర్శనాది శక్తులు అమ్మవారి చేతనే పోషింపబడి

రక్షింపబడుచుండును. ఇది ప్రథమపాదార్థ వివరణము. ద్వితీయపాదమున అమ్మవారి తేజస్సంచయపాటవము సూర్యకిరణాపహారమని చెప్పబడినది. పెద్ద తేజము ముందఱ చిన్న తేజములు లుప్తము లగుట మన మెఱుగుదము. పగటి సూర్యుని తేజము నక్షత్రముల తేజము నపహరించుట చేత అవి లుప్తములే. **అదర్శనం లోపః** (53) (1.1.60) అనుట వ్యాకరణ సంప్రదాయము. లోపమనగా కనబడక పోవుటయే. అమ్మవారి తేజము ముందఱ కోట్లకొలది సూర్యులే వెలవెలబోవుచుండ ఒక సూర్యుని ద్వాదశ సూర్యుల లెక్కయేమి? ఆతడా అమ్మవారి చూపున లీనమయిపోవును అను అర్థము లభించును. ఉత్తరార్ధమున కాంచీనగర మధ్యగతమైన ఆ దీపము విశ్వము నందంతట వెలుగుల నింపుచు విజృంభించుచున్న దనుటచే విరోధాలంకారము **అపి చిత్రమ్ అహో** అను పదములచే వాచ్యమై యున్నది. **దీప్తిజననీ** అనుటచేత సూర్యచంద్రాగ్న్యాది సమస్త జ్యోతిస్సుల దీప్తుల కమ్మవారే దీపిక. తల్లి అనగా దాని నుండియే బయలుదేరినవని వ్యక్తమగుచున్నది. దేవళములందు భూతప్రేత పిశాచాదులు రాకుండా శాశ్వత దీప మేర్పాటు చేయబడును. రాజులు మొదలగు ధనికులా దీపములకు కావలసిన చమురులకై ఆవులను గొఱ్ఱెలను మేకలను, నువ్వులు, ఆముదములు మొదలగు నూనెల పండించుటకు కావలసిన భూములు, ఉత్సవాదులలో దివిటీలు పట్టు చాకళ్ళు మొదలగు వారి కొఱకు దానము చేయబడినట్లు శాసనము లున్నవి. ఆ దీపములకు నిశ్చలత లేకున్నను గాలులకు చలించినను అమ్మవారి విగ్రహము ఆ దేవళము నందు చలించని దీపికయే యను అర్థాంతరము ప్రథమపాదమున ధ్వనించును. దీపికయయ్యు జగద్దీప మనదగిన సూర్యుని కిరణముల నపహరించుట అను విరోధము రెండవ పాదమున స్ఫురించుచున్నది. దీపిక అగ్ని రూపము. అగ్నిలో తన తేజము నస్తమించనున్న సూర్యుడుంచునని ప్రసిద్ధిని కాళిదాసు పేర్కొనియున్నాడు. ఇచట దీపికయే స్వయముగా సూర్యుని కిరణముల నపహరించుట వింత కాదా! అమ్మవారి మహిమ ఈ విరోధమును తనలో లీన మొనరించుకొనగలుగుట మాత్రము వింత కాదు. దీపిక వెలిగించిననే చీకట్లు తొలగును కాని అమ్మవారనెడి దీపము తలచిన మాత్రముననే ఏ జ్యోతులు చొరలేని హృదయగుహలోని తమములను కూడ తొలగించుట వింతయే. **స్మృతా అపి** అను శబ్దములు పైన వివరింపబడిన విధముగా ఇతర దీపమునకన్న విశేషమును చెప్పుటచే వ్యతిరేకాలంకారస్ఫూర్తి యున్నది. గాలులవలన జనించు దీపమును గాలులే రక్షించును. ఇట గాలులను దీపము రక్షించుట వింత! గాలులే దీపము నార్పును. లేక నీరు చిలకరించిన దీపమారును. లేక దుమ్ము చల్లినను దీపమారును. తేజో విశేషమైన దీపమును భూమి జల వాయువులార్పుట లోకమున మన మెఱుగుదుము. అమ్మవారు అజ్ఞానము (తమము) నార్పు జ్ఞాతృరూపదీపికయని సారాంశము. కాంచి అనగా ఒడ్డాణము. అమ్మవారి ఒడ్డాణము దాని నడుమ నొక మణి యుండవచ్చును. మొత్తమది మణి నిర్మితమైనను దాని నడుమ చూపరుల కెదుట నొక మణి బాగుగా కనబడునదై

యుండవచ్చును. కాని ఆ మణికన్న కాంచి చుట్టియుండగా దాని నడుమనున్న అమ్మవారి నడుము కాంచీ మధ్యగతము. అమ్మవారు కూడ కాంచీ మధ్యగతయే. మధ్యనున్న ఆ అమ్మవారే అసలైన మణిదీపిక. కాంచీమధ్యగతాశబ్ద మీ యర్థమును వ్యంజింపజేయును. పూర్వార్థమున పాదాంత్యానుప్రాస మున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు కాంచీమధ్యగతదీపికగా చెప్పబడినది. ఈ శ్లోకమున **కాంచీమధ్యమహామణిగా** చెప్పబడుచున్నది.

**శ్లో॥ కాన్తైః కేశరుచాం చయైర్భ్రమరితం మన్దస్మితైః పుష్పితం**
**కాన్త్యా పల్లవితమ్ పదామ్బురుహయోర్నేత్రత్విషా పత్రితమ్।**
**కమ్పాతీరవనాన్తరం విదధతీ కల్యాణజన్మస్థలీ**
**కాఞ్చీమధ్యమహామణిర్విజయతే కాచిత్కృపాకన్దలీ॥ 10**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కమ్పాతీరవనాంతరమ్ | = | కమ్పానదీతీరవనప్రాంతమును; |
| కాంతైః | = | మనోహరములైన; |
| కేశరుచామ్ | = | కేశముల కాంతుల; |
| చయైః | = | సమూహములచేత; |
| భ్రమరితమ్ | = | తుమ్మెదలు ముసిరినట్లు చేయబడినదిగా; |
| మందస్మితైః | = | చిఱునవ్వులతో; |
| పుష్పితమ్ | = | పూయించబడినదిగా; |
| పదామ్బురుహయోః | = | పాదకమలములయొక్క; |
| కాంత్యా | = | కాంతిచేత; |
| పల్లవితమ్ | = | చిగురింపజేయబడినదిగా; |
| నేత్రత్విషా | = | నేత్రముల కాంతితో; |
| పత్రితమ్ | = | ఆకిడినదిగా; |
| విదధతీ | = | చేయుచున్న; |
| కాంచీమధ్యమహామణిః | = | కాంచీమధ్యమహామణియైన; |
| కాచిత్ | = | ఒకానొక; |
| కృపాకందళీ | = | దయమొలక; |
| కల్యాణజన్మస్థలీ | = | మంగళములకు నిలయముగా; |
| విజయతే | = | సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది. |

**తాత్పర్యము :-**

ఆది కమ్పానది. దాని తీరము నొక వనమున్నది. ఆ వనమధ్యమున

దయమొలక యొకటి యున్నది. దాని కేశచయములు భ్రమరములై, దాని చిఱునవ్వులు పుష్పములై, దాని పాదములు పల్లవముగా, దాని కన్నులు ఆకులుగా నున్నవి. ఆ వనమధ్యకాంచీమధ్యమహామణి, ఆ దయ మొలక అమ్మవారే. ఆమె సమస్తకల్యాణములు నిచ్చుచు సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**వివరణము :-**

అమ్మవారీ శ్లోకమున దయ మొలకగా చెప్పబడినందున అతిశయోక్త్యలంకారమేర్పడియున్నది. ఆమె కేశకాంతులు భ్రమరములుగా, ఆమె చిఱునవ్వులు పూలుగా, ఆమె పాదములు చిగుళ్లుగా, ఆమె నేత్రములు పత్రములుగా అతిశయోక్తి రూపకానుప్రాణితమైనది. అమ్మవారు దయయొక్క మొలక. అమ్మవారు దయ రూపుకట్టినట్లున్నది. అది కమ్పాతీరవనమధ్యకాంచీనగరమధ్య మందున్నది. ఆ నగరము చుట్టు వన ముండుటచే ఆ నగర మున్నట్లే తెలియదు. కాని లోనికేగిన పిమ్మట కాంచీనగరము కనిపించును. వనముయొక్క విస్తృతి అధికమైన నగరవిస్తృతి అల్పమగుటచే ఆ దయయొక్క ప్రసారము నగరజనుల పైననే గాక ఆ వనము మొత్తమున వ్యాపించినది. అందుచేత ఆ వనము చిగుర్చుట, ఆకు తొడుగుట, పుష్పించుట, ఆ పుష్పములపై తుమ్మెదలు వ్రాలుట, మొదలుగునవి ఆ వనముయొక్క శోభను పెంచినవి. ఆ వనమే యొక దేవతగా ప్రకాశించినది. వనము నందొక మొక్కకు చిగుళ్ళు తొడుగుట మొదలుకొని పుష్పించుట, ఆ పూలపై తుమ్మెదలు చేఱువఱకు కొంతకాలము పట్టును. కాని అమ్మవారి దయ యెంతటిదో కాని చిగుర్చుట, ఆకు దొడుగుట, పుష్పించుట ఒకేసారి జరుగుచున్నవి. అడవిలోని కొన్ని మొలకలు చిగిర్చి, మరికొన్ని ఆకు దొడిగి, మరికొన్ని పుష్పించి, మరికొన్ని తుమ్మెదలగుంపులు వ్రాలిన పుష్పములు గలవై కనబడుచున్నవి. ఆ దయా (కందలీ) దేవత శిరస్సునందలి కేశములు తుమ్మెదలవలె, ఆమె చిఱునవ్వులు పుష్పములవలె, ఆమె పాదకాంతి చిగుళ్ళ సమూహములవలె, ఆమె నేత్రకాంతి ఆకుల సమూహముగా ప్రకాశించు చున్నవను ఔపమ్యము ఈ శ్లోకమున వ్యంగ్యమగుచున్నది. క్రిందికి వంగి చూచిన చిగుళ్ళు, పైకి చూచిన పత్రములు (అఱచేతులు, పాదములు) ఇంక కొంచెము పైకి చూచిన పుష్పములు (చిఱునవ్వులు), మఱికొంచెము పైకి చూచిన కేశములు (తుమ్మెదలు) కనిపించుటకై పైనుండి చూపు క్రిందకు ప్రసరింప జేసినపుడు మొదట తుమ్మెదలు, పిదప పుష్పములు, ఆ తరువాత ఆకులు, పిమ్మట చిగుళ్ళు కనిపించును. ఈ మొలక వృక్షజాతికి చెందినదగుటచే ఆ వనముతో అభేదాధ్యవసాయమును పొందినది. అమ్మవారి కేశములే వనదేవత శిరస్సుపై. వ్రాలు తుమ్మెదలుగా, చిఱునవ్వులు పూలుగా, నేత్రకాంతులు పత్రములుగా, పాదకాంతులు పల్లవములుగా భాసించుచున్నవి. మొలకయే వనదేవత, వనదేవతయే మొలకగా (అమ్మవారు) భాసించుచున్నవి. సూక్ష్మకందళి స్థూలవనముగా రూపొందినట్లున్నది. కారణమైన అమ్మవారి దయయే సూక్ష్మస్థూల దశల పొందినట్లున్నది. లేక సూక్ష్మకారణమే

స్థూలకార్యముగా రూపించునట్లున్నది. వ్యష్టి సమష్టి ఏకరూపతను పొందినట్లున్నది. స్థూలమును గడచిన సూక్ష్మవర్తమానస్థితిని అన్వేషించవలసియున్నది. ఆ సూక్ష్మస్థితి నుండియే ఈ స్థూలస్థితి వచ్చినది అని గ్రహింపవలసియున్నది. భూమియందు మొక్క మొలచును. కాని మొక్కయే ఈ శ్లోకమున కల్యాణజన్మభూమిగా వర్ణింపబడుట యొక విచిత్ర విషయము. ఇది అతిశయోక్త్యలంకార రూపము. కాంచీనగరము నందెందఱో భామామణులున్నారు. వారు కంచిలో చిల్లర మణుల వంటివారు. దానిలో మధ్యన మహామణి యున్నట్లు ఆ భామామణులలో మహామణియైన అమ్మవారు కాంచీనగర మధ్యమందున్నది. ఇంద్రనీలములు, గరుడపచ్చలు మొదలగు మణులు వెదజల్లు కాంతి ఆకుపచ్చతీవవలె నుండును. అందుచేత ఆ కృపాకన్దళియైన అమ్మవారు కాంచీమధ్యమణిగా రూపింపబడినది. అమ్మవారట్టి మణిభూమి. అది కల్యాణములకు జన్మభూమి. ఆ వనమంతయు ఆ కల్యాణవితానమే. దాని కింద మణిభూమిమయకాంచీనగరము. తన్మధ్యమున దయను కందళించు మహామణి అమ్మవారు. తేజోరూపమణికందళికి సూర్యచంద్రతేజోరూపనేత్రములు పత్రములని చెప్పుట యుచితముగా యున్నది. పూర్వార్ధమున **భ్రమరిత, పుష్పిత, పల్లవిత, పత్రిత** శబ్దములలో పదాంతానుప్రాస మున్నది. ఉత్తరార్ధమున **స్థలీ, కన్దళీ** అని ముగియుట పాదములలో అంత్యానుప్రాసమున్నది. పూర్వార్ధమున అన్ని అవయవములలోని కాంతులనే ఉపమేయములుగా చేయుటచే అమ్మవారి తేజోరూపమున వివిధ మణి వివిధ తేజములుగల మహామణిత్వము వ్యంగ్యమగు చున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి ముఖగత నేత్రములు వర్ణింపబడినవి. ఈ శ్లోకమున ఆమె ముఖము వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ రాకాచన్ద్రసమానకాన్తివదనా నాకాధిరాజస్తుతా**
**మూకానామపి కుర్వతీ సురధునీనీకాశవాగ్వైభవమ్।**
**శ్రీకాఞ్చీనగరీవిహారరసికా శోకాపహన్త్రీ సతా-**
**మేకా పుణ్యపరమ్పరా పశుపతేరాకారిణీ రాజతే॥ 11**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| రాకాచంద్రసమానకాంతివదనా | = | పున్నమచంద్రునితో సమానకాంతిగల ముఖముగల; |
| నాకాధిరాజస్తుతా | = | ఇంద్రునిచే స్తుతింపబడిన; |
| మూకానామ్ అపి | = | మూగవారికి కూడ; |
| సురధునీనీకాశవాగ్వైభవమ్ | = | ఆకాశగంగతో సమానమైన వాగ్వైభవమును; |
| కుర్వతీ | = | చేయుచున్న; |

| | | |
|---|---|---|
| శ్రీకాంచీనగరీవిహారరసికా | = | శ్రీ కాంచీనగరియందు విహరించు నాసక్తిగల; |
| సతామ్ | = | సత్పురుషులయొక్క; |
| శోకాపహర్త్రీ | = | దుఃఖమును పోగొట్టు; |
| పశుపతేః | = | శివునియొక్క; |
| ఆకారిణీ | = | ఆకారము దాల్చిన; |
| పుణ్యపరంపరా | = | పుణ్యముల వరుసయైనట్టి; |
| ఏకా | = | ఒకతె; |
| రాజతే | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము :-**

పున్నమచంద్రునితో సమానమైన కాంతిగల ముఖము గలది, ఇంద్రునిచే స్తుతింపబడినది, మూగవారికి కూడ ఆకాశగంగ వంటి వాగ్వైభవమును కలిగించు నట్టిది, శ్రీకాంచీనగరియందు అభిరుచి గలిగినది, సత్పురుషులలో శోకమును బోగొట్టునది, రూపుదాల్చిన శివుని పుణ్యముల వరుసయో యనదగినదియైన కామాక్షీదేవి విరాజిల్లుచున్నది.

**వివరణము :-**

రాకాచంద్రసమానకాంతివదనా, సురధునీనీకాశవాగ్వైభవమ్ అను సమాసములందు ఉపమాలంకార మేర్పడియున్నది. నాలుగు పాదములలో ప్రాసమున్నది. వర్ణమైత్రి యుండవలసిన చోట ప్రాసమున్నది. కావున ఈ శ్లోకమున పాదాది మధ్యానుప్రాసమున్నది. సురధుని యనగా దేవనది. ధుని యనగా ధ్వనించునది. అది వేగముగా ఆకాశమునుండి క్రిందికి దుముకును. ధ్వనించుచు క్రిందకు దుముకు ఆకాశగంగయొక్క వేగము వాగ్వైభవము మూకుల ముఖమునుండి వెలువడును. ఇది రెండవ పాదమునందలి చివరి సమాసముయొక్క భావము. అమ్మవారి కరుణతో కలిగిన మూకకవి వాగ్వైభవము ఆకాశ గంగవలె పవిత్రమైనదని వ్యంగ్యము. **శ్రీకాంచీనగరీవిహార రసికా** అను సమాసముచేత మణిద్వీపమునందలి శ్రీనగరమునకన్న శ్రీకాంచీనగరమునందు చరించుటకు అధికమైన ఆసక్తి యున్నదని ధ్వనించుచున్నది. **ఆకారిణీ** అను శబ్దమునకు ఆకారము గలది అను అర్థమే కాక పిలచునది యని అర్థము కూడ నున్నది. అమ్మవారిని మనము పిలిచినచో ఆమె పశుపతిని పిలిచి ఆయనతో కూడి మన కడకు వచ్చునదనుట వ్యంగ్యమగును.



**అవ:-** పై శ్లోకమున ఆకాశగంగ ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున దానికన్న గొప్పనదిగా అమ్మవారు నిరూపింపబడుచున్నది.

**శ్లో॥ జాతా శీతలశైలతస్సుకృతినాం దృశ్యా పరం దేహినాం**
**లోకానాం క్షణమాత్రసంస్మరణతస్సన్తాపవిచ్ఛేదినీ।**

**అశ్చర్యం బహుఖేలనం వితనుతే నైశ్చల్యమాబిభ్రతీ**
**కమ్పాయాస్తటసీమ్ని కాపి తటినీ కారుణ్యపాథోమయీ॥ 12**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| శీతలశైలతః | = | హిమగిరినుండి; |
| జాతా | = | పుట్టినది; |
| పరమ్ | = | కాని; |
| సుకృతినామ్ | = | పుణ్యాత్ములైన; |
| దేహినామ్ | = | దేహధారులకు; |
| దృశ్యా | = | చూడదగినది; |
| క్షణమాత్రసంస్మరణతః | = | క్షణకాలము సంస్మరించుటవలన; |
| లోకానామ్ | = | లోకులయొక్క; |
| సంతాపవిచ్ఛేదినీ | = | సంతాపమును బోగొట్టునది; |
| నైశ్చల్యమ్ | = | నిశ్చలభావమును; |
| ఆబిభ్రతీ | = | ధరించుచునే; |
| బహుఖేలనమ్ | = | గొప్పఆటను; |
| వితనుతే | = | చేయును; |
| కమ్పాయాః | = | కమ్పానదియొక్క; |
| తటసీమ్ని | = | ఒడ్డు ప్రదేశమున; |
| కా+అపి | = | ఒకానొక; |
| తటినీ | = | నది; |
| కారుణ్యపాథోమయీ | = | దయాజలముగలదై; |
| ఆశ్చర్యమ్ | = | ఆశ్చర్యమును; |
| వితనుతే | = | కలిగించుచున్నది. |

**తాత్పర్యము :-**

కమ్పానదీతటమున మరియొక తటిని (కామాక్షీదేవి) ఉన్నది. ఇదియు గంగవలె హిమగిరినుండియే పుట్టినది. కాని ఇది పుణ్యవంతులకు మాత్రమే లోచనగోచరమగును. క్షణకాలము సంస్మరించిన మాత్రముననే సంతాపము నంతయు నంతమొందించును. నిశ్చలముగానుండి ఆడుచుండును. ఈ నదిలో గల జలము కరుణయే.

**వివరణము :-**

హిమగిరినుండి పుట్టుట గంగకు, అమ్మవారికి సమానము. కాని గంగ కంపయు అందఱకును, కాని కమ్పానదీతీరమందున్న నది పుణ్యాత్ములకు మాత్రమే

కనిపించును. నదియొద్దున మరియొక నది యుండదు. ఇది కమ్పానది యొద్దున నున్నది. ఏ నదియైనను స్నానము చేసిన వారి తాపమునే పోగొట్టును. మానసిక సంతాపమును పోగొట్టజాలదు. కాని ఈ నది పాపజన్యమైన మానసిక సంతాపమును క్షణమాత్రము స్మరించినంతనే తొలగించును. నిశ్చలముగా నున్న దాటలాడజాలదు. కాని ఈ నది నిశ్చలముగా నుండియే సృష్టిస్థితి లయముల ఆటలాడును, ఈ నదిలో నీరు లేదు. దానికి బదులు కరుణయే ఉన్నది. ఈ కరుణాజలమునే ఇది ప్రవహింపజేయును. ఈ శ్లోకమున రూపక వ్యతిరేకవిరోధాలంకారములు గలవు. మూడవపాదమున యతిస్థానమున యతితో పాటు ప్రాసమున్నది. నాల్గవపాదమున కకారము వర్ణమైత్రి రూపమున ఉన్నది. కుమ్మరివాడు కుండను చేయుటకు హస్తపాదాది చేష్టల నొనరించును. అమ్మవారు జగముయొక్క సృష్టిస్థితిలయములను ఖేలామాత్రముగం జేయును. హస్తపాదాది చలనమును బాలునివలె నాచరించదు. **ఇచ్ఛామాత్రమ్ ప్రభోః సృష్టిః లీలార్థమితి చాపరే** ఇత్యాది వాక్యములవలన జగద్వ్యాపారమున జగత్సృష్టి స్థితిలయాది లీలలందు హస్తపాదరహిత గావున వాని చేష్టలకు ప్రసక్తి లేదు. విగ్రహమునను నైశ్చల్యమును ధరించుచునే, విగ్రహమున హస్తపాదాదులున్నను వానిని కదలించకయే, సంకల్పమాత్రమున లయాది క్రీడల నొనరించును.



**అవ:-** పై శ్లోకమున కమ్పాతటమునందలి తటినిగా అమ్మవారు నిరూపింప బడినది. ఈ శ్లోకమున ఆమె దాని యందలి యొక ధామముగా నిరూపింప బడుచున్నది.

**శ్లో॥ ఐక్యం యేన విరచ్యతే హరతనౌ దమ్భావపుమ్భావకే**
**రేఖా యత్కచసీమ్ని శేఖరదశాం నైశాకరీ గాహతే।**
**ఔన్నత్యమ్ముహురేతి యేన స మహాన్మేనాసఖస్సానుమా-**
**న్కమ్పాతీరవిహారిణా సశరణాస్తేనైవ ధామ్నా వయమ్॥ 13**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| యేన | = | ఎవరిచేత; |
| దమ్భావపుమ్భావకే | = | దమ్భావ పుమ్భావములుగల; |
| హరతనౌ | = | శివుని శరీరమందు; |
| ఐక్యమ్ | = | ఐక్యము; |
| విరచ్యతే | = | చేయబడుచున్నదో; |
| యత్కచసీమ్ని | = | దేని కేశప్రదేశమున; |
| నైశాకరీ | = | చంద్రునికి సంబంధించిన; |
| రేఖా | = | రేఖ; |
| శేఖరదశామ్ | = | శిరోభూషణతను; |

| | | |
|---|---|---|
| గాహతే | = | పొందుచున్నదో; |
| యేన | = | దేనితో; |
| మేనాసఖః | = | మేనకకు స్నేహితుడైన; |
| మహాన్ | = | గొప్పవాడగు; |
| సః | = | ఆ; |
| సానుమాన్ | = | హిమవంతుడు; |
| ముహుః | = | మాటిమాటికి; |
| ఔన్నత్యమ్ | = | ఔన్నత్యమును; |
| ఏతి | = | పొందునో; |
| కమ్పాతీరవిహారిణా | = | కమ్పానదీతీరమున విహరించు; |
| తేన | = | ఆ; |
| ధామ్నా ఏవ | = | ధామముచేతనే; |
| వయమ్ | = | మేము; |
| సశరణాః | = | దిక్కుగలవారము. |

**తాత్పర్యము :-**

కమ్పాతీరమున నొక ధామము విహరించుచున్నది. దమ్భావ పుమ్భావములు గల, శివుని శరీరమునందు ఐక్యత రచింపబడుచున్నది. దాని కేశప్రదేశమున చంద్రరేఖ భూషణముగ నొప్పుచున్నది. దాని పుట్టుకచేత హిమాలయపర్వతరాజింకను ఔన్నత్యమును పొందుచునే యున్నాడు. కమ్పాతీరమున విహరించు ఆ ధామమే మాకు దిక్కై యున్నది.

**వివరణము :-**

అమ్మవారు శివుని శరీరమునందైక్యమై యున్నది. అనగా అమ్మవారే శివుని శరీరము. శివుని శరీరమే అమ్మవారు. శరీరి శివుడు. శరీర నాయకుడు శరీరి. శరీరమైన అమ్మవారి కాయన నాయకుడు. కావున శివుని శరీరముతో అమ్మవారి కైక్యము. శరీరి శరీరములకు శేషి శేషభావ మంగీకరింపబడును. శివుడు శేషి, అమ్మవారు ఆయనకు శేషభూతము. శరీరము దృశ్యకోటికి చెందినదైనను దృగ్భావము దానియందేర్పడియుండును. దానికే **అహంకారమని** పేరు. గృహారామక్షేత్రాదులు పెక్కు దృశ్యములున్నను, వానియందు మమకారమే కాని అహంకార ముండదు. నేనొక ప్రభువునకు చెందిన వాడను లేక నేను ప్రభువును ఇత్యాదులు అహంకార రూపములు. ఇదమ్ మమ అనునది మమకార రూపము. ఇదమ్ తవ అనునది తవకార రూపము. ఇదమ్ తదీయమ్ అనునది తదీయభావము. ఇది నాది, వీడు నా సేవకుడు ఇత్యాదులు మమకారరూపములే కాక ఇదమ్భావ రూపములు. ఇది (నా) శరీరము, ఇది (నా) గృహము, ఇది (నా) తోట, ఇది (నా) పొలము ఇత్యాదులు మమకారరూపములు. ఇదమ్భావ రూపములు, దృశ్యమునందు స్వీయబుద్ధి మమకారము. ఇదమ్ అనునది

దృశ్యతను చెప్పు శబ్దము. కావున ఇదమ్ భావము దృశ్యము నందంతట గోచరించును. నేను పురుషుడను, నేను స్త్రీని- ఇత్యాదులు అహంకార రూపములు. నేను అనునది తాను కాని వస్తువున నుపయోగించినపుడు అహంకారము అనబడును. లేక అహమ్ భావము అనబడును. గర్వము అను నర్థమున వీనికి ప్రయోగముండుట విషయాంతరము. అస్తు. హర తనువు బ్రహ్మాండము. జీవునకు పిండాండమువలె హరున కది దృశ్యము. ఇదమ్ పద వాచ్యము. ఇదమ్ పదమునకు అర్థము ఇది. ఇది యనగా దృశ్యమని చెప్పుకొంటిమి. దీనికి ద్రష్ట ఎవరు? ఆత్మ ద్రష్ట. ఆత్మను ఉద్దేశించి శరీరగత పుంస్త్వమును ఆరోపించి లేక ద్రష్టత లేని ద్రష్టకాని మనోబుద్ధి స్థూలశరీరాదికము నందు ద్రష్టత నారోపించి నేను సుఖిని, దుఃఖిని, చూచువాడను, వినువాడను- అను అహంకారమును జనులు ప్రదర్శించుట మన మెఱుగుదుము. శరీరగత పుంస్త్వమును ఆత్మయందు ఆరోపించుట ఒకవిధమగు అహంకారము. ఆత్మగత ద్రష్టతను దేహేంద్రియాదికము నందారోపించుట మరొక విధమగు అహంకారము. ప్రకృతి దృశ్యము కావున దృశ్యమునందు స్త్రీత్వము పురుషుడు (ఆత్మ) ద్రష్ట. కావున ద్రష్టయందు పుంస్త్వమును ఆరోపించి వ్యవహరించుట (ఆధ్యాత్మిక వ్యవహారము) ప్రచురముగా నున్నది. దృశ్యమునందు ఇదమ్ భావము, ద్రష్టతారోపము కలిగిన దేహేంద్రియాదికమునందు పుమ్ భావము ఆరోపింప బడిన వ్యవహారమునందున ఈ ఆరోపణములు గల పుమ్భావేదమ్భావములు హరతనువునందు గలవు. అట్టిదేయైన అమ్మవారు (ప్రకృతి) ఆ హరతనువుతో నైక్యమునందినదని శ్లోకమునందలి పార్వతీపరమేశ్వరుల కైక్యము చెప్పు ప్రథమ పాదమున హరతనువునకు విశేషణముగా **దమ్భావపుమ్భావకే** అను సమాసము ప్రయోగింపబడినది. ఇదమ్భావ శబ్దమునకు బదులుగా (ఛందస్సులో పడుటకు) దమ్భావ శబ్దము ప్రయోగింపబడినది. **అయమ్ పురుషః** వీడు పురుషుడు అను వాక్యమున అయమ్ అనునది ఇదమ్ శబ్దముయొక్క పుంలింగైక వచనాంతము అనగా దానియందు ఇదమ్ భావమున్నది. పురుషః అను శబ్దము నందు పుమ్ భావమున్నది. శ్లోకమున **దమ్భావపుమ్భావకే** అను విశేషణము హరతనువును విశేషించుచున్నది. పురుషుడన్న నిట్లుండవలె అని హరతనువును ప్రశంసించుట ఆ ప్రథమపాదార్థము అని మరొక విధముగా వ్యాఖ్యానించవచ్చును. **అయమ్ పురుషః** అని హరతనువు ప్రశంసింపబడుట అమ్మవారు దానియందైక్యము నొందుటచే తానే ఇటువంటి భార్యను పొందిన వీడే పురుషుడు అను **ఇదమ్ భావ పుమ్ భావముల** వ్యవహారమునకు తగిన అర్హతను హరతనువునకు కలిగించిన దమ్మవారని సారాంశము. హరతనువు నందైక్యము అమ్మవారొందుట అర్ధనారీశ్వరత్వ వ్యంజకము కూడ. చంద్రరేఖ శిరోభూషణముగా నున్నదనుట ద్వితీయపాదార్థము. తృతీయపాదమున హిమవంతు దనక **మేనాసఖః సానుమాన్** అనుట హిమవంతునే భంగ్యంతరముగా చెప్పుటచే పర్యాయోక్త్యలంకార మేర్పడియున్నది. అమ్మవారి పుట్టుకచేత తొలుతనే

ఉన్నతుడైన హిమవంతు డింకను ఔన్నత్యమును పొందుచునే యున్నాడనుట వలన ఔన్నత్యమును పొందుట పూర్తి కాలేదని ఇంకను జరుగుచునే యున్నదని ఏతి అను వర్తమానార్థకక్రియచేత వ్యంగ్యమగుచున్నది. ఆ ధామముచేతనే మాకు రక్షణ కలుగుచున్నదను కవి రతి నాల్గవ పాదమున వ్యంగ్యమగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కచములకు చంద్రకళ భూషణమని చెప్పబడినది. ఈ శ్లోకమున దానితో అమ్మవారు కౌమలమును తిరస్కరించుట చెప్పబడినది.

**శ్లో॥ అక్ష్ణోశ్చ స్తనయోశ్శ్రియా శ్రవణయోర్బాహ్వోశ్చ మూలం స్పృశ-**
**న్నుత్తంసేన ముఖేన చ ప్రతిదినం ద్రుహ్యన్పయోజన్మనే।**
**మాధుర్యేణ గిరాం గతేన మృదునా హంసాఙ్గనాం హ్రేపయ-**
**న్కాఞ్చీసీమ్ని చకాస్తి కోఽపి కవితాసన్తానబీజాఙ్కురః॥ 14**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| అక్ష్ణోః | = | కన్నులయొక్క; |
| స్తనయోః చ | = | స్తనములయొక్కయు; |
| శ్రియా | = | కాంతిచేత; |
| శ్రవణయోః | = | చెవులయొక్క; |
| బాహ్వోః చ | = | భుజములయొక్కయు; |
| మూలమ్ | = | మూలమును; |
| స్పృశన్ | = | తాకుచు; |
| ఉత్తంసేన | = | శిరోలంకారముచేత; |
| ముఖేన చ | = | ముఖముచేతను; |
| ప్రతిదినమ్ | = | ప్రతిదినము; |
| పయోజన్మనే | = | కమలముకొఱకు; |
| ద్రుహ్యన్ | = | ద్రోహము చేయుచు; |
| గిరామ్ | = | వాక్కులయొక్క; |
| మాధుర్యేణ | = | తీయదనముచేత; |
| మృదునా | = | మెత్తనైన; |
| గతేన చ | = | నడకచేతను; |
| హంసాంగనామ్ | = | ఆడుహంసను; |
| హ్రేపయన్ | = | స్పర్థిల్లజేయుచు; |
| కాంచీసీమ్ని | = | కాంచీనగర ప్రదేశమునందు; |

| | | |
|---|---|---|
| కః+అపి | = | ఒకానొక; |
| కవితాసంతానబీజాంకురః | = | కవిత సమూహముయొక్క బీజాంకురము (కామాక్షీదేవి); |
| చకాస్తి | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము :-**

కన్నులకాంతిచేత కరమూలమును, స్తనముల కాంతిచేత బాహుమూలమును తాకుచు, శిరోలంకారముచేత ముఖముచేతను కమలమునకు ద్రోహ మొనర్చుచు వాక్కులయొక్క మాధుర్యముచేత మంద గమనముచే ఆడుహంసను స్పర్ధిల్ల జేయుచు ఒక కవితాసంతానబీజాంకురము కంచినందు విరాజిల్లుచున్నది.

**వివరణము :-**

కన్నులు స్తనములు కాంతితో చెవులను బాహుమూలమును తాకుచున్నవి అని కన్నులు కాంతితో చెవులను, స్తనములు కాంతితో బాహుమూలమును తాకుట అను క్రమము పాటించబడుట చేత క్రమాలంకారము ప్రథమపాదమున నున్నది. రెండవపాదము శిరోభూషణము ముఖము రెండు కలసి కమలమునకు ద్రోహమొనరించు చున్నవి అని చెప్పుటచే సముచ్చయా లంకార మేర్పడియున్నది. చంద్రకల యుదయించిన కమలము ముదుచుకొని పోవుటచే చంద్రకల ద్రోహము లోకప్రసిద్ధమే. అమ్మవారి ముఖము తన కాంతితో కమలమును మించి యుండుటచేత కమలద్రోహ మొనర్చు చున్నదని చెప్పుటచేత ఉపమానతిరస్కార ప్రయోజనమైన ప్రతీపాలంకారముయొక్క స్ఫూర్తి యున్నది. పై రెంటిలో నేదో యొకటి చంద్రకలయో, ముఖమో కమలమును తిరస్కరించ కలిగియుండగా రెండు కలిసినచో నా కమలము తలవంచుకొనక తప్పదు అను అర్థము వ్యంగ్యమగుచున్నది. మూడవపాదమున వాఙ్మాధుర్యము హంసాంగన కూతకన్న మధురమని హంసాంగనకన్న వారి మందగమనమే మిన్న అని స్ఫురించుటచేతను ప్రతీపాలంకారస్ఫూర్తి యున్నది. నాల్గవపాదమున అమ్మవారు కవితాసంతాన బీజాంకురముగా రూపింపబడుట చేత అమ్మ దర్శన, పూజనాదులొనర్చిన వారికి కవిత్వము బాగుగా చెప్పు సామర్థ్యము అబ్బునను అర్థము వ్యంగ్యమగును. మొత్తము శ్లోకమున అమ్మవారు ఆకర్ణాంతవిశాలనేత్ర యని భుజములవఱకు వ్యాపించిన స్తనకాంతి గలదని, కమలమును మించిన ముఖసౌందర్యము కలదని, చంద్రుని శిరమున ధరించినదని, హంసకన్న మించిన మందగమనసౌందర్యము కలదని వాఙ్మాధుర్యము కలదని సారాంశము.



**అవ:-** అమ్మవారి ఉపమాతిశాయి రూపసౌందర్యము పై శ్లోకమున వర్ణింపబడినది. ఈ శ్లోకమున అట్టి గొప్ప రూప సౌందర్యము గల శరీరముతో తనకు సారూప్యము కావలెనని కవి ప్రార్థనము చెప్పబడుచున్నది.

శ్లో॥ ఖణ్డం చాన్ద్రమసం వతంసమనిశం కాఞ్చీపురే ఖేలనం
కాలాయశ్ఛవితస్కరీం తనురుచిం కర్ణేజపే లోచనే।
తారుణ్యోష్మనఖమ్పచం స్తనభరం జఙ్ఘాస్పృశం కున్తలం
భాగ్యం దేశికసఞ్చితమ్మమ కదా సమ్పాదయేదమ్బికే॥ 15

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| అనిశమ్ | = | ఎల్లప్పుడు; |
| చాన్ద్రమసమ్ | = | చంద్రునికి సంబంధించిన; |
| ఖండమ్ | = | ముక్క; |
| వతంసమ్ | = | శిరోలంకారము; |
| కాంచీపురే | = | కాంచీనగరమున; |
| ఖేలనమ్ | = | ఆట; |
| కాలాయశ్ఛవితస్కరీమ్ | = | నల్లని ఇనుముయొక్క కాంతిని దొంగిలించు; |
| తనురుచిమ్ | = | శరీరకాంతి; |
| కర్ణేజపే | = | కర్ణములతో ముచ్చటలాడు; |
| లోచనే | = | కన్నులు; |
| తారుణ్యోష్మనఖంపచమ్ | = | యౌవనపు వేడిచే గోరువెచ్చనైన; |
| స్తనభరమ్ | = | చనుల బరువు; |
| జంఘాస్పృశమ్ | = | పిక్కలను తాకు; |
| కున్తలమ్ | = | కేశపాశము; |
| దేశికసంచితమ్ | = | గురువుచే కూర్చబడిన భాగ్యము; |
| అమ్బికే | = | అమ్మా! |
| మమ | = | నాకు; |
| కదా | = | ఎప్పుడు; |
| సమ్పాదయేత్ | = | లభించునో గదా! |

**తాత్పర్యము :-**

అమ్మ యనగా గురుసంచితమైనభాగ్యము. శిరోభూషణము చంద్రఖండము. కాంచీపురమున ఆట, నల్లని ఇనుముయొక్క కాంతిని దొంగిలించు శరీరకాంతి, చెవులతో ముచ్చటలాడు కన్నులు, యౌవనపు వేడితో గోరువెచ్చని స్తనముల బరువు, పిక్కలను తాకు కేశపాశము-ఇది అంతయు గురుసంచితమైనభాగ్యము. అది నా కెప్పుడు లభించునో గదా!

**వివరణము :-**

విద్యావంశము జన్మవంశము అని వంశము రెండు విధములుగ నుండును.

వంశము నందలి భాగ్య మా వంశీయులకు చెందును. తండ్రి కొడుకునకు పితృపితామహ పరంపరా ప్రాప్తమైన ధనమును వలయునంత వఱకు దాచి యుంచి తను ఇచ్చునట్లు పరమ్పరా ప్రాప్తమైన దైవతార్చనమును, జపింపదగిన మంత్రమును, ఉపాసనా విధానమును, శిష్యునకు గురువు కాపాడియిచ్చును. మూకమహాకవి గురువు కడ అమ్మవారే ఒక భాగ్యముగా నున్నది. ఆ గురువున కాయమ్మ యెప్పుడు చంద్రకిరీటముతో నల్లని కాంతితో ఆకర్ణాంత విశాలనేత్రములతో సాంద్రస్తనభారముతో పిక్కల తాకు కేశపాశముతో కాంచీపురమున నాటలాడుచున్నట్లు కనిపించుచుండును. ఒక్కొక్కప్పుడు శిష్యులకు గురువు అమ్మవారుగానే సాక్షాత్కరించును. ఆ గురువు భాగ్యమంతయు అమ్మవారే. గురువునకు అమ్మవారి సాయుజ్యమే లభించినది. ఆ గురువుయొక్క గురువునకు ఆ భాగ్యమే యుండెను. ఆ గురుపరమ్పరలోని పూర్వ గురువులందఱు అమ్మవారి సాయుజ్యమును బ్రతికియుండగనే పొందిన వారు. శిష్యుడైన తనకా భాగ్యమెప్పుడు కలుగునా! యని బాధపడుచున్నాడు. అమ్మవారు తనకు కనీసము సారూప్య దర్శన భాగ్యమెన్నడు కలిగించునో యని బాధపడు చున్నాడు. మనము సాధారణముగా మంచి యిల్లు కట్టుకొను భాగ్యమునో, ఉన్నతాధికార, పుత్రప్రాప్తి భాగ్యమునో నశ్వరమైన అట్టి ఏదో భాగ్యమును కోరుకొనుచుందుము. కాని మూకమహాకవి కా నశ్వరమైన భాగ్యమేదియు అక్కఱలేదు. వాని నాయన కోరనే కోరడు. అమ్మవారి కున్న పైన పేర్కొనబడిన చిహ్నములు తన కెన్నడు కలుగునా యని తపించుచున్నాడు. పూర్వార్ధమున వర్ణమైత్రి కవర్ణ రూపమున కనిపించుచున్నది.



**అవ:–** పై శ్లోకమున అమ్మవారి సారూప్యప్రాప్తి భాగ్యము కలుగవలెనను కవి ప్రార్థనము చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి భౌతికాధ్యాత్మిక భజనము తత్ప్రాప్తి సాధనముగా కవి భజించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ తన్వానం నిజకేళిసౌధసరణిం నైసర్గికీణాం గిరాం**
**కేదారం కవిమల్లసూక్తిలహరీసస్యశ్రియాం శాశ్వతమ్।**
**అంహోవఞ్చనచఞ్చు కిఞ్చన భజే కాఞ్చీపురీమణ్డనం**
**పర్యాయచ్ఛవి పాకశాసనమణేః పౌష్పేషవం పౌరుషమ్॥ 16**

**ప్రతిపదార్థము :–**

నైసర్గికీణామ్ = స్వాభావికములైన;
గిరామ్ = వాక్కులకు (వేదములకు);
నిజకేళిసౌధసరణిమ్ = తన క్రీడా భవన మార్గమును;
తన్వానమ్ = చేయుచున్న;
కవిమల్లసూక్తిలహరీ సస్యశ్రియామ్ = గొప్ప కవుల మంచిమాటల ప్రవాహములనెడి పంటలకు;

| | | |
|---|---|---|
| శాశ్వతమ్ | = | నిత్యమైన; |
| కేదారమ్ | = | పొలమైన; |
| అంహోవంచనచంచు | = | పాపముల వంచించు సామర్థ్యముగల; |
| కాంచీపురీమండనమ్ | = | కాంచీనగరమున కలంకారమైన; |
| పాకశాసనమణేః | = | ఇంద్రనీలమణికి; |
| పర్యాయచ్ఛవి | = | సమానమైన కాంతిగల; |
| పౌష్పేషవమ్ | = | మన్మథునకు సంబంధించిన; |
| పౌరుషమ్ | = | పౌరుషమును(అమ్మవారిని); |
| కించన | = | ఇంచుకంత; |
| భజే | = | సేవించెదను. |

**తాత్పర్యము :-**

వేదవాక్కులను తన కేళిసౌధమార్గముగా చేయుచున్న, గొప్ప కవుల మంచిమాటల ప్రవాహములనెడి పంటలకు పొలమైన, పాపముల నశింపజేయ గల కాంచీపురాలంకారమైన ఇంద్రనీలమణి కాంతిగల, మన్మథుని పౌరుష మనదగిన అమ్మవారిని సేవించెదను.

**వివరణము :-**

అమ్మవారి కడకు పోవు మార్గము కావలెను. ఇది భక్తుల వారథి. ఆ మార్గమేది? వేదములే. ఆ మార్గము వైదికములైన నిష్కామకర్మోపాసనల నొనరించిన వారికి సాలోక్య సామీప్య ముక్తులు లభించును. అమ్మవారి లోకము నందలి అమ్మవారి భవనములోనికి ప్రవేశము లభించును. ప్రథమపాదమున లభించు అర్థమిది. ఇతర కవుల నోడించగల కవులు కవిమల్లులు. వారు గొప్ప కృషీవలులు. అమ్మవారను పొలమున ఆమెతత్త్వమును వివరించు మంచిమాటలు అను పంటలను వారు పండించెదరు. వారి సూక్తిసస్యములకు అమ్మవారే పొలము. అనగా ఆధారము. పొలమున్ననే కృషీవలుల కృషి కొనసాగును. అట్లే అమ్మవారే వారి కవితా సూక్తులను పండించుటకు ఆధారమైన శాశ్వతమైన పొలము. సాధారణ కవులు లౌకికమైన విషయములను గూర్చి కవిత లల్లెదరు. గొప్ప కవులు భగవతీతత్త్వమును వివరించు కవిత లల్లెదరు. ఎంతమంది కవులు ఎంత పంట నేకాలమునైన పండించునంత సార మా పొలమున నున్నది. ఇది ద్వితీయపాదమున లభించు అర్థము. అమ్మవారు కాంచీపురమునకే అలంకారము. పాపాంధకారమును చీల్చు సామర్థ్యము గల అలంకారము. అది సూర్యచంద్రాదుల కాంతివంటి కాంతిని వెలువరించదు. ఆమె వెలువరించు కాంతి ఇంద్రనీలమణికి పర్యాయము. అనగా నీలకాంతి, మన్మథుని పౌరుష మంతయు అమ్మవారే. శివునోడించుట మన్మథుని కామె వలననే సాధ్యమైనది. మన్మథుడు పౌరుషము గలవాడు.

రూపెత్తిన పౌరుషము అని కీర్తింపబడినాడు. ఇది ఉత్తరార్ధమున లభించు అర్థము. అమ్మవారు అని చెప్పక సూక్తి సస్య శాశ్వత కేదారము పుష్పేషు పౌరుషము అని చెప్పుటచే అతిశయోక్త్యలంకార మేర్పడినది. కాని అమ్మవారి పట్ల ఎట్టి అతిశయోక్తులును అల్పోక్తులే యగునను మాట మఱువరాదు. మూడవపాదమున అంహోవంచన చంచు కించన కాంచీపురీమండనమ్ అను పదములలో వృత్త్యనుప్రాసమను శబ్దాలంకార మున్నది. నాల్గవపాదమున పదాది పకార వర్ణమైత్రి యున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారియందు కాముని పౌరుషము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె కామినిగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆలోకే ముఖపఙ్కజే చ దధతీ సౌధాకరీం చాతురీం**
**చూడాలఙ్క్రియమాణపఙ్కజవనీవైరాగమప్రక్రియా।**
**ముగ్ధస్మేరముఖీ ఘనస్తనతటీ మూర్ఛాలమధ్యాఞ్చితా**
**కాఞ్చీసీమని కామినీ విజయతే కాచిజ్జగన్మోహినీ॥ 17**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| ఆలోకే | = | చూపునందు; |
| ముఖపంకజే చ | = | వదనకమలమునందును; |
| సౌధాకరీమ్ | = | చంద్రునికి సంబంధించిన; |
| చాతురీమ్ | = | నైపుణిని; |
| దధతీ | = | ధరించునదియైన; |
| చూడాలంక్రియమాణ పంకజవనీ వైరాగమ ప్రక్రియా | = | కొప్పునందు అలంకరింపబడుచున్న కమల వన వైరముల ప్రక్రియ గల; |
| ముగ్ధస్మేరముఖీ | = | చక్కని చిఱునవ్వు మోముగల; |
| ఘనస్తనతటీ | = | గొప్ప స్తనప్రాంతముగల; |
| మూర్ఛాలమధ్యాంచితా | = | మూర్ఛపడుచున్న నడుముతో నొప్పిన; |
| జగన్మోహినీ | = | జగన్మోహినియైన; |
| కాచిత్ | = | ఒకానొక; |
| కామినీ | = | కామిని; |
| కాంచీసీమని | = | కాంచిసీమయందు; |
| విజయతే | = | సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది. |

**తాత్పర్యము :-**

చూపునందు ముఖమునందును అమృతమును చిందించు నైపుణ్యము, కొప్పు

నందలంకరింపబడుచున్న కమల వనవైర ప్రక్రియగల, చక్కని చిఱునవ్వు గల, గొప్ప స్తన ప్రాంతము గల, మూర్ఛపడుచున్న నడుముతో నొప్పిన జగన్మోహిని యైన యొకానొక కామిని కాంచీసీమయందు సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**వివరణము :-**

అమ్మవారి యొక కన్ను చంద్రుడు. కావున ఆమె చూపు అమృతమును చిందు నైపుణ్యమును కలిగియున్నది. అట్లే ఆమె ముఖమును అమృతము చిందించు చున్నది. ఆమె చూపు ఆమె సంతానమైన జగమునం దమృతమును చిలుకుచుండగా ఆమె ముఖచంద్రునిలోని అమృతమును శివుడు జుఱ్ఱుకొను చున్నాడు అను వ్యంగ్యార్థము వచ్చు సముచ్చయాలంకారము ప్రథమపాదమున నున్నది. పంకజవనముతో వైరప్రక్రియ చంద్రకలారూపము. కొప్పునందు దాని నలంకరించుకొనుచున్నది అమ్మవారు అని రెండవపాదమందు, మొదటి పాదమునందును భంగ్యంతరముగా చంద్రకల, చంద్రుడు చెప్పబడుటచే పర్యాయోక్త్యలంకారము లున్నవి. మూడవపాదమున మూర్ఛపడుచున్న నడుమనగా సన్నని నడుము. పడిపోవునేమో యన్నంత సన్నముగా నున్నది. పైగా అది బోలెడంత స్తనభారము కలిగియున్నది. అది చూచిన వారికి ముఖ్యముగా శివునికి మూర్ఛ వచ్చినంత పనియగును. మా ఆహారమునకై ఇంత స్తనభారము నీ నడుము మోయుచున్నదని చూచిన సంతానమునకు మూర్ఛ వచ్చినంత పనియైనది. శివుడా ఘనస్తనభారముల మోయు నడుమును చూచి తనను తానే మఱచి, మూర్ఛ వచ్చిన వానివలె చేష్టలుడిగి యున్నాడు. సంతానముయొక్కయు, భర్తయొక్కయు మూర్ఛను చూచి అమ్మవారు చిఱునవ్వు దాచుకొను చున్నను పెదవులను దాటుచునే యున్నది. మూడవపాదమున నీ మూడు విశేషణములు పై వస్తువును ధ్వనింపజేయుచున్నవి. కామాక్షి కన్నులలో కామమున్నది. అందుచేతనే ఆమె కామిని. ఆమె యెదలో మరింత భద్రముగా తానుండవచ్చునని మన్మథుడామె యెదలోనే దూరినాడు. అందు శివుడున్నాడు. ఆయనను చూచిన కాముడు పారిపోవలె. కాని పారిపోలేదు. ఏల? ఆ శివుడామె యెదలో నుండుటకు తానే కారణము. పైగా అది అమ్మవారి యెద. దానిలోనికి ఆగంతకుడుగా వచ్చిన శివుడు ఆగంతకుడుగా వచ్చిన తనను పొమ్మనుట కెట్టి యధికారము లేని వాడని గ్రహించి కాముడందులోనే యున్నాడు. ఇంతలో నెచటినుండియో శివుడామె ముందఱకు వచ్చినాడు. విచ్చుకొన్న ఆమె కన్నుల కిటికీలలో నుండి కాముడు తన వలన శివుడు భగ్నవ్రతుడై కాళ్ళ బేరమునకు వచ్చిన సంగతి గ్రహించి జగన్మోహినియైన అమ్మవారి యెదలో కాని, కన్నులలో కాని తాను నిర్భయముగా నున్నాడు. అందుచే నామె ఒకానొక కామిని యని చెప్పబడినది. ఆమెకు మనమును జయ వెట్టుదము. మూడవ పాదమున **ము** కార వర్ణమైత్రి, నాల్గవపాదమున ఐదు పదములలో మూడు పదములు కకారాదులై కకార వర్ణమైత్రి కలవై వృత్త్యనుప్రాసముతో దాని నలంకరించుచున్నవి.



**అవ:-** పై శ్లోకమున కామినీ ప్రస్తావన మున్నది. ఈ శ్లోకమున కామినీ భేదమైన అభిసారికయొక్క కృత్యమైన అభిసృతి ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ యస్మిన్నమ్బ! భవత్కటాక్షరజనీ మన్దేఽపి మన్దస్మిత-**
**జ్యోత్స్నాసంస్నపితా భవత్యభిముఖీ తం ప్రత్యహో దేహినమ్**
**ద్రాక్షామాక్షికమాధురీమదభరవ్రీడాకరీ వైఖరీ**
**కామాక్షి! స్వయమాతనోత్యభిసృతిం వామేక్షణేవ క్షణాత్॥ 18**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| అమ్బ | = | అమ్మా! |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| మందే+అపి | = | మందుడైనను; |
| యస్మిన్ | = | ఎవనియందు; |
| మందస్మితజ్యోత్స్నాసంస్నపితా | = | చిఱునవ్వు వెన్నెలలో స్నానమాడినదై; |
| భవత్కటాక్షరజనీ | = | నీ చూపనెడి రాత్రి; |
| అభిముఖీ | = | అభిముఖి; |
| భవతి | = | అగునో; |
| తమ్ | = | ఆ; |
| దేహినమ్ ప్రతి | = | మనుజుని గూర్చి; |
| అహో | = | ఆహా; |
| ద్రాక్షామాక్షికమాధురీమదభర వ్రీడాకరీ | = | ద్రాక్షలయొక్క తేనెయొక్క తీపియొక్క గర్వముయొక్క భారమునకు సిగ్గు కలిగించు; |
| వైఖరీ | = | వైఖరీ వాక్కు; |
| క్షణాత్ | = | క్షణకాలములో; |
| వామేక్షణేవ | = | స్త్రీవలె; |
| స్వయమ్ | = | స్వయముగా; |
| అభిసృతిమ్ | = | అభిసరణమును; |
| ఆతనోతి | = | చేయును. |

**తాత్పర్యము :-**

అమ్మవారియొక్క కటాక్షమను రాత్రి చిఱునవ్వు వెన్నెలలో స్నానమాడి, మందుడైనను ఎవ్వాని కభిముఖి యగునో వానిని గూర్చి ద్రాక్షల తేనెల మాధురికి సిగ్గును కల్గించు వాగ్వైఖరి వెంటనే స్త్రీవలె అభిసరించి వచ్చును. ఆహా!

**వివరణము :-**

అమ్మవారి చూపు రాత్రిగా, మందస్మితము జ్యోత్స్నగా రూపింప బడుటచే

పూర్వార్ధమున రూపకాలంకార మేర్పడియున్నది. అమ్మవారు పెదవులు విప్పి విప్పకయే నవ్వినది. అంతలోనే ఆమె దంతకాంతి తెల్లగా పెదవులపై పఱచుకొన్నది. ఆమె కన్నుల వఱకు అది వ్యాపించినది. ఆ చిఱునవ్వు కన్నులలో నుండి వచ్చుచున్నట్లే ఉన్నది. ఆ కన్నులలోని కటాక్షము ఆ చిఱునవ్వు వెన్నెలలో తానమాడినట్లున్నది. అనుగమ్యోత్ప్రేక్షాలంకారము పూర్వార్ధమున ఉన్నది. ఆమె ఒక మందునికభిముఖముగా వచ్చినది. మందుడైన నేమి? వాని కడకు విదగ్ధయైన వామేక్షణవలె తీయని వాక్కు (స్త్రీ) అభిసరించి వచ్చినది. ఆ మందుని నోటనుండి ద్రాక్షల తేనెల తీపికన్న ఎక్కువ తీపికల వాక్కు ప్రవాహముగా వెలువడిన దనుటచే ఉపమాలంకారమేర్పడియున్నది. స్త్రీ లింగములైన అభిముఖీ, అభిసృతి అను పదములు ప్రేమగల శృంగారముగల, కామము గల, కామినీ వ్యవహారమును స్ఫురింపజేయుటచే వాచ్యమైన ఉపమాలంకారముచే సమాసోక్త్య లంకారముయొక్క స్ఫూర్తి కలుగుచున్నది. **చత్వారి వాక్పరిమితా పదాని... తురీయం వాచో మనుష్యా వదంతి** ఋ.1-164.45 అను శ్రుతి వాక్కు నాలుగు విధములని, వానిలో మొదటి మూడు పరా, పశ్యంతి, మధ్యమలు గుహలో అప్రకటముగా దాగి యున్నవి. నాల్గవదైన వైఖరి యను వాక్కును మనుష్యులు పలికెదరని చెప్పుచున్నది తంత్రశాస్త్రము. జీవునియొక్క వివక్షచే వాయువుచే ప్రేరేపింపబడిన (గుదగత) మూలాధారగతయైన పరయను వాక్కు (నాభిగత) మణిపురమున పశ్యంతిగా మారును. అది (ఉరోగత) అనాహతమున మధ్యమగా మారును. అది ఇంకను పైకి పోయి (కంఠగత) విశుద్ధమున అకారాది క్షకారాంత వైఖరి యను పేరుగల నాల్గవ వాక్కై వెలువడి ఎదుటివారి చెవులకు వినిపించును అని చెప్పుచున్నది. శ్లోకమున వైఖరీ శబ్దమును వివరించుటకై పై శ్రుతి తంత్రములలోని అర్థ ముదహరింపబడినది. నాల్గవపాదమున వర్ణమైత్రికి బదులు ప్రాసము ప్రయోగింపబడినది. ప్రేమగల నాయిక తన ప్రియు ననుసరించును. అట్టి అభిసరించు నాయిక అభిసారిక యనఁబడును. సిగ్గు, భయము గల నాయిక చీకటి రాత్రి తన ప్రియునభిసరించును. సిగ్గు పడవలసిన, భయపడవలసిన అవసరము లేని నాయిక బాహాటముగా వెన్నెల రాత్రి ప్రియు నభిసరించును. చీకటిలో నభిసరించు నాయిక తమోభిసారిక యని, వెన్నెలలో నభిసరించు నాయిక జ్యోత్స్నాభిసారిక యని చెప్పబడినది. అభిముఖియైనచో నెట్లేని అభిసరించగలిగిన స్త్రీ అభిసారిక. అమ్మవారి చూపు అను రజని (రాత్రి) యను స్త్రీ అభిముఖియైనది. ఆ విషయము నెఱిగిన మరొక స్త్రీ వైఖరి వాని నభిసరించినది. లోకమున అభిముఖియైన స్త్రీ అభిసరించును. కాని ఇచట అభిముఖియైనది కటాక్షరజని. అభిసరించినది వైఖరి. అది లోకాతీత విషయము. అమ్మవారి అనుగ్రహాలోకము పడిన ముసలి వానినైనను అధికముగా కామించి స్త్రీయే యెగబడునని శ్రీశంకరులు చెప్పినారు. తీయని వాక్కు అమ్మవారి అనుగ్రహ ఫలమని సారాంశము. కటాక్షరజనీ రూపమున అభిముఖియై మందస్మిత జ్యోత్స్నగా తానమాడించి, వైఖరీ రూపమున అమ్మవారే అభిసరించినది. ఆమె అభిసరించుటకు ముందు ఆ శివుడు

నిర్గుణుడు, మందుడు. అభిసరించిన పిమ్మట సర్వజ్ఞుడు. నిర్గుణశివుని, సకలగుణ గణపూర్ణు నొనర్చున దమ్మవారే. మందస్మితజ్యోత్స్నలో తానమాడించి కటాక్షరజని నభిముఖి నొనర్చినదని చెప్పుట చేత మందుడైన జీవునియెదలోపలి తమము ప్రీలి పోయినదను అర్థము వ్యంగ్యమగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కటాక్షము రజనిగా రూపింపబడినది. ఈ శ్లోకమున కాళిన్దీ జలముగా ప్రౌఢధ్వాన్తముగా ధూమముగా రూపింపబడుచున్నది.

**శ్లో॥ కాళిన్దీజలకాన్తయః స్మితరుచిస్వర్వాహినీపాథసి**
**ప్రౌఢధ్వాన్తరుచః స్ఫుటాధరమహోలౌహిత్యసన్ధ్యోదయే।**
**మాణిక్యోపలకుణ్డలాంశుశిఖిని వ్యామిశ్రధూమశ్రియః**
**కల్యాణైకభువః కటాక్షసుషమాః కామాక్షి! రాజన్తి తే॥ 19**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ! |
| కల్యాణైకభువః | = మంగళములకు జన్మభూమియైన; |
| తే | = నీయొక్క |
| కటాక్షసుషమాః | = కడగంటి కాంతులు; |
| స్మితరుచిస్వర్వాహినీపాథసి | = చిఱునవ్వనెడి గంగానది జలములో; |
| కాలిన్దీజలకాంతయః | = యమునాజల కాంతి గలవై; |
| స్ఫుటాధరమహోలౌహిత్య సన్ధ్యోదయే | = స్పష్టమైన పెదవి కాంతియగు ఎఱుపు అను సంధ్యయొక్క ఉదయమున; |
| ప్రౌఢధ్వాన్తరుచః | = గాఢాంధకార కాంతిగలవై; |
| మాణిక్యోపలకుండలాంశుశిఖిని | = మణి కుండలముల కాంతియను అగ్నియందు; |
| వ్యామిశ్రధూమశ్రియః | = కలసిన పొగకాంతి గలవై; |
| రాజన్తి | = ప్రకాశించుచున్నవి. |

**తాత్పర్యము :-**

అమ్మవారి కల్యాణహేతువులైన కడగంటికాంతులు చిఱునవ్వు గంగాజలమున యమునాజలములవలె ప్రకాశించును. పెదవి యెఱుపు అనెడి సంధ్యాకాలమున గాఢాంధకారమువలె ప్రకాశించును. మణికుండలకాంతి యను అగ్నియందు ధూమమువలె ప్రకాశించును.

**వివరణము :-**

అమ్మవారి చిఱునవ్వనెడి గంగానదియందు ఆమె కటాక్షకాంతులు కాళిన్దీజల

కాంతులై ప్రకాశించినవను రూపకాలంకార మమ్మవారి ముఖము త్రివేణీ సంగమమను మరొక రూపకమును వ్యంజింపజేయుచున్నది. ఇది అమ్మవారు నవ్వినప్పటి స్థితి. అమ్మవారి దంతముల పైకప్పులై పెదవులున్నప్పుడు వాని యెఱ్ఱని సన్ధ్యాకాలమువంటి కాంతిలో ఆమె కటాక్షములు గాఢాన్ధకాంతి గలిగియున్నవి. ద్వితీయపాదమునందలి రూపకాలంకారముచే గాఢాంధకారము ను తొలగించు ప్రాతస్సన్ధ్యయొక్క గాఢాంధకార హేతువైన సాయంసంధ్యయొక్క విలాసమువంటి సృష్టికి, లయమునకు హేతువైన అమ్మవారి కటాక్షవిలాసము వ్యంగ్యమగుచున్నది. ఇది ఉపమాలంకారస్ఫూర్తి. అమ్మవారి కుండల కాంతియను అగ్నియందు ధూమముగా అమ్మవారి కటాక్షము ప్రకాశించునను ఉపమాలంకారముచేత అమ్మవారి కన్నులలోని ఆమె ముఖములోని ప్రేమామృత సంయోగము స్ఫురించుచున్నది.



**అవ:-** పై శ్లోకము వఱకు శార్దూలవిక్రీడిత వృత్తములలో అమ్మవారు స్తుతింప బడినది. ఈ శ్లోకమునుండి హరిణీ వృత్తములలో స్తుతింపబడుచున్నది. పై శ్లోకమున అమ్మవారి కటాక్షములు ప్రౌఢధ్వాన్తరుచులని చెప్పబడినవి. ఈ శ్లోకమున అట్టివే అయిన అమ్మవారి కచములందు చంద్రుడున్నాడని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కలకలరణత్కాఞ్చీ కాఞ్చీవిభూషణమాలికా**
**కచభరలసచ్చన్ద్రా చన్ద్రావతంససధర్మిణీ।**
**కవికులగిరః శ్రావం శ్రావమ్మిలత్పులకాఙ్కురా**
**విరచిత(పరిచిత)శిరఃకమ్పా కమ్పాతటే పరిశోభతే॥ 20**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కలకలరణత్కాంచీ | = | కలకల మ్రోయు ఒడ్డాణము గల; |
| కాంచీవిభూషణమాలికా | = | కాంచీనగరము నలంకరించు మాలయైన; |
| కచభరలసచ్చంద్రా | = | కేశపాశమున ప్రకాశించు చంద్రుడు గల; |
| చంద్రావతంససధర్మిణీ | = | శివునితో సమానధర్మము గల; |
| కవికులగిరః | = | కవి సమూహముయొక్క వాక్కులను; |
| శ్రావమ్ శ్రావమ్ | = | వినుచు, వినుచు; |
| మిలత్పులకాంకురా | = | కలియుచున్న పులకాంకురములు గల (గగుర్పాటు); |
| పరిచిత శిరఃకమ్పా | = | పరిచితమైన శిరః కంపము గల (కామాక్షీదేవి); |
| కమ్పాతటే | = | కమ్పానదీ తీరమున; |
| పరిశోభతే | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము :-**

కలకల మ్రోయు ఒడ్డాణముగల, కాంచీనగరమునకు అలంకార మాలయైన,

కేశపాశమున ప్రకాశించు చంద్రకల గల, చంద్రకలాశేఖరుడైన శివునితో సమాన ధర్మము గల, కవుల సమూహముయొక్క వాక్కులను వినుచు వినుచు పులకించిపోవుచు శిరః కమ్పము చేయు అమ్మవారు కమ్పానదీతీరమున విలసిల్లుచున్నది.

**వివరణము :-**

1) నాలుగు పాదములలో ఏ పదముతో సమాసము ముగియునో ఆ పదముతో తదనంతర సమాస మారంభింపబడినందున ఈ శ్లోకమున **ముక్తపదగ్రస్తాలంకారము** లున్నవి. అమ్మవారి నడుమునకున్న కాంచిమణి కింకిణులు కలదని **కలకలరణత్కాంచీ** అను సమాసముచేత స్ఫురించుచున్నది. కాంచియను నగర దేవత మెడలోని హారమువలె అమ్మవారున్నదని **కాంచీ విభూషణమాలికా** యను సమాసము స్ఫురింపజేయుచున్నది. **కచభరలసచ్చంద్రా** యను సమాసము అమ్మవారు శిరమున చంద్రకలను మొగలి పూరేకును ధరించినట్లు ధరించినదని స్ఫురింపజేయుచున్నది. శివుని కే ధర్మములు కలవో ఆ ధర్మములు కల దమ్మవారని **చంద్రావతంసధర్మిణీ** అను సమాసము స్ఫురింప జేయుచున్నది. అందుకు నిదర్శనముగా శ్లోకమున కచభరలసచ్చంద్రత్వము అను ధర్మము పేర్కొనబడినది. శివుని జటాజూటమున చంద్రకల యున్నట్లు అమ్మవారి కేశపాశమున చంద్రకల యున్నది. త్రినేత్రత్వాది శరీరధర్మములే గాక జగత్సృష్ట్యాది ఈశ్వరీయధర్మములు శివునితో సమానముగా అమ్మవారి కున్నవి. అమ్మవారి ఆస్థానమున బ్రహ్మాది కవులెందఱో ఉన్నారు. సృష్ట్యాది నుండి ఇప్పటివఱకు భూలోకమున వనితలద్వారా అమ్మవారిని సేవించిన వారెందఱో అమ్మవారి లోకమున ఇప్పుడు కవితల వినిపించుచుందురు. కాంచీ నగరము నందలి కవుల కవితల నమ్మవారు వినుచునే యుందురు. రసికురాలైన సహృదయురాలు, భావుకురాలునైన అమ్మవారు వారి కవితల విని పులకించి పోవుచు శిరఃకమ్పు మొనర్చుచున్నది. మూకమహాకవికి తన కవిత్వమును వినుచు పులకించుచు శిరఃకమ్పు మొనర్చు అమ్మవారు భావనయందు సాక్షాత్కరించి నట్లున్నది. ఆ విషయము నీ శ్లోకము స్పష్టీకరించుచున్నది. ప్రథమపాదమున కకార వర్ణమైత్రి ఉన్నది. కలకల రణత్, కచభర లసత్, కవికుల మిల త్పులక, పరిచిత శిరః పరిశోభతే అను సమాస ద్వంద్వములలో వృత్త్యనుప్రాసాలంకార మున్నది.

2) ససమరసలాగః షట్భేదైర్వయైర్హరిణీ మతా॥ (6.4.7) ఇతి లక్షణమ్.



**అవ:-** పై శ్లోకమున కవుల వాక్కులకు అమ్మవారు మురిసిపోవుట చెప్పబడినది. ఈ శ్లోకమున సరసవాక్కు లమ్మవారి కటాక్షముచే లభించునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ సరసవచసాం వీచీ నీచీభవన్మధుమాధురీ**
**భరితభువనా కీర్తిర్మూర్తిర్మనోభవజిత్వరీ।**

**జనని! మనసో యోగ్యం భోగ్యం నృణాం తవ జాయతే**
**కథమివ వినా కాఞ్చీభూషే! కటాక్షతరఙ్గితమ్॥ 21**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| జనని! | = | అమ్మా! |
| కాంచీభూషే! | = | కాంచీపురాలంకారమా! |
| సరసవచసామ్ | = | సరసవాక్కులయొక్క; |
| వీచీ | = | తరంగమైన; |
| నీచీభవత్ | = | తక్కువయై పోవుచు; |
| మధుమాధురీ | = | తేనె తీపిగలది; |
| భరితభువనా | = | భువనముల నిండిన; |
| కీర్తిః | = | కీర్తి; |
| మనోభవజిత్వరీ | = | మన్మథునోడించు; |
| మూర్తిః | = | ఆకారము; |
| మనసః | = | మనస్సునకు; |
| యోగ్యమ్ | = | యోగ్యమైన; |
| నృణామ్ | = | మనుజులయొక్క; |
| భోగ్యమ్ | = | భోగ్యము; |
| తవ | = | నీయొక్క; |
| కటాక్షతరంగితమ్ | = | కటాక్ష తరంగము; |
| వినా | = | లేక; |
| కథమ్+ఇవ | = | ఎట్లు; |
| జాయతే | = | కలుగును. |

**తాత్పర్యము :-**

తరంగించు తేనె తీపి గల సరసవాక్కు, లోకముల నిండిన కీర్తి, మన్మథునోడించు రూపు, మనసునకు తగిన భోగ్యము, మనుష్యులకు అమ్మవారి కటాక్షము సోకనిదే ఎట్లు కలుగును?

**వివరణము :-**

అమ్మవారి కటాక్షము సోకిన లోకులు సరసులై తేనె తీపిగల వాక్కును, లోకముల నిండు కీర్తిని, మన్మథుని మించు రూపును ఉత్తమభోగ్యసామగ్రిని పొందుదురు. పైన పేర్కొనబడిన భోగ్యసామగ్రి లభించక యిబ్బంది పడువారు పూర్వజన్మలలో అమ్మవారిని సేవించని వారే. ఆమె దయను పొందని వారే అని శ్లోకమున వ్యంగ్యమగు నర్థము. మొదటిపాదమున ముక్తపదగ్రస్తాలంకార మున్నది. తేనె తీపిని తరంగించు

వాక్కు అని చెప్పుటచేత మధుర వాక్కుల తేనెతోడి ఔపమ్యము స్ఫురించుచున్నది. రెండవపాదమున కీర్తిః మూర్తిః అను పదములలో వృత్త్యనుప్రాసాలంకారమున్నది. పూర్వార్ధమున ఆద్యంత్యప్రాస మున్నది. మూడవపాదమున యోగ్యమ్ భోగ్యమ్, జనని మనసో పదముల జంటలలో వృత్త్యనుప్రాసమున్నది. నాల్గవపాదమున మూడు పదములలో కకార వర్ణమైత్రి వలన వృత్త్యనుప్రాసాలంకార మేర్పడియున్నది.



**అవ:**– పై శ్లోకమున **మనోభవజిత్వరీ** అను సమాసముచే చెప్పబడిన అర్థమే ఈ శ్లోకమున **ప్రసూనశరాసనప్రతిభటమనోహారీ** అను సమాసమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ భ్రమరితసరిత్కూలే నీలోత్పలప్రభయా భయా–**
**నతజనతమఃఖణ్డీ తుణ్డీరసీమ్ని విజృమ్భతే।**
**అచలతపసామేకః పాకః ప్రసూనశరాసన–**
**ప్రతిభటమనోహారీ నారీకులైకశిఖామణిః॥ 22**

**ప్రతిపదార్థము :–**

| | | |
|---|---|---|
| అచలతపసామ్ | = | పర్వతతపస్సులయొక్క; |
| ఏకః | = | ఒక; |
| పాకః | = | పాకము; |
| ప్రసూనశరాసనప్రతిభటమనోహారీ | = | మన్మథుని కెదురు నిల్చు మనస్సును హరించు; |
| నారీకులైకశిఖామణిః | = | స్త్రీలోకశిరోలంకారమే; |
| నీలోత్పలప్రభయా | = | నల్లకలువల కాంతితో; |
| భ్రమరితసరిత్కూలే | = | తుమ్మెదలతో నిండిన నదియొడ్డున; |
| తుండీరసీమ్ని | = | తుండీర సీమయందు; |
| భయానతజనతమఃఖండీ | = | భయముతో నమస్కరించు వారి అజ్ఞానమును ఖండించునదై; |
| విజృంభతే | = | విజృంభించుచున్నది. |

**తాత్పర్యము :–**

హిమగిరి తపః పరిపాక రూపిణి, మన్మథుని కెదురు నిల్చు మనస్సును హరించు నారీలోక శిరోలంకార మనదగిన అమ్మవారు తన నీలోత్పలప్రభతో తుమ్మెదల పఱచిన ఒడ్డు నందలి తుండీర సీమయందు భయముతో నమస్కరించు జనుల అజ్ఞానాంధకారమును ఖండించునదై విజృంభించుచున్నది.

**వివరణము :–**

అమ్మవారు నల్లని కలువల కాంతి గలది. ఆ కాంతి కమ్పానదిపై

వ్యాపించినది. అప్పుడా నది కలువలకాంతియని భ్రమించిన భ్రమరములు వచ్చి వ్రాలినవి. అప్పుడా నది భ్రమరితమైనది. దాని యొడ్డున తుండీర మండల మున్నది. అందు కాంచీనగరమున్నది. భయము కలిగినపుడెల్ల అచటి జనులు అమ్మవారికి నమస్కరించెదరు. అమ్మవారు వారి అజ్ఞానాంధకారమును బోగొట్టును. ఇది పూర్వార్ధమున లభించు నర్థము. నల్లని కాంతితో అజ్ఞానాంధకారమును తొలగించుట లోకవిరోధము గల అంశము. అమ్మవారి మహిమ లోకోత్తరమైనది. కావున అట్లు చేయుటలో విరోధము లేదు అని విరోధమును పరిహరించుకొనవచ్చును. కావున నిందు విరోధా భాసాలంకారమున్నది. నల్లని అమ్మవారి కాంతి నదిపై పడగా అది నదిలోని కలువల కాంతియని భ్రమించి తుమ్మెదలు వ్రాలినవి అను భ్రాంత్యలంకారమును **భ్రమరిత** శబ్దము చెప్పుచున్నది. కమ్పానది అమ్మవారి నీలకాంతిచే నల్లబడినది. అందువల్ల అది తనలోని కలువలు పూచినట్లున్నది. వానిమీద తుమ్మెదలు వ్రాలినవి. ఆ నది యొడ్డున నివసించు జను లమ్మవారి భక్తులు. కావున తత్ సారూప్యసిద్ధి కలిగి నల్లగానే ఉన్నారు. వారి యెదలలో సైతము అజ్ఞానాంధకార మున్నది. అది అమ్మవారి కన్న తాము వేరను భావన రూపము గలది. అయినను దానిని చీల్చుట అమ్మవారికి తప్పని పని. వారు భక్తులు గదా! అది అమ్మవారి కొక లెక్కలోనిది కాదు అను విశేషార్థము సైతము వ్యంజితమగుచున్నది. ప్రథమ పాదాంతమున భయాభయా అను శబ్దములలో ఛేకోక్త్యలంకార మున్నది. ద్వితీయ పాదారంభమున నతజనతమః యన్నుచోట యమకాలంకార మున్నది. కూలే నీలో, ఖండీ తుండీ, ఏకః పాకః, హారీ, నారీ అను జంటలలో వృత్త్యనుప్రాస మున్నది. **ప్రసూనశరాసనప్రతిభటమనోహారీ** అను పదమునకు శివుని మనస్సును హరించునది. ప్రసూనశరాసనుడు అనగా పువ్వు విల్లుగా గల మన్మథుడు. ఆతని ప్రతిభటుడు శివుడు. అతని మనస్సును హరించునది అమ్మవారు అని అర్థము, కదలకయుండుట తపమున కొక లక్షణము. హిమగిరి అచలము. చలించకుండుట దాని స్వభావము. అదియే ఇట తపముగా చెప్పబడుటచే అతిశయోక్త్యలంకార మేర్పడినది. ఈ శ్లోకమున పుంలింగమున అమ్మవారు చెప్పబడుట ఆమె సృష్ట్యాది కర్మ దక్షతను సూచించును.



**అవ:-** పై శ్లోకమున నారీకులైకశిఖామణియైన అమ్మవారి **శరీరనీలోత్పలప్రభ** వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఆమె ప్రభ తమాలాభమని ఆ ప్రభలో కానవచ్చు అమ్మవారి కొన్ని అవయవములు వర్ణింపబడుచున్నవి.

**శ్లో॥ మధురవచసో మన్దస్మేరా మతఙ్గజగామిన-**
**స్తరుణిమజుషస్తాపిఞ్ఛాభాస్తమఃపరిపన్థినః।**
**కుచభరనతాః కుర్యుర్భద్రం కురఙ్గవిలోచనాః**
**కలితకరుణాః కాఞ్చీభాజః కపాలిమహోత్సవాః॥** **23**

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| మధురవచసః | = | తీయని వాక్కుగల; |
| మందస్మేరాః | = | చిఱునవ్వుగల; |
| మతంగజగామినః | = | గజగమనముగల; |
| తరుణిమజుషః | = | యౌవనముగల; |
| తాపింఛాభాః | = | తమాల కాంతివంటి కాంతిగల; |
| తమఃపరిపన్థినః | = | తమస్సునకు శత్రువులైన; |
| కుచభరనతాః | = | స్తనభారముతో వంగిన; |
| కురంగవిలోచనాః | = | జింక కన్నులవంటి కన్నులుగల; |
| కలితకరుణాః | = | కూరిన కరుణగల; |
| కాంచీభాజః | = | కాంచీనగరమును పొందియున్న; |
| కపాలిమహోత్సవాః | = | శివునిగొప్ప పండుగలు; |
| భద్రమ్ | = | మంగళమును; |
| కుర్యుః | = | చేయుగాక! |

**తాత్పర్యము :-**

తీయని మాటలు, చిఱునవ్వులు, ఏనుగు నడకలు గల, యౌవనముగల తమాల కాంతివంటి కాంతిగల, చీకటికి శత్రువులైన, స్తనభారముతో వంగిన, జింక కన్నులవంటి కన్నులు గల, కరుణతో నిండిన కాంచీనగరమున నెలకొనియున్న శివుని మహోత్సవములు (అమ్మవారు) మంగళమును కలిగించు గాక!

**వివరణము :-**

తాపింఛాభాః, కురంగవిలోచనాః, మతంగజగామినః అను విశేషణములలో లుప్తోపమాలంకారము లున్నవి. నాలుగు పాదములలో మూడేసి పదము లేకాక్షరారమ్భములై వృత్త్యనుప్రాసాలంకార శోభితములై యున్నవి.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కాంతి తాపింఛాభమని చెప్పబడినది. ఈ శ్లోకమున తాపింఛ శ్రీని విస్తరింపజేయగలదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కమలసుషమాకక్ష్యారోహే విచక్షణవీక్షణాః**
**కుముదసుకృతక్రీడాచూడాలకున్తలబన్ధురాః।**
**రుచిరరుచిభిస్తాపింఛశ్రీప్రపఞ్చనచుఞ్చవః**
**పురవిజయినః కమ్పాతీరే స్ఫురన్తి మనోరథాః॥** **24**

ప్రతిపదార్థము :-



| | | |
|---|---|---|
| కమలసుషమాకక్ష్యారోహే | = | కమలకాంతియొక్క కక్ష్య నారోహించుటయందు; |
| విచక్షణవీక్షణాః | = | సమర్థములైన కన్నులుగల; |
| కుముదసుకృతక్రీడాచూడాల కున్తలబన్ధురాః | = | కలువల పున్నెమాడిన ఆట (చంద్రుడు) శిరమందుగల కురుల బంధముగల; |
| రుచిరరుచిభిః | = | అందమైన కాంతులచేత; |
| తాపిఞ్ఛశ్రీప్రపఞ్చనచుఞ్చవః | = | తమాలకాంతిని విస్తరించుట యందు నిపుణములైన; |
| పురవిజయినః | = | శివునియొక్క; |
| మనోరథాః | = | కోరికలు; |
| కమ్పాతీరే | = | కమ్పానదీతీరమున; |
| స్ఫురన్తి | = | ప్రకాశించుచున్నవి. |

**తాత్పర్యము :-**

కమలకాంతియొక్క స్థానము నెక్కుటకు సమర్థములైన చూపులుగల, చంద్రుని దాల్చిన దట్టమైన కురులుగల, అందమైన కాంతులతో తమాల కాంతిని విస్తరించుటలో సమర్థములైన శివుని మనోరథములు కమ్పానదీతీరమున ప్రకాశించుచున్నవి.

**వివరణము :-**

మొదటిపాదమున అమ్మవారి కన్నులకు కమలముల తోడి ఔపమ్యము స్ఫురించుచున్నది. రెండవపాదమున చంద్రుడనుటకు బదులు **కుముదసుకృత క్రీడా** అనుటచే పర్యాయోక్త్యలంకార మేర్పడియున్నది. మూడవపాదమున అమ్మవారి కాంతికి తమాలకాంతితోడి ఔపమ్యము స్ఫురించుచున్నది. నాల్గవ పాదము, రెండవ పాదము వర్ణమైత్రి కలిగియున్నవి. **క్రీడా, చూడా** శబ్దములలో వృత్త్యనుప్రాసమున్నదీ.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కన్నులు కమలములతో పోల్చబడినవి. ఈ శ్లోకమున వానికి కురంగనేత్రములతో పోలిక చెప్పబడుచున్నది.

**శ్లో॥ కలితరతయః కాఞ్చీలీలావిధౌ కవిమణ్డలీ-**
**వచనలహరీవాసన్తీనాం వసన్తవిభూతయః।**
**కుశలవిధయే భూయాసుర్మే కురఙ్గవిలోచనాః**
**కుసుమవిశిఖారాతేరక్ష్ణాం కుతూహలవిభ్రమాః॥ 25**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కాంచీలీలావిధౌ | = | కాంచీనగరమం దాడుకొనుటయందు; |

| | | |
|---|---|---|
| కలితరతయః | = | కలిగిన ఆసక్తిగల; |
| కవిమండలీవచనలహరీ వాసన్తీనామ్ | = | కవి సమూహముల వాక్ప్రవాహము లనెడి జాజి మల్లెలకు; |
| వసన్తవిభూతయః | = | వసన్తర్తు సంపదలైన; |
| కురంగవిలోచనాః | = | జింకకన్నులవంటి కన్నులుగల; |
| కుసుమవిశిఖారాతేః | = | మన్మథునకు శత్రువైన శివునియొక్క; |
| అక్ష్ణామ్ | = | నేత్రములయొక్క; |
| కుతూహలవిభ్రమాః | = | కుతూహలము కలిగించు విలాసములు (అమ్మవారు); |
| మే | = | నాయొక్క; |
| కుశలవిధయే | = | మంగళముల విధించుట కొఱకు; |
| భూయాసుః | = | అగుగాక. |

**తాత్పర్యము :-**

కాంచీ నగరమందాడుకొనుట యందాసక్తి గల, కవుల వాక్కులను జాజి తీగెలకు వాసన్తావిర్భావములైన, జింక కన్నులవంటి కన్నులుగల, శివుని కన్నులకు కుతూహలము కలిగించు విలాసములు (అమ్మవారు) నాకు మంగళములు కలిగించుగాక!

**వివరణము :-**

అమ్మవారి యందు వసన్తవిభూతిత్వారోపము, కవి వాక్కుల యందు వాసన్తీత్వారోపమును ఉండుటచే పూర్వార్ధమున రూపకాలంకార మేర్పడియున్నది. కురంగలోచనా అను సమాసమునందు లుప్తోపమాలంకారమున్నది. 3,4 పాదములందు కుకార వర్ణముతో ఆరంభింపబడు పదము లుండుటవలన వృత్త్యనుప్రాసాలంకార మేర్పడియున్నది. అమ్మవారు కవితాశక్తిని పెంపొందించు నని రెండవ పాదమున వ్యంగ్యమగుచున్నది.



అవ:- పై శ్లోకమున శివుని కన్నులకు కుతూహలము కలిగించు విభ్రమము అమ్మవారి కున్నట్లు వర్ణింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారు శివుని తపఃఫల విభ్రమ రూపిణిగా వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ కబలితతమస్కాణ్డాస్తుణ్డీరమణ్డలమణ్డనాః**
**సరసిజవనీసన్తానానామరున్తుదశేఖరాః।**
**నయనసరణేర్నేదీయాంసః కదా ను భవన్తి మే**
**తరుణజలదశ్యామాశ్శమ్భోస్తపఃఫలవిభ్రమాః॥** 26

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కబలితతమస్కాండాః | = | మింగిన చీకట్ల సమూహములుగల; |
| తుండీరమండలమండనాః | = | తుండీరమండలమునకలంకారములైన; |
| సరసిజవనీసన్తానానామ్ | = | కమలవనసమూహములకు; |
| అరుంతుదశేఖరాః | = | బాధాకరుడు (చంద్రుడు) శిరోభూషణముగా గల; |
| తరుణజలదశ్యామాః | = | సాంద్రమేఘమువలె శ్యామవర్ణము గలిగిన; |
| శమ్భోః | = | శివునియొక్క; |
| తపఃఫలవిభ్రమాః | = | తపస్సునకు ఫలములైన విలాసములు (అమ్మవారు); |
| మే | = | నాయొక్క; |
| నయనసరణేః | = | నేత్రమార్గమునకు; |
| నేదీయాంసః | = | మిక్కిలి సమీపమునందున్నవిగా; |
| కదా | = | ఎప్పుడు; |
| భవన్తి | = | అగునో! |

**తాత్పర్యము :-**

తమస్సమూహముల నశింపజేయు, తుండీరమండలమున కలంకారములైన, కమలవనసమూహములకు బాధను కలిగించు చంద్రుడు శిరోభూషణముగాగల, సాంద్రమేఘమువలె నల్లనైన శివుని తపఃఫల రూపములైన విలాసములు (అమ్మవారు) నా కన్నుల కెప్పుడు గోచరించునో గదా!

**వివరణము :-**

చంద్రుడని చెప్పక రెండవపాదమున కమలవనములకుబాధ కలిగించు వాడని చెప్పుటచే ద్వితీయపాదమున పర్యాయోక్త్యలంకార మేర్పడి యున్నది. తరుణజలదశ్యామాః అను సమానమున అమ్మవారు మేఘుమువంటి నలుపు వన్నెగలదనుటచే **వాచకలుప్తోపమాలంకార** మున్నది. శివుని గురించి అమ్మవారు తపస్సు చేయుట ప్రసిద్ధము. కాని శివుడు గూడ అమ్మవారిని భార్యగా పొందుటకై తపమొనరింపగా దాని ఫలముగా అమ్మవారాతనికి లభించినదని చివతి విశేషణము తెలుపుచున్నది. **తుండీరమండల మండనాః** అను సమాసమున వృత్త్యనుప్రాసాలంకారమున్నది. నాల్గవపాదమున తకార వర్ణమైత్రి ఉన్నది. **కబలితతమస్కాండాః** అను మొదటి విశేషణమున నల్లనిదయ్యు అమ్మవారు అజ్ఞానాంధకారమును పోగొట్టుట చెప్పబడినది. ఈ శ్లోకమున విరోధాలంకార మేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున సరసిజముల బాధించు చంద్రుని శిరోభూషణముగా అమ్మవారు

ధరించినదని చెప్పబడినది. ఈ శ్లోకమున సరసిజ సంతానమైన బ్రహ్మదేవుని వాహనమగు హంసను, తన నడకచే అమ్మవారే క్రుంగి పోవునట్లు చేసినదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ అచరమమిషుం దీనమ్మీనధ్వజస్య ముఖశ్రియా**
**సరసిజభువో యానమ్మ్లానం గతేన చ మఞ్జునా।**
**త్రిదశసదసామన్నం ఖిన్నం గిరా చ వితన్వతీ**
**తిలకయతి సా కమ్పాతీరం త్రిలోచనసున్దరీ॥** **27**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| ముఖశ్రియా | = | ముఖ కాంతితో; |
| మీనధ్వజస్య | = | మన్మథునియొక్క; |
| అచరమమ్ | = | మొదటి; |
| ఇషుమ్ | = | బాణమును; |
| దీనమ్ | = | దీనమైనదానిగా; |
| మంజునా | = | అందమైన; |
| గతేన | = | నడకతో; |
| సరసిజభువః | = | బ్రహ్మయొక్క; |
| యానమ్ | = | వాహనమును (హంసను); |
| మ్లానమ్ | = | స్రుక్కినదానిగా; |
| గిరా చ | = | వాక్కు చేతను; |
| త్రిదశసదసామ్ | = | దేవతా సమూహములయొక్క; |
| అన్నమ్ | = | అన్నమును (అమృతము); |
| ఖిన్నమ్ | = | దుఃఖపడు దానిగా; |
| వితన్వతీ | = | చేయగల; |
| త్రిలోచనసుందరీ | = | శివుని యిల్లాలు; |
| కమ్పాతీరమ్ | = | కమ్పానదీతీరమును; |
| తిలకయతి | = | అలంకరించుచున్నది. |

**తాత్పర్యము :-**

తన ముఖ కాంతితో మన్మథుని మొదటి బాణమైన అరవిందమును దీనమైన దానిగా, అరవిన్దాసనుని వాహనమైన హంసను తన అందమైన నడకతో మ్లానముగా, తన వాక్కుతో దేవతల అన్నమైన అమృతమును ఖిన్నముగా చేయుచున్న త్రిపురసుందరి కమ్పానదీతీరము నలంకరించుచున్నది.

**వివరణము :-**

మన్మథుడు పంచబాణములు గలవాడు. 1) అరవిన్దము 2) అశోకము 3)

చూతము 4) నవమల్లిక 5) నీలోత్పలము. వీనిలో మొదటి దనుటచే అరవిన్దము మన్మథుని అచరమబాణమని చెప్పబడినది. చరమ అనగా చివతి అను అర్థము. చరమము కానిది మొదటిది అను అర్థమున అచరమ శబ్దము ప్రయోగింపబడినది. అట్టి మన్మథుని మొదటి బాణమును అనగా అరవిన్దమును తన ముఖకాంతితో దీనముగా అమ్మవారు చేయుచున్నది. అట్లే అరవిన్దాసనుడైన బ్రహ్మయొక్క వాహనమైన హంసమును తన అందమైన నడకతో మ్లానముగా చేయుచున్నది. అట్లే తన మాటతో దేవతల అన్నమైన అమృతమును ఖిన్నమునుగా చేయుచున్నది అని మూడు పాదములలో ఉపమాన తిరస్కార ముండుటచే ప్రతీపాలంకారమాల ఈ శ్లోకమున ఏర్పడినది. త్రిపురసంహారము నొనర్చిన సుందరి భార్యగా లభించుట యుచితమగుచున్నదను వ్యంగ్యార్థమును త్రిలోచనశబ్దము స్ఫురింపజేయుచున్నది. శివుడు తిలకలోచనుడు. లోచనమును తిలకింపజేసినవాడు అనగా తిలకస్థానమున లోచనము కలవాడు. ఆతని భార్య కమ్పాతీరమునకు తిలకముగా నుండి దాని నలంకరింపజేయుట యుచితముగా ఉన్నది. ఈ యర్థము **తిలకయతి** అను నామధాతు ప్రయోగముచే వ్యంగ్యమగుచున్నది. నాల్గవపాదమున వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు త్రిలోచనుని సుందరిగా సంబోధింపబడినది. ఈ శ్లోకమున ఆమె తనకు **తల్లి**గా సంబోధింపబడుచున్నది.

**శ్లో॥ జనని! భువనే చంక్రమ్యే౽హం కియన్తమనేహసం**
**కుపురుషకరభ్రష్టైః దుష్టైర్ధనైరుదరమ్భరిః।**
**తరుణకరుణే తన్ద్రాశూన్యే తరఙ్గయ లోచనే**
**నమతి మయి తే కిఞ్చిత్కాఞ్చీపురీమణిదీపికే ॥ 28**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| తరుణ కరుణే | = | సాంద్రమైన దయగల; |
| కాంచీపురీమణిదీపికే | = | కాంచీనగరికి మణిదీపిక అయినదానా; |
| జనని! | = | తల్లీ!; |
| కుపురుషకరభ్రష్టైః | = | దుష్టపురుషుల చేతులనుండి జార్చబడిన; |
| దుష్టైః | = | చెడ్డవైన; |
| ధనైః | = | ధనములతో; |
| ఉదరమ్భరిః | = | పొట్టనింపుకొనువాడనై; |
| అహమ్ | = | నేను; |
| కియన్తమ్ | = | ఎంత; |
| అనేహసమ్ | = | కాలము; |

చంక్రమ్యే = తిఱుగుదును;
నమతి = నమస్కరించు;
మయి = నాయందు;
తంద్రాశూన్యే = సోమరితనములేని;
తే = నీయొక్క;
లోచనే = కన్నులను;
కించిత్ = కొంచెము;
తరంగయ = ప్రవహింపజేయుము.

**తాత్పర్యము :-**

సాంద్రదయవు, మణిదీపికవైన అమ్మా, దుష్టపురుషులచే విదల్పబడిన దుష్టధనములతో నెంతకాలము పొట్టపోసికొనుచు ఈ సంసారమున భ్రమింప గలను. నమస్కరించు నాపై సాంద్రమైన దయగల నీ కన్నులను ప్రసరింప జేయుము.

**వివరణము :-**

ఈ సంసారమున ప్రాణులందఱు ఉదరమ్భరులే. అనగా పొట్టపోసు కొనువారే. పొట్టపోసికొనుట తప్పుకాదు. కాని కుటుంబయజమానులకు కుటుంబమును పోషించు బాధ్యత ఉండును. కావున కుటుంబములోని వారందఱి పొట్టల నింపి పిదప తన పొట్టపోసికొనవలెను. ఇది కూడ గొప్పపని కాదు. కుటుంబమునకు చెందని వారి కేకొంతయైనను పెట్టి వారి పొట్టలు కూడ నింపవలెను. అది గొప్ప పని. గొప్ప వారాపని చేయుదురు. పశుపక్ష్యాదులు కుటుంబమును పోషించుకొనును. మనుష్యుడాపని చేసినచో జంతు సదృశుడు మాత్రమగును. ఆ కుటుంబమును కూడ పోషింపక తన పొట్టమాత్రమే పోసికొను వాడు **ఉదరమ్భరి** యని చెప్పదగినవాడు. నేను ఉదరమ్భరిగా అనగా జంతువుల కన్న హీనుడుగా ఎంతకాలము జీవింపవలెనమ్మా! ఇక జీవింపలేను. ఇప్పటికే కాలము చాల గడచిపోయినది. కుటుంబమును పోషించుటకు గాని తన పొట్టను నింపుకొనుటకు గాని ధనికులను యాచించుచు వారనాదరమున విసుగుతో నా ఒడిలో పడవైచిన వస్తుధనములతో వాని సంపాదనమున వారు చేసిన పాపములోని భాగముతో పాటు పొట్ట నింపుకొనుచు, ఈ పాపపు బ్రతుకు నెంతకాలము ఈడ్తునమ్మా! యను కవి భావ మీ శ్లోకమున వ్యక్తమగుచున్నది. ఈ శ్లోకమున అమ్మవారు కాంచీనగరమణిదీపికగా రూపింపబడినందున రూపకాలంకార మేర్పడియున్నది. **తరుణకరుణే** అను విశేషణము అమ్మవారికిని ఆమె కన్నులకును **దేహలీదత్తన్యాయమున** అన్వయింపజేయవచ్చును. కడవ మీది దీపిక లోపలికి బయటకు రెండు చోట్లను వెలుగు నిచ్చునట్లు ఈ విశేషణము ఒక్కటియయ్యు అమ్మవారికి ఆమె కన్నులకు అన్వయించునట్లు ప్రయోగింప బడినది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు ఆమె కన్నులును కరుణ కలిగియున్నట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారు కరుణ యను నటిక గృహముగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ మునిజనమనఃపేటీరత్నం స్ఫురత్కరుణానటీ-**
**విహరణకలాగేహం కాఞ్చీపురీమణిభూషణమ్।**
**జగతి మహతో మోహవ్యాధేర్నృణాం పరమౌషధం**
**పురహరదృశాం సాఫల్యమ్మే పురః పరిజృమ్భతామ్ ॥29**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| మునిజనమనఃపేటీరత్నమ్ | = | మునిజనమనస్సు అను పెట్టెకు రత్నమైనట్టి; |
| స్ఫురత్కరుణానటీ.....గేహమ్ | = | ప్రకాశించు దయ అను నటియొక్క విహరణకలకు నిలయమైన; |
| కాంచీపురీమణిభూషణమ్ | = | కాంచీనగరికి మణిభూషణమైన; |
| జగతి | = | జగమున; |
| నృణామ్ | = | మనుజులయొక్క; |
| మహతః | = | గొప్పనైన; |
| మోహవ్యాధేః | = | మోహమను వ్యాధికి; |
| పరమౌషధమ్ | = | గొప్ప ఔషధమైన; |
| పురహరదృశామ్ | = | శివుని కన్నులయొక్క; |
| సాఫల్యమ్ | = | సఫలత (అమ్మవారు); |
| పురః | = | నా ముందర; |
| పరిజృమ్భతామ్ | = | విలసిల్లుగాక. |

**తాత్పర్యము :-**

మునిజనమనస్సు అను పెట్టెలోని రత్నమైన, ప్రకాశించు కరుణ అను నటి విహరించు కలకు నిలయమైన, కాంచీనగరికి మణిభూషణమైన, జగమున గల మనుష్యులలో వ్యాపించిన మోహమను మహావ్యాధికి గొప్ప మందైన, శివుని కన్నుల సఫలత (అమ్మవారు) నా యెదుట విలసిల్లుగాక.

**వివరణము :-**

మునిజనమనస్సను పెట్టెకు అమ్మవారు రత్నముగా మోహవ్యాధికి పరమౌషధముగా మరియు కాంచీపురి అను స్త్రీకి మణిభూషణముగా రూపింప బడుటచేత నిందు రూపకాలంకార మేర్పడియున్నది. మొదటిపాదమున వర్ణమైత్రి, నాల్గవపాదమున వర్ణమైత్రి ప్రాస యతులున్నవి. మునిజనమనస్సు పెట్టె. అమ్మవారి నా మునులు తమ మనస్సులలో దాచుకొందురు. ఎక్కడ జారిపోవునేమో అని భద్రముగా ఉంచుకొందురు. కన్నులలో దాచి రెప్పల మూత వేయవచ్చును. అది బాహ్యేంద్రియము కావున నెవరైన

నా ఱెప్పమూత తొలగించి ఎత్తుకొనిపోదురేమో అని వారు అంతరింద్రియమైన మనసును దాచుకొన్నారు. అక్కడ కెవరును పోలేరని అక్కడ దాచుకొన్నారను అర్థము వ్యంగ్యమగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు కరుణయను నటిక గృహముగా చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారు శివుని త్రిలోచనముల సరసక్రీడా సౌధాంగణముగా చెప్పబడినది.

**శ్లో॥ మునిజనమనోధామ్నే ధామ్నే వచోమయజాహ్నవీ-**
**హిమగిరితటప్రాగ్భాగాయాక్షరాయ పరాత్మనే।**
**విహరణజుషే కాఞ్చీదేశే మహేశ్వరలోచన-**
**త్రితయసరసక్రీడాసౌధాఙ్గణాయ నమో నమః॥ 30**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| మునిజనమనోధామ్నే | = మునిజన మనస్సులకుచోటైన; |
| వచోమయ .... ప్రాగ్భాగాయ | = వాక్కను గంగకు హిమగిరితటపు ముందు భాగమైన; |
| అక్షరాయ | = నాశములేని; |
| పరాత్మనే | = పరమాత్మ స్వరూపమైన; |
| కాంచీదేశే | = కాంచీదేశమున; |
| విహరణజుషే | = విహరణమును పొందిన; |
| మహేశ్వరలోచన...సౌధాంగణాయ | = శివుని మూడు కన్నులు సరసముగా ఆడుకొనుమేడ ముందు భాగమైన; |
| ధామ్నే | = తేజము(అమ్మవారు) కొఱకు; |
| నమో నమః | = మరల మరల నమస్సులు. |

**తాత్పర్యము:-**

మునిజన మనస్సులకు నివాసమైన వాఙ్మయగంగకు ప్రాగ్భాగతటమైన, నాశము లేని పరమాత్మ స్వరూపమైన, కాంచీదేశమున విహరించు శివుని మూడు కన్నులు సరసముగా విహరించు మేడయొక్క ముందు భాగమైన తేజము అని చెప్పదగిన అమ్మవారికి మరల మరల నమస్సులు.

**వివరణము :-**

అమ్మవారు మునిజనమనోధామముగా, వాఙ్మయగంగకు హిమగిరి తటముగా, శివుని మూడుకన్నులు సరసముగా క్రీడించుట కనువైన సౌధాంగణముగా రూపింపబడుటచే రూపకాలంకారమేర్పడియున్నది. **ధామ్నే** అను పదము అర్థభేదముతో ద్వీరావృత్తముగా

నున్నందున యమకాలంకార మేర్పడియున్నది. భాగాయాక్షరాయ పరాత్మనే అను పదములలో వృత్త్యను ప్రాసాలంకారమున్నది. ఈ శ్లోకమున మునిజనమనోధామ్నే, వచోమయజాహ్నవీ హిమగిరితట ప్రాగ్భాగాయ, కాంచీదేశే, విహరణజుషే, మహేశ్వర లోచనత్రితయ సరసక్రీడాసౌధాంగణాయ అను పదములు అమ్మవారి స్త్రీత్వము మాయా పరాఙ్ముఖత్వమును సూచించుచున్నవి. **అక్షరాయ పరాత్మనే ధామ్నే,** అను పదములు మాయారహిత జీవపరమాత్మైకజ్ఞానరూపబ్రహ్మను సూచించుచున్నవి.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు శివుని త్రిలోచనముల సరసక్రీడా సౌధాంగణముగా రూపింపబడినది. ఈ శ్లోకమున శివుని అమృతలహరీ పూరముగా నిరూపింపబడుచున్నది.

**శ్లో॥ మరకతరుచాం ప్రత్యాదేశం మహేశ్వరచక్షుషా-**
**మమృతలహరీపూరం పారం భవాఖ్యపయోనిధేః।**
**సుచరితఫలం కాఞ్చీభాజో జనస్య పచేలిమం**
**హిమశిఖరిణో వంశస్యైకమ్ వతంసముపాస్మహే॥ 31**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| మరకతరుచామ్ | = | మరకతమణికాంతులకు; |
| ప్రత్యాదేశమ్ | = | తిరస్కారము; |
| మహేశ్వరచక్షుషామ్ | = | శివునికన్నులకు; |
| అమృతలహరీపూరమ్ | = | అమృతతరంగప్రవాహము; |
| భవాఖ్యపయోనిధేః | = | సంసారమను పేరుగల సముద్రమునకు |
| పారమ్ | = | అవతలి ఒడ్డైన; |
| కాంచీభాజః | = | కాంచీనగరనివాసియైన; |
| జనస్య | = | జనముయొక్క; |
| పచేలిమమ్ | = | పండిన; |
| సుచరితఫలమ్ | = | పుణ్యఫలము; |
| హిమశిఖరిణః | = | హిమవత్పర్వతముయొక్క; |
| వంశస్య | = | వంశముయొక్క; |
| ఏకమ్ | = | ఒక; |
| వతంసమ్ | = | శిరోభూషణమైన (అమ్మవారిని); |
| ఉపాస్మహే | = | ధ్యానించుచున్నాము. |

**తాత్పర్యము:-**

మరకతమణులకు తిరస్కారము, శివనేత్రముల కమృతప్రవాహము.

సంసారసముద్రమున కవతలి ఒడ్డు, కాంచీనగర జనముయొక్క పండిన పుణ్యము యొక్క ఫలము, హిమవత్పర్వతవంశశిరోభూషణమునైన అమ్మవారిని ధ్యానించెదము.

**వివరణము :-**

అమ్మవారు మరకతమణికాంతి ప్రత్యాదేశముగా, శివనేత్రామృత ప్రవాహముగా, సంసారసముద్రపారముగా, కాంచీ నగరవాసి పుణ్యముయొక్క పండినఫలముగా, హిమత్పర్వతశిరోభూషముగా, రూపింపబడి నందున రూపకాలంకారముల మాలయున్నది. పూర్వార్ధమున వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారమృతలహరీపూరముగా చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె కమ్పానదీసఖిగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ ప్రణమనదినారమ్భే కమ్పానదీసఖి తావకే**
**సరసకవితోన్మేషః పూషా సతాం సముదఞ్చితః।**
**ప్రతిభటమహాప్రౌఢప్రోద్యత్కవిత్వకుముద్వతీం**
**నయతి తరసా నిద్రాముద్రాం నగేశ్వరకన్యకే!॥ 32**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కమ్పానదీసఖి | = | కమ్పానదికి స్నేహితురాలవైన; |
| నగేశ్వరకన్యకే | = | ఓ పర్వతకుమారీ; |
| తావకే | = | నీకు సంబంధించిన; |
| ప్రణమనదినారంభే | = | నమస్కరించు దినముయొక్క ఆరంభము నందే |
| సతామ్ | = | సత్పురుషులలో (నక్షత్రములలో); |
| సరసకవితోన్మేషః | = | సరసకవితావికాసరూపుడైన; |
| పూషా | = | సూర్యుడు; |
| సముదంచితః | = | ఉదయించినవాడై; |
| ప్రతిభట ... కుముద్వతీమ్ | = | ప్రత్యర్థి మహాప్రౌఢులనుండి బయలుదేరు కవిత యను కలువ తీగను; |
| నిద్రాముద్రామ్ | = | నిద్రాలక్షణమును; |
| తరసా | = | శీఘ్రముగా; |
| నయతి | = | పొందించును. |

**తాత్పర్యము:-**

కమ్పానదికి స్నేహితురాలైన అమ్మవారికి నమస్కరించిన దినముయొక్క ఆరంభమునందే సత్పురుషులలో సరసకవితోన్మేషసూర్యుడు ఉదయించి ప్రత్యర్థి సహాప్రౌఢులలో బయలుదేరు కవితయను కలువతీగను ముకుళింపజేయును.

**వివరణము :-**

కమ్పానదీతీరకాంచీనగరమున నివసించు కారణమున అమ్మవారు కమ్పానదికి స్నేహితురాలని చెప్పబడినది. సాధారణముగా ఒకవిధమైన ఆలోచనలు అనుభవములు కలవారికి స్నేహము కలుగుచుండును. కమ్పానదివలె అమ్మవారు కూడ నగేశ్వరకన్యక అగుటచే వారిరువురి మధ్యన స్నేహ మేర్పడినది. ఆ స్నేహము దగ్గఱగా నుండుటచే మరింత పెరిగినది. పర్వతకన్యకాశబ్దము నదీత్వమును వ్యంజింపజేయును. వారి స్నేహము రెండు నదుల స్నేహమువంటిదని స్ఫురించుచున్నది. స్నేహము జలగుణమని తర్కశాస్త్రజ్ఞుల అభిప్రాయము. అమ్మవారికి నమస్కరించిన వెంటనే కవితానిర్మాణశక్తి కలుగును అను వస్తువు పూర్వార్ధమున వ్యంజింపబడుచున్నది. ఆ కవిత్వము ఇతర ప్రత్యర్థులు యెంత ప్రౌఢవిద్వత్కవులైనను వారి కవిత్వము ప్రౌఢముగా నుండిన నుండవచ్చుగాక, కాని సరసత విషయమున వారి కవితయను కలువతీగ వాడిపోవునని ఉత్తరార్ధమున, దానిని వాడగొట్టు కవితాసూర్యుడు అమ్మవారికి నమస్కరించిన సత్పురుషులలో నక్షత్రములలో సూర్యుదుదయించినట్లు ఉదయించునని పూర్వార్ధమున వ్యంజింపబడుచున్నది. ప్రత్యర్థి కవిత కుముద్వతిగా, నమస్కరించు వాని కవితోన్మేషము పూషగా, రూపింపబడుటచే ఈ శ్లోకమున రూపకాలంకారమేర్పడియున్నది. ఈ రూపకమువలన దేవతానుగ్రహలబ్ధి కవితాశక్తి సత్కర్మఫలముగా లభించిన కవితాశక్తికన్న గొప్పగా నుండునని వ్యంగ్యమగుచున్నది. కమ్పానదీసఖియగు నగేశ్వరకన్యకయై నదీ తుల్యమగు అమ్మవారి అనుగ్రహము వలన లభించు కవిత నదీప్రవాహ సదృశముగా పరవళ్ళు త్రొక్కుచుండుట వింత కాదు. హిమవత్పర్వతనదులు సూర్యోదయ కాలమునుండియే పరవళ్లు త్రొక్కుచుండును. ఏలననగా మంచు కరిగి నీరై నదులలోనికి వరదలు చేరుటకును సూర్యుదే కారణమని అందఱికి తెలిసిన విషయమే. పూష అనగా సూర్యుడు. ఆతడు అమ్మవారి కన్నైన వాడు. అనుగ్రహము కలిగినప్పుడాతడు తత్ కటాక్ష స్వరూపుడున్మిషితు డగును. కావున నతడు అమ్మవారి అనుగ్రహము స్వరూపముగా గలవాడు. పూషుడదయింపగా అనగా అమ్మవారి అనుగ్రహసూర్యుదుదయింపగా అమ్మవారి స్వరూపమేయైన కవి హృదయ హిమవన్నగేశ్వరకన్యకాశబ్దమువలన వ్యంజితమగును. పూషసరస కవితయొక్క ఉన్మేషరూపుడనగా నర్థమిదియే. సరసకవితోన్మేషం పూషా అను పదములలో పూషోదయము షకారావృత్తిచేత ఆ పదములున్నపాదమున సకారావృత్తివలన మూడవపాదమున ప్రకారావృత్తిచేత నా యలంకారమే యేర్పడియున్నది. నిద్రా ముద్రా అను పదముల జంటలలో ద్రావృత్తిచేత ఆ పదములున్న పాదములలో నకారావృత్తిచే వృత్త్యనుప్రాసాలంకారమేర్పడియున్నది. రెండవ నాల్గవ పాదములలో వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున సూర్యోదయము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున సూర్యోదయమువలన కలుగు జడిమశమము ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥** శమితజడిమారమ్భా కమ్పాతటీనికటేచరీ
నిహతదురితస్తోమా సోమార్ధముద్రితకున్తలా।
ఫలితసుమనోవాఞ్ఛా పాఞ్చాయుధీ పరదేవతా
సఫలయతు మే నేత్రే గోత్రేశ్వరప్రియనన్దినీ॥ 33

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| శమితజడిమారమ్భా | = | శమింపజేయబడిన జడిమయొక్క ఆరంభముగల |
| కమ్పాతటీనికటేచరీ | = | కమ్పానదీ తటమున తిరుగునట్టి; |
| నిహతదురితస్తోమా | = | కొట్టబడిన పాపముల సమూహముగల; |
| ఫలితసుమనోవాంఛా | = | ఫలింపజేయబడిన దేవతల కోరికగల; |
| పాంచాయుధీ | = | పంచాయుధ సంబంధముగల; |
| సోమార్ధముద్రితకున్తలా | = | అర్ధచంద్రుని కురులలో తురుముకొన్న; |
| పరదేవతా | = | పరదేవతయైన; |
| గోత్రేశ్వరప్రియనందినీ | = | పర్వతరాజుయొక్క పుత్రిక (అమ్మవారు); |
| మే | = | నాయొక్క; |
| నేత్రే | = | నేత్రములను; |
| సఫలయతు | = | ఫలింపజేయుగాక!. |

**తాత్పర్యము:-**

అమ్మవారు జాడ్యము(అజ్ఞానము)యొక్క ఆరంభమును శమింప జేయును. కమ్పానదీతటమున చరించును. పాపముల సమూహములను పరిహరించును. ఆమె అర్ధచంద్రుని కురులలో తురుముకొనియున్నది. ఆమె దేవతల వాంఛలను ఫలింపజేయును. ఆమె పంచాయుధధరయైన పరదేవత. హిమవత్పర్వతరాజుయొక్క ప్రియపుత్రికయైన ఆ అమ్మవారు నా కన్నులను ఫలింపజేయుగాక.

**వివరణము :-**

దేవతలు మానవుల వాంఛల ఫలింపజేయుదురు. వారికి సంబంధించి కల్పవృక్షకామధేనుచింతామణ్యాదులు కూడ మానవుల వాంఛల ఫలింపజేయును. కాని కోట్ల ఏండ్ల తరువాతనైనను నశించి పోవునట్టి ఆ దేవతలకు అమరులు అను నామమున్నను ప్రళయమున వారికి చావు తప్పదు. కావున వారు మానవులకు మృత్యుంజయత్వమును అనుగ్రహింపజాలరు. దేవతలకును, మనుజులకును, మృత్యుంజయత్వవాంఛ ఉన్నది. మనుజులు, దేవతలును ఆ వాంఛను ఫలింపజేసికొనుటకు మృత్యుంజయుని యిల్లాలు

కాలకాలిక కాలుని సైతము మ్రింగునట్టి అమ్మవారు మృత్యుంజయత్వవాంఛ కాని, రాక్షస జయ వాంఛ కాని, దేవతల కమ్మవారి నాశ్రయించిననే ఫలించును. సుమనస్సు లనగా దేవతలు. మంచి మనస్సుగల మనుజులును సుమనస్సులని చెప్పుటలో తప్పు లేదు. అట్టి మంచి మనస్సుగల మానవులుగాని దేవతలుగాని కోరదగిన పరమపురుషార్థము మోక్షమే. దానిని అమ్మవారే వారి కీయగలదు. **ఫలిత సుమనోవాంఛా** అను విశేషణము పై యర్థమును వ్యంజింపజేయును. దేవతా శబ్దమువలె సుమనశ్శబ్దము స్త్రీలింగము. ఈ శబ్ద ప్రయోగము అమ్మవారికి స్త్రీలవాంఛల (సౌభాగ్యముల) తీర్చుట యందాసక్తి యున్నదని వ్యంజింపజేయును. **పరదేవతా** శబ్దము ఆమె దేవతా జాతిని సూచించుటయే యిందుకు కారణము. మన్మథుని అయిదుబాణములు (అరవిందాశోకచూతనవమల్లికా నీలోత్పలములు) ఆయనకు ఆయుధములు కావున మన్మథుడు పంచాయుధుడని చెప్పబడును. ఆయన ఉపాసించిన పరదేవత అమ్మవారు. కావున ఆమె పంచాయుధీ అని చెప్పబడినది. విష్ణువుయొక్క పంచాయుధములు **పాంచజన్య సుదర్శన కౌమోదకీ నందకీ శార్ఙ్గములు** ప్రసిద్ధములు కావున మన్మథుని జనకుడైన విష్ణువు కూడ పంచాయుధుడే. ఆయన ఉపాసించిన పరదేవత అమ్మవారు కావున ఆమె పంచాయుధీ అని చెప్పబడినది. విష్ణువు మన్మథుల పంచాయుధత్వ ప్రసిద్ధి అమ్మవారి అనుగ్రహము. పంచాయుధునికి సంబంధించిన అను విగ్రహమున పాంచాయుధీ శబ్దములో తద్ధితవృత్తి యున్నది. తటీ, నికటే, స్తోమా సోమార్ధ, శమిత జడిమ, నిహత దురిత, నేత్రే గోత్రేశ్వర అను శబ్ద ద్వంద్వములలో వృత్త్యనుప్రాసమున్నది. రమ్భా కమ్పా, వాంఛా పంచా అను శబ్దములలో వృత్త్యనుప్రాసమున్నది. తమిళాక్షరములు వ్రాయునప్పుడు రూపసామీప్య ముండును. మహాప్రాణములకు గ్రంథలిపిలో తప్ప సాధారణమైన తమిళలిపిలో వర్గాద్యక్షరముల రూపములు వ్రాయుదురు. తమిళుల ఉచ్చారణలో సైతము వర్గ ప్రథమ తృతీయముల సంకరముండును. పండితులు కాని సాధారణులు మహాప్రాణముల సరిగా నుచ్చరింపరు. ఈ స్థితి కేరళ కర్ణాటాంధ్రాది భాషలలో సైతము కొంత గోచరించును.



**అవ:-** పై శ్లోకము నందలి శమితజడిమారమ్భా సమాసార్థమే ఈ శ్లోకమున వివరింపబడుచున్నది.

**శ్లో॥ మమ తు ధిషణా పీద్యా జాడ్యాతిరేక! కథం త్వయా**
**కుముదసుషమామైత్రీసమ్యగ్వ్రతంసితకున్తలామ్।**
**జగతి శమితస్తమ్భాం కమ్పానదీనిలయామసౌ**
**శ్రయతి హి గలత్తన్ద్రా చన్ద్రావతంససధర్మిణీ॥ 34**

**ప్రతిపదార్థము :-**

జాడ్యాతిరేక! = ఓయీ జాడ్యాతిశయమా!

| | |
|---|---|
| త్వయా | = నీచేత; |
| మమ | = నాయొక్క; |
| అసౌ | = ఈ; |
| ధిషణా తు | = బుద్ధి; |
| కథమ్ | = ఎట్లు; |
| పీడ్యా | = పీడింపదగినది; |
| కుముదసుషమామైత్రీసమ్యగ్వతంసిత కుంతలామ్ | = కలువపూల శోభతో స్నేహము రూపుదాల్చిన చంద్రకళతో చక్కగా అలంకరింపబడిన కురులుగల; |
| శమితస్తమ్భామ్ | = స్తబ్ధతను శమింపజేసిన; |
| కమ్పానదీనిలయామ్ | = కమ్పానదియే నిలయముగా గల; |
| చంద్రావతంసనధర్మిణీ | = శివుని సహధర్మచారిణిని(అమ్మవారిని) |
| గలత్తంద్రా | = సోమరితనమును వీడినదై; |
| శ్రయతి హి | = ఆశ్రయించుచున్నది గదా. |

**తాత్పర్యము:-**

ఓ జాడ్యాతిరేకమా! నీవు నాబుద్ధి నెట్లు పీడింపగలవు. ఈ నా బుద్ధి చంద్రావతంసయగు, స్తబ్ధతను నశింపజేయు, కమ్పానదియే నిలయముగాగల, శివుని యిల్లాలిని సోమరితనము వీడి ఆశ్రయించుచున్నది గదా.

**వివరణము :-**

జాడ్యాతిరేకము కవి బుద్ధిని పీడింపజాలదు. అది చైతన్యవంతమై భాసించుచునే యుండును. చైతన్యమువంటి చంద్రుని కురులలో తురుముకున్న, అంతేగాక అట్టి చంద్రునే శిరమున దాల్చిన, శివుని యిల్లాలైన అమ్మవారి నాశ్రయించి యున్నందున నా శిరమున నున్న బుద్ధి నా శిరస్సులోని సహస్రారచంద్రుని కాంతి ప్రసారము కలిగియున్నందునను జాడ్యాతిరేకము అందఱి బుద్ధులనువలె నా బుద్ధిని పీడింపజాలదు అని ద్వితీయపాదము వ్యంజించును. అద్వైతులు చైతన్యమును చంద్రునితో పోల్చుదురు. కృష్ణమిశ్రులు వ్రాసిన నాటకముయొక్క పేరు **ప్రబోధచంద్రోదయ**మగుట ఈ అంశమును బలపఱచును. విశిష్టాద్వైతులు దీనికి పోటీగా వివేకసూర్యోదయనాటకము రచించిరి. విశిష్టాద్వైతులు వివేకమును సూర్యోదయముతో, అద్వైతులు ప్రబోధమును చంద్రునితో పోల్చుట గమనింపదగినది. అమ్మవారి శిరస్సున కుంతలములు చీకట్లువలె ముసురుకొని యున్నవి. వానిలో అమ్మవారు చంద్రుని తురుముకొని వాని జాడ్యమును పోగొట్టినది. ఈ అంశము కూడ రెండవ పాదమున వ్యంజింపబడినది. చంద్రుని చంద్రుడని చెప్పక **కుముదసుషమా మైత్రీ** అని చెప్పుటచే నందు పర్యాయోక్త్యలంకారమేర్పడియున్నది. కుముదము లనగా తెల్ల కలువలు. వాని కాంతి తెలుపు. దానితో మైత్రి చంద్రున కున్నది. ఇట్లు మిత్ర

వికాసమును కలిగించు చంద్రుడు వాని మైత్రిగా చెప్పబడినాడు. అమ్మవారు చంద్రావతంససధర్మిణి. శివుడు చంద్రుని శిరోభూషణముగా ధరించుట చూచి ఆయన అర్ధాంగియైన అమ్మవారు తాను కూడ సమానధర్మము కలిగినదైనది. జాడ్యమున్న వారికి స్తమ్భము (కదలికను కోల్పోవుట), తంద్రము (సోమరితనము) కూడ తదంగములుగా నుండును. మనుష్యుల బుద్ధికి సోమరితనము అప్పుడప్పుడధికమగుచుండును. మనుష్యుల బుద్ధులు వ్యష్టులు. అమ్మవారు ఆ బుద్ధుల సమష్టి. అమ్మవారి నాశ్రయించిన వారి బుద్ధులలో తంద్ర (బద్ధకము) తగ్గిపోవును. కాని అమ్మవారి నాశ్రయించుటకు ముందే తంద్రను తొలగించుకొనవలెను. ఆ పనియు చేయలేని యెడల తన బుద్ధి తంద్రను తొలగింపవలెనని అమ్మవారిని కోరవలెను. ఆ కోరికకూడ అమ్మవారే కలిగింపవలెను. దాని కేమి చేయవలెనను ప్రశ్న సమాధానము లేనిది. అయినను నిష్కామకర్మ చేయుచుండవలెనని చెప్పగలము. దానికి సంతోషించునో లేదో, సంతోషించి సంతోషింపక తంద్రను తొలగింపగోరి నిష్కామకర్మకై జీవుని ప్రేరేపించును. లేక ప్రేరేపించదు. ఆమె నిరంకుశ కావున అది ఆమె ఇష్టమే. అస్తు. కమ్పానది తటమున నున్నది కాంచీనగరము. ఆ కాంచీనగరములో ఆమె నిలయము కలదు. నదీనిలయ అను శబ్దమునకు పై యర్థము లక్షణావృత్తి వలన లభించును. నది జలజంతువులకు తప్ప నిలయముగా నుండదు. నదిలో కూడ ఎవరి నిలయముండదు. ఆ నదికి దగ్గఱగా నున్నదని చెప్పుటకే నదీనిలయ అను సమాసము ప్రయోగించుటచే లక్ష్యార్థము చెప్పుకొనవలసిన అవసరము ఏర్పడినది. ఇంత ఇబ్బందిని కలిగించు సమాసము నేల ప్రయోగింపవలెను. ప్రయోగించుట కొక ప్రయోజనమున్నది. నదికి చాల దగ్గఱలో నున్నదని చెప్పుటయే ఆ ప్రయోజనము. నదికి దగ్గఱలో ఉన్నదను వాక్యమును ప్రయోగించినప్పు డీ ప్రయోజనము నెఱవేరదు. దగ్గఱ అగుటకు ఎంత దగ్గఱ అను ప్రమాణమేమియు లభింపదు. పదిమైళ్ల లోపల నున్న ప్రాంతమును గూర్చి కూడ నది దగ్గఱ అనియే లోకమున ప్రయోగమున్నది. చాల దగ్గఱ దాదాపు నదిలోనే అన్నంత దగ్గఱ అను అర్థము వచ్చు ప్రయోజనము కొరకే ఆ సమాస ప్రయోగము. పూర్వార్ధమున పవర్గ పంచమాక్షర ప్రాసమున్నది. కుముదసుషమా మైత్రీ శమిత అను శబ్దములలో వృత్త్యనుప్రాసాలంకారమున్నది. తంద్రా చంద్రా అను శబ్దముల జంటలో కూడ ఆ యలంకారము కలదు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు శిరమున చంద్రుని ధరించుట చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె శిరమున పూలు ధరించుట లేక శిరము నందలి కురులు సహజగంధము కలగియుండుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ పరిమలపరీపాకోద్రేకం పయోముచి కాఞ్చనే**
**శిఖరిణి పునర్ద్వైధీభావం శశిన్యరుణాతపమ్।**

**అపి చ జనయన్కమ్బోర్లక్ష్మీమనమ్బుని కో౽ప్యసౌ**
**కుసుమధనుషః కాఞ్చీదేశే చకాస్తి పరాక్రమః॥** 35

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| పరిమళపరీపాకోద్రేకమ్ | = | సుగంధపరిపాకతీవ్రతను; |
| పయోముచి | = | మేఘమునందు; |
| కాంచనే | = | బంగారము నందును; |
| పునః | = | మఱియు; |
| ద్వైధీభావమ్ | = | ద్వైతమును; |
| శిఖరిణి | = | పర్వతమునందు; |
| అరుణాతపమ్ | = | ఎఱ్ఱనిఎండను; |
| శశిని | = | చంద్రునందు; |
| అనమ్బుని | = | నీరులేనిచోట; |
| కమ్బోః | = | శంఖముయొక్క; |
| లక్ష్మీమ్ | = | కాంతిని; |
| జనయన్ | = | కలిగించుచున్న; |
| కః+అపి | = | ఏదో; |
| అసౌ | = | ఈ; |
| కుసుమధనుషః | = | మన్మథునియొక్క; |
| పరాక్రమః | = | పరాక్రమము; |
| కాంచీదేశే | = | కాంచీనగరప్రదేశమున; |
| చకాస్తి | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

మన్మథుని పరాక్రమము (అమ్మవారు) వింత పనులను కొన్నింటిని చేయుచున్నది. మేఘమున బంగారమునందును సువాసన కలిగించుట, బంగారు కొండయందు ద్వైతమున కలిగించుట, చంద్రునందెఱ్ఱని ఎండను కలిగించుట, నీరులేని చోట శంఖకాంతిని కలిగించుట అనునవియే ఆ వింతలు. ఇట్టి వింతలను కలిగించుచున్న ఆ మన్మథుని పరాక్రమము కాంచీనగరప్రదేశమున ప్రకాశించుచున్నది.

**వివరణము :-**

మేఘమున సుగంధ ముండదు. అమ్మవారి మేఘ సదృశమైన కేశపాశము అను మేఘమున సుగంధము నమ్మవారు కలిగించుచున్నది. అట్లే బంగారమునకును వాసన ఉండదు. అమ్మవారి శరీరమే బంగరుకాంతి కలిగియుండుటచే ఆమె శరీరమే బంగారము. దాని యందామె పుప్పొడి మొదలైన సుగంధముగల పరాగములను

ధరించుటచేత బంగారమున సుగంధము నమ్మవారు కలిగించినది. అట్లే కొండను రెండుగా చీల్చుట అసాధ్యకార్యము. కాని అమ్మవారు తన వక్షదేశము అను కొండయందు ద్వైతమును అనగా రెండు అను సంఖ్యను స్తనద్వయ రూపమున కలిగించినది. అట్లే తెల్లని చంద్రునందెఱ్ఱని యెండ యుండదు. కాని అమ్మవారు తన ముఖము అను చంద్రునందు పెదవిని లేక సిందూరతిలకమును ధరించుటచే ఎఱ్ఱనియెండను కలిగించినది. అట్లే నీరులేని చోట శంఖములుండవు. కాని అమ్మవారు శంఖమువంటి కంఠమును ధరించుటచే నీరు లేని చోట శంఖమును కలిగించినది. ఇది ఈ శ్లోకమున తెలియబడు అంశము. కురులని చెప్పక మేఘమని చెప్పుట, శరీరమనిచెప్పక బంగారమని చెప్పుట, స్తనములని చెప్పక కొండయొక్క ద్వైధీభావము అని చెప్పుట, ముఖమని చెప్పక చంద్రుడని చెప్పుట, పెదవి అని గాని లేక సిందూర తిలకమని చెప్పక ఎఱ్ఱనిఎండ అని చెప్పుట అధ్యవసాయము. అనగా విషయమును చెప్పక విషయిని చెప్పుట. (ఉపమేయములను చెప్పక ఉపమానమును చెప్పుట) ఈ అధ్యవసాయము చేయబడిన కారణమున ఈ శ్లోకమున అతిశయోక్త్యలంకార మేర్పడియున్నది. పూవులవల్ల అమ్మవారి కేశపాశమునకు సుగంధము కలిగినదని చెప్పుట అంత సరికాదు. అట్లే శరీరమునకు పుప్పొడి మొదలైన పరాగము అలదుకొనుటచే సుగంధము కలిగినదనుట కూడ అంత సరి కాదు. అమ్మవారి కేశపాశమున సహజ సుగంధమున్నది అని దాక్షిణాత్య కవి నత్కీరుడు చెప్పినాడు. ఆ మాట నిజమని శివుడు సాక్షాత్కరించి చెప్పినట్లాతని ఇతిహాసమున కలదు. పైగా కొంతకాలము ఆమె కేశములనుండిన సాహచర్యముచేత, ఆమె అనుగ్రహముచేత అనగా ఆమె అలంకరించుకొనుటచేత సుగంధత్వమును పొందినవై అమ్మవారు ఇతరుల కలంకరించుకొనుటకై పాతకుసుమములను తీసివైచి ఈయగా వానిని ధరించిన దేవతా యువతుల కేశపాశమునకు శాశ్వత సౌగంధ్యమును కలిగించినవి. అట్టి అమ్మవారి కేశపాశము పుష్పధారణముచేత సుగంధిలమైన దనుట ఆమె కేశపాశ గరిమ నెఱుగక పోవుటయే. పారిజాతాదిదేవతరుకుసుమముల ధరించినను కలుగని శాశ్వతసౌగంధ్య మమ్మవారు కేశపాశమునుండి తీసిపాఱవైచిన పుష్పముల ధరించుటచేత కలిగినదని దేవతాయువతులెప్పుడు కృతజ్ఞతతో భావించుకొనుచుందురు. సాధారణయువతులనే లోకమున పద్మగంధులని పిలచుట కవి లోకరీతి. వారి శరీరములందు పద్మగంధము సహజముగ నుండుననియే కవులు ప్రకటించెదరు. అట్టిచే దేవతయైన కాదు, పరదేవతయై అమ్మవారి శరీరమున సౌగంధ్యము నలదుకొనుటచే కలిగిన దనుట పొరపాటే కాగలదు. హిమగిరిపుత్రియైన అమ్మవారి ముఖము అను హిమాంశువున ప్రొద్దు పొడుచుటయే వింత శోభ. అది ఆ హిమాంశువునకు కలిగినది. ఆమె ధరించిన సిందూరతిలకముకాని బింబాధరముకాని ఆమె ముఖచంద్రునందు ప్రొద్దుపొడుపు సౌందర్యమును కలిగించినది. ఈ యర్థము పూర్వార్ధ ప్రతిపాదితము. శుక్తి రజితభ్రాంతి లోకసహజము. కాని అమ్మవారి కంఠమును చూచి నీరు లేని చోట శంఖ మెక్కడి నుండి వచ్చినదని, ఎట్లు పుట్టినదని

జనులు విస్తుపోయినారు. కంబులక్ష్మి కంబువును విడచియెన్నడో అమ్మవారి కంఠమున చేరినదని కవులు భావించినారు. మన్మథుని పరాక్రమ మేపనియైన చేయగలదు. దాని కసాధ్యమైనదేది? ఈ మన్మథుని పరాక్రమమంతయు వాస్తవమునకు అమ్మవారిదే కాదు. అమ్మవారే పరాక్రమము. ఆ పరాక్రమమే అమ్మవారు. ఈ యర్థము ఉత్తరార్ధ ప్రతిపాదితము. 1,2,3 పాదములలో వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు మన్మథుని పరాక్రమముగా చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె శివుని వామోత్సంగస్థలముగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ పురదమయితుర్వామోత్సఙ్గస్థలేన రసజ్ఞయా**
**సరసకవితాభాజాం కాఞ్చీపురోదరసీమయా।**
**తటపరిసరైర్నీహారాద్రేర్వచోభిరకృత్రిమైః**
**కిమివ న తులామస్మచ్చేతో మహేశ్వరి! గాహతే॥ 36**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| మహేశ్వరి | = మహేశ్వరునిల్లాలా! |
| పురదమయితుః | = శివునియొక్క |
| వామోత్సంగస్థలేన | = వామాంకభాగము ఐన; |
| సరసకవితాభాజామ్ | = మంచికవితగల వారికి; |
| కాంచీపురోదరసీమయా | = కాంచీగర్భస్థ ప్రదేశములగు; |
| రసజ్ఞయా | = రసజ్ఞరాలితో; |
| నీహారాద్రేః | = హిమగిరియొక్క; |
| తటపరిసరైః | = తటప్రాంతములతో; |
| అకృత్రిమైః | = నిత్యములైన; |
| వచోభిః | = వాక్కులతో; |
| అస్మచ్చేతః | = మా మనస్సు; |
| కిమివ | = ఎందుకని; |
| తులామ్ | = పోలికను; |
| న గాహతే | = పొందుట లేదు. |

**తాత్పర్యము:-**

నా మనస్సు శివుని వామాంకము అగు రసజ్ఞురాలితో సరసకవితకు పుట్టినిల్లువంటి కాంచీపురగర్భప్రదేశముతో హిమగిరితటప్రాంతములతో వేద వాక్కులతో నా మనస్సేల సౌందర్యమును పొందలేకున్నది.

**వివరణము :-**

అమ్మవారు శివుని వామాంక మందుండునది. కావున లక్షణ నాశ్రయించి ఆమె శివుని వామాంకస్థలముగా చెప్పబడినది. కాంచీపురము ఎందఱో సరస కవులకు పుట్టిల్లు. కవులెందఱో కాంచీనగరి యను తల్లి గర్భములో నున్నారు. అమ్మవారు కూడ కాంచీపురగర్భముననే ఉన్నది. కావున అమ్మవారు కాంచీపుర గర్భసీమగా చెప్పబడుచున్నది. రస మనగా బ్రహ్మానందము. లేక బ్రహ్మానందసహోదరమైన శృంగారాది నామక రసము. బ్రహ్మము ఆనందము పర్యాయములు అయినను లౌకికానందవైలక్షణ్యమును సూచించుటకు బ్రహ్మానందమను వ్యవహార మేర్పడినది. కాంచీపురమున కావ్యరసము నాస్వాదించు సహృదయులున్నారు. కావుననే అక్కడ కవుల కాదేశ మేర్పడి యున్నది. పెక్కురు కవులక్కడ నివసించుచున్నారు. మూకమహాకవికూడ వారిలో నొకడని వేఱుగా చెప్పనక్కఱలేదు. సరసకవులు రసజ్ఞహృదయులు. పరస్పరానందవర్ధనులు. కవి **సహృదయాఖ్యం విజయతే** అను ఆనందవర్ధన సూక్తి ఈ విషయమును సూచించును. కవి సహృదయులున్న చోట కావ్యములు పుట్టి పెఱిగి అనగా వానిలోని రసాదికములు బహు సంఖ్యాకులచే ఆస్వాద్యమానములై ప్రలయాంతముదాక చిరజీవములై ఉండును. అట్టి సహృదయు లా కావ్యరసము నాస్వాదించెదరు. కావున రసజ్ఞులనబడెదరు. అట్టి రసజ్ఞుల సమష్టి అమ్మవారు. ఆ కాంచీనగరగర్భమున రసజ్ఞులెందఱో ఉన్నారు. అమ్మవారు కూడ ఆ కాంచీపురగర్భముననే ఉన్నది. కావున అమ్మవారు కాంచీపుర గర్భస్థరసజ్ఞరూపిణిగా వెలయుచుండుటచేత ఆమె **రసజ్ఞ** అని చెప్పబడినది. ఇంతేగాక కాంచీనగరగర్భమున సమాధిస్థితినంది ఆత్మానందము నెఱుగు రసజ్ఞులునున్నారు. వారి సమష్టియైన అమ్మవారు నగరమున ఉన్నది. అందుచేత కూడ అమ్మవారు **రసజ్ఞ** అని చెప్పవచ్చును. బ్రహ్మము స్వరూపము. స్వాత్మానందరూపము. సర్వానందరూపము. బ్రహ్మానందరూపము. బ్రహ్మము నెఱుగుట అనగా బ్రహ్మమగుటయే. బ్రహ్మము నెఱిగిన ఆ సమయము అనగా కావ్యరసచర్వణ సమయము. కాగా సమాధిలో బ్రహ్మరసాస్వాదన సమయమున వేద్యాంతర ముండదని తద్‌జ్ఞులు చెప్పెదరు. సర్వానందమును స్వాత్మానందముగా భావించు సత్పురుషులు కూడ రసజ్ఞులనబడెదరు. అమ్మవారట్టి రసజ్ఞరూపిణి కావున **రసజ్ఞ** అని చెప్పబడినది. అమ్మవారు హిమగిరి సంతానము. మాతా పితృ శరీరజము కావున వారి శరీరమున కంటె వేఱుగాజాలదు. ఆత్మయొక్కటే అనగా మాతా పిత్రాత్మ పుత్రాత్మ భిన్నములు కావు. కావున ఆత్మదృష్టిలో మాతాపితృపుత్రులకు భేదము లేదు. **ఆత్మా వై పుత్రనామాసి** కౌ.2.11 అను శ్రుతి తాత్పర్యమిది. హిమగిరి తత్పరిసరము హిమగిరి శరీరభాగములు కావున అమ్మవారు వానివలె శరీరభాగమే. కావున నీహారాద్రియొక్క తట పరిసరములని చెప్పబడినది. సంసారతాపముతో నలసిపోయిన స్రుక్కి సొక్కి సోలియున్న వారి సేద దీర్చునది కావున అమ్మవారు నీహారాద్రి. పరిసరములవలె తాపహారిణి కావున అమ్మవారు అట్లు చెప్పబడినది. వేదవాక్కులు తత్ప్రతిపాద్య పరబ్రహ్మమువలె నిత్యములు. అమ్మవారు

వేదవాగ్రూపిణి కావున అకృత్రిమ వచస్సులు అని చెప్పబడినది. (బహువచనము పూజార్థకము). శబ్దము వర్ణాత్మకము. ధ్వన్యాత్మకము. అని రెండు విధములుగా నుండును. వానిలో ధ్వన్యాత్మక శబ్ద మనిత్యమని, వర్ణాత్మక శబ్దము నిత్యమనియు పూర్వమీమాంసాది శాస్త్రజ్ఞులు చెప్పెదరు. అకృత్రిమవచస్సు అనగా వేదవర్ణాత్మకవాక్కు అమ్మవారి స్వరూపము. కావున అట్లు చెప్పబడినది. **పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ** నాలుగు వాక్కులలో పరా నిత్యవాక్కు కావున అది అకృత్రిమ వచస్సు. అమ్మవారా పరా వాగ్రూపిణి కావున అట్లు చెప్పబడినది. నాల్గవపాదమున పైన పేర్కొనబడిన పురదమయితుర్వామోత్సంగాదులలో తన మనస్సున కేల సారూప్యము లేక తాద్రూప్యము ఎందుకు కలుగుటలేదని తపించుచున్నాడని తెలియబడుచున్నది. భంగ్యంతరముగా అమ్మవారే చెప్పబడినందున పర్యాయోక్త్యలంకారములు మూడు పాదములలో నున్నవి.



**అవ:-** పై శ్లోకమున హిమాచలతటపరిసరములుగా చలించని అమ్మవారు చెప్పబడినది. ఈ శ్లోకమున గజేంద్రమువలె చలించున దమ్మవారని చెప్పబడుచున్నది.

**శ్లో॥ నయనయుగలీమాస్మాకీనాం కదా ను ఫలేగ్రహీం**
**విదధతి గతౌ వ్యాకుర్వాణా గజేన్ద్రచమత్క్రియామ్।**
**మరకతరుచో మాహేశానా ఘనస్తననమ్రితాః**
**సుకృతవిభవాః ప్రాఞ్చః కాఞ్చీవతంసధురన్ధరాః॥ 37**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| గతౌ | = నడకయందు; |
| గజేంద్రచమత్క్రియామ్ | = గజేంద్రముయొక్క చమత్కారమును; |
| వ్యాకుర్వాణాః | = వివరించునట్టి; |
| ఘనస్తననమ్రితాః | = గొప్పవైన స్తనములతో వంగి యున్నట్టి; |
| మరకతరుచః | = మరకతమణికాంతులు కలిగినట్టి; |
| కాంచీవతంసధురంధరాః | = కాంచీపురమున గొప్పవారైనట్టి; |
| ప్రాంచః | = ప్రాచీనములైనట్టి; |
| మాహేశానాః | = మహేశ్వరునకు చెందిన; |
| సుకృతవిభవాః | = పుణ్యసంపదలు; |
| ఆస్మాకీనామ్ | = మాకు సంబంధించిన; |
| నయనయుగలీమ్ | = కన్నులజంటను; |
| కదా | = ఎన్నడు; |
| ఫలేగ్రహీమ్ | = ఫలములందుకొనువానిగా; |
| విదధతి | = చేయునో. |

**తాత్పర్యము:-**

నడకలో గజేంద్రముయొక్క చమత్కారమును కనబఱచుచు, గొప్పస్తనములతో వంగియున్న, మరకతమణికాంతుల వెదజల్లు, కాంచీనగరమున గొప్పవారైన ప్రాచీనములైన మహేశ్వరునకు సంబంధించిన శివుని పుణ్యసంపదలు మా కన్నులకు సాఫల్యము నెన్నడు కలుగజేయునో?

**వివరణము :-**

రెండవపాదమున అమ్మవారి నడక గజగమనమువంటిది అను ఉపమాలంకారము వ్యంగ్యమగుచున్నది. నాల్గవపాదమున అమ్మవారు **కాంచీపుర ధురంధర** అని చెప్పబడినది. కాంచీనగర భారము మోయునది యని ఆ సమాసముయొక్క అర్థము. భారమును మోయుట అనగా కాంచీనగర వాసుల బాగోగులను, యోగక్షేమములను పరశీలించుచు వారిని పాలించుట యని దాని సారము. ఉత్తరార్ధమున అమ్మవారు శివుని పుణ్యసంపదలు అని భంగ్యంతరముగా చెప్పబడుటవలన పర్యాయోక్త్యలంకార మేర్పడియున్నది. ప్రాంచః కాంచీ అను పదముల జంటలో వృత్త్యనుప్రాసాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు శివుని పుణ్యసంపద యని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె శివుని సర్వస్వమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ మనసిజయశఃపారమ్పర్యమ్మరన్దఝరీస్రువాం**
**కవికులగిరాం కన్దం కమ్పానదీతటమణ్డనమ్।**
**మధురలలితమ్మత్కం చక్షుర్మనీషిమనోహరం**
**పురవిజయినః సర్వస్వం తత్పురస్కురుతే కదా॥ 38**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| మనసిజయశఃపారంపర్యమ్ | = మన్మథునికీర్తి పరంపర; |
| మరందఝరీస్రువామ్ | = మకరందనదిని ప్రవహింపజేయు; |
| కవికులగిరామ్ | = కవికుల వాక్కులయొక్క; |
| కన్దమ్ | = జన్మస్థానమైనట్టి; |
| కమ్పానదీతటమండనమ్ | = కమ్పానదీతీరమున కలంకారమైనట్టి; |
| మనీషిమనోహరమ్ | = విద్వాంసుల మనస్సులను హరించునట్టి; |
| మధురలలితమ్ | = మధురము, లలితమునైన; |
| పురవిజయినః | = శివునియొక్క; |
| సర్వస్వమ్ | = సర్వస్వమైన అమ్మవారు; |
| మత్కమ్ | = నాకు సంబంధించిన; |

చక్షుః = కంటిని;
కదా = ఎప్పుడు;
పురస్కురుతే = ఎదురుగా చేయునో!

**తాత్పర్యము:-**

మన్మథుని కీర్తి పరంపర మకరందనదులను ప్రవహింపజేయు కవుల వాక్కులకు జన్మస్థానము. విద్వాంసుల మనస్సులను హరించు మధురము, లలితమునైన శివుని సర్వస్వమైన అమ్మవారు నా కన్నుల కెన్నడు సాక్షాత్కరించునో కదా!

**వివరణము :-**

శివుడు మన్మథుని గాల్చి కీర్తిశేషు నొనరించినా ననుకొన్నాడు. కాని నిగ్రహము కలవాడనన్న కీర్తి నాతడే కోల్పోయినాడు. అమ్మవారిని కామించినాడు. అమ్మవారి కన్నులలో దాగియున్న కాముని చూచినాడు. కామాక్షిని చూచినాడు. కాముడు తనను కాల్చిన కాటిలో నుండియే ఆతని హృదయమున ప్రవేశించినాడు. ఈ ఒక్కొక్క దశలో మన్మథుని కీర్తి పరంపర ఉన్నది. కామరూపిణి కామాక్షియైన అమ్మవారతని హృదయమున కదలక యున్నది. కావున అమ్మవారు మన్మథుని కీర్తి పరంపరగా పేర్కొనబడినది. అమ్మవారిని చూచి శివుడే కవియై ఆమెను పొగడుచు కవితలనెన్నిటినో అల్లినాడు. అంతటి నిష్కాముడని పేరొందిన వేదవేదాంతములలో నివసించు ఛాందసుడే కవియై ఆమెను పొగడినాడనగా మిగిలిన కవులు పొగడుటలో వింత యేమున్నది. అట్లు పొగడిన ఇతర కవులలో బ్రహ్మ మొదటివాడు. శుక్రుడు రెండవవాడు. ఆదికవి వాల్మీకి మూడవవాడు. వ్యాసుడు నాల్గవవాడు. కాళిదాసాదులు ఆ తరువాతి వారు. వీరందఱు మకరందనదీ ప్రవాహములవంటి కవితల.నల్లినారు. వానికి మూల మమ్మవారు. అమ్మవారే స్వయముగా వాగ్రూపిణి, ఆమెయే ఆయా కవుల హృదయములలో నుండి ప్రవహించినదేమో. ఆమె దర్శనము లేక ఆమె అనుగ్రహము మూకుల సైతము మహాకవుల నొనరించును. అందుచేత ఆ తటమునందలి కాంచీ నగరమునకు అమ్మవారే అలంకారము. అమ్మవారి వాక్కు మధురము, రూపము లలితము. అది మనుషుల మనస్సులనే హరించును. అమ్మవారు శక్తి. శివుడు శక్తిమంతుడు. శక్తిమంతుడు శక్తిని వీడి యుండడు. వీడినచో శక్తిమంతుడను మాటయే నిరర్థకమగును. కావున ఈ శ్లోకమున అమ్మవారు శివుని సర్వస్వమని చెప్పబడినది. శక్తిమంతుడైన శివుని సర్వస్వము శక్తిగాక మరేమి కాగలదు. ఈ శ్లోకమున అన్ని పాదములలో వర్ణమైత్రి యున్నది. వృత్త్యనుప్రాసములున్నవి. నాల్గవపాదమున వర్ణమైత్రితో పాటు ప్రాసయతి యున్నది.



**అవ:-** పై శ్లోకమున మనసిజయశఃపారమ్పర్యమ్ అని చెప్పబడిన అమ్మవా రీశ్లోకమున **మనసిజకృపాలీల** అని చెప్పబడినది.

శ్లో॥ శిథిలితతమోలీలాం నీలారవిన్దవిలోచనాం
దహనవిలసత్ఫాలాం శ్రీకామకోటిముపాస్మహే।
కరధృతలసచ్ఛూలాం కామారిచిత్తమనోహరాం
మనసిజకృపాలీలాం లోలాలకామలికేక్షణామ్॥ 39

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| శిథిలితతమోలీలామ్ | = | శిథిలమొనర్చబడిన తమఃప్రభావముగల; |
| నీలారవిన్దవిలోచనామ్ | = | నీలకమలములవంటి కన్నులుగల; |
| దహనవిలసత్ఫాలామ్ | = | అగ్నితో ప్రకాశించు నొసలుగల; |
| కామారిచిత్తమనోహరామ్ | = | శివుని చిత్తమును హరించు; |
| కరధృతలసత్+శూలామ్ | = | చేత ధరించిన శూలముగల; |
| మనసిజకృపాలీలామ్ | = | మన్మథునియందు కృపయను లీల కలిగిన; |
| లోలాలకామ్ | = | చలించు ముంగురులుగల; |
| అలికేక్షణామ్ | = | నొసట కన్నులుగల; |
| శ్రీకామకోటిమ్ | = | శ్రీకామకోటిని; |
| ఉపాస్మహే | = | ధ్యానించుచున్నాము. |

**తాత్పర్యము:-**

తమః ప్రభావము తగ్గించిన, నీలకమలములవంటి కన్నులుగల, నొసటి అగ్నినేత్రముతో ప్రకాశించు, చేత శూలము ధరించిన, శివుని చిత్తమనస్సుల హరించిన, మన్మథునందు దయ యను లీలను ప్రదర్శించిన, చలించు ముంగురులు గల శ్రీ కామకోటి నుపాసించుచున్నాము.

**వివరణము :-**

అమ్మవారు నీల కమలములవంటి కన్నులు కలిగియున్నది. ఇంతే కాదు అమ్మవారి దేహము కూడ తమాలనీలము అయినను తమోగుణ ప్రభావము నడంచుట ఆమె కొక లీల. ఆమె నల్లని ముంగురులు ఆమె నొసటి చీకట్లువలె ముసురుకొనుచున్నవి. ఆ నొసట చీకటిలో దీపము పెట్టినట్లు అచటనున్న కంటిలోనున్న మంట ప్రకాశించుచున్నది. ఆమె పాపిటియందలి సిందూరము కూడ కేశపాశాంధకారమును శిథిల మొనర్చుచున్నది. ఆమె చేతిలో శూలము విరాజిల్లుచున్నది. బహుశః శివుని చేతిలోనున్న శూలమును విలాసముగా తన చేత నామె ధరించియుండవచ్చును. ఆమె శివుని చిత్తమనస్సులను హరించునది. చిత్తముయొక్క పని ధ్యానము. అమ్మవారినే శివుడు ధ్యానించుచున్నాడు. శివుని చిత్తము మరొక దానిని ధ్యానించుట మానుకొన్నది. అసలు చిత్తము తన స్వాధీనములోనున్న కదా దేనినైన ధ్యానించుట. అమ్మవారెప్పుడో ఆయన చిత్తమును హరించివైచినది. సంకల్పవికల్పములు మనసుయొక్క కార్యములు. శివుని

కిప్పుడామె ఆధీనములో నుండవలెనా, ఉండవలదా అను సంకల్ప వికల్పములు లేవు. వాని కలయికయైన సంశయము లేదు. ఆమె ఆధీనములో నుండవలెనను నిశ్చయము జరిగిపోయినది. ఆమె వింతగా శివుడు కామించుట అమ్మవారు మన్మథునిపై దయచూపుట. **నీలారవిన్దవిలోచనామ్** అను విశేషణమున వాచకలుప్తోపమాలంకారమున్నది. కామాక్షీదేవి శ్రీకామకోటియని చెప్పబడినది. ఆమె కామారి చిత్తమనస్సుల హరించినదనగా కాముడు కోటి రూపములలో తనవైరియైన శివునిపై పగ తీర్చుకొన్నాడనియే. **కామారిచిత్తమనోహరామ్** అను విశేషణ మీ యర్థమును వ్యంజింపజేయును. నాలుగు పాదములలోని మొదటి విశేషణములు పదాంతప్రాసమును కలిగియున్నవి. మూడవపాదమున కకారవర్ణమైత్రి యున్నది. ఈ శ్లోకము నందంతట లకారావృత్తిచే వృత్త్యనుప్రాసాలంకార మేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున కామారి చిత్తమనోహరగా చెప్పబడిన అమ్మవారీ శ్లోకమున **కనకగిరిధానుష్కమహిషి**గా చెప్పబడుచున్నది. ఈ శ్లోకమునుండి ఇరువది శ్లోకములు **శిఖరిణీ** వృత్తమున నిబంధింపబడినవి.

**శ్లో॥ కలాలీలాశాలా కవికులవచఃకైరవవనీ-**
**శరజ్జ్యోత్స్నాధారా శశధరశిశుశ్లాఘ్యముకుటీ।**
**పునీతే నః కమ్పాపులినతటసౌహార్దతరళా**
**కదా చక్షుర్మార్గం కనకగిరిధానుష్కమహిషీ॥ 40**

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| కలాలీలాశాలా | = | విద్యల క్రీడాభవనమైన; |
| కవికులవచఃకైరవవనీశరజ్జ్యోత్స్నాధారా | = | కవుల సమూహముల వాక్కులనెడి తెల్ల కలువల వనములకు శరత్కాలపు వెన్నెలధారయైన; |
| శశధరశిశుశ్లాఘ్యముకుటీ | = | బాలచంద్రుడు ప్రశంసింపదగిన కిరీటము కలిగిన; |
| కమ్పాపులినతటసౌహార్దతరళా | = | కమ్పానదియొక్క ఇసుక ఒడ్డు నందలి స్నేహముచే చలించిన; |
| కనకగిరిధానుష్కమహిషీ | = | శివుని పట్టపురాణి; |
| నః | = | మాయొక్క; |
| చక్షుర్మార్గమ్ | = | కంటిమార్గమును; |
| కదా | = | ఎప్పుడు; |
| పునీతే | = | పవిత్రము చేయునో. |

**తాత్పర్యము:-**

విద్యలకు క్రీడాభవనము, కవుల వాక్కులనెడి తెల్ల కలువల వనములకు శరజ్జ్యోత్స్నాధారను ప్రవహింపజేయు బాలచంద్రుని కిరీటమున ధరించినది, కమ్పానది యిసుక ఒడ్డున స్నేహముతో చలించునది, శివుని పట్టపుమహిషియునైన అమ్మవారు మా కంటి మార్గము నెప్పుడు పవిత్రమొనర్చునో!

**వివరణము :-**

1) అమ్మవారు కలలాడుకొనుటకు వీలైన భవనము. కలలందు స్త్రీత్వము కలాశబ్దముయొక్క స్త్రీ లింగముచేత వ్యంగ్యము. అమ్మవారి శరీరమందు కలా స్థానములున్నవి. కలలనగా విద్యలు. విద్వాంసులామెను వర్ణించు కవితలు పాటలు పాడి, తమ గానకవితాకలలకు సార్థకతను సంపాదించుకొందురు అనియు వ్యంగ్యములగు నర్థములు. **కవికులవచఃకైరవవనీశరజ్జ్యోత్స్నాధారా** అను విశేషణమునందు, వచస్సులందు కైరవవనీత్వారోపము, అమ్మవారియందు **శరజ్జ్యోత్స్నాధారాత్వ** మారోపింపబడుటచే రూపకాలంకారమేర్పడియున్నది. శరత్కాలమున వెన్నెలల సాంద్రత అధికము. కావున శరజ్జ్యోత్స్నాధారగా అమ్మవారు చెప్పబడినది. ఆమె ముకుటము శ్లాఘ్యము. ఏలననగా ఆమె ముకుటమున బాలచంద్రుడు వెలయుచుండును గదా. అమ్మవారు కమ్పానదీ పులినతటముల విహరించుచుండును. సాధకుల కా పులినతటములలో అమ్మవారు సాక్షాత్కరించుచుండును. శివునకు మేరుపర్వతము ధనువు. అందుచేత శివుడు కనకగిరిధానుష్కుడు. ఆతడు సర్వలోకమహారాజు. ఆయన భార్య కావున కనకగిరి ధానుష్కమహిషియని చెప్పబడినది. ఆమె ఎప్పుడు సాక్షాత్కరించునా యను కవియొక్క చింత ఈ శ్లోకమున తెలియబడును. నాలుగు పాదములందు వర్ణమైత్రి ఉన్నది. ఈ శ్లోకము **శిఖరిణీ** వృత్తమున నిబంధింపబడినది. దీనిలో **య మ న స భ ల గ** అను గణములుండును.

2) రసై రుద్రైశ్ఛిన్నా యమనసభలా గః శిఖరిణీ। ఇతి లక్షణమ్ (6,11)



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు కవికులవచఃకైరవవనులపై శరజ్జ్యోత్స్నా ధారయని చెప్పబడినది. ఈ శ్లోకమున జ్యోత్స్నాధారకాధారమైన శిరోభూషణముగా చంద్రుని ధరించునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ నమః స్తాన్నమ్రేభ్యః స్తనగరిమగర్వేణ గురుణా**
**దధానేభ్యశ్చూడాభరణమమృతస్యన్ది శిశిరమ్।**
**సదా వాస్తవ్యేభ్యస్సవిధభువి కమ్పాఖ్యసరితో**
**యశోవ్యాపారేభ్యస్సుకృతవిభవేభ్యః పశుపతేః॥** 41

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| గురుణా | = | బరువైన; |
| స్తనగరిమగర్వేణ | = | స్తనముల భారముయొక్క గర్వముతో; |
| నమ్రేభ్యః | = | వంగిన; |
| శిశిరమ్ | = | చల్లని; |
| అమృతస్యన్ది | = | అమృతమును స్రవించు; |
| చూడాభరణమ్ | = | శిరోభూషణమును; |
| దధానేభ్యః | = | ధరించుచున్న; |
| కమ్పాఖ్యసరితః | = | కమ్పా యను పేరుగల నదియొక్క; |
| సవిధభువి | = | సమీప భూమి యందు; |
| సదా | = | ఎల్లప్పుడు; |
| వాస్తవ్యేభ్యః | = | నివసించు; |
| పశుపతేః | = | శివునియొక్క; |
| యశోవ్యాపారేభ్యః | = | కీర్తి వ్యాపారములైన; |
| సుకృతవిభవేభ్యః | = | పుణ్య సంపదలైన (అమ్మవారి కొఱకు); |
| నమః | = | నమస్సు; |
| స్తాత్ | = | అగుగాక. |

**తాత్పర్యము:-**

బరువైన స్తనభారముతో వంగిన, చల్లని అమృతమును స్రవించు శిరోభూషణమును ధరించిన, ఎల్లప్పుడు కమ్పానదీ సమీపభూమియందు నివసించు, శివుని కీర్తి వ్యాపారములు పుణ్యసంపదలునైన అమ్మవారికి నమస్సును సమర్పించుచున్నాను.

**వివరణము :-**

వంగియున్న వారికి నమస్కరించెదను. **నమః స్తాన్నమ్రేభ్యః** అను ఆరంభము హృదయంగమముగా నున్నది. వంగి యుండు వారే (గర్వము లేని వారే) ఉన్నతులగుదురని వారి ముందు మిగిలిన వారు వంగి యుందురు. అణిగి మణిగి యుందురు అను అర్థాంతరన్యాస మాయారంభమున వ్యంగ్యమగుచున్నది. అమ్మవారికి స్తనభారగర్వమున్నది. లోకములోని జీవుల కందఱకు కడుపు నిండునన్ని పాలను కలిగి యుండుటచే ఆ స్తనములు బరువు కలిగియుండుట అమ్మకు గర్వహేతువే యగును. ఆ గర్వమును గొప్పదే. అమ్మవారట్టి గొప్పగర్వముతో వంగినది. ఇట్లు వంగియుండుట బయట కావిధముగా కనబడినను వాస్తవముగా నాకన్న మిన్న (ఉన్నతు) లెవరు లేరను ఔన్నత్యమును ప్రకటించు గడుసుతన మా వంగుటలో నున్నది. తనకు లోక మాతృతాగరిమను కలిగించు శివునకు

కృతజ్ఞతతో అట్లు వంగినదేమో తెలియదు. అట్టి కృతజ్ఞత గలవారు నమస్కరింపదగినవారే. లోకమున చీకటే యెక్కువ అని చాటు కేశపాశమున ఆమె చంద్రుని ధరించినది. చల్లనివాడు, అమృతమును చిందువాడును ఐన చంద్రుడే ఆమె శిరోభూషణమని భంగ్యంతరముగా చెప్పుటచే రెండవ చంద్రుడని చెప్పక చల్లని అమృతమును గురిపించు శిరోభూషణమని భంగ్యంతరముగా చెప్పుటచే రెండవపాదమున పర్యాయోక్త్యలంకార మేర్పడి యున్నది. కమ్పానదీ సమీపభూములలో నెల్లప్పుడు జీవులయం దనుకమ్పతో విహరించుచున్నదెవరు? పశుపతి యశస్సా లేక ఆయన పుణ్యసంపదయా? రెండును అయిన అమ్మవారు గాక మఱెవ్వరును (నాదరింపదగిన వారు) లేరను నిశ్చయాంతమైన సందేహాలంకారము నాల్గవపాదమున వ్యంగ్యమగుచున్నది. పశుపతి కింత యశస్సు కలిగించిన సుకృతమేమో యెట్టిదో ఏమని చెప్పగలము. మూడవపాదమున వర్ణమైత్రి ఉన్నది. నాల్గవపాదమున పదాంతప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు శిరమున చంద్రుని ధరించుట చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె చరణమందలి చంద్రుని కిరణముల దేవతాకిరీట చుంబనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ అసూయన్తీ కాచిన్మరకతరుచో నాకిముకుటీ-**
**కదమ్బం చుమ్బన్తీ చరణనఖచన్ద్రాంశుపటలైః।**
**తమోముద్రాం (వి)నిద్రావయతు మమ కాఞ్చీనిలయనా**
**హరోత్సఙ్గశ్రీమన్మణిగృహమహాదీపకలికా॥ 42**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| మరకతరుచః | = | మరకతమణులకాంతులను; |
| అసూయన్తీ | = | అసూయపడుచున్న; |
| చుమ్బన్తీ | = | చుంబించుచున్న; |
| నాకిముకుటీకదమ్బమ్ | = | దేవతా కిరీటముల సమూహమును; |
| చరణనఖచంద్రాంశుపటలైః | = | పాదముల గోర్లనెడిచంద్రుని కిరణముల గుంపులచేత; |
| హరోత్సఙ్గశ్రీమన్మణిగృహ మహాదీపకలికా | = | శివునితొడ యనెడు మహామణిగృహమునకు దీపకలికయైన; |
| కాంచీనిలయనా | = | కాంచీనగరము నివాసముగా గల; |
| కాచిత్ | = | ఒకానొకతె; |
| మమ | = | నాయొక్క; |

తమోముద్రామ్ = అజ్ఞానాంధకారచిహ్నమును;
నిద్రావయతు = నిద్రింపజేయుగాక!

**తాత్పర్యము:-**

అమ్మవారు కాలిగోళ్ళనెడి చంద్రుల కిరణముల తోడనే, తన పాదములపై కిరీటములు ధరించిన దేవతలు తమ తలలను మోపినపుడు, తాకి యాశీర్వదించినది. కాంచీనగరము నివాసముగా శివుని తొడయను మేడను వెలుగించు దీపకలిక నాయొక్క అజ్ఞానాంధకార చిహ్నము నపహరించుగాక.

**వివరణము :-**

మరకతమణికాంతుల కసూయపడు అను అర్థముగల మొదటి విశేషణమున మరకతమణుల కాంతులతో అమ్మవారి మేనికాంతులకు గల ఔపమ్యము వ్యంగ్యమగుచున్నది. అమ్మవారు చంద్రకలను నెత్తికెక్కించుకొన్నది. ఆ గౌరవము చంద్రకలకెట్లు కలిగినది. అమ్మవారి ముఖమును చూచి చంద్రుడు తన కంత సౌందర్యము లేమికి చింతించి తత్ప్రాప్తికై ఆమె పాదములపై గోళ్ళ రూపమున పది ముక్కలైపడినాడు. దశథా వేడుకొను నా చంద్రుని పదాఅవకలను నెత్తిన పెట్టుకొన్నది. కాళ్ళపైబడిన పదిగోళ్ళనెడి చంద్రులు తమకు శిరోభూషణత్వము లేకపోయెనని చింతించినవి. అమ్మవారా గోళ్ళ రూపమున తనపాదములపైబడిన చంద్రుని పది భాగముల కిరణములతో దేవతా కిరీటములను చుంబించుట సహజము. దేవతలు వచ్చి ఆమె పాదములపై తలల మోపినారు. అమ్మవారి కాలిగోళ్ళనెడి చంద్రుల కిరణములతోడనే వారిని చుంబించినది. తాను వంగకయే తన పాదనఖచంద్రకిరణములతో వారి తలలు తాకి యాశీర్వదించినది. దేవతలా సుఖమునకే ఉబ్బితబ్బిబై మాటిమాటికి నమస్కరించుచుందురు. ఈ యర్థమును వ్యంజింపజేయు ద్వితీయవిశేషణమున గోళ్ళు చంద్రులుగా రూపింపబడుటచే రూపకాలంకారమేర్పడియున్నది. సాధారణముగా కాంచీనగరమునందలి మందిరమున నివసించు అమ్మవారు శివుని తొడయను మేడను వెలిగించు దీపకలికయై యొకనాడు భక్తులకు దర్శనమిచ్చినది. ఆ దృశ్యమును చూచిన మూకమహాకవి దానిని నాల్గవపాదమున వర్ణించినాడు. అమృతసముద్రమున మణిద్వీపమున్నది. దానియందు శ్రీనగరమున్నది. దానియందు చింతామణిగృహమున్నది. ఆ చింతామణిగృహమనగా ఏదో కాదు. శివుని వామోత్సంగమే. దాని యందలి దీపకలిక మరేదో కాదు అమ్మవారే అని రూపించుటచే నాల్గవపాదమున రూపకాలంకార మేర్పడియున్నది. కాచిత్ అని చెప్పుట ఆమె అనిర్వాచ్యతను వ్యంజింపజేయును. జ్ఞానరూపపరబ్రహ్మతను వ్యంజింపజేయును. **తమోముద్రాం నిద్రాపయతు** అను ప్రయోగము విచిత్రమైనది. సాధారణముగా తమస్సు నిద్రను కలిగించును. నిద్రను తొలిగించ నది జాగృతమైయుండును. తల్లి మేల్కొనిన గదా పిల్లల జోకొట్టి నిద్రపుచ్చును. ఆ తమోముద్రయొక్క జాగ్రదవస్థను తొలగింపజేసి

నిద్రింపజేయుమని కవి కోరుచున్నాడు. తమస్సు నశించిననే దాని జాగృతస్థితి నశింపబడును. అది యున్నంతవఱకు నిద్ర తప్పదు. అజ్ఞానము తప్పదు. భ్రాంతి తప్పదు. ఈ సర్వప్రపంచమునకై తమస్సే మూలము. దానిని నిద్రపుచ్చుట యనగా బ్రహ్మాత్మైక్యప్రబోధమును కలిగించుటయే. కవి దానినే అర్థించుచున్నాడు. ఈ ప్రయోగమున వృత్త్యనుప్రాసమున్నది.



**అవ:-** అమ్మవారి **మేనికాంతి** మరకతమణికాంతి సదృశమని పై శ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున అది **మేఘకాంతిసదృశమని** చెప్పబడుచున్నది.

**శ్లో॥ అనాద్యన్తా కాచిత్సుజననయనానన్దజననీ**
**నిరున్ధానా కాన్తిం నిజరుచివిలాసైర్జలముచామ్।**
**స్మరారేస్తారల్యమ్మనసి జనయన్తీ స్వయమహో**
**గలత్కమ్పా శమ్పా పరిలసతి కమ్పాపరిసరే॥ 43**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| అనాద్యన్తా | = | ఆద్యన్తములులేని; |
| సుజననయనానన్దజననీ | = | సజ్జనులకన్నులకానందమును కలిగించు; |
| నిజరుచివిలాసైః | = | తన విలాసములచేత; |
| జలముచామ్ | = | మేఘములయొక్క; |
| కాన్తిమ్ | = | కాంతిని; |
| నిరున్ధానా | = | అడ్డగించుచున్న; |
| స్మరారేః | = | శివునియొక్క; |
| మనసి | = | మనసునందు; |
| తారల్యమ్ | = | చాంచల్యమును; |
| జనయన్తీ | = | కలిగించుచున్న; |
| గలత్కమ్పా | = | జాఱిన వణుకుగల; |
| కాచిత్ | = | ఒకానొక; |
| శమ్పా | = | మెఱుపుతీగ; |
| కమ్పాపరిసరే | = | కమ్పానదీ పరిసరమునందు; |
| స్వయమ్ | = | స్వయముగా; |
| పరిలసతి | = | ప్రకాశించుచున్నది; |
| అహో | = | ఆహా! |

**తాత్పర్యము:-**

ఆద్యంతములు లేనిది. సజ్జననయనానన్దహేతువు. మేఘాలకాంతిని మించిన కాంతిగలది, శివుని మనసున సైతము చంచలతను కలిగించు భయములేని ఒకానొక మెఋపుతీగ కమ్పానది పరిసరములలో స్వయముగా ప్రకాశించుచున్నది. ఆహా!.

**వివరణము :-**

అన్తమున్నవారికే ఆది. ఆది ఉన్నవారికే అంతముండును. భావ వికారములలో మొదటిది పుట్టుక. అదియే ఆది. చావు చివరిది. అదియే అంతము. అమ్మవారికి చావును, పుట్టుకయులేవు. పుట్టుక ఉన్నవారికి చావు ఉండును. ఇది అందఱెఱిగినదే. కాని చచ్చిన వారికే పుట్టుక ఉన్నదని ఎందఱెఱుగుదురు? ఎఱిగినను ఎఱుగక పోయినను అది వాస్తవమని **ధ్రువం జన్మ మృతస్య చ** (2.27) అను గీతా వచనము చెప్పుచున్నది. అమ్మవారికి చావు లేదు. అని **అనాద్యన్తా** అను విశేషణము తెలుపుచున్నది. బ్రతికినంత కాలము ఇతరులకు ముఖ్యముగా సజ్జనుల కానందము కలిగించుచు బ్రతుకవలెను. సజ్జనులట్లే బ్రతుకుదురు. అట్లు బ్రతుకువారే సజ్జనులు. బ్రతుకుట అనగా చావు పుట్టుకల మధ్యభాగము. అది పుట్టుక చావుల మధ్య భాగము కావున మధ్యము అనబడును. అమ్మవారికి ఆద్యన్తములు లేవు కావున మధ్యము, బ్రతుకుట లేవు. అయినను బ్రతుకు వారు కలిగించిన దానికన్న అధికమైన నయనానన్దమును సజ్జనులకు కలిగించుచున్నది. ఆదిమధ్యాన్తములులేక అమ్మవారు నిరంతర మా పనిచేయుచునేయున్నది. దుర్జనుల నయనములకు కంటకమువలె దుఃఖమును కలిగించుచున్నది. దుర్జనులు లోకకంటకులు కావున వారి కమ్మవారు కంటకముగా నుండుట యుచితముగానే ఉన్నది. సుజనులవలె అమ్మవారు సుజనుల నయనముల కానందము కలిగించుచున్నది. ఇది ప్రథమపాద వివరణము. మేఘములు జలదాన మొనర్చుచు లోకోపకారమును సుజనులవలెనే యొనర్చుచున్నవి. అయినను అమ్మవా రా మేఘములకాంతిని తన కాంతితో నడ్డగించుచున్నది. ఇట్లు సుజనసదృశమేఘముల కాంతిని అడ్డగించుట సుజన నయనానన్దహేతువైన అమ్మవారికి భావ్యము కాదనిపించును. కావున అమ్మవారి బాహ్యస్వభావమునకు విరుద్ధముగా నున్నదను విరోధము, సుజన నయనానన్దమును కలిగించు అమ్మవారి కీర్తి ముందఱ మేఘముల సుజన నయనానన్ద హేతుత్వకీర్తి వెలవెల పోవుచున్నదని తెలియుటచే నా విరోధము పరిహరింపబడుచున్నది. అమ్మవారి నల్లనికాంతి ముందఱ మేఘముల కాంతి వెలవెల పోవుటచే మేఘముల కాంతి అడ్డగింపబడినట్లు శ్లోకమున చెప్పబడుట పై అర్థముయొక్క వ్యంజనమునకు హేతువు. సుజనానందమును కలిగించుట అను సృజనకృత్యమున మేఘములు సాటిరాలేనివని చెప్పుట సారాంశము. ఇది ద్వితీయపాదముయొక్క వివరణము.

అందఱి హృదయములందు తారల్యము అనగా చాంచల్యము కలిగించువాడు మన్మథుడు. మనస్సున కామవికారము కలుగుటయే దాని యందు తారల్యము కలుగుట. శివుడు స్మరారి కావున ఆయన మనసున తారల్యమునకు తావుండకూడదు. కాని అమ్మవారా

స్మరారి యని కీర్తి నొందిన శివుని చిత్తము నిశ్చలము అన్న కీర్తిని వమ్ముచేయుచు ఆయన చిత్తమున తారల్యము కలిగించినది. అంత మాత్రమే కాదు. ఇప్పటికిని కలిగించుచునే యున్నది. శతృ ప్రత్యయాంతమైన జనయన్తీ శబ్దము వ్యంజింపజేయుచున్నది. ఇది తృతీయ పాద వివరణము. **శమ్పా** యనగా మెఱపు తీగ. అది క్షణకాలము మెఱసి భయము నొందిన దానివలె అదృశ్యమగును. సాధారణముగా భయము కలిగిన వారు భయహేతువులైన ఇతరులను చూచి చూడక ముందే వారి ముందఱ నుండి పాఱిపోయి అదృశ్యులగుచుందురు. క్షణకాలదర్శనములకు భయ మొక కారణము. అట్లే రాజాంతః పురస్త్రీలు ముఖ్యముగా మహారాణులు బహిర్జనులకు కనబడరు. జనులు మాత్రమువారిని దర్శింపగోరుదురు. సాధారణముగా కనిపించని వారిని చూచు కోరిక కలుగుచుండును. ఎప్పుడో యొకసారి మెఱుపు గుఱిసినట్లు వారి దర్శనము బహిర్జనమునకు కలుగుచుండును. అమ్మవారు త్రిభువనప్రభువుయొక్క పట్టమహిషి, అయినను కమ్పాపరిసరములలో కమ్పమును అనగా రాచఱికపు సంప్రదాయ పరిత్యాగ భయమును వీడి ప్రకాశించు చుండును. అందుచేత ఆమె గలత్కమ్పయని శమ్పయని చెప్పబడినది. క్షణకాలము మెఱయుట శమ్పకు భయమువలన కాకపోయిన దానికి కమ్ప మారోపింపబడుటకు భయము గలవారివలె క్షణకాలము కన్పడుటయే హేతువు. కావున శమ్ప కమ్పసహిత యని ఊహించుకొనవలెను. **గలత్కమ్పా** అను విశేషణము అమ్మవారు మెఱపుతీగ యైనను మెఱపుతీగవలె క్షణకాలము మెఱసి అదృశ్యముగాక నిరంతరము కాంచీపురమందిరమున భక్తులకు దర్శన మొసగుచు శమ్పావైలక్షణ్యమును సంపాదించినదనుటచే నాల్గవపాదమున వ్యతిరేకాలంకారవ్యక్తి యున్నది. కమ్పమువలన భయము కలుగును. అమ్మవారు భయరహిత. కావున గలత్కమ్పా. భయరాహిత్యమే మోక్షము. నిత్యముక్తయగు అమ్మవారికి భయమెట్లుండును? భయములేనివారి దగ్గఱకే భయరాహిత్యము కోరువారు చేరవలెను. గలత్కమ్ప యనుటచే భయరాహిత్యము వ్యక్తమగుచున్న అమ్మవారి కడకు పోయిననే జీవులకు సంసారభయము తొలగును. ఈ యంశము **గలత్కమ్పా** శబ్ద వ్యంగ్యార్థము. కమ్పానది భయముతో పాఱిపోవు జన ప్రవాహమువలె నిర్భయ స్థానమైన సముద్రుని కడకు తన భర్త కడకు వేగముగా పగురులిడుచున్నది. అందువలన కాబోలు కమ్పానది కా పేరు వచ్చినది. హృదయమున భయరహితమైన ఆత్మ యున్నను దాని నాశ్రయించక భయరాహిత్యమునకై జను లెక్కడెక్కడకో పాఱి పోవుచుందురు. ఒక్కొక్కప్పుడు వారట్లు పాఱిపోయి చేరుకొనుచోటనే మృత్యురూప భయము పొంచి యుండి వారిని మ్రింగుచుండును. అట్లే గలత్కమ్పయగు అమ్మవారు పరిసరమున నుండగా ఈ కమ్పానదికి కమ్పానదివంటి జనప్రవాహమునకు భయమేల? ఆత్మరూపిణియైన అమ్మవారి నాశ్రయింపవచ్చును గదా. ఆశ్రయింపకపోవుట వారి అజ్ఞానము, దురదృష్టము. శమ్ప క్షణకాలము మెఱిసినను ఆ ప్రదేశము నందలి అంధకారము కూడ క్షణకాలము మాత్రమే తొలగి శమ్ప మాయమగుటతోడనే తిరిగి అంధకారము గ్రమ్మును. తాత్కాలికముగా

తొలగిన భయము తిరిగి మనస్సు నాక్రమించుకొనును. కాని అమ్మవారను శమ్ప ఆ విధముగా తాత్కాలికభయాంధకారనివారిణి కాక క్షణకాలపు మెఱపుతో శాశ్వతముగా భయాంధకారమును నివారించగలదు. ఆమె నిశ్చలముగా కమ్పాతీరమున నున్నది. మీరు నిరంతర మచ్చటనే యుండి పోవచ్చును. అట్లు వీలు కాకపోయిన క్షణకాలము దర్శించుకొనుడు. చాలును. శాశ్వతభయాంధకారనివారణము కాగలదు. ఈ యర్థమంతయు నాల్గవ పాదమున వ్యంగ్యము.

మొదటి పాదమున నకారావృత్తిచే వృత్త్యనుప్రాసాలంకార మేర్పడి యున్నది. **గలత్కమ్పా, శమ్పా** అను పదముల జంటలో కూడ నా అలంకారమున్నది. **గలత్కమ్పా, కమ్పాపరిసరే** అను సమాసముల జంటలో అర్థభేదమున కమ్పాశబ్దావృత్తి యుండుటచే యమకాలంకారమేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు మేఘకాంతిని మించిన కాంతి గలదని చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారు నీలోత్పలరుచిని మించిన రుచి గలదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ సుధాడిణ్డీరశ్రీః స్మితరుచిషు తుణ్డీరవిషయం**
**పరిష్కుర్వాణాసౌ పరిహసితనీలోత్పలరుచిః।**
**స్తనాభ్యామానమ్రా స్తబకయతు మే కాంక్షితతరుం**
**దృశామైశానీనాం సుకృతఫలపాణ్డిత్యగరిమా॥ 44**

**ప్రతిపదార్థము :-**

స్మితరుచిషు = చిఱునవ్వు కాంతులయందు;
సుధాడిండీరశ్రీః = అమృతపు నుఱుగు కాంతిగల;
తుండీరవిషయమ్ = తుండీర మండలమును;
పరిష్కుర్వాణా = అలంకరించుచున్నదై;
పరిహసితనీలోత్పలరుచిః = వెక్కిరింపబడిన నల్ల కలువల కాంతిగల;
స్తనాభ్యామ్ = స్తనములతో;
ఆనమ్రా = కొంచెమువంగిన;
ఐశానీనామ్ = శివునికి సంబంధించిన;
దృశామ్ = చూపులయొక్క;
సుకృతఫలపాండిత్యగరిమా = పుణ్యఫలమైన పాండిత్యగరిమ గల;
అసౌ = ఈమె (అమ్మవారు);
మే = నాయొక్క;
కాంక్షితతరుమ్ = కోర్కె యను వృక్షమును;
స్తబకయతు = పూగుత్తులు కల దానినిగా చేయుగాక!

**తాత్పర్యము:-**

అమ్మవారి చిఱునవ్వు అమృతపు నుఱుగుకాంతివంటికాంతి గలిగి యున్నది. ఆమె మేను నల్లకలువలకాంతివంటి కాంతిని కలిగి యున్నది. ఆమె తుండీరమండలము నలంకరించుచున్నది. స్తనముల బరువుతో కొంచెము వంగియున్నది. శివుని కన్నుల సుకృతఫలమైన పాండిత్యగరిమమో యన్నట్లున్న అమ్మవారు నా కోర్కె అను వృక్షమును పూగుత్తులు కలదానినిగా చేయుగాక!

**వివరణము :-**

**స్మితరుచిషు సుధాడిండీరశ్రీః** అను విశేషణముచే అమ్మవారి చిఱునవ్వు అమృతపు నుఱుగువలె నున్నది. ఇది ఉపమాలంకారమును ధ్వనింపజేయుచున్నది. పరిహసితనీలోత్పలరుచిః అను సమాసమున అమ్మవారి కాంతి నల్లకలువల కాంతిని మించినది. ఇందు ప్రతీపాలంకారమున్నది. అమ్మవారు తుండీరమండలము నలంకరించుచున్నదనుటచే తుండీర మండలమున కలంకారమై యున్నదను రూపకాలంకారము వ్యంగ్యమగుచున్నది. స్తనాభ్యా మానమ్రా స్తబకయతు అను పదములచే అమ్మవారను తీవకు స్తనములు పూగుత్తులను రూపకాలంకారము స్ఫురించును. మూకమహాకవి తన కోర్కె అను వృక్షమును పూగుత్తులుగల దానినిగా చేయుగాక అను **మే కాంక్షితతరుం స్తబకయతు** పదములోని వాచ్యార్థమువలన అమ్మవారు కల్పలత అను రూపము వ్యంగ్యమగుచున్నది. **కాంక్షితతరుమ్** అను సమాసమునకు కోరబడిన వృక్షమును అనగా ఏకామ్రేశ్వరుని స్తబకయతు పూగుత్తులుగల వానినిగా అనగా పులకాంకితు నొనరించుగాక అనియు, దానివలన జీవులు మోక్షమాకందఫలాస్వాదము చేయగలరు అనియు వ్యంగ్యమగుచున్నది. నాల్గవపాదమున శివుని నేత్రముల పుణ్యఫలపాండిత్యగరిమ అమ్మవారని రూపింపబడుటచే రూపకాలంకార మేర్పడియున్నది. పాండిత్యము సుకృతఫలము అను అర్థాంతరము వ్యంగ్యమగు చున్నది. ప్రథమపాదమునందలి డిండీర తుండీర శబ్దములలో వృత్త్యనుప్రాసాలంకారమున్నది. రెండవపాదమున పకార వర్ణమైత్రి ప్రాసయతి యున్నవి. మూడవ పాదమున స్తవర్ణమైత్రి యున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు తుండీరవిషయము నలంకరించినదిగా చెప్పబడినది. ఈ శ్లోకమున తుండీరవిషయమునందలి కాంచీనగరలీలల పరిచయము కలదిగా చెప్పబడుచున్నది.

శ్లో॥ కృపాధారాద్రోణీ కృపణధిషణానాం ప్రణమతాం
నిహన్త్రీ సన్తాపం నిగమముకుటోత్తంసకలికా।
పరా కాఞ్చీలీలాపరిచయవతీ పర్వతసుతా
గిరాం నీవీ దేవీ గిరిశపరతన్త్రా విజయతే॥ **45**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కృపాధారాద్రోణీ | = కృపాధార కాధారము; |
| ప్రణమతామ్ | = నమస్కరించుచున్న; |
| కృపణధిషణానామ్ | = అల్పబుద్ధిగలవారియొక్క; |
| సంతాపమ్ | = దుఃఖమును; |
| నిహన్త్రీ | = నశింపజేయు; |
| నిగమముకుటోత్తంసకలికా | = వేదకిరీటముల కలంకారపు మొగ్గయైన; |
| కాంచీలీలాపరిచయవతీ | = కాంచీనగరలీలల పరిచయముగల; |
| పర్వతసుతా | = గిరిసుతయైన; |
| గిరామ్ | = వాక్కులయొక్క; |
| నీవీ | = ముడియైన; |
| గిరిశపరతంత్రా | = శివుని యిల్లాలైన; |
| పరా | = పరయైన; |
| దేవీ | = దేవత; |
| విజయతే | = సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది. |

**తాత్పర్యము:-**

కృపాధారకు ఆధారము. అల్పబుద్ధిగల నమస్కరించువారి దుఃఖమును దూరమొనర్చు, వేదాంతముల కలంకారమైన కాంచీ లీలల పరిచయముగల, వాక్కుల మూటయైన హిమగిరి సుతయు, శివుని యిల్లాలును నైన పరదేవత సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**వివరణము :-**

ద్రోణమను పేరుగల మేఘ మొకటి పంచాగములలో ప్రస్తావింపబడును. అది వర్షమును గురిపించును. అమ్మవారు కృపాధారను వర్షించు ద్రోణమేఘ స్వరూపిణి. ద్రోణి యనగా నీరు నింపుకొను కాగు లేక గంగాళము. అమ్మవారు కృపాజలధారను నింపుకొన్న ద్రోణి. వాతావరణశాస్త్రజ్ఞులు ఆకాశమున ద్రోణి యేర్పడిన దందురు. ఇక వర్షములు కురియును అనుట కది సూచనము. కృపకు ఆధారమైన ద్రోణి అని కాని, కృపాధారకు ద్రోణి అని కాని, కృపాధారద్రోణీ అను సమాసమునకు విగ్రహము చెప్పవచ్చును. అమ్మవారు కృపను వర్షించు నననది ఆ సమాసమువలన తెలియబడు అంశము. కృపణ శబ్దము దీన వాచకము. లోభులు తమ ధనమును తామనుభవింపక ఇతరులకు ఈయక ధనమునకు కాపలాగా జీవించెదరు. కృపణధిషణానామ్ అను సమాసమున ధిషణకు కృపణ శబ్దము విశేషణముగా నున్నది. గుడ్డి, కుంటి మొదలగు అంగవైకల్యము కలవారి యెడ అనుకమ్పు చూపించుట సజ్జన లక్షణము. అట్టివారు

అనుకంపనీయులు. ఇచట అనుకంపని యర్థమున వికలార్థమున కృపణ శబ్దము ప్రయోగింపబడినది. బుద్ధి నవరసవిషయములచే కలుషిత మొనర్చుకొని దుఃఖపడుచునే యుందురు. అట్టివారు అమ్మవారికి నమస్కరించి తమ దుఃఖమును దూరమొనర్చుకొనవలెను. అట్లు నమస్కరించిన వారి దుఃఖము నమ్మవారు దూర మొనర్చును. ఇతరుల యందు జాలి నొందుట అను అర్థమున భగవద్గీతలో కార్పణ్య శబ్దము ప్రయోగింపబడినది. కృపాచితులు కానివారి యెడ కృపను జూపుట దోషము. అది కార్పణ్య దోషము అని అర్జునుని స్వభావ మా కార్పణ్య దోషముచే నుపహతమైనదని అచట చెప్పబడినది. **కార్పణ్య శబ్దము కృపణ శబ్ద నిష్పన్నము.** ధనలుబ్ధులై కృపోచితులు కాని దుష్టబంధువులందు కృపను జూపు బుద్ధి గలవారు కృపణధిషణులు. వారి సాంసారికదుఃఖమును దూరము చేయున దమ్మవారే. కృపణులకు ధర్మసమ్మోహము కలుగును. దానిచే వారధర్మ మాచరించెదరు. దాని వలన దుఃఖము నొందెదరు. అట్టివారు నమస్కరించినపుడు వారి దుఃఖమును దూరము చేయున దమ్మవారు. సంసారుల పట్ల జాలి చూపు బుద్ధి గల వీతరాగులు కూడ కృపణధిషణులు. వారు ప్రారబ్ధము వలన కలిగిన దుఃఖము ననుభవించుచు ఇతర సంసారవ్యామోహుల దుఃఖమును దూర మొనర్చుచుందురు. తమ దుఃఖమును పట్టించుకొనక ఇతరుల దుఃఖమును దూరముచేయు వారిని సాంసారికులు కృపణధిషణులు అందురు. అట్టివారు నమస్కరింపగా వారి దుఃఖమును దూరము చేయునదమ్మవారు. స్వదుఃఖమును దూరమొనర్చుమని కోరుకున్నను పరదుఃఖ దుఃఖిత యను కృపగల ఆ వీతరాగుల కృపణధిషణుల నమస్కారము లందుకొని వారి దుఃఖమును అమ్మవారు దూరమొనర్చును. వీతరాగులై ఉపనిషదర్థానుసంధాన మొనర్చు వారి కమ్మవారి తత్త్వమవగతమగును. కావున అమ్మవారు నిగమముకుటోత్తంసకలికా యని చెప్పబడినది. నిగమనామకకాంతులు తమ కిరీటములలో అలంకారముగా ధరించు మొగ్గ అమ్మవారు. పర్వతసుతయైనను ఆమె అనాగరిక కాదు. కాంచీ నగరలీలల పరిచయ మామెకున్నది. కాంచీనగరమున పంచదశీ (పదేనేండ్లకన్య), షోడశీ(పదారేండ్ల కన్య) రూపమున క్రీడించుచు అట్టి వయసుకల వారితో నాడుకొనుచు తన లీలను వారికి, వారి లీలను తాను ఆకళించుకొని ఆమె కాంచీలీలాపరిచయవతి యైనది. శాక్తేయసాధకులట్టి స్త్రీల నమ్మవారిగానే భావించెదరు. అస్తు. పర్వతసుతకు కాంచీనగరలీలాపరిచయము కలిగియుండుట విరోధము. అది వ్యక్తమగుటచే ఈ విశేషణములలో విరోధాభాసాలంకార మున్నది. అమ్మవారికి **గిరామ్ నీవీ** అనగా మాటల ముడి (మూటకు ముడి యనియు వ్యవహారమున్నది). పోకముడి (కోకముడి) గ్రంథి విశేషణమును బోధించి నీవీ శబ్ద మిచట సాధారణమైన ముడి అని అర్థమున అనగా సామాన్యార్థమున ప్రయోగింపబడినది. గిరిశుడనగా వాక్కునందు శయనించు లేదా కొండ(కైలాసము) యందు శయనించు శివుడు. గిరి అనగా పార్వతీ స్వరూపమని, అర్ధస్వరూపుడు శివుడని చెప్పు పురాణశ్లోకమును రఘువంశ ప్రథమశ్లోక వ్యాఖ్యానమున

మల్లినాథుడుదహరించినాడు. అట్టి గిరిశునకు గీః స్వరూపిణి అనగా వాక్స్వరూపిణి అమ్మవారు పరతంత్ర అనిగాని లేక **గిరిశ పరతంత్రా** అను సమాసమునకు రెండు విధములుగా అర్థము చెప్పవచ్చును. శ్రీశంకరులు శివభక్తులలో ఒకరు శేషభూతులైనప్పుడు మరొకరు శేషిభూతులగుదురని శేషశేషి సంబంధ ముభయ సాధారణమని చెప్పినారు. వాక్కు అర్థ పరము. అనగా వాక్కే శేషము. అర్థమే శేషి. అర్థము కొఱకే వాక్కు అని యః పరః స శబ్దార్థః అను శాస్త్రవాక్యము చెప్పుచున్నది. దీనిని బట్టి వాక్స్వరూపిణి అమ్మవారే శివునకు పరతంత్ర యని చెప్పినది. కాని వేద శబ్దముల నుండి జగత్తు నిర్మింపబడినదను మరొక శాస్త్రవాక్యము వాక్కునకు శేషిత్వము, అర్థమునకు శేషత్వము చెప్పినది. కావున శివశక్తుల ఈ శేషశేషి భావ సంబంధ ముభయసాధారణము. బాహ్యముగా భార్య భర్తకు శేషము. అంతరంగికముగా భార్యకు భర్త శేషుడనుట లోకసిద్ధము. దీని ననుసరించి **గిరిశపరతంత్రా** శబ్దమునకు రెండు విధములుగా అర్థము చెప్పుట సమంజసము. గిరిశునకు పరతంత్ర అను విగ్రహము చేసి **తత్పురుషసమాసముగా**, గిరిశుడు పరతంత్రుడుగా గలది అను విగ్రహముచేసి **బహువ్రీహిసమాసము**గా రెండు విధములైన అర్థముల నీ సమాసము చెప్పును. ప్రథమపాదమున కృవర్ణమైత్రి ఉన్నది. ద్వితీయపాదమున నివర్ణమైత్రి ఉన్నది. తృతీయపాదమున పకార వర్ణమైత్రి రేఫ ప్రాస యతి ఉన్నవి. నాల్గవపాదమున గికార వర్ణమైత్రి రేఫ ప్రాస యతియు నున్నవి. నీవీ దేవీ అను అనుప్రాసము కూద ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు మాటల ముడిగా వర్ణింపబడినది. ఈ శ్లోకమున వాగ్విశేషమైన కవితా సంపదకు మూలమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కవిత్వశ్రీకన్దస్సుకృతపరిపాటీ హిమగిరే-**
**ర్విధాత్రీ విశ్వేషాం విషమశరవీరధ్వజపటీ।**
**సఖీ కమ్పానద్యాః పదహసితపాథోజయుగలీ**
**పురాణీ పాయాన్నః పురమథనసామ్రాజ్యపదవీ॥ 46**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కవితశ్రీకన్దః | = కవితా సంపదకు మూలము; |
| హిమగిరేః | = హిమగిరియొక్క; |
| సుకృతపరిపాటీ | = పుణ్యపద్ధతి; |
| విశ్వేషామ్ | = విశ్వేషములయొక్క ; |
| విధాత్రీ | = నిర్మాత్రి; |
| విషమశరవీరధ్వజపటీ | = మన్మథుడను వీరుని పతాక; |

| | | |
|---|---|---|
| కమ్పానద్యాః | = | కమ్పానదియొక్క; |
| సఖీ | = | స్నేహితురాలు; |
| పదహసితపాథోజయుగలీ | = | పాదములచే పరిహసింపబడిన కమలముల జంటగల; |
| పురాణీ | = | పురాతనయైన; |
| పురమథనసామ్రాజ్యపదవీ | = | శివుని సామ్రాజ్య పదవియైన అమ్మవారు; |
| నః | = | మనలను; |
| పాయాత్ | = | కాపాడుగాక. |

**తాత్పర్యము:-**

కవితాసంపదకు మూలకన్దము హిమగిరి పుణ్యపద్ధతి, లోకముల సృష్టించునది, మన్మథవీరుని పతాక, కమ్పానదికి సఖి, పాదములచే అపహసింపబడిన కమలముల జంటగల పురాతనయైన శివుని సామ్రాజ్య పదవియునైన అమ్మవారు మనలను కాపాడుగాక.

**వివరణము :-**

అమ్మవారు కవితా శ్రీ యను లత బయలుదేరు గడ్డ. హిమగిరియొక్క పుణ్యపద్ధతిగా రూపింపబడుటచే ప్రథమపాదమున రెండు రూపకాలంకారము లేర్పడియున్నవి. విశ్వముల విధాత్రి అనగా బ్రహ్మస్వరూపిణి. విషమశరుడనగా మన్మథుడు. ఆతడు వీరుడు. వీరులు తమ విజయచిహ్నముగా ధ్వజపతాకలను ధరించెదరు. అమ్మవారా మన్మథుని ధ్వజము నందలి పతాకగా రూపింపబడుటచే రూపకాలంకారమేర్పడియున్నది. కమ్పానదికి సఖి అమ్మవారు. సఖి మరొక సఖి వెంట పోవుచుండును. చరించు వాని వెంట చరించు వాని ననుచరుడని యన్నట్లే కమ్పననుసరించు అమ్మవారు అనుకమ్ప యగును. అనుకమ్ప అమ్మవారు అనగా అమ్మవారే దయ. ఈ యర్థమునీ కమ్పానద్యాః సఖీ అను పదములు వ్యంజించుచున్నవి. పదహసిత పాథోజ యుగలీ అను సమాసమున పదములచేత కమలముల నపహరించునది అను అర్థము నిచ్చుటచే ప్రతీపాలంకార మున్నది. బ్రహ్మేంద్రాదులు సత్యలోకస్వర్లోకాదుల కధిపతులు. అనగా రాజులు. అట్టి రాజులకు కూడ రాజై సర్వలోకాధిపతియగు శివుడు సమ్రాట్టు. ఆయన సామ్రాజ్యము సర్వలోకాధిపత్యము. అట్టి సామ్రాజ్య మామె వలననే శివునకు కలిగినది. అందుచే అమ్మవారు పురమథనసామ్రాజ్యపదవి యని చెప్పబడినది. పురా అపి నవమ్ అను వ్యుత్పత్తిగల పురాణి అను శబ్దము పాతలలో మిక్కిలి పాతది, క్రొత్తవానిలో మిక్కిలి క్రొత్తది-అను అర్థము నిచ్చుటచే ఆమె నిత్య అని చెప్పినట్లైనది. నిత్య అనగా పుట్టుక చావులు లేనిది. పాతవానికిని క్రొత్తవానికిని పుట్టుక చావులుండును. అమ్మవారికవి లేవు

గావున నిత్య. రెండవ పాదమున వి వర్ణమైత్రి యున్నది. నాల్గవ పాదము పు వర్ణమైత్రిని రేఫ ప్రాసయతిని కలిగియున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి పాదములు కమలముల పరిహసించునని చెప్పబడినది. ఈ శ్లోకమున అవి దేవతాకిరీటములచే స్పృశింపబడుచున్నవని చెప్పబడుచున్నది.

**శ్లో॥ దరిద్రాణా మధ్యే దరదళితతాపిఞ్ఛసుషమా**
**స్తనాభోగక్లాన్తాస్తరుణహరిణాఙ్కాఙ్కితకచాః।**
**హరాధీనా నానావిబుధముకుటీచుమ్బితపదాః**
**కదా కమ్పాతీరే కథయ విహరామో గిరిసుతే!॥ 47**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| గిరిసుతే | = ఓ పార్వతీ! |
| మధ్యే | = నడుమున; |
| దరిద్రాణాః | = పేదవారమై; |
| దరదళితతాపింఛసుషమాః | = కొంచెము వికసించిన తమాల పుష్పముల కాంతి గలవారమై; |
| స్తనాభోగక్లాంతాః | = స్తనముల విస్తృతిచేత అలసినవారమై; |
| తరుణహరిణాంకాంకితకచాః | = బాలచంద్రునిచే చిహ్నితములైన వెంద్రుకలు గలవారమై; |
| హరాధీనాః | = శివుని స్వాధీనులమై; |
| నానావిబుధముకుటీచుమ్బితపదాః | = అనేక దేవతాకిరీటములచే స్పృశింపబడు పాదములు గలవారమై; |
| కమ్పాతీరే | = కమ్పానదీతీరమున; |
| కదా | = ఎప్పుడు; |
| విహరామః | = విహరింతుమో; |
| కథయ | = తెలపవా |

**తాత్పర్యము:-**

సన్నని నడుము దాల్చిన వారమై, స్తనముల బరువుతో అలసిన వారమై, కొంచెము వికసించిన తమాలపుష్పముల కాంతిగలవారమై, బాలచంద్రుని కేశపాశముల దాల్చిన వారమై, హరాధీనులమై, అనేక దేవతా కిరీటములచే మ్రొక్కబడిన పాదములు గలవారమై కమ్పానదీ తీరమున నెప్పుడు విహరించెదమో చెప్పుమమ్మా! పార్వతీ!

**వివరణము :-**

**మధ్యే దరిద్రాణాః** అను పదము లమ్మవారి నడుము సన్ననిదని సంబోధించును. రెండవ విశేషణ మమ్మవారి దేహకాంతి నైల్యమును బోధించును. మూడవ విశేషణము సర్వజగజ్జీవులకు పాలిచ్చు స్తనముల బరువును బోధించును. నాల్గవవిశేషణ మమ్మవారి చంద్రావతంసత్వమును బోధించును. **హరాధీనాః** అను సమాసము తత్పురుషమైనపుడు అమ్మవారు శివున కధీనయని, బహుప్రీహియైనపుడు శివుడే అమ్మవారి కధీనుడని అర్థము నిచ్చును. ఈ అర్థములచే పార్వతీపరమేశ్వరుల ఉభయసాధారణశేషశేషిసంబంధము వ్యంగ్యమగును. ఆఱవ విశేషణము దేవతలచే నమస్కరించబడు అమ్మవారి సర్వదేవతాతిశయవైభవమును బోధించును. ఈ శ్లోకమున అమ్మవారి సారూప్య వాంఛ చెప్పబడినది. నాల్గవపాదమున ఆ వాంఛ ఎప్పుడు తీరునో అను చింత వ్యంగ్యమగును. మొదటి పాదమున **ద** వర్ణమైత్రి రేఫ ప్రాస యతియు, ద్వితీయ పాదమున **స్త** వర్ణమైత్రి యున్నవి. నాల్గవ పాదమున క కార వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు గిరిసుతే అని సంబోధింపబడినది. ఈ శ్లోకమున గిరాం దేవి, ప్రజ్ఞా జనని, కామాక్షి అని సంబోధింపబడుచున్నది.

**శ్లో॥ వరీవర్తు స్థేమా త్వయి మమ గిరాం దేవి మనసో**
**నరీనర్తు ప్రౌఢా వదనకమలే వాక్యలహరీ।**
**చరీచర్తు ప్రజ్ఞాజనని! జడిమా నః పరజనే**
**సరీసర్తు స్వైరం జనని! మయి కామాక్షి! కరుణా॥ 48**

**ప్రతిపదార్థము :-**

గిరామ్ = వాక్కులయొక్క;
దేవి = ఓ దేవీ!
త్వయి = నీయందు;
మమ = నాయొక్క;
మనసః = మనస్సుయొక్క;
స్థేమా = స్థిరత్వము;
వరీవర్తు = వర్తించుగాక;
వదనకమలే = ముఖకమలమున;
ప్రౌఢా = ప్రౌఢమైన;
వాక్యలహరీ = వాక్ప్రవాహము;
నరీనర్తు = నటించుగాక;
ప్రజ్ఞాజనని! = ప్రజ్ఞకు తల్లియైనదానా;

| | |
|---|---|
| నః | = మాయొక్క; |
| పరజనే | = శత్రువునందు; |
| జడిమా | = జాడ్యము; |
| చరీచర్తు | = చరించుగాక; |
| జనని | = తల్లీ!; |
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ; |
| మయి | = నాయందు; |
| స్వైరమ్ | = స్వేచ్ఛగా; |
| కరుణా | = దయ; |
| సరీసర్తు | = ప్రసరించుగాక. |

**తాత్పర్యము:-**

వాగ్దేవియైన అమ్మవారియందు నా మనస్సు వర్తించుగాక. నా ముఖమున వాక్ప్రవాహము నటించుగాక. నా శత్రువున జాడ్యము చరించుగాక. నా యందు అమ్మవారి కరుణ ప్రసరించుగాక.

**వివరణము :-**

వాక్కులదేవియందు చంచలమైన నా మనస్సు స్థిరముగా వర్తించుగాక అను కోరిక అమనస్కతసిద్ధివాంఛయే. మనస్సు అమ్మవారియందు స్థిరముగా ఎక్కువ సేపున్నచో తిరిగి దానికి చలనము కలుగుట అసంభము. అట్లు చలించక యుండినచో ఆ మనస్సు అమనస్సే యగును. వదనకమలమున ప్రౌఢ వాక్ప్రవాహము నటించుగాక అను కోరిక పాండిత్యవాక్చాతుర్యవాంఛయే. శత్రువున జాడ్యము చరించుగాక అను కోరిక శత్రువునకు వాక్స్తంభము కలుగవలెనను వాంఛయే. పై కోరికలన్నింటి సిద్ధింపజేయు అమ్మవారి కరుణ నా యందు ప్రసరించుగాక అను కోరిక సిద్ధిలోనే అంతర్భవించును. అమ్మవారి కరుణ లేనిదే కోర్కెయు సిద్ధించదు గదా. ఆమె కరుణ ప్రసరించిననే ఈ శ్లోకమున చెప్పబడిన లేదా చెప్పబడని కోరికలన్నియు తీరును లేదా కోర్కెయే నశించును. చదువు వారికి ఇహపరవాంఛలుండును. కావున అవి తీరుటనే కవి వాంఛించుచుండును. ఆ తలంపుగాక కవి కేవాంఛయు లేకపోవచ్చును. నాలుగు పాదములలో ద్వితీయ చతుర్థాక్షర ప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున అందమైన కన్నులు గలది కామాక్షి శబ్దముతో అమ్మవారు సంబోధింపబడినది. ఈ శ్లోకమున ఆ కన్నుల అందమును సూచించు భ్రమర కాంతి శిక్షణ గురువైన కటాక్ష వ్యాక్షేప మున్నట్లు చెప్పబడుచున్నది.

శ్లో॥ క్షణాత్తే కామాక్షి! భ్రమరసుషమాశిక్షణగురుః
కటాక్షవ్యాక్షేపో మమ భవతు మోక్షాయ విపదామ్।
నరీనర్తు స్వైరం వచనలహరీ నిర్జరపురీ-
సరిద్వీచీనీచీకరణపటురాస్యే మమ సదా॥ 49

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| భ్రమరసుషమాశిక్షణగురుః | = | తుమ్మెదలకాంతికి శిక్షణమునిచ్చు గురువైన |
| కటాక్షవ్యాక్షేపః | = | కడగంటి చూపుల కదలిక; |
| క్షణాత్ | = | క్షణకాలములో; |
| మమ | = | నాయొక్క; |
| విపదామ్ | = | ఆపదలయొక్క; |
| మోక్షాయ | = | మోక్షము కొఱకు; |
| భవతు | = | అగుగాక; |
| నిర్జరపురీసరిద్వీచీనీచీకరణపటుః | = | అమరపురీ గంగా ప్రవాహమును చిన్న బుచ్చగల; |
| తే | = | నీయొక్క; |
| వచనలహరీ | = | వాక్ప్రవాహము; |
| సదా | = | ఎల్లప్పుడు; |
| మమ | = | నాయొక్క; |
| ఆస్యే | = | ముఖము నందు; |
| స్వైరమ్ | = | స్వేచ్ఛగా; |
| నరీనర్తు | = | నర్తించుగాక. |

**తాత్పర్యము:-**

అమ్మవారి తుమ్మెదల కాంతి శిక్షణగురువైన క్రీగంటివిలాసము క్షణకాలములో నా ఆపదలను పోగొట్టుగాక. అమరావతీనగరము ముందు ప్రవహించు ఆకాశగంగా తరంగవేగమును చిన్నబుచ్చు వాక్ప్రవాహము నా ముఖమున ఎల్లప్పుడు నర్తించుగాక.

**వివరణము :-**

**మోక్షాయ** అను పదమునకు విడిపించుటకొఱకు అని అర్థము. విడిపించుట అనునది బంధమునకు సంబంధించిన క్రియ కావున విపత్తులు బంధనములు అని చెప్పినట్లైనది. కటాక్షవ్యాక్షేపమునందు భ్రమరసుషమా శిక్షణ గురుత్వము చెప్పబడుటచే భ్రమరములకు శిష్యత్వము, భ్రమరకాంతియొక్క అల్పత్వము తెలియబడుటచే

ప్రతీపాలంకారస్ఫూర్తి కలుగును. ఆకాశగంగా ప్రవాహమును మించు వాగ్వైఖరి కలుగు గాక అను వాంఛ తాను గొప్ప వక్త కావలెనను వాంఛయే. పరితల కట్టి వాంఛ యీడేరుగాక అనియే కవి యుద్దేశము. నాల్గవపాదమున వర్ణమైత్రి ఉన్నది. వీచీ నీచీ అను పదములలో వృత్త్యను ప్రాసాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున తనకు వాక్ప్రవాహము కావలెనను కోరిక ప్రకటించ బడినది. ఈ శ్లోకమున ఆ వాక్ప్రవాహముగల బుధుల లోకము చేరు కోరిక చెప్పబడుచున్నది.

**శ్లో॥ పురస్తాన్మే భూయః ప్రశమనపరః స్తాన్మమ రుజాం**
**ప్రచారస్తే కమ్పాతటవిహృతిసమ్పాదిని! దృశోః।**
**ఇమాం యాచ్ఞామూరీకురు సపది దూరీకురు తమః-**
**పరీపాకమ్మత్కం సపది బుధలోకం చ నయ మామ్॥ 50**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కమ్పాతటవిహృతిసంపాదిని | = | కమ్పానదీతీరవిహారమును కలిగించుదానా! |
| మాతః | = | అమ్మా; |
| మమ | = | నాయొక్క; |
| రుజామ్ | = | జబ్బులయొక్క; |
| ప్రశమనపరః | = | తొలగించుట యందాసక్తిగల; |
| తే | = | నీయొక్క; |
| దృశోః | = | చూపులయొక్క; |
| ప్రచారః | = | ప్రచారము; |
| మే | = | నాయొక్క; |
| పురస్తాత్ | = | ఎదుట; |
| భూయః | = | మరల మరల ; |
| స్తాత్ | = | కలుగుగాక; |
| సపది | = | వెంటనే; |
| ఇమామ్ | = | ఈ; |
| యాచ్ఞామ్ | = | కోరికను; |
| ఊరీకురు | = | అంగీకరించుము; |
| మత్కమ్ | = | నాకు సంబంధించిన; |
| తమఃపరీపాకమ్ | = | అజ్ఞానాంధకారతీవ్రతను; |
| దూరీకురు | = | దూరమొనర్చుము; |

సపది = వెంటనే;
మామ్ = నన్ను;
బుధలోకమ్ = దేవలోకమును గూర్చి;
నయ = తీసికొని పొమ్ము.

**తాత్పర్యము:-**

కమ్పానదీతీరమున విహరించు నో తల్లీ! రోగబాధాశామకమైన నీ దృక్ప్రసారము నా ఎదుట మరల మరల కలుగుగాక. నాయీ కోరికను అంగీకరించి వెంటనే నా తమోగుణతీవ్రతను దూరమొనర్చుము. నన్ను సుమనోలోకమున జేర్పుము.

**వివరణము :-**

పురస్తాత్, పరః స్తాత్ అను పదములు ప్రథమపాదమున యమకాను ప్రాసముల కూర్చుచున్నవి. రెండవ పాదమున కమ్పా, సమ్పాదిని అను పదముల జంట, మూడవ పాదమున ఊరీకురు, దూరీకురు అను పదముల జంట, నాల్గవ పాదమున పాకం లోకం అను పదముల జంట అనుప్రాసమును కూర్చుచున్నవి. ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షప్రసారము తన యెదుట జరుగవలెనను కాంక్ష శీఘ్రముగా అమ్మవారిచే నంగీకరింపబడవలెనని, తనకు జ్ఞాతలకు కలుగు లోకము కలుగవలెనని కవిచే కోరబడినది. బుధలోకము అనగా దేవలోకమని మరియొక అర్థము. దేవలోకమున కేగిన వారికి మరల పునరావృత్తి పుణ్యక్షయానంతరము కలుగును. కావున జ్ఞానియైన మూకమహాకవి స్వర్గమును కోరియుండలేదేమో! బుధలోకమనగా విద్వల్లోకము. జ్ఞాని లోకము. జ్ఞానులకు బ్రహ్మాది లోకములకు పోవుట ఉండదు. **అత్ర బ్రహ్మ సమశ్నుతే** (6.14) అను శ్రుతి ననుసరించి వారికి కైవల్యమే కలుగును. కైవల్యమునకు ఉపనిషత్తులలో ఆత్మలోకము అను పర్యాయము కానవచ్చును. అది జ్ఞానికి లభించునది కావున బుధశబ్దము జ్ఞానినికూడ బోధించును. కావున బుధలోకశబ్ద మీ శ్లోకమున కైవల్యమునే బోధించి యుండవచ్చును. లేక **విద్యయా దేవలోకః** (బృ.5.16) అను శ్రుతి ననుసరించి విద్య యనబడు ఉపాసన మొనర్చిన మహాకవికి దేవలోకము, అమ్మవారి లోకము, సాలోక్యముక్తి అని చెప్పబడిన లోకము కవిచే కోరబడి యుండవచ్చును. సపది అనుటచే కవి ఈ మర్త్య లోకమున అజ్ఞాన బంధమును ఏ కొంత కాలమైనను సహింపలేకపోవుచున్నట్లు వ్యంజించును.



**అవ॥:-** పై శ్లోకమున కవిచే పరదేవతాలోకము ప్రార్థింపబడినది. ఈ శ్లోకమున దేవతానదీ ప్రవాహసదృశమైన వాగ్ధాటి భక్తులకు కలుగునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఉదఞ్చన్తీ కాఞ్చీనగరనిలయే! త్వత్కరుణయా**
**సమృద్ధా వాగ్ధాటీ పరిహసితమాధ్వీ కవయతామ్।**

ఉపాదత్తే మారప్రతిభటజటాజూటముకుటీ -
కుటీరోల్లాసిన్యాః శతమఖతటిన్యా జయపటీమ్॥ 51

ప్రతిపదార్థము :-

| | |
|---|---|
| కాంచీనగరనిలయే | = కాంచీనగరమున వసించుదానా! |
| త్వత్కరుణయా | = నీ దయచే; |
| ఉదంచంతీ | = పైకి వచ్చుచున్న; |
| పరిహసితమాధ్వీ | = తేనెను పరిహసించిన; |
| సమృద్ధా | = సమ్పన్నమైన; |
| కవయతామ్ | = కవులయొక్క; |
| వాగ్ధాటీ | = వాగ్ధాటి; |
| మారప్రతిభటజటాజూటముకుటీ కుటీరోల్లాసిన్యాః | = శివుని కపర్దకిరీటమను పొదలో ప్రకాశించు; |
| శతమఖతటిన్యాః | = ఆకాశగంగయొక్క; |
| జయపటీమ్ | = జయ పతాకమును; |
| ఉపాదత్తే | = స్వీకరించుచున్నది. |

**తాత్పర్యము:-**

కాంచీనగర నివాసినియైన అమ్మవారి కరుణచే పైకుబికి వచ్చు కవుల తేనెను మించి తీయనైన వాగ్ధాటి శివుని జడల పొదలలో నుండి పైకి వచ్చు నాకాశగంగయొక్క జయపతాకను లాగికొనుచున్నది.

**వివరణము :-**

శివుని జటాజూటము కపర్దమనబడును. ఆ జటాజూటమే ఒక పొద. దానిలో ప్రకాశించు ఆకాశగంగ వేగమునకు ప్రసిద్ధమైనది. అమ్మవారి కరుణ కల్గినచో కవులంతకు మించిన వేగముకల తీయనైన కవితను చెప్పగలరనుటచే గంగాజయపతాక నా వాగ్ధాటి స్వీకరించునని చెప్పబడినది. జయపతాకను స్వీకరించుట అనగా దానిని లాగికొనుటయే. ఓడినవారు కూడ పూర్వ మెవ్వరినో గెలిచి జయపతాకను సంపాదించి యుండవచ్చును. అట్టి జయపతాక గంగానది కడ నుండగా అమ్మవారి అనుగ్రహమును పొందిన కవుల వాగ్ధాటి దానిని లాగికొన్నదని ఉపమానమైన గంగను తిరస్కరించుట చెప్పబడినందున ఇందు ప్రతీపాలంకారమున్నది. ఉద్ధంచంతీ, కాంచీ అనూ పదముల జంటలో, మారప్రతిభటజటాజూటముకుటీకుటీరోల్లాసిన్యాః అను సమాసమున, తటిన్యా జయపటీమ్ అను పదములలో వృత్త్యనుప్రాసాలంకారములున్నవి.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కరుణచే గంగా సదృశ వాగ్ధాటి కలుగునని చెప్పబడినది. ఈ శ్లోకమున అది విద్యాశ్రీసమతాకీర్త్యాదుల నొసగునని చెప్పబడుచున్నది.

శ్లో॥ శ్రియం విద్యాం దద్యాజ్జనని! నమతాం కీర్తిమమితాం
సుపుత్రాన్ ప్రాదత్తే తవ ఝటితి కామాక్షి! కరుణా।
త్రిలోక్యామాధిక్యం త్రిపురపరిపన్థిప్రణయిని!
ప్రణామస్త్వత్పాదే శమితదురితే! కిం న కురుతే॥ 52

ప్రతిపదార్థము :-

| | |
|---|---|
| శమితదురితే | = పాపమును శమింపజేసినదానా! |
| జనని | = ఓ తల్లీ! |
| త్రిపురపరిపన్థిప్రణయిని | = శివుని ప్రియురాలవైన; |
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ; |
| తవ | = నీయొక్క |
| కరుణా | = దయ; |
| ఝటితి | = శీఘ్రముగా; |
| నమతామ్ | = నమస్కరించువారికి; |
| శ్రియమ్ | = సమ్పదను; |
| విద్యామ్ | = విద్యను; |
| దద్యాత్ | = ఇచ్చును; |
| అమితామ్ | = మితిలేని; |
| కీర్తిమ్ | = కీర్తిని; |
| సుపుత్రాన్ | = మంచి కుమారులను; |
| త్రిలోక్యామ్ | = మూడు లోకములందు; |
| ఆధిక్యమ్ | = ఆధిక్యమును; |
| ప్రాదత్తే | = ఇచ్చుచున్నది; |
| త్వత్పాదే | = నీ పాదమున; |
| ప్రణామః | = నమస్కారము; |
| కిమ్ న కురుతే | = ఏమి చేయదు? |

**తాత్పర్యము:-**

అమ్మవారి కరుణ, సంపదను, విద్యను, అమితమైన కీర్తిని, సుపుత్రులను, త్రైలోకాధిక్యమును ఇచ్చును. అమ్మవారి పాదమున ప్రణామము ఏమి చేయదు?

**వివరణము :-**

సంపత్తి, విద్య, మంచి కొడుకు, అనునవి సాధారణ సంసారులందఱు కోరుకొను

కోర్కెలు. ఇవి బ్రతికి యున్నప్పుడు లభించినచో వారు సంతోషించెదరు. కావున ఇవి ఐహిక లౌకిక ఫలములు. కీర్తి బ్రతికి యున్నప్పుడు సుఖము నిచ్చును. ఇది కూడ ఐహికఫలమే. **అమిత** అని చెప్పబడుటచే చచ్చిన తరువాత కూడ చాల కాలముండు కీర్తి ఇహలౌకికమేయైనను బ్రతికియున్నప్పుడు దాని ప్రయోజన మనుభవింపబడదు. అయినను ఇహలోకమున కీర్తి ఎంతకాలముండునో అంతకాలము ఆ కీర్తి కలవారు స్వర్గమున నుండు నను స్మృతి వచనముచే అమిత కీర్తి పారలౌకికమని కూడ చెప్పవచ్చును. త్రైలోకాధిక్యము అను ఫలము ప్రధానముగ పారలౌకికమే. బ్రతికి యున్నప్పుడు దానిని సాధించుట దుష్కరము. ఇట్టి ఫలము లన్నింటిని ప్రసాదించు అమ్మవారి నమస్కారము పైన చెప్పబడని ఫలముల కూడ ప్రసాదించునని నాల్గవపాదము తెలుపుచున్నది. **విద్యామ్, దద్యాత్, నమతామ్ అమితామ్, త్రిలోక్యామ్ ఆధిక్యమ్, శమితదురితే** కిం న **కురుతే** అను జంటలలో వృత్త్యనుప్రాసమున్నది. మూడవపాదమున వర్ణమైత్రి త్రికారరూపమున నున్నది. అందలి సంబోధమున ప కార రేఫా వృత్తి, రూపానుప్రాసము కూడ నున్నది. శమితదురితే అను విశేషణము పాదమునకు కూడ అన్వయించి పాదమే పాపముల తొలగింపజేయునని చెప్పవచ్చును.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కరుణ సంపత్త్యాదుల నొసగుటచే అది నమస్కరించువారి పాలిట భాగ్యము అని సూచింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారు హిమవంతునకు భాగ్యమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ మనస్స్తమ్భం స్తమ్భం గమయదుపకమ్పం ప్రణమతాం**
**సదాలోకం నీలం చికురజితరోలమ్బనికరమ్।**
**గిరాం దూరం స్మేరం ధృతశశికిశోరం పశుపతే-**
**ర్దృశాం భోగ్యం యోగ్యం తుహినగిరిభాగ్యం విజయతే॥ 53**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| ఉపకమ్పమ్ | = కమ్పానదీ సమీపమున; |
| ప్రణమతామ్ | = నమస్కరించువారియొక్క; |
| మనఃస్తమ్భమ్ | = మనస్సుయొక్క జాడ్యమును; |
| స్తమ్భమ్ గమయత్ | = స్తమ్భిమ్పజేయు; |
| సదాలోకమ్ | = మంచి చూపులు గల; |
| నీలమ్ | = నీలమణియైన; |
| చికురజితరోలమ్బనికరమ్ | = కచములచే తుమ్మెదల జయించిన; |
| గిరామ్ | = వాక్కులకు; |

| | |
|---|---|
| దూరమ్ | = దూరముగనున్న; |
| స్మేరమ్ | = చిఱునవ్వుగల; |
| ధృతశశికిశోరమ్ | = బాలచంద్రుని ధరించిన; |
| పశుపతేః | = శివునియొక్క; |
| దృశామ్ | = చూపులకు; |
| యోగ్యమ్ | = తగిన; |
| భోగ్యమ్ | = అనుభవింపదగిన; |
| తుహినగిరిభాగ్యమ్ | = హిమవంతుని భాగ్యమైన అమ్మవారు; |
| విజయతే | = సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది. |

**తాత్పర్యము:-**

కమ్పానదీతీరమున నమస్కరించు వారి మనోజాడ్యమును తొలగించునట్టి, మంచి కన్నులు గలిగినట్టి నీలి రంగు గలట్టి, తుమ్మెదల జయించు కేశములు గలట్టి, వాక్కులకు దూరముగా నున్నట్టి, చిఱునవ్వు గలట్టి, చంద్రకల దాల్చినట్టి, శివుని కన్నుల యోగ్యభోగ్యమై హిమవంతుని భాగ్యమైన అమ్మవారు సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**వివరణము :-**

అమ్మవారిని అమ్మవారని చెప్పక భంగ్యంతరముగా తుహినగిరిభాగ్య మని చెప్పుటచే నీ శ్లోకమున పర్యాయోక్త్యలంకారమేర్పడియున్నది. మనఃస్తమ్భం స్తమ్భం గమయత్ అను విశేషణమున స్తమ్భ శబ్దము అర్థభేదమున ద్విరావృత్తమగుటచే యమక మను శబ్దాలంకారమేర్పడియున్నది. మొదటి స్తమ్భశబ్దమునకు జాడ్యమని యర్థము. రెండవ స్తమ్భ శబ్దమునకు పనిచేయని స్థితి అని అర్థము. జాడ్యము మనసున ప్రవేశించినచో అది చెడ్డను మంచినిగా, మంచిని చెడ్డనుగా దర్శించును. ఇట్లు దర్శించుటను మానిపించును. కావున మనః స్తమ్భమునకు స్తమ్భమును గలిగించున దమ్మవారని ప్రథమపాదములోని ప్రథమభాగము తెలుపును. అమ్మవారట్లు చేయుట కమ్పానదీతీరమునుండు నమస్కరించు వారి మనసుననే అని ప్రథమపాదమునందలి రెండవ భాగము తెలుపును. అమ్మవారు నీలిరంగు కలిగియున్నది. ఐనను ప్రకాశించుచున్నది. కావున ఆమె నీలమణి అని చెప్పదగినది. ఆ మణి వెలుగు వ్యాపించుటచేత లోకములు కూడ నీలముగా నొనర్చునను అర్థాంతరము గమయత్ అను పదముతో అన్వయించినప్పుడు ఏర్పడును. తుమ్మెదలు నల్లనివైనను అమ్మవారి కేశములంత నల్లనివి కావు. కావున అవి ఆ కేశములచేత ఓడింపబడినవి. అదిగాక అమ్మవారి కేశముల నునుపు ప్రకాశము తుమ్మెదలకు లేకుండుటచే అమ్మవారి కేశములతో ఓడిపోవలసియే వచ్చినది. ఇట్లు సమాన తిరస్కారము చెప్పబడినందున రెండవ పాదమున ప్రతీపాలంకారమేర్పడియున్నది. నీలమ్, రోలమ్, గిరామ్ దూరమ్, స్మేరమ్ ధృతశశికిశోరమ్

అను పదములలో వృత్త్యనుప్రాసమున్నది. అమ్మవారు వాక్కుల కందనంత దూరముగా వాచామగోచరమై యున్నదని మూడవ పాదారమ్భము తెలుపుచున్నది. ఆ పాదమున చివరి భాగమున శకారావృత్తిచే అనుప్రాస మేర్పడియున్నది. నాల్గవ పాదమున కూడ భోగ్యమ్ యోగ్యమ్ భాగ్యమ్ అను పదములలో ఆ అనుప్రాసమను శబ్దాలంకార మేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు **హిమగిరిభాగ్యము**గా చెప్పబడినది. ఈ శ్లోకమున **హిమగిరిపతాక**గా చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఘనశ్యామాన్కామాన్తకమహిషి! కామాక్షి! మధురా-**
**న్దృశామ్పాతానేతానమృతజలశీతాననుపమాన్।**
**భవోత్పాతే భీతే మయి వితర నాథే! దృఢభవ-**
**న్మనశ్శోకే మూకే హిమగిరిపతాకే! కరుణయా॥** **54**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| హిమగిరిపతాకే | = హిమవత్పర్వతపతాకవైన; |
| కామాంతకమహిషి | = శివుని పట్టపురాణివైన; |
| నాథే | = యజమానురాలవైన; |
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ! |
| మధురాన్ | = మధురములైన; |
| అమృతజలశీతాన్ | = అమృతజలములచే చల్లనైన; |
| అనుపమాన్ | = సాటిలేని; |
| ఘనశ్యామాన్ | = మేఘమువలె నల్లనైన; |
| ఏతాన్ | = ఈ ; |
| దృశామ్ | = దృష్టులయొక్క; |
| పాతాన్ | = పాతములను; |
| భవోత్పాతే | = సంసారోత్పాతమున; |
| భీతే | = భయపడిన; |
| దృఢభవన్మనఃశోకే | = దృఢమగుచున్న మనస్సునందలి శోకముగల; |
| మూకే | = మూగనైన; |
| మయి | = నాయందు; |
| కరుణయా | = దయతో; |
| వితర | = ప్రసాదింపుము. |

**తాత్పర్యము:-**

కామాంతకుడైన శివుని యిల్లాలివైన యజమానురాలవైన ఓ కామాక్షీ దేవీ! మేఘమువలె నల్లనైన, అమృతజలముతో చల్లనైన, మధురములైన సాటిలేని ఈ నీ దృష్టిపాతములను, భవోత్పాతమున భయపడియున్న దృఢమగుచున్న మనఃశోకముగల మూకుడనైన నా యందు ప్రసాదింపుము.

**వివరణము :-**

పతాకము ధరించి నాయకులు నడచెదరు. అట్టి వారందఱి దృష్టిలోపడి మన్ననకు పాత్రులగుదురు. అమ్మవారు పుట్టినప్పటినుండి ఆమెను చంకనెత్తుకున్న నాటినుండి హిమగిరి గిరిరాజైనాడు. **హిమగిరిపతాకే** అను సంబోధనముచే ఈ యంశము తెలియుచున్నది. శివుడు కాముని జంపి కామాంతకుడని లోకమున ప్రసిద్ధుడైనాడు. కాని కాముడు ఇంకను అమ్మవారి కన్నులలో బ్రతికియే యున్నాడని లోకమునకు తెలియదు. శివుడు కూడ కాముడు తననొసటి మంటలో కాలిబూడిద యగుట చూచి తాను కాముని చంపినాననియే అనుకొన్నాడు. అమ్మవారిచే వాడు బ్రతికింపబడి ఆమె కన్నులలోనే దాగి యున్నాడని ఆ కన్నుల ద్వారమున ఎప్పుడు తన యెదలోనే దూరి యున్నాడని ఆమె కన్నుల అందమునకు దాసుడై ఆమెను చేపట్టవలసిన పరిస్థితి ఏర్పడినప్పుడుగాని శివునకు కూడ తెలియలేదనుట అతిశయోక్తి కాదేమో! ఈ అర్థమంతయు **కామాంతకమహిషి, కామాక్షి** అను సంబోధములు వరుసగా నుండుట వలన వ్యంగ్యమైనది. అమ్మవారి దృక్పాతములు ఘనశ్యామములని విశేషించుటతో లుప్తోపమాలంకారమే యున్నది. **అనుపమాన్** అనుటలో అనన్వయాలంకారవ్యక్తి యున్నది. **మధురాన్** అను విశేషణముచే అమ్మవారి దృక్పాతము లమృతజలమువలె చల్లనైనవే కాక వానివలె తీయనైనవి కూడ అని. అమృతజలము ఘనీభవించియుండును. భక్తుల కష్టములను చూచి కరగి అప్పుడప్పుడామె కన్నులు చెమ్మగిల్లుట జరుగును. ఆ కన్నులలో అమృతము, శీతము, మరియు మధురమునై భక్తుల భవతాపమును చల్లార్చుటయే గాక వారి హృదయములలో సౌఖ్యమాధుర్యమును నింపును. మూకమహాకవి మహోత్పాతభీతుడై ఉన్నాడు. అతని మనసున శోకము గడ్డకట్టుకొని, గట్టిపడి యున్నది. అది హృదయశల్యమువలె బాధించుచున్నది. దాని నోర్వజాలని మూకమహాకవి అమ్మవారి ఆ దృక్కులను యెదలో నిపతింపజేయ వేడుకొనుచున్నాడు. ఇది యీ శ్లోకమున వ్యంగ్యమగు వస్తువు. అది వేడుకొనుటయే కాని వానియందు తనకు గల స్వత్వము (హక్కు) అని ఆతడు చెప్పుకొనుట లేదు, అయినను కరుణతో ప్రసాదింపు మనియే వేడుకొనుచున్నాడు అనునది కరుణా శబ్ద వ్యంగ్యార్థము. **ఘనశ్యామాన్ కామాంతక మహిషి, కామాక్షి** అను శబ్దములలో ప్రథమపాదమున, **పాతాన్ ఏతాన్ శీతాన్** అను శబ్దములలో ద్వితీయపాదమున, **భవోత్పాతే, భీతే** అను శబ్దములలో మూడవ పాదమున, **శోకే, మూకే, పతాకే** అను శబ్దములలో

నాల్గవపాదమున, మొత్తము శ్లోకమున తకార మకారా వృత్తిచేతను వృత్త్యనుప్రాస శబ్దాలంకారము లేర్పడియున్నవి.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు కామాంతకుని మహిషియని చెప్పబడినది. ఈ శ్లోకమున అట్టిదగుటచే త్రిలోకములకు తల్లియునైనదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ నతానామ్మన్దానాం భవనిగళబన్ధాకులధియాం**
**సదాన్ధ్యం రున్ధానామభిలషితసన్తానలతికామ్।**
**చరన్తీం కమ్పాయాస్తటభువి సవిత్రీం త్రిజగతాం**
**స్మరామస్తాం నిత్యం స్మరమథనజీవాతుకలికామ్॥ 55**

**ప్రతిపదార్థము :-**

మందానామ్ = మన్దులైన;
భవనిగళబన్ధాకులధియామ్ = సంసారపు సంకెలల బన్ధముతో వ్యాకులత చెందిన బుద్ధిగల;
నతానామ్ = నమస్కరించినవారియొక్క;
అన్ధ్యమ్ = చీకటిని;
సదా = ఎల్లప్పుడు;
రున్ధానామ్ = అడ్డగించుచున్న;
అభిలషితసన్తానలతికామ్ = కోరినవారికి సన్తానలతికయైన;
కమ్పాయాః = కమ్పానదియొక్క;
తటభువి = తీరప్రాన్తభూమియందు;
చరన్తీమ్ = తిరుగుచున్న;
త్రిజగతామ్ = మూదులోకములకు;
సవిత్రీమ్ = తల్లియైన;
స్మరమథనజీవాతుకలికామ్ = శివుని జీవనౌషధపు మొగ్గయైన;
తామ్ = ఆమెను(అమ్మవారిని);
నిత్యమ్ = ఎల్లప్పుడు;
స్మరామః = స్మరించెదము.

**తాత్పర్యము:-**

సంసారపు సంకెలలో కట్టబడుటచేత, వ్యాకులత చెందిన బుద్ధి మందగించిన వారు నమస్కరింపగా వారి అజ్ఞానమను చీకటిని అణచివేయునట్టి, ముల్లోకముల తల్లియైన, శివుని జీవనౌషధిమొగ్గయైన, కోరినవారి కోరికల దీర్చు నందనవనమందలి సన్తానలతికయైన, కమ్పానదీతీరభూములలో విహరించునట్టి ఆ అమ్మవారిని స్మరించెదము.

**వివరణము :-**

స్వేచ్ఛననుభవించు వారి బుద్ధిలో చురుకుదనము పెఱుగుట, బంధములకు చిక్కి విడిపించుకొనుటకు యత్నించియు విఫలత చెందిన వారి బుద్ధిలో మాన్ద్యము పెఱుగుట లోకమున మనము చూచెదము. పుట్టి పుట్టకమునుపే సంసారపు సంకెలలకు చిక్కిన వారికి దానినుండి బయటపడవలెనను ఆలోచనయే ఉండదు. ఒకవేళ బద్ధులమై యున్నామని యెఱిగి ఏవో తోచిన ఉపాయములను బుద్ధితో ఆలోచించి ఉపాయము ఫలింపక నైరాశ్యము పెఱిగి ఇక బుద్ధి అట్టి ఆలోచన చేయుటలో ప్రవర్తించక యుండుట వలన మాన్ద్యము పెఱుగును. అటువంటి సంసారశృంఖలాబద్ధులు మందులునైన వారు అదృష్టయోగమున అమ్మవారికి నమస్కరించుట తటస్థించెనేని వారు నివసించు తమోమయ సంసారకారాగారమున అన్ధ్యము అనగా తమస్సు అమ్మవారి అనుగ్రహమున తగ్గిపోవును. ఇది మొదటి విశేషణమున తెలియబడు అర్థము. కాండము పెద్దదిగానున్న ఉద్భిజ్జములు వృక్షములు ప్రసిద్ధములు. అవి కోరిన వారి కోర్కెలన్నిటిని (మోక్షము తప్ప) తీర్చగలవు. వానిలో సంతానవృక్షమొకటి. దాని కాండము సన్నదిగా నున్నందున ఆమె సన్తానలతిక. అమ్మవారు కోరిన వారి కోర్కెలన్నిటిని (మోక్షమును కూడ) ఇచ్చునదనుటచే **సన్తానలతిక** అనబడును. దేవతావనమైన నందనమునందలి సన్తానలతిక మోక్షము నీయజాలక పోయినను అమ్మవారు అను సన్తానలతిక మాత్రము మోక్షమును కూడ ఇచ్చును అని రెండవ విశేషణమున వ్యంగ్యమగుటచే దాని యందు వ్యతిరేకాలంకారధ్వని ఉన్నది. వాచ్యముగా రూపకాలంకారమున్నది. మూడవ విశేషణము అమ్మవారి కమ్పాతీర భూవిహారమును, నాల్గవ విశేషణము త్రిజగతామ్ సవిత్రీమ్ అనునది అమ్మవారి సర్వజగన్మాతృతను తెలుపుచున్నవి. **సవిత్రీమ్, త్రిజగతామ్** అను పదముల జంటలో ముక్తాక్షరగ్రస్తత ఉన్నది. దీనిని అలంకారముగా అలంకారికులు పేర్కొనకున్నను అనుప్రాసమున్నదని చెప్పుటలో భేదింపరు. నాల్గవపాదమున స్మవర్ణమైత్రి రప్రాసయతి యున్నవి. లలితాసహస్రనామ స్తోత్రమున అమ్మవారు హరనేత్రాగ్నియని పేర్కొనబడగా నీ శ్లోకమున స్మరమథనుడైన ఆ హరుని జీవనౌషధియైన యొక తీగ పూచిన కలిక(మొగ్గ)గా చివరి విశేషణముగా చెప్పబడినది. ఓషధుల మొక్కల బెరడు, పూవు, కాయ మొదలగున వన్నియు మందులలో నుపయోగింపబడుట ప్రసిద్ధము. **నతానామ్, మందానామ్, రున్ధానామ్, సన్తాన** అను పదములలో పదాన్తానుప్రాసమున్నది. ఈ శ్లోకమున సన్తాన లతికగా లతికావయవమైన కలికగా అమ్మవారు రూపింపబడుటచే రూపకాలంకారము లేర్పడి యుండుటచే ఆమెకు అవయవావయవిభాగము లేదనియు వ్యంగ్యార్థ మేర్పడి యున్నది. మూడవ పాదమున దాక్షిణాత్యమైన చస వర్ణమైత్రి కూర్చబడినది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు శివుని జీవనౌషధి కలికగా చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె శివుని మనస్సును పరవశమొనర్చినట్లు చెప్పబడుచున్నది.

శ్లో॥ పరా విద్యా హృద్యా శ్రితమదనవిద్యా మరకత-
ప్రభానీలా లీలాపరవశితశూలాయుధమనాః।
తమఃపూరం దూరం చరణనతపౌరన్దరపురీ-
మృగాక్షీ కామాక్షీ కమలతరలాక్షీ నయతు మే॥ 56

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| పరా | = | ఉత్కృష్టమైన; |
| విద్యా | = | విద్యయైన; |
| హృద్యా | = | మనోహారిణియైన; |
| శ్రితమదనవిద్యా | = | ఆశ్రయించిన కాదివిద్యగల; |
| మరకతప్రభానీలా | = | మరకతమణికాంతివలె నల్లనైన; |
| లీలాపరవశితశూలాయుధమనాః | = | విలాసముచే పరవశింపజేయబడిన శివుని మనస్సుగల; |
| చరణనతపౌరందరపురీమృగాక్షీ | = | పాదములయందు నమస్కరించిన అమరావతీ స్త్రీలుగల; |
| కమలతరలాక్షీ | = | కమలములవంటి చంచలములైన కన్నులు గల; |
| కామాక్షీ | = | కామాక్షీదేవి; |
| మే | = | నాయొక్క; |
| తమఃపూరమ్ | = | చీకటి ప్రవాహమును; |
| దూరమ్ | = | దూరము; |
| నయతు | = | కొనిపోవుగాక. |

**తాత్పర్యము:-**

అమ్మవారు అందరిని మోహింపజేయు అందము గలది కావున హృద్య. ఆమె పరవిద్యారూపిణి. కాదివిద్య నాశ్రయించి యుండునది. మరకతమణివలె నీలవర్ణము గలది. తన విలాసములతో శివుని మనసును పరవశింపజేయునట్టిది. దేవతాస్త్రీ లామె చరణములపై వ్రాలి యుందురు. మరకతమణివలె నీలవర్ణము గలది. తన విలాసములతో శివుని మనసును పరవశింపజేయునట్టిది. కమలములవలె చంచలములైన నేత్రములు గలది. అట్టి అమ్మవారు నా హృదయములోని తమఃప్రవాహమును దూరమొనర్చుగాక.

**వివరణము :-**

అమ్మవారు పరాశక్తి స్వరూపిణి కావున పర యనబడును. పరావిద్యాస్వరూపిణి కావున పరా విద్య అనబడును. అపరవిద్య యనగా ఋగ్వేద యజుర్వేద సామవేదాథర్వ వేదములు, పురాణములు మొదలగు వాఙ్మయము. వీని అధ్యయన ప్రవచనములవలన

పరోక్షబ్రహ్మజ్ఞానమే కలుగును. అపరోక్షమైన అక్షరబ్రహ్మయొక్క అధిగమనమును అనగా సాక్షాత్కారమును కలిగించు విద్య **పరావిద్య** యనబడును. శివుని కనబడనీయని **అవిద్య** కూడ ఆమెయే. కావున ఆమె (పర-అవిద్య) పరావిద్య అని చెప్పబడును. పరయైన విద్య అను అర్థమున కర్మధారయ సమాసమేర్పడినప్పుడు పరా చ సా విద్యా పరవిద్యా అని కావలసియుండగా **అన్యేభ్యోపి దృశ్యతే** (సి.కౌ. 3422)+ (పా3.3.130) పాఅను వ్యాకరణసూత్రముచే పరశబ్దమునకు దీర్ఘమురాగా పరావిద్యా అని యేర్పడును. కావున పరవిద్యా, పరావిద్యా అను రెండు రూపములును సాధువులే అని గమనింపవలెను.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు హరిణముల కన్నులవంటి కన్నులు గలదని చెప్పబడినది. ఈ శ్లోకమున హరిణియొక్క ఉచ్చాటనము కోరబడుచున్నది.

**శ్లో॥ అహన్తాఖ్యా మత్కం కబలయతి యా హన్త హరిణీ**
**హఠాత్సంవిద్రూపం హరమహిషి! సస్యాఙ్కురమసౌ।**
**కటాక్షవ్యాక్షేపప్రకటహరిపాషాణపటలై-**
**రిమాముచ్చైరుచ్చాటయ ఝటితి కామాక్షి! కృపయా॥ 57**

**ప్రతిపదార్థము :-**

హరమహిషి = శివుని పట్టపురాణివైన;
కామాక్షి = ఓ కామాక్షీదేవీ!;
యా = ఏది;
అహన్తాఖ్యా = అహంకారనామము కలదో;
(సా-అ) అసౌ = ఈ;
హరిణీ = లేడి;
హఠాత్ = బలాత్కారముగా;
మత్కమ్ = నాకు సంబంధించిన;
సంవిద్రూపమ్ = జ్ఞానరూపమైన;
సస్యాంకురమ్ = పంటను;
హంత = అయ్యో;
కబలయతి = మ్రింగి వేయుచున్నది;
కటాక్షవ్యాక్షేపప్రకటహరిపాషాణ పటలైః = క్రీగంటి ప్రసారములనెడి ఇంద్రనీలమణి పాషాణసమూహములచేత;
ఇమామ్ = దీనిని;
కృపయా = దయతో;
ఉచ్చై = బిగ్గఱగా;

ఝటితి = శీఘ్రముగా;
ఉచ్చాటయ = పాఱద్రోలుము.

**తాత్పర్యము:-**

శివుని పట్టపురాణీ! అహంకారమను పేరుగల లేడి నా జ్ఞానమను సస్యముయొక్క అంకురమును మ్రింగివేయుచున్నది. దీనిని నీ కటాక్ష ప్రసారములను ఇంద్రనీలమణి పాషాణ సమూహములతో శీఘ్రముగా దయతో పారద్రోలుము.

**వివరణము :-**

స్థూలదేహమునందు సూక్ష్మదేహమునకు చెందిన ప్రాణ, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, మనోబుద్ధులయందు నేను అను అభిమానము అహంకార మనబడును. వేదాంతమున అహంకారము అని పిలువబడిన ఆ నేను అను అభిమానము తంత్రములందు **అహన్త** అని పిలువబడును. ఆ అహన్త అహమర్థమైన ఆత్మజ్ఞానము అను పంటమొక్కను మ్రింగివేయు హరిణిగా రూపింపబడుటచే, ఆత్మజ్ఞానము సస్యాంకురముగా రూపింపబడుటచే మరియు అమ్మవారి కటాక్ష వ్యాక్షేపములు హరిమణిపాషాణములుగా రూపింపబడుటచే నీ శ్లోకమున రూపకాలంకారమేర్పడి యున్నది. నేను పొట్టివాడను, పొడుగువాడను ఇత్యాదులు స్థూలదేహము. నేను అను అభిమానమునకు సంబంధించినవి. కావున అవి అహంకార(అహన్త) రూపములు. పొట్టి పొడుగు అన్నవి స్థూలదేహధర్మములే కాని అహమర్థమైన ఆత్మయొక్క ధర్మములు కావు. అట్లే నేను చూచుచున్నాను. మాట్లాడుచున్నాను ఇత్యాదులు సూక్ష్మదేహము భాగములైన జ్ఞాన కర్మేంద్రియములందుగల నేను అను అభిమానమునకు చెందినవి. కావున అవియు అహంకార (అహన్త) రూపములే. నేను సందేహించుచున్నాను అనునది మనస్సునందు **నేను** అను అభిమానమునకు చెందిన అహంకార(అహన్త) రూపము. నేను నిశ్చయించుచున్నాను అనునది బుద్ధియందు నేను అను అభిమానమునకు చెందిన అహంకారరూపము. జ్ఞానేంద్రియకృత్యములైన దర్శనాదులు ఆత్మకృత్యములుగా, కర్మేంద్రియకృత్యములైన వచనాదులు ఆత్మ కృత్యములుగా, మనః కృత్యమైన సందేహము ఆత్మకృత్యముగా, బుద్ధికృత్యమైన నిశ్చయము ఆత్మకృత్యముగా అభిమానించుట సూక్ష్మదేహాభిమానము. అట్లే నాకేమి తెలియదు అనునది కారణదేహము (అజ్ఞానము) నకు చెందిన అహంకారము (అహన్త)యొక్క రూపము. ఆత్మ ఈ దేహత్రయమునకు అతీతమైనది. అది ఏ కృత్యములను చేయదు. పొట్టి, పొడుగు, నలుపు, తెలుపు మొదలగు ధర్మములేవియు ఆత్మకు లేవు. పొట్టి పొడుగు మొదలగునవి స్థూలదేహ ధర్మములు. వచనాదులు సూక్ష్మదేహభాగమైన ఇంద్రియకృత్యములు. ఆకలిదప్పులు సూక్ష్మదేహభాగమైన ప్రాణములయొక్క ధర్మములు. సంశయము సూక్ష్మదేహభాగమైన మనస్సుయొక్క ధర్మము. నిశ్చయము సూక్ష్మదేహభాగమైన బుద్ధి ధర్మము. తెలియకపోవుట అనునది కారణదేహమైన అజ్ఞానముయొక్క స్వరూపము. వీని ధర్మములే ఆత్మధర్మములని

భావించుట ఆత్మజ్ఞానహీనుల లక్షణము. ఆత్మజ్ఞానసస్యాంకురము నపహరించునది అహన్త యను హరిణియే. అమ్మవారి కటాక్షవ్యాక్షేపములు నీలములగుటచే నీలమణిపాషాణ పటలములుగా చెప్పబడినవి. వానితో అహన్తా హరిణ్యుద్ఘాటనము మూకకవిచే కోరబడుట ఈ శ్లోకములోని ప్రధాన వాచ్యార్థము. అమ్మవారు హరమహిషి, హరుడనగా హరించువాడు. ఆయన పట్టపురాణి యగుటచే అమ్మవారు కూడ హరించునట్టిది. కాని నేను హరించు దానను అని అహంతా రూప హరిణి జ్ఞానసస్యాంకుర హరణమునకు సిద్ధపడినది. అమ్మవారే యథార్థముగా హరించు ధర్మముకల హరిణి అని శ్రీసూక్తములోని **హిరణ్యవర్ణాం హరిణీమ్** అను మంత్రము చెప్పుచున్నది. కావుననే ఆ సత్యహరిణీ స్వరూపయైన అమ్మవారు మిథ్యాహరిణియైన అహన్తను, పాఱద్రోలుట అనగా హరించుటయే కవిచే కోరబడుచున్నది. అమ్మవారు సంవిత్స్వరూపిణి. దానిని హరించుటకు సిద్ధపడిన మిథ్యాహన్తయొక్క హరణము కవిచేత కోరబడుచున్నది. అహన్తఖ్యా యా హన్త అనుచోట హన్తశబ్దముయొక్క ద్విరుక్తిచే యమకాలంకారమేర్పడియున్నది. ఉచ్చైరుచ్చాటయ అనుచోట కూడ యమకాలంకారమే ఏర్పడియున్నది. కటాక్షవ్యాక్షేపప్రకట పటల ఉచ్చాటయ ఝుటితి అను శబ్దములలో **ట** కారాక్షరావృత్తిచే వృత్త్యనుప్రాసమేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున హరి శబ్దమున ఇంద్రుడు ప్రస్తావించబడినాడు. ఈ శ్లోకమున నముచిపరిపన్థి శబ్దమున ఆతడు ప్రస్తావింపబడుచున్నాడు.

**శ్లో॥ బుధే వా మూకే వా తవ పతతి యస్మిన్ క్షణమసౌ**
**కటాక్షః కామాక్షి! ప్రకటజడిమక్షోదపటిమా।**
**కథఙ్కారం నాస్మై కరముకులచూడాలముకుటా**
**నమోవాకమ్ బ్రూయుర్నముచిపరిపన్థిప్రభృతయః॥ 58**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ!; |
| బుధే వా | = పండితుడైనను; |
| మూకే వా | = మూగయైనను; |
| యస్మిన్ | = ఎవని యందు; |
| క్షణమ్ | = క్షణకాలము; |
| ప్రకటజడిమక్షోదపటిమా | = స్పష్టమైన జాడ్యమును నశింపజేయుట యందు సామర్థ్యముగల; |
| తవ | = నీయొక్క; |
| కటాక్షః | = క్రీగంటిచూపు; |

పతతి = పడునో;
అస్మై = వీని కొఱకు;
కరముకులచూడాలముకుటా = దోసిళ్ళు కిరీటములలోగల;
నముచిపరిపన్థిప్రభృతయః = ఇంద్రాదులు;
కథంకారమ్ = ఎట్లు;
నమోవాకమ్ = నమోవచనమును;
న బ్రూయుః = చెప్పకుందురు?

**తాత్పర్యము:-**

జాడ్యమును నశింపజేయుగల నీ కటాక్షమును పండితు నందైనను, మూగయందైనను ఒక్క క్షణకాలము పడెనేని వాని కింద్రాదులు సైతము దోసిలొగ్గి నమస్కారము నెట్లు పలుకకుందురు?

**వివరణము :-**

అమ్మవారి కటాక్షము జ్ఞాన (చిత్) స్వరూపము. కావుననే అది జాడ్యమును అనగా అజ్ఞానమును నశింపజేయగలిగినట్టిది. ప్రకటజడిమక్షోద పటిమా అను విశేషణముయొక్క బలమువలన అమ్మవారి కటాక్షము చిత్స్వరూపమని స్పష్టమగుచున్నది. అదిగాక అమ్మవారి శరీరము చిద్ఘనము కావున దాని యందలి కటాక్షము చిత్తనుటలో సంశయమక్కఱలేదు. బుధుడనగా పండితుడు, జ్ఞాని, సాక్షరుడు, వాఙ్మివేత్త. అత్యల్ప వ్యుత్పత్త్యాది భేదము ననుసరించి కించిదర్థభేదము కలవైనను ఇవి పర్యాయపదములే అని చెప్పదగినవి. మూక శబ్దము వాగ్వ్యాపారరహితుని బోధించును. బొత్తిగా మాట్లాడలేని వాడైనను, బాగుగా మాట్లాడగలిగిన వాడైనను అమ్మవారి కటాక్షపాతమునకు పాత్రమైనచో వాని కింద్రాదులు నమస్సులు పలుకుచుందురు. అమ్మవారి దయకు పాత్రుడు కావలెననిన వాడు స్తుతించిన వాడే కానక్కఱ లేదు. అట్లు వాక్కుతో స్తుతింపకపోయినను మూగయొక్క హృదయములోని భాషాభావములను అమ్మవారు గ్రహించి వానిలోని జ్ఞానమునకు వినయమునకు ప్రేమమునకు పరవశులై వానిని తనంత వాని నొనర్చును. అప్పుడు అమ్మవారికి నమస్కరించినట్లే ఇంద్రాదులు ఆమె కృపకు పాత్రుడైన అనగా కటాక్షము సోకిన వానికి నమస్సులను బలుకుచుందురు. నమస్సులను పలుకుట యనగా అష్టాంగములలో నొకటైన వాక్కుచే చేయబడు నమస్కారము. ముకుట మనగా కిరీటము. దాని చూడ దానిపై చివరిభాగము. దానిపై దేవతల దోసిళ్ళున్నవి. కరముకులములు అనగా దోసిళ్ళు. వానిని తమ కిరీటములపై పెట్టుకొని దేవత లమ్మవారి కృపకు పాత్రులైన వారికి నమస్కారము చెప్పుదురు. కరముకులముల కిరీటములపై పెట్టుకొని అష్టాంగాన్యతమములైన తల మరియు హస్తములతో చేయబడు నమస్కారము. తలను నేలపై మోపి నమస్కరించుట ఆ అష్టాంగములలోని తలతో చేయబడు నమస్కారము.

తలపై పెట్టుకొని చేసిన ఈ శ్లోకములోని దేవతల నమస్కారములో తల చేతులు వాక్కు అను మూడింటికి భాగము కలిగింపబడినది. తల చేతులు స్థూల దేహావయవములు. కావున దానిని కాయమను నొక కరణముగా లెక్కించి వాక్కును మరొక కరణముగా లెక్కించి అన్ని కర్మలు మనఃపూర్వకములే కావున మనస్సును కూడ మరొక కరణముగా లెక్కించిన ఈ శ్లోకములోని నమస్కారమునకు కూడ త్రికరణకృతత లభించును. నముచి యను నొక రాక్షసుని సంహరించి ఇంద్రుడు **నముచిపరిపన్థి** యైనాడు. కావున నముచి పరిపన్థి శబ్ద మింద్రుని బోధించును. ఎట్లు నమస్కారము చెప్పకుందురు? అను ఆక్షేపము వలన తప్పక నమస్కారము చెప్పెదరు అను అర్థము సిద్ధమగును. క్షణమ్ క్షోద అను శబ్దములలో పదాద్యనుప్రాస మున్నది. ముకుల ముకుట శబ్దములలో పదాది మధ్యానుప్రాస మున్నది. రెండవపాదమున కటాక్షః ప్రకట అను పదములలో యమకాలంకారమున్నది. మూడవపాదమున **క** వర్ణమైత్రి, నాల్గవ పాదమున **న** వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమును అమ్మవారి కటాక్షము సోకిన వారు ఇంద్రాదిదేవతా వంద్యులగుదురని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ కటాక్షపాత్రులైన మూకాదులకు అమ్మవారి కుండలినీ రూపమున కలిగిన దర్శనము (మూకమహాకవి స్వానుభూతి) చెప్పబడుచున్నది.

**శ్లో॥ ప్రతీచీం పశ్యామః ప్రకటరుచినీవారకణికా-**
**ప్రభాసధ్రీచీనామ్ ప్రదళితషడాధారకమలామ్।**
**చరన్తీం సౌషుమ్నే పథి పరపదేన్దుప్రవిగల-**
**త్సుధార్ద్రాం కామాక్షీం పరిణతపరంజ్యోతిరుదయామ్॥ 59**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| ప్రతీచీమ్ | = అత్యన్తము ఆంతరయైన; |
| ప్రకటరుచినీవారకణికా ప్రభాసధ్రీచీనామ్ | = స్పష్టమైన కాంతిగల నివ్వరిగింజకాంతితో సమానమైన; |
| ప్రదళితషడాధారకమలామ్ | = వికసింపజేయబడిన ఆఱు ఆధారకమలములుగల; |
| సౌషుమ్నే | = సుషుమ్నా నాడికి చెందిన; |
| పథి | = మార్గమున; |
| చరన్తీమ్ | = విహరించుచున్న; |
| పరపదేన్దుప్రవిగలత్సుధార్ద్రామ్ | = పరమపద చంద్రుని నుండి స్రవించు అమృతముచే తడిసిన; |
| పరిణతపరంజ్యోతిరుదయామ్ | = పరిణమించిన పరంజ్యోతియొక్క ఉదయము గల; |

కామాక్షీమ్ = కామాక్షీదేవిని;
పశ్యామః = దర్శించుచున్నాము.

**తాత్పర్యము:-**

సర్వాంతరయైన, నీవారబీజమువంటి తనుత్వకాంతులు గల, మూలాధారాది షట్కమలములు ఆధారములుగాగల, సుషుమ్నా మార్గమున విహరించు, సహస్రారచంద్రుని నుండి స్రవించు అమృతధారచే ఆర్ద్రయైన పరంజ్యోతియొక్క ఉదయముగా పరిణమించు కామాక్షీదేవిని చూచుచున్నాము.

**వివరణము :-**

ఆత్మ సర్వాంతరమని ఉపనిషత్తు చెప్పుచున్నది. అంతరములైన వానికన్నింటికి అంతరముగా నున్నది ప్రతీచి అని చెప్పబడును. ఈ బ్రహ్మాండములో నున్నది మన దేహము. దానిలోనివి ఇంద్రియములు. వానికిని లోననున్నది అంతఃకరణము. దానికిని లోననున్నది ప్రత్యగాత్మ లేక జీవాత్మ. **పరాంచిఖాని** అని కఠోపనిషత్తు ఇంద్రియములు పరాక్కులని చెప్పుచున్నది. పరాక్కులనగా బయట వస్తువులను పొందునవి. కావున ఇంద్రియములు వానిలోని ప్రత్యగాత్మను దర్శింపలేవు అని ఆ ఉపనిషత్తు తెలుపును. ఆ ఇంద్రియముల సాయముతో జీవాత్మ సమస్తవిషయములకు భోక్తగా నున్నది. స్వస్వరూపముగా నున్న తనలోని శుద్ధాత్మను మాత్రము దర్శింపలేకున్నది. మూకమహాకవి యిచ్చట సర్వాంతరము తనలోపలి వానినన్నింటికి లోననున్న ప్రత్యగాత్మను కామాక్షి అను నామాంతరముగల దానిని చూచుచున్నానని చెప్పుచున్నాడు. **ప్రత్యక్** శబ్దముయొక్క స్త్రీలింగరూపము **ప్రతీచీ** శబ్దము. ఆత్మ సర్వవ్యాపకమైన అన్నింటికి లోననున్న సూక్ష్మమైన బుద్ధి ఉపాధిగా గలిగి దానిలోనను ఉండుటచే అది అణువున కన్న అణువైనది. ఆత్మను గూర్చి **అణోరణీయాన్** (క.2-20) అని ఉపనిషత్తు చెప్పుట ఈ దృష్టితో సమంజసమే. లేనిచో మహత్తు కన్న మహత్తైనది. అణువుకన్న అణువగుట యెట్లుపపన్నమగును? మరొక వచనము **వాలాగ్రశతభాగస్స శతధా కల్పితస్య చ జీవో భాగస్స విజ్ఞేయః** (కేశముయొక్క చివరిభాగముయొక్క నూఱవ వంతులోని నూఱవవంతు పరిమాణముగల వాడు జీవుడని తెలియవలెను) అని చెప్పుటయు ఈ దృష్టితోడనే. తేలినదేమనగా కామాక్షీ దేవి ప్రతీచి అనగా ప్రత్యగాత్మ స్వరూపిణి. తదితర బుద్ధ్యాదులన్నియు పరాక్కులు. ఈమె ఒక్కరే ప్రతీచి. బ్రహ్మాండమున పిండాండము అంతరము. దానికన్న ఇంద్రియములు అంతరములు. వానికన్న బుద్ధి అంతరము. దానికన్న అమ్మవారు అంతర. దానికన్న అంతర మరియొకటి లేదు. కావున ఆమె సర్వాంతర. ఆమె దృష్టితో మిగిలినవన్ని బాహ్యములు, పరాక్కులు. వీనిలో బుద్ధియొక్కటే శమదమాది సంస్కృతమైన ప్రతీచియైన కామాక్షిని దర్శింపగలదు. మూకమహాకవి అట్టి తన బుద్ధితో ఆమెను దర్శించుచున్నాడని చెప్పుట ఆయన స్వానుభూతి ప్రకటనము. ఆ కామాక్షి మూకమహాకవి కెట్లు కనబడినది?

నివ్వరిగింజ ముల్లువలె. **నీవారశూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా** (మహానారా. 11.12) (నివ్వరిగింజ ముల్లువలె సన్ననైనది, అణువుతో తులతూగునది, పచ్చని కాంతి గలది) అని ఉపనిషత్తు చెప్పినది. ఆ యర్థమే **ప్రకటరుచినీవారకణికాప్రభాసధ్రీచీనామ్** అను విశేషణముచే చెప్పబడినది. ఇందులోని ప్రభ ఉపనిషత్వాక్యములోని పీతాభయే. ఇప్పటికి కుండలినియైన కామాక్షియొక్క రెండు లక్షణములు చెప్పబడినవి. ఒకటి ఆమె ప్రత్యగాత్మ, రెండు ఆమె సూక్ష్మకాంతి. మూడవ విశేషణము ప్రదళిత షడాధార కమలామ్ అనునది. ఆమెకు మూలాధారము. స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞా అను ఆఱు కమలములు ఆధారములుగా నున్నవని చెప్పి, ఆ కమలములను భేదించినది అని చెప్పుచున్నది. ఈ కమలము లెచ్చట ఉన్నవి? సుషుమ్నానాడిలో ఉన్నవి. ఆ సుషుమ్నానాడి మూలమున **మూలాధారకమల** మున్నది. దానిలో గుదమునకు కించిదూర్ధ్వభాగమున నది ఉన్నది. దానిపైన ఉపస్థేంద్రియముయొక్క కించిదూర్ధ్వభాగమున స్వాధిష్ఠాన కమల మున్నది. దానిపైన నాభికి కించిదూర్ధ్వభాగమున **మణిపూరకమల** మున్నది. దానికి బొమ్మయొక్క కించిదూర్ధ్వభాగమున **అనాహతకమల** మున్నది. దీనికి హృదయకమలము, సంవిత్కమలము అను నామాంతరములున్నవి. దానికి పైన కంఠదేశమున **విశుద్ధకమల** మున్నది. దానికిపైన భ్రూమధ్యమున **ఆజ్ఞాకమల** మున్నది. దానికి పైన **సహస్రారకమలము** మూర్ధమున ఉన్నది. అది ఏడవ కమలము.

కుండలిని ప్రయాణము మూలాధారకమలభేదనముతో ఆరంభమై సహస్రారములోని బిందుస్థానమైన చంద్రమండలమును వేధించుట (బలముగా తాకుట, అందలి అమృతమును తేనెటీగవలె తాగుట దాని అమృతము) తో ముగియును. ఈ తడియుట ఈ శ్లోకమున **పరపదేన్దుప్రవిగలత్సుధార్ద్రామ్** అను విశేషణము చెప్పుచున్నది. **సాధకుడు తన కుడికాలి మడమ బుడిపెను గుదము క్రిందనుంచి అందలి గాలినిపైకి త్రోయుటతో నిద్రించిన కుండలినిలో చలనము కలుగును** అని కొందఱు చెప్పెదరు. మూలాధారకమలము కర్ణిక యందు కులకుండల మొకటి యున్నదని, దానిలో నాగమువంటి కుండలి(ని) తలపెట్టుకొని తలక్రిందుగా నిద్రించుచుండునని అది గురువు అనుగ్రహము కలిగిన వారియొక్క శక్తి తన యందు పడుట అనగా శక్తిపాతముతో సాధకుని ప్రయత్నమేమియు లేకయే కుండలిని మేల్కొనునని మఱికొందఱు చెప్పెదరు. రెండు పక్షములలోను గురుకృప అనివార్యమే. కుండలిని (కామాక్షి) చేయు ఈ షట్కమల భేదనము నీ విశేషణము చెప్పుచున్నది. దీనిచే కుండలిని యొకశక్తి అని, అది ఊర్ధ్వముగా పోవుచు షట్కమలభేదనము నొనరించి సహస్రారము చేరి మరల మూలాధారము చేరునని తెలియుచున్నది. ఇట్లు రాక పోక లొనరించుట కుండలిని కృత్యము. మూలాధారకుండము అగ్నికుండము. ఈ కుండలిని అగ్నిశక్తియే కాక వాయుశక్తియునని తెలియవలెను. ఇది ఆరంభమున జీవరూపిణియై సహస్రారము చేరిన పిదప శివరూపిణి యగును. తానట్లగుటకే మాటిమాటికి శివసంయోగమునో పక్షాంతరమున శివైక్యమునో పొంది ఆనందము




ననుభవించుటకే ఈ యాతాయతములు చేయును. దప్పిక ఎంత తీవ్రమయిన జలము కడకు అంత వేగముగ పోవు వ్యక్తివలె చిరకాల సుప్త భుజగియైన కుండలినికి మెలకువ కలిగినంతనే సహస్రారములోని అమృతము కడకు వేగముగా నేగి దాని నాస్వాదించి తృప్త యగుచుండును. ఆ తృప్తి కొఱకే ఈ యాతాయతముల నొనరించును.

సుషుమ్నానాడిలో నా యాఱు కమలములున్నవి. కావున ఆ నాడి కమలిని అని చెప్పెదరు. సుషుమ్న కూర్ధ్వభాగమున సహస్రారకమల మున్నది. అది ఈ ఆఱు కమలములలో చేరదు. ఈ ఆఱింటికి కులమార్గమని, ఆ సహస్రారము ఆకులము అని చెప్పబడును. ప్రతి జీవుని శరీరమున ఈ కుండలిని ఉండును. కాని అది నిద్రించియే ఉండును. దీనికి వ్యష్టి కుండలిని అని పేరు. సమష్టికుండలిని పాతాళాదిసత్య (బ్రహ్మ) లోకమువఱకు ఊర్ధ్వగతి కలిగి ఉండును అని కొందఱు చెప్పెదరు. మూలాధార స్వాధిష్ఠానములు అగ్ని మండలము. అచట అగ్ని కుండలమున్నది. వానికి పైన నున్న మణిపూరానాహతములు సూర్యమండలము. అచటది సూర్యకుండలము. వానిపైన విశుద్ధాజ్ఞాకమలములు చంద్రమండలము. కుండలినీయోగసాధకులు దానిని గమ్యముగా చేసికొని సాధనము నొనరించెదరు. కుండలిని నచటకు తీసికొని పోగలిగిన వారు కుండలినితో సహ శివస్వరూపులనియే చెప్పబడుదురు. మూడు కుండలములు (చుట్లు) మరియొక సగము చుట్ట మొత్తము మూడున్నర చుట్లు కలిగియున్నందున నిది కుండలి(ని) అని చెప్పబడును. పైన చెప్పిన అగ్ని మండలముపైన బ్రహ్మగ్రన్థి అనగా స్థూలశరీరాభిమానముండును. దానిని భేదించుటతో సాధకునకు స్థూల శరీరాభిమానము తొలగును. సూర్యమండలము పైన విష్ణుగ్రన్థి ఉండును. దానిని భేదించుటతో సాధకునకు సూక్ష్మశరీరాభిమానము తొలగును. చంద్రమండలము పైన రుద్రగ్రన్థి ఉండును. దానిని భేదించుటతో సాధకునకు కారణ శరీరాభిమానము తొలగును. సాధకునకు చిత్కలైక్యము మూడు మండలములు దాటిన పిదప కలుగును. కుండలినికి **చిత్కల** అనియు పేరు.

అగ్ని శక్తి, వాయు(ప్రాణ)శక్తి, చంద్రకల, జీవరూపిణి, చిచ్ఛక్తి, చిత్కల అని కుండలిని తంత్రములలో బహు విధముల పేర్కొనబడినది. ఇంకను ఆమె నాదరూపిణి అనియు చెప్పబడినది. అగ్నిమండలమున కుమారివలె, సూర్యమండలమున యోషిత్తువలె, చంద్రమండలమున పతివ్రతవలె వ్యవహరించునని చెప్పబడినది. అత్తవారింటికి బయలుదేఱుకొత్తపెండ్లికూతురి రోదనమువలె ఆమె ధ్వనియుండునని, ఆ తరువాత యోషిత్తువలె, పుట్టింటిని కొంత మరచిన యోషిత్తువలె, ఆమె భర్త యిల్లే తన యిల్లుగా భావించు పతివ్రతవలె నుండి సహస్రారమున శివైక్యమున తనను తానే మఱచి (పతివ్రత అనగా పతి ననుభవించునది) యుండుననియు చెప్పబడినది. ఈ ఆఱు కమలములందు విభిన్నరూపనామములుగల శివునితో సంగమించుచునే యుండును. సౌందర్య లహర్యాదులైన స్తోత్రములలో ఒక్కొక్క కమలమున ఆమెయొక్క, ఆమె భర్తయైన శివునియొక్క రూపనామములు భిన్న భిన్న ప్రకారములుగా చెప్పబడినవి.

మూలాధారము భూరూపము. స్వాధిష్ఠానము జలరూపము. మణిపూరము అగ్నిరూపము. అనాహతము వాయురూపము. విశుద్ధము ఆకాశరూపము. ఆజ్ఞ మనోరూపము. అని ప్రాచీన గ్రంథములు తెలుపుచుండగా సౌందర్యలహరిలో స్వాధిష్ఠానము అగ్నిరూపము, మణిపూరము జలరూపము అని భిన్నముగా చెప్పబడినది. ఒక్కొక్క కమలము దాటిన కొలది ఒక్కొక్క భూతముయొక్క జయము కలిగి ఆజ్ఞాకమలమును (మనోరూపమును) దాటుటతో సహస్రారమున శివసామరస్యము కలుగునని, శివతాదాత్మ్యము కలుగునని, శివైక్యము కలుగునని చెప్పబడినది. ఈ సహస్రారమునకు పరపదమని పరమపదమని పేర్లు. కౌలాచారులు (కౌలులు) మూలాధారముననే కుండలినిని పూజించుట నారంభించుచుండగా సమయాచారులు మణిపూరమున పూజ నారంభించెదరు. మఱియు మూలాధారము చతుర్దలము. వ శ ష స అను వర్ణములు దళములుగా కలిగియుండును. స్వాధిష్ఠానము బ భ మ య ర ల అను ఆఱు వర్ణములు దళములుగా కలిగి యుండును. మణిపూరము డ ఢ ణ త థ ద ధ న ప ఫ అను వర్ణములు దళములుగా కలిగి యుండును. అనాహతము క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ అను పన్నెండు వర్ణములు దళములుగా కలిగియుండును. విశుద్ధము అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఏ ఐ ఓ ఔ అం అః అను పదాఱు అచ్వర్ణములు దళములుగా కలిగియుండును. సహస్రారము మాత్రము సర్వవర్ణములు దళములుగా కలిగి యుండును. లలితాసహస్రనామ స్తోత్రము విశుద్ధ్యానాహతాద్యాజ్ఞాంత కమలదళములకు అనగా వర్ణముల యందు ఆది వర్ణము లాదిగా నున్న అమృతాది నామములు గల శక్తులున్నవని చెప్పుచున్నది. వర్ణములుకు మాతృకలని పేరున్నను మొత్తము వర్ణములమాల కూడ మాతృకనియు చెప్పబడినది.

ఈ విధముగా కుండలిని **సమస్తవర్ణాత్మకనాదరూపిణి** అని చెప్పబడినది. మఱియు మూలాధారమున పరావాక్కు అను బీజనప ప్రకటనము నంది స్వాధిష్ఠానమున కొంచెము లావెక్కి మణిపూరమున ద్విధావిభాగమున కలిగి **పశ్యన్తీ** రూపమును పొందును. అనాహతమున ద్విధా విభక్తమై వినబడని యుచ్చారణము కలిగి **మధ్యమ**గా పేర్కొనబడును. విశుద్ధమున స్పష్టముగా వినబడు నుచ్చారణమును పొంది **వైఖరీ** నామము నొందును. కొందఱు సహస్రారమున పరగా లలాటమున పశ్యన్తిగా, భ్రూమధ్యమున మధ్యమగా, విశుద్ధమున వైఖరిగా ఒకే వాక్కు చతుర్విధ రూపమున కలిగి యుండునని చెప్పెదరు. వాక్కు మాతృ (పార్వతీ) స్వరూపమని అర్థము. పితృస్వరూపమని కాళిదాసు కూడ రఘువంశ ప్రథమశ్లోకమున సూచించియున్నాడు. వాక్కు నుండి యనగా మాతృకా వర్ణములనుండియే జగములోని అన్ని పదార్థములు యుత్పత్తి జరుగునని తంత్రశాస్త్రజ్ఞుల అభిప్రాయము. ఈ విధముగా కుండలిని పరావాక్కు(నాద) రూపయని చెప్పబడినది. పై వివరమును పరిశీలింపగా అగ్ని, వాయు, నాదాద్యుపాధికమైన ప్రత్యగాత్మయే కుండలిని అని తేలును. ఈ ఆఱు కమలములలో సాకిన్యాది యోగినులు కూడ ఉందురని చెప్పబడినది. ఇది

అంతయు **ప్రదళితషదాధారకమలామ్** అను విశేషణముయొక్క వివరణము. కుండలిని మూలాధారాద్యాజ్ఞా పర్యంతము జీవరూపిణిగా నుండి సహస్రారమున శివైక్యమునంది శివరూపిణిగా నుండును. సహస్రారకమలము పరచంద్రుని, పరశివుని (ఇరువురకు సోమ నామము కలదు) స్థానము. అక్కడకు చేరిన కుండలిని పరంజ్యోతిరుదయగా పరిణతి నందునని ఈ శ్లోకము చివఱి విశేషణము చెప్పుచున్నది. కుండలినీ సాధన రూప యోగాభ్యాస మొనర్చిన యోగులు పైన చెప్పబడిన కుండలినిని దర్శించెదరు. మూకమహాకవి అట్లు దర్శించుటను **పశ్యామః** అను క్రియా పదము తెలుపుచున్నది. అట్లు దర్శించుట అయోగులకు సాధ్యము కాకున్నను మానసికమైన భావనము నొనరించి యథోచితఫలము నొందగలరు. అట్లొందవలెనను ఉద్దేశముతో ఈ శ్లోకమును కొంత దీర్ఘముగా వివరించుట జరిగినది.



**అవ:-** 1. పై శ్లోకమున కామాక్షీదేవియొక్క కుండలినీస్వరూపము నీవార శూకవత్తన్వీ, పీతా భాస్వత్యణూపమా అను శ్రుత్యర్థము అనువదింపబడినది. ఈ శ్లోకమున **విద్యుల్లేఖేవభాస్వరా** అను ఆ శ్రుతిలోని మరొక వాక్యముయొక్క అర్థమనువదింపబడినది.

2. పై శ్లోకముతో శిఖరిణీచ్ఛందమున ఇరువది శ్లోకములు పూర్తియైనవి. ఈ శ్లోకమునుండి మన్దాక్రాంతవృత్తమారంభింపబడుచున్నవి.

**శ్లో॥ జమ్భారాతిప్రభృతిముకుటీః పాదయోః పీఠయన్తీ**
**గుమ్ఫాన్వాచాం కవిజనకృతాన్స్వైరమారామయన్తీ।**
**శమ్పాలక్ష్మీమ్మణిగణరుచాం పాటలైః ప్రాపయన్తీ**
**కమ్పాతీరే కవిపరిషదాం జృమ్భతే భాగ్యసీమా॥** **60**

**ప్రతిపదార్థము :-**

జమ్భారాతిప్రభృతిముకుటీః = ఇంద్రాదుల కిరీటములను;
పాదయోః = పాదములయొక్క;
పీఠయన్తీ = పీఠముగా చేయుచున్న;
కవిజనకృతాన్ = కవిజనులచే చేయబడిన;
వాచామ్ = వాక్కులయొక్క;
గుమ్ఫాన్ = గుత్తులను;
స్వైరమ్ = స్వేచ్ఛగా;
ఆరామయన్తీ = తోటగా చేయుచు;
మణిగణరుచామ్ = మణుల సమూహముల కాంతులకు;

పాటలైః = పాటల పుష్పములచే;
శమ్పాలక్ష్మీమ్ = మెఱుపుతీవ కాంతిని;
ప్రాపయన్తీ = కలిగించుచు;
కవిపరిషదామ్ = కవుల సమూహములయొక్క;
భాగ్యసీమా = భాగ్యముల అవధియైన అమ్మవారు;
కమ్పాతీరే = కమ్పానదీతీరమున;
జృమ్భతే = జృమ్భించుచున్నది.

**తాత్పర్యము:-**

ఇంద్రాదుల కిరీటముల తన పాదపీఠములుగా చేయుచు కవిజనముల వాగ్గుమ్పనములను తోటలుగా చేయుచు మణిగణకాంతులకు పాటలపుష్పములచే మెఱుపు తీవ కాంతిని కలిగించుచు కవి సమూహముల పాలిటి భాగ్యసీమయైన అమ్మవారు కమ్పాతీరమున విజృమ్భించుచున్నది.

**వివరణము :-**

1) అమ్మవారి పాదములను ఇంద్రాది దేవతలు తమ కిరీటములపై ధరించుటచే ఆ కిరీటములే అమ్మవారి పాదములకు పీఠములైనవి. కవుల వాగ్గుమ్పనములు పుష్పగుచ్ఛములు మకరందము గలిగియున్నట్లు రసవంతములౌటచే వానిని తోటలుగా చేయుచున్న దమ్మవారు అనుటచే ఉపమాలంకారస్ఫూర్తి యేర్పడుచున్నది. అమ్మవారి దేహము నీలమణి కాంతుల విరజిమ్ముచు మేఘమువలె నుండగా ఆమె ధరించిన పాటల (ఎఱ్ఱని) పుష్పము లమ్మవారి మేన మెఱుపు తీగలల్లుకొన్నట్లు ప్రకాశించుచున్నవి అనుటచే **విద్యుల్లేఖేవ భాస్వరా** (మహానారా. 11.12) అను శ్రుతి వాక్యార్థము మూడవపాదమున కొంచెము భంగ్యంతరముగా అనువదింపబడినది. కవి సమూహముల పాలిటి భాగ్యసీమయైన కమ్పాతీరమున విజృమ్భించుచున్నదని అమ్మవారు భాగ్యసీమగా భంగ్యంతరముగా చెప్పబడుటచే నీ శ్లోకమున పర్యాయోక్త్యలంకార మేర్పడియున్నది. సవర్గముయొక్క ద్రావిడలిపిలో మహాప్రాణములకు వేరు లిపులు లేనందున ఈ శ్లోకమున ప్రాసము ఏర్పడి యున్నట్లు భావింపనగును.

2) మందాక్రాన్తామ్బుధిరసనగైర్మో భనౌ తౌ గయుగ్మమ్। (4.6.7) ఇతి లక్షణమ్।

3) మహాకవి కాళిదాసు 'మేఘదూతము'ను ఈ వృత్తములోనే రచించినాడు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు కవుల పాలిటి భాగ్యసీమగా చెప్పబడినది. ఈ శ్లోకమున కవుల వాక్కులకు కల్పవల్లిగా ఆమె చెప్పబడుచున్నది.

శ్లో॥ చన్ద్రాపీడాం చతురవదనాం చఞ్చలాపాఙ్గలీలాం
కున్దస్మేరాం కుచభరనతాం కున్తలోద్ధూతభృఙ్గామ్।
మారారాతేర్మదనశిఖినమ్మాంసలం దీపయన్తీం
కామాక్షీం తాం కవికులగిరాం కల్పవల్లీముపాసే॥ 61

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| చన్ద్రాపీడామ్ | = | చంద్రుడు శిరోభూషణముగాగల; |
| చతురవదనామ్ | = | చాతుర్యముగల ముఖముగల; |
| చంచలాపాంగలీలామ్ | = | చంచలములైన క్రీగంటి విలాసములు గల; |
| కుందస్మేరామ్ | = | మొల్లమొగ్గలవంటి చిఱునవ్వుగల; |
| కుచభరనతామ్ | = | కుచముల బరువుతో వంగియున్న; |
| కుంతలోద్ధూతభృంగామ్ | = | కేశములచే వెడలగొట్టబడిన తుమ్మెదలుగల; |
| మారారాతేః | = | శివునియొక్క; |
| మదనశిఖినమ్ | = | కామాగ్నిని; |
| మాంసలమ్ | = | హెచ్చిన దానినిగా; |
| దీపయన్తీమ్ | = | మండించుచున్న; |
| కవికులగిరామ్ | = | కవుల గుంపుల వాక్కులకు; |
| కల్పవల్లీమ్ | = | దేవతాలతయైన; |
| తామ్ | = | ఆ; |
| కామాక్షీమ్ | = | కామాక్షీ దేవిని; |
| ఉపాసే | = | ఉపాసించుచున్నాను. |

**తాత్పర్యము:-**

చంద్రశేఖర, చతురవదన, చంచలములైన క్రీగంటి చూపుల విలాసములు గల మొల్ల మొగ్గలు వికసించినట్లు నవ్వు, స్తనముల భారముచే వంగిన, కేశములచే వెడల గొట్టబడిన తుమ్మెదలుగల, శివుని కామాగ్నిని హెచ్చుగా నుద్దీపింప జేయుచున్న, కవికులముల వాక్కులకు కల్పవల్లియైన కామాక్షీ దేవి నుపాసించు చున్నాను.

**వివరణము :-**

శివుడు చంద్రశేఖరుడు. శివుని అర్ధాంగి కావున అమ్మవారు కూడ చంద్రశేఖర, ఆమె చతురవదన. ఆమె చతురముగా మాట్లాడు నేర్పుగలది. వదనమనగా మాట్లాడునది. మాట్లాడు ముఖమున చాతుర్య మనగా చతురముగా మాట్లాడుటయే. ఆమె చూపుల విలాసములట్టివి. ఆమె దంతములు మొల్లమొగ్గలవలె నున్నవి. ఆమె నవ్వినప్పుడు మొల్లలు వికసించినవా యున్నట్లుండును. ఈ విశేషణమున నీ సంభావనము వ్యంగ్యమగుటచే

నుత్ప్రేక్షాలంకార స్ఫూర్తియేర్పడి యున్నది గదా! ఆమె కేశములతో తుమ్మెదల వెడలగొట్టిన దనుటచే ఉపమాన తిరస్కారము తోచుటచే నీ శ్లోకమున ప్రతీపాలంకారమేర్పడియున్నది. మారారాతి (మన్మథుని శత్రువు) శివుడు. ఆయన ఎదలోనే అధికముగా కామాగ్నిని అమ్మవారు మండింపజేయుచున్నది. ఇట్లనుటలోని విరోధము ఆమె మహిమను తెలుపుచున్నది. కవికులములనగా కవుల గుంపులు. వారి వాక్కులకామె కల్పవల్లి యనగా ఆమె యనుగ్రహముచే ఎంతటి గహన విషయములైనను మనోహరముగా తెలుపు **వాక్కులధార** వారి కేర్పడుననుట ఈ విశేషణముయొక్క సారాంశము. కామాక్షి నుపాసించుచున్నా ననగా కోర్కెల తీర్చు ఆమె కన్నులనుగాని తన కోర్కెను దీర్చుటకు కన్నులలో దానిని నింపుకున్న దానినిగా నిను ధ్యానించుచున్నానని చివటి వాక్కునకు అర్థము. ఈ శ్లోకమున మొదటిపాదమున **చ** వర్ణమైత్రి, రెండవపాదమున **కు** వర్ణమైత్రి, మూడవపాదమున **మ** వర్ణమైత్రి, నాల్గవపాదమున **క** వర్ణమైత్రి అన్ని సమాసముల ఆరంభముననుు ఉన్నందు వలన పదాద్యనుప్రాసమేర్పడియున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారు కవికుల వాక్కుల కల్పవల్లీ అని చెప్పబడినది. ఈ శ్లోకమున కవికల్పవల్లి యని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కాలామ్భోదప్రకరసుషమాం కాన్తిభిస్తర్జయన్తీ**
**కల్యాణానాముదయసరణిః కల్పవల్లీ కవీనామ్।**
**కన్దర్పారేః ప్రియసహచరీ కల్మషాణాం నిహన్త్రీ**
**కాఞ్చీదేశం తిలకయతి సా కాపి కారుణ్యసీమా॥ 62**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కాలామ్భోదప్రకరసుషమామ్ | = కాలమేఘముల గుంపుయొక్క కాంతిని; |
| కాన్తిభిః | = కాంతులతో ; |
| తర్జయన్తీ | = బెదిరించుచున్న; |
| కల్యాణానామ్ | = శుభములయొక్క; |
| ఉదయసరణిః | = ఉదయించు మార్గము; |
| కవీనామ్ | = కవులకు; |
| కల్పవల్లీ | = దేవతాలత; |
| కందర్పారేః | = శివునియొక్క; |
| ప్రియసహచరీ | = ప్రియభార్య; |
| కల్మషాణామ్ | = పాపములయొక్క; |
| నిహన్త్రీ | = నాశమును చేయునది; |

| | | |
|---|---|---|
| సా | = | ఆ; |
| కా+అపి | = | ఒకానొక; |
| కారుణ్యసీమా | = | దయయొక్క అవధియైన అమ్మవారు; |
| కాంచీదేశమ్ | = | కాంచీనగర ప్రదేశమును; |
| తిలకయతి | = | అలంకరించుచున్నది. |

**తాత్పర్యము:-**

తన కాంతులతో కాలమేఘసమూహకాంతులను బెదిరించుచున్న, శుభములకు దయామార్గమైన, కవులకు కల్పలతయైన, శివుని ప్రియభార్యయైన, పాపముల నశింపజేయు, నొకానొక దయావధియైన అమ్మవారు కాంచీనగర ప్రదేశభూమికి తిలకమైయున్నది.

**వివరణము :-**

ఉపమానమైన కాలమేఘముల గుంపుయొక్క కాంతిని బెదరించుచున్న దనుటలో ఉపమానతిరస్కారవ్యక్తి ఉన్నందున ప్రతీపాలంకార మేర్పడి యున్నది. కల్యాణములుదయించు మార్గమమ్మవారని రూపించుటచే రూపకాలంకార మేర్పడియున్నది. కవులకు కల్పవల్లీ యనుటలోనను ఆ రూపకాలంకారమే యున్నది. అమ్మవారుండుటచే కాంచీనగర ప్రాంతభూమికే శోభ కలిగినది. అలంకారములలో తిలకము శ్రేష్ఠము. కావున అమ్మవారిని మించిన విశేషమేమియు నా ప్రాంతమున లేదని తెలియును. ఈ శ్లోకమున అన్ని పాదములలోనను కవర్ణమైత్రి ఉన్నది. అందువలన పదాద్యనుప్రాసాలంకార మేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున అవయవముల వర్ణింపక అవయవియైన అమ్మవారే వర్ణింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి అవయవములైన స్తననయన యుగములు వర్ణింపబడుచున్నవి.

**శ్లో॥ ఊరీకుర్వన్నురసిజతటే చాతురీం భూధరాణాం**
**పాథోజానాం నయనయుగలే పారిపన్థ్యం వితన్వన్।**
**కమ్పాతీరే విహరతి రుచా మోఘయన్మేఘశైలీం**
**కోకద్వేషం శిరసి కలయన్ కోఽపి విద్యావిశేషః॥ 63**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| ఉరసిజతటే | = | స్తన ప్రాంతమున; |
| భూధరణామ్ | = | కొండలయొక్క; |
| చాతురీమ్ | = | చాతుర్యమును; |

| | | |
|---|---|---|
| ఊరీకుర్వన్ | = | అంగీకరించుచు; |
| నయనయుగలే | = | కనుదోయియందు; |
| పాథోజానామ్ | = | కమలములయొక్క; |
| పారిపన్థ్యమ్ | = | శత్రుత్వమును; |
| వితన్వన్ | = | చేయుచు; |
| రుచా | = | కాంతితో; |
| మేఘశైలీమ్ | = | మేఘముల పద్ధతిని; |
| మోఘయన్ | = | వ్యర్థమొనర్చుచు; |
| శిరసి | = | శిరమునందు; |
| కోకద్వేషమ్ | = | చక్రవాకపక్షులతోడి ద్వేషమును (చంద్రుని); |
| కలయన్ | = | ధరించుచు; |
| కః+అపి | = | ఒకానొక; |
| విద్యావిశేషః | = | విద్యావిశేషము; |
| కమ్పాతీరే | = | కంపానదీ తీరమున; |
| విహరతి | = | విహరించుచున్నది. |

**తాత్పర్యము:-**

స్తనప్రదేశమున కొండల చాతుర్యమును అంగీకరించుచు, కన్నుదోయి యందు కమలములతోడి విరోధమును చేయుచు, కాంతితో మేఘశైలిని వ్యర్థమొనర్చుచు, చక్రవాకపక్షులందు ద్వేషముకల చంద్రుని శిరమున ధరించుచు ఒకానొక విద్యావిశేషము కమ్పానదీతీరమున విహరించుచున్నది.

**వివరణము :-**

స్తన ప్రదేశము కొండల చాతురి యుక్క ఊరీకరణము అనుకూల క్రియ, నయనయుగమున కన్నుదోయియొక్క పారిపన్థ్యము నొనర్చుట ప్రతికూల క్రియ. ఇవి రెండును పరస్పరవిరుద్ధక్రియలుగా నున్నవి. అమ్మవారి ఆ స్తన నయనములకు భూధర పాథోజ సాదృశ్యమునే వ్యక్తీకరించుటచే ఉపమాలంకార స్ఫూర్తి యున్నది. అట్లే కాంతితో మేఘశైలిని మోఘీకరించుట (వ్యర్థమొనర్చుట) ప్రతికూలక్రియ. శిరసున కోకద్వేషమును అనగా చంద్రుని ధరించుట అనుకూల క్రియ. ఈ రెండు విరుద్ధక్రియలును చేయుటలో విద్దూర మేమియు లేదు. కాంతితో మేఘశైలిని మోఘీకరించుట సాదృశ్యమునే వ్యక్తీకరించును. ఉపమాలంకారమునే స్ఫురింపజేయుచున్నది. ఆ మేఘములు చంద్రుని దాచివేసి ఆతనిని మోఘీకరింపజేయగా ఈమె తల యందలి కుంతలములు ఆ మేఘముల పోలియున్నను చంద్రుని మాత్రము ప్రకటించి ఆతని ప్రకాశమును బయల్పఱచుట ద్వారా ఆతనికి సార్ధకతనే కలిగించుచున్నవి అను వ్యతిరేకాలంకారవ్యక్తి ఉత్తరార్ధమున నున్నది.

చంద్రుడనక కోకద్వేష మనుట, అమ్మవారనక విద్యావిశే, మనుట పర్యాయోక్త్యలంకార మేర్పడుటకు కారణములు. ప్రథమ పాదమున 1-5 వర్ణములైన ఉకారములమైత్రి, ద్వితీయ పాదమున 1-11 వర్ణములైన పకారములమైత్రి, నాల్గవ పాదమున 1-11 వర్ణములైన కోకారముల మైత్రి ఉన్నవి. మూడవ పాదమున మోఘయ న్మేఘశైలీమ్ అనుటలో వృత్త్యనుప్రాస మున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు ఏదో ఒక విద్యావిశేషమని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ విద్యావిశేషము **మన్మథవిద్య** అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కాఞ్చీలీలాపరిచయవతీ కాపి తాపిఞ్ఛలక్ష్మీ-**
**ర్జాడ్యారణ్యే హుతవహశిఖా జన్మభూమిః కృపాయాః।**
**మాకన్దశ్రీర్మధురకవితాచాతురీకోకిలానాం**
**మార్గే భూయాన్మమ నయనయోర్మాన్మథీ కాపి విద్యా॥ 64**

**ప్రతిపదార్థము :-**

కాంచీలీలాపరిచయవతీ = కాంచీనగర విలాసములతో పరిచయముగల;
కా+అపి = ఒకానొక;
తాపింఛలక్ష్మీః = తమాల కాంతి;
జాడ్యారణ్యే = జడత్వమను అడవియందు;
హుతవహశిఖా = అగ్నిజ్వాల;
కృపాయాః = దయయొక్క ;
జన్మభూమిః = పుట్టుచోటు;
మధురకవితాచాతురీకోకిలానామ్ = మధురకవితాచతురులనే కోకిలలకు;
మాకందశ్రీః = చూతలక్ష్మి;
కా+అపి = ఒకానొక ;
మాన్మథీ = మన్మథునకు చెందిన;
విద్యా = విద్య;
మమ = నాయొక్క;
నయనయోః = కన్నులయొక్క;
మార్గే = మార్గమున;
భూయాత్ = ఉండుగాక!

**తాత్పర్యము:-**

కాంచీనగర విలాసముల పరిచయముగల ఒకానొక తమాలవృక్షలక్ష్మి,

జాడ్యమను అడవియందలి అగ్నిజ్వాల, దయయొక్క జన్మభూమి, మధుర కవితా చతురులను కోకిలలకు చూతలక్ష్మి, మన్మథవిద్య అని చెప్పదగిన అమ్మవారు నాకు కనబడుగాక!

**వివరణము :-**

తమాలవృక్షలక్ష్మి అడవిలో నుండును. కాని దానికి కాంచీనగర విలాస పరిచయము గలిగి నాగరికయైనది అమ్మవారే. ఈ ప్రపంచ మంతయు జడము. అదియే ఇచట జాడ్యారణ్యముగా రూపింపబడినది. ఆ అరణ్యమును కాల్చివేయు అగ్నిజ్వాల అమ్మవారే. ఆమె దయయొక్క పుట్టిల్లనియే చెప్పనగును. ఏలననగా అంత దయ ఏ దేవతయందును కానము. పురుషులు కఠినులు. కావున పురుష దేవతలలో అంత దయ కానరాకపోవుట విచిత్రము కాదు. స్త్రీ దేవతలలో కూడ మరొకరి కంత దయ లేదు. కావున అమ్మవారే దయకు పుట్టిల్లుగా చెప్పబడినది. ఆ దయనే మిగిలిన దేవతలు కొంతకొంత తీసికొని పోయి దయగలవారని చెప్పబడినారు. అంతే. దయ పుట్టుచోటు మాత్ర మమ్మవారే. అనగా దయ కామె గని. ఎంత ఎంత ఎందరు కొనిపోయినను అనగా ఎంత దయ నెన్ని కోట్లమందికి ప్రసాదించినను అది తరుగదు. అందుండి కొంత కొంత తీసుకొని దయగల వారని పేరొందిన దేవతల దయ తఱిగి పోవలసినదే కాని అమ్మవారి దయ అనంతముగా ప్రసాదింపబడినను దాని కంతము కలుగదు. లేదు కూడ.

మామిడి వృక్షముల లక్ష్మిని చూడగానే మధుర కవితాచాతురీ కోకిలలు వచ్చి ఆశ్రయించునని సూచింపబడినది. వాస్తవమునకు అమ్మవారి నాశ్రయించినవే మధురకవితలు. అవి హృదయములలో నుండి పెల్లుబికి వచ్చును. అతిశయోక్తిచ్ఛాయతో ఆశ్రయాశ్రయి భావము మార్చి చెప్పబడినది. అమ్మవారిని మన్మథు డే విద్యతో నుపాసించినాడో ఆ విద్య మన్మథవిద్య. మన్మథుడావిద్యకు ద్రష్ట కావున ఆ విద్య కాతడు ఋషి, అది కాదివిద్య అనియు చెప్పబడును. విద్యకు తదుపాస్యదేవతకు అభేదమును భావించుట తంత్రశాస్త్రసమ్మతము. అందుచేత అమ్మవారే ఇచట మన్మథవిద్య అని చెప్పబడినది. ఇదిగాక అమ్మవారు మన్మథవిద్యగా మన్మథుని యెదలో సాక్షాత్కరించినది. అందవలననే మన్మథుడావిద్యకు ద్రష్ట యని చెప్పబడినాడు. ఇట్లు అమ్మవారే విద్యారూపము నందినది. విషయువైన అమ్మవారిని చెప్పక విషయియైన తాపింఛలక్ష్మిగా, కృపాజన్మభూమిగా, జాడ్యారణ్యాగ్నిశిఖగా, మధురకవితాచాతురీ కోకిలలకు చూతలక్ష్మిగా, చెప్పబడినందున రూపకాతిశయోక్తి మాలాలంకారమేర్పడినదని చెప్పవచ్చును.

విద్య దర్శింపబడవలెననిన రూపవతియైన అమ్మవారుగా పరిణామ మొందవలసి యున్నందున పరిణామాలంకారవ్యక్తియు నీ శ్లోకమున నున్నది. తాపింఛములు, మాకందములు వృక్షములే. కావున వనసంబంధులు. అట్లే అగ్ని శిఖ అడవులలో దావాగ్నిశిఖగా వెలుగొందుచుండు కారణమున అదియు వనసంబంధియే. కావున

**కాంచీలీలాపరిచయవతీ** అను విశేషణ మన్నింటికి వర్తించునని చెప్పవచ్చును. ప్రథమార్ధమున 1-11 వర్ణముల మైత్రి పాటింపబడినది. మొదటిపాదమున క వర్ణమైత్రి, రెండవ పాదమున జ వర్ణమైత్రి, మూడవపాదమున 1-5 ను వర్ణముల మైత్రి, నాలుగవపాదమున 1-5-11 ను వర్ణముల మైత్రి మొత్తము శ్లోకమున కెంతో శోభను చేకూర్చుచున్నవి.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు మన్మథ విద్యగా చెప్పబడినది. ఈ శ్లోకమున మన్మథ పతాకగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ సేతుర్మాతర్మరకతమయో భక్తిభాజాం భవాబ్ధౌ**
**లీలాలోలా కువలయమయీ మాన్మథీ వైజయన్తీ।**
**కాఞ్చీభూషా పశుపతిదృశాం కాపి కాలాఞ్జనాలీ**
**మత్కం దుఃఖం శిథిలయతు తే మఞ్జులాపాఙ్గమాలా॥ 65**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| మాతః | = అమ్మా! |
| తే | = నీయొక్క; |
| మంజులాపాంగమాలా | = అందమైన కటాక్షముల మాల; |
| మరకతమయః | = మరకతమణిమయమైన; |
| భవాబ్ధౌ | = సంసారమను సముద్రమునందు; |
| భక్తిభాజామ్ | = భక్తికలవారికి; |
| సేతుః | = వంతెన; |
| లీలాలోలా | = విలాసములచే చంచలమైన; |
| కువలయమయీ | = నీలోత్పలమయమైన; |
| మాన్మథీ | = మన్మథునకు సంబంధించిన; |
| వైజయన్తీ | = పతాక; |
| పశుపతిదృశామ్ | = శివుని కన్నులకు; |
| కాలాంజనాలీ | = నల్లని కాటుకల వరుస; |
| కాంచీభూషా | = కాంచీనగరపు అలంకారము; |
| మత్కమ్ | = నాకు సంబంధించిన; |
| దుఃఖమ్ | = దుఃఖమును; |
| శిథిలయతు | = నశింపజేయుగాక. |

**తాత్పర్యము:-**

సంసారసముద్రమున నుండు భక్తిసంపన్నులు ఆ సముద్రమును దాటుటకు వంతెన నీ అందమైన కటాక్షముల మాల. అదియే నీలోత్పలమయమైన విలాసములు గల మన్మథుని పతాక. శివుని కన్నులకు నల్లని కాటుకల వరుస ఆ కటాక్షమాల నా దుః ఖమును నశింపజేయుగాక!

**వివరణము :-**

సంసారసముద్రమునందలి ఒక దీవి మనుష్యలోకము. దేవతాది లోకములును అందులోని దీవులే. అమ్మవారి లోకము ఇందులోని దీవులలో చేరినది కాదు. ఇందులోని దీవులలో నొకదానికి మరొకదానికి ఎక్కువ దూరము లేదు. కావున ఈ దీవుల పరస్పర యాతాయాతములు ఈదుట ద్వారా జరుగును. ఒక లోకమునుండి మరొకలోకమును చేరుట పునర్జన్మ. ఒక్కొక్కప్పుడు ఒక దీవిలోననే పునర్జన్మ నందవచ్చును. మరొక లోకమును చేరుట కాతివాహికులుగా(కొంపోవు వారు) ఉత్తరాయణాద్యభిమానదేవత లుందురు. కొంతకాలము ఆయా లోకములలో ఉండి చివఱికి మనుష్యలోకమునకే వచ్చెదరు. పడవ ప్రయాణమున ఈదుటలో నాయాసము ప్రమాదములు కలుగు నవకాశమున్నది. అమ్మవారి లోకమునకు చేరుకొనవలెననిన భక్తి కావలెను. భక్తి కలిగినంతనే ఈ సంసారసముద్రము యొక్క బాధ చాల వరకు తొలగిపోవును. ఇక పరమపదమైన అమ్మవారి లోకమును చేరుకొనిన ఇక భవ సముద్రములోని జీవులకు తిరిగి వచ్చుట యను మాటకే అవకాశము లేదు. ఇది ఉత్తరాయణ మార్గము. భక్తి కలిగిన చాలును. ఇక పరమపదమైన సంసార సముద్రమున కావలనున్న అమ్మవారి లోకము చేరుకొన్నట్లే. అమ్మవారి కటాక్షమాల భక్తికలవారికి మాత్రమే లభించు నొక వంతెన. అది మరకతమణి నిర్మితమట్లు మిక్కిలి దృఢమైనది. కావున కూలిపోవు నవకాశము లేదు. సేతువు మీదుగా ప్రయాణము చేయుటలో నెట్టి ప్రమాదము నుండదు. అమ్మవారి చూపులు నల్లనివి. కావున ఆ కటాక్షమాల మరకతమణిమయమని చెప్పబడినవి. అమ్మవారి కటాక్షమాల మన్మథుని కువలయపుష్పమయమైన పతాక. మన్మథునకు నీలోత్పలమయ బాణము ప్రసిద్ధముగా నున్నది. ఆయన పతాక కువలయ మయమని చెప్పబడినది. అమ్మవారు కాంచీభూష అనగా కాంచీనగరమున కలంకారము. మరొక అర్థము అమ్మవారి నడుమున కాంచి (ఒడ్డాణము) యున్నదని, అమ్మవారు శివుని చూపులకు కాలాంజనము. కాలాంజనము (నల్లని కాటుక) కన్నులకు పూసికొన్నచో (కంటి అందము పెరుగుట యేకాక) కంటిమంట తగ్గి కన్నులు చల్లబడుట ఆయుర్వేద సిద్ధము. కామారియైన శివునకు మన్మథుని పతాక కనబడగానే కంటి మంట హెచ్చవలెను. ఎన్నడో భూతకాలమున అట్లు హెచ్చి మన్మథునాతడు బూది చేసినాడు. కాని ప్రస్తుతము శివుని కాతనిపై ద్వేషము లేదు. పైగా తన ప్రియురాలైన కామాక్షీ దేవి కన్నులలో ఎదలో ఉన్నాడని తన ప్రియురాలి ఆశ్రితుడని

మీదు మిక్కిలి అభిమానము కలిగినది. ఆ అభిమానముతో కువలయమయమై కాలాంజనమై ఆ కటాక్షమాల శివుని కన్నుల కెంతయో హాయి నిచ్చుచున్నది. ఇది వర్తమానకాలిక విషయము. సేతువుగా, వైజయన్తిగా, కాలాంజనాలిగా రూపణము చేయుటచేతను ఆ ఆరోప్యమాణములు దుఃఖశిథిలీకరణమునకై అమ్మవారు మంజులాపాంగ మాలగా పరిణమించుటచే ఈ శ్లోకమున పరిణామాలంకార మేర్పడియున్నది. సేతుర్మాతః అను పదముల జంటలో పదాంతానుప్రాస మున్నది. లీలాలోలా కువలయమయీ, కాలాంజనాలీ పదములలో లకార ప్రాచుర్యముచే వృత్త్యనుప్రాస మేర్పడియున్నది. మూడవ పాదమున **క** వర్ణమైత్రి, నాల్గవపాదమున **మ** వర్ణమైత్రి ఉన్నవి.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కటాక్షములు లీలా(విలాస)లోలములని చెప్పబడినవి. ఈ శ్లోకమున నవి నియమము కలవారి బన్ధచ్ఛేదములని చెప్పబడుచున్నవి.

**శ్లో॥ వ్యావృణ్వానాః కువలయదలప్రక్రియావైరముద్రాం**
**వ్యాకుర్వాణా మనసిజమహారాజసామ్రాజ్యలక్ష్మీమ్।**
**కాఞ్చీలీలావిహృతిరసికే కాంక్షితం నః క్రియాసు-**
**ర్బన్ధచ్ఛేదే తవ నియమినాం బద్ధదీక్షాః కటాక్షాః॥ 66**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కాంచీలీలావిహృతిరసికే | = | కాంచీనగరమున విలాసముగా విహరించుటయందు యిష్టము గలదానా! |
| కువలయదలప్రక్రియావైరముద్రామ్ | = | నల్ల కలువల వికసింపజేయు ప్రక్రియయందు వైర చిహ్నమును; |
| వ్యావృణ్వానాః | = | వివరించునట్టి; |
| మనసిజమహారాజసామ్రాజ్యలక్ష్మీమ్ | = | మన్మథుడను మహారాజుయొక్క సామ్రాజ్యలక్ష్మిని; |
| వ్యాకుర్వాణాః | = | వ్యాకరించునట్టి; |
| నియమినామ్ | = | నియమములు గలవారియొక్క; |
| బంధచ్ఛేదే | = | (సంసార) బంధముయొక్క నశింపజేయుటయందు; |
| బద్ధదీక్షాః | = | బంధింపబడిన దీక్ష కల; |
| తవ | = | నీయొక్క; |
| కటాక్షాః | = | చూపులు; |
| నః | = | మాయొక్క; |

కాంక్షితమ్ = కోర్కెను;
క్రియాసుః = చేయు(తీర్చు)గాక!

**తాత్పర్యము:-**

నల్లకలువల వైరముతో ముకుళింపజేయునట్టి, మన్మథమహారాజ సామ్రాజ్యలక్ష్మిని వ్యాఖ్యానించుచున్నట్టి, నియమములు కలవారి సంసార బంధమును ఛేదించుటయందు దీక్ష బూనిన అమ్మవారి కటాక్షములు మా కోర్కె(ల) నీడేర్చుగాక!

**వివరణము :-**

అమ్మవారి శిరమున చంద్రకల ఉన్నది. దానిని చూచి నల్లకలువలు వికసింప దలచుకొని ఒక్కొక్క రెక్కను ప్రసరింపజేయ దొడగినవి. ఇంతలో అమ్మవారి చూపులా కలువలపై పడినవి. అమ్మవారి కన్నులయెదుట తమ వికాసము చూపుటకు సాహసింపలేక పోయినవి. వైరమా కన్నులలో నా కలువలకు పొడకట్టినది. ఇక వికసించుట మానుకొన్నవి. ఈ వస్తువు ప్రథమ పాద వ్యంగ్యము. అమ్మవారి పేరు కామాక్షి గదా! కాముడు అనగా మనస్సునందు పుట్టిన మన్మథుడు. ఆయన సామ్రాజ్యలక్ష్మిని ఆ అమ్మవారి కన్నులు వ్యాఖ్యానించుచున్నవి అనగా ప్రకటించుచున్నవి. ఇది ద్వితీయపాద బోధ్యాంశము. నియమనిష్ఠలు గలవారి సంసారబంధమును భేదించి వారికి ముక్తిని ప్రసాదించుట కమ్మవారి కటాక్షములు దీక్ష బంధించుచున్నవి. ఇది చతుర్థపాదార్థము. ఇందు బంధచ్ఛేదముకొఱకైన దీక్షాబంధము ముల్లును ముల్లుతో తీసివేయునట్లు బంధము తొలగించుటకు మరొక బంధము ప్రయోగింపవలెననుట వ్యంజింపజేయుచున్నది. మూడవపాదమునందలి **కాంచీలీలావిహృతిరసికే** అను సంబోధన మమ్మవారికి గల కాంచీ పురవిహారము నందలి ఆసక్తిని తెలుపుచున్నది. **కాంక్షితమ్** అను పదము జాత్యేకవచనముగా కోర్కెలను బోధించును. క్రియాసుః అను పదము చేయుట అను అర్థము కలదైనను ఇచట తీర్చుట అను అర్థమును బోధించును. పూర్వార్ధమున తృతీయ చతుర్థాక్షర ప్రాసమున్నది. ఉత్తరార్ధమున 1-11 వర్ణములకు మైత్రి ఉన్నది. **బద్ధదీక్షాః, కటాక్షాః** అను పదములలో పదాంతాను ప్రాసమున్నది.



**అవ:-** అమ్మవారి కటాక్షములు మనసిజసామ్రాజ్యలక్ష్మి ప్రకటనములని పై శ్లోకమున చెప్పబడినవి. ఈ శ్లోకమున అమ్మవారు కారుణ్యలక్ష్మిగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ కాలామ్భోదే శశిరుచి దలం కైతకం దర్శయన్తీ**
**మధ్యేసౌదామని మధులిహామ్మాలికాం రాజయన్తీ।**
**హంసారావం వికచకమలే మఞ్జుముల్లాసయన్తీ**
**కమ్పాతీరే విలసతి నవా కాపి కారుణ్యలక్ష్మీః॥ 67**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కాలామ్భోదే | = | కాలమేఘమున; |
| శశిరుచి | = | చంద్రుని కాంతిగల; |
| కైతకమ్ | = | మొగలికి సంబంధించిన; |
| దలమ్ | = | రేకును; |
| దర్శయన్తీ | = | చూపించుచున్న; |
| మధ్యేసౌదామని | = | మెఱుపుతీగ నడుమ; |
| మధులిహామ్ | = | తుమ్మెదలయొక్క; |
| మాలికామ్ | = | వరుసను; |
| రాజయన్తీ | = | ప్రకాశింపజేయుచున్న; |
| వికచకమలే | = | వికసించిన కమలమునందు; |
| మంజుమ్ | = | అందమైన; |
| హంసారావమ్ | = | హంసల సవ్వడిని; |
| ఉల్లాసయన్తీ | = | వెలువరించుచున్న; |
| నవా | = | కొత్తయైన; |
| కా+అపి | = | ఒకానొక; |
| కారుణ్యలక్ష్మీః | = | దయాలక్ష్మి; |
| కమ్పాతీరే | = | కమ్పానదీతీరమున; |
| విలసతి | = | వెలయుచున్నది. |

**తాత్పర్యము:-**

కాలమేఘమున చంద్రునివలె తెల్లనైన మొగలిరేకును చూపించుచున్న, మెఱుపుతీగ నడుమ తుమ్మెదలవరుసను వెలయించుచున్న, వికసించిన కమలమున హంసధ్వనిని వెలార్చుచున్న, ఒకానొక కొత్త కారుణ్యలక్ష్మి కమ్పానదీ తీరమున విలసిల్లుచున్నది.

**వివరణము :-**

ఈ శ్లోకమున ఉపమానములు ఉపమేయముల బోధించుచుండుటచే నతిశయోక్త్యలంకారము మేర్పడియున్నది. అమ్మవారనగా లక్ష్మి వేషము ధరించిన దయయే. ఈ దయాదేవత కొప్పున (కాలాంభోదమున) చంద్రకల (మొగలిరేకు) ను చూపించుచున్నది. సాధారణముగా చంద్రుని కాలాంభోదము కప్పివేయునే కాని చూపించదు. ఇట అసాధారణత. అందువలన విరోధాలంకారధ్వని యేర్పడును. అట్లే ఆమె నడుము సన్నని మెఱుపుతీగయే. దాని నడుమ తుమ్మెదల మాల (నూగారు) ను ప్రకాశింపకజేయుటయు కొంత అసాధారణమే. మబ్బులు మెఱుపులున్నప్పుడు తుమ్మెదలు దాగియుండునే కాని

ప్రకాశింపవు. అట్లే ఆమె పాదమున (వికచకమలమున) హంసలధ్వని (మంజీరనాదము అందెల చప్పుడు) వెలార్చుచున్నది. రెండవపాదమున మెఱపుతీగ (మందహాసము) తుమ్మెదల మాలను (చూపుల వరుస)ను ప్రకాశింపజేయుచున్నదని చెప్పవచ్చును. ప్రథమ పాదమున **క** వర్ణమైత్రి, రెండవపాదమున **మ** వర్ణమైత్రి, నాల్గవపాదమున **క** వర్ణమైత్రి ఉన్నవి. **మధ్యేసౌదామిని** అనుచోట యతి భంగము కనిపించుచున్నది. అమ్మవారని చెప్పక భంగ్యంతరముగా కారుణ్యలక్ష్మియని చెప్పుటచే నీ శ్లోకమున పర్యాయోక్త్యలంకార మేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున విరోధాభాసము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున కూడ ఒక విధమైన విరోధము చెప్పబడుచున్నది.

**శ్లో॥ చిత్రం చిత్రం నిజమృదుతయా భర్త్సయన్పల్లవాలీం**
**పుంసాం కామాన్భువి చ నియతం పూరయన్పుణ్యభాజామ్।**
**జాతశ్శైలాన్నతు జలనిధేః స్వైరసఞ్చారశీలః**
**కాఞ్చీభూషా కలయతు శివం కోఽపి చిన్తామణిర్మే॥ 68**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| చిత్రమ్ చిత్రమ్ | = ఇది మిక్కిలి చిత్రము; |
| నిజమృదుతయా | = తన మెత్తదనముచేత; |
| పల్లవాలీమ్ | = చిగుళ్ళవరుసను; |
| భర్త్సయన్ | = బెదరించు; |
| పుణ్యభాజామ్ | = పుణ్యవంతులైన; |
| పుంసామ్ | = పురుషులయొక్క; |
| కామాన్ | = కోర్కెలను; |
| భువి చ | = భూమియందును; |
| నియతమ్ | = తప్పక; |
| పూరయన్ | = పూరించుచున్నను; |
| శైలాత్ | = కొండనుండి; |
| జాతః | = పుట్టినది; |
| తు | = కాని; |
| జలనిధౌ | = సముద్రమునుండి; |
| న | = కాదు(పుట్ట లేదు); |
| స్వైరసంచారశీలః | = స్వేచ్ఛగా సంచరించు స్వభావము కలది; |
| కాంచీభూషా | = కాంచీ నగరాలంకారమైన; |

| | |
|---|---|
| కః+అపి | = ఒకానొక; |
| చింతామణిః | = చింతామణి; |
| మే | = నాకు; |
| శివమ్ | = శుభమును; |
| కలయతు | = కలిగించుగాక! |

**తాత్పర్యము:-**

కాంచి కలంకారమైన అమ్మవారు చింతామణియే. కాని విచిత్ర మేమనగా ఈ చింతామణి స్వర్గలోకచింతామణివలె సముద్రమునుండి పుట్టలేదు. కాని కొండనుండి (హిమాలయ పర్వతము నుండి) పుట్టినది. ఇది దానివలె కఠినముగా లేదు. పైగా తన మెత్తదనముచే చిగుళ్ళను బెదిరించుచున్నది. ఆ చిన్తామణి స్వర్గలోకవాసుల కోరికలనే తీర్చును. కాని ఈ చిన్తామణియో భూమియందున్న పుణ్యాత్ముల కోర్కెలను కూడ తీర్చును. పైగా ఆ చిన్తామణి జడము, కదలదు, మెదలదు. ఈ చిన్తామణియో స్వేచ్ఛగా చరించుస్వభావము కలది. ఇది యెంత చిత్రమో!

**వివరణము:-**

చిన్తామణి శిలాజాతికి చెందినది. కావున అది కఠినముగా నుండవలసి యుండగా అమ్మవారను చిన్తామణి చిగుళ్ళకన్న మెత్తగ నున్నది. మెత్తదనమున చిగుళ్ళనే (ఉపమానముచే) బెదిరించు (తిరస్కరించు) చున్నదని చెప్పుటచే నిచట ప్రతీపాలంకార మేర్పడియున్నది. ఈ చిన్తామణి భూలోకమున నుండు పుణ్యాత్ములకు కూడ కామముల నొసగునదని చెప్పుటచే దేవతల కోర్కెలను కూడ తీర్చుననుట స్ఫురించుచున్నది. కాంచీనగరమునకు అమ్మవారు అలంకారము. ఆ అలంకారమైన అమ్మవారు కూడ కాంచియను నొక యలంకారమును (ఒడ్డాణము) ధరించినది. ఒడ్డాణము నడుమ మణి పొదగబడును. అమ్మవారి నడుమునందు ఒడ్డాణమున చిన్తామణివంటి యొక మణి పొదగబడి యున్నదను అర్థము కూడ ఇందు వ్యంజింపబడుచున్నది. ఈ శ్లోకమున చింతామణి మృదువుగా నుండుట స్వేచ్ఛగా తిరుగుట అను విశేషణము లుండుటచే నీ శ్లోకమున వ్యతిరేకాలంకార మేర్పడియున్నది. రెండవపాదమున 1-11 వ వర్ణమైత్రి యున్నది. 1-5వ భు వర్ణములకు మైత్రి కూర్పబడి యున్నది. మూడవపాదమున జకారమునకు సైవ్లోని సకారమునకు మైత్రి చేయబడి యున్నది. నాల్గవపాదమున 1-5 క వర్ణమైత్రి యున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు విలక్షణ చిన్తామణియని చెప్పబడినది. ఈ శ్లోకమున చిన్తామణియొక్క ప్రభువైన ఇంద్రునికి ఐంద్రవిలాసము నమ్మవారు ప్రకటించుట చెప్పబడుచున్నది.

శ్లో॥ తామ్రామ్భోజం జలదనికటే తత్ర బన్ధూకపుష్పం
తస్మిన్మల్లీకుసుమసుషమాం తత్ర వీణానినాదమ్।
వ్యావృణ్వానాః సుకృతలహరీ కాపి కాఞ్చీనగర్యా-
మైశానీ సా కలయతితరామైన్ద్రజాలం విలాసమ్॥ 69

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| జలదనికటే | = | మేఘసమీపమున; |
| తామ్రామ్భోజమ్ | = | ఎఱ్ఱని కమలమును; |
| తత్ర | = | అక్కడ; |
| బన్ధూకపుష్పమ్ | = | మంకెన పూవును; |
| తస్మిన్ | = | దాని యందు; |
| మల్లీకుసుమసుషమామ్ | = | మల్లెపూవుయొక్క కాంతిని; |
| తత్ర | = | అక్కడ; |
| వీణానినాదమ్ | = | వీణయొక్క నినాదమును; |
| వ్యావృణ్వానాః | = | వివరించుచున్నట్టి; |
| కాంచీనగర్యామ్ | = | కాంచీ నగరియందు; |
| సా | = | ఆ; |
| కా+అపి | = | ఒకానొక; |
| ఐశానీ | = | ఈశానునికి సంబంధించిన; |
| సుకృతలహరీ | = | పుణ్య ప్రవాహము; |
| ఐంద్రజాలమ్ | = | ఇంద్రజాలమునకు సంబంధించిన; |
| విలాసమ్ | = | విలాసమును; |
| కలయతితరామ్ | = | బాగుగా చూపించుచున్నది. |

**తాత్పర్యము:-**

అదిగో మేఘము కడ ఎఱ్ఱని కమలమును, దానియందు మంకెన పూవును, దానియందు మల్లెపూవుయొక్క కాంతిని, అక్కడ వీణాధ్వనిని వెలార్చునట్టి ఈశానునకు చెందిన యొకానొక పుణ్యప్రవాహము ఇంద్రజాల విలాసమును ప్రకటించుచున్నది.

**వివరణము :-**

మేఘము రాగానే వాడి ముడుచుకొనిపోవు కమలము మేఘము కడనున్నట్లు ఆ కమలపుష్పమున మరొకపుష్పము (ఒక పుష్పమున మరొక పుష్పముండదు). దానిలో మరొక పుష్పము. అందు మల్లెపూవుయొక్క కాంతి యున్నట్లు, దానిలో వీణానాదము (మల్లెపుష్పమున వీణానాద ముండుటెట్లు) చూపుట ఇంద్రజాల విద్య (గారడి) నెఱిగిన

వారికి మాత్రమే సాధ్యము. కాంచీనగరి యందు ఈశానుని పుణ్య ప్రవాహ మనదగిన అమ్మవారే ఆ ఇంద్రజాల విద్యను ప్రదర్శించుచున్నది. ఉపమానద్రవ్యములతో ఉపమేయములు ఈ శ్లోకమున చెప్పబడుచున్నవి. కాలామ్బోదమనగా కొప్పు. దాని దగ్గఱ ఎఱ్ఱని కమలమనగా ముఖము. దానియందు మంకెన పూవనగా ఎఱ్ఱని పెదవి. దానిలో మల్లెపూవుయొక్క కాంతి యనగా చిఱునవ్వు. దానిలో వీణానాదమనగా మాట్లాడునప్పుడు కలుగు కంఠధ్వని. ఈ శ్లోకమున అతిశయోక్త్యనుప్రాణితమైన ఉత్ప్రేక్షాలంకార మేర్పడియున్నది. అమ్మవారు ఇంద్రజాలమును వాస్తవముగా ప్రదర్శించకున్నను, ప్రదర్శించుచున్నట్లు సంభావింపబడుటయే అందుకు కారణము. ఇది గమ్యోత్ప్రేక్షాలంకారము. సంభావనావాచకమేదియు ఈ శ్లోకమున లేదు గదా! పూర్వార్ధమున రెండు పాదములందును **త** వర్ణమైత్రి యున్నది. నాల్గవపాదమున **ఐ** వర్ణమైత్రి యున్నది. అమ్మవారని చెప్పక శివుని పుణ్య ప్రవాహమని భంగ్యంతరముగా చెప్పుటచే నీ శ్లోకమున పర్యాయోక్త్యలంకారము కూడ నేర్పడియున్నది.



**అవ:-** పై శ్లోకమున ఇంద్రజాలప్రదర్శనమున కొన్ని వింతలమ్మవారు ప్రకటించినట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున మఱికొన్ని వింత లమ్మవారు చూపుచున్నట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆహారాంశం త్రిదశసదసామాశ్రయే చాతకానా-**
**మాకాశోపర్యపి చ కలయన్నాలయం తుఙ్గమేషామ్।**
**కమ్పాతీరే విహరతితరాం కామధేనుః కవీనాం**
**మన్దస్మేరో మదననిగమప్రక్రియాసమ్ప్రదాయః॥ 70**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| చాతకానామ్ | = చాతకములయొక్క; |
| ఆశ్రయే | = ఆశ్రయమునందు; |
| త్రిదశసదసామ్ | = దేవసభలయొక్క; |
| ఆహారాంశమ్ | = ఆహారముయొక్క భాగమును; |
| ఆకాశోపరి+అపి చ | = ఆకాశము పైనను; |
| ఏషామ్ | = వీరికి (దేవతలకు); |
| తుంగమ్ | = ఎత్తైన ; |
| ఆలయమ్ | = ఇంటిని; |
| కలయన్ | = కల్పించుచు; |
| కవీనామ్ | = కవులయొక్క; |
| కామధేనుః | = కోర్కెలనిచ్చు ఆవు; |

| | | |
|---|---|---|
| మన్దస్మేరః | = | చిఱునవ్వుగల; |
| మదననిగమప్రక్రియాసమ్ప్రదాయః | = | మన్మథవేద ప్రక్రియా సంప్రదాయము; |
| కమ్పాతీరే | = | కమ్పానదీ తీరమున; |
| విహరతితరామ్ | = | బాగుగా విహరించుచున్నది. |

**తాత్పర్యము:-**

చాతకముల ఆశ్రయమైన దేవతల ఆహారభాగమును ఆకాశము పైనను ఈ దేవతల కాలయమును కల్పించు కవుల కామధేనువు, చిఱునవ్వుగల మన్మథవేదప్రక్రియా సంప్రదాయము కమ్పానదీతీరమున విహరించుచున్నది.

**వివరణము :-**

చాతకముల ఆశ్రయమనగా మేఘము. మేఘమనగా కొప్పు. అచట ఆహార మనగా చంద్రుడు. ఆహారభాగమనగా చంద్రకల. ఆకాశమనగా నడుము. దానికి పైన దేవతల ఇల్లనగా మేరు పర్వతము (బంగారు పర్వతము) అనగా స్తనమండలము కల్పించియున్న దమ్మవారు. ఆమె కవులకు కామధేనువు. వారి కోర్కెల దీర్చునట్టి అవు స్వర్గలోకముననున్నది. కాని ఈ కామధేనువు కమ్పాతీరముననే విహరించుచున్నది. ఈమె ముఖమున చిఱునవ్వు గలదు. (ధేన్వాది పశువులకు నవ్వుండదు). అమ్మవారు మన్మథ వేదప్రక్రియ సంప్రదాయము. మన్మథవేదమనగా శృంగారశాస్త్రము లేక కామశాస్త్రము. ఏమి యెఱుగని సర్వజ్ఞుడైన శివున కాశాస్త్రములోని రహస్యములను నేర్పినది. కావున ఆమె మన్మథవేదప్రక్రియాసంప్రదాయముగా చెప్పబడినది. లేక మన్మథవేదప్రక్రియా సంప్రదాయమనగా కాదివిద్యాజపోపాసనాతరంగ శ్రీచక్రారాధనా ప్రక్రియాసంప్రదాయము. ఆ సంప్రదాయము నెఱుగుటకు తత్ఫలముగా శివత్వ, శివత్వానుభూతి నొందుటకు ఆమె అనుగ్రహమే ముఖ్యము కావున ఆమెయే ఆ సంప్రదాయము అని చెప్పబడినది. మేఘ మనక చాతకాశ్రయ మనుట, చంద్రకల యనక దేవతల ఆహారభాగమనుట, స్తనమండల మనక దేవతల నిలయమనుట, అమ్మవారనక కామధేనువనుట, మదననిగమ ప్రక్రియా సంప్రదాయ భంగ్యంతరోక్తులు. కావున పర్యాయోక్త్యలంకార మేర్పడియున్నది.

పూర్వార్ధమున **ఆ** 1-11 వర్ణమైత్రి, మూడవపాదమున **క** 1-11 వర్ణమైత్రి, నాలుగవపాదమున **మ** 1-5 వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు శృంగారశాస్త్రప్రక్రియాసంప్రదాయముగా చెప్పబడినది. ఈ శ్లోకమున ప్రీతిహేతుభూతములైన అమ్మవారి కటాక్షములు వర్ణింపబడుచున్నవి.

**శ్లో॥ ఆర్ద్రీభూతైరవిరలకృపైరాత్తలీలావిలాసై-**
**రాస్థాపూర్ణైరధికచపలైరఞ్చితామ్భోజశిల్పైః**

కాన్తై ర్లక్ష్మీలలితభవనైః కాన్తికైవల్యసారైః
కాశ్మల్యం నః కబలయతు సా కామకోటీ కటాక్షైః॥ 71

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| ఆర్ద్రీభూతైః | = | తడిసియున్న; |
| అవిరలకృపైః | = | సాంద్రమైన కరుణగల; |
| ఆత్తలీలావిలాసైః | = | పొందబడిన లీలావిలాసములుగల; |
| ఆస్థాపూర్ణైః | = | ఆస్థతో నిండిన; |
| అధికచపలైః | = | మిక్కిలి చంచలములైన; |
| అంచితాంభోజశిల్పైః | = | పొందబడిన కమలశిల్పముగల; |
| కాంతైః | = | మనోహరములైన; |
| లక్ష్మీలలితభవనైః | = | లక్ష్మియొక్క అందమైన భవనములైన; |
| కాన్తికైవల్యసారైః | = | కాంతియొక్కటే సారముగా గల; |
| కటాక్షైః | = | క్రీగంటి చూపులతో; |
| కామకోటీ | = | కామముయొక్క పరాకాష్ఠ అగ్రము (అమ్మవారు); |
| నః | = | మనయొక్క; |
| కాశ్మల్యమ్ | = | మాలిన్యమును; |
| కబలయతు | = | మ్రింగివేయుగాక! |

**తాత్పర్యము:-**

తడిసియున్న సాంద్రమైన కరుణగల, లీలావిలాసములుగల, ఆస్థతో నిండిన మిక్కిలి చంచలములైన కమలశిల్పములా యున్నట్లున్న మనోహరములైన లక్ష్మీదేవియొక్క అందమైన భవనములైన, కాన్తియొక్కటే సారముగా గల ఆ కామకోటి యను పేరుగలిగిన అమ్మవారు మనలోని మాలిన్యమును పోగొట్టుగాక!

**వివరణము :-**

తల్లికి తన సంతానము స్మృతికి రాగానే కన్నులు చెమ్మగిల్లును. సంసార దుఃఖములలో వ్రేగుచున్న తన బిడ్డలను చూచి ఆమె కన్ను లార్ద్రము లగుటలో వింత లేదు. అందుచేత ఆరంభముననే మాతృవాత్సల్యసూచకమైన **ఆర్ద్రీభూతైః** అను విశేషణము ప్రయోగింపబడినది. ఆ ఆర్ద్రీభావమునకు హేతువు వాత్సల్యముతో పాటు దుఃఖితుల పట్ల ఉండు జాలి కూడ పుష్కలముగా నున్నదని తెలుపుటకు **అవిరలకృపైః** అను విశేషణము ప్రయోగింపబడినది. దుఃఖితులైన బిడ్డల పట్ల వాత్సల్య కరుణలు గల దమ్మవారు అని రెండు విశేషణములచే సూచించి, ఆ భర్త తన కొంగు పట్టుకొని చుట్టు తిరుగునట్లు చేసినవని చెప్పుటకు లీలావిలాసములను సంతరించుకొన్నవి అను అర్థమిచ్చు **ఆత్తలీలావిలాసైః** అను విశేషణము ప్రయోగింపబడినది. ఆ చూపులు శివుని చూచుటలో

ఆస్థ అనగా నిష్ఠ కలిగియున్నవని చెప్పుటకు **ఆస్థాపూర్ణైః** అను విశేషణము ప్రయోగింపబడినది. శివుని చూచుటకు నిష్ఠ కలవై యున్నను ఆ చూపులు సిగ్గుతో ప్రక్కకు త్రిప్పుకొని ఆ శివుని చూచు ఆసక్తిని వీడజాలక చూచుచు మరల త్రిప్పుకొనుచు, మరల నేలపై చూచుచు అని చంచలత్వము కలిగియున్నవని చెప్పుటకు **అధికచపలైః** అను విశేషణము ప్రయోగింపబడినది. ఆ చూపులలో కమలముల శిల్పము లున్నవా యనిపించునని చెప్పుటకు **అంచితామ్భోజశిల్పైః** అను విశేషణము ప్రయోగింపబడినది. లక్ష్మి కమలాలయ కావున కమలముల శిల్పము కలిగి కమలములే యనిపించుచున్నందున ఆమె చూపుల వీడజాలక అచటనే నివసించుచున్నది. అందుచేత అమ్మవారి చూపులే భక్తులపై సోకిన వారి యిండ్లు సంపదలకు నిలయములై పోవుచున్నవని తెలుపుటకు **లక్ష్మీలలితభవనైః** అను విశేషణము ప్రయోగింపబడినది. ఆ కటాక్షములు కాంతి కైవల్యసారములు. వాని కాంతి సోకిన భక్తులకు అమ్మవారితో (శివునితో) కైవల్యము కలుగును. ఇదియే **కాంతికైవల్యసారైః** అను విశేషణముచే తెలియవలసిన అర్థము. అట్టి కటాక్షములతో ఆ అమ్మవారు మాలిన్యమును అనగా అజ్ఞానాంధకారమును నశింపజేయుటకవి కాన్తి కైవల్యసారములు. అనగా కాంతియే స్వరూపముగా కలవి కావున మన అజ్ఞానమును తొలగించుగాక!

పూర్వార్ధమున రెండు పాదములలో 1-5-11 **అ** వర్ణమైత్రి, ఉత్తరార్ధమున 1-11 క వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున క్రీగన్నులతో మాలిన్య వినాశ మర్థింపబడినది. ఈ శ్లోకమున చంచల నయనములతో మన్మథుని పతాకను కదిలించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆధున్వత్యై తరలనయనైరాఙ్గజీం వైజయన్తీ-**
**మానన్దిన్యై నిజపదజుషామాత్తకాఞ్చీపురాయై।**
**అస్మాకీనం హృదయమఖిలైరాగమానాం ప్రపఞ్చై**
**రారాధ్యాయై స్పృహయతితరామాదిమాయై జనన్యై॥ 72**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| తరలనయనైః | = | చంచలములైన కన్నులతో; |
| ఆంగజీమ్ | = | మన్మథునికి చెందిన; |
| వైజయన్తీమ్ | = | పతాకను; |
| ఆధున్వత్యై | = | బాగుగా కదలించుచు; |
| ఆత్తకాంచీపురాయై | = | స్వాధీన పఱచుకొనబడిన కాంచీపురము గల; |
| నిజపదజుషామ్ | = | తన పాదముల నాశ్రయించిన వారికి; |
| ఆనందిన్యై | = | ఆనందమును కలిగించుచున్న; |

| | | |
|---|---|---|
| అఖిలైః | = | అన్ని; |
| ఆగమానామ్ | = | ఆగమములయొక్క; |
| ప్రపంచైః | = | సమూహములచేత; |
| ఆరాధ్యాయై | = | పూజింపదగిన దానికొఱకు; |
| అస్మాకీనమ్ | = | మాకు సంబంధించిన; |
| హృదయమ్ | = | హృదయము; |
| స్పృహయతితరామ్ | = | ఎక్కువగా కోరుకొనుచున్నది. |

**తాత్పర్యము:-**

చంచలనేత్రములతో మన్మథుని పతాక నూపుచున్న, కాంచీపురము నందుండి తన పాదముల నాశ్రయించిన వారి కానందమును కలిగించు, సమస్తాగమసమూహములచే ఆరాధింపదగిన ఆదిమజననికై మా హృదయ మారాటపడుచున్నది.

**వివరణము :-**

మన్మథుని పతాక నూపుట యనగా ఆతని విజయమును ప్రకటించుట. గెలిచిన వారు జండా నూపుట లోక ప్రసిద్ధము. అమ్మవారట్లు చేసి శివుని కంటిమంటతో కాలిన మన్మథుడు చావలేదు, పైగా శివునోడించినాడు, శివుని హృదయమునే గెలిచి కొన్నాడని ప్రకటించినది. సమస్తాగమసమూహము లామె వైభవమునే కొనియాడుచున్నవి. ఆరాధ్య పదమిట్లు కొనియాడుట వాఙ్మయపూజ అను అంశమును వ్యంజించుచున్నది. ఆదిమజనని అనుటచే నామెకు మరొక తల్లి లేదని అందఱకును ఆమెయే తల్లియనియు వ్యంజించును. నాలుగు పాదములలో 1-11 ఆ వర్ణమైత్రి గలదు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు అందఱకు తల్లియని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె శివునకు మాత్రము భార్యయని చెప్పబడుచున్నది.

**శ్లో॥ దూరం వాచాం త్రిదశసదసాం దుఃఖసిన్ధోస్తరిత్రమ్**
**మోహక్ష్వేళక్షితిరుహవనే తీక్ష్ణధారం కుఠారమ్।**
**కమ్పాతీరే ప్రణయకవిభిర్వర్ణితోద్యచ్చరిత్రం**
**శాన్త్యై సేవే సకలవిపదాం శాఙ్కరం తత్కళత్రమ్॥ 73**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| వాచామ్ | = | వాక్కులకు; |
| దూరమ్ | = | దూరమైనది; |
| త్రిదశసదసామ్ | = | దేవసమూహములయొక్క; |
| దుఃఖసింధోః | = | దుఃఖమను సముద్రముయొక్క; |
| తరిత్రమ్ | = | నావ; |

| | | |
|---|---|---|
| మోహక్ష్వేళక్షితిరుహవనే | = | మోహమను విషవృక్షవనమునందు; |
| తీక్ష్ణధారమ్ | = | వాడి యంచుగల; |
| కుఠారమ్ | = | గొడ్డలి; |
| కమ్పాతీరే | = | కమ్పానదీతీరమున; |
| ప్రణయకవిభిః | = | ప్రేమగల కవులచేత; |
| వర్ణితోద్యచ్చరిత్రమ్ | = | వర్ణింపబడిన గొప్ప చరిత్రగల; |
| శాంకరమ్ | = | శంకరునికి చెందిన; |
| తత్ | = | ఆ ; |
| కళత్రమ్ | = | భార్య(అమ్మవారు)ను; |
| సకలవిపదామ్ | = | అన్ని ఆపదలయొక్క; |
| శాంత్యై | = | శాంతికొఱకు; |
| సేవే | = | సేవించెదను. |

**తాత్పర్యము:-**

వాక్కుల కందనిది, దేవగణములను దుఃఖసముద్రమునుండి తరింపజేయు నావయైన, మోహమను విషవృక్షవనమును ఛేదించు వాడి అంచుగల గండ్రగొడ్డలియైన, కమ్పానదీతీరమున ప్రేమగలదియైన, కవులచే వర్ణింపబడిన గొప్ప చరిత్ర గల, శంకరుని భార్యయైన ఆ అమ్మవారిని సర్వాపదల శాంతికై సేవించెదను.

**వివరణము :-**

**జాతి గుణము క్రియ ద్రవ్యము సంజ్ఞ** అను ప్రవృత్తి నిమిత్తము లున్నప్పుడే శబ్దము అవి కలిగిన వస్తువును బోధించగలదు. అమ్మవారవి యేవి లేని వస్తువు. కావున ఆమె వాక్కులకు దూరము. రాక్షసాదులవలన దేవతలకు నా దుఃఖము సముద్రమంత యున్నది. దానిని వారు స్వయముగా దాటలేరు. అమ్మవారి నాశ్రయింపగా ఆమె పడవవలె వారిని దుఃఖసముద్రముయొక్క యావలి యొడ్డునకు చేర్చును. ఇది ప్రథమపాద వివరణము. చెట్లను ఛేదించ గూడదు. అది పాపకార్యము. వానిని నాటుట పుణ్యకార్యము. కాని విషమును వ్యాపింపజేయు వృక్షములను ఛేదించుట పాపము కాదు. పైగా అది పుణ్యకార్యము. అందుచే అమ్మవారు మోహవిషవృక్షవనమును ఛేదించుటలో శివుని చేతి గండ్రగొడ్డలి యైనది. ఇది ద్వితీయపాదవివరణము. అమ్మవారు నావగా, కుఠారముగా రూపింపబడుటచే పూర్వార్ధమున రెండు పాదములలో రెండు రూపకాలంకారము లేర్పడి యున్నవి. మొదటి పాదమున 1-11 దు వర్ణమైత్రి ఉన్నది. మూడవపాదమున అమ్మవారి చరిత్రమును కవులు వర్ణించెదరని చెప్పబడినది. అమ్మవారి సేవ సకలాపచ్ఛాన్తికరమని నాల్గవ పాదమున చెప్పబడినది. ఇందు 1-11 శాం వర్ణమైత్రి ఉన్నది. తీక్ష్ణధార, కుఠారధార శబ్దములలో పదాంతానుప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున కుఠారము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున కుఠార కృత్యమైన ఖణ్డనము ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ ఖణ్డీకృత్య ప్రకృతికుటిలం కల్మషం ప్రాతభశ్రీ-**
**శుణ్డీరత్వం నిజపదజుషాం శూన్యతన్ద్రం దిశన్తీ।**
**తుణ్డీరాఖ్యే మహతి విషయే స్వర్ణవృష్టిప్రదాత్రీ**
**చణ్డీ దేవీ కలయతి రతిం చన్ద్రచూడాలచూలీ॥ 74**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| నిజపదజుషామ్ | = | తన పాదముల నొందిన వారియొక్క; |
| ప్రకృతికుటిలమ్ | = | సహజముగా వక్రమైన; |
| కల్మషమ్ | = | పాపమును; |
| ఖణ్డీకృత్య | = | ఖండించి; |
| ప్రాతిభశ్రీశుండీరత్వమ్ | = | ప్రతిభకు సంబంధించిన గొప్ప నైపుణ్యమును; |
| శూన్యతంద్రమ్ | = | సోమరితనము లేకుండ; |
| దిశన్తీ | = | ఇచ్చుచున్న; |
| తుండీరాఖ్యే | = | తుండీరమను పేరు గల; |
| మహతి | = | గొప్పనైన; |
| విషయే | = | దేశమునందు; |
| స్వర్ణవృష్టిప్రదాత్రీ | = | బంగారువానను కురిపించునట్టి; |
| చంద్రచూడాలచూలీ | = | చంద్రుడు భూషణముగాగల, కొప్పుగల; |
| చండీ దేవీ | = | చండీదేవి; |
| రతిమ్ | = | క్రీడను; |
| కలయతి | = | చేయుచున్నది. |

**తాత్పర్యము:-**

తన పాదముల నాశ్రయించిన వారి పాపమును ఖండించిన వారిలో ప్రతిభా సామర్థ్యముల నెల్లప్పుడు ఇచ్చుచున్న తుండీరమండలము అను గొప్ప దేశమున బంగారు వానల కురిపించుచు చంద్రశేఖరయగు చండీదేవి క్రీడించుచున్నది.

**వివరణము :-**

పాపము కలవారు కుటిలముగా ప్రవర్తించెదరు. అందుచే పాపమను మాలిన్యము సహజముగా కుటిలమని చెప్పబడినది. తుండీరమండలము భరత ఖండమునందలి చిన్నదేశమైనను గొప్పదని చెప్పుట మూకకవియొక్క స్వదేశాభిమానమును చాటు చున్నది. ఆ గొప్పదనమునకు కారణము అమ్మవారక్కడ వెలయుట కావచ్చును. అక్కడ అమ్మవారి

అనుగ్రహమున బంగారు వానలు కురియుటచే ఆ దేశసంపద పెఱుగుటయు, ఆ గొప్పదనమునకు కారణము కావచ్చును. చండీదేవి యనగా కోపముగల దేవత. తన భక్తుల పాపమును పోగొట్టి వారిలో ప్రతిభాసామర్థ్యములను సోమరితనములేక యెల్లప్పుడు ప్రసాదించుట విచిత్రము. తాను భూలోకమునకు వచ్చినను తనను చేరుట కిష్టపడని వారి యెడ కోపమామెకు సముచితమే. ప్రథమపాదమున ఖ, క ల వర్ణమైత్రి, రెండవపాదమున శు వర్ణమైత్రి, నాల్గవపాదమున చ వర్ణమైత్రి ఉన్నవి. ద్వితీయ తృతీయ పాదములలో ద్విప్రాసము మొత్తము పద్యమున ప్రాసమును కలవు.



**అవ:-** తాను వసించు ప్రాదేశమున అమ్మవారు బంగారు వానల కురిపించుట పై శ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున తన్ను చేపట్టిన వాని చేతికి బంగారు ధనువునే యొసగుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ యేన ఖ్యాతో భవతి స గృహీ పూరుషో మేరుధన్వా**
**యద్దృక్కోణే మదననిగమప్రాభవం బోభవీతి।**
**యత్ప్రీత్యైవ త్రిజగదధిపో జృమ్భతే కిమ్పచానః**
**కమ్పాతీరే స జయతి మహాన్ కశ్చిదోజోవిశేషః॥ 75**

**ప్రతిపదార్థము :-**

యేన = దేనితో;
సః = ఆ;
పూరుషః = పురుషుడు;
గృహీ = గృహస్థుడు;
మేరుధన్వా = మేరు పర్వతము ధనువుగా గలవాడుగా;
ఖ్యాతః = ప్రసిద్ధుడు;
భవతి = అగుచున్నాడో;
యద్దృక్కోణే = దేని కంటి కొనయందు;
మదననిగమప్రాభవమ్ = మన్మథవేదముయొక్క గొప్పతనము;
బోభవీతి = ఉన్నదో;
యత్ప్రీత్యా+ఏవ = దేని ప్రీతితోడనే;
కింపచానః = ఏమి వండవలెనో అని ఆలోచించువాడు;
త్రిజగదధిపః = మూడు లోకముల ప్రభువై;
జృమ్భతే = విజృమ్భించునో;
సః = ఆ;

| | |
|---|---|
| కశ్చిత్ | = ఒకానొక; |
| మహాన్ | = గొప్ప; |
| ఓజోవిశేషః | = తేజోవిశేషము; |
| కమ్పాతీరే | = కమ్పానదీతీరమున; |
| జయతి | = సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నది. |

**తాత్పర్యము:-**

దేనితో ఆ పురుషుడు గృహస్థుడు, మేరుపర్వతమును ధనువుగా గలవాడుగా ప్రసిద్ధుడగుచున్నాడో, దేని కంటికొనయందు మన్మథవేదముయొక్క గొప్పతనమున్నదో, దేని సంతోషముచేత ఏమి వండవలయునో ఎఱుగని పేదవాడు మూడు లోకముల నాయకుడగుచున్నాడో, ఆ గొప్ప తేజోవిశేషము కమ్పానదీతీరమున సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**వివరణము :-**

అమ్మవారనక భంగ్యంతరముగా **ఓజోవిశేష** మని చెప్పుటచే పర్యాయోక్త్యలంకార మేర్పడినది. శ్లోకమున అమ్మవారి ఆ ఓజో విశేషమున తాను పురుషుడనని యెఱుగని శివుడు, అంగాతీతుడు, పురుషుడైనాడు. ఇల్లు ఇల్లాలుగల గృహస్థుడైనాడు. మేరువు అను పేరగల బంగరు పర్వతమును చేత ధరించినాడు. ఇది ప్రథమపాద బోధ్యము. ఆ అమ్మవారి కంటికొనయందే మన్మథవేద ప్రాభవ మున్నది. అనగా శృంగార సర్వస్వమున్నది. ఇది ద్వితీయపాద బోధ్యము. ఆ పూట కేమి వండవలయునా యని ఆలోచించువాడు అనగా ఇంట బియ్యముండి పప్పులేక, పప్పుండి బియ్యములేక, ఇట్లొకటి ఉండి మరొకటి లేక ఆ పూట ఎట్లు గడపవలెనా అని ఆలోచించువాడు కిమ్పచానుడు. అట్టి నిరుపేద కూడ అమ్మవారి ఓజో విశేషముననే త్రిజగదీశ్వరుడై విజృమ్భించును. ఇది ఆ ఓజో విశేషముయొక్క గొప్పతనము. ఇది తృతీయపాద బోధ్యము. ఆ ఓజోవిశేషమని చెప్పదగిన అమ్మవారు కమ్పానదీతీరముననే దర్శనీయమై యున్నది. ఇది చతుర్థపాద బోధ్యము. నాలుగవ పాదమున **క** వర్ణమైత్రి యున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి అనుగ్రహపాత్రుడు ఇంద్రపదవి నలంకరించు నని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె అనుగ్రహపాత్రుడై ఆకాశగంగాసదృశ కవితాధార కలవాడు కావలెనను కవి కోర్కె చెప్పబడుచున్నది.

**శ్లో॥ ధన్యాధన్యా గతిరిహ గిరాం దేవి! కామాక్షి! కా మే**
**నిన్ద్యామ్ భిన్ద్యాత్సపది జడతాం కల్మషాదున్మిషన్తీమ్।**
**సాధ్వీ మాధ్వీరసమధురతాభఞ్జినీ మఞ్జురీతి-**
**ర్వాణీవేణీ ఝటితి వృణుతాత్ స్వర్ధునీస్పర్ధినీ మామ్॥ 76**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కామాక్షి!దేవి! | = | ఓ కామాక్షీదేవీ! |
| మే | = | నాయొక్క; |
| గిరామ్ | = | వాక్కులయొక్క; |
| గతిః | = | గతి; |
| ఇహ | = | ఇచట; |
| ధన్యా | = | ధన్యయా; |
| అధన్యా | = | అధన్యయా; |
| ధన్యాధన్యా | = | మిక్కిలి ధన్యయే; |
| మే | = | నాయొక్క; |
| కల్మషాత్ | = | పాపమునుండి; |
| ఉన్మిషన్తీమ్ | = | వికసించుచున్న; |
| నిన్ద్యామ్ | = | నిందింపదగిన; |
| జడతామ్ | = | జాడ్యమును; |
| కా | = | ఎవతె; |
| సపది | = | శీఘ్రముగా; |
| భిన్ద్యాత్ | = | తొలగించును; |
| కా | = | పరబ్రహ్మస్వరూపిణి; |
| సాధ్వీ | = | చక్కనిదైన; |
| మాధ్వీరసమధురతాభంజనీ | = | తేనె తీపిని భంజించు; |
| మంజురీతిః | = | అందమైన; |
| స్వర్ధునీస్పర్ధినీ | = | ఆకాశగంగతో పోటీపడు; |
| వాణీవేణీ | = | వాఙ్నది; |
| మామ్ | = | నన్ను; |
| ఝటితి | = | శీఘ్రముగా; |
| వృణుతాత్ | = | వరించుగాక! |

**తాత్పర్యము:-**

అమ్మా! కామాక్షీదేవీ, నా వాక్కులగతి ధన్యమా, అధన్యమా, అను ప్రశ్నకు అతి ధన్యమని నా యుత్తరము. ఎవతె పాపమునుండి వికసించు నింద్యమైన జాడ్యమును తొలగించునను ప్రశ్నకు పరబ్రహ్మస్వరూపిణి అనియే నా యుత్తరము. తేనె తీపిని భంజించు అందమైన రీతిగల ఆకాశగంగతో పోటీపడు వాఙ్నది నన్ను వరించుగాక!

**వివరణము :-**

కించిదన్వయ భేదమునను కొన్ని పదముల ఆవృత్తి చేతనే ప్రశ్నోత్తరము లిచటనే

ఏర్పడుచున్నవి. ఇట్టి రచన ప్రహేలికాప్రాయము. ధన్యా ధన్యా, నిన్యామ్ భిన్యాత్, స్వర్ధునీ స్పర్ధినీ, వాణీవేణీ, సాధ్వీ మాధ్వీ, భంజనీ మంజురీతి, కల్మషా దున్మిషన్తీ, కామాక్షి కామే, ఇత్యాది పద ద్వంద్వములలో వృత్త్యనుప్రాస మున్నది. నాలుగవ పాదమున 1-11 వ వర్ణమైత్రి ఉన్నది. పూర్వార్ధమున అమ్మవారిని చెప్పజాలకున్నను అమ్మవారిని చెప్పుటకు ప్రయత్నించు వాక్కులే అతి ధన్యములని అమ్మవారనుగ్రహించిన, పాపమునుండి జనించు జాడ్యమును తొలగించి జ్ఞానమును ప్రసాదించుననుట బోధ్యాంశము. ఉత్తరార్ధమున తన వాక్కు నటివంటిదే. కాని దానికి ఆకాశగంగవంటి వేగములేదని అది కావలెనను కవియొక్క కోరిక తెలియజేయబడినది. ఆకాశగంగకు తేనెతీపిని భంజించు మంజురీతి లేదు. కాని తన కవిత కుండవలెనని ఆకాశగంగాతిశయము కూడ కోరబడుట విశేషము.



**అవ:-** పై శ్లోకమున ఆకాశగంగ సదృశ వాగ్ధాటి కావలెనను విశేషమైన కోర్కె కోరబడినది. ఈ శ్లోకమున సామాన్యముగా కోర్కెలు తీరవలెనని కోరబడుచున్నది.

**శ్లో॥ యస్యా వాటీ హృదయకమలం కౌసుమీ యోగభాజాం**
**యస్యాః పీఠీ సతతశిశిరా శీకరైర్మాకరన్దైః।**
**యస్యాః పేటీ శ్రుతిపరిచలన్మౌళిరత్నస్య కాఞ్చీ**
**సా మే సోమాభరణమహిషీ సాధయేత్కాంక్షితాని॥ 77**

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| యస్యాః | = | ఎవతెకు; |
| యోగభాజామ్ | = | యోగుల; |
| హృదయకమలమ్ | = | హృదయ కమలమే; |
| కౌసుమీ | = | పూలకు సంబంధించిన; |
| వాటీ | = | తోటయో; |
| యస్యాః | = | ఎవతెయొక్క; |
| పీఠీ | = | పీఠము; |
| మాకరన్దైః | = | మకరందమునకు చెందిన; |
| శీకరైః | = | తుషారములచేత; |
| సతతశిశిరా | = | ఎల్లప్పుడు చల్లనిదో; |
| యస్యాః | = | ఎవతెకు; |
| కాంచీ | = | కాంచీనగరము; |
| శ్రుతిపరిచలన్మౌలిరత్నస్య | = | వేదముల చలించు తల యందలి రత్నమునకు; |
| పేటీ | = | పెట్టెయో; |
| సా | = | ఆ; |

| | | |
|---|---|---|
| సోమాభరణమహిషీ | = | శివుని పట్టపురాణి; |
| మే | = | నాయొక్క; |
| కాంక్షితాని | = | కోర్కెలను; |
| సాధయేత్ | = | తీర్చుగాక! |

**తాత్పర్యము:-**

ఎవతెకు యోగుల హృదయకమలమే పుష్పవాటికయో, ఎవతెయొక్క పీఠము మకరందపు చినుకులతో చల్లనై యుండునో, ఎవతెకు వేదములలో తిరుగు మౌళిరత్నము యొక్క పెట్టె కాంచీనగరమో, ఆ సోమశేఖరుని మహిషి నా కోరికల దీర్చు గాక!

**వివరణము:-**

మూలాధారాది కమలము లన్నింటిలోన ఆయా సంప్రదాయాల ననుసరించి అమ్మవారు ఉపాస్యగా ఉన్నను హృదయకమలమందే ప్రధానముగా అధికముగా ఉపాస్య యనుట ప్రసిద్ధమే. ఈ ఆఱు కమలములలో ముఖ్యముగా హృదయకమలములో అమ్మవారు విహరించుననుట పై ప్రసిద్ధిని పురస్కరించుకొన్నదే. ఈ శ్లోకమున ప్రథమపాదమున **హృదయకమల** శబ్ద మేకవచనమే యైనను అది జాత్యేకవచనము. యోగులందఱకు ఒక హృదయ కమల ముండదు గదా! యోగుల హృదయకమలములన్నియు ఆమె పూదోటగా రూపింపబడుటచే రూపకాలంకారమేర్పడి యున్నది. రెండవపాదమున ఆమెయొక్క పీఠము మకరందపుచినుకులతో చల్లనై యున్నదని చెప్పుటచే ఆమె పాదపీఠము కూడ ఒక కమలమే అని భంగ్యంతరము చెప్పినట్లైనందున పర్యాయోక్త్యలంకార మేర్పడి యున్నది. మూడవపాదమున శ్రుతుల (వేదముల)ను స్త్రీల మౌళులనగా ఉపనిషత్తులు, వానిలోని రత్న మనగా అమ్మవారు. కాంచీనగర మమ్మవారి నివాసమనుట చేత రత్నము దాచుటకు పెట్టె నుపయోగించుట లోకప్రసిద్ధము. కావున కాంచీ నగరము పెట్టెగా రూపింపబడినందున రూపకాలంకార మేర్పడియున్నది. అమ్మవారను రత్నము శ్రుతి శిరస్సులలో అనగా ఉపనిషత్తులలో వెదుకగా లభించునది. దానిని బహుశః శివుడో యోగులో జ్ఞానులో తీసికొని వచ్చి కాంచీనగరమను పెట్టెలో దాచియుంచి యుండ వచ్చుననుట ఇట వ్యంగ్యమగు అర్థము. మొదటి మూడు పాదములలో తమిళ లేఖన సంప్రదాయము ననుసరించి నాలుగవ అక్షరము ప్రాసముగా నున్నట్లు చెప్పవచ్చును. నాల్గవపాదమున 1-11 స వర్ణమైత్రి యున్నది. సా మే సోమా అనుటలో వృత్త్యను ప్రాసమున్నది.



**అవ:-** పై శ్లోకమున యోగు లమ్మవారి నుపాసించుట అనగా ధ్యానించుట చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారే ధ్యానముద్ర కలిగి యున్నట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఏకా మాతా సకలజగతామేయుషీ ధ్యానముద్రా-**
**మేకామ్రాధీశ్వరచరణయోరేకతానా సమిన్ధే।**

**తాటఙ్కోద్యన్మణిగణరుచా తామ్రకర్ణప్రదేశా**
**తారుణ్యశ్రీస్తబకితరుచా తాపసీ కాపి బాలా॥ 78**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| సకలజగతామ్ | = | అన్ని లోకములకు; |
| ఏకా | = | ఒక; |
| మాతా | = | తల్లియైన; |
| ఏకామ్రాధీశ్వరచరణయోః | = | ఏకామ్రేశ్వరుని చరణముల యందు; |
| ఏకతానా | = | ఏకాగ్రత కలదై; |
| ధ్యానముద్రామ్ ఏయుషీ | = | ధ్యానముద్రను పొందినదై; |
| తాటంకోద్యన్మణిగణరుచా | = | కమ్మలలోని మణి సమూహములకాంతితో; |
| తామ్రకర్ణప్రదేశా | = | ఎఱ్ఱబారిన చెవుల ప్రాంతములుగల; |
| తారుణ్యశ్రీస్తబకితరుచా | = | యౌవన సంపద గుత్తులుగా మారిన కాంతి గల; |
| తాపసీ | = | తాపసియైన; |
| కా+అపి | = | ఒకానొక; |
| బాలా | = | బాలిక; |
| సమిన్ధే | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

సర్వలోకములకు తల్లియైన, ఏకామ్రేశ్వరుని చరణకమలములందు ఏకాగ్రతతో ధ్యానముయొక్క ముద్రను పొందిన, తాటంకములలోని మణుల సమూహముల కాంతితో ఎఱ్ఱబడిన చెవుల ప్రాంతములుగల, యౌవనసంపద గుత్తులుగా కనబడు కాంతిగల ఒకానొక తాపసబాలిక ప్రకాశించుచున్నది.

**వివరణము :-**

అమ్మవారే సకల జగములకు తల్లి. జగము లనేకములు. వాని తల్లియొక్కటే. ఆమె రెండు పాదములందేకాగ్రత కలిగి యున్నది. అవి ఒక్కడైన ఏకామ్రేశ్వరునిదే. ఆమ్రములనగా మామిడి చెట్లు. వానిలో నొక మామిడి చెట్టు వానికి ప్రభువుగా నున్నట్లున్నది. దాని మూలమున నొక శివలింగ మున్నది. అన్ని ఆమ్రముల మూలములలో లేకపోవుటచే ఆ ఆమ్రము తన మూలముననకే ఈశ్వరుడుండుటచే తానే ఆమ్రేశ్వరుడననుకొనుచున్నదేమో, ఏమైన నేమి? ఆ శివలింగమే ఏకామ్రేశ్వరనామమున ప్రసిద్ధికెక్కినది. ఒక ఈశ్వరుని అవయవములైన రెండు చరణములలో ఏకాగ్రత కలిగి యున్నదనగా ఒక ఈశ్వరు నుండి జనించిన సకలజగములలో నేకత్వమును దర్శించిన దన్నమాట. ద్వైతముగా కనబడినను దాని నద్వైతముగానే భావించుట **ఏకతానధ్యానముద్ర.** దానిలో జ్ఞానములు పెక్కులున్నను అవి తైలధారవలె ఏకధారగా ఏకముగా రూపొందుటలో

ఏకతాన ధ్యానముద్ర యేర్పడినది. ఆమె చిత్తమున కూడ ఆ రెండు చరణములు ఒక ఈశ్వరరూపముననే సాక్షాత్కరించినవి. అవయవ భేదము అకించిత్కరమై తనయొక్క ఆత్మ, ఈశ్వరునిలో పరమాత్మ రెండును ఏకరూపములై గోచరించినవను వ్యంగ్య మిచట భాసించుచున్నది. పూర్వార్ధములోని ఏక శబ్దముయొక్క బహువారావృత్తి ఈ వ్యంగ్యభావనమునకు హేతువు. అమ్మవారి తాటంకములలో మణుల కాంతి ప్రసరించుటచే ఆమె రెండు కర్ణప్రాంతము లెఱ్ఱ బారినవి. రుచా శబ్దముతో ముగిసిన ఈ సమాసము తృతీయాంతము. రుచా శబ్దముతో ముగిసిన మరొక సమాసము ప్రథమాంతము. ఒకటి తాటంకమణికాంతిని బోధించుచు, మరొకటి యౌవనకాంతిని బోధించును. యౌవనపు పూగుత్తులు స్తనములు. గుత్తులుగా మారిన అను అర్థమిచ్చు స్తబకిత శబ్దము స్తనద్వయమును వ్యంజించును. స్తనములు రెండైనను యౌవన మొక్కటే. ఆ యౌవనమే ప్రకాశించుచున్నదని ఉత్తరార్ధ వ్యంగ్యము. పూర్వార్ధమున ఏ వర్ణమైత్రి, ఉత్తరార్ధమున **తా** వర్ణమైత్రి కూర్చబడినవి. బహుత్వమును బోధించు సకల శబ్దము, ద్విత్వమును బోధించు చరణశబ్దగత ద్వివచనము (త్రైలాదులన్నియు బహుత్వములే యని వానికి మూలము ద్వైతమే) యని త్రైతమువలె ద్వైతము కూడ అనేకమే. కావున ద్వైతము తొలగిన బహుత్వమును తొలగి ఏకత్వమనబడు అద్వైతసిద్ధి కలుగుననుట సూచించుచున్నవి.



**అవ:-** పై శ్లోకమున స్తబకిత శబ్దమున వ్యంజింపజేయబడిన **స్తనద్వయము** చెప్పబడినది. ఈ శ్లోకమున **మనసిజవృక్షాంకురద్వయము**గా చెప్పబడుచున్నది.

**శ్లో॥ దన్తాదన్తిప్రకటనకరీ దన్తిభిర్మన్దయానై-**
**ర్మన్దారాణామ్మదపరిణతిమ్మథ్నతీ మన్దహాసైః।**
**అఙ్కూరాభ్యామ్మనసిజతరోరఙ్కితోరాః కుచాభ్యా-**
**మన్తఃకాఞ్చి స్ఫురతి జగతామాదిమా కాపి మాతా॥ 79**

**ప్రతిపదార్థము :-**

మందయానైః = మెల్లని నడకలతో;
దంతిభిః = ఏనుగులతో;
దన్తాదన్తిప్రకటనకరీ = దన్తాదన్తి(యుద్ధము) యొక్క ప్రకటనమును చేయు;
మందహాసైః = చిఱునవ్వులతో;
మందారాణామ్ = మందారములయొక్క;
మదపరిణతిమ్ = మద పరిణామమును;
మథ్నతీ = నశింపజేయుచున్న;
మనసిజతరోః = మన్మథవృక్షముయొక్క;
అంకూరాభ్యామ్ = అంకురములైన;

కుచాభ్యామ్ = కుచములతో;
అంకితోరాః = చిహ్నితమైన ఱొమ్ముగల;
జగతామ్ = జగత్తులయొక్క;
కా+అపి = ఒకానొక ;
ఆదిమా = తొలి;
మాతా = తల్లి;
అంతఃకాంచి = కాంచీనగరము లోపల;
స్ఫురతి = ప్రకాశించుచున్నది.

**తాత్పర్యము:-**

అమ్మవారు తన మందయానములతో ఏనుగులతో దన్తాదన్తియుద్ధమును ప్రకటించుచున్నది. తన మందహాసములతో మందారముల మదపరిణామ గర్వమును నశింపజేయుచున్నది. మన్మథవృక్షముయొక్క అంకురములైన స్తనములతో ఆమె యురము చిహ్నితమై యున్నది. జగముల తొలి తల్లియైన ఆమె కాంచీనగరము లోపల ప్రకాశించుచున్నది.

**వివరణము :-**

ఇరువురు వ్యక్తులు తమ దన్తములతో పరస్పరము కొఱకుకొనుచు చేయు యుద్ధము **దన్తాదన్తి** యనబడును. అమ్మవారు తన మందయానములతో (దన్తులనగా ఏనుగుల నోడించుట అనగా ఏనుగులను మించిన మందయాన సౌందర్యమును గలిగి యుండుట) దన్తాదన్తి యుద్ధప్రకటనముగా సంభావింపబడుటచే నీ ప్రథమపాదమున నుత్ప్రేక్షాలంకార మేర్పడియున్నది. ద్వితీయపాదమున మందహాసములతో మందారముల మదపరిణామమైన గర్వమును మథించుచున్న దనుటలో ఉపమానములైన మందారముల తిరస్కార ముండుటచే ప్రతీపాలంకార మేర్పడియున్నది. అమ్మవారి స్తనములు మన్మథ వృక్షముయొక్క అంకురములా యన్నట్లున్నవను సంభావనము మూడవ పాదమున వాచ్యమైన రూపకాలంకారము వ్యంగ్యమగుచున్నది. నాల్గవపాదమున అట్టి అమ్మవారు త్రిలోకములకు మాతయని కాంచీనగరము లోపల నుండుటచే కాంచీనగరి యామెను తల్లివలె గర్భమునవలె దాచుకొన్నను ఆమె జగన్మాతృత్వమున కేమి లోటు వాటిల్లదని **స్ఫురతి** అను క్రియాపదము, అంతఃకాంచి అను సమాసములోని అంతఃశబ్దము వ్యంజించుచున్నది. దన్తి శబ్ద మర్థ భేదమున ప్రయోగింపబడినందువలన యమకాలంకారమను శబ్దాలంకార మేర్పడియున్నవి. ప్రథమపాదము చివఱ పదమునందలి మంద శబ్దము, మందార శబ్దము, ద్వితీయపాదము చివఱి మందహాసమును వృత్త్యనుప్రాసము అను శబ్దాలంకారమును కలిగించుచున్నవి. ప్రథమపాదమున **ద** వర్ణమైత్రి యున్నది. ద్వితీయపాదమున పదము లన్నియు **మ**కారాదులై శబ్దసౌభాగ్యమును కలిగించుచున్నవి. ఉత్తరార్ధమున **అ** కార వర్ణమైత్రి కూర్పబడినది.



**అవ:-** గడచిన మూడు వింశతులలో వింశతి కొక వృత్తము చొప్పున శ్లోకములున్నవి. మొదటివింశతిలో మాత్రము పందొమ్మిది శ్లోకములే యున్నవి. రాబోవు వింశతియందు భిన్న వృత్తములు ప్రయోగింపబడినవి. కవియొక్క సంఖ్యా ప్రణాళిక ననుసరించి యొక శ్లోకము రాలి పోయి యుండునని భావింపవచ్చును. ఏమైనను 18 పృథ్వీ వృత్తములు, వాని తరువాత నాలుగయిదు భిన్న వృత్తములతో చివఱి భాగమున్నది. ముందుగా పృథ్వీ వృత్త మారంభింపబడుచున్నది. పై శ్లోకమున కల్పితమైన అమ్మవారి మందయానముయొక్క దంతులతోడి దన్తాదన్తి యుద్ధ విహారము వర్ణింపబడినది. ఈ శ్లోకమున పురాణ ప్రసిద్ధమైన బహువిధ విహారము వర్ణింపబడుచున్నది.

**శ్లో॥** **త్రియమ్బకకుటుమ్బినీం త్రిపురసున్దరీమిన్దిరాం**
**పులిన్దపతిసున్దరీం త్రిపురభైరవీం భారతీమ్।**
**మతఙ్గకులనాయికామ్మహిషమర్దినీమ్మాతృకాం**
**భణన్తి విబుధోత్తమా విహృతిమేవ కామాక్షి! తే॥** **80**

**ప్రతిపదార్థము :-**

త్రియంబకకుటుంబినీమ్ = ముక్కంటి భార్యగా;
త్రిపురసుందరీమ్ = త్రిపురసుందరిగా;
ఇందిరామ్ = లక్ష్మిగా;
పులిందపతిసుందరీమ్ = కిరాతపతి భార్యగా;
త్రిపురభైరవీమ్ = త్రిపుర భైరవిగా;
మతంగకులనాయికామ్ = మాతంగకులమునకు నాయికగా;
భారతీమ్ = భారతిగా;
మహిషమర్దినీమ్ = మహిషుని సంహర్త్రిగా;
మాతృకామ్ = మాతృకగా;
విబుధోత్తమాః = ఉత్తమవిద్వాంసులు;
కామాక్షి = ఓ కామాక్షీ దేవీ;
తే = నీయొక్క;
విహృతిమ్ ఏవ = విహారమునే;
భణన్తి = పలుకుచున్నారు.

**తాత్పర్యము:-**

విద్వాంసులు నీయొక్క విహారమునే పలుకుచున్నారు ఓ కామాక్షీదేవీ!

**వివరణము:-**

1) నామరూప రహిత పరబ్రహ్మము శివశక్తులుగా ద్విధాభావము నందినది. శివుడు త్ర్యంబకుడు. శక్తి ఆయన భార్య. వినాయక, కుమారులు కుమారులు. కైలాసమున

ఆ కుటుంబము నివసించును. శివుడు కుటుంబి, కాగా శక్తి కుటుంబిని యైనది. ఇది ఆమె ప్రథమ విహారము. 2) ఆమె త్రిపురసుందరి. త్రిపురములనగా స్థూలసూక్ష్మకారణ శరీరములు. శక్తియే త్రిపురములుగా వానిలో నివసించు చేతనగానున్నది. అందుచేత ఆమె **త్రిపురసుందరి** యనబడినది. సుందరి కొఱకే త్రిపురములు. సుందరికే ప్రాధాన్యము. ఆమె కొఱకు రుద్రుడు త్రిపురసంహార మొనర్చినాడు. వానిలోని సుందరితో తాదాత్మ్య భావము నంది శివుడైనాడు. సర్వవ్యాప్తచైతన్యమును త్రిపురములు కారాగారములై బంధించినవి. సాధకుడు జ్ఞానాగ్నిచే త్రిపురములను స్థూలసూక్ష్మకారణ శరీరములను కాల్చి సుందరుడైనాడు. శివుడైనాడు. కారణశరీరమను పేరే అజ్ఞానముయొక్క కారణత్వమును తెలుపుచున్నది. మిగిలిన స్థూల సూక్ష్మ శరీరములు కార్యము లైనను కారణముచే వ్యాప్తములైన హేతువుచేత కారణమైన అజ్ఞానముయొక్క నాశము కలుగగానే కార్యములైన సూక్ష్మస్థూల శరీరములు నశించినవి. త్రిపుర దాహము పూర్తియైనది. జీవుని మాలిన్యము తొలగి సౌందర్యము కలవాడైనాడు. సౌందర్యమే శబ్దమున లింగభేదమున సుందరుడు, సుందరి అని పిలవబడినను అర్థమున భేదము లేదు. బ్రాహ్మణపరివ్రాజక న్యాయమున త్రిపురములు కాలగా మిగిలినదగుటచే భూతకాలోపాధివ్యవహారమున మిగులగా ఆమె త్రిపుర సుందరియైనది. 3) ఆమె ఇందిర. ఇది ధాతువు నుండి ఏర్పడినది. ఈ శబ్దము పరమైశ్వర్యవంతురాలు అను అర్థమును బోధించును. నిఘంటువు లిందిర యనగా లక్ష్మి యను నర్థమును బోధించును. శాక్తేయగ్రంథము సప్తశతి ఆద్యమహా లక్ష్మి నుండి గౌరీలక్ష్మీభారతులుగా స్త్రీ రూపమును, రుద్రనారాయణబ్రహ్మలుగా పుంరూపమును బొంది మూడు జంటలుగా ఏర్పడి లోకసృష్టి స్థితి లయముల నొనర్చుచున్నట్లు చెప్పినది. కావున మహాలక్ష్మి ఆదిశక్తియే. లక్ష్మియు నామె నుండి ఏర్పడినందున తన్మయియే 4) ఆమె పులిన్ధసతిసుందరి. అర్జునుని తపఃస్థైర్యమును పరీక్షించుటకు శివుడు పులిందపతి రూపమును, శక్తి పులిందపతి సుందరిగా రూపముల ధరించి అర్జునునితో యుద్ధ మొనరించి ఆయన పాశుపతాస్త్రధారణయోగ్యుడని నిశ్చయించి ఆతని కా యస్త్రమును ప్రసాదించి నందున అమ్మవారీ శ్లోకమున పులిందపతిసున్దరి యని చెప్పబడినది. 5. ఆమె త్రిపురభైరవి. సమయాచారులు శక్తి శివుల త్రిపురసున్దరీ కామేశ్వరులుగా భావించగా, కౌళులు భైరవీభైరవులుగా ఆరాధించెదరు. అందువలన ఈ శ్లోకమున 'అమ్మవారు త్రిపురభైరవి అని చెప్పబడినది. 6. ఆమె భారతి. వెనుక చెప్పబడిన విధముగా సృష్టికర్తృ దంపతులు భారతీ బ్రహ్మలు. బ్రహ్మ ఆతని భార్య భారతియు ఆద్యమహాలక్ష్మి నుండి యేర్పడిన వారేయైనందున, భారతి కూడ ఆద్యమహాశక్తి రూపిణియే. ఆమె మాతంగకుల నాయిక. తంత్రములలో మాతంగీ మంత్రోపాసనములు చెప్పబడినవి. ఆమె నీలవర్ణ. కామాక్షీదేవియు బహుశ్లోకములలో నీలవర్ణగా చెప్పబడినది. కావున ఆ కామాక్షీ దేవియొక్క రూపాంతరమే ఈమె. 7. ఆమె మహిషమర్దిని. మార్కండేయపురాణాంతర్గత సప్తశతి మధ్యమ చరిత్రములోనను, శ్రీదేవీభాగవత మహాపురాణములోనను అమ్మవారు మహిషమర్దినిగా అవతరించిన కథ చెప్పబడినది.

మధ్యమ చరిత్ర పారాయణాదులకు ముందు మహాలక్ష్మీ ధ్యానమే చేయబడినది. కావున అమె మహాలక్ష్మి యను పేరు గల శక్తియొక్క రూపమే. ఈ మహిషమర్దిని తమోగుణ రూపమే మహిషుడు. కావున మహిషమర్దిని యన తమోనివారణి జ్ఞానశక్తియే. అమ్మవారు మాతృక. వర్ణము మాతృక యనబడుటయే గాక వర్ణమాలయు మాతృక అని వ్యవహరింపబడును. అర్థోత్పత్తి శబ్దముల వలననే అను తంత్రసిద్ధాంతము ననుసరించి షట్త్రింశతత్త్వములకు వర్ణములే మాతృకలై జన్మనిచ్చుటచే శబ్దశక్తియైన అమ్మవారు మాతృక అని శ్లోకమున చెప్పబడినది. త్ర్యంబక శబ్దము వ్యాకరణ సమ్మతమే. కాని త్రియమ్బక శబ్దము వ్యాకరణ సమ్మతము కాదు. కాళిదాసు కుమారసంభవమున ఛాందస(వైదికమైన) ఇయంగాదేశము చేర్చబడిన త్రియమ్బక శబ్దమును ప్రయోగించినట్లు ఈ కవియు ప్రయోగించినాడు. నచ్చని వారు కాళిదాసు త్రియమ్బక శబ్దమును మార్చి త్రిలోచన పాఠాంతరము కల్పించి తృప్తిపడినట్లు ఇచ్చటను చేయవచ్చును. ప్రథమపాదమున త్రి వర్ణమైత్రి కలదు. పదము లన్ని మకారాదులుగానున్న తృతీయపాదమున 1-9-15 మ వర్ణములకు మైత్రి కూర్చబడినది అని చెప్పనక్కఱ లేదు. ఇది దాక్షిణాత్య సంప్రదాయాను సరణము. ఇది పృథ్వీ వృత్తము. దీని గణములు **జ స జ స య ల గ** అనునవి. పాద మధ్యమున 8 అక్షరముల తరువాత విశ్రాన్తి కూర్చవలెను. ఇది దీని లక్షణము. అమ్మవారికి అమృతసముద్రమధ్యమందలి మణిద్వీపమున నొక పురము గలదు. పుర శబ్దము పట్టణ సామాన్య వాచకము. అదియే అమ్మవారి ఆ పట్టణమునకు సంజ్ఞ యా పురశబ్దమే యైనది. దాని కన్న తక్కువ స్థాయి గల వైకుంఠామరావత్యాదికములు విష్ణ్వింద్రాదుల కున్నవి. విశేష సంజ్ఞ చేర్చుకున్నచో అద్వితీయమై ద్వితీయనగర సాదృశ్యములేని ఆ పట్టణమును పుర మనిన చాలును. అట్టిది మరొకటి యున్న గదా దీనికి విశేష సంజ్ఞయొక్క యావశ్యకత. అట్టిదే మరొక పురము పాలసముద్రమున నున్నదట. మరొకటి మేరు పర్వతమున నున్నదట. ఈ మూడు పురములలో నుండు స్వామినియైన సుందరియొక్కటే. కావున ఆమె త్రిపురసున్దరి.

2) జసౌ జసయలా వసుగ్రహయతిశ్చ పృథ్వీ గురుః ఇతి లక్షణమ్.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి వివిధ విహారములు తెలుపు నామములు వర్ణింపబడినవి. ఈ శ్లోకమున కమ్పాతటీ కుటీరములలో విహరించు ఆమె తనకు విభూతినీయ ప్రార్థింపబడుచున్నది.

**శ్లో॥ మహామునిమనోనటీ మహితరమ్యకమ్పాతటీ-**
**కుటీరకవిహారిణీ కుటిలబోధసంహారిణీ।**
**సదా భవతు కామినీ సకలదేహినాం స్వామినీ**
**కృపాతిశయకిఙ్కరీ మమ విభూతయే శాఙ్కరీ॥ 81**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| మహామునిమనోనటీ | = | మహామునుల మనములలో నటించునది; |
| మహితరమ్యకమ్పాతటీకుటీరక విహారిణీ | = | గొప్ప అందమైన కమ్పానదీ తటము నందలి కుటీరమున విహరించునది; |
| కుటిలబోధసంహారిణీ | = | కపటముతో కూడిన జ్ఞానమును సంహరించునది; |
| సకలదేహినామ్ | = | సమస్త ప్రాణులకు; |
| స్వామినీ | = | నాయికయైన; |
| కృపాతిశయకింకరీ | = | అధిక దయ దాసిగా గల; |
| శాంకరీ | = | శంకరునకు సంబంధించిన; |
| కామినీ | = | యువతి; |
| మమ | = | నాయొక్క |
| విభూతయే | = | సంపద కొఱకు; |
| సదా | = | ఎల్లప్పుడు; |
| భవతు | = | అగుగాక! |

**తాత్పర్యము:-**

అమ్మవారు మహామునుల మనములలో నటించు నట్టిది. కమ్పానదీ తీరకుటీరములలో విహరించునట్టిది. కుటిలబోధల సంహరించు నట్టిది. సకల ప్రాణులకు నాయికయై నట్టిది. మరియు శంకరుని కామించి నట్టిది. అట్టి అమ్మవారు నా కెల్లప్పుడు సంపదను ప్రసాదించుగాక!

**వివరణము :-**

మహామునుల మనస్సులు అను రంగస్థలములలో అమ్మవారు నటించు చుండును. ఆమె నటరాజు అర్ధాంగి గదా! భక్తులకు కమ్పానదీ తీరమందలి ఏదో పొదలో ఎప్పుడో ఒకప్పుడు అమ్మవారి దర్శనము కలుగుచుండుట ఆ ప్రాంతవాసుల అనుభవము. ఆమె కుటిల బోధల సంహరించును. అశాస్త్రీయమైన అసత్యమైన జ్ఞానము అజ్ఞానమున కన్న చెడ్డది. జ్ఞానమున్న సమయమున దుఃఖ ముండదు. అయథార్థజ్ఞానమువలన నరకాది లోకములలోనికి పతనము జరుగును. అమ్మవారి భక్తులైన వారికి యీ అసత్యమైన విక్షేపములు ఉండవు. అజ్ఞానము తొలగిన కుటిలబోధకూడ తొలగును. అజ్ఞానము అనగా బ్రహ్మము తెలియకపోవుటయే. అదియే జగద్రూపమున పరిణమించి భ్రాంతులకు దుఃఖములకు హేతువగును. విహారిణీ సంహారిణీ కామినీ స్వామినీ కింకరీ శాంకరీ అను పద ద్వంద్వములలో పదాన్తానుప్రాసమున్నది. మూడవపాదమున 1-9 వర్ణములకు మైత్రి కూర్చబడినది.



**అవ:-** పై శ్లోకమున కవి తనకు విభూతిని ప్రసాదించుమని అమ్మవారి నభ్యర్థించుట చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షవీక్షణమునకు పాత్రులైన వారికి కలుగు ఇంద్రవిభూతిని గూడ వారు లెక్కచేయరని చెప్పబడుచున్నది.

**శ్లో॥ జడాః ప్రకృతినిర్ధనా జనవిలోచనారున్తుదా**
**నరా జనని! వీక్షణాం క్షణమవాప్య కామాక్షి! తే!**
**వచఃసు మధుమాధురీం ప్రకటయన్తి పౌరన్దరీ-**
**విభూతిషు విడమ్బనాం వపుషి మాన్మథీం ప్రక్రియామ్॥ 82**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| జనని | = | అమ్మా! |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ; |
| జడాః | = | తెలియని వారు; |
| ప్రకృతినిర్ధనాః | = | సహజమైన పేదరికము గలవారు; |
| జనవిలోచనారుంతుదాః | = | జనుల కన్నులకు పీడను కలిగించు వారునైన; |
| నరాః | = | నరులు; |
| క్షణమ్ | = | క్షణకాలము; |
| తే | = | నీయొక్క; |
| వీక్షణమ్ | = | చూపును; |
| అవాప్య | = | పొంది; |
| వచస్సు | = | మాటలయందు; |
| మధుమాధురీమ్ | = | తేనె తీపిని; |
| పౌరన్దరీవిభూతిషు | = | ఇంద్రునికి సంబంధించిన సంపదలందు; |
| విడమ్బనామ్ | = | అనాదరమును; |
| వపుషి | = | శరీరమున; |
| మాన్మథీమ్ | = | మన్మథునకు చెందిన; |
| ప్రక్రియామ్ | = | ప్రక్రియను; |
| ప్రకటయన్తి | = | ప్రకటించెదరు. |

**తాత్పర్యము:-**

తెలివిలేని వారు, సహజముగా పేదవారు, జనుల కన్నులకు పీడను కలిగించు వారునునైన జనులు క్షణకాల మమ్మవారి వీక్షణమునకు పాత్రులయిరేని వారు తమ మాటలలో తేనెతీపిని, ఇంద్రసంపదలం దనాదరమును, శరీరము నందు మన్మథసౌందర్యమును ప్రకటించెదరు.

**వివరణము :-**

1) చేతన శబ్దమునకు వ్యతిరేక పదము జడ శబ్దము. చేతనులనగా తెలివి

కలవారు. కావున జడులనగా తెలివిలేని వారు. అమ్మవారి కటాక్షము సోకగానే వాక్కులలో తేనె తీపిని ప్రకటించెదరు. అనగా మధురముగా మాట్లాడు సామర్థ్యమును పొంది గొప్ప తెలివి గలవారుగా ప్రసిద్ధి నొందెదరు. 2) పుట్టు దరిద్రులు గర్భదరిద్రులు పేదలైన తల్లిదండ్రులకు జన్మించి పేదరికములోనే మ్రగ్గువారు అమ్మవారి కటాక్షము సోకగానే ఇన్ద్రుని సంపదలను చూచియు లెక్క సేయనంత సంపద కలవారగుదురు. 3) జనుల కంటికి బాధ కలిగించు వారనగా అందమేమాత్రము లేనివారు, అవయవసౌష్ఠవము లేనివారు, భయంకరముగా నుండువారు. ఇట్టి వారిని చూచినప్పుడు జనులు కన్నులు మూసికొనవలసి వచ్చును. అట్టి దుర్భగలు కూడ అమ్మవారి కటాక్షము సోకగానే వారు మన్మథునివంటి సుందరులుగా మారిపోవుదురు అను పూర్వార్ధములోని మూడు విశేషణములు వరుసగా ప్రతిద్వంద్విగా ఉత్తరార్ధమున మూడు స్థితులను ప్రకటించెదరని చెప్పుటచే నీ శ్లోకమున క్రమాలంకారమున్నది. ప్రథమపాదమున **జ** వర్ణమైత్రి కూర్పబడినది. మూడవపాదమున **ద ప** వర్ణమైత్రి కూర్పబడినది. వీక్షణమ్ క్షణమ్ అను పదములలో ఛేకానుప్రాసమున్నది. విభూతిషు, విడమ్బనామ్ అను పదములలో పదాది వర్ణమైత్రి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి దృక్కు సోకిన వారి అభ్యుదయము చెప్పబడినది. ఈ శ్లోకమున తన దృక్కుల కమ్మవారెప్పుడు లభ్యమగునా యను వింత చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఘనస్తనతటస్ఫుటస్ఫురితకఞ్చులీ చఞ్చలీ-**
**కృతత్రిపురశాసనా సుజనశీలితోపాసనా।**
**దృశోస్సరణిమశ్నుతే మమ కదా ను కాఞ్చీపురే**
**పరా పరమయోగినామ్మనసి చిత్కలా పుష్కలా॥ 83**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| ఘనస్తనతటస్ఫుటస్ఫురితకంచులీ | = గొప్ప స్తనముల ప్రాంతమున స్పష్టముగా తోచు రవిక గల; |
| చంచలీకృతత్రిపురశాసనా | = చలింపజేయబడిన శివుడుగల; |
| సుజనశీలితోపాసనా | = సుజనులచే చేయబడిన ఉపాసనగల; |
| పరమయోగినామ్ | = గొప్ప యోగులయొక్క; |
| మనసి | = మనసున; |
| పుష్కలా | = పూర్ణమైన; |
| చిత్కలా | = చిత్కలయైన; |
| పరా | = పరయైన అమ్మవారు; |
| కాంచీపురే | = కాంచీపట్టణమున; |
| మమ | = నాయొక్క; |

| | |
|---|---|
| దృశోః | = చూపులయొక్క; |
| సరణిమ్ | = మార్గమును; |
| కదా | = ఎప్పుడు; |
| అశ్నుతే | = పొందునో. |

**తాత్పర్యము:-**

స్తనముల బిగువుచే చిక్కటిలిన రవిక కలిగి శివుని చలింపజేసిన, సుజనులచే నుపాసింపబడిన పరదేవతయైన, పరమయోగుల మనసున ప్రత్యక్షమగు చిత్కలయైన అమ్మవారు నా కన్నుల కెప్పుడు కనబడునో గదా!

**వివరణము :-**

త్రిపురము లనగా స్థూల సూక్ష్మ కారణ శరీరములు. వానిని శాసించు అనగా శరీరత్రయ విలక్షణ సాక్షిభూతుడైన శివునకు మనసే లేదు. కాని అమ్మవారాయనను మనసుగల వానిగా చేసి ఆ మనసును చలింపజేసి శివునే తన కడకు వచ్చునట్లు చంచలింపజేసినది. ప్రాణములు ఇంద్రియములు మనోబుద్ధులు సూక్ష్మశరీర మనబడును. కావున సూక్ష్మశరీరమును శాసించిన వాడనగా మనసును ఇంద్రియప్రాణములను శాసించిన వాడు. అనగా నశింపజేసిన వాడని అర్థము. అట్టి శివుని తిరిగి మనస్సు కలవానినివలె చంచలింపజేసినది. ప్రాణేంద్రియాదులు చలించునవి యైనను మనసు వాటన్నిటి కన్న అతిచలము కావున మనస్సు చంచలమను ప్రసిద్ధి యేర్పడినది. **చంచలీకృత త్రిపురశాసనా** అను సమాసమునందు మనఃశబ్దము లేకున్నను శివునకు చాంచల్యము కలుగుటకు ఆయనకు మనసుండుట అనివార్యము. కావున చంచలీకృతమనస్సు కల శివుడనియే చంచలీకృతత్రిపురశాసనా అను ఆ సమాసమునకు అర్థము చెప్పవలెను. సుజనులనగా బహుజన్మల సాధనముయొక్క అనంతరము ప్రస్తుతజన్మ నొంది సాధన నొనర్చు వారు. వారికిది చివఱి జన్మ. కావుననే అమ్మవారి నుపాసించు శీల మేర్పడినది. ఈ చివఱి జన్మ పిదప వారికి ముక్తిని ప్రసాదింపదలచియే వారికిట్టి శీలమమ్మవారే కలిగించినది. ఇది **సుజనశీలితోపాసనా** అను సమాసముచే బోధ్యమైన అంశము. అందఱి మనసులలో యోగుల మనసులలోనను **చిత్కల** యుండును. దానిని యోగులు కానివారి మనసులు బహిర్ముఖములగుటచే గ్రహింపలేవు. చిత్కలను గ్రహింపవలెనన్నచో అవి అంతర్ముఖములు కావలెను. అట్టి అంతర్ముఖమనస్సు గలవారు పరమయోగులు. వారి మనస్సులలో చిత్కల పుష్కలమగును. అదియే మనసున నిండగా మరొక విషయము గ్రహించుట కవకాశము లేకపోవుట తటస్థించును. మనస్సుయొక్క ఈ స్థితియే చిత్కల పౌష్కల్యముగా నిచట ఉద్దేశింపబడినది. పరమయోగినామ్ అను పదముయొక్క బహువచనము ననుసరించి **మనసి** అను పదమిట జాత్యేకవచనము కలదిగా భావింపవలెను. అప్పుడు మనసులయందు అను అర్థము వచ్చును. ఒక్కొక్క యోగి కొక్కొక్క మనసుండును. కావున ఆ మనసులు పెక్కులు కాని ఒక్కటి కాదు. సదా

అనుటచే తాత్కాలికముగా సమాధిస్థితిలో చిత్కల పౌష్కల్యము ననుభవించువారు కాక వారు సహజసమాధిస్థితి గలవారని వ్యంగ్యమగును. సహజ సమాధి యనగా అన్ని అవస్థలలో (జాగ్రత్స్వప్నసుషుప్తులలో) నను బ్రహ్మదృష్టి తప్ప జగదృష్టి లేనివారు అని గమనింపవలెను. అట్టి పుష్కల చిత్కలయునైన అమ్మవారు రూపమును ధరించి తనకు అనగా కాంచీపురవాసిగా దర్శన మెప్పుడిచ్చునో కదా అను చింతయొక్క ఉదయము ఈ శ్లోకమున వ్యంగ్యమగుటచే చింతా భావోదయమున్నదని చెప్పవలసియున్నది. పర శబ్దమునకు పరవాగ్రూపిణి యనిగాని పరాశక్తిరూపిణి యనిగాని, పరదేవత యనిగాని లేక సామాన్యముగా ఉత్కృష్టురాలనిగాని అర్థము చెప్పవచ్చును. కంచులీ చంచలీ పురశాసనాశీలితో పాసనా, పుష్కలా చిత్కలా అను శబ్దద్వంద్వములలో పదాంతానుప్రాస మున్నది. **ఉపాసనమభిధ్యానమ్** అను శంకరుల వాక్కు ననుసరించి తైలధారవలె అవిచ్ఛిన్నముగా చేయబడు పరోక్షజీవబ్రహ్మైక్యజ్ఞానముల ధార ఉపాసనము.



**అవ:-** పై శ్లోకమున కవికి గలిగిన దర్శనమునకు సంబంధించిన చింతయను భావముయొక్క ఉదయము చెప్పబడినది. ఈ శ్లోకమున దర్శనముయొక్క కాంక్ష చెప్పబడుచున్నది.

**శ్లో॥ కవీన్ద్రహృదయేచరీ పరిగృహీతకాఞ్చీపురీ**
**నిరూఢకరుణాఝరీ నిఖిలలోకరక్షాకరీ।**
**మనఃపథదవీయసీ మదనశాసనప్రేయసీ**
**మహాగుణగరీయసీ మమ దృశోఽస్తు నేదీయసీ॥ 84**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| కవీంద్రహృదయేచరీ | = | కవీంద్రహృదయమున చరించునది; |
| పరిగృహీతకాంచీపురీ | = | స్వీకరించబడిన కాంచీపురము గలది; |
| నిరూఢకరుణాఝరీ | = | లోతుగా నెలకొన్న దయానది గలది; |
| నిఖిలలోకరక్షాకరీ | = | సమస్తలోకము రక్షణము చేయునది ; |
| మనఃపథదవీయసీ | = | మనసుయొక్క మార్గమున కందనిది; |
| మహాగుణగరీయసీ | = | గొప్పగుణములతో అధిక గురుత్వము నందినదియునైన; |
| మదనశాసనప్రేయసీ | = | శివుని యిల్లాలు; |
| మమ | = | నాయొక్క |
| దృశోః | = | కన్నులకు; |
| నేదీయసీ | = | మిక్కిలి దగ్గఱగా నుండునదిగా; |
| అస్తు | = | అగుగాక! |

**తాత్పర్యము:-**

అమ్మవారు కవీన్ద్రుల హృదయములలో విహరించును. కాంచీపురిని తన నివాసముగా స్వీకరించినట్టిది. ఆమెలో కరుణ పొంగి పొరలు నదిగా నుండును. ఆమె సమస్త లోకముల రక్షించును. మనోమార్గమునకు ఆమె అందదు. గొప్ప గుణములతో గురువులకు గురువు కాదగినదియై యున్నది. అట్టి శివుని యిల్లాలైన అమ్మవారు నా కన్నులకు మిక్కిలి దగ్గఱగా నుండి దర్శనమొసగుగాక!

**వివరణము :-**

లోకమున నిందఱుండగా కవీంద్రుల హృదయములలో చరించుట, ఇన్ని పట్టణములుండగా కాంచీపురినే తన నివాసముగా స్వీకరించుట అనునవి ఆమె స్వాతంత్ర్యమునకు సంబంధించినవి. కవీంద్రులనిన కాంచీపురి యనిన అంత ప్రేమ ఆమె కేలనో? తెలియదు. ఆమెలో కరుణ నిరూఢమై యున్నది. లోతుగా నెలకొని యున్నది. ఏ క్షణముననైన ఎవరిని చూచిన పొంగునో తెలియదు. నిఖిల లోకముల నామెయే రక్షించుచుండగా విష్ణ్వాదులు రక్షించుట యనునది ఉపచారము మాత్రమే. **యతో.... అప్రాప్య మనసా సహ** అను శ్రుతి ననుసరించి ఆమె మనస్సుయొక్క మార్గమునకు అందని ద్రాక్షపండు. ఏ గురువులోనను అన్ని గొప్పగుణములుండవు. గావున మహా గుణములలో గరీయసి, దగ్గఱగా అనక నేదీయసీ మిక్కిలి దగ్గఱగా నుండునది యనుటలో మూకకవికి లోకసాధకునకు గాని వార్ధకము వచ్చినపుడు దూరపు చూపు చాల వఱకు తగ్గి మిక్కిలి దగ్గఱకు వచ్చిన వారినే గుర్తించగలుగుదురు. కొంచెము దూరముగానున్నను గుర్తింపలేనేమో అని **దృశోఃనేదీయసీ అస్తు.** పూర్వార్ధమున మొదటి నాలుగు విశేషణములు **రీ** యను అక్షరముతో, ఉత్తరార్ధమున నాలుగు విశేషణములు **సీ** యను అక్షరముతో ముగియుటచే నీ శ్లోకమున పదాంతానుప్రాసము లేర్పడి యున్నవి. **మనః పథదవీయసి** యైనను దృక్కులకు నేదీయసీ యగుగాక అనుటలో మనస్సుతో నందుకొనుటకు యత్నించుట సాధ్యము కాకపోయినను ఆమె **అవ్యాజకరుణానిరూఢ** కావున ఆమెయే దగ్గఱకు వచ్చునేమో యని నిరీక్షించుట మాత్రమే సాధకుని కర్తవ్యమను స్ఫూర్తియున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి దర్శనముయొక్క కాంక్ష ప్రకటింపబడినది. ఈ శ్లోకమున కవికిగల అమ్మవారియొక్క ఉపాసన యందలి ఆసక్తి చెప్పబడుచున్నది.

**శ్లో॥ ధనేన న రమామహే ఖలజనాన్న సేవామహే**
**న చాపలమయామహే భవభయాన్న దూయామహే।**
**స్థిరాం తనుమహేతరాం మనసి కిఞ్చ కాఞ్చీరత-**
**స్మరాన్తకకుటుమ్బినీచరణపల్లవోపాసనామ్॥ 85**

ప్రతిపదార్థము :-

| | |
|---|---|
| ధనేన | = ధనముతో; |
| న రమామహే | = సంతోషించుట లేదు; |
| ఖలజనాన్ | = దుష్టజనులను; |
| న సేవామహే | = సేవించుట లేదు; |
| చాపలమ్ | = చపలభావమును; |
| న అయామహే | = పొందుట లేదు; |
| భవభయాత్ | = సంసారభయమున; |
| న దూయామహే | = తపించుట లేదు; |
| కిం చ | = మరియు; |
| స్థిరామ్ | = స్థిరమైన; |
| కాంచీరతస్మరాంతకకుటుంబినీ చరణపల్లవోపాసనామ్ | = కాంచీనగరమునం దిష్టమైన శివుని యిల్లాలి చిగురువంటి పాదముయొక్క ఉపాసనమును; |
| మనసి | = మనసునందు; |
| తనుమహేతరామ్ | = బాగుగ చేయుచుందుము. |

**తాత్పర్యము:-**

మాకు ధనమున సంతోషము కలుగదు. ఖలజనులను సేవించు చాపల్యమును పొందము. సంసారభయమున పరితపించము. మఱి కాంచీనగరమున ఇష్టమైన శివుని యిల్లాలి చిగురువంటి పాదముయొక్క ఉపాసనమును స్థిరముగా చేయుదుము.

**వివరణము :-**

ఖలులైన ధనవంతులను సేవించి డబ్బు సంపాదించవలసిన దురదృష్టము కొందఱ కేర్పడును. వారిని సేవించినను ధనము లభింపని దురదృష్టులు మఱికొందఱు. సేవించకుండ చౌర్యాదులవలన ధనమును సంపాదించు వారు మఱి కొందఱు. ఏమైనను ధనము సంపాదించు కాంక్ష చాల మంది కుండును. దాని.వలన భోగము లనుభవించు కోరిక వారి కుండును. కొందఱు ధనమును సంపాదించి అనుభవించకుండ పిసినారులై దాచుకొనుచుందురు. వారికి భోగేచ్ఛ లేకున్నను ధన మున్నదను తృప్తి యుండును. కవి అట్టి తృప్తి తనకు లేదు అనుచున్నాడు. తత్సంపాదనకై ఖలజనులను సేవించుట లేదనియు చెప్పు చున్నాడు. భోగము నొకదాని ననుభవించి తృప్తిలేక మరొక భోగమును అప్పటికి తృప్తిలేక మరొక భోగమును కోరు స్వభావము చాపలము. అట్టి చాపలము తనకు లేదని కవి చెప్పుచున్నాడు. సంసారమందుడు వారికి ధనకాంక్ష, భోగముల నెన్నింటినో అనుభవించవలెనను కోరిక, ఆ ధన, భోగవాంఛ తీర్చుకొనుటకు ఖలజనులను సేవించుట,

ఇదంతయు జరిగిన పిమ్మట జరామరణములు అవశ్యానుభవనీయములను భవభయముతో సంసారు లధికముగా పీడితులై యుందురు. కవికి అమ్మవారిని ధ్యానించుట తప్ప మరో కృత్యము లేదు. సంసారమున ధనమున కాశించి విచారించని, శరీరమునకు కలుగబోవు జరామరణములతో నాకేమియు భయము లేదను నిబ్బరము కలిగి అమ్మవారి ఉపసనము స్థిరముగా చేయుదునని చెప్పుచున్నాడు. ప్రథమపాదమున నకారావృత్తి, ద్వితీయపాదము **య** కారావృత్తి, మూడవపాదమున బిందు పూర్వక చ కారావృత్తి, వృత్త్యనుప్రాసమును కలిగించుచున్నవి. నాలుగవపాదమున స చ కారవర్ణమునమైత్రి, రేఫ ప్రాసయతియు కూర్పబడినవి. ఆత్మనేపది లడంత క్రియల నాలిగింటిలో **మహే** అను అక్షరముల ఆవృత్తితో పదాంతనుప్రాసము ఈ శ్లోకము నలంకరించుచున్నది.



**అవ:-** పై శ్లోకమున తనకు ధనాదులందు గల వైరాగ్యమును తెలిపినను ఈ శ్లోకమున ఇంద్ర భోగాదులను కోరు దరిద్రునకై అమ్మవారి అనుగ్రహమునకు పాత్రుడయినవాని కవి సిద్ధించునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ సురాః పరిజనా వపుర్మనసిజాయ వైరాయతే**
**త్రివిష్టపనితమ్బినీకుచతటీ చ కేళీగిరిః।**
**గిరస్సురభయో వయస్తరుణిమా దరిద్రస్య చ**
**కటాక్షసరణౌ క్షణం నిపతితస్య కామాక్షి! తే॥ 86**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ! |
| తే | = నీయొక్క; |
| కటాక్షసరణౌ | = కటాక్షమార్గము నందు; |
| నిపతితస్య | = పడిన; |
| దరిద్రస్య చ | = పేదవానికైనను; |
| సురాః | = దేవతలు; |
| పరిజనాః | = సేవకులు; |
| భవన్తి | = అగుదురు; |
| వపుః | = శరీరము; |
| మనసిజాయ | = మన్మథుని కొఱకు; |
| వైరాయతే | = శత్రువగును; |
| త్రివిష్టపనితంబినీకుచతటీ చ | = స్వర్గమునందలి స్త్రీల స్తనప్రాంతమును; |
| కేళీగిరిః | = క్రీడాపర్వతము (భవతి); |

గిరః = వాక్కులు;
సురభయః = కామధేనువులు, (భవన్తి);
వయః = వయస్సు;
తరుణిమా = యౌవనము (మాత్రమే);
భవతి = అగును.

**తాత్పర్యము:-**

అమ్మవారి కటాక్షముల మార్గమునందు పడిన దరిద్రునకైనను దేవతలు పరిజనులగుదురు. శరీరము మందముగా మారిపోవును. స్వర్గస్త్రీల కుచతటియే క్రీడాపర్వతమగును. వాక్కులు కామధేనువులు. వయస్సు యౌవన మగును.

**వివరణము:-**

ఇంద్రునకు దేవతలు పరిజనులై అనగా సేవకులై యుందురు. అమ్మవారి కటాక్షమార్గమునందు పడిన దరిద్రునకైనను ఆ దేవతలు పరిజనులుగానే ఉందురు. దేవతలు పరిజనులుగా ఉండుట అనునది ఇంద్రభోగము. ఇంద్రుడు అందగాండ్రలో నొకడు. అమ్మవారి కటాక్షానుగ్రహమునకు పాత్రుడైన వాడు దుర్భగశరీరము కలవాడైనను వాని శరీరము ఇంద్రుని శరీరమువలె సుందరమగును. గౌతమశాపమున ఇంద్రుని శరీరము దుర్భగమగుట కాలాంతర విషయము. అందగాండ్రందఱు మన్మథునకు శత్రువులే అగుదురు. తపస్యులు, యోగులు, విరాగులు కూడ మన్మథునకు శత్రువులే. శివుడును మన్మథునకు శత్రువే. అమ్మవారి కటాక్షమునకు పాత్రుడైనచో దరిద్రుని వికృతినిలయమైన శరీరము మన్మథునితో శత్రుత్వ మొనరించును అనుటలో శివత్వమును పొంది మన్మథుని చంపువైరము కలవాడగునని, విరాగి యోగి తపస్వియై తన తపోభంగము పగ తీర్చుకొనునని, ఇంద్రుడై అందమున మన్మథునితో పోటీపడునను అర్థములు స్ఫురించును. ఇంద్రాది దేవతల ఆశీర్వాక్కులు ఫలించి భక్తులు సుఖముల నందుట లోక ప్రసిద్ధము. అనగా వారి వాక్కు దాని అర్థమును సార్థక పరచును. ఒకవేళ ఇంద్రాదులు నీకు మేలగుగాక అనిగాని, నీకు ధనము కలుగుగాక అనిగాని, గృహము కలుగుగాక, సంతానము కలుగుగాక అనిగాని ఆశీర్వాక్కు పలికిన ఆ వాక్కు ఫలించి తదారాధకుడు ధనగృహాదులు కలవాడగును. వారొకవేళ ఆగ్రహించి నీ ధనము నష్టమగుగాక, నీ గృహము నష్టమగుగాక, అని శపించిన ఆ వాక్కును ఫలించి తదాగ్రహపాత్రుడు ధనగృహాది హీనుడగును. దేవతావాక్కులు అర్థవంతములగును అని లోకప్రసిద్ధి కూడ నున్నది. అమ్మవారి కటాక్షమునకు పాత్రుడైన దరిద్రుడు కూడ ఇట్లు శాపానుగ్రహసమర్థుడు కాగలడు. ఆతడు మేలు కలుగుననిన మేలు కలుగును. కీడు కలుగుననిన కీడు కలుగును. సురభి శబ్దమునకు కామధేనువని అర్థము. కామధేనువు కడకేగి దేనిని ప్రార్థించిన దాని నిచ్చును. అట్లే దేవీ కటాక్షానుగ్రహ పాత్రుని వాక్కులు కామధేనువులవలె కోర్కెల తీర్చును. సురభి శబ్దమునకు పరిమళవంతము అని మఱియొక అర్థమున్నది. దాని ననుసరించి దేవీ కటాక్షపాత్రుల వాక్కులు పరిమళవంతములగును. అనగా వారి వాక్కులు బహుజనమనోహరములుగా నుండును.

ఎక్కువ మందిని సంగీతధ్వనులవలె వాని సాధారణమయిన మాటలు ఆనందింపజేయును. కవివాక్కులవలె రసభావాదులను అపండితుడైన ఆ దేవ్యనుగ్రహ పాత్రుని వాక్కులు సహృదయుల నానందింపజేయును. స్వర్గలోకమున యౌవనవయసు గడచుట అనునది యుండదు. దేవతలకు నిర్జరులు అను పేరు కలదు. త్రిదశులను మరొక పేరు గలదు. బాల్య కౌమార యౌవనములను మూడు వయస్సులే కాని ముసలితనము అను నాలుగవ దశ సాధారణ మానవుల కుండునట్లు ఉండదు అని ఆ శబ్దముల అర్థము. యౌవన వయస్సున నున్నవాడు అమ్మవారి అనుగ్రహమునకు పాత్రుడు కాగా ఆ యౌవనమే కల్పాంతము వఱకుండును. ముసలితనము రాదు. నాలుగు వయస్సులలో యౌవనమే అందఱిచేత కోరబడును. అది లౌకికవాంఛలలో శ్రేష్ఠమైన దాంపత్య సుఖానుభవమునకు హేతువు. ఆ వయస్సే బలము కలిగియుండుట, అధికారమును సంపాదించగలుగుట ఇత్యాది భోగములకు హేతువు. యౌవనము రాని బాలురు కుమారులు, యువకులము కావలెనని కోరుకొనుట కదియే హేతువు. యౌవనము తరువాత సాధారణముగా ముసలితనము రాక తప్పదు. అది ఎవరికి నిష్టము కాదు. అమ్మవారి యనుగ్రహము నొందిన వానికి ముసలితన ముండదు. ఈ శ్లోకములో చెప్పబడినవన్ని ఇంద్రభోగములే. దేవతలు ఇంద్రునకు సేవకులుగా నుందురు. దేవతాస్త్రీలకుచము లాతని క్రీడాగిరులు. ఆతడు సుందరశరీరుడు. ఆయన వయస్సు యౌవనము. ఆతడు సత్యవాక్కు. కావున శ్లోకములో చెప్పబడిన అన్ని భోగములు ఇంద్రుని కున్నవి. కాని ఇంద్రుడు తనకున్న భోగములలో కొన్ని యొసగునే కాని అన్ని యీయడు. అన్ని యిచ్చినచో ఆతని ఆధిక్యమునకే ముప్పు వచ్చును గదా! నూఱు యజ్ఞములొనర్చిన పిదప దాని నొందునని నూఱవ యజ్ఞము నింద్రుడు భగ్నము చేయబూనుకొనిన యుదంతము లెన్నియో పురాణములందున్నవి. కావున ఇంద్రభోగము లన్నియు ఇంద్రోపాసకునకు ఈ లోకమున లభింపవు. ఒకవేళ లభించినను జన్మాంతరము వఱకు వేచి యుండవలసివచ్చును. అందుచేత అమ్మవారినే ఇంద్రభోగముల కొఱకుపాసించుట మంచిది అనుటయే ఈ శ్లోకముయొక్క సారము. ప్రథమ తృతీయ పాదముల రేఫావృత్తి, నాలుగవ పాదమున క్ష కారావృత్తి వృత్త్యనుప్రాస హేతువులగుచున్నవి.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి అనుగ్రహపాత్రు డింద్రభోగముల నొందగలడని చెప్పబడినది. ఈ శ్లోకమున కవి తనను పవిత్రుని నొనరింపుమను కోర్కె చెప్పబడుచున్నది.

**శ్లో॥ పవిత్రయ జగత్త్రయీవిబుధబోధజీవాతుభిః**
**పురత్రయవిమర్దినః పులకకఞ్చులీదాయిభిః।**
**భవక్షయవిచక్షణైర్వ్యసనమోక్షణైర్వీక్షణై-**
**ర్నిరక్షరశిరోమణిం కరుణయైవ కామాక్షి! మామ్॥ 87**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| జగత్త్రయీవిబుధబోధజీవాతుభిః | = | మూడు లోకములలోని విద్వాంసుల జ్ఞానమునకు జీవనహేతువులైన; |
| పురత్రయవిమర్దినః | = | శివునియొక్క; |
| పులకకంచులీదాయిభిః | = | పులకాంకురమయమైన కంచుకము నిచ్చునట్టి; |
| భవక్షయవిచక్షణైః | = | సంసారముయొక్క నాశమునందు సమర్థములైన; |
| వ్యసనమోక్షణైః | = | వ్యసనముల నుండి విడిపించునట్టి; |
| వీక్షణైః | = | చూపులతో; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| నిరక్షరశిరోమణిమ్ | = | చదువురాని వారలలో శిరోమణినైన; |
| మామ్ | = | నన్ను; |
| కరుణయా ఏవ | = | దయతోడనే; |
| పవిత్రయ | = | పవిత్రు నొనరింపుము. |

**తాత్పర్యము:-**

మూడు లోకములలోని విద్వాంసుల జ్ఞానముయొక్క జీవనమునకు హేతువులైన, శివునికి పులకాంకుర కంచుకము దొడుగునట్టి, సంసారమును నశింపజేయు సామర్థ్యము గల, వ్యసనములనుండి విడిపింపగల నీ చూపులతో అమ్మా కామాక్షీ! దయతోడనే నిరక్షరకుక్షలలో శిరోమణినైన నన్ను పవిత్రు నొనరింపుము.

**వివరణము :-**

ఈ లోకమున నెందఱో విబుధులు అనగా విద్వాంసులుండనే ఉందరు. పాతాళలోకముననను కొందఱు విబుధులుండవచ్చును. ఆ విబుధుల బోధ అనగా విజ్ఞానము వార్థక్యాది హేతుకవిస్మృతిచే నశింపకుండ కాపాడుచు శీఘ్రముగా అవసరమైనప్పుడెల్ల ఆ జ్ఞానము స్మృతికి వచ్చునట్లు చేయుటచే బోధ జీవాతుత్వము. అట్టి బోధజీవనౌషధులు అమ్మవారి చూపులు. అవి శివునిపై సోకగానే శివుడు నిలువెల్ల పులకించి కంచులి యగును. అనగా దిగబంరుడైన ఆతడు నిలువెల్ల చొక్కా తొడిగికొనిన వానివలె నగును. అవి సంసారమును నశింపజేయు విలక్షణములు ద్యూతాదివ్యసనములనుండి విడిపించు నట్టివి. అట్టి చూపులు కరుణతోడనే నిరక్షరులలో శిరోమణియైన కవిని పవిత్రు నొనరింపవలెనని ఆతడు కోరుచున్నాడు. పవిత్రత యనగా పుణ్యపాపములను రెండు మలములనుండి విముక్తి లభించుట. నిర్మలతయే పవిత్రత. పవిత్రత పుణ్యమువలన పాపనాశము కలిగి తదనంతరము లభించునది యని కొందఱి అభిప్రాయము. కాని పుణ్యముకూడ మోక్షప్రతిబంధకము కావున అది కూడ మలముగానే భావింపదగినది. జీవునకు నేను కర్తను, భోక్తను అను అహంకృతి తొలగిననే ఆ అపవిత్రత తొలగి పవిత్రుడగుట సంభవించును. అమ్మవారట్టి పవిత్రత కలిగింపవలెనని అందుకు అర్హత

నీకు కలదా యని అమ్మవారు ప్రశ్నింపగా కవి యిట్లను చున్నాడు. అమ్మా! నా కట్టి అర్హత ఎంత మాత్రము లేదు. నేను ఆత్మజ్ఞానిని కానేకాను. కనీసము పరోక్షజ్ఞానరూపమైన శాస్త్రజ్ఞానము కూడ లేదు. అయినను అమ్మా! నా కర్హత ఉన్నచో నేను నిన్ను పవిత్రు నొనరింపుమని కోరుట యెందుకు. నేను కోరకపోయినను ఆ పని చేసి యుందువు. నీవు అర్హత నుపేక్షించు దానవు కాదు కదా! నేనర్హుడను కాను. కావుననే నీవు దయతో మాత్రమే నన్ను పవిత్రు నొనరింపుము. నీకు నాపై దయ ఉన్నచో నా కర్హత ఉన్నదా లేదా అను మీమాంసతో నాకేమి పని, నీ కేమి పని, నీకు దయ ఉన్నచో చాలును. నీకు దయ ఉన్నదనుటలో నా కేమియు సందేహము లేదు. ఎందఱో అసురులనే యోగ్యతలేని వారిని కూడ నీ వుద్ధరించినావని భక్తులు చెప్పుకొనుచుండగా విని యున్నాను. నేను భక్తుడనని చెప్పుకొనుట లేదు. పతితులందును నీకు దయ ఉన్నదని వారు చెప్పుకొను చుండగా వినియున్నాను. అవి యన్నియు నా స్మృతిపథమునుండి యింకను తొలగిపోలేదనగా నీ దయ నాపై ఉన్నట్లే. ఇప్పటిదాక నన్ను కాపాడుచున్నావు గదా! ఆ కాపాడుట నీకు నాకు పవిత్రత నీయనిచో వ్యర్థమే కదా! అందువలననే నీ దయను మాత్రమే నమ్ముకొని నీ వా పవిత్రతను ప్రసాదింపుమని కోరుకొనుచున్నాను. మొదటి మూడు పాదములలో యకారాక్షర ప్రాసమున్నది. మొదటి రెండు పాదములలో తృతీయ చతుర్థాక్షర ద్విప్రాస మున్నది. రెండవ పాదమున **పు** వర్ణమైత్రి ఉన్నది. మూడవ పాదమునను భవ వర్ణముల మైత్రి ఉన్నది. మూడవ పాదమున క్షణ శబ్దముతో ముగియు మూడు విశేషణము లుండుటచే పదాన్తానుప్రాస మేర్పడి యున్నది. నాలుగవ పాదమునను రేఫావృత్తిచే వృత్త్యనుప్రాసము లేర్పడియున్నవి.



**అవ:-** పై శ్లోకమున కైవల్యమునకు కావలసిన పవిత్రత కవిచే చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి దర్శనము కొఱకు కవిలో చింతయను భావముయొక్క ఉదయము స్ఫురింపజేయబడుచున్నది.

**శ్లో॥ కదా కలితఖేలనాః కరుణయైవ కాఞ్చీపురే**
**కలాయముకులత్విషః శుభకదమ్బపూర్వాఙ్కురాః।**
**పయోధరభరాలసాః కవిజనేషు తే బన్ధురాః**
**పచేలిమకృపారసాః పరిపతన్తి మార్గే దృశోః॥ 88**

ప్రతిపదార్థము :-

కరుణయా+ఏవ = దయతోడనే;
కాంచీపురే = కాంచీనగరము నందు;
కలితఖేలనాః = ఏర్పడిన క్రీడలుగల;
కలాయముకులత్విషః = ఇఱుగుడు మొగ్గల కాంతివంటి కాంతి గల;

శుభకదంబపూర్వాంకురాః = శుభసమూహములకు ముందేర్పడునట్టి అంకురములు గల;
పయోధరభరాలసాః = స్తనభారముచే సోమరితనము నొందిన ;
కవిజనేషు = కవిజనములయందు;
బన్ధురాః = దట్టములైన;
తే = నీయొక్క;
పచేలిమకృపారసాః = పండిన దయారసములు;
కదా = ఎప్పుడు;
దృశోః = కన్నులయొక్క;
మార్గే = మార్గమునందు;
పరిపతన్తి = బాగుగా పడునో కదా!

**తాత్పర్యము:-**

దయతోడనే కాంచీపురమున క్రీడించుచున్న ఇఱుగుడు మొగ్గల కాంతివంటి కాంతిగల, రాబోవు శుభముల పండించుటకు తొలియాధారములైన అంకురములైన, స్తన భారముచే నడకవేగము మందగించిన, కవిజనములందు సాంద్రముగా పడుచున్న, ఆ పండిన దయారసములు(అమ్మవారు) ఎప్పుడు నా కన్నులమార్గమునందు పడునో కదా!

**వివరణము :-**

ఇన్ని నగరములుండగా అమ్మవారు కాంచీపురమునందేల క్రీడ నారంభించినది. కాంచీనగరముపై దయతోడనే ఆమె ఖేలన మట నారంభించినది. మరి వారి మీద దయ యేల? అను ప్రశ్నమునకు సమాధానము లేదు. ఏల? ఆమె అవ్యాజమైన దయగలది గదా! ఆ దయ ఎప్పుడు ఎచట కురియునో ఎవరెఱుగుదురు. ఇఱుగుడు మొగ్గల కాంతివంటి కాంతిగల అను అర్థమునిచ్చు **కలాయముకులత్విషః** అను సమాసమున లుప్తోపమాలంకార మేర్పడియున్నది. అమ్మవారు కనబడుట మొదలు జరుగవలెను. శుభసమూహము తరువాత పండవలెను. ఆ శుభసమూహములు పండుటకు ముందు మొక్కలుండవలెను. ఆ మొక్కలే అమ్మవారు. కవిజనములచే కట్టువడినట్లు వారి యందమ్మ వారుండును. పయోధర భారముచే ఆమె నడక మందగించినట్లున్నది. ఆమె పండిన కృపారసము. ప్రథమపాదమున ఇదివఱకు ప్రయోగింపబడిన కరుణాశబ్దము కాంచీపురము నందలి దయను బోధించును, నాలుగవ పాదముయొక్క ఆరంభము నందలి **పచేలిమకృపారసాః** అను సమాసము నందలి కృపాశబ్దము కవియందలి దయను బోధించును. బాగుగా పండిన పండులోని రస మేక్షణమున బయటకు చిమ్మునో తెలియనట్లు అమ్మవారి కృప ఎప్పుడెవరి మీద పడునో తెలియదు. పండిన కృపకు ఫలమేమనగా ఆమె దర్శనమే. అది యెప్పుడా అను కవియొక్క చింత అను భావముయొక్క ఉదయము ఈ శ్లోకమున స్ఫురించుచున్నది. ప్రథమపాదమున క వర్ణమైత్రి, నాలుగవపాదమున ప వర్ణమైత్రి ఉన్నవి. పూర్వార్థమున నకారావృత్తి, ఉత్తరార్థమున పకారావృత్తి ఉన్నవి.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి దర్శనమార్గపతనచింతాభావముయొక్క ఉదయము స్ఫురింపజేయబడినది. ఈ శ్లోకమున అమ్మవారను రత్నమునకు తన మనసెప్పుడు పెట్టె అగునా అను చింతాభావముయొక్క ఉదయము స్ఫురింపజేయబడుచున్నది.

**శ్లో॥ అశోధ్యమచలోద్భవం హృదయనన్దనం దేహినా-**
**మనర్ఘమధికాఞ్చి తత్కిమపి రత్నముద్ద్యోతతే।**
**అనేన సమలఙ్కృతా జయతి శఙ్కరాఙ్కస్థలీ**
**కదాఽస్య మమ మానసం వ్రజతి పేటికావిభ్రమమ్॥ 89**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| అశోధ్యమ్ | = శోధింపరానిది; |
| అచలోద్భవమ్ | = కొండనుండి పుట్టినది; |
| దేహినామ్ | = ప్రాణులయొక్క |
| హృదయనన్దనమ్ | = హృదయములను సంతోషింపజేయునది; |
| అనర్ఘమ్ | = వెలలేనిది; |
| అధికాంచి | = కాంచీనగరము నందున్నట్టి; |
| కిమ్ అపి | = ఏదోయొక; |
| తత్ | = ఆ; |
| రత్నమ్ | = రత్నము; |
| ఉద్ద్యోతతే | = ప్రకాశించుచున్నది; |
| అనేన | = దీని(రత్నము) చేత; |
| సమలంకృతా | = బాగుగా అలంకరింపబడిన; |
| శంకరాంకస్థలీ | = శివుని యొడి; |
| జయతి | = సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నది; |
| అస్య | = దీనికి (ఈ రత్నమునకు) ; |
| మమ | = నాయొక్క; |
| మానసమ్ | = మనస్సు; |
| పేటికావిభ్రమమ్ | = పేటికయొక్క విలాసమును; |
| కదా | = ఎప్పుడు; |
| వ్రజతి | = పొందునో కదా! |

**తాత్పర్యము:-**

శోధ్యము కానిది, కొండనుండి పుట్టినది, ప్రాణుల హృదయుము నానందింప జేయునది, వెల కట్టలేనిది, కాంచీనగరమందున్నట్టిదియునైన, ఆ రత్నము (అమ్మవారు) ప్రకాశించుచున్నది. శివుని యొడి ఈ రత్నముచే అలంకరింపబడి సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నది. ఈ రత్నమునకు నా మనసెప్పుడు పెట్టెగా నుండునో.

**వివరణము :-**

**అశోధ్య** మనగా శోధింపరానిది, మలిన వస్తువునకు శోధించుట అవసరము. అమ్మవారు అమలిన కావున అశోధ్యరత్నమని చెప్పబడినది. రత్నములకు సానబట్టి పట్టిన మలినముల తొలగించి తొలగించి దానికి ఉజ్జ్వలత కలిగించుట లోకప్రసిద్ధము. అమ్మవారను రత్నమునకు శోధనముయొక్క ఆవశ్యకత లేదు. రత్నధారణమువలన ఆ అవయవమున కేమి యానందము కలుగును? కలుగదు. అవయవముల కానందించు స్వభావమే లేదు. ఏ అవయవమున కే రత్నము నలంకరించినను ఆనందించునది ఆ అవయవములు గల దేహము గలవారిలోని హృదయమే. అమ్మవారు రత్నము **దేహినామ్ హృదయ నన్దనమ్** అని చెప్పబడినది. శివుడా రత్నము నొడిలోనికి తీసికొని అనగా పెండ్లి చేసికొన్న నాటి నుండి ఆతని యొడికి సర్వోత్కర్షము కలిగినది. ఇది మూడవ పాదమున బోధ్యాంశము. ఈ రత్నము కెప్పుడు నా మనసు పెట్టెగా మారునో అనునదే కవి చింత. రత్నమును సువర్ణరజతాది నిర్మితపేటికలో దాచుకొనుట లోక ప్రసిద్ధము. అమ్మవారు పరిచ్ఛిన్నమైన రత్నము కాదు కావున దానిని దాచుటకు తగినది మనసు తప్ప మరొక పెట్టె లేదు. ప్రథమద్వితీయారంభ విశేషణము లకారారమ్భములైయున్నవి. మొదటి మూడవ పాదములును అకారారమ్భములే అయియున్నవి. మూడవపాదమున బిందుపూర్వక కకారావృత్తిచే వృత్త్యనుప్రాస మేర్పడియున్నది. సాధారణ రత్నమున కన్న ఈ అమ్మవారు అను రత్నమునందు విశేషము స్ఫురింపజేయబడుటచే నీ శ్లోకమున వ్యతిరేకాలంకారస్ఫూర్తి ఉన్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారెప్పుడు తన మనసులో చేరునా అను చింత స్ఫురింపజేయబడినది. ఈ శ్లోకమున ఎల్లప్పుడు తన మనసునందు ఆమె ప్రకాశించుట కోరబడుచున్నది.

**శ్లో॥ పరామృతరసప్లుతా జగతి నిత్యమన్తశ్చరీ**
**నృణామపి బహిశ్చరీ పరమసంవిదేకాత్మికా।**
**మహద్భిరపరోక్షితా సతతమేవ కాఞ్చీపురే**
**మమాన్వహమహమ్మతిర్మనసి భాతు మాహేశ్వరీ॥ 90**

**ప్రతిపదార్థము :-**

పరామృతరసప్లుతా = పరామృతరసముచే తడిసినది;
జగతి = జగమున;
నిత్యమ్ = ఎల్లప్పుడు;
అంతశ్చరీ = లోపల చరించునది;
నృణామ్ = మనుష్యులయొక్క;

| | |
|---|---|
| బహిః అపి | = వెలుపల కూడ; |
| చరీ | = చరించునది; |
| పరమసంవిత్ | = పరమజ్ఞానరూపిణి; |
| ఏకాత్మికా | = ఏకాత్మరూపిణి; |
| మహద్భిః | = గొప్పవారిచేత; |
| కాంచీపురే | = కాంచీపురమున; |
| సతతమ్ | = ఎల్లప్పుడు; |
| అపరోక్షితా | = సాక్షాత్కరింపజేసికొనబడినది; |
| మాహేశ్వరీ | = మహేశ్వరునకు సంబంధించిన; |
| అహమ్మతిః | = అహమ్ అను బుద్ధి (అమ్మవారు) ; |
| మమ | = నాయొక్క; |
| మనసి | = మనస్సున; |
| అన్వహమ్ | = ఎల్లప్పుడు; |
| భాతు | = ప్రకాశించుగాక! |

**తాత్పర్యము:-**

సహస్రారచంద్రామృతరసమున తడిసినది, జగములోని నరుల లోపల బయటను చరించునది, పరమజ్ఞానరూప ఏకాత్మకయు, మహాత్ములచే నిరంతరము సాక్షాత్కరించుకొనబడినది, మాహేశ్వరునకు సంబంధించిన అహము బుద్ధిరూపిణి యునైన అమ్మవారు నా మనసున నెప్పుడు ప్రకాశించుగాక!

**వివరణము :-**

అమ్మవారు రసప్లుతా కుండలినీవేధముచే సహస్రారపరచంద్రునుండి కురియు అమృతముచే నాడులన్నియు తడిసిపోయినప్పుడు కుండలిని కూడ తడిసిపోవును. ఆ తడియుట నీ విశేషణము చెప్పుచున్నది. వ్యష్టికుండలిని పిండమున, సమష్టికుండలిని బ్రహ్మాండమున మూలాధారము నుండి సహస్రారమునకు ప్రయాణము చేయుచుండును. కావున అమ్మవారు మనుష్యుల లోపల బయటను చరించును. ఈ విషయమునే **జగతి అపి అంతశ్చరీ నృణామ్ బహిశ్చరీ** శబ్దములచే చెప్పబడినది. అమ్మవారు పరమసంవిద్రూపిణి. ఏకాత్మిక యగుటయే పరమసంవిత్తుతో ఏకీభావము నొందిన స్వరూపము కలది కావున **పరమసంవిదేకాత్మిక** అని ఏకపదముగను వ్యాఖ్యానింపబడవచ్చును. అట్టి అమ్మవారిని కాంచీనగరము నందలి పెద్దలు ఎప్పుడును సాక్షాత్కరింప జేసికొనుచునే యుందురు. వారికి వేరొక పని లేదు అను అర్థమును ఏక కారము వ్యంజించుచున్నది. మహేశ్వరునకు నేను మహేశ్వరుడను అహంకారముండును. అది మాయామయము. ఇది **ఏకోఽహమ్ బహుస్యామ్** వంటి అహమ్మతులవంటిదే.

వాస్తవమునకీ అహమ్మతి అమ్మవారే. ఆ అహమ్మతియు శివునిది కాదు. శివున కింకేమి మిగిలినది. **స్థూలోऽహమ్ కృశోऽహమ్** వంటి క్షుద్రాహమ్మతులు గాక తనకు మహేశ్వరోऽహమ్ అను అహమ్మతి కావలెనని కవి కోరుచున్నాడు. శివుని యందు మహేశ్వరోऽహమను రూపమున అమ్మవారున్నదో అట్లే జీవుడైన తన యందు అట్టి అహమ్మతి రూపమున అమ్మవారుండవలెనని కవి కోరుచున్నాడు. అన్వహమహమ్ అను శబ్దమున అహమ్ శబ్దముయొక్క ద్విరావృత్తిచే యమకాలంకారమేర్పడియున్నది. శ్లోకమునందు మకారావృత్తి వృత్త్యనుప్రాస హేతువైయున్నది.



**అవ:-** పై శ్లోకమున మహేశ్వరోऽహమ్ అను బుద్ధి తనకు కలుగవలెనని కవిచే ప్రార్థింపబడినది. ఈ శ్లోకమున తన హృదయగజమును పరమసంవిద్వృక్షమునకు కట్టివేయ ప్రార్థింపబడుచున్నది.

**శ్లో॥ తమోవిపినధావినం సతతమేవ కాఞ్చీపురే**
**విహారరసికా పరా పరమసంవిదుర్వీరుహే।**
**కటాక్షనిగలైర్దృఢం హృదయదుష్టదన్తావలం**
**చిరం నయతు మామకం త్రిపురవైరిసీమన్తినీ॥ 91**

**ప్రతిపదార్థము :-**

సతతమ్ = ఎల్లప్పుడు;
కాంచీపురే ఏవ = కాంచీనగరమునందే;
చిరమ్ = చిరకాలము;
విహారరసికా = విహరించుటయం దాసక్తిగల;
పరా = ఉత్కృష్టురాలైన;
త్రిపురవైరిసీమన్తినీ = శివుని యిల్లాలు;
మామకమ్ = నాకు సంబంధించిన;
తమోవిపినధావినమ్ = తమోమయమైన అడవిలో పరుగిడు;
హృదయదుష్టదన్తావలమ్ = మనస్సను దుష్టగజమును;
కటాక్షనిగలైః = క్రీగంటి చూపులను సంకెలచే;
దృఢమ్ = గట్టిగా;
పరమసంవిదుర్వీరుహే = గొప్పజ్ఞానమను చెట్టుకడకు;
నయతు = కొనిపోవు గాక!

**తాత్పర్యము:-**

ఎల్లప్పుడు కాంచీపురమున విహరించుటయందే ఆసక్తిగల, ఉత్కృష్టురాలైన

శివుని యిల్లాలు, తమోమయమైన అడవిలో పరుగిడు నా మనస్సను దుష్టగజమును గొప్ప జ్ఞానమను చెట్టునకు గట్టిగా కట్టివేయుటకు తీసికొనిపోవుగాక!

**వివరణము :-**

తమస్సును విపినమునుగా, తన హృదయమును ఏనుగునుగా, అమ్మవారి కటాక్షములను సంకెలలుగా, పరమసంవిత్తును వృక్షమునుగా రూపించుటచే నీ శ్లోకమున రూపకాలంకారమేర్పడియున్నది. ఏనుగులు మదించి యున్నప్పుడదుపు తప్పి అడవిలో పరుగిడుచుండును. అట్టి వానిని సంకెలలతో బంధించి పెద్దచెట్టునకు కట్టివేయుట లోక వ్యవహారసిద్ధము. మనస్సు మలములతో మలినమై నల్లనిదై పోయినందున ఇట ఆ మనస్సు నల్లనియేనుగుతో రూపింపబడినది. అట్లే అమ్మవారి కన్నులు నల్లనివి కావున ఇనుపసంకెలలు నల్లగా ఉండును. కావున కటాక్షములు(ఇనుప)సంకెలలుగా రూపింప బడినవి. జ్ఞానము కలిగినంతనే మనశ్చాంచల్య మణగిపోవును. కావున గొప్ప జ్ఞానమను చెట్టునకు కట్టివేయుమని కవి ప్రార్థించుచున్నాడు. రెండవపాదమున పరా, పరమ అను శబ్దములలో ఛేకానుప్రాసమున్నది. రేఫావృత్తితో వృత్త్యనుప్రాసము కూడ నున్నది.



**అవ:-** పై శ్లోకమున జ్ఞానమునకు మనస్సు అంటుకొని యుండునట్లు చేయవలసినదిగా అమ్మవారు ప్రార్థింపబడినది. ఈ శ్లోకమున ఆమెను స్తుతించుట తనకు చేతగాదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ త్వమేవ సతి! చణ్డికా త్వమిహ దేవి! చాముణ్డికా**
**త్వమేవ పరమాతృకా త్వమసి యోగినీరూపిణీ।**
**త్వమేవ కిల శామ్భవీ త్వమసి కామకోటీ జయా**
**త్వమేవ విజయా త్వయి త్రిజగదమ్బ! కిం బ్రూమహే॥ 92**

**ప్రతిపదార్థము :-**

దేవి = ఓ దేవీ!
సతి = సద్రూపిణీ;
ఇహ = ఇట;
త్వమ్ ఏవ = నీవే;
చణ్డికా = చండికవు;
త్వమ్ = నీవు;
చాముణ్డికా = చాముండికవు;
త్వమ్ ఏవ = నీవే;
పరమాతృకా = పరమాతృకవు;
త్వమ్ = నీవు;

| | |
|---|---|
| యోగినీరూపిణీ అసి | = యోగినీరూపిణివి అగుదువు; |
| త్వమ్ | = నీవు; |
| శాంభవీ కిల | = శామ్భవివట; |
| త్వమ్ | = నీవు; |
| కామకోటీ | = కామకోటివి; |
| అసి | = అగుదువు; |
| జయా | = జయవు; |
| త్వమ్ ఏవ | = నీవే |
| విజయా | = విజయవు; |
| త్రిజగదమ్బ | = మూడు లోకముల తల్లీ! |
| కిమ్ | = ఏమి? |
| త్వయి | = నీ విషయమున; |
| బ్రూమహే | = చెప్పగలము. |

**తాత్పర్యము:-**

ఓ సతీదేవీ! మూడు లోకముల తల్లీ, నీవే చండికవు, చాముండివి, నీవే పరమాతృకవు, నీవే యోగినీరూపిణివి, నీవే శాంభవివి, కామకోటివి, నీవే జయవు, విజయవు, నీ విషయమున ఏమి చెప్పగలము?

**వివరణము :-**

1. చండ శబ్దము బ్రహ్మావాచకము. అతని భార్య చణ్డిక. చడి (కోపే) అను ధాతువు నుండి ఏర్పడిన చండికాశబ్దము రాక్షసాది దుష్టసంహారము కొఱకు కోపమును బూనిన అమ్మవారిని చెప్పును. చండముండులను సంహరించిన కాళికకు అమ్మవారిచ్చిన బిరుదము చాముండ అయినను ఆ శబ్దము మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతులకు మూలమైన మహాదేవిని కూడ బోధించును. 2) మాతృక అనగా వర్ణము లేక వర్ణమాల. పరమాతృక అనగా వైఖరీరూపవర్ణాత్మక మాతృకకు మూలమైన పరావాగ్రూపిణి యగు అమ్మవారు. కావున ఆమె పరమాతృక 3) యోగ మనగా కలయిక. ఎవరెవరికి జీవేశ్వరులకు వారి కలయిక ఘటాకాశమహాకాశముల కలయికవంటిది. కలసిన పిమ్మట ఐక్యమును పొందుట ఘటాకాశ మహాకాశ యోగమున మన మెఱుగుదుము. ఘటాకాశమువంటి జీవుడు మహాకాశమువంటి పరమాత్మతో యోగము కలిగినప్పుడు వారిరువురి కైక్యమే సంభవించును. ఉపాధి వారిరువురికి యోగము అనగా ఐక్యము కలుగును. అట్టి యోగము కలిగియుండుటచేతను కలిగించుటచేతను అమ్మవారు యోగిని. 4) శ్రీ చక్రమున నలుబది కోణము లున్నవనుట ప్రసిద్ధి. నలుబది మూడని కొందఱు చెప్పెదరు. కోణములేగాక ఇతర స్థలములలో రేఖల యోగములున్నవి. అట్టి యోగముల కధిదేవతలు యోగినులు. 5) మూలాధారాది చక్రములలో నొక్కొక్క చక్రమున నొక్కొక్క యోగిని ఉన్నది.

విశుద్ధిచక్రమున డాకిని, అనాహతమున రాకిణి, మణిపూరమున లాకిని, స్వాధిష్ఠానమున కాకిని, మూలాధారమున సాకిని, ఆజ్ఞాచక్రమున హాకిని, సహస్రారమున యాకిని అను యోగినులున్నట్లు శ్రీ లలితాసహస్రనామస్తోత్రము చెప్పుచున్నది. 6) బ్రాహ్మ్యాదు లెనమండుగురు. వారికొక్కొక్కరి కెనమండుగురు అంశభూతలున్నారు. ఆ అఱువది నలుగురు యోగినులు వారికిని ఒక్కొక్కరి క్కొక్కకోటి చొప్పున అంశీభూతలున్నారు. వారందఱు కలసి అరువది నాలుగు కోట్లగుదురు. ఈ విషయము **మహాచతుఃషష్టికోటియోగినీ గణసేవితా** అను లలితాసహస్రనామములలోని యొక నామమువలన తెలియుచున్నది. పైన పేర్కొనబడిన నాలుగు విధముల యోగినుల రూపము లన్నియు అమ్మవారివే కాన ఆమె యోగినీరూపిణి. 7) అమ్మవారు శాంభవి. అనగా శంభువునకు సంబంధించిన శక్తి యనిగాని, విద్య యనిగాని, ముద్ర అనిగాని చెప్పవచ్చును. అమ్మవారు కామకోటి కోట్లకొలది కామములుగా మాయలోని లేక ప్రకృతిలోని రజోగుణమునుండి రూపునందుకొన్న దమ్మవారే కావున ఆమె కామకోటి అని చెప్పబడినది. కామములలో చివరిది అగ్రగణ్యమునైనది మోక్షేచ్ఛయే. అట్టి మోక్షేచ్ఛారూపిణి అమ్మవారు. అమ్మవారికి **జయా విజయా** అను ఇద్దరు సేవకురాండ్రున్నారు. వారును అమ్మవారి రూపాంతరములే కావున అమ్మవారే. ఇట్లెంత చెప్పినను నోరు నొప్పిపుట్టునట్లు చెప్పినను అమ్మవారి మహిమ ఆవగింజంత భాగమును చెప్పినట్లు కాదు. కావున ఇంతటితో ఏమి చెప్పగలము? అని చెప్పి కవివలె ముగించుట మంచిది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారిని స్తుతించుట చేతకాని పని అని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె కృపావీక్షణము చెప్పబడుచున్నది.

**శ్లో॥ పరే! జనని! పార్వతి! ప్రణతపాలిని! ప్రాతిభ-**
**ప్రదాత్రి! పరమేశ్వరి! త్రిజగదాశ్రితే! శాశ్వతే!।**
**త్రియమ్బకకుటుమ్బిని! త్రిపదసఙ్గిని! త్రీక్షణే!**
**త్రిశక్తిమయి! వీక్షణమ్మయి నిధేహి కామాక్షి! తే॥ 93**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| పరే | = ఓ పరాశక్తిస్వరూపిణీ! |
| జనని | = ఓ తల్లీ! |
| పార్వతి | = ఓ పార్వతీ! |
| ప్రణతపాలిని | = నమస్కరించిన వారిని పాలించుదానా! |
| ప్రాతిభప్రదాత్రి | = ప్రతిభాశక్తుల సమూహమును ప్రసాదించుదానా! |
| పరమేశ్వరి | = ఓ పరమైశ్వర్యము కలదానా! |
| శాశ్వతే | = ఓ శాశ్వతురాలా! |

| | |
|---|---|
| త్రియంబకకుటుంబిని | = శివుని యిల్లాలా! |
| త్రిపదసంగిని | = మూడు లోకములందుండుదానా! |
| త్రీక్షణే | = మూడు కన్నులు కలదానా! |
| త్రిశక్తిమయి | = మూడు శక్తులు స్వరూపములుగా కలదానా! |
| కామాక్షి | = ఓ కామాక్షీ దేవీ! |
| తే | = నీయొక్క; |
| వీక్షణమ్ | = చూపును; |
| మయి | = నాయందు; |
| నిధేహి | = ఉంచుము. |

**తాత్పర్యము:-**

ఓ పరాశక్తీ, తల్లీ పార్వతీ, నమస్కరించిన వారిని ప్రేమించుదానా! ప్రతిభాసమూహముల ప్రసాదించుదానా, త్రిలోకములచే నాశ్రయింపబడుదానా, శాశ్వతురాలా, ముక్కంటి ఇల్లాలా, మూడు లోకములతో సంగము కలదానా, మూడు కన్నులు కలదానా, త్రిశక్తిస్వరూపిణీ, కామాక్షీదేవీ నీ చూపు నాయందు ఉంచుము.

**వివరణము :-**

1) అమ్మవారు పర అనగా ఉత్కృష్టురాలు. శివుని పరా, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, కుండలినీ, మాతృకా అను ఆఱు శక్తులలో పరాశక్తి మొదటిది. మిగిలిన అయిదు శక్తులకును ఆ పరాశక్తియే మూలము కావున పరాశక్తియే శివస్వరూపిణి, శక్తి స్వరూపిణియు నని గమనింపవలెను. ఇది **శాంభవ సిద్ధాంతానుసారము.** 2) ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తి స్వరూపములైన పశ్యన్తీ మధ్యమా వైఖరీ వాక్కులకు మూలమైన పరాశక్తి వాక్కుయొక్క స్వరూపము కలది కావున అమ్మవారు పర. ఇది **శాక్తేయ సిద్ధాంతము.** 3) జీవశక్తి ప్రత్యగ్రూపము. ఈశ్వరశక్తి పర రూపము. కావున ఈశ్వరశక్తియైన అమ్మవారు పర. 4) అమ్మవారు తల్లి. లోకమున నందఱకును తల్లులుందురు. ఆ తల్లులకును అమ్మవారు తల్లి. ఆమెకు మరొక తల్లి లేనందున ఆమె పరా జనని. మరియు మిగిలిన స్త్రీలు ఒకరికి తల్లిగా నున్నను మరొకరికి భార్యగా, ఇంకొకరికి కోడలుగా, మరొకరికి చెల్లెలుగా, మరొకరికి కూతురుగా నుండుటచే వారిలో మాతృత్వముతో పాటు మిగిలినవి ఉండును. అమ్మవారి యందలి మాతృత స్నుషాత్వాదులలో అవిచ్ఛిన్నము కాక అనవచ్ఛిన్నముగా నుండును. కావున ఆమె జనని యనుటకే సర్వధా తగినది. శివున కామె భార్యగాదా అనవచ్చును. కాని ఆమె శివభిన్న కాదు. కావున ఆమె మాతృత్వము భార్యాత్వముచే పరిచ్ఛిన్నము కాదు. అవతారస్వీకరణసమయమున అమ్మవారు పర్వతరాజునకు కూతురుగా నవతరించి పార్వతియైనది. అమ్మవారు ప్రణతపాలిని. ప్రణతులను పాలించగల సామర్థ్యము కలది. ఇతరులకు ప్రణామములు చేయువారుండవచ్చును. కాని వారు వారిని పాలించలేరు. కావున వారు ప్రణతపాలురని చెప్పరాదు. ఒకవేళ వారు ప్రణతుల పాలించినను ఆ శక్తి

అమ్మవారి నుండి లభించినదే. కావున అది వారిది కాదు. కావున అమ్మవారొక్కతెయే ప్రణతపాలిని. అమ్మవారు ప్రాతిభప్రదాత్రి. ప్రతిభ అనగా నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞ. అనేక విషయములకు సంబంధించిన వేర్వేరు ప్రతిభల సమూహము ప్రాతిభము. ఆ ప్రాతిభమును ప్రసాదించునది కావున ఆమె ప్రాతిభప్రదాత్రి. ఆమె పరమైశ్వర్యము కలది. పరమైశ్వర్యము ఆమెదే. సర్వప్రపంచమునందధికారము ఆమెదే. ఆమెకు ఈశ్వరుడు మరొకడు లేడు. ఆమెయే పరమేశ్వరి. ఆమె త్రిజగదాశ్రిత. మూడు లోకముల వారును ఆమె నాశ్రయించి రక్షణమును జీవనమును సుఖమును పొందవలసియున్నది. ఆమెను తప్ప వేరొకరి నాశ్రయించిన వారికవి లభింపవు. అందువలన ఆమెయే త్రిజగదాశ్రిత. ఇంద్రాదులు నామె నాశ్రయించి కొందఱకాశ్రితులగుట యథార్థమే, అయినను ఇతరాశ్రితులాశ్రయించినారనగా ఆ ఇతరులును పరమ్పరగా అమ్మవారి నాశ్రయించినట్లే. ఆమె శాశ్వతత్వము గలది. కావున ఆమెయే శాశ్వతి అని చెప్పదగినది. త్రిజగదాశ్రితే అను పదములలో పదాంతానుప్రాసము కలుగటకు **శాశ్వతే** అని చెప్పబడినదేమో. శ్రీ లలితాసహస్రనామ స్తోత్రమున **శాశ్వతీ** నామమే ఉన్నది. కావున శాశ్వతీ అను పాఠమే సమంజసమేమో. అమ్మవారు త్రిపదసంగిని. త్రిపదములనగా 1. సృష్టిస్థితిలయ స్థానములు. ఆ మూడు ఆమె యందే ఉండుటచే ఆమె త్రిపదముతోడి సంగము కలది. కావున త్రిపదసంగిని యైనది. త్రిపదములనగా 2. సత్యవైకుంఠకైలాసములు. ఈ మూడు పదములలో మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళీ రూపమున నుండుటచే ఆమె త్రిపదసంగిని యైనది. 3. భూర్భువస్సువర్లోకములు త్రిపదములు. వానితో సంగము కలది కావున నామె త్రిపదసంగిని. 4. జాగ్రత్స్వప్నసుషుప్తులు త్రిపదములు. వానిలో విశ్వవైశ్వానరతైజస, హిరణ్యగర్భ ప్రాజ్ఞావ్యాకృతరూపమున సంగము కలిగియున్నందున ఆమె త్రిపదసంగిని యైనది. **త్రిషు ధామసు యద్భోగ్యమ్।** (క్రై. 18) ఇత్యాది శ్రుతి దీనికి ప్రమాణము. అమ్మవారు త్రీక్షణ. ముక్కంటియైన శివుని అర్ధాంగి కావున ఈమె కన్నులు కూడ మూడు. అందువలన ఈమె త్రీక్షణ. అమ్మవారు త్రిశక్తిమయి. త్రి శక్తులనగా అమ్మవారి వీక్షణము మనపై నున్నచో రక్షణ కవచమున్నట్లే. మనకెట్టి యాపదలును రావు. అందుచేత కవి అమ్మవారిని వీక్షణమును తన యందుంచుమని కోరుచున్నాడు. పూర్వార్ధమున తొలి యైదు సంబోధనములు పకారాదులైయున్నవి. మూడవపాదమున **త్రి** వర్ణమైత్రి ఉన్నది. మూడవ పాదమున మూడు సంబోధనములు త్రిపదాదులై త్రి సంఖ్యయొక్క ప్రాధాన్యమును తెలుపుచున్నవి. ఓంకారమున వర్ణములు మూడు, మూర్తులు ముగ్గురు, లోకములు మూడు, అవస్థలు(జాగ్రత్స్వప్నసుషుప్త) మూడు, మూడు కృత్యములు (సృష్టిస్థితిలయలు), మూడు కాలములు (భూతభవిష్యద్వర్తమానములు), మూడు పురుషములు (ప్రథమ మధ్యమోత్తమ), ఇత్యాదులెన్నియో త్రిసంఖ్యావిశేషములై యుండుట త్రిసంఖ్యా ప్రాధాన్యమును సూచించును.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి రక్షణ మర్థింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారు చిన్మంజరిగా రూపింపబడుచున్నది.

**శ్లో॥ మనోమధుకరోత్సవం విదధతీ మనీషాజుషాం**
**స్వయమ్ప్రభవవైఖరీవిపినవేదికాలమ్బినీ।**
**సదా శిశిరితా కృపామధురసేన కమ్పాతటే**
**చరాచరవిధాయినీ చరతి కాపి చిన్మఞ్జరీ॥** **94**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| మనీషాజుషామ్ | = మనీషను పొందిన వారియొక్క; |
| మనోమధుకరోత్సవమ్ | = మనస్సులను తుమ్మెదలకు సంతోషమును; |
| విదధతీ | = చేయుచున్న; |
| స్వయమ్ప్రభవవైఖరీవిపిన వేదికాలంబినీ | = బ్రహ్మయొక్క వైఖరీ వాక్కు అను విపిన వేదిక నవలంబించు; |
| కమ్పాతటే | = కమ్పానదీతీరమున; |
| కృపామధురసేన | = దయ యను తేనెతో; |
| సదా | = ఎల్లప్పుడు; |
| శిశిరితా | = చల్లబఱచబడిన; |
| చరాచరవిధాయినీ | = స్థావర జంగమముల నొనర్చు; |
| కా+అపి | = ఒకానొక; |
| చిన్మంజరీ | = జ్ఞానపు గుత్తి; |
| చరతి | = సంచరించుచున్నది. |

**తాత్పర్యము:-**

విద్వాంసుల మనస్సులను తుమ్మెదలకు ఆనందము కలిగించు, బ్రహ్మయొక్క వైఖరీ వాక్కుల అరణ్యము నందలి వేదిక నవలంబించు, కమ్పానదీతీరమున దయ యను తేనె రసముతో ఎల్లప్పుడు చల్లబఱచబడిన జంగమముల సృష్టించు ఒకానొక చిన్మంజరి చరించుచున్నది.

**వివరణము :-**

మనీష కలవారు విద్వాంసులు. విద్వాంసులను మనీషు లనుట వ్యవహారసిద్ధము. విద్వాంసుల మనస్సులు తుమ్మెదలుగా చిత్తుమంజరిగా, బ్రహ్మయొక్కవైఖరి విపిన వేదికగా, కృప మధురరసముగా రూపింపబడుటచే నిందు రూపకాలంకారమేర్పడి యున్నది. స్వయమ్ప్రభు డనగా బ్రహ్మ. పరబ్రహ్మ స్వరూపిణియైన శక్తి తన ఇచ్ఛచేతనే పాలసముద్రమున విష్ణువుగా రూపొందినది. ఆ విష్ణువుయొక్క నాభికమలమునుండి స్వేచ్ఛతో ఆమెయే బ్రహ్మగా నవతరించినది. ఆ శక్తి రూపిణియైన బ్రహ్మ స్వయమ్ప్రభువు.

అమ్మవారు తనకు తానే బ్రహ్మగా పుట్టుటచే బ్రహ్మ స్వయమ్భుభుడని పేర్కొనబడినాడు. ఆ చతుర్ముఖ బ్రహ్మయొక్క మూలాధారమున ఆ శక్తియే పరావాక్కుగా నవతరించి మణిపూరమున పశ్యన్తిగా, అనాహతమున మధ్యమగా, రూపాంతరము నంది నాల్గవ దశనొంది వైఖరియను నామాంతరముచే బ్రహ్మయొక్క కంఠమునుండి భేదించుకొని వేదరూపిణిగా అవతరించినది. బ్రహ్మయొక్క వైఖరీరూపములైన వేదము లరణ్యము లంత పెద్దవి. ఆ వేదారణ్యములలో నొకవేదిక ఉన్నది. అది ఓంకారము. అదియే వేదిక అనగా చిన్న వేదము. అనగా సర్వవేద సంగ్రహరూపమైన ఏకాక్షరము. అది వేదికగా ఒక చిన్మంజరి, జ్ఞానరూపమైన పూగుత్తి ఉన్నది. పూగుత్తి వృక్షసారమైనట్లు సర్వవేదసారప్రణవ వేదిక యందది సారతరమై యున్నది. ఆ చిన్మంజరియే పూగుత్తి. మకరందముతో నిండి యున్నట్లు కృప యను పూదేనెతో నిండి దానితో చల్లబఱచబడి యున్నది. ఆ చిన్మంజరియే అమ్మవారు. ఆమె స్థావరజంగమాత్మక సర్వసృష్టి విధాత్రి.



**అవ॥:-** పై శ్లోకమున చిద్రూపిణియైన అమ్మవారు మంజరిగా రూపింపబడినది. ఈ శ్లోకమున ఆ పరదేవతయందు కవి రమించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ కలావతి కలాభృతో ముకుటసీమ్ని లీలావతి**
**స్పృహావతి మహేశ్వరే భువనమోహనే భాస్వతి।**
**ప్రభావతి రమే సదా మహితరూపశోభావతి**
**త్వరావతి పరే సతాం గురుకృపామ్బుధారావతి॥ 95**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| ముకుటసీమ్ని | = కిరీటప్రదేశమున; |
| కలాభృతః | = చంద్రునియొక్క; |
| కలావతి | = కల గల; |
| లీలావతి | = లీలలు గల; |
| మహేశ్వరే | = శివునియందు; |
| స్పృహావతి | = కోరిక గల; |
| భువనమోహనే | = లోకమును మోహింపజేయు; |
| భాస్వతి | = ప్రకాశించు; |
| ప్రభావతి | = కాన్తిగల; |
| త్వరావతి | = త్వరగల; |
| మహితరూపశోభావతి | = గొప్ప రూపశోభగల; |
| గురుకృపాంబుధారావతి | = కరుణ యను జలధార గల; |
| పరే | = పరము నందు; |

| | |
|---|---|
| సదా | = ఎల్లప్పుడు; |
| రమే | = రమించెదను. |

**తాత్పర్యము:-**

కిరీటమున చంద్రుని గల, లీలలు గల, మహేశ్వరునియందు కోరిక గల, ప్రభ గల, ప్రకాశించు గొప్ప రూప శోభగల, త్వర గల, గొప్ప కృప యను జలధార గల పరము (అమ్మవారు) నందు ఎల్లప్పుడు రమించుచుండెదను.

**వివరణము :-**

ప్రతి పాదమున రెండేసి మొత్తము ఎనిమిది పదములలో వతి అని ముగియుటచే పదాంతానుప్రాసమేర్పడి యున్నది. ప్రథమపాదమున లకారావృత్తి, ద్వితీయపాదమున హకారావృత్తి, తృతీయపాదమున భకారావృత్తి, నాల్గవపాదమున రేఫావృత్తి ఉండుటచే ఈ శ్లోకమున వృత్త్యనుప్రాసమేర్పడి యున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారియందు గొప్ప కృప యను అంబుధార ఉన్నట్లు వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఆ కృపచేత ఆర్ద్రయైనట్లు వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ త్వయైవ జగదమ్బయా భువనమణ్డలం సూయతే**
**త్వయైవ కరుణార్ద్రయా తదపి రక్షణం నీయతే।**
**త్వయైవ ఖరకోపయా నయనపావకే హూయతే**
**త్వయైవ కిల నిత్యయా జగతి సన్తతం స్థీయతే॥ 96**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| జగదమ్బయా | = జగదమ్బయైన; |
| త్వయా+ఏవ | = నీ చేతనే; |
| భువనమణ్డలమ్ | = భువనమండలము; |
| సూయతే | = ప్రసవింపబడుచున్నది; |
| కరుణార్ద్రయా | = దయతో తడిసిన; |
| త్వయా+ఏవ | = నీచేతనే; |
| తద్ అపి | = అది(భూమండలము) కూడ; |
| రక్షణమ్ | = రక్షణమును; |
| నీయతే | = పొందింపబడుచున్నది; |
| ఖరకోపయా | = తీక్షణమైన కోపముగల; |
| త్వయా+ఏవ | = నీ చేతనే; |
| నయనపావకే | = నేత్రాగ్నియందు; |
| హూయతే | = హవింపబడుచున్నది; |

| | |
|---|---|
| నిత్యయా | = నిత్యురాలవైన; |
| త్వయా+ఏవ | = నీచేతనే; |
| జగతి | = జగమున; |
| సంతతమ్ | = ఎల్లప్పుడు; |
| స్థీయతే | = నిలువబడుచున్నది. |

**తాత్పర్యము:-**

జగదమ్బవైన నీ చేత నీ భువనము సృష్టింపబడుచున్నది. కరుణార్ద్ర వగుటచే దీనిని కాపాడుచున్నావు. తీక్షణమైన కోపము గలదానవగుటచే దీనిని సంహరించుచున్నావు. నీవు మాత్రము నిత్యము నిలచి యున్నావు.

**వివరణము :-**

జగదమ్బయౌటచే అమ్మవారు జగమును సృష్టించినదా, జగమును సృష్టించుటచే జగదమ్బయైనదా అను ప్రశ్నము ఒక విధముగా అనవస్థా దోషమునకు చెందినది. జగదమ్బయని యనుట యెట్లు? జగమును కనుటచేత గదా? జగమును కననిదే జగదమ్బ అని అనుట యెట్లు? సృష్టి ప్రలయములు ఒకదాని తరువాత ఒకటి వచ్చునవే. వానిలో మొదటిదేది అను ప్రశ్నము కూడ అనవస్థకు సంబంధించినదే కావున లేదనిరి. ఎప్పటి నుండియో యీ సృష్టి ప్రలయము లొకదాని తరువాత ఒకటి కలుగుచునే యున్నవి. వర్తమాన జగమును కనక పూర్వమే పూర్వ కల్పీయ జగమును కని యుండుటచే అమ్మవారు జగదమ్బ యనుటలో విరోధమేమియు లేదు. కరుణ యనునదొక గుణము. అది రక్షణాది క్రియలచే ననుమేయము. జగద్రక్షణక్రియచే ఆమెకు దయ యున్నదనుట సిద్ధించును. ఆమె కరుణ జగత్తుయొక్క స్థితికి హేతువు అనుట రెండవపాదము యొక్క తాత్పర్యము. సాధారణముగా దేవతల నుద్దేశించి నేయి మొదలగు హవిర్ద్రవ్యములను అగ్నిలో వ్రేల్చుట భక్తిగౌరవములచేతనే అనుట లోకసిద్ధము. కాగా అమ్మవారు గొప్ప కోపము కలదైనందున తన నేత్రాగ్నిలోననే ఈ శోకమును హరించుచున్నది. అమ్మవారి మూడవనేత్రము అగ్నియగుట పురాణప్రసిద్ధమే. అగ్ని ఆమె అవయవమైన నేత్రముగా నున్నది. దేవతలందఱు **అంగాన్యన్యా దేవతాః** (తై. 1. 5. 1) అను శ్రుతి ననుసరించి అవయవములే. అగ్నియు నొక దేవత. అమ్మవారికి లోకముపై కోపము వచ్చినప్పుడు ఆ లోకమును తన అవయవమైన నేత్రాగ్నిలో హరించును. ఇది ఎట్లున్నదనగా గుడ్లను పెట్టిన ఆడు పాము ఆకలివేసి ఆ గుడ్లనే తినినట్లున్నది. సర్పములలోనో, పెద్ద పుళ్ళలోనో ఈ సంతానమును తిను విద్దూరముండిన ఉండవచ్చును. ఇంతకు దేవతలును జగములోని వారే. జగమునంతను సృష్టించుటలోనే అగ్ని జన్మమును అంతర్భవించి యున్నది. ఇంతేగాక ఆ అగ్ని అవయవమనుట పురాణప్రసిద్ధమైన అగుగాక. ఆ అగ్ని జగదమ్బకు బిడ్డడు కాదా. ఆతని కాకలి వేయదా? ఆతని ఆకలిని గుర్తించిన ఆ జగదమ్బ బిడ్డయైన అగ్నికి ఆహారముగా లోకములోని సర్వప్రాణులను గోరుముద్దలుగా చేసి తినిపించినది. సంహారము

కూడ కరుణ కృత్యమే. అగ్ని పై గల కరుణయొక్క కృత్యము. లోకమునం దేల ఆమెకు అంత కోపము వచ్చినది. మరణము దుఃఖరూపము కావున అది పాపఫలమని చెప్పక తప్పదు. లోకము పాపము చేసినదనిగదా దాని నామె అగ్నిలో మాడ్చివేసినది. పాపము చేయునంత పెద్దవారైనారా ఆ బిడ్డలు? అంతకు ముందే వారి స్థితి సమయమున పెంచచున్నప్పుడే వారి పాపము చేయుటనుండి అరికట్టు శిక్షణ నీయవచ్చును గదా! అంతదాక యెందుకు? సాధారణ జనని, బిడ్డ బుద్ధి నదుపుచేయలేక పోయినను జగదమ్బ సర్వశక్తిమతి కదా. పాపము చేయకూడదనే బుద్ధినే పుట్టించకుండ నుండ వచ్చునుగదా. అట్లు బిడ్డలకు పాపబుద్ధి పుట్టుచున్నప్పు డుపేక్షించినది. పుట్టి తప్పుచేసిన పిదప శిక్షించుటకు సమకట్టినది. మరియు శిక్షించుట మరొకసారి తప్పుచేయుకుండ సవరించుటకు గదా పూర్తిగా చంపుట యేల? ఏమో ఇదంతయు గందరగోళముగా నున్నది. ఈ లోకము పాపకర్మ హేతువున జన్మమరణముల ననుభవించుచున్నది. పాపపుణ్యకర్మలు హేతువులు. స్థితికాలమున సుఖదుఃఖముల ననుభవించుచున్నది. చివఱకు చచ్చుచున్నది. దేనిని ఆమె వారించుట లేదు. ఆ లోకులు పూర్వజన్మపాప హేతువున పుట్టి గిట్టు చుండగా తనకేమి పట్టనట్లు అమ్మ చూచుచున్నది. కేవలము సాక్షిగా నున్నది. సాక్ష్యమైన జగము కూడ ఆమెకు భిన్నము కాదు. కావున తన సాక్షి భావమును సాగించుచునే ఎల్లప్పుడు నిలచియున్నది. అమ్మవారందువలన నిత్యయైనది. ఆ నిత్యత్వము నిచ్చినచో ఓ తల్లీ ఇక నిన్ను విమర్శించుటకు పూనుకొనను. ఇప్పుడు చేసిన దానిని క్షమించుము. ఈ విమర్శ చేయుటకు నేను స్వతంత్రుడను కాదుగదా! నీ విచ్చిన బుద్ధితోడనే గదా ఈ పని చేసితిని. ఈ బుద్ధిని ఈ మనస్సును నిశ్చల మొనర్చి దీని ఆటలు కట్టించుము. ఇది నీకు వినోదముగనే ఉన్నచో కొనసాగింపుము. లోకమునందలి ఏ బిడ్డయైన కోరినట్లే తల్లియైన చేయునేమో కాని నీవట్లు బొత్తిగా చేయవని కాని, చేయుదువని కాని చెప్పలేను. నీవు నిత్యవై ఉన్నావు. అని కవి అనుటలో నీవట్లుండి ఆనందించుచు నా కేల ఆ ఆనందమీయవు? అను ప్రశ్నము వ్యంగ్యమగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున లోకము లనిత్యమని అమ్మవారు నిత్యయని చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి సర్వమయత్వము చెప్పబడుచున్నది.

**శ్లో॥ చరాచరవిచిన్మయీం సకలహృన్మయీం చిన్మయీం**
**గుణత్రయమయీం జగత్త్రయమయీం త్రిధామామయీమ్।**
**పరాపరమయీం సదా దశదిశాం నిశాహర్మయీమ్**
**పరాం సతతసన్మయీమ్ పరమచిన్మయీం శీలయే॥ 97**

**ప్రతిపదార్థము :-**

చరాచరవిచిన్మయీమ్ = చరాచరములలోని వివిధ చిత్తులు స్వరూపములుగా గల;

| | | |
|---|---|---|
| సకలహృన్మయీమ్ | = | అందఱి హృదయములు స్వరూపములుగా గల; |
| చిన్మయీమ్ | = | చిత్తు స్వరూపముగా గల; |
| గుణత్రయమయీమ్ | = | గుణత్రయము స్వరూపముగా గల; |
| జగత్త్రయమయీమ్ | = | మూడు లోకములు స్వరూపముగా గల; |
| త్రిధామామయీమ్ | = | మూడు ధామములు స్వరూపములుగా గల; |
| పరాపరమయీమ్ | = | పరము అపరమునైన; |
| సదా | = | ఎల్లప్పుడు; |
| దశదిశామ్ | = | పది దిక్కులైన; |
| నిశాహర్మయీమ్ | = | రాత్రిందినస్వరూపమైన; |
| సతతసన్మయీమ్ | = | ఎల్లప్పుడు సద్రూపిణిగా నుండు; |
| పరమచిన్మయీమ్ | = | పరమచిత్తు స్వరూపముగా గల; |
| పరామ్ | = | పరను; |
| శీలయే | = | ధ్యానించెదను. |

**తాత్పర్యము:-**

చరాచరములలోని విశిష్టచైతన్యములు ఆమె స్వరూపములు. సకల హృదయములు ఆమె రూపములు అయినవి. చిత్తే ఆమె రూపము. గుణత్రయము, జగత్త్రయము, ధామత్రయము ఆమె రూపములై ఏర్పడును. పరము, అపరము రెండును ఆమెయే. పది దిక్కులు, రాత్రింబవళ్ళు ఆమె రూపములే. ఎల్లప్పుడు సద్రూపిణిగానే ఆమె ఉండును. పరమచిత్స్వరూపిణికూడ ఆమెయే. అట్టి అమ్మవారిని ధ్యానించెదను.

**వివరణము :-**

చరాచరము లన్నింటను చైతన్యముండును. సోపాధికముగా నుండుటచే నా చైతన్యము భిన్నభిన్నముగా విశిష్టవిశిష్టముగా తోచును. ఒక జీవివలె మరొక జీవి యుండదు. వారి స్వభావములు కృత్యములు భిన్నభిన్నముగానే యుండును. సమష్టిసంకల్పము భగవంతునికి మనఃస్థానీయము. వ్యష్టిలోని హృదయములు అనగా మనస్సులు సమష్టిసంకల్పరూపిణియైన అమ్మవారికి భిన్నములుగావు. కావున ఆమె **సకలహృన్మయి** యని చెప్పబడినది. సత్త్వరజస్తమస్సులు గుణత్రయమని చెప్పబడును. ప్రళయకాలమున గుణత్రయము సామ్యము కలిగి ఉండును. వైషమ్యము కలిగినప్పుడు సృష్టి యేర్పడును. ఈ ప్రపంచమును సృష్టించుట రక్షించుట సంహరించుట అను ఈ మూడు క్రియలు గుణత్రయ కృత్యములే. కావున వీనిని భరించు అమ్మవారు **గుణత్రయమయి** అని చెప్పబడినది. జగత్త్రయమనగా స్వర్గమర్త్యపాతాళములు. ఈ మూడును అమ్మవారి శరీరము నందే యున్నవని పురాణములు చెప్పుచున్నవి. పాతాళము పాదములని, కటి .మర్త్యలోకమని, తల స్వర్గలోకమని నిలబడియున్న ఆమెను గూర్చి చెప్పబడినది. కూర్చొనియున్న అమ్మవారిని గూర్చి ఆమె పాదములు భూలోకమని, నాభ్యాది

కంఠాంతము భువర్లోకమని, శిరస్సు స్వర్గలోకమని చెప్పబడినది. ధామములు అనగా తేజస్సులు. అగ్ని సూర్య చంద్ర మండలములుగా తేజోరూపిణియైన అమ్మవారు చెప్పబడినది. కావున ఈ శ్లోకమున ఆమె **త్రిధామమయి** అని చెప్పబడినది. లేక ధామములనగా జాగ్రత్స్వప్నసుషుప్తులు. ఈ మూడును అమ్మవారే అయినందున త్రిధామమయి అని చెప్పబడినది. ఉపనిషత్తు యందు బ్రహ్మరూపములు రెండని ఒకటి అపరమని, మరొకటి పరమని చెప్పబడినందున అమ్మవారు **పరాపరమయి** అని ఈ శ్లోకమున చెప్పబడినది. అపరవిద్య అనగా ఋగ్వేదాది సమస్తవాఙ్మయమని, తత్త్వమసి వాక్యార్థవిచారణము పరవిద్య అని చెప్పబడి నందున అమ్మవారు పరాపరవిద్యారూపిణియై నందున ఈ శ్లోకమున ఆమె **పరాపరమయి** అని చెప్పబడినది. దశదిశామ్ నిశాహర్మయామ్ అను రెండు సమాసములు అమ్మవారియొక్క దేశకాలమయతను చెప్పును. సతతసత్తు అనగా ఎల్లప్పుడు ఉండు సత్తు కావున ఆమె **సతతసన్మయి** అని చెప్పబడినది. అట్లే **పరమచిన్మయి.** ఇట్లు పరదేవత పరయైన అమ్మవారిని ధ్యానింపవలెనని తన ఆచారమును మనకు కవి ఈ శ్లోకమున తెలుపుచున్నాడు. పెక్కు పదములు మయితో ముగియుటచేత పదాంతానుప్రాస మేర్పడియున్నది.



**అవ:-** గడచిన పదునెనిమిది శ్లోకములు పృథ్వీ వృత్తమున నిబంధింపబడినవి. ఈ శ్లోకము మొదలు శతకాంత సూచనముగా భిన్న వృత్తములు నిబంధింప బడుచున్నవి. ఈ శ్లోకము **నర్దటక వృత్తమున** (న జ భ జ జ ల గ) నిబంధింపబడుచున్నది.

**శ్లో॥ జయ జగదమ్బికే! హరకుటుమ్బిని! నేత్రరుచా**
**జితశరదమ్బుజే! ఘనవిడమ్బిని! కేశరుచా।**
**పరమవలమ్బనం కురు సదా పరరూపధరే!**
**మమ గతసంవిదో జడిమడమ్బరతాణ్డవినః॥ 98**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| హరకుటుంబిని | = | శివుని యిల్లాలైన; |
| జగదమ్బికే | = | ఓ జగదమ్బికా! |
| జయ | = | సర్వోత్కర్షముగా వర్ధిల్లుము; |
| నేత్రరుచా | = | కన్నులయొక్క కాంతిచే ; |
| జితశరదమ్బుజే | = | ఓడింపబడిన శరదృతుకమలములు గలదానా; |
| కేశరుచా | = | కేశముల కాంతితో; |
| ఘనవిడమ్బిని | = | మేఘముల ననుకరించుదానా! |
| సదా | = | ఎల్లప్పుడు; |
| పరరూపధరే | = | పరరూపమును ధరించుదానా! |

| | | |
|---|---|---|
| గతసంవిదః | = | పోయిన జ్ఞానము గల; |
| జడిమడమ్బరతాండవినః | = | జాడ్యముయొక్క ఆడంబరతాండవము గల; |
| మమ | = | నాకు; |
| పరమ్ | = | శ్రేష్ఠమైన; |
| అవలమ్బనమ్ | = | ఆలమ్బనమును; |
| కురు | = | చేయుము. |

**తాత్పర్యము:-**

నేత్రకాంతితో శరత్కమలముల జయించిన, కేశకాంతిచే మేఘముల ననుకరించు ఓ శివుని యిల్లాలవైన జగదమ్బికా! సర్వోత్కర్షముగా వర్ధిల్లుము. ఎల్లప్పుడు ఉత్కృష్టరూపమును ధరించుదానా, జ్ఞానమును కోల్పోయి జాడ్యము తాండవించు చున్నట్లుండిన నాకు ఆధారముగా నుండుము.

**వివరణము :-**

1) **నేత్రరుచా జితశరదమ్బుజే** అను సంబోధనమున ఉపమానమైన అమ్బుజమోడినట్లు చెప్పబడుటచే ప్రతీపాలంకారమేర్పడియున్నది. **కేశరుచా ఘనవిడమ్బిని** అను సంబోధనమున ఉపమాలంకార స్ఫూర్తి ఉన్నది. పూర్వార్ధమున పాదాంతాను ప్రాసము **రుచా** అను పదముతో రెండు పాదములు ముగియుటచే నేర్పడియున్నది. 1-2-3 పాదములలో ఆఱవ అక్షరము బిందు పూర్వక బకారము ప్రాసముగా నున్నది. నాలుగవ పాదమున కూడ బిందు పూర్వక వకార మున్నది. వ, బ యోరభేదః అను సూక్తి ననుసరించి దాని యందును ప్రాస మున్నదని చెప్పవచ్చును. అట్లే యున్నందున వృత్త్యనుప్రాసమేర్పడి యున్నది. మూడవ పాదమున పర శబ్దము పునరావృత్తమై వర్ణమైత్రి ప్రాసల కలిగించుచున్నవి.

2) యది భవతో నజౌ భజజలా గురు **నర్దటకమ్.** ఇతి లక్షణమ్.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారు **హరకుటుంబిని** అని సంబోధింపబడినది. ఈ శ్లోకమున హరుడు భూషాభూతచంద్రుడు కావున ఆయన కుటుంబినియైన అమ్మవారు కూడ **భూషాభూతచంద్రే** అని సంబోధింపబడినది. **వృత్తము-మాలినీ.**

**శ్లో॥ భువనజనని! భూషాభూతచన్ద్రే! నమస్తే**
**కలుషశమని! కమ్పాతీరగేహే! నమస్తే।**
**నిఖిలనిగమవేద్యే! నిత్యరూపే! నమస్తే**
**పరశివమయి! పాశచ్ఛేదహస్తే! నమస్తే॥** **99**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| భువనజనని | = | ఓ లోకమాతా! |

భూషాభూతచంద్రే = (శిరో) భూషణముగా చేయబడిన చంద్రుడు గలదానా!
తే = నీకు;
నమః = నమస్సు;
కలుషశమని = పాపముల బోగొట్టుదానా!
కమ్పాతీరగేహే = కమ్పానదీతీరమున గృహము గలదానా!
తే = నీకు;
నమః = నమస్సు;
నిఖిలనిగమవేద్యే = సమస్త వేదములచే తెలియదగినదానా!
తే = నీకు;
నమః = నమస్సు;
పరశివమయి = పరశివుడు స్వరూపముగా గలదానా!
పాశచ్ఛేదహస్తే = పాశమును ఛేదించు హస్తము గలదానా!
తే = నీకు;
నమః = నమస్సు.

**తాత్పర్యము:-**

లోకమాతా! చంద్రభూషణా నీకు నమస్కారము. పాపములను బోగొట్టుదానా, కమ్పానదీతీరమున గృహము కలదానా, నీకు నమస్కారము. సమస్తవేదవేద్యురాలా, నిత్యమైన రూపము కలదానా, నీకు నమస్కారము. పరమ శివస్వరూపిణీ! పాపమును ఛేదించు హస్తము కలదానా, నీకు నమస్కారము.

**వివరణము :-**

1) ప్రతిపాదమున రెండు సంబోధనము లున్నవి. నమః పదమును ప్రతి సంబోధనమునకు విడిగా అన్వయించినచో ఈ శ్లోకమున అష్ట నమస్కారములు అనగా సాష్టాంగనమస్కారము చెప్పబడినట్లైనది. అమ్మవారి ఒక చేత పాశమున్నది. దానితో లోకములోని వారందఱికి పరస్పరము పితాపుత్ర భావము మాతపుత్రీ భావము, భార్యాభర్తృ భావము. సోదర భావము మొదలైన బంధములు కల్పించి సంసారబద్ధులజేసిన ఆ పాశముగల చేతనే పాశమును ఛేదించునని కవి చెప్పుట విశేషము. ప్రథమపాదమున 1-7 భు వర్ణమైత్రి, ద్వితీయపాదమున 1-7 క వర్ణమైత్రి, తృతీయపాదమున 1-9 ని వర్ణమైత్రి, చతుర్థపాదమున 1-7 ప వర్ణమైత్రి ఉన్నవి. వృత్తము-మాలినీ, దీని గణములు న, న, మ, య, య.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారికి అష్టనమస్సులు చేయబడినవి. ఈ శ్లోకమున కవిచే తన మనస్సున అమ్మవారి విహరణము కోరబడుచున్నది.

శ్లో॥ క్వణత్కాఞ్చీ కాఞ్చీపురమణివిపఞ్చీలయఝురీ-
శిరఃకమ్పా కమ్పావసతిరనుకమ్పాజలనిధిః।
ఘనశ్యామా శ్యామా కఠినకుచసీమా మనసి మే
మృగాక్షీ కామాక్షీ హరనటనసాక్షీ విహరతామ్॥ 100

ప్రతిపదార్థము :-

| | |
|---|---|
| క్వణత్కాంచీ | = ధ్వనించు ఒడ్డాణముగల; |
| కాంచీపురమణివిపంచీలయ ఝురీశిరఃకమ్పా | = కాంచీపురిలోని మాణిక్య వీణలలయ ప్రవాహమునకు తలయూచు; |
| కమ్పావసతిః | = కమ్పానదియందు నివాసము గల; |
| అనుకమ్పాజలనిధిః | = దయకు సముద్రమైన; |
| ఘనశ్యామా | = మేఘమువలె నీలమైన; |
| శ్యామా | = మధ్య యౌవనముగల; |
| కఠినకుచసీమా | = కఠినమైన స్తనముల ప్రాంతము గల; |
| మృగాక్షీ | = జింక కన్నులవంటి కన్నులు గల; |
| హరనటనసాక్షీ | = శివుని నటనకు సాక్షియైన; |
| కామాక్షీ | = కామాక్షీ దేవి; |
| మే | = నాయొక్క; |
| మనసి | = మనసు నందు; |
| విహరతామ్ | = విహరించుగాక! |

**తాత్పర్యము:-**

ధ్వనించు నొడ్డాణము గల, కాంచీపురమందలి మాణిక్యవీణల లయ ప్రవాహమునకు తలయూచు, కమ్పానది నివాసముగా గల, దయాజలధియైన మేఘమువలె నల్లనైన, యౌవనమధ్యస్థయైన కఠినస్తనమండలముగల, జింక కన్నులవంటి కన్నులు గల, శివుని నటనకు సాక్షియైన కామాక్షీ దేవి నా మనసున విహరించుగాక!

**వివరణము :-**

**క్వణత్కాంచీ** శబ్దము అమ్మవారి యొడ్డాణము గజ్జల యొడ్డాణమని తెలుపుచున్నది. తరువాతి విశేషణముకూడ కాంచీ శబ్దముతో నారంభింపబడుటచే ముక్తపదగ్రస్తాలంకార మేర్పడియున్నది. ఆ విశేషణము అమ్మవారికి గల సంగీతరసికత్వమును వ్యంజించుచున్నది. ఈ విశేషణము కమ్పాశబ్దముతో ముగిసి మరొక విశేషణము కమ్పా శబ్దముతో నారంభించుటచే ముక్తపదగ్రస్తాలంకార మేర్పడి యున్నది. ఈ కమ్పావసతి అను సమాసముయొక్క వాచ్యార్థము అనన్వితమై యున్నది. కమ్పానదియందు వసతి ఎవరికి ఉండదు గదా! ఈ ప్రశ్నమునకు విష్ణువు జలనిధియందు

వసతి గలవారైనట్లు అమ్మవారికి కమ్పానదియందు వసతి ఉన్నట్లు అంగీకరింపవచ్చును. లేక లక్షణావృత్తి నాశ్రయించి కమ్పయందు వసతి అనగా కమ్పానదికి మిక్కిలి దగ్గఱగా ఆమె వసతి ఉన్నదని అర్థము చెప్పవచ్చును. దీనివలన కమ్పానదికి అమ్మవారి వలన, అమ్మవారి వలన కమ్పానదికి ప్రసిద్ధి యేర్పడుట వ్యంగ్యమగుచున్నది. **అనుకమ్పా జలనిధి** యను విశేషణముచేత అనుకమ్ప అనగా దయ అయిపోవునది కాదని, అది నిత్యమని, పూర్ణమని ఎంత తోడుకొన్నను అది అవిచ్ఛిన్నముగా పెల్లుబుకుచునే యుండునని తెలియుచున్నది. కమ్పా శబ్దము అర్థభేదమున రెండవపాదమున మూడు సార్లు ప్రయోగించుటచే యమకమను శబ్దాలంకార మేర్పడి యున్నది. **ఘనశ్యామా శ్యామా** అను శబ్దములతో శ్యామా శబ్దావృత్తి ముక్తపదగ్రస్తాలంకారమును, యమకాలంకారమును కలిగించుచున్నది. **కఠిన కుచసీమా** శబ్దముతో కూడి ఘనశ్యామా శబ్దము పదాన్తానుప్రాసము నేర్పరచుచున్నది. ఈ ఘనశ్యామా శబ్దమున మృగాక్షీ శబ్దమునను లుప్తోపమాలంకారము లేర్పడియున్నవి. నాల్గవ పాదమందలి మొదటి మూడు శబ్దములు కలసి పదాన్తానుప్రాసము నేర్పఱుచుచున్నవి. మూడవ పాదమున **ఘ** క వర్ణముల మైత్రి ఉన్నది. వృత్తము-**శిఖరిణీ.** దీని గణములు య, మ, న, స, భ, ల, గ.



**అవ:-** పై శ్లోకమున నాల్గవపాదమున పదాన్తానుప్రాసాలంకారము కూర్పబడినది. ఈ శ్లోకమున శ్లోకమునందధిక శబ్దములతో పదాన్తానుప్రాసము కూర్పబడినది.

**శ్లో॥ సమరవిజయకోటీ సాధకానన్దధాటీ**
**మృదుగుణమణిపేటీ ముఖ్యకాదమ్బవాటీ।**
**మునినుతపరిపాటీ మోహితాజాణ్డకోటీ**
**పరమశివవధూటీ పాతు మాం కామకోటీ॥ 101**

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| సమరవిజయకోటీ | = | యుద్ధములందు విజయముల కోట్లు కలిగిన; |
| సాధకానందధాటీ | = | సాధకుల ఆనందముయొక్క తీవ్రతయైన; |
| మృదుగుణమణిపేటీ | = | మృదుగుణములనెడి మణులకు పెట్టెయైన; |
| ముఖ్యకాదంబవాటీ | = | కదంబవృక్షములధికముగానున్న తోటగల; |
| మునినుతపరిపాటీ | = | మునులచే పొగడబడిన పద్ధతి గల; |
| మోహితాజాండకోటీ | = | మోహింపజేయబడిన బ్రహ్మాండ కోట్లు గల; |
| పరమశివవధూటీ | = | పరమశివునియొక్క యిల్లాలైన; |
| కామకోటీ | = | కామకోటీ నామముగల అమ్మవారు; |
| మామ్ | = | నన్ను; |
| పాతు | = | కాపాడు గాక. |

**తాత్పర్యము:-**

కోట్లకొలది యుద్ధములలో కోట్లకొలది విజయముల నొందిన, సాధకులకు ఆనందతీవ్రతను కలిగించు, మృదువులైన గుణములను మణుల పెట్టెలవలె దాచుకొన్న, కదంబవృక్షములధికముగానున్న తోటగల, మునులచేత పొగడబడిన మర్యాదగల, బ్రహ్మాండకోట్లను మోహింపజేయు కామకోటి యను పేరుగల పరమశివుని యిల్లాలు నన్ను కాపాడుగాక!

**వివరణము :-**

మొదటి విశేషణము అమ్మవారు కోట్లకొలది పర్యాయములు యుద్ధములలో విజయములను పొందినదని తెలుపును. పురాణములలో మహిష, శుంభ, విశుంభులను కొద్దిమంది రాక్షసుల సంహరించి అమ్మవారు విజయముల నొందిన గాథలు వర్ణింపబడియున్నవి. కాని ఆమె అనంతచరిత్రముల పురాణముల నెట్లు వర్ణింపగలవు. **కోటి** శబ్దమును తత్త్వమునే సూచించును. అమ్మవారిని సమాధిలో సాక్షాత్కరించుకొన్నవారి ఆనందతీవ్రత యెంతటి దనగా దానిలో నుండి బయటకు రావలెనను ఇచ్ఛయే ఆ సమయమున పుట్టదు. సమాధి ప్రదేశమునకు పూర్వ క్షణమునందలి ఇచ్ఛ వలన వారు బయటకు వచ్చినను మరల మరల ఆ సమాధి సుఖమును పొందనాకాంక్షించెదరు. ఇది రెండవ విశేషణము. చివతి ధీటీ శబ్దము వలన వ్యంగ్యమగు నంశము. అమ్మవారిలో అనంతకల్యాణగుణములున్నవి. వానినీ శ్లోకమున మృదుగుణములని చెప్పుట జరిగినది. గుణము లెంత గొప్పవనగా మణులంత గొప్పవి. కావుననే ఆ అమ్మ వానిని తన నగల కంటె భద్రముగా తనలోనే దాచుకొని వానికి తానే పెట్టెయైనది అను అర్థమును మూడవ విశేషణము వ్యంజించును. అమ్మవారికి తోటలెన్నో ఉన్నవి. వానిలో కదంబవనము ముఖ్యమైనదని నాల్గవవిశేషణము బోధించును. లేక ఆమె తోటలో అనేక పుష్పవృక్షము లున్నను వానిలో కదంబ వృక్షములధికముగా నున్నందున ముఖ్యముగా అది కదంబవనమను ప్రసిద్ధినే పొందినదను మరొక అర్థము కూడ బోధ్యమగును. రాణులకు కొన్ని మర్యాదలుండును. అవి రాజవంశముల సంప్రదాయముల ననుసరించి ఉండును. అమ్మవారనగా రాజరాజేశ్వరుని పట్టమహిషి. ఇచటి మర్యాద లేరాణులకును తెలియవు. కాని మునుల కవి స్తుతింపదగినవై యున్నవి అను నర్థము నైదవ విశేషణము బోధించును. కోట్లకొలది బ్రహ్మాండములను బుట్టించి వానిని తన మాయచే మోహితములనొనరించినదని ఆఱవ విశేషణము తెలుపును. ఆ బ్రహ్మాండములలో నొక్కొక్క దానికి బ్రహ్మ విష్ణు మహేశ్వర త్రయముండి వాని జన్మరక్షణనాశముల నొనరించుచు అమ్మవారి యాజ్ఞల బాటించు వారగుటచేతను అమ్మవారే ఆ శక్తిని వారికి ప్రసాదించుటచేతను తత్కర్తృత్వ మమ్మవారిదే యని చెప్పవలసి యున్నది. వాని మోహితత్వము కూడ ఆమె కృత్యమే. ఆ బ్రహ్మాండములలోని జనులను మాత్రమే మోహింపజేయుట కాదు. తదధిపతులైన బ్రహ్మాండాధిపతుల కన్న శ్రేష్ఠుడైన శివుడు అని అర్థము. చివటికి విశేష్యము ఆమె కామకోటి

సంజ్ఞ కలదని చెప్పుచున్నది. కోట్లకొలది బ్రహ్మాండముల సృష్టించుట కామె కోట్లకొలది కామములు కలదైనది. ఆ బ్రహ్మాండములలోని కోట్లకొలది జీవుల చరమ కామమైన మోక్షము ఆమె స్వరూపము కావున ఆమె వారి కామముల కోటియై నిలచియున్నది. ప్రథమ పాదమున స వర్ణమైత్రి, తృతీయపాదమున ము, మో వర్ణముల మైత్రి, నాల్గవ పాదమున ప వర్ణమైత్రి ఉన్నవి. రెండవపాదమున మ్బ ము వర్ణముల మైత్రి చేయబడినది. సంస్కృత భాషల వర్ణమైత్రి పాటించనవసరము లేకున్నను ఈ దాక్షిణాత్య కవి దేశీయపద్ధతిని బాటించి నియమముగా కాకున్నను వీలైనన్ని చోట్ల దానిని పాటించినారు. ఆంధ్రభాషలలో మృ వర్ణము మి మీ మె మే లతోడనే మైత్రి ఉన్నను మృ వర్ణమును ౖమువలె నుచ్చరింపబడు విశేషము ననుసరించి క్వచిత్కముగా వర్ణమైత్రి పాటించుట విద్వాంసు లెఱుగుదురు. అట్టి క్వాచిత్క వర్ణమైత్రి యిట ఏర్పడి యున్నదని భావింపవచ్చును. వృత్తము-**మాలినీ.**



**అవ:-** పై శతకానంతర శ్లోకమున తన రక్షణమును కవి అర్థించినాడు. ఈ శ్లోకమున ఈ స్తుతిశతక మొక్కటి సమస్తపుణ్యకర్మఫలమును పాఠకులకు ప్రసాదించునని కవిచే చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఇమం పరవరప్రదం ప్రకృతిపేశలం పావనం**
**పరాపరచిదాకృతిప్రకటనప్రదీపాయితమ్।**
**స్తవమ్ పఠతి నిత్యదా మనసి భావయన్నమ్బికాం**
**జపైరలమలం మఖైరధికదేహసంశోషణైః॥ 102**

**ప్రతిపదార్థము :-**

| | | |
|---|---|---|
| పరవరప్రదమ్ | = | గొప్ప వరముల నిచ్చు; |
| ప్రకృతిపేశలమ్ | = | సహజ సుకుమారమైన; |
| పావనమ్ | = | పవిత్రమైన; |
| పరాపరచిదాకృతిప్రకటన ప్రదీపాయితమ్ | = | పరములు అపరములైన చిదాకృతులను ప్రకాశించుటలో ప్రదీపమైన; |
| ఇమమ్ | = | ఈ; |
| స్తవమ్ | = | స్తుతిని; |
| మనసి | = | మనస్సున; |
| నిత్యదా | = | నిత్యము; |
| అమ్బికామ్ | = | అమ్మవారిని; |
| భావయన్ | = | భావించుచు; |
| పఠతి | = | పఠించినచో; |

అధికదేహసంశోషణైః = అధికముగా దేహమును పీడించు;
జపైః = జపములతో;
అలమ్ = పనిలేదు;
మఖైః = యజ్ఞములతో;
అలమ్ = పనిలేదు.

**తాత్పర్యము:-**

పరమును మోక్షమును వరముగా ప్రసాదించునది, గొప్ప చిన్న జీవుల ఆకృతులకు స్వస్వరూపమును చూపించుటలో ప్రదీపమైన ఈ స్తుతిని పఠించినచో ఎక్కువగా దేహమును పీడించు జపములతో గాని యజ్ఞములతో గాని పనిలేదు.

**వివరణము :-**

అమ్మవారి స్తుతి ఏ వరములనైన ఇచ్చును. చిన్న చిన్న వరముల నితరదేవతా స్తుతియే యిచ్చుచుండ ఈ స్తుతి ఈయదా? ఇచ్చును. కాని ఈ స్తుతి గొప్పవరమైన మోక్షము నీయగలదై యుండగా చిన్న చిన్న వరముల కోరుట కోరువారి అవివేకమునే తెలుపునను అర్థము నీ మొదటి స్తుతి విశేషణము వ్యంజించుచున్నది. ఈ స్తుతి అల్పులు అధికులునైన జీవుల స్వరూపమైన కేవల జ్ఞానరూపత అను యథార్థమైన ఆకృతిని చూపుటలో ప్రదీపమువలె నున్నదని చెప్పు నీ రెండవ విశేషణ ముపమాలంకారస్ఫూర్తి కలిగి ఉన్నది. ఉత్తరార్ధమున జపమఖములు మాత్రమే పేర్కొనబడినను అవి ఉపలక్షణములు కావున సర్వకర్మల ఫల మీ అల్పాయాసస్తుతివలన లభించుచుండగా అధికదేహపీడన సాధ్యములైన జపాది కర్మల, యజ్ఞాది కర్మల, తన్మూల మానసిక వ్యాపారసాధ్యములైన అన్ని కర్మలు, పై యర్థమును వ్యంజింపజేయబడుచున్నది. పూర్వార్ధమున నాలుగు విశేషణములు పకారాదులై పదాద్యనుప్రాసమునకు హేతువులగుచున్నవి. ఉత్తరార్ధమున నిత్యదయైన అమ్బికను మనసున భావించుచు ఈ స్తుతి పఠింపవలెనని పాఠముయొక్క అతికర్తవ్యతయొక్క సౌలభ్యమును బోధించుచున్నది. ఒక్క అమ్మవారి స్మరణముతప్ప ఇతర వ్యాపారములు అంగములు ఏవియు లేవని తెలుపుచున్నది. పిల్లవాడు చేసిన అల్పకార్యమునకు అమ్మ ఆనందించునట్లు అమ్మవారానందించుననుట **నమ్బికా** శబ్దము వ్యంజించుచున్నదని ఈ అల్పమైన బిడ్డ పనికి అనల్పమైన మోక్షమును ప్రసాదించునని అమ్బికా విశేషణమైన **నిత్యదా** అను పదము బోధించుచున్నది. ఈ శ్లోకము పృథ్వీ వృత్తమున నిబంధింపబడినది.

సర్వమూ సంపూర్ణము

శ్రీః

# స్తుతిశతకమ్ - శ్లోకానుక్రమణికా

శ్రీః

మూకపఞ్చశతీ

# కటాక్షశతకమ్

సారోల్లాసినీ వ్యాఖ్యా

శ్లో॥ మోహాన్ధకారనివహం వినిహన్తుమీడే
మూకాత్మనామపి మహాకవితావదాన్యాన్।
శ్రీకాఞ్చిదేశశిశిరీకృతిజాగరూకా-
నేకామ్రనాథతరుణీకరుణావలోకాన్॥ 1

శ్లో॥ మాతర్జయన్తి మమతాగ్రహమోక్షణాని
మాహేన్ద్రనీలరుచిశిక్షణదక్షిణాని।
కామాక్షి! కల్పితజగత్త్రయరక్షణాని
త్వద్వీక్షణాని వరదానవిచక్షణాని॥ 2

శ్లో॥ ఆనఙ్గతన్త్రవిధిదర్శిత కౌశలానా-
మానన్దమన్దపరిఘూర్ణితమన్థరాణామ్।
తారల్యమమ్బ! తవ తాడితకర్ణసీమ్నాం
కామాక్షి! ఖేలతి కటాక్షనిరీక్షణానామ్॥ 3

శ్లో॥ కల్లోలితేన కరుణారసవేల్లితేన
కల్మాషితేన కమనీయమృదుస్మితేన।
మామఞ్చితేన తవ కిఞ్చన కుఞ్చితేన
కామాక్షి! తేన శిశిరీకురు వీక్షితేన॥ 4

శ్లో॥ సాహాయ్యకం గతవతీ ముహురర్జునస్య
మన్దస్మితస్య పరితోషితభీమచేతాః।
కామాక్షి! పాణ్డవచమూరివ తావకీనా
కర్ణాన్తికం చలతి హన్త కటాక్షలక్ష్మీః॥ 5

శ్లో॥ అస్తం క్షణాన్నయతు మే పరితాపసూర్య-
మానన్దచన్ద్రమసమానయతాం ప్రకాశమ్।
కాలాన్ధకారసుషమాం కలయన్దిగన్తే
కామాక్షి! కోమలకటాక్షనిశాగమస్తే॥ 6



శ్లో॥ తాటఙ్కమౌక్తికరుచాఙ్కురదన్తకాన్తిః
కారుణ్యహస్తిపశిఖామణినాధిరూఢః।
ఉన్మూలయత్వశుభపాదపమస్మదీయం
కామాక్షి! తావకకటాక్షమతఙ్గజేన్ద్రః॥ 7



శ్లో॥ ఛాయాభరేణ జగతాం పరితాపహారీ
తాటఙ్కరత్నమణితల్లజపల్లవశ్రీః।
కారుణ్యనామ వికిరన్మకరన్దజాలం
కామాక్షి! రాజతి కటాక్షసురద్రుమస్తే॥ 8



శ్లో॥ సూర్యాశ్రయప్రణయినీ మణికుణ్డలాంశు-
లౌహిత్యకోకనదకాననమాననీయా।
యాన్తీ తవ స్మరహరాననకాన్తిసిన్ధుం
కామాక్షి! రాజతి కటాక్షకలిన్దకన్యా॥ 9



శ్లో॥ ప్రాప్నోతి యం సుకృతినం తవ పక్షపాతా-
త్కామాక్షి! వీక్షణవిలాసకలాపురన్ధ్రీ।
సద్యస్తమేవ కిల ముక్తివధూర్వృణీతే
తస్మాన్నితాన్తమనయోరిదమైకమత్యమ్॥ 10



శ్లో॥ యాన్తీ సదైవ మరుతామనుకూలభావం
భ్రూవల్లిశక్రధనురుల్లసితా రసార్ద్రా।
కామాక్షి! కౌతుకతరఙ్గితనీలకణ్ఠా
కాదమ్బినీవ తవ భాతి కటాక్షమాలా॥ 11



శ్లో॥ గఙ్గామ్భసి స్మితమయే తపనాత్మజేవ
గఙ్గాధరోరసి నవోత్పలమాలికేవ।
వక్త్రప్రభాసరసి శైవలమణ్డలీవ
కామాక్షి! రాజతి కటాక్షరుచిచ్ఛటా తే॥ 12



శ్లో॥ సంస్కారతః కిమపి కన్దలితాన్రసజ్ఞ(జ్ఞా)-
కేదారసీమ్ని సుధియాముపభోగయోగ్యాన్।
కల్యాణసూక్తిలహరీకలమాఙ్కురాన్నః
కామాక్షి! కన్దలయతు త్వదపాఙ్గమేఘః॥ 13



శ్లో॥ చాఞ్చల్యమేవ నియతం కలయన్ ప్రకృత్యా
మాలిన్యభూఃశ్రుతిపథాక్రమజాగరూకః।
కైవల్యమేవ కిము కల్పయతే నతానాం
కామాక్షి! చిత్రమపి తే కరుణాకటాక్షః॥ 14



శ్లో॥ సఞ్జీవనే జనని! చూతశిలీముఖస్య
సమ్మోహనే శశికిశోరకశేఖరస్య।
సంస్తమ్భనే చ మమతాగ్రహచేష్టితస్య
కామాక్షి! వీక్షణకలా పరమౌషధం తే॥ 15



శ్లో॥ కామద్రుహో హృదయయన్త్రణజాగరూకా
కామాక్షి! చఞ్చలదృగఞ్చలమేఖలా తే।
ఆశ్చర్యమమ్బ! భజతాం ఝటితి స్వకీయ-
సమ్పర్క ఏవ విధునోతి సమస్తబన్ధాన్॥ 16



శ్లో॥ నీలోఽపి రాగమధికం జనయన్పురారే-
ర్లోలోఽపి భక్తిమధికాం ద్రఢయన్నరాణామ్।
వక్రోఽపి దేవి! నమతాం సమతాం వితన్వన్
కామాక్షి! నృత్యతు మయి త్వదపాఙ్గపాతః॥ 17



శ్లో॥ కుణ్ఠీకరోతు విపదమ్మమ కుఞ్చితభ్రూ-
చాపాఞ్చితః శ్రితవిదేహభవానురాగః।
రక్షోపకారమనిశం జనయఞ్జగత్యాం
కామాక్షి! రామ ఇవ తే కరుణాకటాక్షః॥ 18

శ్లో॥ శ్రీకామకోటి! శివలోచనశోషితస్య
శృఙ్గారబీజవిభవస్య పునఃప్రరోహే।
ప్రేమామ్భసార్ద్రమచిరాత్ప్రచురేణ శఙ్కే
కేదారమమ్బ! తవ కేవలదృష్టిపాతమ్॥ 19

శ్లో॥ మాహాత్మ్యశేవధిరసౌ తవ దుర్విలఙ్ఘ్య-
సంసారవిన్ధ్యగిరికుణ్ఠనకేలిచుఞ్చుః।
ధైర్యామ్బుధిమ్పశుపతేశ్చులుకీకరోతి
కామాక్షి! వీక్షణవిజృమ్భణకుమ్భజన్మా॥ 20

శ్లో॥ పీయూషవర్షశిశిరా స్ఫుటదుత్పలశ్రీ-
మైత్రీ నిసర్గమధురా కృతతారకాప్తిః।
కామాక్షి! సంశ్రితవతీ వపురష్టమూర్తే-
ర్జ్యోత్స్నాయతే భగవతి! త్వదపాఙ్గమాలా॥ 21

శ్లో॥ అమ్బ! స్మరప్రతిభటస్య వపుర్మనోజ్ఞ-
మమ్భోజకాననమివాఞ్చితకణ్టకాభమ్।
భృఙ్గీవ చుమ్బతి సదైవ సపక్షపాతా
కామాక్షి! కోమలరుచిస్త్వదపాఙ్గమాలా॥ 22

శ్లో॥ కేశప్రభాపటలనీలవితానజాలే
కామాక్షి! కుణ్డలమణిచ్ఛవిదీపశోభే।
శఙ్కే కటాక్షరుచిరఙ్గతలే కృపాఖ్యా
శైలూషికీ నటతి శఙ్కరవల్లభే! తే॥ 23

శ్లో॥ అత్యన్తశీతలమతన్ద్రయతు క్షణార్ధ-
మస్తోకవిభ్రమమనఙ్గవిలాసకన్దమ్।
అల్పస్మితాదృతమపారకృపాప్రవాహ-
మక్షిప్రరోహమచిరాన్మయి కామకోటి॥ 24



శ్లో॥ మన్దాక్షరాగతరలీకృతిపారతన్త్ర్యా-
త్కామాక్షి! మన్థరతరాం త్వదపాఙ్గదోలామ్।
ఆరుహ్య మన్దమతికౌతుకశాలి చక్షు-
రానన్దమేతి ముహురర్ధశశాఙ్కమౌలేః॥ 25



శ్లో॥ త్రైయమ్బకం త్రిపురసున్దరి! హర్మ్యభూమి-
రఙ్గం విహారసరసీ కరుణాప్రవాహాః।
దాసాశ్చ వాసవముఖాః పరిపాలనీయం
కామాక్షి! విశ్వమపి వీక్షణభూభృతస్తే॥ 26



శ్లో॥ వాగీశ్వరీ సహచరీ నియమేన లక్ష్మీః
భ్రూవల్లరీవశకరీ భువనాని గేహమ్।
రూపం త్రిలోకనయనామృతమమ్బ! తేషాం
కామాక్షి! యేషు తవ వీక్షణపారతన్త్రీ॥ 27



శ్లో॥ మాహేశ్వరం ఝటితి మానసమీనమమ్బ!
కామాక్షి! ధైర్యజలధౌ సుతరాం నిమగ్నమ్।
జాలేన శృఙ్ఖలయతి త్వదపాఙ్గనామ్నా
విస్తారితేన విషమాయుధదాశకోఽసౌ॥ 28



శ్లో॥ ఉన్మథ్య బోధకమలాకరమమ్బ! జాడ్య-
స్తమ్బేరమం మమ మనోవిపినే భ్రమన్తమ్।
కుణ్ఠీకురుష్వ తరసా కుటిలాగ్రసీమ్నా
కామాక్షి! తావకకటాక్షమహాఙ్కుశేన॥ 29



శ్లో॥ ఉద్వేల్లితస్తబకితైర్లలితైర్విలాసై-
రుత్థాయ దేవి! తవ గాఢకటాక్షకుఞ్జాత్।
దూరం పలాయయతు మోహమృగీకులమ్మే
కామాక్షి! సత్వరమనుగ్రహకేసరీన్ద్రః॥ 30

శ్లో॥ స్నేహార్ద్రితాం విదలితోత్పలకాన్తిచోరాం
జేతారమేవ జగదీశ్వరి! జేతుకామః।
మానోద్ధతో మకరకేతురసౌ ధునీతే
కామాక్షి! తావకకటాక్షకృపాణవల్లీమ్॥ 31

శ్లో॥ శ్రౌతీం వ్రజన్నపి సదా సరణిం మునీనాం
కామాక్షి! సన్తతమపి స్మృతిమార్గగామీ।
కౌటిల్యమమ్బ! కథమస్థిరతాఞ్చ ధత్తే
చౌర్యఞ్చ పఙ్కజరుచాం త్వదపాఙ్గపాతః॥ 32

శ్లో॥ నిత్యం శ్రుతేః పరిచితౌ యతమానమేవ
నీలోత్పలం నిజసమీపనివాసలోలమ్।
ప్రీత్యైవ పాఠయతి వీక్షణదేశికేన్ద్రః
కామాక్షి! కిం ను తవ కాలిమసమ్ప్రదాయమ్॥ 33

శ్లో॥ భ్రాన్త్వా ముహుః స్తబకితస్మితఫేనరాశౌ
కామాక్షి! వక్త్రరుచిసఞ్చయవారిరాశౌ।
ఆనన్దతి త్రిపురమర్దననేత్రలక్ష్మీ-
రాలభ్య దేవి! తవ మన్దమపాఙ్గసేతుమ్॥ 34

శ్లో॥ శ్యామా తవ త్రిపురసున్దరి! లోచనశ్రీః
కామాక్షి! కన్దలితమేదురతారకాన్తిః।
జ్యోత్స్నావతీ స్మితరుచాపి కథం తనోతి
స్పర్ధామహో కువలయైశ్చ తథా చకోరైః॥ 35

శ్లో॥ కాలాఞ్జనం చ తవ దేవి! నిరీక్షణం చ
కామాక్షి! సామ్యసరణిం సముపైతి కాన్త్యా।
నిశ్శేషనేత్రసులభం జగతీషు పూర్వ-
మన్యత్త్రినేత్రసులభం తుహినాద్రికన్యే॥ 36



శ్లో॥ ధూమాఙ్కురో మకరకేతనపావకస్య
కామాక్షి! నేత్రరుచినీలిమచాతురీ తే।
అత్యన్తమద్భుతమిదం నయనత్రయస్య
హర్షోదయం జనయతే హరిణాఙ్కమౌలేః॥ 37



శ్లో॥ ఆరమ్భలేశసమయే తవ వీక్షణస్య
కామాక్షి! మూకమపి వీక్షణమాత్రనమ్రమ్।
సర్వజ్ఞతా సకలలోకసమక్షమేవ
కీర్తిః స్వయంవరణమాల్యవతీ వృణీతే॥ 38



శ్లో॥ కాలామ్బువాహ ఇవ తే పరితాపహారీ
కామాక్షి! పుష్కరమధఃకురుతే కటాక్షః।
పూర్వః పరం క్షణరుచా సముపైతి మైత్రీ-
మన్యస్తు సన్తతరుచిం ప్రకటీకరోతి॥ 39



శ్లో॥ సూక్ష్మేఽపి దుర్గమతరేఽపి గురుప్రసాద-
సాహాయ్యకేన విచరన్నపవర్గమార్గే।
సంసారపఙ్కనిచయే న పతత్యమూన్తే
కామాక్షి! గాఢమవలమ్బ్య కటాక్షయష్టిమ్॥ 40



శ్లో॥ కామాక్షి! సన్తతమసౌ హరినీలరత్న-
స్తమ్భే కటాక్షరుచిపుఞ్జమయే భవత్యాః।
బద్ధోఽపి భక్తినిగలైర్మమ చిత్తహస్తీ
స్తమ్భం చ బన్ధమపి ముఞ్చతి హన్త చిత్రమ్॥ 41



శ్లో॥ కామాక్షి! కార్ష్ణ్యమపి సన్తతమఞ్జనం చ
బిభ్రన్నిసర్గతరలోఽపి భవత్కటాక్షః।
వైమల్యమన్వహమనఞ్జనతాం చ భూయః
స్థైర్యం చ భక్తహృదయాయ కథం దదాతి॥ 42

శ్లో॥ మన్దస్మితస్తబకితమ్మణికుణ్డలాంశు-
స్తోమప్రవాలరుచిరం శిశిరీకృతాశమ్।
కామాక్షి! రాజతి కటాక్షరుచేః కదమ్బ-
ముద్యానమమ్బ! కరుణాహరిణేక్షణాయాః॥ 43

శ్లో॥ కామాక్షి! తావకకటాక్షమహేన్ద్రనీల-
సింహాసనం శ్రితవతో మకరధ్వజస్య।
సామ్రాజ్యమఙ్గలవిధౌ మణికుణ్డలశ్రీ-
ర్నీరాజనోత్సవతరఙ్గితదీపమాలా॥ 44

శ్లో॥ మాతః క్షణం స్నపయ మాం తవ వీక్షితేన
మన్దాక్షితేన సుజనైరపరోక్షితేన।
కామాక్షి! కర్మతిమిరోత్కరభాస్కరేణ
శ్రేయస్కరేణ మధుపద్యుతితస్కరేణ॥ 45

శ్లో॥ ప్రేమాపగాపయసి మజ్జనమారచయ్య
యుక్తస్మితాంశుకృతభస్మవిలేపనశ్రీః।
కామాక్షి! కుణ్డలమణిద్యుతిభిర్జటాలః
శ్రీకణ్ఠమేవ భజతే తవ దృష్టిపాతః॥ 46

శ్లో॥ కైవల్యదాయ కరుణారసకిఙ్కరాయ
కామాక్షి! కన్దలితవిభ్రమశఙ్కరాయ।
ఆలోకనాయ తవ భక్తవశఙ్కరాయ
మాతర్నమోఽస్తు పరతన్త్రితశఙ్కరాయ॥ 47

శ్లో॥ సామ్రాజ్యమఙ్గలవిధౌ మకరధ్వజస్య
లోలాలకాలికృతతోరణమాల్యశోభే।
కామేశ్వరి! ప్రచలదుత్పలవైజయన్తీ-
చాతుర్యమేతి తవ చఞ్చలదృష్టిపాతః॥ 48

శ్లో॥ మార్గేణ మఞ్జుకచకాన్తితమోవృతేన
మన్దాయమానగమనా మదనాతురాసౌ।
కామాక్షి! దృష్టిరయతే తవ శఙ్కరాయ
సఙ్కేతభూమిమచిరాదభిసారికేవ॥ 49

శ్లో॥ వ్రీడానువృత్తిరమణీకృతసాహచర్యా
శైవాలితాం గలరుచా శశిశేఖరస్య।
కామాక్షి! కాన్తిసరసీం త్వదపాఙ్గలక్ష్మీ-
ర్మన్దం సమాశ్రయతి మజ్జనఖేలనాయ॥ 50

శ్లో॥ కాషాయమంశుకమివ ప్రకటం దధానో
మాణిక్యకుణ్డలరుచిమ్మమతావిరోధీ।
శ్రుత్యన్తసీమని రతః సుతరాం చకాస్తి
కామాక్షి! తావకకటాక్షయతీశ్వరోఽసౌ॥ 51

శ్లో॥ పాషాణ ఏవ హరినీలమణిర్దినేషు
ప్రమ్లానతాం కువలయం ప్రకటీకరోతి।
నైమిత్తికో జలదమేచకిమా తతస్తే
కామాక్షి! శూన్యముపమానమపాఙ్గలక్ష్మ్యాః॥ 52

శ్లో॥ శృఙ్గారవిభ్రమవతీ సుతరాం సలజ్జా
నాసాగ్రమౌక్తికరుచా కృతమన్దహాసా।
శ్యామా కటాక్షసుషమా తవ యుక్తమేత-
త్కామాక్షి! చుమ్బతి దిగమ్బరవక్త్రబిమ్బమ్॥ 53

శ్లో॥ నీలోత్పలేన మధుపేన చ దృష్టిపాతః
కామాక్షి! తుల్య ఇతి తే కథమామనన్తి।
శైత్యేన నిన్దతి యదన్యహమిన్దుపాదా-
న్పాథోరుహేణ యదసౌ కలహాయతే చ॥ 54



శ్లో॥ ఓష్ఠప్రభాపటలవిద్రుమముద్రితే తే
భ్రూవల్లివీచిసుభగే ముఖకాన్తిసిన్ధౌ।
కామాక్షి! వారిభరపూరణలమ్బమాన-
కాలామ్బువాహసరణిం లభతే కటాక్షః॥ 55



శ్లో॥ మన్దస్మితైర్ధవలితా మణికుణ్డలాంశు-
సమ్పర్కలోహితరుచిస్త్వదపాఙ్గధారా।
కామాక్షి! మల్లికుసుమైర్నవపల్లవైశ్చ
నీలోత్పలైశ్చ రచితేవ విభాతి మాలా॥ 56



శ్లో॥ కామాక్షి! శీతలకృపారసనిర్ఝరామ్బు-
స్సమ్పర్కపక్ష్మలరుచిస్త్వదపాఙ్గమాలా।
గోభిస్సదా పురరిపోరభిలక్ష్యమాణా
దూర్వాకదమ్బకవిడమ్బనమాతనోతి॥ 57



శ్లో॥ హృత్పఙ్కజమ్మమ వికాసయతు ప్రముష్ణ-
న్నుల్లాసముత్పలరుచేస్తమసాం నిరోద్ధా।
దోషానుషఙ్గజడతాం జగతాం ధునానః
కామాక్షి! వీక్షణవిలాసదినోదయస్తే॥ 58



శ్లో॥ చక్షుర్విమోహయతి చన్ద్రవిభూషణస్య
కామాక్షి! తావకకటాక్షతమః ప్రరోహః।
ప్రత్యఙ్ముఖం తు నయనం స్తిమితం మునీనాం
ప్రాకాశ్యమేవ నయతీతి పరం విచిత్రమ్॥ 59



శ్లో॥ కామాక్షి! వీక్షణరుచా యుధి నిర్జితం తే
నీలోత్పలం నిరవశేషగతాభిమానమ్।
ఆగత్య తత్పరిసరం శ్రవణావతంస-
వ్యాజేన నూనమభయార్థనమాతనోతి॥ 60



శ్లో॥ ఆశ్చర్యమమ్బ! మదనాభ్యుదయావలమ్బః
కామాక్షి! చఞ్చలనిరీక్షణవిభ్రమస్తే।
ధైర్యం విధూయ తనుతే హృది రాగబన్ధం
శమ్భోస్తదేవ విపరీతతయా మునీనామ్॥ 61



శ్లో॥ జన్తోస్సకృత్ప్రణమతో జగదీడ్యతాం చ
తేజస్వితాం చ నిశితాం చ మతిం సభాయామ్।
కామాక్షి! మాక్షికఝరీమివ వైఖరీఞ్చ
లక్ష్మీఞ్చ పక్ష్మలయతి క్షణమీ(వీ)క్షణం తే॥ 62



శ్లో॥ కాదమ్బినీ కిమయతే న జలానుషఙ్గమ్
భృఙ్గావళీ కిమురరీకురుతే న పద్మమ్।
కిం వా కళిన్దతనయా సహతే న గఙ్గాం
కామాక్షి! నిశ్చయపదం న తవాక్షిలక్ష్మీః॥ 63



శ్లో॥ కాకోలపావకతృణీకరణేఽపి దక్షమ్
కామాక్షి! బాలకసుధాకరశేఖరస్య।
అత్యన్తశీతలతమోఽప్యనుపారతం తే
చిత్తం విమోహయతి చిత్రమయం కటాక్షః!! 64



శ్లో॥ కార్పణ్యపూరరసవర్ధితమమ్బ! మోహ-
కన్దోద్గతం భవమయం విషపాదపమ్మే।
తుఙ్గం ఛినత్తు తుహినాద్రిసుతే! భవత్యాః
కాఞ్చీపురేశ్వరి! కటాక్షకుఠారధారా॥ 65



శ్లో॥ కామాక్షి! ఘోరభవరోగచికిత్సనార్థ-
మభ్యర్థ్య దేశికకటాక్షభిషక్ప్రసాదాత్।
తత్రాపి దేవి! లభతే సుకృతీ కదాచి-
దత్యన్తదుర్లభమపాఙ్గమహౌషధం తే॥ 66

శ్లో॥ కామాక్షి! దేశికకృపాఙ్కురమాశ్రయన్తో
నానాతపోనియమనాశితపాశబన్ధాః।
వాసాలయం తవ కటాక్షమముం మహాన్తో
లబ్ధ్వా సుఖం సమధియో విచరన్తి లోకే॥ 67

శ్లో॥ సాకూతసంలపితసమ్భృతముగ్ధహాసం
వ్రీడానురాగసహచారి విలోకనం తే।
కామాక్షి! కామపరిపన్థిని మారవీర-
సామ్రాజ్యవిభ్రమదశాం ప్రకటీకరోతి॥ 68

శ్లో॥ కామాక్షి! విభ్రమబలైకనిధిర్విధాయ
భ్రూవల్లిచాపకుటిలీకృతమేవ చిత్రమ్।
స్వాధీనతాం తవ నినాయ శశాఙ్కమౌలే-
రఙ్గార్ధరాజ్యసుఖలాభమపాఙ్గవీరః॥ 69

శ్లో॥ కామాఙ్కురైకనిలయస్తవ దృష్టిపాతః
కామాక్షి! భక్తమనసాం ప్రదదాతి కామాన్।
రాగాన్వితః స్వయమపి ప్రకటీకరోతి
వైరాగ్యమేవ కథమేష మహామునీనామ్॥ 70

శ్లో॥ కాలామ్బువాహనివహైః కలహాయతే తే
కామాక్షి! కాలిమమదేన సదా కటాక్షః।
చిత్రం తథాపి నితరామమమేవ దృష్ట్వా
సోత్కణ్ఠ ఏవ రమతే కిల నీలకణ్ఠః॥ 71

శ్లో॥ కామాక్షి! మన్మథరిపుం ప్రతి మారతాప-
మోహాన్ధకారజలదాగమనేన నృత్యన్।
దుష్కర్మకఞ్చుకికులం కబలీకరోతు
వ్యామిశ్రమేచకరుచిస్త్వదపాఙ్గకేకీ॥ 72



శ్లో॥ కామాక్షి! మన్మథరిపోరవలోకనేషు
కాన్తం పయోజమివ తావకమక్షిపాతమ్।
ప్రేమాగమో దివసవద్వికచీకరోతి
లజ్జాభరో రజనివన్ముకులీకరోతి॥ 73



శ్లో॥ మూకో విరిఞ్చతి పరం పురుషః కురూపః
కన్దర్పతి త్రిదశరాజతి కిమ్పచానః।
కామాక్షి! కేవలముపక్రమకాల ఏవ
లీలాతరఙ్గితకటాక్షరుచః క్షణం తే॥ 74



శ్లో॥ నీలాలకా మధుకరన్తి మనోజ్ఞనాసా-
ముక్తారుచః ప్రకటకన్దబిసాఙ్కురన్తి।
కారుణ్యమమ్బ! మకరన్దతి కామకోటి!
మన్యే తతః కమలమేవ విలోచనం తే॥ 75



శ్లో॥ ఆకాఙ్క్ష్యమాణఫలదానవిచక్షణాయాః
కామాక్షి! తావకకటాక్షకకామధేనోః।
సమ్పర్క ఏవ కథమమ్బ! విముక్తపాశ-
బన్ధాః స్ఫుటం తనుభృతః పశుతాం త్యజన్తి॥ 76



శ్లో॥ సంసారఘర్మపరితాపజుషాం నరాణాం
కామాక్షి! శీతలతరాణి తవేక్షితాని।
చన్ద్రాతపన్తి ఘనచన్దనకర్దమన్తి
ముక్తాగుణన్తి హిమవారినిషేచనన్తి॥ 77

శ్లో॥ ప్రేమామ్బురాశిసతతస్నపితాని చిత్రం
కామాక్షి! తావకకటాక్షనిరీక్షణాని।
సన్ధుక్షయన్తి ముహురిన్ధనరాశిరీత్యా
మారద్రుహో మనసి మన్మథచిత్రభానుమ్॥ 78

శ్లో॥ కాలాఞ్జనప్రతిభటం కమనీయకాన్త్యా
కన్దర్పతన్త్రకలయా కలితానుభావమ్।
కాఞ్చీవిహారరసికే కలుషార్తిచోరం
కల్లోలయస్వ మయి తే కరుణాకటాక్షమ్॥ 79

శ్లో॥ క్రాన్తేన మన్మథమదేన విమోహ్యమాన-
స్వాన్తేన చూతతరుమూలగతస్య పుంసః।
కాన్తేన కిఞ్చిదవలోకయ లోచనస్య
ప్రాన్తేన మాం జనని! కాఞ్చిపురీవిభూషే!॥ 80

శ్లో॥ కామాక్షి! కేఽపి సుజనాస్త్వదపాఙ్గసఙ్గే
కణ్ఠేన కన్దలితకాలిమసమ్ప్రదాయాః।
ఉత్తంసకల్పితచకోరకుటుమ్బపోషా
నక్తన్దివప్రసవభూనయనా భవన్తి॥ 81

శ్లో॥ నీలోత్పలప్రసవకాన్తినిదర్శనేన
కారుణ్యవిభ్రమజుషా తవ వీక్షణేన।
కామాక్షి! కర్మజలధేః కలశీసుతేన
పాశత్రయాద్వయమమీ పరిమోచనీయాః॥ 82

శ్లో॥ అత్యన్తచఞ్చలమకృత్రిమమఞ్జనం కిం
ఝఙ్కారభఙ్గిరహితా కిము భృఙ్గమాలా।
ధూమాఙ్కురః కిము హుతాశనసఙ్గహీనః
కామాక్షి! నేత్రరుచినీలిమకన్దలీ తే॥ 83

శ్లో॥ కామాక్షి! నిత్యమయమఞ్జలిరస్తు ముక్తి-
బీజాయ విభ్రమమదోదయఘూర్ణితాయ।
కన్దర్పదర్పపునరుద్భవసిద్ధిదాయ
కల్యాణదాయ తవ దేవి! దృగఞ్చలాయ॥ 84

శ్లో॥ దర్పాఙ్కురో మకరకేతనవిభ్రమాణాం
నిన్దాఙ్కురో విదలితోత్పలచాతురీణామ్।
దీపాఙ్కురో భవతమిస్రకదమ్బకానాం
కామాక్షి! పాలయతు మాం త్వదపాఙ్గపాతః॥ 85

శ్లో॥ కైవల్యదివ్యమణిరోహణపర్వతేభ్యః
కారుణ్యనిర్ఝరపయఃకృతమజ్జనేభ్యః।
కామాక్షి! కిఙ్కరితశఙ్కరమానసేభ్యః
తేభ్యో నమోఽస్తు తవ వీక్షణవిభ్రమేభ్యః॥ 86

శ్లో॥ అల్పీయ ఏవ నవముత్పలమమ్బ! హీనా
మీనస్య వా సరణిరమ్బురుహాం చ కిం వా।
దూరే మృగీ తదసమఞ్జసమఞ్జనం చ
కామాక్షి! వీక్షణరుచౌ తవ తర్కయామః॥ 87

శ్లో॥ మిశ్రీభవద్గరలపఙ్కిలశాఙ్కరోర-
స్సీమాఙ్గణే కిమపి రిఙ్ఖణమాదధానః।
హేలావధూతలలితశ్రవణోత్పలోఽసౌ
కామాక్షి! బాల ఇవ రాజతి తే కటాక్షః॥ 88

శ్లో॥ ప్రౌఢీకరోతి విదుషాం నవసూక్తిధాటీ-
చూతాటవీషు బుధకోకిలలాల్యమానమ్।
మాధ్వీరసం పరిమలం చ నిరర్గలం తే
కామాక్షి! వీక్షణవిలాసవసన్తలక్ష్మీః॥ 89

శ్లో॥ కూలఙ్కషం వితనుతే కరుణామ్బువర్షీ
సారస్వతం సుకృతినస్సులభం ప్రవాహమ్।
తుచ్ఛీకరోతి యమునామ్బుతరఙ్గభఙ్గీం
కామాక్షి! కిం తవ కటాక్షమహామ్బువాహః॥ 90

శ్లో॥ జాగర్తి దేవి! కరుణాశుకసున్దరీ తే
తాటఙ్కరత్నరుచిదాడిమఖణ్డశోభే।
కామాక్షి! నిర్భరకటాక్షమరీచిపుఞ్జ-
మాహేన్ద్రనీలమణిపఞ్జరమధ్యభాగే॥ 91

శ్లో॥ కామాక్షి! సత్కువలయస్య సగోత్రభావా-
దాక్రామతి శ్రుతిమసౌ తవ దృష్టిపాతః।
కిఞ్చ స్ఫుటం కుటిలతాం ప్రకటీకరోతి
భ్రూవల్లరీపరిచితస్య ఫలం కిమేతత్॥ 92

శ్లో॥ ఏషా తవాక్షిసుషమా విషమాయుధస్య
నారాచవర్షలహరీ నగరాజకన్యే।
శఙ్కే కరోతి శతధా హృది ధైర్యముద్రాం
శ్రీకామకోటి! యదసౌ శిశిరాంశుమౌలేః॥ 93

శ్లో॥ బాణేన పుష్పధనుషః, పరికల్ప్యమాన-
త్రాణేన భక్తమనసాం కరుణాకరేణ।
కోణేన కోమలదృశస్తవ కామకోటి!
శోణేన శోషయ శివే! మమ శోకసిన్ధుమ్॥ 94

శ్లో॥ మారద్రుహో మకుటసీమని లాల్యమానే
మన్దాకినీపయసి తే కుటిలం చరిష్ణుః।
కామాక్షి! కోపరభసాద్వలమానమీన-
సన్దేహమఙ్కురయతి క్షణమక్షిపాతః॥ 95

శ్లో॥ కామాక్షి! సంవలితమౌక్తికకుణ్డలాంశు-
చఞ్చత్స్మితశ్రవణచామరచాతురీకః।
స్తమ్భే నిరన్తరమపాఙ్గమయే భవత్యా
బద్ధశ్చకాస్తి మకరధ్వజమత్తహస్తీ॥ 96

శ్లో॥ యావత్కటాక్షరజనీసమయాగమస్తే
కామాక్షి! తావదచిరాన్నమతాం నరాణామ్।
ఆవిర్భవత్యమృతదీధితిబిమ్బమమ్బ!
సంవిన్మయం హృదయపూర్వగిరీన్ద్రశృఙ్గే॥ 97

శ్లో॥ కామాక్షి! కల్పవిటపీవ భవత్కటాక్షో
దిత్సుస్సమస్తవిభవం నమతాం నరాణామ్।
భృఙ్గస్య నీలనలినస్య చ కాన్తిసమ్ప-
త్సర్వస్వమేవ హరతీతి పరం విచిత్రమ్॥ 98

శ్లో॥ అజ్ఞాతభక్తిరసమప్రసరద్వివేక-
మత్యన్తగర్వమనధీతసమస్తశాస్త్రమ్।
అప్రాప్తసత్యమసమీపగతం చ ముక్తేః
కామాక్షి! నైవ తవ కాంక్షతి దృష్టిపాతః॥ 99

శ్లో॥ అత్యన్తశీతలమనర్గలకర్మపాక-
కాకోలహారి సులభం సుమనోభిరేతత్।
పీయూషమేవ తవ వీక్షణమమ్బ! కిన్తు
కామాక్షి! నీలమిదమిత్యయమేవ భేదః॥ 100

శ్లో॥ పాతేన లోచనరుచేస్తవ కామకోటి!
పోతేన పాతకపయోధిభయాతురాణామ్।
పూతేన తేన నవకాఞ్చనకుణ్డలాంశు-
వీతేన శీతలయ భూధర కన్యకే మామ్॥ 101

శ్రీః

# మూకపఞ్చశతీ

# కటాక్షశతకమ్

## సారోల్లాసినీ వ్యాఖ్యా



అవ॥:- మూకమహాకవి తన మోహాంధకారమును నశింపజేయ సమర్థములని శ్రీ కామాక్షీదేవియొక్క చల్లని చూపులను ఈ ప్రథమ శ్లోకమున స్తుతించుచున్నాడు.

శ్లో॥ మోహాన్ధకారనివహం వినిహన్తుమీడే
మూకాత్మనామపి మహాకవితావదాన్యాన్।
శ్రీకాంచిదేశశిశిరీకృతిజాగరూకా-
నేకామ్రనాథతరుణీకరుణావలోకాన్॥ 1

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| శ్రీ కాంచిదేశ- | = | శ్రీకాంచీనగర ప్రాంతముయొక్క |
| శిశిరీకృతి- | = | చల్లబరచుటయందు; |
| జాగరూకాన్ | = | మేల్కొనియుండునట్టి; |
| మూకాత్మనామ్+అపి | = | మూగవోయిన మనస్సు కలవారికైనను |
| మహాకవితావదాన్యాన్ | = | మహాకవిత్వమును ప్రసాదించునట్టి; |
| ఏకామ్రనాథ- | = | ఏకామ్రేశ్వరునియొక్క |
| తరుణీ- | = | భార్యయయిన శ్రీ కామాక్షీదేవియొక్క |
| కరుణావలోకాన్ | = | దయతోకూడిన చూపులను; |
| మోహాన్ధకారనివహమ్ | = | మోహమనెడి చీకట్ల రాశిని; |
| వినిహన్తుమ్ | = | నశింపజేయ; |
| ఈడే | = | స్తుతించెదను. |

తాత్పర్యము:-

శ్రీ కాంచీనగర ప్రాంతమును చల్లబఱచు నట్టివి శ్రీ కామాక్షీ కరుణావ లోకములు - అవి మూగవారికిని మహాకవిత్వము నొసగును. నా మోహాంధకార రాశిని దొలగించ వానిని స్తుతించెదను.

**వివరణము:-**

1) భూమండలమందలి అన్ని ద్వీపములును సముద్రముచే చుట్టబడి యుండును. భూదేవికి సముద్రమే కాంచియైయుండును. శ్రీకామాక్షికి సర్వబ్రహ్మాండములు కాంచీ కింకిణీరూపములే. ఆమే బ్రహ్మాండనగరనాయిక. బ్రహ్మాండములనన్నిటిని తనలో నిముడ్చుకొన్న మహాకాశము ఆమెకు అంబరము. నడుముపైనున్న పీతాంబరము నొడ్డాణముతో బిగింపవచ్చును. కాంచీనగరమిట సర్వబ్రహ్మాండోపలక్షకము. సర్వబ్రహ్మాండముల కాధారమైన ఈ నగరము కాంచి యని పిలువబడుచు భారత దక్షిణ ప్రాంతమున విరాజిల్లుచున్నది. ఆ కాంచీనగర నాయకుని ప్రాంతమున నున్న యొక శివలింగము దగ్గఱగా ఒక మామిడి చెట్టుండుటచే నేకామ్రనాథ నామము కలిగినది. ఏకామ్రనాథ నాముడైన శివునకు కామాక్షీ నామముకల దేవి భార్య. కామాక్షీ నామమున కన్నుల ప్రాధాన్యము కనబడును. మూకమహాకవి వ్రాసిన పంచశతిలోని ఐదు శతకములలో కటాక్షశతకము ముఖ్యము. కటాక్షమామెదే. ఆమె కన్నులలోనిదే. అదియే మూక మహాకవిచే నైదు శతకముల రచింపజేసినది. అక్షిప్రాధాన్యసూచకకామాక్షీ శబ్దప్రతిపాద్యదేవతాకటాక్ష ప్రాముఖ్యమే కటాక్షశతకము ప్రతిపాదించుచున్నది. **సర్వేంద్రియాణామ్ నయనం ప్రధానమ్** అన్నంత మాత్రమున మిగిలిన యింద్రియముల యావశ్యకత నివారింపబడదు. మిగిలిన శతకములున్నప్పుడే దీనికి ప్రాధాన్యము లభించును. విగ్రహమునందు పాదముఖములే అనాచ్ఛాదితములు. భక్తుల యుపాసనలకు లక్ష్యములగుట యుపపన్నము. రెండవ శతకమున పాదద్వంద్వ ముపాసింపబడినది. ముఖమునం దుపాసింపదగినవి కటాక్షమందస్మితములు. కటాక్షము కలిగినందుకు సూచనగా పెదవులపై దరహాస మంకురించును. కావున మందస్మితశతక మిందు చివరదైనది. కటాక్షము మందస్మితమునకు ముందుండవలసినది అట్లే యున్నది ఇంద్రియములలో కన్నులు తైజసములు. అజ్ఞానమోహాద్యంధకార ప్రభేదముల నివారణమున కవియే యుపయుక్తము లగును. కావుననే మూకమహాకవి యీ ప్రథమశ్లోకమున మోహాన్ధకారనివహ వినిహననమునకై శ్రీ కామక్షీ దేవి యొక్క కరుణావలోకములను ప్రార్థించుచున్నాడు. పరికరాంకురాలకారధ్వని యీ శ్లోకమునందున్నది. **జాగరూకాన్, కరుణావలోకాన్** అని ముగియు నుత్తరార్ధపాదాంతములలో అంత్యానుప్రాసయున్నది. మూకా, శ్రీకా, ఏకా అని 2,3,4 పాదముల ఆదిలో నుండుటచే నాద్యనుప్రాసము. హాక, రీక్ర, ణీక మధ్యలో నుండుటచే మధ్యానుప్రాసము అను శబ్దాలంకారములున్నవి. ఈ శతకమున వసంతతిలక వృత్త ముపయోగింపబడినది. ఇందు "తభజజగగ" (8,6) అను గణము లుండును. వసంత ముఖమునకు భ్రమరము తిలకము అనదగును. కటాక్షభ్రమరౌపమ్యము ప్రసిద్ధమగుటచే కటాక్షవర్ణనమున **వసంతతిలకవృత్త** ముపయోగించుటచే వృత్తౌచిత్యశోభిత మీశతకము.

2) ఉక్తా వసన్తతిలకా తభజా జగౌ గః। ఇతి లక్షణమ్.



**అవ॥:-** ప్రథమ శ్లోకమున అమ్మవారి చూపులను స్తుతించిన మూక మహాకవి ఈ ద్వితీయ శ్లోకమున అవి సర్వోత్కృష్టములని వర్ణించుచున్నాడు.

**శ్లో॥ మాతర్జయన్తి మమతాగ్రహమోక్షణాని**
**మాహేన్ద్రనీలరుచిశిక్షణదక్షిణాని।**
**కామాక్షి! కల్పితజగత్త్రయరక్షణాని**
**త్వద్వీక్షణాని వరదానవిచక్షణాని॥ 2**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| మాతః | = | తల్లీ! |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| మమతాగ్రహమోక్షణాని | = | మమకారమనెడి దయ్యమునుండి విడిపించునట్టి; |
| మాహేంద్రనీల- | = | ఇంద్రనీల మణుల యొక్క |
| రుచి- | = | కాంతిని |
| శిక్షణ- | = | శిక్షించుటయందు |
| దక్షిణాని | = | సమర్థములైన; |
| కల్పిత- | = | కల్పింపబడిన |
| జగత్త్రయ- | = | మూడులోకములయొక్క |
| రక్షణాని | = | రక్షణముగల; |
| వరదానవిచక్షణాని | = | వరముల నిచ్చుటయందు నేర్పుగల; |
| త్వద్వీక్షణాని | = | నీచూపులు |
| జయంతి | = | సర్వోత్కృష్టముగా వర్ధిల్లుచున్నవి. |

**తాత్పర్యము:-**

ఓ తల్లీ! కామాక్షీదేవీ! నీ చూపులు, నన్ను లేక అందఱను పట్టిన మమకారమనెడి దయ్యమునుండి విడిపించగల్గునవి. ఇంద్రనీల మణుల కాంతిని శిక్షించుటలో, ముల్లోకములకు రక్షణమును కల్పించుటలో, వరములిచ్చుటలో, సమర్థములైనవి.

**వివరణము:-**

మొదటిశ్లోకమున మోహమంధకారముగా రూపొందింపబడి దాని నాశము ప్రార్థింపబడినది. అజ్ఞానమందలి ఆవరణశక్తి మోహ మనబడును. ఉన్న వస్తువును కన్పింపకుండ గప్పివేయునది మోహము కావున నది యావరణ శక్తి. దీనివలన స్వకీయులు పరకీయులు నను భేదభావముత్పన్నమై ఒకే ఆత్మ కొందఱు తనవారుగా, కొందఱు తన వారుకాని వారుగా బహుత్వమును బొందును. వీరు తనవారు (ఇవి తనవి) అను భావమే మమకారమని పేర్కొనబడును. ఈ మమకారమొక దయ్యమువలె మనచే వికృతచేష్టల

చేయించును. అమ్మవారి చూపులాదయ్యమునుండి విముక్తి కలిగించునని యీ శ్లోకమున జెప్పబడినది. ఈశ్వరత్వవ్యవస్థాపకములైన నాలుగు కర్మలీ శ్లోకమున జెప్పబడినవి. **మోక్షణము**-మమకారము నుండి విడిపించుట. జీవులను సంసారబంధమునుండి విడిపించుటయే. **మమేతి బధ్యతే జంతుః నిర్మమేతి విముచ్యతే** అను సూక్తి యిందుకు ప్రమాణము. శిక్షణము-ఇంద్రనీల మణుల కాంతులు అర్హత లేకున్నను దేవి చూపులతో సామ్యమును, ఐక్యమును పొందగోరుటచే వానిని శిక్షించుచున్నవా యమ్మ చూపులు. అహంకారము వీడనివాడు స్థూలసూక్ష్మకారణశరీరములు నేననుకొనుచునే ఈశ్వరోఽహమని భావించును. ఇటువంటి వానిని గీత నిందించినది. **ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ** - అధ్యాయము 16 శ్లోకము 14' దుష్టులైన రాక్షసులందఱు ఈ కారణముననే శిక్షింపబడినారు. నేటికిని అప్పుడప్పుడు దుష్టులేదో విధమున నీశ్వరునిచే శిక్షింపబడుచునే యున్నారు. అర్హతకలవాడు ఈశ్వరునితో నైక్యము ననుసంధించుట శాస్త్రసమ్మతమే. దుష్ట శిక్షణముతోబాటు శిష్ట రక్షణము ఈశ్వర కృత్యమే. అమ్మ కనులు ముల్లోకముల రక్షించుచున్నవి, వరదానము-జీవుల కిహపర లోకములలో కూడ సుఖములు కావలయును. దీని **కభ్యుదయ** మనుపేరు. దానిని కూడ ఈశ్వరుడే వివిధదేవతోపాసకులకు వారిద్వారా స్వోపాసకులకు స్వయముగా ప్రసాదించును కావున నిదియు నీశ్వరకృతమే. 'ణాని' అని నాలుగు పాదముల చివఱ నుండుటచే నీశ్లోకమున నంత్యానుప్రాసాలంకారము కలదు. కన్నులకు సమానములు కాదగిన ఇంద్రనీలమణులకాంతులను శిక్షించుచున్నదని ఉపమాననింద వ్యంగ్యమగు చుండుటచే ఈ శ్లోకమునందలి అలంకారము **ప్రతీపము.**



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి చూపులు సర్వోత్కృష్టములని వర్ణించిన మూకమహాకవి ఈ శ్లోకమున ఆ చూపుల చంచలితకు గల మన్మథ తంత్ర విధానమున గల నేర్పును వర్ణించుచున్నాడు.

**శ్లో॥ ఆనఙ్గతన్త్రవిధిదర్శితకౌశలానా**
**మానన్దమన్దపరిఘూర్ణితమన్థరాణామ్**
**తారల్యమమ్బ! తవ తాడితకర్ణసీమ్నాం**
**కామాక్షి! ఖేలతి కటాక్షనిరీక్షణానామ్** **3**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| అంబ | = | తల్లీ! |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| ఆనంగతంత్రవిధి- | = | మన్మథ తంత్రవిధాన మందు |
| దర్శిత- | = | చూపబడిన |
| కౌశలానామ్ | = | నేర్పుగల; |

| | | |
|---|---|---|
| ఆనందమన్ద- | = | ఆనందము మెల్లగా |
| పరిఘూర్ణిత- | = | తిరుగుటచేత |
| మంథరాణామ్ | = | అలసములైన; |
| తాడితకర్ణసీమ్నామ్ | = | తాకిన చెవుల హద్దుగల; |
| తవ | = | నీయొక్క; |
| కటాక్షనిరీక్షణానామ్ | = | క్రీగంటిచూపులయొక్క; |
| తారల్యమ్ | = | చంచలిత |
| ఖేలతి | = | ఆడుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ చూపులు మన్మథ తంత్ర విధానమును ప్రదర్శించినవి. వానిలో ఆనందము మెల్లగా సుడి తిరుగుటచే కదలికలలో వేగము కోల్పోయినవి. అవి కర్ణాంతము వ్యాపించినవి. అట్టి నీచూపులలో చాంచల్యము ఆడుకొనుచున్నది.

**వివరణము:-**

1) భర్తయైన శివునాకర్షించుటకు నీ కన్నులు మన్మథ తంత్ర విధానము ననుసరించి శృంగారవిలాసములను బ్రదర్శించుచుండును. కామునకు అనంగుడను పేరుగలదు. కావున కామశాస్త్రమునకు **అనంగతంత్ర** మను పేరు వచ్చినది. అంతరంగమునందు పుట్టు కామునకు అంగము లేదు. విష్ణ్వంగము నందు బుట్టిన అంగజుని అంగము శివునిచే కాల్పబడినది కావున కామునకు **అనంగు** డనుపేరు వచ్చినది. **"సోఽకామయత"** అనునుపనిషద్వాక్యానుసారము ఈశ్వరుని బహుభవన సంకల్పమే కాముడు. స్త్రీ పురుషులిద్దఱు, వారిని ముగ్గురిని చేయుటకు వారి అంతరంగములలో కాముదుద్భవించును. అట్టి కాముని జయించుట శివునకు మాత్రమే సాధ్యమయినది. అదియు తాత్కాలికముగ మాత్రమే. అమ్మవారి సౌందర్యము శివునిలో కామము కల్గింపజేయలేక పోవుటయే శివుని మన్మథదాహము. నిర్గుణశివునకు కామరాహిత్యము శాశ్వతము, సగుణేశ్వరున కది తాత్కాలికము, తాద్దేశికము. ఈశ్వరుడనగా మాయాశబల బ్రహ్మము. ఆయనకు మాయతోడి సంపర్కమున సృష్టికర్తృత్వ మేర్పడినది. మాయాస్వరూపిణియైన కామాక్షీదేవి కన్నులలోని అనంగతంత్రముయొక్క మహిమ యిది. ఆమె కన్నులలోని శృంగారవిలాసములకు శివుడు బానిసయైనాడు. తనను దహించిన శివునిపై అమ్మవారి కన్నులలో దాగియుండి కాముడు అదను చూచి శివుని జయించినాడు. మన్మథుడు శ్రీ విద్యా ప్రభేదములలోని కాదివిద్యకు ద్రష్ట. త్రిపురోపనిషత్తులో నొక మంత్రమున కాదివిద్య ఉద్ధరింపబడినది. ఆ మంత్రమిది. **"కామో యోనిః కమలా వజ్రపాణిః గుహాహసా మాతరిశ్వాభ్రమింద్రః పునర్గుహా సకలా మాయయా చ పురూచ్యేషా విశ్వమాతాదివిద్యోమ్"(15)** ఈ విద్యయందు మూడు కూటములు కలవు. అందు రెండవ కూటమునకు కామరాజకూటమని పేరు. హాదివిద్యాదులుకూడ శ్రీ విద్య ప్రభేదములే.

వానిలోని ద్వితీయ కూటమునకును కామకూటమనియే పేరు. శ్రీవిద్యాసంప్రదాయములోని కామమునకున్న స్థానమిది. ఇంతేకాదు శాక్తేయసాంప్రదాయమున శివునకు కాముడు, కామేశ్వరుడు అను పేర్లు కూడా కలవు. అతని దేవేరి కామేశ్వరి. ఆమెయే ఈ కామాక్షి. కామునకు చెఱుకుగడ విల్లు, పూలు బాణములు కలవనుట కవిసమయము కాని మన్మథుడు తన యుపాస్య దేవతయైన కామాక్షీదేవి యొక్క సారూప్యము ధరించి యామె నుపాసించెను. ఆమె యనుగ్రహమున ఆ సారూప్యమే అతనికి శాశ్వతమయ్యెను. ఉపాసనాకాలమున **"నారుద్రో రుద్రమర్చయేత్ నావిష్ణుర్విష్ణుమర్చయేత్"** ఇత్యాది సూక్తుల ననుసరించి యుపాస్య దేవతారూపము వంటి రూపమును ధరింపవలెను. అందుకే శివోపాసకులు భస్మరుద్రాక్షలు ధరించెదరు. విష్ణూపాసకులు తులసీమాలోర్ధ్వ త్రిపుండ్రముల ధరించెదరు. అందుచేత కామేశ్వరీ యుపాసకుడైన కాముడు వానిని ధరించి యామె నుపాసించెను. సచ్చిదానందము లీశ్వరునికి స్వరూపములు. అమ్మ వారీశ్వరి. కావున ఆనందమామె స్వరూపము. ఆమె శరీరమంతయు నానందఘనమే. కన్నులు ఆ ఆనందముచేతనే చాపల్యము తగ్గించుకొని మెల్లగా కదలుచున్నవని కవి వర్ణించినాడు. మెల్లగా కదలినప్పుడెక్కువ కాలము తనపై నవి ప్రసరించుచుండునని కవి భావము. ఆమె కన్ను లా కర్ణాంతములు. పెద్దకన్నులలోని చూపులు మెల్లగా కదలినపుడు తనపై నెక్కువకాలము ప్రసరించుటనే విశ్లేషించి తెల్పుటకే కన్నులకు తాడితకర్ణసీమ్నా మను విశేషణమును కవి కూర్చినాడు. జగమంతయు ఆ తల్లి చూపుల విలాసమే. ఆ చూపుల ఆటయే. **ఖేలతి** యను క్రియాపదమీ యంశమును స్పష్టమొనర్చుచున్నది.

2) బేసి పాదములు నామంతములు. సరిపాదములు ణామంతములు అగుటచే నీ శ్లోకమున అంత్యానుప్రాసము కలదు.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి క్రీగంటిచూపుల చంచలితను వర్ణించిన పిదప ఈ శ్లోకమున అమ్మవారి కడగంటి చూపు సర్వసుఖముల నొసగు సమర్థమని వర్ణించుచున్నాడు.

**శ్లో॥ కల్లోలితేన కరుణారసవేల్లితేన**
**కల్మాషితేన కమనీయమృదుస్మితేన।**
**మామఞ్చితేన తవ కిఞ్చన కుఞ్చితేన**
**కామాక్షి! తేన శిశిరీకురు వీక్షితేన॥ 4**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| కల్లోలితేన | = | తరంగితమైన; |
| కరుణారసవేల్లితేన | = | కరుణారసముచే పొంగిన; |
| కల్మాషితేన | = | కలంకము కూర్పబడిన; |

| | | |
|---|---|---|
| కమనీయమృదుస్మితేన | = | మనోహరమైన చిరునవ్వుగల; |
| అంచితేన | = | గొప్పనైన; |
| కించన కుంచితేన | = | కొంచెము వంచిన; |
| తవ | = | నీయొక్క; |
| తేన | = | ఆ; |
| వీక్షితేన | = | చూపు చేత; |
| మామ్ | = | నన్ను; |
| శిశిరీకురు | = | చల్లబఱుపుము. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ శరీరమొక కరుణాసముద్రము. కన్ను అందలి తరంగమువలె నున్నది. అందు దయారసము పొంగుచున్నది. ఆ కన్ను కొంచెము వంగి యున్నది. అది చూచువారికి పూజింప దగినదిగా తోచును. అందు అందమైన మందహాసము చిందులు త్రొక్కును. దానికి కాటుక దిద్దబడియున్నది. అట్టి నీ కంటి చూపుతో సంసారతాపతప్తుడనైన నన్ను చల్లబఱుపుము.

**వివరణము:-**

1) శ్రీ శంకరులమ్మ వారిని **జయతి కరుణా కాచిదరుణా** అని కరుణా స్వరూపిణిగా పేర్కొన్నారు. శ్రీలలితాసహస్రనామస్తోత్రము **కరుణారససాగరా** అని పేర్కొన్నది. ఈ రెంటినీ కలిపి మూకమహాకవి అమ్మవారి కంటిని కరుణారస సముద్రమందలి తరంగముగా పేర్కొన్నారు. అమ్మవారి కన్నుల యందలి అరుణ్యము కారుణ్యమే. ఆ కన్నులయందు కాటుక రేఖ తీర్చబడినది. అది కన్నులలోని సహజమైన నైల్యమునకు మరింత వన్నెబెట్టుచున్నది. ఆ కన్నులయందు మందహాసము దోబూచులాడుచున్నది. అది ధావల్యమును బెంపొందజేయుచున్నది. సృష్టిస్థితిలయ హేతువులైన రజస్సత్త్వతమస్సులకు అరుణ్యానైల్యధావల్యములు ప్రతీకలు. సృష్టిస్థితులే కాక లయముకూడ అమ్మవారి కరుణా కృత్యమే. లయము లేనిచో సృష్టియే యుండదు. సృష్టిలయ పూర్వకమని **ధ్రువం జన్మ మృతస్య చ** (2.27) అను గీతా వాక్యము సిద్ధాంతీకరించి చెప్పినది. అమ్మవారి సంపూర్ణ దృష్టిని కోరుట అత్యాశయమగునేమో కొంచెము వంగిన దృష్టియైన (అనగా కరుణ లేశముగలచూపు) చాలునని అదియే లౌకికాలౌకిక సర్వసుఖముల నొసగ సమర్థమగునని అమ్మవారి కరుణాప్రభావాతిశయము వర్ణించుటకు కరుణగల కడగంటిచూపు చాలునని కవి చెప్పుచున్నాడు.

2) దక్షిణ భారత భాషల వారి కవిత్వములో వర్ణమైత్రి యను నామాంతరముగల వళికి ఆదరము హెచ్చు. కావున వారు ప్రాంతీయములైన తమభాషల కవిత్వములలో దానిని నియతమొనర్చిరి. దాక్షిణాత్య కవులు వ్రాసిన సంస్కృత కవిత్వములలో నియత

మొనర్పకున్నను దానిని పుష్కలముగా ప్రయోగించిరి. ఈ శ్లోకమున 1-6 వర్ణములకు మొదటి రెండు పాదములలో మైత్రి కూర్చ బడినది. మొత్తము 13 పదములలో 8 పదములు తేన అను నక్షరములతో ముగియుటచే పదాంతాను ప్రాసము కలదు. **కల్లోలిత** యను విశేషణము తరంగములను, **కరుణారసవేల్లిత** అను విశేషణము జలాధిక్యమును, **కల్మాషిత** యను విశేషణము సముద్రములోని కాలకూట విషమును, **కమనీయమృదుస్మిత** యను విశేషణము సముద్రములో జనించిన చంద్రుని ధ్వనింపజేయుటచే విశేష్యమైన వీక్షితమునకు సముద్రముతోడి సామ్యము ధ్వనిత మగుచున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి చూపు సర్వసుఖముల నొసగు సమర్ధమని చెప్పి, ఈ శ్లోకమున కటాక్షలక్ష్మిని శ్లేషరూపమున వర్ణించుచున్నాడు.

**శ్లో॥ సాహాయ్యకం గతవతీ ముహురర్జునస్య**
**మన్దస్మితస్య పరితోషితభీమచేతాః।**
**కామాక్షి! పాణ్డవచమూరివ తావకీనా**
**కర్ణాన్తికం చలతి హన్త కటాక్షలక్ష్మీః॥** **5**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ; |
| ముహుః | = | మాటి మాటికి; |
| అర్జునస్య | = | తెల్లనైన(అర్జునునకు); |
| మందస్మితస్య | = | చిఱునవ్వునకు; |
| సాహాయ్యకమ్ | = | తోడ్పాటుగా; |
| గతవతీ | = | వెళ్ళిన; |
| పరితోషిత- | = | సంతోష పెట్టబడిన |
| భీమ- | = | శివునియొక్క (భీముని యొక్క) |
| చేతాః | = | చిత్తముగల; |
| కటాక్షలక్ష్మీః | = | కడగంటి కాంతి; |
| పాండవచమూరివ | = | పాండవసేనవలె |
| తావకీనా | = | నీ; |
| కర్ణ- | = | చెవులయొక్క (కర్ణునియొక్క) |
| అంతికమ్ | = | దగ్గఱకు; |
| చలతి | = | కదులుచున్నది |
| హంత | = | ఆహా! |

**తాత్పర్యము:-**

ఈ శ్లోకమున అమ్మవారి కాంతి పాండవసేనతో పోల్చబడినది. అమ్మవారి కడగంటి కాంతి మాటిమాటికి తెల్లని చిరునవ్వునకు సహాయముగా వెళ్ళుచున్నది. ఎట్లు? పాండవసేన అర్జునునకు సహాయముగా వెళ్ళినట్లు అమ్మవారి కడగంటి కాంతి శివుని చిత్తమును సంతోషపఱచినట్లు, పాండవసేన కర్ణుని దగ్గఱకు వెళ్ళినట్లు అమ్మవారి కడగంటి కాంతి చెవి సమీపమునకు కదలుచున్నది. అమ్మవారి కటాక్షములు చిరునవ్వు చిందించునని కర్ణాంతమును చేరునంత విశాలములైనట్టివి.

**వివరణము:-**

అర్జున, భీమ, కర్ణ పదములు శ్లిష్టములు. కావున శ్లేషానుప్రాణితోపమా లంకారము కలదు. తకార వర్ణావృత్తి యుండుటచే వృత్త్యనుప్రాసాలంకారమను శబ్దాలంకారమిందు కలదు. కటాక్షలక్ష్మి కర్ణుని దగ్గఱకు కదలుచున్నది అను వాక్యమున నాయికా-నాయక భావము స్ఫురించుటచే సమాసోక్త్యలంకారము కలదు.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి చూపులను శ్లేషరూపమున వర్ణించి ఈ శ్లోకమున కటాక్షనిశాగమముతో పరితాపము సమసిపోవుటను వర్ణించుచున్నాడు.

**శ్లో॥ అస్తం క్షణాన్నయతు మే పరితాపసూర్య-**
**మానన్దచన్ద్రమసమానయతాం ప్రకాశమ్।**
**కాలాన్ధకారసుషమాం కలయన్దిగన్తే**
**కామాక్షి! కోమలకటాక్షనిశాగమస్తే॥ 6**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| దిగన్తే | = | దిక్కులచివఱ; |
| కాలాంధకారసుషమామ్ | = | నల్లని చీకటి కాంతిని; |
| కలయన్ | = | కలిగించుచు; |
| తే | = | నీ యొక్క; |
| కోమలకటాక్షనిశాగమః | = | మృదువైన కటాక్షమనెడి రాత్రి యొక్క రాక; |
| మే | = | నాయొక్క; |
| పరితాపసూర్యమ్ | = | పరితాపమనెడి సూర్యుని; |
| క్షణాత్ | = | క్షణములో; |
| అస్తమ్ | = | చివరిదశను; |
| నయతు | = | పొందించును గాక! |
| ఆనన్దచన్ద్రమసమ్ | = | ఆనందమనెడి చంద్రుని; |

ప్రకాశమ్ = సమక్షమునకు (బయటకు);
అనయతామ్ = కొని వచ్చునుగాక!

**తాత్పర్యము:-**

అమ్మవారి కటాక్షమనెడి రాత్రియొక్క రాక దిగంతమున చీకట్లను వ్యాపింపజేయుచున్నది. అది పరితాపమనెడి సూర్యకాంతిని వెంటనే అస్తమింప జేయుగాక! రాత్రిరాకతో దిక్కులచివఅలలో చీకట్లు గ్రమ్ముకొనును. సూర్యుడస్తమించును. చంద్రప్రకాశము విస్తరించును. కటాక్ష నిశాగమముతో పరితాపము నశించును. ఆనందము వెల్లివిరియును. కన్నులలోని నల్లదనము దిగన్తముల విస్తరించును.

**వివరణము:-**

అవయవులు కటాక్షనిశాగమములు. అవయవములు పరితాప సూర్యులు. ఆనందచంద్రులు. సూర్య-చంద్రా-ద్యవయవసహితనిశాగమముగా అమ్మవారి కోమల కటాక్షము రూపింపబడుటచే నీ శ్లోకమున సావయవ-రూపకాలంకారము కలదు. అది **కటాక్షనిశాగమః** అను సమాసమున నుండుటచే సమస్త రూపకము. కటాక్షనిశాగమముల యొక్క సామ్యము వ్యంగ్యము. అమ్మవారి కటాక్షము తమస్సును హరింపవలసినదై యుండగా రాత్రివలె దిక్కులలో నంధకారమును విస్తరింపజేయునదిగా ఇట వర్ణింపబడుట కొందఅకౌచిత్య భంగముగా తోచవచ్చును. కాని **యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ। యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః(2.69)** అను గీతాసూక్తి ననుసరించి జ్ఞానికి సంసారము రాత్రిగా తోచును. అజ్ఞానికి బ్రహ్మము రాత్రిగా తోచును. సంసారదుఃఖమును కనిపింప జేయని చీకట్లు ముసరుకొనుట అమ్మవారి కటాక్షముతో సంభవించినచో నిక కావలసిన దేమున్నది. కావున సంసారము కనిపించజేయని చీకట్లను అమ్మవారి కటాక్షము వ్యాపింప జేయుట యుచితమే యగుచున్నది. అపుడే పరితాపసూర్యుడస్తమించుట, ఆనంద చంద్రప్రకాశము వ్యాపించుట సంభవింపగలదు.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి కటాక్ష నిశాగమముతో పరితాపము నశించుట చెప్పి ఈ శ్లోకమున కడగంటి చూపును గజేన్ద్రము అమంగళమను వృక్షమును పెకలించుటను చెప్పుచున్నాడు.

**శ్లో॥ తాటఙ్కమౌక్తికరుచాఙ్కురదన్తకాన్తిః**
**కారుణ్యహస్తిపశిఖామణినాధిరూఢః।**
**ఉన్మూలయత్వశుభపాదపమస్మదీయం**
**కామాక్షి! తావకకటాక్షమతఙ్గజేన్ద్రః॥** 7

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |
| తాటంక- | = | కమ్మలలోని |
| మౌక్తిక- | = | ముత్తెముల యొక్క |
| రుచాంకురదన్తకాన్తిః | = | కాంతి మొలకలనెడి దంతకాంతులుగల; |
| కారుణ్యహస్తిపశిఖామణినా | = | దయయనెడి శ్రేష్ఠుడైన మావటీనిచేత; |
| అధిరూఢః | = | ఆరోహింపబడిన; |
| తావకకటాక్షమతంగజేన్ద్రః | = | నీ కడగంటి చూపనెడి గజేన్ద్రము; |
| అస్మదీయమ్ | = | మా; |
| అశుభపాదపమ్ | = | అమంగళమనెడి వృక్షమును; |
| ఉన్మూలయతు | = | పెకలించి వేయుగాక! |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీదేవీ! నీ కర్ణభూషణములలోని ముత్యముల కాంతులు దంతకాంతులుగా కనిపించుచున్నవి. (ఏనుగునకు దంతియను పేరు దంతముల వలననే వచ్చును) నీ కటాక్షమే ఏనుగు. దానిపై కారుణ్య మను మావటివాడు ఎక్కి యున్నాడు. ఏనుగులకు వృక్షమును పెకిలించుట అలవాటైన నంభవమయిన వని. కారుణ్యహస్తిపారూఢమైన నీ కటాక్షగజేంద్రము మాయొక్క అమంగళ వృక్షమును సమూలముగా పెకలించి వేయుగాక!

**వివరణము:-**

1) అమ్మవారి కర్ణభూషణములలో ముత్యములు పొదగబడినవి. వాని కాంతి కటాక్షములపై బడుచుండగా కటాక్ష గజేంద్రమునకు దంతములు పొదచుకొని వచ్చినట్లు అమ్మవారి కారుణ్యము కటాక్షముపై ప్రకాశించుచుండగా కటాక్ష గజేంద్రము కారుణ్యహస్తిపారూఢమై యున్నట్లు కవి యుత్ప్రేక్షించుట వ్యంగ్యమగుచున్నది. అరణ్యమున మంచివి, చెడ్డవియైన బహువిధవృక్షము లుండును. మావటివాడు లేనప్పుడే వృక్షములనైన నేనుగులు పెకలించి వేయగలవు. ఇట అశుభపాదపమే ఉన్మూలింపబడవలెనన్న కటాక్షగజేన్ద్రము కారుణ్య హస్తిపారూఢము కావలెను. అది యట్లే తన యశుభవృక్షమును నిర్మూలింపజేయుగాక యని కవిచే నమ్మవారి కటాక్షము ప్రార్థింపబడుచున్నది.

2) ఈ శ్లోకమున రూపకాలంకారమున్నను పైన వివరింపబడిన యుత్ప్రేక్షణము వ్యంగ్యముగా నున్నది. రెండు నాల్గు పాదములలో క-ఖ వర్ణములకు కా-క అను వర్ణములకు మైత్రి పాటింపబడినది. పై శ్లోకమున వృక్ష ప్రస్తావన వచ్చినది. కటాక్షమునే సురవృక్షమునుగా నిరూపించుటకీ శ్లోకమవతరింప జేయబడుచున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి చూపు గజేన్ద్రమని వర్ణించి, ఈ శ్లోకమున అది కల్పవృక్షమని అభివర్ణించుచున్నాడు.

**శ్లో॥ ఛాయాభరేణ జగతాం పరితాపహారీ**
**తాటఙ్కరత్నమణితల్లజపల్లవశ్రీః।**
**కారుణ్యనామ వికిరన్మకరన్దజాలం**
**కామాక్షి రాజతి కటాక్షసురద్రుమస్తే॥** **8**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| ఛాయాభరేణ | = | దట్టమైన నీడచేత; |
| జగతామ్ | = | లోకములయొక్క; |
| పరితాపహారీ | = | పరితాపమును దొలగించు; |
| తాటంక- | = | కమ్మలయందలి; |
| రత్నమణితల్లజ | = | తల్లజ శ్రేష్ఠములయిన రత్నముల మరియు మణుల వంటి; |
| పల్లవశ్రీః | = | చిగురుటాకుల కాంతిగల; |
| తే | = | నీయొక్క; |
| కటాక్షసురద్రుమః | = | కడకంటి కాంతియనెడి కల్పవృక్షము; |
| మకరందజాలమ్ | = | పుష్పరస సమూహమును; |
| కారుణ్యనామ | = | దయయను పేరు; |
| వికిరన్ | = | వెదజల్లుచు; |
| రాజతి | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీదేవీ! తన చల్లని నీడతో జగముల పరితాపమపహరించునట్టి, కమ్మలలో పొదగబడిన శ్రేష్ఠ రత్నమణులే ఎఱ్ఱని చిగురుటాకులై ప్రకాశించు చుండగా దయయను మకరందరసపు వెల్లువను వెదజల్లుచు నీ కటాక్ష కల్పతరువు రాజిల్లుచున్నది.

**వివరణము:-**

వృక్షము, సూర్యతాపహరము, కటాక్షము ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవిక జగత్పరితాపత్రయమును హరించును. కటాక్షకల్పతరువునకు తాటంక రత్నమణులే చిగురుటాకులు. కారుణ్యమే మకరందము. కటాక్షసురద్రుమః అను సమాసమున్నందున ఈ శ్లోకమున వ్యస్తరూపకాలంకారము కలదు. వృక్షము సూర్య తాపమును మాత్రమే యపహరింపజాలును. సురవృక్షము ఆధ్యాత్మికాది తాపత్రయమును సైతము కొంచెమపహరింపజాలును. శ్రీదైవీకటాక్షము మాత్రము సంపూర్ణముగా వాని నపహరింపగలదు. ఈ లోకములోని వృక్షాది భౌతిక పదార్థముల వలన లభించు సుఖము

అత్యల్పము. సురలోకములో లభించునట్టి సుఖము నరలోకసుఖము కంటే దీర్ఘకాలమువఅకు ఉందునట్టిదే యైనను 'శాశ్వతము' మాత్రము కాదు. శాశ్వతమైన సుఖము మోక్షమొక్కటే. అది కామాక్షి కటాక్షముననే కలుగును.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి చూపు కల్పవృక్షమని వర్ణించిన మూక మహాకవి ఈ శ్లోకమున అది యమునానదియే యని వర్ణించుచున్నాడు.

**శ్లో॥ సూర్యాశ్రయప్రణయినీ మణికుణ్డలాంశు-**
**లౌహిత్యకోకనదకాననమాననీయా।**
**యాన్తీ తవ స్మరహరాననకాన్తిసిన్ధుం**
**కామాక్షి! రాజతి కటాక్షకలిన్దకన్యా॥** **9**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| సూర్య- | = | సూర్యుని యొక్క (విద్వాంసుల యొక్క లేక విద్యా సూరులనెడి జీవుల యొక్క) |
| ఆశ్రయ- | = | ఆశ్రయించుట యందు |
| ప్రణయినీ | = | ప్రేమగల; |
| మణికుండలాంశు- | = | మణికుండలముల కాంతులయొక్క |
| లౌహిత్య- | = | విఱుపు అనెడి |
| కోకనద- | = | ఎఱ్ఱకలువల |
| కానన- | = | అడవిచేత |
| మాననీయా | = | గౌరవింపదగిన; |
| స్మరహర- | = | శివుని యొక్క |
| ఆనన- | = | ముఖముయొక్క |
| కాన్తిసిన్ధుమ్ | = | కాంతియనెడు సముద్రమును; |
| యాన్తీ | = | చేరుచున్న |
| తవ | = | నీ యొక్క; |
| కటాక్షకలిన్దకన్యా | = | కడగంటి చూపనెడి యమునానది; |
| రాజతి | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీదేవీ! నీ కటాక్షము యమునానదియే. యమునానది తన ఆవిర్భావహేతువైన సూర్యుని ఆశ్రయమునందు ప్రేమ కలది. నీ కటాక్షము సూరిజనుల

ఆశ్రయించుట యందు ప్రేమకలది. యమునానది ఎఱ్ఱ కలువల వనముల నుండి ప్రవహించును. నీ కటాక్షము మణికుండల కాంతులనుండి వెల్లుబికి వచ్చును. యమునానది సముద్రమును చేరును. నీ కటాక్షము శివముఖ కాంతిని జేరును. అందుచేత నీ కటాక్షము యమునానదియే.

**వివరణము:-**

యమునానది కలిన్దగిరినుండి పుట్టి ప్రవహించుచు చివఱకు గంగలో కలసి గంగతో కూడి సముద్రమును చేరునట్లు అమ్మ కటాక్షమమ్మవారి ముఖము నుండి యావిర్భవించి కుండలాంశు కాంతులనెడి యెఱ్ఱ కలువల యడవులలో నుండి ప్రవహించుచు చివఱకు శివుని ముఖము చేరి యాగిపోవును. నది ప్రయాణము సముద్రమువఱకే గదా. యమునానది గంగానది కుపనది యగుటచే స్వయముగా సముద్రము చేరజాలకున్నను గంగతోకూడి సముద్రమును చేరును. ఈ శ్లోకమునందు రూపకాలంకారమే కలదు. విశిష్టాద్వైత సిద్ధాంతమున జీవులు మూడు విధములుగా నుందురు. బద్ధులు, ముక్తులు, నిత్యులు (సూరులు). **బద్ధులు** అనగా మనవలె సంసారమున బంధింపబడియున్నవారు. **ముక్త** లనగా పరమేశ్వరానుగ్రహమున ముక్తిని పొందిన వారు. **నిత్యు** లనగా నెల్లప్పుడు వైకుంఠముననే యుండి విష్ణువును సేవించువారు. వీరినే **నిత్యసూరు** లనియు నందురు. మూకకవి పరమార్థమున విశిష్టాద్వైత మంగీకరింపకున్నను వ్యావహారికముగ నందు చెప్పబడిన భక్తి సిద్ధాంతము నాశ్రయించియే యీ స్తోత్రమును రచించియున్నందున **సూర్యాశ్రయప్రణయనీ** అను విశేషణమున ఆ విశిష్టాద్వైతసిద్ధాంతమం దంగీకరింపబడిన సూరులను జీవభేదములను సూచించియున్నాడని చెప్పవచ్చును. లేదా సూరియనగా జ్ఞాని అని మాత్రమే అర్థము చెప్పుకొని విశిష్టాద్వైత-పరామర్శమిట లేదనియు చెప్పవచ్చును. అద్వైతమునందును వ్యావహారికముగా భక్తికి గొప్ప స్థానమున్నదే.



**అవ॥:-** అమ్మవారి కటాక్షము యమునా నదియేయని పై శ్లోకమున వర్ణించిన మూకమహాకవి ఈ శ్లోకమున ఎన్ని జన్మలపుణ్యమున్ననో అమ్మవారి కటాక్షము కల్గునని పలుకుచున్నాడు.

**శ్లో॥ ప్రాప్నోతి యం సుకృతినం తవ పక్షపాతా-**
**త్కామాక్షి! వీక్షణవిలాసకలాపురన్ధ్రీ।**
**సద్యస్తమేవ కిల ముక్తివధూర్వృణీతే**
**తస్మాన్నితాన్తమనయోరిదమైకమత్యమ్॥** 10

**ప్రతిపదార్థము:-**

కామాక్షి! = ఓ కామాక్షీదేవీ!.

| | | |
|---|---|---|
| వీక్షణవిలాసకలాపురన్ధ్రీ | = | చూపు అను నొయ్యారపు భామ; |
| తవ | = | నీయొక్క; |
| పక్షపాతాత్ | = | తెప్పలకదల్చుటవలన(ఇరుపక్షముల యెడల సమానముగా నుండక యొక పక్షముపై ప్రేమను ప్రకటించుట వలన) |
| యమ్ | = | ఏ; |
| సుకృతినమ్ | = | పుణ్యవంతుని; |
| ప్రాప్నోతి | = | చేరునో; |
| తమేవ | = | అతనినే; |
| ముక్తివధూః | = | ముక్తియనెడి కాంత; |
| సద్యః | = | వెంటనే ; |
| వృణీతే | = | స్వయముగా వరించునది; |
| అనయోః | = | కటాక్ష విలాసకలాపురన్ధ్రీ ముక్తి వధువు అను నీయిరువురికి; |
| తస్మాత్ | = | అందువలన; |
| ఇదమ్ | = | ఈ ; |
| ఐకమత్యమ్ | = | ఏకాభిప్రాయము |
| నితాన్తమ్ | = | అధికముగా |
| దృశ్యతే | = | కానవచ్చును (అధ్యాహారము). |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీదేవీ! నీ చూపుల కదలికలలోని కళయనెడి యొకసతి పక్షపాతము చూపి ఎవనిని చేరుకొనునో అతనినే ముక్తి వధువు వెంటనే స్వయముగా వరించును. అందువలన వీక్షణవిలాసపురంధ్రికి ముక్తివధువున కైకమత్యము కనబడుచున్నది. ఎన్ని జన్మల పున్నెమున్ననో అమ్మవారి కటాక్షము కల్గును. కటాక్షమా పుణ్యాత్మునిపై పడెనో లేదో అప్పుడే అతనికి ముక్తి లభించును.

**వివరణము:-**

ఈ లోకమున ఎవరికేక్షణమున నెవరిపై రాగమంకురించునో చెప్పజాలము. ఇరుపక్షములవారు సమానమైనను శ్రీ కృష్ణుడు పాండవపక్షపాతి యని పేరు తెచ్చుకొనెను. అమ్మవారి కటాక్షపాతమునకు పూర్వజన్మపుణ్యమే కారణమని మన మనుకొనవలెను. కాని యిటువంటి పుణ్యాత్ములెందరో యుండగా నా యొకనిపై నమ్మవారి కటాక్షమునకు పక్షపాతమేలనో చెప్పజాలము. కాని పుణ్యాత్ముడు తన పుణ్యబలమే అమ్మవారి కటాక్షమునకు తనను పాత్రమొనరించుకొన్నదని యహంకారము రూపుమాపుటకే యా కటాక్షమాపక్ష పాతము ప్రదర్శించినది. మరొక విషయము. అమ్మవారి కటాక్షము పుణ్యాత్మునిపై బడునా? లేక కటాక్షము పడిన పిమ్మటనే యాతనికి పుణ్యమొనర్చు బుద్ధి పొడమునా? యనియు సందేహము కలుగును. సాధారణముగా పుణ్యాత్ములు అనగా వేదశాస్త్రరూపమైన దేవి

యాజ్ఞ ననుసరించి సత్కర్మ నాచరించువారు తమ యాజ్ఞను పాటించువారిపై నెవరికైనను ప్రేమ కలుగును కదా! కాని యొక్కొక్కప్పుడు అవ్యాజముగా నిర్నిమిత్తముగా అమ్మవారి కటాక్షమే ముందు పడును. ఆ తరువాతనే వాడు పుణ్యమొనరించును. ఇది అసాధారణము. ఈ అసాధారణ్యమే లేనిచో పుణ్యాత్ములకు తమ పూర్వకర్మలకు సంబంధించి యహంకారము కల్గును. అమ్మవారనుగ్రహింపక యెట్లుండగల దను గర్వము కలుగును. అట్టి దోషము నివారించుటకు అమ్మవారసాధారణరీతిలో ముందుగానే యొకనిపై కటాక్షము పఱచును. వాడు పుణ్యాత్ముడగును. వానికి చిత్తము శుద్ధమై జ్ఞానముదయించి పిమ్మట ముక్తుడగును. **సాధు కర్మ కారయతి కౌ.3.8**. ఇత్యాది శ్రుతి పైవివరణమునకు ప్రమాణము. ఒక పురుషుడుండును వానిని పెక్కురు స్త్రీలు ప్రేమింతురు లేక కామింతురు. పెక్కురు స్త్రీల ప్రేమకు పాత్రుడైన వానిని దక్షిణనాయకుడందురు. దాక్షిణ్యమనగా ఇరువురు నాయికలందు సమానురాగము కలిగియుండుట లేదా కనీసము సమానానురాగము కలిగియున్నట్లు నటించు సామర్థ్యము కలిగియుండుట దాక్షిణ్య శబ్దమునకు సామర్థ్యమను నర్థము కూడ కలదు. కటాక్షవిలాసకల ఎవనిని చేరునో వానిని ముక్తివధువు కూడా చేరును. పుణ్యాత్మునకు దక్షిణనాయకత్వము కలుగునని కవి యిచ్చట వ్యక్తమొనర్చు చున్నాడు. సాధారణముగా పురుషునొక స్త్రీ చేరినదని యెఱిగిన పిమ్మట మరొక స్త్రీ యాతనిని చేరదు. అసాధారణముగా ఒక స్త్రీ పురుషుని చేరుట చూచి మరొక స్త్రీ యాతనినే చేరును. శ్రీ కృష్ణుని విషయమున నిట్లే జరిగి వేలకొలది కన్యలను శ్రీ కృష్ణుడు పెండ్లాడవలసి వచ్చెను. కటాక్షవిలాసకల కటాక్షాధీన యైన పతివ్రత యనుకొందము. ఆమె పక్షపాతమును ప్రదర్శించి యొక పుణ్యాత్ముని చేరినది. పతివ్రతయే యిట్లొనరించినప్పుడు పెండ్లి కాని వధువు నాతని నేల వరింపకుండును. అందుకే ముక్తివధువు నాతని నేల వరింపకుండును. అందుకే ముక్తివధువు అతనిని వరించునని కవి చెప్పుచున్నాడు. ఈ నాయికానాయక వ్యవహార మిందు రూపకాలంకారముచే వ్యంజింపజేయుబడినది. సాధారణముగా సమాసోక్త్యాలంకారముచే వ్యంజింపజేయుబడినది. సాధారణముగా సమాసోక్త్యాలంకారమున నాయికానాయక వ్యవహారము వాచ్యము చేయబడక వ్యంగముగానే స్ఫురించుచుండును. ఈ శ్లోకమున నది వాచ్యము చేయబడినది. అయినను పుణ్యాత్మునందు దక్షిణనాయకత్వము వ్యంగ్యముగానే యున్నది. అది వాచ్యము చేయబడలేదు. కావున రూపకానుప్రాణితసమాసోక్త్యలంకారము ఇందున్నదని చెప్పవచ్చును. ఒక పురుషునిరువురు ప్రేమించు సందర్భమున పురుషుడిరువురు స్త్రీలను సమానముగా ప్రేమింప గలిగినను స్త్రీలు తమలో తాము అతని యధిక ప్రేమ నాశించి కలహింపకుండ యుండజాలరు. దక్షిణనాయకుడైన శ్రీకృష్ణుని యిరువురు రాణులు రుక్మిణీ సత్యభామలట్లు కలహించి నారందురు. కాని సత్యభామ కలహించి యుండవచ్చును. రుక్మిణి సత్యభామపై మత్సరమును పొందినట్లు తార్కాణ మేమియు కానరాదు. అస్తు. ప్రస్తుతమున అమ్మవారి కటాక్షవిలాసకల నాదరించి దాని యాదరమునకు పాత్రుడైన యాతనినే ముక్తివధువు

వరించుననని కవి యిచ్చట చెప్పుచున్నాడు. ఆమె ఆ తరువాత కలహింపనే కలహింపదను విషయము **వృణీతే** యని కవి యాత్మనేపదక్రియను ప్రయోగించుటచే స్పష్టమగుచున్నది. స్వయముగా సస్త్రీకుని వరించిన వారు పిమ్మటెట్లు కలహింపగలరో! ఆ సత్యభామయట్లు కలహించెను. అందుచే గర్వభంగమునకు గురియయ్యెను. కథ సుఖాంతమే యయినది. ఈ పుణ్యాత్ముని కథయు సుఖాంతముగానే యుండగలదు. కామాక్షి మహాదేవత. దేవతలకే పక్షపాత ముండదు. అందుకే వా రనిమిషులని పిలువబడుచున్నారు. కామాక్షీ దేవతకెట్లు పక్షపాతము సంభవించును. సామాన్యరాజ్ఞికే పక్షపాతము తగదు. మహారాజ్ఞి యగు కామాక్షీ దేవి యొక్క వీక్షణవిలాసకలాపురంధ్రికి పక్షపాతము ఎట్లు సంభవించును? సామాన్య జీవుల నేత్రమునకు పక్షపాతము సహజము. పక్షపాతము లేని జీవులే లేరని చెప్పిన నతిశయోక్తి కాదు. పక్షపాతము ఒకరి యెడ నిష్కారణముగ దయను ప్రదర్శించుట ఈశ్వరియొక్క నిరంకుశస్వాతంత్ర్యమునకు సూచకము. వైషమ్యనైర్ఘృణ్యదోషములు లేవని చెప్పుటచే నీశ్వరుడు పక్షపాతము లేక జీవులకందరికి వారు చేసిన కర్మలకు ఫలమును మాత్రమే నొసగునను మాట ఈశ్వరునికి పారతంత్ర్యదోషమును సమకూర్చును. తన్నివారణార్థమే యసాధారణముగా యత్కించిత్ జీవసమూహమున పక్షపాతమును ధరించుట పారతంత్ర్యదోషనివారణార్థమంగీకరించదగినదియే యగును. ఇందుకు ప్రమాణమీ ఉపనిషద్వాక్యము **"తమేవ సాధు కర్మ కారయతి యమేవైష ఉన్నినీషతే తమేవాసాధు కర్మ కారయతి యమధో నినీషతే"** పక్షపాత శబ్దప్రయోగ సౌందర్యమత్యాశ్చర్యకరము.



**అవ॥:-** అమ్మవారి కడగంటి చూపుల వరుస మేఘమాలవలె ప్రకాశించుటను ఈ శ్లోకమున వర్ణించుచున్నాడు.

**శ్లో॥ యాస్తే సదైవ మరుతామనుకూలభావం**
**భ్రూవల్లిశక్రధనురుల్లసితా రసార్ద్రా।**
**కామాక్షి! కౌతుకతరఙ్గితనీలకణ్ఠా**
**కాదమ్బినీవ తవ భాతి కటాక్షమాలా॥ 11**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| తవ | = | నీ యొక్క; |
| కటాక్షమాలా | = | కడగంటి చూపుల వరుస; |
| సదా | = | ఎల్లప్పుడును; |
| మరుతామేవ | = | దేవతలకే (గాడ్పులకే); |
| అనుకూలభావమ్ | = | అనుకూల్యమును; |

| | | |
|---|---|---|
| యాన్తీ | = | పొందుచున్నదై; |
| భ్రూవల్లిశక్రధనుః | = | కనుబొమ్మలనెడి యింద్రధనువుచే; |
| ఉల్లసితా | = | ప్రకాశించినదై; |
| రసార్ద్రా | = | శృంగారరసముచే (జలముచే) తడిసినదై; |
| కౌతుకతరంగితనీలకంఠా | = | కుతూహలముప్పొంగిన శివుడు (నెమలి) కలదై; |
| కాదంబినీవ | = | మేఘమాలవలె; |
| భాతి | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి కటాక్షమాలిక మేఘమాలికవలె ప్రకాశించుచున్నది. ఇట్లనుట కీ క్రిందివి హేతువులు. మేఘమాలిక గాడ్పులకనుకూలముగా చలించును. కటాక్షమాలిక దేవతలకనుకూలంగా చలించును. మేఘమాలిక పైన ప్రకాశించినది. జలముచే తడిసినది. కటాక్షమాలిక ఉల్లాసము గలది. దయారసముచే తడిసినది. మేఘమాలిక శక్రధనువు గలది. కటాక్షమాలిక భ్రూవల్లి కలది. మేఘమాలికను చూచి నెమలి కుతూహలము చెంది యుండును. కటాక్షమాలికను చూచి శివుడు కుతూహలము చెంది యుండును.

**వివరణము:-**

1) దేవతల పట్లనే అనుకూల్యమును ప్రదర్శించుట. వెనుక శ్లోకమున జెప్పిన ఈశ్వరి పక్షపాతమునకీ శ్లోకమున దృష్టాంతము చూపబడుటచే పూర్వశ్లోకమునకు ఈ శ్లోకమునకు ప్రసంగ సంగతి కలదు. "శివే శృంగారార్ద్రా" అని అమ్మవారి చూపును శివుని పట్ల శృంగారార్ద్రమని శంకరులు చెప్పినారు. మూకకవి ఈ శ్లోకమున రసార్ద్రా అని ప్రయోగించి శంకరుల భావమును వ్యంగ్య మొనర్చినాడు. మేఘముల జూచిన నెమలి యాడుచున్నప్పుడు క్వాచిత్కముగా పక్షపాతము జరుగును. దయాస్వరూపురాలైన అమ్మవార్రి శృంగారపుజూపుల మైకములో శివుడు వైషమ్యమునకు లోనై అమ్మవారి భక్తులయెడ పక్షపాతము జూపుననుటయు అమ్మవారి కటాక్షము తన పక్షపాతస్వభావమును శివుని పైనను రుద్ది సత్కర్మకారులనే యనుగ్రహింతునను భీష్మస్వభావమును బోగొట్టినదనుటయు నను రెండు వస్తువులు వ్యంగ్యముల దోచుచుండుటచే నీ శ్లోకమున వస్తుధ్వని కలదు. ఒడలంతయు దెల్లగా నున్న శివుని కంఠమునందమ్మ వారి చూపు పడి కంఠమునందు నైల్యము కలిగించినదా? యను నూహను పుట్టించుటకు 'శివ' శబ్దమునకు బదులుగా **నీలకంఠ** శబ్దమును ప్రయోగించుట. ఈ ప్రయోగము "అసంబంధ సంబంధాతిశయోక్త్యలంకారము''ను వ్యంగ్యమొనర్చుచున్నది. కావున నిందతిశయోక్త్యలంకార ధ్వని గలదు. కవికి భగవతి పట్లనున్న భక్తి భావమునకిది గుణీభూతమైనను, వాచ్యార్థమునకు గుణీభూతము కాకపోవుటచే నిది "ధ్వనియే" యగును.

2) ఈ శ్లోకమున శ్లేషానుప్రాణితమైన ఉపమాలంకారము కలదు. అది శివుడు,

నెమలి, భ్రూవల్లి, శక్రధనువు, అను ఉపమేయోపమాన ధర్మముల బింబప్రతిబింబ భావముతో కూడియున్నది. కటాక్షభ్రమరములకు పోలిక స్వతస్సిద్ధము. కటాక్ష మేఘమాలికల కౌపమ్యము స్ఫురింపజేయుటకు శ్లేషయను బింబ-ప్రతిబింబ భావము నిట నాశ్రయింపబడినవి.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి చూపుల వరుసను మేఘమాలికతో పోల్చినాడు, ఈ శ్లోకమున అమ్మవారి చూపుల ప్రసారము శివుని యెదన నాచుగుంపువలె ప్రకాశించుటను వర్ణించుచున్నాడు.

**శ్లో॥ గఙ్గామ్భసి స్మితమయే తపనాత్మజేవ**
**గఙ్గాధరోరసి నవోత్పలమాలికేవ।**
**వక్త్రప్రభాసరసి శైవలమణ్డలీవ**
**కామాక్షి! రాజతి కటాక్షరుచిచ్ఛటా తే॥ 12**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| తే | = | నీ యొక్క; |
| కటాక్షరుచిచ్ఛటా | = | కడగంటి చూపుల వెల్గుల ప్రసారము; |
| స్మితమయే | = | చిఱునవ్వనెడి; |
| గంగాంభసి | = | గంగాజలమునందు; |
| తపనాత్మజేవ | = | సూర్యపుత్రి(యైన యమునానది) వలె; |
| గంగాధరోరసి | = | గంగను ధరించువాని (శివుని)ఱొమ్మున; |
| నవోత్పలమాలికేవ | = | అప్పుడేపూచిన నల్లకలువలహారమువలె; |
| వక్త్రప్రభాసరసి | = | ముఖకాంతియనెడి జలాశయమునందు; |
| శైవలమండలీవ | = | నాచుగుంపువలె; |
| రాజతి | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి కటాక్షరుచిచ్ఛట, చిఱునవ్వు అనెడి ఆ గంగయందు యమున వలె, తెల్లనైన శివుని యురమున అప్పుడే పూచిన నల్లకలువలమాలె వలె ముఖకాంతి సరస్సునందు నాచువలె ప్రకాశించుచున్నది.

**వివరణము:-**

1) అమ్మవారి కటాక్షరుచిచ్ఛట ఎల్లప్పుడును ప్రకాశించుచుండును. శివుడెదురుగనున్నపుడు మరింత ప్రకాశించును. అమ్మవారి ముఖమెప్పుడు చిఱునవ్వు

చిందించుచుండును. ఆ చిరునవ్వు గంగవలె స్వచ్ఛమైనది మరియు తెల్లనైనది. ఆమె చిఱునవ్వామె కటాక్షమునందును దోబూచులాడుచుండును. అందుచే చిఱునవ్వు గంగ కాగా, దాని యందమ్మవారి కటాక్షరుచిచ్ఛట యమున యైనది. చిఱునవ్వు తెలుపుచే గంగయైనది. సరే! ఎదుట గంగాధరుడే యున్నాడు. ఆయన ఱొమ్మునందొక కటాక్షకాంతిచ్ఛట అప్పుడే పూచిన నల్లకల్వపూల మాలయైనది. అమ్మవారి ముఖకాంతి యొక సరోవరము. దాని యందమ్మ వారి కటాక్షకాంతి నాచైనది. ఇంతకు చిఱునవ్వు అమ్మవారిదేనా? కాదనుటకే మాధార మున్నది? ఆ చిఱునవ్వు శివునిది కాకూడదా? దానిని చూచినపుడు అమ్మవారి కడగంటిచూపులకాంతి యమున యైనది. ఇచ్చట వక్త్రప్రభాస రస్సెవ్వరిది? అమ్మవారిదా? శివునదా? ఎవరిదన్నను కాదనుటకు వీలులేదు. ఎవరిదైనను అగుగాక! అమ్మవారి కడగంటికాంతి నాచువలె కన్పడుచునే యుండును. ఈ తెలుపు నలుపుల సమ్మేళనము (శివాశివుల సమ్మేళనము) గంగా యమునా సంగమమువలె శోభాయమానముగా నున్నది. ఇచ్చట శివుడనుటకు బదులుగా గంగాధరుడనుట శివుని నెత్తిమీద గంగ ఈ చిఱునవ్వు ముందఱ వెల-వెల పోవుటచే నది గంగాత్వము కోల్పోయినదేమో? అందుకే చిఱునవ్వునందు ఎక్కడో చూచిన గంగాసామ్యము చెప్పబడినదేమో? ఇంతకును కామాక్షీదేవి యెదుట నుండగా శివుడింకను గంగను నెత్తిపై పెట్టుకొనుటయా? అట్లు పెట్టుకొన్నచో నమ్మవారి కడగన్నుల కాంతి యమునగా మారుట కాదు. శోణనదముగా మారకుండునా? అందుకే శివుని నెత్తిపైని గంగయందు అమ్మవారి కడగంటి కాంతి యమునయైనదని చెప్పక, చిఱునవ్వునందు గంగాత్వమును 'మూకకవి' యారోపించినాడేమో? యను నూహలను పుట్టించుచున్నది. శ్రీ శంకరులమ్మవారి మూడుకన్నులను **గంగా యమునా శోణా** సంగమముగా వర్ణింపగా మూకకవి యెదలోతులలోని సరస్వతి అమ్మవారి కటాక్షరుచిచ్ఛట యందు గంగా-యమునా సంగమ సౌభాగ్యమును దర్శింప జేసినది. మూకకవి యూహాప్రవాహములలో నెక్కువగా సుళ్ళుతిరుగునది అమ్మవారి కటాక్షమాలికయే! అదియే పై శ్లోకమున వర్ణింపబడినది. ఈ శ్లోకమున నవోత్పలమాలిక యొకటి శివుని యురమున నలంకరింప నూహ పుట్టినది. అమ్మవారి కటాక్షమాల కాంతి పుంజముల పూలమాలయే నవోత్పలమాలికగా మూకకవి యూహాప్రవాహమున గొట్టుకొని వచ్చినది. **'మాలికా'** శబ్దము పై శ్లోకమునకు, నీశ్లోకమునకు సంగతిగా రూపొందినది. శివుని యన్ని యవయవములు, సందరములే కాని అమ్మవారే శివుని విశాల వక్షస్థలమును దనివిదీరక యల్లుకొని పోయియున్నదని మందహాస గంగాంభోవక్త్రప్రభాస సరస్సుల మధ్య **"నవోత్పలమాలికేవ"**. యని మూకకవి ప్రయోగించుటచే వ్యంగ్యమగుచున్నది. వక్షఃస్థలము ప్రధానశరీరమున శిరస్సునకు క్రింద ఉదరమునకు బైన ననగా రెండు మధ్య నుండు నట్టిదే గదా! మందహాస గంగావక్త్రప్రభాసరస్సులు రెండు జలస్వరూపములు. జలముల మధ్య ప్రకాశించునది. 'నవోత్పలమాలిక' అమ్మవారి కటాక్షకాంతి నవోత్పల మాలికయని మూకకవి వర్ణించుటలో

నమ్మవారే స్వయముగా నవోత్పల మాలికయై శివుని వక్షఃస్థలమున విరాజిల్లుచున్నట్లు వ్యక్తమగుచున్నది. మందహాసగంగాంభో రహితముగా వక్త్రప్రభాసరస్సుండనే యుండదు. వాస్తవమునకు అమ్మవారి మందహాసము గంగయగుటకు అమ్మవారి వక్త్రము ప్రభాసరస్సు అనుటకు విశాల శివవక్షోదర్శనము హేతువనుటలో విప్రతిపత్తి యుండరాదు.

2) ఈ శ్లోకమున కటాక్షరుచిచ్ఛటకు మూడుపమానము లుండుటచే మాలోపమాలంకారము కలదు. మూడు పాదముల అంతమున "ఇవ" శబ్దముండుటచే నీ శ్లోకమున నంత్యప్రాసమను శబ్దాలంకారము గలదు. పై శ్లోకమున వక్త్రప్రభాసరస్సు ప్రస్తావింపబడినది. సరస్సులోనికి నీరు వచ్చుట దాని వెనుక నున్న పొలములు పండుట మేఘాధీనములు కావున నీ శ్లోకమున నమ్మవారి కటాక్షము మేఘముగా రూపింపబడు చున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి క్రీగంటిప్రసారము శివుని యెదన నాచుగుంపు వలె ప్రకాశించుట చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి క్రీగంటిమేఘము రసజ్ఞ కేదారసీమయని చెప్పబడుచున్నది.

**శ్లో॥ సంస్కారతః కిమపి కన్దలితాన్రసజ్ఞ(జ్ఞా)-**
**కేదారసీమ్ని సుధియాముపభోగయోగ్యాన్।**
**కల్యాణసూక్తిలహరీకలమాఙ్కురాన్నః**
**కామాక్షి! కన్దలయతు త్వదపాఙ్గమేఘః॥ 13**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీ దేవీ! |
| త్వదపాంగమేఘః | = నీ కడకన్నెడి మేఘము; |
| రసజ్ఞకేదారసీమ్ని | = సహృదయులనెడి పొలముల ప్రదేశములందు; |
| రసజ్ఞాకేదారసీమ్ని | = నాలుకయను పొలమునందు; |
| నః | = మా; |
| సంస్కారతః | = భావనవలన; |
| కిమపి | = విచిత్రముగా; |
| కన్దలితాన్ | = మొలకెత్తిన; |
| సుధియామ్ | = విద్వాంసులయొక్క; |
| ఉపభోగయోగ్యాన్ | = అనుభవమునకు దగిన; |
| కల్యాణసూక్తిలహరీకలమాంకురాన్ | = మంగళ సుభాషిత ప్రవాహములనెడి వరిమొలకలను; |
| కన్దలయతు | = మొలపించుగాక. |

**తాత్పర్యము:-**

అమ్మా! సంస్కారము వలన రసజ్ఞకేదరములయందు మొలకెత్తిన విద్వదుపభోగ్యములైన మా వాక్కులనెడి వరి మొలకలను నీ కడగంటి చూపనెడి మేఘము మొలకెత్తించు గాక! లేక, అమ్మా! నా నాలుకయనెడి పొలమునందు సంస్కారమువలన మొలకెత్తిన విద్వదుపభోగ్యములైన శోభ వాక్కలమాంకురము లనే కటాక్షమేఘము మరల మొలకెత్తించు గాక!

**వివరణము:-**

రసజ్ఞులు పొలమువంటి వారు. కవుల శోభనవాక్కలమాంకురములు వానిలో పండవలెను. ఆ పొలములు దేవమాతృకములు. కావున కటాక్షము మేఘముగా రూపొంది వానిని పండింపవలెనని కవి ప్రార్థన. ప్రార్థనా కాలమందే నెరవేరినది. లేనిచో పొలము లెక్కడనైన రసజ్ఞములై యుండునా? ఇక్కడ కవియే రసజ్ఞకేదారమైనాడు. కవి సహృదయాఖ్య సరస్వతీ తత్త్వద్వయ మిందు సమైక్య మొందినది. ఇది యన్వర్థసుధీభోగ్య మీ చమత్కారము. పొలమందు నిండిన పంట జూచి రైతు హృదయమున బొందునట్టి యానందము లౌకికము. ఇచట నలౌకిక బ్రహ్మానందము కవి సహృదయద్వయైక్యరూపాద్వయస్థితి నందినది. **చదువది యెంత గల్గిన రసజ్ఞత యించుక చాలకున్న నా, చదువు నిరర్థకమ్ము**, రసజ్ఞత వేరు, పాండిత్యము వేరు. పాండిత్యము కొంత తక్కువయైనను రసజ్ఞత పుష్కలముగా నున్న కవి శోభనవాక్కులలోని రసము ననుభవింపగలరు. రసజ్ఞతతోబాటు మంచి బుద్ధి అనగా సదసద్విమర్శనాబుద్ధియున్న పండితులు దానిని చక్కగా విమర్శింపగలరు. అప్పుడు కవియొక్క హృదయరహస్యము రసజ్ఞుల హృదయము లందు ప్రతిబింబించి రసఫలోదయయై యద్వితీయ బ్రహ్మానందము సాక్షాత్కరింప సంసారదుఃఖము సమూలముగా నశించి కృతకృత్యత ధన్యత యేర్పడును. ఈ శాఖాచంక్రమణ మంతయు రసజ్ఞకేదారసీమ్ని అను ముద్రితపాఠము ననుసరించి చేయబడినది. వాస్తవమునకు ఇచట **రసజ్ఞాకేదార సీమ్ని** అను పాఠము సరియైనదని నాయుద్దేశ్యము, అప్పుడు నా నాలుకయను పొలమునందు సుధ్యుపభోగ్యములైన వాక్కలమాంకురములు మొలకెత్తు గాక యను భావమక్లేశముగా హృదయంగమముగా స్ఫురించును. అప్పుడు శాఖాచంక్రమణ మంతయు ననావశ్యకమే యగును. ఈ శ్లోకమున సావయవరూపకాలంకారము కలదు. **త్వదపాంగమేఘః** అను సమాసపద ముండుటే సమస్తరూపకము.



**అవ:-** పై శ్లోకమున కటాక్షము మేఘముగా రూపించబడినది. మేఘము సజలమైనట్లు కటాక్షము సకరుణమని ఈ శ్లోకమున జెప్పబడుచున్నది.

**శ్లో॥ చాఞ్చల్యమేవ నియతం కలయన్ ప్రకృత్యా**
**మాలిన్యభూః శ్రుతిపథాక్రమణజాగరూకః।**

**కైవల్యమేవ కిము కల్పయతే నతానాం**
**కామాక్షి! చిత్రమపి తే కరుణాకటాక్షః॥ 14**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| ప్రకృత్యాః | = | సహజముగా; |
| నియతమ్ | = | విడువకుండ; |
| చాంచల్యమేవ | = | చపలత్వమునే; |
| కలయన్ | = | ధరించునట్టి; |
| మాలిన్యభూః | = | మాలిన్యమునకు(కాటుకకు) ఆధారమై; |
| శ్రుతిపథాక్రమజాగరూకః | = | చెవి మార్గముకు చేరు (వేదమార్గము) యొక్క దాటుటయందు మెలకువ గలిగియున్నట్టి; |
| తే | = | నీయొక్క; |
| కరుణాకటాక్షః | = | దయగల చూపు; |
| నతానమ్ | = | నమస్కరించు వారికి; |
| కైవల్యమేవ | = | కైవల్యమునే (ఈశ్వరునితో నైక్యమునే); |
| చిత్రమపి | = | విచిత్రముగా; |
| కల్పయతే కిము | = | కల్పించుచున్నదా! |

**తాత్పర్యము:-**

కామాక్షీదేవి దయగలచూపు చాంచల్యమును విడువదు. కాటుకను (మాలిన్యమును) ధరించును. చెవిచేరు మార్గమును (వేదమార్గమును) అతిక్రమించినది. ఐనను నమస్కరించువారికి జీవేశ్వరైక్యరూపకైవల్యమునే ఇచ్చుట వింతచిత్రము.

**వివరణము:-**

1) కన్నులు రెండైనను చూపు మాత్రమొకటే. వ్యావహారికముగా జీవేశ్వరులు వేరుగా నున్నట్లున్నను పారమార్థికముగా వారిరువురొక యాత్మయే కాని వేరుగా లేరు. ఇది కటాక్షమునందలి కైవల్యము. కేవలాత్మానుభూతిని బొందిన జీవన్ముక్తుడే గురువై తనకు నమస్కరించి శరణుజొచ్చిన శిష్యులకుగూడ ఆ కేవలాత్మానుభూతినే కలిగింపగలడు. కటాక్షమునందు, నీతులందు గురుశిష్య వ్యవహారము స్ఫురించుటచే నిందు సమాసోక్త్యలంకారము కలదు. **"స్వయంతీర్ణః పరాంస్తారయతి"** అను లోకోక్తి ఈ శ్లోకమున వ్యంగ్యము. కైవల్యము లభింప వలెనన్న మొదటి శ్రుత్యుక్తమైన కర్మ నాచరించి చిత్తమున మాలిన్యరాహిత్యమును (శుద్ధిని) సంపాదించి ఉపాసనచేసి చిత్తముయొక్క చాంచల్యము తొలగించుకొన వలెను. కన్నులకు చాంచల్యమాలిన్యములు నశించలేదు. తగ్గను కూడ లేదు. పైగా నవి శ్రుతిమార్గాతిక్రమణమును చేసియున్నవి. అయ్యును అవి చూపున

కైవల్యము నందియున్నవి.

2) అమ్మవారి కన్నులకు శ్రుతిమార్గాతిక్రమణము లేకున్నను శ్లేషతో శ్రుతి మార్గాతిక్రమణము నాపాదించుటచే ససంబంధ సంబంధాతిశయోక్తి యిట వ్యంగ్యము. కన్నుల ధైర్ఘ్యాతిశయము వ్యక్తము చేయు నతిశయోక్త్యలంకారము గూడ నిందు భావ్యముగానే యున్నది. శ్రుతిమార్గాతిక్రమణమాలిన్య చాంచల్యములు కలవారికి కైవల్యము లభించుట విరుద్ధము. ఈ విరోధము శ్లేషచే పరిహరింపబడి విరోధమాభాసరూపమగుటచే నిందు విరోధాభాసా లంకారము కలదు.



**అవ:-** "పై శ్లోకమున అమ్మవారి కన్నులయొక్క అలౌకిక కైవల్యదానసామర్థ్యము ప్రతిపాదింపబడినది. ఈ శ్లోకమున ఐహలౌకిక ఫలప్రదానసామర్థ్యము వర్ణింప బడుచున్నది.

**శ్లో॥ సఞ్జీవనే జనని! చూతశిలీముఖస్య**
**సమ్మోహనే శశికిశోరకశేఖరస్య।**
**సంస్తమ్భనే చ మమతాగ్రహచేష్టితస్య**
**కామాక్షి! వీక్షణకలా పరమౌషధం తే॥ 15**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| జనని | = | తల్లీ! |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తే | = | నీయొక్క; |
| వీక్షణకలా | = | చూపులోని పదారవ భాగము; |
| చూతశిలీముఖస్య | = | మామిడిపూవు బాణముగాగల మన్మథునియొక్క; |
| సంజీవనే | = | బ్రదికించుటయందు; |
| శశికిశోరకశేఖరస్య | = | బాలచంద్రుడు శిరోభూషణముగాగల శివునియొక్క; |
| సమ్మోహనే | = | మోహింప జేయుటయందు; |
| మమతాగ్రహచేష్టితస్య | = | మమకారమనెడి దయ్యము యొక్క చేష్టితమును; |
| సంస్తంభనే చ | = | స్తంభింపజేయుటయందును; |
| పరమౌషధమ్ | = | గొప్పమందు. |

**తాత్పర్యము:-**

అమ్మా! కామాక్షీదేవీ! నీ దృష్టిపాతము లేశమైనను మన్మథుని సంజీవింప జేయును. శివుని సమ్మోహింప జేయును. మమతాగ్రహముయొక్క వికృతచేష్టలను స్తంభింపజేయును.

**వివరణము:-**

కొన్ని ఔషధములు సంజీవనములుగా పేరొంది యున్నవి. కాని అవి సమ్మోహనములు కాజాలవు. సంస్తమ్భకములును కాజాలవు. సమ్మోహనమునకో సంస్తమ్భనమునకో పనికి వచ్చు ఔషధములు సంజీవనములు కాజాలవు. కాని అమ్మవారి చూపు సంజీవనౌషధము, సమ్మోహనౌషధము, సంస్తంభనౌషధము. ఔషధము వ్యక్తిభేదమున గూడ భిన్నరోగముల మాన్పును. చచ్చిన మన్మథునికది సంజీవనము, మోహమెరుగని శివునకు సమ్మోహనము. వికృతచేష్టగల మమతాగ్రహమునకు సంస్తమ్భనము. అమ్మవారి కరుణాకటాక్ష మొకింత సోకెనో లేదో వాడు మరల బ్రతికినాడు. ఈ యర్థమును చెప్పు నీ శ్లోకములోని ప్రథమ పాదము **"హరనేత్రాగ్నిసందగ్ధకామసంజీవనౌషధిః"** అను శ్రీలలితా సహస్రనామస్తోత్రములోని నామము యొక్క అర్థమునే చెప్పును. అచట అమ్మవారు కాముని బ్రదికించు నౌషధము. ఇచట నమ్మవారి చూపు చూపుకాదు, చూపులోని అత్యల్పభాగము. శుక్లపక్షములోని మొదటి ఐదు రాత్రులలోని బాలచంద్రుడు రెండవయైదు రాత్రులలోని చంద్రుడు అర్ధచంద్రుడు, చివరయైదు రాత్రులలోని చంద్రుడు పూర్ణచంద్రుడు. ఈ చంద్రుని బాలత్వ అర్ధత్వ పూర్ణత్వములు కృష్ణపక్షములో విపరీతములగును. కృష్ణపక్షములోని చివరియైదు రాత్రులలో శుక్లపక్షములోని మొదటి యైదు రాత్రులలోను శశికిశోరుడు **కుహూ** అను అమావాస్యనాడు గర్భస్థశిశువువలె శశి కనిపించడు. **సినీ** అను అమావాస్య శీర్షోదయమైన శిశువువలె కన్పించును. కన్పించినను కన్పించకున్నను అది **అమాకళ**. సాధారణభక్తులలోని ఈశ్వరాస్తిత్వమువలె నది దృష్టాదృష్టము. శశికిశోర అనక శశికిశోరక అనుటచేత నీ సాదాపరపర్యాయమైన యమాకళ శివుడు ధరించు **చంద్రకల** యని వ్యంగ్యమగుచున్నది. శివజటాజూటము రాత్రి యందలి యాకాశము. అందొకప్పుడు చంద్రుడు కనిపించియు కనిపించ నట్లుండును. ఒకప్పుడర్ధమే కనిపించును. కొన్ని యేండ్లవఱకే తండ్రి బిడ్డను నెత్తికెక్కించుకొనును. శివుడును చంద్రుని యర్ధభాగము పెరుగువఱకే నెత్తికెక్కించుకొనును. ఆ తర్వాత పూర్ణచంద్రు నాతడు శిరమున ధరింపడు కాని శిరోభూషణమైన చంద్రుడు పూర్ణత నందినప్పుడు వానిని తన సహస్రారమునుగా రూపొందించుకొనును.



**అవ:-** "పై శ్లోకమున అమ్మవారి చూపులోని 16వ భాగము శివుని మోహింపజేయుట యందు పరమౌషధమని వర్ణింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి క్రీగంటిచూపుల వలయము చెప్పబడుచున్నది.

**శ్లో॥ కామద్రుహో హృదయయన్త్రణజాగరూకా**
**కామాక్షి! చఞ్చలదృగఞ్చలమేఖలా తే,**

**ఆశ్చర్యమమ్బ! భజతాం ఝటితి స్వకీయ-**
**సమ్పర్క ఏవ విధునోతి సమస్తబన్ధాన్॥** **16**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| అంబ! | = | అమ్మా! |
| కామద్రుహః | = | శివునియొక్క |
| హృదయయన్త్రణజాగరూకా | = | మనస్సుయొక్క బంధనమునందు మెలకువ గలిగినది; |
| తే | = | నీ యొక్క |
| చంచలదృగంచలమేఖలా | = | కదలు కడగంటి చూపుల వలయము; |
| స్వకీయసంపర్క ఏవ | = | తన సంబంధమే; |
| ఝటితి | = | వెంటనే; |
| భజతామ్ | = | భజించువారియొక్క |
| సమస్తబన్ధాన్ | = | అన్ని బంధములను; |
| విధునోతి | = | తొలగించును; |
| ఆశ్చర్యమ్ | = | వింతకదా! |

**తాత్పర్యము:-**

అమ్మా! ఓ కామాక్షీదేవీ! చంచలములైనను నీ చూపులు శివుని హృదయమును బంధించి వేయుటకు సమర్థములు కాని భక్తుల బంధనము లన్నింటిని సంబంధ మాత్రము చేతనే ఛేదించి వేయ గలవనుట ఎంత విచిత్రము!

**వివరణము:-**

1) అమ్మవారి చూపులు చంచలములు. శివుని మనస్సు స్థిరము. స్థిరమైన త్రాటితో చంచలములైన పశ్వాదులను బంధించవచ్చును. కాని చంచలము లైన అమ్మవారి చూపులే అన్యత్ర (ఆత్మావలోకమునందు) స్థిరమైన శివుని మనస్సును దానినుండి మరల్చి తమపై స్థిరముగా నుండునట్లు చేయుటలో మెలకువ గలిగి యున్నవి. అస్థిరములు స్థిరమును బంధించుట లోక విరుద్ధము మరొక విషయము బంధించునది విడిపింపజాలదు. త్రాడెక్కడైన ఎవరినైనా విడిపించునా? కాని అమ్మవారి చూపుల వలయము శివుని బంధించునదే యైనను భక్తుల సమస్త బంధముల దొలగించగలదు. ఇది మరింత లోకవిరుద్ధము. త్రాటి యొక్క స్పర్శ దేనిని ఎవనిని విడిపింప జాలదు. పైగా త్రాటి యొక్క సంబంధము లేకపోవుటయే బంధవిముక్తి. అట్లుండ అమ్మవారి చూపుల త్రాడు తన సంబంధముచేతనే అనగా చూపుల స్పర్శ చేతనే భక్తుల బంధములను హరించి వేయుచున్నది. ఇది మరియు విరుద్ధము.

2) కావున నీ శ్లోకమున మూడు విరోధాభాసాలంకారముల సమ్మేళనమున్నది.

ఇది అమ్మవారి మహిమాతిశయమును వ్యంజింప జేయుచున్నది.



అవ:- విరోధాభాసాలంకారమునే ఈ శ్లోకమునను నిబంధించుచున్నాడు.

శ్లో॥ నీలోఽపి రాగమధికం జనయన్పురారే-
ర్లోలోఽపి భక్తిమధికాం ద్రఢయన్నరాణామ్।
వక్రోఽపి దేవి నమతాం సమతాం వితన్వన్
కామాక్షి! నృత్యతు మయి త్వదపాఙ్గపాతః॥ 17

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| నీలః+అపి | = | నల్లనిదైనను; |
| పురారేః | = | శివునకు; |
| అధికమ్ | = | ఎక్కువయిన; |
| రాగమ్ | = | రక్తిని; |
| జనయన్ | = | కలిగించుచు; |
| లోలః+అపి | = | చంచలమయినను; |
| నరాణామ్ | = | మనుష్యులకు; |
| అధికామ్ | = | ఎక్కువయిన; |
| భక్తిమ్ | = | భక్తిని; |
| ద్రఢయన్ | = | గట్టిపఱచుచు; |
| వక్రః+అపి | = | వంకఱయైనను; |
| నమతామ్ | = | నమస్కరించువారిలో; |
| సమతామ్ | = | సమభావమును; |
| వితన్వన్ | = | విస్తరింపజేయుచు; |
| త్వదపాంగపాతః | = | నీ క్రీగంటి ప్రసారము; |
| మయి | = | నాయందు; |
| నృత్యతు | = | నర్తించుగాక. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ క్రీగంటి ప్రసారము నల్లనిదయ్యును శివునకు రాగమును (ఎఱ్ఱదనమును) కలిగించుచున్నది. అది చంచలమయ్యును మనుష్యులలో నధికముగా భక్తిని దృఢీకరింప జేయుచున్నది. మరియునది వంకఱయైనను నమస్కరించువారలలో సమభావమును విస్తరింపజేయుచున్నది. అది నా యందు రాగమును కలిగించి భక్తిని దృఢమొనరించి సమభావమును విస్తరింప జేయుగాక!

**వివరణము:-**

1) నీలవస్తువు నైల్యమునే వెదజల్లుట సహజము. కాని అమ్మ వారి నీలమైన క్రీగంటి ప్రసారము శివునిలో రాగమును కలిగించుట యొక విరోధము. చాంచల్యము నాపక పోయిన చాంచల్యమునే నిరంతరము కలిగి యుండుట వైజ్ఞానిక సమ్మత సిద్ధాంతము. కాని అమ్మవారి క్రీగంటి ప్రసారము భక్తిని అనగా తైలధారవలె నవిచ్ఛిన్నమైన భగవత్స్వరూపజ్ఞానధారను అనగా భగవత్స్వరూపము నందు చిత్తముయొక్క అచంచలమైన ఏకాగ్రతను భక్తులలో దృఢీకరింపజేయు చున్నది. మనస్సులో విషయములు మారిపోవుట దానినిబట్టి మనస్సు యొక్క వృత్తులు మారిపోవుట మనస్సు యొక్క చాంచల్య మనబడును. భక్తుల మనస్సున భగవంతుడను విషయము మారకపోవుటచే వారి చిత్తమేకాగ్రమని చెప్పబడును. ఆ ఏకాగ్రత ఎక్కువ మరింత యెక్కువ కాల ముండుటయే భక్తియొక్క దృఢీకరణము. భగవద్రామానుజసిద్ధాంతమున భక్తి శేముషీరూపమనగా జ్ఞానధారాస్వరూపము. భగవత్స్వరూపధ్యానము భక్తి యని వారి సిద్ధాంతము వలన తెలియును. శ్రీ శంకరులు సైతము స్వస్వరూపానుసంధానమే భక్తి యని చెప్పినారు. అనగా స్వస్వరూపధ్యాన మన్నమాట. శంకరుల సిద్ధాంతమున భగవంతుడు స్వాభిన్నుడు. కావున స్వస్వరూపానుసంధానము అన్నను భగవత్స్వరూపధ్యానమన్నను ఒక్కటియే యగును. ఉభయుల మతము నందును భక్తి ఉపాసనారూపమే. సరే అలంకారిక దృష్టిలో చంచలమైన అమ్మవారి క్రీగంటి ప్రసారము చిత్తమునందు భక్తిరూపస్థైర్యమున కలిగించుట మరియొక విరోధము. వక్రత సమత్వము పరస్పరవిరుద్ధములు కాని అమ్మవారి క్రీగంటి ప్రసారము నందలి వక్రత నమస్కరించువారిలో సమత్వమును విస్తరింప జేయును. ఇది మరియొక విరోధము. మూడు విరోధములీ శ్లోకమున నిబంధింపబడి యున్నవి.

2) మొదటి పాదమున రాగశబ్దమునందలి శ్లేషచే విరోధ మాభాసమయి పోవును. రెండవ, మూడవ పాదములలో అమ్మవారి అపాంగపాతముయొక్క మహిమాతిశయమువలన విరోధమాభాసమాత్రమయి పోవును. మూడు పాదములందును గల అపి శబ్దము విరోధమును స్ఫురింపజేయును. ఆ విరోధము నిలువక పోవుటచే రజ్జువునందు సర్పమువలె నాభాసమాత్రమయి పోవును. ఇట్లు విరోధ మాభాసమాత్రమే యై విరోధము లపహరింపబడుటయే విరోధాభాసాలంకారమనబడును. ఇట్టి అలంకారములు మూడు ఈ శ్లోకమున నొప్పుటచే ఈ శ్లోకమున పై శ్లోకము నందు వలెనే మూడు విరోధాభాసా లంకారముల సమ్మేళనము కలదు. **'నీల లోల జనయన్ ద్రఢయన్'** అని మొదటి రెండు పాదముల నుండుటచే ఆద్యనుప్రాసము మధ్యానుప్రాసము అను శబ్దాలంకారములు ఈ శ్లోకమున కలవు.



అవ:- శ్రీ కామాక్షీదేవి కటాక్షము శ్రీరామస్వరూపమైనదని ఈ శ్లోకమున వర్ణించుచున్నాడు.

శ్లో॥ కుణ్ఠీకరోతు విపదమ్మమ కుఞ్చితభ్రూ-
చాపాఞ్చితః శ్రితవిదేహభవానురాగః।
రక్షోపకారమనిశం జనయఞ్జగత్యాం
కామాక్షి! రామ ఇవ తే కరుణాకటాక్షః॥ **18**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| కుంచితభ్రూచాపాంచితః | = | వంచిన కనుబొమలు అనెడి వింటితో కూడిన; |
| శ్రితవిదేహభవానురాగః | = | పొందిన దేహభవానురాగరాహిత్యము కలది (విదేహరాజపుత్రి యగు సీత యందలి యనురాగము గల); |
| జగత్యామ్ | = | భూమియందు; |
| జనయన్ | = | కలిగించుచు |
| అనిశమ్ | = | ఎల్లప్పుడు; |
| రక్షోపకారమ్ | = | రక్షించుటయను; |
| తే | = | నీయొక్క |
| కరుణాకటాక్షః | = | దయగల చూపు; |
| రామ ఇవ | = | రామునివలె; |
| మమ | = | నా యొక్క |
| విపదమ్ | = | ఆపదను; |
| కుంఠీకరోతు | = | నశింపజేయుగాక. |

**తాత్పర్యము:-**

అమ్మా! కామాక్షీ దేవీ! నీ కరుణా కటాక్షము రాముడే. రాముడు వంచిన ధనువు గలవాడు. నీ కటాక్షము వంచిన కనుబొమలు కలది. కటాక్షము సంసారులలో దేహానుభవానురాగరాహిత్యమును కలిగించునది. రాముడు విదేహరాజపుత్రికయందు ప్రేమను పొందినవాడు. కటాక్షము జగమును రక్షించుట యను నుపకారమొనరించునది. రాముడు జగద్రక్షణోపకార మొనర్చినవాడు. ఈ విధముగ శ్రీరామస్వరూపమైన నీ కటాక్షము నా ఆపదను నశింపజేయుగాక!

**వివరణము:-**

ఆపదామపహర్తారమ్' అని 'రామాయాపన్నివారిణే' అని భక్తు లాపదనివారణము కొఱకు శ్రీరాముని నుతించుచుందురు. శ్రీ రాముడు వైకుంఠవాసియైన శ్రీమహావిష్ణువు

యొక్క యవతారమే. అతనికి వికుంఠుడు వైకుంఠుడు అను పేర్లు కూడ కలవు. ఆయన లోకమెవరిచేతను నశింపజేయ బడదు. కావుననది వైకుంఠము. ఆయన నెవరు నశింపజేయ జాలరు. గావున నాశమే లేనివాడు గావునను ఆయన వికుంఠుడు లేక వైకుంఠుడు. ఆయన మాత్రము దుష్టుల పరాక్రమమును దురాక్రమణలను కుంఠీకరింప జేయును. రామావతారమున నీ లక్షణము మరింత యధికము. కావున ఆపన్నివారణమునకు శ్రీరాము నాశ్రయించెదరు. మూకకవియు శ్రీరాముని యీ లక్షణము నమ్మవారి చూపుల యందున్నదని నిరూపింపగోరినాడు. శ్రీరాముని కా శక్తి అమ్మవారి యుపాసనవలన కలిగినదే. శ్రీరామున కీ శక్తి అమ్మవారి దయగల చూపునకు బాత్రుడైన పిమ్మటనే లభించినది. చూపు అమ్మవారిలో నొక అవయవము. శ్రీరాము దమ్మవారిలో నొక భాగము. **'అంగాన్యన్యా దేవతా' (తై1.5.1)** అని శ్రుతి. కామాక్షి దేహచ్ఛాయ శ్యామలము. కటాక్షము కూడ శ్యామలము. కావుననే కొందఱు **శ్రీరామః శ్యామలాదేవీ**-అని శ్రీరామశ్యామలాదేవ్యభేదమును భావించెదరు. ఇంత ముఖ్య దైవమైన శ్రీరాముడు కూడ అమ్మ చూపు చివఱ నొదిగి మూకకవికి సాక్షాత్కరించినాడు. అందుకే కటాక్షము రాముని వల నున్నదని శ్రీరామునితో కటాక్షము నుపమించినాడు. ఉపమానము ఉపమేయమునకన్న గుణాధిక్యము కలదై యుండును. ఈ సూత్రము భగవద్వర్ణమునకు వర్తించదు. భగవంతుని కన్న నధికమైన దేదియు సృష్టి యందుండదు గదా! సాధారణ నాయికానాయకుల వర్ణనము నందును ప్రతీపాలంకార వ్యాజమున నుపమానమును నిందించుట ద్వారా కవులు వారి నతిశయింపజేయుచుండగా భగవద్వస్తువు తాకి ఉపమానద్రవ్యమున కన్న శ్రేష్ఠమనుటలో విచిత్రమేమి? **శ్రితవిదేహభవానురాగః** అను కటాక్షవిశేషణము గమనింపదగినది. అమ్మవారు దలచుకొన్నచో దేహాభిమానమును విసర్జించిన జ్ఞానులను కూడ బలాత్కారముగా లాగి మోహ రాక్షసునకప్పగించి పతితులగావించు **'జ్ఞానినామపి చేతాంసి మాయా భగవతీ హి సా బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి.'** అని చండీ సప్తశతీ వాక్యము. విదేహులకు సైతము భవమునందు అనగా సంసారము నందాసక్తి కలిగించగల దమ్మవారి కటాక్షము. కరుణాహీనమైన యెడల అది కరుణా సహితమైన దేహభవానురాగ విహీనులనుగా, సంసారుల నొనర్చును. (లేక దేహ భవానురాగమును విశిష్టమునుగా జేయును). శ్రీరాముడు వంచిన ధనువు కలవాడు. అమ్మవారి కటాక్షము కుంచిత భ్రూయుగము కలది. కావుననే కటాక్షమునకు శ్రీరాముడుపమానముగా జేయబడినాడు. శ్రీరామునకు ధనువు ప్రతీకము. శ్రీకృష్ణునకు నెమలిపింఛము. నెమలి పింఛమును చూచిన కృష్ణుడు తలపునకు వచ్చును. ధనుర్ధరులలో శ్రీరాముడగ్రేసరుడు. ధనువు శ్రీరామునకు ప్రతీకము. ధనువును చూచిన రాముడు తలపునకు వచ్చును. మూకకవికి దేవి యొక్క కుంచితభ్రూయుగము దర్శించుటచే రాముడు తలపునకు వచ్చెను. అందుకే రామునితో కటాక్షము నుపమించినాడు. ఇట వాచ్యమైన ఉపమాలంకారముచే స్మృత్యాలంకారము వ్యంగ్యమగుచున్నది. **రామో విగ్రహవాన్ ధర్మః** అను సూక్తి రాముడు శరీరముధరించిన

ధర్మమని తెలియ జేయును. ధర్మమను శబ్దమునకు ధనువని కూడ నర్థము కలదు. కావుననే శ్రీరామునకు ప్రతీకము ధనువని చెప్పబడినది. శ్రీరాముడు రావణాది రాక్షసుల వధించి జగత్తునకు రక్ష యను నుపకారము చేసినాడు. అమ్మవారి కటాక్షము రజస్తమో వృత్తుల నశింపజేసి భక్తకోటికి రక్షోపకారమొనర్చుచున్నది. శ్రీరాముడు సైతమమ్మ వారి కటాక్షము పడని వాని రక్షింపజాలడు. కరుణాకటాక్షము కల యమ్మవారిచే బ్రహ్మరుద్రులు జగత్సృష్టిప్రలయకర్మల యందు వియోగింపబడినారు. అమ్మవారి కంటికొన శ్రీ విష్ణ్వవతార భూత రామావతారము ధరించి జగత్తును రక్షించు చున్నదేమో యను నుత్ప్రేక్షాలంకారము వాచ్యమైన ఉపమాలంకారముచేత వ్యంగ్యమగుచున్నది. సృష్టి ప్రలయము లన్యోన్యాధీనములు. సృష్టి లేనిదే ప్రలయము లేదు. ప్రలయము లేనిదే సృష్టిలేదు. ఇక మిగిలినది రక్షణము. అది అమ్మవారి కటాక్షము యొక్క కృత్యము. అమ్మవారి కటాక్షము కామజనకము. కాదు కాదు కామకోటి జననము. కాముని ధనుర్బాణము లమ్మవారి ప్రసాదములే. అమ్మ పుండ్రేక్షుపుష్పబాణహస్త. మన్మథుడు నట్టివాడే. శ్రీరాముడును కోటి కందర్ప సుందరుడు. స్త్రీలకే కాదు పురుషులకు నాయనను (జూచినప్పుడు స్త్రీ త్వభావనాభావితులై శ్రీరామునాలింగనము చేసికొన గోరుదురు. **పుంసాం మోహన రూపాయ** అని కదా పెద్దలందరు. వాస్తవమునకు శ్రీరాముడమ్మవారి కటాక్షమే. కామమును కలిగించి సంసారిని జేయు నామె కటాక్షమే కరుణతో కూడి సంసారుల ముక్తుల జేయగలదు. శ్రీరాముడు తారక మంత్ర స్వరూపుడు. కావుననే అమ్మవారి సంసారతారకకరుణా కటాక్షమునకు సమానముగా జేయబడినాడు. విపత్కుంఠీ కరణము అనగా ఆపన్నివారణము. పురుషార్థము. సర్వ ప్రాణు లాపన్నివారణము గోరుకొందురు. ఇతర వాంఛలు దోషయుక్తములైన కావచ్చును. ఆపన్నివారణవాంఛ మనివార్యవాంఛ కావున అది పురుషార్థము. వివేకులు జీవబ్రహ్మైక్యానుభవమహానందమునే గోరుకొందురు. తదితర పురుషార్థములు. తదితర సామాన్యవాంఛలు వారి దరికి చేరవు. వారికితర వాంఛాఫలము లన్నియు దుఃఖరూపములే కావున విషరూపములే. మూక మహాకవి వివేకి కావుననే విపత్కుంఠీకరణరూప పరమపురుషార్థమునే యీ శ్లోకమున కోరుకొనుచున్నాడు.



**అవ:-** శివుడు కాముని దేహమును కాల్చివేయగా వాడు విదేహుడైనాడు. అయినను వాడు చావలేదు. స్త్రీ పురుషులందరలో జనించు ననురాగమంతయు విదేహభవమే. విదేహుడైన పిమ్మట మన్మథుడు అమ్మవారి కటాక్షము నాశ్రయించినాడు. లోకబంధహేతువైన యనురాగమును జన్మింపజేయు కాముడమ్మవారి కటాక్షము నాశ్రయించుటచే నమ్మవారికి కామాక్షియను పేరేర్పబడినది. ఈ శ్లోకమున శ్రీరాముని సౌందర్యములోని లేశము నాశ్రయించిన మన్మథుడను బీజముయొక్క పుట్టుక కమ్మవారి కటాక్షము కేదారమగుట చెప్పబడుచున్నది.

శ్లో॥ శ్రీకామకోటి శివలోచనశోషితస్య
శృఙ్గారబీజవిభవస్య పునః ప్రరోహే।
ప్రేమామ్భసార్ద్రమచిరాత్ప్రచురేణ శఙ్కే
కేదారమమ్బ! తవ కేవలదృష్టిపాతమ్॥ 19

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| శ్రీకామకోటి | = | శ్రీకామకోటి పీఠ స్వరూపిణివైన యో కామాక్షీ దేవీ! |
| అంబ | = | అమ్మా! |
| శివలోచనశోషితస్య | = | శివుని కంటిచేత నార్పివేయబడిన; |
| శృంగారబీజవిభవస్య | = | స్త్రీ పురుష పరస్పర రతివాంఛా బీజసంపద్రూపుడైన మన్మథుని యొక్క; |
| పునః | = | తిరిగి; |
| ప్రరోహే | = | మొలకెత్తించుటయందు; |
| ప్రచురేణ | = | అధికమైన; |
| ప్రేమాంభసా | = | ప్రేమజలముచేత; |
| అచిరాత్ | = | క్రొత్తగా; |
| ఆర్ద్రమ్ | = | తడిసిన; |
| తవ | = | నీ యొక్క; |
| కేవలదృష్టిపాతమ్ | = | ఏకైక కటాక్షప్రసారమునే; |
| కేదారమ్ | = | పొలమునుగా; |
| శంకే | = | భావించుచున్నాను. |

**తాత్పర్యము:-**

శ్రీ కామకోటి పీఠాధిష్ఠాత్రివైన యో తల్లీ! శివుని కంటి వేడిచే నెండింపబడిన శృంగార బీజరాశి (మన్మథుడు) తిరిగి మొలకెత్తుటకు అత్యంత ప్రేమార్ద్రమైన నీ యేకైకదృష్టిపాతమే పొలమయినదని యెంచుచున్నాను.

**వివరణము:-**

1) కొత్త పంటలోని తాలులేని మంచి విత్తనముల నెండ బెట్టి బాగుగా నెండిన పిదప నీరు కట్టి పొలమున దిరిగి మొలకెత్తించుట హాలికులెరిగిన విషయమే. మూకకవి కవితాహాలికుడు. ఆతనికి నీ విషయము తెలియును. కావుననే శివుని కంటి మంటకు బాగుగా నారి పచ్చదొలగి యెండిన శృంగార రస బీజమును తిరిగి మొలకెత్తించుటకు కావలసిన పొలమును గుర్తించినాడు. అది అమ్మవారి దృష్టిపాతము. అది ఇటీవల యత్యంత ప్రేమ మనెడి జలాధిక్యముచే బాగుగా తడిసి యున్నది. కావున ఆ బీజము ఆశించిన విధముగా తిరిగి మొలకెత్తి స్త్రీపురుషహృదయద్వంద్వమున ఫలించినది. ఈ సంసారమిట్లు

సాగుటకు అమ్మవారి దృష్టిపాతమే హేతువు. ఆమే కన్నుమూసినచో సంసారబీజమయిన కామమే లేకపోవును. ఇక సంసార మెట్లుండును? అంతర్హితమై పోవును. ఆమె **ఉన్మేషనిమిషోత్పన్నవిపన్నభువనావళి** కదా!

2) ఈ శ్లోకమునందుత్ప్రేక్షాలంకారము కలదు. కామాక్షి యను సంబోధనము లేనిది ఈ శ్లోకము.



**అవ:-** అమ్మవారి వీక్షణము అగస్త్యరూపమని ఈ శ్లోకమున కవి నిరూపించుచున్నాడు.

**శ్లో॥ మాహాత్మ్యశేవధిరసౌ తవ దుర్విలఙ్ఘ్య-**
**సంసారవిన్ధ్యగిరికుణ్ఠనకేలిచుఞ్చుః।**
**ధైర్యామ్బుధిమ్పశుపతేశ్చులుకీకరోతి**
**కామాక్షి! వీక్షణవిజృమ్భణకుమ్భజన్మా॥ 20**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| మాహాత్మ్యశేవధిః | = | మాహాత్మత్వమునకు నిధియైన; |
| దుర్విలంఘ్య- | = | దాటరాని |
| సంసార- | = | సంసారమనెడి |
| వింధ్యగిరి- | = | వింధ్య పర్వతముయొక్క |
| కుంఠనకేలి- | = | అణచి వేయుట యను నాట యందు |
| చుంచుః | = | సమర్థుడైన; |
| తవ | = | నీ యొక్క; |
| అసౌ | = | ఈ |
| వీక్షణ విజృమ్భణ కుంభజన్మా | = | చూపుయొక్క విజృంభణమను కుంభమునందు జన్మించిన యగస్త్యుడు; |
| పశుపతేః | = | శివునియొక్క; |
| ధైర్యాంబుధిమ్ | = | ధైర్యసముద్రమును; |
| చులుకీకరోతి | = | పుడిసిలిగా జేయుచున్నాడు. |

**తాత్పర్యము:-**

అమ్మా! కామాక్షీ! నీ వీక్షణవిజృంభణాగస్త్యుడు సంసారమనెడి వింధ్యగిరిని దాటి వచ్చి, శివుని ధైర్యమను సముద్రమును బుడిసిట బట్టుచున్నాడు.

**వివరణము:-**

మునులలో నగస్త్యుడు మహాముని, అతని మాహాత్మ్య మనన్య సామాన్యము.

మేరు పర్వతముతో మాత్సర్యమును వహించి, సూర్యగతి కవరోధము కలిగించిన వింధ్యపర్వత మగస్త్యుని జూడగనే మోకరిల్లెను. "నేను దక్షిణదేశమున కేగుచున్నాను. తిరిగివచ్చు వరకు నీవిట్లే యుండుమని" వింధ్యపర్వతమును ఆజ్ఞాపించినాడు. అంతే, అగస్త్యుడు తిరిగి రాలేదు. వింధ్యుడు తలయెత్తలేదు. సూర్యగతి కవరోధము గలుగలేదు. అగస్త్యుడు సముద్రము నంతయు పుడిసిట బట్టి యాచమించెను. ముమ్మా రాచమింపవలె గదా! ఒకసారికే సముద్రజలమంతయైపోయినది. అమ్మవారు కన్ను దెరుచుకొని మనను చూచుచో సంసారవింధ్యగిరి గర్వమణగి పోవును. ఆమె వీక్షణము శివుని ధైర్యసముద్రమునే పుడిసిట బట్టినది. అందుకే ఆ వీక్షణ మగస్త్యమునిగా రూపింపబడినది. కావున నీశ్లోకమున రూపకాలంకారము గలదు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి వీక్షణము అగస్త్య స్వరూపమని వర్ణించిన మూక మహాకవి ఈ శ్లోకమున అమ్మవారి కడగంటి చూపులవరుస వెన్నెలవలె నాచరించుచున్నదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ పీయూషవర్షశిశిరా స్ఫుటదుత్పలశ్రీ-**
**మైత్రీ నిసర్గమధురా కృతతారకాప్తిః।**
**కామాక్షి! సంశ్రితవతీ వపురష్టమూర్తే-**
**ర్జ్యోత్స్నాయతే భగవతి! త్వదపాఙ్గమాలా॥ 21**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| భగవతి! | = | షడ్గుణైశ్వర్య సంపన్నురాలా! |
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| త్వదపాంగమాలా | = | నీ కడగంటి చూపుల వరుస; |
| పీయూషవర్షశిశిరా | = | అమృతముయొక్క వర్షముచే చల్లనిదై; |
| స్ఫుటదుత్పలశ్రీమైత్రీ | = | వికసించుచున్న కలువలకాంతితో స్నేహము గలదై; |
| నిసర్గమధురా | = | స్వభావముచే మధురమైనదై; |
| కృతతారకాప్తిః | = | చేయబడిన కనుపాపలపొందిక కలదై లేక నక్షత్రముల పొందిక కలదై; |
| అష్టమూర్తేః | = | శివుని యొక్క |
| వపుః | = | శరీరమును; |
| సంశ్రితవతీ | = | ఆశ్రయించినదై; |
| జ్యోత్స్నాయతే | = | వెన్నెలవలె నాచరించుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి కడగంటి చూపుల వరుస అమృతమును వర్షించుచు చల్లగా నుండును. వికసించుచున్న కలువల కాంతి కలిగి యుండును. సహజ మధురముగా నుండును. వెన్నెలయు పై లక్షణములు కలిగి యుండును. అమ్మవారి కడగంటి చూపుల వరుస కనుపాపలతో కూడి యుండును. వెన్నెల నక్షత్రములతో కూడి యుండును. రెండును తారకాప్తి కలవియే కావున అమ్మవారి కడగంటిచూపులవరుస వెన్నెలవలె నాచరించుచున్నది.

**వివరణము:-**

1) ఈ శ్లోకమునందలి మొదటి మూడు విశేషణములు, ఐదవ విశేషణము అర్థశ్లేషము ననుసరించి వెన్నెలయందు అమ్మవారి కడగంటి చూపులతో నభేద ప్రధానసాదృశ్యము. నాల్గవ విశేషణము శబ్దశ్లేషము నాశ్రయించి సమాన ధర్మమును నారెంటికి చెప్పుటచేత నుపమాలంకార మేర్పడుచున్నది.

2) చంద్రుడు సుధాకరుడు. అమృతకిరణుడు. దేవతలకమృత భాండము. కాని అతని కాంతియగు వెన్నెల అమృతమును అనగా మోక్షమును కలిగించును. చంద్రబింబము శివుని యష్టమూర్తులలో నొకటి. కావున వెన్నెల శివుని యష్టమూర్తుల నాశ్రయించి యుండును. అమ్మవారి చూపులును శివుని యష్టమూర్తుల నాశ్రయించి యుండును. వెన్నెలలో కలువలు వికసించు చుండుటచే నది వానితో స్నేహ మొనరించునట్లు అమ్మవారి కడగంటి చూపులుత్పలముల స్నేహముజేయును. అనగా వానితో పోలియుండును. శివుడష్టమూర్తి. పంచభూతములు సూర్యచంద్రద్వయము (మనోబుద్ధులు) యజమానత్వము (అహంకారము)లు. అనునవి శివుని అష్టమూర్తులు. సూర్యుడు బుద్ధికి, చంద్రుడు మనస్సునకు ప్రతీకలు. బ్రహ్మాండ శరీరమున మనోబుద్ధ్యహంకారసహిత మహాభూతములు, పిండాండశరీరమున మనో బుద్ధ్యహంకార సహిత పంచ భూతములుండుటచే నా రెంటికి అష్టమూర్తి అను పేరేర్పడియున్నది. ఇట్లు జీవరూపమున పిండాండ శరీరము నష్టమూర్తి సహితమును, ఈశ్వరరూపమున బ్రహ్మాండ శరీరము నష్టమూర్తి సహితమును గలవాడగుటచే శివుడష్టమూర్తి సహితమును గలవాడగుటచే శివుడష్టమూర్తి యనబడుచున్నాడు. అమ్మవారి కటాక్షమునకు పాత్రుడయినట్టి వారి సహస్రార చంద్రమండలమునుండి జాలు వారిన యమృతవర్షముచే నాడీమండల మంతయు నాప్లావితమై యుండుటచే వారు ఆనందమును జిలుకుచు ఇతరుల పరితాపమపహరించు చల్లదనము కలవారై యుందురు. **పీయూషవర్షశిశిరత్వ** మనగా నట్టిది. అమ్మవారి శిరమున చంద్రుడుండుటచే నామె శరీర మంతయు జల్లగా నుండి యితరుల పరితాపమును బోగొట్టు చల్లదనము కలిగి యుండును. ఇక ఆమె కన్నులు పీయూషమును వర్షించుటలో సందేహమేమి? అమ్మవారి కన్నులలో నొకటి చంద్రుడే కావున నది వెన్నెల వంటి చూపు కలదగుట సముచితము. పంచభూతములలో

అగ్ని యున్నది. శివుని శరీరములో నది భాగము కావున ఫాలము నందది ధరింపబడినది కావునను శివుని శరీరము వేడెక్కి యుండగా అమ్మవారి యపాంగమాల వెన్నెలవలె శివుని శరీరమును చల్లబరచుచున్నది. అట్లే తాపత్రయముచే తపించియున్న భక్తుల మనస్సునం దా యపాంగమాల శీతలదయారసము వర్షించి చల్లబఱచగలదు. వాస్తవమునకు శివుని శరీరమున చంద్రుడున్నాడు. కావున ఆయన శరీరమును చల్లబఱచు వ్యాపారమునకంటె భక్తమానసమును తాపరహితముగా జేయు వెన్నెలవలె చల్లబఱచు వ్యాపారమే యవసరము. జీవునిలోని జీవత్వాగ్ని తాపము హరించి శివత్వమను వెన్నెలలో చల్లబఱచుట అవసరము అను భక్తుల యాశలను **జ్యోత్స్నాయతే, అష్టమూర్తేః** యను పదములు వ్యంజింపజేయుచున్నవి.



**అవ:-** అమ్మవారి కడగంటిచూపుల వరుస వెన్నెల నాచరించుచున్నదని చెప్పిన మూకమహాకవి ఈ శ్లోకమున శివుని అందమైన శరీరమును ఆడుతుమ్మెద వలె నెడతెగక స్పృశించుచున్నదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ అమ్బ! స్మరప్రతిభటస్య వపుర్మనోజ్ఞ-**
**మమ్భోజకాననమివాఞ్చితకణ్టకాభమ్।**
**భృఙ్గీవ చుమ్బతి సదైవ సపక్షపాతా**
**కామాక్షి! కోమలరుచిస్త్వదపాఙ్గమాలా॥ 22**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| అంబ! | = | అమ్మా! |
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| కోమలరుచిః | = | మృదుతయం దభిలాషగల; |
| సదా+ఏవ | = | ఎల్లప్పుడు; |
| సపక్షపాతా | = | పక్షపాతముతో కూడిన; |
| త్వదపాంగమాలా | = | నీ క్రీగంటి చూపుల వరుస; |
| అంచితకంటకాభమ్ | = | పొందిన పులకాంకురముల కాంతిగల లేక పొందిన ముండ్లకాంతి గల; |
| అమ్భోజకాననమ్+ఇవ | = | కమలవనమునువలె; |
| స్మరప్రతిభటస్య | = | మన్మథవిరోధి (శివుని) యొక్క; |
| మనోజ్ఞమ్ | = | అందమైన; |
| వపుః | = | శరీరమును; |
| భృంగీ+ఇవ | = | తుమ్మెదవలె; |
| చుంబతి | = | స్పృశించుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మా! కామాక్షీ దేవీ! నీ కడగంటి చూపుల వరుస భక్తులయందు బక్షపాతము కలది. దాని కాంతి కోమలమైనది. మృదువైన కమల వనము వంటి శివుని యందమైన శరీరము నాడుతుమ్మెదవలె నెడతెగక స్పృశించు చున్నది. ఆ రోమాంచము కమలవనమునందలి కంటకముల (ముండ్ల) కాంతిగలదై యున్నది.

**వివరణము:-**

కమలము స్త్రీముఖముతో, తుమ్మెదను పురుషులతో కవులు పోల్చుట సాధారణము. ఈ శ్లోకమున శివుని యవయవములన్నియు కమలములుగా పోల్చబడినవి. శివుని శరీరము కమలవనముగా పోల్చబడినది. అమ్మవారి అపాంగమాల ఆడుతుమ్మెదగా పోల్చబడినది. నాయకుడు ముద్దిడుకొన బోవునపుడు నాయికకు, నాయిక ముద్దిడుకొన బోవునపుడు నాయకునకు రోమాంచము కలుగును. ఈ శ్లోకమున నాయికయే నాయకుని చుంబించినదను వ్యవహారము స్ఫురించుటచే **ఉపమానప్రాణితసమాసోక్త్యలంకారము** గలదు. అమ్మవారి యపాంగమాల స్వయముగా కోమలమైన కాంతి గలది. కావున రుచి కోమలమైన యంభోజము నందాసక్తి గలది కావునను కోమలరుచి కమలానన మందలి కంటకములా కోమలతకు భంజకములు కావు. కోమలతకు రక్షకములు. శివుడు స్మరప్రతిభటుడైనను అమ్మవారి చూపులకు కోమలుడుగానే కన్పించుచున్నాడు. ఆతని రోమాంచము తన నమ్మవారు చూడబోవుచున్నదను నానందముతో కలిగినట్టిదే. అపాంగములను భృంగములతో కవులు పోల్చుట సాధారణమే. కాని అపాంగమాలను భృంగితో పోల్చుట అసాధారణము. అపాంగమాలను భృంగమాలతో పోల్చవలెను. కాని అమ్మవారి అపాంగమాల శివుని శరీరములోని యవయవములన్నింటి నొకేసారి చుంబించుచున్నదనుటకు అపాంగమాల యని కవి ప్రయోగించినాడు. భృంగమాల అనక భృంగి యనుటలో జాత్యేకవచనమున్నదని గ్రహింపవలెను. దాని వలన శివుని ప్రత్యవయవమును చుంబించు నమ్మవారి కటాక్షమాల శివుని యవయవము లందలి రుద్రాక్షమాల యని వ్యంగ్య మగుచున్నది. మాలా శబ్దము నందలి యేకవచనము సమూహ మొకటి కావున ఉపపన్నము. అపాంగముల కుపమానములు కాదగిన భృంగము లనేకములైనను తజ్జాతి యొకటే కావున భృంగీ యని యేకవచనమున బ్రయోగింపబడినది. భృంగీశబ్దములోని స్త్రీలింగము గూడ జాతిగతమేగాని భృంగగతము కాదు. సదైవ అను పదములలోని 'ఏవ' ను దూరము చేసి 'చుంబతి' అను పదమునకు కలిపిన 'చుంబతి ఏవ'-ముద్దాడు కొనుచునే యున్నదను చుంబన సాపత్యము స్ఫురించును. కమలవనమువంటి శివుని వపువును ముద్దాడు కొనకుండుట అపాంగమాల కశక్యమును, చుంబనేతర వ్యవచ్ఛేదమును స్ఫురించును. భృంగము పక్షములుగల కీటకము. కన్నులకు పక్షములు సహజములే. దేవతలకు కన్నులున్నను అని పక్షపాతరహితములే కావలయును. శివుని యందు బక్షపాతముతో నాతనినే చూచుట పత్నికి తగిన పని కావచ్చును. కాని

అంబకు తగిన పని కాదు. అంబ పుత్రులకూడ చూచుకొనవలసియున్నది. అని అంబ యను సంబోధనము స్ఫురింపజేయుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కటాక్షము శివునియందమైన శరీరమును నిరంతరము స్పృశించుచున్నదని వర్ణింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షమున దయ దోబూచులాడుచున్నదని వర్ణించుచున్నాడు.

**శ్లో॥ కేశప్రభాపటలనీలవితానజాలే**
**కామాక్షి! కుణ్డలమణిచ్ఛవిదీపశోభే।**
**శఙ్కే కటాక్షరుచిరఙ్గతలే కృపాఖ్యా**
**శైలూషికీ నటతి శఙ్కరవల్లభే! తే॥ 23**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| శంకరవల్లభే! | = | శివునకు ప్రియురాలవైన; |
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| కేశప్రభాపటలనీలవితానజాలే | = | కేశకాంతి సమూహమనెడి నల్లని పందిరి గల; |
| కుండల- | = | కుండలములందలి |
| మణి- | = | రత్నముల |
| ఛవి- | = | కాంతి యనెడి |
| దీప- | = | దీపము యొక్క |
| శోభే | = | కాంతి గల; |
| తే | = | నీ యొక్క |
| కటాక్షరుచిరంగతలే | = | కటాక్షకాంతియనెడి రంగస్థలమున; |
| కృపాఖ్యా | = | దయయను పేరుగల; |
| శైలూషికీ | = | నట్టువరాలు (నటి); |
| నటతి | = | నటించుచున్నట్లు; |
| శంకే | = | అనుకొనుచున్నాను. |

**తాత్పర్యము:-**

శివప్రియవైన యో కామాక్షీ! నీ కటాక్ష కాంతియే యొక రంగస్థలము. దానికి పైన కేశప్రభపందిరిగా నుండగా కుండలమణులకాంతి దానియందు దీపముల వెలిగించినది. ఆ రంగస్థలమున నీ దయ యను నటి నటించు చున్నట్లున్నది. అనగా నీ కన్నులలో దయ దోబూచులాడుచున్నది.

**వివరణము:-**

అమ్మవారి శిరమున నల్లని కనులున్నవి. దాని కాంతి నల్లని పందిరి. అమ్మవారి

చెవులకు కుండలములున్నవి. వానిలోని మణులు దీపములు. కటాక్షకాంతియే రంగస్థలము. దయ యనునదే నటి. ఆమె నటించుచున్నట్లున్నది. ఇట్లీ శ్లోకమున సావయవమా రూపకాలంంకారమును, ప్రాణితోత్ప్రేక్షాలంకారము గలదు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కటాక్షమున దయ దోబూచులాడుచున్నట్లు వర్ణించిన మూకమహాకవి ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షమును తనయందు అరక్షణము ప్రసరింపుమని ప్రార్థించుచున్నాడు.

**శ్లో॥** **అత్యన్తశీతలమతన్ద్రయతు క్షణార్ధ-**
**మస్తోకవిభ్రమమనఙ్గవిలాసకన్దమ్।**
**అల్పస్మితాదృతమపారకృపాప్రవాహ-**
**మక్షిప్రరోహమచిరాన్మయి కామకోటి॥** **24**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామకోటి | = | కామకోటి పీఠాధిష్ఠాత్రివైన యో దేవీ! |
| అత్యన్తశీతలమ్ | = | మిక్కిలి చల్లని; |
| అస్తోకవిభ్రమమ్ | = | గొప్ప కదలికగల; |
| అనంగవిలాసకన్దమ్ | = | మన్మథ విలాసములకు జన్మభూమియైన; |
| అల్పస్మితాదృతమ్ | = | చిఱునవ్వునం దాదరముగల; |
| అపారకృపాప్రవాహమ్ | = | ఒడ్లు కనబడకుండ బ్రవహించు కృపా ప్రవాహముకల; |
| అక్షిప్రరోహమ్ | = | చూపును; |
| మయి | = | నా యందు; |
| అచిరాత్ | = | వెంటనే; |
| క్షణార్ధమ్ | = | అరక్షణము; |
| అతన్ద్రయతు | = | జాగృత మొనర్చుగాక. |

**తాత్పర్యము:-**

మిక్కిలి చల్లని, వేగముగా కదలు, మన్మథవిలాసముల జన్మభూమియైన, చిఱునవ్వు చిందించు, అపారముగా ప్రవహించు కృపగల నీ చూపును అరక్షణము నా యందు వెంటనే జాగృత మొనర్చుము తల్లీ!

**వివరణము:-**

అక్షి ప్రరోహ విశేషణములన్నియు నకారాదులై యుండుట అక్షి ప్రరోహమను విశేష్యము కూడ అకారాది యై యుండుట ఈ శ్లోకమున మిక్కిలి శోభావహముగా నున్నది. ఇది పదాద్యనుప్రాసమను శబ్దాలంకారము.



**అవ:-** మూకమహాకవి ఈ శ్లోకమున అమ్మవారి క్రీగన్ననెడి ఊయలను ఎక్కిన అర్ధనారీశ్వరుని కన్ను క్షణక్షణం ఆనందం పొందుచున్నదని వర్ణించుచున్నాడు.

**శ్లో॥ మన్దాక్షరాగతరలీకృతిపారతంత్ర్యా-**
**త్కామాక్షి! మన్థరతరాం త్వదపాఙ్గదోలామ్।**
**ఆరుహ్య మన్దమతికౌతుకశాలి చక్షు-**
**రానన్దమేతి ముహురర్ధశశాఙ్కమౌలేః॥ 25**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| మన్దాక్ష- | = | సిగ్గుయొక్క |
| రాగ- | = | ప్రేమ యొక్క |
| తరలీకృతి- | = | చంచలీ కరణమనెడి |
| పారతంత్ర్యాత్ | = | పరాధీనత వలన; |
| మన్థరతరామ్ | = | మిక్కిలి మెల్లిగానూగు; |
| త్వదపాంగదోలామ్ | = | నీ క్రీగన్ననెడి ఊయలను; |
| మన్దమ్ | = | మెల్లిగా; |
| ఆరుహ్య | = | ఎక్కి; |
| అతికౌతుకశాలి | = | మిక్కిలి కుతూహలముతో నొప్పు; |
| అర్ధశశాంకమౌలేః | = | చంద్రుని యర్ధభాగము శిరమునందుగల శివునియొక్క |
| చక్షుః | = | కన్ను; |
| ముహుః | = | మాటి మాటికి; |
| ఆనందమ్ | = | ఆనందమును; |
| ఏతి | = | పొందుచున్నది. |

**తాత్పర్యము:-**

సిగ్గొకవైపు, ప్రేమ యొకవైపు లాగు చుండగా వివశమై కదలికతో వేగము తగ్గిన నీ యొక్క క్రీగన్ననెడి ఊయలను మెల్లిగా నెక్కి మిక్కిలి కుతూహలము కల శివునియొక్క కన్ను ఆనందము నొందుచున్నది.

**వివరణము:-**

అమ్మవారియొక్క శివునియొక్క చూపుల కలయిక ఈ శ్లోకమున వర్ణింపబడినది. సిగ్గు, ప్రేమ యను భావముల శబలతయందు భక్తిభావము గుణీభావ మొంద **ఊర్జస్వి** యలంకార మొప్పుచున్నదీ శ్లోకమున. అమ్మవారి కటాక్షమిందు దోలగా రూపింపబడుటచే రూపకాలంకారము కలదు.



**అవ:-** అమ్మవారి కటాక్షమును రాజునకు శివుడు ఆకరమని మూకమహాకవి ఈ శ్లోకమున వర్ణించుచున్నాడు.

శ్లో॥ త్రైయమ్బకం త్రిపురసున్దరి! హర్మ్యభూమి
రఙ్గం విహారసరసీ కరుణాప్రవాహః।
దాసాశ్చ వాసవముఖాః పరిపాలనీయం
కామాక్షి! విశ్వమపి వీక్షణభూభృతస్తే॥ **26**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| త్రిపురసున్దరి! | = | మూడు పురములలో సున్దరివైన |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తే | = | నీ యొక్క |
| వీక్షణభూభృతః | = | చూపనెడి రాజునకు; |
| త్రైయంబకమ్ | = | శివునకు సంబంధించిన |
| అంగమ్ | = | శరీరం |
| హర్మ్యభూమిః | = | నివాసస్థానము |
| కరుణాప్రవాహః | = | దయాప్రవాహమే |
| విహారసరసీ | = | విహరించు సరస్సు |
| వాసవముఖాః | = | ఇంద్రాదులు |
| దాసాః | = | సేవకులు |
| విశ్వమ్+అపి | = | ప్రపంచమే |
| పరిపాలనీయమ్ | = | పరిపాలింపదగినది |

**తాత్పర్యము:-**

అమ్మవారి కటాక్షమే రాజు. రాజునకొక మేడ యుండవలెను గదా! ఈ కటాక్షరాజునకు శివుని శరీరమే మేడ. అతని కొక విహారసరస్సుండవలె గదా! ఈ కటాక్షరాజునకు కరుణాప్రవాహమే విహారసరస్సు. అతనికి సేవకులుండవలె గదా! ఈ కటాక్షరాజునకు ఇంద్రాదులే సేవకులు. అతని కొక పరిపాలనీయ ముండవలెగదా! ఈ కటాక్షరాజునకు విశ్వమే పరిపాలనీయము.

**వివరణము:-**

అమ్మవారీ శ్లోకమున త్రిపురసున్దరిగా సంబోధింపబడినది. త్రిపురము లనగా స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు. వానిలో నివసించుచు వాని నంటక యుండుటచే నామెయే **త్రిపురసుందరి.** వానిపై దయ గలిగి రక్షించు నీశ్వరియే త్రిపుర సున్దరి.

త్రిపురములు వ్యష్టి, సమష్టి రూపమున ద్వివిధములు. స్థూలము నందభిమానము గల జీవుడు **తైజసుడు.** కారణమునం దభిమానముగల జీవుడు ప్రాజ్ఞుడు. స్థూలమునం దభిమానము గల ఈశ్వరుడు **వైశ్వానరుడు** సూక్ష్మమునం దభిమానము గల ఈశ్వరుడు **హిరణ్యగర్భుడు.** కారణమునం దభిమానము గల ఈశ్వరుడు **అవ్యాకృతుడు.** పై స్థూలసూక్ష్మకారణశరీరముల యందభిమానముగల వ్యష్టిని **జీవుడ**ని, సమష్టిని **ఈశ్వరుడ**నియు నందురు. వ్యష్టియందు, సమష్టియం దభిమానము లేని కేవలాత్మ **త్రిపురసుందరి.** ఈమెయే **తుర్య** యనబడును. వ్యష్టులన్నింటిని స్థూల సూక్ష్మ సమష్టులను తనలో నిముడ్చుకొన్న కారణము మాయమే త్రిపురసుందరి. సృష్టి శక్తి, స్థితి శక్తి, లయశక్తి-సరస్వతి, లక్ష్మి, కాళి పై మూడింటిని కలిపి మాయ, యందురు. పై మూడింటికతీతమయిన దగుటచే మహామాయ **త్రిపురసుందరి** యనబడును. భూర్భువస్స్వర్లోకములు లేక స్వర్గభూపాతాళములు త్రిపురములు వానికి నాయికయే **త్రిపురసుందరి.** బ్రహ్మాండముల కావల యుండు మహాకైలాసము లేక అపరాజితము మేరు పర్వతమునందున్న మణిపురము అమృతసముద్రమందున్న మణిద్వీపములోని మహానగరము త్రిపురములు. వానిలో నివసించు నాయిక **త్రిపురసుందరి.** ఓంకారములోని అకార, ఉకార మకారములు త్రిపురములు, వాని సమష్టియైన ఓంకారము **త్రిపురము.** దానికి నాయిక తత్ప్రతిపాద్యయగుటచే అమ్మవారు **త్రిపురసుందరి.** త్రిపురాభిమాన దుఃఖములేని యానందరూపిణి, పంచకోశాతీత పుచ్ఛ బ్రహ్మస్వరూపిణి **త్రిపురసుందరి** యనబడును. సృష్టిస్థితిలయముల నొనరించు శక్తులు మూడును కలిగిన ముగురమ్మల మూలపుటమ్మ మహాలక్ష్మి **త్రిపురసుందరి** యనబడును (సప్తశతిలోని ప్రాధానిక రహస్యములో చూడదగినది). **ఉన్దీ క్లేదనే** యను ధాతువునకు సు అను ఉపసర్గను పూర్వమునందు జేర్చిన సుందశబ్దమేర్పడును. దానికి ఆర్ద్రీభావము **దయ** యని యర్థము. అట్టి దయను సమస్తజీవుల్కకు ఒసగునది సుందరి యనబడును. జాగ్రత్స్వప్నసుషుప్తులను మూడు పట్టణములందుండి వానిని దయతో గాపాడు సుందరి **త్రిపురసుందరి** యనబడును. (విష్ణుసహస్రనామ శంకర భాష్యము - సుందశబ్ద వివరణను చూడదగినది) బహుళార్థ ప్రతిపాదికమైన త్రిపుర శబ్దము దూర్వాసుల కిష్టమైన నామము. సౌందర్యమనగా దయయే త్రిపురయు దయగలిగిన తల్లియునైన దేవి **త్రిపురసుందరి** యనబడును. ఇట్లెన్నియేని యర్థములు చెప్పవచ్చును. గ్రంథ విస్తరణభీతిచే నీ నామ వివరణము ముగించుచున్నాను. శివుని అంగము హర్మ్యభూమిగా, కరుణాప్రవాహము విహారసరస్సుగా, పరిపాలనీయము విశ్వముగా, దాసులు వాసవాదులుగా, రూపించబడుట అవయవియాం కటాక్షము నకు రాజత్వము నిరూపింపబడుటచే నీ శ్లోకమున సావయవరూపకాలంకారము కలదు.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షము సర్వసంపత్ప్రదానమని వర్ణింప బడుచున్నది.

శ్లో॥ వాగీశ్వరీ సహచరీ నియమేన లక్ష్మీః
భ్రూవల్లరీవశకరీ భువనాని గేహమ్।
రూపం త్రిలోకనయనామృతమమ్బ! తేషాం
కామాక్షి! యేషు తవ వీక్షణపారతన్త్రీ॥ 27

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| అమ్బ | = | అమ్మా! |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| యేషు | = | ఎవరియందు; |
| తవ | = | నీయొక్క; |
| వీక్షణపారతన్త్రీ | = | చూపు యొక్క వివశతయో; |
| తేషామ్ | = | వారికి; |
| నియమేన | = | తప్పక; |
| వాగీశ్వరీ | = | సరస్వతీ; |
| సహచరీ | = | కలసి తిరుగునదియై యుండును; |
| లక్ష్మీః | = | లక్ష్మీదేవి; |
| భ్రూవల్లరీవశకరీ | = | భ్రూలతవశముననుండి పనులనొనరించునదై యుండును; |
| రూపమ్ | = | శరీరచ్ఛాయ; |
| త్రిలోకనయనామృతమ్ | = | త్రిలోకములందలి జనుల కన్నుల కమృతమై యుండును; |
| భువనాని | = | లోకములు; |
| గేహమ్ | = | ఇల్లుగా నుండును. |

తాత్పర్యము:-

అమ్మా! కామాక్షీ దేవీ! నీ చూపెవరి యందు వివశమై పడునో వారికి వాగీశ్వరి సహచరిగా, లక్ష్మి కనుసైగ ననుసరించి సేవ చేయునదిగా, భువనములే ఇల్లుగా, రూపము త్రిలోకనయనామృతముగా మారిపోవును.

వివరణము:-

లక్ష్మి భ్రూవల్లరీవశకరి యగు ననగా విష్ణుత్వము సంభవించుననియు, వాగీశ్వరి సహచరి యగు ననగా బ్రహ్మత్వము కలుగునని, భువనములే యిల్లగు ననుగా సర్వలోకములయందు సంచరించు సామర్థ్యము కలుగుట, రూపము త్రిలోకనయనామృత మగు ననగా మన్మథసమానసౌందర్యము కలుగుననియు వ్యంగ్యార్థములు స్ఫురించును. అవి యన్నియు కలసి దేవీ కటాక్షపాత్రుని మహిమాతిశయమును స్ఫురింపజేయుచున్నవి. కావున నిందు వస్తుధ్వనియున్నది.



**అవ:–** పై శ్లోకమున అమ్మవారి కటాక్షము సర్వసంపత్ప్రదానమని వర్ణింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షమున శివభగవానుడు వలలో పడిన చేపవలె ఓలలాడుచున్నాడని వర్ణింపబడినాడు.

**శ్లో॥ మాహేశ్వరం ఝటితి మానసమీనమమ్బ!**
**కామాక్షి! ధైర్యజలధౌ సుతరాం నిమగ్నమ్।**
**జాలేన శృఙ్ఖలయతి త్వదపాఙ్గనామ్నా**
**విస్తారితేన విషమాయుధదాశకోఽసౌ॥ 28**

**ప్రతిపదార్థము:–**

| | | |
|---|---|---|
| అమ్బ | = | అమ్మా! |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| ధైర్యజలధౌ | = | ధైర్యమను సముద్రమందు; |
| సుతరామ్ | = | మిక్కిలి; |
| నిమగ్నమ్ | = | మునిగిన; |
| మాహేశ్వరమ్ | = | మహేశ్వరునకు సంబంధించిన; |
| మానసమీనమ్ | = | మనస్సను చేపను; |
| ఝటితి | = | శీఘ్రముగా; |
| అసౌ | = | ఈ; |
| విషమాయుధదాశకః | = | మన్మథుడను దాసుడు; |
| విస్తారితేన | = | పఱచబడిన; |
| త్వదపాంగనామ్నా | = | నీ కడగంటిచూపను పేరుగల; |
| జాలేన | = | వలతో; |
| శృంఖలయతి | = | బంధించుచున్నాడు. |

**తాత్పర్యము:–**

అమ్మా, కామాక్షీ దేవీ! శివుని మనస్సను చేప, ధైర్యమను సముద్రమందు మగ్నమై యుండ, దానిని నీ కడగంటి చూపనెడి వలపరచి నీ దాసుడైన మన్మథుడు బంధించుచున్నాడు.

**వివరణము:–**

శివుడు ధీరుడు. అతని మనస్సు ధైర్యజలధిలో మునిగిన చేపగా రూపింపబడినది. దానిని అమ్మవారి కడగంటిచూపనువలతో అమ్మవారి సేవకుడైన మన్మథుడే బంధించివైచినాడు. అనగా శివుడధీరుడై అమ్మవారి చూపులకోడి యామెకు వశమైనాడు. శివుని మనస్సు వలలోపడిన చేపయైనదని రూపించుటచే నిట **సావయవరూపకాలంకారము**

గలదు. సాధారణముగా ధైర్యము పర్వతముతో పోల్చబడును. ధైర్యవంతుని మేరుధీరు డందురు. అయినను ఇట ధైర్యమునందు జలధితోడి పోలిక వ్యక్తము చేయబడినది. ఇది అసాధారణము ధీరమయిన శివమనోఝషమును అమ్మవారి చూపనెడి వలలో బంధించినవాడు మన్మథుడు. అమ్మవారికి దాసుడు. అనుటచే అమ్మవారి ప్రభుత్వము వ్యక్తమగును. మొదట శివుని మనస్సు ధైర్యజలధిలో స్వేచ్ఛగా దిరిగి మన్మథునికి పెట్టుబడి అధీరమైనదని చెప్పుటచే అమ్మవారి సౌందర్యాతిశయము వ్యక్తము అగుచుండుటచే నిట వస్తుధ్వని కలదు.



**అవ:-** ఈ శ్లోకమున మూకమహాకవి తన మనస్సును అరణ్యమున భ్రమించుచున్న జడత్వమను గజమును అణుచుమని శ్రీకామాక్షీదేవిని ప్రార్థించుచున్నాడు.

**శ్లో॥** **ఉన్మథ్య బోధకమలాకరమమ్బ! జాడ్య-**
**స్తమ్బేరమం మమ మనోవిపినే భ్రమన్తమ్।**
**కుణ్ఠీకురుష్వ తరసా కుటిలాగ్రసీమ్నా**
**కామాక్షి! తావకకటాక్షమహాఙ్కుశేన॥** **29**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| అమ్బ | = | అమ్మా! |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| కుటిలాగ్రసీమ్నా | = | వక్రమైన చివటి భాగముగల; |
| తావకకటాక్షమహాంకుశేన | = | నీ కడగంటి చూపనెడి అంకుశముచేత; |
| మమ | = | నాయొక్క |
| బోధకమలాకరమ్ | = | జ్ఞానమను సరస్సును; |
| ఉన్మథ్య | = | కలచివైచి; |
| మనోవిపినే | = | మనస్సను నడవియందు; |
| భ్రమన్తమ్ | = | తిరుగుచున్న; |
| జాడ్యస్తమ్బేరమమ్ | = | జడత్వమనుగజమును; |
| తరసా | = | శీఘ్రముగా; |
| కుంఠీకురుష్వ | = | అణచివేయుము. |

**తాత్పర్యము:-**

అమ్మా, కామాక్షీ దేవీ! వక్రమైన మొనగల నీ కటాక్షమను నంకుశముతో నా జ్ఞానసరస్సును కలచివైచి నామనస్సను వనమున భ్రమించుచున్న నా జాడ్యమను నేనుగును అణచి వేయుము.

**వివరణము:-**

అమ్మవారి కటాక్ష మీ శ్లోకమున రూపింపబడినది. కటాక్షమునకు అంకుశమునకు పోలిక యిందు వ్యంగ్యమగుచున్నది. పోలిక సామాన్యధర్మము నాశ్రయించి పుష్టమగును. కటాక్షాంకుశములకు పోలిక యప్రసిద్ధము కావున **కుటిలాగ్రసీమ్నా** అను విశేషణము కటాక్షాంకుశముల యభేదప్రధాన సాదృశ్యము స్ఫురింపజేయుటకు మూలమైన సామాన్యధర్మమును చెప్పుచున్నది! ఈ విశేషణ మందర్థశ్లేష కలదు. అమ్మవారి కటాక్షమునందు వక్రత యున్నది. అంకుశము చివఱ వక్రత యున్నది. **కుటిల** పదముతోను భయగతమైన వక్రత యను సామాన్యధర్మమిందుపపాదించబడినది. మూకకవి తన మనమును వనమునుగా రూపించినాడు. వనమునందు సరస్సుండిన నుండవచ్చును. పరిణామమున వనము పెద్దది. సరస్సు చిన్నది కాని మనస్సు పెద్దదో చిన్నదో మనకు ప్రత్యక్షము కాకపోవుటచే తెలియదు. శాస్త్రజ్ఞులు కొందరు యంతఃకరణమును పరమాణు పరిమాణమనగా, మరికొందరు మధ్యమ పరిమాణ మనినారు. తక్కువ ప్రదేశము నాక్రమించునది పరమాణువు. కాని అది అల్పకాలికము కాదు. ముక్తి పర్యంతము దానికి నాశము లేదు. కనుక నది పెద్దదే దాని యందొకప్పుడు వృత్తులుదయించు చుండును. నిద్రావస్థలో వృత్తి యుండదని కొందఱు, శూన్యవృత్తియని కొందఱు అజ్ఞానావరణమును దొలగించి బోధను కలుగజేయును. ఇటువంటి బోధములు పెక్కులు జాగ్రదవస్థలో మనమున నుద్భవించుచుండును. కావున మనమున కంటే బోధములు కాలికముగా చిన్నవి. బోధము ద్విక్షణావస్థాయమని కొందఱు చెప్పెదరు. మనస్సు అనాదికాలము నుండి ముక్తిపర్యంత ముండునది. కావున కాలికముగా బెద్దది. బోధము కాలికముగా చిన్నది. పెద్దవనములో చిన్నసరస్సుతో మనములో నొకప్పుడు జనించు బోధము రూపింపబడినది. ఏనుగు మందగమనమునకు బ్రసిద్ధము. మాంద్యము జాడ్యమునకు సహభవము. కావున జాడ్యమేనుగుతో రూపింపబడినది. కావున నీ శ్లోకమున రూపకాలంకారము కలదు. జాడ్యము భ్రమహేతువు. కావున జాడ్యగజము భ్రమించుచున్నదని 'భ్రమన్తమ్' అను పదమిచ్చుట చాల నుచితముగా నున్నది. భ్రమణము వట్టి తిరుగుట కాదు. అది భ్రమించుట యను నర్థమును కూడ నొసగును. జాడ్యము బోధమును హరించి భ్రమను కలిగింపజేయునని ఆ జాడ్యమును నీ కటాక్షముతో నణచివేయుమని మూకకవి కోరుచున్నాడు.



**అవ:-** పై శ్లోకమున జడత్వమను గజమును అణచుమని ప్రార్థించిన మూకమహాకవి ఈ శ్లోకమున మోహమనెడు లేళ్ళగుంపును పారద్రోలుమని అమ్మవారిని ప్రార్థించుచున్నాడు.

**శ్లో॥ ఉద్వేల్లితస్తబకితైర్లలితైర్విలాసై-**
**రుత్థాయ దేవి! తవ గాఢకటాక్షకుఞ్జాత్।**

**దూరం పలాయయతు మోహమృగీకులమ్మే**
**కామాక్షి! సత్వరమనుగ్రహకేసరీన్ద్రః॥ 30**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| దేవి | = | దేవీ! |
| ఉద్వేల్లితస్తబకితైః | = | తీగలుగా పైకి పాకి గుత్తులు కట్టిన; |
| లలితైః | = | అందములైన; |
| విలాసైః | = | విలాసములతో; |
| తవ | = | నీ యొక్క; |
| గాఢకటాక్షకుంజాత్ | = | తీవ్రమైన కడగంటి పొదనుండి; |
| ఉత్థాయ | = | లేచి; |
| సత్వరమ్ | = | వేగముగా; |
| అనుగ్రహకేసరీన్ద్రః | = | దయయనెడి మృగరాజ రాజు; |
| మే | = | నాయొక్క; |
| మోహమృగీకులమ్ | = | మోహమనెడి లేళ్ళగుంపును; |
| దూరమ్ | = | దూరముగా; |
| పలాయయతు | = | పారద్రోలుగాక! |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! నీ కటాక్ష మొక పొదరిల్లు, దానిలో దయ యను మృగ చక్రవర్తి యున్నది. తద్విలాసములు ఉద్వేల్లితస్తబకితలలితములై యున్నవి. ఆ పొదరింటినుండి యా సింహము త్వరగా లేవవలెను. నా మోహ మనెడి లేళ్ళ గుంపును దూరముగా బారద్రోలవలెను.

**వివరణము:-**

ప్రథమ పాదములోని ఉద్వేల్లితస్తబకితలలితవిలాసకులు అనుగ్రహ సింహగతము లని కొందఱు, కటాక్షకుంజగతములని కొందఱు భావించుట కవకాశమున్నది. ఉద్వేల్లితత్వము, స్తబకితత్వము కటాక్షకుంజమున నుచితములైయున్నట్లు అనుగ్రహసింహము కటాక్షకుంజస్థితము కావున కటాక్షకుంజగత ధర్మములు కటాక్షకుంజస్థితమైన యనుగ్రహసింహము నందును వర్తింప జేయుట పెద్ద విరోధము కాదు. ఈ శ్లోకమున కటాక్షము కుంజముగా, మోహము మృగీకులముగా, అనుగ్రహము సింహముగా, రూపింపబడినవి. కావున నిందు రూపకాలంకారము కలదు. కటాక్షకుంజగతానుగ్రహసింహము తన మోహ మృగమును బారద్రోలగోరుచున్నాడు.



**అవ:-** అమ్మవారి కటాక్షము వికసించిన కలువల నల్లని కాంతిని విరజిమ్ముచున్నదని ఈ శ్లోకమున వర్ణింపబడుచున్నాడు.

**శ్లో॥ స్నేహార్ద్రితాం విదలితోత్పలకాన్తిచోరాం**
**జేతారమేవ జగదీశ్వరి! జేతుకామః।**
**మానోద్ధతో మకరకేతురసౌ ధునీతే**
**కామాక్షి! తావకకటాక్షకృపాణవల్లీమ్॥ 31**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| జగదీశ్వరి! | = | లోకమునకు ప్రభ్వివైన |
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| స్నేహార్ద్రితామ్ | = | స్నేహము (నూనె) తో తడిసిన; |
| విదలితోత్పలకాన్తిచోరామ్ | = | వికసించిన కలువల కాంతిని దొంగిలించు; |
| తావకకటాక్షకృపాణవల్లీమ్ | = | నీకడగంటి చూపనెడి ఖడ్గవల్లిని; |
| మానోద్ధతః | = | అభిమానముతో గర్వించియున్న; |
| జేతారమేవ | = | జయించిన వానినే (శివునే); |
| జేతుకామః | = | జయింప గోరిన; |
| అసౌ | = | ఈ; |
| మకరకేతుః | = | మొసలి ధ్వజచిహ్నముగాగల మన్మథుడు; |
| ధునీతే | = | జళిపించుచున్నాడు. |

**తాత్పర్యము:-**

జగదీశ్వరివైన యో కామాక్షీ దేవీ! నీ కటాక్షమను కత్తిని ధరించి కాముడు ఒకప్పుడు శివునిచే నోడిపోయియు మరల నాతనిపైకి ఝళిపించుచున్నాడు. నీ కటాక్షకృపాణము వికసించిన కలువల నల్లని కాంతిని విరజిమ్ముచున్నది. అది త్రుప్పు పట్టకుండుటకై స్నేహముచే తడుపబడి యున్నది.

**వివరణము:-**

1) ఒకడు తన స్నేహితునితో కలసి యిష్టము లేకపోయినను స్నేహితుని బలవంతముతో దొంగతనము చేయుట లోకమునం దెడనెడ కన్పించును. కాని యొక స్నేహితుడు తన స్నేహితుని యింటనే దొంగతనము చేయడు. కటాక్షకృపాణవల్లికి రెండు విశేషణములున్నవి. ఒకటి **స్నేహార్ద్రితాం** అని మరొకటి **విదలితోత్పలకాంతిచోరామ్** అని స్నేహముతో ఆర్ద్రమైన అమ్మవారి కటాక్షకృపాణ వల్లిక విదలితోత్పలముల కాంతిని దొంగిలించుటలో నౌచిత్యము లేదనిపించును. కాని అమ్మవారి కటాక్షము కృపాణవల్లితో స్నేహముచేసి తదభేదమును బొందినది. తత్స్నేహముననే వికసించిన యుత్పలముల

కాంతిని దొంగిలించినదని ఔచిత్యభంగము కలుగకుండ సమర్థింపవచ్చును. కత్తులకు త్రుప్పు పట్టకుండుటకు నూనె పూయుదురు. అదే యిచట స్నేహార్ద్రితత్వము. కటాక్షమునకు అమ్మవారి హృదయమున నున్న స్నేహము (మైత్రి) ప్రాప్తించినది. కావున ఇది స్నేహార్ద్రితమైనది. కృపాణవల్లి యని కృపాణమును వల్లితో రూపించుట కవి సమయసిద్ధమే. ఆ వల్లి ఉత్పలవల్లి యేల కాకూడదు. ఉత్పలవల్లియై ఉత్పల కాంతిని దొంగిలించుట స్వవస్తుచౌర్యమే యగును గావున నది దోషమే కాదు ఇంతకు ఉపమానధర్మచౌర్యము ఉపమేయమున వర్ణించుట కవి సమయ సిద్ధము కావున స్నేహార్ద్రితత్వ కాంతిచౌర్యముల విరోధము పరిహరించు కొనవచ్చును కావున నట విరోధాభాసాలంకారము వ్యంగ్యమగుచున్నది. ఓడిపోయినవారికి నూతనమైన ఆయుధసంపత్తి లభించినప్పుడు ఓడించిన వారి నోడించుటకు బయలుదేరుట సర్వేశ్వరులలో బహుధా కనిపించునట్టిదే. అమ్మవారి కటాక్ష కృపాణవల్లి మన్మథునకు లభించినది. ఇక నేమి దాని సాయమున శివుని మీదకే యాతని జయించుటకు బోయినాడు. విజయమును సాధించినాడు. కామజితుడై శివుడమ్మవారిని బెండ్లి జేసికొనవలసివచ్చినది. ఆమెను బెండ్లాడి యామె కర్ధ శరీరమునే యొసగినాడు. తానే యామె యధీనుడైనాడు. అమ్మవారు స్వాధీనపతిక యైనది. మకరము జలములో నివసించు తనకన్న బలహీనములైన జంతువులను బెదరించును. భూచరములైన ప్రాణులు జలములోనికి దిగినప్పుడు వానిని జంపి దినును. మకరకేతువైనంత మాత్రమున కైలాసవాసియగు శివునకేమి భయము. పైగా మకరము భూమిపైకి వచ్చిన మిక్కిలి బలహీనమగును. కుక్కచే గూడ జంపబడును. మకరమును జెండాయందు ధరించిన మన్మథుడు శివునిచే మొదట నోడి పోయినాడు. ఇప్పుడమ్మవారి కటాక్షకృపాణవల్లి లభించగా మరల ఓడిపోయినవాడే మరల విజృంభించి శివునోడించినాడు. విధి బలీయము. ఓడిపోయినవాడే మరల యుద్ధముచేసి గెలువవచ్చును. మన్మథుడు శివుని స్వదేహ బలముచే నోడింపజాలలేదు. అమ్మవారి కటాక్షముయొక్క సాయమున (ఆయుధబలమున) నోడించినాడు. ఘనత అమ్మవారి కటాక్షమునకే చెందును గాని మన్మథునకు చెందదు. మన్మథునిచే శివుడోడింపబడినాడనుట ఆయుధ మహత్త్వ మెఱుగక పోవుటయే అయ్యును ఆయుధసంపాదనము తత్ప్రయోగ నైపుణ్యము మన్మథుని కొప్పుకొని మన్మథుడే గెలిచినాడందము. **జగదిదమనంగో విజయతే** యని సౌందర్యలహరిలో శ్రీ శంకరులే యన్నారు గదా! మన్మథునకు నీలోత్పలము బాణము. అది శివునిపై పనిచేయలేదు. అయినను అది బాణముగా పెక్కేండ్లు మన్మథుని కడ నున్నది. దానిని విడువలేక పోయినను తత్కాంతిగల అమ్మవారి కటాక్షము నాశ్రయించి శివుని గెలుచుట యతనికి తన బాణమైన నీలోత్పలముచేతనే గెలుచుటగా భావించి మిక్కిలి సంతోషము కలిగినది.



**అవ:-** పైశ్లోకమున కటాక్షము నందుత్పల కాంతి చౌర్యము ప్రసక్తమైనది. ఈ శ్లోకమున పంకజరుక్చౌర్యము ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ శ్రౌతీం ప్రజన్నపి సదా సరణిం మునీనాం**
**కామాక్షి! సన్తతమపి స్మృతిమార్గగామీ।**
**కౌటిల్యమమ్బ! కథమస్థిరతాఞ్చ ధత్తే**
**చౌర్యఞ్చ పఙ్కజరుచాం త్వదపాఙ్గపాతః॥ 32**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| అంబ! | = | అమ్మా! |
| కామాక్షి | = | ఓ కామాక్షి దేవీ! |
| సదా | = | ఎల్లప్పుడు; |
| శ్రౌతీమ్ | = | శ్రుతికి సంబంధించిన ; |
| సరణిమ్ | = | మార్గమును; |
| ప్రజన్నపి | = | పొందుచున్నను; |
| సంతతమ్ | = | ఎల్లప్పుడు; |
| మునీనామ్ | = | మునులయొక్క; |
| స్మృతిమార్గగామి అపి | = | స్మృతి మార్గమున బోవునదైనను; |
| త్వదపాంగపాతః | = | నీ క్రీగంటి ప్రసారము; |
| కౌటిల్యమ్ | = | వక్రతను; |
| అస్థిరతాం చ | = | చంచలత్వమును; |
| పంకజరుచామ్ | = | కమలకాంతులయొక్క; |
| చౌర్యం చ | = | దొంగతనమును; |
| కథమ్ | = | ఎట్లు; |
| ధత్తే | = | ధరించుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మా! కామాక్షీ దేవీ! నీ క్రీగంటి ప్రసారము శ్రుతిమార్గమును బొందుచున్నది. మునులయొక్క స్మృతి మార్గమును గూడా బొందుచున్నది. ఇట్లు శ్రుతిస్మృత్యనుసారి యైనను వక్రత్వచంచలత్వములను కమలకాంతిచౌర్యము నెట్లు ధరించుచున్నది. అమ్మవారి కటాక్షప్రసారము చెవిని దాకునంత దీర్ఘమైనదని, మునుల స్మృతులందు మెలగునదని, వక్రత్వ చంచలత్వములను కలిగియుండి కమల కాంతుల గూడ కలిగి యున్నదని యర్థాంతరము. ఇట్లు శ్రుతిస్మృతి మార్గగామిత్వములను సద్గుణములు, కౌటిల్యవక్రత్వచౌర్యములను దుర్గుణములు, నీ కటాక్షమున సహవాసము చేయుట వింత కదా!

**వివరణము:-**

ఆశ్చర్యకరములైన సుగుణదుర్గుణములు కల్గిసి యుండుటయను అపి శబ్దోక్తవిరోధము; చెవి, జ్ఞప్తి అను అర్థాంతరములు కల శ్రౌతీస్మృతి శబ్దముల శ్లేషవలన పరిహరింపబడుటచే నీ శ్లోకమున **విరోధాభాసాలంకారము** వాచ్యమై యున్నది.



**అవ:-** పై శ్లోకమున **శ్రౌతమార్గము** ప్రస్తావింపబడినది. ఇందా శ్రుతి పరిచయముచే సిద్ధించు **కాలిమా** సంప్రదాయాధ్యయనము ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ నిత్యం శ్రుతేః పరిచితౌ యతమానమేవ**
**నీలోత్పలం నిజసమీపనివాసలోలమ్।**
**ప్రీత్యైవ పాఠయతి వీక్షణదేశికేన్ద్రః**
**కామాక్షి! కిం ను తవ కాలిమసమ్ప్రదాయమ్॥ 33**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి | = ఓ కామాక్షి దేవీ! |
| నిత్యమ్ | = ఎల్లప్పుడు; |
| శ్రుతేః | = చెవి (వేదము) యొక్క; |
| పరిచితౌ | = పరిచయమునందు; |
| యతమానమేవ | = యత్నించుచున్నదేయయ్యు; |
| నిజసమీపనివాసలోలమ్ | = తన దగ్గఱ నుండు; |
| నీలోత్పలమ్ | = నల్లకలువను; |
| వీక్షణదేశికేన్ద్రః | = చూపనెడి గురుస్వామి; |
| ప్రీత్యా+ఏవ | = ప్రీతితోనే, |
| తవ | = నీయొక్క; |
| కాలిమసంప్రదాయమ్ | = నలుపుయొక్క రీతిని; |
| (శిక్షయతీవ | = నేర్పుచున్నదో యన్నట్లున్నది). |

**తాత్పర్యము:-**

వేదముయొక్క (చెవి యొక్క) పరిచయమునందు తనకడనే యుండి యత్నించుచుండుట జూచి నీలోత్పలమునకు నీ చూపనెడి గురుస్వామి ప్రేమతో నలుపుదనమును నేర్పుచున్నట్లున్నది.

**వివరణము:-**

అమ్మవారి వీక్షణమునందు గురుస్వామిత్వ మారోపింపబడి యుండుట,

నీలోత్పలమునందు శిష్యత్వారోపణమును వ్యక్తీకరించుచున్నది. పరంపరిత రూపకాలంకార మిందుగలదు. శిష్యుడు నిత్యము శ్రుతి పరిచయమునకు యత్నించుచు గురువుకడ నివసింపవలెనను శిష్యధర్మము నీలోత్పలమునందు శ్రుతి శబ్దశ్లేషచే **సమీపనివాసలోలం** అను పదము నందలి అర్థశ్లేషచేతను స్ఫురించుచున్నది. తనకడనుండి వేదాధ్యయనము నొనరించు వానికి ప్రీతితో గురువు తనకు సంప్రదాయాగతమైన విద్యను బోధించును. ఇచట వీక్షణము నందు పరంపరాగతమైన కాలిమ సంప్రదాయమున్నది. దానిని తనకడ నుండ గోరిన నీలోత్పలమునకు బోధించుచున్నట్లున్నదా? యను భావన ఇవ శబ్దవ్యాచ్యమగుటచే నీ శ్లోకమున నుత్ప్రేక్షాలంకారమున్నది. రూపకాలంకార ముత్ప్రేక్షాలంకారమున కంగముగా నుండుటచే నిచటి యుత్ప్రేక్షాలంకారము రూపకానుప్రాణితమై యున్నది. అమ్మవారు శ్రుతికి (చెవికి) ఆభరణముగా నీలోత్పలమును ధరించినది. అందువలన నా నీలోత్పలము శ్రుతిపరిచయము నకు యత్నించుచున్నట్లున్నది. రూపరహితమైన బ్రహ్మమును కొందఱు నల్లని పురుషునిగా కొందఱు నల్లని స్త్రీగా, భావించి యుపాసించెదరు. ఈ సంప్రదాయమే కాలిమ సంప్రదాయము. కొందఱెఱ్ఱగా నున్నట్లుపాసించెదరు. వారిది శోణిమ సంప్రదాయము. కొందఱు తెల్లగా నున్నట్లుపాసించెదరు. వారిది ధవళిమ సంప్రదాయము. ఈ మూడు మాయాశబలిత బ్రహ్మోపాసనాసంప్రదాయములును శ్రుతిసిద్ధములు. కావున వాని యధ్యయనమునకు శ్రుతి పరిచయ మావశ్యకము. వేదము మొత్తమధ్యేయమే యైనను శక్తి చాలని వారొక సంప్రదాయమునే యభ్యసించి తదుపాసన మాచరించెదరు. గురువులును వారికి కావలసిన సంప్రదాయమునే నేర్పుదురు. కాలిమసంప్రదాయములోని భేదములు శ్రీ విష్ణూపాసనము కాలీదేవ్యుపాసనము ఇత్యాదులు. శోణిమసమ్ప్రదాయములో లక్ష్మీలలితోపాసనాదులు చేరును. ధవలిమ సంప్రదాయములో సరస్వతీ శివోపాస నాదులు చేరును. కామాక్షీ దేవి నల్లనిది, ఆమెను మూకకవి యుపాసించుటచే నీతనిది కాలిమ సంప్రదాయము. ఇది యీతని కమ్మవారి కృపా వీక్షణము చేతనే లభించి యుండవచ్చును. లేనిచో మూగవాని కే గురువు నేర్ప నుత్సహించును?



**అవ:-** పై శ్లోకమున **'కాలిమ'** సంప్రదాయము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షము శివుని నేత్రలక్ష్మిగా రూపింపబడుచున్నది.

**శ్లో॥ భ్రాన్త్వా ముహుః స్తబకితస్మితఫేనరాశౌ**
**కామాక్షి! వక్త్రరుచిసఞ్చయవారిరాశౌ।**
**ఆనన్దతి త్రిపురమర్దననేత్రలక్ష్మీ-**
**రాలభ్య దేవి! తవ మన్దమపాఙ్గసేతుమ్॥ 34**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షి దేవీ! |
| స్తబకితస్మితఫేనరాశౌ | = | గుత్తులు కట్టిన చిఱునవ్వు అనెడి నుఱుగులు గుంపుగల; |
| తవ | = | నీ యొక్క; |
| వక్త్రరుచిసంచయవారిరాశౌ | = | ముఖకాంతి సమూహమనెడి సముద్రమునందు; |
| ముహుః | = | మాటిమాటికి; |
| భ్రాన్త్వా | = | భ్రమించి; |
| మన్దమ్ | = | మెల్లనైన; |
| అపాంగసేతుమ్ | = | క్రీగంటి చూపనెడి ఒడ్డును; |
| ఆలభ్య | = | పొంది; |
| త్రిపురమర్దననేత్రలక్ష్మీః | = | త్రిపురసంహారియైన శివుని కన్నుల కాంతి; |
| ఆనన్దతి | = | ఆనందించుచున్నది. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! శివుని కన్నుల కాంతి నీ చిఱునవ్వుతో నిండిన వక్త్రకాంతి యనెడి సముద్రమునందు తిరిగి తిరిగి క్రీగంటి చూపనెడి ఒడ్డును పొంది ఆనందించు చున్నది.

**వివరణము:-**

సముద్రములో ఒడ్డుగానక భ్రమించు వ్యక్తి కొడ్డును చూచిన సంతసము కల్గును. శివుని నేత్రలక్ష్మి అమ్మవారి వక్త్రకాంతి సముద్రమున తిరిగి తిరిగి చివరికి క్రీగంటిచూపను ఒడ్డునుచూచి యానందించుచున్నది. ఒడ్డెక్కక పోయినను ఒడ్డును చూడగనే యానందించుచున్నది. ఆనందించుచునే యుండుటచే నొడ్డెక్కు యత్నమునే చేయలేదేమో? వర్తమాన క్రియ ఈ యంశమును వ్యంగ్యమొనరించు చున్నది. స్త్రీలింగమైన లక్ష్మీశబ్దము; పుంలింగమైన సేతు శబ్దము; లక్ష్మి సేతువులందు నాయికా నాయక వ్యవహారమును స్ఫురింపజేయుటచే నీ శ్లోకమున సమాసోక్త్యాలంకారము కలదు. నాయిక నాయకుని బొంది యానందించును గదా! లక్ష్మి సముద్రుని కూతురగుటచే సముద్రము నందుండుటకే యిష్టపడును. సముద్రపు టొడ్డును బొంద యత్నింపలేదు. శివుని నేత్రలక్ష్మి యట్టిది కాదు. ఆమెకు ముఖకాంతి సముద్రముయొక్క అంచును చూడవలెనను కోరిక కలదు. ఆమె చూపను చెలియలికట్టను పొంది యానందించినది. కాని దానిని దాటలేదు. అది మర్యాదాతిక్రమణము. శివనేత్రలక్ష్మికి అమ్మవారి చూపను ఒడ్డే భర్త కావున పతిని పొంది యానందించినది. ఆ లక్ష్మి చంచల. ఈ లక్ష్మి స్థిర. కావుననే అమ్మవారి నేత్రసేతువును పొంది యిప్పటికిని ఆనందించుచునే యున్నది. ఆ యానంద మనంతము. సముద్రమున శోభావహములైన రత్నములెన్నో కలవు. ముఖకాంతి సముద్రమునందు భ్రూయుగము లలాటము, కపోలములు, ఇత్యాదులు రత్నములు. కాని వాని యన్నిటిని చెప్పక స్మిత

మొక్కటే ఈ శ్లోకమున చెప్పబడినది. కారణమేమి? స్మితము ఫేనము. అది శివనేత్రలక్ష్మిని యొడ్డునకు చేర్చినదా? యన్నట్లు శివుని నేత్రలక్ష్మి కపాంగసేతువు కనబడినది. అది ముఖ కాంతి సముద్రముయొక్క పరమావధి. ఇతర రత్నములకన్న స్మితము దాని కన్న అపాంగమే శివున కానందదాయకమైనది. ఆ చూపు మందముగా నున్నది. అమ్మవారేదో పారవశ్యమున నున్నట్లున్నది. అది శివనేత్రదర్శనముచేత కాబోలు. ఆ శివనేత్ర మీమె యపాంగమును స్పృశించినది. కన్నులు కన్నులు కలసినవి. ఇక శివుడన్య మాలోచింపక యానందించుచున్నాడు. శివుడు త్రిపురమర్దన మొనరించి వచ్చినాడు. దేవతల కమృతోద్భవ మైనప్పుడు కలిగిన యానందము కన్న ఎక్కుడానందమైనది. ఆ ఆనందము శివుని నేత్రలక్ష్మి కమ్మవారి యపాంగ సేతుస్పర్శవలన కలిగినది. అమ్మవారి చూపు శివుని నేత్రములందలి యానందము నోరగా చూచి పారవశ్యమొందినది. శివుని కన్నులలోనికి సూటిగా చూచుట కమ్మవారి హృదయములోని లజ్జ యడ్డువచ్చినట్లున్నది. పారవశ్యలజ్జాతిశయము లమ్మచూపునకు మాంద్యమును ఘటింపజేసినవి. అప్పుడు అమ్మవారి ముఖ్య సౌందర్యసముద్రపారదర్శనముచే శివుని యానంద మపారమైనది. అందుకే శివ నేత్రలక్ష్మి నిశ్చలమైనది. మగవాడైన శివుని నేత్రములందలి లక్ష్మి యాడుదియై, ఆడుదైన కామాక్షీదేవి యపాంగసేతువు పురుషుడై ఉభయుల శరీరము దృశ్యమని, ఉభయుల యాత్మ దృగ్రూపుడని, దృగ్దృశ్య సంయోగమును సూచించుచున్నది.



**అవ:-** పై శ్లోకమున **శివనేత్రలక్ష్మి** చెప్పబడినది. ఈ క్రింది శ్లోకమున అమ్మవారి **లోచనశ్రీ** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ శ్యామా తవ త్రిపురసున్దరి! లోచనశ్రీః**
**కామాక్షి! కన్దలితమేదురతారకాన్తిః।**
**జ్యోత్స్నావతీ స్మితరుచాపి కథం తనోతి**
**స్పర్ధామహో కువలయైశ్చ తథా చకోరైః॥ 35**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| త్రిపురసున్దరి | = | త్రిపురములలో సుందరివైన; |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తవ | = | నీయొక్క |
| లోచనశ్రీః | = | కంటి కాంతి; |
| శ్యామా | = | నల్లనిదై (యౌవనమధ్యస్థురాలై); |
| కందలితమేదురతారకాంతిః | = | మొగ్గతొడిగిన దట్టమైన కనుపాపల తళుకు (నక్షత్రముల కాంతి) గలదై; |
| స్మితరుచా | = | చిఱునవ్వు కాంతిచే; |

జ్యోత్స్నావతీ = వెన్నెల కలదై (రాత్రియయ్యును);
కువలయైః = కలువలతో;
తథా చకోరైః చ = అట్లే చకోరములతోడను;
కథమ్ = ఎట్లు;
స్పర్ధామ్ = పోటీని;
తనోతి = పెంచుచున్నది;
అహో = ఆహా!

**తాత్పర్యము:-**

త్రిపురసున్దరి వైన యో కామాక్షీ దేవీ! నల్లని కనుపాపల తళుకు అనెడి నక్షత్రకాంతిగల నీ నయనశోభ చిఱునవ్వు వెన్నెలగలదై వెన్నెలరాత్రి యగుటచే కలువలతో చకోరములతో స్నేహము చేయవలసియుండగా వానితో పోటీ పడుచుండుట విచిత్రము గదా!

**వివరణము:-**

1) అమ్మవారి నయనశోభయందు రాత్రిత్వ మపహ్నుతమై అమ్మవారి రెప్పలకాంతియందు నక్షత్రకాంతి యారోపమును **కందలితమేదురతారకాంతిః** అను శ్లిష్టశబ్దవిశేషణము స్మితరుచియందు వెన్నెల యారోపమును, **స్మిత రుచా జ్యోత్స్నావతీ** అను అశ్లిష్టవిశేషణము చెప్పుటచే నిది రూపకాతిశయోక్త్యలంకార మగుచున్నది. చకోరములతో కువలయములతో అసహజమైన విరోధము **అపి** శబ్దముచే వాచ్యమగుటచే నిట విరోధాభాసాలంకారము కూడ నున్నది. ఈ లోచనశ్రీ రాత్రి చీకటి రాత్రియా? వెన్నెల రాత్రియా? శ్యామయు, కందలిత మేదురతారకాంతియు నగుటచే చీకటి రాత్రియని చెప్పవచ్చును. కాని చిఱునవ్వు వెన్నెలకలదై చకోరములతో కలువలతో స్పర్ధించుచుండటచే వెన్నెలరాత్రి యని తెలియుచున్నది. శ్యామయను శబ్దమునకు 'యౌవనమధ్యస్థురాలని యర్థము చెప్పినను అమె నల్లనిది కాదనుటకు వీలులేదు. వెన్నెల రాత్రి నల్లని దెట్లగును? ఇంతకు లోచనశ్రీ నల్లనిది. కావున చీకటిరాత్రియే యనవలెను. చీకటి రాత్రిలోనే మేదురతారకాంతి కందలిత మగుచుండును. స్మితరుచి లోచనశ్రీ కాగంతుకము. ఆగంతుకమైన దీనితోనే లోచనశ్రీ కలువలతో, చకోరములతో స్పర్ధించుట న్యాయము కాదు. అట్లు స్పర్ధించుచుండుట తాను కాదు. అట్లు స్పర్ధించుచుండుట తాను కలువల కన్న, చకోరములకన్న నధిక సౌందర్యము కలదాననని చెప్పుటకే కావున నిందు ప్రతీపాలంకారధ్వనియున్నది. లోచనశ్రీ స్పర్ధించుట సద్వలయము లతో కాదు. కువలయములతోనే కావున నా స్పర్ధ యుచితమే, యనవచ్చును. అను చమత్కారమును **కువలయ** శబ్ద ప్రయోగమందించుచున్నది. శివుడు తెల్లనివాడు, అమ్మవారి లోచనశ్రీ స్మితజ్యోత్స్నావతి, అందుచే అమ్మవారి లోచనశ్రీ శివుని శరీరముతో స్పర్ధించుచున్నను శివచకోరము మాత్రమా స్మితజ్యోత్స్నను గ్రోలుచు నానందించుచునే యున్నది.

2) పతి యనురక్తితో పతివలె తెల్లనివారైన శివభక్తులు భక్తితో నాస్మితజ్యోత్స్నను గ్రోలుచుందురని చకోరశబ్దగతబహువచనము వ్యంజింప జేయుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి లోచనశ్రీ **శ్యామ** యని చెప్పబడినది. ఈ క్రింది శ్లోకమునం దమ్మవారి చూపునకు **కాలాంజనాతుల్యనైల్యము తద్వైషమ్యమును** చెప్పబడుచున్నది.

**శ్లో॥ కాలాఞ్జనం చ తవ దేవి! నిరీక్షణం చ**
**కామాక్షి! సామ్యసరణిం సముపైతి కాన్త్యా।**
**నిశ్శేషనేత్రసులభం జగతీషు పూర్వ-**
**మన్యత్త్రినేత్రసులభం తుహినాద్రికన్యే॥ 36**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| తుహినాద్రికన్యే! | = | మంచుకొండకు బిడ్డవైన; |
| కామాక్షి, దేవి | = | ఓ కామాక్షీదేవీ! |
| కాలాంజనం చ | = | నల్లని కాటుకయు; |
| తవ | = | నీయొక్క |
| నిరీక్షణం చ | = | (ఎదురు) చూపున్ను; |
| కాన్త్యా | = | కాన్తితో; |
| సామ్యసరణిమ్ | = | పోలిక దారిని; |
| సముపైతి | = | పొందుచున్నది; |
| పూర్వమ్ | = | మొదటిది(కాలాంజనము); |
| జగతీషు | = | లోకములయందు; |
| నిశ్శేషనేత్రసులభమ్ | = | సర్వుల నేత్రములకు లభించునది; |
| అన్యత్ | = | మఱొకటి (నీ నిరీక్షణము); |
| త్రినేత్రసులభమ్ | = | త్రినేత్రుడైన శివునకే లభించునట్టిది. |

**తాత్పర్యము:-**

కామాక్షీ దేవి నిరీక్షణము, కాలాంజనము నల్లనివే, రెండును కాంతితో సమములే. కాని కాలాంజనము ఎవరి నేత్రములకైన లభించును. కాని అమ్మవారి నిరీక్షణము త్రినేత్రుడైన శివునకు మాత్రమే లభించును.

**వివరణము:-**

1) నేత్రశోభను పెంపొందించుటకు సహజమైన నల్లదనము తక్కువగా నున్నవారు కాలాంజనము (కాటుక) ను ధరించెదరు. అమ్మవారి నేత్రము సహజముగా నల్లనిదే కనుక కాలాంజనమును ధరింప నక్కఱ లేదు. అయినను దానిని ధరించినది.

దాని వలన ఆమె కంతిశోభ పెరుగను లేదు. తరగను లేదు. ఇది ఈ శ్లోకమున వ్యంగ్యమగు అర్థము. ప్రసిద్ధోపమానోపమేయ భావము నేత్రాంజనములకు లేదు. కాంతితో నవి సమములని వాని యుపమానోపమేయ భావము కవి వ్యంజింపజేసినాడు. నేత్రాంజనములకు భూషణభూష్య భావమున్నది. వానియందు సామ్యమును చెప్పుటచే నేత్రాంజనములకు కవి కల్పితోపమానోపమేయ భావమున్నది. అయినను కాలాంజనము నిశ్శేషనేత్ర సులభము. ఎవరైనను కన్నులకు కాటుకను ధరింపవచ్చును. లేదా కన్నుల కలంకరించుకొన్న కాటుకను చూడవచ్చును. అమ్మవారి చూపును నీరీక్షణ మనుట మిక్కిలి యందముగా నున్నది. సాధారణ దృష్టితో జూచినప్పుడు అది చూపే. మూడవ కంటితో జూచినప్పుడది యెదురు చూపు. అది యెదురు చూపని గ్రహించుట త్రినేత్రునకు సులభము. ఇతరులకది చూపు మాత్రమే. కాటుక ధరించినను ధరించక పోయినను దానియందు నలుపు శోభించుచునే యుండును. ఉపమానోపమేయభావమును కల్గించి తిరిగి ఆ రెంటిలోని విశేషమును బేర్కొనుటచే నిట వ్యతిరేకాలంకారము కలదు. కవి తానే ఈ శ్లోకమును కల్పించి యా రెంటిలో విశేషము చెప్పుట ఈ **వ్యతిరేకాలంకారములోని ప్రత్యేకత.** ప్రత్యేక విశేషము.

2) **తుహినాద్రికన్యే** అను సంబోధనము అమ్మవారి చూపులోని చల్లదనమును వ్యంజింప జేయుచున్నది. శివుని యవయవములలో కంఠ మొక్కటి కాలాంజనాభము. కాని శరీరమంతయు నల్లనైన అమ్మవారి నిరీక్షణముచే శివుని శరీరమంతయు నల్లబడి పోయినది. శివుడు సమీపించెను. సమీపమునుండి చూచు వారి కా యిరువురు నల్లగా యద్వైత స్థితినందినట్లు కనపడుదురు. భిన్నులై యుండ సామ్యసరణి యభేదము స్ఫూర్తికి హేతువగును. అమ్మవారి కన్నులలోని యా నీలిమ సహజమో? కాలంజన జన్యమో? యెవ్వటెఱుగుదురు? ఆ త్రినేత్రుడే చెప్పవలెను. అమ్మవారి కొఱకు దేవేంద్రాదులు నిరీక్షించెదరు. అమ్మవారు శివుని కొఱకు నిరీక్షించును.



**అవ:-** అమ్మవారి కన్నులు కాంతితో కాలాంజనసమములని పై శ్లోకమున చెప్పబడినది. ఆ **నీలిమచాతురి** యా క్రింది శ్లోకమున వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ ధూమాఙ్కురో మకరకేతనపావకస్య**
**కామాక్షి! నేత్రరుచినీలిమచాతురీ తే।**
**అత్యన్తమద్భుతమిదం నయనత్రయస్య**
**హర్షోదయం జనయతే హరిణాఙ్కమౌలేః॥** **37**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి! = ఓ కామాక్షీదేవీ!

| | | |
|---|---|---|
| తే | = | నీ యొక్క; |
| నేత్రరుచినీలిమచాతురీ | = | నేత్ర కాంతిలోని నీలిమయొక్క నిపుణత; |
| మకరకేతనపావకస్య | = | మన్మథాగ్నియొక్క; |
| ధూమాంకురః | = | పొగమొలక; |
| ఇదమ్ | = | ఇది; |
| అత్యంతమ్ | = | మిక్కిలి; |
| అద్భుతమ్ | = | వింత; |
| హరిణాంకమౌలేః | = | చంద్రుని శిరమందు దాల్చిన శివునియొక్క; |
| నయనత్రయస్య | = | మూడు కన్నులకు; |
| హర్షోదయమ్ | = | ఆనందావిర్భావమును; |
| జనయతే | = | కలిగించుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి కంటిలోని **నీలిమ** ఆమెలో మన్మథాగ్ని కలదని తెలియజేయు పొగవలె గన్పడుచున్నను, శివుని మూడు కన్నులలో హర్షోదయమునే కలిగించుట మిక్కిలి యద్భుతము కదా.

**వివరణము:-**

కనబడని యగ్ని యున్నదనుటకు కనబడు ధూమము హేతువు. అగ్ని లేనిదే పొగ యుండదు గదా! అమ్మవారి హృదయములో కామాగ్ని యున్నదనుటకు ఆమెకన్నులలో **నీలిమ** యను పొగ హేతువుగా చెప్పబడినది. కావున పూర్వార్ధములో ననుమానాలంకారము వ్యక్తమగుచున్నది. హిమగిరి సానువునందు దపము జేయు శివునకమ్మవారు మన్మథతాపము తోడనే పరిచరించినది. ఆమెలోని మన్మథుడే దేవతల ప్రేరణమువలన బయటికి కుసుమబాణుడై వచ్చి శివునిపై బూబాణముల ప్రయోగించెను. శివుడది గ్రహించి తన మూడవ కంటిలోని యగ్నిచే వానిని గాల్చివైచెను. అమ్మవారి హృదయములోని కామాగ్ని జల్లార్చుట కదియే హిమవర్షమయ్యెను. మన్మథాగ్ని జల్లారునపుడు పైకెగసిన పొగ అమ్మవారి కన్నుల నీలిమగ రూపు ధరించెనా! అది చూచి శివునకు సంతోషమయ్యెనా? లేక మన్మథుని బాణముచే అమ్మవారిపై కలిగిన కామాగ్నికి లోబడెనా? కాని అమ్మవారక్కడనుండి వెడలి తపము చేయుచుండెను. ఆమె హృదయములో కామాగ్ని యున్నదో లేదో చూచుటకు శివుడు వచ్చెను. తపో విషయమున కాటుక లేకున్నను అమ్మవారి కన్నులలో నీలిమ కన్పడెను. అమ్మవారి హృదయములో కామాగ్ని నుండి బయలుదేరిన ధూమమున్నదని నిశ్చయించుకొని సంతోషించెనా? మొదటి పక్షమంగీకరించిన శివుడమ్మవారితో కలసి యుండడు. శివుడమ్మ వారితో కలిసి యున్నాడు గదా! రెండవ పక్షమే సరియైనది. మన్మథుడు చావలేదని అమ్మవారి యెదలో అగ్ని

రూపమున నున్నాడని తెలిసి శివుని సూర్య చంద్రులనెడి క్రింది కన్నులు సహచరుడు బ్రతికి యున్నందు కానందించినవి. మూడవకన్ను తాను స్వయముగా గాల్చినను బూడిదగాక అమ్మవారి హృదయములో చేరి ఇంకను మండుచునే యున్నాడని తనవలె శాశ్వతముగా నుండుచున్నాడని సంతసించినది. ఈ విధముగా మూడు కన్నులును హర్షించుట యెంతో వింతగా నున్నది. ఇది పూర్వోత్తరార్ధములచే వ్యక్తమయిన వింత. సహచరుని దుఃఖముతో నానందించు వారు కొందఱుందురు. అందుకే సూర్యు డుదయించినప్పుడు మిత్రోదయమయ్యెనని యేడ్చుచు చంద్రుడస్తాద్రి గుహలో తల దాచుకొనును. అట్లే చంద్రోదయవేళలో మిత్రుడైన సూర్యుడేడ్చుచు సప్తగిరి గుహలో తలదాచుకొనును. అగ్నికుభయోదయకాలరూపదర్శపూర్ణమాసలలో నాహుతులు లభించుటచే నానందము కల్గును. అదిగాక సాయంకాలమున దనతేజమును సూర్యుడగ్ని యందుంచును. సూర్యుడగ్ని యందు మైత్రి బ్రకటించగా నగ్ని బాగుగా వెలుగురాత్రులందే చంద్రుడు ప్రకాశించుచు అగ్నితో మైత్రీభావమునే పొంది యున్నాడు. కావున సూర్యచంద్రులిరువు రెడ మొగము పెడమొగముగా నుందురు. వారిరువురకు పై నుండి అగ్ని యా యిరువురితో మైత్రి పాటించును. మొత్తము మీద మన్మథాగ్ని సత్తా నిర్ణాయక ధూమమును జూచి శివుని మూడు కన్నులకును హర్షము కలిగెను. ఇది యెంతో వింతగా నున్నది. ఇది పూర్వోత్తరార్ధముల రెంటిలో వ్యాపించి వ్యక్తమయిన వింత. ఏమైనను చంద్రాగ్నులు రాత్రియందు వెలిగినంతగా, సూర్యుడు ప్రకాశించు దినవేళ నంతగా ప్రకాశించరు. చంద్రాగ్నులే మిక్కిలి మిత్రులుగా నందురు. తన మిత్రుడగ్ని మన్మథాగ్ని రూపమున నమ్మవారి హృదయములో నున్నాడని నేత్రకాంతిధూమ దర్శనమున నిశ్చయించుకొన్న చంద్రుడు శివుని శిరముపై నెక్కి నాట్య మాడెనని **హరిణాంకమౌలేః** అను శివవాచకపదము ప్రయోగించుటచే వ్యక్త మగును. అగ్నిప్రకాశము సంతోషమును, అగ్ని పొగ చూరి యుండుట దుఃఖమును, సూచించు చిహ్నములు. అమ్మవారి కన్నుల నీలిమ యొక్క చాతురి యేమనగా నది ధూమరూపమైనను శివుని మూడు కన్నుల కానందమునే కల్గించినది. అగ్నిలో నుండి అంకురము జనించదు. కాని అమ్మవారి హృదయములో నున్న కామాగ్నిలో నుండి ధూమాంకుర ముదయించినది. ఇది యన్నింటి కంటె నత్యంత మైన యద్భుతము. పూర్వార్ధము నందలి పావకమునకు ధూమాంకురోద్భవ మొక వింత. ఉత్తరార్ధము నందలి నయనత్రయమున కొకేసారి హర్షముదయించుట యొక వింత యని చెప్పుటకు ఉత్తరార్ధారంభమున **అత్యంత మద్భుతమిద** మను వాక్యము దేహలీదత్తదీపన్యాయమున రెండు వింతలను ప్రకాశింపజేయుచున్నది. ఉత్తరార్ధారంభమున శివునకు అనితర సాధారణముగా నయనత్రయ ముండుటయు వింతయే. ధూమము నయనములకు బాధనే కలిగించును. కాని అమ్మవారి కన్నుల నీలిమ యను ధూమము మాత్రము శివనయనత్రయమునకు హర్షమును గలిగించుట అద్భుతము కాకుండుట యెట్లు. ఇన్ని వింతలొక శ్లోకమున ప్రకాశించునట్లు శ్లోకమును రచించి మూకకవి తన

ప్రతిభయే అత్యద్భుతమైన వింతగా బేర్కొనుచున్నట్లనిపించుచున్నది. లేక మూకుడైన తన కా యత్యద్భుతప్రతిభ నీయగల్గుటయే అమ్మవారొనర్చిన యద్భుతమని చెప్పుచున్నట్లనిపించుచున్నది.



**అవ:-** అమ్మవారి లోచన చాతుర్యమత్యద్భుతముల నొనర్పగలదని పై శ్లోకమున జెప్పబడినది. అది చేయు మరొక యద్భుతము నీ క్రింది శ్లోకము ప్రస్తావించు చున్నది.

**శ్లో॥ ఆరమ్భలేశసమయే తవ వీక్షణస్య**
**కామాక్షి! మూకమపి వీక్షణమాత్రనమ్రమ్।**
**సర్వజ్ఞతా సకలలోకసమక్షమేవ**
**కీర్తిః స్వయంవరణమాల్యవతీ వృణీతే॥ 38**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| తవ | = | నీ యొక్క |
| వీక్షణస్య | = | చూపుయొక్క; |
| ఆరమ్భలేశసమయే | = | వ్యాపారలేశకాలమునందు; |
| వీక్షణమాత్రనమ్రమ్ | = | చూపుచేతనే నమ్రత నొందిన; |
| మూకమపి | = | మూగను గూడ; |
| సకలలోకసమక్షమేవ | = | సమస్తదేహుల యెదురుగనే; |
| సర్వజ్ఞతా | = | సర్వమెఱుగు శక్తి (అనుకన్య); |
| కీర్తిః | = | కీర్తి(యనుకన్య); |
| స్వయంవరణమాల్యవతీ | = | స్వయముగా వరించుటకై మాల గలదై; |
| వృణీతే | = | వరించును. |

**తాత్పర్యము:-**

అమ్మవారి చూపు ప్రసరించినదో లేదో వినమ్రుడయిన మూగను కూడ సర్వజ్ఞతాకన్య, కీర్తికన్యయు స్వయంవరమాలల ధరించి వరించెదరు.

**వివరణము:-**

కనులు దెరచుచున్నప్పుడే పూర్తిగా దెఱవకమునుపే నిన్ను చూచి వినమ్రుడయిన మూగను సర్వజ్ఞతాకీర్తికన్యలు వరించునని కారణప్రవృత్తి. సమకాలముననే కార్యప్రవృత్తి జరిగినట్లు శ్లోకమున చెప్పబడినది. కీర్తి సర్వజ్ఞతలను జెప్పుటకు స్త్రీ లింగ శబ్దముల బ్రయోగించుటచే కన్యకాత్వారూపము స్ఫురించుచున్నది. కావున నిందు **సాపహ్నవాతిశయోక్త్యలంకార** మున్నది. తెల్లవాఱుజామున నమ్మవారిని నిద్రనుండి

మేల్కొల్పుటకు అమ్మవారి దేవాలయమునకు బలువురు వచ్చిరి. వారిలో నొక మూగ యున్నాడు. మూగ యనగా వినికిడి శక్తి కూడ లేనివాడు. ఏ మాటను వినలేక పోవుటచే బలుకుటకును జేతగాని వాడు, జదువురాదని, వైదికవిజ్ఞానమెఱుంగని వాడని వేరుగా జెప్ప బనిలేదు. అమ్మవారికి నమస్కరించుట కూడ యెఱుగడు. అట్టి వాని నమ్మవారు చూచినట్లున్నది. కాదు అట్టివాడమ్మవారిని జూచినాడు. వెంటనే వాడు సర్వజ్ఞతను బ్రకటించుచు మాట్లాడినాడు. అతని వాక్కులు వాగ్దేవీ విలాసములుగా నున్నవి. ఈ విషయము వెంటనే జగత్ప్రసిద్ధమాయెను. ఇది యంతయు మూకకవి స్వానుభవమును వలె జెప్పుచున్నాడని లేక యట్టి మరొక సంఘటనము నాతడు జూచి స్వానుభవమును జ్ఞప్తికి దెచ్చుకొన్నాడని, సకల **లోకసమక్షమేవ** అనుటచే దెలియుచున్నది. ఆ వచ్చిన పెక్కుఱు లోకులలో నొక మూకయున్నాడని మూక-లోక శబ్ద ప్రయోగముచే స్ఫురించుచున్నది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి లోచన ఎడతెగని కాంతిని ప్రకటించుచున్నదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కాలామ్బువాహ ఇవ తే పరితాపహారీ**
**కామాక్షి! పుష్కరమధఃకురుతే కటాక్షః।**
**పూర్వః పరం క్షణరుచా సముపైతి మైత్రీ-**
**మన్యస్తు సన్తతరుచిం ప్రకటీకరోతి॥ 39**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| పరితాపహారీ | = | సంతాపమును హరించు; |
| తే | = | నీ యొక్క; |
| కటాక్షః | = | క్రీగంటి చూపు; |
| కాలాంబువాహ ఇవ | = | వర్షాకాల మేఘమువలె; |
| అధఃకురుతే | = | ముకుళింపజేయుచున్నది; |
| పుష్కరమ్ | = | కమలమును; |
| పూర్వః పరమ్ | = | మొదటిది(కాలామ్బువాహము) మాత్రము; |
| క్షణరుచా | = | క్షణకాలము వెలుగు (విద్యుత్తు) తో; |
| మైత్రీమ్ | = | స్నేహమును; |
| సముపైతి | = | పొందుచున్నది; |
| అన్యః తు | = | మఱొకటి(కటాక్షము) మాత్రము; |
| సన్తతరుచిమ్ | = | ఎడతెగని కాన్తిని; |
| ప్రకటీకరోతి | = | ప్రకటించుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి చూపు వర్షాకాలమేఘము వంటిది. అమ్మవారి చూపును వర్షాకాల మేఘమును పరితాపమును హరించు నట్టివే. కాని భేదమేమనగా వర్షాకాలమేఘము క్షణకాలము మెఱసి నశించు మెఱుపుతో స్నేహమొనర్చు చుండగా అమ్మవారి కటాక్షము మాత్రము నిరంతర కాంతిని ప్రకటించుచుండును.

**వివరణము:-**

కాలామ్బువాహ కటాక్షములకు పరితాపహరణము అను సామాన్య ధర్మము నాశ్రయించి యుపమానోపమేయభావము చెప్పబడి పిమ్మట వానిలో కాలామ్బువాహమున క్షణకాంతి సంబంధము కటాక్షమునకు సంతతకాంతి సంబంధము అను వైషమ్యము అనగా విశేషము చెప్పుటచే నీ శ్లోకమున వ్యతిరేకాలంకారము గలదు. కాలామ్బువాహ కటాక్షములకు పుష్కరాధఃకరణరూప సమానధర్మము కూడ కలదు. కాలామ్బువాహ మంతరిక్షమున నుండుటచే సరోవరమునందలి పుష్కరము వికసించి యుండినను అధః కృతమైనట్లే, సూర్యునకాచ్ఛాదకరమై కాలామ్బువాహము తనకు తన హితునకు మధ్య యవనికగా నుండుటచే కమలము తన ప్రియుడు కనబడకపోవుటచే తల వంచుకొనియే దిగులు పడుచుండును. స్వాధీనవికాసముకల అమ్మవారి కటాక్షము పరాధీన వికాసముకల కమలము నధఃకరించుట యుచితముగనే యున్నది. కాలామ్బువాహము జలవర్షము కురిపించునట్లు అమ్మవారి కటాక్షము కరుణావర్షము కురిపించి భక్తులను శాశ్వతైశ్వర్య సంపన్నుల నొనర్చును. కాలామ్బువాహము జనుల తాత్కాలికైశ్వర్యసంపన్నుల నొనర్చును. కాలామ్బువాహము జనుల తాత్కాలికైశ్వర్యసంపన్నుల మాత్రమే యొనర్చును. ఈ విశేషము అమ్బువాహమునకు విశేషణమగు కాలశబ్దముచే క్షణరుచా యందలి క్షణశబ్దము చేతను, **సంతతరుచిం** యందలి సంతతశబ్దము చేతనే స్ఫురింప జేయబడుచున్నది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షమున యష్ట్యారోపము చేయబడుట వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ సూక్ష్మేఽపి దుర్గమతరేఽపి గురుప్రసాద-**
**సాహాయ్యకేన విచరన్నపవర్గమార్గే।**
**సంసారపఙ్కనిచయే న పతత్యమూన్తే**
**కామాక్షి! గాఢమవలమ్బ్య కటాక్షయష్టిమ్॥** **40**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి! = ఓ కామాక్షీదేవీ!
సూక్ష్మే+అపి = సన్నగానున్నను;

| | | |
|---|---|---|
| దుర్గమతరే+అపి | = | నడచిపోవుటకు మిక్కిలి కష్టమైనదే ఐనను; |
| అపవర్గమార్గే | = | మోక్షమార్గమున; |
| గురుప్రసాదసహాయ్యకేన | = | గుర్వనుగ్రహముయొక్క తోడ్పాటుతో; |
| విచరన్ | = | నడచుచు; |
| తే | = | నీ యొక్క; |
| అమూమ్ | = | ఈ ; |
| కటాక్షయష్టిమ్ | = | చూపనెడి కఱ్ఱను; |
| గాఢమ్ | = | గట్టిగా; |
| అవలమ్బ్య | = | పట్టుకొని; |
| సంసారపఙ్కనిచయే | = | సంసారమనెడి బురదల సమూహమున; |
| న పతతి | = | పడదు. |

**తాత్పర్యము:-**

మోక్షమార్గమిఱుకుగా నుండును. నడుచుటకు గష్టముగా నుండును. అయినను గుర్వనుగ్రహముతో అమ్మవారి కటాక్షమనెడి యూత కఱ్ఱను గట్టిగా పట్టుకొని నడుచువాడు ఆ మార్గమున నిటునటు నున్న బురదగుంటలలో పడకుండ గైవాల్యానందధామము జేరుకొనును.

**వివరణము:-**

మోక్షము లభింపవలెనన్న ఈశ్వరానుగ్రహమున నద్వైతవాసన ముందు లభింపవలెను. ఆ యీశ్వరానుగ్రహము గురూపదిష్టమార్గమున నీశ్వరోపాసన చేసిన పిమ్మటనే లభించును. గురువుగారికడ అమ్మవారి కటాక్షమను ఊతకఱ్ఱ యున్నది. ఆ మార్గమున గైవల్యమును బ్రదికి యుండగానే చేరికొన్న జీవన్ముక్తుడైన గురువు తనకింక ప్రేమతో దేవీ కటాక్షమను యష్టిని యవసరము లేకపోవుటచే శిష్యున కొసగును. ఇదియే గుర్వనుగ్రహము. దానిని పట్టుకొని పదిలముగా నెంతటి దుర్గమమార్గమున నైనను బ్రయాణించవచ్చును. అదిగాక గురువు తన ముందుండి మార్గము జూపుచున్నాడు గదా. కటాక్షమునందు యష్ట్యారోప ముండుటచే నిట రూపకాలంకారముగలదు.



అవ:- ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షమందు భక్తిశృంఖలాబంధము చెప్పబడుచున్నది.

శ్లో॥ **కామాక్షి! సన్తతమసౌ హరినీలరత్న-**
**స్తమ్భే కటాక్షరుచిపుఞ్జమయే భవత్యాః।**
**బద్ధోఽపి భక్తినిగలైర్మమ చిత్తహస్తీ**
**స్తమ్భం చ బన్ధమపి ముఞ్చతి హన్త చిత్రమ్॥** 41

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| సంతతమ్ | = | ఎల్లప్పుడు; |
| భవత్యాః | = | నీ యొక్క; |
| అసౌ | = | ఈ ; |
| కటాక్షరుచిపుంజమయే | = | క్రీగంటి చూపుల కాంతుల సమూహమనెడి; |
| హరినీలరత్నస్తంభే | = | ఇంద్రనీలమణిస్తంభమందు; |
| భక్తినిగలైః | = | భక్తిశృంఖలలచేత; |
| బద్ధః+అపి | = | బంధింపబడియున్నను; |
| మమ | = | నా యొక్క; |
| చిత్తహస్తీ | = | చిత్తమను నేనుగు; |
| స్తంభం చ | = | స్తంభమును; |
| బంధం చ | = | బంధమును; |
| ముంచతి | = | విడచుచున్నది; |
| హన్త | = | ఆహా! |
| చిత్రమ్ | = | విచిత్రము. |

**తాత్పర్యము:-**

అమ్మవారి కటాక్షకాంతిపుంజమనెడి స్తంభమునందు భక్తిశృంఖలలచే నా మనస్సనెడి ఏనుగు బంధించబడి యున్నను అది స్తంభించిపోవుటను మానుకొన్నది. అట్లే బంధమును కూడ విడచి వేయుచున్నది.

**వివరణము:-**

స్తంభమునకు కట్టివేయబడిన వారి బంధమును వేరొకరు విడువవలెను. కాని అమ్మవారి కటాక్షకాంతిసమూహస్తంభమున కట్టి వేయబడిన నా చిత్త హస్తి తనకు తానే సంసారబంధమును విడచివేయుచున్నది. తమోగుణమువలన కలుగు స్తంభించి పోవుటయను గుణమును విడచివైచినది. కటాక్షకాంతిపుంజ మందు స్తంభత్వ మారోపించుటచే పూర్వార్ధమున రూపకాలంకారము. ఇది ఉత్తరార్ధమున స్తంభ బంధమోచనము చిత్తహస్తి తానే చేయుట విచిత్రమని చెప్పబడినది. పూర్వార్ధమున భక్తి శృంఖలాబంధము చెప్పబడినది. ఉత్తరార్ధమున సంసారబంధమోచనము చెప్పబడినది. ఏ బంధముయొక్క మోచనమో చెప్పబడక పోవుటచే నేర్పడిన విరోధము సంసారమును ఆక్షిప్తార్ధముగ చెప్పుకొనుటచే పరిహృతమగుచున్నది. అట్లే పూర్వార్ధమున కటాక్షరుచి పుంజమునందు స్తంభత్వారోప మున్నది. ఉత్తరార్ధమున స్తంభమను తమోగుణవిశేషము యొక్క మోచనమని శ్లేషవలన లభించిన యర్థాంతరముచే అది ఏ స్తంభమో తెలియక ముందు కలిగిన విరోధము పరిహరింపబడుటచే నీశ్లోకమున రూపకానుప్రాణిత

విరోధాభాసాలంకారమున్నది. **అపి హంత చిత్రమ్** అను పదములచే విరోధాభాసాలంకారము వాచ్యమైనది. ఇంద్రనీలమును చెప్పుటకు బదులు హరినీల మనుటచే అమ్మవారి కటాక్షపుంజస్తంభమున సింహత్వము స్ఫురించు చున్నది. సింహము అను స్తంభమునకు ఏనుగు కట్టి ˉయబడుట యను విరోధమే కాక అమ్మవారి కటాక్షరుచిపుంజమునందు విష్ణుభేదాపత్తి విష్ణువు గజేంద్రబంధమోచన వృత్తాంతము శబ్దశక్తిమూలమున స్ఫురించుచున్న వస్తు ధ్వనులుగా నీ శ్లోకమున నున్నవి.



**అవ:-** పై శ్లోకమున విరోధాభాస మున్నది. అటువంటిదే మరొక విరోధ మీశ్లోకమున ప్రస్తావించబడుచున్నది.

**శ్లో॥ కామాక్షి! కార్ష్ణ్యమపి సన్తతమఞ్జనం చ**
**బిభ్రన్నిసర్గతరలోఽపి భవత్కటాక్షః।**
**వైమల్యమన్వహమనఞ్జనతాం చ భూయః**
**స్థైర్యం చ భక్తహృదయాయ కథం దదాతి॥ 42**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| కార్ష్ణ్యం చ | = | నల్లదనమును; |
| సంతతమ్ | = | ఎల్లప్పుడు; |
| అంజనం చ | = | కాటుకను; |
| బిభ్రన్ | = | ధరించుచున్న; |
| నిసర్గతరలః అపి | = | సహజచంచలమైనను; |
| భవత్కటాక్షః | = | నీ కడగంటి చూపు; |
| అన్వహమ్ | = | ఎల్లప్పుడు; |
| వైమల్యమ్ | = | నిర్మలత్వమును; |
| అసంజనతాం చ | = | అకలంకత్వమును; |
| భూయః | = | మాటిమాటికి; |
| భక్తహృదయాయ | = | భక్తుని యెదకు; |
| స్థైర్యం చ | = | స్థిరత్వమును కూడ; |
| కథమ్ | = | ఎట్లు; |
| దదాతి | = | ఇచ్చుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి కటాక్షము నల్లని దయ్యు స్వచ్ఛతను, సాంజనమయ్యు

నిరంజనత్వమును, చంచలమయ్యు స్థైర్యమును, భక్త హృదయమునకు నెట్లు గూర్చుచున్నది.

**వివరణము:-**

మాహాత్మ్యాతిశయముచే విరోధము పరిహరింపబడుటచే విరోధాభాసా లంకారము కలదు.



**అవ:-** ఈ శ్లోకమున సావయవరూపకాలంకారము ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ మన్దస్మితస్తబకితమ్మణికుణ్డలాంశు-**
**స్తోమప్రవాలరుచిరం శిశిరీకృతాశమ్।**
**కామాక్షి! రాజతి కటాక్షరుచేః కదమ్బ-**
**ముద్యానమమ్బ! కరుణాహరిణేక్షణాయాః॥ 43**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| అమ్బ! | = | అమ్మా! |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| మన్దస్మితస్తబకితమ్ | = | చిఱునవ్వే పూలగుత్తులుగా గల; |
| మణికుణ్డలామ్ | = | మణి కుండలముల యొక్క; |
| అంశుస్తోమ- | = | కాంతి సమూహమనెడి |
| ప్రవాల- | = | చిగుళ్ళతో |
| రుచిరమ్ | = | అందమైన; |
| శిశిరీకృతాశమ్ | = | చల్లబఱచిన దిక్కులు గల; |
| కటాక్షరుచేః | = | కడగంటికాంతులయొక్క; |
| కదమ్బమ్ | = | సమూహము; |
| కరుణాహరిణేక్షణాయాః | = | కరుణయను సుందరికి; |
| ఉద్యానమ్ | = | తోటగా; |
| రాజతి | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

చిఱునవ్వులే పూలగుత్తులుగా, మణికుండల కాంతులే చిగుళ్ళుగా, దిక్కుల జల్లబఱచునట్టి అమ్మవారి కటాక్షకాంతి, కదంబము కరుణాసుందరి విహరించు తోటగా ప్రకాశించుచున్నది.

**వివరణము:-**

అమ్మవారి కటాక్షకాంతికదమ్బ మీ శ్లోకమున నుద్యానముగా రూపింప

బడుచున్నది. విషయధర్మములైన మందస్మితములు, మణికుండలాంశు స్తోమములు విషయిధర్మములైన పూలగుత్తులుగా చిగుళ్ళుగా రూపింపబడినవి. కరుణయే యా యుద్యానమున విహరించు సుందరిగా రూపింపబడినది. కావున నిందు సావయవరూపకాలంకారము కలదు.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి లోచన దీపమాలగా రూపింపబడుచున్నది.

**శ్లో॥ కామాక్షి! తావకకటాక్షమహేన్ద్రనీల-**
**సింహాసనం శ్రితవతో మకరధ్వజస్య।**
**సామ్రాజ్యమఙ్గలవిధౌ మణికుణ్డలశ్రీ-**
**ర్నీరాజనోత్సవతరఙ్గితదీపమాలా॥** **44**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తావకకటాక్షమహేన్ద్రనీల సింహాసనమ్ | = | నీ కటాక్షమనెడి యింద్రనీలమణి సింహాసనమును; |
| శ్రితవతః | = | ఆశ్రయించిన; |
| మకరధ్వజస్య | = | మన్మథునియొక్క; |
| సామ్రాజ్యమఙ్గలవిధౌ | = | సామ్రాజ్యపట్టాభిషేక కర్మయందు; |
| మణికుండలశ్రీః | = | మణికుండల కాంతి; |
| నీరాజనోత్సవతరఙ్గితదీపమాలా | = | నీరాజనోత్సవమున బొందిన దీపమాలగా; |
| రాజతి | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి కటాక్షము మహేన్ద్రనీలమణినిర్మితసింహాసనము. దానిని మన్మథుడెక్కెను. అప్పుడు వానికి పట్టాభిషేకకర్మ జరిగెను. ఆ కర్మ చివఱ నీరాజన దీపమాలగా అమ్మవారి మణికుండలకాంతి రూపొందెను.

**వివరణము:-**

సంభావనావాచకములైన ఇవాది పదము లేవియు లేకుండ అమ్మవారి కటాక్ష సింహాసన మెక్కిన మన్మథుని పట్టాభిషేకకర్మయందు మణికుండలకాంతి నీరాజనోత్సవ దీపమాలగా నుత్ప్రేక్షింపబడుటచే నీ శ్లోకమున **రూపకానుప్రాణిత గమ్యోత్ప్రేక్షాలంకారము** గలదు.



**అవ:-** శ్రేయస్సులను ప్రసాదించు అమ్మవారి కటాక్షమున తనను క్షణకాలము స్నానమాడింపుమని కవి అమ్మవారిని ఈ శ్లోకమున ప్రార్థించుచున్నాడు.

**శ్లో॥ మాతః క్షణం స్నపయ మాం తవ వీక్షితేన**
**మన్దాక్షితేన సుజనైరపరోక్షితేన।**
**కామాక్షి! కర్మతిమిరోత్కరభాస్కరేణ**
**శ్రేయస్కరేణ మధుపద్యుతితస్కరేణ॥ 45**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| మాతః | = | అమ్మా! |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| మధుపద్యుతితస్కరేణ | = | తుమ్మెదల కాంతిని దొలగించు; |
| శ్రేయస్కరేణ | = | శుభముల గలిగించు; |
| కర్మతిమిరోత్కరభాస్కరేణ | = | కర్మలనెడి చీకట్లగుంపునకు సూర్యుడైన; |
| మన్దాక్షితేన | = | సిగ్గిలిన; |
| సుజనైః | = | మంచివారిచేత; |
| అపరోక్షితేన | = | సాక్షాత్కరింప జేసికొనబడిన; |
| తవ | = | నీ యొక్క; |
| వీక్షితేన | = | చూపుచేత; |
| క్షణమ్ | = | కొంచెము సేపు; |
| మామ్ | = | నన్ను; |
| స్నపయ | = | తడుపుము. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీదేవీ! నీ చూపు కర్మాంధకారము బాపుటలో సూర్యుడు తుమ్మెదల కాంతి నపహరించు దొంగయునైనట్టిది. అది శ్రేయస్సులను కలిగించునది. సిగ్గు తొణికిసలాడు నట్టిది. సుజనులెప్పుడు దానిని సాక్షాత్కరించు కొనుచుందురు. అట్టి చూపుచేత నో తల్లీ! నన్ను క్షణకాలము స్నానమాడింపుము.

**వివరణము:-**

1) తుమ్మెద మధువు ద్రాగును. మధువు త్రాగువారి దగ్గఱనున్న దానిని అపహరించుట సులభము. మధుపాయి దగ్గరనున్న దానిని దొలగించిన వాడిక మధువు ద్రాగలేడు. వాని దురభ్యాసము మానుట కిది యొక మార్గము. మధువనగా విషయసుఖము. స్త్రీరూపముకూడ మధువే. దానిని ద్రావు జీవుని చూపు నపహరించినచో వాడిక స్త్రీరూపమధువు గ్రోలడు. తుమ్మెద కాంతిని అమ్మవారి కన్ను అపహరించు దొంగ యని అమ్మవారి చూపునందు దొంగతన మారోపింపబడినది. తుమ్మెద యనుటకు

మధుపశబ్దమును బ్రయోగించుటచే బై యర్థము స్ఫురించుచున్నది. మధుపద్యుతితస్కరేణ యను సమాసమున కిది వివరణము. అమ్మవారి చూపు కర్మతిమిరోత్కరభాస్కరము. కర్మమార్గము గహనము. **గహనా కర్మణో గతిః(4.17)** అని భగవద్గీత చెప్పుచున్నది. భక్తి మార్గమునందు శ్రవణాది కర్మలున్నను ప్రత్యవాయము లింతగా నుండవు. యజ్ఞాది కర్మలు ప్రత్యవాయ బహులములు వాని ఫలముగా లభించు స్వర్గాది లోకము లనిత్యములు. కర్మమార్గముతో బోల్చినప్పుడు భక్తిమార్గము సులభతరము. కర్మమార్గము శుభకరమే అయినను భక్తి మార్గము శ్రేయస్కరము. భక్తి మార్గమున లభించు వైకుంఠాది లోకములు నిత్యములు కాకపోయినను కైవల్యరూపములు కాక పోయినను అటకుజేరిన వారు కూడ వెనుకకు మాత్రము రారు. ఆ లోకముల యంతమందు లోకాధిపతి తన లోకమునకు వచ్చిన వారికి **తత్త్వమసి** యను వాక్యము నుపదేశించును. అప్పుడు కైవల్యము కలుగును. కావున భక్తిమార్గమందు పునరావృత్తి లేదు. కర్మమార్గమందట్లు కాదు. **గతాగతం కామకామా లభంతే(9.21)** అని సకామకర్మమార్గమును భగవద్గీత నిందించినది. అందుచేత నిది తిమిరముగా రూపింపబడినది. దానికి భాస్కరుడుగా నమ్మవారి చూపు రూపింపబడినది. నిష్కామకర్మమార్గము చిత్తశుద్ధిజననము అది యక్కడ తిమిరముగా చెప్పబడలేదు. సకామకర్మమార్గమే తిమిరోత్కరము. దాని కమ్మవారి చూపు భాస్కరుడు. అమ్మవారి యొక కన్నెట్లైనను ఆరోపణము లేకున్నను అది సూర్యుడే. కాని సూర్యుడుగా కన్పడక విగ్రహమునందు కన్నుగా గన్పడుటచేత అది యట సూర్యుడుగా రూపింపబడినది. కావున నీ సమాసమున రూపకాలంకారమున్నది. అమ్మవారి వీక్షితము దృగ్రూపము. జగమంతయు దృశ్యము. ఆత్మను దృగ్రూపమందురు. సుజనులు అమ్మవారి చూపును పరోక్ష మొనరించుకొనినారనగా స్వాత్మ బ్రహ్మైక్యజ్ఞానము నొందినారన్నట్లే అపరోక్షితశబ్ద ప్రయోగము మిక్కిలి చమత్కారజనకము. సాధారణముగా ప్రత్యక్షము అపరోక్షము అను శబ్దము లనేకార్థముగా వాడెదరు. ప్రత్యక్ష మనగా ఇంద్రియము లేక ఇంద్రియజన్య జ్ఞానము. అపరోక్షమనగా స్వయంప్రకాశజ్ఞానము. అది ప్రత్యక్షమను ఇంద్రియమునే కాదు మరి యే అనుమానాదీతర ప్రమాణమును అపేక్షింపదు.

2) కావున అపరోక్షిత మనగా స్వయం ప్రకాశమైన యాత్మజ్ఞానమే. బ్రహ్మాత్మైకవిజ్ఞానస్వరూపమే బ్రహ్మాత్మైక్యవిజ్ఞానము తత్త్వమస్యాది వాక్యజన్యజ్ఞానము కదా. అది యపరోక్షిత మెట్లను ప్రశ్న జనించును. సమాధాన మేమనగా నా జ్ఞానము వృత్తివ్యాప్యత్వాంశమునందే వాక్యజన్యము. ఫలవ్యాప్యత్వాంశమున నది వాక్యజన్యముగాదు. కావున నది యపరోక్షితమే. సుజనులకు మాత్రమే బహుజన్మాంతమున నీ జ్ఞానము కలుగును. **సుజనైరపరోక్షితేన** అను మాటచే నా యర్థమంతయు స్ఫురింపజేయబడినది. అన్ని జ్ఞానములవలె మహావాక్య జన్యబ్రహ్మాత్మైక్యజ్ఞానము కూడ క్షణికమే. అన్ని యితర జ్ఞానములు అనాదితూలావిద్యను నివారించినట్లు ఇది మూలావిద్య నివారింపజేయును. కావుననే యిట మూకకవి క్షణం స్నపయ క్షణకాలము నీ చూపును నా మీద వర్షింపుము

అనుచున్నాడు. అమ్మవారి చూపు మందాక్షితము. శివుని సాన్నిధ్యమున నది సిగ్గిల్లుటచే నిట నది **మందాక్షితేన** అని పేర్కొనబడినది. అమ్మవారి చూపు **శ్రేయస్కరేణ** అని విశేషింపబడినది. శ్రేయస్సనగా నిత్యసుఖము. అనిత్యసుఖము ప్రేయస్సనబడును. కఠోపనిషత్తునందు **శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతః(క1.2.2)** అని చెప్పబడినది. శ్రేయస్సు ప్రేయస్సు ఈ రెంటిలో సుజనులే శ్రేయస్సునెన్ను కొందురు. అందుకై సుజనులమ్మవారి చూపు నవలంబించి శ్రేయస్సు నందుదురు. ఇతర దేవతాకటాక్షము ప్రేయస్సు నొసంగునే కాని శ్రేయస్సు నొసంగదు. పరదేవతాకటాక్ష మందుచే శ్రేయస్కరము. శ్రేయస్సనగా నిత్యసుఖమైన మోక్షమే. అది బ్రహ్మాత్మైక్యజ్ఞానరూపమే. అది అనాది దుఃఖము నివారించి నిత్యము కైవల్యరూపమునైన **మహానందము** నొసంగును. పరదేవతా కటాక్షమపరోక్షితము కానిదే ఈ మహానందము లభించదు. అందుచే సుజనులమ్మవారి కటాక్షమున పరోక్షిత మొనరించుకొనగోరుదురు. సుజనుల కోర్కె నమ్మవారి కటాక్షము తీర్చును. అది వారి కపరోక్షిత మగును. అదియే చరమపురుషార్థము. అనాదిసంసార మహాదుఃఖనివృత్తిరూపము **భాస్కరేణ, శ్రేయస్కరేణ, తస్కరేణ"** అను పదాన్తములందనుప్రాస రూప శబ్దాలంకారము కలదు.



**అవ:-** పై శ్లోకమున **శివైక్యరూపమైన** శ్రేయస్సు ప్రస్తావించబడినది. ఈ శ్లోకమున శ్రేయస్సాధనమైన **శ్రీ కన్ఠభజనము** ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ ప్రేమాపగాపయసి మజ్జనమారచయ్య**
**యుక్తస్మితాంశుకృతభస్మవిలేపనశ్రీః।**
**కామాక్షి! కుణ్డలమణిద్యుతిభిర్జటాలః**
**శ్రీకణ్ఠమేవ భజతే తవ దృష్టిపాతః॥ 46**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| తవ | = నీ యొక్క |
| దృష్టిపాతః | = చూపు; |
| ప్రేమాపగాపయసి | = ప్రేమయను నది నీటిలో; |
| మజ్జనమ్ | = స్నానమును; |
| ఆరచయ్య | = చేసి; |
| యుక్త- | = కూడిన |
| స్మిత- | = చిఱునవ్వుయొక్క |
| అంశు- | = కాంతిచే |

| | |
|---|---|
| కృత- | = చేయబడిన |
| భస్మవిలేపన- | = బూడిద పూతయొక్క |
| శ్రీః | = కాంతి కలదై; |
| కుండలమణిద్యుతిభిః | = కుండలమణికాంతులచే; |
| జటాలః | = జడల దాల్చినదే; |
| శ్రీకణ్ఠమ్ ఏవ | = శివునే; |
| భజతే | = సేవించుచున్నది. |

**తాత్పర్యము:-**

ప్రేమయను నది నీట స్నాన మొనరించి చిఱునవ్వు కాంతి యనెడి బూడిద పూతతో ప్రకాశించుచున్నదై కుండల మణి కాంతులనెడి జడల దాల్చి నీ చూపు శివునే సేవించుచున్నదో కామాక్షీ దేవీ!

**వివరణము:-**

**నారుద్రో రుద్రమర్చయేత్** అనునది శాసనము. రుద్రుడు కాని వాడు రుద్రునర్చింప గూడదని యర్థము. అందుచేతనే శివభక్తులు శివుని వలె భస్మము, జడల ధరించెదరు. అమ్మవారి చూపుకూడ శివదీక్ష గైకొన్నట్లు నదిలో స్నానమొనరించినది. ఆ నది యే నది? ప్రేమాపగ. భస్మ మేది? చిఱునవ్వు కాంతినే భస్మముగా ధరించినది. జడలేవి? కుండలకాంతులనే జడలుగా ధరించినది. వీనివలన నమ్మవారి చూపునకు రుద్రత్వము వచ్చినట్లే, అనగా రుద్రవేషధారణము పూర్తియైనది. ఆపైన శివుని సేవించుచున్నది. పై శాసనము పాటించి శివదీక్ష గైకొని శివునివలె భస్మజటాధారియై అమ్మవారి దృష్టి శివుని చూచినది. అట్లు కాకుండ జూచినచో ఆ చూపును శివుడంగీకరించదేమో. అందుకే యామె చూపట్లు చేసినది. కటాక్షమునందు లేని శివదీక్ష యున్నట్లు వర్ణింప బడుటచే నీ శ్లోకమున నతిశయోక్త్యలంకారము కలదు.



**అవ:-** శ్రీ కంఠుని భజించు నమ్మవారి చూపే స్వయముగా కైవల్యము నొసగు నట్టిదని ఈ శ్లేకమున జెప్పబడుచున్నది.

**శ్లో॥ కైవల్యదాయ కరుణారసకిఙ్కరాయ**
**కామాక్షి! కన్దలితవిభ్రమశఙ్కరాయ।**
**ఆలోకనాయ తవ భక్తవశఙ్కరాయ**
**మాతర్నమోఽస్తు పరతన్త్రితశఙ్కరాయ॥ 47**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| మాత | = అమ్మా! |

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| కైవల్యదాయ | = | కైవల్యము నొసగునట్టి; |
| కరుణారసకింకరాయ | = | కరుణారసము సేవకముగా గలిగిన; |
| కన్దలితవిభ్రమశంకరాయ | = | అంకురించిన విలాసములచే సుఖమును గలిగించు; |
| భక్తవశంకరాయ | = | భక్తులు వశంకరులుగా గలిగిన; |
| పరతన్త్రితశంకరాయ | = | పరతన్త్రుడుగా మార్చబడిన శంకరుడు గల; |
| తవ | = | నీయొక్క |
| ఆలోకనాయ | = | చూపుకొఱకు; |
| నమః | = | నమస్సు; |
| అస్తు | = | అగుగాక. |

**తాత్పర్యము:-**

కైవల్యము నొసగునట్టి, ఏమిచేయు మనిన నదియే చేయునట్టి కరుణా రసముగల, అంకురించిన విలాసములచే సుఖమును కలిగించు భక్తులకు వశమైన శంకరుని తనకు వశమొనరించు కొనిన నీ కటాక్షమునకో కామాక్షీ దేవీ! నేను నమస్కరించుచున్నాను.

**వివరణము:-**

నాలుగు పాదముల చివఱ కరాయ అను శబ్దముండుటచే నీ శ్లోకమున పాదాంతానుప్రాసము కలదు.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి లోచన కదలుచున్న కలువల పతాకవలె ప్రకాశించు చున్నదని ప్రతిపాదించినాడు.

**శ్లో॥ సామ్రాజ్యమఙ్గలవిధౌ మకరధ్వజస్య**
**లోలాలకాలికృతతోరణమాల్యశోభే।**
**కామేశ్వరి! ప్రచలదుత్పలవైజయన్తీ-**
**చాతుర్యమేతి తవ చఞ్చలదృష్టిపాతః॥** **48**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామేశ్వరి! | = | ఓ కామేశ్వరీ దేవీ! |
| లోల- | = | చంచలములైన |
| అలక- | = | ముంగురుల |
| అలి- | = | వరుసచేత |
| కృత- | = | చేయబడిన |

| | | |
|---|---|---|
| తోరణమాల్య- | = | తోరణరూపమాలల యొక్క |
| శోభే | = | కాంతి గల; |
| మకరధ్వజస్య | = | మన్మథునియొక్క; |
| సామ్రాజ్యమంగలవిధౌ | = | సామ్రాజ్యార్పణ శుభకర్మయందు; |
| తవ | = | నీ యొక్క; |
| చంచలదృష్టిపాతః | = | చంచలమైన దృక్ప్రసారము; |
| ప్రచలత్ | = | కదలుచున్న; |
| ఉత్పల- | = | కలువల |
| వైజయంతీ- | = | పతాకయొక్క |
| చాతుర్యమ్ | = | నైపుణ్యమును |
| ఏతి | = | పొందుచున్నది. |

**తాత్పర్యము:-**

ముంగురులే తోరణమాలలైన మన్మథుని సామ్రాజ్యార్పణోత్సవమునం దమ్మవారి చంచలదృక్ప్రసారమే కదలుచున్న కలువల పతాకవలె ప్రకాశించు చున్నది.

**వివరణము:-**

అమ్మవారి చంచల కటాక్షమునందు మన్మథుని సామ్రాజ్యార్పణోత్సవమున బతాకధర్మమారోపింపబడుటచే పదార్థవృత్తి నిదర్శనాలంకార మున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కటాక్షము కదలుచున్న కలువల పతాకవలె నున్నదని వర్ణించిన మూకమహాకవి ఈ శ్లోకమున కటాక్షమునందు అభిసారికత్వమును ఉత్ప్రేక్షించుచున్నాడు.

**శ్లో॥ మార్గేణ మఞ్జుకచకాన్తితమోవృతేన**
**మన్దాయమానగమనా మదనాతురాసౌ।**
**కామాక్షి! దృష్టిరయతే తవ శఙ్కరాయ**
**సఙ్కేతభూమిమచిరాదభిసారికేవ॥ 49**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| మంజు- | = | అందమైన |
| కచ- | = | కురుల యొక్క |
| కాన్తి- | = | కాంతి యనెడి |
| తమః- | = | చీకటితో |

| | | |
|---|---|---|
| వృతేన | = | కూడిన; |
| మార్గేణ | = | దారిలో; |
| మన్దాయమానగమనా | = | మెల్లనగుచున్న నడక గలదై; |
| మదనాతురా | = | కామాధిక్యముచే పీడుతురాలైన; |
| అసౌ | = | ఈ; |
| తవ | = | నీ యొక్క; |
| దృష్టిః | = | చూపు; |
| శంకరాయ | = | శంకరునికొఱకై; |
| అచిరాత్ | = | వేగముగా; |
| అభిసారిక ఇవ | = | అభిసారికవలె; |
| సంకేతభూమిమ్ | = | ఏర్పఱచుకొన్న సంగమ ప్రేదశమును గూర్చి; |
| అయతే | = | పోవుచున్నది. |

**తాత్పర్యము:-**

ముంగురుల చీకటి ముసిరిన దారిలో కామాక్షి యైన అమ్మ వారి చూపు శంకరుని సంగమునకై తమోభిసారికవలె సంకేతభూమికి పోవుచున్నట్లున్నది.

**వివరణము:-**

అమ్మవారి చూపునందు తమోభిసారికత్వ ముత్ప్రేక్షింపబడుటచే నీ శ్లోకమున **నుత్ప్రేక్షాలంకారము** ఇవ శబ్దముచే వాచ్యమైయున్నది.



**అవ:-** ఈ శ్లోకము అమ్మవారి కడగంటి కాంతి శివుని కొఱకై యున్నదని ప్రతిపాదించుచున్నాడు.

**శ్లో॥ వ్రీడానువృత్తిరమణీకృతసాహచర్యా**
**శైవాలితాం గలరుచా శశిశేఖరస్య।**
**కామాక్షి! కాన్తిసరసీం త్వదపాఙ్గలక్ష్మీ-**
**ర్మన్దం సమాశ్రయతి మజ్జనఖేలనాయ॥ 50**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| వ్రీడానువృత్తిరమణీ- | = | లజ్జ యనెడి దాసిచేత |
| కృత- | = | చేయబడిన |
| సాహచర్యా | = | సహచరణము గల; |
| త్వదపాంగలక్ష్మీః | = | నీ కడగంటి లక్ష్మి; |

శశిశేఖరస్య = చంద్రావతంసుని (శివుని) యొక్క;
గలరుచా = కణ్ఠకాన్తిచేత;
శైవాలితామ్ = నాచేర్పడిన;
కాన్తిసరసీమ్ = కాన్తియనెడి సరస్సును;
మజ్జనఖేలనాయ = జలక్రీడకొఱకు;
మన్దమ్ = మెల్లగా;
సమాశ్రయతి = ఆశ్రయించుచున్నది.

**తాత్పర్యము:-**

లజ్జయను దాసితో కలసినడుచునట్టి యమ్మవారి కడగంటి కాంతి యనెడి రాణి శివుని కంఠకాన్తి యనెడి నాచుగల కాన్తి యనెడి సరస్సును, స్నానమాడి వినోదించుట కొఱకు జేరుచున్నది.

**వివరణము:-**

అమ్మవారి కటాక్షలక్ష్మి రాజ్ఞీత్వము స్ఫురింపజేయుటకై లజ్జ యందు అనుచరీత్వ మారోపింపబడినది. శివుని కంఠకాన్తి యందు శైవాలత్వము, శివుని దేహకాంతియందు సరసీత్వ మారోపింపబడినది. అందుచేత నీశ్లోకమున రూపకాతిశయోక్త్యలంకారము కలదు.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షమున కాషాయాంబరత్వము ప్రతిపాదించుచున్నాడు.

**శ్లో॥ కాషాయమంశుకమివ ప్రకటం దధానో**
**మాణిక్యకుణ్డలరుచిమ్మమతావిరోధీ।**
**శ్రుత్యన్తసీమని రతః సుతరాం చకాస్తి**
**కామాక్షి! తావకకటాక్షయతీశ్వరోఽసౌ॥ 51**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి! = ఓ కామాక్షీదేవీ!
కాషాయమ్+అంశుకమ్+ఇవ = కాషాయవస్త్రమువంటి;
మాణిక్యకుండలరుచిమ్ = మణికుండల కాంతిని;
ప్రకటమ్ = బహిరంగముగా;
దధానః = ధరించుచు;
మమతావిరోధీ = మమకారమును విరోధించు;
శ్రుత్యంతసీమని = చెవి చివఱి ప్రదేశమున (వేదాంతసీమ యందు);
రతః = ఆసక్తికల;
అసౌ = ఈ;

తావకకటాక్షయతీశ్వరః = నీ కటాక్షమను యతీశ్వరుడు;
సుతరామ్ = మిక్కిలి;
చకాస్తి = ప్రకాశించుచున్నాడు.

**తాత్పర్యము:-**

అమ్మవారి కటాక్షమను యతీశ్వరుడు మాణిక్యకుండలకాంతినే కాషాయాంబరముగా ధరించి మమకారము లేని వాడై వేదాంతసీమలో నాసక్తుడై మిక్కిలి ప్రకాశించుచున్నాడు.

**వివరణము:-**

మాణిక్యకుండలకాంతియందు కాషాయాంబరత్వము, కటాక్షమందు యతీశ్వరత్వ ముత్ప్రేక్షింపబడుటచే నీ శ్లోకమున **నుత్ప్రేక్షాలంకారమున్నది.** కాషాయాంబరము ధరించుట, మమకారమును విరోధించుట, వేదాంతము నందాసక్తివహించుట యతీశ్వర లక్షణములు. కటాక్షయతికి మాణిక్య కుండలకాంతి కాషాయాంబరమైనది. చెవి చివతి ప్రదేశమే వేదాంతసీమ యైనది. వేదాంతములనగా **ఉపనిషత్తులు.** వేదములయొక్క చివతిభాగములు లేక వేదాంతముల సిద్ధాంతములున్న భాగములు. వేదము ఋక్సామయజురథర్వ రూపము. **ఋగ్వేదమునకు, యజుర్వేదమునకు, సామవేదమునకు, అథర్వ వేదమునకు** బెక్కు శాఖలున్నవి. అవి యన్నియు వేయికి మించియున్నవి. వానిలో నేడు కొన్నియే మిగిలియున్నవి. ఒక్కొక్కశాఖ **సంహిత, బ్రాహ్మణము. ఆరణ్యకము, ఉపనిషత్తు** అను నాలుగు భాగములుగా నుండును. నేడు మిగిలి యున్న యుపనిషత్తులు రెండు వందలకు మించవు. బ్రహ్మచర్యాశ్రమమున సమగ్రముగా వేదము నభ్యసింపవలెను. గృహస్థాశ్రమమున యజ్ఞాది కర్మము లొనర్చవలెను. వానప్రస్థాశ్రమమున నుపాసనముల నొనర్పవలెను. సన్యాసాశ్రమమున లేక యత్యాశ్రమమున బ్రహ్మవిచార ముపనిషద్వాక్యముల ద్వారమున జేయవలెను. అందుకే **శ్రుత్యంతసీమనిరతః** అని చెప్పబడినది. సర్వసంగ పరిత్యాగి యగు సన్యాసికి ఎవరి యందును మమకారముండరాదు. అందుకే మమతా విరోధీ యని పేర్కొనబడినది. సన్యాసాశ్రమ బహిరంగ చిహ్నము కాషాయాంబరధారణ మని వివరింప నవసరము లేదనుకొందుము. **కాషాయ దండమాత్రేణ యతి పూజ్యో న సంశయః** (అన్ని యాశ్రమముల వారికి, కాషాయాంబర దండములు గల సన్యాసి పూజ్యుడు) అని చెప్పబడినది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి లోచనయందు కాషాయాంబరత్వమును చెప్పిన మూకమహాకవి ఈ శ్లోకము దానికుపమానములేదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ పాషాణ ఏవ హరినీలమణిర్దినేషు**
**ప్రమ్లానతాం కువలయం ప్రకటీకరోతి।**

నైమిత్తికో జలదమేచకిమా తతస్తే
కామాక్షి! శూన్యముపమానమపాఙ్గలక్ష్మ్యాః॥ 52

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| హరినీలమణిః | = | ఇంద్రనీలమణి; |
| పాషాణః ఏవ | = | రాయియే; |
| దినేషు | = | పగళ్ళయందు; |
| కువలయమ్ | = | కలువ; |
| ప్రమ్లానతామ్ | = | వాడియుండుటను; |
| ప్రకటీకరోతి | = | బయటపెట్టును; |
| జలదమేచకిమా | = | మేఘముయొక్క నలుపు; |
| నైమిత్తికః | = | (కాలము) నిమిత్తమున నేర్పడినది; |
| తతః | = | అందువలన; |
| తే | = | నీయొక్క; |
| అపాంగలక్ష్మ్యాః | = | కడగంటికాంతికి; |
| ఉపమానమ్ | = | ఉపమానము; |
| శూన్యమ్ | = | లేదు. |

**తాత్పర్యము:-**

అమ్మవారి కడగంటి కాంతికి హరినీలమణి యుపమానము కాలేదు. అది ఱాయి మాత్రమే. కలువ ఉపమానము కాజాలదు. అది పగలు ముకుళించుకొని పోవును. మేఘము కూడ ఉపమానము కాజాలదు. అది వర్షాకాలమందే నల్లగా ఉండును. అందుచే అమ్మవారి కడగంటి కాంతి కుపమానము లేదు.

**వివరణము:-**

లోకమున కంటి కింద్రనీలమణియు సమానముగా భావింపబడును. అది ఱాయి కావున దానికి దయయుండదు. అమ్మవారి కడ గన్ను దయ గలిగినది. కావున దయ యెఱుగని ఇంద్రనీలమణి దాని కుపమానము కాజాలదు. అట్లే కలువను కడకంటి కుపమానముగా జెప్పెదరు. కాని అది పగలు ముడుచుకొని యుండును. అమ్మవారి యపాంగము పగలు రాత్రి వికసించియే యుండును. కావున దానికి కలువ యుపమానము కాజాలదు. అట్లే మేఘముకూడ ఉపమానముగా కొందఱిచే భావింపబడినను అదియు అమ్మవారి యపాంగమున కుపమానము కాజాలదు. ఎందుకనగా మేఘమునకు నలుపు నైమిత్తికముగా అనగా వర్షాకాలము వచ్చినప్పుడే యేర్పడును. అమ్మవారి యపాంగమునకు నలుపు తాత్కాలిక మయినది కాదు. ఇట్లు లోకమున సమానముల బరిశీలించి నమ్మవారి

యపాంగమునకు సమానముగా నుండదగిన యోగ్యత దేనికిని లేదు. అన్నిటికి యేదో లోపమున్నది. వాస్తవమునకు ఉపమానమధిక గుణములు కలదిగా నుండవలెను. అధికత యట్లుంచి సమత్వముకూడా వానికి లేదు. కావున అమ్మవారి యపాంగమున కుపమానమే లేదని యొప్పుకొని ఉపమానాన్వేషణ మానుకొనవలెను. అమ్మవారి యపాంగమున కుపమానమే లేదని చెప్పుటచే రెండవ వస్తువేదియు అమ్మవారి యపాంగమునకు లేదని దాని కదియే సాటియని శూన్య శబ్దముచే ద్వితీయ సదృశ వ్యవచ్ఛేదము చెప్పబడుటచే నిట **ననన్వయాలంకారము** కలదు. ఇంద్రనీలమణి సువర్లోకస్థము, మేఘము భువర్లోకస్థము, కువలయము భూలోకస్థము- మూడు లోకములలో నమ్మవారి యపాంగమునకు సాటి లేదని రెండవ పాదమందలి కు(భూ) వలయ శబ్దముచే వ్యంగ్యమగుచున్నది. అమ్మవారి సువలయమను నపాంగమునకు జాలనందుననే తనను కు(చెడ్డ) వలయముగా నిందించుకొనుచున్నది. **కు** శబ్దశక్తిమూలమున లభించిన వస్తుధ్వని యిది. కువలయము (కలువ) పగలు సరే రాత్రి పూట కూడ చంద్రుడు లేనప్పుడు ప్రమ్లానమే. చంద్రుడున్నప్పుడు కూడ వృద్ధి క్షయములు కలవాడగుటచే నది చంద్రుని సంపూర్ణత లేనప్పుడు కొంత మ్లానముగానే యుండును. పగలు అది ప్రమ్లానము. రాత్రి చంద్రుని సంపూర్ణత లేనప్పుడు కొంత మ్లానము, పూర్ణిమనాడు కూడ చంద్రునకు సాఖ్యకళ లేకుండుటచే షోడశకలాపరిపూర్ణుడు కాజాలడు. అందుచే కించిన్మ్లానము గానే కువలయ ముండును. కావున నెప్పుడును కలువ అమ్మవారి యపాంగమునకు సాటి కాజాలదని ప్రమ్లాన శబ్దమందలి **ప్ర** యను ఉపసర్గము వ్యక్తమొనరించుటచే నిది ప్రశబ్దశక్తిమూల వస్తుధ్వని, వర్షాకాలమున జలదము వర్షించిన పిమ్మట జలదత్వమును, దానితో పాటు మేచకిమను కోల్పోవును. అమ్మవారి యపాంగ మెల్లప్పుడు కరుణా వర్షమును కురిపించుచు నల్లగానే యుండును. కావున మేఘము వర్షాకాలమున కూడ అమ్మవారి యపాంగమునకు సాటి రాజాలదని జలదశబ్దము వ్యక్తమొనర్చుటచే నిది జలదశబ్దశక్తిమూలధ్వని. అమ్మవారి యొక కన్ను సూర్యుడు. అతడు సువర్లోకస్థుడు. మరొక కన్ను చంద్రుడు. అతడు పితృలోకము అనబడు భువర్లోకమున నుండువాడు. సువర్లోకమున నుండు సూర్యుడు భూర్భువస్సువర్లోకములకు మూడింటికి తన కాంతితో సంతోషము కలిగించును. భువర్లోకస్థుడైన చంద్రుడు కువలయానందకరుడను పేరు గలవాడైనను భూర్భువర్లోకముల కానందము గలిగించును. భువర్లోకమున నుండు చంద్రుడు దేవతలకాహారమైన సుధకరములందు గలవాడగుటచే సువర్లోకమునకు నానందము కలిగించును. మహర్లోకస్థచంద్రుడు అమ్మవారి లలాటము నలంకరించువాడు.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షకాంతి శివుని ముఖబింబమును చుంబించుచున్నదని ప్రతిపాదించుచున్నాడు.

శ్లో॥ శృఙ్గారవిభ్రమవతీ సుతరాం సలజ్జా
నాసాగ్రమౌక్తికరుచా కృతమన్దహాసా।
శ్యామా కటాక్షసుషమా తవ యుక్తమేత-
త్కామాక్షి! చుమ్బతి దిగమ్బరవక్త్రబిమ్బమ్॥ 53

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| శృంగారవిభ్రమవతీ | = | శృంగారవిలాసములుగల; |
| సుతరామ్ | = | మిక్కిలి ; |
| సలజ్జా | = | సిగ్గుతో కూడిన; |
| నాసాగ్రమౌక్తికరుచా | = | ముక్కుకొన ముత్తెపుకాంతిచేత; |
| కృతమన్దహాసా | = | చిందించిన చిఱునవ్వుగల; |
| శ్యామా | = | నల్లనిదైన (యౌవన మధ్యస్థురాలైన); |
| తవ | = | నీ యొక్క; |
| కటాక్షసుషమా | = | కడగంటి కాంతి; |
| యుక్తమ్ | = | తగినదైన; |
| ఏతత్ | = | ఎదుటనున్న; |
| దిగమ్బరవక్త్రబిమ్బమ్ | = | దిక్కులే వస్త్రములుగా గల శివునియొక్క ముఖబిమ్బమును; |
| చుమ్బతి | = | చుమ్బించుచున్నది. |

**తాత్పర్యము:-**

శృంగారవిలాసముల నొకవైపు, సిగ్గుగా నొకవైపు ప్రదర్శించు ముక్కు కొన ముత్తెపుకాంతినే చిఱునవ్వుగా చేసికొన్న నల్లనిదై, యౌవనమధ్యస్థురాలై యున్న నీ కటాక్షకాంతి దిగంబరుడైన శివుని ముఖబింబమును చుంబించు చున్నది.

**వివరణము:-**

శృంగారవిభ్రమము ప్రౌఢయొక్క లక్షణము. అధికలజ్జ ముగ్ధా లక్షణము. ఇవి కలసి యమ్మవారి కటాక్షకాంతియనెడి స్త్రీలో నున్నవనగా నామె యౌవన మధ్యస్థురాలే కావలెను. నవ్వు పెదవిని దాటకుండుట ముగ్ధా లక్షణము. స్పష్టమైన నవ్వు ప్రౌఢ లక్షణము ముక్కుకొనముత్తెపుకాంతి చిఱునవ్వుగా నుండుటచే నా కటాక్షసుషమ యౌవనమధ్యస్థయే. శివుని ముఖమందు చూపు నిలుపుటయే. ఇట చుమ్బనము దిగమ్బరదర్శనముచే నుద్దీప్తమైన కామము కటాక్షసుషమ యను కాంత ప్రౌఢవలె, చుంబించుటకు కారణమైనదని గ్రహింపవలెను. కటాక్షసుషమయందు నాయికావ్యవహారము స్ఫురించుటచే నీ శ్లోకమున **సమాసోక్త్యలంకార** మొప్పుచున్నది.



అవ:- ఈ శ్లోకమునను అమ్మవారి చూపునకుపమానము లేదని పలుకుచున్నాడు.

శ్లో॥ నీలోత్పలేన మధుపేన చ దృష్టిపాతః
కామాక్షి! తుల్య ఇతి తే కథమామనన్తి।
శైత్యేన నిన్దతి యదన్వహమిన్దుపాదా-
న్పాథోరుహేణ యదసౌ కలహాయతే చ॥ 54

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తే | = | నీ యొక్క; |
| దృష్టిపాతః | = | చూపు; |
| నీలోత్పలేన | = | నల్లకలువతో; |
| మధుపేన | = | తుమ్మెదతోడను; |
| తుల్యః | = | సమానము; |
| ఇతి | = | అని; |
| కథమ్ | = | ఎట్లు; |
| ఆమనన్తి | = | చెప్పెదరు; |
| యత్ | = | ఏదైతే; |
| అసౌ | = | ఇది (చూపు); |
| శైత్యేన | = | చల్లదనముతో; |
| అన్వహమ్ | = | ఎల్లప్పుడు; |
| ఇన్దుపాదాన్ | = | చన్ద్ర కిరణములను; |
| నిన్దతి | = | నిందించునో; |
| యత్ | = | ఎందువలన నైతే; |
| పాథోరుహేణ | = | కమలముతో; |
| కలహాయతే చ | = | కలహించుచు గూడ నుండునో! |

తాత్పర్యము:-

అమ్మవారి చూపు చంద్రకిరణముల నిందించుటచే నల్లకలువతో సమానమని చెప్పరాదు. కమలములతో కలహించుటచే తుమ్మెదతో సమానమని చెప్పరాదు. వానితో సమానమని చెప్పుట యెట్లుకుదురును వాని కన్న గొప్పది కదా!

వివరణము:-

నీలోత్పలము చంద్రకిరణముల నవవికాసహేతువైనందున చంద్ర కిరణముల ప్రశంసించునే కాని నిందించదు. అమ్మవారి చూపు చంద్ర కిరణముల నిందించుచున్నది. కనుక నీలోత్పలముతో సమానమని చెప్పరాదు. మధుపము కమలముతో కలహింపదు.

కమలము తనకు మధువు నొసగుచున్నది. అట్లుపకారము చేయు కమలముతో మధుపము ఎట్లు కలహింపగలదు? అమ్మవారి చూపు కమలముతో సౌందర్యమున పోటీపడుచు కలహించును. కావున అమ్మవారి చూపు మధుపముతో సమానమని చెప్పరాదు. ఇట్లు నీలోత్పల మధుపములతో నైల్యహేతువున ప్రసిద్ధముగా ప్రాప్తమైన సామ్యము శ్లోకము యొక్క పూర్వోత్తరపాదములచే నిషేధింపబడినది. అమ్మవారి చూపునందు నీలోత్పలసామ్యము నిషేధింపబడుటకు కమలముతో కలహించుటను కారణముగా చెప్పుట జరిగినది. కావున నిందు ప్రతీపాలంకార మొప్పుచున్నది. ఉపమానములందు సమానత్వము నిషేధింపబడుటచే నిట నుపమాన తిరస్కారము చెప్పబడినట్లైనది. **ఉపమానతిరస్కారమే ప్రతీపాలంకార లక్షణము.**



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షము 'వర్షాకాలమేఘము'గా యుత్ప్రేక్షించుచున్నాడు.

**శ్లో॥ ఓష్ఠప్రభాపటలవిద్రుమముద్రితే తే**
**భ్రూవల్లివీచిసుభగే ముఖకాన్తిసిన్ధౌ।**
**కామాక్షి! వారిభరపూరణలమ్బమాన-**
**కాలామ్బువాహసరణిం లభతే కటాక్షః॥ 55**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తే | = | నీ యొక్క |
| ఓష్ఠ ప్రభాపటలవిద్రుమముద్రితే | = | పెదవుల కాంతుల సమూహమనెడి పగడముల చిన్నెలు కల; |
| భ్రూవల్లివీచిసుభగే | = | తీగవంటి కనుబొమలను తరంగములు గల; |
| ముఖకాన్తిసిన్ధౌ | = | ముఖము యొక్క కాంతియనెడి సముద్రము నందు; |
| కటాక్షః | = | కడగంటి చూపు; |
| వారిభర- | = | జలసమూహమును |
| పూరణ- | = | నింపుకొనుటకై |
| లమ్బమాన- | = | వ్రేలాడుచున్న |
| కాలామ్బువాహ- | = | వర్షాకాలమేఘముయొక్క |
| సరణిమ్ | = | రీతిని; |
| లభతే | = | పొందుచున్నది. |

**తాత్పర్యము:-**

పెదవులు పగడములుగా, కనుబొమలు తరంగములుగా, నొప్పు నమ్మవారి

ముఖ కాంతియనెడి సముద్రమునందు కటాక్షము నీరు నింపుకొనుటకై వ్రేలాడు వర్షాకాలమేఘమా యన్నట్లున్నది.

**వివరణము:-**

నీరు నింపు కొనుటకై వ్రేలాడు మేఘముతో నమ్మవారి కటాక్షముత్రేక్షింప బడుటచే నుత్ప్రేక్షాలంకారమున్నది. ముఖకాంతి సముద్రముగా రూపింపబడి యున్నది. తన అవయవములైన ఓష్ఠవిద్రుమములకు భ్రూతరంగములకు నారోపము కూడ నుండుటచే పై యుత్ప్రేక్షాలంకారము **సావయవరూపకాను ప్రాణితమై** యున్నది.



**అవ:-** ఈ శ్లోకమునను 'యుత్ప్రేక్ష' వాచ్యమై యున్నది.

**శ్లో॥ మన్దస్మితైర్ధవలితా మణికుణ్డలాంశు-**
**సమ్పర్కలోహితరుచిస్త్వదపాఙ్గధారా।**
**కామాక్షి! మల్లికుసుమైర్నవపల్లవైశ్చ**
**నీలోత్పలైశ్చ రచితేవ విభాతి మాలా॥ 56**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| త్వదపాంగధారా | = నీకడగంటి చూపులవరుస; |
| మన్దస్మితైః | = చిఱునవ్వులచే; |
| ధవలితా | = తెల్లనిదై; |
| మణికుండలాంశుసంపర్కలోహితరుచిః | = మణి కుండలకాంతుల సంబంధముచే నెఱ్ఱని కాంతి గలదై; |
| మల్లికుసుమైః | = మల్లెపూల చేత; |
| నవపల్లవైః చ | = క్రొత్త చిగుళ్ళ చేతను; |
| నీలోత్పలైః చ | = కలువలచేతను; |
| రచితా | = కూర్చబడిన; |
| మాలా ఇవ | = హారమువలె; |
| విభాతి | = ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

నల్లనైన అమ్మవారి క్రీగంటి చూపుల వరుస, చిఱునవ్వులచే తెల్లనిదై, మణికుండలకాంతులచే నెఱ్ఱనిదై, మల్లెలతో చిగుళ్ళతో కలువలతో కూర్చబడిన హారమో యను నట్లున్నది.

**వివరణము:-**

మందస్మితములు మల్లెలు. మణికుండలకాంతులు చిగుళ్ళు. అమ్మవారి చూపులు నల్లకలువలు అను ఆరోపము లిందు వ్యక్తములై కటాక్షధారయందు మాలాత్వోత్ప్రేక్షణ మిందు వాచ్యమై యుండుటచే రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకార మిందు శోభించుచున్నది.



**అవ:-** పూర్వ శ్లోకమున అపాంగాధార యందు మాలాత్వ ముత్ప్రేక్షింపబడినది. ఈ శ్లోకమున నపాంగమాలయందు దూర్వాత్వ ముత్ప్రేక్షింపబడుచున్నది.

**శ్లో॥ కామాక్షి! శీతలకృపారసనిర్ఝరామ్భ-**
**స్సమ్పర్కపక్ష్మలరుచిస్త్వదపాఙ్గమాలా।**
**గోభిస్సదా పురరిపోరభిలక్ష్యమాణా**
**దూర్వాకదమ్బకవిడమ్బనమాతనోతి॥ 57**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| శీతల- | = | చల్లనైన; |
| కృపారస- | = | దయారసము అనెడి; |
| నిర్ఝరాంభః | = | ప్రవాహజలము యొక్క ; |
| సంపర్క- | = | సంబంధము కల; |
| పక్ష్మల- | = | ఱెప్పలయొక్క; |
| రుచిః | = | కాంతిగల; |
| త్వదపాంగమాలా | = | నీ చూపుల వరుస; |
| పురరిపోః | = | త్రిపురములకు శత్రువైన శివునియొక్క; |
| గోభిః | = | ఇంద్రియములను గోవులచేత; |
| సదా | = | నిత్యము; |
| అభిలక్ష్యమాణా | = | చూడబడుచున్నదై; |
| దూర్వాకదమ్బకవిడమ్బనమ్ | = | గరికె కాంతియొక్క అనుకరణమును; |
| ఆతనోతి | = | చేయుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి చూపులవరుసయందు కరుణారసప్రవాహజలముచే దడిసిన ఱెప్పలకాంతి యున్నది. అందుచే శివునింద్రియము లనెడి గోవులచే గరికెగా చూడబడుచున్నట్లున్నది.

**వివరణము:-**

అమ్మవారి చూపులవరుసయందు దూర్వాకదంబకవిడంబన ముత్ప్రేక్షింప బడుటచే నీ శ్లోకమున **నుత్ప్రేక్షాలంకార** మున్నది. దూర్వ పశువులచే తినబడవలెనను నాశచే చూడబడుచుండును. అట్లే శివుని నే(త్రము (కన్ను) లను గోవులచే నాశచే చూడబడుచున్నందున నపాంగములయఁదు దూర్వోత్ప్రేక్ష ముచిత మగుచున్నది. శివుని యింద్రియములకు గోవులకు ఆరోపము శ్లేషచే స్ఫురించుచుండుటచే నీ యుత్ప్రేక్ష రూపకానుప్రాణితమగు చున్నది. పుగాధిపతికి పశువులుండుట సహజము. కాని శివుడు పురశత్రువు. కాని ఆయన యింద్రియములనే గోవులే యనుట విచిత్రము. దూర్వ సాధారణముగా ప్రవాహపు టొడ్ల యందు మొలచును. అమ్మవారి కన్నులలో కృపారసప్రవాహములున్నవి. తెప్పలు వాని కొడ్లవలె నున్నవి. వాని చివఱలలో వెంద్రుకలున్నవి. అవి గరికె పోచలవలె కృపారసాంబు బిందువులు కలిగి యున్నవి. శివుని కన్నులను గోవులు నిరంతరమా గరికెవైపు చూచుచున్నవనగా అమ్మవారి చూపులయం దాయన చూపులు లగ్నమై యున్నవను నంశము వ్యక్తమగుచున్నది.



**అవ:-** ఈ శ్లోకమున శ్రీ కామాక్షీదేవి కటాక్షమను ప్రాతఃకాలము తన హృదయ పంకజమును వికసింపజేయమని మూకమహాకవి ప్రార్థించుచున్నాడు.

**శ్లో॥ హృత్పఙ్కజమ్మమ వికాసయతు ప్రముష్ణ-**
**న్నుల్లాసముత్పలరుచేస్తమసాం నిరోద్ధా।**
**దోషానుషఙ్గజడతాం జగతాం ధునానః**
**కామాక్షి! వీక్షణవిలాసదినోదయస్తే॥** **58**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తే | = | నీ యొక్క; |
| వీక్షణవిలాసదినోదయః | = | కంటి విలాసమనెడు ప్రాతఃకాలము; |
| ఉత్పలరుచేః | = | కలువలకాంతికి; |
| ఉల్లాసమ్ | = | వికాసమును; |
| ప్రముష్ణన్ | = | దొంగిలించుచున్నది; |
| తమసామ్ | = | చీకట్లయొక్క (తమోగుణవికారములయొక్క); |
| నిరోద్ధా | = | నిరోధించునదై; |
| జగతామ్ | = | లోకములయొక్క; |
| దోషానుషంగజడతామ్ | = | దోషమునకు (రాత్రికి) సంబంధించిన జాడ్యమును; |

| | | |
|---|---|---|
| ధునానః | = | తొలగించునట్టిదై; |
| మమ | = | నా యొక్క ; |
| హృత్పఙ్కజమ్ | = | హృదయకమలమును; |
| వికాసయతు | = | వికసింపజేయు గాక. |

**తాత్పర్యము:-**

కలువల కాంతిని దొంగిలించునట్టి, తమో వికారములనెడి చీకట్లనణుచు నట్టి, దోషమనెడి రాత్రికి సంబంధించిన జాడ్యమును దొలగించునట్టి, అమ్మవారి కంటివిలాసమనెడి ప్రాతఃకాలము నా హృదయపఙ్కజమును వికసింప జేయుగాక.

**వివరణము:-**

కలువల కాంతిని మించుట నా కలువల కాంతి యుల్లాసమును దొలగించుటయే. తమో వికారముల నణచుట చీకట్లను అణచుటయే. దోషముల సంబంధమును దొలగించుట రాత్రి సంబంధమును దొంగిలించుటయే అను మూడు ఆరోపములు అవయవులైన అమ్మవారి వీక్షణవిలాసమునకు దినోదయమునకు ఆరోపముండుటచే నీ శ్లోకమున **సావయవరూపకాలంకార** మున్నది. మొదటి ఆరోపము అర్థశ్లేషము మీద, రెండవ ఆరోపము తమః శబ్దము యొక్క శ్లేషమీద, మూడవ ఆరోపము (దోష+అనుషంగ) దోషానుషంగ శబ్దము యొక్క శ్లేష మీద ఆధారపడి యున్నవి. అమ్మవారి యొక నేత్రము సూర్యుడే కావున ఆ నేత్రముయొక్క విలాసము సహజముగనే దినోదయ మగుటచే పై రూపకాలంకారముచే **స్వభావోక్త్యలంకారము** వ్యంగ్యమగు చున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చూపుయొక్క విలాసము **దినోదయము**గా రూపింపబడినది. దినోదయ శబ్దముచే తద్విరుద్ధమైన తమః ప్రరోహ స్ఫురణము జరుగుటచే నీ శ్లోకమున అమ్మవారి చూపు **తమః ప్రరోహము**గా రూపింపబడు చున్నది.

**శ్లో॥ చక్షుర్విమోహయతి చన్ద్రవిభూషణస్య**
**కామాక్షి! తావకకటాక్షతమఃప్రరోహః।**
**ప్రత్యఙ్ముఖం తు నయనం స్తిమితం మునీనాం**
**ప్రాకాశ్యమేవ నయతీతి పరం విచిత్రమ్॥** **59**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తావకకటాక్షతమఃప్రరోహః | = | నీ కడ కన్ననెడి చీకటి మొలక; |
| చన్ద్రవిభూషణస్య | = | చంద్రుని అలంకారముగా ధరించిన శివునియొక్క; |

| | | |
|---|---|---|
| చక్షుః | = | కంటిని; |
| విమోహయతి | = | మోహింపజేయుచున్నది; |
| స్తిమితమ్ | = | నిశ్చలమైన; |
| ప్రత్యఙ్ముఖమ్ | = | అంతర్ముఖమైన; |
| మునీనామ్ | = | మునులయొక్క; |
| నయనమ్ | = | కంటిని; |
| ప్రాకాశ్యమ్ ఏవ | = | వెలుగునే; |
| నయతి+ఇతి | = | పొందించుచున్నదనుట; |
| పరమ్ | = | మిక్కిలి; |
| విచిత్రమ్ | = | వింత. |

**తాత్పర్యము:-**

అమ్మవారి కడగంటి చీకటిమొలక శివుని కంటిని మోహింప జేయుచున్నను, నిశ్చలమైన అంతర్ముఖమైన మునులయొక్క కంటిని మాత్రము వెలిగించుచున్నది.

**వివరణము:-**

చీకటికి మోహింపజేయుట సహజము. కాని శివుడు చంద్రవిభూషణుడు గదా! ఆ భూషణము చీకటిని దొలగింపదా? తొలగించ గలదే. కాని అమ్మవారి చూపు మొలకగా నున్నను దాని శక్తి యధికము. చన్ద్రుడమ్మవారికంటి చీకటి మొలకగా నున్నను దానిని వారింపలేకపోయెను. శివుని కన్నొకటి సూర్యుడు మరొకటి చంద్రుడు. ఇరువురు తమోనివారణమున సమర్థులే కాని వారిరువురు కలసి యొక్కటై అనగా అమావాస్యారూపము ధరించుటచే అమ్మవారి కటాక్ష తమః ప్రరోహమును వారింప లేకపోయినారు అని చన్ద్రవిభూషణశబ్దము నయన శబ్దగతైకవచనము వ్యక్తమొనర్చుచున్నవి. రెండు కన్నులొక్కటై అమ్మవారి చూపు యొక్క సౌందర్యమునకు మోహింపు చున్నవని భావము. శివుని కంటి కమ్మవారి కటాక్ష మెదురుగా నున్నది కావున శివుడామె కటాక్షమును జూచుటకై, కనులు తెఱచి బహిర్ముఖుడు కావలెను. శివుని కన్ను తెఱవబడి యున్నను అమ్మవారి కటాక్ష తమస్సే కాన్పించుచున్నది. కాని ప్రత్యఙ్ముఖమైన మునులయొక్క మూసిన కంటి కమ్మవారు కటాక్షతమస్సు మొలకగానే యుండి దాని వెలుగునే ప్రసరింప జేయుచున్నది. అమ్మవారి కన్నులు కూడ సూర్యచంద్రులైనను జీకటిలోను నల్లని చీకటి మొలకలైనవి. ఆత్మజ్యోతిర్దర్శనభాగ్యము నమ్మవారి కటాక్ష మనుగ్రహించుచునే యున్నది. శివుని జీవునిగా చేయుట, జీవుని శివునిగా చేయుట, అమ్మవారి కటాక్షముయొక్క కృత్యములే. ఇట్లు (కటాక్ష) తమఃప్రరోహము మునుల కంటికి వెలుగును ప్రసరింపజేయుట యను విరోధము పరిహరింప బడుటచే నిందు **విరోధాభాసాలంకారమున్నది.** చన్ద్రవిభూషణుడైన శివుని కన్ను కూడ చంద్రరూపమే. చంద్రుడు తమోగర్భుడు. అమ్మవారి కటాక్షతమఃప్రరోహ సౌందర్యమును జూచి శివుని కంటిలోని తమస్సు పైకి బ్రసరించినదేమో

మోహమును బొందినది. తమ వారి జూచినప్పు డుత్సాహముతో పొంగి పోవుట విరోధి దర్శనముచే క్రుంగిపోవుటయు సహజములే. అందును లేతమనస్సులోని తమస్సుయొక్క మొలకను జూచి సజాతీయు లానంద పడకుండ నెట్లుందురు? మరియు నమ్మవారి కటాక్ష తమఃప్రరోహమును జూచి శివుని కన్ను చెదరినది. కన్ను చంచలమైనప్పుడు మోహమును పొందుట సహజము. మునుల మనస్సు కటాక్షతమఃప్రరోహమున కభిముఖముగాక ప్రత్యఙ్ముఖత్వమును స్థిమితత్వమును అనగా మూసికొనిపోయి నిశ్చలత్వమును పొందుటచే లోని పరంజ్యోతి దర్శన మిచ్చినది. అది అమ్మవారి కటాక్ష ప్రసారానుగ్రహఫలము.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చూపు తమః ప్రరోహముగా రూపింపబడుచున్నది. ఈ శ్లోకమున ఓడిపోయిన నీలోత్పలము అభయమీయమని అమ్మవారి కటాక్షమును వేడుకొనుచున్నట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ కామాక్షి! వీక్షణరుచా యుధి నిర్జితం తే**
**నీలోత్పలం నిరవశేషగతాభిమానమ్।**
**ఆగత్య తత్పరిసరం శ్రవణావతంస-**
**వ్యాజేన నూనమభయార్థనమాతనోతి॥ 60**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తే | = | నీ యొక్క; |
| వీక్షణరుచా | = | కంటికాంతితో; |
| యుధి | = | యుద్ధమునందు; |
| నిర్జితమ్ | = | ఓడింపబడిన; |
| నీలోత్పలమ్ | = | నల్ల కలువ; |
| నిరవశేషగతాభిమానమ్ | = | పూర్తిగా పోయిన అభిమానము కలదై; |
| తత్పరిసరమ్ | = | దాని (వీక్షణము యొక్క) సమీపమును; |
| ఆగత్య | = | చేరి; |
| శ్రవణావతంసవ్యాజేన | = | శ్రవణాలంకారమగునెపమున |
| నూనమ్ | = | నిశ్చయముగా; |
| అభయార్థనమ్ | = | అభయయాచనమును; |
| ఆతనోతి | = | చేయుచున్నది. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! నీ కంటి కాంతితో యుద్ధము చేసి యోడి పోయిన నీలోత్పలము అభిమానము వీడి ఆ కంటికి సమీపమునకు వచ్చి చెవి కలంకారముగా నుండి యా నెపమున దన కభయము నీయుమని వీక్షణమును నిశ్చయముగా వేడుకొనుచున్నదేమో యన్నట్లున్నది.

**వివరణము:-**

నీలోత్పలము యుద్ధమున నమ్మవారి కంటిచే నోడిపోయి యున్నదట. ఇంకను బీడింపకుండ శ్రవణావతంసరూపమున వీక్షణపరిసరమున నున్న చెవి నాశ్రయించి వీక్షణముతో తన కభయము నీయగోరినట్లు ఉత్ప్రేక్షణముండుటచే నీ శ్లోకమున **నుత్ప్రేక్షాలంకారము** "నూనమ్" అను పదముండుటచే వాచ్యమై యున్నది.



**అవ:-** ఈ శ్లోకమున శ్రీకామాక్షీదేవి కటాక్షవైచిత్రి వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ ఆశ్చర్యమమ్బ! మదనాభ్యుదయావలమ్బః**
**కామాక్షి! చఞ్చలనిరీక్షణవిభ్రమస్తే।**
**ధైర్యం విధూయ తనుతే హృది రాగబన్ధం**
**శమ్భోస్తదేవ విపరీతతయా మునీనామ్॥ 61**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| అమ్బ! | = | అమ్మా |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| మదనాభ్యుదయావలమ్బః | = | మన్మథుని (యిహపరలోకములలోని) అభివృద్ధికి ఆధారమైన; |
| తే | = | నీ యొక్క; |
| చంచలనిరీక్షణవిభ్రమః | = | చంచలమైన చూపుయొక్క విలాసము; |
| శమ్భోః | = | శివునియొక్క; |
| హృది | = | హృదయమునందు; |
| ధైర్యమ్ | = | ధీరతను; |
| విధూయ | = | తొలగించి; |
| రాగబన్ధమ్ | = | అనురాగబన్ధమును; |
| తనుతే | = | చేయుచున్నది; |
| మునీనామ్ | = | మునులయొక్క; |
| హృది | = | హృదయమునందు; |

| | |
|---|---|
| తదేవ | = దానినే (ధైర్యమును దొలగించుట రాగబన్ధమును కలిగించుట); |
| విపరీతతయా | = వ్యతిరేకముగా (ధైర్యమును గలిగించుట, రాగబన్ధమును దొలగించుట); |
| తనుతే | = చేయుచున్నది; |
| ఆశ్చర్యమ్ | = వింతగదా! |

**తాత్పర్యము :-** అమ్మవారి చంచలవీక్షణవిలాసము మన్మథుని అభివృద్ధికి ఆధారమైన శివుని హృదయమున ధైర్యము దొలగించి అనురాగమును కలిగించు చున్నను, మునుల హృదయమునందు మాత్రము ధైర్యమును గలిగించి, రాగమును దొలగించుచున్నది.

**వివరణము :-** మన్మథుడు శివుని గెలిచి ఆ లోకమున అప్రతిహతవీరుడను కీర్తిని, శివఫాలాక్షదగ్ధమైనశరీరమును మరల పొందుట అను రెండు శుభము లమ్మవారి వీక్షణవిలాసఫలములే. అవి రెండు ఇహలోకమునకు సంబంధించిన అభివృద్ధులు. అమ్మవారి పంచదశీవిద్యలలో నొకటైన కాదివిద్య-మన్మథదృష్టము. మన్మథోపాసితము. గురుపరమ్పరాలబ్ధమై నేటికి నుపాసింపబడుచున్నది. మన్మథున కమ్మవారి సారూప్య ముపాసనా కాలమందున్న దని, మన్మథుని జగద్విజయము శివవిజయముతో సహా అమ్మవారి కటాక్షనుగ్రహ లబ్ధమని శంకరులు చెప్పి యున్నారు. ఉపాసనాఫలముగా తత్క్రతున్యాయము ననుసరించి అమ్మవారి లోకమందు మన్మథునకు సారూప్యముక్తిలాభము సందేహమే కాదు. ఈ విధముగా అమ్మవారి కటాక్షము మన్మథుని యిహపరలోకములలోని యభివృద్ధిరూపమైన అభ్యుదయమునకు అవలమ్బమై యున్నది. అమ్మవారి కటాక్షవిభ్రమము శివుని హృదయమున రాగబన్ధమును, మునుల హృదయమున వైరాగ్యబన్ధమును; శివుని హృదయమున నధైర్యమును, మునుల హృదయమున ధైర్యమును; ఒకే కాలమున నొకే కటాక్షవిభ్రమమున విరుద్ధములైన రెండు కార్యముల నొనర్చుట విచిత్రము గదా. 59వ శ్లోకము వలె నీ శ్లోకముననను అమ్మవారి కటాక్ష వైచిత్రి వర్ణింపబడినది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కటాక్ష వైచిత్రి ప్రదర్శింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారు వొకింతసేపు చూచిన, వెంటనే సర్వసంపదలు కలుగునని వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ జన్తోస్సకృత్ప్రణమతో జగదీడ్యతాం చ**
**తేజస్వితాం చ నిశితాం చ మతిం సభాయామ్।**
**కామాక్షి! మాక్షికఝురీమివ వైఖరీఞ్చ**
**లక్ష్మీఞ్చ పక్ష్మలయతి క్షణ(వీ)మీక్షణం తే॥ 62**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తే | = | నీ యొక్క |
| క్షణమ్ | = | అల్పకాలపు; |
| ఈక్షణమ్ | = | చూపు; |
| సకృత్ | = | ఒకసారి; |
| ప్రణమతఃజన్తోః | = | నమస్కరించు వానికి; |
| జగదీడ్యతాం చ | = | లోకస్తుత్యతను; |
| తేజస్వితాం చ | = | ప్రకాశవత్త్వమును; |
| సభాయామ్ | = | సభయందు; |
| నిశితామ్ | = | తీక్షణమైన; |
| మతిం చ | = | బుద్ధిని; |
| మాక్షికఝరీమ్ ఇవ | = | తేనె వాక వంటి; |
| వైఖరీమ్ | = | ఇతరుల చెవులకు వినబడు వాక్కును; |
| లక్ష్మీం చ | = | సంపదను కూడ; |
| పక్ష్మలయతి | = | కలిగించుచున్నది. |

**తాత్పర్యము :-** అమ్మా! కామాక్షీదేవీ! నీకొకపరి నమస్కరించువానికి నీ వొకింత సేపు చూచిన వెంటనే జగన్నుత్యత్వము, తేజస్విత, సభారంజకమైన సూక్ష్మబుద్ధి, తేనెల గార్చు వాక్కు, నింటియందు లక్ష్మియు గలుగును.

**వివరణము :-** ఒకసారి నమస్కరించినవాని నొకపరి చూడగానే వీనికి లభించు లోకస్తుత్యత, తేజస్విత, సభారంజకములైన ప్రతిభ, తేనెలూరు ప్రసంగమును జేయుశక్తి, ఇంటియందు సంపదయు లభించుచున్న నిరంతరము పెక్కుసార్లు నమస్కరించువానిని నీ వెక్కువ సేపు దయతో చూచినవానికి లభించు సౌఖ్యముల సంగతి యేమని చెప్పవచ్చును. మూలాధారమున నున్నట్టిది పరావాగ్బీజము. ఇది పరమాత్మాభిన్నము. అది స్వాధిష్ఠానము నను చ్చూనమై (ఉబ్బి) మణిపూరము నందు ద్విదళితాంకురముగా రూపొందును. అనగా శబ్దము అర్థము అని రెండుగా చీలిన యంకురమువలె యుండి దర్శనీయమై **పశ్యంతీ** యను పేరునొందును. ఇది విషయజ్ఞానైకరూపము. ఆ తరువాత అనాహతమున దాని కనాహతమై నాదము చేరును. అప్పుడు దానికి **మధ్యమా** యను పేరు కల్గును. అయినను అది ఇతరుల చెవులకు వినబడదు. విశుద్ధమున కంఠాద్యవయవముల యాహుతిచే ఇతరుల చెవి జేరునదై **వైఖరీ** వాక్కని పిలువబడును. పరావాక్కు మన యనుభవమునకు రాకున్నను విషయజ్ఞానరూపమైన **పశ్యంతీ వాక్కు** మన యనుభవమున గోచరమగును. ఒక యర్థమున గూర్చిన జ్ఞానమున ఆ యర్థమును బోధించు శబ్దముకూడ గోచరించును. కావున పశ్యంతి, మధ్యమ, వైఖరి అను మూడు వాక్కులే మన జ్ఞానమున కందునట్టివి.

కావుననే వేరే పేరు పెట్టక పశ్యంతికి వైఖరికి మధ్య నున్న దానికి మధ్యమ వాక్కనియే పేరు పెట్టబడినది. వైఖరి యనగ చతుర్థమైన వాక్కు. ఈ చతుర్విధవాక్కు సరస్వతీ దేవియే, తదర్థములైన అర్థాదులు లక్ష్మీ రూపములు. సాధారణముగా సరస్వతి లక్ష్ములొకరికడ నుండవు. కాని యమ్మవారి కటాక్షమునకు బాత్రుడైన వానికి రెండును వశములై యుండును యని **లక్ష్మీంచ** అనుచోటి **చ**కారము తెలుపు చున్నది. ప్రణామ మనగా ఆత్మనివేదనము లేక శరణాగతి. అది యొకసారి చేసిన చాలును. **సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతమ్మమ** అని శ్రీమద్ రామాయణమున శ్రీరాముడు చెప్పినాడు. **మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే(7.14)** అని భగవద్గీతయు దీనిని పేర్కొన్నది. ప్రణామమనగా నాదేమియులేదని ఈ స్థూలసూక్ష్మకారణదేహములు నీవే యని భగవానునిపై వాని భారముంచుట, దీనినే **భరన్యాస** మనియు నందురు. **ఏకోపి కృష్ణస్య కృతః ప్రణామః దశాశ్వమేధావభృధేన తుల్యః దశాశ్వమేధీ పునరేతి జన్మ కృష్ణ ప్రణామీ న పునర్భవాయ** (ఒకసారి చేసిన ప్రణామము దశాశ్వమేధావాభృధతుల్యము. కాదు కాదు. అంతకంటెను గొప్పది. దశాశ్వమేధి పునర్జన్మ నొందును. ప్రణామి మరల జన్మనొందదు) అను శ్లోకము కూడ నిట ననుసన్ధేయము. **సకృత్ప్రణమతః**-అనుటలోని విశేషమిది. కామాక్షి మాక్షిక అనుచోట **మాక్షి** అను వర్ణములు అవ్యవధానముగా పునరావృత్తము లగుటచే **ఛేకానుప్రాస** మను శబ్దాలంకారమున్నది. క్షణమీక్షణమ్ అనుచోట క్షణ శబ్దము యొక్క పునరావృత్తి యుండుటచే **యమకాలంకారము** అను శబ్దాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి వీక్షణము సర్వసంపద్ప్రదానమని ప్రదర్శింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి కంటికాంతి 'యిది' అని తేల్చుకోలేక సందిగ్ధములో మూకమహాకవి కొట్టుమిట్టాడుట వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ కాదమ్బినీ కిమయతే న జలానుషఙ్గం**
**భృఙ్గావళీ కిమురరీకురుతే న పద్మమ్।**
**కిం వా కళిన్దతనయా సహతే న గఙ్గాం**
**కామాక్షి! నిశ్చయపదం న తవాక్షిలక్ష్మీః॥ 63**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| తవ | = నీ యొక్క |
| అక్షిలక్ష్మీః | = కంటికాంతి; |
| కాదమ్బినీ కిమ్ | = మేఘమాలయా; |

జలానుషఙ్గమ్ = నీటియొక్క సంబంధమును;
న అయతే = పొందదు;
భృఙ్గావళీ కిమ్ = తుమ్మెదల వరుసయా;
పద్మమ్ = కమలమును;
న ఉరరీకురుతే = అంగీకరించదు;
వా = లేక;
కళిన్దతనయా కిమ్ = యమునయా;
గంగామ్ = గంగను;
న సహతే = సహించదు;
నిశ్చయపదమ్ = నిశ్చయస్థానమును;
న అయతే = పొందుట లేదు.

**తాత్పర్యము:-**

అమ్మవారి కంటికాంతి మేఘమాల యనుకొందమా? మేఘమాలకు జలానుషంగమున్నది. అమ్మవారి కంటికాంతికి జలానుషంగము లేదు. లేక యది తుమ్మెదల వరుస అనుకొందమా? తుమ్మెదల వరుస పద్మము నంగీకరించును. కాని అమ్మవారి కంటికాంతి దాని నంగీకరించదు. పోని యమున యను కొందమా. యమున గంగను సహించును. అమ్మవారి కంటిచూపు గంగను సహించదు. కావున మేఘమాల యని భృంగావలియని, యమున యని నిశ్చయించలేక మూకకవి సందేహములలోనే మునుగుచున్నాడు.

**వివరణము:-**

1) మేఘమాల యని కాని, భృంగావలి యని కాని, యమున యని కాని నిశ్చయించలేక పోవుటచే నీశ్లోకమున **సందేహాలంకారమున్నది.** జలసంబంధము కలగియుండుట **కాదంబిని** యందున్నది. పద్మము నంగీకరించుట తుమ్మెద యందున్నది. గంగను సహించుట యమున యందున్నది. పై మూటిలో నే యొకటియు నమ్మవారి కంటికాంతియందు లేదు. నిజమే కాని అక్షిలక్ష్మి కుపమాన మేదైన కలదా లేదా యను సందేహము మాత్రము తప్పుట లేదు. పై యొక్కొక్క వైషమ్యము తప్ప మిగిలిన ధర్మముల విషయమున అమ్మవారి కంటి కాంతి మేఘములతో భృంగావలితో యమునతో పోలిక కలిగి యున్నదని ఆ యొక్క ధర్మము లేదని చెప్పుటచే మిగిలిన ధర్మము లుండుటచే నమ్మవారి కంటికాంతి కాదంబిని యని యొప్పుకొనవలసి వచ్చుట యొక కోటి ధర్మములు లేకపోవుటచే నొప్పుకొన నక్కఱ లేకపోవుట మరొక కోటి సమానములుగా నుండుట చే నీశ్లోకమున నొప్పుకొనవలసి యున్న సందేహాలంకారముచే వానిలోని వైషమ్యము చెప్పబడుట హేతువుగా **విశేషాలంకారము** స్ఫురించుచున్నది.

2) మూడు నకారములు ధర్మనిషేధమున కుపయోగింపబడుట ఈ స్ఫురణమునకు హేతువు.



**అవ:-** ఈ శ్లోకము అమ్మవారి చూపు చల్లనిదయ్యు, శివుని చిత్తమును మోహింపజేయుట వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ కాకోలపావకతృణీకరణేఽపి దక్షమ్**
**కామాక్షి! బాలకసుధాకరశేఖరస్య।**
**అత్యన్తశీతలతమోఽప్యనుపారతం తే**
**చిత్తం విమోహయతి చిత్రమయం కటాక్షః!! 64**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తే | = | నీ యొక్క |
| అయం కటాక్షః | = | ఈ చూపు |
| అత్యన్తశీతలతమః+అపి | = | మిక్కిలి చల్లనిదైనను |
| కాకోలపావకతృణీకరణే+అపి | = | విషాగ్నులను గడ్డిపోచగా చేయుట యందైనను |
| దక్షమ్ | = | సమర్థమైన |
| బాలకసుధాకరశేఖరస్య | = | చిన్ని చంద్రుడు శిరోభూషణముగా గల శివునియొక్క |
| చిత్తమ్ | = | మనస్సును |
| అనుపారతమ్ | = | ఎడతెగకుండ |
| విమోహయతి | = | విశేషముగా మోహింపజేయుచున్నది |
| చిత్రమ్ | = | వింత కదా! |

**తాత్పర్యము:-**

విషాగ్నులను లెక్క చేయని చిన్ని చంద్రుని శిరోభూషణముగా ధరించు శివుని చిత్తమును గూడ అమ్మవారి చూపు చల్లనిదయ్యు మోహింప జేయుట చిత్రము గదా!

**వివరణము:-**

తృణము నగ్ని దహింపగలదు. అగ్నిదాహకము. తృణము దాహ్యము. అగ్నిని తృణీకరించినది శివుని చిత్తము. అగ్నిని దాహ్యముగా జేసికొని దాహక దాహకమైనది శివుని చిత్తము. అంతకంటె ఘోరమైన విషమో, అగ్నియో శివుని చిత్తమును మోహింప జేయవలెను. కాని అమ్మవారి చూపు శీతలమును సైతము శీతలీకరింప గలది. అని అత్యన్త శీతల తమః అను పదమందలి శీతల విశేషణము "తమ" అను ప్రత్యయము వ్యంజింపజేయుచున్నవి.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షము గం(డ్రగొడ్డలిగా రూపింపబడుచున్నది.

**శ్లో॥ కార్పణ్యపూరరసవర్ధితమమ్బ! మోహ-**
**కన్దోద్గతం భవమయం విషపాదపమ్మే।**
**తుఙ్గం ఛినత్తు తుహినాద్రిసుతే భవత్యాః**
**కాఞ్చీపురేశ్వరి! కటాక్షకుఠారధారా॥** **65**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| అమ్బ! | = | అమ్మా! |
| తుహినాద్రిసుతే | = | హిమపర్వతకుమారివైన; |
| కాంచీపురేశ్వరి | = | ఓ కాంచీపురనాయికా! |
| భవత్యాః | = | నీ యొక్క; |
| కటాక్షకుఠారధారా | = | కంటికొన యనెడి గండ్ర గొడ్డలి యంచు; |
| కార్పణ్యపూరరసవర్ధితమ్ | = | అహంకార ప్రవాహము నందలి రసముచే పెరిగి; |
| మోహకన్దోద్గతమ్ | = | మోహమను దుంపనుండి మొలచిన; |
| తుంగమ్ | = | ఎత్తయిన; |
| మే | = | నా యొక్క; |
| భవమయమ్ | = | సంసారరూపమైన; |
| విషపాదపమ్ | = | విషవృక్షమును; |
| ఛినత్తు | = | ఛేదించుగాక! |

**తాత్పర్యము:-**

హిమవత్పర్వత కుమారివైన, జగదీశ్వరివైన, కాంచీపురనాయికవైన, యో కామాక్షీ దేవీ! నీ కటాక్ష మనెడి గండ్ర గొడ్డలి యంచు; మోహమనుదుంప నుండి మొలచిన, అహంకారజలముచే పెరిగిన, ఎత్తయిన నా సంసార మనెడి విషవృక్షమును ఛేదింప జేయుగాక!

**వివరణము:-**

అమ్మవారి చూపు సంసారమనెడి విషవృక్షమును ఛేదించు గండ్రగొడ్డలిగా రూపింపబడుటచే నిందు రూపకాలంకారమున్నది. ఆ విషవృక్షము మోహ మనెడి దుంపనుండి పుట్టి అహంకార మనెడి జలముచే పెరిగినదని అవయవముల రూపణ ముండటచే నిది సావయవము.



**అవ:-** పై శ్లోకమున సంసారము విష వృక్షముగా రూపింపబడినది. ఈ క్రింది శ్లోకమున నది **రోగము**గా రూపింపబడుచున్నది.

శ్లో॥ కామాక్షి! ఘోరభవరోగచికిత్సనార్థ-
మభ్యర్థ్య దేశికకటాక్షభిషక్ప్రసాదాత్।
తత్రాపి దేవి! లభతే సుకృతీ కదాచి-
దత్యన్తదుర్లభమపాఙ్గమహౌషధం తే॥ 66

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| దేవి, కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| ఘోరభవరోగచికిత్సనార్థమ్ | = | ఘోరమైన సంసారమనెడి రోగము యొక్క చికిత్సకొఱకు; |
| అభ్యర్థ్య | = | అడిగి; |
| దేశికకటాక్షభిషక్ప్రసాదాత్ | = | గురువు చూపనెడి వైద్యుని యనుగ్రహమువలన; |
| తత్ర+అపి | = | అందును; |
| కదాచిత్ | = | ఒకప్పుడు; |
| సుకృతీ | = | పుణ్యాత్ముడు; |
| అత్యన్తదుర్లభమ్ | = | మిక్కిలి దుర్లభమైన; |
| తే | = | నీ యొక్క; |
| అపాంగమహౌషధమ్ | = | కటాక్షమనెడి గొప్ప మందును; |
| లభతే | = | పొందును. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! నీ కటాక్షము ఘోరమైన సంసార మనెడి రోగమును కుదుర్చుటలో గొప్ప మందు. అది లభింప వలెనన్న ముందుగా గురువనెడి వైద్యుడు లభింపవలెను. అతడు దయతో చూచి రోగి నను(గహింపవలెను. మాటిమాటి కడిగిన పిమ్మట నా దేశికుడను వైద్యుడు నీకటాక్షమను గొప్ప మందు నొసగును. దానిని పొందుట కా రోగి బహుజన్మార్జితసుకృతము కలవాడై యుండవలెను. ఇన్ని యున్నను ఆ మందు లభించుట నియతము కాదు. ముఖ్యముగా గుర్వనుగ్రహమును పొంది యుండవలెను. అమ్మవారి కటాక్షము గురు కటాక్షాధీనము.

**వివరణము:-**

భవరోగమహౌషధముగా అమ్మవారి కటాక్షము రూపింపబడినది. గురువు వైద్యుడుగా రూపింపబడినాడు. కావున నిందు రూపకాలంకారము గలదు. గురునడుగనిదే యీ భవరోగమనే ఔషధరూపదేవీకటాక్షము నాతడీయడు. **నా పృష్టః కస్యచిద్బ్రూయాత్-** అడుగనిదే యెవనికి మోక్షోపాయము చెప్ప గూడదని పెద్దలందురు గదా! అందుకే మాటిమాటి కడుగ వలెను. **తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా। ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః(4.34)** అని భగవద్గీత జ్ఞానప్రాప్తిసాధనముగా పరిప్రశ్నను

బేర్కొన్నది. అది అభ్యర్థ్య అను పదముచే చెప్పబడినది. **బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మామ్ ప్రపద్యతే। (7.19)** అని భగవద్గీత బహుజన్మానంతరమే జ్ఞానము కలుగునని చెప్పుచున్నది. **యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః(7.3)** (జ్ఞాన ప్రయత్నముచేయు వేలకొలది మనుష్యులలో నొకానొకడు మాత్రమే జ్ఞానమును బొందగలడు) అని భగవద్గీత చెప్పుచున్నది. ఈ యంశమును **కదాచిత్** అను పదము సూచించుచున్నది. సుకృతీ అను పదము పై శ్లోకములోని కశ్చిత్ అను పదమునకు వివరణము. **అత్యన్తదుర్లభమ్** అను పదము పై శ్లోకములోని "అపి" అను పదమునకు వివరణము.



**అవ:-** పై శ్లోకమున దేశికకృప వైద్యానుగ్రహముగా రూపింపబడినది. ఈ శ్లోకమున దేశికకృపాలేశమును బొందినవారు కూడ సిద్ధిని బొందుదురని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కామాక్షి! దేశికకృపాఙ్కురమాశ్రయన్తో**
**నానాతపోనియమనాశితపాశబన్ధాః।**
**వాసాలయం తవ కటాక్షమముం మహాన్తో**
**లబ్ధ్వా సుఖం సమధియో విచరన్తి లోకే॥** **67**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| దేశికకృపాఙ్కురమ్ | = గురువుయొక్క యనుగ్రహలేశమును; |
| ఆశ్రయన్తః | = ఆశ్రయించిన; |
| నానాతపోనియమనాశితపాశబన్ధాః | = అనేక తపోనియమములచేత నశింపజేయబడిన పాశముల బన్ధములు గల; |
| మహాన్తః | = గొప్పవారు; |
| అముమ్ | = ఈ; |
| తవ | = నీ యొక్క |
| కటాక్షమ్ | = కటాక్షమును; |
| వాసాలయమ్ | = నివాసభవనమునుగా; |
| లబ్ధ్వా | = పొంది; |
| సమధియః | = సమబుద్ధి గలవారై; |
| లోకే | = లోకమునందు; |
| సుఖమ్ | = సుఖముగా; |
| విచరన్తి | = తిరిగెదరు. |

**తాత్పర్యము:-**

దేశికకృపాలేశమున నమ్మవారి కటాక్షమను నివాసభవనమును బొందిన గొప్పవారు సమబుద్ధి గలవారై సుఖముగ విహరించెదరు. ఆ భవనము లభించుటకు ముందు వారు గురుకృపాలేశము నాశ్రయించి వారుపదేశించిన తపోనియమముల ననుష్ఠించి పాశబన్ధములను దొలగించికొని యుండవలెను. అట్లు భవనము వారికి లభింపగా సమబుద్ధి గలవారై వారు లోకమున సుఖముగా విహరించెదరు.

**వివరణము:-**

సంసారవనమున భ్రమించి యలసిన వారికి నివాసభవనము కావలెను. సంసారవనమున భ్రమించుచుండగా నదృష్టవశమున లభించిన గుర్వనుగ్రహమున భ్రమించుచుండగా నదృష్టవశమున లభించిన గుర్వనుగ్రహమును బొంది వారు చెప్పిన విధముగా తపోనియమవ్రతాదుల ననుష్ఠించి తత్ఫలముగా పాశబన్ధములను నశింపజేసి కొనవలెను. అప్పుడమ్మవారి కటాక్షమను నివాసభవనము లభించును. దానిలో ప్రవేశించి సుఖముగా తిరుగుచుందురు. భవనము లభించిన వారు తిరుగుట విచరణము; భవనము లభింపక వనములో తిరుగుట భ్రమణము. మొదటిది సుఖరూపము, రెండవది దుఃఖరూపము. అమ్మవారి కటాక్షము లభించిన పిమ్మట సంసారము నందు భ్రమజనకత్వరూపవనధర్మము నశించి విశ్రాంతిజనకత్వరూపభవనధర్మము లభించుటచే వారికి లోకవిచరణము సుఖముగానే యుండును. కటాక్ష భవనమును బొంది సుఖముగా విచరించెదరు అనుమాటచేత నంతకు ముందు వారు వనమునందు భ్రమించి దుఃఖపడినారను నర్థము వ్యంగ్యమగును. వనములో కంటకవృక్షములే యధికమైనను గురుకృప యనునది దివ్యాంకురముగా చెప్పబడుటచే నది కూడ నదృష్టవశమున సంసారవనముననే లభించును. దానికై వెదకి లభింపగానే దాని నాశ్రయింపవలెనని అంకుర శబ్దముచే వ్యంగ్యమగుచున్నది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి విలోకన మహిమ ప్రతిపాదింపబడినది.

**శ్లో॥ సాకూతసంలపితసమ్భృతముగ్ధహాసం**
**వ్రీడానురాగసహచారి విలోకనం తే।**
**కామాక్షి! కామపరిపన్థిని మారవీర-**
**సామ్రాజ్యవిభ్రమదశాం ప్రకటీకరోతి॥ 68**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి! = ఓ కామాక్షీదేవీ!
సాకూత- = అభిప్రాయముతో కూడిన
సంలపిత- = మాటలతో

| | |
|---|---|
| సంభృత- | = పోగుపడిన |
| ముగ్ధ- | = అమాయకమైన |
| హాసమ్ | = నవ్వుగల; |
| వ్రీడానురాగసహచారి | = సిగ్గుతో అనురాగముతో కూడి తిరుగు; |
| తే | = నీయొక్క; |
| విలోకనమ్ | = చూపు; |
| కామపరిపన్థిని | = కామునికి శత్రువైన శివునియందు; |
| మారవీరసామ్రాజ్యవిభ్రమదశామ్ | = వీరుడైన మన్మథుని సామ్రాజ్యమునకు లోబడిన యవస్థను; |
| ప్రకటీకరోతి | = ప్రకటించుచున్నది. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! నీవు సాభిప్రాయముగ మాట్లాడునప్పుడు అప్రయత్నముగా నుబికిన నవ్వు, సిగ్గు, అనురాగము, ముప్పిరిగొన్న నీ చూపు శివునియం దేర్పడిన మన్మథవీరునిసామ్రాజ్యమునకు లోబడియున్న యవస్థను బ్రకటించుచున్నది.

**వివరణము:-**

కాముని దహించి శివుడు కామపరిపన్థి యను ప్రసిద్ధిని బడసి యుండగా శివుని జీవితమునం దమ్మవారు ప్రవేశించినది. ఆమె చూపు శివునియందు బడినదో లేదో మన్మథుడు సమ్రాట్టగుట శివున కాయనకు లోబడి యుండు నవస్థ కలిగినది. ఈ విషయమును గూడ ఆమె కన్నులలోని హాసము తెలుపుచున్నది. ఎటువంటి శివున కెటువంటి యవస్థ కలిగినదను పరిహాసమా కన్నులలో నుండి వ్యక్తమగు చున్నది. జయాపజయములు ఎవరియందును నియతముగా నుండవు గావున ఒకప్పుడు గెలిచిన శివుడే మన్మథుడు సమ్రాట్టగుట చూచి యాతనికి లోబడ వలసిన వాడైనాడు. ఇది యంతయు నమ్మవారి విలోకన మహిమ.



**అవ:-** ఈ శ్లోకము అర్ధనారీశ్వరత్వము ప్రతిపాదింపబడినది.

**శ్లో॥ కామాక్షి! విభ్రమబలైకనిధిర్విధాయ**
**భ్రూవల్లిచాపకుటిలీకృతమేవ చిత్రమ్।**
**స్వాధీనతాం తవ నినాయ శశాఙ్కమౌలే-**
**రఙ్గార్ధరాజ్యసుఖలాభమపాఙ్గవీరః॥** **69**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి! = ఓ కామాక్షీదేవీ!

| | | |
|---|---|---|
| తవ | = | నీయొక్క; |
| అపాఙ్గవీరః | = | కటాక్షవీరుడు; |
| విభ్రమబలైకనిధిః | = | విలాసబలము ముఖ్యనిధిగా గలవాడై; |
| చిత్రమ్ | = | వింతగా; |
| భ్రూవల్లిచాపకుటిలీకృతమ్+ఏవ | = | తీగవంటి కనుబొమలు వంచుటను మాత్రమే; |
| విధాయ | = | చేసి; |
| శశాఙ్కమౌలేః | = | చంద్రుదు శిరమునందుగల శివునియొక్క; |
| అంగార్ధరాజ్యసుఖలాభమ్ | = | శరీరములోని సగమను రాజ్యముయొక్క సుఖసంపాదనమును; |
| స్వాధీనతామ్ | = | స్వ (నీ యొక్క) వశమును; |
| నినాయ | = | పొందించెను. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! నీ కటాక్షవీరుడు కనుబొమ్మలను ధనుర్లతను వంచి విలాసబలము నిధిగా పొందినవాడై శివునియొక్క సగము శరీరము నందధికారమును నీకు వశ మొనర్చెను.

**వివరణము:-**

అమ్మవారికి లభించినది శివుని యంగార్ధ రాజ్యము. దానిని లభింపజేసిన వాడు అపాఙ్గవీరుడు అపాఙ్గ అనగా తొలగిన అంగము కలవాడు. అనఙ్గుడన్న మాట. అనంగుడంగార్ధ రాజ్యము నమ్మవారికి సంపాదించి పెట్టుట యను వింత ఈ శ్లోకమునందు వర్ణింపబడినదని 'చిత్రమ్' అను పదము తెలుపుచున్నది. శివుడు శశాంకమౌలి. మన్మథున కా శశాంకుడు మామ. మన్మథుని పక్షమున నుండవలసిన వాడు. ఆ శశాంకుడు శత్రువైన మన్మథుని పక్షమునకు చెందినవాడు. శివుడు శత్రుపక్షమునకు చెందిన వాని నెత్తికెక్కించుకొన్నాడు. అయినను చంద్రుదు శివునకేమియు సాయపడలేదు. చివఱకు శివుడోడింప బడినవాడు. తత్ఫలితముగా తన శరీరార్ధ రాజ్యమందధికారమును గోల్పోయినాడు. ఇప్పటికి నా శశాంకుని నెత్తిమీదనే యుంచుకొన్నాడు. ఇది వింత యని "చిత్రమ్" అను పదము తెలుపుచున్నది. శివుడమ్మ వారికి తన శరీరములోని సగమప్పగించి యోటమి నంగీకరించినాడు. అప్పుడా శశాంకు దమ్మవారి శిరమున గూడ వ్యాపించినాడు. అప్పుడాత డపాంగుడను నామాంతరముగల అనంగుని పక్షమే వహించి నట్లైనది. అయినను శివునకు శశాంకమౌలి యను యశము వీడి పోలేదు. ఇది వింత యను విషయమును "చిత్రమ్" అను పదము తెలుపుచున్నది. శశాఙ్క శబ్దము చంద్రగత కలంకితను దోషిత్వమును చెప్పుచున్నది. అట్టి వానిని నెత్తికెక్కించు కొన్నను

వాడు శత్రువుతో యుద్ధము సంభవించినప్పుడేమియు సాయము చేయలేదు. అయినను శివుడు వానిని శిరమునుండి తీసివేయలేదు. ఇది వింత యను నంశమును **"చిత్రమ్"** అను పదము తెలుపుచున్నది.



**అవ:-** అమ్మవారి కటాక్షము మహామునులకు వైరాగ్యమును ప్రకటించుటను ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ కామాఙ్కురైకనిలయస్తవ దృష్టిపాతః**
**కామాక్షి భక్తమనసాం ప్రదదాతి కామాన్।**
**రాగాన్వితః స్వయమపి ప్రకటీకరోతి**
**వైరాగ్యమేవ కథమేష మహామునీనామ్॥ 70**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| కామాఙ్కురైకనిలయః | = | కామమను మొలకకు ముఖ్య నివాసమైన; |
| తవ | = | నీ యొక్క; |
| దృష్టిపాతః | = | చూపు; |
| భక్తమనసామ్ | = | భక్తుల మనస్సులకు; |
| కామాన్ | = | కోరికలను; |
| ప్రదదాతి | = | ఇచ్చుచున్నది; |
| స్వయమ్ | = | స్వయముగా; |
| రాగాన్వితః అపి | = | రాగముతో కూడిన దైనను; |
| ఏషః | = | ఇది(దృష్టిపాతము); |
| మహామునీనామ్ | = | గొప్ప మునులకు; |
| వైరాగ్యమ్ ఏవ | = | వైరాగ్యమునే; |
| కథమ్ | = | ఎట్లు; |
| ప్రకటీకరోతి | = | ప్రకటించుచున్నది. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! నీ చూపు మన్మథునికి పుట్టిల్లు. భక్తుల మనస్సులలో బుట్టిన కోరికలన్నిటిని తీర్చుచు నుండును. అది స్వయముగా రాగముతో కూడినదే యైనను మహామునులకు వైరాగ్యమునే ప్రకటించుచున్నది.

**వివరణము:-**

అమ్మవారి చూపు పడి కామారియైన శివునియెదలో సైతము శృఙ్గార

సంబంధమైన కామము కలిగినది. భక్తుల మనస్సులలోనున్న శృఙ్గారేతరము లైన కామముల నెన్నిటినో ప్రసాదించుచున్నది. అమ్మవారి చూపున శివ విషయకమైన రాగమున్నను మహామునులకు మాత్రము వైరాగ్యమునే కల్పించు చున్నది. రాగన్వితమైనది వైరాగ్యమును కలిగించుట వింతయే, అమ్మవారి కటాక్షమహిమ అన్ని విరోధములకు నతీతమే కావున నందు **విరోధాభాసాలంకార** మున్నది. వైరాగ్యమనగా శృంగార, శృంగారేతర సర్వకామములు వీడిపోవుట. ఇట్టి స్థితి సామాన్య భక్తులలో నుండదు. సర్వసఙ్గపరిత్యాగులైన మునులలో మాత్రమే యుండును. సర్వసంగపరిత్యాగసూచకముగా తల గొరిగించుకొని యున్న సన్యాసి **ముని** యనబడును. సంకల్పములు మనస్సున మొలచు కేశములు. వానిని ఛేదించిన వాడు ముని, దానికి బహిరంగ సూచనము శిరోముండనము. శిరోముండనమను బహిరంగ చిహ్నము లేకున్నను మనస్సు నందలి సంకల్పముల త్యజించిన వాడు మునియే యగును. అట్టి మునులకు సైతము అమ్మవారి కటాక్షము వాంఛనీయమే. అది లేనిదే అద్వైత వాసనయే లభించదు. ఇక జీవైశ్వర్యైక్యవిజ్ఞానము, ముక్తిలాభము, అను నంశములు లభింపవని చెప్పనక్కఱలేదు కదా! ఈ యంశమంతయు ముని విశేషణమైన మహాశబ్దము వ్యంజింప జేయుచున్నది.



;అవ:- ఈ శ్లోకమున శివుడు 'నెమలి'గా రూపింపబడుచున్నాడు.

**శ్లో॥ కాలామ్బువాహనివహైః కలహాయతే తే**
**కామాక్షి! కాలిమమదేన సదా కటాక్షః।**
**చిత్రం తథాపి నితరామముమేవ దృష్ట్వా**
**సోత్కణ్ఠ ఏవ రమతే కిల నీలకణ్ఠః॥** **71**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి! = ఓ కామాక్షీదేవీ!
తే = నీ యొక్క;
కటాక్షః = చూపు;
సదా = ఎల్లప్పుడు;
కాలిమమదేన = నలుపుయొక్క మదముచేత;
కాలామ్బువాహనివహైః = వర్షాకాలమేఘముల గుంపులతో;
కలహాయతే = కలహించును;
తథాపి = అయినను;
అముమ్ ఏవ = దీని (కటాక్షము) నే;
దృష్ట్వా = చూచి;

| | | |
|---|---|---|
| నీలకణ్ఠః | = | నల్లని కంఠము గల శివుడను నెమ్మలి; |
| సోత్కణ్ఠః ఏవ | = | ఉత్కంఠగల వాడయియే; |
| నితరామ్ | = | ఎక్కువగా; |
| రమతే కిల | = | రమించునట; |
| చిత్రమ్ | = | వింత గదా! |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! నీ కటాక్షము వర్షాకాలమేఘమాలతో కాలిమ మదము కారణముగా కలహించుచున్నను దీనిని చూచి యుత్కంఠగల వాడయి శివుడను నెమలి రమించుచుండుట చిత్రము గదా!

**వివరణము:-**

వర్షాకాల మేఘములను చూచి యుత్కంఠ గలదై నెమలి సంతోషముతో పురివిప్పి యాడును. కావున మేఘములతో నెమలికి స్నేహమే యుండును. కాని అమ్మవారి కటాక్షము మేఘములతో కలహించుచుండును. అయినను శివుడను నెమలి మాత్రము తన మిత్రులైన కాలామ్బువాహములతో కలహించు కటాక్షమును చూచి యానందించుచునే యుండుట విచిత్రము. ఈ శ్లోకమున శివుడు నెమలిగా నీలకంఠశబ్దశ్లేషబలమున రూపింపబడినాడు. కావున నిందు **రూపకాలంకార** మున్నది. చిత్రమ్, తథాపి అను శబ్దములచే చెప్పబడిన కాలామ్బువాహములతో కలహించు కటాక్షమును చూచి యానందించుట యను విరోధము శ్లేషచే పరిహరింపబడును. కావున నిందు, విరోధాభాసాలంకార మున్నది. అది రూపకశ్లేషలచే ననుప్రాణితమై యున్నది.



**అవ:-** పై శ్లోకమున శివుడు **నెమలిగా** రూపింపబడినాడు. ఈ శ్లోకమున అమ్మవారి యపాఙ్గము **నెమలిగా** రూపింపబడుచున్నది.

**శ్లో॥ కామాక్షి! మన్మథరిపుం ప్రతి మారతాప-**
**మోహాన్ధకారజలదాగమనేన నృత్యన్।**
**దుష్కర్మకఞ్చుకికులం కబలీకరోతు**
**వ్యామిశ్రమేచకరుచిస్త్వదపాఙ్గకేకీ॥ 72**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| మన్మథరిపుమ్ ప్రతి | = | మన్మథునికి శత్రువైన శివునిగూర్చి; |
| మారతాపమోహాన్ధకారజలదాగమనేన | = | మన్మథతాపమోహాన్ధకారమనెడి మేఘముయొక్క రాకచే; |

| | | |
|---|---|---|
| నృత్యన్ | = | నర్తించుచున్న; |
| వ్యామిశ్రమేచకరుచిః | = | బాగుగా కలసిన నల్లని కాంతిగల; |
| త్వదపాఙ్గకేకీ | = | నీ కటాక్షమనెడి నెమలి; |
| దుష్కర్మకంచుకికులమ్ | = | చెడు పనులనెడి పాముల సమూహమును; |
| కబలీకరోతు | = | మ్రింగివేయుగాక. |

**తాత్పర్యము:-**

అమ్మవారి కటాక్షమనెడి నెమలి శివునిపైకి మన్మథమోహాన్ధకారమేఘము యొక్క రాకతో పురివిప్పి నాట్యము చేయుచున్నదై దుష్కర్మసర్పసమూహములను మ్రింగివేయుగాక!

**వివరణము:-**

తొలకరి మేఘముయొక్క రాకతో నంతకు ముందు బాగుగా నెండిన భూమినుండి గాలియాడక తాపము బయలు దేరును. మెల్లిగా చీకట్లు గ్రమ్ముకొనును. అట్లే శివుని పై మన్మథుడు విజయము నంద నాతనికి తాపము కలిగినది. మోహాన్ధకారము గ్రమ్ముకొన్నది. అది చూచి యమ్మవారి కటాక్షమను నెమలి సంతోషించి యాడుచున్నది అని కటాక్షమందు నెమలియొక్క యారోపము; దుష్కర్మలందు సర్పారోపమును నీ శ్లోకమున నుండుటచే నీ శ్లోకమున **రూపకాలంకార** మున్నది. నెమలి జలదాగమనమున సంతోషించి నర్తించును. కటాక్షమను నెమలి జలదాగమనమున సంతోషించి నర్తించును. కటాక్షమను నెమలి శివునకు మారతాపమోహాన్ధకారమేఘముయొక్క రాకతో నర్తించును. ఇట్లు మారతాపమోహాన్ధకారమందు జలదముయొక్క యారోపము కూడ నందుండుటచే నిది యాడునెమలియందు బహువర్ణమిశ్రితమైన నల్లని కాంతి యుండును. అట్లే అమ్మవారి కటాక్షమునందు నుండును. కటాక్షమునందు చేయబడుచున్న నెమలి యారోపణము మనస్సునందు రూఢమగుటకు వ్యామిశ్రమేచకరుచి యను సమానధర్మము సాయపడుచున్నది.



**అవ:-** పై శ్లోకమున మన్మథరిపునకు మార తాపము చెప్పబడినది. ఈ క్రింది శ్లోకమున శివుని చెప్పుటకు మన్మథరిపు శబ్దమే ప్రయోగింపబడినది.

**శ్లో॥ కామాక్షి! మన్మథరిపోరవలోకనేషు**
**కాన్తం పయోజమివ తావకమక్షిపాతమ్।**
**ప్రేమాగమో దివసవద్వికచీకరోతి**
**లజ్జాభరో రజనివన్ముకులీకరోతి॥ 73**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |

| | | |
|---|---|---|
| మన్మథరిపోః | = | మన్మథశత్రువైన శివునియొక్క; |
| అవలోకనేషు | = | చూపులయందు; |
| కాన్తమ్ | = | కాన్తి నొందిన; |
| పయోజమ్ ఇవ | = | కమలమువలె; |
| తావకమ్ | = | నీ; |
| అక్షిపాతమ్ | = | చూపును; |
| ప్రేమాగమః | = | ప్రేమయొక్క రాక; |
| దివసవద్ | = | పగలువలె; |
| వికచీకరోతి | = | వికసింపజేయుచున్నది; |
| లజ్జాభరః | = | సిగ్గుయొక్క యతిశయము; |
| రజనివత్ ముకులీకరోతి | = | రాత్రివలె సంకోచింపజేయును. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! శివుని చూపులు సోకగానే నీ కటాక్షము అందమైన కమలమువలె పగలుయొక్క ప్రేమతో వికసించుచు రాత్రివంటి లజ్జతో ముకుళించుచున్నది.

**వివరణము:-**

శివుని చూపులు సోకగానే అమ్మవారి కటాక్షము కమలమువలె ప్రేమలజ్జ ఘర్షణతో వికసించియు వికసింపక, ముకులించియు ముకులింపక అరమోడ్పుతో ప్రకాశించుచున్నది. ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షమునకు కమలము తోడి పోలిక **ఇవ** శబ్దముచే చెప్పబడుటచే **నుపమాలంకారము** వాచ్యమై యున్నది. పగలు వంటిది ప్రేమయనీ, రాత్రివంటిది సిగ్గని, అప్రసిద్ధములతో పోలిక చెప్పబడినది. సిద్ధమైన కమలముతో కటాక్షమునకు పోలిక చెప్పబడినది. కమలము పగలు వికసించుట రాత్రి ముకుళించుట కవి సమయసిద్ధములే.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షలీలావైచిత్రి పేర్కొనబడుచున్నది.

**శ్లో॥ మూకో విరిఞ్చతి పరం పురుషః కురూపః**
**కన్దర్పతి త్రిదశరాజతి కిమ్పచానః।**
**కామాక్షి! కేవలముపక్రమకాల ఏవ**
**లీలాతరఙ్గితకటాక్షరుచః క్షణం తే॥** **74**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తే | = | నీ యొక్క; |

| | | |
|---|---|---|
| లీలాతరంగితకటాక్షరుచః | = | విలాసముతో ప్రసరించిన కటాక్షకాంతియొక్క; |
| కేవలమ్ | = | ఒక; |
| ఉపక్రమకాల ఏవ | = | ఆరంభకాలమందే; |
| క్షణం | = | క్షణములో |
| మూకః | = | మూగివాడు; |
| విరించతి | = | బ్రహ్మ యగుచున్నాడు; |
| పురమ్ | = | మిక్కిలి; |
| కురూపః | = | వికృతమైన రూపముగల; |
| పరుషః | = | పురుషుడు; |
| కందర్పతి | = | మన్మథు డగుచున్నాడు; |
| కింపచానః | = | పేదవాడు; |
| త్రిదశరాజతి | = | ఇంద్రుడగుచున్నాడు. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ లీలాకటాక్షము పూర్తిగ ప్రసరింపకుండగనే, కొంచెము ప్రసరింపగానే మూగ-బ్రహ్మ, వికృతరూపుడు-మన్మథుడు, పేద-ఇంద్రుడు నగుచున్నాడు.

**వివరణము:-**

మాట్లడలేని వాడు మూగ, బ్రహ్మయో సరస్వతికి భర్త నాలుగు వేదములను నాలుగు ముఖములనుండి వెలువరించినవాడు, మాట్లాడగల వారందఱలో నెవడును బ్రహ్మను మించలేడు. అమ్మ కటాక్షము ప్రసరించుటతోడనే మూగ బ్రహ్మయగును. కురూపుడనగా కంటికి వెగటు కలిగించు రూపము కలవాడు. కందర్పుడో సౌందర్యవంతుల కుపమానభూతుడు. కురూపునియం దమ్మవారి కటాక్షము ప్రసరించుటతోడనే వాడు సౌందర్యవంతులలో నగ్రగణ్యుడైన కందర్పుడగును. కింపచనుడనగా నేడు వండుటకేమి యున్నది. అది యెక్కడెట్లు లభించునని యాలోచించుకొనుచుండువాడు. త్రిదశరాజనగా పరమైశ్వర్య వంతుడైన ఇంద్రుడు. అమ్మవారి కటాక్షము ప్రసరించుటతోడనే కింపచాను డింద్రు డగును. పై మూడు వాక్యము లమ్మవారి కటాక్షమునకు గల అఘటిత ఘటనాసామర్థ్యమును వెల్లడించుచున్నవి. కటాక్షప్రసారముయొక్క ఆరంభకాలము తోనే యనగా కారణము సమగ్రము కాకుండగానే కార్యమైనట్లు చెప్పబడుటచే నిందతిశయోక్త్యలంకార మున్నది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి 'కన్ను' కమలముగా భావించుటచే ఉత్ప్రేక్ష వాచ్యమైయున్నది.

శ్లో॥ నీలాలకా మధుకరన్తి మనోజ్ఞనాసా-
.ముక్తారుచః ప్రకటకన్దబిసాఙ్కురన్తి।
కారుణ్యమమ్బ! మకరన్దతి కామకోటి!
మన్యే తతః కమలమేవ విలోచనం తే॥ 75

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామకోటి | = | కామకోటిపీఠాధీశ్వరివైన |
| అమ్బ! | = | ఓ యమ్మా! |
| నీలాలకాః | = | నల్లని ముంగురులు; |
| మధుకరన్తి | = | తుమ్మెదలగుచున్నవి; |
| మనోజ్ఞనాసాముక్తారుచః | = | అందమైన ముక్కు ముత్తెపు కాంతులు; |
| ప్రకటకన్దబిసాఙ్కురంతి | = | స్పష్టమైన కన్దమందలి తామరతూండ్ల మొలకలగుచున్నవి; |
| కారుణ్యమ్ | = | దయ; |
| మకరన్దతి | = | మకరన్దమగుచున్నది; |
| తతః | = | అందువలన; |
| తే | = | నీ యొక్క; |
| విలోచనమ్ | = | కంటిని; |
| కమలమ్ ఏవ | = | కమలమును గానే; |
| మన్యే | = | తలచుచున్నాను. |

తాత్పర్యము:-

ఓయమ్మా! నీ కన్నుమీద వాలు ముంగురులు తుమ్మెదలుగా, ముక్కు ముత్తెపు కాంతులు కందబిసాంకురములుగా, కారుణ్యము మకరన్దముగా, భాసించుటచే నీ కన్నును కమలమును గానే తలచుచున్నాను.

వివరణము:-

అమ్మవారి కన్నును కమలమునుగా భావించుట మన్యే అను పదముచేత చెప్పబడుట చే నీ శ్లోకమునం దుత్ప్రేక్షాలంకారము వాచ్యముగా నున్నది.



అవ:- ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షము 'కామధేనువే' అని రూపింపబడుచున్నది.

శ్లో॥ ఆకాఙ్క్ష్యమాణఫలదానవిచక్షణాయాః
కామాక్షి! తావకకటాక్షకకామధేనోః।

**సమ్పర్క ఏవ కథమమ్బ! విముక్తపాశ-**
**బన్ధాః స్ఫుటం తనుభృతః పశుతాం త్యజన్తి॥ 76**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| అమ్బ | = అమ్మా! |
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| ఆకాంక్ష్యమాణఫలదానవిచక్షణాయాః | = కోరిన ఫలముల నిచ్చుటలో సమర్థురాలైన; |
| తావకకటాక్షకకామధేనోః | = నీ కటాక్షమనెడి కామధేనువుయొక్క; |
| సంపర్క ఏవ | = సంబంధమునందే; |
| స్ఫుటమ్ | = స్పష్టముగా; |
| తనుభృతః | = దేహధారులు; |
| విముక్తపాశబన్ధాః | = విడువబడిన పాశములయొక్క బన్ధములు గలవారై; |
| కథమ్ | = ఎట్లు; |
| పశుతామ్ | = పశుభావమును; |
| త్యజన్తి | = విడుచుచున్నారు. |

**తాత్పర్యము:-**

అమ్మా! కామాక్షీ దేవీ! కోరిన ఫలముల నొసగుటలో సమర్థమగుటచే నీ కటాక్షము కామధేనువే. దాని సంబంధము కలిగిన తోడనే దేహధారులు పాశబన్ధములనుండి విడివడుదురు. ఇది యెట్లు?

**వివరణము:-**

కామధేనువు కూడ పశుత్వజాతియుతమే కావున పశువే. పశువు బన్ధింపబడునే కాని బంధములనుండి యితరుల విడిపింపజాలదు. అమ్మవారి కటాక్షకామధేనువుమాత్రము తన సంపర్కము కలిగిన యందఱిని బంధముల నుండి విడిపించును. అమ్మవారి కటాక్షమను కామధేనువు పశుజాతిస్వభావ విలక్షణముగా బన్ధవిమోచన మొనరించునట్లు చెప్పబడుటచే నేర్పడిన విరోధము అమ్మవారి కటాక్షమహిమాతిశయమున **విరోధాభాసాలంకార** మొప్పుచున్నది. కటాక్షమునందు కామధేనుత్వారోపముచే నది **రూపకానుప్రాణితమైనది.**



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి చూపుల వైచిత్రి ప్రతిపాదింపబడుచున్నది.

**శ్లో॥ సంసారఘర్మపరితాపజుషాం నరాణాం**
**కామాక్షి! శీతలతరాణి తవేక్షితాని।**

చన్ద్రాతపన్తి ఘనచన్దనకర్దమన్తి
ముక్తాగుణన్తి హిమవారినిషేచనన్తి॥ 77

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| శీతలతరాణి | = మిక్కిలి చల్లనైన; |
| తవ | = నీయొక్క; |
| ఈక్షితాని | = చూపులు; |
| సంసారఘర్మపరితాపజుషామ్ | = సంసారగ్రీష్మపరితాపము నొందిన; |
| నరాణామ్ | = మనుష్యులకు; |
| చన్ద్రాతపన్తి | = వెన్నెలలగుచున్నవి; |
| ఘనచన్దనకర్దమన్తి | = గంధపు ముద్దలగుచున్నవి; |
| ముక్తాగుణన్తి | = ముత్తెముల హారములగుచున్నవి; |
| హిమవారినిషేచనన్తి | = హిమజలముయొక్క అభిషేకములగుచున్నవి. |

**తాత్పర్యము:-**

అమ్మవారి చల్లని చూపులు సంసారమను గ్రీష్మముయొక్క పరితాపముచే తపించిన మనుష్యులకు వెన్నెలలు గంధపు ముద్దలు, ముత్తెముల హారములు హిమజలాభిషేకములగుచున్నవి.

**వివరణము:-**

ఎండ కాలమున మనుష్యులు తాపముపశమింపజేసికొనుటకై వెన్నెలలను చందనచర్చలను సేవించెదరు. ముత్తెముల హారముల ధరించెదరు. మంచు వేసిన నీటి నొంటిపై జల్లుకొందురు. సంసారగ్రీష్మతాపతప్తులగువారి కమ్మవారి కటాక్షములే వెన్నెలలవలె, గంధపు బూతలవలె, ముత్తెములవలె, చల్లని నీటి జల్లులవలె, నాచరించుచున్నవని చెప్పుటచే ఉపమానముల మాలయుండుటచే నీ శ్లోకమున **మాలోపమాలంకార**మున్నది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి చూపులు శివునియందు మన్మథజ్వాలను రగుల్కొల్పుటను రంగరించుచున్నది.

శ్లో॥ ప్రేమామ్బురాశిసతతస్నపితాని చిత్రం
కామాక్షి! తావకకటాక్షనిరీక్షణాని।
సన్ధుక్షయన్తి ముహురిన్ధనరాశిరీత్యా
మారద్రుహో మనసి మన్మథచిత్రభానుమ్॥ 78

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| ప్రేమామ్బురాశిసతతస్నపితాని | = | ప్రేమ సముద్రమునందు నిరంతరము మునిగిన; |
| తావకకటాక్షనిరీక్షణాని | = | నీ కడగంటి చూపులు; |
| ముహుః | = | మాటిమాటికి; |
| ఇన్ధనరాశిరీత్యా | = | ఇన్ధన సమూహమువలె; |
| మారద్రుహః | = | మన్మథునకు ద్రోహ మొనర్చిన శివునియొక్క; |
| మనసి | = | మనస్సునందు; |
| చిత్రమ్ | = | వింతగా; |
| మన్మథచిత్రభానుమ్ | = | మన్మథాగ్నిని; |
| సంధుక్షయన్తి | = | జ్వలింపజేయుచున్నవి. |

**తాత్పర్యము :-**

అమ్మవారి కడగంటి చూపులు ప్రేమసముద్రములో మునిగియుండియు నిన్ధనరాశివలె మాటిమాటికి శివుని మనస్సునందు మన్మథాగ్నిని రగులు కొల్పుచున్నవి.

**వివరణము :-**

ప్రేమసముద్రములో మునిగిన అమ్మవారి చూపులు శివుని మన్మథాగ్ని రగులు కొల్పుట విరోధము. తడిసిన ఇంధనములు అగ్నిని రగుల్పలేవు గదా! ఈ విరోధము **చిత్రమ్** అనుపదముతో చెప్పబడి కటాక్షమహిమాతిశయముచే పరిహరింపబడుటచే నీ శ్లోకమున **విరోధాభాసాలంకారము** కలదు.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షమును దుఃఖశమనమునకై ప్రార్థింపబడుచున్నది.

**శ్లో॥ కాలాఞ్జనప్రతిభటం కమనీయకాన్త్యా**
**కన్దర్పతన్త్రకలయా కలితానుభావమ్।**
**కాఞ్చీవిహారరసికే కలుషార్తిచోరం**
**కల్లోలయస్వ మయి తే కరుణాకటాక్షమ్॥** **79**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కాంచీవిహారరసికే | = | కాంచీపట్టణమునందు విహరించుటలో రసించునో దేవీ; |
| కమనీయకాన్త్యా | = | అందమైన కాంతితో; |
| కాలాంజనప్రతిభటమ్ | = | నల్లని కాటుకకు దీటైన; |

| | | |
|---|---|---|
| కన్దర్పతంత్ర కలయా | = | అనంగతన్త్రవిద్యచేత; |
| కలితానుభవమ్ | = | పొందిన గొప్పతనముగల; |
| కలుషార్తిచోరమ్ | = | దోషముల దుఃఖముల దొంగిలించు; |
| తే | = | నీయొక్క; |
| కరుణాకటాక్షమ్ | = | దయగల చూపును; |
| మయి | = | నాయందు; |
| కల్లోలయస్వ | = | పొంగింపజేయును. |

**తాత్పర్యము :-**

ఓ దేవీ! నీ చూపు కాంతిచేతనే కాలాంజనముతో బోలియున్నది. మన్మథాగమముతో మరింత గొప్పతనము నొందియున్నది. దోషముల దుఃఖముల నపహరించు నీ కరుణాకటాక్షమును నాయందు బఱపుము.

**వివరణము :-**

అమ్మవారి కటాక్షము కరుణగల దొంగ కావుననే తన కలుషదోషముల నపహరింపగ వేడికొనుచున్నాడు. అమ్మవారి కన్ను, కాటుక అక్కఱ లేనంత నల్లని కాంతిని గలిగి యున్నది. మరొక విధముగా తాను ధరించిన కాటుకనే యోడించ గలిగి యున్నది. దొంగను దనకడకు బంపుమని కోరుట యిందలి చిత్రము.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి **లోచనవైచిత్రి** చిత్రీకరింపబడినది.

**శ్లో॥ క్రాన్తేన మన్మథమదేన విమోహ్యమాన-**
**స్వాన్తేన చూతతరుమూలగతస్య పుంసః।**
**కాన్తేన కిఞ్చిదవలోకయ లోచనస్య**
**ప్రాన్తేన మాం జనని! కాఞ్చిపురీవిభూషే!॥ 80**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కాంచిపురీవిభూషే! | = | కాంచీ పట్టణమున కలంకారమైన |
| జనని! | = | యో తల్లీ! |
| క్రాంతేన | = | విక్రమించిన; |
| మన్మథమదేన | = | కాముని మదముచే; |
| చూతతరుమూలగతస్య | = | మామిడి చెట్టు మూలమునున్న; |
| పుంసః | = | పురుషునియొక్క (ఏకామేశ్వరుని యొక్క); |
| విమోహ్యమానస్వాంతేన | = | మోహించిన మనస్సుగల; |
| కాంతేన | = | మనోహరమైన; |

లోచనస్య = కంటియొక్క;
ప్రాంతేన = కొనచేత;
మామ్ = నన్ను;
కించిత్ = కొంచెము;
అవలోకయ = చూడుము.

**తాత్పర్యము:-**

ఓ తల్లీ! నీ కంటి కొనయందు మన్మథుని మదమున్నది. అది యేకామ్రేశ్వరుని మనస్సును మోహింపజేయుచున్నది. అందమైన యా కంటికొనతో నన్ను కొంచెము చూడుము.

**వివరణము:-**

నిరంతరము భర్తనే చూచుచు నాతనినే మోహింపజేయుచున్న నీవు, బిడ్డనైన నన్ను కొంచెము సేపైన చూడుము అని, జనని అను పదముచే వ్యంగ్యమగు చున్నది. ఈ శ్లోకమున **క్రాంతేన, స్వాంతేన, కాంతేన, ప్రాంతేన** అను నాల్గు పదములు నాల్గు పాదముల మొదట నుండుటచే ఆద్యనుప్రాసమను పేరు గల శబ్దాలంకారమున్నది. శివునకు అని అనుటకు బదులుగా చూతతరుమూల గతుడైన, పురుషునకు అని అనుట చేత అనగా భంగ్యంతరముగా శివుని చెప్పుటచేత **పర్యాయోక్తాలంకార** మనుపేరు గల అర్థాలంకారమున్నది.



**అవ:-** ఈ శ్లోకము అమ్మవారి చూపు పడినవారు శివరూపము నొందుదురని ప్రతిపాదింపబడుచున్నది.

**శ్లో॥ కామాక్షి! కేఽపి సుజనాస్త్వదపాఙ్గసఙ్గే**
**కణ్ఠేన కన్దలితకాలిమసమ్ప్రదాయాః।**
**ఉత్తంసకల్పితచకోరకుటుమ్బపోషా**
**నక్తన్దివప్రసవభూనయనా భవన్తి॥ 81**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి! = ఓ కామాక్షీ దేవీ!
కే+అపి = ఎవరో;
సుజనాః = సజ్జనులు;
త్వదపాంగసంగే = నీకడగంటి చూపుల కలయికయందు;
కంఠేన = మెడతో;
కన్దలితకాలిమసంప్రదాయాః = గడ్డకట్టించిన నలుపుదనముయొక్క సంప్రదాయము

| | | |
|---|---|---|
| | | కలవారుగా; |
| కల్పిత- | = | కల్పింపబడిన |
| ఉత్తంస- | = | శిరోభూషణము (చంద్రుని) చేత |
| చకోరకుటుమ్బ- | = | చకోరకుటుమ్బములయొక్క |
| పోషాః | = | పోషణము గలవారుగా; |
| నక్తందివ- | = | రాత్రింబవళ్ళ |
| ప్రసవ- | = | పుట్టుకకు |
| భూ- | = | చోట్లు(సూర్యచంద్రులు) |
| నయనాః | = | కన్నులుగా గలవారుగా; |
| భవన్తి | = | అగుచున్నారు. |

**తాత్పర్యము :-**

అమ్మవారి చూపు పడిన పుణ్యాత్ములు సజ్జనులైన కొందఱు మాత్రమే నల్లని మెడగల వారుగా (నీలకంఠులుగ) శిరస్సున చంద్రునలంకరించు కొనువారుగా (చంద్రశేఖరులుగ) సూర్యచంద్రులు కన్నులుగా గలవారుగా (సూర్య చంద్రనేత్రులుగా) నగుదురు.

**వివరణము :-**

అమ్మవారి చూపు బడిన పుణ్యాత్ములు శివరూపమును పొందుదురనుటకు బదులుగా చంద్రశేఖరులుగా సూర్యచంద్రనేత్రులుగా నగుదురని భంగ్యంతరముగా చెప్పుటచే నీ శ్లోకమున **బర్యాయోక్తాలంకారము**న్నది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి **లోచనమహిమ** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ నీలోత్పలప్రసవకాన్తినిదర్శనేన**
**కారుణ్యవిభ్రమజుషా తవ వీక్షణేన।**
**కామాక్షి! కర్మజలధేః కలశీసుతేన**
**పాశత్రయాద్వయమమీ పరిమోచనీయాః॥** **82**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| నీలోత్పలప్రసవకాన్తినిదర్శనేన | = | నల్లగలువ పూవుయొక్క కాంతిని బ్రదర్శించు; |
| కారుణ్యవిభ్రమజుషా | = | దయయొక్క విలాసమును బొందిన; |
| కర్మజలధేః | = | కర్మయను సముద్రమునకు; |
| కలశీసుతేన | = | అగస్త్యుడైన; |

| | | |
|---|---|---|
| తవ | = | నీయొక్క; |
| వీక్షణేన | = | చూపుచేత; |
| అమీ | = | ఈ; |
| వయమ్ | = | మేము; |
| పాశత్రయాత్ | = | పాశముల మూడింటినుండి; |
| పరిమోచనీయాః | = | విడిపింపదగినవారము. |

**తాత్పర్యము:-**

నీ చూపు నల్లనికాంతిని ప్రదర్శించునది. కారుణ్యమే విలాసముగా గలిగి యున్నది. అది కర్మసముద్రము నగస్త్యునివలె త్రాగి వేయునట్టిది. అట్టి నీ చూపు మమ్ము పాశత్రయమునుండి విడిపింపవలెను తల్లీ!

**వివరణము:-**

**నీలోత్పలప్రసవకాన్తినిదర్శనేన** అను సమాసమున అన్యధర్మము నన్యత్ర యారోపించుట (నీలోత్పల కాంతిని అమ్మవారి కన్ను ప్రదర్శించుట) చే **నిదర్శనాలంకార** మున్నది. **కారుణ్యవిభ్రమజుషా** అను సమాసమున చుట్టు భక్తులు మూగియుండుటచే వారిపై గల కరుణతో నిటునటు తిరుగు, లేక కారుణ్యమును బొందిన అను నర్థాంతరములు కూడ చెప్పవచ్చును. కర్మజలధేః **కలశీసుతేన** అను సమాసములో **రూపకాలంకార**మున్నది. మూడవపాదమున రెండు కకారములు, నాల్గవపాదమున రెండు పకారములు - ఒకటవ తొమ్మిదవ అక్షరములుగా నుండుటచే దాక్షిణాత్యభాషా సంప్రదాయము ననుసరించి యతి, అలంకారికసంప్రదాయము ననుసరించి వృత్త్యనుప్రాసము అను శబ్దాలంకారమును కలవు.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి 'నేత్రరుచి' వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ అత్యన్తచఞ్చలమకృత్రిమమఞ్జనం కిం**
**ఝఙ్కారభఙ్గిరహితా కిము భృఙ్గమాలా।**
**ధూమాఙ్కురః కిము హుతాశనసఙ్గహీనః**
**కామాక్షి! నేత్రరుచినీలిమకన్దలీ తే॥ 83**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తే | = | నీయొక్క; |
| నేత్రరుచినీలిమకన్దలీ | = | కంటి కాంతియనెడి నలుపు మొలక; |
| అత్యన్తచంచలమ్ | = | మిక్కిలి చంచలమైన; |

| | | |
|---|---|---|
| అకృత్రిమమ్ | = | సహజమైన; |
| అంజనమ్ కిమ్ | = | కాటుకయా; |
| ఝుంకారభఙ్గిరహితా | = | ఝుంకారపు తీరులేని; |
| భృఙ్గమాలా కిము | = | తుమ్మెదల వరుసయా |
| హుతాశనసఙ్గహీనః | = | అగ్నిసమ్పర్కములేని; |
| ధూమాఙ్కురః కిము | = | పొగమొలకయా. |

**తాత్పర్యము :-**

అమ్మా నీ నేత్రకాంతి మిక్కిలి చంచలమైన సహజమైన కాటుకయా? ఝుంకారములేని తుమ్మెదల వరుసయా? అగ్ని సంపర్కములేని పొగ మొలకయా?

**వివరణము :-**

అంజనమునకు చాంచల్య ముండదు. భృంగమాల ఝుంకార రహితముగా నుండదు. పొగ మొలక అగ్ని సంపర్కము లేక యుండదు. అమ్మవారి నేత్రరుచి యా మూడు వస్తువులుగా నుల్లేఖింపబడుటచే **నుల్లేఖాలంకార** మీ శ్లోకమున నున్నది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షమునకు దోసిలొగ్గుట ప్రతిపాదింపబడుచున్నది.

**శ్లో॥ కామాక్షి! నిత్యమయమఞ్జలిరస్తు ముక్తి-**
**బీజాయ విభ్రమమదోదయఘూర్ణితాయ।**
**కన్దర్పదర్పపునరుద్భవసిద్ధిదాయ**
**కల్యాణదాయ తవ దేవి! దృగఞ్చలాయ॥** **84**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి!దేవి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| ముక్తిబీజాయ | = | ముక్తికి మూలమైన; |
| విభ్రమ- | = | విలాసముయొక్క |
| మద- | = | మదముయొక్క |
| ఉదయ- | = | పుట్టుకచే |
| ఘూర్ణితాయ | = | భ్రమించు |
| కన్దర్ప- | = | మన్మథుని |
| దర్ప- | = | గర్వముయొక్క |
| పునః- | = | మరల |
| ఉద్భవ- | = | పుట్టుకయును |
| సిద్ధిదాయ | = | సిద్ధిని ఇచ్చు; |

| | | |
|---|---|---|
| కల్యాణదాయ | = | శుభముల నొసగు; |
| తవ | = | నీయొక్క; |
| దృగఞ్చలాయ | = | కంటికొనకొలకు; |
| నిత్యమ్ | = | ఎల్లప్పుడు; |
| అయమ్ | = | ఈ; |
| అఞ్జలిః | = | దోసిలి; |
| అస్తు | = | అగుగాక. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ కటాక్షము విభ్రమమదముల పుట్టకచే తిరుగుచున్నది. చచ్చిన మన్మథుని గర్వమును మరల బుట్టించుచున్నది. శుభముల నిచ్చు నట్టిది. అట్టి నీ కటాక్షమునకు ఇదిగో దోసిలొగ్గు చున్నాను.

**వివరణము:-**

శివుడు మొదట కాముని చంపియు మరల కామమునకు లోబడి పార్వతిని బెండ్లాడుట, యామె కర్ధదేహమిచ్చుట, ఆమె సంగమును వీడకుండుట, కాముడు మరల పుట్టినాడనుటకు నిదర్శనములు.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షమును రక్షణకై ప్రార్థింపబడుచున్నది.

**శ్లో॥ దర్పాఙ్కురో మకరకేతనవిభ్రమాణాం**
**నిన్ద్రాఙ్కురో విదలితోత్పలచాతురీణామ్।**
**దీపాఙ్కురో భవతమిస్రకదమ్బకానాం**
**కామాక్షి! పాలయతు మాం త్వదపాఙ్గపాతః॥ 85**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| మకరకేతనవిభ్రమాణామ్ | = | మన్మథుని విలాసములయొక్క; |
| దర్పాఙ్కురః | = | గర్వపు మొలకయైన; |
| విదలితోత్పలచాతురీణామ్ | = | వికసించిన కలువల చాతుర్యముయొక్క; |
| నిన్ద్రాఙ్కురః | = | నిన్దారంభముగా నున్న; |
| భవతమిస్రకదమ్బకానామ్ | = | సంసారమనెడి చీకటిగుంపులకు; |
| దీపాఙ్కురః | = | చిన్నదీపమైన; |
| త్వదపాఙ్గపాతః | = | నీ కటాక్షము; |
| మామ్ | = | నన్ను; |
| పాలయతు | = | కాపాడుగాక! |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ కటాక్షము మన్మథ విలాసముల గర్వము. వికసించిన కలువల నైపుణ్యమునకు నింద. సంసారాన్ధకారమునకు దీపకలిక. అట్టి నీ కటాక్షము నన్ను నిరంతరము కాపాడుగాక!

**వివరణము:-**

అమ్మవారి కటాక్షమునందు అంకురత్రయారోపముండుటచే **మాలా రూపకాలంకార** మున్నది. వాని అంకుర త్రయమున మూడవ యారోపము భవమునందు తమిస్రారోపముతో సమంజసమగుచున్నందున మూడవపాదమున **పరమ్పరిత రూపకాలంకార**మున్నది.



**అవ:-** ఈ శ్లోకమున రూపకాలంకారము వాచ్యమై యున్నది.

**శ్లో॥ కైవల్యదివ్యమణిరోహణపర్వతేభ్యః**
**కారుణ్యనిర్ఝరపయఃకృతమజ్జనేభ్యః।**
**కామాక్షి! కిఙ్కరితశఙ్కరమానసేభ్యః**
**తేభ్యో నమోఽస్తు తవ వీక్షణవిభ్రమేభ్యః॥ 86**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| కైవల్యదివ్యమణిరోహణపర్వతేభ్యః | = | కైవల్యమను దివ్యమణికి రోహణ గిరులైన; |
| కారుణ్యనిర్ఝరపయఃకృతమజ్జనేభ్యః | = | దయాప్రవాహజలమున చేయబడిన; |
| కింకరితశంకరమానసేభ్యః | = | సేవకముగా చేయబడిన శివుని మనస్సుగల; |
| తేభ్యః | = | ఆ; |
| తవ | = | నీయొక్క; |
| వీక్షణవిభ్రమేభ్యః | = | చూపుల విలాసములకొఱకు; |
| నమః | = | నమస్సు; |
| అస్తు | = | అగుగాక. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ వీక్షణవిభ్రమములు కైవల్యదివ్యమణికి రోహణగిరులు, దయాప్రవాహజలమున స్నాతములైనట్టివి. శివుని మనస్సును దాసముగా నొనరించు కొన్నట్టివి. అట్టి నీ వీక్షణవిభ్రమములకు నా నమస్సగుగాక.

**వివరణము:-**

రోహణగిరి మణి జన్మస్థానము. కైవల్యమ్మణి కమ్మవారి వీక్షణ విభ్రమములు రోహణగిరులగుటచే నీ మొదటి పాదమున **రూపకాలంకారము** కలదు. రెండవ పాదమున అమ్మవారి వీక్షణవిభ్రమములు దయగలవని చెప్పుటకు దయాప్రవాహజలముగా రూపింపబడి ఆ జలమున నవి స్నానముచేసినట్లున్నవని చెప్పుటచే **నతిశయోక్త్యలంకారము, రూపకానుప్రాణితమై** యొప్పుచున్నది. స్నాన సంబంధములు చెప్పుటచే నీ యతిశయోక్తి **అసంబంధసంబంధాతి శయోక్త్యలంకార** భేదమగుచున్నది. మూడవ పాదమున శివుని మనస్సున కింకర భావారోపణ ముండుటచే రూపకాలంకారమున్నది.



**అవ:-** ఈ శ్లోకమున ప్రతీపాలంకారము వాచ్యమైయున్నది.

**శ్లో॥ అల్పీయ ఏవ నవముత్పలమమ్బ! హీనా**
**మీనస్య వా సరణిరమ్బురుహాం చ కిం వా।**
**దూరే మృగీ తదసమఞ్జసమఞ్జనం చ**
**కామాక్షి! వీక్షణరుచౌ తవ తర్కయామః॥ 87**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| అమ్బ | = | అమ్మా! |
| తవ | = | నీయొక్క; |
| వీక్షణరుచౌ | = | కంటి కాంతియందు; |
| నవమ్ | = | కొత్తదైన; |
| ఉత్పలమ్ | = | కలువయైనను; |
| అల్పీయ ఏవ | = | మిక్కిలి తక్కువయే; |
| అమ్బురుహాం చ | = | కమలములయొక్కయు; |
| మీనస్య చ | = | చేపయొక్కయు; |
| సరణిః వా | = | తీరైనను |
| హీనా | = | తక్కువదే |
| కిమ్ వా | = | మరియు |
| మృగీ | = | లేడి యైనను |
| దూరే | = | దూరమందున్నదే |
| తత్ | = | ఆ |
| అఞ్జనఞ్చ | = | కాటుకయు |

అసమఞ్జసమ్ = సమఞ్జసముగా నుండదు అని
తర్కయామః = ఊహించుచున్నాను.

**తాత్పర్యము:-**

అమ్మవారి కంటి కాంతిలో కొత్త కలువయు చిన్నదైపోవును. చేపయు తక్కువదైపోవును. లేడియో దూరమందున్నదియే యగును. ఆ కాటుకయు నయోగ్యముగానే కన్పడునని యూహించుచున్నాను.

**వివరణము:-**

నవోత్పలమందు అల్పీయస్త్వము. చేపయందు కమలములయందును హీనత్వము, లేడియందు దూరస్థత్వము, కాటుకయందు నసమంజసత్వము ఊహించుచున్నామని ఉపమాననింద చెప్పబడుటచే నీ శ్లోకమున **ప్రతీపాలంకార** మొప్పుచున్నది.



**అవ:-** ఈ శ్లోకమున శివుని యురము వాకిలిగా రూపింపబడినది.

**శ్లో॥ మిశ్రీభవద్గరలపఙ్కిలశాఙ్కరోర-**
**స్సీమాఙ్గణే కిమపి రిఙ్ఖణమాదధానః।**
**హేలావధూతలలితశ్రవణోత్పలో௨సౌ**
**కామాక్షి! బాల ఇవ రాజతి తే కటాక్షః॥ 88**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి! = ఓ కామాక్షీ దేవీ!
అసౌ = ఈ ;
తే = నీయొక్క;
కటాక్షః = చూపు;
మిశ్రీభవత్- = కలసిపోవుచున్న;
గరల- = విషముయొక్క
పఙ్కిల- = బురదయైన
శాఙ్కర- = శివునకు సంబంధించిన
ఉరస్సీమాఙ్గణే = వక్షఃప్రదేశపు వాకిట;
రిఙ్ఖణమాదధానః = అంబాడుట లేక దోగాటను చేయుచున్న;
హేలా = విలాసముగా;
అవధూత- = విదల్చిన
లలిత- = అందమైన

| | | |
|---|---|---|
| శ్రవణ- | = | చెవియందలి |
| ఉత్పలః | = | కలువగలవాడై; |
| బాలః ఇవ | = | బాలుని వలె; |
| రాజతి | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ చూపు విషపుకాంతిచే బురదయైన శివుని వక్షోదేహమున చెవియందలి కలువను విదల్చుచు బాలునివలె దోగాడుచున్నది.

**వివరణము:-**

పిల్లలు వాకిటిలోని బురదమట్టిలో నాడు కొందురు. చెవికున్న యలంకారమును చేతితో కదలించుకొనుచుందురు. అమ్మవారి కటాక్షబాలకుడు శివుని రొమ్మున దోగాడుచు చెవి కలువను విదలించుచున్నాడని యుత్ప్రేక్షించుట వలన నీ శ్లోకమున **నుత్ప్రేక్షాలంకారము** కలదు. అమ్మవారి చూపు ఉత్పలమును మించి నల్లగా నున్నదని చెప్పుటకు చెవియందలి యుత్పలమును విదల్చుచున్నదని చెప్పుటచే ఉపమాననింద వ్యక్తమగుచుండుటచే **ప్రతీపాలంకారము** మూడవ పాదమున స్ఫురించుచున్నది. శివుని యురము తెల్లనిది. కంఠము నల్లనిది. విషముచే కంఠము నల్లనైనది. ఆ నల్లని కాంతి యురమున వ్యాపించి యున్నది. తెల్లనికాంతి నీరుగా, నలుపును మట్టిగా, భావించినప్పుడు నీటితో కలసిన బురదగా శివుని యురమను వాకిట దోచును. శివుని యురము వాకిలిగా రూపింపబడుటచే నిట **రూపకాలంకార**మున్నది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి చూపునందు వసంతలక్ష్మీత్వారోపమున ప్రతిపాదింపబడినది.

**శ్లో॥ ప్రౌఢీకరోతి విదుషాం నవసూక్తిధాటీ-**
**చూతాటవీషు బుధకోకిలలాల్యమానమ్।**
**మాధ్వీరసమ్ పరిమలం చ నిరర్గలం తే**
**కామాక్షి! వీక్షణవిలాసవసన్తలక్ష్మీః॥** **89**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| తే | = | నీయొక్క |
| వీక్షణవిలాసవసంతలక్ష్మీః | = | కంటియొక్క విలాసమనెడి వసంతముయొక్క సంపత్తి; |
| విదుషామ్ | = | విద్వాంసులయొక్క |
| నవ- | = | క్రొత్తవైన |

| | | |
|---|---|---|
| సు- | = | మంచి |
| ఉక్తి- | = | మాటలయొక్క |
| ధాటీ- | = | వేగములనెడి |
| చూతాటవీషు | = | మామిళ్ళ వనములందు; |
| బుధకోకిలలాల్యమానమ్ | = | పండితులనెడి కోకిలలచే ఆస్వాదింపబడు; |
| మాధ్వీరసమ్ | = | తేనెను; |
| నిరర్గలమ్ | = | అడ్డులేని; |
| పరిమలమ్ చ | = | వాసనను; |
| ప్రౌఢీకరోతి | = | అధికముగా నందించుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ చూపు వసంతలక్ష్మి. అది పండితవాగ్వనములందు బండితులనెడి కోకిలలచే నాస్వాదింపదగిన తేనెను వాసనను బుష్కలముగా నందించుచున్నది. అమ్మవారి దయగల చూపులెవరిపై ప్రసరించునో వారు రసవంతమైన ఆమోదభరితమైన కవిత్వమును జెప్పి పండితుల నానందింప జేయుదురు.

**వివరణము:-**

పండితుల సూక్తులందు చూతాటవీత్వారోపము, బుధులయందు కోకిలత్వారోపము, అమ్మవారి చూపునందు వసంతలక్ష్మీత్వారోపమును చేయబడుటచే నీ శ్లోకమున **రూపకాలంకారము** గలదు. వసంతర్తువున బూవులు బాగుగా పూచి వానియందు మకరందము పుట్టును. తేనెటీగలు దాని నొకచోట చేర్చి తేనె పట్టులను సిద్ధము చేయును. మామిడి పూవులలోని వాసనను తేనెను ఆస్వాదించుచు కోకిల లానందించును. ఇతరములైన చెట్లు గూడ పూచి తేనెను, మంచి పరిమళము నందించును. ఇట్టి పరిస్థితులలో ముగ్ధల కన్నులలో సైతము విలాసము లుదయించును. ప్రౌఢత్వమును బ్రకటించుచుందురు. అట్టి తతి యువతులు పరిమళము వ్యాపింపజేయుచుందురు. వారి పెదవులలో తేనె లూరుచుండును. యౌవనమదముచే వారు ప్రియుల సమక్షమున సహజమైన లజ్జను కొంత విడచి ప్రౌఢత్వమునే ప్రదర్శించుచు తమకు తామై వారి నానందింపజేయుదురు. ఈ వస్తువంతయు నీ శ్లోకమున వ్యంగ్యమగుటచే నట **అర్థశక్తిమూలవస్తుధ్వని** యున్నది.



**అవ:-** ఈ శ్లోకమున ప్రతీపాలంకారము వాచ్యమైయున్నది.

**శ్లో॥ కూలఙ్కషం వితనుతే కరుణామ్బువర్షి**
**సారస్వతం సుకృతినస్సులభం ప్రవాహమ్।**

**తుచ్ఛీకరోతి యమునామ్బుతరఙ్గభఙ్గీం**
**కామాక్షి! కిం తవ కటాక్షమహామ్బువాహః॥ 90**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీ దేవీ! |
| కరుణామ్బువర్షీ | = దయాజలమును వర్షించునట్టి; |
| తవ | = నీ యొక్క; |
| కటాక్షమహామ్బువాహః | = చూపనెడి గొప్ప మేఘము; |
| సారస్వతమ్ | = భాషకు సంబంధించిన; |
| కూలంకషమ్ | = ఒడ్డనొఱయు; |
| ప్రవాహమ్ | = ప్రవాహమును; |
| సుకృతినః | = పుణ్యాత్మునకు; |
| సులభమ్ | = సుఖముగా లభించు దానినిగా; |
| వితనుతే | = చేయుచున్నది; |
| యమునామ్బుతరంగభంగీమ్ | = యమునానదీజలతరంగముల తీరును; |
| తుచ్ఛీకరోతి కిమ్ | = అల్పమునుగా నొనరించుచున్నదా యేమి? |

**తాత్పర్యము:-**

నీ కటాక్షము దయాజలమును వర్షించుటచే మేఘమే యగుచున్నది. అది పుణ్యాత్మునికి కూలంకషసారస్వతప్రవాహమును సులభ మొనరించుచున్నది. యమునానదీ తరఙ్గముల తీరు నవమానించుచున్నదో యను నట్లున్నది. **వివరణము:-**

మేఘము జలమును వర్షించును. అమ్మవారి చూపు దయను వర్షించును అని దయాజలములకు, కటాక్షమేఘముల కభేదమును చెప్పుటచే నిచట రూపకాలంకార మున్నది. ఇంతే కాదు పుణ్యాత్ముని కా చూపు మేఘము. కూలంకషమైన సారస్వత ప్రవాహమును సులభ మొనర్చు ననుటచే భాషయందు నద్యారోపణము వ్యక్తమగుచున్నది. యమునామ్బుతరంగభంగి నవమానించు ననుటచే అమ్మవారి చూపు నందలి నీలిమాతిశయము వ్యక్తమగుచున్నది. ఉపమానముకాదగిన యమునానదీతరంగభంగి నవమానించుననుటచే నుపమాననింద యుండుటచే నుత్తరార్థమున ప్రతీపాలంకార మొప్పుచున్నది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి లోచన ఇంద్రనీల మణిగా ప్రతిపాదింపబడినది.

**శ్లో॥ జాగర్తి దేవి! కరుణాశుకసున్దరీ తే**
**తాటఙ్కరత్నరుచిదాడిమఖణ్డశోభే।**

కామాక్షి! నిర్భరకటాక్షమరీచిపుఞ్జ-
మాహేన్ద్రనీలమణిపఞ్జరమధ్యభాగే॥ 91

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! దేవి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| తే | = | నీయొక్క; |
| కటాక్ష- | = | చూపుయొక్క |
| మరీచి- | = | కిరణముయొక్క |
| పుఞ్జ- | = | సమూహమనెడి |
| మాహేన్ద్ర నీలమణి- | = | ఇంద్రనీలమణినిర్మితమైన |
| పఞ్జర- | = | పంజరముయొక్క |
| మధ్యభాగే | = | నడిమి ప్రదేశమున; |
| తాటఙ్క- | = | కమ్మలయందలి |
| రత్న- | = | రత్నములయొక్క |
| రుచి- | = | కాంతి యనెడి |
| దాడిమ- | = | దానిమ్మపండుయొక్క |
| ఖణ్డ- | = | ముక్కయొక్క |
| శోభే- | = | కాంతిగల; |
| కరుణాశుకసున్దరీ | = | దయయను యాడు చిలుక; |
| జాగర్తి | = | మేలుకొని యున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ కటాక్షకాంతి సమూహమొక యింద్రనీలమణి నిర్మిత పంజరము. అందులో కమ్మల కాంతి యను దానిమ్మపండుముక్క శోభించుచున్నది. ఆ పఞ్జరమున దయయను నాడుచిలుక మేలుకొనియున్నది.

**వివరణము:-**

కటాక్షమరీచిపుంజము మహేన్ద్రనీలమణినిర్మితపంజరముగా అందలి కమ్మల కాంతి దానిమ్మపండుయొక్క ముక్కగా, అందున్న కరుణ శుకసుందరిగా రూపింపబడుటచే నిందు **రూపకాలంకార**మున్నది. పంజరమున శుకము బంధించుట, దాని కాహారముగా దానిమ్మ పండు ముక్క నుంచుట లోకసిద్ధములే. కాని దానియందు చిలుక కొంత కాలము మేలుకొని, కొంత కాలము నిద్రించి యుండును. దయ అమ్మవారి కటాక్షకాంతియను పంజరమందు నిరంతరము మేల్కొని యుండు నాడుచిలుక భక్తుల కెప్పుడే యవసరము వచ్చునో వారికే యాపద మూడునో యని మేలుకొని యుండి వారి యావశ్యకతను దీర్చుచు వారి నాపదలనుండి రక్షించుచున్నది-యని **జాగర్తి** యను శబ్దము వ్యంజింపజేయు

చున్నది. మగవారి కన్న నాడువారియందు దయ యెక్కువగా నుండును. కావున నిట **శుకసున్దరి** యను శబ్దముచేత నా దయ మిక్కిలి గొప్పదని వ్యంజింపజేయ బడినది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి చూపులకు వక్రత యేర్పడినదా యేమి? అని శంకించుట ప్రతిపాదింపబడినది.

**శ్లో॥ కామాక్షి! సత్కువలయస్య సగోత్రభావా-**
**దాక్రామతి శ్రుతిమసౌ తవ దృష్టిపాతః।**
**కిం చ స్ఫుటం కుటిలతాం ప్రకటీకరోతి**
**భ్రూవల్లరీపరిచితస్య ఫలం కిమేతత్॥ 92**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| తవ | = | నీ యొక్క; |
| అసౌ | = | ఈ; |
| దృష్టిపాతః | = | కటాక్షము; |
| సత్కువలయస్య | = | మంచికలువయొక్క; |
| సగోత్రభావాత్ | = | సోదరభావమువలన; |
| శ్రుతిమ్ | = | చెవిని (వేదమును); |
| ఆక్రామతి | = | ఆక్రమించుచున్నది. |
| కిమ్ చ | = | మరియు; |
| స్ఫుటమ్ | = | స్పష్టముగా; |
| కుటిలతామ్ | = | వక్రతను (కపటమును); |
| ప్రకటోకరోతి | = | ప్రకటన చేయుచున్నది; |
| ఏతత్ | = | ఇది; |
| భ్రూవల్లరీపరిచితస్య | = | తీగవంటి కనుబొనుల పరిచయమునకు, |
| ఫలమ్ కిమ్ | = | ఫలమా యేమి? |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ చెవిపై నల్లకలువ యలంకరింపబడియున్నది. అది చూచి నీ చూపు కూడ చెవి నాక్రమించుచున్నది. కువలయమునకు చూపునకు సామ్యమే. సగోత్రభావము శ్రుత్యతిక్రమణమువలననే నీ చూపు కుటిలతను గూడ ప్రకటించుచున్నది. కనుబొమలు తీగలవలె వంకలు తిరిగి యుండుటచే నా కనుబొమ్మల పరిచయమువలన చూపులకునూ వక్రత యేర్పడినదా యేమి?

వివరణము:-

చెవిపై నలంకరించుకొనబడిన కలువ కొంచెము వంకరగానే యుండును. అట్లు వక్రముగా చేయకున్నచో చెవిపై నది నిలువజాలదు. ఎట్లైన నేమి కువలయము మంచిదే యైనను దానికి వక్రతయే యేర్పడినది. యని సత్ అను శబ్దము వ్యంజింపజేయుచున్నది. చూపును కలువతో బోల్చుట కవిసమయ సిద్ధమే. పోలికయే యిట కువలయ కటాక్షముల సగోత్రభావకల్పనకు మూలము. సామ్యమున్నచోట సోదరభావము నూహించుకొనుట లోకసహజము. అన్న దమ్ముల పోలిక లోకసహజము. పైగా అన్నను దమ్ముడనుకరించుచునే యుండును. కలువయొక్క శ్రుత్యతిక్రమణమును (చెవి నాక్రమించుకొని యుండుటను) చూచి చూపును (శ్రుతిని, చెవిని) ఆక్రమించుచున్నదా యేమి? యని చూపునందు సహజసిద్ధమైన చెవిదాక వ్యాపించుటను శ్రుత్యతిక్రమణముగా నుత్ప్రేక్షించుటచే పూర్వార్థమున నుత్ప్రేక్షాలంకారమున్నది. శ్రుత్యతిక్రమణము చేయువారికి కుటిలత యబ్బును. అమ్మవారి చూపునకు గూడ శ్రుత్యతిక్రమణము చేతనే కుటిలత యబ్బినదా? కనుబొమ్మల కుటిలత చూపుల కుటిలతకన్న మిక్కిలి స్పష్టము కావున భ్రూవల్లరితో పరిచయము చేయుటచేతనే కనుబొమ్మల వక్రత నీ చూపున కబ్బినదా యేమి యని కనుబొమ్మల పరిచయమునకు ఫలముగా నేర్పడకున్నను చూపులోని వక్రత కది పరిచయహేతువుగా నుత్ప్రేక్షించుటచే నుత్తరార్థమున హేతూత్ప్రేక్షాలంకారమున్నది.



అవ:- ఈ శ్లోకమున అమ్మవారి చూపులు శివునియెడ మన్మథబాణపరంపరగా వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ ఏషా తవాక్షిసుషమా విషమాయుధస్య**
**నారాచవర్షలహరీ నగరాజకన్యే।**
**శఙ్కే కరోతి శతధా హృది ధైర్యముద్రాం**
**శ్రీకామకోటి! యదసౌ శిశిరాంశుమౌలేః॥ 93**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| నగరాజకన్యే | = | పర్వతరాజకుమారివైన |
| శ్రీకామకోటి! | = | ఓ కామకోటిపీఠాధీశ్వరీ! |
| తవ | = | నీయొక్క; |
| ఏషా | = | ఈ; |
| అక్షిసుషమా | = | కంటికాంతి; |
| విషమాయుధస్య | = | మన్మథునియొక్క; |

| | | |
|---|---|---|
| నారాచవర్షలహరీ | = | బాణవర్షముయొక్క పొంగు; |
| యత్ | = | ఎందువలననగా; |
| అసౌ | = | ఇది (కంటికాంతి); |
| శిశిరాంశుమౌలేః | = | చంద్రుడు శిరమందు గల శివునియొక్క; |
| హృది | = | మనస్సునందలి; |
| ధైర్యముద్రామ్ | = | ధైర్యలక్షణమును; |
| శతధా | = | నూరు ముక్కలుగా; |
| కరోతి | = | చేయుచున్నదేమో యని; |
| శఙ్కే | = | అనుకొనుచున్నాను. |

**తాత్పర్యము:-**

హిమవత్పర్వతసుతవైన యో కామాక్షీ దేవీ! నీ యక్షికాంతి మన్మథుని బాణ వర్షముగా తలపోయుదును. ఏలననగా నది శివుని మనస్సులోని ధైర్యమును నూరు ముక్కలు చేయుచున్నది.

**వివరణము:-**

శివుని ధైర్య మాతని మనస్సులో నున్నది. బాణములు శరీరములోని బయటి భాగమునే గాయపఱచగలవు. ఒక్క మన్మథుని బాణములే మనస్సును గాయ పఱచగలవు. అందువలననే నీ కంటికాంతి మన్మథబాణవర్షముగా తలపోయు చున్నాను అని అమ్మవారి కంటి కాంతియందు మన్మథబాణవర్షలహరీత్వ ముత్ప్రేక్షింపబడుటచే నిందు త్ప్రేక్షాలంకార మొప్పుచున్నది. శివుడు విషమాంబకుడు. అనగా బేసి కన్నులు గలవాడు. మన్మథుడు విషమాయుధుడు. మన్మథుని బాణము లైదు. కావున నాతడు బేసి యాయుధములు కలవాడు. సములకే కలహము శోభిల్లును. కాన శివునితో మన్మథుడు తలపడినాడు. అయినను మూడు కన్న ఐదు పెద్ద సంఖ్య కావున మన్మథుని బలము గొప్పది. కావుననే శివుని యెదలోపలి ధైర్యమును నూరుముక్కలు చేయగలిగినాడని **విషమాయుధ శబ్దము** వ్యంజింపజేయుచున్నది. ఆరంభమున మన్మథుడు శివునితో తలపడినను ఎదలో కలవరమారంభమైనను తన యెదలో నెట్టి వికారము కలుగనట్లు గాంభీర్యమును జూపుచు తాను మన్మథుని బాణములకు కలవరపడలేదని సూచించుచుండెను. కాని పాపమా శివుడెంత కాలము మన్మథుని నారాచవర్షలహరి కోర్వగలడు. ఒకటా, రెండా, ఆ ఐదు బాణములనే మరల మరల వర్షమువోలె కురిపించెను. శివుని ధైర్యము నూరు ముక్కలయ్యెను. అమ్మవారి కోడి తన శరీరములోని సగభాగమునే యర్పించుకొని సంధి చేసికొనెను. ఇంతకు మన్మథుని యా ఐదు బాణములలో అమ్మవారి కంటికాంతితో నభేదము పొందియే మన్మథుడు విజయము నొందెను అని అమ్మవారి కంటి కాంతియందు మన్మథుడు విజయము నొందెను అని అమ్మవారి కంటి కాంతి యందు

మన్మథునారాచవర్షలహర్యుత్ప్రేక్షణము వ్యంజింపజేయుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి కంటికాంతి మన్మథనారాచవర్షలహరిగా నుత్ప్రేక్షింప బడినది. ఈక్రింది శ్లోకమున అమ్మవారి కటాక్షము మన్మథుని బాణముగా రూపింప బడుచున్నది.

**శ్లో॥ బాణేన పుష్పధనుషః, పరికల్ప్యమాన-**
**త్రాణేన భక్తమనసాం కరుణాకరేణ।**
**కోణేన కోమలదృశస్తవ కామకోటి!**
**శోణేన శోషయ శివే! మమ శోకసిన్ధుమ్॥ 94**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామకోటి | = | కామకోటి పీఠాదీశ్వరివైన |
| శివే | = | ఓ శివా! |
| పుష్పధనుషః | = | పువ్వులు బాణములుగాగల మన్మథునియొక్క; |
| బాణేన | = | బాణమైన; |
| భక్తమనసామ్ | = | భక్తుల మనస్సులకు; |
| పరికల్ప్యమాన- | = | కల్పించుచున్న |
| త్రాణేన | = | రక్షణగల; |
| కరుణాకరేణ | = | దయకు గనియైన; |
| తవ | = | నీయొక్క; |
| కోమలదృశః | = | మృదువైన చూపుయొక్క; |
| కోణేన | = | కొనచేత; |
| మమ | = | నాయొక్క; |
| శోకసిన్ధుమ్ | = | దుఃఖమనెడి సముద్రమును; |
| శోషయ | = | ఇగిరిపోవునట్లు చేయుము. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ చూపు మన్మథుని బాణము. అది భక్తులకు రక్షణమును కల్పించుచున్నది. అది దయకు గనిగా నున్నది. అది యెఱ్ఱనిది. అట్టి నీ చూపు చేత నాయొక్క శోకసముద్రము నింకింపజేయుము.

**వివరణము:-**

అమ్మవారి చూపు శివునోడించు సమయమున మన్మథుని బాణమగును. భక్తులకు రక్షణము కల్గించునప్పుడు దయతో నిండిపోవును. భక్తుడైన మూకకవి యొక్క దుః

ఖసముద్రమును శుష్కింపజేయునప్పు డది కోపముతో నిండిపోవలయును. కంటిలోని యెఱుపు ఒకసారి దయను, మరొకసారి కోపమును, మరొకసారి యనురాగమును సూచించును. ఈ మూడు భావములు కోణశబ్దముచే వ్యంజింపజేయబడుచున్నవి. మన్మథుని బాణముగా నమ్మవారి చూపు రూపింపబడుటచే నిందు **రూపకాలంకార**మున్నది. నాలుగు పాదముల మొదట **బాణేన, త్రాణేన, కోణేన, శోణేన** అను నాల్గు పదములుండుటచే నీ శ్లోకమున బాదాద్యనుప్రాసాలంకార మొప్పుచున్నది. చివరి పాదమున శకారము నాల్గుసార్లుండుటచే వృత్త్యనుప్రాసాలంకారమున్నది. శోషణము వాయుకృత్యము. వాయుపుత్రుడైన యగ్నికి నా గుణము సంక్రమించి యుండును. మూకకవి తన దుఃఖమును శోషయ(అర్పివేయుము) అని ప్రార్థించుటచేత అమ్మవారి చూపునకు శోషణస్వభావమైన వాయులక్షణము వ్యంజింపజేయబడినది. కాని వాయువునకు రూపములేదు. అమ్మవారి చూపునకు రూపమున్నది. ఆ రూపమెఱుపు. అగ్నికి రోహితరూపము వేదసిద్ధము. వాయులక్షణమైన శోషణ మగ్నియందు సంక్రమింప జేయబడినట్లు అమ్మవారి చూపునందును సంక్రమింప జేయబడినది. వాచ్యమైన శోకసింధు శోషణముచే పై విషయము వ్యంజింపజేయ బడినది.



**అవ:-** పై శ్లోకమున సముద్రము ప్రస్తావింపబడినది. సముద్రమున చేపలుండును. ఈ క్రింది శ్లోకమున అమ్మవారిచూపు చేపయా యని సందేహింపబడుచున్నది.

**శ్లో॥ మారద్రుహో మకుటసీమని లాల్యమానే**
**మన్దాకినీపయసి తే కుటిలం చరిష్ణుః।**
**కామాక్షి! కోపరభసాద్వలమానమీన-**
**సన్దేహమఙ్కురయతి క్షణమక్షిపాతః॥ 95**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |
| మారద్రుహో | = | మన్మథునకు ద్రోహియైన శివునిచేత; |
| మకుటసీమని | = | కిరీటప్రదేశమున; |
| లాల్యమాణే | = | ఆదరింపబడుచున్న; |
| మన్దాకినీపయసి | = | ఆకాశగంగాజలమున; |
| కోపరభసాత్ | = | కోపావేశమువలన; |
| కుటిలమ్ | = | వంకరగా; |
| చరిష్ణుః | = | తిరుగు; |
| తే | = | నీయొక్క |

అక్షిపాతః = చూపు;
క్షణమ్ = కొంచెము సేపు;
వలమానమీనసన్దేహమ్ = కదలుచున్న చేపయా యను సందేహమును;
అంకురయతి = కలిగించుచున్నది.

**తాత్పర్యము:-**

అమ్మా! నీ చూపు శివుడు నెత్తిని బెట్టుకొని యాదరించు గంగాజలమున కోపముచే వంకరగా తిరుగు చేపయా యని సందేహింపబడుచున్నది.

**వివరణము:-**

అమ్మవారి చూపు చేపగా సందేహింపబడుటచే నీ శ్లోకమున **సందేహాలంకార** మున్నదని నిస్సందేహముగా చెప్పవచ్చును. అమ్మవారు కోపమున గంగను చూచుటచే సపత్నీమాత్సర్యముచే కలహోత్కంఠితగా నీ శ్లోకమున సాక్షాత్కరించు చున్నది. శివుడామె కోపమును లెక్క చేయలేదు. కోపమున మరింత ప్రకాశించు నామె చూపు మారధ్వజమైన తిరుగుచున్న చేపవలె నున్నదని **మారద్రుహా** యను పదము వ్యంజింపజేయుచున్నది. దానిని బట్టుకొనవచ్చునని సంతోషించుచున్నాడని పై సందేహాలంకారము వ్యంజింప జేయుచున్నది.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి చూపు **చలించు చేప**గా సందేహింపబడినది. ఈ క్రింది శ్లోకమున చలనము లేని స్తంభముగా రూపింపబడుచున్నది.

**శ్లో॥ కామాక్షి! సంవలితమౌక్తికకుణ్డలాంశు-**
**చఞ్చత్స్మితశ్రవణచామరచాతురీకః।**
**స్తమ్భే నిరన్తరమపాఙ్గమయే భవత్యా**
**బద్ధశ్చకాస్తి మకరధ్వజమత్తహస్తీ॥ 96**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి = ఓ కామాక్షీ దేవీ!
సంవలిత- = మూగిన
మౌక్తిక - = ముత్తెముల
కుండల- = కుండలముల
అంశు- = కాంతి యనెడి
చంచత్- = ప్రకాశించు
స్మిత- = చిఱు నవ్వుగల
శ్రవణచామర- = చామరముల వంటి చెవుల

| | | |
|---|---|---|
| చాతురీకః- | = | చాతుర్యముకల; |
| మకరధ్వజమత్తహస్తీ | = | మన్మథుడనెడి మదగజము; |
| అపాఙ్గమయే | = | చూపనెడి; |
| స్తమ్భే | = | స్తంభమునందు; |
| భవత్యా | = | నీ చేత; |
| బద్ధః | = | బంధింపబడినదై; |
| చకాస్తి | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ చూపు ముత్యాల కుండలము. కాంతి యనెడి నవ్వుగల చామరముల వంటి చెవులుగల మన్మథుడనెడి మదగజము నీ చూపనెడి స్తంభమున బంధింపబడినదై ప్రకాశించుచున్నది.

**వివరణము:-**

ఈ శ్లోకమున అపాంగ మనెడి స్తంభమున మకరధ్వజుడు అమ్మవారి చేత చూపున గట్టివేయబడిన మదగజముగా రూపింపబడుటచే రూపకాలంకారమున్నది. కుండలములు తెల్లని ముత్తెములు కలవగుటచే స్మితమున తెల్లని కాంతి వ్యాపించి యుండుటచే కటాక్షస్తంభమున కట్టివేయబడిన యా మదగజమైరావతమే యని స్ఫురించుచున్నది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి కటాక్ష వైచిత్రి ప్రతిపాదింపబడుచున్నది.

**శ్లో॥ యావత్కటాక్షరజనీసమయాగమస్తే**
**కామాక్షి! తావదచిరాన్నమతాం నరాణామ్।**
**ఆవిర్భవత్యమృతదీధితిబిమ్బమమ్బ!**
**సంవిన్మయం హృదయపూర్వగిరీన్ద్రశృఙ్గే॥ 97**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| అమ్బ! | = | అమ్మా! |
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |
| యావత్ | = | ఎంతలో; |
| తే | = | నీయొక్క; |
| కటాక్షరజనీసమయాగమః | = | చూపనెడి పున్నమరాకయో; |
| తావత్ | = | అంతలో; |
| అచిరాత్ | = | శీఘ్రముగా; |

| | |
|---|---|
| నమతామ్ | = నమస్కరించునట్టి; |
| నరాణామ్ | = మనుష్యులకు; |
| హృదయపూర్వగిరీన్ద్రశృంగే | = హృదయమనెడి తూర్పుకొండ కొమ్మున; |
| సంవిన్మయమ్ | = జ్ఞానమయమైన; |
| అమృతదీధితిబింబమ్ | = చంద్రబింబము; |
| ఆవిర్భవతి | = ప్రాదుర్భవించును. |

**తాత్పర్యము:-**

ఎంతలో నీకటాక్షమనెడి పున్నమరాత్రి సమయమువచ్చునో అంతలోనే నమస్కరించు నరుల హృదయమనెడి తూర్పు కొండ కొమ్మున జ్ఞానమయమైన చంద్రబింబమావిర్భవించును.

**వివరణము:-**

హృదయము తూర్పు కొండ కొమ్ముగా, జ్ఞానము చంద్రబిమ్బముగా, అమ్మవారి కటాక్షము పున్నమిరాత్రి రాకగా, రూపింపబడుటచే నీ శ్లోకమున రూపకాలంకారమున్నది. జ్ఞానమును చంద్రునితో బోల్చుట అద్వైత సమ్ప్రదాయమున నున్నదే. ప్రబోధచన్ద్రోదయమను ఆధ్యాత్మికనాటకము కూడ ప్రసిద్ధమైనదే. విశిష్టాద్వైత సంప్రదాయమున వివేకసూర్యోదయమను నాటకమున్నది. జ్ఞానమును సూర్యునిగా బేర్కొనుట అద్వైతసమ్ప్రదాయమునకు కించిద్భిన్నమైనను అంధకారమును జీల్చు నన్న తాత్పర్యములో భేదము లేదు. పున్నమిరాత్రి రాకయు, చన్ద్రోదయము నొకేసారి వచ్చుటను యావత్ శబ్దము సూచించును. అమ్మవారి యనుగ్రహము కలిగిన పిమ్మట జ్ఞానోదయము కలుగును. అమ్మవారి యనుగ్రహము కారణము, జ్ఞానోదయము కార్యము. ఇవి రెండు సమకాలికములని చెప్పుట కారణకార్యముల మధ్య యెక్కువ వ్యవధానము లేదని కారణముదయించిన వెంటనే కార్యముదయించినదని శైఘ్ర్యాతిశయమిట వ్యంగ్యమగుచున్నది. ఇది **అతిశయోక్త్యలంకారము.**



**అవ:-** మోక్షపురుషార్థము అలౌకికము. శ్రేయోనామకము. అమ్మవారి యనుగ్రహము శ్రేయో హేతువే కాక ప్రేయో హేతువు కూడా నగునని ఈ క్రింది శ్లోకమున చెప్పబడుచున్నది.

శ్లో॥ **కామాక్షి! కల్పవిటపీవ భవత్కటాక్షో**
**దిత్సుస్సమస్తవిభవం నమతాం నరాణామ్।**
**భృఙ్గస్య నీలనలినస్య చ కాన్తిసమ్ప-**
**త్సర్వస్వమేవ హరతీతి పరం విచిత్రమ్॥** **98**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |
| భవత్కటాక్షః | = | నీ చూపు; |
| కల్పవిటపీవ | = | కల్పవృక్షమువలె; |
| నమతామ్ | = | నమస్కరించు; |
| నరాణామ్ | = | మనుష్యులకు; |
| సమస్తవిభవమ్ | = | సమస్తమైన సంపదను; |
| దిత్సుః | = | ఈయగోరుచున్నాను; |
| భృంగస్య | = | తుమ్మెదకును; |
| నీలనలినస్య చ | = | నల్లని కమలమునకును; |
| కాన్తిసంపత్సర్వస్వమ్ | = | కాన్తిసంపదను; |
| హరతి ఏవ | = | తప్పక హరించును; |
| ఇతి | = | అనుట; |
| పరమ్ | = | మిక్కిలి; |
| విచిత్రమ్ | = | వింత! |

**తాత్పర్యము :-**

అమ్మా! కల్పవృక్షము వంటి నీ చూపు నమస్కరించు వారలకు సమస్త సంపదల నీయగోరును. కాని తుమ్మెదయొక్క నీలకమలముయొక్క కాంతి యను సంపద మొత్తము హరించుట వింత కదా! అమ్మవారి కటాక్షము తుమ్మెద కన్న నీలనలినముకన్న మిక్కిలి నల్లనై శోభించుచున్నది.

**వివరణము :-**

ఒకరికి సర్వసంపదల నొసగుట, మరొకరికి కాంతిసంపత్సర్వస్వము నపహరించుట యొక విధముగా విరోధమే. అది పక్షపాతమే. కాని నమస్కరించు వారికి సర్వసంపద నొసగుట స్పర్ధించు వారి కీయకపోవుట యొక విధముగా నవిరోధమే. విచిత్రమ్ అను పదము చేత నీ విరోధము వ్యక్తమైనను, అమ్మవారి కంటితో స్పర్ధించుటచే విరోధము కాదని పరిహరింపబడు నవకాశముండుటచే నట విరోధాభాసాలంకారమున్నది.



**అవ:-** ఈ శ్లోకమున అమ్మవారి **కటాక్షమహిమ** వర్ణింపబడినది.

**శ్లో॥ అజ్ఞాతభక్తిరసమప్రసరద్వివేక-**
**మత్యన్తగర్వమనధీతసమస్తశాస్త్రమ్।**
**అప్రాప్తసత్యమసమీపగతం చ ముక్తేః**
**కామాక్షి! నైవ తవ కాంక్షతి దృష్టిపాతః॥ 99**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |
| తవ | = | నీయొక్క |
| దృష్టిపాతః | = | కటాక్షము; |
| అజ్ఞాతభక్తిరసమ్ | = | భక్తిలోని రక్తి నెఱుగని వానిని; |
| అప్రసరద్వివేకమ్ | = | వివేకము ప్రసరించని వానిని; |
| అత్యన్తగర్వమ్ | = | మిక్కిలి గర్వము కలవానిని; |
| అనధీతసమస్తశాస్త్రమ్ | = | సమస్తశాస్త్రములనేర్వని వానిని; |
| అప్రాప్తసత్యమ్ | = | సత్యము చేరని వానిని; |
| ముక్తేః | = | ముక్తికి; |
| అసమీపగతమ్ | = | దగ్గఱని వానిని; |
| న ఏవ కాంక్షతి | = | కోరనేరదు. |

తాత్పర్యము:-

అమ్మా! భక్తియొక్క రక్తి నెఱుగని వానిని, వివేకము ప్రసరించని వానిని, గర్వము లేని వానిని, అన్ని శాస్త్రముల నేర్వని వానిని, సత్యము చేరని వానిని ముక్తికి దగ్గఱని వానిని నీ కటాక్షము కోరదు. ఇన్ని ఉన్న వానికే అమ్మవారి కటాక్షము లభించును. అనగా నది సామాన్యులకు దుర్లభము.

వివరణము:-

పై లక్షణములు లేని వానిని కోరదనుటలో పై లక్షణముల నపేక్షింపకయే తన స్వేచ్ఛచే నెటువంటి సుగుణములులేని వానిపై సైతము యాదృచ్ఛికముగ అమ్మవారి దృష్టిపడి వాడు కృతార్థుడగును అను అర్థాంతరము కూడ స్ఫురించుటచే నమ్మవారి కటాక్షముయొక్క నిరంకుశస్వాతంత్ర్యము కూడ దెలియుచున్నది.



అవ:- ఈ శ్లోకమున అమ్మవారి కటాక్షమహిమ వర్ణింపబడినది.

శ్లో॥ అత్యన్తశీతలమనర్గలకర్మపాక-
కాకోలహారి సులభం సుమనోభిరేతత్।
పీయూషమేవ తవ వీక్షణమమ్బ! కిన్తు
కామాక్షి! నీలమిదమిత్యయమేవ భేదః॥ 100

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! అంబ! | = | ఓ కామాక్షీ దేవీ! |
| అత్యన్తశీతలమ్ | = | మిక్కిలి చల్లని; |

| | | |
|---|---|---|
| అనర్గలకర్మపాకకాకోలహారి | = | అడ్డులేని కర్మపరిపాకమను విషమును హరించు; |
| సుమనోభిః | = | దేవతలచేత; |
| సులభమ్ | = | సుఖముగా బొందదగిన; |
| ఏతత్ | = | ఈ; |
| తవ | = | నీయొక్క; |
| వీక్షణమ్ | = | చూపు; |
| పీయూషమ్ ఏవ | = | అమృతమే; |
| కిం తు | = | కాని; |
| ఇదమ్ | = | ఇది (నీ చూపు); |
| నీలమ్ ఇతి | = | నల్లని దనుట; |
| అయమ్ ఏవ | = | ఇదియే; |
| భేదః | = | భేదము. |

**తాత్పర్యము:-**

అమ్మా! మిక్కిలి చల్లనిది, అనర్గల కర్మపాకమను విషమును హరించునది, దేవతలకు సులభమైనదియునైన నీ చూపు అమృతమే కాని నీ యీ చూపు నల్లనిది.

**వివరణము:-**

అమృతము తెల్లనిది. దాని లక్షణములన్నియున్నను అమ్మవారి చూపు నందు తెలుపు లేక నలుపుండుట. ఇదియే విశేషము. ఉపమానోపమేయములైన పీయుష కటాక్షములకు సామ్యమును పుష్కలముగా చెప్పి యీ విశేషము చెప్పుటచే నీ శ్లోకమున వ్యతిరేకాలంకారమున్నది.



**శ్లో॥ పాతేన లోచనరుచేస్తవ కామకోటి!**
**పోతేన పాతకపయోధిభయాతురాణామ్।**
**పూతేన తేన నవకాంచనకుణ్డలాంశు-**
**వీతేన శీతలయ భూధరకన్యకే మామ్॥** **101**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| భూధరకన్యకే! | = | పర్వతసుతవైన; |
| కామకోటి! | = | ఓ కామకోటిపీఠాధీశ్వరీ! |
| పాతకపయోధిభయాతురాణామ్ | = | పాపసముద్రముయొక్క భయముచే పీడితులైన వారికి; |
| పోతేన | = | ఓడయయిన; |

| | | |
|---|---|---|
| నవకాంచనకుండలాంశువీతేన | = | క్రొత్త బంగారు కుండలముల కాంతులచే కూడిన; |
| తేన పూతేన | = | దానిచే పవిత్రమైన |
| తవ | = | నీ యొక్క; |
| లోచనరుచేః | = | కంటి కాంతియొక్క; |
| పాతేన | = | ప్రసారముచేత; |
| మామ్ | = | నన్ను; |
| శీతలయ | = | చల్లబఱుపుము. |

**తాత్పర్యము:-**

పర్వతసుతవైన యో కామాక్షీ దేవీ! నీ దృష్టిపాతము పాపసముద్ర భయాతురులకు పోతము, నవకాంచనకుండలాంశుసముపేతము. అట్టి నీ దృష్టిపాతముచేత నన్ను జల్లబఱుపుము.

**వివరణము:-**

అమ్మవారు **భూధరకన్యక** యని సంబోధింపబడినది. ఆ భూధరము సామాన్య భూధరము కాదు. అది శీతభూధరమే యని శీతలయ (చల్లబఱుపుము) అనుటచే వ్యంగ్యమగుచున్నది. అమ్మవారి దృష్టిపాతము పాతభయాతురులకు పోతము అనుటచే ద్వితీయపాదమున రూపకాలంకారమున్నది.

**కటాక్షశతకం సర్వం సంపూర్ణమ్**

**'లోకాస్సమస్తాస్సుఖినో భవంతు'**

**శ్రీః**

# కటాక్షశతకమ్ - శ్లోకానుక్రమణికా

శ్రీః

మూకపఞ్చశతీ

# మన్దస్మితశతకమ్

సారోల్లాసినీ వ్యాఖ్యా



శ్లో॥ బధ్నీమో వయమఞ్జలిం ప్రతిదినం బన్ధచ్ఛిదే దేహినాం
కన్దర్పాగమతన్త్రమూలగురవే కల్యాణకేలీభువే।
కామాక్ష్యా ఘనసారపుఞ్జరజసే కామద్రుహశ్చక్షుషాం
మన్దారస్తబకప్రభామదముషే మన్దస్మితజ్యోతిషే॥ 1



శ్లో॥ సధ్రీచే నవమల్లికాసుమనసాం నాసాగ్రముక్తామణే-
రాచార్యాయ మృణాలకాణ్డమహసాం నైసర్గికాయ త్విషే।
స్వర్ధున్యా సహ యుధ్వనే హిమరుచేరర్ధాసనాధ్యాసినే
కామాక్ష్యాః స్మితమఞ్జరీధవలిమాద్వైతాయ తస్మై నమః॥ 2



శ్లో॥ కర్పూరద్యుతిచాతురీమతితరామల్పీయసీం కుర్వతీ
దౌర్భాగ్యోదయమేవ సంవిదధతీ దౌషాకరీణాం త్విషామ్।
క్షుల్లానేవ మనోజ్ఞమల్లినికరాన్ఫుల్లానపి వ్యఞ్జతీ
కామాక్ష్యా మృదులస్మితాంశులహరీ కామప్రసూరస్తు మే॥ 3



శ్లో॥ యా పీనస్తనమణ్డలోపరి లసత్కర్పూరలేపాయతే
యా నీలేక్షణరాత్రికాన్తితతిషు జ్యోత్స్నాప్రరోహాయతే।
యా సౌన్దర్యధునీతరఙ్గతతిషు వ్యాలోలహంసాయతే
కామాక్ష్యాశ్శిశిరీకరోతు హృదయం సా మే స్మితప్రాచురీ॥ 4



శ్లో॥ యేషాం గచ్ఛతి పూర్వపక్షసరణిం కౌముద్వతః శ్వేతిమా
యేషాం సన్తతమారురుక్షతి తులాకక్ష్యాం శరచ్చన్ద్రమాః।
యేషామిచ్ఛతి కమ్బురప్యసులభామన్తేవసత్ప్రక్రియాం
కామాక్ష్యా మమతాం హరన్తు మమ తే హాసత్విషామఙ్కురాః॥ 5



శ్లో॥ ఆశాసీమసు సన్తతం విదధతీ నైశాకరీం వ్యాక్రియాం
కాశానామభిమానభఙ్గకలనాకౌశల్యమాబిభ్రతీ।
ఈశానేన విలోకితా సకుతుకం కామాక్షి! తే కల్మష-
క్లేశాపాయకరీ చకాస్తి లహరీ మన్దస్మితజ్యోతిషామ్॥ 6



శ్లో॥ ఆరూఢస్య సమున్నతస్తనతటీసామ్రాజ్యసింహాసనం
కన్దర్పస్య విభోర్జగత్త్రయజయప్రాకట్యముద్రానిధేః।
యస్యాశ్చామరచాతురీం కలయతే రశ్మిచ్ఛటాచఞ్చలా
సా మన్దస్మితమఞ్జరీ భవతు నః కామాయ కామాక్షి! తే॥ 7



శ్లో॥ శమ్భోర్యా పరిరమ్భసంభ్రమవిధౌ నైర్మల్యసీమానిధిః
గైర్వాణీవ తరఙ్గిణీ కృతమృదుస్యన్దాం కలిన్దాత్మజామ్।
కల్మాషీకురుతే కలఙ్కసుషమాం కణ్ఠస్థలీచుమ్బినీం
కామాక్ష్యాః స్మితకన్దలీ భవతు సా కల్యాణసన్దోహినీ॥ 8



శ్లో॥ జేతుం హారలతామివ స్తనతటీం సంజగ్ముషీ సన్తతం
గన్తుం నిర్మలతామివ ద్విగుణితాం మగ్నా కృపాస్రోతసి।
వక్తుం విస్మయనీయతామివ హరం రాగాకులం కుర్వతీ
మఞ్జుస్తే స్మితమఞ్జరీ భవభయం మథ్నాతు కామాక్షి! మే॥ 9



శ్లో॥ శ్వేతాపి ప్రకటం నిశాకరరుచాం మాలిన్యమాతన్వతీ
శీతాపి స్మరపావకం పశుపతేస్సన్ధుక్షయన్తీ సదా।
స్వాభావ్యాదధరాశ్రితాపి నమతాముచ్చైర్దిశన్తీ గతిం
కామాక్షి! స్ఫుటమన్తరా స్ఫురతు నస్త్వన్మన్దహాసప్రభా॥ 10



శ్లో॥ వక్త్రశ్రీసరసీజలే తరలితభ్రూవల్లికల్లోలితే
కాలిమ్నా దధతీ కటాక్షజనుషా మాధువ్రతీం వ్యాపృతిమ్।
నిర్నిద్రామలపుణ్డరీకకుహనాపాణ్డిత్యమాబిభ్రతీ
కామాక్ష్యాః స్మితచాతురీ మమ మనః కాతర్యమున్మూలయేత్॥ 11



శ్లో॥ నిత్యం బాధితబన్ధుజీవమధరం మైత్రీజుషం పల్లవైః
శుద్ధస్య ద్విజమణ్డలస్య చ తిరస్కర్త్రారమప్యాశ్రితా।
యా వైమల్యవతీ సదైవ నమతాం చేతః పునీతేతరాం
కామాక్ష్యా హృదయం ప్రసాదయతు మే సా మన్దహాసప్రభా॥ 12

శ్లో॥ ద్రుహ్యన్తీ తమసే ముహుః కుముదినీసాహాయ్యమాబిభ్రతీ
యాన్తీ చన్ద్రకిశోరశేఖరవపుస్సౌధాఙ్గణే ప్రేఙ్ఖణమ్।
జ్ఞానామ్భోనిధివీచికాం సుమనసాం కూలఙ్కషాం కుర్వతీ
కామాక్ష్యాః స్మితకౌముదీ హరతు మే సంసారతాపోదయమ్॥ 13

శ్లో॥ కాశ్మీరద్రవధాతుకర్దమరుచా కల్మాషతాం బిభ్రతీ
హంసౌఘైరివ కుర్వతీ పరిచితిం హారీకృతైర్మౌక్తికైః।
వక్షోజన్మతుషారశైలకటకే సఞ్చారమాతన్వతీ
కామాక్ష్యా మృదులస్మితద్యుతిమయీ భాగీరథీ భాసతే॥ 14

శ్లో॥ కమ్భోర్వంశపరమ్పరా ఇవ కృపాసన్తానవల్లీభువః
సమ్ఫుల్లస్తబకా ఇవ ప్రసృమరా మూర్తాః ప్రసాదా ఇవ।
వాక్పీయూషకణా ఇవ త్రిపథగాపర్యాయభేదా ఇవ
భ్రాజన్తే తవ మన్దహాసకిరణాః కాఞ్చీపురీనాయికే॥ 15

శ్లో॥ వక్షోజే ఘనసారపత్రరచనాభఙ్గీసపత్నాయితా
కణ్ఠే బన్ధురదన్తపత్రకుహనా వ్యాపారముద్రాయితా।
ఓష్ఠశ్రీనికురుమ్బపల్లవపుటే ప్రేఙ్ఖత్ప్రసూనాయితా
కామాక్షి! స్ఫురతాం మదీయహృదయే త్వన్మన్దహాసప్రభా॥ 16

శ్లో॥ యేషాం బిన్దురివోపరి ప్రచలితో నాసాగ్రముక్తామణి-
ర్యేషాం దీన ఇవాధికణ్ఠమయతే హారః కరాలమ్బనమ్।
యేషాం బన్ధురివోష్ఠయోరరుణిమా ధత్తే స్వయం రఞ్జనమ్
కామాక్ష్యాః ప్రభవన్తు తే మమ శివోల్లాసాయ హాసాఙ్కురాః॥ 17

శ్లో॥ యా జాడ్యామ్బునిధిం క్షిణోతి భజతాం వైరాయతే కైరవై-
ర్నిత్యం యా నియమేన యా చ యతతే కర్తుం త్రినేత్రోత్సవమ్।
బిమ్బం చాన్ద్రమసం చ వఞ్చయతి యా గర్వేణ సా తాదృశీ
కామాక్షి! స్మితమఞ్జరీ తవ కథం జ్యోత్స్నేత్యసౌ కీర్త్యతే॥ 18



శ్లో॥ ఆరూఢా రభసాత్పురః పురరిపోరాశ్లేషణోపక్రమే
యా తే మాతరుపైతి దివ్యతటినీశఙ్కాకరీ తత్క్షణమ్।
ఓష్ఠం వేపయతి భ్రువౌ కుటిలయత్యానమ్రయత్యాననం
తాం వన్దే మృదుహాసపూరసుషమామేకామ్రనాథప్రియే॥ 19



శ్లో॥ వక్త్రేన్దోస్తవ చన్ద్రికా స్మితరుచిర్వల్గు స్ఫురన్తీ సతాం
స్యాచ్చేద్యుక్తమిదం చకోరమనసాం కామాక్షి! కౌతూహలమ్।
ఏతచ్చిత్రమహర్నిశం యదధికామేశం సదా గాహతే
బిమ్బోష్ఠద్యుమణిప్రభాస్వపి చ యద్బిబ్బోకమాలమ్బతే॥ 20



శ్లో॥ సాహాయ్యం కలశామ్బుధేర్వహతి తే కామాక్షి! మన్దస్మితం
శోభామోష్ఠరుచాం చ విద్రుమభువామేతద్భిదాం బ్రూమహే।
ఏతస్మాదుదితం పురా కిల పపౌ శర్వః పురాణః పుమా-
నేతన్మధ్యసముద్భవాం రసయతే మాధుర్యరూపాం సుధామ్॥ 21



శ్లో॥ ఉత్తుఙ్గస్తనకుమ్భశైలకటకే విస్తారికస్తూరికా-
పత్రశ్రీజుషి చఞ్చలాః స్మితరుచః కామాక్షి! తే కోమలాః।
సన్ధ్యాదీధితిరఞ్జితా ఇవ ముహుస్సాన్ద్రాధరజ్యోతిషా
వ్యాలోలామలశారదాభ్రశకలవ్యాపారమాతన్వతే॥ 22



శ్లో॥ క్షీరం దూరత ఏవ తిష్ఠతు కథం వైమల్యమాత్రాదిదం
మాతస్తే సహపాఠవీథిమయతాం మన్దస్మితైర్మఞ్జులైః।
కిం చేయం తు భిదాస్తి దోహనవశాదేతత్తు సఞ్జాయతే
కామాక్షి! స్వయమర్థితం ప్రణమతామేతత్తు దోదుహ్యతే॥ 23



శ్లో॥ కర్పూరైరమృతాంశుభిర్జనని! తే కాన్తైశ్చ చన్ద్రాతపై-
ర్ముక్తాహారగుణైర్మృణాలవలయైర్ముగ్ధస్మితశ్రీరియమ్।
శ్రీకాఞ్చీపురనాయికే! సమతయా సంస్తూయతే సజ్జనై-
స్తత్తాదృఙ్మమ తాపశాన్తివిధయే కిం దేవి! మన్దాయతే॥ 24

శ్లో॥ మధ్యేగర్భితమఞ్జువాక్యలహరీమాధ్వీఝరీశీతలా
మన్దారస్తబకాయతే జనని! తే మన్దస్మితాంశుచ్ఛటా।
యస్యా వర్ధయితుం ముహుర్వికసనం కామాక్షి! కామద్రుహో
వల్గుర్వీక్షణవిభ్రమవ్యతికరో వాసన్తమాసాయతే॥ 25

శ్లో॥ బిమ్బోష్ఠద్యుతిపుఞ్జరఞ్జితరుచిస్త్వన్మన్దహాసచ్ఛటా
కల్యాణం గిరిసార్వభౌమతనయే! కల్లోలయత్వాశు మే।
ఫుల్లన్మల్లిపినద్ధహల్లకమయీ మాలేవ యా పేశలా
శ్రీకాఞ్చీశ్వరి! మారమర్దితురురోమధ్యే ముహుర్లమ్బతే॥ 26

శ్లో॥ బిభ్రాణా శరదభ్రవిభ్రమదశాం విద్యోతమానాప్యసౌ
కామాక్షి! స్మితమఞ్జరీ కిరతి తే కారుణ్యధారారసమ్।
ఆశ్చర్యం శిశిరీకరోతి జగతీమాలోక్య చైనామహో
కామం ఖేలతి నీలకణ్ఠహృదయం కౌతూహలాన్దోళితమ్॥ 27

శ్లో॥ ప్రేఙ్ఖత్ప్రౌఢకటాక్షకుఞ్జకుహరేష్వత్యచ్ఛగుచ్ఛాయితం
వక్త్రేన్దుచ్ఛవిసిన్ధువీచినిచయే ఫేనప్రతానాయితమ్।
నైరన్తర్యవిజృమ్భితస్తనతటే నైచోలపట్టాయితం
కల్మాషం కబలీకరోతు మమ తే కామాక్షి! మన్దస్మితమ్॥ 28

శ్లో॥ పీయూషం తవ మన్థరస్మితమితి వ్యర్థైవ సాపప్రథా
కామాక్షి! ధ్రువమీదృశం యది భవేదేతత్కథం వా శివే।
మన్దారస్య కథాలవం న సహతే మథ్నాతి మన్దాకినీ-
మిన్దుం నిన్దతి కీర్తితే చ కలశీపాథోధిమీర్ష్యాయతే॥ 29

శ్లో॥ విశ్వేషాం నయనోత్సవం వితనుతాం విద్యోతతాం చన్ద్రమా
విఖ్యాతో మదనాన్తకేన ముకుటీమధ్యే చ సమ్మాన్యతామ్।
ఆః కిం జాతమనేన హాసనుషమామాలోక్య కామాక్షి! తే
కాలక్ష్మీమవలమ్బతే ఖలు దశాం కల్మాషహీనోఽప్యసౌ॥ 30



శ్లో॥ చేతః శీతలయన్తు నః పశుపతేరానన్దజీవాతవో
నమ్రాణాం నయనాధ్వసీమసు శరచ్చన్ద్రాతపోపక్రమాః।
సంసారాఖ్యసరోరుహాకరఖలీకారే తుషారోత్కరాః
కామాక్షి! స్మరకీర్తిబీజనికరాస్త్వన్మన్దహాసాఙ్కురాః॥ 31



శ్లో॥ కర్మౌఘాఖ్యతమఃకచాకచికరాన్కామాక్షి! సంచిన్తయే
త్వన్మన్దస్మితరోచిషాం త్రిభువనక్షేమఙ్కరానఙ్కురాన్।
యే వక్త్రం శిశిరశ్రియో వికసితం చన్ద్రాతపామ్భోరుహ-
ద్వేషోద్ఘోషణచాతురీమివ తిరస్కర్తుం పరిష్కుర్వతే॥ 32



శ్లో॥ కుర్యుర్నః కులశైలరాజతనయే! కూలఙ్కషం మఙ్గళం
కున్దస్పర్ధనచుఞ్చవస్తవ శివే! మన్దస్మితప్రక్రమాః।
యే కామాక్షి! సమస్తసాక్షినయనం సన్తోషయన్త్యాన్తరం
కర్పూరప్రకరా ఇవ ప్రసృమరాః పుంసామసాధారణాః॥ 33



శ్లో॥ కమ్రేణ స్నపయస్వ కర్మకుహనాచోరేణ మారాగమ-
వ్యాఖ్యాశిక్షణదీక్షితేన విదుషామక్షీణలక్ష్మీపుషా।
కామాక్షి! స్మితకన్దలేన కలుషస్ఫోటక్రియాచుఞ్చునా
కారుణ్యామృతవీచికావిహరణప్రాచుర్యధుర్యేణ మామ్॥ 34



శ్లో॥ త్వన్మన్దస్మితకన్దలస్య నియతం కామాక్షి! శఙ్కామహే
బిమ్బః కశ్చన నూతనః ప్రచలితో నైశాకరశ్శీకరః।
కిఞ్చ క్షీరపయోనిధిః ప్రతినిధిః స్వర్వాహినీవీచికా-
బిబ్బోకోఽపి విడమ్బ ఏవ కుహనా మల్లీమతల్లీరుచః॥ 35



శ్లో॥ దుష్కర్మార్కనిసర్గకర్కశమహఃసమ్పర్కతప్తం మిల-
త్పఙ్కం శఙ్కరవల్లభే! మమ మనః కాఞ్చీపురాలఙ్క్రియే।
అమ్బ! త్వన్మృదులస్మితామృతరసే మఙ్క్త్వా విధూయ వ్యథా-
మానన్దోదయసౌధశృఙ్గపదవీమారోఢుమాకాంక్షతి॥ 36



శ్లో॥ నమ్రాణాం నగరాజశేఖరసుతే నాకాలయానాం పురః
కామాక్షి! త్వరయా విపత్ప్రశమనే కారుణ్యధారాః కిరన్।
ఆగచ్ఛన్తమనుగ్రహం ప్రకటయన్నానన్దబీజాని తే
నాసీరే మృదుహాస ఏవ తనుతే నాథే! సుధాశీతలః॥ 37



శ్లో॥ కామాక్షి! ప్రథమానవిభ్రమవిధిః కన్దర్పదర్పప్రసూ-
ర్ముగ్ధస్తే మృదుహాస ఏవ గిరిజే! ముష్ణాతు మే కిల్బిషమ్।
యం ద్రష్టుం విహితే కరగ్రహ ఉమే! శమ్భుస్త్రపామీలితం
స్మేరం కారయతి స్మ తాణ్డవవినోదాహిణ్డినా తణ్డునా॥ 38



శ్లో॥ క్షుణ్ణం కేనచిదేవ ధీరమనసా కుత్రాపి నానాజనైః
కర్మగ్రన్థినియన్త్రితైరసుగమం కామాక్షి! సామాన్యతః।
ముక్తేర్ద్రష్టుమశక్యమేవ మనసా మూఢస్య మే చక్షుషో
మార్గం దర్శయతు ప్రదీప ఇవ తే మన్దస్మితశ్రీరియమ్॥ 39



శ్లో॥ జ్యోత్స్నాకాన్తిభిరేవ నిర్మలతరం నైశాకరం మణ్డలం
హంసైరేవ శరద్విలాససమయవ్యాకోచమమ్భోరుహమ్।
స్వచ్ఛైరేవ వికస్వరైరుడుగణైః కామాక్షి! బిమ్బం దివః
పుణ్యైరేవ మృదుస్మితైస్తవ ముఖం పుష్ణాతి శోభాభరమ్॥ 40



శ్లో॥ మానగ్రన్థివిధున్తుదేన రభసాదాస్వాద్యమానే నవ-
ప్రేమాడమ్బరపూర్ణిమాహిమకరే కామాక్షి! తే తత్క్షణమ్।
ఆలోక్య స్మితచన్ద్రికాం ముహురిమామున్మీలనం జగ్ముషీం
చేతశ్శైలయతే చకోరచరితం చన్ద్రార్ధచూడామణేః॥ 41



శ్లో॥ కామాక్షి! స్మితమఞ్జరీం తవ భజే యస్యాస్త్విషామఙ్కురా-
నాపీనస్తనపానలాలసతయా నిశ్శఙ్కమఙ్కేశయః।
ఊర్ధ్వం వీక్ష్య వికర్షతి ప్రసృమరానుద్దామయా శుణ్డయా
సూనుస్తే బిసశఙ్కయాశు కుహనాదన్తావలగ్రామణీః॥ 42



శ్లో॥ గాఢాశ్లేషవిమర్దసమ్భ్రమవశాదుద్దామముక్తాగుణ-
ప్రాలమ్బే కుచకుమ్భయోర్విగలితే దక్షద్విషో వక్షసి।
యా సఖ్యేన పినహ్యతి ప్రచురయా భాసా తదీయాం దశామ్
సా మే ఖేలతు కామకోటి! హృదయే సాన్ద్రస్మితాంశుచ్ఛటా॥ 43



శ్లో॥ మన్దారే తవ మన్థరస్మితరుచో మాత్సర్యమాలోక్యతే
కామాక్షి! స్మరశాసనే చ నియతం రాగోదయో లక్ష్యతే।
చాన్ద్రీషు ద్యుతిమఞ్జరీషు చ మహాదోషాఙ్కురో దృశ్యతే
శుద్ధానాం కథమీదృశీ గిరిసుతేఽశుద్ధా దశా కథ్యతామ్॥ 44



శ్లో॥ పీయూషం ఖలు పీయతే సురజనైర్దుగ్ధామ్బుధిర్మథ్యతే
మాహేశైశ్చ జటాకలాపనిగళైర్మన్దాకినీ నహ్యతే।
శీతాంశుః పరిభూయతే చ తమసా తస్మాదనేతాదృశీ
కామాక్షి! స్మితమఞ్జరీ తవ వచోవైదగ్ధ్యముల్లఙ్ఘతే॥ 45



శ్లో॥ ఆశఙ్కే తవ మన్దహాసలహరీమన్యాదృశీం చన్ద్రికా-
మేకామ్రేశకుటుమ్బిని ప్రతిపదం యస్యాః ప్రభాసఙ్గమే।
వక్షోజామ్బురుహే న తే రహయతః కాఞ్చిద్దశాం కౌట్మలీ-
మాస్యామ్భోరుహమమ్బ! కిం చ శనకైరాలమ్బతే ఫుల్లతామ్॥ 46



శ్లో॥ ఆస్తీర్ణాధరకాన్తిపల్లవచయే పాతం ముహుర్జగ్ముషీ
కామద్రోహిణి మాంసలస్మరశరజ్వాలావలిర్వ్యఞ్జతీ।
నిన్దన్తీ ఘనసారహారవలయజ్యోత్స్నామృణాలాని తే
కామాక్షి! స్మితచాతురీ విరహిణీరీతిం జగాహేతరామ్॥ 47



శ్లో॥ సూర్యాలోకవిధౌ వికాసమధికం యాన్తీ హరన్తీ తమ-
స్సన్దోహం నమతాం నిజస్మరణతో దోషాకరద్వేషిణీ।
నిర్యాన్తీ వదనారవిన్దకుహరాన్నిర్ధూతజాడ్యా నృణాం
శ్రీకామాక్షి! తవ స్మితద్యుతిమయీ చిత్రీయతే చన్ద్రికా॥ 48

శ్లో॥ కుణ్ఠీకుర్యురమీ కుబోధఘటనామస్మన్మనోమాథినీం
శ్రీకామాక్షి! శివంకరాస్తవ శివే! శ్రీమన్దహాసాఙ్కురాః।
యే తన్వన్తి నిరన్తరం తరుణిమస్తమ్బేరమగ్రామణీ-
కుమ్భద్వన్ద్వవిడమ్బిని స్తనతటే ముక్తాకుథాడమ్బరమ్॥ 49

శ్లో॥ ప్రేఙ్ఖన్తః శరదమ్బుదా ఇవ శనైః ప్రేమానిలైః ప్రేరితా
మజ్జన్తో మదనారికణ్ఠసుషమాసిన్ధౌ ముహుర్మన్థరమ్।
శ్రీకామాక్షి! తవ స్మితాంశునికరాః శ్యామాయమానశ్రియో
నీలామ్భోధరనైపుణీం తత ఇతో నిర్నిద్రయన్త్యఞ్జసా॥ 50

శ్లో॥ వ్యాపారం చతురాననైకవిహృతౌ వ్యాకుర్వతీ కుర్వతీ
రుద్రాక్షగ్రహణం కరేణ సతతం వాగూర్మికల్లోలితా।
ఉత్ఫుల్లం ధవలారవిన్దమధరీకృత్య స్ఫురన్తీ సదా
శ్రీకామాక్షి! సరస్వతీ విజయతే త్వన్మన్దహాసప్రభా॥ 51

శ్లో॥ కర్పూరద్యుతితస్కరేణ మహసా కల్మాషయత్యాననం
శ్రీకాఞ్చీపురనాయికే! పతిరివ శ్రీమన్దహాసోఽపి తే।
ఆలిఙ్గత్యతిపీవరాం స్తనతటీం బిమ్బాధరం చుమ్బతి
ప్రౌఢం రాగభరం వ్యనక్తి మనసో ధైర్యం ధునీతేతరామ్॥ 52

శ్లో॥ వైశద్యేన చ విశ్వతాపహరణక్రీడాపటీయస్తయా
పాణ్డిత్యేన పచేలిమేన జగతాం నేత్రోత్సవోత్పాదనే।
కామాక్షి! స్మితకన్దలైస్తవ తులామారోఢుముద్యోగినీ
జ్యోత్స్నాసౌ జలరాశిపోషణతయా దూష్యాం ప్రపన్నా దశామ్॥ 53

శ్లో॥ లావణ్యామ్బుజినీమృణాలవలయైశ్శృఙ్గారగన్ధద్విప-
గ్రామణ్యః శ్రుతిచామరైస్తరుణిమస్వారాజ్యబీజాఙ్కురైః।
ఆనన్దామృతసిన్ధువీచిపృషతైరాస్యాబ్జహంసైస్తవ
శ్రీకామాక్షి! మథాన మన్దహసితైర్మత్కం మనఃకల్మషమ్॥ 54



శ్లో॥ ఉత్తుఙ్గస్తనమణ్డలీపరిచలన్మాణిక్యహారచ్ఛటా-
చఞ్చచ్ఛోణిమపుఞ్జమధ్యసరణిం మాతః పరిష్కుర్వతీ।
యా వైదగ్ధ్యముపైతి శఙ్కరజటాకాన్తారవాటీపత-
త్స్వర్వాపీపయసః స్మితద్యుతిరసౌ కామాక్షి తే మఞ్జులా॥ 55



శ్లో॥ సన్నామైకజుషా జనేన సులభం సంసూచయన్తీ శనై-
రుత్తుఙ్గస్య చిరాదనుగ్రహతరోరుత్పత్స్యమానం ఫలమ్।
ప్రాథమ్యేన వికస్వరా కుసుమవత్ప్రాగల్భ్యమభ్యేయుషీ
కామాక్షి! స్మితచాతురీ తవ మమ క్షేమఙ్కరీ కల్పతామ్॥ 56



శ్లో॥ ధానుష్కాగ్రసరస్య లోలకుటిలభ్రూలేఖయా బిభ్రతో
లీలాలోకశిలీముఖం నవవయస్సామ్రాజ్యలక్ష్మీపుషః।
జేతుం మన్మథమర్దినం జనని! తే మన్దస్మితప్రక్రమో
వల్గుర్విభ్రమభూభృతో వితనుతే సేనాపతిప్రక్రియామ్॥ 57



శ్లో॥ యన్నాకమ్పత కాలకూటకబలీకారే చుచుమ్బే న యద్-
గ్లాన్యా చక్షుషి రూషితానలశిఖే రుద్రస్య తత్తాదృశమ్।
చేతో యత్ప్రసభం స్మరజ్వరశిఖిజ్వాలేన లేలిహ్యతే
తత్కామాక్షి! తవ స్మితాంశుకణికాహేలాభవం ప్రాభవమ్॥ 58



శ్లో॥ సమ్భిన్నేవ సుపర్వలోకతటినీ వీచీచయైర్యామునైః
సంమిశ్రేవ శశాఙ్కదీప్తిలహరీ నీలైర్మహానీరదైః।
కామాక్షి! స్ఫురితా తవ స్మితరుచిః కాలాఞ్జనస్పర్ధినా
కాలిమ్నా కచరోచిషాం వ్యతికరే కాఞ్చిద్దశామశ్నుతే॥ 59



శ్లో॥ జానీమో జగదీశ్వరప్రణయిని! త్వన్మన్దహాసప్రభామ్
శ్రీకామాక్షి! కుముద్వతీమభినవామేషా యతస్సర్వదా।
ఆస్యేన్దోరవలోకనే పశుపతేరభ్యేతి సమ్ఫుల్లతాం
తన్ద్రాలుస్తదభావ ఏవ తనుతే తద్వైపరీత్యక్రమమ్॥ 60



శ్లో॥ యాన్తీ లోహితభావమభ్రతటినీ ధాతుచ్ఛటాకర్దమై-
ర్యాన్తీ బాలగభస్తిమాలికిరణైర్మేఘావలీ శారదీ।
బిమ్బోష్ఠద్యుతిపుఞ్జచుమ్బనకలాశోణాయమానేన తే
కామాక్షి! స్మితరోచిషా సమదశామారోఢుమాకాఙ్క్షతే॥ 61



శ్లో॥ శ్రీకామాక్షి! ముఖేన్దుభూషణమిదం మన్దస్మితం తావకం
నేత్రానన్దకరం తథా హిమకరో గచ్ఛేద్యథా తిగ్మతామ్।
శీతం దేవి! తథా యథా హిమజలం సన్తాపముద్రాస్పదం
శ్వేతం కిఞ్చ యథా తథా మలినతాం ధత్తే చ ముక్తామణిః॥ 62



శ్లో॥ త్వన్మన్దస్మితమఞ్జరీం ప్రసృమరాం కామాక్షి! చన్ద్రాతపం
సన్తస్సన్తతమామనన్త్యమలతా తల్లక్షణం లక్ష్యతే।
అస్మాకం న ధునోతి తాపమధికం ధూనోతి నాభ్యన్తరం
ధ్వాన్తం తత్ఖలు దుఃఖినో వయమమీ కేనేతి నో విద్మహే॥ 63



శ్లో॥ నమ్రస్య ప్రణయప్రరోహకలహచ్ఛేదాయ పాదాబ్జయో-
ర్మన్దం చన్ద్రకిశోరశేఖరమణేః కామాక్షి! రాగేణ తే।
బన్ధూకప్రసవశ్రియం జితవతో బంహీయసీం తాదృశీం
బిమ్బోష్ఠస్య రుచిం నిరస్య హసితజ్యోత్స్నా వయస్యాయతే॥ 64



శ్లో॥ ముక్తానామ్ పరిమోచనం విదధతస్తత్ప్రీతినిష్పాదినీ
భూయో దూరత ఏవ ధూతమరుతస్తత్పాలనం తన్వతీ।
ఉద్భూతస్య జలాన్తరాదవిరతం తద్దూరతాం జగ్ముషీ
కామాక్షి! స్మితమఞ్జరీ తవ కథం కమ్బోస్తులామశ్నుతే॥ 65



శ్లో॥ శ్రీకామాక్షి! తవ స్మితద్యుతిఝరీవైదగ్ధ్యలీలాయితం
పశ్యన్తోఽపి నిరన్తరం సువిమలం మన్యా జగన్మణ్డలే।
లోకం హాసయితుం కిమర్థమనిశం ప్రాకాశ్యమాతన్వతే
మన్దాక్షం విరహయ్య వస్తువిభవం మన్దారచన్ద్రాదయః॥ 66

శ్లో॥ క్షీరాబ్ధేరపి శైలరాజతనయే త్వన్మన్దహాసస్య చ
శ్రీకామాక్షి! వలక్షమోదయనిధేః కిఞ్చిద్భిదాం బ్రూమహే।
ఏకస్మై పురుషాయ దేవి స దదౌ లక్ష్మీం కదాచిత్పురా
సర్వేభ్యోఽపి దదాత్యసౌ తు సతతం లక్ష్మీం చ వాగీశ్వరీమ్॥ 67

శ్లో॥ శ్రీకాఞ్చీపురరత్నదీపకలికే! తాన్యేవ విశ్వాన్తరే
చాకోరాణి చరాచరేశ్వరి పరం ధన్యాని మన్యామహే।
కమ్పాతీరకుటుంబచంక్రమకలాచుంచూని చంచూపుటై-
ర్నిత్యం యాని తవ స్మితేన్దుమహసామాస్వాదమాతన్వతే॥ 68

శ్లో॥ శైత్యప్రక్రమమాశ్రితోఽపి నమతాం జాడ్యప్రథాం ధూనయ-
న్నాగవ్యఞ్జనపేశలోఽపి గిరిశే వైమల్యముల్లాసయన్।
లీలాలాపపురస్సరోఽపి సతతం వాచంయమాన్ ప్రీణయ-
న్కామాక్షి! స్మితరోచిషాం తవ సముల్లాసః కథం వర్ణ్యతే॥ 69

శ్లో॥ శ్రోణీచఞ్చలమేఖలాముఖరితం లీలాగతం మంథరం
భ్రూవల్లీచలనం కటాక్షవలనం మన్దాక్షవీక్షాచణమ్।
యద్వైదగ్ధ్యముఖేన మన్మథరిపుం సమ్మోహయత్యఞ్జసా
శ్రీకామాక్షి! తవ స్మితాయ సతతం తస్మై నమస్కుర్మహే॥ 70

శ్లో॥ శ్రీకామాక్షి! మనోజ్ఞమన్దహసితజ్యోతిష్ప్రరోహే తవ
స్ఫీతశ్వేతిమసార్వభౌమసరణిప్రాగల్భ్యమభ్యేయుషి।
చన్ద్రోఽయం యువరాజతాం కలయతే చేటీధురం చన్ద్రికా
గఙ్గా సా చ సుధాఝరీ సహచరీసాధర్మ్యమాలమ్బతే॥ 71

శ్లో॥ జ్యోత్స్నా కిం తనుతే ఫలం తనుమతామౌష్ణ్యప్రశాన్తిం వినా
త్వన్మన్దస్మితరోచిషా తనుమతాం కామాక్షి! రోచిష్ణునా।
సన్తాపోఽపి నివార్యతే నవవచఃప్రాచుర్యమఙ్కూర్యతే
సౌన్దర్యం పరిపూర్యతే జగతి సా కీర్తిశ్చ సఞ్చార్యతే॥ 72



శ్లో॥ వైమల్యం కుముదశ్రియాం హిమరుచః కాన్త్యైవ సన్ధుక్ష్యతే
జ్యోత్స్నారోచిరపి ప్రదోషసమయం ప్రాప్యైవ సమ్పద్యతే।
స్వచ్ఛత్వం నవమౌక్తికస్య పరమం సంస్కారతో దృశ్యతే
కామాక్ష్యాః స్మితదీధితేర్విశదిమా నైసర్గికో భాసతే॥ 73



శ్లో॥ ప్రాకాశ్యమ్ పరమేశ్వరప్రణయిని త్వన్మన్దహాసశ్రియః
శ్రీకామాక్షి! మమ క్షిణోతు మమతావైచక్షణీమక్షయామ్।
యద్భీత్యేవ నిలీయతే హిమకరో మేఘోదరే శుక్తికా-
గర్భే మౌక్తికమణ్డలీ చ సరసీమధ్యే మృణాలీ చ సా॥ 74



శ్లో॥ హేరమ్బే చ గుహే చ హర్షభరితం వాత్సల్యమఙ్కూరయ-
న్మారద్రోహిణి పూరుషే సహభువం ప్రేమాఙ్కురం వ్యఞ్జయత్।
ఆనమ్రేషు జనేషు పూర్ణకరుణావైదగ్ధ్యముత్తాలయ-
న్కామాక్షి! స్మితమఞ్జరీ తవ కథంకారం మయా కథ్యతే॥ 75



శ్లో॥ సంక్రుద్ధద్విజరాజకోఽప్యవిరతం కుర్వన్ద్విజైస్సఙ్గమం
వాణీపద్ధతిదూరగోఽపి సతతం తత్సాహచర్యం వహన్।
అశ్రాన్తం పశుదుర్లభోఽపి కలయన్పత్యౌ పశూనాం రతిం
శ్రీకామాక్షి! తవ స్మితామృతరసస్యన్దో మయి (స్ప)స్యన్దతామ్॥ 76



శ్లో॥ శ్రీకామాక్షి! మహేశ్వరే నిరుపమప్రేమాఙ్కురప్రక్రమం
నిత్యం యః ప్రకటీకరోతి సహజామున్నిద్రయన్మాధురీమ్।
తత్తాదృక్తవ మన్దహాసమహిమా మాతః కథం మానితాం
తన్మూర్ధ్నా సురనిమ్నగాం చ కలికామిన్దోశ్చ తాం నిన్దతి॥ 77



శ్లో॥ యే మాధుర్యవిహారమణ్డపభువో యే శైత్యముద్రాకరా
యే వైశద్యదశావిశేషసుభగాస్తే మన్దహాసాఙ్కురాః।
కామాక్ష్యాస్సహజం గుణత్రయమిదం పర్యాయతః కుర్వతాం
వాణీగుమ్ఫనడమ్బరే చ హృదయే కీర్తిప్రరోహే చ మే॥ 78



శ్లో॥ కామాక్ష్యా మృదులస్మితాంశునికరా దక్షాన్తకే వీక్షణే
మన్దాక్షగ్రహిలా హిమద్యుతిమయూఖాక్షేపదీపాఙ్కురాః।
దాక్ష్యం పక్ష్మలయన్తు మాక్షికగుడద్రాక్షాభవం వాక్షు మే
సూక్ష్మం మోక్షపథం నిరీక్షితుమపి ప్రక్షాలయేయుర్మనః॥ 79



శ్లో॥ జాత్యా శీతలశీతలాని మధురాణ్యేతాని పూతాని తే
గాఙ్గానీవ పయాంసి దేవి! పటలాన్యల్పస్మితజ్యోతిషామ్।
ఏనఃపఙ్కపరమ్పరామలినతామేకామ్రనాథప్రియే!
ప్రజ్ఞానాత్సుతరాం మదీయధిషణాం ప్రక్షాలయన్తు క్షణాత్॥ 80



శ్లో॥ అశ్రాన్తం పరతన్త్రితః పశుపతిస్త్వన్మన్దహాసాఙ్కురైః
శ్రీకామాక్షి! తదీయవర్ణసమతాసఙ్గేన శఙ్కామహే।
ఇన్దుం నాకధునీం చ శేఖరయతే మాలాం చ ధత్తే నవై-
ర్వైకుణ్ఠైరవకుణ్ఠనం చ కురుతే ధూలీచయైర్భాస్మనైః॥ 81



శ్లో॥ శ్రీ కాఞ్చీపురదేవతే! మృదువచస్సౌరభ్యముద్రాస్పదం
ప్రౌఢప్రేమలతానవీనకుసుమం మన్దస్మితం తావకమ్।
మన్దం కన్దలతి ప్రియస్య వదనాలోకే సమాభాషణే
శ్లక్ష్ణే కుట్మలతి ప్రరూఢపులకే చాశ్లేషణే ఫుల్లతి॥ 82



శ్లో॥ కిం త్రైస్రోతసమమ్బికే పరిణతం స్రోతశ్చతుర్థం నవం
పీయూషస్య సమస్తతాపహరణం కింవా ద్వితీయం వపుః।
కింస్విన్నైకటికం గిరో మధురిమాభ్యాసాయ న(గ)వ్యం పయః
శ్రీకాఞ్చీపురనాయకప్రియతమే! మన్దస్మితం తావకమ్॥ 83



శ్లో॥ భూషా వక్త్రసరోరుహస్య సహజా వాచాం సఖీ శాశ్వతీ
నీవీ విభ్రమసన్తతేః పశుపతేస్సౌధీ దృశాం పారణా।
జీవాతుర్మదనశ్రియశ్శశిరుచేరుచ్చాటనీ దేవతా
శ్రీకామాక్షి! గిరామభూమిమయతే హాసప్రభామఞ్జరీ॥ 84

శ్లో॥ సూతిశ్శ్వేతిమకన్దలస్య వసతిశ్శృఙ్గారసారశ్రియః
పూర్తిః సూక్తిఝరీరసస్య లహరీ కారుణ్యపాథోనిధేః।
వాటీ కాచన కౌసుమీ మధురిమస్వారాజ్యలక్ష్మ్యాస్తవ
శ్రీకామాక్షి! మమాస్తు మఙ్గలకరీ హాసప్రభాచాతురీ॥ 85

శ్లో॥ జన్తూనాం జనిదుఃఖమృత్యులహరీసన్తాపనం కృన్తతః
ప్రౌఢానుగ్రహపూర్ణశీతలరుచో నిత్యోదయం బిభ్రతః।
శ్రీకామాక్షి! విసృత్వరా ఇవ కరా హాసాఙ్కురాస్తే హఠా-
దాలోకేన నిహన్యురన్ధతమసస్తోమస్య మే సన్తతిమ్॥ 86

శ్లో॥ ఉత్తుఙ్గస్తనమణ్డలస్య విలసల్లావణ్యలీలానటీ-
రఙ్గస్య స్ఫుటమూర్ధ్వసీమని ముహుః ప్రాకాశ్యమభ్యేయుషీ।
శ్రీకామాక్షి! తవ స్మితద్యుతితతిర్బిమ్బోష్ఠకాన్త్యఙ్కురై-
శ్చిత్రాం విద్రుమముద్రితాం వితనుతే మౌక్తీం వితానశ్రియమ్॥ 87

శ్లో॥ స్వాభావ్యాత్తవ వక్త్రమేవ లలితం సన్తోషసమ్పాదనం
శమ్భోః కిం పునరఞ్చితస్మితరుచః పాణ్డిత్యపాత్రీకృతమ్।
అమ్భోజం స్వత ఏవ సర్వజగతాం చక్షుఃప్రియంభావుకం
కామాక్షి! స్ఫురితే శరద్వికసితే కీదృగ్విధం భ్రాజతే॥ 88

శ్లో॥ పుమ్భిర్నిర్మలమానసైర్విదధతే మైత్రీరసం నిర్మలం
కర్తుం కర్మలయం చ నిర్మలతమాం కీర్తిం లభన్తేతరామ్।
సూక్తిం పక్ష్మలయన్తి నిర్మలగుణాం యత్తావకాస్సేవకా-
స్తత్కామాక్షి! తవ స్మితస్య కలయా నైర్మల్యసీమానిధేః॥ 89

శ్లో॥ ఆకర్షన్నయనాని నాకిసదసాం శైత్యేన సంస్తమ్భయ-
న్నిన్దుం కిఞ్చ విమోహయన్పశుపతిం విశ్వార్తిముచ్చాటయన్।
హింసన్ సంసృతిడమ్బరం తవ శివే! హాసాహ్వయో మాన్త్రికః
శ్రీకామాక్షి! మదీయతాపతమసోవిద్వేషణే చేష్టతామ్॥ 90



శ్లో॥ క్షేపీయః క్షపయన్తు కల్మషభయాన్యస్మాకమల్పస్మిత-
జ్యోతిర్మణ్డలచంక్రమాస్తవ శివే! కామాక్షి! రోచిష్ణవః।
పీడాకర్మఠకర్మఘర్మసమయవ్యాపారతాపానల-
శ్రీపాతా నవహర్షవర్షణసుధాస్రోతస్వినీశీకరాః॥ 91



శ్లో॥ శ్రీకామాక్షి! తవ స్మితైన్దవమహఃపూరే పరిస్ఫూర్జతి
ప్రౌఢాం వారిధిచాతురీం కలయతే భక్తాత్మనాం ప్రాతిభమ్।
దౌర్గత్యప్రసరాస్తమఃపటలికాసాధర్మ్యమాబిభ్రతే
కిం కిం కైరవసాహచర్యపదవీరీతిం న ధత్తే పదమ్॥ 92



శ్లో॥ మన్దారాదిషు మన్మథారిమహిషి! ప్రాకాశ్యరీతిం నిజాం
కాదాచిత్కతయా విశఙ్క్య బహుశో వైశద్యముద్రాగుణః।
శ్రీకామాక్షి! తదీయసఙ్గమకలామన్దీభవత్కౌతుకః
సాతత్యేన తవ స్మితే వితనుతే స్వైరాసనావాసనామ్॥ 93



శ్లో॥ ఇన్ధానే భవవీతిహోత్రనివహే కర్మౌఘచణ్డానిల-
ప్రౌఢిమ్నా బహులీకృతే నిపతితం సన్తాపచిన్తాకులమ్।
మాతర్మాం పరిషిఞ్చ కిఞ్చిదమలైః పీయూషవర్షైరివ
శ్రీకామాక్షి! తవ స్మితద్యుతికణైః శైశిర్యలీలాకరైః॥ 94



శ్లో॥ భాషాయా రసనాగ్రఖేలనజుషశ్శృఙ్గారముద్రాసఖీ
లీలాజాతరతేః సుఖేన నియమస్నానాయ మేనాత్మజే।
శ్రీకామాక్షి! సుధామయీవ శిశిరా స్రోతస్వినీ తావకీ
గాఢానన్దతరఙ్గితా విజయతే హాసప్రభాచాతురీ॥ 95



శ్లో॥ సన్తాపం విరలీకరోతు సకలం కామాక్షి! మచ్చేతనా
మజ్జన్తీ మధురస్మితామరధునీకల్లోలజాలేషు తే।
నైరన్తర్యముపేత్య మన్మథమరుల్లోలేషు యేషు స్ఫుటం
ప్రేమేన్దుః ప్రతిబిమ్బితో వితనుతే కౌతూహలం ధూర్జటేః॥ 96



శ్లో॥ చేతఃక్షీరపయోధిమన్థనచలద్రాగాఖ్యమన్థాచల-
క్షోభవ్యాపృతిసంభవాం జనని! తే మన్దస్మితశ్రీసుధామ్।
స్వాదంస్వాదముదీతకౌతుకరసా నేత్రత్రయీ శాఙ్కరీ
శ్రీకామాక్షి! నిరన్తరం పరిణమత్యానన్దవీచీమయీ॥ 97



శ్లో॥ ఆలోకే తవ పఞ్చసాయకరిపోరుద్దామకౌతూహల-
ప్రేఙ్ఖన్మారుతఘట్టనప్రచలితాదానన్దదుగ్ధామ్బుధేః।
కాచిద్వీచిరుదఞ్చతి ప్రతినవా సంవిత్ప్రరోహాత్మికా
తాం కామాక్షి! కవీశ్వరాః స్మితమితి వ్యాకుర్వతే సర్వదా॥ 98



శ్లో॥ సూక్తిశ్శీలయతే కిమద్రితనయే మన్దస్మితాత్తే ముహు-
ర్మాధుర్యాగమసంప్రదాయమథవా సూక్తేస్తు మన్దస్మితమ్।
ఇత్థం కామపి గాహతే మమ మనస్సందేహమార్గభ్రమీం
శ్రీకామాక్షి! న పారమార్థ్యసరణిస్ఫూర్తౌ నిధత్తే పదమ్॥ 99



శ్లో॥ క్రీడాలోలకృపాసరోరుహముఖీసౌధాఙ్గణేభ్యః కవి-
శ్రేణీవాక్పరిపాటికామృతఝరీసూతీగృహేభ్యశ్శివే!।
నిర్వాణాఙ్కురసార్వభౌమపదవీసింహాసనేభ్యస్తవ
శ్రీకామాక్షి! మనోజ్ఞమన్దహసితజ్యోతిష్కణేభ్యో నమః॥ 100



శ్లో॥ ఆర్యామేవ విభావయన్మనసి యః పాదారవిన్దం పురః
పశ్యన్నారభతే స్తుతిం స నియతం లబ్ధ్వా కటాక్షచ్ఛవిమ్।
కామాక్ష్యా మృదులస్మితాంశులహరీజ్యోత్స్నావయస్యాన్వితా-
మారోహత్యపవర్గసౌధవలభీమానన్దవీచీమయీమ్॥ 101



శ్రీః

# మూకపఞ్చశతీ

# మన్దస్మితశతకమ్

## సారోల్లాసినీ వ్యాఖ్యా



శ్లో॥ బధ్నీమో వయమఞ్జలిం ప్రతిదినం బన్ధచ్ఛిదే దేహినాం
కన్దర్పాగమతన్త్రమూలగురవే కల్యాణకేలీభువే।
కామాక్ష్యా ఘనసారపుఞ్జరజసే కామద్రుహశ్చక్షుషాం
మన్దారస్తబకప్రభామదముషే మన్దస్మితజ్యోతిషే॥ 1

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| దేహినామ్ | = | ప్రాణులయొక్క; |
| బన్ధచ్ఛిదే | = | బంధమును పోగొట్టు; |
| కన్దర్పాగమతన్త్రమూలగురవే | = | కన్దర్పాగమమనెడి తన్త్రమునకు మొదటి గురువైన; |
| కల్యాణకేళీభువే | = | కల్యాణములాడుకొను; |
| కామద్రుహః | = | కామద్రోహియైన శివునియొక్క; |
| చక్షుషామ్ | = | కన్నులకు; |
| ఘనసారపుంజరజసే | = | గద్దకర్పూరముయొక్క పొడియైన; |
| మందారస్తబకప్రభామదముషే | = | మందారపుష్పగుచ్ఛముల మదమును దొంగిలించు; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| మందస్మితజ్యోతిషే | = | చిరునవ్వనెడి వెలుగునకై; |
| ప్రతిదినమ్ | = | దినదినము; |
| వయమ్ | = | మేము; |
| అంజలిమ్ | = | దోసిలిని; |
| బధ్నీమః | = | పట్టెదము (కట్టెదము). |

**తాత్పర్యము:-**

బహువిధతంత్రములలో కామతంత్రమొకటి. దానికి కామాక్షి చిఱునవ్వు వెలుగే

మొదటి గురువు. అది ప్రాణుల బంధముల ఛేదించును. కల్యాణము లాడుకొను (చోటు) శివుని కన్నులకు కర్పూరపరాగము అది. మందారస్తబక కాంతిని దొంగిలించినట్టిదియు నైన కామాక్షీదేవియొక్క ఆ మందస్మితకాంతికై ప్రతిదినము దోసిలొగ్గుచున్నాము.

**వివరణము :-**

1) పురుషార్థములు నాలుగనుట భారతీయ సంప్రదాయము. అవి **ధర్మము, అర్థము, కామము, మోక్షము** అనునవి. వీనిలో తృతీయము కామము. తురీయము మోక్షము, స్థూలముగ మోక్షము నిత్యసుఖము కావున తృతీయమైన కామము అనిత్య సుఖరూపము గావున పురుషార్థములలో మోక్షమునకే అగ్రస్థానము. కాని మోక్షము కోరువారు అరుదుగానే ఉందురు. కామ పురుషార్థమును అర్థించని వారు, దాదాపుగ ఉండరనియే చెప్పవచ్చును. కాని ఇచ్చటి కామపదము నిత్యా నిత్య సుఖములను రెండింటిని సంగ్రహించునదిగా నున్నది. కామమోక్షములకు రెండింటికి ధర్మార్థములు సాధనములే. కాని అవి లేకయే కామమోక్షములు సంభవించునెడ ధర్మార్థములనెవ్వరు కోరరు. అట్టి సందర్భమున వానిని పురుషార్థములలో చేర్చుటయే అనుచితమగును. కానీ ధర్మములేనిదే అర్థకామములుగాని, మోక్షముగాని సిద్ధింపక పోవుటచేత ధర్మమునకు ప్రాధాన్య మీయబడినది. అర్థము, కామము అను రెండింటికి భేదము రూఢియై ఉన్నది. ధనము అర్థమని, స్త్రీ సుఖము కామమని లోక ప్రసిద్ధి యున్నది. ధనము సుఖసాధనమే గానీ సుఖరూపము కాదు. బంధమునుండి విడివడుటయే మోక్షమని చెప్పినపుడు అది కూడా సుఖసాధనము యగును కాని సుఖరూపము కాదు. సాధ్యసాధనములకు అవినాభావ మంగీకరించి ఇవి అన్నియు పురుషార్థములని చెప్పబడినది. కామము అనునది కోరబడునది అను అర్థములో సంసారసుఖము మోక్షసుఖము రెండింటిని సంగ్రహించును. అమ్మవారి మందస్మితము ప్రాణులయొక్క సంసారబంధమును తొలగించును. అందువలన అది మోక్షప్రదము. కాని ఇచట అమ్మవారు **'కామాక్షి'**. ఆమె రెండుకన్నులలో కామమొక్కటీ ఉన్నది. అది లౌకికాలౌకిక సుఖములను అనగా కామమోక్షములను రెండింటిని తనలో ఇముడ్చుకున్నది. ఆమె కటాక్షమునకు పాత్రుడైన వాడు, లౌకికసుఖముతోబాటు అలౌకికమైన మోక్షసుఖమును పొందగలడు. కామతంత్రము అనునది ఇహపరలోక సాధనము. మోక్షసాధనము కూడ. శ్రీవిద్యాతంత్రములలో కాదివిద్య కామరాజోపాసితము. అదియే ఇచట కందర్పాగమతంత్రమని చెప్పబడినది. అర్థాదులు మంగళరూపములు. అవియును అమ్మవారి మందస్మితపాత్రునకు సంభవించును. మందస్మితము కన్నులలో సైతము దోబూచులాడుచుండును. అది ప్రధానముగ పెదవులు విచ్చుకొనుటలో నుండినను, దాని తళుకులు కన్నులలో కనపడక మానవు. శివుని కన్నులలో కుడికన్ను సూర్యరూపము, ఫాలనేత్రము అగ్ని రూపము అవి ఎప్పుడు మండుచునే యుండును. అమ్మవారిని చూచునప్పుడు మాత్రము వాని తాపము శంకరునకే తెలియదు. కామాక్షీదేవియొక్క

మందస్మితము శంకరునకే కర్పూరపుపూత యగును. మందారస్తబకములు తెల్లనివి. మందస్మితమే వాని గర్వమును అపహరించినది. ఈ శ్లోకమున మందస్మితజ్యోతి కందార్పాగమతంత్ర మూలగురువుగ, ఘనసారపుంజరజముగ, మందారస్తబక మదాపహర్తగా ఉత్ప్రేక్షింపబడుటచేత మాలోత్ప్రేక్షాలంకారము కలదు. ఈ శ్లోకము శార్దూల విక్రీడితఛందస్సున నిబంధింపబడినది. దీనికి పన్నెండు అక్షరముల తర్వాత విరామముండవలెను. ప్రతిపాదమునకు పందొమ్మిది అక్షరములుండవలెను. వరుసగా **మసజసతతగ** అను గణములు ఉండవలెను. ఈ శ్లోకమున దాక్షిణాత్య సంప్రదాయము ననుసరించి ఒకటవ పదమూడవ వర్ణములకు మైత్రి పాటింప బడినది. అది కూడా అదే అక్షరముయొక్క పునరావృత్తిచేత అనుప్రాసాలంకార మగుచున్నది. దేహిబన్ధచ్ఛేదకమైన అమ్మవారి మన్దస్మితమున కంజలిని బంధించుచున్నా మనుటలో విరోధాలంకారస్ఫూర్తి కలదు. మందస్మితమందు చేయబడిన గురుత్వారోపముచేత ఆతని యందు బన్ధచ్ఛేదకత్వమున్నదని, గురువు లేని వారలకు సంసారబంధచ్ఛేదము లేదని **బన్ధచ్ఛిదే, గురవే** అను రెండు మందస్మిత విశేషణములచేత వ్యంగ్యమగుటచే నిట వస్తుధ్వని కూడ కలదు.

2) సూర్యాశ్వైర్యది మః సజౌ సతతగాః శార్దూలవిక్రీడితమ్। ఇతి లక్షణమ్.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మందస్మితమున గురుత్వము బన్ధచ్ఛేదకత్వము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆచార్యత్వము బన్ధచ్ఛేదానంతరలభ్యాద్వైతము చెప్పబడుచున్నది.

**శ్లో॥ సధ్రీచే నవమల్లికాసుమనసాం నాసాగ్రముక్తామణే-**
**రాచార్యాయ మృణాలకాణ్డమహసాం నైసర్గికాయ త్విషే।**
**స్వర్ధున్యా సహ యుధ్వనే హిమరుచేరర్ధాసనాధ్యాసినే**
**కామాక్ష్యాః స్మితమఞ్జరీధవలిమాద్వైతాయ తస్మై నమః॥ 2**

**ప్రతిపదార్థము:-**

నవమల్లికాసుమనసామ్ = కొత్తమల్లెపూలకు;
సధ్రీచే = సాటియైన;
నాసాగ్రముక్తామణేః = ముక్కునత్తుయొక్క;
ఆచార్యాయ = గురువైన;
మృణాళకాండమహసామ్ = తామరతూండ్ల కాంతులకు;
నైసర్గికాయ = సహజమైన;
త్విషే = కాంతిరూపమైన;

| | | |
|---|---|---|
| స్వర్ధున్యా | = | ఆకాశగంగతో; |
| సహ యుధ్వనే | = | (కూడి) పోరాడు; |
| హిమరుచేః | = | చంద్రునియొక్క; |
| అర్ధాసనాధ్యాసినే | = | అర్ధసింహాసనము అధిష్ఠించిన; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| తస్మై | = | ఆ; |
| స్మితమంజరీధవలిమాద్వైతాయ | = | చిఱునవ్వు గుత్తుల తెలుపను అద్వైతమునకు (ఏకీభావమునకు); |
| నమః | = | నమస్సు. |

**తాత్పర్యము:-**

అమ్మవారి మందస్మితము కొత్త మల్లెపూలకు సాటి. నాసికా భూషణము నకు గురువు. తామరతూండ్ల సహజకాంతికి అభిన్నము. ఆ మందస్మితము ఆకాశగంగతో పోరాడును. చంద్రుని యర్ధసింహాసనము నధిష్ఠించును. అమ్మవారి చిఱునవ్వనగా అది యొక ధవలిమాద్వైతము. సర్వధావళ్యముల సమాహారము. దానికి నమస్కారము.

**వివరణము :-**

కొత్త మల్లెపూలతో అమ్మవారి స్మితమంజరి సాటియని చెప్పుటచే లుప్తోపమాలంకారము, నాసాగ్రముక్తామణికి గురువని చెప్పుటచే అతిశయోక్త్య లంకారము. తామరతూండ్ల కాంతుల సహజకాంతి దీని యందు కలదనుటచే పదార్థవృత్తి నిదర్శనము. ఆకాశగంగతో పోరాడుననుటచే ప్రతీపాలంకారము, చంద్రునియొక్క అర్ధాసన మధిష్ఠించుననుటచే ఉత్ప్రేక్షాలంకారము. ఈ అలంకారములన్నియు స్మితమంజరీధవలిమ యందు ఏకీభావము నందుచున్నవి కావున ఇట పై అలంకారములయొక్క సంసృష్టి, మందస్మిత మందు (ధవలిమయొక్క) అద్వైత తత్త్వమారోపించుటచేత అద్వైతసిద్ధాంతము నందు కవియొక్క ఆదరము వ్యంగ్యమగుచున్నది. ధవలిమాద్వైతమునకు ఆచార్యాయ అను విశేషణము చెప్పబడుటచే దర్శనములలో **ఉత్తరమీమాంస** (అద్వైతము) శ్రేష్ఠమనుట వ్యంగ్యమగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున మన్దస్మితమున **ఆచార్యత్వము అద్వైతసిద్ధి** చెప్పబడినది. ఈ శ్లోకమున **కామజనకత్వము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ కర్పూరద్యుతిచాతురీమతితరామల్పీయసీం కుర్వతీ**
**దౌర్భాగ్యోదయమేవ సంవిదధతీ దౌషాకరీణాం త్విషామ్।**
**క్షుల్లానేవ మనోజ్ఞమల్లినికరాన్ఫుల్లానపి వ్యఞ్జతీ**
**కామాక్ష్యా మృదులస్మితాంశులహరీ కామప్రసూరస్తు మే॥ 3**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కర్పూరద్యుతిచాతురీమ్ | = కప్పురపు కాంతుల నైపుణ్యమును; |
| అతితరామ్ | = మిక్కిలి; |
| అల్పీయసీమ్ | = చిన్నదానినిగ; |
| కుర్వతీ | = చేయుచున్నట్టి; |
| దోషాకరీణామ్ | = చంద్రసంబంధములైన; |
| త్విషామ్ | = కాంతులకు; |
| దౌర్భాగ్యోదయమేవ | = దౌర్భాగ్యపువృద్ధినే; |
| సంవిదధతీ | = కలిగించుచున్నట్టి; |
| ఫుల్లానపి | = వికసించియున్నను; |
| మనోజ్ఞమల్లినికరాన్ | = అందమైన మల్లెల గుంపులను; |
| క్షుల్లానేవ | = అల్పములుగానే; |
| వ్యంజతీ | = స్ఫురింపచేయుచున్నట్టి; |
| కామాక్ష్యాః | = కామాక్షీదేవియొక్క; |
| మృదులస్మితాంశులహరీ | = మెత్తని చిఱునవ్వుకాంతుల ప్రవాహము; |
| మే | = నాకు; |
| కామప్రసూః | = కామములను కలిగించునదిగా; |
| అస్తు | = ఉండుగాక. |

**తాత్పర్యము:-**

అమ్మవారి చిఱునవ్వు, కర్పూరపు కాంతిని చిన్నదానినిగ చేయుచున్నది. చంద్రుని కాంతులకు దౌర్భాగ్యమునే కలిగించుచున్నది. వికసించిన మల్లెపూలు సైతము అమె మందహాసము నెదుట క్షుద్రములే యగుచున్నవి. అట్టి కామాక్షీదేవియొక్క మందస్మిత కాంతి ప్రవాహము నాకు సర్వకామప్రద మగుగాక.

**వివరణము :-**

ఉపమానములైన కర్పూర, చంద్రకాంతి, మల్లికా పుష్పములను అమ్మవారి మందహాసము అతిశయించినదని చెప్పుటచే ఉపమాననింద కూడా **అల్పీయసీం, దౌర్భాగ్యోదయమేవ, క్షుల్లానేవ** అను పదములచే స్పష్టీకరించుటచే ఈ శ్లోకమున ప్రతీపాలంకారమున్నది. **"దోషాకరీణాం త్విషాం దౌర్భాగ్యోదయమేవ సంవిదధతీ"** అను రెండవ పాదముచేత దోషముల (పాపముల) నొనర్చినవారికి దౌర్భాగ్యమే కలుగునని, సౌభాగ్యము కలుగదను వస్తువు వ్యంగ్యమగుటచే వస్తుధ్వని యున్నది. నాలుగవ పాదమున కామాక్షీదేవియొక్క మృదులస్మితాంశులహరియందు కామప్రసూత్వము చెప్పబడుటచే లక్ష్మీత్వము వ్యక్తమయినను పై పాదమున చెప్పబడినట్లది దోషాకరదౌర్భాగ్యోదయమునే

కలిగించుటచే చంద్రకాంతి తోడి వైషమ్యము తద్వారమున వ్యతిరేకాలంకారధ్వనియు కలదు. దోషాకారదౌర్భాగ్య విధానము అమ్మవారు దుష్టులను నిగ్రహించుట, తద్వారా వారి కుత్తమలోకప్రాప్తి కలిగించుననుటయు వ్యంగ్యమగుచున్నది.



**అవ॥:-** పై శ్లోకమున సాధారణ **కామజనకత్వము** చెప్పబడినది. ఈ శ్లోకమున కామములలో పురుషార్థరూపమైన హృత్తాపనివారణము ప్రార్థింపబడుచున్నది.

**శ్లో॥ యా పీనస్తనమణ్డలోపరి లసత్కర్పూరలేపాయతే**
**యా నీలేక్షణరాత్రికాన్తితతిషు జ్యోత్స్నాప్రరోహాయతే।**
**యా సౌన్దర్యధునీతరఙ్గతతిషు వ్యాలోలహంసాయతే**
**కామాక్ష్యాశ్శిశిరీకరోతు హృదయం సా మే స్మితప్రాచురీ॥** 4

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| యా | = | ఏదైతే; |
| పీనస్తనమండలోపరి | = | లావైన స్తనమండలముపైన; |
| లసత్కర్పూరలేపాయతే | = | ప్రకాశించు కర్పూరపు పూతయగుచున్నదో; |
| యా | = | ఏదైతే; |
| నీలేక్షణరాత్రికాన్తితతిషు | = | నల్లని కన్నుల రాత్రుల కాంతుల గుంపులందు; |
| జ్యోత్స్నాప్రరోహాయతే | = | వెన్నెల మొలక యగుచున్నదో; |
| యా | = | ఏదైతే; |
| సౌందర్యధునీతరంగతతిషు | = | సౌందర్యనదీతరంగముల గుంపునందు; |
| వ్యాలోలహంసాయతే | = | కదలాడు హంసయగుచున్నదో; |
| సా | = | ఆ ; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| స్మితప్రాచురీ | = | నవ్వుల ఆధిక్యము; |
| మే హృదయమ్ | = | నాయొక్క ఎదను; |
| శిశిరీకరోతు | = | చల్లబరచుగాక. |

**తాత్పర్యము:-**

ఈ శ్లోకమున అమ్మవారి స్మితప్రాచురీ, ఆమె స్తనమండలముపై కర్పూర లేపమువలె, ఆమె కన్నుల రాత్రుల కాంతుల గుంపులందు వెన్నెల మొలకవలె, ఆమె సౌందర్యనదీతరంగసమూహములందు కదలాడు హంసవలెను ఆచరించు చున్నది.

**వివరణము :-**

1) అమ్మవారి స్తనమండలముపై నీలేక్షణరాత్రికాన్తితతులయందు సౌందర్య

ధునీతరంగతతులందు వరుసగా లసత్కర్పూరలేపమువలె, జ్యోత్స్నా ప్రరోహమువలె, వ్యాలోలహంసవలె అమ్మవారి స్మితప్రాచురి ఆచరించుచున్నదని చెప్పుటచే ఇందు మాలోపమాలంకారమున్నది. ఆ స్మితప్రాచురీ నా ఎదను చల్లబరచు గాక అని చెప్పుటచేత ఆ స్మితప్రాచురియందు వర్షారోపము ఇందు స్ఫురించు చుండుటచే ఇందు రూపకాలంకారము వ్యంగ్యమగుచున్నది. కావుననే భక్తుని (మూకకవి) హృదయగత తాపత్రయశాంతి నివారణము వ్యంగ్య మగుచున్నది. అమ్మవారి కన్నులు నల్లనివి, అవి రాత్రి కాంతులుగ రూపింపబడుటచే జ్యోత్స్నాప్రరోహము తోడి పోలికకు దోహదము నందించుచున్నది. అమ్మవారి నదీ సౌందర్యతరంగములందు, అమ్మవారి చిఱునవ్వు హంసవలె నాచరించుచున్నదని చెప్పుటచే అమ్మవారి సౌందర్య తరంగములకు మరింత శోభ కలుగుచున్నది. మొత్తము మీద అమ్మవారి చిఱునవ్వు ఆమె స్తనముల, కన్నుల, తదితరావయముల సౌందర్యమునకు కారణమగుటచే స్మితప్రాచురియొక్క సర్వావయవాతిశాయి సౌందర్యము వ్యక్తమగుచున్నది. భక్తులు ఏకాగ్రతకై అమ్మవారి అవయవములలో పాదములనో, చిఱునవ్వునో ఆశ్రయించుట కలదు. స్మితము కాంతిరూపముగ నుండుటచే దానికి జ్యోతిరూపమైన పరమాత్మతోడి అభేదానుసంధానము చక్కగా కుదురును. మొదటిపాదమున **స్తనమండలోపరి** అనుటచే కర్పూర లేపము పై(బాహ్య) తాపమునే హరించునని, రెండవపాదమున రాత్రి జ్యోత్స్న శబ్దములుండుటచే జ్యోత్స్న రాత్రియందు మాత్రమే బాహ్యాంధకారము నివారించ గలదని, మూడవ పాదమున హంసకు వ్యాలోల అను విశేషణ ముండుటచే హంసలకు అనగా సన్న్యాసులకు, నిర్గుణోపాసకులకును ప్రాథమికముగా ఉపాదేయమని మొత్తము శ్లోకముచేత కర్పూరలేపజ్యోత్స్నాప్రరోహవ్యాలోల హంసాతిశాయిత్వము అమ్మవారి స్మితప్రాచురియందు స్ఫురించుచున్నది.

2) కవి అధికమైన ఔష్ణ్యము కలిగిన దక్షిణ భారతదేశమునందు నివసించు వాడగుటచే హృదయశిశిరీకరణమును కోరుచున్నాడు. ఒకవేళ నతడు పాశ్చాత్త్యములైన చలిదేశములలో పుట్టియుండెనేని హృదయమునకు వెచ్చదనము కలిగించుటను కోరుకొనెడివాడు.



**అవ:-** పై శ్లోకమున హృత్తాపహరణము ప్రార్థింపబడినది. ఈ శ్లోకమున హృత్తాప హేతువైన మమతయొక్క హరణము ప్రార్థింపఁబడుచున్నది.

**శ్లో॥ యేషాం గచ్ఛతి పూర్వపక్షసరణిం కౌముద్వతః శ్వేతిమా**
**యేషాం సన్తతమారురుక్షతి తులాకక్ష్యాం శరచ్చన్ద్రమాః।**
**యేషామిచ్ఛతి కమ్బురప్యసులభామన్తేవసత్త్వప్రక్రియాం**
**కామాక్ష్యా మమతాం హరన్తు మమ తే హాసత్విషామఙ్కురాః॥ 5**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| యేషామ్ | = | వేనికి |
| కౌముద్వతః | = | తెల్లకలువకు వెన్నెలరాత్రికి సంబంధించిన; |
| శ్వేతిమా | = | తెలుపు; |
| పూర్వపక్షసరణిమ్ | = | పూర్వపక్షమార్గమును; |
| గచ్ఛతి | = | పొందుచున్నదో; |
| యేషామ్ | = | వేనియొక్క |
| తులాకక్ష్యామ్ | = | సమత్వకక్ష్యను; |
| శరచ్చంద్రమాః | = | శరత్కాలపు చంద్రుడు; |
| సంతతమ్ | = | ఎల్లప్పుడు; |
| ఆరురుక్షతి | = | ఎక్కగోరుచున్నాడో; |
| యేషామ్ | = | వేనికి; |
| కంబురపి | = | శంఖము కూడ; |
| అసులభామ్ | = | దుర్లభమైన; |
| అంతేవసత్త్వప్రక్రియామ్ | = | శిష్యత్వమును; |
| ఇచ్ఛతి | = | కోరుచున్నదో; |
| తే | = | ఆ; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క |
| హాసత్విషామ్ అంకురాః | = | నవ్వుకాంతులయొక్క మొలకలు; |
| మమ | = | నాయొక్క |
| మమతామ్ | = | మమకారమును; |
| హరంతు | = | అపహరించుగాక. |

తాత్పర్యము:-

అమ్మవారి మందహాసమునకు, వెన్నెలరాత్రి, తెల్లదనము, కలువల తెల్లదనము పూర్వ పక్షమార్గము నాశ్రయించుచున్నది. శరచ్చంద్రుడు తనకు అందనంత ఎత్తుగానున్న అమ్మవారి మందహాసముతోడి పోలికయను మెట్టును ఎల్లప్పుడును ఎక్కగోరుచునే యున్నాడు. శంఖముకూడ అమ్మవారి హాసాంకురములకు (సులభముకాని) శిష్యత్వమును కోరుచునేయున్నది. అమ్మవారి అట్టి మందహాసప్రకాశాంకురములు నాయొక్క మమకారమును అపహరించుగాక.

వివరణము :-

1) వెన్నెలరాత్రి తెల్లదనము పూర్వపక్షమార్గము పొందుచున్నది అనుటచేత మందహాసాంకురములకు సిద్ధాంతత్వము సంభవించుచున్నది. సాధారణముగ పూర్వపక్షము

కొట్టబడి, సిద్ధాంతము నిలుచును. మాసములో పూర్వపక్షము శుక్లపక్షము, రెండవపక్షము కృష్ణపక్షము. శుక్లపక్షమే పూర్వపక్షత్వమునందగా (అనగా కొట్టబడగా) ఇంక కృష్ణపక్షము విషయమున చెప్పవలసినదేమున్నది. రెండు పక్షములలోను కొన్ని వెన్నెల రాత్రులుండును. చాంద్రమాసమునకు శుక్లపక్షము పూర్వపక్షము, కృష్ణపక్షము ఉత్తరపక్షము అనుట, నెలలో చివరిదినము అమావాస్య అని అనుకొన్నప్పుడు మాత్రము సంభవించును. మాసము చివరి దినము అమావాస్యయగుట **అమాంతపక్ష** మనబడును. ఈ పక్షము కించిన్నవీన మనిపించును. కారణమేమనగ పున్నమకు (పూర్ణమాస) పౌర్ణమాసే అను పేరు వేదమున కనిపించును. దీని యర్థము నెల చివర దినము పున్నమ యనుటయే కదా. ఈ పక్షము **పూర్ణిమాంత** పక్షమనబడును. ఇది వేద సమ్మతమైన పక్షము. కానీ దక్షిణ దేశ వ్యవహారమున అమాంతపక్షమే ప్రబలముగ నుండుటచే శుక్లపక్షము పూర్వపక్షమగుచున్నది. ఇంతకు శుక్లపక్షమున కొన్ని రాత్ర్యారంభకాలమున వెన్నెల ఉండుటచే జనులు నిద్రించిన పిమ్మట వెన్నెల లేకపోయినను ఆ రాత్రులు శుక్లపక్షరాత్రులే. ఇక్కడ శుక్లపక్షమునకు పూర్వ పక్షత్వము వ్యవహారప్రక్రియ ననుసరించి సంభవించుచున్నది. జ్యోతిశ్శాస్త్రమున వ్యావహారికశుక్లపక్షము అను ప్రసిద్ధి యొకటి ఉన్నది. చంద్రునకాపక్షమున ప్రకాశకాలాధిక్య ముండును. ఇంతకు ఈ వివరణముయొక్క తాత్పర్యమేమనగా తెలుపెక్కువగా నుండు రాత్రులు గూడ అమ్మవారి హాసాంకురముల ముందర పూర్వపక్షమగుచున్నవని చెప్పుట. రాత్రుల వెన్నెలల ధావళ్యముల కంటే అమ్మవారి హాసాంకురముల తెలుపు అత్యధికమనుట తాత్పర్యము.

2) శరచ్చంద్రుడు మిగిలిన ఋతువులలోని చంద్రులకన్న అధికమైన తెలుపుదనము కలవాడు. అమ్మవారి చిఱునవ్వుతో పోలిక ఆయనకు అందనంత ఎత్తుగా ఉన్నది. అయినను తనకు ఆ పోలిక కావలెనని చంద్రుడు కోరుచునే ఉన్నాడనుటచే ఆ కోరిక ఎంతో కాలము నుండి యున్నది కాని అది తీరలేదనుట స్పష్టము. ఇది ఆరురుక్షతి అను క్రియలోని వర్తమానార్థక ప్రత్యయముచే ధ్వనించుచున్నది.

3) శంఖము అమ్మవారి హాసాంకురములకు వాని తెల్లదనమును కోరి శిష్యత్వమొనరించుచున్నది అని చెప్పుటచే అమ్మవారి హాసాంకురముల గురుత్వము వ్యంగ్యమగుచున్నది. పై మూడు వాక్యములందు ఉపమానతిరస్కార ముండుటచే ప్రతీపాలంకారము వ్యక్తమగుచున్నది.

4) మమకారము సంసారమునకు మూలము. అది అజ్ఞానజనితము. అది దోషరూపము. అది అంధకారరూపము. అమ్మవారి మందహాసకాంతులు మాత్రమే దానిని దొంగిలించగలవు. చీకటి పోవలెనన్న ఏ కర్మచేయవలెను? చీకటి కర్మవలన పోవునా? దేనిని ధ్యానించిన పోవును? ధ్యానమువలన చీకటి తొలగునా? మరి చీకటి ఎట్లు పోవును? కాంతిచేత మోక్షము సిద్ధించదని 'జ్ఞానాదేవ హి కైవల్యం' అను సిద్ధాంతము ననుసరించి జ్ఞానప్రకాశమువల్లనే మమతాదిరూపఅజ్ఞానాంధకారము తొలగునని నాలుగవపాదము

వ్యంజింప జేయుచున్నది. మమతారూపాజ్ఞానాంధకారము తొలగుట ఆత్మ జ్ఞాన ప్రకాశము కలుగుట. ఇదియే యథార్థమైన మోక్షము. సాలోక్యాదులు లోకాంతరవాసరూప మోక్షములే కాని విదేహకైవల్యరూపములు కావు.



**అవ:-** పై శ్లోకమున కల్మషక్లేశరూపమైన మమతయొక్క హరణము ప్రార్థింపబడినది. ఈ శ్లోకమున అమ్మవారి మందస్మితము నందు సమస్త కల్మష క్లేశాపాయ కరత్వము చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆశాసీమసు సన్తతం విదధతీ నైశాకరీం వ్యాక్రియాం**
**కాశానామభిమానభఙ్గకలనాకౌశల్యమాబిభ్రతీ।**
**ఈశానేన విలోకితా సకుతుకం కామాక్షి! తే కల్మష-**
**క్లేశాపాయకరీ చకాస్తి లహరీ మన్దస్మితజ్యోతిషామ్॥ 6**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| ఆశాసీమసు | = | దిగంతములయందు |
| నైశాకరీమ్ | = | చంద్రసంబంధమైన; |
| వ్యాక్రియామ్ | = | వ్యాపారమును; |
| సంతతమ్ | = | ఎల్లప్పుడు; |
| విదధతీ | = | చేయుచున్నదై; |
| కాశానామ్ | = | రెల్లుగడ్డి పోచలకు (రెల్లు పూలకు); |
| అభిమానభంగకలనాకౌశల్యమ్ | = | అభిమాన (గర్వ) భంగమును కలిగించు నేర్పును; |
| ఆబిభ్రతీ | = | పూర్తిగా భరించుచున్నట్టి; |
| ఈశానేన | = | శివునిచే; |
| సకుతుకమ్ | = | కుతూహలముతో; |
| విలోకితా | = | చూడబడినట్టి; |
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| తే | = | నీయొక్క; |
| కల్మషక్లేశాపాయకరీ | = | పాపములను దుఃఖములను తొలగించు; |
| మందస్మితజ్యోతిషామ్ | = | చిఱునవ్వు వెలుగులయొక్క; |
| లహరీ | = | ప్రవాహము; |
| చకాస్తి | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి చిఱునవ్వు కాంతుల ప్రవాహము దిగంతములయందు వెన్నెలను వ్యాపింపజేయుచున్నది. రెల్లుపూల గర్వమును నశింపజేయుచున్నది. పాపములను, దుః

ఖములను పోగొట్టుచున్నది. శివునిచేత ఎల్లప్పుడు చూడబడుచున్నది. అట్టి అమ్మవారి చిఱునవ్వుల వెలుగుల ప్రవాహము భక్తుల పాపదుఃఖములను పోగొట్టునదై నిరంతరము ప్రకాశించుచున్నది.

**వివరణము :-**

1) అమ్మవారి చిఱునవ్వుల వెలుగుల ప్రవాహము దిగంతములయందు వెన్నెలలను చిమ్ముచున్నదనుటచేత అమ్మవారి మందస్మితమునకు చంద్రకాంతి తోడి సామ్యము వ్యంగ్యమగుచున్నది. రెల్లుపూల గర్వభంగ మొనర్చునదని చెప్పుటచేత ప్రతీపాలంకారము వ్యంగ్యమగుచున్నది. ఈ పద్యమున దాక్షిణాత్య పద్ధతిలో పాదములలోని రెండవ అక్షరము ఒకటిగా నుండవలెనన్న ప్రాస నియమము పాటింపబడుచున్నది. మొదటి రెండు పాదములలో సంస్కృత పద్ధతి (ఛందస్సు) ననుసరించి 12 అక్షరముల తర్వాత యతి పాటింపబడినది. అంతేకాక తెలుగు ఉపజాతి ఛందస్సునకు సంబంధించిన ప్రాస యతి నియమము కూడ పాటింపబడినది. **క్లేశము** లనగా **అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము** అను నీ యైదు క్లేశములని **పాతంజలియోగశాస్త్రము**న చెప్పబడినది. **అవిద్య** యనగా అహంకారము. రాగమనగా కొందరి యెడల కలుగునట్టి ప్రేమ, ద్వేష మనగా కొందరియందు కలుగునట్టి పగ. **అభినివేశ** మనగా తప్పని తెలిసియు మానజాలని బలహీనత. కల్మషక్లేశములు నల్లని రంగు గలవని, చీకటి వంటివని కవి సమయము. అంధకారపు నలుపు వెలుగుతో పోవునట్లు కల్మషక్లేశాంధకారనైల్యముకూడ అమ్మవారి చిఱునవ్వుల వెలుగులు పోగొట్టగలవు.

2) లోకమున క్లేశములు కష్టములు బాధలు అను శబ్దములు సమానార్థకములుగా వాడబడుచున్నవి. కలికల్మషనాశినీత్యాది ప్రయోగములందు కల్మషశబ్దము పాపము అను అర్థమున వాడబడినది. మచ్చ అను అర్థము కూడ కల్మష శబ్దమునకు కలదు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మందస్మితమున కల్మష క్లేశాపాయ కరత్వము చెప్పబడినది. ఈ శ్లోకమున కల్మషక్లేశాపాయానంతరలభ్య మోక్షానంద రూపకామము కోరబడుచున్నది.

**శ్లో॥ ఆరూఢస్య సమున్నతస్తనతటీసామ్రాజ్యసింహాసనం**
**కన్దర్పస్య విభోర్జగత్త్రయజయప్రాకట్యముద్రానిధేః।**
**యస్యాశ్చామరచాతురీం కలయతే రశ్మిచ్ఛటాచఞ్చలా**
**సా మన్దస్మితమఞ్జరీ భవతు నః కామాయ కామాక్షి! తే॥ 7**

**ప్రతిపదార్థము:-**

సమున్నతస్తనతటీ సామ్రాజ్యసింహాసనమ్ } = ఎత్తైన స్తనమండల సామ్రాజ్య సింహాసనమును;

| | |
|---|---|
| ఆరూఢస్య | = ఎక్కిన; |
| జగత్త్రయజయప్రాకట్యముద్రానిధేః | = ముల్లోకముల జయమును ప్రకటించు చిహ్నములను మణులను ధరించిన; |
| విభోః | = ప్రభువైన; |
| కందర్పస్య | = మన్మథునకు; |
| యస్యాః | = యే కామాక్షీదేవి చిఱునవ్వుల గుత్తియొక్క |
| రశ్మిచ్ఛటాచంచలా | = కిరణముల కదలికల తళుకు మెఱుపుతీగె; |
| చామరచాతురీమ్ | = చామరముల నేర్పును (చామరభావమును); |
| కలయతే | = ధరించుచున్నదో; |
| తే | = నీయొక్క; |
| మందస్మితమంజరీ | = చిఱునవ్వులగుత్తి; |
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ! |
| నః | = మనయొక్క (మాయొక్క); |
| కామాయ | = కామసిద్ధికొఱకు; |
| భవతు | = అగుగాక. |

**తాత్పర్యము:-**

అమ్మవారి స్తనమండలమనే (మన్మథ) సామ్రాజ్యసింహాసనమున మన్మథుడు ఎక్కినాడు. ఆ ఎక్కుటలో లోకత్రయవిజయముయొక్క ప్రకటన చిహ్నములు పుష్కలముగ కానవచ్చుచున్నవి. ఆ విధముగ సామ్రాట్టు అయిన మన్మథునకు అమ్మవారి చిఱునవ్వుల వెలుగులు చామరములు వీయుచున్నట్లున్నవి. అట్టి ఆ చిఱునవ్వులగుత్తి భక్తులమయిన మా కోరికలను సిద్ధింపజేయుగాక.

**వివరణము :-**

ఒక చిన్న ప్రదేశమున అధికారముచేయు (వెలుగు) వానిని రాజందురు. అటువంటి చిన్న ప్రదేశములు పెక్కులు గల పెద్ద భూప్రాంతమును ఏలు వానిని మహారాజందురు. అట్టి మహారాజులందరినీ జయించి భూమండల మంతటినీ ఏకచ్ఛత్రాధిపతిగ ఏలు వానిని సమ్రాట్టు అందురు. ఇంద్రుడు త్రిలోకాధిపతి, నిజమైన సామ్రాజ్యమాతనిదే. మూడులోకములలో ఆయన ఏలుబడికి రాని ప్రదేశము ఉండదు. ఇది ఇట్లుండగ అమ్మవారి స్తనమండలము మన్మథుని సామ్రాజ్యసింహాసనము. అంతటి సౌందర్యముగ త్రిలోకములలో నెక్కడను ఉండదని సామ్రాజ్యమన్న పదము తెలియజేయుచున్నది. మన్మథునకు త్రిలోకాధిపత్యము లేకపోయినను ఇంద్రుని మించిన ఆధిక్యము జగత్త్రయ జయమును ప్రకటించు చిహ్నములున్నవని చెప్పుటచే వ్యంగ్యమగుచున్నది. పంచదశీ విద్యలలోని ఒక విద్యకు ఇంద్రుడు ద్రష్ట, అట్టివే మరి కొన్ని పంచదశీ విద్యలు గలవు. వాటన్నింటిలో కామోపాసితమైన **కాదివిద్య**

అత్యంతశ్రేష్ఠము. కాముడు అందుచేత ఉపాసనా విషయమున నింద్రుని మించి ఉపాసక సామ్రాట్టు అగుచున్నాడు. ప్రస్తుతము మన్మథుడు అమ్మవారి స్తనమండలమున సామ్రాజ్య సింహాసనమెక్కినాడు కదా, ఆతనికి వింజామరలు వీచిన దెవ్వరు? రశ్మిచ్ఛటా చంచలమైన అమ్మవారి మందస్మితమంజరి ఆ పని చేయుచున్నది. మంజరీ శబ్దమందలి స్త్రీలింగము అమ్మవారి చిఱునవ్వునందలి చామరగ్రాహిణ్యత్వమును తెలుపుచున్నది. సాధారణముగ చామరములు పట్టునది ఒక ఆడదియే యై ఉండును. కామారి యయిన శివునకు కాముని యధికారప్రాప్తిచేతనే అమ్మవారి యెడ కామసిద్ధి కలుగుటలో వింత లేదు. ఆ కామము శృంగారరూపము. భక్తుల కామము తదన్య వాంఛారూపము. అది అమ్మవారి చిఱునవ్వును పొందిన భాగ్యశాలియయిన భక్తునకు లభించును. దీనికి నిదర్శనము అమ్మవారి మంత్రమైన కాదివిద్య నుపాసించిన మన్మథుడు మూడు లోకముల జయించుట, త్రిలోకసామ్రాజ్య సింహాసనమధిష్ఠించుట. ఐదవ శ్లోకమున శరచ్చంద్రునకు అమ్మవారి చిఱునవ్వునకు సమానమైన ధర్మము నెక్కగోరుట అనగా ఆరురుక్షుత్వము చెప్పబడినది. ఆ చంద్రుడా తులాకక్ష్య నారోహించలేదు అని చెప్పబడినది. ఆ చంద్రుడును ఇంద్రునివలె పంచదశీ విద్యలలో నొకదానికి ద్రష్ట, దానికి **చంద్రవిద్య** యని పేరు. అయినను చంద్రునకారురుక్షుత్వమునుండి పై నుండు ఆరూఢస్థితి కెదుగుట కుదరలేదు. త్రిపురోపనిషత్తున నుద్ధరింపబడి మూలపంచదశి యయిన **కాదివిద్య** నుపాసించిన మన్మథుడు ఆరూఢస్థితి నందుకొన్నాడని ఈ శ్లోకమందలి **ఆరూఢస్య** అను పదము వ్యంజింప జేయుచున్నది. **"ఆరురుక్షోర్మునేర్యోగం కర్మకారణముచ్యతే। యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే"** (6.3) అని భగవద్గీత యోగారూఢునికి యోగారురుక్షువున కన్న పైస్థాన మొసగినది.



**అవ॥:-** పై శ్లోకమున అలౌకికమైన **ఆనందరూపమైన కామము** ప్రార్థింపబడినది. ఈ శ్లోకమున **సమస్తలౌకికశుభములు** ప్రార్థింపబడుచున్నవి.

**శ్లో॥ శమ్భోర్యా పరిరమ్భసంభ్రమవిధౌ నైర్మల్యసీమానిధిః**
**గైర్వాణీవ తరఙ్గిణీ కృతమృదుస్యన్దాం కలిన్దాత్మజామ్।**
**కల్మాషీకురుతే కలఙ్కసుషమాం కణ్ఠస్థలీచుమ్బినీం**
**కామాక్ష్యాః స్మితకన్దలీ భవతు సా కల్యాణసన్దోహినీ॥ 8**

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| యా | = ఏదైతే; |
| శంభోః | = శివునియొక్క |
| పరిరంభసంభ్రమవిధౌ | = కౌగిలించుకొనుటకై తొందరపడు విధానమునందు; |

| | |
|---|---|
| నైర్మల్యసీమానిధిః | = నిర్మలత్వముయొక్క సీమకు స్థానమైనదో; |
| గైర్వాణీ | = దేవతలకు సంబంధించిన; |
| తరంగిణీ | = నది(గంగ); |
| ఇవ | = వలె; |
| కృతమృదుస్యన్దామ్ | = మెల్లగా కదలు (స్రవించు); |
| కలిన్దాత్మజామ్ | = యమునానది ఆయన (వంటి); |
| కంఠస్థలీచుంబినీమ్ | = కంఠస్థలమును స్పృశించు; |
| కలంకసుషమామ్ | = మచ్చయొక్క కాంతిని; |
| కల్మాషీకురుతే | = నల్లగా చేయుచున్నదో; |
| సా | = ఆ; |
| కల్యాణసందోహినీ | = మంగలములను స్రవించు; |
| కామాక్ష్యాః | = కామాక్షీదేవియొక్క; |
| స్మితకందలీ | = మొలక నవ్వు; |
| కల్యాణసందోహినీ (భవతు) | = మంగలములను స్రవించునదియగు గాక. |

**తాత్పర్యము:-**

కామాక్షి స్మితకందలి గంగవలె నైర్మల్య సీమావధి. కామాక్షీదేవి శివుని కౌగిలించుకొన్నప్పుడు శివుని కంఠమందలి నల్లనిమచ్చ యమునవలె అమ్మవారి చిఱునవ్వు గంగయందు కలిసి గంగాయమునాసంగమ మేర్పడినది. అట్టి కామాక్షీదేవి స్మితకందలి భక్తులకందఱకు కల్యాణముల కలిగించుగాక.

**వివరణము :-**

గంగ గీర్వాణనది. గీర్వాణులవలె వారి నదియు తెల్లనిది. గీర్వాణు లనగా వాక్కు బాణముగా గలవారు, అనగా శాపాయుధులు. ఆయుధము నుపయోగించకయే తమ విరోధులను తిట్టి చంపగలరు. వాక్కు గూడ తెల్లనిదనుట కవి సమయము. వాగ్దేవియైన సరస్వతి సర్వశుక్లయనబడినది. గంగ తాను నిర్మలయగుటయే గాక తన యందు స్నాన మొనర్చిన వారిని నిర్మలుల జేయును. అంతేగాక స్మరించిన వారిని గూడ నిర్మలుల నొనర్చుటచే నదులన్నింట నైర్మల్య విషయమున ఉత్తమోత్తమ. అమ్మవారి స్మితకందలి ఆ గంగవలె నైర్మల్యసీమానిధి అని చెప్పుటచే నుపమాలంకారమున్నది. తెల్లని వారి సమక్షమున నల్లనివారి నలుపు మరింత బాగుగా స్పష్టమగును. ప్రయాగయందు గంగలో కలియకముందు గంగకు దగ్గఱనున్నప్పుడు యమునానదియొక్క నలుపు మరింత స్పష్టమగు చుండును. అట్లే శివుని కంఠమునందున్న నల్లని మచ్చ అమ్మవారి ఆలింగన సమయమున మరింత నల్లగా కనబడినది. నలుపు శివకంఠమునకు లోకక్షేమకృత్యమైన విషపానమున ఆగంతుకమైనది. యమునకు అనాదిసిద్ధము. జీవులకున్న అనాదియైన అజ్ఞానము వంటిది. యమున గంగలో కలిసినపుడు, ఈశ్వరైక్యసిద్ధి జీవులకు కలిగినప్పుడు అనాది నీలిమ,

అనాది అజ్ఞానము సంపూర్ణముగా తొలగిపోవును. మంచివారై పోవుదురు. యమునకు గంగా సంగమమట్టిది. అది శివశక్త్యాలింగనసమయ కృష్ణార్జున వర్ణసమ్మేళన రహస్యము. **"ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీన్దోః కిరణేష్వివాంకః"** *(కుమారసంభవం 1.3)* అని కాళిదాసు చెప్పియున్నాడు గదా! కణ్ఠనీలిమ ఏకదేశీయము. మందహాసకాంతి సర్వాంగవ్యాపనము మన్దహాసకాంతిలో కంఠనీలిమ లీనమగుట సహజమే.



**అవ:-** పై శ్లోకమున గంగాయమునానదీ సంగమము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున స్మితమంజరి కృపాస్రోతస్సున మునిగినట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ జేతుం హారలతామివ స్తనతటీం సంజగ్మృషీ సన్తతం**
**గన్తుం నిర్మలతామివ ద్విగుణితాం మగ్నా కృపాస్రోతసి।**
**వక్తుం విస్మయనీయతామివ హరం రాగాకులం కుర్వతీ**
**మఞ్జుస్తే స్మితమఞ్జరీ భవభయం మథ్నాతు కామాక్షి! మే॥ 9**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి = ఓ కామాక్షీదేవీ!
హారలతామ్ = తీగవంటి హారమును;
జేతుం = జయించుటకు;
సంతతమ్ = ఎల్లప్పుడు;
స్తనతటీమ్ = స్తనప్రదేశమును;
సంజగ్మృషీ ఇవ = చేరుచున్నట్లున్న;
ద్విగుణితామ్ = రెట్టింపైన;
నిర్మలతామ్ = నిర్మలత్వమును;
గంతుమ్ = పొందుటకు;
కృపాస్రోతసి = దయాప్రవాహమున;
మగ్నా ఇవ = మునిగినట్లున్న;
విస్మయనీయతామ్ = ఆశ్చర్యపడదగియుండుటను;
వక్తుమివ = చెప్పుటకన్నట్లు;
హరమ్ = శివుని;
రాగాకులమ్ = రాగవ్యాకులుని;
కుర్వతీ = చేయుచున్న;
మంజుః = మనోహరమైన;
తే = నీయొక్క;

స్మితమంజరీ = చిఱునవ్వుల గుత్తి;
మే = నాయొక్క
భవభయమ్ = సంసారభయమును;
మథ్నాతు = నశింపజేయుగాక!

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీదేవి! నీ చిఱునవ్వు గుత్తి హారలతను జయించుటకు స్తనప్రదేశము కడకు ఎల్లప్పుడు పోవుచున్నట్లున్నది. రెట్టింపైన నిర్మలత్వమును పొందుటకు దయా ప్రవాహమున మునిగినట్లున్నది. ఆశ్చర్యపడదగి యుండుటను చెప్పుటకు శివుని రాగాకులుని చేయుచున్నట్లున్నది. అట్టి నీ స్మితమంజరి నా సంసార (భవ) భయమును దొలగించుగాక!

**వివరణము :-**

**1)** మూడు పాదములలో వరుసగా స్మితమంజరియందు హారలతాజయ సంభావన, ద్విగుణితనిర్మలత్వప్రాప్తిసంభావన, విస్మయనీయతావచనసంభావన చేయబడుటచే మాలోత్ప్రేక్షాలంకారమున్నది. **2)** దయకు తెలుపు నిర్మలత్వ మున్నట్లు వర్ణించుట కవి సమయసిద్ధము. **3)** శివుని రాగాకులుని చేయుట అమ్మవారి చిఱునవ్వు గుత్తికి సహజమే అయినను రాగాకుల శబ్దములోని శ్లేష ననుసరించి తెల్లని శివునెఱ్ఱని వానినిగా చేయుట యను విశేషము స్ఫురించుచున్నది. అమ్మవారి చిఱునవ్వామె తాంబూలారుణాధర నిరతము గదా! అందుచే శివుని రాగాకులుని చేయగలుగు చున్నదా? తాంబూలారుణా ధరనిర్గమనమున తనకు సంక్రమించిన రాగము కారణముగా తన నిర్మలత్వము తగ్గిన దనుకొని కృపాప్రవాహమున మునిగి తన నిర్మలత్వమును ద్విగుణితము నొనర్చుకొను చున్నదా? ఇట్టి బహువిధభావనాప్రవాహములు రాగాకుల శబ్దశ్లేషధ్వనితము లగుచున్నవి. భయాదులు తామసములు గావున వానిని నల్లనివిగా నూహించు కొనవచ్చును. కృపాస్రోతోమగ్నమైన స్మితమంజరి తెల్లనిది గావున తామసమైన (నల్లని) భవభయమును మథించుటలోని ఔచిత్యము నాల్గవపాదమున స్ఫురించు చున్నది. మరియు మథనసమర్థములైన మన్థానాచలాదులు చేయలేని భవభయ మథనము నవలీలగా చేయగల మృదువైన స్మితమంజరియొక్క మహామహిమ ధ్వనించుచున్నది. ఈ హారలతా, నిర్మలతా శబ్దముల చివరలలో లతాశబ్దము పునరుక్తమగుటచే యమకాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమును శివుని రాగాకులత్వము ప్రస్తావింపబడినది.. ఈ శ్లోకమున శివునిలోని స్మరపావక సంధుక్షణము పేర్కొనబడుచున్నది.

**శ్లో॥ శ్వేతాపి ప్రకటం నిశాకరరుచాం మాలిన్యమాతన్వతీ**
**శీతాపి స్మరపావకం పశుపతేస్సన్ధుక్షయన్తీ సదా।**

స్వాభావ్యాదధరాశ్రితాపి నమతాముచ్చైర్దిశన్తీ గతిం
కామాక్షి! స్ఫుటమన్తరాస్ఫురతు నస్త్వన్మన్దహాసప్రభా॥ 10

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవి! |
| త్వన్మన్దహాసప్రభా | = నీ చిఱునవ్వుకాంతి; |
| శ్వేతాపి | = తెల్లనిదయినను; |
| ప్రకటమ్ | = స్పష్టముగా; |
| నిశాకరరుచామ్ | = చంద్రుని కాంతులకు; |
| మాలిన్యమ్ | = మాలిన్యమును; |
| ఆతన్వతీ | = కలిగించుచున్నదై; |
| శీతాపి | = చల్లనిదయినను; |
| పశుపతేః | = శివునకు; |
| స్మరపావకమ్ | = మన్మథాగ్నిని; |
| సదా | = ఎల్లప్పుడు; |
| సంధుక్షయన్తీ | = రగులుకొలుపుచున్నదై; |
| స్వాభావ్యాత్ | = స్వాభావికముగ; |
| అధరాశ్రితాపి | = పెదవిని (నీచులను) ఆశ్రయించినదైనను; |
| నమతామ్ | = నమస్కరించు వారికి; |
| ఉచ్చైః | = ఉన్నతమైన; |
| గతిమ్ | = గతిని; |
| దిశన్తీ | = ఇచ్చుచున్నదై; |
| స్ఫుటమ్ | = స్పష్టముగా; |
| నః | = మాయొక్క; |
| అన్తః | = లోపల; |
| ఆస్ఫురతు | = సంపూర్ణముగ స్ఫురించుగాక! |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ మందహాసప్రభ తెల్లనిదయ్యు చంద్రకాంతులకు మాలిన్యము నాపాదించుచున్నది. చల్లనిదయ్యు శివునిలో మన్మథాగ్నిని రగులు కొలుపుచున్నది. క్రింది పెదవి నాశ్రయించిన దయ్యు నమస్కరించు వారికి పై లోకములకు పోవుమార్గమును చూపుచున్నది. అట్టి నీ **మందహాసప్రభ** మాలో స్ఫురించుగాక!

**వివరణము :-**

**1)** నిశాకరునిలో మాలిన్యము (మచ్చ) కనిపించును కాని యాతని కాంతులలో

మాలిన్యములేదు. అమ్మవారి మందహాసము పెదవి దాటినదో లేదో చంద్రుని కాంతులలో ప్రకాశహీనత (మాలిన్యము) కలిగినది! అని **'రుచామ్'** అను పదముయొక్క అర్థము వలన స్ఫురించుటచే నిట అర్థశక్తిమూలవస్తుధ్వని ఉన్నది.

**2)** మొదటి మూడు పాదములలో **అపి** శబ్దముండుట చేత విరోధాభాసాలంకారము వాచ్యమైయున్నది. తెల్లనిదైన మందహాసప్రభ మాలిన్యము కలిగించుట, చల్లనిదైన మందహాసప్రభ మన్మథాగ్నిని రగులు కొలుపుట, అధరాశ్రితమైన మన్దహాసప్రభ ఉచ్చగతిని కలిగించుట అను విరోధములు మన్దహాసప్రభయొక్క మహిమాతిశయమువలన ఆభాసములై పోయినవి. మూడవ పాదమందలి **'అధరాశ్రితా'** అను సమాసమునందలి అధర శబ్దము నందు శ్లేష గలదు. ఆ శ్లేషముచే విరోధ మాభాసమైపోయినది. ఎట్లనగా అధర శబ్దమునకు ఒక అర్థము క్రింది పెదవి. మరొక అర్థము నీచులు, నీచార్థముననే విరోధము స్ఫురించును కాని పెదవి అను అర్థము చెప్పికొన్న విరోధముండదు. ఈ పాదమున నమస్కరించుచున్నవారికి అనగా క్రింది వంగుచున్న వారికి పైగతి లభించుచున్నదను మరొక విరోధము కూడ అమ్మవారి చిఱునవ్వుయొక్క మహిమాతిశయముచే ఆభాసమై పోవుచున్నది.

**3)** మన్దహాసమునకు శ్వేతత్వము కవి సమయసిద్ధము. స్వచ్ఛములైన దంతములు కొంచెము కనపడి కనపడనప్పుడుద్భవించుట మందహాసములోని శ్వేతత్వము, అనగా తెల్లదనము దంతముల తెలుపునుండి పుట్టినది కావచ్చును. కాని యా మన్దహాసమునకు శీతత్వము అనగా చల్లదనము ఎట్లు సంభవించును? అను ప్రశ్నమునకు సమాధానము ఇట్లు చెప్పికొనవచ్చును. భారతదేశమంతయు హిమాలయములకీవలిది. భూమధ్యరేఖకు సన్నిహితమైనది. సమశీతోష్ణ మండలములోనిదని చెప్పుకొన్నను శీతబాధ కన్న ఉష్ణబాధయే ఎక్కువ. హిందీ భాషలో మంచి మనస్సు అనుటకు 'ఠండాదిల్' అనెదరు. అనగా చల్లని మనస్సు. అట్లే మన కవులందరు చల్లని చూపులు, చల్లని నవ్వులు ఇత్యాది విధమున వ్యవహరింతురు. ఆంగ్లదేశమున 'వామ్ వెల్కమ్' అను ప్రయోగము కలదు. వెచ్చని స్వాగతము అని దాని అర్థము. చలిదేశముల వారి దృష్టిలో వెచ్చదనమే మంచిది. ముఖ్యముగా దక్షిణ భారతదేశమున వేడి హెచ్చు కావున మనము నిరంతరము చల్లదనమునే కోరుచుందుము. అదే మనకు మంచిది. కావుననే దాక్షిణాత్యుడైన మూకకవి అమ్మవారి మందహాసప్రభ చల్లనిది అని చెప్పుట ఉచితమే.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మన్దహాసముయొక్క స్వాన్తఃస్ఫురణము ప్రార్థింపఁబడినది. ఆ స్ఫురించిన స్మితచాతురి తన మనోభయము తొలగింప ప్రార్థింపఁబడుచున్నది.

**శ్లో॥ వక్త్రశ్రీసరసీజలే తరలితభ్రూవల్లికల్లోలితే**
**కాలిమ్నా దధతీ కటాక్షజనుషా మాధువ్రతీం వ్యాపృతిమ్।**

**నిర్నిద్రామలపుణ్డరీకకుహనాపాణ్డిత్యమాబిభ్రతీ**
**కామాక్ష్యాః స్మితచాతురీ మమ మనః కాతర్యమున్మూలయేత్॥ 11**

**ప్రతిపదార్థము:-**

తరలితభ్రూవల్లికల్లోలితే = చాంచల్యముకల కనుబొమ్మల ముడిసుదులు తిరిగిన;
వక్త్రశ్రీసరసీజలే = వక్త్రశోభయనెడి సరసియొక్క జలమున;
కటాక్షజనుషా = కడగంట జనించిన;
కాలిమ్నా = నలుపుచేత;
మాధువ్రతీమ్ = తుమ్మెదలకు సంబంధించిన;
వ్యాపృతిమ్ = వ్యాపారమును;
దధతీ = ధరించు;
నిర్నిద్రామలపుండరీకకుహనా పాండిత్యమ్ = వికసించిన స్వచ్ఛమైన తెల్లని కమలముయొక్క కపట పాండిత్యమును;
ఆబిభ్రతీ = ధరించు;
కామాక్ష్యాః = కామాక్షీదేవియొక్క;
స్మితచాతురీ = చిఱునవ్వుయొక్క నైపుణ్యము;
మమ = నాయొక్క;
మనః కాతర్యమ్ = మనస్సులోని పిరికితనమును;
ఉన్మూలయేత్ = పెరికి వేయును గాక!

**తాత్పర్యము:-**

అమ్మా! నీ ముఖముయొక్క శోభ సరసిలోని జలము వంటిది. కనుబొమ్మ ముడి అందులోని తరంగముల వంటిది. ఆ జలమున అమ్మవారి చిఱునవ్వు తెల్ల కమలమువలె నున్నది. అమ్మవారి చూపులందు తుమ్మెదలవలె ఉన్నవి. అట్టి నీ చిఱునవ్వుయొక్క నైపుణ్యము నా మనస్సులోని పిరికితనమును పెరికి వేయుగాక!

**వివరణము :-**

**పుండరీక** శబ్దమునకు పులియను అర్థమున్నది. అది తెల్లపులి కావచ్చును, కావుననే దాని కుహనా పాండిత్యమును అమ్మవారి సిత్మచాతురి ధరించియున్నది. పులియొక్క కుహనాపాండిత్యమును గురించి కంకణము ధరించి పేద బ్రాహ్మణుని ప్రలోభపరచి వాని జంపిన దొక పులియను కథ యొకటి పంచతంత్రమున కలదు. అది యటుండనిండు. ప్రస్తుతము ఆ స్మితము పులియైనచో మనస్సను లేడికి భయము కలుగవలెను. కాని యిచట తన మనస్సుయొక్క కాతర్యమును దూరము చేయుగాక యని కోరుచున్నాడు. నిజమే పుండరీకమే రక్షింపబూనినచో నిక మనఃకురంగమునకు భయమెక్కడిది?



**అవ:-** పై శ్లోకమున మనఃకాతర్యోన్మూలనము ప్రార్థింపఁబడినది. కాతర్య మొకటి పోయిన చాలునా, ఇంకను కామక్రోధాదులెన్నో యున్నవి కదా, వాని యన్నింటి యున్మూలనము ద్వారా ఈ శ్లోకమున **మనఃప్రసాదము** ప్రార్థింపఁబడుచున్నది.

**శ్లో॥ నిత్యం బాధితబన్ధుజీవమధరం మైత్రీజుషం పల్లవైః**
**శుద్ధస్య ద్విజమణ్డలస్య చ తిరస్కర్తారమప్యాశ్రితా।**
**యా వైమల్యవతీ సదైవ నమతాం చేతః పునీతేతరాం**
**కామాక్ష్యా హృదయం ప్రసాదయతు మే సా మన్దహాసప్రభా॥ 20**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| యా | = | ఏ మన్దహాసప్రభ; |
| నిత్యమ్ | = | ఎల్లప్పుడు; |
| బాధితబంధుజీవమ్ | = | బంధుజీవ(మంకెన)పుష్పమును బాధించిన, పక్షాంతరమున బంధువుల జీవముల బాధించిన; |
| పల్లవైః | = | చిగుళ్ళతో, పక్షాంతరమున విటులతో; |
| మైత్రీజుషమ్ | = | స్నేహమును పొందునది; |
| శుద్ధస్య | = | నిర్మలమైన; |
| ద్విజమండలస్య | = | దంత పంక్తియొక్క; |
| తిరస్కర్తారఞ్చ | = | తిరస్కర్తయునైన; |
| అధరమ్ | = | క్రింది పెదవిని; |
| ఆశ్రితాపి | = | ఆశ్రయించినదైనను; |
| సదా | = | ఎల్లప్పుడు; |
| వైమల్యవతీ ఏవ | = | స్వచ్ఛతయే కలదై; |
| నమతామ్ | = | నమస్కరించువారియొక్క; |
| చేతః | = | మనస్సును; |
| పునీతేతరామ్ | = | మిక్కిలి పవిత్రమొనర్చుచున్నదో; |
| సా | = | ఆ; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| మన్దహాసప్రభా | = | చిఱునవ్వుకాంతి; |
| మే | = | నాయొక్క; |
| హృదయమ్ | = | హృదయమును; |
| ప్రసాదయతు | = | నిర్మలమొనర్చుగాక. |

**తాత్పర్యము:-**

అమ్మవారి క్రింది పెదవి బంధుజీవకుసుమకాంతిని మించి యుండుటచే దానిని

నిరంతరము బాధించినదే యగును. పక్షాంతరమున బంధువుల జీవముల నపహరించినదగును. అది పల్లవములతో స్నేహమొనర్చునది. పక్షాంతరమున విటులతో సహచరించునది. అది శుద్ధమైన చంద్రమండలమును తిరస్కరించునది. పక్షాంతరమున బ్రాహ్మణసమూహమును దిరస్కరించునది. అట్టి క్రింది పెదవి నాశ్రయించినదే యైనను అమ్మవారి మన్దహాసప్రభ ఎల్లప్పుడు వైమల్యమును కలిగియున్నదే యగుచున్నది. నమస్కరించువారి మనస్సును పరిశుద్ధపరచుచునే యున్నది. అట్టి ఆ మన్దహాసప్రభ నా హృదయమును కామక్రోధాది రహితము నొనర్చుగాక!

**వివరణము :-**

**1)** అధర శబ్దమునకు క్రింది పెదవియనియే గాక నీచమని యర్థము కలదు. నీచులు బంధువుల జీవముల బాధించినట్లధరము కూడ బంధుజీవ కుసుమమును బాధించుచున్నది. ఎఱుపుదనమున అమ్మవారి ఆదరము అతిశయించి యుండుటకు బంధుజీవకుసుమమెప్పుడు బాధనే పొందుచుండును. దానికొక విధముగా అధరమే నిమిత్తమగుచుండును గదా! అమ్మవారి పెదవిని బోలియుండుటచే నది చిగుళ్ళతో స్నేహమును పొందియున్నట్లు చెప్పబడినది. చిగుళ్ళతో పెదవి స్నేహమొనర్చునట్లు నీచులు విటులతో స్నేహ మొనర్చుదురు. శుద్ధమైన అమ్మవారి దంతములను దాచి యుండుటచే అధరము దంతపంక్తిని తిరస్కరించినట్లు చెప్పబడినది. పెదవి తెల్లనైన దంతపంక్తిని తిరస్కరించినట్లు నీచులు శుద్ధమైన (సదాచార సంపన్నమైన) బ్రాహ్మణసమూహమున్ను తిరస్కరింతురు. ఇట్లు బంధుజీవబాధనము పల్లవమైత్రి శుద్ధద్విజమండల తిరస్కారము అను నీచలక్షణములు కలిగియున్న అధరము నాశ్రయించినదైనను మందహాసప్రభ ఎల్లప్పుడు నిర్మలముగనే యుండును. నమస్కరించు వారి మనస్సులను కూడ నిర్మల మొనర్చుచుండును. నిర్మల మొనర్చుట స్వభావముగా గల ఆ అమ్మవారి మందహాసప్రభకు నా హృదయమును నిర్మల మొనర్చుట సులభకార్యము.

**2)** శ్లేషబలమున విరోధము ఆభాసమౌటచే నీ శ్లోకమున విరోధాభాసాలంకార మున్నది.

**3)** మంధహాసమునందు స్నేహము (రాగము) తిరస్కారము (ద్వేషము) బాధనము (ద్వేషజన్యహింస) వంటి దోషములు ప్రసాదవ్యతిరేకములు అయినను అమ్మవారికి సంబంధించినవగుటచే భక్తమనఃప్రసాదహేతువులుగా ఇచట వర్ణింపబడినవి. శ్రీకృష్ణ కర్ణామృతమందలి ఈ క్రింది శ్లోకమిచట అనుసన్ధేయము.

శ్లో॥ *"స్తేయం హరేర్హరతి యన్నవనీతచౌర్యం*
*జారత్వమస్య గురుతల్ప కృతాపరాధమ్*
*హత్యాం దశాననహతిర్మధుపానదోషం*
*యత్పూతనాస్తనపయస్స పునాతు కృష్ణః"॥* (3.90)

శ్రీకృష్ణుని వెన్నదొంగతనము నా దొంగతనపుపాపమును, ఆతని గోపికా జారత్వము నా గురుతల్పగమనదోషమును, ఆతని రామావతారపు దశాననహననము నా హత్యాపాపమును, ఆతని పూతనాస్తనపానము నా మధుపానదోషమును హరించుగాక!



**అవ:-** పై శ్లోకమున హృదయప్రసాదము ప్రార్థింపబడినది. ప్రసాదము తాపమున్నప్పుడు కలుగదు కావున **సంతాపహరణ** మీ శ్లోకమున ప్రార్థింపఁబడుచున్నది.

**శ్లో॥ ద్రుహ్యన్తీ తమసే ముహుః కుముదినీసాహాయ్యమాబిభ్రతీ**
**యాన్తీ చన్ద్రకిశోరశేఖరవపుస్సౌధాఙ్గణే ప్రేఙ్ఖణమ్।**
**జ్ఞానామ్భోనిధివీచికాం సుమనసాం కూలఙ్కషాం కుర్వతీ**
**కామాక్ష్యాః స్మితకౌముదీ హరతు మే సంసారతాపోదయమ్॥ 13**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| తమసే | = చీకటికి(కొరకు); |
| ద్రుహ్యన్తీ | = ద్రోహమొనర్చుచున్నట్టిది; |
| ముహుః | = మాటిమాటికి; |
| కుముదినీసాహాయ్యమ్ | = కలువతీగకు సాయమును; |
| ఆబిభ్రతీ | = చేయుచున్నట్టిది; |
| చన్ద్రకిశోరశేఖరవపుస్సౌధాంగణే | = శివుని శరీరమును మేడ వాకిట; |
| ప్రేంఖణమ్ | = చిత్రగతిని; |
| యాన్తీ | = పొందుచున్నట్టిది; |
| జ్ఞానాంభోనిధివీచికామ్ | = జ్ఞానసముద్రతరంగమును; |
| సుమనసామ్ | = దేవతలయొక్క; |
| కూలంకషామ్ | = ఒడ్డొరసి ప్రవహించు నదిని (గంగను)గా; |
| కుర్వతీ | = చేయుచున్నటిదియైన; |
| కామాక్ష్యాః | = కామాక్షీదేవియొక్క; |
| స్మితకౌముదీ | = చిఱునవ్వు వెన్నెల; |
| మే | = నాయొక్క; |
| సంసారతాపోదయమ్ | = సంసారతాపోదయమును; |
| హరతు | = హరించుగాక! |

**తాత్పర్యము:-**

చీకటికి ద్రోహము చేయుచు కలువతీవకు సాయమొనర్చుచు శివశరీర

సౌధాంగణమున నెగురుచు జ్ఞానసముద్రతరంగము నుప్పొంగింప జేయుచున్నట్టి అమ్మవారి చిఱునవ్వు వెన్నెల నా సంసారతాపము నపహరించుగాక!

**వివరణము:-**

**1)** ఒకరికి ద్రోహము చేయువారందరకు ద్రోహము చేయుదురనరాదు. మరొకరికి సాయమును కూడ నొనర్చుచుందురు. శత్రువులకు ద్రోహము మిత్రులకు సాయమును చేయుట సహజము. అమ్మవారి చిఱునవ్వు వెన్నెలకు తమము సహజశత్రువు కావున దానికి ద్రోహమొనర్చును. **2)** చిఱునవ్వు వెన్నెల కావున కలువ తీవ దానికి స్నేహితులు కావున దానికి సాయమొనర్చును. **3)** అమ్మవారి నవ్వు చిఱునవ్వు కావున బాలికవలె శివశరీరసౌధాంగణమున నెగురును అని **ప్రేంఖణం, యాన్తీ** అను పదములచేత బాలికావ్యవహారము ఇచట స్ఫురించుటచే సమాసోక్త్యలంకారమున్నది. **4)** వెన్నెల సముద్రమును బొంగింపఁజేయును. ఇచట జ్ఞానసముద్రతరంగమును సుమనఃకూలంకష నొనర్చుచున్నదని చెప్పుటచే నతిశయోక్త్యాలంకారము స్పష్టమగుచున్నది. సుమనస్సులనగా దేవతలు, కూలంకషయనగా నది. ఈ రెండు పదములు కలసి గంగను బోధించును. సుమనస్సులనగా విద్వాంసులు. వారిలో జ్ఞాన సముద్రమున్నది. అమ్మవారి చిఱునవ్వు వెన్నెలలు ప్రసరించుటచే నా జ్ఞాన సముద్రముయొక్క యొక చిన్న తరంగమే ఆకాశగంగవలె మిన్నుముట్టుచున్నది. కూలంకష యనగ ఒడ్డొరసి ప్రవహించునది. ఇట చిన్న వీచికయే ఒడ్డొరసి ప్రవహించునదిగా మారినదని **కూలంకష** యను శబ్దము వ్యంజింపజేయుచున్నది. దీని వలన అమ్మవారి చిఱునవ్వు వెన్నెల గొప్పతనము స్ఫురించుటచే నిట వస్తుధ్వని యున్నది.

*5)* *గంగా పాపం శశీ తాపం దైన్యం కల్పతరుస్తథా।*
*పాపం తాపం చ దైన్యం చ ఘ్నన్తి సన్తో మహాశయాః॥*

అను సుభాషితము ననుసరించి చంద్రుడు తన వెన్నెలలో విహరించు వారి తాపము నపహరించును. అమ్మవారి చిఱునవ్వు వెన్నెలగా నిట రూపింప బడుటచే నది తాపమును హరించుననుట యుచితముగా నున్నది. కాని ఆ తాపము సంసారతాపము కావున దానిని హరించుటకు వెన్నెల మరల అమ్మవారి చిఱునవ్వుగా పరిణమింపవలసి యుండుటచే నిట పరిణామాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున సంసారతాపహరణ సమర్థమైన అమ్మవారి స్మితకౌముది ప్రార్థింపఁ బడినది. ఈ శ్లోకమున అమ్మవారి స్మితము తాపహరణమున వేగము కలిగిన దగుట భాగీరథితో రూపింపఁబడుచున్నది.

**శ్లో॥ కాశ్మీరద్రవధాతుకర్దమరుచా కల్మాషతాం బిభ్రతీ**
**హంసౌఘైరివ కుర్వతీ పరిచితిం హారీకృతైర్మౌక్తికైః।**

వక్షోజన్మతుషారశైలకటకే సఞ్చారమాతన్వతీ
కామాక్ష్యా మృదులస్మితద్యుతిమయీ భాగీరథీ భాసతే॥ 14

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కాశ్మీరద్రవధాతుకర్దమరుచా | = | కుంకుమపూల రసముతో కూడిన ధాతువుల బురద కాంతిచేత; |
| కల్మాషతామ్ | = | మలినతను (చిత్రవర్ణమును); |
| బిభ్రతీ | = | ధరించుచున్నట్టి; |
| హారీకృతైః | = | హారములుగా చేయబడిన; |
| మౌక్తికైః | = | ముత్యముల చేత; |
| హంసౌఘైః | = | హంసల గుంపులతో; |
| పరిచితిమ్ | = | పరిచయమును; |
| కుర్వతీ ఇవ | = | చేయుచున్నట్లున్న; |
| వక్షోజన్మతుషారశైలకటకే | = | స్తనములనెడి హిమవత్పర్వత ప్రాంతముల; |
| సంచారమ్ | = | సంచారమును; |
| ఆతన్వతీ | = | చేయుచున్నట్టి; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| మృదులస్మితద్యుతిమయీ | = | మెత్తని చిఱునవ్వు కాంతియనెడి; |
| భాగీరథీ | = | గంగానది; |
| భాసతే | = | ప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

కుంకుమపూలబురదతో మలినమైనట్టి హారములను ధరించి, హంసలతో పరిచయమును కలిగినట్లున్నట్టి, స్తన హిమగిరి ప్రాంతమున సంచరించుచున్నట్టి, కామాక్షీదేవియొక్క చిఱునవ్వనెడి గంగానది ప్రకాశించుచున్నది.

**వివరణము:-**

ఈ శ్లోకమున అమ్మవారి చిఱునవ్వు గంగానదిగా ఉత్ప్రేక్షించబడుచున్నది. గంగానదిలో బురద ఉండును. అమ్మవారి చిఱునవ్వులో కుంకుమపూలరసముతో కూడిన గైరికాదిధాతువుల బురదకాంతి యున్నది. గంగానదిలో హంసలు తిరుగుచుండును. ఆ తిరుగుటయే గంగానదికి హంసలతో గల పరిచయము. ఇక్కడ హారములందలి ముత్యములు హంసలుగా ఉత్ప్రేక్షించబడుచున్నవి. గంగానది హిమాలయప్రాంతమున ప్రవహించును. అమ్మవారి చిఱునవ్వు స్తనముల మీదుగా ప్రవహించుచున్నది, అని చెప్పబడుటచే ఈ శ్లోకమున ఉత్ప్రేక్షాలంకార మున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మందహాసము **భాగీరథిగా** ఉత్ప్రేక్షించబడినది. ఈ శ్లోకమున అమ్మవారి మందహాసకిరణములు "త్రిపథగ" అను నామాంతరము గల ఆ గంగయొక్క పర్యాయ భేదములుగా ఉత్ప్రేక్షించబడుచున్నవి.

**శ్లో॥ కమ్బోర్వంశపరమ్పరా ఇవ కృపాసన్తానవల్లీభువః**
**సమ్ఫుల్లస్తబకా ఇవ ప్రసృమరా మూర్తాః ప్రసాదా ఇవ।**
**వాక్పీయూషకణా ఇవ త్రిపథగాపర్యాయభేదా ఇవ**
**భ్రాజన్తే తవ మన్దహాసకిరణాః కాఞ్చీపురీనాయికే॥ 15**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కాంచీపురీనాయికే | = | కాంచీపురమునకు నాయికవైన ఓ కామాక్షీదేవీ! |
| తవ | = | నీయొక్క |
| మందహాసకిరణాః | = | చిఱునవ్వు కిరణములు |
| కంబోః | = | శంఖముయొక్క |
| వంశపరంపరా ఇవ | = | వంశముయొక్క వరుసలో యున్నట్లు |
| కృపాసంతానవల్లీభువః | = | దయయనెడి దేవతాలతనుండి పుట్టిన |
| సంపుల్లస్తబకా ఇవ | = | వికసించిన గుత్తులో యన్నట్లు |
| మూర్తాః ప్రసృమరాః | = | ఆకృతి దాల్చిన |
| ప్రసాదా ఇవ | = | అనుగ్రహములో యన్నట్లు |
| వాక్పీయుషకణా ఇవ | = | వాగమృతబిందువులో యన్నట్లు |
| త్రిపథగాపర్యాయభేదా ఇవ | = | గంగానది క్రమభేదములో యన్నట్లు |
| భ్రాజన్తే | = | ప్రకాశించుచున్నవి. |

**తాత్పర్యము:-**

అమ్మవారి చిఱునవ్వు వెలుగు శంఖముయొక్క వంశపరంపరలో యన్నట్లు దయయనెడు దేవతాలతనుండి పుట్టిన వికసించిన పూగుత్తులో యన్నట్లు ఆకృతి ధరించిన అనుగ్రహములో యన్నట్లు వాగమృతబిందువులో యన్నట్లు గంగాదేవి మారురూపములో యన్నట్లు ప్రకాశించుచున్నది.

**వివరణము :-**

ఈ శ్లోకమున అయిదు ఉత్ప్రేక్షలుండుటచేత మాలోత్ప్రేక్షాలంకార మున్నది. **శంఖము** తెల్లనిది. **దేవతాలత** తెల్లనిది. దానికి జన్మించిన పూగుత్తులు తెల్లనివి. అట్లే **అనుగ్రహము, వాక్కు,** తెల్లనివనుట కవి సమయము. **ఆకాశగంగ** తెల్లనిది. ఆ గంగ-ఆకాశము, భూమి, పాతాళము అను మూడు మార్గములలో సంచరించుటచేత ఆ గంగకు '**త్రిపథగ**' యను పేరు వచ్చినది.



**అవ:-** పై శ్లోకమున మందహాస కిరణములు వర్ణింపఁబడినవి. ఈ శ్లోకమున ఆ మందహాసము బహుత్వమును వీడి ప్రభగా ఏకత్వము పొందినట్లు వర్ణింపఁబడుతున్నది.

**శ్లో॥ వక్షోజే ఘనసారపత్రరచనాభఙ్గీసపత్నాయితా**
**కణ్ఠే బన్ధురదన్తపత్రకుహనావ్యాపారముద్రాయితా।**
**ఓష్ఠశ్రీనికురుమ్బపల్లవపుటే ప్రేఙ్ఖత్ప్రసూనాయితా**
**కామాక్షి! స్ఫురతాం మదీయహృదయే త్వన్మన్దహాసప్రభా॥ 16**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| వక్షోజే | = | స్తనమునందు; |
| ఘనసారపత్రరచనాభంగీసపత్నాయితా | = | కప్పురపు పూతకు సవతియే యన్నట్లు; |
| కంఠే | = | కంఠమున; |
| బంధురదంతపత్రకుహనావ్యాపార ముద్రాయితా | = | దట్టమైన దంతపు దువ్వెనలయొక్క రహస్యవ్యాపార ముద్రయేయన్నట్లు; |
| ఓష్ఠశ్రీనికురుంబపల్లవపుటే | = | పెదవుల కాంతి యనెడు చివురాకు దొప్పయందు; |
| ప్రేంఖత్ ప్రసూనాయితా | = | దుముకుచున్న పువ్వో యన్నట్లున్న; |
| త్వన్మందహాసప్రభా | = | నీ చిఱునవ్వుకాంతి; |
| మదీయహృదయే | = | నా హృదయమున; |
| స్ఫురతామ్ | = | స్ఫురించుగాక. |

**తాత్పర్యము:-**

అమ్మవారి మందహాసప్రభ, స్తనమున కర్పూరము పూసినట్లు, కంఠమున దంతమణుల హారమువలె, పెదవి చివురాకు దొప్పయందు కదలుచున్న పువ్వువలె ఉన్న నీ మందహాసప్రభ నాహృదయమున ప్రకాశించుగాక!

**వివరణము :-**

అమ్మవారి మందహాసకాంతి స్తనమున కర్పూరపుపూతకు సవతియో యన్నట్లు, కంఠమున దంత పత్ర రహస్య వ్యాపార చిహ్నమో యన్నట్లు, పెదవి యను చివురాకు దొప్పయందు పువ్వో యన్నట్లు, ఉన్నదని స్థానభేదమున ఉత్ప్రేక్షించుట చేత ఉత్ప్రేక్షాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున మందహాసము ప్రభగా రూపించబడినది. ఈ శ్లోకమున ఆ మందహాసము బహుత్వమును పొందిన **అంకురములు**గా రూపింపబడుచున్నది.

శ్లో॥ యేషాం బిన్దురివోపరి ప్రచలితో నాసాగ్రముక్తామణి-
ర్యేషాం దీన ఇవాధికణ్ఠమయతే హారః కరాలమ్బనమ్।
యేషాం బన్ధురివోష్ఠయోరరుణిమా ధత్తే స్వయం రఞ్జనమ్
కామాక్ష్యాః ప్రభవన్తు తే మమ శివోల్లాసాయ హాసాఙ్కురాః॥ 17

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| యేషామ్ | = | వేనియొక్క |
| ఉపరి | = | పైన |
| నాసాగ్రముక్తామణిః | = | ముక్కుచివరి ముత్తెము |
| బిందురివ | = | బిందువువలె |
| ప్రచలితః | = | కదలునో |
| అధికంఠమ్ | = | కంఠమందు |
| హారః | = | హారము |
| దీన ఇవ | = | దీనునివలె |
| యేషామ్ | = | వేనియొక్క |
| కరాలంబనమ్ | = | చేతి ఊతను |
| అయతే | = | పొందునో |
| యేషామ్ | = | వేనికి |
| ఓష్ఠయోః | = | పెదవులయొక్క |
| అరుణిమా | = | ఎఱుపు |
| బన్ధురివ | = | చుట్టమువలె |
| స్వయమ్ | = | స్వయముగ |
| రంజనమ్ | = | సంతోషమును (ఎఱ్ఱదనమును) |
| ధత్తే | = | కలిగించునో |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క |
| తే | = | అట్టి |
| హాసాంకురాః | = | నవ్వుయొక్క మొలకలు |
| మమ | = | నాయొక్క |
| శివోల్లాసాయ | = | శివుని ఉల్లాసమునకు |
| ప్రభవంతు | = | సమర్థములగుగాక (కారణములగుగాక). |

**తాత్పర్యము:-**

అమ్మవారి ముక్కు చివరనున్న ముత్తెము అమ్మవారి చిఱునవ్వు బిందువో యన్నట్లు కదలుచున్నది. ఆమె కంఠములోని హారము ఆమె చిఱునవ్వుల చేతి యూతను

పొందుచున్నట్లున్నది. ఆమె పెదవుల ఎఱుపు చుట్టమువలె చిఱునవ్వులను రంజింప జేయుచున్నది. అట్టి అమ్మవారి చిఱునవ్వు నాలోని శివుని సంతోషింపజేయుట కొఱకు, నా కల్యాణముల వికాసము కొఱకు సమర్థము అగుగాక!

**వివరణము :-**

హాసముయొక్క మొలకలనగా చిఱునవ్వులు, అంకురముల పైన చిన్నచిన్న జల బిందువులు ప్రకాశించుట మనమెరుగుదుము. అమ్మవారి ముక్కు చివరనున్న ముత్తెము నవ్వు మొలకలపై వెలసిన బిందువో యన్నట్లున్నది. అమ్మవారి మెడలో ముత్యాల హారమున్నది. ఆ ముత్యముల కాంతి కన్న చిఱునవ్వు అధికమైన కాంతిని కల్గి యుండుటచే ఆ హారము దీనత్వమును పొందినది. దీనుడైనవాడు ఇతరుల చేతియూతను కాంక్షించును. ఇచట హారము దీనునివలె అమ్మవారి చిఱునవ్వుయొక్క చేయూతను పొందినది. బంధువులు ఎవరైన ఇంటికి వచ్చినపుడు, ఇంటిలోని వారు సంతోషింతురు. చిఱునవ్వుల ఇంటికి పెదవుల ఎఱుపు అను చుట్టము వచ్చినపుడు రంజనము కల్గినది. శివోల్లాస శబ్దము, శివునియొక్క ఉల్లాసము అను ఒక అర్థమును, కల్యాణములను పెంచుట అను మరొక అర్థమును ఇచ్చును. శివుడు తెల్లనివాడు. శుభములు తెల్లనివనుట కవి సమయము. ఈ శ్లోకమున మొదటి మూడు పాదములలో నుత్ప్రేక్షలుండుటచే మాలోత్ప్రేక్షాలంకారమున్నది. అంకురముపైనున్న బిందువు అంకురము కదలినదనుటలో తెల్లదనమున చిఱునవ్వుయొక్క బిందువు (వేదము)తో పోలనేమోయని బాగుగా చలించిపోయినదని **ప్రచలితః** అను పదము వ్యంజింపజేయు చున్నది. కావున నిట వస్తుధ్వని యున్నది.



**అవ:-** పై శ్లోకమున బిందుదీన బంధువులతో స్మితముత్ప్రేక్షింపబడినది. ఈ శ్లోకమున ఆ అమ్మవారి స్మితమునకు జ్యోత్స్నతోడి ఔపమ్యము తిరస్కరింప బడుచున్నది.

**శ్లో॥ యా జాడ్యామ్బునిధిం క్షిణోతి భజతాం వైరాయతే కైరవై-**
**ర్నిత్యం యా నియమేన యా చ యతతే కర్తుం త్రినేత్రోత్సవమ్।**
**బిమ్బం చాన్ద్రమసం చ వఞ్చయతి యా గర్వేణ సా తాదృశీ**
**కామాక్షి స్మితమఞ్జరీ తవ కథం జ్యోత్స్నేత్యసౌ కీర్త్యతే॥ 18**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| యా | = ఏ స్మితమంజరి |
| భజతామ్ | = సేవించువారియొక్క |
| జాడ్యాంబునిధిమ్ | = జాడ్యమను సముద్రమును |
| క్షిణోతి | = క్షీణింపజేయునో |
| యా | = ఏది |

| | |
|---|---|
| కైరవైః | = తెల్ల కలువలతో |
| వైరాయతే | = విరోధించునో |
| నిత్యమ్ | = ఎల్లప్పుడు |
| నియమేన | = నియమముతో |
| యా | = ఏది |
| త్రినేత్రోత్సవమ్ | = శివునికి (నేత్రములకు) సంతోషమును |
| కర్తుమ్ | = చేయుటకు |
| యతతే | = ప్రయత్నించునో |
| యా | = ఏది |
| చాంద్రమసమ్ | = చంద్రసంబంధమైన |
| బింబమ్ | = బింబమును |
| గర్వేణ | = గర్వముతో |
| వంచయతి | = వంచించునో |
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| తాదృశీ | = అట్టి |
| సా | = ఆ |
| అసౌ | = ఈ |
| తవ | = నీయొక్క |
| స్మితమంజరీ | = చిఱునవ్వుగుత్తి |
| జ్యోత్స్నా ఇతి | = వెన్నెల అని |
| కథమ్ | = ఎట్లు |
| కీర్త్యతే | = కీర్తించబడును? |

**తాత్పర్యము:-**

కామాక్షీదేవీ! నీయొక్క ఏ స్మితమంజరి, సేవించువారి సోమరితనమను సముద్రమును క్షీణింపజేయునో, తెల్లకలువలతో విరోధించునో, ఎల్లప్పుడు నియమముతో శివుని (కి) మూడు కన్నులకు సంతోషము కలిగించునో, ఏది గర్వముతో చంద్రబింబమును వంచించునో, ఆ నీయొక్క స్మితమంజరి వెన్నెల యని యెట్లు చెప్పబడుచున్నది?

**వివరణము :-**

వెన్నెల సముద్రమును పొంగింపజేయునే కాని క్షీణింపజేయదు, తెల్లకలువలతో మైత్రి నొనరించునే కాని విరోధము నొనరింపదు. శివుని విరోధించు మన్మథుని మామయగుచు, శివుని నెత్తినెక్కిన చంద్రునికాంతి యగుటచే శివుని కాహ్లాదమును కల్గింపజాలదు. చంద్రుని బింబమును వంచింపనే వంచింపదు. కాని అమ్మవారి స్మితము,

వెన్నెల చేయని పై పనులను చేయుటచేత తెల్లదనమును హేతువుగాఁజేసికొని అమ్మవారి చిఱునవ్వును వెన్నెలయని కీర్తింపరాదు, అని వెన్నెలకు లేని విశేషము స్మితమున స్ఫురింపఁ జేయుటచే నీ శ్లోకమున వ్యతిరేకాలంకారము స్ఫురించుచున్నది. చంద్రునికి వృద్ధిక్షయము లుండుటచే వెన్నెల నియమముగా శివునకు సంతోషము కలిగింపఁజాలదు. క్షీణదశలోని చంద్రుని చిఱువెన్నెల సంతోషము నెట్లు కలిగింపగలదు. అమ్మవారి స్మితము శుక్లకృష్ణోభయపక్షములయందు నియతముగా శివునకు సంతసము కలిగింపఁజాలును అను వస్తువు **నియమ** శబ్దముచే వ్యంగ్య మగుచున్నది. **అమృతకల** యగుటచే **నిత్య** యగుటచే శివుని శిరోభూషణమగుటచే చంద్రకల నమ్మవారి స్మితము గర్వముతో వంచింపకపోవచ్చును కాని పున్నమ నాటి పూర్ణచంద్రబింబముయొక్క కాంతి అమ్మవారి స్మితముతో పోటీపడ యత్నించినందున దానిని గర్వముతో నమ్మవారి స్మితము, వంచించు ననువస్తువు బింబశబ్దమువలన స్ఫురించుచున్నది. చాంద్రమస బింబమునే కాక బింబనామముతో ప్రసిద్ధమైన దొండపండు నమ్మవారి పెదవి వంచించుచున్నదను వస్తువు **చ** శబ్దముచేత స్ఫురించుచున్నది. అమ్మవారి పెదవికి స్మితమున్నట్లు ఏ తెల్లని వస్తువుతో దొండపండునకు సహవాసము లేదు గదా!



**అవ:-** పై శ్లోకమున సేవించు వారి మనస్సులలోని జాడ్యము నమ్మవారి స్మితము క్షీణింపఁ జేయునని చెప్పఁబడినది. ఈ శ్లోకమున జాడ్యమును క్షీణింపఁజేసినదను కృతజ్ఞతా బుద్ధితో నమ్మవారి స్మితసుషమ నమస్కరింపఁబడుచున్నది.

**శ్లో॥ ఆరూఢా రభసాత్పురః పురరిపోరాశ్లేషణోపక్రమే**
**యా తే మాతరుపైతి దివ్యతటినీశఙ్కాకరీ తత్క్షణమ్।**
**ఓష్ఠం వేపయతి భ్రువౌ కుటిలయత్యానమ్రయత్యాననం**
**తాం వన్దే మృదుహాసపూరసుషమామేకామ్రనాథప్రియే॥ 19**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| ఏకామ్రనాథప్రియే! | = ఏకామ్రేశ్వరునకు ప్రియురాలైన; |
| మాతః! | = అమ్మా; |
| పురరిపోః | = పురములకు శత్రువైన శివునియొక్క; |
| పురః | = ముందు; |
| యా | = ఏ మృదుహాసపూరసుషమ; |
| రభసాత్ | = వేగమువలన; |
| ఆరూఢా | = ఎక్కినదై; |
| ఆశ్లేషణోపక్రమే | = కౌగలింతయొక్క ఆరంభమున; |
| తే | = నీకు; |

| | |
|---|---|
| దివ్యతటినీశంకాకరీ | = ఆకాశగంగయను శంకను గలిగించునదై; |
| తత్క్షణమ్ | = వెంటనే; |
| ఉపైతి | = చేరువగుచున్నదో; |
| ఓష్ఠమ్ | = పెదవిని; |
| వేపయతి | = వణికించుచున్నదో; |
| భ్రువౌ | = కనుబొమలను; |
| కుటిలయతి | = ముడిపెట్టజేయుచున్నదో; |
| ఆననమ్ | = ముఖమును; |
| ఆనమ్రయతి | = బాగుగా వంచుచున్నదో; |
| తామ్ | = ఆ; |
| మృదుహాసపూరసుషమామ్ | = చిఱునవ్వు ప్రవాహపు కాంతిని (శోభను); |
| వన్దే | = నమస్కరించుచున్నాను. |

**తాత్పర్యము:-**

శివుని ఎదుట పెదవిపై మొలచి ఆతడు కౌగిలించుకొనబోగా బయటపడిన నీ చిఱునవ్వుకాంతి దగ్గరలో నున్నదై ఆకాశగంగాశంకను నీకు కలిగించి నీ పెదవినదరునట్లు వంచుచున్నదో ఏకామ్రనాథప్రియురాలవైన ఓ యమ్మా! ఆ చిఱునవ్వు కాంతికి నమస్కరించుచున్నాను.

**వివరణము :-**

**ఆరూఢా** శబ్దము అమ్మవారి మృదుహాసపూరసుషమయొక్క ఆరూఢ యౌవనత్వ రూపమైన ప్రౌఢాత్వమును వ్యంజింపఁజేయుచున్నది. దివ్యతటినీ శంకాకరీ శబ్దము అమ్మవారి మృదుహాసపూరసుషమయందు ఆకాశగంగో త్ప్రేక్షణమును చెప్పుటచే ఉత్ప్రేక్షాలంకారమును వాచ్యమొనర్చుచున్నది. **ఓష్ఠవేపనము, భ్రూకుటిలీకరణము, ఆనమ్రీకరణము** అను క్రియలు అమ్మవారిలో సపత్నీదర్శనజములుగా భావింపఁబడినప్పు డామె ప్రణయకలహవ్యాపారములుగా తోచును. శివుని ఆశ్లేషణోపక్రమమున ఆమె ప్రణయకోపము తగ్గినప్పుడు చుంబనాభిముఖ్యమును శివుని దాక్షిణ్యమును ఆతనికి తన సవతి యగు గంగపై ప్రేమలేదని తెలిసికొను ప్రయత్నమును శివుడు తన చుబుకము నెత్తవలెనను అభిలాషమును వరుసగా స్ఫురింపఁజేయును. **ఏకామ్రనాథప్రియే** అని కవి చేసిన సంబోధనములోని ఏక శబ్దము శివునకు గంగాదేవి కామాక్షి అంత ప్రియురాలు కాదని వ్యంజింపఁజేయును.



**అవ:-** పై శ్లోకమున **ఓష్ఠవేపనాది విలాసవిశేషములు** చెప్పబడినవి. ఈ క్రింది శ్లోకమున **బిబ్బోకము** చెప్పఁబడుచున్నది.

శ్లో॥ వక్త్రేన్దోస్తవ చన్ద్రికా స్మితరుచిర్వల్గు స్ఫురన్తీ సతాం
స్యాచ్చేద్యుక్తమిదం చకోరమనసాం కామాక్షి! కౌతూహలమ్।
ఏతచ్చిత్రమహర్నిశం యదధికామేశం సదా గాహతే
బిమ్బోష్ఠద్యుమణిప్రభాస్వపి చ యద్బిబ్బోకమాలమ్బతే॥ 20

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| తవ | = నీయొక్క; |
| వక్త్రేంద్రోః | = ముఖ చంద్రునియొక్క; |
| చంద్రికా | = వెన్నెలయగు; |
| స్మితరుచిః | = చిఱునవ్వుకాంతి; |
| వల్గు | = చక్కగా (మృదువుగా); |
| స్ఫురన్తీ | = స్ఫురించుచున్నదై; |
| సతామ్ | = సత్పురుషులవంటి, సత్త్వగుణముగల; |
| చకోరమనసామ్ | = మనశ్చకోరములకు; |
| కౌతూహలమ్ | = కుతూహలముగా; |
| స్యాత్ చేత్ | = అయినచో; |
| ఇదమ్ | = ఇది; |
| యుక్తమ్ | = యుక్తమే; |
| అహర్నిశమ్ | = రాత్రింబవళ్ళు; |
| అధికామేశమ్ | = కామేశ్వరునిపట్ల; |
| సదా | = ఎల్లప్పుడు; |
| గాహతే ఇతి యత్ | = చేరియున్నది అనునదేదికలదో; |
| బింబోష్ఠద్యుమణిప్రభాస్వపి | = దొండపండువంటి పెదవియను సూర్యుని కాంతులున్నప్పుడును; |
| బిబ్బోకమ్ | = శృంగారచేష్టను; |
| ఆలంబతే ఇతి యత్ | = చేపట్టుచున్నదనునది ఏదిగలదో; |
| ఏతత్ | = ఇది (ఈ రెండును); |
| చిత్రమ్ | = చిత్రము. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీదేవీ! నీ ముఖము చంద్రుడు కాగా; చిఱునవ్వు వెన్నెలయే యగును, గావున అది సత్పురుషుల మనశ్చకోరములకు కుతూహలమును కలిగించుట యుక్తమే. కాని ఆ చిఱునవ్వు చంద్రిక కామేశుడైన శివుని పట్ల విడువక రాత్రింబవళ్ళు ప్రసరించుచున్నది. అంతేకాక (చకోర స్వభావమునకు విపరీతముగా) బింబోష్ఠారుణ

(సూర్య) కాంతులు ప్రసరించుచున్నను ఆ వెన్నెల రాత్రింబవళ్ళధికముగా మునిగిపోవుట యను శృంగారచేష్ట నొనర్చుచున్నది. ఇవి రెండును వింతలే.

**వివరణము :-**

సత్పురుషుల మనస్సులు చకోరములవలె అమ్మవారి చిఱునవ్వు వెన్నెలలో విహరించవలెనను కౌతూహలము కలిగియుండుట సహజమైనదే, ఇందు వింత యేమియు లేదు. సత్పురుషులందరు అమ్మవారి భక్తులు కావున ఆమె అనుగ్రహమును సూచించు మన్దహాసపుకాంతులలో విహరించుట సహజమే కాని సత్పురుషులలో నొకడైన శివుడు కామాక్షీదేవికి పతి కావున ఆతనికి అమ్మవారి పెదవియనెడి అరుణ బింబముయొక్క కాంతులందును రాత్రింబవళ్ళు మునిగియుండుట యొక శివుని మనస్సునకే ఇష్టము. శివుడు సత్పురుషుడు కావున ఆయన మనస్సును చకోరమే యనదగును. చకోరమునకు వెన్నెలపట్ల కౌతూహలముండుట సహజమే కాని అమ్మవారి పెదవియను అరుణబింబము యొక్క కాంతులందును మునిగియుండుటయే వింత. శృంగార చేష్టకూతమిచ్చుట వింత. ఏలననగా పెదవి కాంతులు తెల్లనివి కావు. అవి వెన్నెలలును కావు. అవి ఎఱ్ఱనివి. అవి అరుణ(సూర్య) కాంతులు. చకోరము చంద్రకాంతిలో కౌతూహలము చూపునే కాని సూర్యకాంతియందు చూపదు. శివుని మనశ్చకోరము సాధారణచకోరము కాదు గదా కావున అది అరుణ(సూర్య) కాంతులయందు మునిగిపోవుచుండును అని, విరోధము పరిహరించుకొన వచ్చును. కావున ఇట విరోధాభాసాలంకారము కలదు. ఇందు వ్యతిరేకా లంకారము కూడ ధ్వనించుచున్నది. ఎట్లనగా శివుని మనస్సు చకోరమువలె మందహాసచంద్రకాంతి యందు కౌతూహలము చూపినను ఓష్ఠారుణకాంతుల యందును మునుగుట యను విశేషము స్ఫురించుచున్నది గదా!



**అవ:-** పై శ్లోకమున సత్పురుషుల మనశ్చకోరములలో శివమనశ్చకోరముయొక్క అసాధారణత్వము ప్రతిపాదింపబడినది. ఈ శ్లోకమున అమృతపానమున దేవతలలో శివునకు గల అసాధారణత్వము నిరూపింపఁబడుచున్నది.

**శ్లో॥ సాహోయ్యం కలశామ్బుధేర్వ్యహతి తే కామాక్షి! మన్దస్మితం**
**శోభామోష్ఠరుచాం చ విద్రుమభువామేతద్భిదాం బ్రూమహే।**
**ఏతస్మాదుదితం పురా కిల పపౌ శర్వః పురాణః పుమా-**
**నేతన్మధ్యసముద్భవాం రసయతే మాధుర్యరూపం సుధామ్॥ 21**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి = ఓ కామాక్షీదేవి!
తే = నీయొక్క;
మన్దస్మితమ్ = చిఱునవ్వు;

| | | |
|---|---|---|
| కలశాంబుధే | = | పాలసముద్రమునకు; |
| సాహాయ్యమ్ | = | సహాయకత్వమును; |
| వహతి | = | ధరించుచున్నది; |
| విద్రుమభువామ్ | = | పగడములకు నెలవులైన; |
| ఓష్ఠరుచామ్ | = | పెదవుల కాంతులయొక్క; |
| శోభాఇ్చ | = | శోభను కూడా; |
| వహతి | = | ధరించుచున్నది; |
| ఏతద్భిదామ్ | = | ఈ రెంటి భేదమును; |
| బ్రూమహే | = | చెప్పెదము; |
| ఏతస్మాత్ | = | దీని (పాలసముద్రము) నుండి; |
| ఉదితమ్ | = | పుట్టినదానిని (విషమును, అమృతమును); |
| పురా | = | పూర్వము; |
| పురాణః పుమాన్ | = | పురాణపురుషుడైన; |
| శర్వః | = | శివుడు; |
| పపౌ కిల | = | త్రాగెనట; |
| ఏతన్మధ్యసముద్భవామ్ | = | దీని (మన్దస్మితము) మధ్యనుండి జనించిన; |
| మాధుర్యరూపమ్ | = | మాధుర్యరూపమైన; |
| సుధామ్ | = | అమృతమును; |
| రసయతే | = | ఇప్పటికినీ ఆస్వాదించుచున్నాడు. |

**తాత్పర్యము:-**

అమ్మా, నీ మందస్మితము పాలసముద్రమునకు సాయము చేయుచున్నది. పగడముల జన్మభూములైన పెదవుల కాంతుల శోభను కూడ ధరించుచున్నది. పాలసముద్రమునుండి జనించిన విషమునో, అమృతమునో పూర్వము పురాణపురుషుడైన శివుడు త్రావెనట. ఈ మందహాసోదితమాధుర్య సుధను మాత్రము ఇప్పటికి నా శివుడు ఆస్వాదించుచునే యున్నాడు.

**వివరణము :-**

పాలసముద్రము తెల్లనిది. అమ్మవారి మందస్మితము దానికన్న తెల్లనిది. పాలసముద్రమును చూచి అమ్మవారు చిఱునవ్వు చిలుకరించినది. ఇంకేమి ఆ చిఱునవ్వు తెలుపు పాలసముద్రములో కలిసి పాలసముద్రముయొక్క తెలుపునకు బలము చేకూర్చినది. తెల్లని వస్తువులలో నది ప్రథమ గణ్యమైనది. ఈ విధముగా అమ్మవారి చిఱునవ్వు పాలసముద్రమునకు సాయమొనర్చినది. పాలసముద్రములో పగడములుండును. కావున

దాని తెలుపులో కొంచెము ఎఱుపు కలిసియున్నది. అమ్మవారి పెదవులు కూడ పగడములకు నెలవులే కావున వానిమధ్య నుండి వచ్చిన చిఱునవ్వు నందు కూడ కొంచెమెఱుపున్నది. కావుననే అది పాలసముద్రమునకు సాయము చేయగలిగినది. పాలసముద్రమునకు మన్దస్మితమునకు ఈ విధమున సామ్యమున్నను భేదము (వైషమ్యము) కూడ నున్నది. పాలసముద్రమునుండి పుట్టిన అమృతమును దేవతలందఱితో కలసి శివుడు కూడా త్రావెనట. శివుడు దేవతలలో నొకడు కదా! అతడమృతము త్రాగకుండుట యెట్లు. మోహినివేషముననున్న విష్ణు వాశివునకు అమృతము నొసగుటకు నిరాకరించినట్లు కథలో లేదు. కాని అమృతమున కన్న ముందే పుట్టిన విషమును శివుడు త్రాగెననుటలో సందేహము లేదు. అమృతమెంత మధురమైనను కావచ్చును. అది విషము పుట్టిన చోటి నుండియే పుట్టియుండుటచే దాని లక్షణము కించిన్మాత్రమైనను అమృతమునకు లేకయుండదు. పేరునకది అమృతము అయినను దేవతలు ప్రళయకాలములో చచ్చెదరు కావున అమృతముయొక్క అమృతత్వమునకు కొంత లోపమా విషమునుండి పుట్టిన చోట పుట్టుటచే కలిగియుండవచ్చును. అదిగాక అమృతము అనగా మరణము నివారించునది కావున ఔషదమువలె త్రాగదగినదే కాని అది సుధ (సుఖముగా త్రాగదగినది) మాత్రము కాదు. ఈ యర్థమంతయు 'ఉదితం' అను విశేషణము మాత్రము చెప్పి, విశేష్యమైన విషమో అమృతమో చెప్పక పోవుట చేతను సుధా శబ్దప్రయోగము చేతను స్ఫురించుచున్నది. కావున నట వస్తుధ్వని యున్నది. ఇంతకు ఈ సుధ మన్దస్మిత మధ్య జనితమా, ఓష్ఠమధ్య జనితమా? అను ప్రశ్నకు స్పష్టమగు సమాధానమీ శ్లోకమున చెప్పఁబడలేదు. కాని పెదవుల మధ్యనుండి చుంబనసమయమున మన్దస్మితము అను పాలసముద్రము, దానిమధ్య నుండి మాధుర్యసుధ పుట్టినదని, చెప్పుకొన్న సహృదయుల హృదయములలో సమాధానము జనించును. ఇట్లు ఉపమానోపమేయములకు సామ్యపూర్వకముగా విశేషము చెప్పుటచేత నీ శ్లోకమున వ్యతిరేకాలంకారము గలదు. అమృతము దేవతలందరకు సాధారణము. శ్రీ కామాక్షీ ముఖ చుంబన మాధుర్య సుధ శివునకసాధారణము కావున దేవతలలో నతడు మహాదేవుడు, పురుషులలో నతడు పురాణ పురుషుడు. ముందు విషమును, దేవతలతో కలసి అమృతము త్రావిన శివునకు భేదము తెలియలేదు. అతడు సముడు గదా! ఆతని సమత్వమును తొలగించినది, కామాక్షీ ముఖ చుంబన జనిత మాధుర్య సుధ. శివుని సమత్వయోగమునుండి (సమత్వం యోగ ఉచ్యతే-భగవద్గీత) నిరంతర మాధుర్య సుధాస్వాదనాభిముఖ్యము వైపు నడిపించినది కావున ఆ యాస్వాదన మింకను కొనసాగుచున్నదని రసయతే అను క్రియలోని వర్తమానార్థక లట్ప్రత్యయము వ్యంజింపఁజేయుచున్నది. పపౌ కిల అను శబ్దములు శివుని (విషము లేక అమృతముయొక్క పానముయొక్క అప్రత్యక్షత్వమును పెద్దలు చెప్పుకొనుచుండగా శబ్ద ప్రమాణముచే తెలియబడుటను వ్యంజింపజేయుచున్నది.



శ్లో॥ ఉత్తుఙ్గస్తనకుమ్భశైలకటకే విస్తారికస్తూరికా-
పత్రశ్రీజుషి చఞ్చలాః స్మితరుచః కామాక్షి! తే కోమలాః।
సన్ధ్యాదీధితిరఞ్జితా ఇవ ముహుస్సాన్ద్రాధరజ్యోతిషా
వ్యాలోలామలశారదాభ్రశకలవ్యాపారమాతన్వతే॥ 22

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| విస్తారికస్తూరికాపత్రశ్రీజుషి | = విస్తరించియున్న కస్తురితో వ్రాయబడిన మకరికా పత్రముల కాంతిని పొందిన; |
| ఉత్తుంగస్తనకుంభశైలకటకే | = ఎత్తైన కుంభములవంటి స్తనములనెడి పర్వతముల సానువున; |
| చంచలాః | = కదలుచున్న; |
| కోమలాః | = మృదువులైన; |
| తే | = నీయొక్క; |
| స్మితరుచః | = చిఱునవ్వుకాంతులు; |
| ముహుః | = మాటిమాటికి; |
| సాన్ద్రాధరజ్యోతిషా | = దట్టమైన పెదవికాంతిచే; |
| సంధ్యాదీధితిరంజితా ఇవ | = సంజకెంజాయతో నెఱుపెక్కిన వానివలె; |
| వ్యాలోలామలశారదాభ్రశకల వ్యాపారమ్ | = చంచలములైన స్వచ్ఛములైన శరత్కాలమునకు చెందిన మేఘముల యొక్క వ్యాపారమును; |
| ఆతన్వతే | = చేయుచున్నవి. |

**తాత్పర్యము:-**

అమ్మవారి చిఱునవ్వుల కాంతులు కస్తురిచే మకరికారేఖలు వ్రాయబడిన స్తనశైలముల సానువులలో చలించుచున్నవై క్రిందిపెదవి కాంతిచే సంజకెంజాయతో రంజిల్లిన **శరత్కాలమేఘశకలవ్యాపారము** నొనర్చుచున్నవి.

**వివరణము :-**

1) శరత్కాలమేఘశకలములతో అమ్మవారి చిఱునవ్వులు పోల్చబడుటచే నిందుపమాలంకారమున్నది. 2) అమ్మవారి స్తనమండలమందు కుంకుమ ద్రవారుణ్యమున్నది. కావున శరత్కాలమేఘశకలముల కుపమానత సిద్ధించుట కొఱకు సంధ్యాదీధితి **రంజితా** అను విశేషణము కూర్చబడినది. 3) అమ్మవారి స్తనమందలి కస్తూరియొక్క నల్లనికాంతి కుంకుమద్రవముచే కల్గిన ఎఱ్ఱని కాంతి మన్దస్మితముయొక్క

సహజధావల్యము అను మూడు రంగుల (లోహితశుక్ల కృష్ణ వర్ణత్రయము) అమ్మవారి ప్రకృతిభావమును వ్యంజింపజేయుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మన్దస్మిత కాంతులు కోమలచంచలములని చెప్పబడినది. ఈ శ్లోకమున వాని మంజులత్వము విశేషముతో అలంకరించు చున్నవి.

**శ్లో॥ క్షీరం దూరత ఏవ తిష్ఠతు కథం వైమల్యమాత్రాదిదం**
**మాతస్తే సహపాఠవీథిమయతాం మన్దస్మితైర్మఞ్జులైః॥**
**కిం చేయం తు భిదాస్తి దోహనవశాదేతత్తు సఞ్జాయతే**
**కామాక్షి! స్వయమర్థితం ప్రణమతామేతత్తు దోదుహ్యతే॥ 23**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! మాతః! | = ఓ కామాక్ష్యంబా! |
| క్షీరమ్ | = పాలు; |
| దూరత ఏవ | = దూరముగానే; |
| తిష్ఠతు | = ఉండుగాక; |
| వైమల్యమాత్రాత్ | = స్వచ్ఛత యొకటి యున్న మాత్రమున; |
| ఇదమ్ | = ఇది(క్షీరము); |
| తే | = నీయొక్క; |
| మంజులైః | = అందములైన; |
| మన్దస్మితైః | = చిఱునవ్వులతో; |
| సహపాఠవీథిమ్ | = సమానభావమును; |
| కథమ్ | = ఎట్లు; |
| అయతామ్ | = పొందును; |
| కిం చ | = మరియు; |
| ఇయమ్ | = ఈ; |
| భిదా | = భేదము; |
| అస్తి | = కలదు; |
| ఏతత్ తు | = ఈ క్షీరము మాత్రము; |
| దోహనవశాత్ | = పితుకుటవలన; |
| సంజాయతే | = పుట్టును; |
| ఏతత్ తు | = ఈ మన్దస్మితము మాత్రము; |
| అర్థితమ్ | = కోరబడిన దానిని; |
| ప్రణమతామ్ | = నమస్కరించువారికి; |

స్వయమ్ = స్వయముగా;
దోదుహ్యతే = పితుకును.

**తాత్పర్యము:-**

ఓ కామాక్ష్యంబా! పాలకు వైమల్యముండవచ్చును. అంతమాత్రమున అది నీ మందస్మితముతో నెట్లు పోలగలదు. పాలు పితుకుటవలన జనించును. మన్దస్మితము నమస్కరించు వారికి కోరిన దానిని పితుకును.

**వివరణము:-**

సహపాఠులనగా కలసి చదువుకొనువారు. వారియొక్క వీథి యనగా వరుస, సహపాఠులందరు దాదాపు ఒక తరగతివారై ఒక వయస్సువారై ఉందురు. అనగా వారందరు సమానులు. గురువు అధికుడైనను సహపాఠులు మాత్రము సమానులు. అందువలన **సహపాఠవీథిమ్** అను శబ్దము సమానభావము అను అర్థమును తెలుపును. సమానభావము చెప్పి విశేషము చెప్పఁబడుటచే నిందు వ్యతిరేకాలంకారము గలదు.



**అవ:-** ప్రణమదర్థిత దోహన మొనర్చు నమ్మవారి మన్దస్మితము పై శ్లోకమున వర్ణింపఁబడినది. అట్టి ఆ మన్దస్మితము నా తాపము శమింపఁజేయు విషయమున నేల యలసతను చూపుచున్నదని ఈ శ్లోకమున కవి ప్రశ్నించుచున్నాడు.

**శ్లో॥ కర్పూరైరమృతాంశుభిర్జనని! తే కాన్తైశ్చ చన్ద్రాతపై-**
**ర్ముక్తాహారగుణైర్మృణాలవలయైర్ముగ్ధస్మితశ్రీరియమ్।**
**శ్రీకాఞ్చీపురనాయికే! సమతయా సంస్తూయతే సజ్జనై-**
**స్తత్తాదృఙ్మమ తాపశాన్తివిధయే కిం దేవి! మన్దాయతే॥ 24**

**ప్రతిపదార్థము:-**

శ్రీకాంచీపురనాయికే! జనని! దేవి! = ఓ కాంచీపురనాయికవైన తల్లీ కామాక్షీదేవీ!
కర్పూరైః = కర్పూరములతో;
అమృతాంశుభిః = చంద్రురూపములైన (చంద్రులతో);
కాన్తైః = అందములైన (చంద్రకాంతమణులతో);
చంద్రాతపైః = వెన్నెలలతో;
ముక్తాహారగుణైః = ముత్తెముల దండలతో;
మృణాలవలయైః = తామరతూండ్ల కడియములతో;
ఇయమ్ = ఈ;
తే = నీయొక్క;
ముగ్ధస్మితశ్రీః = అమాయకమైన చిఱునవ్వుయొక్క శోభ;

| | |
|---|---|
| సజ్జనైః | = సత్పురుషులచేత; |
| సమతయా | = సమానముగా; |
| సంస్తూయతే | = పొగడబడుచున్నది; |
| తత్ | = ఆ; |
| తాదృక్ | = అట్టి స్మితశ్రీ; |
| మమ | = నాయొక్క; |
| తాపశాన్తివిధయే | = తాపములను శమింపఁజేయు విధికొఱకు; |
| కిం | = ఏల; |
| మన్దాయతే | = సోమరి యగుచున్నది? |

**తాత్పర్యము:-**

కాంచీపురనాయికవైన యో దేవీ కామాక్షీ తల్లీ! కర్పూర చంద్ర చంద్రాతప మృణాల ముక్తాహారములతో సమమని సజ్జనులు స్తుతించు నీ చిఱునవ్వు నా తాపముల శమింపఁజేయుటలో నేల యలసించుచున్నది?

**వివరణము :-**

తాపనివారణమునకై కర్పూరము పూసికొనుట, వెన్నెలలో తిరుగుట పడుకొనుట, కూర్చుండుట, తామరతూండ్ల ధరించుట, ముత్యాలదండలు వేసికొనుట మొదలగు శీతలోపచారములతో సమానముగా పొగడబడుచున్న అమ్మవారి చిఱునవ్వు అని చెప్పఁబడుటచే నీ శ్లోకమున నుపమాలంకార స్ఫూర్తి కలదు. సజ్జనులు స్తుతించుచున్నారనుట చేత వారి మాట యసత్యము కాదుగదా యనియు, అయినచో నా తాపముల శమింపఁజేయుటలో ఆలసించుటకు కారణము తెలియదని బహుశః స్మితశ్రీలోని ముగ్ధత్వము కారణము కావచ్చునని **ముగ్ధ** శబ్దము తెలుపుచున్నది. ఆలస్యము ముగ్ధా లక్షణమనట నిర్వివాదము.



**అవ:-** వసన్త గ్రీష్మర్తువులో ఆవశ్యకములైన శీతలోపచారములకు సాధనములైన కర్పూరచంద్రాతపాదులతో అమ్మవారి చిఱునవ్వు సమమనుట పై శ్లోకమున చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివుని చూపే వసంతర్తువు అగుచున్నదని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మధ్యేగర్భితమఞ్జువాక్యలహరీమాధ్వీఝరీశీతలా**
**మన్దారస్తబకాయతే జనని! తే మన్దస్మితాంశుచ్ఛటా।**
**యస్యా వర్ధయితుం ముహుర్వికసనం కామాక్షి! కామద్రుహో**
**వల్గుర్వీక్షణవిభ్రమవ్యతికరో వాసన్తమాసాయతే॥** **25**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| జనని | = అమ్మా! |

| | |
|---|---|
| కామాక్షి | = కామాక్షీదేవీ! |
| యస్యాః | = దేనియొక్క; |
| వికసనమ్ | = వికాసమును; |
| వర్ధయితుమ్ | = పెంచుటకు; |
| కామద్రుహః | = శివునియొక్క; |
| వల్గుః | = మనోహరమైన; |
| వీక్షణవిభ్రమవ్యతికరః | = చూపుల విలాసముల సంబంధము; |
| వాసన్తమాసాయతే | = వసన్తర్తువగుచున్నదో (సా = ఆ); |
| మధ్యే- | = నడుమ; |
| గర్భితమంజువాక్యలహరీమాధ్వీఝరీ | = లోనున్న మంచి వాక్యముల మాధుర్య ప్రవాహముతో కూడిన; |
| శీతలా | = చల్లనైన; |
| తే | = నీయొక్క; |
| మందస్మితాంశుచ్ఛటా | = చిఱునవ్వుకాంతుల ప్రసారము; |
| మన్దారస్తబకాయతే | = మందార పుష్పమంజరి యగుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మా కామాక్షీదేవీ! నీ మన్దస్మితాంశుచ్ఛట మధ్య మంజువాక్య మాధుర్యఝరి యున్నది. కావున అది మందారస్తబకమును బోలుచున్నది. శివుని చూపుల విలాసముల సంబంధము ఆ మందారస్తబకముయొక్క వికాసమును వర్ధిల్లఁజేయుటకు వసన్తర్తువే యగుచున్నది.

**వివరణము :-**

మన్దారము మకరన్దమధికముగా నుండు పుష్పము. మందారమునందు మకరన్దములవలె అమ్మవారి మన్దస్మితమున మంజువాక్యములు గర్భితములై యున్నవి, అని, మన్దారమన్దస్మితములకు పోలిక చెప్పఁబడుటచే నిట నుపమాలంకారమున్నది. వసన్తర్తువున మన్దారవృక్షములకు పూలగుత్తుల వికాస మధికముగా నుండును. శివుని చూపులకు వసంతర్తూపమ చెప్పఁబడినది. చూపులకు వసంతర్తువుతోడి పోలిక. స్వతస్సిద్ధము కాదు, కావున నీ శ్లోకము నందలి ఉపమాలంకార ముత్ప్రేక్షానుప్రాణిత మగుచున్నది. **వాసన్తమాస** శబ్దము చైత్ర వైశాఖములు రెండింటికి వాచకమగుటచే వసన్తర్తువను నర్థము నొసగును.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వు తెల్లని మందారస్తబకములతో పోల్చబడినది. ఈ శ్లోకమున ఎట్టిని తెల్లని హల్లక మల్లీపుష్పములలో పోలిక చెప్పఁబడుచున్నది.

శ్లో॥ బిమ్బోష్ఠద్యుతిపుఞ్జరఞ్జితరుచి స్త్వన్మన్దహాసచ్ఛటా
కల్యాణం గిరిసార్వభౌమతనయే! కల్లోలయత్వాశు మే।
ఫుల్లన్మల్లిపినద్ధహల్లకమయీ మాలేవ యా పేశలా
శ్రీకాఞ్చీశ్వరి! మారమర్దితురురోమధ్యే ముహుర్లమ్బతే॥ 26

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| గిరిసార్వభౌమతనయే! | = పర్వతరాజకుమారీ! |
| శ్రీ కాంచీశ్వరి | = శ్రీ కాంచీశ్వరుని యిల్లాలా! |
| యా మందహాసచ్ఛటా | = ఏ చిఱునవ్వుల ప్రసారము; |
| ఫుల్లన్మల్లిపినద్ధహల్లకమయీ | = మల్లెలు పొదిగిన ఎఱ్ఱదామరలతో కూర్చబడిన; |
| మాలా ఇవ | = మాలవలె; |
| పేశలా | = మృదువైనదై; |
| మారమర్దితుః | = శివునియొక్క; |
| ఉరోమధ్యే | = వక్షమునడుమ; |
| ముహుః | = మాటిమాటికి; |
| లమ్బతే | = వ్రేలాడునో; (సా = ఆ); |
| బింబోష్ఠద్యుతిపుంజరంజితరుచిః | = దొండపండు వంటి పెదవి కాంతుల సమూహముచే ఎఱ్ఱవారిన కాంతిగల; |
| త్వన్మన్దహాసచ్ఛటా | = నీ చిఱునవ్వుల ప్రసారము; |
| ఆశు | = శీఘ్రముగా; |
| మే | = నాకు; |
| కల్యాణమ్ | = శుభమును; |
| కల్లోలయతు | = తరంగింపఁజేయుగాక. |

**తాత్పర్యము:-**

పెదవుల ఎఱుపుచే కలసిన తెల్లని నీ చిఱునవ్వు మల్లెలతో కలసిన యెఱ్ఱదామరల మాలవలె శివుని యురోమధ్యమున మాటిమాటికి వ్రేలాడు చున్నది. ఆ చిఱునవ్వు నాకు శుభమును కల్గించుగాక!

**వివరణము :-**

అమ్మవారి బింబోష్ఠము హల్లకమును బోలియున్నది. అందులో నుండి వెడలిన చిఱునవ్వు మల్లెపువ్వును బోలియున్నది. హల్లకమల్లీపుష్పములమాలవలె అమ్మవారి మన్దహాస మున్నదని చెప్పుటచే నిట నుపమాలంకారమున్నది. అమ్మవారు శివుని యురమును చూచి వచ్చినది. బహుశః ఉరమునందలి ఎఱ్ఱని అస్థిమాలను చూచి

కావచ్చును లేక విభూతిని చూచి కావచ్చును. తన యురమున నవి యుండవు. తన యురమున నున్నచో మల్లీహల్లకముల గూర్చిన మాల యుండవచ్చును. అట్టి హారమునే తన నవ్వుతో సృష్టించి శివుని యురమున గూర్చినదేమో యనిపించుచున్నది. మల్లికా హల్లకములు రెండును మన్మథుని బాణములలో చేరినవే. వానిని ప్రయోగించియే మన్మథుడు శివుని మనస్సును గాయపరచినాడు తరువాత నా మారుని శివుడు మర్దించినాడు. అమ్మవారా మన్మథుని పునరుజ్జీవింపఁజేసినది. ఆమె తన మన్దహాసమున ఆ మన్మథుని బాణములైన పూలమాలనే శివుని యురమున వ్రేలాడునట్లొనర్చినది. **మారమర్దితుః** అను శివవాచకపద మీ యర్థమునకు వ్యంజకమైనది. **ముహుర్లంబతే** (మాటిమాటికి వ్రేలాడుచున్నవి) అను పదములు శివుడు వానిని తొలగించుకొనలేకపోవుటను వ్యంజింపజేయుచున్నవి.



**అవ:-** పై శ్లోకమున శివుని యురమున నూగుచున్న మాలతో అమ్మవారి మన్దస్మితము పోల్చబడినది. ఈ శ్లోకమున నీలకంఠహృదయకౌతూహలాందోళన హేతువుగా మందస్మితము వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ బిభ్రాణా శరదభ్రవిభ్రమదశాం విద్యోతమానాప్యసౌ**
**కామాక్షి! స్మితమఞ్జరీ కిరతి తే కారుణ్యధారారసమ్।**
**ఆశ్చర్యం శిశిరీకరోతి జగతీమాలోక్య చైనామహో**
**కామం ఖేలతి నీలకణ్ఠహృదయం కౌతూహలాన్దోళితమ్॥27**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| అసౌ | = | ఈ; |
| తే | = | నీయొక్క; |
| స్మితమంజరీ | = | చిఱునవ్వుగుత్తి; |
| విద్యోతమానా+అపి | = | ప్రకాశించుచున్నదైనను; |
| శరదభ్రవిభ్రమదశామ్ | = | శరత్కాలపు మేఘము విలాసములయొక్క దశను; |
| బిభ్రణా | = | భరించుచున్నదై; |
| కారుణ్యధారారసమ్ | = | దయారసధారను; |
| కిరతి | = | వెదజల్లుచున్నది; |
| జగతీమ్ | = | భూలోకమును; |
| శిశిరీకరోతి | = | చల్లబఱచుచున్నది; |
| ఏనామ్ | = | దీనిని (కారుణ్యరసధారను); |
| ఆలోక్య చ | = | చూచియు; |

| | | |
|---|---|---|
| అహో | = | అహో; |
| నీలకణ్ఠహృదయమ్ | = | శివుని(నెమలి) హృదయము; |
| కామమ్ | = | అధికముగా; |
| కౌతూహలాన్దోళితమ్ | = | కుతూహలమున కలుగు ఆన్దోలనము గలదై; |
| ఖేలతి | = | ఆడుచున్నది. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీదేవి! నీ చిఱునవ్వుగుత్తి ప్రకాశించుచున్నదయ్యు శరత్కాలమేఘమువలె విలసిల్లుచు కరుణారసధారను వర్షించుచున్నది. ఈ భూలోకమును చల్లబఱచుచున్నది. దీనిని చూచియు నెమలివలె శివుని హృదయము కౌతూహలముతో నాడుచున్నది. అహా ఆశ్చర్యము.

**వివరణము :-**

1) వర్షాకాల మేఘము నల్లగా నుండును. అమ్మవారి చిఱునవ్వు శరత్కాల మేఘమువలె తెల్లగా నున్నది. శరత్కాలమేఘము వర్షించుచునే యుండును. ఇదొక ఆశ్చర్యము. మరొక ఆశ్చర్యము అమ్మవారి చిఱునవ్వు ఈ లోకమును చల్లబఱచుట. కరుణారసముచే తడిసి ఈ భూలోకము చల్లఁబడినది. ఇది శరత్కాలమున జరుగదు కదా? మరొక ఆశ్చర్యము నెమళ్ళు వర్షాకాలమేఘమును చూచి యాడునే కాని శరత్కాల మేఘమును చూచియాడవు. అమ్మవారి చిఱునవ్వు శరత్కాలమేఘమువలె తెల్లగా నున్నను దానిని చూచి నీలకణ్ఠుడు (నెమలి) కుతూహలముతో నాడుచున్నాడు.

2) శరత్కాలమేఘమువలన జరుగని పై పనులు అమ్మవారి చిఱునవ్వు అనెడి శరత్కాలమేఘమువలన జరిగినట్లు వర్ణింపఁబడుటచే నీ శ్లోకమున విరోధాభాసాలంకారము **అపి** శబ్దముచే వాచ్యమగుచున్నది. శిశిరీకరోతి అను పదము శిశిరఋతువుయొక్క ధర్మము శరదృతువున జరుగుచున్నట్లు చెప్పుటయు విరోధాభాసమే.

3) మొదటి పాదమున **భకారము,** రెండవ మూడవ పాదములలో **రేఫము** నాల్గవపాదమున **లకారము** యొక్క పునఃపునరావృత్తి యుండుచే వృత్త్యను ప్రాసాలంకారము కలదు.

4) ఈ శ్లోకమున తెలుగు పద్యమునందువలె ప్రాసవర్ణమైత్రులు పాటింపఁ బడినవి.



**అవ:-** పై శ్లోకమున స్మితము **మంజరి** యని సామాన్యముగా చెప్పబడినది. ఈ శ్లోకమున అత్యచ్ఛగుచ్ఛముతో నుపమింపబడుచున్నది.

**శ్లో॥ ప్రేఙ్ఖత్ప్రౌఢకటాక్షకుఙ్కుమహరేష్వత్యచ్ఛగుచ్ఛాయితం**
**వక్త్రేన్దుచ్ఛవిసిన్ధువీచినిచయే ఫేనప్రతానాయితమ్।**

**నైరన్తర్యవిజృమ్భితస్తనతటే నైచోలపట్టాయితం**
**కల్మాషం కబలీకరోతు మమ తే కామాక్షి! మన్దస్మితమ్॥ 28**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| ప్రేంఖత్ప్రౌఢకటాక్షకుంజకుహరేషు | = కదలుచున్న ప్రౌఢములైన కడగంటి చూపుల పొదల చీకటి భాగములలో; |
| అత్యచ్ఛగుచ్ఛాయితమ్ | = మిక్కిలి స్వచ్ఛమైన పూగుత్తివలె నున్న; |
| వక్త్రేన్దుచ్ఛవిసిన్ధువీచినిచయే | = ముఖచంద్రప్రకాశసముద్రముయొక్క; |
| ఫేనప్రతానాయితమ్ | = తరంగముల సమూహమున నుఱుగుల గుంపువలెనున్న; |
| నైరన్తర్యవిజృంభితస్తనతటే | = ఎప్పుడును విజృంభించు స్తనమండలమున; |
| నైచోలపట్టాయితమ్ | = రవిక గుడ్డవలెనున్న; |
| తే | = నీయొక్క; |
| మన్దస్మితమ్ | = చిఱునవ్వు; |
| మమ | = నాయొక్క; |
| కల్మాషమ్ | = పాపమును(మాలిన్యమును); |
| కబలీకరోతు | = మ్రింగి వేయుగాక! |

**తాత్పర్యము:-**

అమ్మవారి చిఱునవ్వామె కడకన్నులలో దోబూచులాడుచున్నది. అవి చీకటి పొదలవలె నుండగా చిఱునవ్వు వానిలో పూలగుత్తివలె కన్పడుచున్నది. ముఖచన్ద్రప్రకాశ సముద్రతరంగసమూహమున నుఱుగువలె కన్పడుచున్నది. నిరంతరము విజృంభించు స్తనతటమున తెల్లని రవిక గుడ్డవలె కన్పడుచున్నది. అట్టి ఆ కామాక్షి అమ్మవారి మన్దస్మితము నాలోని పాపమాలిన్యాంధకారమును మ్రింగివేయుగాక!

**వివరణము:-**

పై శ్లోకమున మొదటి మూడు పాదములలో ఉపమాలంకారముండుటచే మాలోపమాలంకారము ఏర్పడియున్నది. మొదటిపాదమందలి యుపమకు కటాక్షకుంజ కుహరేషు (కటాక్షములనెడు కుంజముల కుహరములందు) అను రూపణము వానియొక్క బింబప్రతిబింబభావద్వారమున సిద్ధమైనది. రెండవ పాదమున వక్త్రేన్దుచ్ఛవి సిన్ధువీచినిచయముల బింబప్రతిబింబభావముచే సిద్ధమైనది. మూడవపాదమున బింబ ప్రతిబింబభావము లేకున్నను స్తనముల నిరంతరవిజృంభణము నరికట్టుటలో సాఫల్యమందిన నైచోలపట్టియతోడి యుపమ చెప్పఁబడినది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి ముఖముయొక్క ప్రకాశము సముద్ర వీచినిచయములని చెప్పఁబడినది. ఈ శ్లోకమున అమ్మవారి చిఱునవ్వు పాలసముద్రముపై నీర్ష్యపడుచున్నట్లు వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ పీయూషం తవ మన్థరస్మితమితి వ్యర్థైవ సాపప్రథా**
**కామాక్షి! ధ్రువమీదృశం యది భవేదేతత్కథం వా శివే।**
**మన్దారస్య కథాలవం న సహతే మథ్నాతి మన్దాకినీ-**
**మిన్దుం నిన్దతి కీర్తితే చ కలశీపాథోధిమీర్ష్యాయతే॥ 29**

**ప్రతిపదార్థము:-**

శివే = మంగళస్వరూపురాలవైన
కామాక్షి! = ఓ కామాక్షీదేవీ!
తవ = నీయొక్క
మంథరస్మితమ్ = చిఱునవ్వు
పీయూషం ఇతి = అమృతమనుటయేదో
సా = అది
వ్యర్థా = నిరర్థకమైన
అపప్రథా ఏవ = అపకీర్తియే
యది = ఒకవేళ (ఏతత్-ఇది)
ఈదృశమ్ = ఇట్టిది
ధ్రువమ్ = శాశ్వతమైనచో
కథమ్ వా = ఎట్లు (తత్-ఆ చిఱునవ్వు)
మన్దారస్య = మన్దారముయొక్క
కథాలవమ్ = ప్రసంగలేశమును
న సహతే = సహించదు
మన్దాకినీమ్ = ఆకాశగంగను
మథ్నాతి = క్షోభింపఁజేయును
ఇన్దుమ్ = చన్ద్రుని
నిన్దతి = నిన్దించును
కీర్తితే = ప్రశంసితమైనప్పుడు
కలశీపాథోధిమ్ = పాలసముద్రమును
ఈర్ష్యాయతే = ఈసడించుకొనును.

**తాత్పర్యము:-**

అమ్మవారి చిఱునవ్వు అమృతమనుట నిరర్థకమును అపప్రథయు నగును.

ఒకవేళ ఆ మాట నిల్చునదే యగుచో ఆ చిఱునవ్వు మందారపుష్పము యొక్క ప్రసంగలేశమును ఏల సహించదు? ఏల గంగను క్షోభింపఁజేయును? ఏల చంద్రుని నిన్దించును? పాలసముద్రము పేర్కొనబడినంత మాత్రమున నేల దానిపై నీసుగొనును?

**వివరణము :-**

పాలసముద్రమున అమృతము పుట్టినది. మన్దారము పుట్టినది. చంద్రుడు పుట్టినాడు. మన్దాకిని ఆ సముద్రుని ప్రియురాలు. ఒకవేళ అమ్మవారి చిఱునవ్వు అమృతమను మాట నిలచునదైనచో తన సోదరులైన మన్దారేన్దువుల పట్ల ప్రేమ చూపవలెగదా! చూపుట లేదు. పైగా కోపము చూపుచున్నది. తన తండ్రి ప్రియురాలైన, తనకు తల్లివరుసయైన, మన్దాకిని నేల క్షోభింపఁజేయును. తన జన్మహేతువైన పాలసముద్రముపై నీసుగొనునా? ఇట్లు చేయుచున్నది కావున అమ్మవారి చిఱునవ్వు నమృత మనరాదని. మన్దహాసమునందులేని చన్ద్రనిన్దాది కార్యములను చెప్పుటచే నిట నతిశయోక్త్యలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున ప్రస్తావింపఁబడిన చన్ద్రనిన్దకు హేతువు గాదగిన చన్ద్రుని కలంకితకు ఈ శ్లోకమున హేతువు చెప్పఁబడుచున్నది.

**శ్లో|| విశ్వేషాం నయనోత్సవం వితనుతాం విద్యోతతాం చన్ద్రమా**
**విఖ్యాతో మదనాన్తకేన ముకుటీమధ్యే చ సమ్మాన్యతామ్।**
**అః కిం జాతమనేన హాసనుషమామాలోక్య కామాక్షి! తే**
**కాలజ్మీమవలమ్బతే ఖలు దశాం కల్మాషహీనోఽప్యసౌ॥ 30**

**ప్రతిపదార్థము:-**

చన్ద్రమాః = చన్ద్రుడు;
విఖ్యాతః = కీర్తినొందినవాడై;
విశ్వేషామ్ = ఎల్లఱకు;
నయనోత్సవమ్ = కనువిందును;
వితనుతామ్ = చేయుగాక;
విద్యోతతామ్ = ప్రకాశించుగాక!
మదనాన్తకేన = శివునిచే;
ముకుటీమధ్యే = కిరీట మధ్యమున;
సమ్మాన్యతామ్ = గౌరవింపఁబడుగాక!
అః = ఆహా!
అనేన = దీనితో;
కిమ్ = ఏమి;

| | |
|---|---|
| జాతమ్ | = అయినది? |
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| తే | = నీయొక్క |
| హాససుషమామ్ | = నవ్వుశోభను; |
| ఆలోక్య | = చూచి; |
| కల్మాషహీనః+అపి | = మచ్చలేని వాడైనను; |
| అసౌ | = వాడు (ఈ చంద్రుడు) |
| కాలంకీమ్ | = కలంకితయను; |
| దశామ్ | = దశను; |
| అవలంబతే ఖలు | = పొందుచున్నాడు గదా! |

**తాత్పర్యము:-**

ఎల్లరకు కనువిందొనర్చుగాక. విఖ్యాతుడై ప్రకాశించుగాక, శివుని చేత కిరీటమధ్యమున సమ్మానింపఁబడుగాక. దీనివలన చంద్రుని కేమి యొనఁగూడినది. అమ్మవారి నవ్వు శోభను చూచిన పిమ్మట నందఱచే కలంకియని పిలువఁబడు దుస్థితిని పొందుచున్నాడు గదా!

**వివరణము :-**

చంద్రుని కలంకితకు కారణముకాని హాసావలోకనము గారణముగా చెప్పఁబడుటచే నిందతిశయోక్త్యాలంకారము కలదు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి హాసమును చూచి ఈర్ష్య నొందిన చంద్రుని కలంకిత వర్ణింపఁబడినది. ఈర్ష్య నొందని వారి (శివుని) కవి ఆనన్దజీవాతువులని చంద్రుడు చేయజాలని చేతః శీతలికరణమునకై అమ్మవారి మన్దహాసము ప్రార్థింపఁబడుచున్నది.

**శ్లో॥ చేతః శీతలయన్తు నః పశుపతేరానన్దజీవాతవో**
**నమ్రాణాం నయనాధ్వసీమసు శరచ్చన్ద్రాతపోపక్రమాః।**
**సంసారాఖ్యసరోరుహాకరఖలీకారే తుషారోత్కరాః**
**కామాక్షి! స్మరకీర్తిబీజనికరాస్త్వన్మన్దహాసాఙ్కురాః॥ 31**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి | = ఓ కామాక్షీ దేవీ! |
| పశుపతేః | = శివునకు; |
| ఆనన్దజీవాతవః | = ఆనందము నుజ్జీవింపఁజేయు నౌషధములైన |
| నమ్రాణామ్ | = నమస్కరించు వారియొక్క |
| నయనాధ్వసీమసు | = నేత్రమార్గ ప్రాంతములో; |

శరచ్చంద్రాతపోపక్రమాః = శరచ్చన్ద్రచన్ద్రికారంభములైన;
సంసారాఖ్యసరోరుహాకరఖలీకారే = సంసారమను పేరుగల పద్మాకరమును పాడుచేయుటలో;
తుషారోత్కరాః = మంచు బిందువులైన;
స్మరకీర్తిబీజనికరాః = మన్మథుని కీర్తి బీజసమూహరూపములైన;
త్వన్మందహాసాంకురాః = నీ చిఱునవ్వు మొలకలు;
నః = మా;
చేతః = మనస్సును;
శీతలయన్తు = చల్లబఱచుగాక.

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! శివానన్దజీవనౌషధములు నమస్కరించు వారి కంటికి వెన్నెలలు. సంసారపద్మాకరతుషారవర్షములైన, మన్మథుని కీర్తికి కారణములైన నీ మన్దహాసాంకురములు మా మనస్సుల చల్లఁబఱచుగాక.

**వివరణము :-**

1) ఆనన్దజీవాతు, చంద్రతపోక్రమ, తుషారోత్కర, స్మరకీర్తిబీజనికర రూపణము మందహాసమునందుండుటచే రూపకాలంకారము కలదు.

2) కీర్తి తెల్లనిది కావున దాని బీజములు కూడ తెల్లనివిగా నిట వర్ణింపబడినవి.

3) **ఖలీకార** శబ్దము కళ్ళము చేయుటను, **తుషారోత్కరాః** అను శబ్దము నీరు చల్లుటను, **బీజనికరా** అను శబ్దము విత్తుటను, **అంకురా** అను శబ్దము మొలకెత్తుటను సూచించుటచే కృషకవ్యవహారమిట స్ఫురించుటచే సమాసోక్త్యలంకారము. చేతః శీతలీకరణమున కంకురములు సమర్థములు కావలెనన్న నవి అమ్మవారి మందహాసములుగా పరిణమించుట ఆవశ్యము కావున నిట పరిణామాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మన్దహాసాంకురములు తమ చిత్తశీతలీ కరణమునకై ప్రార్థింపఁబడినవి. ఈ క్రింది శ్లోకమున మందస్మిత రోచిరంకురములు త్రిభువనక్షేమ కరణమునకై చింతింపఁబడుచున్నవి.

**శ్లో॥ కర్మౌఘాఖ్యతమఃకచాకచికరాన్కామాక్షి! సంచిన్తయే**
**త్వన్మన్దస్మితరోచిషాం త్రిభువనక్షేమఙ్కరానఙ్కురాన్।**
**యే వక్త్రం శిశిరశ్రియో వికసితం చన్ద్రాతపామ్భోరుహ-**
**ద్వేషోద్ఘోషణచాతురీమివ తిరస్కర్తుం పరిష్కుర్వతే॥ 32**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి = ఓ కామాక్షీ దేవీ!

| | |
|---|---|
| యే | = ఏవి (నీ మందస్మిత రోచిరంకురములు); |
| శిశిరశ్రియః | = శిశిరలక్ష్మికలవై; |
| వికసితమ్ | = వికసించిన; |
| వక్త్రమ్ | = ముఖమును; |
| చన్ద్రాతపామ్భోరుహద్వేషోద్ఘోషణ చాతురీమ్ | = వెన్నెలయందు కమలమందును ద్వేషమును ప్రకటించు చాతుర్యమును; |
| తిరస్కర్తుం ఇవ | = తిరస్కరించుటకో యన్నట్లు; |
| పరిష్కుర్వతే | = అలంకరించునో; |
| తాన్ | = ఆ; |
| కర్మౌఘాఖ్యతమఃకచాకచికరాన్ | = కర్మసమూహమనెడి చీకటితో పోరాడు; |
| త్రిభువనక్షేమంకరాన్ | = మూడు లోకములకు క్షేమమును కలిగించు; |
| త్వన్మన్దస్మితరోచిషామ్ | = నీ చిఱునవ్వు కాంతులయొక్క; |
| అంకురాన్ | = మొలకలను; |
| సంచిన్తయే | = బాగుగా ధ్యానించెదను. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! కర్మసమూహమనెడి చీకటితో పోరాడునవి నీ మందహాస రోచిరంకురములు. అవి చల్లదనపు కాంతి గలవి. వెన్నెలయందు కమల మందును ద్వేషమును బ్రకటించు చాతురి తిరస్కరించుటకు వికసిత వక్త్రమలంకరించు చున్నట్లున్నవి. అట్టి త్రిభువనక్షేమకరములైన నీ మన్దస్మిత రోచిరంకురముల చింతించెదను.

**వివరణము :-**

1) తమశ్శబ్దమునకు చీకటియను నర్థముతో బాటు అజ్ఞానము నను అర్థము కలదు. చీకటి యున్నంత వరకు ఎదుటనున్న వస్తువు కూడ కన్పించదు. అజ్ఞానమున్నంత కాలము నిత్యాపరోక్షమైన ఆత్మస్వరూపము శుద్ధరూపమున సాక్షాత్కరింపదు. అజ్ఞానము వలన అహంకారము మమకారమును జనించును. మమకారము రాగమునకు హేతువు. దుఃఖహేతువులైన పదార్థములందు వ్యక్తులందును మమకారముండదు. కావున రాగమునకు ప్రతిద్వంద్వియైన ద్వేష మేర్పడును. రాగద్వేషములే కర్మకు ప్రేరేపకములు. రాగద్వేషములు లేనివారికి కర్మలందు ప్రవృత్తి నివృత్తులుండవు. అజ్ఞానము దానివలన జనించిన అహంకారమమకారములు కలవారే లౌకికవైదికకర్మలందు బ్రవృత్తులగు చుందురు. పరంపరగా కర్మకు అజ్ఞానమే హేతువైనందున ఈ శ్లోకమున తమస్సు కర్మౌఘాఖ్యమని చెప్పఁబడినది. మన్దస్మితరోచిరంకురములు కర్మౌఘాఖ్య తమస్సుతో కచాకచి నొనరించునని **కర్మౌఘాఖ్యతమఃకచాకచికరాన్** అను సమాసముచే చెప్పఁబడినది. పోరాడు వారొకరి జుట్టును మరొకరు పీకుచుందురు. ఇట్టి పోరాటము కచాకచి యని

లేక కేశాకేశి యని చెప్పబడును. బాహువులు బాహువులతో నప్పళించి కొట్టుకొనుచు చేయు పోరాటము బాహాబాహి యనఁబడును. అమ్మవారి మన్దస్మితరోచి రంకురములు కర్మౌఘాఖ్య తమస్సుతో కచాకచి యని లేక **కేశాకేశి** యని చెప్పఁబడును. అమ్మవారి మన్దస్మితరోచిరంకురములు తెల్లనివి. కర్మౌఘాఖ్య తమస్సు నల్లనిది. తెలుపు, నలుపు జ్ఞానాజ్ఞానములవలె పరస్పర విరుద్ధములు. కావున కర్మౌఘముతో నమ్మవారి మన్దస్మితరోచిరంకురములు పోరాడుచుండును. ఈ బ్రహ్మాండము నందును అనంతమైన తమస్సు కలదు. దానితో సూర్యాది జ్యోతులు పోరాడుచునే యున్నవి. బ్రహ్మాండమున్నంత వరకు నీ పోరాటము సాగుచునే యుండును. ఇది చీకటి వెలుగుల పోరాటము. తెలుపు నలుపుల పోరాటము. తెలుపనగా అన్ని వర్ణముల కలయిక నలుపనగా సర్వవర్ణ రాహిత్యము. కర్మౌఘాఖ్యమైన నల్లనితమస్సుతో తెల్లనిమందస్మిత జ్యోతిరంకురములు పోరాడుచున్నవి. ఈ పోరాటము బ్రహ్మాండమందలి మహాతమస్సుతో సూర్యాది జ్యోతుల పోరాటమునకు ప్రతీకమని కర్మౌఘాఖ్యతమః శబ్దమందలి ఏకత్వస్ఫోరకములైన ఓఘతమశ్శబ్దములు బహువచనాంతమైన అంకురశబ్దము వ్యంజింపఁజేయుచున్నది.

2) దీనివలన తేలిన మరొక యంశము, ఒకరి కాత్మజ్ఞానము కలిగినదనగా వానికి సర్వసంసారాభావము లేక సర్వ బ్రహ్మానుభవము కలిగినదని యర్థము. కాని లోకమున మిగిలిన వారజ్ఞానులుగానే యుందురు. విశ్వవ్యవహారము సాగుచునే యుండును. అంకురము లనగా మొలకలు. మొలకలే తమ నాశ్రయించిన జీవుల సర్వజ్ఞానము తొలగించగలవనగా నిక మన్దస్మితముయొక్క మొత్తముశక్తిని గూర్చి చెప్పవలసినదేమున్నది? ఒక భక్తునను(గహించుటకమ్మవారి మన్దస్మితము సోకినదో లేదో అనాదియైన వాని యజ్ఞానమంతయు పటాపంచలగును. త్రిభువనములలో నెవడమ్మవారి యనుగ్రహమందస్మితమునకు పాత్రుడగునో వాడు తమోవిముక్తుడగును. త్రిభువనములొక బ్రహ్మాండమునకు జెందినవి. అట్టి యనేక కోటి బ్రహ్మాండములకు కామాక్షీదేవి జనని కావున ఆమె మందస్మితరోచిరంకురములకు· త్రిభువనజీవులకర్మౌఘ బంధమోచకత్వ ద్వారమున క్షేమంకరత్వము సిద్ధమగును. ఇంతేగాక మోక్ష రూపాలౌకికక్షేమమే కాక ఇష్టవాంఛాసిద్ధిరూపమైన ఇహపరలోక క్షేమకరత్వమును గూడ **"త్రిభువనక్షేమంకరాన్"** అను సమాసము స్ఫురింపఁజేయుచున్నది. తామరలు వెన్నెలలు శరత్కాలమున నత్యంతశోభావంతములై యుండును. అయ్యు పరస్పరము ద్వేషించుకొనుచుండును. వెన్నెలలు రాత్రులందే విలసిల్లును. వాని తోడి పగలు. తామరలను పగలు మాత్రమే విలసిల్లు నట్లొనరించుచున్నవి. అమ్మవారి మన్దహాసములు శిశిరశ్రీనిలయమగుటచే ఆ చంద్రాతపామ్భోరుహములను రెంటిని తన అదుపులో నుంచుకొనుటకే వానిలోని పరస్పర ద్వేషోద్ఘోషణమును తిరస్కరించుటకే అమ్మవారి ముఖము నలంకరించుచున్న వనుటచే ఉత్ప్రేక్షాలంకార ముత్తరార్ధమున నొప్పుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మన్దస్మితమునందలి లౌకికాలౌకిక క్షేమంకరత్వము ప్రస్తావింపఁబడినది. ఈ శ్లోకమున కూలంకషమంగళమునకై అనగా సంపూర్ణక్షేమమునకై ఆ మన్దస్మితము ప్రార్థింపఁబడుచున్నది.

**శ్లో॥ కుర్యుర్నః కులశైలరాజతనయే! కూలఙ్కషం మఙ్గళం**
**కున్దస్పర్ధనచుఞ్చవస్తవ శివే! మన్దస్మితప్రక్రమాః।**
**యే కామాక్షి! సమస్తసాక్షినయనం సన్తోషయన్త్యాన్తరం**
**కర్పూరప్రకరా ఇవ ప్రసృమరాః పుంసామసాధారణాః॥ 33**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కులశైలరాజతనయే | = | ఓ హిమవత్పర్వత రాజకుమారియైన; |
| శివే | = | మంగళస్వరూపురాలవైన; |
| కామాక్షి | = | ఓ కామాక్షీదేవీ! |
| యే | = | ఏవి (మన్దస్మిత ప్రక్రమములు); |
| ప్రసృమరాః | = | ప్రసరించు; |
| కర్పూరప్రకరా ఇవ | = | కప్పురపుపలుకులవలె; |
| ఆన్తరమ్ | = | లోపలనున్న; |
| సమస్తసాక్షినయనమ్ | = | సమస్తములకు సాక్షులైన సూర్యచంద్రాగ్నులు కన్నులుగాగల శివుని; |
| సన్తోషయన్తి | = | సంతోషింపజేయునో; |
| తే | = | ఆ; |
| కుందస్పర్ధనచుంచవః | = | మొల్లమొగ్గలతో స్పర్ధించుటలో సమర్థములైన; |
| మన్దస్మితప్రక్రమాః | = | మన్దస్మితారమ్భములు; |
| నః | = | మాకు; |
| కూలంకషమ్ | = | ఎనలేని; |
| మంగలమ్ | = | శుభమును; |
| కుర్యుః | = | చేయునుగాక. |

**తాత్పర్యము:-**

నీ చిఱునవ్వులు వ్యాపించు కప్పురపు పలుకులవలె లోనున్న శివుని సంతోషింపఁజేయును. మొల్లమొగ్గలతో పోటీపడును. అట్టి నీ మందస్మితా రంభములు మాకెనలేని మంగలముల ప్రసాదించుగాక!

**వివరణము :-**

1) నయనము దృక్కు, రూపము దృశ్యము, రూపమును మాత్రమే గాక

అన్నింటిని తెలిసికొనువాడు సమస్తసాక్షి. ఉపలక్షణముగా దృశ్యశబ్దము తెలియఁబడునన్నింటికి వాచకము, తెలిసికొను ఆత్మకు దృక్శబ్దము వాచకము. అందుచే ఆత్మ సమస్తసాక్షి యనఁబడును. ఈ యాత్మలో నుండువాడు కాన ఆంతరుడు లోపలినేత్రము అనగా శమదమాది సంస్కృతమైన మనస్సు సర్వస్వరూపుడైన బ్రహ్మమును తెలిసికొనుటలో సహకరించునది. కావున అది ఆన్తరనయనమని చెప్పఁబడును. మనస్సులో ప్రతిబింబించి చూచునది ఆత్మయే కావున వాస్తవమున నాత్మయే నయనమని చెప్పఁదగినది. అమ్మవారిలోన శివుడు ఆత్మరూపుడుగానే యున్నాడు. మనందఱిలోని యాత్మకూడ శివుడే సాక్షినయనుడు. సూర్య చంద్రాగ్నులు సమస్తసాక్షులు గావున అవి కన్నులుగా గల శివుడు సమస్త సాక్షి. నయనుడు. ఆయన ఆంతరుడే. శమదమాదిసంస్కృతమైనమనస్సుకూడ ఆంతరమే. శివునిలోని మనస్సునుకూడ కర్పూరపుపలుకులవలె అమ్మవారి మన్దస్మితప్రకరముల సంతోషింపజేయునవనుటచే నిట నుపమాలంకారము గలదు.

2) కంటికి దోషము, బాధ, వేడి కలిగినపుడు తచ్ఛాంతికై కర్పూరము పూసికొనుట సర్వులెరిగినదే. కర్పూరము పూసినప్పుడు కన్ను సంతోషించినట్లు శివుడమ్మవారి మన్దస్మితముచే సంతోషించును. శివుని దేహము విషాగ్ని దన్దహ్యమానము కర్పూర శకలములవలె అమ్మవారి మన్దస్మితము లా దేహమున వ్యాపించి లోనికి చొచ్చుకొనిపోయి ఆయన మనస్సును సంతోషపెట్టును. అనుగ్రహపాత్రులైన భక్తులందరలోనున్న ఆత్మరూప శివుని కవి సంతోషమును కలిగించును.

3) అనుగ్రహపాత్రులుగాని పురుషుల కా మన్దస్మిత ప్రక్రమములు సాధారణములు గావు అనగా భోగ్యములు గావు. అని **పుంసామసాధారణాః** అను పదములు తెలుపును. అమ్మవారి ప్రాతివ్రత్యమును గూడ స్ఫురింపఁజేయును. కున్దస్పర్ధనచుంచవః అను సమాసము గూడ కుందములతోడి ఔపమ్యమును మన్దస్మితప్రకరములందు స్ఫురింపఁజేయుచున్నది.



**అవ:-** పై శ్లోకమున తాపశాంతిహేతుకర్పూరప్రకరములతోడి యౌపమ్యము చిఱునవ్వునందు చెప్పఁబడినది. ఈ శ్లోకమున తాపశాంతి హేతు మన్దస్మితమున స్నానమర్థింపఁబడుచున్నది.

**శ్లో॥ క్రమేణ స్నపయస్వ కర్మకుహనాచోరేణ మారాగమ-**
**వ్యాఖ్యాశిక్షణదీక్షితేన విదుషామక్షీణలక్ష్మీపుషా।**
**కామాక్షి! స్మితకన్దలేన కలుషస్ఫోటక్రియాచుఞ్చునా**
**కారుణ్యామృతవీచికావిహరణప్రాచుర్యధుర్యేణ మామ్॥ 34**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి = ఓ కామాక్షీ దేవీ!

| | | |
|---|---|---|
| క్రమేణ | = | కమ్మనైన; |
| కర్మకుహనాచోరేణ | = | కర్మయనెడి కాపట్యమును దొంగిలించు; |
| మారాగమవ్యాఖ్యాశిక్షణదీక్షితేన | = | మన్మథతంత్రముయొక్క వ్యాఖ్యయందు శిక్షణ మందును దీక్షితమైన; |
| విదుషామ్ | = | జ్ఞానియైన; |
| అక్షీణలక్ష్మీపుషా | = | గొప్ప శుభమును పోషించు; |
| కలుషస్ఫోటక్రియాచుంచునా | = | పాపముల పగులగొట్టు క్రియయందు సమర్థమైన; |
| కారుణ్యామృతవీచికావిహరణ ప్రాచుర్యధుర్యేణ | = | కరుణామృత తరంగములలోనధికముగా విహరించుటలో ముందంజవేయు; |
| స్మితకన్దలేన | = | చిఱునవ్వు మొలకచేత; |
| మామ్ | = | నన్ను; |
| స్నపయస్వ | = | స్నానమాడింపుము. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! కమ్మనైనది కర్మకాపట్యమును దొంగిలించునట్టి నీ చిఱునవ్వు మారాగమమును వ్యాఖ్యానించుటయందు, ఇతరులకు నేర్పుటయందును సమర్థమైనది. అది పాపములఁబగులగొట్టుటలో నేర్పరి. కరుణామృతతరంగములలో విహరించుటలో ముందంజవేయునది. అట్టి నీ చిఱునవ్వుతో నన్ను దడుపుము.

**వివరణము :-**

కాపట్యము అనగా ఇతరులను మోసగించుట. ఇది స్వపరభేద జ్ఞానరూపమైన అజ్ఞానముచేత సంభవించునది. అట్టి కర్మకాపట్యము నమ్మవారి నవ్వు దొంగిలించివేయును. చిఱునవ్వును దొంగగా రూపించుటచేత నీ సమాసమున రూపకాలంకారమున్నది. **"ఆగతం శివ వక్త్రాత్తు గతం తు గిరిజాముఖే"** శివుని ముఖమునుండి అమ్మవారి ముఖములోనికి అనగా చెవిలోనికి, చెవిద్వారా మనస్సులోనికి పోవునట్టి వాఙ్మయమున కాగమమని పేరు. భారతీయసాహిత్యమున **ఆగమవాఙ్మయము** పుష్కలముగా నున్నది. నిగమాగమతన్త్రములు భిన్నశబ్దప్రతిపాద్యములైనను వీనికి స్పష్టమైన భేదము – (ఇది నిగమములే గాని ఆగమములు కావు. ఆగమములే కాని నిగమములు కావు. అట్లే ఆగమములే కాని తంత్రములు కావు. తంత్రములే కాని ఆగమములు కావు. ఇత్యాది రీత్యా చెప్పఁదగిన భేదము) కానరాదు. కొందఱు వేదములను ఆగమములనుచుండగా నిగమశబ్దముచే కొందఱు వేదములఁబేర్కొందురు. కొందఱు నిగమాగమములు పౌరుషేయము లందురు. కొందఱు వేదములు గూడ పౌరుషేయములు (పరమేశ్వర ప్రోక్తములు) అని యందురు. కొందఱు వేదార్థవివరణములను తంత్రము లందురు. కొందరు వేదవిరుద్ధాధ్యాత్మిక గ్రంథములను తంత్రములందురు. కలగాపులగముగా నిగమాగమతంత్ర శబ్దము

లొక్కొక్కదానినే పేర్కొనుట కాననగును. ఉదాహరణము వైదికమీమాంసా శాస్త్రమును తంత్రమనుట కలదు. వేదవిరుద్ధములైన జైనబౌద్ధతంత్రములు ఆగమములు కలవు. **ప్రత్యాక్షానుమానాగమాః ప్రమాణాని (పా.యో.7)** అనుచోట ఆగమ శబ్దము వేదసాహిత్యమును తెలుపును. వైదికసాహిత్యమంతయు ఆగమశబ్ద ప్రాతిపాద్యము. **నిగమకల్పతరోర్గలితం ఫలమ్** అను శ్రీ మద్భాగవతశ్లోకమున నిగమ శబ్దము వేదమునకు పర్యాయముగా నున్నది. ప్రస్తుతాంశము మారాగమ శబ్దము మన్మథతంత్రము మన్మథవిద్య అని పిలువఁబడు పంచదశీమంత్రమును బోధించును. ఈ రెండును అమ్మవారి అనుగ్రహమన్దస్మితములేక సిద్ధింపదు. మారాగమవ్యాఖ్యాశిక్షణము అమ్మవారి మన్దస్మితముయొక్క కృత్యములు. ఈ యర్థమును **మారాగమవ్యాఖ్యాశిక్షణదీక్షితేన** అను సమాసము బోధించును. దీక్షిత శబ్దమా మన్దహాసమున మారాగమవ్యాఖ్యాశిక్షణము. అమ్మవారి మన్దస్మితము యొక్క ముఖ్యకృత్యములని తెలుపును. అమ్మవారి మన్దస్మితము కలుషస్ఫోటక్రియాచుంచువు. పాపములు జీవుని బంధించు శృంఖలములు. వానిని పగులగొట్టుటలో అమ్మవారి మన్దస్మితము సమర్థము అని తెలుపును. **స్ఫోటక్రియా** శబ్దముచే పాపముల శృంఖలత్వరూపణము వ్యంగ్య మగును. సమస్తజీవులందు లక్ష్మి యుండును. కాని అది ముదిమిచే క్షీణించుచుండును. అమ్మవారి మన్దస్మితమునకు ముదిమిలేదు కావున అది అక్షీణము. విద్వాంసులకు అనగా జ్ఞానులకు అజరామరత్వము కలిగించుటచే వారిలో అక్షీణలక్ష్మి నమ్మవారి మన్దస్మితము పోషించును. అన్నిటికన్న ముఖ్యముగా అమ్మవారి మన్దస్మిత కారుణ్యామృతవీచికావిహరణప్రాచుర్యధుర్యము కారుణ్యమే లేనిచో ఆ మన్దహాసముతో మనకేమి యుపయోగము. అది కారుణ్యమాత్రము కలది కాదు. కారుణ్యామృత వీచికలలో విహరించు వారిలో నగ్రగణ్యము. ఈ విశేషణము అమ్మవారి మన్దస్మితముతో ఇతర కారుణికులెవరును సాటిరారని తెలుపును. స్నపయస్వ అను శబ్దము కవియొక్క బహుజన్మలనుండి అనుభవించుచున్న తాపము నివారింపఁబడవలెను అను తీవ్రవాంఛను తెలుపును. ఈ శ్లోకమున విశేషణములన్నియు సాభిప్రాయములగుటచే నిట పరికరాలంకారము కలదు.



**అవ:-** పై శ్లోకమున మన్దస్మితవిశేషణములలో **కుహనా వీచికా** శబ్దములు ప్రయోగింపఁబడినది. అవియే ఈ శ్లోకమున మన్దస్మితసామ్యలేశముగల **స్వర్వాహినీ, మల్లీమతల్లీ** సంబద్ధములుగా ప్రయోగింపఁబడుచున్నవి.

**శ్లో॥ త్వన్మన్దస్మితకన్దలస్య నియతం కామాక్షి! శఙ్కామహే**
**బిమ్బః కశ్చన నూతనః ప్రచలితో నైశాకరశ్శీకరః।**
**కిఞ్చ క్షీరపయోనిధిః ప్రతినిధిః స్వర్వాహినీవీచికా-**
**బిబ్బోకో౽పి విడమ్బ ఏవ కుహనా మల్లీమతల్లీరుచః॥ 35**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి | = ఓ కామాక్షీ దేవీ! |
| త్వన్మన్దస్మితకన్దలస్య | = నీ చిఱునవ్వు మొలకకు; |
| నైశాకరః | = చంద్రునికి సంబంధించిన; |
| బిమ్బః | = బిమ్బము; |
| నూతనః | = క్రొత్తదైన; |
| కశ్చన | = ఒకానొక; |
| శీకరః | = బిందువు; |
| ప్రచలితః | = ఏర్పడినది; |
| ఇతి | = అని; |
| నియతమ్ | = నిశ్చయముగా; |
| శంకామహే | = తలచుచున్నాము; |
| కిం చ | = మరియు; |
| క్షీరపయోనిధిః | = పాలసముద్రము; |
| ప్రతినిధిః | = ప్రతినిధి; |
| స్వర్వాహినీవీచికావిబ్బోకః | = స్వర్లోకనదీతరంగవిలాసము; |
| విడంబః+ఏవ | = అనుకరణమే; |
| మల్లీమతల్లీరుచః | = శ్రేష్ఠమైన మల్లె తీగకాంతులు; |
| అపి | = కూడ; |
| కుహనాః | = మిథ్యలే. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! చంద్రబింబము నీ చిఱునవ్వున నేర్పడిన యొకానొక క్రొత్తబిందువే యని నిశ్చయముగా నూహించుచున్నాము. మరియు పాల సముద్రము ప్రతినిధిగా మాత్రమే యున్నది. స్వర్లోకమునందలి మన్దాకినీ విలాసము కూడ అనుకరణముగానే యున్నది. శ్రేష్ఠమైన మల్లెతీగయొక్క కాంతులు కూడ మిథ్యలు అనియే చెప్పవచ్చును.

**వివరణము :-**

చంద్రబిమ్బము అమ్మవారి మన్దస్మితమున కొత్తగా నేర్పడిన యొక బిందువని, పాలసముద్రము ప్రతినిధియని, ఆకాశగంగా విలాసము విడంబమని, మల్లెతీగల కాంతులు మిథ్యలని, యుత్ప్రేక్షించుటచే నీ శ్లోకమున మాలోత్ప్రేక్షా లంకారము **శంకామహే** అను క్రియచే వాచ్యమై యున్నది. ప్రతినిధియనగా ఒక వస్తువు దొఱకనప్పుడు ప్రతినిధి మూలవస్తువునకు దాదాపు సమానము. ఆ కారణమున ప్రతినిధి మూలవస్తువునకు

ప్రతినిధి కాగా దానియందు జన్మించిన పూర్ణచంద్రబింబము దానిలోని యొక కొత్త బిందువే యగుటలో వింత యేమున్నది? పాలసముద్రమే ప్రతినిధియైనప్పుడు అందులో చేరి నామరూపములు గోల్పోవు ఆకాశగంగావిలాసము విడంబనము కాక మరేమి? ఇక భూమి యందు మొలచి కొన్నాళ్ళే కాంతిని ప్రసరించు మల్లెతీగ భూమిలోని తీగలలో శ్రేష్ఠమైనదే అయినను మన్దస్మితము ముందది మిథ్యాప్రాయమే గదా?



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మన్దస్మితమునకు పాలసముద్రము ప్రతినిధియని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ పాలసముద్రమున జనించిన తత్సారభూతమైన అమృతరసముగా అమ్మవారి మందస్మితము చెప్పబడుచున్నది.

**శ్లో॥ దుష్కర్మార్కనిసర్గకర్కశమహఃసమ్పర్కతప్తం మిల-**
**త్పఙ్కం శఙ్కరవల్లభే! మమ మనః కాఞ్చీపురాలఙ్క్రియే।**
**అమ్బ! త్వన్మృదులస్మితామృతరసే మఙ్క్త్వా విధూయ వ్యథా-**
**మానన్దోదయసౌధశృఙ్గపదవీమారోఢుమాకాంక్షతి॥** **36**

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| కాంచీపురాలంక్రియే | = కాంచీపురమునకలంకారమైనదానా! |
| శంకరవల్లభే | = శివుని కిల్లాలవైన దానా! |
| అంబ | = అమ్మా! |
| దుష్కర్మార్కనిసర్గకర్కశమహఃసంపర్క తప్తమ్ | = దుష్కర్మయనెడి సూర్యునియొక్క సహజముగా వాడియైన గొప్పస్పర్శచే తపించిపోయివున్న; |
| మమ | = నాయొక్క; |
| మనః | = మనస్సు; |
| త్వన్మృదులస్మితామృతరసే | = నీ కోమలమైన చిఱునవ్వు అను అమృతరసము నందు; |
| మంక్త్వా | = మునిగి; |
| వ్యథామ్ | = బాధను; |
| విధూయ | = వీడి; |
| ఆనన్దోదయసౌధశృంగపదవీమ్ | = ఆనన్దోదయ మనెడి మేడ పైభాగము నందున్న చోటునకు; |
| ఆరోఢుమ్ | = ఎక్క; |
| ఆకాంక్షతి | = కోరుచున్నది. |

**తాత్పర్యము:-**

దుష్కర్మసూర్యకర్కశస్పర్శచే తపించియున్న నా మనస్సోయమ్మా! నీ మృదుస్మితామృతరసమున మునిగి బాధను వీడి ఆనన్దము నొన్దగోరుచున్నది.

**వివరణము :-**

తాపహేతువగుటచే దుష్కర్మము సూర్యునితో రూపింపబడినది. కవి మనస్సు ఆ దుష్కర్మసూర్యస్పర్శచే తప్తమైనది. మనస్సు కమలముతో పోల్చబడుచుండును. అట్టి మృదువైన మనఃకమలము బాలసూర్యస్పర్శ సహించగలదు కాని ప్రచండదుష్కర్మ మధ్యాహ్నార్కస్పర్శము నెట్లు సహింపగలదు. అర్కతప్తులు స్నానమాడి చల్లగా నుండు ఎత్తైన స్థలములలో విహరింపగోరుట మనమెరుగుదుము. అట్లే కవి మనస్సుగూడ అమ్మవారి స్మితామృతరసమున మునిగి యా పిమ్మట ఆనన్దమనెడి ఎత్తైనమేడ పైభాగము నెక్కగోరుచున్నది అని తప్తస్వభావము వర్ణింపబడుటచే స్వభావోక్త్య లంకారమున్నది. అది దుష్కర్మార్క, మృదులస్మితామృతరస, ఆనన్దోదయసౌధశృంగపదవీ అను రూపకములతో కూడియున్నది.



**అవ:-** పై శ్లోకమున ఆనన్దము సౌధముగా రూపింపఁబడినది. ఈ శ్లోకమున ఆనన్దమున బీజారోపము చేయబడుచున్నది.

**శ్లో॥ నమ్రాణాం నగరాజశేఖరసుతే నాకాలయానాం పురః**
**కామాక్షి! త్వరయా విపత్ప్రశమనే కారుణ్యధారాః కిరన్।**
**ఆగచ్ఛన్తమనుగ్రహం ప్రకటయన్నానన్దబీజాని తే**
**నాసీరే మృదుహాస ఏవ తనుతే నాథే! సుధాశీతలః॥ 37**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| నగరాజశేఖరసుతే! | = పర్వతసార్వభౌమపుత్రీ! |
| నాథే | = యజమానురాలా! |
| కామాక్షి | = ఓ కామాక్షీ దేవీ! |
| పురః | = ఎదుట; |
| నమ్రాణామ్ | = వంగియున్న; |
| నాకాలయానామ్ | = దేవతలయొక్క |
| విపత్ప్రశమనే | = ఆపదల శమింపఁజేయుటలో; |
| కారుణ్యధారాః | = దయారసధారలను; |
| కిరన్ | = చిమ్ముచు; |
| ఆగచ్ఛన్తమ్ | = వచ్చుచున్న; |
| అనుగ్రహమ్ | = దయను; |

| | | |
|---|---|---|
| ప్రకటయన్ | = | ప్రకటించుచు; |
| ఆనన్దబీజాని | = | ఆనన్దపు విత్తనములను ; |
| నాసీరే | = | (యుద్ధ) భూమియందు; |
| సుధాశీతలః | = | అమృతముతో(వలె) చల్లనైన; |
| తే | = | నీయొక్క; |
| మన్దహాస ఏవ | = | చిఱునవ్వే; |
| తనుతే | = | వెదజల్లుచున్నది. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! ఆపన్నులైన దేవతలు నీకు నమస్కరించి నిలువఁబడగా వారి యాపదల శమింపఁజేయు కారుణ్యధారల జల్లుచు అనుగ్రహమును బ్రకటించిన నీ మన్దహాస మానన్దబీజములను వారు నిలచియున్న భూమి యందే వెదఁజల్లుచున్నది.

**వివరణము :-**

**క** అనగా సుఖము, **అక** అనగా దుఃఖము. అకము లేనిది నాకము అనగా స్వర్గము. ఆ స్వర్గము ఆలయముగా గలవారు నాకాలయులు. వారికిని విపత్తు వచ్చినది. వారమ్మవారి మ్రోల నమస్కరించి నిలచియున్నారు. అమ్మవారి మన్దహాసము కారుణ్యధారలను వెదజల్లుచు అనుగ్రహమును బ్రకటించును. ఆనన్దబీజములు వారి మనోభూములలో వెదజల్లుచున్నది. నీరు చిలికి బీజముల జల్లుట కర్షకుల కృత్యము. అమ్మవారి మన్దహాసమునందు కర్షకవ్యవహారోపముచే సమాసోక్త్యలంకార మేర్పడుచున్నది. **ఆగచ్ఛన్తమనుగ్రహమ్**, ప్రకటయన్ అను శబ్దములు రాబోవు కాలమున గ్రహానుకూల్య ముండునని కావున సస్యములు ఫలించునని ముందుగా కర్షకులకు ధైర్యమును కలిగించుట సూచించుచున్నవి.



**అవ:-** అమ్మవారి అనుగ్రహమన్దహాసావశ్యకత దేవతలకు కలుగుట పై శ్లోకమున వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున శివునకు దాని యావశ్యకత యేర్పడగా దానికై ఆయన చేయు ప్రయత్నము వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ కామాక్షి! ప్రథమానవిభ్రమవిధిః కన్దర్పదర్పప్రసూ-**
**ర్ముగ్ధస్తే మృదుహాస ఏవ గిరిజే! ముష్ణాతు మే కిల్బిషమ్।**
**యం ద్రష్టుం విహితే కరగ్రహ ఉమే! శమ్భుస్త్రపామీలితం**
**స్మేరం కారయతి స్మ తాణ్డవవినోదాహిణ్డినా తణ్డునా॥** **38**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| గిరిజే | = | పర్వతపుత్రికవైన |
| కామాక్షి | = | ఓ కామాక్షీ దేవీ! |

ఉమే = ఓ ఉమా!
కరగ్రహే = వివాహము;
విహితే = చేయబడగా;
త్రపామీలితమ్ = సిగ్గుతో మూయబడిన;
యమ్ = దేనిని (చిఱునవ్వును);
ద్రష్టుమ్ = చూచుటకు;
శమ్భుః = శివుడు;
తాండవవినోదాహిండినా = తాండవ వినోదమునకై తిరుగు;
తండునా = తండువుచేత;
స్మేరమ్ = వికసించిన దానినిగా;
కారయతి స్మ = చేసెనో;
(సః ఆ) ప్రథమానవిభ్రమవిధిః = విభ్రమవిధిని ప్రకటించుచున్న;
కన్దర్పదర్పప్రసూః = మన్మథునికి గర్వమును కలిగించు;
ముగ్ధః = అమాయకమైన;
తే = నీయొక్క;
మృదుహాస ఏవ = మందస్మితమే;
మే = నాయొక్క;
కిల్బిషమ్ = పాపమును;
ముష్ణాతు = హరించుగాక.

**తాత్పర్యము:-**

అమ్మా ఉమా! నీ చిఱునవ్వు విభ్రమములను ప్రకటించును, మన్మథునకు దర్పము పుట్టించును. అది అమాయకముగా కనిపించును, నీ వివాహమైన పిదప శివుడు తండువుతో వికృతముగా తాండవ మొనరింపఁజేసి సిగ్గుతో ముడుచుకొన్న నీ పెదవులు విప్పుకొని నవ్వునట్లొనరించెను. నీ నవ్వును చూచుటకై శివుడు అట్లు ప్రయత్నించెను. అట్టి నీ చిఱునవ్వు నా పాపమును పోగొట్టుగాక!

**వివరణము :-**

శివుడు తాండవప్రియుడు. తాండవ మనునదొక నాట్య ప్రభేదము. శివుని అనుచరుడగు తండువనువాడు దీనిని సృష్టించెను. కావున దీనిని తాండవ మందురు. నృత్తము నృత్యము నని నాట్యము రెండు విధములుగా నుండును. అందును నృత్తము లాస్యము తాండవము నని ద్వివిధము. నృత్తమున ప్రతికదలికకు అర్థముండదు. కాని ఆ మొత్తము నృత్తమొక మానసికభావమును ప్రకటించును. ప్రతి కదలికలోను అర్థముండునది నృత్యము. నృత్తనృత్యములు రెండును రసపర్యవసాయులే, నృత్తభేదమైన లాస్యమెక్కువగా నాడువారు ముఖ్యముగా అమ్మవారు ఒనర్చునట్టిది. నృత్తభేదమైన తాండవమును ఎక్కువగా

పురుషులు శివభక్తులు ముఖ్యముగా శివుడొనర్చునట్టిది. ప్రస్తుతము అమ్మవారిని నవ్వించుటకై తండువును ప్రేరేపించెను. వాడమ్మవారికి నవ్వును పుట్టించు నాట్యము నొనర్చెను. అమ్మవారి చిఱునవ్వునకై శివుడు ప్రయత్నించెననగా కందర్పునికి దర్పము పుట్టినట్లే కదా. ఆ నవ్వున విలాసములు ప్రకటింపఁబడునని శివుడెరుగును. అందుకే ఆ నవ్వునకై ప్రయత్నించెను. క్రొత్త పెండ్లికూతురైన పార్వతి కొంచెము పెదవుల విప్పెను. అమాయకమైన చిఱునవ్వు శివునకు కన్పించెను. అమ్మా ఆ చిఱునవ్వు నా యెదను దోచునట్లు చేయుము. నా హృదయములోని పాపమంతయు దొలగిపోవును. ప్రస్తుత మమ్మవారి మన్దహాసము దాని యందు అప్రస్తుతమైన శివుని ప్రయత్నమునఁబుట్టి యుండుట వర్ణింపఁబడుటచే నిట నప్రస్తుతప్రశంసాలంకారము కలదు. మన్దహాసము తెల్లనిది. కిల్బిషము నల్లనిది. మన్దహాసము తెల్లని వెలుగై నల్లని చీకటి వంటి నా పాపమును దొలగించగలదని వ్యంగ్య మగుచున్నది. వెలుగునకు చీకటిని బోగొట్టుట సహజము కావున ప్రయత్నమక్కర లేకుండ జరుగుననియు వ్యంగ్య మగుచున్నది.



**అవ:–** కిల్బిషహరణమునకై అమ్మవారి మన్దస్మితము పైశ్లోకమునఁబ్రార్థింపబడినది. ఈ శ్లోకమున ప్రదీపము వంటి ఆ మన్దస్మితము ముక్తి మార్గము చూపించుటకై ప్రార్థింపఁ బడుచున్నది.

**శ్లో॥ క్షుణ్ణం కేనచిదేవ ధీరమనసా కుత్రాపి నానాజనైః**
**కర్మగ్రన్థినియన్త్రితైరసుగమం కామాక్షి! సామాన్యతః।**
**ముక్తేర్ద్రష్టుమశక్యమేవ మనసా మూఢస్య మే చక్షుషో**
**మార్గం దర్శయతు ప్రదీప ఇవ తే మన్దస్మితశ్రీరియమ్॥39**

**ప్రతిపదార్థము:–**

| | |
|---|---|
| కామాక్షి | = ఓ కామాక్షీ దేవీ! |
| కుత్రాపి | = ఎక్కడనో ఒకచోట; |
| కేనచిత్ | = ఒకానొక; |
| ధీరమనసా ఏవ | = ధీరమనస్కునిచేతనే; |
| క్షుణ్ణమ్ | = త్రొక్కబడిన; |
| సామాన్యతః | = సాధారణముగా; |
| కర్మగ్రన్థినియన్త్రితైః | = కర్మలముడులలో చిక్కువడిన; |
| నానాజనైః | = అనేక జనులచేత; |
| అసుగమమ్ | = సులభముగాఁబోరాని; |
| మూఢస్య | = జ్ఞానహీనుడనైన; |
| మే | = నాయొక్క |

| | |
|---|---|
| మనసా ఏవ | = మనస్సుచేతనైనను; |
| ద్రష్టుమ్ | = చూచుటకు; |
| అశక్యమ్ | = వీలుకాని; |
| ముక్తేః | = ముక్తియొక్క; |
| మార్గమ్ | = మార్గమును; |
| మే చక్షుషః | = నాకంటికి; |
| దర్శయతు | = చూపుటకు; |
| అశక్యమ్ | = వీలుకాని; |
| ముక్తేః | = ముక్తియొక్క; |
| మార్గమ్ | = మార్గమును; |
| మే చక్షుషః | = నా కంటికి; |
| దర్శయతు | = చూపుటకు; |
| ఇయమ్ | = ఈ ; |
| మన్దస్మితశ్రీః | = మన్దస్మితకాంతి; |
| ప్రదీపః+ఇవ | = దీపము వంటిది. |

**తాత్పర్యము:-**

ఎక్కడో ఒక చోట ఎవడో ఒక ధీరమనస్కుడు మాత్రమే పోగలిగిన, కర్మల ముడులలో చిక్కువడిన వారికి సుగమము కాని, మూఢుండనైన నా మనస్సున కసలు వీలుకాని, ముక్తి మార్గమును చూపుటకు అమ్మా! నీ మందస్మిత ప్రకాశము నా కంటికి ప్రదీపమువంటిదే యగును.

**వివరణము :-**

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే, యతతామపి సిద్ధనాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః** (7.3) (మోక్ష మార్గమున అడుగుపెట్టువాడు కోటికొక్కడు) అను పై గీతార్థము, **ధీరమనసా** శబ్దములోని ఏకవచనము తెలుపుచున్నది. ధీరమనస్కుడైన ఆ యొక్కనికే ఆ మోక్షమార్గము సుగమము. మిగిలిన కర్మగ్రంథి బంధములలో చిక్కువడిన యనేకులకు సుగమము కాని మోక్షమార్గము మూఢుడనైన నా మనస్సుయొక్క ఊహకును అందనట్టిది. అమ్మవారి మన్దస్మిత ప్రకాశము నా కంటి కా ముక్తిమార్గముఁజూపు దీపమువలె నున్నది యని మన్దస్మిత ప్రకాశదీపములకు పోలిక చెప్పుటచే నిట నుపమాలంకారము కలదు.



**అవ:-** పై శ్లోకమున మన్దస్మితమునకు ప్రదీపముతోడి పోలిక చెప్పఁబడినది. ఈ శ్లోకమున చంద్రమండలాంభోరుహ ద్యుబింబములతో పోలిక వ్యంజింపజేయ c బడుచున్నది.

శ్లో॥ జ్యోత్స్నాకాన్తిభిరేవ నిర్మలతరం నైశాకరం మణ్డలం
హంసైరేవ శరద్విలాససమయవ్యాకోచమమ్భోరుహమ్।
స్వచ్ఛైరేవ వికస్వరైరుడుగణైః కామాక్షి! బిమ్బం దివః
పుణ్యైరేవ మృదుస్మితైస్తవ ముఖం పుష్ణాతి శోభాభరమ్॥ 40

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| కామాక్షి | = ఓ కామాక్షీ దేవీ! |
| నైశాకరమ్ | = చంద్రునికి సంబంధించిన; |
| మండలమ్ | = మండలము; |
| జ్యోత్స్నాకాంతిభిః ఏవ | = వెన్నెల వెలుగుల చేతనే; |
| నిర్మలతరమ్ | = మిక్కిలి నిర్మలము; |
| శరద్విలాససమయవ్యాకోచమ్ | = శరదృతువు విలసిల్లు సమయమున వ్యాపించు; |
| అంభోరుహమ్ | = కమలము; |
| హంసైరేవ | = హంసలచేతనే; |
| నిర్మలతరమ్ | = మిక్కిలి నిర్మలము; |
| దివః | = ఆకాశముయొక్క; |
| బిమ్బమ్ | = బింబము; |
| స్వచ్ఛైః | = స్వచ్ఛములైన; |
| వికస్వరైః | = వికసించిన; |
| ఉడుగణైః ఏవ | = చుక్కల గుంపులతోడనే; |
| నిర్మలతరమ్ | = మిక్కిలి నిర్మలము; |
| పుణ్యైః | = పవిత్రములైన; |
| మృదుస్మితైః ఏవ | = చిఱునవ్వులచేతనే; |
| తవ | = నీయొక్క |
| ముఖమ్ | = ముఖము; |
| శోభాభరమ్ | = శోభాధిక్యమును; |
| పుష్ణాతి | = పోషించుచున్నది. |

తాత్పర్యము:-

అమ్మా కామాక్షీ! వెన్నెల వెలుగులచేతనే చంద్రమండలము; శరదృతువుననే, హంసలచేతనే కమలము, ఆకాశబింబము స్వచ్ఛముగా మెఱయు చుక్కలచేతనే; మరింత శోభావంతములై కన్పడుచున్నది. నీ ముఖము కూడా పవిత్రములైన చిఱునవ్వుల చేతనే నధికముగా శోభిల్లుచున్నది.

వివరణము :-

మొదటిమూడుపాదములలో అప్రకృతములైన చంద్రమండలాంభోరుహాకాశ మండలముల నిర్మలత్వము అను తుల్యధర్మము చెప్పఁబడినందున చివరి పాదమున అమ్మవారి మన్దస్మితములచేత నా ముఖమున శోభాధిక్యపోషణము చెప్పఁబడుటచే ఉపమానధర్మములైన జ్యోత్స్నాకాంతిహంసోడుగణములకు ఉపమేయధర్మమైన మన్దస్మితములకు బింబప్రతిబింబభావముండుటచేత **తుల్యయోగితానుప్రాణిత దృష్టాంతాలంకార** మొప్పుచున్నది.



**అవ:-** చన్ద్రికా కాంతులచే నిర్మలతరమైన నైశాకరమండలము తోడి పోలిక మన్దస్మితసహితముఖమునకు బింబప్రతిబింబభావముతో వ్యంజింపఁజేయబడినది. ఈ శ్లోకమున స్మితమున చంద్రికతో రూపణము ద్వారమున పోలిక వ్యంజింపఁజేయబడినది.

**శ్లో॥ మానగ్రన్థివిధున్తుదేన రభసాదాస్వాద్యమానే నవ-**
**ప్రేమాడమ్బరపూర్ణిమాహిమకరే కామాక్షి! తే తత్క్షణమ్।**
**ఆలోక్య స్మితచన్ద్రికాం ముహురిమామున్మీలనం జగ్ముషీం**
**చేతశ్శీలయతే చకోరచరితం చన్ద్రార్ధచూడామణేః॥ 41**

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| కామాక్షి | = ఓ కామాక్షీ దేవీ! |
| మానగ్రంథివిధుంతుదేన | = మానగ్రన్థియను రాహువుచేత; |
| నవప్రేమాడంబరపూర్ణిమాహిమకరే | = నూత్న ప్రేమయనెడి పున్నమచన్ద్రుడు; |
| రభసాత్ | = బలాత్కారముగా; |
| ఆస్వాద్యమానే | = అనుభవింపఁబడుచుండగా; |
| తత్క్షణమ్ | = వెంటనే; |
| ముహుః | = మాటిమాటికి; |
| ఇమామ్ | = ఈ; |
| ఉన్మీలనమ్ | = వికాసమును; |
| జగ్ముషీమ్ | = పొందుచున్న; |
| తే | = నీయొక్క |
| స్మితచన్ద్రికామ్ | = చిఱునవ్వు వెన్నెలను; |
| ఆలోక్య | = చూచి; |
| చన్ద్రార్ధచూడామణేః | = శివునియొక్క |
| చేతః | = మనస్సు; |
| చకోరచరితమ్ | = చకోరముయొక్కచరిత్రమును; |
| శీలయతే | = అనుకరించుచున్నది. |

**తాత్పర్యము:-**

కామాక్షీదేవి నూత్నప్రణయచంద్రుడు మానగ్రన్థిరాహువుచే బలవంతముగా ఆస్వాదింపఁబడుచుండినను స్మితచంద్రిక బయటపడుచునే యున్నది. ఆ స్మితచన్ద్రిక మాటిమాటికి క్రమముగా వికాసమునే పొందుచున్నది. అట్టి ఆ స్మితచన్ద్రికను చూచి శివుని మనస్సు చకోర చరితము ననుకరించుచున్నది.

**వివరణము :-**

కామాక్షిదేవికి శివునితో కాపురము చేయు తొలిరోజులవి. భర్తకు లొంగిపోవలెనని మనస్సులో నున్నను బెట్టుచేయుట మానమనఁబడును. అది యొక గ్రంథి. శివుని ప్రణయరసాస్వాదమునకు కించిదాటంకము. ఆ మానగ్రంథి ప్రేమయను పూర్ణచంద్రుని బలవంతముగా నాస్వాదించుచున్నది. అనగా మానము ప్రేమను గ్రమ్మివైచినది. అయినను ఆ నవప్రేమ పూర్ణచంద్రుడు గదా రాహువుచే తన దారిలో పూర్ణిమా చన్ద్రునికి యత్కించిద్గ్రాసము కలుగుచున్నను వెన్నెల బొత్తిగా లేకుండునా? అదియు గాక గ్రహణము అల్పకాలికమే గదా. మానగ్రన్థి విడిపోక యెంతకాలము నుండగలదు. అది విడిపోవుచున్న కొలది అమ్మవారి మన్దస్మితచన్ద్రిక వికసించుచునే యున్నది. దానిని చూచి శివుని చిత్తము చకోరమువలె నానందింపకుండ నెట్లుండగలదు? పూర్వార్ధమున మానగ్రన్థి రాహువులకు, నవప్రేమపూర్ణచన్ద్రులకు రూపణముండుటచే నిట రూపకాలంకార మున్నది. స్మితచన్ద్రికలకును రూపణమున్నది. శివుని చిత్తము చకోరచరితము ననుకరించుచున్నది, అనుటలో చిత్తచకోరములకు ఔపమ్యము స్ఫురించుచున్నది. శివుడు చన్ద్రార్ధ చూడామణి. సగము చన్ద్రుడు ఆయన శిరసున అలంకారముగా నున్నాడు. శివుని చిత్తమున కా యర్ధచంద్రుని వెన్నెల విరహ వేదననే పెంచుచున్నది. అమ్మవారి మానగ్రన్థివిడలేదు గదా, అందుకే ఆ విరహము. **చన్ద్రార్ధచూడామణేః** అను శివవాచక పదమీ యంశమును సూచించును.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి స్మితము **చంద్రికగా** రూపింపబడినది. ఈ శ్లోకమున నా స్మితమున బిసశంక గజముఖునకు గల్గినట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ కామాక్షి! స్మితమఞ్జరీం తవ భజే యస్యాస్త్విషామఙ్కురా**
**నాపీనస్తనపానలాలసతయా నిశ్శఙ్కమఙ్కేశయః।**
**ఊర్ధ్వం వీక్ష్య వికర్షతి ప్రసృమరానుద్దామయా శుణ్డయా**
**సూనుస్తే బిసశఙ్కయాశు కుహనాదన్తావలగ్రామణీః॥** **42**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి = ఓ కామాక్షీ దేవీ!

| | |
|---|---|
| యస్యాః | = దేవి (స్మితమంజరియొక్క); |
| ప్రసృమరాన్ | = వ్యాపించు; |
| త్విషామ్ | = కాంతులయొక్క; |
| అంకురాన్ | = మొలకలను; |
| అంకేశయః | = ఒడిలో పడుకొనియున్న; |
| కుహనాదన్తావలగ్రామణీః | = కపటగజశ్రేష్ఠుడైన; |
| తే | = నీయొక్క; |
| సూనుః | = కొడుకు(శిశువు); |
| ఆపీనస్తనపానలాలసతయా | = బలువైన స్తనమును ద్రాగునాసక్తిచేత; |
| ఊర్ధ్వమ్ | = పైకి; |
| వీక్ష్య | = చూచి; |
| నిశ్శంకమ్ | = నిర్భయముగా; |
| ఆశు | = శీఘ్రముగా; |
| బిసశంకయా | = తామరతూండ్లను శంకచేత; |
| ఉద్దామయా | = అదుపులేని; |
| శుండయా | = తొండముచేత; |
| వికర్షతి | = లాగుచున్నాడో; |
| (తామ్ | = ఆ); |
| తవ | = నీయొక్క; |
| స్మితమంజరీమ్ | = చిఱునవ్వు గుత్తిని; |
| భజే | = భజించెదను. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీదేవీ! ఏ నీ చిఱునవ్వుగుత్తియొక్క కాంతుల మొలకలు వ్యాపించుచుండ వానిని, నీయొడిలో పడుకొన్న కపటగజస్వరూపుడైన నీ చిన్ని కుమారుడు పాలు త్రాగవలెనని పైకి చూచి, తామరతూండ్లను కొని శ్రీఘ్రముగా అదుపులేని తన తొండముతో లాగుచున్నాడో అట్టి నీ చిఱునవ్వుగుత్తిని భజించుచుండెదను.

**వివరణము :-**

1) గజముఖుడట్లు చేసియుండకపోయినను చేసినట్లు వర్ణించుటచే నీ శ్లోకమున అతిశయోక్త్యలంకారమున్నది. 2) పెద్దన వర్ణించిన గజముఖుని బిసశంకరీ శ్లోకము ప్రేరకము కావచ్చును.



**అవ:-** పై శ్లోకమున స్మితకాంతులయందు వినాయకునకు గలిగిన బిసశంక వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఆ స్మితకాంతియందు సఖ్యమున్నట్లు వర్ణింపఁబడుచున్నది.

శ్లో॥ గాఢాశ్లేషవిమర్దసమ్భ్రమవశాదుద్దామముక్తాగుణ-
ప్రాలమ్బే కుచకుమ్భయోర్విగలితే దక్షద్విషో వక్షసి।
యా సఖ్యేన పినహ్యతి ప్రచురయా భాసా తదీయాం దశాం
సా మే ఖేలతు కామకోటి! హృదయే సాన్ద్రస్మితాంశుచ్ఛటా॥ 43

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| కామకోటి! | = కామకోటి పీఠాధీశ్వరీ! |
| యా | = ఏది (సాన్ద్రస్మితాంశుచ్ఛట); |
| కుచకుంభయోః | = కుండలవంటి స్తనములందలి; |
| గాఢాశ్లేషవిమర్దసమ్భ్రమవశాత్ | = గాఢాలింగనముయొక్క రాపిడియొక్క వేగముయొక్క, వశము వలన; |
| ఉద్దామముక్తాగుణప్రాలమ్బే | = గొప్పదైన ముత్యాలహారముయొక్క యొక వరుస; |
| దక్షద్విషః | = శివునియొక్క; |
| వక్షసి | = ఉరమున; |
| విగలితే | = తెగిపడగా; |
| ప్రచురయా | = అధికమైన; |
| భాసా | = కాంతితో; |
| తదీయామ్ | = ఆ హారమునకు సంబంధించిన; |
| దశామ్ | = దశను; |
| సఖ్యేన | = స్నేహముతో; |
| పినహ్యతి | = దాచుచున్నదో; |
| సా | = ఆ; |
| సాన్ద్రస్మితాంశుచ్ఛటా | = దట్టమైన చిఱునవ్వు కాంతిప్రసారము; |
| మే | = నాయొక్క; |
| హృదయే | = హృదయమున; |
| ఖేలతు | = క్రీడించుగాక. |

**తాత్పర్యము:-**

శివుడు కామాక్షీదేవియొక్క ఆలింగనసమయమున నేర్పడిన రాపిడి తొందర వలన అమ్మవారి స్తనముల పైనున్న ముత్యాలహారము తెగి శివుని వక్షమున ముత్యములు వ్యాపించి యుండగా అమ్మవారియొక్క చిఱునవ్వు ముత్యాలహారముయొక్క ఆ దశను చూచి తన కాంతి ప్రసారమున స్నేహముతో కప్పివైచినది. ఆ అమ్మవారి చిఱునవ్వు కాంతి ప్రసారము నా హృదయమున క్రీడించుగాక!

**వివరణము :-**

ఈ శ్లోకమున అమ్మవారి పురుషాయితరతియొక్క ధ్వనియున్నది. అమ్మవారి ముత్యాలహార మాలింగనవిమర్దసంభ్రమములవలన తెగినది. అందలి ముత్తెములు శివుని వక్షస్థలమున నున్నవి. అప్పుడమ్మవారు నవ్వినది. ఆ నవ్వు తెల్లనిది కావున తెల్లని తెగిన ముత్తెములా చిఱునవ్వు కాంతిలో కలిసిపోయినవి, అని చెప్పుటచేత శివుని వక్షోవైశాల్యము వ్యంగ్యమగుచున్నది. మన్దస్మితాంశుచ్ఛటకు సంబంధించని ముత్యాలయందలి స్నేహము వర్ణింపఁబడుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి సాన్ద్రమన్దస్మితాంశుచ్ఛటయొక్క **సఖ్యము** వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున దానికి ప్రతిద్వంద్వులైన **మాత్సర్యరాగదోషములు** వర్ణింపఁబడుచున్నవి.

**శ్లో॥ మన్దారే తవ మన్థరస్మితరుచో మాత్సర్యమాలోక్యతే**
**కామాక్షి! స్మరశాసనే చ నియతం రాగోదయో లక్ష్యతే।**
**చాన్ద్రీషు ద్యుతిమఞ్జరీషు చ మహాదోషాఙ్కురో దృశ్యతే**
**శుద్ధానాం కథమీదృశీ గిరిసుతేఽశుద్ధా దశా కథ్యతామ్॥ 44**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| గిరిసుతే | = పర్వతపుత్రికవైన |
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| తవ | = నీయొక్క; |
| మన్థరస్మితరుచః | = చిఱునవ్వుకాంతికి; |
| మన్దారే | = మందారమునందు; |
| మాత్సర్యమ్ | = అసూయ; |
| ఆలోక్యతే | = కనఁబడుచున్నది.; |
| స్మరశాసనే | = శివునియందు; |
| నియతమ్ | = నిశ్చయముగా; |
| రాగోదయః చ | = రాగోదయముకూడ; |
| లక్ష్యతే | = కనఁబడుచున్నది; |
| చాన్ద్రీషు | = చన్ద్ర సంబంధములైన; |
| ద్యుతిమంజరీషు | = కాంతిగుత్తులయందు; |
| మహాదోషాంకురః | = గొప్పదోషముయొక్క మొలక; |
| దృశ్యతే | = కనఁబడుచున్నది; |

| | |
|---|---|
| శుద్ధానామ్ | = శుద్ధులకు; |
| ఈదృశీ | = ఇటువంటి; |
| అశుద్ధా | = అపవిత్రమైన; |
| దశా | = దశ; |
| కథమ్ | = ఎట్లు (కలుగుచున్నదో); |
| కథ్యతామ్ | = చెప్పఁబడుగాక! |

**తాత్పర్యము:-**

పర్వతరాజపుత్రికవైన యో కామాక్షీదేవీ! నీ చిఱునవ్వుకాంతికి మన్దారమునందు మాత్సర్యము, శివునందు రాగోదయమును కనఁబడుచున్నది. వెన్నెలలయందు దోషసంబంధము కనఁబడుచున్నది. శుద్ధములైన నీ మందస్మిత కాంతులకే అపవిత్రస్థితి ఎట్లు కలిగినదో చెప్పుము.

**వివరణము :-**

మన్దారవృక్షము దాని పత్రపుష్పములును తెల్లనివి. అమ్మవారి చిఱునవ్వు కాంతి తెల్లనిది కావున మాత్సర్యమమ్మవారి చిఱునవ్వునకున్నది. లేక మన్దారమునకే అమ్మవారి చిఱునవ్వుకాంతియందు మాత్సర్యమున్నది. అమ్మవారికి శివునందు రాగము పొడమియున్నది. లేక శివున కమ్మవారి యందు రాగోదయమైనది. అమ్మవారి చిఱునవ్వుకాంతిలో వెన్నెలలకు దోషము కనబడుచున్నది. లేదా చన్ద్ర కాంతులలో దోషము (చన్ద్రుడు దోషాకరుడు కావున) కనబడుచున్నది. మన్దారస్మరశాసనచన్ద్రద్యుతిమందస్మిత కాంతులన్నీ శుద్ధములే అయ్యు వీనిలో అశుద్ధులకు కలుగవలసిన మాత్సర్యాదులు కనఁబడుట యెట్లు చెప్పుమని కవి యమ్మవారి నడుగుచున్నాడు. అమ్మవారి స్మితకాంతులకు లేని మాత్సర్యాదులున్నట్లు చెప్పుటచే అతిశయోక్త్యలంకారము ఈ శ్లోకముననున్నది.



**అవ:-** శుద్ధులకపరిశుద్ధ దశ ఎట్లు కలిగినదో కవి మనస్సునకు తెలియక పోవుట పై శ్లోకమున చెప్పఁబడినది. ఈ శ్లోకమున మనస్సునకు తెలిసినంత వఱకైనను అమ్మవారి చిఱునవ్వును వర్ణించుటకు మాటలు చాలవని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ పీయూషం ఖలు పీయతే సురజనైర్దుగ్ధామ్బుధిర్మథ్యతే**
**మాహేశైశ్చ జటాకలాపనిగళైర్మన్దాకినీ నహ్యతే।**
**శీతాంశుః పరిభూయతే చ తమసా తస్మాదనేతాదృశీ**
**కామాక్షి! స్మితమఞ్జరీ తవ వచోవైదగ్ధ్యముల్లఙ్ఘతే॥ 45**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ! |

| | | |
|---|---|---|
| పీయూషమ్ | = | అమృతము; |
| సురజనైః | = | దేవతలచే; |
| పీయతే | = | త్రాగఁబడుచున్నది; |
| దుగ్ధాంబుధిః | = | పాలసముద్రము; |
| మథ్యతే | = | మథింపఁబడుచున్నది; |
| మాహేశైః | = | మహేశ్వరునికి చెందిన; |
| జటాకలాపనిగలైః | = | జడలసమూహమనెడి గొలుసులచే; |
| మన్దాకినీ | = | ఆకాశగంగ; |
| నహ్యతే | = | బంధింపఁబడుచున్నది; |
| తమసా | = | రాహువుచేత; |
| శీతాంశుః | = | చన్ద్రుడు; |
| పరిభూయతే చ | = | అవమానింపఁబడుచున్నాడు కూడ; |
| తస్మాత్ | = | అందువలన; |
| అనేతాదృశీ | = | ఇటువంటిది కాని; |
| తవ | = | నీయొక్క; |
| స్మితమంజరీ | = | చిఱునవ్వుగుత్తి; |
| వచోవైదగ్ధ్యమ్ | = | మాటనేర్పును; |
| ఉల్లంఘతే | = | దాటుచున్నది. |

**తాత్పర్యము:-**

అమృతమును దేవతలు త్రాగుదురు. పాలసముద్రమును దేవతలు, రాక్షసులు మథించిరి. శివుని జడలనెడి గొలుసు లాకాశగంగను బంధించెను. అమ్మవారి చిఱునవ్వు వీని (అమృత క్షీరాబ్ధ్యాకాశగంగల) వంటిది కాదు. కావున నేర్పరులైన వారు కూడ దానిని వర్ణింపలేరు.

**వివరణము :-**

దేవతలు మాత్రమే త్రావుదురు, మనుష్యుల కందదని అమృతము గొప్పతనము చెప్పవచ్చును. దేవతలు రాక్షసులు మథించినను పాలసముద్రమున కేమియు హాని కలుగలేదని పాలసముద్రముయొక్క మహిమను కీర్తింపవచ్చును. లేక అమృతము దేవతలచే త్రావబడి క్షీణించినదని పాలసముద్రము దేవ రాక్షసుల మన్థనముల వారింపలేకపోయినదని వాని నిందయైనను చేయవచ్చును. ఇట్లే ఆకాశగంగ యందాసక్తిచే శివుడు శిరసున జడలచే బంధించినాడని ఆకాశగంగయొక్క గొప్పతనమును లేక ఆ గంగను బంధించి ఆకాశగంగయొక్క విజృంభణము నరికట్టినాడు శివుడని గంగకు శివునిచే జరిగిన అవమానమును చెప్పవచ్చును. గర్భమున తమస్సుగల చన్ద్రుని రాహువవమానించుటలో

వింతలేదని చన్ద్రుని నిందను అది తాత్కాలికమే యని చంద్రప్రశంసను చేయవచ్చును. కాని అమ్మవారి చిఱునవ్వులో దోషములు లేవు. కనుక నిందింపజాలము. దాని గుణములనంతములు కనుక స్తుతింపజాలము అని నిన్దాస్తుతి రూప వాగ్వ్యాపారములలో నేదియు ప్రవర్తింపఁజాలదని వర్ణించుట **"యతో వాచో నివర్తంతే"** (తై. 2.4.1) అను వేదవాక్యముయొక్క అర్థమును వ్యంజింపఁజేయుచున్నది.



**అవ॥:-** పై శ్లోకమున **యతో వాచో నివర్తంతే** అను శ్రుత్యర్థము స్ఫురింపజేయ బడినది. ఈ శ్లోకమున **సర్వే వేదా యత్పదమామనంతి** అను శ్రుత్యర్థము స్ఫురింపజేయుచు అమ్మవారి **స్మితాంశులవారివిచిత్రచంద్రిక** యని రూపింప బడుచున్నది.

**శ్లో॥ ఆశఙ్కే తవ మన్దహాసలహరీమన్యాదృశీం చన్ద్రికా-**
**మేకామ్రేశకుటుమ్బిని! ప్రతిపదం యస్యాః ప్రభాసఙ్గమే।**
**వక్షోజామ్బురుహే న తే రహయతః కాఞ్చిద్దశాం కౌట్మలీ-**
**మాస్యామ్భోరుహమమ్బ! కిం చ శనకైరాలమ్బతే ఫుల్లతామ్॥ 46**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| ఏకామ్రేశకుటుంబిని | = ఏకామ్రేశ్వరునిల్లాలా! |
| యస్యాః | = దేని (మన్దహాసలహరి)యొక్క; |
| ప్రభాసంగమే | = కాంతుల కలయిక యందు; |
| ప్రతిపదమ్ | = అడుగడుగున; |
| తే | = నీయొక్క; |
| వక్షోజాంబురుహే | = స్తనకమలముల జంట; |
| కాంచిత్ | = ఒకానొక; |
| కౌట్మలీమ్ | = మొగ్గకు సంబంధించిన; |
| దశామ్ | = దశను; |
| న రహయతః | = విడుచుట లేదో; |
| కిం చ | = మరియు; |
| ఆస్యామ్భోరుహమ్ | = ముఖకమలము; |
| శనకైః | = మెల్లగా; |
| ఫుల్లతామ్ | = వికాసమును; |
| ఆలంబతే | = అవలంబించుచున్నదో; |
| తామ్ | = ఆ; |
| తవ | = నీయొక్క; |
| మన్దహాసలహరీమ్ | = చిఱునవ్వు ప్రవాహమును; |

అన్యాదృశీమ్ = విలక్షణమైన;
చన్ద్రికామ్ = వెన్నెలను;
ఆశంకే = తలచుచున్నాను.

**తాత్పర్యము:-**

నీ మన్దహాస ప్రభాసంగమమున అడుగడుగున స్తనకమలములు ముకులత్వమును వదలుట లేదు. ముఖకమలము మెల్లమెల్లగా వికాసమును పొందుచున్నది. అందుచే నీ మందహాసలహరిని విలక్షణమైన వెన్నెలగా తలచుచున్నాను.

**వివరణము :-**

1) స్తనములు కమల ముకులములుగా పోల్చబడుట కవి సమయము. అట్లే ముఖము కమలముతో పోల్చబడుట కవి సమయము. మరియు వెన్నెలతో కమలములు ముకులించుకొనుటయు సహజము. కమలములు ముకుల భావమును విడువకుండటయు సహజము. ఇది ఇట్లుండగా అమ్మవారి మన్దహాసలహరి సాధారణమైన వెన్నెలయైనచో స్తనకమలములు ముకుల భావమును వీడకుండును. ముఖకమలముగూడ ముకులభావమును వీడగూడదు. కాని యిట ముఖకమలము మాత్రము మెల్లగా వికాసమును పొందుట మన్దహాసలహరి సామాన్యచన్ద్రిక గాక విలక్షణమైన చన్ద్రిక యనుటకు హేతువు. ఇట్లు మన్దహాసలహరియందు విలక్షణచంద్రికోత్ప్రేక్షణ ముండుటచే నీ శ్లోకమును ఉత్ప్రేక్షాలంకారము ఒప్పుచున్నది.

2) ముఖము వికసించుట యనగా ముఖము నవ్వుచుండుట. ముఖము మెల్లగా వికసించుట యనగా ముఖమున చిఱునవ్వు మాత్రమే దోచుట, ప్రౌఢహాసము లేకుండుట. ఇది అమ్మవారు ముగ్ధావస్థను వీడి మధ్యావస్థను పొందుటను వ్యంగ్యమొనర్చును.



**అవ:-** పై శ్లోకమున ముఖము మెల్లగా వికసించుట బాగుగా వికసించపోవుట యను మధ్యావస్థ వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున ముఖము వికసించకపోవుట సంపూర్ణలక్షణముగా నుండు విరహిణీదశ అమ్మవారి స్మితచాతురి యందు వర్ణింపఁ బడుచున్నది.

**శ్లో॥ ఆస్తీర్ణాధరకాన్తిపల్లవచయే పాతం ముహుర్జగ్ముషీ**
**కామద్రోహిణి మాంసలస్మరశరజ్వాలావలిర్వ్యఞ్జతీ।**
**నిన్దన్తీ ఘనసారహారవలయజ్యోత్స్నామృణాలాని తే**
**కామాక్షి! స్మితచాతురీ విరహిణీరీతిం జగాహేతరామ్॥** 47

**ప్రతిపదార్థము:-**

కామాక్షి! = ఓ కామాక్షీ దేవీ!

| | |
|---|---|
| ఆస్తీర్ణాధరకాంతిపల్లవచయే | = పఱచబడిన పెదవి కాంతి యనెడి చిగుళ్ళగుంపుపై; |
| ముహుః | = మాటిమాటికి; |
| పాతమ్ | = పడుటను; |
| జగ్ముషీ | = పొందుచున్న; |
| కామద్రోహిణి | = శివునియందు; |
| మాంసలస్మరశరజ్వాలావలీః | = దట్టమైన మన్మథుని బాణములనెడి జ్వాలల సమూహములను; |
| వ్యంజతీ | = వ్యంజింపఁజేయుచున్న; |
| ఘనసారహారవలయ జ్యోత్స్నామృణాలాని | = కర్పూరమను హారముల సమూహమును వెన్నెలను తామరతూండ్లను; |
| నిన్దన్తీ | = నిన్దించుచున్న; |
| తే | = నీయొక్క; |
| స్మితచాతురీ | = చిఱునవ్వు నేర్పు; |
| విరహిణీరీతిమ్ | = విరహిణీ దశను; |
| జగాహేతరామ్ | = బాగుగా క్రమ్ముకొనుచున్నది. |

**తాత్పర్యము:-**

పఱచబడిన పెదవి కాంతి యనెడు చిగుళ్ళపై మాటిమాటికి పడుచు శివుని యందు మన్మథబాణజ్వాలలను వ్యంజింపఁజేయును. కర్పూరమును హారముల గుంపును వెన్నెలను తామరతూండ్లను నిందించుచున్న నీ స్మితచాతురి విరహిణీ దశను బాగుగా క్రమ్ముకొనుచున్నది.

**వివరణము :-**

1) విరహిణులు చిగుళ్ళపాన్పుపై పడిపోవుదురు. దాని పైననే పడుకొని యుందురు. మన్మథ బాణజ్వాలలు క్రమ్ముకొని యున్నట్లు కనఁబడెదరు. కర్పూరము రాచుకొని తాపమార్పలేక పోయినదని దానిని నిందించెదరు. అట్లే హారములు ధరించినను వెన్నెలలో విహరించినను తామర తూండ్లను ధరించినను తాపశాంతిని కలిగింప లేకపోయినందుకు వానిని నిందించెదరు. చిఱునవ్వు పెదవి యందే ఉండును. ఆ పెదవి కాంతియే చిగుళ్ళ పాన్పుగా నిందు రూపింపబడినది. అమ్మవారి చిఱునవ్వు పెదవి కాంతి యను చిగుళ్ళ పాన్పునందు పడుచుండుట విరహిణీ దశ చిహ్నామే. అట్లే శివుని యందు మన్మథుని బాణములు ప్రయోగింపఁబడినవనుట పురాణకథ. అవి అమ్మవారికిని తాపము పుట్టించినవి. కావున నవి జ్వాలలే. ఇట్లు మన్మథ బాణాగ్ని జ్వాలలు గ్రమ్ముకొని యుండుటయు విరహిణీ దశ చిహ్నామే. తాపశాంతికై కర్పూరము హారములను

తామరతూండ్లను ధరించుట వెన్నెలలో విహరించుటయు విరహిణీ దశా చిహ్నములు. అమ్మవారి స్మిత చాతురి తెల్లనిది. కర్పూరహారవలయజ్యోత్స్నామృణాలములు తెల్లనివి. తెల్లదనమున చల్లదనమున తనకు సాటి రాజాలవని వాని నమ్మవారి స్మిత చాతురి నిందించినది. ఈ నింద తాపశాంతి కలిగింప లేదని నిందించిన నిందగా మలచబడినది. ఇట్లు స్మితచాతురి యందు విరహిణీ చిహ్నములుత్ప్రేక్షింపఁబడుటచే నిందుత్ప్రేక్షాలంకారము స్ఫురించుచున్నది.

2) ఈ వర్ణనము జీవులందఱు స్త్రీలేయని వారికి భగవంతుడే భర్త యని, ఆ భర్తకు దూరముగా నుండి వివిధ బాధలొందుట విరహ బాధానుభవమే యని సూచించుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వునందు విరహిణీ చిహ్నము లుత్ప్రేక్షింపఁ బడినవి. ఈ శ్లోకమున నా మన్దహాసము విరహిణిని వేధించు విచిత్ర చన్ద్రికగా చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ సూర్యాలోకవిధౌ వికాసమధికం యాన్తీ హరన్తీ తమ-**
**స్సన్దోహం నమతాం నిజస్మరణతో దోషాకరద్వేషిణీ।**
**నిర్యాన్తీ వదనారవిన్దకుహరాన్నిర్ధూతజాడ్యా నృణాం**
**శ్రీకామాక్షి! తవ స్మితద్యుతిమయీ చిత్రీయతే చన్ద్రికా॥ 48**

**ప్రతిపదార్థము:-**

శ్రీకామాక్షి! = శ్రీకామాక్షీదేవీ!
సూర్యాలోకవిధౌ = సూర్యాలోకవిధియందు
(సూర్య+అలోక విరోధపక్షము) (సూరి+ఆలోకవిరోధ పరిహారపక్షము);
అధికమ్ = ఎక్కువగా;
వికాసమ్ = వికాసమును;
యాన్తీ = పొందుచున్న;
నమతామ్ = నమస్కరించువారియొక్క;
1) నిజస్మరణతః = తనయొక్క స్మరణమువలన;
2) తమస్సందోహమ్ = తమోగుణ సమూహమును ;
(పక్షాంతరమున చీకట్ల సమూహమును);
హరన్తీ = తొలగించుచున్న;
దోషాకరద్వేషిణీ = పాపములకు నెలవులైన వారిని
(పక్షాంతరమున చన్ద్రుని ద్వేషించుచున్న);

| | | |
|---|---|---|
| వదనారవిన్దకుహరాత్ | = | ముఖకమలగుహనుండి; |
| నిర్యాన్తీ | = | బయలుదేరుచున్న; |
| నృణామ్ | = | నరులయొక్క; |
| నిర్ధూతజాడ్యా | = | జాడ్యమును తొలగించిన; |
| తవ | = | నీయొక్క; |
| స్మితద్యుతిమయీ | = | చిఱునవ్వు కాంతియనెడి; |
| చన్ద్రికా | = | వెన్నెల; |
| చిత్రీయతే | = | వింత గొలుపుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి చిఱునవ్వు వెన్నెల విద్వాంసులఁజూచునప్పుడు (సూర్యా లోకమున) వికాసమును పొందుచున్నది. నమస్కరించువారు తనను స్మరించిన తోడనే వారి తమోనిచయమును తొలగించుచున్నది. ముఖ కమల గుహనుండి బయలుదేరుచున్నది. నరుల జాడ్యమును తొలగించుచున్నది. ఇది వింతగా నున్నది.

**వివరణము :-**

సూర్యుడు కనపడగానే వెన్నెల యంతర్ధానమగునే కాని వికాసమును పొందదు. వెన్నెలలో విహరించునప్పుడే చీకటి తొలగును కాని స్మరించిన మాత్రమున వెన్నెల చీకటిని తొలగింపఁజాలదు, వెన్నెల చంద్రునినుండి వచ్చు కాంతి కావున యది అతని శక్తి. అతనిని ద్వేషించు ప్రశ్నయే లేదు. వెన్నెల గుహనుండి వెలికిరాదు. గుహలో అసలే ఉండదు. కావున దానినుండి బయటకు వచ్చు నవకాశమే లేదు. వెన్నెలలో విహరించునప్పుడు నరులకు చురుకుతనము తగ్గి మెల్లగా నడువవలెనని, ఎక్కువ సేపు అక్కడనే పడుకొనవలె ననిపించును. కాని జాడ్యము హెచ్చునే కాని తొలగదు. వెన్నెలకు విరుద్ధములైన లక్షణములెన్నో అమ్మవారి చిఱునవ్వు వెన్నెలలో నుందుట విరోధము. ఇది శ్లేషబలమున స్ఫురించుట దానికి పరిహారము సంభవించుచుండుటచే నీ శ్లోకమున విరోధాభాసాలంకారమున్నది. 2) విశిష్టాద్వైతసిద్ధాంతమున బద్ధులు, ముక్తులు, నిత్యులు (సూరులు) అని జీవులు మూడు విధములుగా నుందురు. సూరులు భక్తులు కావున వారిని చూచునప్పుడు అమ్మవారి చిఱునవ్వువెన్నెల వికాసమును పొందునని చెప్పవచ్చును లేదా అద్వైతసిద్ధాంతమున సూరులనగా జ్ఞాని భక్తులు. వారిని చూచి అమ్మవారి చిఱునవ్వు అధికవికాసము నొందునని చెప్పవచ్చును. రెండవపక్షము మూకకవి హృదయమునకు సమ్మత తరమనుట అస్మన్మతము.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వు జాడ్యమును తొలగించునని చెప్పఁబడినది. ఈ శ్లోకమున జాడ్యమువలన కలుగు కుబోధఘటనయొక్క కుంఠీకరణము ప్రార్థింపఁ బడుచున్నది.

శ్లో॥ కుణ్ఠీకుర్యురమీ కుబోధఘటనామస్మన్మనోమాథినీం
శ్రీకామాక్షి! శివంకరాస్తవ శివే! శ్రీమన్దహాసాఙ్కురాః।
యే తన్వన్తి నిరన్తరం తరుణిమస్తమ్బేరమగ్రామణీ-
కుమ్భద్వన్ద్వవిడమ్బిని స్తనతటే ముక్తాకుథాడమ్బరమ్॥ 49

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| శివే | = మంగలస్వరూపురాలవైన; |
| శ్రీ కామాక్షి! | = ఓ శ్రీ కామాక్షీదేవీ!; |
| యే | = ఏవి (శ్రీమన్దహాసాంకురాః); |
| తరుణిమస్తమ్బేరమగ్రామణీకుమ్భ ద్వన్ద్వవిడంబిని | = యౌవనమనెడి గజశ్రేష్ఠముయొక్క కుంభముల జంటను బోలు; |
| స్తనతటే | = కుచప్రదేశమున; |
| ముక్తాకుథాడంబరమ్ | = ముత్తెముల అంబారి తోడి అనుకరణమును; |
| నిరన్తరమ్ | = ఎల్లప్పుడు; |
| తన్వన్తి | = చేయుచున్నవో; |
| శివంకరాః | = శుభకరములైన (తే = ఆ); |
| అమీ | = ఈ; |
| తవ | = నీయొక్క; |
| శ్రీమన్దహాసాంకురాః | = శ్రీ మన్దహాసపు మొలకలు; |
| అస్మన్మనోమాథినీమ్ | = మా మనస్సును బోధించు; |
| కుబోధఘటనామ్ | = దుర్జ్ఞాన సంబంధమును; |
| కుంఠీకుర్యుః | = వ్యర్థమొనర్చుగాక. |

**తాత్పర్యము:-**

మంగళస్వరూపురాలవైన యో శ్రీ కామాక్షీదేవీ! నీ మన్దహాసపు మొలకలు యౌవనమనెడి గజశ్రేష్ఠముయొక్క కుంభస్థలముల జంటను బోలిన స్తనతటమున ముత్తెపుటంబారియొక్క అనుకరణమును జేయుచున్నవి. శివంకరములైన నీ మందహాసాంకురములు మా మనస్సును బాధించు దుర్జ్ఞానసంబంధమును వ్యర్థము చేయుగాక!

**వివరణము :-**

ఈ శ్లోకమున యౌవనమున గజశ్రేష్ఠారోపమును, స్తనములయందు గజకుంభస్థలారోపముండుటచేత రూపకాలంకారమున్నది. మన్దహాసాంకురము లందు

ముత్తెపుటంబారి అనుకరణము నుత్ప్రేక్షింపఁబడుటచే ఔపమ్య స్ఫూర్తి ఫలకముగ యుత్ప్రేక్షాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మన్దహాసము యౌవనమనెడి గజముయొక్క కుంభస్థలములవంటి స్తనతటమున ముత్తెపుటంబారిగా నుత్ప్రేక్షింపఁబడినది. ఈ శ్లోకమున మన్దహాసమున నీలాంభోధర నైపుణి యుత్ప్రేక్షింపఁబడుచున్నది.

**శ్లో॥ ప్రేఙ్ఖన్తః శరదమ్బుదా ఇవ శనైః ప్రేమానిలైః ప్రేరితా**
**మజ్జన్తో మదనారికణ్ఠసుషమాసిన్ధౌ ముహుర్మన్థరమ్।**
**శ్రీకామాక్షి! తవ స్మితాంశునికరాః శ్యామాయమానశ్రియో**
**నీలామ్భోధరనైపుణీం తత ఇతో నిర్నిద్రయన్త్యఞ్జసా॥ 50**

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| శ్రీ కామాక్షి! | = ఓ శ్రీకామాక్షీదేవీ! |
| తవ | = నీయొక్క; |
| స్మితాంశునికరాః | = చిఱునవ్వు కాంతుల సమూహములు; |
| శరదంబుదా ఇవ | = శరత్కాలపుమేఘములవలె; |
| శనైః | = మెల్లగా; |
| ప్రేంఖన్తః | = కదలుచున్నవై; |
| ప్రేమానిలైః | = ప్రేమవాయువులచే; |
| ప్రేరితాః | = ప్రేరేపింపఁబడినవై; |
| మదనారికణ్ఠసుషమాసిన్ధౌ | = శివుని కణ్ఠముయొక్క కాంతి యనెడి సముద్రమున; |
| మన్థరమ్ | = మెల్లగా; |
| ముహుః | = మాటిమాటికి; |
| మజ్జన్తః | = మునుగుచున్నవై; |
| శ్యామాయమానశ్రియః | = నల్లబడిన కాంతిగలవై; |
| తత ఇతః | = అటునిటు; |
| నీలామ్భోధరనైపుణీమ్ | = నీలి మేఘముల నేర్పును; |
| అంజసా | = శీఘ్రముగా; |
| నిర్నిద్రయంతి | = మేలుకొలుపుచున్నవి. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ చిఱునవ్వు మొలకలు శరదంబుదములవలె మొదట తెల్లగా నుండి

నిటునటు కదలుచున్నవై ప్రేమవాయువులచే ప్రేరేపింపబడి శివుని కణ్ఠకాంతియను సముద్రమందు మునిగి అందులోని కాంతిజలము త్రావి నలుపెక్కినవై నీలమేఘముల నైపుణిని మేలుకొలుపుచున్నవి.

**వివరణము :-**

ఈ శ్లోకమున శరదంబుదములవలెనున్న మేఘములు శివుని కరసముద్రము నందు మునిగి నల్లబడి నీలమేఘముల నైపుణిని మేలుకొలుపు చున్నవని యుత్ప్రేక్షించుటచే నుత్ప్రేక్షాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మన్దహాసాంకురములు నీలిమేఘములుగా నుత్ప్రేక్షింపం బడినవి ఈ శ్లోకమున అమ్మవారి మన్దహాసప్రభ సరస్వతిగా రూపింపబడుచున్నది.

**శ్లో॥ వ్యాపారం చతురాననైకవిహృతౌ వ్యాకుర్వతీ కుర్వతీ**
**రుద్రాక్షగ్రహణం కరేణ సతతం వాగూర్మికల్లోలితా।**
**ఉత్ఫుల్లం ధవలారవిన్దమధరీకృత్య స్ఫురన్తీ సదా**
**శ్రీకామాక్షి సరస్వతీ విజయతే త్వన్మన్దహాసప్రభా॥ 51**

**ప్రతిపదార్థము:-**

శ్రీకామాక్షి! = ఓ కామాక్షీ దేవీ!
సతతమ్ = ఎల్లప్పుడు;
చతురాననైకవిహృతౌ = విద్వాంసులయందే ముఖముగా విహరించుట యందు; బ్రహ్మాయందే విహరించుటయందు;
వ్యాపారమ్ = చేష్టను;
వ్యాకుర్వతీ = బాగుగా చేయుచున్నదై;
కరేణ = చేతితో;
రుద్రాక్షగ్రహణమ్ = రుద్రాక్షల పట్టుకొనుటను;
కుర్వతీ = చేయుచున్నదై;
వాగూర్మికల్లోలితా = మాటలనే తరంగములచే సంచలించినదై;
ఉత్ఫుల్లమ్ = వికసించిన;
ధవలారవిన్దమ్ = తెల్లని కమలమును;
అధరీకృత్య = క్రిందుగా జేసి;
సదా = ఎల్లప్పుడు;
స్ఫురన్తీ = ప్రకాశించుచున్నదై;

త్వన్మన్దహాసప్రభా = నీ చిఱునవ్వు కాంతి;
సరస్వతీ = సరస్వతియై;
విజయతే = సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**తాత్పర్యము:-**

సరస్వతీ దేవి అనగా బ్రహ్మ చతురాననములలో నాలుగు ముఖముల విహరించును. అమ్మవారి చిఱునవ్వు చతురమైన ఆననముకల విద్వాంసులలో విహరించును. సరస్వతీదేవి చేత రుద్రాక్ష నెల్లప్పుడు ధరించును. అమ్మవారి చిఱునవ్వు కాంతితో శివుని కన్నుల నాకర్షించును. సరస్వతి మాటల తరంగములు కలది. చిఱునవ్వు కూడ మాటల తరంగములు గలది. సరస్వతి వికసించిన తెల్లని కమలము నందాసీనురాలై దాని నధఃకరించును. అమ్మవారి చిఱునవ్వు వికసించిన తెల్లని కమలము నధఃకరించును. కావున అమ్మవారి చిఱునవ్వు సరస్వతియనుటలో సన్దేహము లేదు. ఆ చిఱునవ్వుకాంతి సరస్వతియై సర్వోత్కర్షముతో వర్ధిలుచున్నది.

**వివరణము :-**

ఒక కొమ్మ రెమ్మకు కాసిన రెండు పండ్లు దూరమునుండి చూచువారికొకటిగా కనపడునట్లు ఒక పదమునుండి వచ్చిన రెండర్థముల కభేదము పొడచూపును. శబ్దశ్లేష ద్వారా అర్థశ్లేషద్వారా భిన్నార్థముల కేకీభావము సాహిత్యమర్మజ్ఞులకు సమ్మతము. ఈ శ్లోకమున అమ్మవారి మన్దహాసప్రభకు సరస్వతికి శ్లిష్ట విశేషణముల ద్వారా అభేధాధ్యవసాయము చేయబడినది కావున విషయి విషయములు భిన్న పదములచే చెప్పఁబడినందున వ్యస్తరూపకాలంకార మేర్పడుచున్నది. అమ్మవారి చిఱునవ్వుకాంతికి, సరస్వతీదేవికి తెలుపురంగు కలదు. కావున అభేదాధ్యవసాయము చేయుటయు నిట యుచితముగా నున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వు నందు సరస్వత్యారోపము చేయఁబడినది. ఈ శ్లోకమున అమ్మవారి చిఱునవ్వు నందు శివుని తోడి పోలిక స్ఫురింపఁజేయబడుచున్నది.

**శ్లో॥ కర్పూరద్యుతితస్కరేణ మహసా కల్మాషయత్యాననం**
**శ్రీకాఞ్చీపురనాయికే! పతిరివ శ్రీమన్దహాసో౽పి తే।**
**ఆలిఙ్గత్యతిపీవరాం స్తనతటీం బిమ్బాధరం చుమ్బతి**
**ప్రౌఢం రాగభరం వ్యనక్తి మనసో ధైర్యం ధునీతేతరామ్॥ 52**

**ప్రతిపదార్థము:-**

శ్రీ కాంచీపురనాయికే = శ్రీ కాంచీపురనాయికా!
తే = నీయొక్క

| | |
|---|---|
| శ్రీమన్దహాసః అపి | = చిఱునవ్వు కూద; |
| తే | = నీయొక్క; |
| పతిః+ఇవ | = భర్తయగు శివునివలె; |
| కర్పూరద్యుతితస్కరేణ | = కర్పూరపు కాంతిని దొంగిలించు; |
| మహసా | = కాంతిలో; |
| తే | = నీయొక్క; |
| ఆననమ్ | = ముఖమును; |
| కల్మాషయతి | = రంగు మారునట్లు చేయుచున్నది; |
| అతిపీవరామ్ | = మిక్కిలి బలిసిన; |
| స్తనతటీమ్ | = స్తనప్రదేశమును; |
| ఆలింగతి | = కౌగలించుచున్నాడు; |
| బింబాధరమ్ | = దొండపండువంటి పెదవిని; |
| చుమ్బతి | = ముద్దాడుకొనుచున్నది; |
| ప్రౌఢమ్ | = తీవ్రమైన; |
| రాగభరమ్ | = అనురాగభారమును; |
| వ్యనక్తి | = వ్యంజింపఁజేయుచున్నది; |
| మనసః | = మనసుయొక్క; |
| ధైర్యమ్ | = ధైర్యమును; |
| ధునీతేతరామ్ | = మిక్కిలి కదలింపజేయుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ చిఱునవ్వు నీ భర్తయగు శివునివలె తెల్లనిది. ఆ తెలుపు కర్పూరపుకాంతిని దొంగిలించియున్నది. అది శివునివలె నీ ముఖముయొక్క రంగు మారునట్లొనరించుచున్నది. శివునివలెనే నీ మందహాసమును పీవరస్తన ప్రదేశమును గౌగలించుకొనుచున్నది. దొండపండువంటి నీ పెదవిని నీ భర్తవలెనే చుంబించుచున్నది. తీవ్రమైన మనసులోని రాగాతిరేకమును బయల్పరచుచున్నది. మనస్సులోని నిగ్రహశక్తి రూపము అయిన ధైర్యమును కదలింపజేయుచున్నది.

**వివరణము :-**

అమ్మవారి చిఱునవ్వు ఆమె భర్తయైన శివుడుగా నుత్ప్రేక్షింపఁబడుటచే నీ శ్లోకమున ఉత్ప్రేక్షాలంకారమున్నది. కర్పూరద్యుతితస్కరేణ అను సమాసమున ఉపమాలంకారస్ఫూర్తి యున్నది. బింబాధరమ్ అను సమాసమున నుపమాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున మందహాసమున శివత్వోత్ప్రేక్షణము ద్వారా శివునితోడి ఔపమ్యము

స్ఫురింపజేయబడినది. ఈ శ్లోకమున స్మితముతోడి ఔపమ్యమునకై వెన్నెల ప్రయత్నించుచున్నదని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ వైశద్యేన చ విశ్వతాపహరణక్రీడాపటీయస్తయా**
**పాణ్డిత్యేన పచేలిమేన జగతాం నేత్రోత్సవోత్పాదనే।**
**కామాక్షి! స్మితకన్దలైస్తవ తులామారోఢుముద్యోగినీ**
**జ్యోత్స్నాసౌ జలరాశిపోషణతయా దూష్యాం ప్రపన్నా దశామ్॥ 53**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీదేవీ! |
| వైశద్యేన | = | నిర్మలత్వముచేత; |
| విశ్వతాపహరణ క్రీడాపటీయస్తయా | = | విశ్వముయొక్క తాపమును హరించు క్రీడలో నధికమైన నేర్పు కలిగి యుండుటచేత; |
| జగతామ్ | = | లోకములయొక్క |
| నేత్రోత్సవోద్పాదనే | = | కనువిందుఁగలిగించుటలో; |
| పచేలిమేన | = | పండిన; |
| పాండిత్యేన చ | = | పాండిత్యముచేతను; |
| తవ | = | నీయొక్క |
| స్మితకన్దలైః | = | చిఱునవ్వు మొలకలతో; |
| తులామ్ | = | సామ్యమును; |
| ఆరోఢుమ్ | = | అందుకొనుటకు; |
| ఉద్యోగినీ | = | ప్రయత్నించు; |
| అసౌ | = | ఈ; |
| జ్యోత్స్నా | = | వెన్నెల; |
| జలరాశిపోషణతయా | = | సముద్రమును పోషించునదగుటచేత, పక్షాంతరమున జడుల సమూహమును పోషించునదగుటచేత; |
| దూష్యామ్ | = | నిందింపఁదగిన; |
| దశామ్ | = | దశను; |
| ప్రపన్నా | = | పొందినది. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షి దేవీ! నిర్మలత్వముచేత, అందరితాపమును హరించు నాటలో నేర్పరియగుటచేత, లోకములకు కనువిందుఁగలిగించుటలో పండిన పాండిత్యము చేత, వెన్నెల నీ చిఱునవ్వుమొలకలతో సామ్యమునుఁబొందుటకు యత్నించు చున్నది. సముద్రమునకు పొంగుగలిగించుట యను జడరాశి పోషణముచేత నిందింపఁదగినదే యగుచున్నది.

**వివరణము :-**

ఉపమానమైన వెన్నెలకు దూష్యదశ కలుగుట వర్ణించుటచే నీ శ్లోకమున ప్రతీపాలంకారమున్నది. జలరాశినుండి పుట్టిన చంద్రుడు జలరాశిని పోషించుట సహజము. **'లడయోరభేదః'** అను నియమము ననుసరించి జలరాశి పోషణము జడరాశి పోషణముగా భావింపఁబడినది. అందుచే చన్ద్రునికాంతియగు వెన్నెలకు దూష్యత సంభవించినది. అమ్మవారి స్మితము చైతన్యస్తబకము. కావున దాని తోడి సామ్యము జడమైన వెన్నెలకు అసంభవమను జడులు తమ ప్రయత్నములలో సఫలత నొందలేకపోవుటతో పాటు, దూష్యతయు వారికి ఘటిల్లుచుండుట సహజమనియు స్ఫురించుచున్నది.



**అవ:-** పై శ్లోకమున దూష్యత అనగా దోషము ప్రస్తావింపఁబడినది. ఈ శ్లోకమున మనోదోషరూపమైన కల్మషముయొక్క నివారణము ప్రార్థింపఁబడుచున్నది.

**శ్లో॥ లావణ్యామ్బుజినీమృణాలవలయైశ్శృఙ్గారగన్ధద్విప-**
**గ్రామణ్యః శ్రుతిచామరైస్తరుణిమస్వారాజ్యబీజాఙ్కురైః।**
**ఆనన్దామృతసిన్ధువీచిపృషతైరాస్యాబ్జహంసైస్తవ**
**శ్రీకామాక్షి! మథాన మన్దహసితైర్మత్కం మనఃకల్మషమ్॥ 54**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| శ్రీ కామాక్షి! | = ఓ శ్రీ కామాక్షీ దేవీ! |
| లావణ్యామ్బుజినీమృణాలవలయైః | = సౌందర్యమను కమలలతకు తామర తూండ్ల కడియములైన; |
| శృంగారగన్ధద్విపగ్రామణ్యః | = శృంగారమనెడి గంధగజ శ్రేష్ఠముయొక్క |
| శ్రుతిచామరైః | = శ్రుతి చామరములైన; |
| తరుణిమస్వారాజ్యబీజాంకురైః | = యౌవనమనెడి స్వారాజ్యముయొక్క బీజాంకురములైన; |
| ఆనన్దామృతసింధువీచిపృషతైః | = ఆనన్దమనెడి అమృతసముద్రపు తరంగములయొక్క బిందువులైన; |
| ఆస్యాబ్జహంసైః | = ముఖకమలమునందు హంసములైన; |
| తవ | = నీయొక్క |
| మన్దహసితైః | = చిఱునవ్వుల చేత; |
| మత్కమ్ | = నాకు సంబంధించిన; |
| మనఃకల్మషమ్ | = మనస్సులోని దోషమును; |
| మథాన | = మథించి వేయుము. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ చిఱునవ్వులు సౌందర్యమనెడి కమలలతకు తామర తూండ్ల కడియములు, శృంగారగన్ధగజముయొక్క శృతిచామరములు, యౌవన స్వారాజ్యముయొక్క బీజాంకురవములు, ఆనాన్దామృతసముద్రతరంగములయొక్క బిందువులు, నీ ముఖకమలమున విహరించు హంసములు. అట్టి నీ చిఱునవ్వులతో నా మనస్సులోని దోషమును మథించుము.

**వివరణము :-**

అమ్మవారి చిఱునవ్వులందు మృణాలవలయశ్రుతిచామరబీజాంకుర, వీచి పృషత్క, ఆస్యాబ్జహంసముల ఆరోపముండుటచే మాలారూపకాలంకార మేర్పడుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వులు ఆనన్దామృతసిన్ధువీచి బిందువులుగా రూపింపఁబడినవి. ఈ శ్లోకమున అమ్మవారి చిఱునవ్వు కాంతి శివజటాటవియందు పడుచున్న స్వర్గవాపీపయస్సుగా వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ ఉత్తుఙ్గస్తనమణ్డలీపరిచలన్మాణిక్యహారచ్ఛటా-**
**చఞ్చచ్ఛోణిమపుఞ్జమధ్యసరణిం మాతః పరిష్కుర్వతీ।**
**యా వైదగ్ధ్యముపైతి శఙ్కరజటాకాన్తారవాటీపత-**
**త్స్వర్వాపీపయసః స్మితద్యుతిరసౌ కామాక్షి తే మఞ్జులా॥55**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి! = ఓ కామాక్షీ దేవీ!
మాతః = తల్లీ;
యా = ఏది (స్మితద్యుతి);
ఉత్తుంగస్తనమణ్డలీ పరిచలన్మాణిక్య హారచ్ఛటాచంచచ్ఛోణిమపుఞ్జ మధ్యసరణిమ్ = ఎత్తైన స్తనప్రదేశమున బాగుగా కదలుచున్న మణిహారకాంతిచే ప్రకాశించు నెఱుపుల సమూహాము మధ్య దారిని;
పరిష్కుర్వతీ = అలంకరించుచు;
అస్తి = ఉన్నదో;
(సా = అ) అసౌ = ఈ;
మంజులా = అందమైన;
తే = నీయొక్క;
స్మితద్యుతిః = చిఱునవ్వు కాంతి;

| | |
|---|---|
| శంకరజటాకాన్తారవాటీ పతత్ స్వర్వాపీపయసః | = శివుని జడలనెడి అడవి భాగము నుండి పడుచున్న స్వర్గముయొక్క దిగుడుబావి నీటియొక్క; |
| వైదగ్ధ్యమ్ | = నైపుణ్యమును; |
| ఉపైతి | = పొందుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి మన్దహాసమామె స్తనమండలమునందు ముత్యాలకాంతితో ప్రకాశించు నెఱుపుల మధ్య దారి నలంకరించుచున్నది. అది శివుని జడల అడవి ప్రదేశమునుండి పడు స్వర్గముయొక్క దిగుడుబావి నీటియొక్క నైపుణ్యమును బొందుచున్నది.

**వివరణము :-**

అమ్మవారి స్తనమండలమున మాణిక్యహారము కలదు. అది ఎఱ్ఱని కాంతుల విరజిమ్ముచున్నది. వాని మధ్యలోని దారిని అమ్మవారి చిఱునవ్వు అలంకరించుచున్నది. శివుని జడలెఱ్ఱనివి. ఆ జడల సమూహమొక యెఱ్ఱని యడవి. దానిలోనికి స్వర్గముయొక్క దిగుడు బావి యనదగిన యాకాశగంగ పడుచున్నది. మాణిక్యహారచ్ఛటకును శివజటాకాంతారవాటికి బింబప్రతిబింబ భావముండుటచే మొదటి వాక్యార్థమునకు రెండవ వాక్యార్థమునకు దృష్టాంత దార్ష్టాంతిక భావమున్నది కావున నిచట దృష్టాంతాలంకార మున్నది. ఆ దృష్టాంతాలంకారముచేత మొదటి వాక్యర్థమున విశేష్యమైన స్మితద్యుతికి, రెండవ వాక్యార్థమున విశేష్యమైన ఆకాశగంగా జలముతోడి పోలిక వ్యంగ్యమగుచున్నది. కావున నిట నుపమాలంకారధ్వని యున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వుయొక్క మంజులత్వము వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున అమ్మవారి చిఱునవ్వుయొక్క వికస్వరత్వము వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ సన్నామైకజుషా జనేన సులభం సంసూచయన్తీ శనై-**
**రుత్తుఙ్గస్య చిరాదనుగ్రహతరోరుత్పత్స్యమానం ఫలమ్।**
**ప్రాథమ్యేన వికస్వరా కుసుమవత్ప్రాగల్భ్యమభ్యేయుషీ**
**కామాక్షి! స్మితచాతురీ తవ మమ క్షేమఙ్కరీ కల్పతామ్॥ 56**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీ దేవీ! |
| సన్నామైకజుషా | = మంచి పేరునే పొందిన; |
| జనేన | = జనునిచేత; |
| చిరాత్ | = చిరకాలమునకు; |

| | | |
|---|---|---|
| ఉత్తుంగస్య | = | ఎత్తైన; |
| అనుగ్రహతరోః | = | అనుగ్రహవృక్షమునకు; |
| ఉత్పత్స్యమానమ్ | = | పుట్టబోవు; |
| సులభమ్ | = | సులభమైన; |
| ఫలమ్ | = | ఫలమును; |
| శనైః | = | మెల్లగా; |
| సంసూచయన్తీ | = | సూచింపఁజేయుచున్నదై; |
| ప్రాథమ్యేన | = | ముందుగా; |
| వికస్వరా | = | విచ్చుకున్నదై; |
| కుసుమవత్ | = | పూవువలె; |
| ప్రాగల్భ్యమ్ | = | ప్రగల్భతను; |
| అభ్యేయుషీ | = | పొందుచున్న; |
| తవ | = | నీయొక్క; |
| స్మితచాతురీ | = | చిఱునవ్వునేర్పు; |
| మమ | = | నాకు; |
| క్షేమంకరీ | = | క్షేమమును కల్గించునదిగా; |
| కల్పతామ్ | = | శక్తమగు గాక! |

**తాత్పర్యము:-**

మంచి పేరు పొందిన జనుని ద్వారా ఎత్తైన అనుగ్రహవృక్షమువలన కలుగబోవు సులభమైన ఫలమును మెల్లగా సూచించుచున్నదై, ముందుగా వికసించినదై, పూవువలె ప్రగల్భతను పొందినట్టి అమ్మవారి స్మితచాతురి నాకు క్షేమమును కలిగించుగాక!

**వివరణము :-**

అమ్మవారి పెదవులు విప్పుకొని చిఱునవ్వు బయలుదేరినదనగా ఆమెకు గొప్ప అనుగ్రహము కలిగినందుకు అది సూచకము. కాని ఈ అమ్మవారి అనుగ్రహము మంచిపేరు పొందిన యొక జనుని ద్వారా సులభమగును. ఆ జనుడెవరు? ఆతడు సద్గురువు. ఆ గురుమూర్తి అమ్మవారి రూపాంతరమే. ఈ అనుగ్రహతరువునుండి కలుగఁ బోవు ఫలమేది? అది మోక్షము. చెట్టు ముందు పూయును తరువాత కాయును. అమ్మవారిలో అనుగ్రహవృక్షము దాగియున్నది. అది పూచినదో యన్నట్లమ్మవారి పెదవుల చిఱునవ్వు మెఱసినది. దాని వలన కలుగఁబోవు ఫలము కైవల్యమే. అమ్మవారి ఈ చిఱునవ్వునకు ఆ కైవల్యము పుట్టబోవు ఫలము. ఫలప్రదాత్రి అమ్మవారే అను పక్షమిది. అనుగ్రహించున దమ్మవారు. శివుడు కైవల్య మొసగును అను పక్షమున సన్నామమును పొందిన జనుడనగా శివుడే. ఆయనకు 'సత్' అనునదొకపేరు. **"ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణః త్రివిధః స్మృతః"(17.23)** (ఓం, తత్, సత్ అనునవి బ్రహ్మయొక్క పేర్లు) అని

కదా భగవద్గీత. అమ్మవారికిని గురుమూర్తిత్వముతో పాటు శివైక్యము కలదు. గనుక ఆమెయే శివకైవల్యమును సైతమొసగును. కాని సద్రూపుడైన అనగా బ్రహ్మానుభవము (లేక) శివైక్యానుభవముకల సద్గురువు అమ్మవారిలో అనుగ్రహమును కలిగించుటకు సమర్థుడు అని **సన్నామైకజుషా** అను సమాసముచేత నీ యర్థమంతయు స్ఫురించును. **'అస్తి బ్రహ్మేతి చేద్వేద సన్తమేనం తతో విదుః'** (తై.2.6.1) అను శ్రుతి వాక్యము బ్రహ్మాస్తిత్వము నెరిగినవాడు సన్ అను పేరుగలవాడు అని చెప్పుటచే గురువు సన్నామమును పొందినవాడని తెలియవలెను. ఆతడే ఆస్తికుడు, ఆతడే సత్పురుషుడు. ఆతడు తన గురువు ద్వారముననే అస్తి బ్రహ్మయని యెరుగవలెను. ఆ గురువు లందఱకును ఆదిశివుడే కావున శివునకు 'సన్' అను పేరుండుటలో సంశయమక్కఱలేదు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి స్మితమునందు ప్రాగల్భ్యము వర్ణింపఁబడినది. ఈ శ్లోకమునందు అమ్మవారి స్మితమునందు సేనాపతిత్వ ముత్ప్రేక్షింపఁబడుచున్నది.

**శ్లో॥ ధానుష్కాగ్రసరస్య లోలకుటిలభ్రూలేఖయా బిభ్రతో
లీలాలోకశిలీముఖం నవవయస్సామ్రాజ్యలక్ష్మీపుషః।
జేతుం మన్మథమర్దినం జనని! తే మన్దస్మితప్రక్రమో
వల్గుర్విభ్రమభూభృతో వితనుతే సేనాపతిప్రక్రియామ్॥ 57**

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| జనని | = అమ్మా! |
| తే | = నీయొక్క; |
| వల్గుః | = అందమైన; |
| మన్దస్మితప్రక్రమః | = చిఱునవ్వుయొక్క ఆరంభము; |
| లోలకుటిలభ్రూలేఖయా | = చంచలమైన వంకరయైన కనుబొమరేఖచే; |
| ధానుష్కాగ్రసరస్య | = ధనుర్ధరులలో శ్రేష్ఠుడైన; |
| లీలాలోకశిలీముఖమ్ | = అలవోకగా చూచు చూపను బాణమును; |
| బిభ్రతః | = ధరించునట్టియు; |
| నవవయస్సామ్రాజ్యలక్ష్మీపుషః | = యౌవనమను సామ్రాజ్యముయొక్క శోభను పొందిన; |
| విభ్రమభూభృతః | = విలాసరాజునకు (విలాసమను రాజుయొక్క); |
| మన్మథమర్దినమ్ జేతుమ్ | = శివుని జయించుటకు; |
| సేనాపతిప్రక్రియామ్ | = సేనాపతియొక్క ప్రక్రియను; |
| వితనుతే | = చేయుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి విలాసమొక రాజు. అతడు అమ్మవారి కనుబొమ రేఖను ధనువుగా ధరించి ధానుష్కులలో శ్రేష్ఠుడైనాడు. లీలాలోకమును బాణమునుగా ధరించినాడు. యౌవనమను సామ్రాజ్యముయొక్క లక్ష్మిని పోషించినవాడు. అట్టి విలాసరాజు శివుని జయింపఁబోవునపుడు అందమైన అమ్మవారి చిఱునవ్వుయొక్క ఆరంభము సేనాపతిత్వము నవలంబించి యున్నది.

**వివరణము :-**

అమ్మవారి విభ్రమమునందు రాజత్వము, ఆమె మన్దహాసప్రక్రమము నందు సేనాపతి ప్రక్రియ, యుత్ప్రేక్షింపఁబడుటచే నిందుత్ప్రేక్షాలంకారమున్నది. ఈ విభ్రమప్రభువు స్వయముగా ధనుర్బాణముల ధరించి సామ్రాజ్యలక్ష్మిని పొందినవాఁడని చెప్పుటచే నీతడు స్వాయత్తసిద్ధమైన ప్రభువని స్పష్టమగుచున్నది. అయినను శివుని జయించుట కా ప్రభువునకు సేనాపతి కావలసిరాగా మన్దస్మితము సేనాపతిత్వము నొందినదని చెప్పుటచే శివుని జయించుటకు మన్దస్మిత సేనాపతి సహితుడైనప్పుడే విభ్రమ ప్రభువు సమర్థుడైనాడని స్ఫురింఃుటచే మన్దస్మిత ప్రాధాన్యము స్పష్టమగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున మన్మథ మర్దియైన శివుని జయించు అమ్మవారి మన్దస్మితముయొక్క సేనాపతిత్వము వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున నమ్మవారి మన్దహాసలేశమే శివుని మనస్సు మన్మథజ్వరాగ్నిజ్వాలచే చుట్టఁబడుటకు హేతువుగా వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ యన్నాకమ్పత కాలకూటకబలీకారే చుచుమ్బే న యద్-**
**గ్లాన్యా చక్షుషి రూషితానలశిఖే రుద్రస్య తత్తాదృశమ్।**
**చేతో యత్ప్రసభం స్మరజ్వరశిఖిజ్వాలేన లేలిహ్యతే**
**తత్కామాక్షి! తవ స్మితాంశుకణికాహేలాభవం ప్రాభవమ్॥ 58**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| యత్ | = | ఏది (శివుని మనసు) |
| కాలకూటకబలీకారే | = | కాలకూటమును మ్రింగుటయందు |
| న అకమ్పత | = | భయపడలేదో |
| యత్ | = | ఏది (శివుని మనసు) |
| చక్షుషి | = | కన్ను |
| రూషితానలశిఖే | = | అగ్నిజ్వాలల గ్రక్కినను |
| గ్లాన్యా | = | గ్లానిచేత |

| | | |
|---|---|---|
| న చుచుమ్బే | = | స్పృశింపఁబడలేదో |
| తత్ | = | ఆ |
| తాదృశమ్ | = | అటువంటి |
| రుద్రస్య | = | రుద్రునియొక్క |
| చేతః | = | మనస్సు |
| ప్రసభమ్ | = | బలవంతముగా |
| స్మరజ్వరశిఖిజ్వాలేన | = | మన్మథజ్వరాగ్నిచేత |
| లేలిహ్యతే | = | చుట్టబడుచున్నదనుట |
| యత్ | = | ఏదో |
| తత్ | = | అది |
| తవ | = | నీయొక్క |
| స్మితాంశుకణికాహేలాభవమ్ | = | చిఱునవ్వు కాంతిలేశపు విలాసమున జనించిన |
| ప్రాభవమ్ | = | వైభవమే. |

**తాత్పర్యము:-**

అమ్మా కామాక్షీ దేవీ! కాలకూటము మ్రింగునప్పుడు భయపడలేదు. కంటి మంటలకు గ్లాని నొందలేదు. అట్టి శివుని చిత్తము నేడు మన్మథాగ్ని జ్వాలలచే చుట్టబడినదనగా నది నీ మన్దస్మితలేశముయొక్క వైభవము కాదా?

**వివరణము :-**

కాలకూటవిషముకంటె, నిటలాగ్నిజ్వాలకంటె, మన్మథాగ్ని జ్వరజ్వాల తీవ్రమైనది. అట్టి మన్మథాగ్ని జ్వరజ్వాల అమ్మవారి మన్దస్మితలేశముయొక్క విలాసమున జనించినది కావున మన్దస్మిత మహత్వమీ శ్లోకమున ప్రతిపాదింపబడినది. కాలకూటాగ్నికి, నిటలాగ్నికి కందని శివుని మనస్సును చుట్టివేసిన స్మరజ్వరాగ్నిజ్వాల అమ్మవారి మృదుహాసలేశమున జనించుట వింత కాదా? కాలకూటాగ్నికూడ నల్లని పాలసముద్రమునుండియే జనించినను అది అంత వింత కాదేమో. కాని అమ్మవారి మృదుహాసలేశమున అంత తీవ్రమైన స్మరజ్వరాగ్ని జనించుట మాత్రము వింతయే అని **కణికా, హేలా** శబ్దములచే వ్యంగ్యమగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి స్మితరుచి **హేలాభవ ప్రాభవము** వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున స్మితరుచికి కచవ్యతికరమున సంభవించునొక దశ వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ సమ్భిన్నేవ సుపర్వలోకతటినీ వీచీచయైర్యామునైః**
**సంమిశ్రేవ శశాఙ్కదీప్తిలహరీ నీలైర్మహానీరదైః।**

కామాక్షి! స్ఫురితా తవ స్మితరుచిః కాలాఞ్జనస్పర్ధినా
కాలిమ్నా కచరోచిషాం వ్యతికరే కాఞ్చిద్దశామశ్నుతే॥ 59

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీ దేవీ! |
| తవ | = నీయొక్క |
| స్మితరుచిః | = చిఱునవ్వు కాంతి |
| యామునైః | = యమునానదికి సంబంధించిన |
| వీచీచయైః | = తరంగసమూహములచేత |
| సమ్భిన్నా | = కలసిపోయిన |
| సుపర్వలోకతటినీ ఇవ | = గంగానదివలె |
| నీలైః | = నల్లని |
| మహానీరదైః | = గొప్ప మేఘములచేత |
| సమ్మిశ్రా | = కలిసిపోయిన |
| శశాంకదీప్తిలహరీ ఇవ | = వెన్నెల ప్రవాహమువలె |
| కాలాంజనస్పర్ధినా | = కాటుకతో పోటీపడు |
| కచరోచిషామ్ | = కేశకాంతులయొక్క |
| కాలిమ్నా | = నల్లదనముతో |
| వ్యతికరే | = సంబంధమున |
| స్ఫురితా | = ఆక్రమింపఁబడినదై |
| కాంచిత్ | = ఒకానొక |
| దశామ్ | = దశను |
| అశ్నుతే | = పొందుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి స్మితరుచి కచకాంతులసంబంధమున నల్లనికాంతిచే ఆక్రమింపబడినదై, యమునానదీతరంగములతో కూడిన గంగానదివలె, నీల మేఘములతో కలసిన వెన్నెల ప్రవాహమువలె, విచిత్రదశను పొందుచున్నది.

**వివరణము :-**

అమ్మవారి స్మితరుచి గంగానదితో, వెన్నెల ప్రవాహముతో పోల్చబడినది. గంగానదికి యమునానదితో సంగమము కలిగినట్లు వెన్నెల ప్రవాహమునకు నల్లని మేఘములతో కలయిక యేర్పడినట్లు స్మితరుచికి నల్లనికాంతితో కలయిక కచవ్యతికరమున నేర్పడినది అని చెప్పబడుటచే నిట నుపమాలంకారమున్నది. యమునానది సంగమ

మేర్పడినప్పు డే దశ గంగకు కలిగినదో నా మేఘములతో సంబంధమేర్పడినప్పుడు వెన్నెల కే దశ కలిగనదో అట్టి విచిత్రమగు నొక దశ స్మితరుచికి కచవ్యతికరమున నేర్పడినది. కాంచిత్ శబ్ద ప్రయోగమున ఆ దశలో వాని శోభవర్ణనాతీతమని అది దర్శనైకవేద్యమని స్ఫురించుచున్నది.



అవ:- మన్దస్మితముయొక్క తెలుపునకు దానికి విపరీతమైన (కచముల) నలుపుయొక్క కలయిక పై శ్లోకమున ప్రస్తావింపఁబడినది. ఈ శ్లోకమున మన్దహాస ప్రభయొక్క శివముఖదర్శనమువలన వికాసమును, దానికి విపరీతమైన హాసము శివముఖదర్శనాభావమున నేర్పడునట్లు వర్ణింపఁబడుచున్నది.

శ్లో॥ జానీమో జగదీశ్వరప్రణయిని! త్వన్మన్దహాసప్రభం
శ్రీకామాక్షి! కుముద్వతీమభినవామేషా యతస్సర్వదా।
ఆస్యేన్దోరవలోకనే పశుపతేరభ్యేతి సమ్ఫుల్లతాం
తన్ద్రాలుస్తదభావ ఏవ తనుతే తద్వైపరీత్యక్రమమ్॥ 60

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| జగదీశ్వరప్రణయిని | = శివుని ప్రియురాలవైన |
| శ్రీకామాక్షి! | = ఓ కామాక్షీ దేవీ! |
| త్వన్మన్దహాసప్రభామ్ | = నీ చిఱునవ్వు కాంతిని; |
| అభినవామ్ | = క్రొంగొత్త; |
| కుముద్వతీమ్ | = కలువతీవనుగా; |
| జానీమః | = తెలిసికొనుచున్నాము; |
| యతః | = ఎందువల్లననగా; |
| సర్వదా | = ఎల్లప్పుడు; |
| ఏషా | = ఈ మన్దహాసప్రభ; |
| పశుపతేః | = శివునియొక్క; |
| ఆస్యేన్దోః | = ముఖచంద్రునియొక్క; |
| అవలోకనే | = దర్శనమున; |
| సమ్ఫుల్లతామ్ | = వికాసమును; |
| తదభావ ఏవ | = అది (శివాస్యేన్దుదర్శనము) లేనప్పుడే; |
| తన్ద్రాలుః | = నిద్రించుచున్నదై; |
| తద్వైపరీత్యక్రమమ్ | = దానికి (వికాసమునకు) విపరీతమైన స్థితిని (హాసమును); |
| అభ్యేతి | = పొందుచున్నది. |

**తాత్పర్యము:-**

శివుని ప్రియురాలవైన యో కామాక్షీదేవీ! నీ మన్దహాసప్రభను క్రొంగొత్తకలువ తీవనుగా తెలిసికొనుచున్నాము. ఆ మందహాసప్రభ శివాస్యేందుదర్శనమున వికాసమును తదభావమున హాసమును పొందుచున్నది.

**వివరణము :-**

ఈ శ్లోకమున మన్దహాసప్రభ కుముద్వతిగా నుత్ప్రేక్షింపఁబడుటచే నుత్ప్రేక్షాలంకారమున్నది. అది **జానీమః** అను క్రియాపదముచేత వాచ్యమై యున్నది.



**అవ:-** పై శ్లోకమున తెల్లని కలువతీవగా అమ్మవారి మన్దహాసప్రభ యుత్ప్రేక్షింపబడినది. ఈ శ్లోకమున నెఱ్ఱవారుచున్న యమ్మవారి స్మితరోచిస్సు వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ యాన్తీ లోహితభావమభ్రతటినీ ధాతుచ్ఛటాకర్దమై-**
**ర్భాన్తీ బాలగభస్తిమాలికిరణైర్మేఘావలీ శారదీ।**
**బిమ్బోష్ఠద్యుతిపుఞ్జచుమ్బనకలాశోణాయమానేన తే**
**కామాక్షి! స్మితరోచిషా సమదశామారోఢుమాకాంక్షతే॥ 61**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| ధాతుచ్ఛటాకర్దమైః | = | ధాతువుల కాంతుల బురదలచే; |
| లోహితభావమ్ | = | ఎఱ్ఱదనమును; |
| యాన్తీ | = | పొందుచున్న; |
| అభ్రతటినీ | = | ఆకాశగంగ; |
| బాలగభస్తిమాలికిరణైః | = | లేతసూర్యునికిరణములచేత; |
| భాన్తీ | = | ప్రకాశించుచున్న; |
| శారదీ | = | శరత్కాలమునకు చెందిన; |
| మేఘావలీ | = | మేఘముల గుంపు; |
| బిమ్బోష్ఠద్యుతిపుంజచుంబనకలా శోణాయమానేన | = | దొండపండు వంటి పెదవియొక్క కాంతి పుంజమును చుంబించువిద్యతో నెఱ్ఱవారుచున్న; |
| తే | = | నీయొక్క; |
| స్మితరోచిషా | = | చిఱునవ్వు కాంతితో; |
| సమదశామ్ | = | సమానమైన స్థితిని; |
| ఆరోఢుమ్ | = | ఎక్కుటకు (పొందుటకు); |
| ఆకాంక్షతే | = | కోరుచున్నది. |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! ధాతుకాంతులచే నెఱ్ఱదనము నొందుచున్న ఆకాశగంగ, లేతసూర్యుని కిరణములచే ప్రకాశించుచున్న శరత్కాలపు మేఘముల గుంపు, దొండపండు వంటి నీ యెఱ్ఱని పెదవిని చుంబించు నేర్పుచే నెఱ్ఱవారుచున్న నీ చిఱునవ్వు కాంతితో సమానమైన స్థితిని పొందగోరుచున్నది.

**వివరణము :-**

ఆకాశగంగ స్వర్గములోని మేరుపర్వతమునుండి శివుని శిరస్సుపైకి, శివుని శిరస్సునుండి కైలాసపర్వతముమీదికి, కైలాసపర్వతము నుండి హిమాలయ పర్వతము మీదికి ప్రవహించుటచే ఆయా పర్వతముల సానుపులందలి గైరికాది ధాతువులు ఆకాశగంగతో కలియుటచే తెల్లనైన ఆకాశగంగకు ఎఱ్ఱదనము కలిగినది. శరత్కాలపు మేఘములగుంపు తెల్లనిదైనను బాలభానుకిరణములచే నెఱ్ఱదనము నొందినది. అట్లే అమ్మవారి స్మితరోచిస్సు సహజముగా తెల్లనిదైనను నెఱ్ఱనిపెదవిపై ప్రకాశించుటచే పెదవియొక్క ఎఱ్ఱదనము అమ్మవారి స్మితరోచిస్సునకు సంక్రమించినది. ఆకాశగంగయు శారదకాదంబినియు సాంక్రామికమైన ఎఱ్ఱదనము నొందినవై పెదవుల యెఱ్ఱదనము సంక్రమించిన చిఱునవ్వుతో సమమైన స్థితి నొందుటకు కోరుచున్నవి యని ఆకాశగంగా శరత్కాదంబినులకు లేని కోరిక యున్నట్లు చెప్పబడుటచే నతిశయోక్త్యలంకారము కలదు. దాని వలన ఉపమానములైన ఆకాశగంగాశరత్కాదంబినులే ఉపమేయమైన అమ్మవారి స్మితరోచిస్సుతో సమానమైన స్థితిని బొందగోరుచున్నా మని చెప్పుటచే ప్రతీపాలంకారస్ఫూర్తి కలదు. యాస్తీ భాస్తీ అని ప్రథమ ద్వితీయ పాదాలయం దుండుటచే ఆద్యనుప్రాసమును కలదు.



**అవ॥:-** పై శ్లోకమున ఆకాశగంగా శరన్మేఘావలులతో పోలిక అమ్మవారి స్మిత రోచిస్సునందు స్ఫురింపఁజేయబడినది. ఈ శ్లోకమున చంద్రహిమజల ముక్తామణులతోడి పోలిక స్ఫురింపఁజేయబడుచున్నది.

**శ్లో॥ శ్రీకామాక్షి! ముఖేన్దుభూషణమిదం మన్దస్మితం తావకం**
**నేత్రానన్దకరం తథా హిమకరో గచ్ఛేద్యథా తిగ్మతామ్।**
**శీతం దేవి! తథా యథా హిమజలం సన్తాపముద్రాస్పదం**
**శ్వేతం కిఞ్చ యథా తథా మలినతాం ధత్తే చ ముక్తామణిః॥ 62**

ప్రతిపదార్థము :-

| | | |
|---|---|---|
| శ్రీకామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| ముఖేన్దుభూషణమ్ | = | ముఖచన్ద్రునకు అలంకారమైన; |

| | | |
|---|---|---|
| తావకమ్ | = | నీకు సంబంధించిన; |
| మన్దస్మితమ్ | = | చిఱునవ్వు; |
| హిమకరః | = | చన్ద్రుడు; |
| యథా | = | ఏ విధముగా; |
| తిగ్మతామ్ | = | తీక్షణత్వమును; |
| గచ్ఛేత్ | = | పొందునో; |
| తథా | = | ఆ విధముగా; |
| నేత్రానన్దకరమ్ | = | కన్నులకు ఆనందము కలిగించునట్టిది; |
| యథా | = | ఏవిధముగా; |
| హిమజలమ్ | = | మంచునీరు; |
| సన్తాపముద్రాస్పదమ్ | = | సన్తాపచిహ్నములకు నిలయమగునో; |
| తథా | = | ఆవిధముగా; |
| శీతమ్ | = | చల్లనిది; |
| కిఞ్చ | = | మరియు; |
| యథా | = | ఏ విధముగా; |
| ముక్తామణిః | = | ముత్తెము; |
| మలినతామ్ | = | మలినత్వము; |
| ధత్తే | = | ధరించునో; |
| తథా | = | ఆవిధముగా; |
| శ్వేతమ్ | = | తెల్లనిది. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ ముఖచన్ద్రున కలంకారమైన నీ చిఱునవ్వు చన్ద్రుడు తీక్షణముగా ననిపించునంత నేత్రానందకరము. మంచునీరు సన్తాపలక్షణముల నెలవు అనిపించునంత చల్లనిది. ముత్తెము మలినమనిపించునంత తెల్లనిది.

**వివరణము :-**

చన్ద్రునకు తీక్షణతాయోగము, హిమజలమునకు సన్తాపహేతుత్వ యోగము, ముత్తెమునకు మలినత్వయోగములు లేకున్నను ఉన్నట్లు వర్ణించుటచే నిట నతిశయోక్త్యాలంకారము కలదు. దీనివలన అమ్మవారి మన్దస్మితమునకు గల నేత్రానన్దకరత్వ, శీతత్వ, శ్వేతత్వములు చంద్ర హిమజల ముక్తాతిశాయులను వస్తువు వ్యంగ్య ముండుటచే నిట వస్తుధ్వని కలదు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మన్దస్మితమునకు **చన్ద్రహిమజలముక్తామణుల**

**అల్పత్వము** జెప్పఁబడినది. ఈ శ్లోకమున చన్ద్రాతపము మన్దస్మితము కన్న అల్పమని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ త్వన్మన్దస్మితమఞ్జరీం ప్రసృమరాం కామాక్షి! చన్ద్రాతపం**
**సన్తస్సన్తతమామనన్త్యమలతా తల్లక్షణం లక్ష్యతే।**
**అస్మాకం న ధునోతి తాపమధికం ధూనోతి నాభ్యన్తరం**
**ధ్వాన్తం తత్ఖలు దుఃఖినో వయమమీ కేనేతి నో విద్మహే॥63**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| ప్రసృమరామ్ | = | వ్యాపించు; |
| త్వన్మన్దస్మితమంజరీమ్ | = | నీ చిఱునవ్వు గుత్తిని; |
| చన్ద్రాతపమ్ | = | వెన్నెలనుగా; |
| సన్తః | = | సత్పురుషులు; |
| సంతతమ్ | = | ఎల్లప్పుడు; |
| ఆమనన్తి | = | చెప్పుదురు; |
| అమలతా | = | స్వచ్ఛతయే; |
| తల్లక్షణమ్ | = | దాని లక్షణముగా; |
| లక్ష్యతే | = | కనఁబడుచున్నది; |
| తత్ | = | అది; |
| అస్మాకమ్ | = | మాయొక్క; |
| అధికమ్ | = | అధికమైన; |
| తాపమ్ | = | తాపమును; |
| న ధునోతి | = | తొలగించుటలేదు; |
| ఆభ్యన్తరమ్ | = | లోని; |
| ధ్వాన్తమ్ | = | చీకటిని; |
| న ధూనోతి | = | తొలగించుటలేదు; |
| ఖలు | = | కదా; |
| అమీ | = | ఈ; |
| వయమ్ | = | మేము; |
| కేన | = | ఏ కారణముచేత; |
| దుఃఖినః | = | దుఃఖము కలవారమగుచున్నామో; |
| నో విద్మహే | = | తెలియకున్నాము. |

**తాత్పర్యము:-**

అమ్మా! సత్పురుషులు వ్యాపించు నీ మన్దస్మితమంజరిని చూచి వెన్నెలయే యనుచున్నారు. దాని (వెన్నెల) స్వచ్ఛత కనబడుచున్నది కాని అధికమైన తాపమును కాని, అభ్యన్తరమైన అన్ధకారమును గాని, అది తొలగించుట లేదు. ఏ కారణమువలన మేము దుఃఖముకలవార మగుచున్నామో తెలియకున్నాము.

**వివరణము :-**

సత్పురుషులు అమ్మవారి మన్దస్మితమును చన్ద్రికగా పేర్కొనుట కమలత్వ కారణము కనఁబడుచున్నది. ఆ చన్ద్రాతపమమ్మ మన్దస్మితమే యయినచో మా అధికతాపమును మా అభ్యన్తరమైన అన్ధకారమును దొలగింపకుండుటకు అందువలన మేము దుఃఖము కలవారమై యుండుటకు, కారణమేమో మేము తెలియకున్నాము అని వారనుచున్నారు. కావున అమ్మవారి మన్దస్మితముతో చన్ద్రాతపమున కేమాత్రము పోలికలేదు, అని చంద్రాతపనింద స్ఫురించుటచే ప్రతీపాలంకారము వ్యంగ్యమగుచున్నది. మన్దస్మితము ఎంత అధికమైన తాపమునైన నివారింపఁగలదు. చన్ద్రసూర్యాదులు తొలగింపలేని మా ఆభ్యన్తరమైన అన్ధకారమును అమ్మవారి మన్దస్మితము తొలగింపనున్నదనుటలో సంశయము లేదు కాని మాకు ఆమె మన్దస్మితము లభించు భాగ్యము లేదు. దానితో నే మాత్రము సరితూగజాలని చన్ద్రాతపమే మాకు లభించుచున్నది. అది అమ్మవారి మన్దస్మితమంజరియే యని సత్పురుషులు చెప్పుట విని ఈ చన్ద్రాతపమే ఆభ్యన్తరములైన అధికతాపాన్ధకారముల తొలగింపగలదని భ్రమించితిమి. సత్పురుషులకు సర్వత్ర బ్రహ్మదర్శనముండుటచే వారికీ చన్ద్రాతపమమ్మవారి మన్దస్మితముగానే తోచుట సరియైనదే కావచ్చును. మాకట్టి దర్శనము లేదు కదా! అదియే మా దుఃఖమునకు కారణము. మరొకటేదైన కలదేమో మాకు తెలియకున్నది. అభ్యంతరమైన ధ్వాన్తమనగా అజ్ఞానము. అమ్మవారి మన్దస్మితము సత్యజ్ఞానానందరూపము. అమ్మవారి యనుగ్రహముగల సత్పురుషులకే అజ్ఞానము తొలగును. అస్మదాదులకు యనుగ్రహభాగ్యమే లేకుండుటకు కారణమేమి? అమ్మవారికి వారియందు పక్షపాత మేల? మాయందుపేక్ష యుండుటకు కారణమేమియో తెలియకున్నామనుట కవి భావనము. సత్పురుషులితరులయెడ దోషమును దర్శింపరు. ఇది వారి యౌదార్యము. అందుకే చన్ద్రాతపము నమ్మవారి మన్దస్మితముగా దర్శించి చెప్పినారు. కాని చన్ద్రాతపమునకు కారణమైన చన్ద్రుడు దోషాకరుడు. మేము దోషదర్శనము చేయుట కలవాటు పడిన పండితులము కావున చన్ద్రాతపము నమ్మవారి మన్దస్మితముగా దర్శింపలేకున్నాము. అమలత్వము చన్ద్రాతపము నందుండుట మాత్రమే సత్పురుషులు చూచినారు. మేమేమో పనిగట్టుకొని చన్ద్రాతపహేతువైన చన్ద్రుని దోషాకరత్వము చూచువఱకు విశ్రమింపకున్నాము. ఇంతచేసియు మాకు దుఃఖమే మిగిలినది అను వస్తువు వ్యంగ్యమగుటచే నిందు వస్తుధ్వని కలదు.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మన్దస్మితము అమలత్వకారణమున చన్ద్రాతపమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున రాగముతో నా హసితజ్యోత్స్న శివునకు స్నేహితురాలగు చున్నదని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ నమ్రస్య ప్రణయప్రరోహకలహచ్ఛేదాయ పాదాబ్జయో-**
**ర్మన్దం చన్ద్రకిశోరశేఖరమణేః కామాక్షి! రాగేణ తే।**
**బన్ధూకప్రసవశ్రియం జితవతో బంహీయసీం తాదృశీం**
**బిమ్బోష్ఠస్య రుచిం నిరస్య హసితజ్యోత్స్నా వయస్యాయతే॥64**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| ప్రణయప్రరోహకలహచ్ఛేదాయ | = | ప్రణయముయొక్క పెంపునందలి కలహముయొక్క నాశము కొఱకు; |
| తే | = | నీయొక్క; |
| పాదాబ్జయోః | = | పాద కమలమునందు; |
| మందమ్ | = | మెల్లగా; |
| నమ్రస్య | = | వంగిన; |
| పాదాబ్జయోః | = | పాదకమలములయొక్క; |
| రాగేణ | = | రాగముతో; |
| బన్ధూకప్రసవశ్రియమ్ | = | బన్ధూక (మంకెన) కుసుమకాంతిని; |
| జితవతః | = | జయించిన; |
| చన్ద్రకిశోరశేఖరమణేః | = | బాలచన్ద్రుని శిరోభూషణమణిగా ధరించిన శివునియొక్క; |
| తాదృశీమ్ | = | అటువంటి; |
| బంహీయసీమ్ | = | గొప్పనైన; |
| బిమ్బోష్ఠస్య | = | దొండపండువంటి పెదవియొక్క; |
| రుచిమ్ | = | కాంతిని; |
| నిరస్య | = | నిరసించి; |
| తే | = | నీయొక్క; |
| హసితజ్యోత్స్నా | = | నవ్వు వెన్నెల; |
| వయస్యాయతే | = | స్నేహితురాలగుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారితో శివునకు ప్రణయకలహము కలిగినపుడు శివుడామె పాదముల పైకి మెల్లగా వంగెను. అప్పుడు ఆ పాదములందలి యెఱుపు శివుని శిరోభూషణమైన

స్వచ్ఛమైన బాలచన్ద్రుని కాంతితో కలిసి యెఱ్ఱవారి బన్ధూక ప్రసవ కాంతినే జయించినది. దొండపండువంటి అమ్మవారి పెదవి పైనున్న యెఱ్ఱని కాంతిని దాటి వచ్చిన అమ్మవారి చిఱునవ్వే శివునకు మిత్రురాలైనది.

**వివరణము :-**

శివుడు తెల్లనివాడు. ఆయన శిరోభూషణమణియైన బాలచన్ద్రుడు తెల్లనివాడే. శివుని హృదయమున అమ్మవారి పట్ల (రాగమున్నది) ప్రణయమున్నది. ఆ ప్రణయమెక్కువగా నున్నది అని **ప్రణయప్రరోహకలహచ్ఛేదాయ** అను శబ్దములోని ప్రరోహ శబ్దము తెలుపుచున్నది. ప్రణయము ప్రవృద్ధమగుచున్నప్పుడు అల్పహేతువున సైతము అమ్మవారికి కోపము వచ్చును. అది ప్రణయకోపమే. ఆ కోపమును బాపుటకు శివుడామె పాదములపై వ్రాలుట తప్పదు. అట్టి సమయమున ఆమె పాదములందలి రాగము శివుని శిరోభూషణమణియైన చన్ద్రునకు సంక్రమించును. శివుని స్వచ్ఛహృదయమున అమ్మవారి యెడ రాగము గలిగినట్లే ఆమె పాదముల రాగము శివశిరోభూషణమణియైన చన్ద్రునకు సంక్రమించినది. అమ్మవారి పెదవి యెఱ్ఱనిది. అది బన్ధూకప్రసవకాంతిని జయించినది. అంతటి యెఱుపును దాటి చిఱునవ్వు బయటికి వచ్చినది. ఎందుకు? శివునంతటి వీతరాగి తన కపట (ప్రణయ) కోపమునకే భయపడి పాదములపై వ్రాలినాడే అని. మొదటనే ఆ కోపము తెచ్చిపెట్టుకొన్నది. శివుడు పాదములపై వ్రాలిన పిమ్మట కూడ ఎట్లుండగలదు? కోపము పోయి బిగించిన దొండపండువంటి పెదవి విప్పారినది. తెల్లని చిఱునవ్వు పెదవి యెఱుపును చీల్చుకొని బయటకు వచ్చినది. నాయిక కోపము తగ్గినదని ఇక మీ రామెను సమీపించవచ్చునని చెప్పుటకు వచ్చిన నాయిక ప్రాణసఖివలె ఆ చిఱునవ్వు శివునకు తోచినది. అమ్మవారి చిఱునవ్వు ఆమె యెఱ్ఱని పెదవిని చీల్చుకొని వచ్చినదనగా ఆమె యెదలోని యెఱ్ఱని కోపమును జీల్చుకొని వచ్చినదని యర్థము. ఆ కోపము విరిసినట్లే పెదవి విరిసినది. ఇక్కడ ఎఱుపు తెలుపులలో తెలుపు జయించినది. శివుని స్వచ్ఛమైన హృదయమున ప్రణయము ప్రరోహమొందిన దనగా తెలుపు నెఱుపు జయించినదని యర్థము. ప్రణయమెఱ్ఱనిదే కోపమును ఎఱ్ఱనిదే యని కవి సమయము. శివుడు అమ్మవారి పాదములపై వ్రాలినపుడు శివ శిరోభూషణమణి (చంద్రకాంతమణి) యైన చన్ద్రుడు అమ్మవారి పాదముల ఎఱుపుకాంతిచే బన్ధూకప్రసవకాంతిని జయించునంత ఎఱ్ఱబడినాడు. అనగా ఇక్కడ ఎఱుపు తెలుపును జయించినది. అమ్మవారి పాదములు సహజముగానే కమలములవలె నెఱ్ఱనివి పైగా పాదములకు ఆమె లత్తుక లేక పారాణి ధరించినది. ఇక చన్ద్రుని తెల్లదనమెట్లు నిలువగలదు. చన్ద్ర (కాంతిమణి) రూపమైన శివ శిరోభూషణమణి పద్మారాగమణియైనది. ఈ యెఱుపు తెలుపుల పరస్పరాధిక్యమే, అమ్మవారి కంటె శివుడెక్కువయని శివుని కంటె నమ్మవారెక్కువ యని తెలియుటచే నీ శ్లోకమున వస్తుధ్వని యున్నది. హసితజ్యోత్స్నయందు వయస్యాత్వ ముత్ప్రేక్షింపఁబడుటచే నీ శ్లోకమున నుత్ప్రేక్షాలంకార మున్నది. శృంగారప్రబన్ధములలో నాయకుడు నర్మసచివుని ద్వారమున

నాయికయొక్క కోపమును పోగొట్టుట (లేక) నాయిక నర్మసఖిద్వారమున నాయకుని కోపమును పోగొట్టుట ప్రసిద్ధమైనదే. మన్దహసితము నర్మసఖీత్వమునొందుట అనిదంపూర్వమైన మూకమహాకవి యొక్క కల్పనము.



అవ:- పై శ్లోకమున హసితము జ్యోత్స్నగా రూపింపఁబడినది. ఈ శ్లోకమున హసితము కంబ్వతిశాయిధావల్యము వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ ముక్తానామ్ పరిమోచనం విదధతస్తత్ప్రీతినిష్పాదినీ**
**భూయో దూరత ఏవ ధూతమరుతస్తత్పాలనం తన్వతీ।**
**ఉద్భూతస్య జలాన్తరాదవిరతం తద్దూరతాం జగ్ముషీ**
**కామాక్షి! స్మితమఞ్జరీ తవ కథం కమ్బో స్తులామశ్నుతే॥ 65**

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| ముక్తానామ్ | = | ముత్తెములయొక్క; |
| పరిమోచనమ్ | = | పరిత్యాగమును; |
| విదధతః | = | చేయునట్టి; |
| ధూతమరుతః | = | తొలగించిన వాయువులుగల; |
| జలాన్తరాత్ | = | నీటిలోపల నుండి; |
| ఉద్భూతస్య | = | పుట్టిన; |
| కమ్బోః | = | శంఖముయొక్క; |
| తులామ్ | = | పోలికను; |
| భూయః | = | మాటిమాటికి; |
| తత్ప్రీతినిష్పాదినీ | = | వారికి(ముక్తులకు) ప్రీతిని గలిగించునట్టి; |
| దూరతః+ఏవ | = | దూరమందుండియే; |
| తత్ | = | ఆ దేవతల; |
| పాలనమ్ | = | పాలనమును; |
| తన్వతీ | = | చేయునట్టి; |
| అవిరతమ్ | = | ఎల్లప్పుడు; |
| తద్దూరతామ్ | = | ఆ జడులకు దూరమును; |
| జగ్ముషీ | = | పొందునట్టి; |
| తవ | = | నీయొక్క; |
| స్మితమంజరీ | = | చిఱునవ్వుగుత్తి; |

కథమ్ = ఎట్లు;
అశ్నుతే = పొందును?

**తాత్పర్యము:-**

శంఖము ముక్తములననగా ముత్తెములఁబైకి జిమ్ముచుండును. అమ్మవారి స్మితమంజరి ముక్తులకు మాటిమాటికి ప్రీతిని గలిగించుచుండును. శంఖము నూదినపుడు లోపలి మరుత్తులు అనగా గాలులు బయటికి పోవుచుండును. అమ్మవారి స్మితమంజరి ఆ ధూతమరుత్తుల అనగా ప్రాణాయామము చేయు యోగుల పాలనమొనర్చును. శంఖము జలా(డా)ంతరమునుండి పుట్టును. అమ్మవారి స్మితమంజరి ఆ జడములకు దూరముగా నుండునట్టిది. ఇట్లు యన్ని యంగములలో విలక్షణమైన అమ్మవారి స్మితమంజరి తెల్లనిదైనంత మాత్రమున శంఖముతో పోలునని చెప్పుట యెట్లు?

**వివరణము :-**

శంఖములలో ముత్తెములుండుననుట కవి సమయసిద్ధము. **ముక్తానామ్** అను శబ్దమునకు ఒక యర్థము ముత్తెములు మరొర యర్థము ముక్తినొందినవారు. శంఖము ముత్తెములను తననుండి దూరము చేయును. అమ్మవారి స్మితమంజరి ముక్తులకు సంతోషమును కలిగించుచు తనకడనే యుంచుకొనును. శంఖము ధూతమరుత్తు అనగా ఊదినప్పుడు లోని మరుత్తులు (ననగా) గాలులు బయటకు వెళ్ళగొట్టును. అమ్మవారి స్మితమంజరి మరుత్తులను అనగా దేవతలను వెడలగొట్టదు పైగా పరిపాలించుచుండును. శంఖము నీటిలోపలి నుండి పుట్టును. జలాన్తరాత్ అనగా నీటిలోపలినుండి యొక యర్థము, జడము నుండి అని మరియొక యర్థము. శంఖము జలాన్తరమునుండి యనగా జడాన్తరము నుండి అనగా మరొక జడమునుండి పుట్టును. జలము జడమే శంఖము జడమే కావున శంఖము మరొక జడము నుండి పుట్టినది. ఆ విధముగా అమ్మవారి స్మితమంజరి జడము నుండి పుట్టలేదు. చిద్రూపిణి చిద్ఘనయునగు నమ్మవారిలో నుండి పుట్టినది. పైగా జడులకు దూరముగానే యుండును. ఇట్లన్ని విషయములలో శంఖమునకు అమ్మవారి స్మితమునకు వైషమ్యముండగా పోలిక యెట్లు? స్మితమంజరికి శంఖమునకు నొక్క తెల్లదనమునందే సామ్యము. మిగిలిన యన్ని యంశములలో వైషమ్యమున్నది. సామాన్యధర్మము (తెలుపు) సమానమైనను ఉపమానోప- మేయములకు విశేషమున్నది కావున వ్యతిరేకాలంకార మేర్పడుచున్నది.



**అవ:-** అమ్మవారి స్మితమునకు శంఖము సాటి రాజాలదని పై శ్లోకమునఁజెప్పబడినది. ఈ శ్లోకమున మన్దారచన్ద్రాదులు సైతము అమ్మవారి మన్దస్మితములకు సాటి కాజాలవని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ శ్రీకామాక్షి! తవ స్మితద్యుతిఝరీవైదగ్ధ్యలీలాయితం
పశ్యన్తోఽపి నిరన్తరం సువిమలం మన్యా జగన్మణ్డలే।
లోకం హాసయితుం కిమర్థమనిశం ప్రాకాశ్యమాతన్వతే
మన్దాక్షం విరహయ్య వస్తువిభవం మన్దారచన్ద్రాదయః॥ 66

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| తవ | = | నీయొక్క |
| స్మితద్యుతి... లీలాయితమ్ | = | చిఱునవ్వు కాంతినదియొక్క సామర్థ్యాచరణమును; |
| నిరన్తరమ్ | = | ఎల్లప్పుడు; |
| పశ్యన్తః+అపి | = | చూచుచున్నాను; |
| జగన్మణ్డలే | = | జగత్తుయొక్క మండలమున; |
| సువిమలమ్మన్యా | = | మిక్కిలి నిర్మలులమని తలచుకొను; |
| మన్దారచన్ద్రాదయః | = | మన్దారము, చన్ద్రుడు మొదలగునవి; |
| మన్దాక్షమ్ | = | సిగ్గును; |
| విరహయ్య | = | విడచి; |
| లోకమ్ | = | లోకమును; |
| హాసయితుమ్ | = | నవ్వించుటకు; |
| అనిశమ్ | = | ఎల్లప్పుడు; |
| వస్తువిభవమ్ | = | వస్తువులయొక్క వైభవమును; |
| ప్రాకాశ్యమ్ | = | బయట పెట్టుటకు; |
| కిమర్థమ్ | = | ఎందుకు; |
| ఆతన్వతే | = | చేయుచున్నది? |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ చిఱునవ్వు ప్రవాహముయొక్క విలాసమును చూచుచున్నాను. మన్దారచన్ద్రాదులు ఈ లోకమున తామే నిర్మలులమని తలచువారై సిగ్గు విడచి ఈ లోకమును నవ్వించుటకు ఈ లోకములోని వస్తువుల నెందుకు ప్రకాశింపఁజేయుచున్నారు?

**వివరణము :-**

మన్దారచన్ద్రాదులకు లేని సువిమలమ్మన్యత్వము సిగ్గువిడచుట వాని కున్నట్లు చెప్పుటచే నిట నతిశయోక్త్యలంకారము కలదు. మన్దారచన్ద్రాదులకు లోకమున పరిహాసము తప్ప మరొక లాభము లేదని చెప్పుటచే ప్రకాశమున నవి అమ్మవారి స్మితద్యుతికి సాటిరావని వ్యంగ్యమగుచున్నది.



**అవ:–** పై శ్లోకమున అమ్మవారి స్మితమునకు మన్దార చన్ద్రాద్యాధిక్యము చెప్పబడినది. ఈ శ్లోకమున క్షీరాబ్ధికంటెను అమ్మవారి మన్దహాసమధికమని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ క్షీరాబ్ధేరపి శైలరాజతనయే త్వన్మన్దహాసస్య చ**
**శ్రీకామాక్షి! వలక్షమోదయనిధేః కిఞ్చిద్భిదాం బ్రూమహే।**
**ఏకస్మై పురుషాయ దేవి! స దదౌ లక్ష్మీం కదాచిత్పురా**
**సర్వేభ్యోఽపి దదాత్యసౌ తు సతతం లక్ష్మీం చ వాగీశ్వరీమ్॥ 67**

**ప్రతిపదార్థము:–**

| | |
|---|---|
| శైలరాజతనయే | = పర్వతరాజపుత్రివైన; |
| శ్రీ కామాక్షి! దేవి! | = ఓ కామాక్షీ దేవీ! |
| వలక్షమోదయనిధేః | = తెలుపుదనము పుట్టునిధియైన; |
| క్షీరాబ్ధేః+అపి | = పాలసముద్రమునకును; |
| త్వన్మన్దహాసస్య చ | = నీ చిఱునవ్వునకును; |
| కించిద్భిదామ్ | = కొంచెము భేదమును; |
| బ్రూమహే | = చెప్పుచున్నాము; |
| సః | = ఆ పాలసముద్రము; |
| పురా | = పూర్వము; |
| కదాచిత్ | = ఒకప్పుడు; |
| లక్ష్మీమ్ | = లక్ష్మిని; |
| ఏకస్మై | = ఒక; |
| పురుషాయ | = పురుషుని కొఱకు; |
| దదౌ | = ఇచ్చెనట; |
| అసౌ | = ఈ మన్దహాసము; |
| సర్వేభ్యః+అపి | = అందరికి కూడ; |
| లక్ష్మీమ్ | = లక్ష్మిని; |
| వాగీశ్వరీమ్ చ | = సరస్వతినికూడ; |
| దదాతి | = ఇచ్చుచున్నది. |

**తాత్పర్యము:–**

అమ్మా! పర్వతరాజపుత్రీ దేవీ! పాలసముద్రము, నీ మన్దహాసమును తెల్లనివే. కాని కొంచెము భేదమును కూడ చెప్పుచున్నాము. ఆ పాలసముద్రము ఎప్పుడో పూర్వము ఒక పురుషునికి లక్ష్మి నిచ్చెనట. నీ మన్దహాసము మాత్రమెల్లప్పుడు లక్ష్మితోపాటు సరస్వతిని అందఱకును ఇచ్చుచున్నది.

**వివరణము :-**

ఉపమానోపమేయములైన క్షీరాబ్ధి మన్దహాసములకు ఒక పురుషునికి లక్ష్మినిచ్చుట. అందరకు లక్ష్మితో పాటు సరస్వతిని కూడ ఇచ్చుట మన్దహాసమునందున్నదే కాని పాలసముద్రమునందు లేదు. ఈ విశేషము చెప్పఁబడుటచే నిట వ్యతిరేకాలంకారమున్నది. పాలసముద్రము విష్ణుదేవునకు లక్ష్మినిచ్చుట పురాణకథ కావున విశ్వసింపదగినదే కాని సాక్ష్యము మాత్రము నేడు లభింపదు. అమ్మవారి మన్దహాసము మాత్రము అందఱకుఁ (తనను సేవించిన వారికి) లక్ష్మిని సరస్వతిని రెండింటినిచ్చుట సర్వ ప్రత్యక్షము. ఒకటి ప్రత్యక్ష ప్రమాణలబ్ధార్థము. మరొకటి ఐతిహ్యప్రమాణలబ్ధము. ఐతిహ్యప్రమాణము నందఱంగీకరింపరు. ప్రత్యక్షము నందఱంగీకరించెదరు. కావున అమ్మవారి మందస్మితము (యొక్క) లక్ష్మీసరస్వతుల నందరకిప్పటికి ఇచ్చుచుండుట ప్రత్యక్ష ప్రమాణసిద్ధార్థము. కావున ఐతిహ్యప్రమాణలబ్ధమైన క్షీరాబ్ధి లక్ష్మిని విష్ణుదేవునకిచ్చుట అను దానికన్న విశ్వసనీయము. ఈ యర్థమంతయు **'దదౌ'** అను క్రియలోని అప్రత్యక్షార్థ భూతకాలవాది లిట్ ప్రయోగమునను **సతతమ్ దదాతి** అను పదముల ప్రయోగముచేతను వ్యక్తమగుచున్నది. చార్వాకులు ప్రత్యక్షము నొక్కదానినే ప్రమాణమందురు. వారికనుమానాది ప్రమాణములు ప్రమాణములు కావు. వైశేషికులు, నైయాయికులు, తార్కికులు, ప్రత్యక్షము అనుమానమును ఈ రెండింటిని బౌద్ధులవలె ప్రమాణములుగా నంగీకరించెదరు. బౌద్ధులంగీకరించని ఆగమమును (వేదమును) అనగా శబ్దప్రమాణమును కూడా అంగీకరించెదరు. బౌద్ధులంగీకరించని ఉపమానమును కూడా ప్రమాణముగా అంగీకరించెదరు. జైనులు ప్రత్యక్షము, అనుమానము, ఆగమము (జినునివాక్యమును) అను మూడింటిని ప్రమాణాలుగా నంగీకరించెదరు. మీమాంసకులు, వేదాంతులు నైయాయికవైశేషికులంగీకరించిన అర్థాపత్తిని, అనుపలబ్ధిని ప్రమాణములుగా నంగీకరించెదరు. వీరికి ప్రమాణములాఱైనవి. పౌరాణికులు, సంభవైతిహ్యముల రెంటిని ప్రమాణములుగా నంగీకరించి అష్ట ప్రమాణవాదులైనారు.



**అవ:-** పై శ్లోకమున సర్వులకు లక్ష్మీసరస్వతీ దానముచే కలిగిన ధన్యత్వం అమ్మవారి మన్దహాసమున జెప్పఁబడినది. ఈ శ్లోకమున నా మన్దహాసము అను చన్ద్రిక నాస్వాదించు చకోరములో యనఁదగిన కాంచీపురవాసి యోగుల ధన్యత్వము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ శ్రీకాఞ్చీపురరత్నదీపకలికే! తాన్యేవ విశ్వాన్తరే**
**చాకోరాణి చరాచరేశ్వరి పరం ధన్యాని మన్యామహే।**
**కమ్పాతీరకుటుమ్బచంక్రమకలాచుఞ్చూని చఞ్చూపుటై-**
**ర్నిత్యం యాని తవ స్మితేన్దుమహసామాస్వాదమాతన్వతే॥ 68**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| చరాచరేశ్వరి! | = చరాచరములకు ఈశ్వరివైన; |
| శ్రీకాంచీపురరత్నదీపకలికే | = శ్రీ కాంచీనగరమునకు రత్నదీపకలికవైన కామాక్షీదేవీ; |
| యాని | = ఏవి (చకోరములు); |
| కమ్పాతీరకుటుమ్బచంక్రమకలా చుంచూని | = కమ్పానదీతీరమునందు కుటుంబములలో తిరుగు కల యందు సమర్థములై; |
| చంచూపుటైః | = ముక్కు పుటములతో; |
| నిత్యమ్ | = ఎల్లప్పుడు; |
| తవ | = నీ; |
| స్మితేన్దుమహసామ్ | = చిఱునవ్వు వెన్నెలలయొక్క; |
| ఆస్వాదమ్ | = ఆస్వాదమును; |
| ఆతన్వతే | = చేయుచున్నవో; |
| తాని | = ఆ; |
| చాకోరాణి ఏవ | = చకోరసమూహములే; |
| విశ్వాన్తరే | = ప్రపంచములోపల; |
| పరమ్ | = మిక్కిలి; |
| ధన్యాని | = ధన్యములైనవిగా; |
| మన్యామహే | = తలచుచున్నాము. |

**తాత్పర్యము:-**

అమ్మా! కామాక్షీదేవీ! కమ్పాతీరకుటుంబములలో తిరుగుచు నీ చిఱునవ్వు వెన్నెలల నాస్వాదించుచున్న వే చకోరములో విశ్వము నందాచకోరములే ధన్యములని భావించుచున్నాము.

**వివరణము :-**

అమ్మవారు శ్రీ కాంచీపురదీపరత్నకలిక యైనను ఆమె చరాచరేశ్వరి కాంచీపురమును వెలిగించుచునే చరాచరముల నేలుచున్నది. కాంచీపురము కమ్పానదీ తీరమునందున్నట్టి పట్టణము. ఆ నగరమున నివసించు వారు ధన్యాత్ములు. ఏలననగా వారి కమ్మవారి చిఱునవ్వు వెన్నెల నాస్వాదించు సౌభాగ్యమున్నది. చన్ద్రకాన్తి నాస్వాదించు చకోరములెన్ని విశ్వమున లేవు? వాని కమ్మవారి చిఱునవ్వు వెన్నెల నాస్వాదించు భాగ్యము లేదు. కాని ఆ చకోరములకును చన్ద్రుడు ప్రభువు కాడు. చరాచరేశ్వరి కామాక్షీ దేవియే కదా! అమ్మవారి చిఱునవ్వు వెన్నెల అంతరంగమున యోగులకు లభించునట్టిది. వారి యంతరంగమే శ్రీ కాంచీపురము, వారి యన్తరంగములందు చిద్దీపకలికయై సాక్షాత్కరించు

నమ్మవారి చిఱునవ్వు ఇతరులకు దుర్భరము. అయినను శ్రీ కాంచీపురము అమ్మవారి దివ్యక్షేత్రము కావున అక్కడ నుండు వారు ధన్యులే. అది క్షేత్రమహత్త్వమున తద్వాసులకు లభించిన ధన్యత్వము. పూర్వజన్మపుణ్యము లేనిదే యీ దివ్యక్షేత్రమున జన్మ దుర్లభము. ఈ యర్థమంతయు **శ్రీ కాంచీపుర దీపరత్నకలికే, చరాచరేశ్వరి** యను అమ్మవారి సంబోధనల వల్ల స్ఫురించును.



**అవ:-** పై శ్లోకమున కాంచీపుర చకోరాస్వాద్యములైన అమ్మవారి స్మితేన్దు మహస్సు వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున విరుద్ధ ధర్మాశ్రయమైన అమ్మవారి **స్మితరోచిస్సముల్లాసము** వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ శైత్యప్రక్రమమాశ్రితోఽపి నమతాం జాడ్యప్రథాం ధూనయ-**
**న్రాగవ్యఞ్జనపేశలోఽపి గిరిశే వైమల్యముల్లాసయన్।**
**లీలాలాపపురస్సరోఽపి సతతం వాచంయమాన్ ప్రీణయ-**
**న్కామాక్షి! స్మితరోచిషాం తవ సముల్లాసః కథం వర్ణ్యతే॥ 69**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి | = ఓ కామాక్షీదేవీ!; |
| శైత్యప్రక్రమమ్ | = శైత్యారమ్భమును; |
| ఆశ్రితః+అపి | = ఆశ్రయించిన దైనను; |
| నమతామ్ | = నమస్కరించువారియొక్క; |
| జాడ్యప్రథామ్ | = జాడ్యస్థితిని; |
| ధూనయన్ | = తొలగించుచున్న; |
| గిరిశే | = శివుని యందు; |
| రాగవ్యంజనపేశలః+అపి | = రాగమును వ్యంజింపఁజేయు సౌకుమార్యము గలదైనను; |
| వైమల్యమ్ | = నిర్మలత్వమును; |
| ఉల్లాసయన్ | = ప్రకటించుచున్న; |
| లీలాలాపపురస్సరః+అపి | = విలాసప్రసంగములలో ముందు నడచునదైనను; |
| సతతమ్ | = ఎల్లప్పుడు; |
| వాచంయమాన్ | = మౌనులను; |
| ప్రీణయన్ | = సంతోషింపఁజేయుచున్న; |
| తవ | = నీయొక్క; |

స్మితరోచిషామ్ = చిఱునవ్వు కాంతులయొక్క;
సముల్లాసః = వికాసము;
కథమ్ = ఎట్లు;
వర్ణ్యతే = వర్ణింపఁబడును?

**తాత్పర్యము:-**

అమ్మవారి చిఱునవ్వు చల్లనిదైనను నమస్కరించువారి జాడ్యము నపహరించును. శివునియందు రాగమును వ్యంజింపఁజేయునదైనను స్వచ్ఛతను వెల్లడించుచునే యుండును. విలాసప్రసంగములలో దిట్టయైనను మౌనులను సంతోషింపఁజేయును. ఇట్లు విరుద్ధదర్శనముల కాశ్రయమైన నీ చిఱునవ్వు కాంతుల నెట్లు వర్ణింపవచ్చును?

**వివరణము :-**

శైత్యమనగా చల్లదనము అమ్మవారి మన్దహాసమున నున్నది. శైత్యము జలముయొక్క (జడముయొక్క) (ల, డలకు భేదము లేదు.) ధర్మము. అది జాడ్యమును పెంచునే కాని వారించదు. అమ్మవారి స్మితము జాడ్యము నపహరించును. అమ్మవారి చిఱునవ్వు శివుని యందు రాగమును వ్యంజింపఁజేయునది. ఐనను అది నిర్మలమే. విలాసప్రసంగముల నొనరించున దైనను మౌనులను సంతోషింపఁజేయునని విరుద్ధధర్మములైన శైత్య, జాడ్య వారణములకు, రాగనైర్మల్యములకు లీలాలాపమౌనులకు ఆశ్రయమైనట్లు అమ్మవారి చిఱునవ్వు వర్ణింపఁబడుటచే నీ శ్లోకమున మూడు విరోధాభాసాలంకారములు **అపి** శబ్దములచే వాచ్యములైయున్నవి. ఇవి అమ్మవారి చిఱునవ్వెట్లు వర్ణింపఁబడునని చెప్పుటచే అమ్మవారి చిఱునవ్వుయొక్క అచింత్య మహిమను వ్యక్తమొనర్చుచున్నవి.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి స్మితమునందు శివునిపై రాగమును వ్యంజింపఁజేయుట చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి చిఱునవ్వునందు శివ సమ్మోహత్వము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ శ్రోణీచఞ్చలమేఖలాముఖరితం లీలాగతం మన్థరం**
**భ్రూవల్లీచలనం కటాక్షవలనం మన్దాక్షవీక్షాచణమ్।**
**యద్వైదగ్ధ్యముఖేన మన్మథరిపుం సమ్మోహయత్యఞ్జసా**
**శ్రీకామాక్షి! తవ స్మితాయ సతతం తస్మై నమస్కుర్మహే॥ 70**

**ప్రతిపదార్థము:-**

శ్రీ కామాక్షి! = ఓ కామాక్షీ దేవీ!
శ్రోణీచంచలమేఖలాముఖరితమ్ = పిఱుదులపైగల ఒడ్డాణపు గజ్జెల చప్పుడు;

| | | |
|---|---|---|
| మన్దరమ్ | = | మెల్లని; |
| లీలాగతమ్ | = | విలాసగమనము; |
| భ్రూవల్లీచలనమ్ | = | కనుబొమల కదలిక; |
| మన్దాక్షవీక్షాచణమ్ | = | సిగ్గుతో కూడియు చూచుటయందు నేర్పరియైన; |
| కటాక్షవలనమ్ | = | కడగంటి చలనమును; |
| యద్వైదగ్ధ్యముఖేన | = | దేని (చిఱునవ్వు) యొక్క నైపుణ్యము ద్వారమున; |
| మన్మథరిపుమ్ | = | శివుని; |
| అంజసా | = | వెంటనే; |
| సమ్మోహయతి | = | సమ్మోహింపఁజేయునో; |
| తస్మై | = | ఆ; |
| తవ | = | నీయొక్క; |
| స్మితాయ | = | చిఱునవ్వు కొఱకు; |
| సతతమ్ | = | ఎల్లప్పుడు; |
| నమస్కుర్మహే | = | నమస్కరించుచున్నాము. |

**తాత్పర్యము:-**

అమ్మవారి పిఱుదులపై వ్రేలాడు ఒడ్డాణపు గజ్జెల మ్రోత, విలాసపు మన్దగమనము, కనుబొమ్మల కదలిక, సిగ్గుతోడి కడగంటి చూపు, ఇవి యన్నియు చిఱునవ్వుయొక్క సామర్థ్యము ద్వారముననే శివుని సమ్మోహింపజేయును. అట్టి అమ్మవారి చిఱునవ్వున కెల్లప్పుడు నమస్కరించుచున్నాము.

**వివరణము :-**

పిఱుదులపై వ్రేలాడు ఒడ్డాణపు గజ్జెల మ్రోత, విలాస మన్దగమనము, కనుబొమ్మల కదలిక, సిగ్గుతోడి కడగంటి చూపు ఇవేవియు స్వయముగా శివుని మోహింపఁ జేయజాలవు, అమ్మవారి చిఱునవ్వుయొక్క సామర్థ్యము ప్రసరించిన పిమ్మటనే ఇవి యన్నియు మోహింపఁచేయును. ఈ మోహింపఁజేయుటలోని గొప్పతనమంతయు అమ్మవారి స్మితమునకే ముందుగా చెందును. ఆ పిమ్మటనే తక్కినవాని స్థానము అని ఈ శ్లోకము వ్యక్తమొనర్చుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మేఖలాముఖరితమన్దగమనభ్రూవల్లీచలన కటాక్ష చలనముల కన్న మన్దహాసమునకే మన్మథరిపుజయమున ప్రాముఖ్యము చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారి మన్దహసితసార్వభౌమత్వము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ శ్రీకామాక్షి! మనోజ్ఞమన్దహసితజ్యోతిష్ప్రరోహే తవ**
**స్ఫీతశ్వేతిమసార్వభౌమసరణిప్రాగల్భ్యమభ్యేయుషి।**

చన్ద్రోఽయం యువరాజతాం కలయతే చేటీధురం చన్ద్రికా
గఙ్గా సా చ సుధాఝురీ సహచరీసాధర్మ్యమాలమ్బతే॥ 71

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| శ్రీకామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| తవ | = | నీయొక్క; |
| మనోజ్ఞమన్దహసితజ్యోతిష్ప్రరోహే | = | అందమైన చిఱునవ్వు కాంతుల యుదయము; |
| స్ఫీతశ్వేతిమసార్వభౌమసరణి ప్రాగల్భ్యమ్ | = | దట్టమైన తెల్లదనమున సార్వభౌమ మార్గగతి ప్రగల్భతను; |
| అభ్యేయుషి | = | పొందగా; |
| అయమ్ | = | ఈ; |
| చన్ద్రః | = | చన్ద్రుడు; |
| యువరాజతామ్ | = | యౌవరాజ్యమును; |
| కలయతే | = | పొందుచున్నాడు; |
| చన్ద్రికా | = | వెన్నెల; |
| చేటీధురమ్ | = | దాసీభావమును; |
| సుధాఝురీ చ | = | అమృతనదియగు; |
| సా | = | ఆ; |
| గంగా చ | = | గంగయు; |
| సహచరీసాధర్మ్యమ్ | = | సఖీసమానధర్మమును; |
| ఆలంబతే | = | పొందుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి మన్దస్మిత జ్యోతిస్సు తెలుపుదనపుచక్రవర్తిత్వమును పొందగా చన్ద్రుడు యువరాజగుచున్నాడు. వెన్నెల దాసీభావము పొందుచున్నది. అమృతమును ప్రవహించు గంగానది స్నేహితురాలగుచున్నది.

**వివరణము :-**

మన్దస్మితమునందు సార్వభౌమత్వము, చన్ద్రునియందు యువ రాజత్వమును, చన్ద్రికయందు చేటీభావమును, గంగయందు సఖీత్వమును ఆరోపించుటచే నీ శ్లోకమున పదార్థవృత్తి నిదర్శనాలంకార మేర్పడుచున్నది. మన్దస్మితమున కీ సార్వభౌమత్వము తెలుపుదనమునకు సంబంధించినది కావున తెల్లనిచన్ద్రచన్ద్రికాగంగలకు యువరాజత్వ చేటీత్వ సఖీత్వములను చెప్పుట యుచితముగానున్నది. మన్దస్మితమునకు సార్వభౌమత్వ మున్నప్పుడు మన్దస్మితమునకు పుత్రప్రాయుడైన చన్ద్రునకు యువసార్వభౌమత్వము

రావలసియుండగా యువరాజత్వము మాత్రమే చెప్పబడినది. అమ్మవారి హసితమునకు కోట్ల కొలది చన్ద్రులు పుత్రప్రాయులుగా నున్నారు. కావున మనము చూచు నీ చన్ద్రునకు యువరాజత్వము మాత్రమే కలిగించుచున్నది. ఈ చన్ద్రునకు జ్యేష్ఠ పుత్రత్వము నిశ్చితము కాదు కావున యువరాజత్వము మాత్రమే అమ్మవారి నిర్హేతుకమైన దయవలన (లేక) చన్ద్రుడు అమ్మవారి పంచదశీ విద్యలలో నొకవిధమైన దానికి ద్రష్ట యగుటచే యువరాజత్వము కలిగినది, అని **అయం** శబ్దము తెలుపుచున్నది. చన్ద్రిక కా విధముగా మన్త్రద్రష్టృత లేకపోవుటచే దాసీభావము మాత్రమే కలిగినది. గంగను **సుధాఝరి** యని విశేషించుటచే భూలోకమునకు రాక మునుపు మాత్రమే ఆమెకు సహచరీత్వమని తెలియుచున్నది. 'సా' అని యనుటచే శివుడు నెత్తిన బెట్టుకున్న గంగయని వ్యక్తమగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున వెన్నెల అమ్మవారి చిఱునవ్వునకు దాసీత్వమును పొందినట్టు చెప్పబడినది. ఈ శ్లోకమున అందుకు కారణము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ జ్యోత్స్నా కిం తనుతే ఫలం తనుమతామౌష్ణ్యప్రశాన్తిం వినా**
**త్వన్మన్దస్మితరోచిషా తనుమతాం కామాక్షి! రోచిష్ణునా।**
**సన్తాపోఽపి నివార్యతే నవవచఃప్రాచుర్యమఙ్కూర్యతే**
**సౌన్దర్యం పరిపూర్యతే జగతి సా కీర్తిశ్చ సఞ్చార్యతే॥ 72**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీ దేవీ! |
| జ్యోత్స్నా | = వెన్నెల; |
| తనుమతామ్ | = ప్రాణులకు; |
| ఔష్ణ్యప్రశాంతిం వినా | = వేడిని తగ్గించుట కాక; |
| కిమ్ | = ఏ; |
| ఫలమ్ | = ఫలమును; |
| తనుతే | = కలిగించుచున్నది; |
| రోచిష్ణునా | = ప్రకాశించు; |
| త్వన్మన్దస్మితరోచిషా | = నీ చిఱునవ్వు కాంతిచేత; |
| తనుమతామ్ | = ప్రాణులయొక్క ; |
| సంతాపః+అపి | = సన్తాపముకూడ; |
| నివార్యతే | = తొలగింపఁబడుచున్నది; |
| నవవచఃప్రాచుర్యమ్ | = క్రొత్తమాటల ఆధిక్యము; |
| అంకూర్యతే | = అంకురింపఁజేయబడును; |
| సౌన్దర్యమ్ | = అందము; |

| | | |
|---|---|---|
| పరిపూర్యతే | = | నింపఁబడును; |
| జగతి | = | లోకమున; |
| సా | = | ఆ; |
| కీర్తిః+చ | = | కీర్తియు; |
| సంచార్యతే | = | సంచరింపఁజేయఁబడును. |

**తాత్పర్యము:-**

ప్రాణులకు వేడిని తొలగించుట తప్ప వెన్నెల వేరొక ఫలమేమి కలిగింపఁ గలదు. ప్రకాశించు అమ్మవారి చిఱునవ్వు కాంతి ప్రాణుల సంతాప మపహరించును, క్రొత్తమాటల ఆధిక్యము నంకురింపఁజేయును, అందమును నింపును, కీర్తిని లోకమున విస్తరింపఁజేయును.

**వివరణము :-**

ప్రథమ ద్వితీయ పాదాంతములలో **'నా'** అని ఉండుట వలన తృతీయ చతుర్థ పాదాంతములలో **'ర్యతే'** అని ఉండుట వలన పాదాంతానుప్రాసము కలదు. వెన్నెల వేడిని తగ్గించును. అమ్మవారి మన్దస్మితరోచిస్సు కూడ వెన్నెల చేయుపనిని చేయగలదనుటలో సంశయము లేదు అని **"సన్తాపోఽపి"** అను చోట గల **అపి** శబ్దము వ్యంజింపఁజేయుచున్నది. ఇంతే కాక ఆ **అపి** శబ్దము వెన్నెల తొలగింపఁజాలని మానసికసన్తాపమునుకూడ అమ్మవారి మన్దస్మిత రోచిస్సు తొలగింపగలదని వ్యంజింపఁ జేయుచున్నది. వెన్నెల చేయలేని క్రొత్త మాటలఁగూర్చగల నేర్పు (కవిత్వము) నమ్మవారి మన్దస్మితరోచిస్సు కలిగించును. జగమునందంతట సౌన్దర్యమును నింపును. వెన్నెల కీర్తిని గూడ సేవించు వారలకు కలిగింపజాలదు. అమ్మవారి మందస్మితరోచిస్సు సేవించువారి కీర్తిని లోకమునం దంతట విస్తరింపఁజేయును. **'సా కీర్తి'** అను చోటగల **'సా'** అను శబ్దము అన్యదుర్లభమైన అసాధారణకీర్తిని కలిగించునని వ్యంజింపఁజేయును. వెన్నెల ఉపమానమే కాని దానికి గుణాధిక్యము లేదు. అది ఔష్ణ్య ప్రశాంతిని మాత్రమే కలిగించును. ఆ యౌష్ణ్య ప్రశాంతి గ్రీష్మకాలముననే వాంఛనీయము, శీతకాలమునందు వాంఛనీయము కాదు. అమ్మవారి మన్దస్మిత రోచిస్సు సార్వకాలికమైన మనస్సున పుట్టుచుండు సంతాపమును వారించుటచే నుపమేయమైన అమ్మవారి మన్దస్మితరోచిస్సు నందు గుణాధిక్యము చెప్పఁబడుటచే నీ శ్లోకమున ప్రతీపాలంకారస్ఫూర్తి యున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వుతో వెన్నెల సాటి కాదని చెప్పఁబడినది. దానికి కారణ మీ శ్లోకమున చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ వైమల్యం కుముదశ్రియాం హిమరుచః కాన్త్యైవ సన్ధుక్ష్యతే**
**జ్యోత్స్నారోచిరపి ప్రదోషసమయం ప్రాప్యైవ సమ్పద్యతే।**

స్వచ్ఛత్వం నవమౌక్తికస్య పరమం సంస్కారతో దృశ్యతే
కామాక్ష్యాః స్మితదీధితేర్విశదిమా నైసర్గికో భాసతే॥ 73

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| కుముదశ్రియామ్ | = | తెల్లకలువల కాంతులయొక్క; |
| వైమల్యమ్ | = | స్వచ్ఛత; |
| హిమరుచః | = | చన్ద్రునియొక్క; |
| కాంత్యైవ | = | కాంతిచేతనే; |
| సంధుక్ష్యతే | = | ఎగదోయఁబడును; |
| జ్యోత్స్నారోచిః+అపి | = | వెన్నెల కాంతి కూడ; |
| ప్రదోషసమయమ్ | = | ప్రదోషసమయమును; |
| ప్రాప్యైవ | = | పొందియే; |
| సమ్పద్యతే | = | వెల్లివిరియును; |
| పరమమ్ | = | గొప్పనైన; |
| నవమౌక్తికస్య | = | కొత్తముత్తెముయొక్క; |
| స్వచ్ఛత్వమ్ | = | స్వచ్ఛత; |
| సంస్కారతః | = | సంస్కారము వలన; |
| దృశ్యతే | = | కనఁబడును; |
| కామాక్ష్యాః | = | కామాక్షీదేవియొక్క; |
| స్మితదీధితేః | = | చిఱునవ్వు కిరణము (కాంతి)యొక్క స్వచ్ఛత మాత్రము; |
| నైసర్గికః భాసతే | = | సహజసిద్ధముగాఁప్రకాశించుచున్నది. |

**తాత్పర్యము:-**

తెల్లకలువల కాంతుల స్వచ్ఛత్వము చన్ద్రునికాంతితోడనే యెగఁదోయఁబడును. వెన్నెలకాంతికూడ ప్రదోషసమయమును పొందియే వెల్లివిరియును. కొత్తముత్తెముయొక్క పరమస్వచ్ఛత సంస్కారము వలననే కనఁబడును. ఒక్క అమ్మవారి చిఱునవ్వు కిరణము (కాంతి)యొక్క స్వచ్ఛత మాత్రము సహజ సిద్ధముగాఁప్రకాశించుచున్నది.

**వివరణము :-**

వెన్నెల వెల్లివిరియనిదే కలువలు వికసించవు. కలువలు వికసించకున్న వాని కాంతి తక్కువగానే యుండును. అనగా కలువల కాంతులు వెల్లివిరియుట, చన్ద్రకాన్తిపై నాధారపడియున్నది. అట్లే వెన్నెల వెల్లివిరియవలెనన్న రాత్రి ప్రదోషక సమయము రావలసినదే. ప్రదోషము రాకున్న పగలు చన్ద్రుని కాంతి భాసించదు కదా. అదే విధముగా

కొత్త ముత్తెము సంస్కారముతోడనే దానిలోని స్వచ్ఛత వెల్లివిరియును. కొత్తముత్తెము సంస్కరింపబడక ముందు దాని స్వచ్ఛత కానరాదు. కామాక్షీదేవియొక్క చిఱునవ్వుకాంతి యొక్క స్వచ్ఛత మాత్రము సహజసిద్ధమై ప్రకాశించును. కుముదకాంతుల వెన్నెల కొత్తముత్తెముల పరాధీన ప్రకాశము అను తుల్యధర్మముయొక్క యోగముండుటచే తుల్యయోగితాలంకారస్ఫూర్తి యున్నది. ఉపమానములకువలె పరాధీనప్రకాశము లేకపోవుట స్ఫురించుటచే వ్యతిరేకాలంకారస్ఫూర్తి కలదు. ప్రపంచమునందలి అన్ని వస్తువులు పరాధీన ప్రకాశములు. అమ్మవారి చిఱునవ్వు స్వయంప్రకాశము. అమ్మవారి చిఱునవ్వు స్వచ్ఛతకు స్వయంసత్త యున్నది. లోకమునందలి ఇతర వస్తువుల స్వచ్ఛత సత్తకు అమ్మవారి చిఱునవ్వు స్వచ్ఛతయొక్క సత్తయే మూలము అని స్ఫురించుటచే నీ శ్లోకమున వస్తుధ్వని యున్నది.



**అవ:-** పై శ్లోకమున కుముద శ్రీజ్యోత్స్నానవమౌక్తికముల స్వచ్ఛత పరాధీనమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున చన్ద్రమౌక్తికమణు లమ్మవారి చిఱునవ్వుతో తులతూగఁజాల మన్న భయమున దాగియుండుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ప్రాకాశ్యమ్ పరమేశ్వరప్రణయిని! త్వన్మన్దహాసశ్రియః**
**శ్రీకామాక్షి! మమ క్షిణోతు మమతావైచక్షణీమక్షయామ్।**
**యద్భీత్యేవ నిలీయతే హిమకరో మేఘోదరే శుక్తికా-**
**గర్భే మౌక్తికమణ్డలీ చ సరసీమధ్యే మృణాలీ చ సా॥ 74**

**ప్రతిపదార్థము:-**

పరమేశ్వరప్రణయిని = పరమేశ్వరుని ప్రియురాలవైన
శ్రీ కామాక్షి! = ఓ కామాక్షీ దేవీ!
యద్‌భీత్యా+ఇవ = దేని (మన్దహాస శ్రీ ప్రాకాశ్యము) భయముతోడనోయన్నట్లు;
హిమకరః = చన్ద్రుడు;
మేఘోదరే = మేఘముయొక్క పొట్టలో;
మౌక్తికమణ్డలీ = ముత్తెముల సమూహము;
శుక్తికా గర్భే = ముత్తెపుచిప్పయొక్క పొట్టలో ;
సా = ఆ;
మృణాలీ చ = తామరతూడును;
సరసీమధ్యే = సరస్సుయొక్క నడుమ;
నిలీయతే = దాగుకొనుచున్నదో;
తత్ = ఆ;

| | |
|---|---|
| మన్దహాసశ్రియః | = మన్దహాసకాంతియొక్క; |
| ప్రాకాశ్యమ్ | = ప్రకటనము; |
| మమ | = నాయొక్క; |
| అక్షయామ్ | = క్షయములేని; |
| మమతావైచక్షణీమ్ | = మమకారముయొక్క పాండిత్యమును; |
| క్షిణోతు | = క్షీణింపఁజేయుగాక! |

**తాత్పర్యము:-**

అమ్మవారి చిఱునవ్వు కాంతికి సరితూగజాలమన్న భయమున కాబోలు చన్ద్రుడు మేఘముయొక్క పొట్టలో, ముత్తెము చిప్పయొక్క పొట్టలో, తామరతూడు సరస్సుయొక్క మధ్యమున దాగుకొనుచున్నది. అట్టి అమ్మవారి చిఱునవ్వు కాంతియొక్క ప్రకటనము క్షయములేని నా మమకారపాండిత్యమును క్షీణింపఁజేయుగాక!

**వివరణము :-**

చన్ద్రుడు మేఘోదరమున, ముత్తెము ముత్తెపుచిప్పయొక్క పొట్టలో, తామరతూడు సరస్సుయొక్క మధ్యమున నుండుటకు హేతువు కాని అమ్మవారి చిఱునవ్వుకాంతి ప్రకటనముయొక్క భీతిని హేతువుగా చెప్పుటచే నీ శ్లోకమున హేతూత్ప్రేక్షాలంకారము ఇవ శబ్దముచే వాచ్యమై యున్నది. ఇతర విధముల మమకారము క్షీణించదు కావున మమకారవైచక్షణి అక్షయమని పేర్కొనఁబడినది. అమ్మవారి చిఱునవ్వుకాంతియొక్క ప్రకటనముచేతనే అది క్షీణించును. కావున సర్వవిధముల నది అక్షయము కాదని గమనింపవలెను.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వు కొన్నింటిని భయము కలిగించునవి చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ చిఱునవ్వుయొక్క వాత్సల్య ప్రేమకరణులు వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ హేరమ్బే చ గుహే చ హర్షభరితం వాత్సల్యమఙ్కూరయ-**
**న్మారద్రోహిణి పూరుషే సహభువం ప్రేమాఙ్కురం వ్యఞ్జయత్।**
**అనమ్రేషు జనేషు పూర్ణకరుణావైదగ్ధ్యముత్తాలయ-**
**న్కామాక్షి! స్మితమఞ్జరీ తవ కథంకారం మయా కథ్యతే॥ 75**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీ దేవీ! |
| హేరమ్బే | = వినాయకునియందును; |
| గుహే చ | = కుమారస్వామియందును; |
| హర్షభరితమ్ | = సంతోషముతో నిండిన; |

| | | |
|---|---|---|
| వాత్సల్యమ్ | = | వాత్సల్యమును; |
| అంకూరయన్ | = | కలిగించుచు; |
| మారద్రోహిణి | = | మన్మథునికి శత్రువైన; |
| పూరుషే చ | = | పురుషుని (శివుని) యందును; |
| సహభువమ్ | = | సహజమైన; |
| ప్రేమాంకురమ్ | = | ప్రేమమొలకను; |
| వ్యంజయత్ | = | స్ఫురింపఁజేయును; |
| ఆనమ్రేషు | = | వంగియున్న; |
| జనేషు | = | జనులయందు; |
| పూర్ణకరుణావైదగ్ధ్యమ్ | = | పూర్ణకరుణానైపుణ్యమును; |
| ఉత్తాలయన్ | = | కలిగించు; |
| తవ | = | నీయొక్క |
| స్మితమంజరీ | = | చిఱునవ్వుయొక్క అందము; |
| మయా | = | నాచేత; |
| కథంకారమ్ | = | ఎట్లు; |
| కథ్యతే | = | చెప్పబడును. |

**తాత్పర్యము:-**

వినాయకునియందు, కుమారస్వామియందును సంతోషముతో నిండిన వాత్సల్యమును, శివునియందు సహజప్రేమను, నమస్కరించిన జనులయందు సంపూర్ణకరుణానైపుణ్యమును సూచించునట్టి నీ చిఱునవ్వుయొక్క అందమెట్లు చెప్పబడును?

**వివరణము :-**

శివుడనుటకు బదులు **మారద్రోహిణి పూరుషే** అనుట భంగ్యంతరముగా శివుని చెప్పుట కావున పర్యాయోక్త్యలంకార మేర్పడుచున్నది. అమ్మవారికి తన పెంపుడు కుమారులైన వినాయకకుమారస్వాములయెడ వాత్సల్యముండుట సహజము. శివునియందు ప్రేమకూడ సహజమే. ఆ వాత్సల్యము ఆ ప్రేమ సహజములే కాని పూర్ణములు కావు. వారు తనకు సంబంధించిన వారు కావున వారికి క్లేశములే లేవు. జీవులు క్లేశతప్తులై నమస్కరించిన వారు కావున వారి యందమ్మవారికి పూర్ణకరుణ కలుగునను వస్తువు వ్యంగ్యమగుటచే నిట వస్తుధ్వని కలదు.



**అవ:-** హేరమ్బగుహులయం దమ్మవారికి వాత్సల్యము నామె మందస్మిత మంకురింపఁ జేయునని పై శ్లోకమున చెప్పఁబడినది. ఈ శ్లోకమున నా స్మితమను నమృతమును వారివంటి నా యందుఁజిలుకవలెనని కవి కోరుచున్నాడు.

శ్లో॥ సంక్రుద్ధద్విజరాజకోఽప్యవిరతం కుర్వన్ద్విజైస్సఙ్గమం
వాణీపద్ధతిదూరగోఽపి సతతం తత్సాహచర్యం వహన్।
అశ్రాన్తం పశుదుర్లభోఽపి కలయన్పత్యౌ పశూనాం రతిం
శ్రీకామాక్షి! తవ స్మితామృతరసస్యన్దో మయి స్యన్దతామ్॥ 76

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| శ్రీ కామాక్షి! | = | ఓ కామాక్షీ దేవీ! |
| సంక్రుద్ధద్విజరాజకః+అపి | = | చన్ద్రుని (బ్రాహ్మణుడు) కోపించువాడైనను; |
| అవిరతమ్ | = | ఎల్లప్పుడు; |
| ద్విజైః | = | దన్తముల (బ్రాహ్మణుల) తో; |
| సంగమమ్ | = | సహవాసమును; |
| కుర్వన్ | = | చేయుచు; |
| వాణీపద్ధతిదూరగః+అపి | = | వాఙ్మార్గమునకు దూరముగా నున్నను; |
| సతతమ్ | = | ఎల్లప్పుడు; |
| తత్సాహచర్యమ్ | = | వాక్కులతోడి సహచరభావమును; |
| వహన్ | = | వహించుచు; |
| పశుదుర్లభః+అపి | = | పశువులకు లభింపరానిదైనను; |
| అశ్రాన్తమ్ | = | ఎల్లప్పుడు; |
| పశూనామ్ పత్యౌ | = | పశువులకు పతియైన శివునియందు; |
| రతిమ్ | = | ప్రేమను; |
| కలయన్ | = | పొందుచు; |
| తవ | = | నీయొక్క |
| స్మితామృతరసస్యన్దః | = | చిఱునవ్వనెడి అమృతరసప్రవాహము; |
| మయి | = | నాయందు; |
| స్యన్దతామ్ | = | స్రవించుగాక! |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీదేవీ! నీ చిఱునవ్వు తనతో పోటీపడుచున్నదని చన్ద్రునిపై కోపించును. అయినను దంతములతో సంగమము చేయును, ఆ చిఱునవ్వు వాక్కులతో వర్ణింపరానంత గొప్పది అయినను వాక్కులతో కూడి చరించును, పశువులకు అనగా అజ్ఞాని జీవులకు లభింపరానిదైనను, పశుపతియందు, అనగా శివునియందు ప్రేమను పొందును. అట్టి నీ చిఱునవ్వు అనెడి అమృతరస ప్రవాహము నా యందు ప్రవహించుగాక.

**వివరణము :-**

అమ్మవారి చిఱునవ్వు ద్విజరాజును అనగా చన్ద్రుని కోపించును. ద్విజములనగా చుక్కలు, వానికి రాజు కావున చన్ద్రుడు ద్విజరాజు అయినను అది దన్తములతో సంగమ మొనరించును. చిఱునవ్వు దన్తముల కాంతులు వెలికి వచ్చునప్పుడే కన్పించును గదా, అంతకుముందు నోటిలో దన్తములు చిఱునవ్వును కలిసియే యుండును. ద్విజరాజును కోపించునదైనను ద్విజులతో సంగమ మొనరించుట అనగా బ్రహ్మణులను కోపించినను వారితో కలసి యుండుట అనునవి విరుద్ధములు. అట్లే వాక్కుల మార్గమునకు దూరమైనను వాక్కులతో కలసి యుండును. చిఱునవ్వు మాటలు వెలికి వచ్చుటకు ముందు నోటితో కలిసియే యుండును. అమ్మవారి చిఱునవ్వు అనెడి అమృతరసము అనుభవైక వేద్యము కావున వాచామగోచరము. మాటల కందనిది. మాటలతో వర్ణింపరాకుండుట మాటలతో కలిసి యుండుట విరుద్ధములు. అట్లే అమ్మవారి చిఱునవ్వు అజ్ఞాని జీవులకు దుర్లభము. అయినను పశువులకు పతియైన శివుని ప్రేమించును. పశువులకు దుర్లభమగుట పశుపతియందు యుండుట విరుద్ధములు. ద్విజరాజ శబ్దమునకు చన్ద్రుడని యర్థము చెప్పుకొన్న విరోధము లేదు. పశుపతికూడ పశువనుటలో విరోధమున్నది. కాని పశుపతి పశువు కాదని పరమేశ్వరుడని చెప్పుకొన్న విరోధము పరిహరింపఁబడును. ఈ విరోధములు అభాసములు మాత్రమే కాని యథార్థములు కావు. కావున ఇట విరోధాభాసాలంకార మున్నది.



**అవ:-** పై శ్లోకమున చన్ద్రునిపై నమ్మవారి చిఱునవ్వు కోపించినట్లు చెప్పఁబడినది. కోపించిన వారు నిందించుట సహజము గదా. ఈ శ్లోకమున సాధారణులకు సహజమైన ఆ నింద నమ్మవారి చిఱునవ్వేలచేయును. పైగా భర్త శిరస్సునఁబెట్టుకొన్నదానిని నిందించుటెట్లని కవి ప్రశ్నించుచున్నాడు.

**శ్లో॥ శ్రీకామాక్షి! మహేశ్వరే నిరుపమప్రేమాఙ్కురప్రక్రమం**
**నిత్యం యః ప్రకటీకరోతి సహజామున్నిద్రయన్మాధురీమ్।**
**తత్తాదృక్తవ మన్దహాసమహిమా మాతః కథం మానితాం**
**తన్మూర్ధ్నా సురనిమ్నగాం చ కలికామిన్దోశ్చ తాం నిన్దతి॥ 77**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| శ్రీ కామాక్షి! | = | ఓ శ్రీ కామాక్షీ దేవీ! |
| మాతః! | = | అమ్మా! |
| యః | = | ఏది (మన్దహాసమహిమ); |
| మహేశ్వరే | = | శివునియందు; |

| | | |
|---|---|---|
| నిరుపమప్రేమాంకురప్రక్రమమ్ | = | సాటిలేని ప్రేమయొక్క ఆవిర్భావారంభమును |
| నిత్యమ్ | = | ఎల్లప్పుడు; |
| సహజామ్ | = | సహజమైన; |
| మాధురీమ్ | = | మాధుర్యమును; |
| ఉన్నిద్రయన్ | = | మేలుకొలుపుచు; |
| ప్రకటీకరోతి | = | ప్రకటించునో; |
| తత్తాదృక్ | = | అటువంటి ఆ; |
| తవ | = | నీయొక్క; |
| మన్దహాసమహిమా | = | చిఱునవ్వుయొక్క గొప్పతనము; |
| తన్మూర్ధ్నా | = | ఆతని (శివుని)యొక్క తలచేత; |
| మానితామ్ | = | గౌరవింపఁబడిన; |
| సురనిమ్నగామ్ చ | = | దేవనదిని గూడ; |
| ఇన్దోః | = | చన్ద్రునియొక్క; |
| కలికామ్ చ | = | కలను; |
| కథమ్ | = | ఎట్లు; |
| నిన్దతి | = | నిన్దించుచున్నది? |

**తాత్పర్యము:-**

అమ్మా! శివునియందు సహజమైన మాధురిని మేలుకొల్పుచు, సాటిలేని ప్రేమను ప్రకటించు నీ మన్దహాసమహిమ ఆ శివుడు తలదాల్చు దేవనదిని చన్ద్రకల నెట్లు నిన్దించుచున్నది?

**వివరణము :-**

ఎంత సురనదియైనను గంగ నిమ్నగ శివుని శిరమునుండి క్రిందుగా క్రిందుగా పోయి చివరకు సముద్రుని లోనికి చేరుచున్నది. కావున నిన్దకు పాత్రురాలే యని నిమ్నగా శబ్దము వ్యంజింపఁజేయుచున్నది. అమ్మవారి మన్దహాసము ఆమె ముఖచన్ద్రబింబముయొక్క సర్వస్వము దాని సమక్షమున చన్ద్రకల శివుడు ధరించిన ధరించు గాక, అది ఆ శిరమున కలామాత్రమై నిక్కుట తగదని **కలికా** శబ్దము వ్యంజింపఁజేయుచున్నది. ఉపమేయమైన మన్దహాసము ఉపమానములైన సురనిమ్నగా చన్ద్రకలలను నిందించుట చెప్పఁబడుటచే నిట ప్రతీపాలంకారమున్నది. ఈ ఉపమానోపమేయభావమునకు హేతువగు సమానధర్మము తెలుపని వేరుగా చెప్పనక్కఱ లేదు. శివుని యందలి అమ్మవారి ప్రేమ నిరుపమము. శివుడు మహేశ్వరుడు కదా! సాధారణేశ్వరులు తమ ఐశ్వర్యమునితరులకు సంక్రమింపఁజేయఁజాలరు, శివుడు జీవులలో అట్టి కోరిక అనగా మహేశ్వరప్రాప్తి

వాంఛయున్న వారికి తన ఈశ్వరత్వమును సంక్రమింపఁజేయగల్గుటయే యాతని ఈశ్వరత్వములోని మహత్వము. కావుననే యా మహేశ్వరుడు నిరుపముడు. ఆతనియం దమ్మవారి ప్రేమయు నిరుపమము. అమ్మవారి స్వాత్మయే మహేశ్వరుడు. స్వాత్మను మించి యొరుల ప్రేమించుట యసంభవము గదా!



అవ:- పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వునకు మాధుర్యము సహజమని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ చిఱునవ్వునకు మాధుర్యముతో పాటు శైత్య వైశద్యములు కూడ సహజములు అని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యే మాధుర్యవిహారమణ్డపభువో యే శైత్యముద్రాకరా**
**యే వైశద్యదశావిశేషసుభగాస్తే మన్దహాసాఙ్కురాః।**
**కామాక్ష్యాస్సహజం గుణత్రయమిదం పర్యాయతః కుర్వతాం**
**వాణీగుమ్ఫనడమ్బరే చ హృదయే కీర్తిప్రరోహే చ మే॥ 78**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| యే | = ఏవి; |
| మాధుర్యవిహారమణ్డపభువః | = మాధుర్యముయొక్క విహారమునకు మణ్డప ప్రదేశములో; |
| యే | = ఏవి; |
| శైత్యముద్రాకరాః | = చల్లదనముయొక్క చిహ్నములకు గనులో; |
| యే | = ఏవి; |
| వైశద్యదశావిశేషసుభగాః | = స్వచ్ఛతయను దశావిశేషముతో సున్దరములో; |
| తే | = ఆ; |
| కామాక్ష్యాః | = కామాక్షీదేవియొక్క; |
| మన్దహాసాంకురాః | = చిఱునవ్వు మొలకలు; |
| ఇదమ్ | = ఈ; |
| సహజమ్ | = సహజమైన; |
| గుణత్రయమ్ | = గుణత్రయమును; |
| పర్యాయతః | = పరుసగా; |
| వాణీగుమ్ఫనడమ్బరే | = మాటల కూర్పును వెల్లడించుటయందు; |
| హృదయే చ | = హృదయమునందును; |
| కీర్తిప్రరోహే చ | = కీర్తిని పెంచుట యందును; |
| కుర్వతామ్ | = చేయుగాక! |

**తాత్పర్యము:-**

కామాక్షీదేవియొక్క మన్దహాసాంకురములు మాధుర్యగుణమునకు విహారమణ్టప ప్రదేశములు, శైత్యగుణమును ముద్రించునట్టివి, వైశద్య గుణముయొక్క విశేషస్థితిలో అందమైనట్టివి. ఆ సహజమాధుర్య శైత్యవైశద్య గుణములు మూడింటిలో మాధుర్యగుణము నా మాటలలో, శైత్యము నా హృదయములో, వైశద్యము నా కీర్తిలో ప్రకాశించుగాక.

**వివరణము :-**

అమ్మవారి మన్దహాసాంకురములు పర్యాయతః (క్రమముగా) మాధుర్య శైత్య వైశద్య గుణముల మూడింటిని వాణీగుమ్ఫనడమ్బరమున హృదయమున కీర్తి ప్రరోహమున కలిగించుగాక అని చెప్పుటవలన నీ శ్లోకమున క్రమాలంకారమున్నదని క్రమవాచిపర్యాయశబ్దప్రయోగముచేత స్పష్టమగు చున్నది. **గుణత్రయశబ్దప్రయోగముచే** ప్రకృతిస్వరూపిణియగు నమ్మవారి సత్త్వరజస్తమోగుణత్రయమునకు గాని పరమాత్మ స్వరూపిణి యగు నమ్మవారు సచ్చిదానన్దములకు గాని ప్రతీకముగా నూహించుకొనుట కవకాశమేర్పడుచున్నది. ప్రథమ ద్వితీయ పాదాన్తములందు ముద్రాకరా, హాసాంకురా అని యుండుటచే పాదాన్తానుప్రాసయేర్పడుచున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వు నందు జలధర్మమైన శైత్యమున్నట్లు చెప్పఁబడినది. ఈ శ్లోకమున జలక్రియయగు ప్రక్షాళనము మనఃకర్మకముగా చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ కామాక్ష్యా మృదులస్మితాంశునికరా దక్షాన్తకే వీక్షణే**
**మన్దాక్షగ్రహిలా హిమద్యుతిమయూఖాక్షేపదీపాఙ్కురాః।**
**దాక్ష్యం పక్ష్మలయన్తు మాక్షికగుడద్రాక్షాభవం వాక్షు మే**
**సూక్ష్మం మోక్షపథం నిరీక్షితుమపి ప్రక్షాలయేయుర్మనః॥ 79**

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| దక్షాన్తకే | = శివునకు సమ్బన్ధించిన; |
| వీక్షణే | = చూపునందు; |
| మన్దాక్షగ్రహిలా | = సిగ్గు పట్టుకొన్న; |
| హిమద్యుతిమయూఖాక్షేప దీపాంకురాః | = చన్ద్రుని కిరణముల నాక్షేపించు చిఱుదివ్వెలగు; |
| కామాక్ష్యాః | = కామాక్షీదేవియొక్క; |
| మృదులస్మితాంశునికరాః | = మన్దహాసకాంతి సమూహములు; |
| మే | = నాయొక్క; |
| వాక్షు | = వాక్కులలో; |

| | | |
|---|---|---|
| మాక్షికగుడద్రాక్షాభవమ్ | = | తేనెనుండి బెల్లమునుండి ద్రాక్షనుండి పుట్టిన; |
| దాక్ష్యమ్ | = | సామర్థ్యమును; |
| పక్ష్మలయన్తు | = | ఉన్మీలింపఁజేయుగాక; |
| సూక్ష్మమ్ | = | సూక్ష్మమైన; |
| మోక్షపథమ్ | = | మోక్షమార్గమును; |
| నిరీక్షితుమపి | = | చూచుటకును; |
| మే | = | నాయొక్క; |
| మనః | = | మనస్సును; |
| ప్రక్షాలయేయుః | = | కడుగుగాక. |

**తాత్పర్యము:-**

శివుడు చూచినప్పుడు సిగ్గుతో చుట్టబడిన, చన్ద్రుని కిరణముల నాక్షేపించుటలో చిఱుదివ్వెలైన కామాక్షీదేవియొక్క మన్దహాసకాంతి సమూహము లనెడి జలములు నా వాక్కులలో తేనెలో, బెల్లములో, ద్రాక్షలో నుండు మాధుర్యమును నింపి సూక్ష్మమైన మోక్షమార్గమును దర్శించుటకు కావలసిన నిర్మలత్వమును కలిగించుగాక!

**వివరణము :-**

**ప్రక్షాలయేయుః** అను క్రియయొక్క ప్రయోగముచేత అమ్మవారి చిఱునవ్వు కాంతి సమూహములందు జలారోపము వ్యక్తమగుటచే నిందు రూపకాలంకార స్ఫూర్తియున్నది. ప్రక్షాళనము జలముయొక్క క్రియగదా! ఆధునికులు స్వచ్ఛమైన నీటికి రంగు రుచి వాసన లేవు అని చెప్పుచున్నను ప్రాచీన పదార్థ విజ్ఞాన (తర్క) శాస్త్రజ్ఞులు జలమునకు మాధుర్యగుణమున్నదని యంగీకరించినారు. అంతే గాక తెల్లదనము అను రంగు కూడ జలమున కుండునని అంగీకరించినారు. ఆధునికులవలెనే వాసన మాత్రము జలమునకు లేదన్నారు. ఆ మన్దహాసము తన వాక్కులలో తేనెలో బెల్లములో ద్రాక్షలో నున్న మాధుర్యమును నింపవలెను అని కవి ప్రార్థించుటవలన అమ్మవారి మన్దహాసములో వాటి మాధుర్యమును మించిన మాధుర్యమున్నది. దానిని కోరుట అత్యాశయని భావించిన కవి తేనె బెల్లము ద్రాక్షలోనుండు మాధుర్యమును తన వాక్కులకు ప్రసాదింపవలెనని కోరుచున్నాడు. శివుడు చూచినప్పుడు సిగ్గుతో మన్దహాసమునకు సంకోచమేర్పడును. సిగ్గుతోడి సంకోచముతో కూడిన మన్దహాసము శివునకు మరింత మధురముగా తోచును. ఈ శ్లోకమున క్షకారము బహువారావృత్తమైనది. కావున వృత్త్యనుప్రాసమను పేరుగల శబ్దాలంకారమున్నది. అమ్మవారి చిఱునవ్వు కాంతులు చన్ద్రకిరణము నాక్షేపించు చిఱుదివ్వెలని చెప్పుటవలన రూపకాలంకారమున్నది. ఆ చిఱుదివ్వెలు చన్ద్రుని కాన్తుల నాక్షేపించుట వింతకాదు. చిఱుదివ్వె వెలుగులు వెన్నెల వ్యాపించని చోట కూడ వ్యాపించుట

మనమెరుగుదుము. హృదయగుహలోనికి చన్ద్రుని కాన్తులు ప్రసరించనే ప్రసరించవు. అమ్మవారి చిఱునవ్వు కాంతులు హృదయగుహయందలి చీకటిని బోగొట్టగల చిఱుదివ్వెలనుటలో సందేహము లేదు. దీపము చిన్నదైనను పెక్కు దీపముల వెలిగింపజాలును. చన్ద్రకాంతుల కా లక్షణము లేదు. అందువలనను చన్ద్రకాంతులను మన్దహాసదీపాంకురము లాక్షేపించగలవు అని **దీపాంకుర** శబ్దములోని బహువచనము స్ఫురింపఁజేయుచున్నది. మనసు నిర్మలమైనప్పుడే మోక్షమార్గమును చూడగలదు. ఆ మార్గము కత్తియంచువలె సన్ననైనది. దానిని చూచుటకు మనసులో నేమాత్రము మాలిన్యముండరాదు. మాలిన్యముండకుండఁజేయవలెనన్న దానిని కడుగవలెను. దానిని కడుగుటకు అమ్మవారి మన్దహాసాంకురరూప జలములే సమర్థములు. **మన ఏవ మనుష్యాణాం, కారణమ్ బన్ధమోక్షయోః** మై.6.30 అను సూక్తి మలినమైన మనస్సు బన్ధమునకు హేతువు. నిర్మలమైన మనస్సు మోక్షమునకు హేతువు అని చెప్పుచున్నది. అజ్ఞానమునకు మలమను పేరు కూడ కానవచ్చును. మలక్షాలనము జలకృత్యము, అజ్ఞానమంధకార రూపము కావున దానిని దీపవే నివారింపగలదు. ఇట్లు జలదీపలక్షణములున్ననే మలాన్ధకార లక్షణములు గల అజ్ఞానమును నివారించుటకు వీలున్నది. కావుననే కవి మన్దహాసమునందు దీపారోపమును వాచ్యమొనర్చి జలారూపమును లక్ష్యమొనర్చినాడు.



**అవ:-** పై శ్లోకమున మనః ప్రక్షాళనము కోరఁబడినది. ఈ శ్లోకమున బుద్ధి ప్రక్షాలనము కోరఁబడుచున్నది.

**శ్లో॥ జాత్యా శీతలశీతలాని మధురాణ్యేతాని పూతాని తే**
**గాఙ్గానీవ పయాంసి దేవి! పటలాన్యల్పస్మితజ్యోతిషామ్।**
**ఏనఃపఙ్కపరమ్పరామలినతామేకామ్రనాథప్రియే!**
**ప్రజ్ఞానాత్సుతరాం మదీయధిషణాం ప్రక్షాలయన్తు క్షణాత్॥ 80**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| ఏకామ్రనాథప్రియే | = ఏకామ్రేశ్వరుని ప్రియురాలవైన; |
| దేవి | = ఓ దేవీ!; |
| తే | = నీయొక్క; |
| అల్పస్మితజ్యోతిషామ్ | = చిఱునవ్వు కాంతులయొక్క; |
| పటలాని | = గుంపులు; |
| గాంగాని | = గంగకు సంబంధించిన; |
| పయాంసి ఇవ | = జలములవలె; |
| జాత్యా | = జాతితో; |

| | | |
|---|---|---|
| శీతలశీతలాని | = | చల్లచల్లనివి; |
| మధురాణి | = | ఇంపైనవి; |
| పూతాని | = | పవిత్రములైనవి; |
| ఏనః పంకపరమ్పరామలినతామ్ | = | పాపములనెడి బురదల వరుసల మాలిన్యముగల; |
| మదీయధిషణామ్ | = | నా బుద్ధిని; |
| సుతరామ్ | = | మిక్కిలి; |
| ప్రజ్ఞానాత్ | = | ప్రజ్ఞానము వలన; |
| క్షణాత్ | = | క్షణకాలములో; |
| ప్రక్షాలయన్తు | = | కడిగి వేయుగాక. |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ చిఱునవ్వు కాంతుల సమూహములు గంగాజలములవలె సహజముగా చల్లనివి, పవిత్రములైనట్టివి. అవి నా బుద్ధిలోని పాపపంకమును ప్రజ్ఞానమువలన క్షణకాలములో బాగుగా కడిగివేయుగాక.

**వివరణము :-**

అమ్మవారి చిఱునవ్వు కాంతుల సమూహములు గంగాజలములవలె చల్లనివి, పవిత్రములు అని చెప్పుటచే పూర్ణోపమాలంకారమున్నది. ఈ శ్లోకము నందును పూర్వశ్లోకము నందువలెనే ప్రక్షాలన క్రియ చెప్పఁబడుటచే అమ్మవారి చిఱునవ్వు కాంతుల సమూహములందు జలారోపము స్ఫురించుటచే రూపకాలంకారస్ఫూర్తి కలదు. ప్రజ్ఞానమా జలములధారగా గమనింప వలసియున్నది. **"ప్రజ్ఞానమ్ బ్రహ్మ"** అనునది నాలుగు మహావాక్యములలో ప్రథమము. బ్రహ్మము ప్రజ్ఞానరూపము కావున ప్రజ్ఞానము సమస్తపాప ప్రక్షాలనమున గంగాజలములధార. జ్ఞానములధారవలననే బుద్ధిదోషములు నశించును. జ్ఞానముల ధారలో విషయము సగుణ (సాకార) బ్రహ్మము. అట్టి బ్రహ్మముయొక్క ధ్యానము (జ్ఞానముల ధార) చేత బుద్ధికి విషయము కానిది విషము రూపము అయినది. **'జహదజహల్లక్షణ'** (భాగత్యాగ లక్షణా) వృత్తి లభ్యము అయినది. నిర్గుణ బ్రహ్మము **'యో బుద్ధేః పరతస్తు సః'** 3.42 అని భగవద్గీతలో పేర్కొనఁబడినది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి మన్దహాసాంకురములకు గంగాజలములతో పోలిక చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ పోలికయే శివుడు గంగను శిరమున దాల్చుటకు హేతువుగా నుత్ప్రేక్షింపఁబడుచున్నది.

**శ్లో॥ అశ్రాన్తం పరతన్త్రితః పశుపతిస్త్వన్మన్దహాసాఙ్కురైః**
**శ్రీకామాక్షి! తదీయవర్ణసమతాసఙ్గేన శఙ్కామహే।**

ఇన్దుం నాకధునీం చ శేఖరయతే మాలాం చ ధత్తే నవై-
ర్వైకుణ్ఠైరవకుణ్ఠనం చ కురుతే ధూలీచయైర్భాస్మనైః॥81

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| శ్రీకామాక్షి! | = ఓ శ్రీ కామాక్షీ దేవీ! |
| త్వన్మన్దహాసాంకురైః | = నీ చిఱునవ్వు మొలకల చేత; |
| పశుపతిః | = శివుడు ; |
| అశ్రాన్తమ్ | = ఎల్లప్పుడు; |
| పరతన్త్రితః | = పరతంత్రను బొందినాడు; |
| తదీయవర్ణసమతాసంగేన | = నా చిఱునవ్వు రంగుతోడి పోలిక యందలి ఆసక్తిచేత ; |
| ఇన్దుమ్ | = చన్ద్రుని; |
| నాకధునీమ్ | = స్వర్గనదిని; |
| శేఖరయతే | = శిరోభూషణములుగా చేసికొనుచున్నాడు; |
| నవైః | = నూతనములైన; |
| వైకుంఠైః | = తుమ్మిపూలతోడి; |
| మాలాం చ | = మాలనుగూడ; |
| ధత్తే | = ధరించుచున్నాడు; |
| భాస్మనైః | = భస్మమునకు సంబంధించిన; |
| ధూలీచయైః | = పరాగముల సమూహముచేత; |
| అవకుణ్ఠనం చ | = మైపూతను గూడ; |
| కురుతే | = చేసికొనుచున్నాడు అని; |
| శంకామహే | = అనుకొనుచున్నాము. |

**తాత్పర్యము:-**

అమ్మవారి చిఱునవ్వు మొలకచేత శివుడు పూర్తిగా పరాధీనుడైనాడు. కావున ఆ చిఱునవ్వు రంగుయొక్క సామ్యమందలి ఆసక్తి చేతనే చన్ద్రుని స్వర్గనదిని శిరమున అలంకరించుకొన్నాడు. నూతనములైన తుమ్మి పూలమాల ధరించినాడు. బూడిదను పూతగా బూసికొన్నాడు అని అనుకొనుచున్నాము.

**వివరణము :-**

శివుడు శిరమున స్వర్గనదిని, చన్ద్రుని ధరించుటకు, తుమ్మిపూల మాలను ధరించుటకు, బూడిద పూసికొనుటకు అమ్మవారి చిఱునవ్వు మొలకచే పొందిన పరాధీనత కారణము కాకపోయినను కారణముగా చెప్పుటచే, శంకామహే అను క్రియను ప్రయోగించుటచే నీ శ్లోకమున ఉత్ప్రేక్షాలంకారము వాచ్యమైయున్నది. అమ్మవారి చిఱునవ్వు

రంగే ఆకాశగంగకు, చన్ద్రునకు, తుమ్మిపూలమాలకు బూడిద పూతకు నున్నది. అమ్మవారి చిఱునవ్వు మీది ప్రేమలో తత్సమానవర్ణముగల వస్తువులను కూడ ప్రేమించుట ప్రేమికుడైన శివునకు సహజమే.



**అవ:–** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వు నందు శివునకు గల ప్రేమ వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున అమ్మవారికి శివునందు గల ప్రేమ వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ శ్రీకాఞ్చీపురదేవతే! మృదువచస్సౌరభ్యముద్రాస్పదం**
**ప్రౌఢప్రేమలతానవీనకుసుమం మన్దస్మితం తావకమ్।**
**మన్దం కన్దలతి ప్రియస్య వదనాలోకే సమాభాషణే**
**శ్లక్ష్ణే కుట్మలతి ప్రరూఢపులకే చాశ్లేషణే ఫుల్లతి॥ 82**

**ప్రతిపదార్థము:–**

| | |
|---|---|
| శ్రీకాంచీపురదేవతే | = శ్రీ కాంచీపుర దేవతా! |
| మృదువచస్సౌరభ్యముద్రాస్పదమ్ | = మెత్తని మాటల సుగన్ధ చిహ్నమునకు స్థానమైన; |
| ప్రౌఢప్రేమలతానవీనకుసుమమ్ | = ప్రౌఢమైన ప్రేమ యను తీగయొక్క క్రొత్త పూవైన; |
| తావకమ్ | = నీకు సంబంధించిన; |
| మన్దస్మితమ్ | = చిఱునవ్వు; |
| ప్రియస్య | = ప్రియుని (శివుని)యొక్క; |
| వదనాలోకే | = ముఖమును చూచుట యందు; |
| మన్దమ్ | = మెల్లగా; |
| కన్దలతి | = అంకురించును; |
| శ్లక్ష్ణే | = స్నేహపూర్ణమైన; |
| సమాభాషణే | = మాట్లాడుట యందు; |
| కుట్మలతి | = మొగ్గదొడుగును; |
| ప్రరూఢపులకే | = మొలచిన పులకులుగల; |
| ఆశ్లేషణే చ | = కౌగిలింత యందును; |
| ఫుల్లతి | = వికసించును. |

**తాత్పర్యము:–**

శ్రీ కాంచీపుర దేవతా! మృదువులైన మాటల సుగన్ధ చిహ్నములకు నెలవైన, ప్రౌఢ ప్రేమ యనెడి తీగకు క్రొత్తగా పుట్టిన పూవైన నీ చిఱునవ్వు శివుని చూడగానే అంకురించును. స్నేహపూర్వకమైన అతని తోడి సమ్భాషణ మారమ్భము కాగానే మొగ్గ దొడుగును. పులకాంకురములను కలిగించు నాతని యాలింగన సమయమున వికసించును.

**వివరణము :-**

అమ్మవారి చిఱునవ్వు నందామె మాటల సౌగన్ధ్యమున్నది. అది ఆ శివునిపై అమ్మవారి హృదయమునందలి ప్రౌఢప్రేమ యనెడి తీగ క్రొత్తగా పూచిన పూవు అని మాట యందు సౌగన్ధ్యము, ప్రేమయందు తీగయొక్క, అమ్మవారి చిఱునవ్వు నందు పుష్పముయొక్క ఆరోపముండుటచే రూపకాలంకార మేర్పడుచున్నది. అమ్మవారి చిఱునవ్వనెడి పువ్వుయొక్క, **అంకుర దశ, కుట్మల దశ, వికాస దశ** వరుసగా వర్ణింపఁ బడుటచే క్రమాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున కామాక్షీదేవి శ్రీకాంచీపురదేవతగా పేర్కొనఁబడినది. ఈ శ్లోకమున శ్రీ కాంచీపుర నాయకుడైన ఏకామ్రేశ్వరుని ప్రియతమగా పేర్కొనఁబడుచున్నది.

**శ్లో॥ కిం త్రైస్రోతసమమ్బికే పరిణతం స్రోతశ్చతుర్థం నవం**
**పీయూషస్య సమస్తతాపహరణం కింవా ద్వితీయం వపుః।**
**కింస్విన్నైకటికం గిరో మధురిమాభ్యాసాయ నవ్యం పయః**
**శ్రీకాఞ్చీపురనాయకప్రియతమే! మన్దస్మితం తావకమ్॥ 83**

**ప్రతిపదార్థము :-**

శ్రీకాంచీపురనాయకప్రియతమే = శ్రీకాంచీపురనాయకునకు ప్రియతమురాలవైన;
అమ్బికే = అమ్మా! ;
తావకమ్ = నీకు సంబంధించిన;
మన్దస్మితమ్ = చిఱునవ్వు ;
త్రైస్రోతసమ్ = గంగకు సంబంధించిన ;
నవమ్ = క్రొత్తదైన;
చతుర్థమ్ = నాలుగవదైన;
సమస్తతాపహరణమ్ = అన్ని తాపములను బోఁగొట్టు;
స్రోతః = ప్రవాహము;
పరిణతమ్ కిం = పరిణమించినదా?
పీయూషస్య = అమృతముయొక్క;
ద్వితీయమ్ = రెండవదైన;
వపుః కిం వా = శరీరమా;
గిరః = వాక్యముయొక్క;
మధురిమాభ్యాసాయ = మాధుర్యము నభ్యసించుట కొఱకు;
నైకటికమ్ = సమీపమునందున్న;

నవ్యమ్ = క్రొత్తదైన;
పయః కింస్విత్ = పాలా?

**తాత్పర్యము:-**

ఏకామ్రేశ్వరుని ప్రియతమురాలవైన అమ్మా! నీ చిఱునవ్వు గంగయొక్క క్రొత్తదైన నాల్గవ ప్రవాహముయొక్క పరిణామమా? అమృతముయొక్క రెండవ శరీరమా? వాక్కుల మాధుర్యము నభ్యసించుటకు సమీపించిన క్రొత్తపాలా?

**వివరణము :-**

ఆకాశమునందు, భూమియందు పాతాళమునందు గంగ ప్రవహించినది. కావున గంగకు ఆకాశ ప్రవాహము (మన్దాకిని) భూప్రవాహము (హైమవతి) పాతాళ ప్రవాహము (భోగవతి) అను మూడు ప్రవాహములున్నవి కావున త్రిస్రోతస యను పేరేర్పడినది. అమ్మవారి చిఱునవ్వు ఆ గంగయొక్క నాల్గవ ప్రవాహమా? అమృతముయొక్క శరీరమొకటి దేవతలకు భోగ్యమై యున్నది. ఈ చిఱునవ్వు ఆ అమృతముయొక్క రెండవ శరీరమా? ఈ చిఱునవ్వు అమ్మవారి వాక్కుయొక్క మాధుర్యము నభ్యసించుటకు దగ్గరకు వచ్చిన క్రొత్తపాలా యని యొకే చిఱునవ్వు మూడు విధములుగా నుల్లేఖింపఁబడుట వలన నీ శ్లోకమున నుల్లేఖాలంకారమున్నది. అమ్మవారి చిఱునవ్వు గంగయొక్క నాల్గవ ప్రవాహమా, అమృతముయొక్క రెండవ శరీరమా, నవ్యమైన పాలా, యనుట వలన తాద్రూప్యరూపకాలంకారము స్ఫురించుచున్నది. గంగ ఒక విధమైన ఆధ్యాత్మిక (శారీరక) మైన తాపమును హరింపఁగలదే కాని మరొక విధమైన ఆధ్యాత్మిక (మానసిక) మైన తాపము హరింపఁజాలదు. కావున సమస్త తాపముల హరించుటకు నాల్గవ ప్రవహముగా పరిణమించినదా యేమి? పీయూషముయొక్క యొక శరీరము దేవతా భోగ్యమే కాని పరదేవతా (శివ) భోగ్యముకాదు. ఆ లోపమునపహరించి పరదేవతా (శివ) భోగ్యమగుటకు ద్వితీయశరీరము ధరించినదా యేమి? పాలకు అమ్మవారి చిఱునవ్వు నందలి మాధుర్యము లేదు. కావున శివుడు పాలు త్రాగనే లేదు. పాలసముద్రములో పుట్టిన విషమును త్రావినాడు. చివఱకు మాతృస్తన్యమును కూడ గ్రోల లేదు అని పాలు క్రొత్తరూపు ధరించి అమ్మవారి వాక్కుయొక్క మాధుర్యము నభ్యసించుటకు ఆమె చిఱునవ్వును సమీపించినదా యేమి యను నిట్టి భావము స్ఫురించుటచే నీ శ్లోకమున మాలోత్ప్రేక్షాలంకారస్ఫూర్తి యున్నది. శివుడేమి చూచి గంగను నెత్తికెక్కించు కొన్నాడు. గంగ దేవతలనదియే. ఆ దేవతలు ప్రలయమున మరణించువారేకదా వారి నదికి (దేవతానదికి) ప్రలయమున నాశముండదా తనవలెనది శాశ్వతమైనదా? అని అమ్మవారు మందహాస మొనర్చినది. శివుడు దేవతలందఱితో పాటు అమృతమును త్రావియున్నచో వారివలె ప్రళయమున నశింపకుండుట యెట్లు? ఆ నశింపకుండుట తన మాంగల్యమహిమ యని శివుడెఱుగడా యని అమ్మవారు మందహాసమొనర్చినది. పాపము శివుడు తల్లి పాలరుచినెఱుగనివాడు.

తన భక్తకుమారులకు మాత్రము తన చనుబాల రుచి తెలియును, భర్తకు పాలరుచిని మించిన మాధుర్యము కల మందహాసమొనర్చి శివునానందింపఁజేసినది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వు ఆమె వాక్కులయొక్క మాధుర్యము నభ్యసించుటకు వచ్చిన పాలయొక్క క్రొత్తరూపుగా వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున వాక్కులకు **స్నేహితురాలుగా** అమ్మవారి హాసప్రభామంజరి వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ భూషా వక్త్రసరోరుహస్య సహజా వాచాం సఖీ శాశ్వతీ**
**నీవీ విభ్రమసన్తతేః పశుపతేస్సౌధీ దృశాం పారణా।**
**జీవాతుర్మదనశ్రియశ్శశిరుచేరుచ్చాటనీ దేవతా**
**శ్రీకామాక్షి! గిరామభూమిమయతే హాసప్రభామఞ్జరీ॥ 84**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| శ్రీకామాక్షి! | = ఓ కామాక్షీ దేవీ! |
| తే | = నీయొక్క |
| హాసప్రభామంజరీ | = నవ్వుల కాంతుల గుత్తి; |
| వక్త్రసరోరుహస్య | = ముఖకమలమునకు; |
| సహజా | = సహజమైన; |
| భూషా | = అలంకారము; |
| వాచామ్ | = వాక్కులకు; |
| శాశ్వతీ | = శాశ్వతమైన; |
| సఖీ | = స్నేహితురాలు; |
| విభ్రమసన్తతేః | = విలాససమూహమునకు; |
| నీవీ | = పోకముడి; |
| పశుపతేః | = శివునియొక్క |
| దృశామ్ | = చూపులకు; |
| సౌధీ | = అమృతసమ్బన్ధమైన; |
| పారణా | = విందు; |
| మదనశ్రియః | = మన్మథలక్ష్మికి; |
| జీవాతుః | = జీవనౌషధము; |
| శశిరుచేః | = చన్ద్రకాన్తికి; |
| ఉచ్చాటనీ | = వెడలకొట్టు; |
| దేవతా | = దేవతయునై; |
| గిరామ్ | = వాక్కులయొక్క |

అభూమిమ్ = చేరరాని చోటును;
అయతే = పొందుచున్నది.

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీ దేవీ! నీ హాసప్రభామంజరి నీ ముఖకమలమునకు సహజాలంకారము. నీ వాక్కులకు శాశ్వత సఖి, నీ విలాసముల సమూహామునకు కేన్ద్రము, శివుని చూపులకు అమృతపు విందు. మన్మథలక్ష్మికి జీవనౌషధము, చన్ద్రకాన్తి కుచ్చాటన దేవత. ఆ హాసప్రభామంజరి వాక్కుల కందకుండనున్నది.

**వివరణము :-**

అమ్మవారి చిఱునవ్వునందు ముఖకమలసహజాలంకారత్వము వాణినిత్య సఖాత్వము, విభ్రమసంతతనవత్వము, పశుపతి దృక్సుధాపారణత్వము, మదన శ్రీ జీవాతుత్వము, శశిరుచ్యుచ్చాటన దేవతాత్వము ఆరోపితములగుటచే నీ శ్లోకమున మాలారూపకాలంకార మేర్పడుచున్నది. అమ్మవారి చిఱునవ్వు ననేక విధముల నీ శతకమున వర్ణించిన మూకకవి అమ్మవారి చిఱునవ్వు వాక్కుల కందరానిదని చెప్పుచున్నాడు. ఇట్లు చెప్పుటకూడ వాక్కే. వాక్కుల కందరానిదని వాక్కుతోడనే గదా చెప్పవలెను. పోతే అట్లని మూకకవి మౌనమును వహించినాడా? లేదు. ఇంకను వర్ణించుచునే యున్నాడు. వాక్కుల కందరానిదనుటలో తాత్పర్యము సమగ్రముగా వాక్కులతో నమ్మవారి చిఱునవ్వు వర్ణించుట సాధ్యము కానిదనియే. ఇంత వర్ణించినను ఆ వర్ణనము యత్కించి ద్వర్ణనమే కాని సమగ్రవర్ణనము కాదను సత్యము చెప్పుట కవియొక్క నిరహంకారతకు నిదర్శనము. నిర్గుణబ్రహ్మము వాక్కులకందరానిదే. కామాక్షీ దేవి సగుణబ్రహ్మస్వరూపిణి. సగుణ, నిర్గుణ శబ్దములలోని గుణ శబ్దము శబ్దప్రవృత్తి నిమిత్తములైన గుణజాతి క్రియాద్రవ్య సంజ్ఞల కుపలక్షణము. ప్రవృత్తి నిమిత్తములైన **జాతి గుణ క్రియా ద్రవ్యసంజ్ఞలులేని** నిర్గుణబ్రహ్మము వాక్కుల కందరానిదనుట ఉచితమే. కాని కామాక్షీ దేవి మన్దహాసము సగుణము కదా. వాక్కులకందరాని దగుట యెట్లు అను ప్రశ్నము కలుగును. సగుణము అనగా ఒకటి రెండు గుణములు కలదని, అనంత గుణములు కలదనియు చెప్పవచ్చును. అనంతగుణములు కలదైన మన్దహాసముకూడ నిర్గుణబ్రహ్మమువలె వాక్కుల కందరానిదే. అనంతగుణముల చెప్పుట యెవనికి సాధ్యము. ఏ వాక్కులనంత గుణముల చెప్పగలవు? ఏ వాక్కులును చెప్పలేవు. అమ్మవారి మందహాసము సగుణమైనను అనంతగుణములు కలదగుట వలన వాక్కులకందరానిదే యనుట నిస్సంశయము. ఏవో కొన్ని గుణములు చెప్పవచ్చును. మూకకవి కూడ అట్లే చెప్పినాడు. చెప్పఁబోవుచున్నాడు. ఆయన అమ్మవారి మన్దహాసము సమగ్రముగా చెప్పుట సాధ్యము కాదనియే తాత్పర్యము. దేవమనుష్యపశ్వాది శబ్దములు జాతివాచకములు; శ్వేతపీతాదిశబ్దములు గుణవాచకములు, జనకసంహారక పాచకాది శబ్దములు క్రియావాచకములు, శూలిదండ్యాదిశబ్దములు ద్రవ్య (యోగ)

వాచకములు, (సివ) డిత్థడవిత్థాదిశబ్దములు సంజ్ఞావాచకములు, వీనిలో నేవి కూడ సగుణబ్రహ్మను చెప్పజాలవు. సర్వజాతియుక్తము సర్వగుణయుక్తము సర్వక్రియావంతము సర్వ ద్రవ్యవంతము సర్వశబ్దైకార్థమునగు సగుణబ్రహ్మము కొన్ని గుణములు కొన్ని క్రియలు స్వీకరించి కాంచీపురమున నవతరించి నందుననే ఈ మాత్రముగానైన కవుల వాక్కులు ప్రసరించుచున్నవి. అవతారమనగా అనంతగుణక్రియాదిమత్సగుణబ్రహ్మము కొన్ని గుణములు స్వీకరించి క్రిందకు దిగివచ్చుట.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి హాసప్రభయందు కొన్ని రూపణములు చెప్పఁబడినవి. ఈ శ్లోకమున మరి కొన్ని రూపణములు చెప్పఁబడుచున్నవి.

**శ్లో॥ సూతిశ్శ్వేతిమకన్దలస్య వసతిశ్శృఙ్గారసారశ్రియః**
**పూర్తిః సూక్తిఝరీరసస్య లహరీ కారుణ్యపాథోనిధేః।**
**వాటీ కాచన కౌసుమీ మధురిమస్వారాజ్యలక్ష్మ్యాస్తవ**
**శ్రీకామాక్షి! మమాస్తు మఙ్గలకరీ హాసప్రభాచాతురీ॥ 85**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| శ్రీకామాక్షి | = ఓ కామాక్షీదేవీ!; |
| శ్వేతిమకన్దలస్య | = తెలుపు మొలకకు; |
| సూతిః | = జన్మస్థానము; |
| శృంగారసారశ్రియః | = శృంగారసారలక్ష్మికి; |
| వసతిః | = నివాసస్థానము; |
| సూక్తిఝరీరసస్య | = సూక్తిప్రవాహరసమునకు; |
| పూర్తిః | = నిండైన; |
| లహరీ | = ప్రవాహము; |
| మధురిమస్వారాజ్యలక్ష్మ్యాః | = మాధుర్యస్వారాజ్యలక్ష్మికి; |
| కాచన | = ఒకానొక; |
| కౌసుమీ | = పుష్పసమ్బన్ధమైన; |
| వాటీ | = తోటయునయిన; |
| తవ | = నీయొక్క; |
| హాసప్రభాచాతురీ | = నవ్వుకాంతి నైపుణ్యము; |
| మమ | = నాకు; |
| మంగలకరీ | = శుభముల కలిగించునది; |
| అస్తు | = అగుగాక. |

**తాత్పర్యము:-**

తెలుపుమొలకయొక్క జన్మస్థానము, శృంగారసారలక్ష్మి యొక్క నివాసస్థానము, సూక్తిప్రవాహరసముయొక్క సంపూర్ణత, దయాసముద్రముయొక్క ప్రవాహము, మాధుర్యస్వారాజ్యలక్ష్మియొక్క ఒకానొక పూలతోటయు నయిన అమ్మవారి హాసప్రభాచాతురి నాకు శుభముల గలిగించున దగుగాక!

**వివరణము :-**

ఈ శ్లోకమున అమ్మవారి చిఱునవ్వునందు శ్వేతిమకన్దలసూతిత్వము, శృంగారసారలక్ష్మి నివాసత్వము, సూక్తిప్రవాహరసపూర్తిత్వము, దయాసముద్ర ప్రవాహత్వము, మధురిమస్వారాజ్యలక్ష్మీకుసుమవాటీత్వము ఆరోపింపఁబడినందున మాలారూపకాలంకార మేర్పడుచున్నది. అమ్మవారు మధురిమ సర్వస్వము అని చెప్పుటకు సర్వమాధుర్యములలో శ్రేష్టము అని చెప్పుటకు **మధురిమస్వారాజ్యలక్ష్మి** శబ్ద ముపయోగింపఁబడినది. ఆమె స్వాయంభువ, స్వయం విరాజమాన. ఆమె మృదువుగా నవ్వినది. అంతే ఆమె విహరించు పూలతోట యేర్పడినది. ఆ మన్దహాసము శాశ్వతము. ఆమెకు దుఃఖగన్ధము లేదు. ఆ మన్దహాస మానన్దసుగన్ధిలము.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వు మంగలసామాన్యమునకై ప్రార్థింపఁబడినది. ఈ శ్లోకమున (అజ్ఞాన) తమో నివారణమునకై ప్రార్థింపఁబడుచున్నది.

**శ్లో॥ జన్తూనాం జనిదుఃఖమృత్యులహరీసన్తాపనం కృన్తతః**
**ప్రౌఢానుగ్రహపూర్ణశీతలరుచో నిత్యోదయం బిభ్రతః।**
**శ్రీకామాక్షి! విసృత్వరా ఇవ కరా హాసాఙ్కురాస్తే హఠా-**
**దాలోకేన నిహన్త్యురన్ధతమసస్తోమస్య మే సన్తతిమ్॥ 86**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| శ్రీ కామాక్షి! | = ఓ శ్రీ కామాక్షీ దేవీ! |
| జన్తూనామ్ | = ప్రాణులయొక్క; |
| జనిదుఃఖమృత్యులహరీసన్తాపనమ్ | = జన్మదుఃఖ మృత్యుప్రవాహముల సన్తాపమును; |
| కృన్తతః | = కత్తిరించు; |
| ప్రౌఢానుగ్రహపూర్ణశీతలరుచః | = గొప్ప అనుగ్రహమనెడి పూర్ణచన్ద్రునియొక్క; |
| నిత్యోదయమ్ | = నిత్యాభివృద్ధిని; |
| బిభ్రతః | = మోయు; |
| తే | = నీయొక్క; |
| హాసాంకురాః | = నవ్వుమొలకలు; |

విసృత్వరాః = వ్యాపించు;
కరాః+ఇవ = కిరణములవలె;
హఠాత్ = ఆకస్మికముగా;
ఆలోకేన = వెలుగు చేత;
మే = నాయొక్క;
అన్ధతమసస్తోమస్య = (అజ్ఞాన) చీకట్లగుంపుయొక్క;
సన్తతిమ్ = పరంపరను;
నిహన్యుః = నశింపఁజేయుగాక!

**తాత్పర్యము:-**

అమ్మవారి చిఱునవ్వులు ప్రాణుల జన్మదుఃఖమృత్యుప్రవాహముల వలన కలుగు పరితాపమును కత్తిరించునట్టివి. ప్రౌఢానుగ్రహ మనెడి పూర్ణ చన్ద్రునియొక్క నిత్యాభివృద్ధిని మోయునట్టివి. అట్టి చిఱునవ్వులు వ్యాపించు కిరణములవలె హఠాత్తుగా నా హృదయమున వెలిగి అందున్న అజ్ఞానాంధకార సమూహముల పరంపరను నశింపఁజేయుగాక!

**వివరణము :-**

అమ్మవారి చిఱునవ్వులు చన్ద్రకిరణములతో పోల్చఁబడుటచే నీ శ్లోకమున నుపమాలంకారమున్నది. చన్ద్రకిరణములు శారీరకమైన సన్తాపమును నశింపఁజేయును. అమ్మవారి చిఱునవ్వులు శారీరకమానసికములైన జన్మప్రవాహము వలన, దుః ఖప్రవాహమువలన, మృత్యుప్రవాహమువలన, కలుగు సన్తాపము నంతను హరించును. అమ్మవారి చిఱునవ్వు ఆమె ప్రౌఢానుగ్రహమును సూచించును కావున ప్రౌఢానుగ్రహ మనెడి పూర్ణచన్ద్రునియొక్క నిత్యాభివృద్ధిని చేయునని చెప్పఁబడినది. చన్ద్రకిరణములు హఠాత్తుగా ప్రవేశించి వెలుగవలెనన్నచో నింటి కప్పునకో గోడకో రంధ్రమేర్పడవలెను. హృదయము నం దమ్మవారు నిలచియే యున్నందున ఆమె పెదవులు ఆమె హృదయములోని ప్రౌఢానుగ్రహము కారణముగా హఠాత్తుగ విప్పుకొనిన చాలును. హృదయమున వ్యాపించు చన్ద్రకిరణములవలె అమ్మవారి చిఱునవ్వులు హృదయమందలి అన్ధకార (అజ్ఞాన)మును నశింపఁజేయును. చిఱునవ్వులంధకార (అజ్ఞాన)మును నశింపఁ జేయుగాక యనుటచే చిఱునవ్వులందు కాంతుల యారోపము స్ఫురించుటచే నీ శ్లోకమున రూపకాలంకార స్ఫూర్తియున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వుయొక్క **తెలుపు** వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున పెదవుల మెఱుపుతో కూడిన చిఱునవ్వుయొక్క తెలుపు వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ ఉత్తుఙ్గస్తనమణ్డలస్య విలసల్లావణ్యలీలానటీ -**
**రఙ్గస్య స్ఫుటమూర్ధ్వసీమని ముహుః ప్రాకాశ్యమభ్యేయుషీ।**

శ్రీకామాక్షి! తవ స్మితద్యుతితతిర్బిమ్బోష్ఠకాన్త్యఙ్కురై-
శ్చిత్రాం విద్రుమముద్రితాం వితనుతే మౌక్తీం వితానశ్రియమ్॥ 87

ప్రతిపదార్థము:-

| | | |
|---|---|---|
| శ్రీ కామాక్షీ! | = | ఓ శ్రీ కామాక్షీదేవీ! |
| విలసల్లావణ్యలీలానటీరంగస్య | = | ప్రకాశించు సౌందర్యమనెడి లీలానటికి రంగస్థలమైన; |
| తవ | = | నీయొక్క; |
| ఉత్తుంగస్తనమణ్డలస్య | = | ఎత్తైన స్తనప్రదేశముయొక్క; |
| స్ఫుటమూర్ధ్వసీమని | = | స్పష్టమైన పైభాగమున; |
| ముహుః | = | మాటిమాటికి; |
| ప్రాకాశ్యమ్ | = | ప్రకటనమును; |
| అభ్యేయుషీ | = | పొందుచున్నట్టి; |
| (తవ-నీయొక్క) స్మితద్యుతితతిః | = | చిఱునవ్వు కాంతుల సమూహము; |
| బిమ్బోష్ఠకాన్త్యంకురైః | = | దొండపండువంటి పెదవి కాంతుల మొలకలచే; |
| చిత్రామ్ | = | విచిత్రమై; |
| విద్రుమముద్రితామ్ | = | పగడపు ముద్రలు గల; |
| మౌక్తీమ్ | = | ముత్తెములకు సంబంధించిన; |
| వితానశ్రియమ్ | = | చాందిని (పందిరి)యొక్క శోభను; |
| వితనుతే | = | విస్తరింపఁజేయుచున్నది. |

**తాత్పర్యము:-**

అమ్మవారి సౌన్దర్యమనెడి లీలానటియొక్క రంగస్థలమే ఆమె ఎత్తైన స్తనమణ్డలము. దాని పైభాగమున మాటిమాటికి మెఱయుచున్న చిఱునవ్వు కాంతుల గుంపు దొండపండువంటి పెదవియొక్క ఎఱుపు కాంతితో కూడి పగడపు ముద్రలుగల ముత్తెముల పందిరియొక్క శోభను విస్తరింపఁజేయుచున్నది.

**వివరణము :-**

అమ్మవారి స్తనమండలము లావణ్యలీలానటీరంగముగా రూపింపఁబడుటవలన రూపకాలంకార మేర్పడుచున్నది. బిమ్బోష్ఠకాన్త్యంకురములతో కూడిన అమ్మవారి స్మితద్యుతితతి పగడపుముద్రలుగల ముక్తావితానశ్రీని విస్తరింపఁజేయుచున్నదని చెప్పుటచే స్మితద్యుతితతికి ముక్తావితానమునకు ఉపమానోపమేయభావము స్ఫురించుటచే ఉపమాలంకార ధ్వని యున్నది.



**అవ:-** పై శ్లోకమున బిమ్బోష్ఠకాన్త్యంకురములతో నెఱ్ఱవారిన అమ్మవారి తెల్లని స్మితము వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున అమ్మవారి ముఖమునకు మరింత తెల్లదనము సంపాదించునది యామె స్మితమని వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ స్వాభావ్యాత్తవ వక్త్రమేవ లలితం సన్తోషసమ్పాదనం**
**శమ్భోః కిం పునరఞ్చితస్మితరుచః పాణ్డిత్యపాత్రీకృతమ్।**
**అమ్భోజం స్వత ఏవ సర్వజగతాం చక్షుఃప్రియంభావుకం**
**కామాక్షి! స్ఫురితే శరద్వికసితే కీదృగ్విధం భ్రాజతే॥ 88**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీ దేవీ! |
| తవ | = నీయొక్క; |
| వక్త్రమ్ | = ముఖము; |
| స్వాభావ్యాత్ ఏవ | = స్వాభావికముగానే; |
| లలితమ్ | = అందమైనది; |
| శమ్భోః | = శివునకు; |
| సంతోషసమ్పాదనమ్ | = సంతోషమును కలిగించునట్టిది; |
| అంచితస్మితరుచః | = పూజితమైన చిఱునవ్వు కాంతియొక్క ; |
| పాండిత్యపాత్రీకృతమ్ | = పాండిత్యమునకు పాత్రముగా చేయబడినచో; |
| కిం పునః | = ఇక చెప్పవలసినదేమున్నది?; |
| అమ్భోజమ్ | = కమలము; |
| స్వత ఏవ | = తనకు తానుగానే; |
| సర్వజగతామ్ | = సర్వలోకములయొక్క; |
| చక్షుఃప్రియంభావుకమ్ | = కన్నులకు ప్రియముగా ననిపించునట్టిది; |
| స్ఫురితే | = వికసించినచో; |
| శరద్వికసితే | = శరదృతువున వికసించినచో; |
| కీదృగ్విధమ్ | = దేని విధముగా (ఎంత అందముగా) ; |
| భ్రాజతే? | = ప్రకాశించును? |

**తాత్పర్యము:-**

అమ్మవారి ముఖము స్వాభావికముగానే అందమైనది. శివునకు సంతోషమును గలిగించునట్టిది. ఇక నా ముఖము చిఱునవ్వు కాంతికి పాత్రమైనచో చెప్పవలసినదేమున్నది. కమలము స్వయముగానే సర్వలోకములకు కనువిందొనర్చును. అది వికసించినచో అందునా శరదృతువున వికసించినచో ఇంకెట్లు ప్రకాశించునో?

**వివరణము :-**

అమ్మవారి చిఱునవ్వుతో కూడిన ముఖమునకు శరద్వికసిత కమలము దృష్టాంతముగా చెప్పఁబడుటచే నీ శ్లోకమున దృష్టాంతాలంకారమున్నది. అమ్మవారి చిఱునవ్వు కాంతియొక్క పాండిత్యమనగా తెల్లదనమే. **పాండిత్య**శబ్దము పాండు (పాండివం) శబ్దస్ఫోరకము గదా. పాండిత్యమనగా జ్ఞానము. అది తెల్లనిదనుట కవి సమయము. ఆ విధముగా కూడా పాండిత్య శబ్దము పాండిమ (తెల్లదన)మును సూచించును. శంభు సంతోషసంపాదన, సర్వజగచ్చక్షుః ప్రియంభావుక శబ్దములు, అంచితస్మితరుచిపాండిత్య పాత్రీకృత, శరద్వికసిత శబ్దములు, దృష్టాంతాలంకారమునకు కావలసిన బింబప్రతిబింబభావము నందించుచున్నవి. అమ్మవారి **ముఖము** 1) లలితము 2) శంభుసంతోష సంపాదనము 3) స్మితరుచిపాండిత్యపాత్రీకృతము. **కమలము** 1) స్ఫురితము 2) సర్వజగచ్చక్షుః ప్రియంభావుకము 3) శరద్వికసితము ఉపమానోపమేయములైన ముఖకమలములయొక్క పై విశేషణములు వాని ఏకోత్తరసమృద్ధి శోభా సూచకములు. కమలము సర్వజగచ్చక్షుఃప్రియంభావుకముకాగా అమ్మవారి ముఖము శంభువునకు మాత్రమే సంతోషసంపాదనమగుట అమ్మవారి ముఖమునకు న్యూనత్వము కలిగించదా? అను ప్రశ్న యొకటి యుదయించును. ముఖముపమేయము కావున న్యూనత్వముచితమే యనుట యొక సమాధానము. శివుడు సర్వజగద్రూపుడగుటచే అమ్మవారి ముఖము సర్వజగత్సంతోష సంపాదకమనుట మరియొక సమాధానము. **ఆత్మా వై పుత్రనామాసి** కౌ.2.11 అను శ్రుతి ననుసరించి శివునకు తత్పుత్రప్రాయములైన సర్వజగములకు అభేదము ఘటించుచున్నది. భర్తయైన శివునకు సంతోషమును కలిగించినట్లే సర్వ జగములకు సంతోషమును గలిగించునట్టి దమ్మవారి ముఖమనుట మరొక సమాధానము.



**అవ॥:-** పై శ్లోకమున అమ్మవారి స్మితము పితృపుత్ర భావాపన్నములైన శంభు సర్వ జగత్సంతోష జనకమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున అమ్మవారి స్మితము ఆమె సేవకులకు కలిగించు వివిధ లాభములు పేర్కొనఁబడుచున్నవి.

**శ్లో॥ పుమ్భిర్నిర్మలమానసైర్విదధతే మైత్రీరసం నిర్మలం**
**కర్తుం కర్మలయం చ నిర్మలతమాం కీర్తిం లభన్తేతరామ్।**
**సూక్తిం పక్ష్మలయన్తి నిర్మలగుణాం యత్తావకాస్సేవకా-**
**స్తత్కామాక్షి! తవ స్మితస్య కలయా నైర్మల్యసీమానిధేః॥** 89

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| తావకాః | = నీకు సంబంధించిన; |
| సేవకాః | = సేవకులు; |

| | |
|---|---|
| నిర్మలమానసైః | = స్వచ్ఛమైన; |
| మైత్రీరసమ్ | = స్నేహరసమును; |
| విదధతే | = చేయుచున్నారు; |
| కర్మలయమ్ | = కర్మముల నాశమును; |
| కర్తుమ్ | = చేయుటకు; |
| నిర్మలతమామ్ | = మిక్కిలి స్వచ్ఛమైన; |
| పుమ్భిః | = పురుషులతో; |
| కీర్తిమ్ | = యశమును; |
| లభన్తేతరామ్ | = అధికముగా పొందుచున్నారు; |
| నిర్మలగుణామ్ | = ప్రసాదగుణముగల; |
| సూక్తిమ్ | = సుభాషితమును; |
| పక్ష్మలయన్తి యత్ | = మేలుకొలుపుచున్నారు అనునది యేది గలదో; |
| తత్ | = అది; |
| తవ | = నీయొక్క; |
| నైర్మల్యసీమానిధేః | = స్వచ్ఛతయొక్క హద్దుకు స్థానమైన; |
| స్మితస్య | = చిఱునవ్వుయొక్క; |
| కలయా | = లేశము చేతనే (యేర్పడుచున్నది). |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ సేవకులు కర్మలనాశముకొఱకు శుద్ధమనస్కులైన పురుషులతోనే మైత్రి నొనరించెదరు. కర్మలంతమై నిర్మల కీర్తి నొందుచున్నారు. ప్రసాదగుణముగల సుభాషితమును మేలుకొలుపుచున్నారు. ఇది యంతయు నిర్మలత్వమునకు చివరి హద్దైన నీ చిఱునవ్వుయొక్క లేశముచేతనే యేర్పడు చున్నది.

**వివరణము :-**

అమ్మవారు తన సేవకులను చూచి మన్దహాస మొనరించును. సేవకులప్పటినుండి కర్మవినాశనము కొఱకై నిర్మలమనస్కులైన వారితోడనే మైత్రి నొనరించెదరు. నిర్మలమైన కీర్తి నొందెదరు. ప్రసాదగుణభూయిష్ఠమైన వాక్కు పల్కెదరు. అమ్మవారి చిఱునవ్వు నైర్మల్యసీమానిధి. కావున ఆమె చిఱునవ్వుయొక్క అల్ప ప్రసారముయొక్క మహత్త్వ మిట్లుండగా సంపూర్ణప్రసారముచేత నింకెంత లాభము సేవకులకు కలుగునో చెప్పరాదను వస్తువు ఈ శ్లోకమున ధ్వనించుచున్నది. **శారీరకనిర్మలత స్నానాదుల వలన కలుగును. మానసికనిర్మలత సత్యదయాదిగుణముల వలన కలుగును.** ఆ గుణములు అమ్మవారి అనుగ్రహము చేతనే ఆమె సేవకులకు లభించుటకు వీలుగా నిర్మలమానసులు తారసపడుదురు. వారి సహవాసమున నమ్మవారి సేవకుల మనస్సులును నిర్మలములగును.

ఇది యంతయు అమ్మవారి అనుగ్రహముననే కలుగును. ఆ యనుగ్రహమునే ఆమె మన్దస్మితము సూచించును. సత్కర్మలకు నిర్మలత్వము ఫలముగా లభింపవలెనన్న ఫలప్రదాత్రియగు నమ్మవారి యనుగ్రహ మావశ్యకము.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వులేశమువలన సేవకులకు లాభములు కొన్ని పేర్కొనబడినవి. ఈ శ్లోకమున అమ్మవారి హాసము వలన **జీవుల సంసారమే హింసింపబడునని** చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ఆకర్షన్నయనాని నాకిసదసాం శైత్యేన సంస్తమ్భయ-**
**న్నిన్దుం కిం చ విమోహయన్పశుపతిం విశ్వార్తిముచ్చాటయన్।**
**హింసన్ సంసృతిడమ్బరం తవ శివే! హాసాహ్వయో మాన్త్రికః**
**శ్రీకామాక్షి! మదీయతాపతమసోవిద్వేషణే చేష్టతామ్॥ 90**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| శివే | = | మంగలస్వరూపురాలవైన; |
| శ్రీకామాక్షి | = | ఓ శ్రీ కామాక్షీదేవీ! |
| నాకిసదసామ్ | = | దేవతల సభలలో నున్న వారియొక్క; |
| నయనాని | = | కన్నులను; |
| ఆకర్షన్ | = | ఆకర్షించుచు; |
| శైత్యేన | = | చల్లదనముతో; |
| ఇన్దుమ్ | = | చన్ద్రుని; |
| సంస్తమ్భయన్ | = | బాగుగా స్తంభింపఁజేయుచు; |
| కిం చ | = | మరియు; |
| పశుపతిమ్ | = | శివుని; |
| విమోహయన్ | = | మోహింపఁజేయుచు; |
| విశ్వార్తిమ్ | = | జగముయొక్క పీడను; |
| ఉచ్చాటయన్ | = | వెడల గొట్టుచు; |
| సంసృతిడమ్బరమ్ | = | సంసారవిలాసమును; |
| హింసన్ | = | హింసించుచు; |
| తవ | = | నీయొక్క; |
| హాసాహ్వయః | = | నవ్వను పేరుగల; |
| మాన్త్రికః | = | మాన్త్రికుడు; |
| మదీయతాపతమసోవిద్వేషణే | = | నా తాపమనెడి చీకటిని ద్వేషించుటయందు; |
| చేష్టతామ్ | = | పూనుకొనుగాక! |

**తాత్పర్యము:-**

ఓ శివా! కామాక్షీ దేవీ! దేవతల సభలలో నున్నవారియొక్క కన్నుల నాకర్షించుచు, చల్లదనముతో చన్ద్రుని స్ఫురింపఁజేయుచు, శివుని మోహింప జేయుచు, లోకబాధను వెడలగొట్టుచు, సంసారవిలాసమును హింసించుచు, నీ నవ్వను మాన్త్రికుడు ఇక నా తాపమనెడి చీకటిని ద్వేషించుటకుఁబూనుకొనుగాక!

**వివరణము :-**

ఆకర్షణము, స్తంభనము, మోహనము, ఉచ్చాటనము, హింసనము, విద్వేషణము మొదలగు పనులు మాన్త్రికక్రియలు. ఈ పనుల నాచరించు నమ్మవారి నవ్వు మాన్త్రికుడని చెప్పుట వలన నీ శ్లోకమున రూపకాలంకార స్ఫూర్తి యున్నది. దేవతల కన్నులయొక్క ఆకర్షణము, చన్ద్రునియొక్క స్తమ్భనము, శివునియొక్క మోహనము, విశ్వార్తియొక్క ఉచ్చాటనము, సంసారవిలాసముయొక్క హింసనము, చేసిన అమ్మవారి నవ్వు అను మాన్త్రికునకు చేయవలసిన మాన్త్రికా క్రియయేయైన విద్వేషణము ఒకటి మిగిలినది. ఆ మాన్త్రికుడు నా తాపమను తమస్సుయొక్క విద్వేషణ మాచరించినచో నదియు పూర్తియగును, అను వస్తువు ఇచ్చుట వ్యంగ్యమగుచున్నది.



**అవ:-** పై శ్లోకమున తాపము **తమస్సు**గా రూపింపఁబడినది. ఈ శ్లోకమున తాపము **అనలము**గా రూపింపఁబడుచున్నది.

**శ్లో॥ క్షేపీయః క్షపయన్తు కల్మషభయాన్యస్మాకమల్పస్మిత-**
**జ్యోతిర్మణ్డలచంక్రమాస్తవ శివే! కామాక్షి! రోచిష్ణవః।**
**పీడాకర్మఠకర్మఘర్మసమయవ్యాపారతాపానల-**
**శ్రీపాతా నవహర్షవర్షణసుధాస్రోతస్వినీశీకరాః॥ 91**

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| శివే | = మంగలస్వరూపురాలవైన |
| కామాక్షి! | = ఓ కామాక్షీ దేవీ!; |
| రోచిష్ణవః | = ప్రకాశించునట్టి; |
| పీడాకర్మఠకర్మఘర్మసమయ వ్యాపారతాపానలశ్రీపాతాః | = పీడారూపములైన కర్మనిరతుల కర్మయను గ్రీష్మకాలవ్యాపారతాపాగ్నియొక్క కాంతిని నశింపజేయునట్టి; |
| నవహర్షవర్షణసుధాస్రోతస్వినీ శీకరాః | = క్రొత్త సంతోషమును వర్షించు అమృత నది బిందువులైనట్టి; |
| తవ | = నీయొక్క |

| | | |
|---|---|---|
| అల్పస్మితజ్యోతిర్మణ్డలచంక్రమాః | = | చిఱునవ్వు వెలుగుల గుంపుయొక్క పరిభ్రమణములు; |
| అస్మాకమ్ | = | మాయొక్క; |
| కల్మషభయాని | = | పాపభయములను; |
| క్షేపీయః | = | శీఘ్రముగా; |
| క్షపయన్తు | = | నశింపఁజేయుగాక. |

**తాత్పర్యము:-**

పీడారూపమైన కర్మఠుల కర్మయనెడి గ్రీష్మకాలవ్యాపారమైనతాపాగ్ని కాంతిని నశింపఁజేసి క్రొత్త సంతోషమును వర్షించు అమృతనది బిందువులైన ప్రకాశించు నీ చిఱునవ్వుల కాంతుల గుంపుల పరభ్రమణములు శీఘ్రముగా మా పాపభయములను నశింపఁజేయుగాక.

**వివరణము :-**

కర్మఠుల కర్మ పీడరూపమే. పీడారూపముకానిచో నది పూర్వజన్మ పాపమును తొలగింపఁజాలదు. శాస్త్రోక్తమైనది కావున నది కర్తవ్యమనుటలో సంశయము లేదు. అది చేయకపోయిన పూర్వజన్మపాపము ఈ జన్మమున దుఃఖమును కల్గింపక మానదు. శాస్త్రోక్త కర్మాచరణము ద్వారమున పూర్వజన్మ పాపమును తొలగించుకొనవచ్చును. **ధర్మేణ పాపమపనుదన్తి** (మహానారా. 22.1) అని శ్రుతి చెప్పుచున్నది. ధర్మకర్మ నాచరించి పాపమును తొలగింపవలెనని దాని కర్థము. ఆ కర్మఠుల కర్మ శారీరక పీడారూపమగుటచే గ్రీష్మకాలపు వ్యాపారమైన అగ్నితాపము వంటిది. చిత్తశుద్ధిపర్యంతమీ కర్మ ఆచరింపఁ దగినదే. శుద్ధచిత్తమున భక్తియనగా పరమేశ్వరునందు ప్రేమ అంకురించును. భక్తియొక్క చివరి మెట్టుగా జ్ఞానము కలుగును. ఇట్టి వారినే జ్ఞానిభక్తులని భగవద్గీత చెప్పినది. జ్ఞానము కలిగిన పిదప కర్మాధికారము తొలగును. కర్మయొక్క ఆవశ్యకతయు తొలగును. ఆ కర్మయొక్క ఆచరణీయత అప్పుడు అనివార్యము, అనగా తప్పనిసరి కాదు. అమ్మవారి చిఱునవ్వులట్టి భక్తిని దాని శిఖరమైన జ్ఞానమును కలిగించుటచేత కర్మయను ఘర్మసమయవ్యాపారాగ్నితాపమును అమ్మవారి చిఱునవ్వులు నశింపఁజేయును. తాపనాశమభావరూపము కావున నది ఆనందాభాసము కావచ్చును. ఆనందము కాజాలదు. క్రొత్తదైన ఆ యానందమును వర్షించు అమృతనది బిందువులుగా అమ్మవారి చిఱునవ్వులకాంతులు రూపింపఁబడుటచే నిందు రూపకాలంకారమున్నది. అమ్మవారి చిఱునవ్వులకు పాత్రమైన వారికి పాప భయముండదు. కావుననే ఆ చిఱునవ్వులు తన పాపభయమును పోగొట్టుగాక యని కవి ప్రార్థించుచున్నాడు. చిఱునవ్వులు తెల్లనివి. అమృతబిందువులు తెల్లనివి కావున ఉపమానోపమేయభావస్ఫూర్తి యుండుటచే నుపమాలంకార ధ్వనియు నిచట నున్నది. శీఘ్రముగా కల్మషభయమును నశింపఁ

జేయుగాక యని కవి కోరుటవలన ఆ పాపభయములయొక్క అసహ్యత ధ్వనించుచున్నది. చిఱునవ్వుల కాంతులు కల్మషభయములంధకారరూపములని స్ఫురించుచున్నది.



**అవ:-** పై శ్లోకమున కల్మష భయములందు తమోరూపత స్ఫురింపఁజేయఁబడినది. ఈ శ్లోకమున దౌర్గత్యప్రసారములందు తమఃపటల సాధర్మ్యము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ శ్రీకామాక్షి! తవ స్మితైన్దవమహఃపూరే పరిస్ఫూర్జతి**
**ప్రౌఢాం వారిధిచాతురీం కలయతే భక్తాత్మనాం ప్రాతిభమ్।**
**దౌర్గత్యప్రసరాస్తమఃపటలికాసాధర్మ్యమాబిభ్రతే**
**కిం కిం కైరవసాహచర్యపదవీరీతిం న ధత్తే పదమ్॥ 92**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| శ్రీ కామాక్షి! | = | ఓ శ్రీ కామాక్షీ దేవీ! |
| తవ | = | నీయొక్క |
| స్మితైన్దవమహఃపూరే | = | చిఱునవ్వనెడి చన్ద్రకాంతి ప్రవాహము; |
| పరిస్ఫూర్జతి | = | వెల్లివిరియుచుండగా; |
| భక్తానామ్ | = | భక్తులైన జీవులయొక్క; |
| ప్రాతిభమ్ | = | ప్రతిభా సమున్మేషము; |
| ప్రౌఢామ్ | = | సంపూర్ణమైన; |
| వారిధిచాతురీమ్ | = | సముద్రముయొక్క నైపుణిని; |
| కలయతే | = | పొందుచున్నది; |
| దౌర్గత్యప్రసరాః | = | దుర్గతుల ప్రసారములు; |
| తమఃపటలికాసాధర్మ్యమ్ | = | చీకట్ల గుంపులతోడి సమానధర్మతను; |
| ఆబిభ్రతే | = | ధరించుచున్నవి. |
| కైరవసాహచర్యపదవీరీతిమ్ | = | తెల్లకలువల సాహచర్యము (చన్ద్రత్వము) యొక్క పదవియొక్క రీతిని; |
| కిం కిమ్ | = | ఏదేది; |
| పదమ్ | = | అడుగును; |
| న ధత్తే? | = | మోపదు? |

**తాత్పర్యము:-**

ఓ కామాక్షీదేవీ! నీ చిఱునవ్వు వెన్నెల ప్రవాహము వెల్లివిరియుచుండగా భక్తులైన జీవులయొక్క ప్రతిభాసమున్మేషము సముద్రమువలె పొంగిపోవును. దారిద్ర్యాది దుర్గతి ప్రసారములు చీకట్లగుంపులతో సమానధర్మములగును. చన్ద్రత్వమే లభించినపుడు చన్ద్రోదయమున జరుగవలసిన కార్యములలో నేదైన జరుగకుండునా?

**వివరణము :-**

వెన్నెల వెల్లివిరియునపుడు సముద్రము పొంగుట కవి సమయము. విజ్ఞానశాస్త్రసిద్ధము కూడా. భక్తుల ప్రతిభ సముద్రముయొక్క చాతురిని పొందుననుటలో భక్తుల ప్రతిభకు సముద్రమునకు ఉపమానోపమేయభావము స్ఫురించుటచే ఉపమాలంకారము వ్యంగ్యమగుచున్నది. దౌర్గత్యప్రసారములు తమఃపటలికాసాధర్మ్యమును వహించుచున్నవనుటచే యుపమాలంకారము దాదాపు వాచ్యమైనదనియే చెప్పవచ్చును. వెన్నెల వెల్లివిరిసినపుడు చీకట్లు నశించునట్లు అమ్మవారి చిఱునవ్వు వెల్లివిరియగా దౌర్గత్యప్రసారములు నశించును. అట్లే భక్తుల ప్రతిభాసమున్మేషణము సముద్రము పొంగినట్లు పొంగిపోవుననుట ఫలితార్థము. చన్ద్రుడు కైరవములకు (తెల్లకలువలకు) సహచరుడు కావున కైరవసాహచర్యపదవి యనగా చన్ద్రత్వం లేక చన్ద్రకాన్తి, అమ్మవారి చిఱునవ్వు వెన్నెల కావున వెన్నెల వెల్లివిరియునపుడు జరుగు చీకట్లు (దౌర్గత్యములు) నశించుట, సముద్రము (భక్తుల ప్రతిభ) పొంగుట వంటి కార్యములు జరుగకుండ నెట్లుండును.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వునకు చన్ద్రకాన్తితోడి సార్వ కాలికమైన పోలిక చెప్పఁబడినది. ఈ శ్లోకమున మన్దారాదులతోడి పోలిక అమ్మవారి చిఱునవ్వునకు కాదాచిత్కమని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మన్దారాదిషు మన్మథారిమహిషి! ప్రాకాశ్యరీతిం నిజాం**
**కాదాచిత్కతయా విశఙ్క్య బహుశో వైశద్యముద్రాగుణః।**
**శ్రీకామాక్షి! తదీయసఙ్గమకలామన్దీభవత్కౌతుకః।**
**సాతత్యేన తవ స్మితే వితనుతే స్వైరాసనావాసనామ్॥ 93**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| మన్మథారిమహిషి! | = మన్మథుని శత్రువు (శివుని)యొక్క పట్టపురాణివైన; |
| శ్రీకామాక్షి! | = ఓ శ్రీకామాక్షీదేవీ!; |
| మన్దారాదిషు | = మన్దారాదులయందు; |
| నిజామ్ | = తన; |
| ప్రాకాశ్యరీతిమ్ | = ప్రకటనపద్ధతిని; |
| కాదాచిత్కతయా | = ఎప్పుడో ఒకప్పుడు మాత్రమే యుండునదగుటచేత; |
| బహుశః | = పెక్కు మార్లు; |
| విశంక్య | = ఆలోచించి; |

| | |
|---|---|
| వైశద్యముద్రాగుణః | = స్వచ్ఛతాధిక్యగుణము; |
| తదీయసంగమకలామన్దీభవత్కౌతుకః | = ఆ మన్దారాదులతోడి సంగమముచేత తగ్గుచున్న కుతూహలము కలదై; |
| తవ | = నీయొక్క; |
| స్మితే | = చిఱునవ్వునందు; |
| సాతత్యేన | = నిరంతరము; |
| స్వైరాసనావాసనామ్ | = స్వేచ్ఛగా నుండవలెనను కోర్కెను; |
| వితనుతే | = విస్తరింపఁజేసికొనుచున్నది. |

**తాత్పర్యము:-**

స్వచ్ఛత్వగుణము తన ప్రకటనము మన్దారాదులయందు తాత్కాలికమే యని పెక్కు విధముల నాలోచించి ఇదివఱ కా మన్దారాదులతోడి సంగమానుభవమున్నది కావున మరల వాని సంగమమునందు కుతూహలము తగ్గుచున్నందున అమ్మవారి చిఱునవ్వునందే నిరంతరము స్వేచ్ఛగా నుండవలెనను కోర్కెను విస్తరింపఁజేసికొనుచున్నది.

**వివరణము :-**

వైశద్యగుణము చేతనము కాదు. కావున దానికి విశంకకౌతుకము వాసన వంటి చేతన ధర్మములుండవు. ఉండకపోయినను ఆ వైశద్యగుణమునందు చేతనముయొక్క ధర్మముల యారోపమున్నది. లేని విశంకాకౌతుకవాసనా గుణములున్నట్లు చెప్పుటచే నిట నతిశయోక్త్యలంకారమున్నది. మన్దారాదులకు అమ్మవారి చిఱునవ్వునకు సమానధర్మముగా వైశద్యముద్రాగుణము చెప్పఁబడినందున అది కాదాచిత్కము, మన్దారాదులు వికసించినప్పుడు మాత్రమే ఉండునది అని చెప్పుటచే ఉపమానములైన మన్దారాదులకు న్యూనత స్ఫురించుటచే ప్రతీపాలంకారస్ఫూర్తియున్నది, **తదీయసంగమకలా** శబ్దము మన్దారాదుల సంగమలేశము అను అర్థమును లేదా అమ్మవారి చిఱునవ్వుయొక్క సంగమలేశము అను అర్థమును చెప్పవచ్చును. మన్దారాదుల సంగమము వైశద్యముద్రాగుణమునకు కాదాచిత్కమే కావున ఆ సంగమము లేశమే అయినా తాత్కాలికమైన ఆ సంగమము మరల కలుగవలెనని అనిపించలేదు. ఆ సంగమమే విసుగు కలిగించినది. కావున పిమ్మట మన్దారాదులతోడి సంగమము ఇక అవసరమని అనిపించనేలేదు. వైశద్యముద్రాగుణమునకు అందువలన మన్దారాదులందు కౌతుకము మన్దగించినది.



**అవ:-** అమ్మవారి చిఱునవ్వు నందలి వైశద్యగుణము చెప్పఁబడినది. ఈ శ్లోకమున మాధుర్యము సూచింపఁబడుచున్నది.

**శ్లో॥ ఇన్ధానే భవవీతిహోత్రనివహే కర్మౌఘచణ్డానిల-**
**ప్రౌఢిమ్నా బహులీకృతే నిపతితం సన్తాపచిన్తాకులమ్।**

మాతర్మాం పరిషిఞ్చ కిఞ్చిదమలైః పీయూషవర్షైరివ
శ్రీకామాక్షి! తవ స్మితద్యుతికణైః శైశిర్యలీలాకరైః॥ 94

ప్రతిపదార్థము :-

| | |
|---|---|
| శ్రీకామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| మాతః | = అమ్మా! |
| కర్మౌఘచండానిలప్రౌఢిమ్నా | = కర్మసమూహమనెడి తీవ్రమైన అగ్ని యొక్క ప్రౌఢిమచేత; |
| బహులీకృతే | = ఎక్కువజేయఁబడిన; |
| ఇన్ధానే | = మండుచున్న; |
| భవవీతిహోత్రనివహే | = సంసారమనెడి అగ్నిసమూహమునందు; |
| నిపతితమ్ | = పడిన; |
| సన్తాపచిన్తాకులమ్ | = సన్తాపచిన్తచే వ్యాకులతనందిన; |
| మామ్ | = నన్ను; |
| అమలైః | = స్వచ్ఛములైన; |
| పీయూషవర్షైరివ | = అమృతవర్షముల వంటి; |
| శైశిర్యలీలాకరైః | = శైత్యలీలకు నివాసములైన; |
| తవ | = నీయొక్క; |
| స్మితద్యుతికణైః | = చిఱునవ్వు కాంతి లేశముల చేత; |
| కించిత్ | = కొంచెము; |
| పరిషించ | = తడుపుము. |

**తాత్పర్యము:-**

కర్మ సమూహమొక తీవ్రాగ్ని, దాని ప్రౌఢిమచేత సంసారాగ్ని సమూహమెక్కువై మండుచున్నందున నేను సన్తాపచిన్తాకులుడ నైనాను. అట్టి నన్ను స్వచ్ఛములైన అమృతవర్షములవంటి శైత్యలీలకు స్థానములైన నీ చిఱునవ్వు కాంతిలేశముల చేతఁ దడుపుము.

**వివరణము :-**

అమ్మవారి చిఱునవ్వు కాంతి లేశములు అమృతవర్షములవంటి వనుటచే ఉపమాలంకార మేర్పడినది. అమ్మవారి చిఱునవ్వు కాంతిలేశములకు అమృతవర్షముల కుపమానోపమేయభావహేతువైన మాధుర్యమను సమాన ధర్మమిందు వాచ్యము కాలేదు. అది వ్యంగ్య మగుచునే యున్నది. కాని అమలత్వ శైశిర్యములు అను సమానధర్మములు వాచ్యములుగానే యున్నవి. కవి కర్మౌఘాగ్ని ప్రౌఢిమచేత ఎక్కువఁజేయబడిన సంసారాగ్నిసమూహము మండుచుండగా సన్తాపచిన్తాకులుడై యున్నాడు. ఒక అగ్నికి

మరొక అగ్ని తోడుకాగా అగ్ని బహులముగా మండునదైనది. ఇట్టి సన్తాపచిన్త మృత్యువుతోడనే అంతమగును కావున కవి అమృతవర్షములవంటి అమ్మవారి చిఱునవ్వుకాంతిలేశముల గోరుచున్నాడు. ఆ చిఱునవ్వుకాంతిలేశములు తనను తడిపినచో నిక మృత్యుభయముండదు. మధురపదార్థములలో నమృతముయొక్క స్థానమద్వితీయము. అది మృత్యునివారకమగుటయే గాక ఆనందహేతువైన మాధుర్యమున కాలవాలము. అమృతము త్రావిన వారికి మరొక మధుర పదార్థమునం దాసక్తి యుండదు. అమ్మవారి చిఱునవ్వుకాంతిలేశములు అమృతవర్షములవంటివి. అమలత్వము, శైత్యము, చిఱునవ్వుకాంతి లేశములకున్నందున సన్తాపతప్తుల సన్తాపనివారణమునకు మిక్కిలి అపూర్వములగుచున్నవి. సన్తాపతప్తులస్నానీయములు అమలములుగా శీతములుగా నుండవలెను గదా.



**అవ:-** పై శ్లోకమున శిశిరములైన అమ్మవారి చిఱునవ్వున కాంతి లేశముల పరిషేకమర్థింపఁబడినది. ఈ శ్లోకమున ఆ చిఱునవ్వు కాంతుల నైపుణి స్నానార్హామృత శిశిరస్రోతస్వినిగా వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ భాషాయా రసనాగ్రఖేలనజుషశ్శృఙ్గారముద్రాసఖీ**
**లీలాజాతరతేః సుఖేన నియమస్నానాయ మేనాత్మజే।**
**శ్రీకామాక్షి! సుధామయీవ శిశిరా స్రోతస్వినీ తావకీ**
**గాఢానన్దతరఙ్గితా విజయతే హాసప్రభాచాతురీ॥ 95**

**ప్రతిపదార్థము:-**

| | | |
|---|---|---|
| మేనాత్మజే | = | మేనాదేవికి కుమార్తెవైన; |
| శ్రీ కామాక్షి! | = | ఓ శ్రీ కామాక్షీదేవీ! |
| లీలాజాతరతేః | = | విలాసముగా పుట్టిన ప్రేమగల; |
| రసనాగ్ర ఖేలనజుషః | = | నాలుక చివరనాడు; |
| భాషాయాః | = | సరస్వతికి; |
| శృంగారముద్రాసఖీ | = | శృంగారచిహ్నములు గల స్నేహితురాలైన; |
| తావకీ | = | నీకు సంబంధించిన; |
| హాసప్రభాచాతురీ | = | నవ్వుల కాంతుల నైపుణి; |
| సుఖేన | = | సుఖముగా; |
| నియమస్నానాయ | = | ధార్మికస్నానముకొఱకు; |
| శిశిరా | = | చల్లనైన; |
| సుధామయీ | = | అమృతమయియైన; |
| గాఢానన్దతరంగితా | = | తీవ్రములైన ఆనన్దతరంగములు గల; |

స్రోతస్వినీ ఇవ = నదివలె;
విజయతే = సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**తాత్పర్యము:-**

మేనాదేవికి కుమార్తెవైన యో కామాక్షీదేవీ! విలాసముగా నేర్పడిన ప్రేమగల నాలుకపై నాడు సరస్వతికి శృంగారసఖియైన నీ చిఱునవ్వుకాంతి ఆ సరస్వతి ముఖముగా ధార్మికస్నానమాచరించుటకు తగిన చల్లదనముగల గాఢానందతరంగములు గల అమృతనదివలె సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**వివరణము :-**

చిఱునవ్వు వాక్కు నోటిలో నుండును గనుక చిఱునవ్వు వాక్కునకు స్నేహితురాలు. ఆ వాక్కు స్నానమాచరించుటకు తగిన చల్లదనముగల గాఢానంద తరంగములకు అమృతనదియో యన్నట్లు నమ్మవారి చిఱునవ్వున్నదని చెప్పుటచే నిచట నుత్ప్రేక్షాలంకార మున్నది. అమ్మవారి నవ్వు నందు సరస్వతియొక్క శృంగార సఖీత్వమారోపింపఁబడుటచే రూపకాలంకారమున్నది. చిఱునవ్వును, వాక్కును అమ్మవారి నోటిలో నాడుకొను స్నేహితురాండ్రు. కావున వారి కాటలాడు సమయమున పరస్పరస్నేహము కలిగినదని **"లీలాజాతరతేః"** అను సమాసము వలన వ్యక్తమగుచున్నది. ధార్మికస్నానము చల్లని నీట చేయఁదగినదని **శిశిరా** అను పదము వ్యంజింపఁజేయుచున్నది. ధార్మికులు ఆ చల్లని నీట సుఖముగా స్నానమాడెదరని **సుఖేన** అను పదము వ్యక్తమొనర్చుచున్నది. ఆనందమును నవ్వు సూచించునని **గాఢానందతరంగితా** అను సమాసము తెలుపుచున్నది. భాష తెల్లనిది, నవ్వు తెల్లనిది కావున **సమానశీలవ్యసనేషు సఖ్యమ్** అను సూక్తి ప్రకారము భాషకు నవ్వునకు సఖ్యము సముచితమే.



**అవ:-** పై శ్లోకమున సంతాపనివారకశిశిరసుధానదిగా అమ్మవారి చిఱునవ్వుత్ప్రేక్షింపఁబడినది. ఈ శ్లోకమున సంతాప నివారణము కొఱకై అమ్మవారి మధురస్మితము ప్రార్థింపఁబడుచున్నది.

**శ్లో॥ సన్తాపం విరలీకరోతు సకలం కామాక్షి! మచ్చేతనా**
**మజ్జన్తీ మధురస్మితామరధునీకల్లోలజాలేషు తే।**
**నైరన్తర్యముపేత్య మన్మథమరుల్లోలేషు యేషు స్ఫుటం**
**ప్రేమేన్దుః ప్రతిబిమ్బితో వితనుతే కౌతూహలం ధూర్జటేః॥ 96**

**ప్రతిపదార్థము:-**

కామాక్షి! = ఓ కామాక్షీదేవీ!
మన్మథమరుల్లోలేషు = కామ వాయువుచే చంచలములైన;

| | | |
|---|---|---|
| యేషు | = | వేని యందు; |
| నైరంతర్యమ్ | = | ఎడతెగకుండుటను; |
| ఉపేత్య | = | పొంది; |
| స్ఫుటమ్ | = | స్పష్టముగా; |
| ప్రతిబిమ్బితః | = | ప్రతిబిమ్బింపఁబడిన; |
| ప్రేమేన్దుః | = | ప్రేమచన్ద్రుడు; |
| ధూర్జటేః | = | శివునకు; |
| కౌతూహలమ్ | = | కుతూహలమును; |
| వితనుతే | = | కలిగించునో; |
| (తేషు = ఆ) తే | = | నీయొక్క |
| మధురస్మితామరధునీకల్లోలజాలేషు | = | మధురమైన చిరునవ్వనెడి దేవనది తరంగములయందు; |
| మజ్జన్తీ | = | మునుగుచున్న; |
| మచ్చేతనా | = | నా బుద్ధి; |
| సకలమ్ | = | సమస్తమైన; |
| సన్తాపమ్ | = | సంతాపమును; |
| విరలీకరోతు | = | తగ్గించుకొను గాక! |

**తాత్పర్యము:-**

అమ్మా! నీ స్మితములు మధురములు అని, అమరధునీతరంగముల సమూహములు, వానిలో నీ ప్రేమచన్ద్రుడు ప్రతిబింబించి శివునకు కుతూహలము కలిగించుచున్నాడు. వానియందు మునుగుచున్న నా బుద్ధి సమస్తమైన సన్తాపమును తగ్గించుకొనుగాక!

**వివరణము :-**

స్మితములందు అమరధునీ కల్లోలజాలములయొక్క, మన్మథునియందు వాయువుయొక్క, ప్రేమయందు చన్ద్రునియొక్క యారోప ముండుటచే నీ శ్లోకమున రూపకాలంకారమున్నది, మరుల్లోలేషు, కల్లోల జాలేషు అను సమాసములందు వృత్త్యనుప్రాసమను శబ్దాలంకారమున్నది.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి స్మితము మధురమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున అమ్మవారి చిఱునవ్వుకాంతి సుధయని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ చేతఃక్షీరపయోధిమన్థనచలద్రాగాఖ్యమన్థాచల-**
**క్షోభవ్యాపృతిసంభవాం జనని! తే మన్దస్మితశ్రీసుధామ్।**

స్వాదంస్వాదముదీతకౌతుకరసా నేత్రత్రయీ శాఙ్కరీ
శ్రీకామాక్షి! నిరన్తరం పరిణమత్యానన్దవీచీమయీ॥ 97

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| శ్రీకామాక్షి! | = ఓ శ్రీ కామాక్షీదేవీ! |
| చేతః........ సంభవామ్ | = మనస్సను పాలసముద్రముయొక్క మన్థనమున గదలు రాగమనుపేరి మన్థరపర్వతమువలన కలిసిన క్షోభయను వ్యాపారముచే పుట్టిన; |
| తే | = నీయొక్క; |
| మన్దస్మితశ్రీసుధామ్ | = చిఱునవ్వుకాంతి యను నమృతమును; |
| ఉదీతకౌతుకరసా | = కుతూహలము పుట్టునట్లుగా; |
| స్వాదంస్వాదమ్ | = అనుభవించి అనుభవించి; |
| శాంకరీ | = శివునకు సంబంధించిన; |
| నేత్రత్రయీ | = మూడుకన్నులు; |
| ఆనన్దవీచీమయీ | = ఆనన్ద తరంగములుగా; |
| నిరన్తరమ్ | = ఎల్లప్పుడు; |
| పరిణమతి | = పరిణమించుచున్నవి. |

**తాత్పర్యము:-**

అమ్మా! కామాక్షీ దేవీ! మనస్సను పాలసముద్రమును రాగమను మన్థర పర్వతముతో మథించగా పుట్టిన చిఱునవ్వుకాంతియను నమృతమును కుతూహలము పుట్టునట్లుగా అనుభవించి అనుభవించి శివుని మూడు కన్నులు ఎల్లప్పుడు ఆనందతరంగములుగా పరిణమించుచున్నవి.

**వివరణము :-**

అమ్మవారి మనస్సు పాలసముద్రము. ఆ మనస్సులోని ఆమె రాగము మన్థర పర్వతము. ఆ మన్థర పర్వతములో ఆ మనస్సును మథించగా అమ్మవారి చిఱునవ్వు అను అమృతము పుట్టినది అని చెప్పుటలో మనసునందు క్షీరసముద్రముయొక్క రాగమునందు మన్థర పర్వతముయొక్క చిఱునవ్వు నందు సుధయొక్క ఆరోపములుండుటచే నీ శ్లోకమున రూపకాలంకారమేర్పడుచున్నది. మథన సంభవమైన విషమును శివుడు త్రావుట ప్రసిద్ధమే కాని యా శివుడు ఇతర దేవతలతో పాటమృతమును త్రావినాడో లేదో యను సన్దేహము మూకకవికే యున్నది కాబోలు. కావుననే యాతడు పై రూపకాలంకార వ్యాజమున శివుని మన్దస్మిత శ్రీ సుధాపానమును వర్ణించినాడు. అమృతపానానంతరము రక్షోబాధల నొందిన దేవతల యానందము పేర్కొనదగినది

కాకపోయినను కామాక్షీ మన్దస్మిత శ్రీ సుధాపానమున శివుని కన్నులలో నానన్దవీచులు, దోబూచులాడుట వర్ణింపదగినదే.



**అవ:-** పై శ్లోకమున అమ్మవారి చిఱునవ్వు మనస్సును పాలసముద్రమునుండి పుట్టిన అమృతముగా చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆనన్దము పాలసముద్రము యొక్క తరంగముగా అమ్మవారి చిఱునవ్వు చెప్పఁబడినది.

**శ్లో॥ ఆలోకే తవ పఞ్చసాయకరిపోరుద్దామకౌతూహల-**
**ప్రేఙ్ఖన్మారుతఘట్టనప్రచలితాదానన్దదుగ్ధామ్బుధేః।**
**కాచిద్వీచిరుదఞ్చతి ప్రతినవా సంవిత్ప్రరోహాత్మికా**
**తాం కామాక్షి! కవీశ్వరాః స్మితమితి వ్యాకుర్వతే సర్వదా॥ 98**

**ప్రతిపదార్థము :-**

కామాక్షి! = ఓ కామాక్షీదేవీ!
పంచసాయకరిపోః = అయిదు బాణములు గల మన్మథునికి శత్రువైన శివునియొక్క;
ఆలోకే = చూపునందు;
తవ = నీయొక్క;
ఉద్దామ ... ప్రచలితాత్ = గొప్ప కుతూహలమను నెగురుచున్న గాలియొక్క రాపిడిచేత కదలిన;
ఆనన్దదుగ్ధాంబుధేః = ఆనన్దమను పాలసముద్రమునుండి;
ప్రతినవా = క్రొత్తదైన;
సంవిత్ప్రరోహాత్మికా = జ్ఞానప్రరోహరూపమైన;
కాచిత్ = ఒకానొక;
వీచిః = తరంగము;
ఉదంచతి = పైకి లేచుచున్నది;
తామ్ = దానిని;
కవీశ్వరాః = కవీశ్వరులు;
సర్వదా = ఎల్లప్పుడు;
స్మితమ్ ఇతి = చిఱునవ్వు అని;
వ్యాకుర్వతే = వివరించుచున్నారు.

**తాత్పర్యము:-**

శివుడు చూచినప్పుడు అమ్మవారి యెదలో కౌతూహలమను వాయువు

విజృంభించుచున్నది. అప్పుడామె యెదలో నున్న ఆనన్దమను పాలసముద్రము పొంగును. పొంగిన ఆ పాలసముద్రమునుండి జ్ఞానప్రరోహరూపమైన యొకానొక తరంగము పైకిలేచినది. దానినే కవీశ్వరులు అమ్మవారి చిఱునవ్వుగా చెప్పుచున్నారు.

**వివరణము :-**

కుతూహలమునందు వాయువుయొక్క ఆనన్దమునందు పాలసముద్రముయొక్క జ్ఞానప్రరోహమునందు తరంగముయొక్క ఆరోపముండుటచే నిందు రూపకాలంకార మున్నది. ఆనన్దసముద్రమునుండి ఆనన్దతరంగములే యుదయింపవలెను. జ్ఞానతరంగము వీచుటెట్లు, సత్యజ్ఞానానందము లేక రూపములు కావున ఆనన్దసముద్రమునుండి జ్ఞాన తరంగముదయింపవచ్చును. **ఆనన్దము ద్వివిధము**, విషయానందము, స్వరూపానందము. విషయానందము కూడా స్వరూపానందసముద్రముయొక్క తరంగములే, విషయానందము తరంగమువలె నశ్వరము, స్వరూపానందము సముద్రమువలె శాశ్వతము. స్వరూపజ్ఞానము స్వరూపానందము ఏకరూపములు. సంవిత్ప్రరోహము **అహం బ్రహ్మాస్మి** అను చరమవృత్తి జ్ఞానము. అది యుదయించియు మరల స్వరూపానందసముద్రమునందే లీనమగును. ఆ సంవిత్ప్రరోహ ముదయింపనిచో జీవుడు సచ్చిదానందస్వరూపుడయ్యు స్వరూపానందానుభవమునకు దూరుడే. అనాదియైన యజ్ఞానము ఆ సంవిత్ప్రరోహము చేతనే నశించును. అప్పుడే స్వరూపానందానుభవము కలుగును. సగుణబ్రహ్మమునకు నిర్గుణబ్రహ్మమున కభేదము కనుక అమ్మవారు సగుణ బ్రహ్మరూపిణియే యైనను నిర్గుణబ్రహ్మాభిన్నము కావున ఆమె శరీరము చిదానందఘనము. ఆమె మనస్సు చిదానందరూపము. ఆ సముద్రమునుండి యుదయించిన తరంగమైన స్మితసంవిత్ప్రరోహము చిదానందరూపమని చెప్పనక్కఱలేదు. ఆ సంవిత్ప్రరోహమే స్మితము కావున అమ్మవారి స్మితము చిదానందరూపమే. స్మితము ఎదలోని యానందమునకు బాహ్యచిహ్నము. దాని వలన ఎదలోని యానందము పొంగును. ఆ ఆనందము పొంగినపుడు మరల స్మితము ఇట్లు ఆనంద స్మితముల పరంపర అమ్మవారిలో ఎడతెగక అవిచ్ఛిన్నముగా సాగుచుండును.



**అవ:-** అమ్మవారికి స్మితరూపమైన సంవిత్ప్రరోహాత్మకశివైక్యనిశ్చయ జ్ఞానమున్నదని పై శ్లోకమున చెప్పఁబడినది. ఈ శ్లోకమున కవి తనకు అమ్మవారి స్మితము విషయమున నిశ్చయాత్మకపారమార్థికజ్ఞానము లేనట్లు చెప్పుకొనుచున్నాడు.

**శ్లో॥ సూక్తిశ్శైలయతే కిమద్రితనయే మన్దస్మితాత్తే ముహు-**
**ర్మాధుర్యాగమసంప్రదాయమథవా సూక్తేస్తు మన్దస్మితమ్।**
**ఇత్థం కామపి గాహతే మమ మనస్సందేహమార్గభ్రమీం**
**శ్రీకామాక్షి! న పారమార్థ్యసరణిస్ఫూర్తౌ నిధత్తే పదమ్॥** 99

ప్రతిపదార్థము:-

అద్రితనయే = పర్వతపుత్రికవైన;
శ్రీకామాక్షి! = ఓ శ్రీ కామాక్షీదేవీ!
తే = నీయొక్క;
సూక్తిః = శుభవాక్కు;
మన్దస్మితాత్ = చిఱునవ్వునుండి;
మాధుర్యాగమసంప్రదాయమ్ = మాధుర్యాగమ సంప్రదాయమును;
శీలయతే కిమ్? = నేర్చుకొనుచున్నదా?;
ముహుః = మాటిమాటికి;
ఇత్థమ్ = ఈవిధముగా;
మమ = నాయొక్క;
మనః = మనస్సు;
సన్దేహమార్గభ్రమీమ్ = సన్దేహమార్గభ్రమణమును;
గాహతే = పొందుచున్నది;
పారమార్థ్యసరణిస్ఫూర్తౌ = యథార్థతా మార్గముయొక్క స్ఫూర్తియందు;
పదమ్ = అడుగును;
న నిధత్తే = మోపుటలేదు.

**తాత్పర్యము:-**

పర్వతపుత్రికవైన యో శ్రీ కామాక్షీదేవీ! మాధుర్యాగమ సంప్రదాయమును నీ మన్దస్మితమునుండి నీ శుభవాక్కు నేర్చుకొనుచున్నదా? లేక దానిని నీ సూక్తి నుండియే నీ మందస్మితము నేర్చుకొనుచున్నదా? యను సందేహమార్గమున భ్రమించుచున్న నా మనస్సు నిశ్చయమార్గమున అడుగు మోపలేకున్నది.

**వివరణము :-**

సంశయమున్నప్పుడు నిశ్చయముండదు. నిశ్చయమున్నప్పుడు సంశయ ముండదు. నిశ్చయము అయథార్థనిశ్చయము యథార్థ నిశ్చయము అని రెండు విధములుగా నుండును. అయథార్థనిశ్చయము అజ్ఞానరూపమే. సంశయము కూడ అజ్ఞానరూపమే. జ్ఞానులయొక్క యుపదేశము నొంది అజ్ఞానమును, సంశయమును తొలగించుకొనవలెను. అజ్ఞానసంశయములు గలవాడు నశించునని భగవద్గీత చెప్పుచున్నది. **'అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి, నాయంలోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః'** (4.40) అని భగవద్గీత. అజ్ఞానము కలవారికి వినాశము కలుగవచ్చును. కాని వినాశపర్యంతము సుఖమే యుండును. సంశయాత్మునకు మాత్రము సుఖముండదు. చివరకు వినాశము కూడ తప్పదు. లౌకికవిషయముల విషయమునను, అలౌకికవిషయముల విషయమునను

సంశయము జిజ్ఞాసను గలిగించి యథార్థకోటిద్వయము కలదై యుండును. మాధుర్యాగమసంప్రదాయమును అమ్మవారి సూక్తి ఆమె స్మితమునుండి నేర్చుకొనుట యొక కోటి. అమ్మవారి స్మితమామె సూక్తినుండి నేర్చుకొనుట మరొక కోటి. సంశయమున భావభావ కోటి ద్వయమే యుండవలెనని యంగీకరించినప్పుడు మాధుర్యాగమ సంప్రదాయము నమ్మవారి సూక్తినుండి ఆమె మన్దహాసము నేర్చుకొనుచున్నదా, లేదా యని యొక సంశయము. మాధుర్యాగమ సంప్రదాయము నమ్మవారి మన్దహాసమునుండి యామె సూక్తి నుండి నేర్చుకొనుచున్నదా లేదా యని మరొక సంశయము నేర్పడును. మొట్టమొదటి సంశయమున రెండవకోటి నంగీకరించిన మొదటి కోటియొక్క అభావము, మొదటి కోటి నంగీకరించిన రెండవకోటియొక్క యభావమును అంతర్భవించును గావున రెండు పక్షములలోను సామంజస్యము నొప్పుకొనవచ్చును. ఎట్లైనను సంశయము బాధారూపమే సుఖాభావరూపమే. అమ్మవారి నోటి నుండి మాధుర్యాగమసంప్రదాయము లోకమునం దాగతమైనది. ఆమె నోటిలోనున్న మాధుర్యాగమసంప్రదాయమును ఆమె నోటిలోనే యున్న వాక్కు మన్దస్మితము నేకకాలమున మాధుర్యాగమసంప్రదాయ మెరిగియున్నవని అంగీకరింపవచ్చును. వాక్కు శబ్దరూపమున మాధుర్యాగమ సంప్రదాయమును ప్రవర్తింపఁజేయును. మన్దస్మితమున ధ్వని యుండదు. కావున మౌనరూపమున మాధుర్యాగమ సంప్రదాయమును ప్రవర్తింపఁజేయును. వాక్కు (మాధుర్య) ఆగమ సంప్రదాయమును (బ్రహ్మాత్మైక్యనిశ్చయజ్ఞానము) ప్రవర్తింపఁజేయుననుటకు ప్రమాణము **అనన్య ప్రోక్తే గతిరత్ర నాస్తి** (క. 1. 2. 8) (పరబ్రహ్మ రూపియగు గురువు చెప్పినపుడు బ్రహ్మజ్ఞానము కలుగకపోవుట లేదు) అను కఠోపనిషద్వాక్యము ప్రమాణము. మన్దస్మితము (మాధుర్య) ఆగమసంప్రదాయమును మౌనముతో ప్రవర్తింపఁజేయుననుటకు **"మౌనవ్యాఖ్యాప్రకటితపరబ్రహ్మతత్త్వం"** అను శ్రీ శంకరాచార్యుల సూక్తి ప్రమాణము. జీవులు స్త్రీ రూపులు. పరమాత్మ పురుషరూపి. పరమాత్మను భర్తగాగాని ప్రియునిగాని భావించుట మధురభక్తి యనఁబడును. ఈ మధురభక్తి సంప్రదాయమునకు ప్రమాణము **"యథా నద్యస్స్యందమానా స్సముద్రేఽ_స్తం గచ్ఛన్తి నామరూపే విహాయ"** (ముం. 3. 2. 8) అను నుపనిషద్వాక్యము ప్రమాణము. పై ఉపని ద్వాక్యమున నద్యః అను జీవసూచక పదము స్త్రీలింగమున, పరమాత్మ సూచక సముద్ర పదము పుంలింగమున నుండుట గమనింపఁదగినది. జీవేశ్వరుల మధ్య నాయికానాయకులమధ్యవలె శృంగారమే సముచితము శ్రేష్ఠము. కారణము అది మధురమగుటయే. **"శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః** అని ధ్వన్యాలోకకర్తయగు నానన్దనర్ధనుని సూక్తి యిట అనుసంధింపఁ దగినది. మొదట జీవుడమ్మవారితో నైక్యానుసన్ధానమును పొంది తరువాత శివైక్యాను సన్ధానమాచరింపవలెను. ఇదియే మాధుర్యాగమసంప్రదాయము. ఐక్యాను సన్ధానమున అమ్మవారికి శివునకు శేషశేషిభావము సాధారణము. కావున ఒక్కరెక్కువ ఒకరు తక్కువ అనునది లేదు. మనస్సుయొక్క స్వభావము సంశయమే. **"సంశయాత్మకమ్మనః"** అని

పెద్దల నిర్వచనము. కవి నా మనస్సు సంశయమార్గములో భ్రమించుచున్నదే కాని నిశ్చయమార్గమున నడుగిడుట లేదు అని చెప్పునప్పుడు మనశ్శబ్దమును ప్రయోగించుట యుచితముగా నున్నది. వాస్తవమునకు మనస్సను శబ్దము అంతఃకరణార్థమున ప్రయోగింపఁబడుచుండును. అంతఃకరణము సంశయాత్మకత్వమును విడచి నిశ్చయాత్మకత్వము నందినప్పుడు బుద్ధియని పేర్కొనఁబడును. పారమార్థ్యము భగవత్సత్తయందు భగవత్ జ్ఞానమునందు భగవదానందమునందు మాత్రమే యుండును. మిగిలినదంతయు మిథ్యయే. పైసత్త జ్ఞానము ఆనందమని పేర్కొనఁబడుటయే కాని వానిలో ఏకత్వమే యున్నది. పృథగ్భావము లేదు.



**అవ:-** పై శ్లోకమున తన మనస్సు సంశయమార్గభ్రమణము వీడకున్నది అని కవిచే చెప్పఁబడినది. ఈ శ్లోకమున పరమార్థనిశ్చయబుద్ధి కలుగుట కావశ్యకమైన శరణాగతిరూపమైన నమస్కారము చేయఁబడుచున్నది.

శ్లో॥ క్రీడాలోలకృపాసరోరుహముఖీసౌధాఙ్గణేభ్యః కవి-
శ్రేణీవాక్పరిపాటికామృతఝరీసూతీగృహేభ్యశ్శివే!।
నిర్వాణాఙ్కురసార్వభౌమపదవీసింహాసనేభ్యస్తవ
శ్రీకామాక్షి! మనోజ్ఞమన్దసహితజ్యోతిష్కణేభ్యో నమః॥ **100**

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| శివే | = మంగల స్వరూపురాలవైన; |
| శ్రీకామాక్షి! | = ఓ శ్రీ కామాక్షీదేవీ!; |
| క్రీడాలోలకృపాసరోరుహముఖీ సౌధాఙ్గణేభ్యః | = ఆటతమి గల దయయను స్త్రీయొక్క మేడముంగిళ్ళైన; |
| కవిశ్రేణీవాక్పరిపాటికామృతఝరీ సూతీగృహేభ్యః | = కవి సమయముయొక్క వాక్పరిపాటి యను అమృతనదికి జన్మస్థానములైన; |
| నిర్వాణాంకురసార్వభౌమపదవీ సింహాసనేభ్యః | = మోక్ష ప్రాప్తియనెడి చక్రవర్తి పదవీ సింహాసనములైన; |
| తవ | = నీయొక్క; |
| మనోజ్ఞమన్దహసితజ్యోతిష్కణేభ్యః | = అందమైన చిఱునవ్వు కాంతి కణములకు |
| నమః | = నమస్కారము. |

**తాత్పర్యము:-**

మంగల స్వరూపురాలవైన శ్రీకామాక్షీదేవీ! నీ చిఱునవ్వు కాంతి కణములు ఆటతమిగల దయయను స్త్రీ విహరించు సౌధమునకు ముంగిళ్ళు. కవి సమూహముల

వాక్పరిపాటియను అమృతనదికి జన్మస్థానములు, మోక్షమను చక్రవర్తి పదవికి సింహాసనములు నైనవి. అట్టి నీ అందమైన చిఱునవ్వు కాంతి సమూహములకు నమస్కరించుచున్నాను.

**వివరణము :-**

చిఱునవ్వుకాంతికణములయందు సౌధాంగణత్వ సూతీగృహత్వ, సింహాసనత్వారోపము లుండుటచే నిందు రూపకాలంకారమున్నది. **క్రీడాలోల కృపాసరోరుహముఖీసౌధాంగణేభ్యః** అనుటవలన అమ్మవారి స్మితము ఆమె యెదలోని దయను సూచించునని, **కవి శ్రేణీ వాక్పరిపాటికామృతఝరీ సూతీగృహేభ్యః** అనుట వలన ఎవరిపై అమ్మవారి మందహాసము ప్రసరించునో వారికి అమృతనది వంటి వాగ్ధార కలుగునని, **నిర్వాణాంకురసార్వభౌమపదవీ సింహాసనేభ్యః** అనుట వలన అమ్మవారి మన్దస్మిత మెవరి యందు ప్రసరించునో వారు మోక్షసింహాసన మధిష్ఠించెదరని వ్యక్తమగుచున్నది. మొదట కన్యగా నుండి సౌధాంగణమున విహరించుట, వివాహితయై సూతీగృహమున మాతృత్వము నందుట జరుగును. స్త్రీకి మాతృత్వమందుటతో కన్యాత్వ వివాహితాత్వము లామె మాతృత్వమున లీనములగును. ఆ తరువాత స్త్రీకి మరొకటి కోరదగినది లేదు కనుక ఆమెకు సార్వభౌమపదవి యబ్బినట్లే, అప్పుడామె యానందసింహాసన మధిష్ఠించును. అని పై మూడు విశేషణముల క్రమవిన్యాసమువలన వ్యక్తమగుటచే నిట వస్తుధ్వని యున్నది. అశోక రూపమైన బ్రహ్మానందప్రాప్తికి జీవేశ్వరాద్వైతజ్ఞానమేకైక సాధనము. ఆ యద్వైతజ్ఞానము కలుగవలెనను వాసన ఈశ్వరానుగ్రహలభ్యము. **"ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా"** (ఈశ్వరానుగ్రహమువలననే అద్వైత వాసన కలుగును) అని పెద్దలు చెప్పిరి గదా! ఈశ్వరానుగ్రహము ఈశ్వరశరణాగతిచేతనే లభించును. మూకమహాకవి అద్వైతజ్ఞానప్రాప్తికై శ్రీ కామాక్షీదేవి మన్దస్మిత జ్యోతిష్కణములకు శరణాగతి చేయుచున్నాడు. ఆమె పాదారవిన్దమునకు గాని ఆమె కటాక్షమునకు గాని ఆమె మన్దస్మితమునకు గాని శరణాగతి యొనర్చుట ఆమెకు శరణాగతి చేయుటయే. శరణాగతికి నమస్కారమునకు భేదము లేదు. నమః అనగా నాదేమియు లేదనుట. పరిశేషన్యాయమున అంతయు నీశ్వరునిదే యనుట శరీర మనః ప్రాణేన్ద్రియగృహ క్షేత్ర పత్నీపుత్రాదులందు మమకారము తొలగుట. నమే అను భావము కలిగినప్పుడంతయు నీశ్వరునిదే. విశ్వమంతయు నీశ్వరోత్పన్నమే కావున ఈశ్వరస్వరూపమే యగును. మట్టినుండి పుట్టిన కుండ మట్టియే గదా. వాసుదేవ స్సర్వమను గీత వాక్యముయొక్క అర్థమిదియే గదా! ఇట్లు శరణాగతి ఈశ్వరానుగ్రహము. ఈ క్రమము ద్వారా అద్వైతజ్ఞానము లభించును. మన్దహాసముచేతనే విలాసము. చైతన్యఘనమైన అమ్మవారి పెదవులు విప్పికొని వచ్చినది, మన్దహాసము. అట్లే అమ్మవారి మాయా యవనికను చీల్చుకొని వచ్చినదీ విశ్వము. కావున మందహాసమువలె ఈ విశ్వమంతయు మహామాయయగు నమ్మవారి విలాసము అనగా

విశ్వావిర్భావము, మన్దహాస ప్రకటనము ఏకరూపములు అనగా విశ్వమంతయు అమ్మవారి మందహాసమే. కావున మన్దహాసమునకు నమస్కారమనగా విశ్వరూపిణియగు నమ్మవారికి నమస్కారము అని యర్థము.

1) చిద్విలాసః ప్రపంచోయ మనునది శాక్తేయాద్వైత సిద్ధాంతము. ఈ సిద్ధాంతమున కనఁబడుచున్న జగము మిథ్య కాదు. జగమునకు అమ్మవారికి కనఁబడుచున్న భేదము మిథ్య అనగా విశ్వము విశ్వేశ్వరీ స్వరూపమే. విశ్వము విశ్వేశ్వరియు రెండును సత్యములు. ఆ రెంటిని భిన్నములనుకొనుట యజ్ఞానము.

2) అమ్మవారి మన్దహాస మామె మాయ **"చిద్వివర్తః ప్రపంచోయమ్"** అనునది శంకరాద్వైత సిద్ధాంతము. ఈ సిద్ధాన్తమున జగమే మిథ్య, రజ్జువివర్తమైన సర్పము మిథ్యయైనట్లు, బ్రహ్మవివర్తమైన ఈ జగము మిథ్య. రెండు సిద్ధాంతములలోను అద్వైత మంగీకరింపఁబడినది.



**అవ:-** మనోజ్ఞ మందహసిత జ్యోతిష్కణ నమస్కారముతో పై శ్లోకమున మన్దస్మిత శతకము ముగిసినది. ఈ 101 శ్లోకమున పంచశతీ గ్రంథముయొక్క సమాప్తి చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ఆర్యామేవ విభావయన్మనసి యః పాదారవిన్దం పురః**
**పశ్యన్నారభతే స్తుతిం స నియతం లబ్ధ్వా కటాక్షచ్ఛవిమ్।**
**కామాక్ష్యా మృదులస్మితాంశులహరీజ్యోత్స్నావయస్యాన్వితా-**
**మారోహత్యపవర్గసౌధవలభీమానన్దవీచీమయీమ్॥ 101**

**ప్రతిపదార్థము:-**

| | |
|---|---|
| యః | = ఎవడు |
| మనసి | = మనస్సునందు; |
| ఆర్యామేవ | = ఆర్యనే; |
| విభావయన్ | = విశేషముగా భావించుచు; |
| పురః | = ఎదుట; |
| పాదారవిన్దమ్ | = పాదకమలమును; |
| పశ్యన్ | = చూచుచు; |
| స్తుతిమ్ | = స్తుతిని; |
| ఆరభతే | = ఆరంభించునో; |
| సః | = వాడు; |
| నియతమ్ | = తప్పక; |
| కటాక్షచ్ఛవిమ్ | = కటాక్షముయొక్క కాన్తిని; |

లబ్ధ్వా = పొంది;
కామాక్ష్యాః = కామాక్షీదేవియొక్క;
మృదులస్మితాంశులహరీజ్యోత్స్నా వయస్యాన్వితామ్ = మన్దహాసకాన్తి ప్రవాహమనెడి వెన్నెల యను పేరుగల స్నేహితురాలితో కూడిన;
ఆనన్దవీచీమయీామ్ = ఆనన్దతరంగరూపమైన;
అపవర్గసౌధవలభీమ్ = మోక్షమను మేడయొక్క పై యంతస్తునకు ముందున్న భాగమునకు;
ఆరోహతి = ఎక్కును.

**తాత్పర్యము:-**

ఎవడు ఆర్యనే విశేషముగా భావించుచు, నెదుట ఆమె పాదార విందమును చూచుచు, స్తుతి నారంభించునో, వాడు తప్పక ఆమె కటాక్షకాన్తిని పొంది, ఆ కామాక్షీ దేవియొక్క మన్దస్మిత కాంతి ప్రవాహమనెడి వెన్నెల యను పేరుగల స్నేహితురాలితో కూడిన మోక్షసౌధము పైయంతస్తుయొక్క ముందు భాగమును చేరుకొనగలడు.

**వివరణము :-**

మూకమహాకవి ఈ గ్రంథమును వ్రాయుటకు ముందు **ఆర్య**ను అనగా కామాక్షీదేవిని మనసున భావించినాడు. అప్పుడాయన యెదుట అమ్మవారి **పాదము** కనఁబడినది. అమ్మవారి **స్తుతి** నారంభించినాడు. ఆ స్తుతివలన అమ్మవారి **కటాక్ష**మాయనకు లభించినది. ఆ తరువాత ఆయనకు మోక్షము లభించినది. మూకమహాకవికి భూతభవిష్యద్వర్తమానకాలములకు సంబంధించిన విజ్ఞానము కాలాతీతపరమార్థవిజ్ఞానమును లభించినది. మొదటి శతకము పూర్తి కాగానే అమ్మవారి పాదారవిన్దము సాక్షాత్కరించినది. అనగా విశ్వమంతయు భగవంతుని పాదమే యను **మాండూక్యోపనిషద్వాక్యార్థ** మనుభవములోనికి వచ్చినది. ఎదుట కనబడు విశ్వమునే యమ్మవారి పాదముగా దర్శించుచు **పాదారవిన్దశతకము** ముగించినాడు. స్తుతి శతకమారంభించగానే అమ్మవారు తనను కటాక్షించినట్లనుభవము కలిగినది. ఇంతవరకు భూతకాల జ్ఞానము. **కటాక్షశతకము** పూర్తి చేయగానే అమ్మవారి మన్దహాసము వెల్లివిరిసినది. మూకమహాకవి దానిలో మునిగిపోయినాడు. ప్రాణమెప్పుడు పోయినదో కాని తానమ్మవారి మన్దహాసముయొక్క ఉపరిభాగమైన మోక్షసౌధవలభితో తనకు తాను దర్శించుకొన్నాడు. ఇది భవిష్యత్ జ్ఞానము. యత్తత్ శబ్దములయొక్క విభావయన్ పశ్యన్ అను శత్రంతములయొక్క లబ్ధ్వా, యుక్త్వా, అను క్త్వాన్తములయొక్క ప్రయోగబలమున పై వస్తువంతయు వ్యంగ్యమగుచున్నది. రెండు శత్రంతముల పిమ్మట **ఆరభతే** యను వర్తమాన క్రియను ప్రయోగించుటచే అంతకు పూర్వమున్న జ్ఞానము భూతకాలికము. లబ్ధ్వా అను, క్త్వాన్తమున దాని తరువాత భవిష్యర్థక లడంత క్రియ (ఆరోహతి) ప్రయోగించుటచే కటాక్షలాభము మోక్షసౌధవలభ్యా రోహణము

స్తుత్యారంభానంతర భవిష్య జ్ఞానమని స్పష్టము కాకమానదు. ఈ శ్లోకమున ఈ పంచశతి పఠించు వానికి కలుగు లాభమును కూడ వివరించు చున్నాడు. **పంచశతిలో మొదటిది ఆర్యాశతకము. రెండవది పాదారవిన్ద శతకము, మూడవది స్తుతి శతకము నాలుగవది కటాక్ష శతకము. ఐదవది మందస్మిత శతకము.** పంచశతీపాఠకుడు ఆర్యను భావింపవలెను. తత్పుణ్యబలమున మరియు భావనాబలమున పరోక్షవస్తువైన అమ్మవారి పాదారవిన్ద మెదుట సాక్షాత్కరించును. ఆ యనుభూతితో పులకించి యా పాఠకుడు తనకున్న భాషాపటిమతో నామెను పాదాదిగా స్తుతించ నారంభించును. ఆరంభించిన ఆ స్తుతి ఇట్లు పాదారవిన్ద శతకము స్తుతి శతకము ముగియు నప్పటికి అమ్మవారు కటాక్షించినట్లనుభూతి నొందును. ఆ అనుభూతితో కటాక్షశతకమును ముగించునప్పటికి అమ్మవారి మన్దస్మితప్రవాహము మెల్లమెల్లగా బయలుదేరి పాఠకుని ముంచివేయును. మన్దస్మిత పాఠము పూర్తియగునప్పటికి పాఠకుడు బ్రహ్మాత్మజ్ఞానము నొంది జీవన్ముక్తావస్థ నొందును. జీవన్ముక్తావస్థ నొందిన యా పాఠకుడు పునః పునః పంచశతీ పాఠమొనరించుచు దేహపాతా నంతరము అమ్మవారితో నైక్యము నొందును. ఇదియే **కైవల్యముక్తి.** ఒకవేళ బ్రహ్మాత్మజ్ఞానము కలుగక జీవన్ముక్తావస్థ లభింపనిచో దేహపాతానంతరము అమ్మవారి లోకముఁజేరును. ఇది **సాలోక్యముక్తి.** తరువాత అమ్మవారి రూపముతో సమానరూపము అనగా పాశాంకుశేక్షుధనుః పుష్పబాణములు గల చతుర్భుజములు గల రూపమును పొందును. ఆ పిమ్మట అమ్మవారి దగ్గఱకు చేరును. ఇది **సామీప్యముక్తి.** ఆ తరువాత అమ్మవారి ఐశ్వర్యముతో సమానమైన (జగత్సృష్ట్యాది వ్యాపారము తప్ప) ఐశ్వర్యము నొందును. ఇది **సార్ష్టిముక్తి.** ఆ తరువాత అమ్మవారి యాభరణములలో అవయవములలో కరణములలో నంతఃకరణములలో ఏదోయొక దానిలో నైక్యమొందును. ఇది **సాయుజ్యముక్తి.** ఆ తరువాత అమ్మవారు గురుస్వరూపిణియై **తత్త్వమసి** యను మహావాక్య ముపదేశించును. ఆ యుపదేశమున సాలోక్యాదిముక్తులలోనే ముక్తిని పొందిన వాడైనను బ్రహ్మాత్మైక్యజ్ఞానము నొందును. అప్పుడు లోకాతీయమైన అలౌకికమైన చిద్రూపిణీయైన అమ్మవారిలో నైక్యము నొందును. ఇంతటితో పాఠకుని కథ కంచికి చేరును. భూలోకమున భార్యాపుత్రాదులు తోడుగా నుందురు. వారినందఱను విడచి జీవుడు మరణించును. ఆతడు లోకాన్తరములకు పోవునప్పుడు ఆతని పుణ్యపాపములే వెంటనుండును. అమ్మవారిలోకమున మాత్రము అమ్మవారి మన్దహాసకాంతి ప్రవాహజ్యోత్స్నయను స్నేహితురాలుండును. ఆమెతో కలిసి మోక్షసౌధవలభియందు ఆనన్దవీచుల నోలలాడును.

**మందస్మితశతకమ్ సంపూర్ణమ్**

**ఓం నమశ్శివాయై చ నమశ్శివాయ ఓం**

**శ్రీః**

## మన్దస్మితశతకమ్ - శ్లోకానుక్రమణికా

1518

శ్రీః



**చంద్రశేఖర రక్షమాం చంద్రశేఖర పాహి మాం**

ఈ గ్రంథము

**నాగమోతు క్రిష్‌మిత్ర**

రోచెస్టర్ వారి

ఆర్థిక సహాయముతో ముద్రింపబడినది.

